శ్రీనాథ మహాకవి విరచిత

# శ్రీ భీమేశ్వర పురాణము

(దక్షిణ కాశికా వ్యాఖ్యాన సహితము)


సంపాదకుడు, వ్యాఖ్యాత

డాక్టర్ గుండవరపు లక్ష్మీనారాయణ, M.A., Ph.D

సహ వ్యాఖ్యాతలు

శ్రీ జన్నాభట్ల వీరేశ్వర శాస్త్రి, M.A.

శ్రీ జక్కరాజు నరసింహారావు, M.A.



ఫాలాక్ష ప్రచురణ

గుంటూరు

ప్రథమ ముద్రణము
ఈశ్వర - 1997
వేయి ప్రతులు

వెల : రూ. 220=00 లు

ప్రతులకు :
**శ్రీమతి గుండవరపు రమాదేవి,**
శివశక్తి కాంప్లెక్స్,
8/1 అరండల్ పేట,
గుంటూరు-522 002
ఫోన్ : 230940

# విషయ సూచిక

వ్యాఖ్యాభిషేకము iv
అనుశ్రుతి vii
దక్షిణకాశికా దర్శనము iL


## ప్రథమాశ్వాసము

ఇష్ట దేవతా ప్రార్థనము 2
పురాతన కవీంద్ర గుణ కీర్తనము 6
కుకవి నిరాకరణము 13
ఉపోద్ఘాతము 19
వేమ భూపాల వంశావతారవర్ణనము 29
కృతిపతి వంశ వర్ణనము 45
షష్ఠ్యంతములు 79
దక్షారామ పుర వర్ణనము 82
కథా ప్రారంభము 131


## ద్వితీయాశ్వాసము

సూర్యాస్తమయ వర్ణనము 148
చంద్రోదయ వర్ణనము 159
సూర్యోదయ వర్ణనము 168
వ్యాస మహర్షి యాత్రకు వెడలుట 170
పీఠికాపుర వర్ణనము 175
కుమారారామ వర్ణనము 185
సర్పపుర వర్ణనము 190
అగస్త్యుఁడు వ్యాస మహర్షిఁగాశిఁబాసి వచ్చుటకుఁ గారణం బడుగుట 205
వ్యాసుఁడు తాను కాశిఁబాసిన కారణంబుఁ జెప్పుట 209

వ్యాసమహర్షి కాశిని శపింపఁబూనుట 219
విశ్వనాథుఁడు పార్వతీ-తోడ వ్యాసాదులుండిన
వేదిక కడకు విజయము చేయుట 241
శంభుండు వ్యాసుని శిష్యులతోడఁగాశి వెడలి పొమ్మనుట 244

## తృతీయాశ్వాసము

అగస్త్యుఁడు వ్యాసునకు దక్షారామ మహిమంబు చెప్పుట 259
వ్యాసాదులాకసంబున నుండి భీమ మండలంబు కనుంగొనుట 296
వ్యాసాదులు దక్షారామంబు ప్రవేశించుట 311
ఇంద్రుఁడు దేవతలకు శివలింగ మాహాత్మ్యంబు చెప్పుట 338
బ్రహ్మాదులు భీమేశ్వరు నభివర్ణించుట 356
అగస్త్యుఁడు వ్యాసునకుఁ బంచ తీర్థంబులు వివరించుట 375
అగస్త్య వ్యాసులు భీమేశ్వరాలయంబు దర్శించుట 385
వ్యాసుండు భీమేశ్వరార్చనంబు సలుపుట 395
వ్యాసుండీశ్వరుని స్తుతించుట 402

## చతుర్థాశ్వాసము

అగస్త్యుఁడు తీర్థ మాహాత్మ్యంబుఁ జెప్పుట 455
క్షీర సాగర మథన కథాక్రమము 460
శివుఁడు హాలాహలము మ్రింగుట 475
దేవత లీశ్వరుని స్తుతించుట 478
శివుని యాజ్ఞచే సురాసురులు విఘ్నేశునిఁ బూజించి
పాల్కడలి తరియించి చంద్రాదులఁబడయుట 490
దేవాసురు లమృతమునకై పోరుటయు శ్రీమన్నారాయణుఁడు
దేవారుల వంచించుట 496
నారదోక్తి నసురు లీశ్వరునిఁ బూజించి వరములు వడసి లోకముల బాధించుట 498
బ్రహ్మ విష్ణ్వాదులు శివుని కడ కేఁగి మొఱవెట్టుట 503
ఈశ్వరుఁడు త్రిపురాసురుల నిర్జించుట 515
తుల్యభాగ యుత్పత్తి క్రమము 563
శ్రీ భీమనాథేశ్వరుఁడు దనకుఁ దానప్రతిష్ఠితుండగుట 569

## పంచమాశ్వాసము


సూర్యుఁడు కైలాసంబున కరిగి శివుని దక్షారామంబునకుఁ దోడొచ్చుట 580
మహాదేవుండు ప్రమథగణ సమేతుండై దక్షారామమునకుఁ బోవుట 592
శివుఁడు దక్షారామంబుఁ బ్రవేశించుట 601
శ్రీ కంఠుఁడు దక్షారామ భీమేశుతో నైక్యముం బొరయుట 611
లక్ష్మ్యాదులు శ్రీ భీమేశ్వరుని స్తుతించుట 615
దివస్పతి బృహస్పతిని దానములఁ గూర్చి యడుగుట 621
భూదాన మహిమ 622
దివస్పతి శ్రీ భీమేశ్వరునకు భీమ మండలంబు సమర్పించుట 630
వసంతర్తు వర్ణనము 641
సప్తముని స్తోత్రము 666
గౌరికి మహేశ్వరుండు భక్తి విజ్ఞాన యోగంబుఁ జెప్పుట 682


## షష్ఠాశ్వాసము


దక్షవాటీ మహాస్థాన మాహాత్మ్యము 713


## అనుబంధము


అకారాది పద్య గద్య సూచిక 795

# వ్యాఖ్యాభిషేకము

అరయఁగ శ్రీ భీమేశ్వర
పురాణమున కెందులకొ? విపులమగు వ్యాఖ్యన్
విరచింపలేదు పెద్దలు
దొరకొంటిని వ్రాయ లోటుఁ దొలఁగఁగఁ జేయన్

శివుఁడన్నన్ శివభక్తులన్నఁ గవులన్ శ్రీనాథుఁడన్నన్ బురా
భవ సంబంధ మదేమియో పరవశంబౌ నా మనం బింక నా
శివుఁడుండన్ శివభక్తులుండఁ గవియై శ్రీనాథుఁడుండన్ మనం
బవలోకించునె? నా సమర్థతను వ్యాఖ్యానాధ్వ యానంబునన్

శివ భోగమ్ముల భీమ ఖండమును సృష్టించెన్ శివాద్వైత చి
త్కవి శ్రీనాథుఁడు దక్షిణా పథమునన్ గాశిన్ బ్రతిష్ఠింప నా
కవితా తాండవ భీమరుద్రమునకున్ గైసేసితిన్ భాష్యమున్
శివ సంకల్పముగా శివార్చనముగాఁ జింతింతు నీ కార్యమున్

పండితుఁడ నన్న గర్వభావానఁగాదు
వ్యాఖ్యఁ జేపట్టి యిట్టుల వ్రాయుటెల్ల
నర్థభావ విశేషాల వ్యాజముసను
శంకరార్చన సలుపు లక్ష్యమ్ము కాని

దక్షిణ కాశిక వ్యాఖ్య ప్ర
దక్షిణ మొనరించి శివుని ధన్యంబగుతన్
దక్షిణ కాశీ నగరా
ధ్యక్ష కథా వ్యాఖ్య యనెడి ధ్యానముతోడన్

* * *

## దక్షిణ కాశికా వ్యాఖ్యాన ప్రణాళిక

1. గ్రంథమునందలి ప్రతి పదమునకు అర్థము, భావము వ్రాయుట; విశేషమున్నచో వివరించుట.
2. సరళగ్రాంథిక భాషలో వ్యాఖ్యానించుట.
3. అవసరమైన సందర్భములందు తులనాత్మక పరిశీలనమునకై సంస్కృత భీమఖండ శ్లోకములను ఉటంకించుట.
4. ప్రతి స్వల్ప వ్యాకరణ విషయమును వివరించుటకై వ్యాకరణ సూత్రములతో నింపకుండుట; ప్రతి ప్రసిద్ధ పదము యొక్క ప్రామాణికతకై అమరమును ఏకరువు పెట్టకుండుట.

కాని పండిత లోకమున చర్చలకు గురియైన 'ఎల్లన్ శిష్యులు, గ్రహయాళువు, కానినేయు' మొదలగు ప్రయోగముల సాధుత్వాసాధుత్వములను గూర్చి వ్యాకరణ సూత్రములతో చర్చచేయుట; అట్లే అప్రసిద్ధ పదమైనచో కోశముల ప్రమాణముతో అర్థము తెలుపుట. అట్లే అన్యదేశ్యముల విషయమున భాషా శాస్త్రవేత్తల అభిప్రాయములను వ్రాయుట.

5. అలంకార నామములను, కుంతకుని వక్రోక్తి భేదములను సూచించుట; ఛందో విశేషములను వివరించుట.
6. శాస్త్రీయ పదములను శాస్త్ర ప్రమాణములతో వివరించుట.
7. స్థల నామములకు భౌగోళికముగా స్థల నిర్దేశము చేయుట.
8. సంప్రదాయములను స్థానిక విశేషములతో జోడించి వివరించుట.
9. గ్రంథ రచనాకాలము నాటి స్థానిక విశేషములకు నేటి కాలమున గల స్థితిని తెలుపుట.
10. ఈ గ్రంథములో వచ్చిన అంశములకు సమానాంశములు శ్రీనాథుని యితర గ్రంథములలో కనబడిన, వానిని ఉటంకించుట.
11. ఈ గ్రంథములోని భావములకు మూలములు సంస్కృత కవుల గ్రంథములలో కనబడిన ఉటంకించుట.
12. శ్రీనాథ మహాకవిని గూర్చి అనేక కోణములలో ఎందరెందరో పండితులు పరిశ్రమ చేసిరి. అవసరమైన సందర్భములందు వారి పరిశ్రమల ఫలితములైన వాక్యములను ఉటంకించుట.

ఇది ద్వాదశ భావములతో గూడిన దక్షిణ కాశికా వ్యాఖ్యాన జాతక చక్రము.

* * *

గుండవర మందు గుంటూరు మండలమున
నలరు శ్రీరామలింగేశ్వరాఖ్య శివుఁడు
పార్వతీ సమేతుండు శుభప్రదుండు
తాత తాతల తాతల త్రాత యగుచు

ఒక తాత ప్రతిష్ఠించె నిఁ
కొక తాత యమర్చె ప్రహరియు ధ్వజస్తంభం
బకలంకంబగు భక్తిని
సకలాలంకారము లిడి జనములు పొగడన్

తనయూరి కేతెంచి తనువు చాలించిన
చెవి చెంత గొణఁగు కాశీ ప్రభుండు
చేట చెవుల సామి చెప్పక వినలేని
సాక్ష్యాశ్రితుండు శ్రీశైల విభుఁడు
మారుతీశ్వరుఁడు పంపకయున్న లోనికి
రానీఁడు రామేశ్వరప్రభుండు
చాటుమాటున దాఁగి సాక్షాత్కరింపక
మాయ చేయును చిదంబర విభుండు

ఇంట నుండిన - నౌకరు వచింపకున్నఁ
బంపకున్నఁ గన్పడుచుఁ గాపాడుచుండు
గుండవరమునఁ గాపుర ముండి నట్టి
ప్రభుఁడు - శ్రీరామలింగేశ్వరప్రభుండు

పండితుల కృషి నుపయోగ పఱచు కొనుచు
నేను కూర్చిన యట్టి వ్యాఖ్యాన మిద్ది
తరతరాలుగా మా యింటి దైవమైన
ఆ శివునకె - ఆ శివునకే - అంకితంబు

**నమశ్శంభవేచ మయోభవేచ**
**నమశ్శంకరాయచ మయస్కరాయచ**
**నమశ్శివాయచ శివతరాయచ**

**-గుండవరపు లక్ష్మీనారాయణ**

# అనుశ్రుతి

శ్రీనాథుడు సకల విద్యాసనాథుడు. ఈశ్వరార్చన కళాశీలుడు. బ్రాహ్మీదత్త వరప్రసాదుడు. కర్ణాట క్షితిపాల మౌక్తిక సభాగారాంతరాకల్పిత స్వర్ణస్నాన జగత్ప్రసిద్ధ కవిరాట్టు. 'ఈక్షోణిన్ నినుఁబోలు సత్కవులు లేరీనేఁటి కాలంబునన్' అని ప్రశంస లందుకొనిన కవిసార్వభౌముడు. ఒక పాదమున సాహిత్యలోకమును, మరియొక పాదమున రాజలోకమును, ఇంకొక పాదమున భోగలోకమును ఆక్రమించిన త్రివిక్రముడు.

శుంభద్గాథుడైన శ్రీనాథుడు ఆంధ్రకవీంద్ర ప్రపంచమున అనేకాంశములకు ఆద్యుడు.

పూర్వాంధ్ర మహాకవులలో శ్రీనాథుడు దర్శించినంతమంది ప్రభువులను, ప్రముఖులను మరియొక కవి దర్శింపలేదు. నాటి సాహిత్య లోకము నందేకాక, రాజకీయ లోకమునందు కూడ శ్రీనాథుడు ప్రముఖ పాత్ర వహించినాడు. గ్రంథముల అంకితముల వలన నేమి, చాటు పద్యముల వలన నేమి, ఇతరుల వ్రాతల వలన నేమి శ్రీనాథునకు తన కాలము నాటి ప్రముఖులందరు పరిచితమని వెల్లడియగుచున్నది.

మామిడి వేమనామాత్యుడు, మామిడి ప్రెగ్గడయ్య, మామిడి సింగన, అవచి తిప్పయసెట్టి, బెండపూడి అన్నయామాత్యుడు, పెదకోమటి వేమారెడ్డి, అల్లాడ వేమారెడ్డి, వీరభద్రారెడ్డి, సర్వజ్ఞ సింగభూపాలుడు, సాంపరాయని తెలుంగాధీశుడు, ప్రౌఢదేవరాయలు, దంతలూరి గన్నభూపాలుడు, భాస్కరుడు, విస్సనమంత్రి, శాంత భిక్షావృత్తి యతీశ్వరుడు, ముమ్మడి శాంతయ్య, ముమ్మసుకవి .... ఇంక నెందరెందరితోడనో ప్రత్యక్ష పరిచయమున్న వాడు శ్రీనాథుడు. ఇట్లు నానారాజ సందర్శనము చేసి, అనేక సత్కారములను పొందిన ఆంధ్రకవులలో ప్రథముడు.

ప్రతి గాథా ప్రతిభావంతమైన శాలివాహన సప్తశతి - అను ప్రాకృత గ్రంథమును ఆంధ్రీకరించుటచే - ప్రాకృత గ్రంథానువాదము చేసిన ఆంధ్ర కవులలో ప్రథముడు.

శాలివాహన సప్తశతి సంకలన గ్రంథమగుటచే, సంకలన గ్రంథానువాదకులైన ఆంధ్రకవులలో ప్రథముడు.

పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రము - అను ద్విపద కృతిని పద్య ప్రబంధముగా పరివర్తించుటచే, ద్విపద కృతిని పద్య ప్రబంధముగా రూపొందించిన ఆంధ్ర కవులలో ప్రథముడు.

కొండవీటి ప్రభువైన పెదకోమటి వేమారెడ్డి కొలువులో విద్యాధికారి పదవి యందుండుటచే - విద్యాధికారి పదవి నలంకరించిన ఆంధ్రకవులలో ప్రథముడు.

కోకొల్లలుగా చాటువులు చెప్పి, నాటి సాంఘిక భౌగోళిక, రాజకీయాంశములతో ముందు తరముల వారికి చరిత్ర అందచేసిన - ఆంధ్రాకు కవులలో ప్రథముడు.

క్రీడాభిరామము అను వీథి ఈతని గ్రంథమే యైనచో రూపకానువాదకులైన ఆంధ్రకవులలో ప్రథముడు.

తెలుగు నేల యొక్క భౌగోళిక చారిత్రిక విశేషములను, తెలుగు నేలపై మొలిచి నిలచిన ఆహార వ్యవహారములను, రుచులను, అభిరుచులను, ఆచార సమాచారములను వివిధ జాతుల కట్టు బొట్టులను గ్రంథములందు, చాటువులందు పనికట్టుకొని ఛందోబద్ధముచేసి మాతృదేశాభిమానము అపరిమితముగా ప్రదర్శించిన ఆంధ్ర కవులలో ప్రథముడు.

ఇంత ప్రతిష్ఠ కల శ్రీనాథ కవి వరేణ్యుని లౌకిక జీవితమందలి, సాహిత్య జీవితమందలి అనేకాంశములు సాహిత్యానుష్ఠాన నిష్ఠా గరిష్ఠుల గోష్ఠులలో వివాదాస్పద విషయములుగా తిష్ఠ వేసినవి. ఇప్పటికిని ఇంక కొన్ని రావణ కాష్ఠములుగనే మిగిలియున్నవి.

శ్రీనాథుని జనన కాలమేది? పాకనాడు ఇంటిపేరగునా? జన్మభూమి ఏది? శ్రీనాథుడు కర్ణాటుడా? శ్రీనాథుడు బమ్మెర పోతన బావ మఱదులా? శ్రీనాథుని దీనారటంకాల తీర్థమాడించిన కర్ణాట క్షితిపాలుడెవరు? శ్రీనాథుడు దర్శించిన సర్వజ్ఞ సింగభూపాలుడెవరు? శ్రీనాథుడు శృంగారియా? గ్రంథ రచనా క్రమమేది? అలభ్య కృతలేవి? పలనాటి చరిత్రము క్రీడాభిరామము లితని కృతులే యగునా? భీమఖండ మాంధ్రీకరణమా? శివరాత్రి మాహాత్మ్యమును ముమ్మడి శాంతయ్యకు శ్రీనాథుడంకితమిచ్చెనా? .... మొదలగునవి వాద ప్రతివాదములకు సదనములైన ప్రధానాంశములు.

## జనన కాలము

శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావు గారు - శ్రీనాథుని హరవిలాస రచనా కాలమును బట్టి శ్రీనాథుని జనన కాలమును క్రీ.శ. 1360 అని నిర్ణయించిరి.

శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులు గారు - శ్రీనాథుని పితామహుడగు కమలనాభామాత్యుని ఆధారముగా తీసికొని, క్రీ.శ. 1365 ప్రాంతమనిరి.

శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు - శ్రీనాథుని శృంగార నైషధ రచనా కాలమును ఊతగా చేసికొని క్రీ.శ. 1385 అని తలచిరి.

శ్రీ చిలుకూరి వీరభద్రరావు గారు - కొమఱ్ఱాజు లక్ష్మణరావు గారి వలె హరవిలాస రచనా కాలము బట్టియే శ్రీనాథుని జననకాలము నిర్ణయించిరి. కాని వీరు క్రీ.శ. 1385 ప్రాంతమనిరి.

శివశ్రీబండారు తమ్మయ్య గారు - బెండపూడి అన్నయామాత్యుని పితామహుడగు అన్నమంత్రి కాలమును ఆధారము చేసికొని, శ్రీనాథుని జనన కాలము క్రీ.శ. 1365-70 మధ్యకాలముగా నిర్ణయించుట చాల సంగతముగా నుండుననిరి.

శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ గారు - శ్రీనాథుని చరమ కాలము నాధారముగా చేసికొని, క్రీ.శ. 1378 ప్రాంతమనిరి.

ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి గారు - శ్రీనాథుని విద్యాధికారి పదవీ కాలము, కమల నాభామాత్యుడు వినమత్కాకతి సార్వభౌముడైన కాలములను సాధనములుగా చేసికొని, క్రీ.శ. 1360 అని నిర్ణయించిరి.

ఈ విధముగా ప్రముఖ సాహిత్యవ్రతులు చేసిన వాదముల సారాంశమేమనగా - శ్రీనాథుని జనన కాలము క్రీ.శ. 1360 నుండి క్రీ.శ. 1385 వఱకు గల మధ్య కాలములో ఊయెల లూగుచున్నది. కాల వ్యత్యాసము పెద్దగా లేదు కనుక - శ్రీనాథుని జనన కాలము - క్రీ.శ. 1360 - 1385 మధ్య కాలము.

## జన్మ స్థలము

ఒక మనీషికి మహాకవి యని బిరుద ప్రదానము చేయునది అతడు సృజించిన కావ్యమునందలి కవితా కళ మాత్రమే. వైయక్తిక విశేషములు కావు. కవి యొక్క కుల గోత్రాదులు, జన్మస్థలము, ఆచార వ్యవహారములు-కవితా ప్రియుడైన పాఠకునకు ఆసక్తి లేని అంశములు. ఈ చర్చ సాహిత్య పరిశోధకుల మేధాశక్తికి గీటురాయి కావచ్చునేమోకాని రసాస్వాదన తత్పరుడైన సహృదయునకు మాత్రము పంటిరాయి అగును.

కాని నేటి పద్ధతి యదికాదు. నేడు ఒక మహాకవి సాహిత్య విశేషములతోపాటు అతని జీవిత విశేషములను గూడ వివరింపనిచో, ఆ సమీక్ష సంపూర్ణమైనది కాదు. ఆ కారణముచేతనే నేటి సాహిత్య విమర్శక లోకములో జన్మస్థల చర్చ ఒక ప్రధానాంశముగా గణింపబడుచున్నది. ఇది కూడ సరిగా చరిత్ర తెలియని ప్రాచీన కవులకు మాత్రమే పరిమితము.

ప్రాచీనుడైన ఒక ప్రసిద్ధ వ్యక్తి యొక్క వైయక్తిక విశేషములను తెలిసికొనుటకు రెండు రకములైన సాక్ష్యములే సామాన్యముగా ఆధారములగుచుండును. 1. బాహిర సాక్ష్యములు - అనగా శాసనములు, ఇతరుల గ్రంథములు, వంశ చరిత్రములు మొదలగునవి. 2. అంత స్సాక్ష్యములు - అనగా ఆ వ్యక్తి స్వయముగా తెలిపిన అంశములు.

శ్రీనాథ మహాకవి జన్మస్థలము నిర్ణయించుటకు బాహిర సాక్ష్యములు లభింపలేదు. ఇక మిగిలినవి అంతస్సాక్ష్యములు మాత్రమే. ఈ అంతస్సాక్ష్యములు కూడ సూటిగ లేవు.

శ్రీనాథుడు తన పితామహుడగు కమలనాభామాత్యుని గూర్చి శ్రీ భీమేశ్వర పురాణములో చేసిన ప్రశంస - (భీమ 1-10)

> కనకక్ష్మాధర ధీరు వారిధి తటీ కాల్పట్టణాధీశ్వరున్
> ఘనునిన్ బద్మపురాణ సంగ్రహకళా కావ్య ప్రబంధాధిపున్
> వినమత్కాకతి సార్వభౌముఁ గవితా విద్యాధరున్ గొల్తు మా
> యనుగుందాతఁ బ్రదాత శ్రీ కమలనాభామాత్య చూడామణిన్.

కాశీ ఖండమున (కాశి. 1-20) కమలనాభుని గూర్చి చేసిన మరియొక ప్రశంస -

> మత్పితామహు గవి పితామహునిఁ దలఁతుఁ
> గలిత కావ్య కలాలాభుఁ గమల నాభుఁ
> జంద్ర చందన మందార సదృశకీర్తి
> సరస సాహిత్య సామ్రాజ్య చక్రవర్తి

బెండపూడి అన్నయామాత్యుడు శ్రీనాథునితో పలికిన పలుకులు - (భీమ. 1-23)

పాకనాఁటింటి వాఁడవు బాంధవుఁడవు
కమలనాభుని పౌత్రుఁడ వమలమతివి
నాకుఁ గృపసేయు మొక ప్రబంధంబు నీవు
కలిత గుణగణ్య! శ్రీనాథ కవి వరేణ్య!

ఈ పద్యముల వలన తెలియుచున్న అంశములు -

శ్రీనాథుడు పాకనాటింటివాడు. శ్రీనాథుని తాత పేరు కమలనాభుడు. కమలనాభుడు సముద్రపుటొడ్డున గల కాల్పట్టణమునకు అధీశ్వరుడు. పద్మపురాణ సంగ్రహమను ప్రబంధమును వ్రాసినవాడు, కాకతి సార్వభౌమునిచే నమస్కరింపబడుచుండెడి వాడు.

ఈ అంశములను ఆధారముగా చేసికొని సాహిత్య స్నాతకులు శ్రీనాథుని జన్మ స్థలమును గూర్చి తెలిపిన అభిప్రాయములు.

'పాకనాఁటింటి వాఁడవు' అను దానికి - శ్రీనాథుని ఇంటిపేరు 'పాకనాఁడు' అని శ్రీ దేకుమళ్ల అచ్యుతరావు గారు ఊహించిరి. కాని ఈ ఊహను ఎక్కువమంది పండితులు సమర్థింపలేదు. 'పాకనాఁటింటివాఁడవు' అనగా పాకనాటి నియోగి శాఖా బ్రాహ్మణుడు - అని ఎక్కువమంది అభిప్రాయపడినారు.

శ్రీనాథుని పూర్వులు పాకనాటి వారు. అంతమాత్రమున శ్రీనాథుడు పాకనాడులో జన్మించినాడని చెప్పుటకు అవకాశము లేదు. జన్మించినట్లు ఆధారమున్న అభ్యంతరము లేదు. అట్టి ఆధారము లభింపలేదు. కనుక పాకనాటింటివాడవు అను అంశము శ్రీనాథుని జన్మస్థల నిర్ణయమునకు ఉపయోగింపదు.

కమలనాభుడు వ్రాసిన పద్మపురాణ సంగ్రహము లభించిన, కమలనాభుని గూర్చి కొంత సమాచారము లభించెడిదేమో. కాని పద్మపురాణ సంగ్రహము లభింపలేదు. ఇక కమల నాభునకు నమస్కరించిన కాకతి సార్వభౌముడు కడపటి కాకతీయ సామ్రాజ్యాధిపతియైన ప్రతాపరుద్ర చక్రవర్తి (క్రీ.శ. 1320-23) ఈ అంశము కూడ జన్మస్థల నిర్ణయమునకు ఉపకరింపదు.

ఇక కమలనాభామాత్యుడు అధీశ్వరుడుగా నున్న కాల్పట్టణము. ఈ కాల్పట్టణము సముద్రపుటొడ్డున ఉండవలెను. శ్రీనాథుని జన్మస్థలమును నిర్ణయించుటకు ఆధారము 'వారిధితటీ కాల్పట్టణము' మాత్రమే. ఇక పరిశోధకులు - సముద్రపుటొడ్డున కల కాల్పట్టణమునకై వెదకిరి.

శ్రీ వీరేశలింగం పంతులుగారు 'క్రాల్పట్టణము' అని గ్రహించి శ్రీనాథుని జన్మ స్థలమును ఊహించిరి. వీరు 'క్రాలు' అను శబ్దమునకు 'ప్రకాశించు' అనియున్న అర్థమును గ్రహించి, క్రొత్తగ కట్టిన పట్టణము ప్రకాశించు చుండును అని అన్వయించి, ఒంగోలునకు పదిమైళ్ల దూరములో సముద్ర తీరమున నున్న 'క్రొత్త పట్టణము' శ్రీనాథుని జన్మ స్థలమని సూచించిరి.

బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి గారు - మచిలీ పట్టణమునకు తూర్పున సముద్ర తీరమున 'కాలీ పట్టణము' అను గ్రామమున్నది. ఇది ప్రాచీన పట్టణము. కాలి పట్టణము, కాలీ పట్టణము, కాళీపట్టణము అను పదముల కంత భేదము లేదు. శ్రీనాథుడు పేర్కొన్న కాల్పట్టణము ఇపుడు కాలీ పట్టణమని వ్యవహరింపబడుచున్న ఈ గ్రామమే. శ్రీనాథుని బావమఱది యగు దుగ్గన ఇంటిపేరి గ్రామమగు దగ్గుపల్లి, శ్రీనాథుని బంధువగు బెండపూడి అన్న మంత్రి ప్రభృతుల గ్రామములు ఈ కాలీ పట్టణమునకు దగ్గరగా నున్నవి - అని శ్రీనాథుని జన్మస్థలము మచిలీపట్టణము చెంత గల కాలీపట్టణము అని నిర్ణయించిరి.

శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావు గారు - ఒక శాసనమును ఆధారముగా చేసికొని 'కలుపట్టణము' అను ఒక గ్రామ నామమును బైటకు తీసి, ఆ కలుపట్టణమే శ్రీనాథుడు చెప్పిన కాల్పట్టణముగా భావించిరి. ఈ కలుపట్టణము ప్రభాకర శాస్త్రిగారు తెలిపిన కాలీ పట్టణమునకు దరిదాపుననే కలదు.

శ్రీ చిలుకూరి వీరభద్రరావు గారు - కాల్పట్టణము అనగా 'కాలపట్టణము.' కాల అనగా 'నల్లని' అని అర్థము. నెల్లూరు చెంత కృష్ణ పట్టణము కలదు. కృష్ణ పట్టణమన్నను 'నల్లని పట్టణము' అనియేకదా. కనుక కృష్ణ పట్టణమే శ్రీనాథుడు చెప్పిన కాల్పట్టణము అని వీరు ఊహించిరి.

శ్రీ నేలటూరి వేంకటరమణయ్య గారు - శ్రీనాథుని బాల్య సఖుడగు అవచి తిప్పయ సెట్టిది నెల్లూరు. బాల్య సఖులు జన్మస్థలము నందుందురు. కనుక శ్రీనాథుని జన్మస్థలము నెల్లూరు అని భావించిరి. 'వారిధి తటీ కాల్పట్టణాధీశ్వరున్' అనుదాని ప్రస్తావన తీసికొని రాలేదు.

శ్రీ చాగంటి శేషయ్య గారు - గుంటూరు మండలము రేపల్లె తాలూకాలో 'నల్లూరు' అను నొక గ్రామమున్నది. రేపల్లెకు అయిదు మైళ్ల దూరమునను సముద్రమునకు పది మైళ్ల దూరముననున్నది. నల్ల + ఊరు = నల్లూరు. కాలపట్టణమన్నను నల్లని ఊరేకదా - అని శ్రీనాథుని జన్మస్థలము రేపల్లె తాలూకా యందలి 'నల్లూరు' అని ఊహించిరి.

ఇట్లు దేశములో ప్రముఖులైన పండితులు శ్రీనాథుని జన్మస్థలమును గూర్చి రకరకములైన అభిప్రాయములు వెలిబుచ్చిరి. వీరి వాదములన్నియు ఊహలపై ఆధారపడినవే.

కనుక ఇప్పటివరకు శ్రీనాథుని జన్మస్థలమేదియో స్పష్టముగా తెలియదు.

## శ్రీనాథుడు కర్ణాటుడా?

శ్రీనాథుని జన్మస్థలమును గూర్చి సాహిత్య పరిశోధక లోకము ఇంతగా ఇట్లు తలమునకలు అగుచుండగా, శ్రీనాథుడు తెలుగు దేశమున పుట్టలేదనియు, కన్నడ దేశమున పుట్టి తెలుగుదేశమునకు చేరి తెలుగు కవీంద్రుడయ్యెననియు, శ్రీనాథుడు కర్ణాటుడనియు ఒక వాదము లేవనెత్తిరి.

ఈ వాదము చేయువారు చెప్పెడి హేతువులు ఇవి.

1. భీమేశ్వర పురాణమునందు (భీమ-ప్రథమ-15) కుకవి నింద చేయుచు శ్రీనాథుడిట్లు చెప్పుకొనినాడు.

ప్రౌఢి పరికింప సంస్కృత భాష యండ్రు
పలుకు నుడికారమున నాంధ్ర భాష యందు
రెవ్వరేమన్న నండ్రు నాకేల కొఱంత
నా కవిత్వంబు నిజము కర్ణాట భాష

శ్రీనాథుడే తన కవిత్వము కర్ణాట భాషయని చెప్పుకొనినాడు. ఇంతకన్న సాక్ష్యమేమి కావలయును? కనుక శ్రీనాథుడు కర్ణాటుడు.

2. కాశీ ఖండమునందలి అవతారికలో (కాశి-ప్రథమ-7) శ్రీనాథుడు తానే వయస్సులో ఏ గ్రంథము వ్రాసినది ఒక సీస పద్యమునందు గుదిగ్రుచ్చినాడు. ఆ పద్యమునందలి ఎత్తుగీతిలో -

ప్రాయ మింతకు మిగులఁ గైవ్రాలకుండఁ
గాశికాఖండమను మహాగ్రంథమేను
దెలుఁగుఁ జేసెదఁ గర్ణాట దేశ కటక
పద్మవన హేళి శ్రీనాథ భట్ట సుకవి

అని కర్ణాట దేశ కటకమను పద్మవనమునకు తాను సూర్యుడనని చెప్పుకొనినాడు. కనుక శ్రీనాథుడు కర్ణాటుడు అని ఈ వాద ప్రియులు చూపించు రెండవ ఆధారము.

3. శ్రీనాథుడు కర్ణాట దేశమునందు సంచరించునపుడు ఎన్నో యిబ్బందులకు గుఱియయ్యెను. ఆ సందర్భము నందు చెప్పిన చాటువొకటి గలదు.

కుల్లాయుంచితి కోక సుట్టితి మహా కూర్పాసమున్ దొడ్గితిన్
వెల్లుల్లిన్ దిలపిష్టమున్ మెసవితిన్ విశ్వస్త వడ్డింపఁగాఁ
జల్లా యంబలి ద్రావితిన్ రుచులు దోసంబంచుఁ బోనాడితిన్
దల్లీ! కన్నడ రాజ్యలక్ష్మి! దయలేదా! నేను శ్రీనాథుఁడన్

ఈ పద్యమునందు శ్రీనాథుడే కన్నడ దేశమును తల్లీ! యని సంబోధించినాడు. ఆతని కంఠోక్తిని శంకింప వలసిన అవసరమేమున్నది. కనుక శ్రీనాథుడు నిస్సందేహముగా కర్ణాటుడే.

4. శ్రీనాథుని గ్రంథములందు కన్నడ భాషా సంబంధములైన పదములు కన్పడు చున్నవి. కన్నడ భాషా పదములు ఆ భాషతో సంబంధము లేని వారికెట్లు తెలియును? శ్రీనాథుడు కన్నడ దేశమునందు పుట్టెను గనుక ఆ భాషా పదములు అతనికి తెలిసినవి. కనుక శ్రీనాథుడు కన్నడుడు.

ఈ నాలుగంశముల నాధారము చేసికొని కన్నడుడని కొందరు విమర్శకులు వాదము చేయుట జరిగినది. కాని ఈ నాలుగంశములు తుత్తునియలుగా ఖండింపబడుట కూడ జరిగినది. ఆ ఖండనముల సారాంశములు క్రమముగా నివి.

1. 'నా కవిత్వంబు నిజము కర్ణాట భాష' అను పాదము కల పద్యము భీమేశ్వర పురాణము నందలిది. శ్రీనాథుడు భీమ ఖండము వ్రాయు కాలమునందు రాజమహేంద్రవర విద్వాంసుల విమర్శలకు గుఱి అయ్యెను. వారి కుతర్కములకు, వారి నీచారోపణములకు విసుగెత్తి చెప్పిన పద్యమిది. శ్రీనాథుని భాష తెలుగు భాష కాదనియు కర్ణాట భాష యనియు ఆ పండితులు విమర్శింపగా ఒడలు మండి - ప్రౌఢముగా చెప్పిన సంస్కృత భాష యందురని, నుడికారముతో చెప్పిన ఆంధ్రభాషయందురని చెప్పి, ఎవ్వరేమన్న తనకేమియు కొఱత లేదనియు చెప్పుచు కోపముతో 'నా కవిత్వంబు నిజము కర్ణాట భాష' అని గద్దించినాడు. కనుక కినుకతో విసుగుకొనిన పలుకులను యథార్థ విషయముగా గ్రహించుట కవకాశము లేదు.

ఏ గ్రంథమునందును ఇంతకు పూర్వము కుకవినింద చేయని శ్రీనాథుడు ఈ గ్రంథమునందు చేయుటకు గల కారణము ఆ కాలమున ఎదురయిన రాజమహేంద్రవర విద్వాంసుల ఎత్తిపొడుపు మాటలే.

ఈ పద్యము ప్రక్షిప్తమని శ్రీ చాగంటి శేషయ్య గారి అభిప్రాయము. ప్రక్షిప్తమే యైనచో ఈ సమాధానము కూడ చెప్పనక్కరలేదు. కొందరు ఈ పద్యము చాటు పద్యమని భావించిరి. చాటు పద్యమైనను గ్రంథస్థ పద్యమైనను సమాధాన మింతకు ముందు చెప్పుకొన్నదే.

కర్ణాట భాష యను దానిని శ్రీ బులుసు వేంకట రమణయ్య గారు 'కర్ణ+అట' అని విడదీసి, కర్ణ సమీపమున చరించు భాషయని అర్థము చెప్పిరి. అనగా వీరి మతము ప్రకారము కర్ణాట భాషయనగా శ్రవణానందకరమైన భాష. శ్రీ కుందూరు ఈశ్వరదత్తుగారు 'కర్ణాడు' అనగా నల్లని ప్రదేశమనియు, ఆ ప్రదేశమునందు వ్యవహారములో గల భాష కర్ణాట భాష యనియు అర్థము చెప్పిరి.

ఇట్లెందరెన్ని విధముల చెప్పినను "కర్ణాట భాష" యను దాని నాధారము చేసికొని శ్రీనాథుడు కన్నడుడు అని మాత్రము ఎవరును చెప్పలేదు.

2. ఇక రెండవ అంశము :- కాశీ ఖండము నందలి 'కర్ణాట దేశ కటక పద్మవన హేళి శ్రీనాథ భట్ట సుకవి' అను నంశము శ్రీనాథుని కీర్తి ప్రతిష్ఠలకు నిదర్శనమే కాని. శ్రీనాథుడు కర్ణాటుడని చెప్పుటకు నుపయోగపడు నంశము కాదు. కర్ణాట దేశమందలి రాజధాని యను పద్మవనమునకు సూర్యుడు అని కదా భావము. అనగా శ్రీనాథుని వలన ఆ నగరమంతయు ప్రకాశించెనన్నమాట. అనగా ఆ నగర ప్రజలు ముఖ్యముగా పండితులు ఆనందించిరని తాత్పర్యము. అంతేకాని శ్రీనాథుడు కర్ణాట దేశస్థుడను భావము రాదు. అంతేకాదు. సూర్యుడు పద్మవనమును వికసింప జేయును కాని పద్మవనమునందు పుట్టడు. అట్లే శ్రీనాథుడు కూడ తన ప్రతిభా పాండిత్యముల చేత కర్ణాట దేశ పండితులను ఆనందింపజేసెనని గ్రహింపవలెను కాని కర్ణాట దేశమునందు పుట్టినట్లు గ్రహింపరాదు. కనుక శ్రీనాథుడు కర్ణాటుడు అని అనుటకు ఈ యంశము ఆధారము కానేరదు.

3. ఇక మూడవ అంశము :- కర్ణాట దేశమునందు సంచరించునపుడు శ్రీనాథుడు చెప్పిన 'తల్లీ కన్నడ రాజ్యలక్ష్మి! దయలేదా। నేను శ్రీనాథుఁడన్' అను పద్యపాదము ఆ దేశమునందు అవస్థలు పడుచు చెప్పినదే కాని మాతృదేశస్తవ రూపమైనది కాదు. విసువుతో

మాటాడునపుడు 'తల్లీ' అని సంబోధించుట లోకము నందున్నదియే కదా. అంతకు పూర్వము కర్ణాట దేశమున సంచరించినపుడు శ్రీనాథుడు అచ్చట అనేక సత్కారములను పొందినాడు. అవి గుర్తునకు వచ్చి 'అన్ని సత్కారములను బొందిన శ్రీనాథుడను. ఇపుడిన్ని యవస్థలను పడుచుంటిని. ఓ కన్నడ రాజ్యలక్ష్మీ! తల్లీ! దయలేదా' అని దీనముగా ప్రార్థించినాడు. అంతేకాని శ్రీనాథుడు కన్నడ దేశమును తన జన్మదేశముగా చెప్పినట్లు అర్థము కాదు. కనుక శ్రీనాథుడు కర్ణాటుడు అనుటకు ఈ అంశముపకరింపదు.

4. నాలుగవ అంశము :- శ్రీనాథుని భాషయందు కొన్ని కన్నడ భాషా సంప్రదాయ సంబంధములైన పదములు కన్పడుచున్నవన్న మాట సత్యమే 'కోహళి, చారులు, ఎల్లన్ శిష్యులు, హేరాళము, కైవార దుర్భాషణములు; నిర్బిందుకమైన 'తీగె' - మొదలగున వన్నియు నీకోవలోనివే. ఈ ప్రయోగములు శ్రీనాథుని సాహిత్యమునందు కన్పడినంత మాత్రమున శ్రీనాథుడు కన్నడుడనుట పొరపాటు. పూర్వాంధ్ర కవులలో అనేక ప్రాంతములు సంచారము చేసిన మహాకవి శ్రీనాథుడు. అనేక ప్రాంతముల ఆచార వ్యవహారములు అతడు గమనించినాడు. గమనించిన ఆచార వ్యవహారములను అక్షర బద్ధము చేయుట అతనికొక అలవాటు. అట్లే దేశ సంచారము వలన కాని, బహుదేశబుధులతో విద్యాధికారిగా నున్నపుడు భాషించుట వలన గాని ఆతనికనేక భాషల రహస్యములు తెలిసికొనుట కవకాశము కలదు. తక్కిన భాషల సంగతి యెట్లున్నను కన్నడ భాష సమీప ప్రాంతమందున్న భాష. కనుక భాషా తృష్ణ కల శ్రీనాథ భట్టునకు కన్నడ భాషా రహస్యములు తెలియుటలో ఆశ్చర్యము లేదు. తెలిసిన వానిలో కొన్ని ఆతని సాహిత్యము నందు ప్రవేశించినవి. అంతమాత్రమున కర్ణాటుడనవచ్చునా? ఇతని గ్రంథములందు కన్నడ పదములే కాదు చాల ఉర్దూ పారశీక పదములు కూడ చోటు చేసికొన్నవి. ఈ విధముగా వాదము చేసినచో శ్రీనాథుడు భారతీయుడే కాదనవలసి వచ్చును. కనుక సారాంశమేమనగా ఈ అంశము శ్రీనాథుని బహుభాషా పాండిత్యమునకు మఱియొక యుదాహరణ మగును గాని శ్రీనాథుడు కర్ణాటుడనుటకు పనికిరాదు.

ఇట్లు ఈ వాదములలో బలము కన్పడదు. ఇది యిట్లుండగా తెనుగు భాషకే కర్ణాట భాష యను వ్యవహారము కూడ లేకపోలేదు. తెనుగు భాషలో గ్రంథములు వ్రాసిన కొందరు కవులు తాము కర్ణాట భాషలో వ్రాసినట్లు చెప్పుకొనినారు. వీరాచార్యులు సంస్కృతములో వ్రాసిన గణిత శాస్త్రమును ఎలుగంటి పెద్దనార్యుడు తెలుగున కనువదించినాడు. తెలుగులో గ్రంథము వ్రాయుచు పెద్దనార్యుడు కర్ణాటకమున వ్రాయుచున్నట్లు చెప్పినాడు - (చాగంటి శేషయ్య గారు ఆంధ్రకవి తరంగిణి 5 భా - 11 పుట.)

హాటకమైన ప్రకీర్ణము
పాటించి గుణింపఁ జేతు బహు పద్ధతులన్
గాటంబగు లెక్కలు క
ర్ణాటకమున వెలయ సూర్యనారాయణుఁడా।

శ్రీనాథుడు కర్ణాటుడు అనువాదమునకు బలము లేకపోగా శ్రీనాథుడు ఆంధ్రు డనుటకు బలమైన కారణములు కలవు. అతడు చేసిన రచనలన్నియు ఆంధ్రభాషయందే.

కన్నడ భాషయందు మచ్చుకైనను ఒక్క పద్యము కూడ లేదు. అంతేకాదు పూర్వాంధ్ర కవులలో శ్రీనాథునకున్నంత ఆంధ్రదేశాభిమానము మఱియొకరిలో కన్పడదు. శ్రీనాథునివలె అనేక విధముల అనేక సందర్భములందు ఆంధ్రదేశమును అంతగా వర్ణించిన మఱియొక కవి కన్పడడు కదా। చిన్నారి పొన్నారి చిఱుత కూకటి నాటి నుండి దివిజ కవివరు గుండియలు దిగ్గురనగ అమరపురికి నరుగు వఱకు అతని అక్షరార్చన మంతయు ఆంధ్రభాష యందే కదా। శ్రీనాథుడు ఆంధ్రుడు మాత్రమే కాదు. ఆంధ్రదేశాభిమానమున్న ఆంధ్రుడు.

## శ్రీనాథుడు - పోతన

శ్రీనాథుడు, బమ్మెర పోతన బావ బావ మఱదులని లోకములో ఒక ప్రచారము కలదు. ఎన్నో కథలు కూడ కలవు. ఈ అంశమును ఖండించుచు శ్రీ చాగంటి శేషయ్య గారు అన్న మాటలు -

'....దీనినిబట్టి పోతనామాత్యుడు శ్రీనాథుని కాలములో లేడనియు, ఆతడు చనిపోయిన పిమ్మటనే పోతన జన్మించెననియు స్పష్టమగుచున్నది. ఇందువలన శ్రీనాథునితో సంబంధించిన కథలన్నియు నభూత కల్పనములనియు, నందఱుమాత్రమును సత్యము లేదనియు నిస్సంశయముగా జెప్పవచ్చును.' (ఆంధ్రకవి తరంగిణి - భా-6 పుట-192)

ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి గారు వారి తెలుగు సాహిత్య చరిత్రలో (భా-2 పుట-157) ఈ మధ్య వెలిబుచ్చిన అభిప్రాయము -

'శ్రీనాథుని కాలము 1360-1450. పోతన కాలము 1425-1500. ఉభయులకు అరువది యైదు సంవత్సరములు (1425-1360=65) వయోభేదము కలదు. కావున శ్రీనాథుడు బమ్మెర పోతన బావ బావమఱది అగుట మఱి అసంభవము. ఇద్దఱి సంబంధమును అస్తయోన్ముఖుడైన సూర్యుడు, ఉదయోన్ముఖుడైన చంద్రుడు కనిపించు ఆకాశమునకు సంకాశము.'

దగ్గుపల్లి దుగ్గన రచించిన నాసికేతోపాఖ్యానములో (1-19) దుగ్గన శ్రీనాథుని మఱది అనియు దుగ్గనకు పోతన అను అగ్రజుడున్నట్లు కలదు.

కవి సార్వభౌముఁడై కర్ణాట విభుచేతఁ
గనక రత్నాభిషేకములు గనిన
శ్రీనాథ సుకవి కూరిమి సేయు మఱఁదివి
దుగ్గయ్య కవిరాజ దగ్గుపల్లి
తిప్పనార్యునకు సతీమణి యెఱ్ఱమ
కును దనూజుఁడవు పోతనకు నెఱ్ఱి
నామాత్య వర్యునకు ననుఁగుఁ దమ్ముండవు
శాండిల్య గోత్రుఁడౌ సరసమతివి

చెప్పనేర్తువు కృతులు సుస్థిరముగాఁగఁ
గాన నీవు రచింపఁగఁ గడఁగియున్న
నాసికేత చరిత్రంబు నాదుపేర
నంకితము సేయు కవిరాజు లాదరింప

కనుక శ్రీనాథునకు పోతన అను పేరుగల మఱది యున్నాడు. ఈ పోతననే బమ్మెర పోతనగా భ్రమించి లోకము కట్టుకథలను అల్లియుండవచ్చును.

పోతన శ్రీనాథులు వయోభేదము బాగుగా నున్న సమకాలీనులు కావచ్చునేమో కాని సమవయస్కులు మాత్రము కారు, బావమఱదులు కానేకారు - అని సారాంశము.

## కనకాభిషేకము చేసిన కర్ణాట క్షితి పాలుడెవరు?

కర్ణాట క్షితిపాల మౌక్తిక సభాగారాంతరాకల్పిత
స్వర్ణస్నాన జగత్ప్రసిద్ధ కవిరాట్....

అని కాశీఖండములో (కాశి 7-266) - శ్రీనాథుడు తాను కర్ణాట క్షితిపాలుని ముత్యాలశాలలో స్వర్ణస్నానము చేసి జగత్ప్రసిద్ధుడనైన కవిరాజునని తెలిపినాడు.

'కవి సార్వభౌముఁడై కర్ణాట విభుచేతఁ
గనక రత్నాభిషేకములు గనిన
శ్రీనాథ సుకవి'

అని శ్రీనాథుని బావమఱది యైన దగ్గుపల్లి దుగ్గన తాను రచించిన నాసికేతోపాఖ్యానములో (1-19) గొప్పగ చెప్పిన అంశము.

శ్రీనాథుడు రావు సింగమహీపాలుని కొలువున కేగినపుడు, శారదాంబ కరుణ వలన తాను సాధించిన ఘనకార్యములను గుదిగ్రుచ్చి ఒక పద్యము చెప్పినాడు.

దీనారటంకాలఁ దీర్థమాడించితి
దక్షిణాధీశు ముత్యాలశాల
పగులఁ గొట్టించి తుద్భట వివాద ప్రౌఢి
గౌడడిండిమభట్టు కంచుఢక్క
పలుకుఁ దోడై తాంధ్రభాషామహాకావ్య
నైషధగ్రంథ సందర్భమునకు
చంద్రభూష క్రియాశక్తి రాయల యొద్దఁ
బాదు కొల్పితి సార్వభౌమ బిరుద

మెటుల మెప్పించెదో నన్ను నింక మీఁద
రావు సింగ మహీపాలు ధీవిశాలు
నిండు కొలువున నెలకొని యుండి నీవు
సగస సద్గుణ నికురంబ! శారదాంబ!

కాశీఖండమున చెప్పిన 'కర్ణాట క్షితిపాలుడు', దుగ్గన నాసికేతోపాఖ్యానములో చెప్పిన 'కర్ణాట విభుడు', శ్రీనాథుడు 'దీనారటంకాల....' పద్యములో చెప్పిన 'దక్షిణాధీశుడు' ఒకడే. ఎవరా కర్ణాట విభుడు?

జననాథోత్తమ। దేవరాయనృపతీ। చక్రేశ। శ్రీవత్సలాం
ఛన సంకాశ మహాప్రభావ। హరిరక్షాదక్ష। నాబోటికిన్
కునృపస్తోత్ర సముద్భవంబయిన వాగ్దోషంబు శాంతంబుగాఁ
గనక స్నానము చేసి కాక పొగడంగా శక్యమే దేవరన్

జోటీ। భారతి యార్భటిన్ మెఱయుమీ చోద్యంబుగా నేను గ
ర్ణాటాధీశ్వరు దేవరాయ నృపతిన్ నాసీరధాటీ చమూ
కోటీఘోటక ధట్టికా ఖురపుటీ కుట్టాక సంఘట్టన
స్ఫోటీధూత ధరా రజశ్ఛుళికితాంభోధిన్ బ్రశంసించెదన్

అను శ్రీనాథుని చాటు పద్యముల వలన కర్ణాట విభుడు దేవరాయలు అని స్పష్టము.

పంపా విరూపాక్ష బహు జటా జూటి కా
రగ్వధ ప్రసవ సౌరభ్యములకు
తుంగభద్రా సముత్తుంగ వీచీ ఘటా
గంభీర ఘుమఘుమారంభములకు
కలసాపురప్రాంత కదళీవనాంతర
ద్రాక్షాలతాఫల స్తబకములకు
కర్ణాట కామినీ కర్ణహాటక రత్న
తాటంక యుగ ధాళధళ్యములకు

నిర్నిబంధ నిబంధమై నెగడు కవిత
తెలుఁగునను సంస్కృతంబునఁ బలుకనేర్తు
ప్రౌఢ దేవేంద్ర రాయ భూపాల వరుని
సమ్ముఖంబున దయఁ జూడు ముమ్మసుకవి

డంబు సూపి ధరాతలంబుపైఁ దిరుగాడు
కవిమీఁదఁ గాని నాకవచమేయ
దుష్ప్రయోగంబుల దొరకొని చెప్పెడు
కవి శిరస్సునఁగాని కాలు చాఁప
సంగీత సాహిత్య సరస విద్యల నేర్చు
కవుల ఱొమ్ములు గాని కాల్చి విడువ
చదివి చెప్పఁగ నేర్చి సభయందు విలసిల్లు
కవి నోరు గాని వ్రక్కలుగఁ దన్న

దంట కవులకు బలువైన యింటి మగఁడఁ
గవుల వాదంబు వినవేడ్కఁ గల్గెనేని
నన్నుఁ బిలిపింపు మాస్థాన సన్నిధికిని
లక్షణోపేంద్ర। ప్రౌఢరాయక్షితీంద్ర।

ఈ చాటు పద్యముల వలన దేవరాయలు ప్రౌఢదేవరాయలు అని కూడ పిలువబడు చుండెడివాడని తెలియుచున్నది.

'దీనారటంకాల....' అను సీసపద్యము వలన శ్రీనాథుడు రావు సింగమహీపాలుని కొలువునకు వెడలునాటికే గౌడ డిండిమభట్టును ఓడించుట, కవి సార్వభౌమ బిరుదము గడించుట, కనకాభిషేక సత్కారము నందుట జరిగినవని స్పష్టము. భీమేశ్వర పురాణములో కనకాభిషేక ప్రస్తావన లేకపోవుట, తరువాత వ్రాసిన కాశీఖండములో నుండుట వలన శ్రీనాథునకు కనకాభిషేకము భీమేశ్వర పురాణము రచించిన తరువాత కాశీఖండము వ్రాయక పూర్వము జరిగినట్లు కూడ భావింపవచ్చును.

ఇక ఈ ప్రౌఢ దేవరాయలు ఎవరు?

కర్ణాట రాజ్యమును పరిపాలించిన సింగమ వంశమున దేవరాయలు అను పేరుకలవారు నలుగురున్నారు. మొదటి దేవరాయల కాలము క్రీ.శ. 1406-1412. రెండవ దేవరాయల కాలము క్రీ.శ. 1422-1442. మిగిలిన ఇద్దరు దేవరాయ నామధారులు శ్రీనాథుని కాలము వారు కారు. కనుక ఈ ఇద్దరు కారు.

సాహిత్య పరిశోధకులలో కొందరు శ్రీనాథునకు కనకాభిషేకము చేసినది మొదటి దేవరాయలనియు, మఱికొందరు రెండవ దేవరాయలనియు రకరకములైన ఆధారములతో తెలిపిరి.

శ్రీ వీరేశలింగము పంతులుగారు - రెండవ దేవరాయలు కవి పండిత పోషకుడు. కనుక శ్రీనాథునకు కనకాభిషేకము చేసినది రెండవ దేవరాయలు అని తెలిపిరి.

శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు కూడ రెండవ దేవరాయలే యని యనిరి.

శ్రీ చిలుకూరి వీరభద్రరావు గారు - మొదటి దేవరాయలు అని అనిరి.

శ్రీ నేలటూరి వేంకట రమణయ్య గారు - చంద్రభూష క్రియాశక్తిని, శాసనములను ఆధారము చేసికొని శ్రీనాథుడు దర్శించిన దేవరాయలు మొదటి దేవరాయలు అని నిర్ణయించిరి.

శివ శ్రీ బండారు తమ్మయ్య గారు నేలటూరి వారి నిర్ణయమును అంగీకరింపలేదు. తమ్మయ్య గారు చంద్రభూష క్రియాశక్తి రెండవ దేవరాయల యాస్థానమునందున్నట్లు ఊహించిరి. ఆధారములు తెలుపలేదు.

చాగంటి శేషయ్య గారు బండారు తమ్మయ్య గారు సరియైన ఆధారములు చూపలేదనుచు. నేలటూరి వారి వాదమును సమర్థించిరి.

ఆచార్య కొర్లపాటి వారు, పై వారందరి తరువాత శ్రీనాథుని పరిశోధించిన వారగుటచే, పై వారి వాదములన్నింటిని పరిశీలించి -

శ్రీనాథుని ప్రత్యర్థియైన అరుణగిరినాథుని బట్టి, భీమఖండ కాశీఖండ రచనల మధ్యకాలము సరిపోవుటను బట్టి, శ్రీనాథుడు రెండవ దేవరాయల ఆస్థానములో గల

అరుణగిరినాథుని ఓడించి, కవి సార్వభౌమ బిరుదమును పొంది కనకాభిషేక సత్కారమందెను - అని నిర్ణయించిరి. అనగా శ్రీరామమూర్తి గారి అభిప్రాయము ప్రకారము - శ్రీనాథునకు కనకాభిషేకము చేసినది రెండవ దేవరాయలు.

శ్రీనాథునకు కనకాభిషేకము చేసిన కర్ణాట విభుడు :-

శ్రీ చిలుకూరి వీరభద్రరావు గారు, శ్రీ నేలటూరి వేంకట రమణయ్య గారు, శ్రీ చాగంటి శేషయ్య గారు మొదటి దేవరాలనియు; శ్రీ వీరేశలింగము పంతులుగారు, శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు, శివశ్రీ బండారు తమ్మయ్య గారు, ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి గారు రెండవ దేవరాయలనియు భావించిరి.

**శ్రీనాథుడు దర్శించిన సర్వజ్ఞ సింగమనాయకుడు ఎవరు?**

శ్రీనాథుడు శారదాంబను ప్రార్థించుచు చెప్పిన - 'దీనారటంకాల....' అను సీస పద్యము నందలి -

ఇంతకాలంబు వలెఁ గాదు వింతరీతి
నెట్లు మెప్పించెదోకదా యింక మీఁద
రావు సింగాంక భూపాలు ధీవిశాలు
సకల సద్గుణ నికురంబ। శారదాంబ।

అను ఎత్తుగీతి పద్యము వలన శ్రీనాథుడు సింగభూపాలుని కొలువునకు వెడలక ముందే శారదాంబను స్తుతించినట్లు అనిపించుచున్నది. కాని ఈ ఎత్తు గీతి పద్యమునకు ప్రచారములోనున్న పాఠాంతర పద్యమిది.

ఎటుల మెప్పించెదో నన్ను నింకమీఁద
రావు సింగమహీపాలు ధీవిశాలు
నెండుకొలువున నెలకొని యుండి నీవు
సరస సద్గుణ నికురంబ। శారదాంబ.

ఈ ఎత్తుగీతి వలన - శ్రీనాథుడు సింగ మహీపాలుని కొలువున కేగి. ఆ కొలువులో గల శారదాంబను స్తుతించినట్లు తెలియుచున్నది.

శ్రీనాథుడు శారదాంబను స్తుతించి కొలువున కేగినను. కొలువున కేగిన తరువాత స్తుతించినను - శ్రీనాథుడు సింగమ నాయకుని దర్శించినట్లు స్పష్టమగుచున్నది.

శ్రీనాథునకు సింగమనీడు 'కుక్కవొ నక్కవో ఫణివొ క్రోతివొ పిల్లివొ బూతపిల్లివో' అను సమస్య నిచ్చినట్లును - ఆ సమస్యను

తక్కక రావు సింగ వసుధావరుఁ డర్థుల కర్థమిచ్చుచో
దిక్కుల లేని కర్ణుని దధీచిని ఖేచరు వేల్పు మ్రానుఁ బెం
పెక్కిన కామధేనువు శిబీంద్రుని నెన్నెదు భట్ట! దిట్టవై
కుక్కవొ నక్కవో ఫణివొ క్రోతివొ పిల్లివొ బూతపిల్లివో

అని సింగమ నాయకుని ప్రశంసించుచు పూరించినట్లు కలదు - అట్లే

సర్వజ్ఞ నామధేయము
శర్వునకే రావు సింగ జనపాలునకే
యుర్విం జెల్లున్ దక్కొరు
సర్వజ్ఞుండనుట కుక్క సామజమనుటే

అను నొక చాటు పద్యము వలన కూడ సర్వజ్ఞ సింగ భూపాలుని దర్శించినట్లు తెలియుచున్నది.

ఈ సర్వజ్ఞ సింగమనాయకుడెవరు?

సర్వజ్ఞ సింగమ నాయకుడు లేక సర్వజ్ఞ సింగమనీడు అను నతడు నిస్సందేహముగా తెలంగాణము నందలి రాచకొండ వెలమ ప్రభువు. కాని సింగమ నాయకుని వంశ వృక్షములో - ఐదవ తరములో ఒక సింగమ నాయకుడు, ఏడవ తరములో ఒక సింగమ నాయకుడు , పదియవ తరములో ఒక సింగమనాయకుడు-మొత్తము ముగ్గురుసింగమ నామధారులున్నారు.

ఏడవ తరములోని సింగమ నాయకునకు సర్వజ్ఞ బిరుదము లేదని కొందరు, పదవ తరములోని సింగమ నాయకునకు సర్వజ్ఞ బిరుదము లేదని మరికొందరు భావించుచున్నారు.

చాగంటి శేషయ్య గారు - శ్రీనాథుడు ఐదవ తరములోని సింగమ నాయకుని కాలము నాటికి జన్మింపలేదనియు, పదవ తరములోని సింగమ నాయకుని కాలము నాటికి ఇహలోకమును వీడిపోయెననియు, ఇక మిగిలిన ఏడవ తరము నాటి సింగమ నాయకుడే శ్రీనాథుని కాలము వాడని నిర్ణయించెను. ఈతనిని శ్రీనాథుడు క్రీ.శ. 1408-10 ప్రాంతములో దర్శించెనని తెలిపెను.

రసార్ణవ సుధాకరము అను అలంకార శాస్త్ర గ్రంథమును, రత్నపాంచాలిక అను సంస్కృత రూపకమును రచించిన వాడును, విశ్వేశ్వర కవిచే చమత్కార చంద్రిక అను లక్షణ గ్రంథమును అంకితముగా గొన్న సర్వజ్ఞ సింగమ నాయకుడే, శ్రీనాథుడు దర్శించిన సర్వజ్ఞ సింగమ నాయకుడు - అని చాగంటి వారు నిర్ణయించిరి.

వేటూరి ప్రభాకర శాస్త్రి గారు చాగంటి శేషయ్య గారు చెప్పిన సర్వజ్ఞ సింగమ నాయకుని కాక, ఈతని మనుమడైన సర్వజ్ఞ సింగమనాయకుని శ్రీనాథుడు దర్శించెనని భావించిరి.

శ్రీనాథుడు దర్శించిన సర్వజ్ఞ సింగమ నాయకుడు అనపోత నాయని కుమారుడు. వసంతరాయని అగ్రజుడు. అని వెలుగోటి వారి వంశావళిలో స్పష్టముగా కలదు.

''వసంతావనీనాథు సంసేవితాంచత్పదాంభోజు .... కుమారాన్న పోతావనీ నాథు సూనున్ .... సర్వజ్ఞ సింగక్షమానాథున్ .... పోచమాంబా లసద్గర్భ సంజాతు ఘనున్ రావు సింగ క్షమానాథ పౌత్రున్ .... సర్వజ్ఞ సింగోర్వరాధ్యక్షు నీక్షించి....'' అను భోగినీ దండక భాగముల వలన బమ్మెర పోతనామాత్యుడు భోగినీ దండకమును ఈ సర్వజ్ఞ నాయకుని గూర్చి చెప్పినదే యన్నది స్పష్టమగుచున్నది.

విశ్వేశ్వర కవి చమత్కార చంద్రికలో గల -

'విద్యాదైవత తాతతావక మగురో సర్వజ్ఞ చూడామణే స్తోతవ్యోసిమనీషిణామ్....'

అను ప్రశంసను బట్టి రసార్ణవ సుధాకర కర్తయైన సింగమ నాయకునకు సర్వజ్ఞ బిరుదము కలదని స్పష్టము. ఇతని మనుమడైన సింగమ నాయకునకును సర్వజ్ఞ బిరుదము కలదు.

ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి గారు శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి గారి అభిప్రాయము సమంజసమని -

"రసార్ణవ సూధాకర కర్త మొదటి సర్వజ్ఞ సింగమనాయకుడనియు, శ్రీనాథుడు సందర్శించిన సర్వజ్ఞ సింగమ నాయకుడు రెండవ సర్వజ్ఞ సింగమ నాయకుడనియు (క్రీ.శ. 1435) స్పష్టము" - అని తెలిపిరి. (శ్రీనాథుడు - పుట. 271)

శ్రీనాథుడు "దీనారటంకాల...." అను పద్యము చెప్పినది, "కుక్కవొనక్కవో...."అను సమస్యను పూర్తి చేసినది, "సర్వజ్ఞనామధేయము...." అను పద్యము చెప్పినది - ఈ రెండవ సర్వజ్ఞ సింగమనాయకుని దర్శించిన సందర్భమునందే.

## శ్రీనాథుడు శృంగారియా?

ప్రతిభతో ప్రసిద్ధులైన వారి ప్రతిదిన ప్రవర్తనమును కూడ పరిశీలించుట ప్రపంచము నకు పరిపాటి. తన కాలమున తనంతటి సత్కవి లేడు అని అనిపించుకొన్నవాడు శ్రీనాథుడు. ఇక ప్రపంచము ఊరకుండునా? శ్రీనాథుని వ్యక్తిగత జీవిత విషయములందు కూడ తలదూర్చి. శ్రీనాథుడు వేశ్యాలోలుడని తలచినది.

శ్రీనాథునకు సమీపకాలమునందు గల కవయిత్రి యైన మొల్ల తన రామాయణ గ్రంథమందలి పూర్వ కవిస్తుతితో 'రసికుడైనట్టి శ్రీనాథు' అని చెప్పినది.

ఆధునికులలో శ్రీనాథుని స్త్రీలౌల్యమును గూర్చి మొదటగా ప్రస్తావించినవారు కందుకూరి వీరేశలింగము పంతులు గారు.

తరువాత ఈ యంశమును బాగుగా ప్రచారము చేసినవారు శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు. వీరు రచించిన శ్రీనాథ చరిత్రమునకే 'శృంగార శ్రీనాథము' అని నామకరణము చేసిరి. శ్రీనాథుని స్వభావమును గూర్చి వీరు శృంగార శ్రీనాథము నందన్న మాటలు -

'శ్రీనాథుడు మహాభోగ పరాయణుడు... శ్రీనాథుడు నిర్వ్యాజముగా నొక్క గ్రంథమేని పారలౌకిక ఫలము నపేక్షించి భగవదంకితము చేసినట్లు కానరాదు. స్వర్ణ పాత్ర భోజనములు, దీనారటంకాల తీర్థమాడుటలు, జాంబూనదాంబరాభరణ ధారణములు, కస్తూరికా సుగంధాంగరాగానులేపనములు, ఉద్యాన విహారములు శ్రీనాథుడపేక్షించెను. తదుపలబ్ధికయి గ్రంథములు రచించెను. అతనికి యశోలిప్స యపారము.' (పుట - 299)

"మఱియు నాతడు శృంగారి శేఖరుడు. భీమఖండ కాశీఖండ గ్రంథ భాగములు, వీథి నాటకము, శివరాత్రి మాహాత్మ్యము, చాటుధారలు, ఐతిహ్యములు, ఇతర కవిస్తుతులు నీ విషయమును రాద్ధాంత పఱచుచున్నవి." (పుట-300)

శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి గారు - శ్రీనాథ చరిత్రమునకు 'శృంగార శ్రీనాథము' అను పేరు పెట్టి, శ్రీనాథుని శృంగారి శేఖరుడుగా నిరూపింపగా, శ్రీ చిలుకూరి పాపయ్య శాస్త్రిగారు

- వారు వ్రాసిన 'శ్రీనాథ కవితా సమీక్ష' అను గ్రంథమునకు 'శ్రీనాథుఁడు శృంగారియా?' అను పేరుపెట్టి, ప్రభాకర శాస్త్రిగారి వాదమును ఖండించినారు.

శ్రీ చిలుకూరి పాపయ్య శాస్త్రిగారు 'శ్రీనాథుఁడు శృంగారియా?' అన్న గ్రంథము యొక్క 'ఆముఖము'లో అన్నమాటలు -

'శ్రీనాథుని శృంగారిశేఖరునిగా నిరూపించుటకు క్రీడాభిరామ పీఠికలో శాస్త్రిగారు కూర్చి పెట్టిన యుపపత్తు లెంతవఱకు సరిపడునో, పరికింపవలయుననిపించినది. క్రీడాభిరామ కర్తృత్వమును శ్రీనాథునకుఁ గూర్చిననాఁడే శాస్త్రిగారి దృష్టిలో నాతఁడు శృంగారి శేఖరుఁడైనాఁడు. తత్కర్తృత్వమాతనికి లేని నాఁడాతఁడు శృంగారి కూడఁ గాఁడనిపించినది నాకు. ఆ దృష్టితోఁ బరిశీలనకుఁ బ్రారంభింపఁగా, శ్రీనాథుని స్త్రీలోలునిగాఁ దెలుపుటకు శాస్త్రిగారు క్రీడాభిరామ పీఠికలోఁ గూర్చి పెట్టిన చాటువులన్నియునాతని వగునా? కావా? యను సందియమేర్పడినది. శాస్త్రిగారు శ్రీనాథుని శృంగారిఁగా నిరూపింప దలపెట్టిననాఁడు, వారి కాతని రచనలన్నియు దత్సమర్థకములుగా నెట్లు పొడకట్టినవియో, 'శ్రీనాథుడు శృంగారి కాఁడు' అని యనుకొనిన నాఁడు, నాకు నట్లే ఆతని రచన లన్నింటియందు నాతని యీశ్వరార్చన కళాశీలత్వమే గోచరించుచు వచ్చినది. అట్టి దిదృక్షతోఁ బరికింపఁగా శాస్త్రిగారు శృంగార శ్రీనాథమునను, క్రీడాభిరామ పీఠికయందును నిరూపించిన యుక్తులు, ఉపపత్తులు సరిపడనట్లు తోఁచి నన్నీ విమర్శనమునకుఁ బ్రేరేపించినవి.'

శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు 'శృంగార శ్రీనాథము' ప్రచురించినది 1923లో. దీనిని ఖండించుచు శ్రీ చిలుకూరి పాపయ్య శాస్త్రిగారు 'శ్రీనాథుడు శృంగారియా?' అను గ్రంథమును ప్రచురించినది 1959లో. అనగా 36 ఏండ్ల తరువాత. ఇది ఇట్లుండగా 1980లో అనగా చిలుకూరి వారి గ్రంథము ప్రచురించిన 21 ఏండ్ల తరువాత, విద్వాన్ దీపాల పిచ్చయ్య శాస్త్రి గారు, తమ 86వ ఏట, శ్రీనాథుడు శృంగారియని నిర్ణయించుచు 'శ్రీనాథుడు - శృంగారము' అను నొక సమీక్షా గ్రంథమును వ్రాసి ప్రచురించినారు. అనగా ప్రభాకర శాస్త్రిగారి వాదమును 57 ఏండ్ల తరువాత పిచ్చయ్య శాస్త్రిగారు పునస్థాపనము చేసినారు.

శ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు - వారి సమీక్షా గ్రంథమైన 'శ్రీనాథుడు - శృంగారము' యొక్క "తొలిపలుకు"లో గ్రంథ రచనా కారణమును తెలుపుచు పలికిన పలుకులు-

"శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు తాము రచించిన శ్రీనాథ చరిత్రకు 'శృంగార శ్రీనాథ' మని పేరు పెట్టినారు. శ్రీనాథుడు శృంగారి కాడనియు, అతని చరిత్రకాపేరు పెట్టుట తప్పనియు ఒకరాక్షేపించినారు. ఆయాక్షేపము తప్పో ఒప్పో విచారింపకుండనే, పెద్దలు ఒకరిద్దరు ప్రభాకర శాస్త్రిగారు శ్రీనాథున కన్యాయము చేసినారని అందందు తాకనాడినారు.... అందుకు అతడు శృంగారి యని రుజువు చేయవలె గావున, అతడెలాటి శృంగారియో విపుల ముగా వివరిస్తూ ఈ వ్యాసము వ్రాశాను. అతడు శృంగారి యనుటకు అతని రచనలనే ప్రమాణముగా చూపించాను. నా స్వకపోలకల్పనమేమీ లేదు."

విద్వాన్ దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు గ్రంథాంతమున "సారాంశము"లో పలికిన పలుకులు -

"అతడు శృంగారి. అతని చాటువులు శృంగారమయములు. అతని కృతులు శృంగారపూరితములు. అతని కృతులకు పతులైన వారు శృంగార పరాయణులు. మరియు నతనిచేత నర్చితుడైన యీశ్వరుడు శృంగారులలో మొదటివాడు. అతనికి సంబంధించిన ప్రతియంశమును శృంగారయుతమే. ఎక్కువ మాటలెందుకు? అతడు రూపొందించిన శృంగారము. శృంగారమునకు మారుపేరు శ్రీనాథుడు."

శ్రీనాథుడు అవినీతిపరుడుకాడు, రసికుడు - అని రుజువు చేయుచు సమగ్రాంధ్ర సాహిత్యంలో (4-151) ఆరుద్ర గారు వ్రాసిన వాక్యములు -

"ఆడవాళ్ల సౌందర్యాన్ని నిశితంగా పరీక్షించడంలో, సహజంగా వర్ణించడంలో శ్రీనాథుడు అందెవేసిన చెయ్యి. ఇటువంటి పద్యాలను అతిగా చెప్పడం వల్ల అతడు స్త్రీలోలుడనే అపకీర్తి అతణ్ణి అలుముకొంది. శ్రీనాథుడు అవినీతిపరుడుకాడు. రసికుడు. ఆనాడు శాస్త్రాలు, సమాజం అంగీకరించిన విధంగా భోగం వాళ్లదగ్గర తన రాసిక్యత చూపి సుఖించాడే కాని మగనాలి జోలికి పోలేదు. చూడండి - ఆకాంక్షనీయమైన ఒకవనితను భోగందానిగా చేయక దాసరి వనితగా పుట్టించినందుకు విధిని తిడుతున్నాడు -

వాసనగల్గు మేను నిడువాలు కనుంగవ గబ్బిగుబ్బలున్
గేసరి మధ్యమున్ మదన కేళికి నింపగు బాహుమూల వి
న్యాసము గల్గినట్టి యెలనాగను బోగము దాని జేయకా
దాసరి దానిఁజేసిన విధాతను నేమనవచ్చు నీశ్వరా!"

బ్రహ్మశ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారి "శ్రీనాథుడు-శృంగారము" అను సమీక్షా గ్రంథమునకు అభిప్రాయము వెలిబుచ్చుచు డాక్టర్ ప్రసాదరాయ కులపతి గారు వ్రాసిన వాక్యములు-

"శ్రీనాథుడు శృంగారియని, కామరాజని, రసిక పుంగవుడని నేను హృదయపూర్వకముగా విశ్వసింతును, వేశ్యాప్రియుడని అంగీకరింతును. కానీ పరదారకాముకుడని మాత్రము ఒప్పుకొనను. పరస్త్రీ గమనపాతక ఫలితమును తీవ్రభయంకరముగా వర్ణించిన ధర్మనిష్ఠుడతడు. అతని కావ్యగతధర్మము. జీవితధర్మము నొకటియే. నాటి కవులెక్కువమంది అట్టివారే. రాసిక్యము, భగవద్భక్తి, ధర్మాచరణము పెనవేసికొన్న గొప్ప బ్రతుకులు వారివి. కవిసార్వభౌముడగు శ్రీనాథుడు ఆ కోవలో అగ్రగణ్యుడు'

'శ్రీనాథుడు-శృంగారి' అను చర్చా సీమంతిని ఎప్పుడో పుట్టి నేడు అకర్షణము లేక కడు వృద్ధురాలైనను. శ్రీనాథుని శృంగార కవిత్వకాంత మాత్రము నేటికిని నిండు జవ్వనముతో రసికాకర్షణ శక్తిని సంతరించుకొని కవ్వించుచునే యున్నది.

## గ్రంథముల పౌర్వాపర్యము

శ్రీనాథుని గ్రంథములు అనేకములు. అందులో కొన్ని అలభ్యములు. లభ్యములైన వానిలో కొన్ని కర్తృత్వ విషయమున వివాదగ్రస్తములు. కొన్ని ఇతరులు శ్రీనాథుని గ్రంథములని చెప్పుట వలన తెలిసినవి.

శృంగారనైషధము, భీమేశ్వర పురాణము, కాశీఖండము, హరవిలాసము, శివరాత్రి మాహాత్మ్యము, పలనాటి చరిత్రము, క్రీడాభిరామము - లభ్యములైన గ్రంథములు.

మరుత్తరాట్చరిత్ర, శాలివాహన సప్తశతి, పండితారాధ్య చరిత్రము - అలభ్య గ్రంథములు.

ధనంజయ విజయము, వల్లభాభ్యుదయము, కామశాస్త్రము, నందనందన చరిత్రము - ఈ గ్రంథములను తాను వ్రాసినట్లు శ్రీనాథుడెక్కడను చెప్పలేదు. శ్రీనాథుని గ్రంథములని ఇతరులు చెప్పినవి.

లభ్యగ్రంథములలో పలనాటి చరిత్రము, క్రీడాభిరామములు శ్రీనాథ కృతములని, కావని పండిత లోకమున అభిప్రాయ భేదములున్నవి.

శ్రీనాథుడు తన గ్రంథ రచనా క్రమమును గూర్చి కాశీఖండములో (1-7) చెప్పిన పద్యము-

చిన్నారి పొన్నారి చిఱుత కూఁకటి నాఁడు
  రచియించితి మరుత్తరాట్చరిత్ర
నూనూఁగు మీసాల నూత్న యౌవనమున
  శాలివాహన సప్తశతి నొడివితి
సంతరించితి నిండు జవ్వనంబున యందు
  హర్ష నైషధ కావ్య మాంధ్రభాష
ప్రౌఢ నిర్భర వయఃపరిపాకమునఁ గొని
  యాడితి భీమనాయకుని మహిమ

ప్రాయమింతకు మిగులఁ గైవ్రాలకుండఁ
గాశికా ఖండమను మహాగ్రంథమేను
దెలుఁగుఁ జేసెదఁ గర్ణాట దేశ కటక
పద్మవన హేళి శ్రీనాథ భట్ట కవిని.

ఈ పద్యము వలన తెలియుచున్న కొన్ని గ్రంథముల క్రమమిది - మరుత్తరాట్చరిత్ర. శాలివాహన సప్తశతి, శృంగారనైషధము, భీమేశ్వర పురాణము, కాశీఖండము.

హర విలాసమునందు (1-8) 'ఆంధ్ర నైషధాబ్జభవుని' అనియుండుట వలన హరవిలాసము శృంగార నైషధము వ్రాసిన తరువాత వ్రాసిన గ్రంథమని స్పష్టము. శృంగార నైషధము నందు (1-14) "ఆరాధ్యచరితమాదిగ" అని ఆరాధ్య చరిత్ర ప్రసక్తి యుండుటచే, పండితారాధ్య చరిత్ర శృంగార నైషధ రచనకు పూర్వమే వ్రాసినదని స్పష్టము.

శ్రీనాథుని మాటల వలన తేలిన గ్రంథముల క్రమమిది-

మరుత్తరాట్చరిత్ర, శాలివాహన సప్తశతి, పండితారాధ్య చరిత్ర, శృంగార నైషధము, హరవిలాసము. భీమేశ్వర పురాణము, కాశీఖండము.

అనేకవిధములైన ఆధారములతో సాహిత్య పరిశోధకులు తెలిపెడి శ్రీనాథుని సర్వగ్రంథ ములు పౌర్వాపర్యమిది.

మరుత్తరాట్చరిత్ర - శాలివాహన సప్తశతి - కామశాస్త్రము - పండితారాధ్య చరిత్ర - శృంగారనైషధము - హరవిలాసము - ధనంజయ విజయము - నందనందన చరిత్ర - వల్లభాభ్యుదయము - భీమేశ్వర పురాణము - కాశీఖండము - శివరాత్రి మాహాత్మ్యము - పలనాటి చరిత్ర.

## అలభ్య గ్రంథములు

**మరుత్తరాట్చరిత్ర :**

మరుత్తరాట్చరిత్ర శ్రీనాథుని లేఖిని ప్రసవించిన ప్రథమ గ్రంథము. చిన్నారి పొన్నారి చిఱుత కూకటినాడు రచించినట్లు శ్రీనాథుని కంఠోక్తి. చిన్నారి పొన్నారి వయస్సును పలువురు పలువిధములుగా భావించిరి. పదునాలుగు సంవత్సరముల ప్రాంతమని స్థూలముగా భావింపవచ్చును. దీనిని గూర్చి యేమియు తెలియదు. మరుత్తుడను రాజు యొక్క చరిత్రయని మాత్రము చెప్పవచ్చును. అనేక పురాణములలో అనేక విధముల మరుత్తరాట్చరిత్ర కలదు. శ్రీనాథుడే పురాణ కథను గ్రహించెనో తెలియదు. ఈ కృతిని మామిడి సింగన పెద్దన్నయైన వేమయ్యకు అంకితమిచ్చెనని ఆరుద్రగారు (సమ. సాహి. 4-130) ఊహించిరి.

**శాలివాహన సప్తశతి :**

శాలివాహనునిచే ప్రాకృత భాషలో సంకలనము చేయబడిన గ్రంథము. ఇది ప్రతిగాథా ప్రతిభావంతమైన గ్రంథము. ఇది ఆర్యావృత్తములతో గూడిన ఏడు శతకముల గ్రంథము. ఈ గ్రంథమును శ్రీనాథుడు నూనూగు మీసాల వయస్సులో అనువాదము చేసినట్లు చెప్పినాడు. ఈ నూనూగు మీసాల వయస్సు అనునది మరల నొక సమస్య. కాని అదృష్టవశమున శ్రీనాథుడే నూనూగు మీసాల వయస్సును శివరాత్రి మాహాత్మ్యము నందు సూచించినాడు. 'ఉద్భిన్న నవశ్మశ్రు నభినవ యౌవనోద్భాసితు షోడశ వర్షదేశీయు' (శివ-3-39) అని సుకుమారుని వర్ణనము. కనుక శ్రీనాథుని మతము ప్రకారము నూనూగు మీసాల వయస్సన కొంచెము తక్కువగా పదియారేండ్లు కావచ్చును. ఈ గ్రంథమునందలి ఒక్క పద్యము మాత్రము శ్రీ మానవల్లి రామకృష్ణ కవి గారి పరిశోధన వలన వెలుగు చూచినది.

> వారణ సేయఁదావి గొనవా? నవ వారిజ మందుఁ దేఁటి క్రొ
> వ్వారుచు నుంట నీవెఱుఁగవా? ప్రియ వాతెఱగంటిఁ, గంటికె
> వ్వారికిఁ గెంపురాదె? తగవా మగ వారల దూఱ? నీ విభుం
> డారసి నీ నిజంబెఱుఁగు నంతకు నంతకు నోర్వు నెచ్చెలీ!

ఈ పద్యమునకు మూలము గాథా సప్తశతిలో కన్పడదు. పెదకోమటి వేమారెడ్డి సప్తశతి నుండి సారముగా గ్రహించి కూర్చి వ్యాఖ్యానించిన సప్తశతీసారమునందు మాత్రమే ఏడవ గాథగా కన్పడును. ఆ ప్రాకృత పాఠమునకు సంస్కృతచ్ఛాయ.

> కస్యవా నభవతి రోషో దృష్ట్వా
> ప్రియాయాః వ్రవణ మధరం
> సభ్రమర పద్మా ఘ్రాయిణి
> వారిత వామే సహస్వేదానీమ్.

**పండితారాధ్య చరిత్ర :**

పిడుపర్తి సోమనాథ కవి తన బసవ పురాణ పద్య ప్రబంధము యొక్క అవతారికలో-

'హరభక్తి వైదికంబని శ్రుతు లిడి చెప్పెఁ
బ్రతిభ సోమేశుఁడారాధ్య చరిత
సరవి శ్రీనాథుఁ డా చరిత పద్య ప్రబం
ధము చేసె ద్విపదలు తఱచునిలిపి'

అని తెలుపుట వలన శ్రీనాథుని పండితారాధ్య చరిత్రము పాల్కురికి సోమనాథుని ద్విపద పండితారాధ్య చరిత్రమును పద్య ప్రబంధముగా రూపొందించిన గ్రంథమని తెలియుచున్నది.

జగము నుతింపఁగఁ జెప్పితి
బ్రెగడయ్యకు నాయనుంగుఁబెద్దనకుఁ గృతుల్
నిగమార్థ సార సంగ్రహ
మగునా యారాధ్య చరిత మాదిగఁ బెక్కుల్

అను శృంగార నైషధము నందలి (1-14) పద్యము వలన శ్రీనాథుడు తన పండితారాధ్య కృతిని మామిడి సింగన సోదరునకు అంకితమిచ్చినట్లు తెలియుచున్నది. ప్రెగడయ్యకు అంకితమిచ్చెనా? లేక పెద్దన్నయైన వేమయ్య కంకితమిచ్చెనా? అనునది మరల సందిగ్ధాంశము. వీరిరువురిలో నొకరికిచ్చెనన్నది మాత్రము స్పష్టాంశము. పెద్దన్నయైన వేమయ్యకు, చిన్నన్నయైన ప్రెగడయ్యకు అనగా ఇద్దరకు శ్రీనాథుడు కృతులు అంకితమిచ్చినట్లు ఈ పద్యము తెలుపుచున్నది. ఆ రెండవ కృతి ఏదో?

ఆ రెండవ కృతి మరుత్తరాట్చరిత్రమని ఆరుద్రగారి అభిప్రాయము. మరుత్తరాట్చరిత్రమును పెద్దన్నయైన వేమయ్యకు. పండితారాధ్య చరిత్రము చిన్నన్నయైన ప్రెగడయ్యకు శ్రీనాథుడు అంకితమిచ్చినట్లు ఆరుద్రగారు ఊహించిరి. (సమ. సాహి. 4-131)

**ధనంజయ విజయము :**

ఈ ధనంజయ విజయ గ్రంథమును శ్రీనాథుడు వ్రాసెనని చెప్పుటకు ఒకే ఒక ఆధారము.

దంతులూరి బాపిరాజు అనునతడు మూర్తిత్రయోపాఖ్యానమను ప్రబంధమును వ్రాయుచు పీఠికలో తన వంశమందు బహుపూర్వుడైన దంతులూరి గన్న భూపాల మౌళిని స్తుతించెను. ఆ స్తుతిలో-

శ్రీనాథ సుకవీంద్రుచే ధనంజయ విజ
యంబను సత్కావ్యమంది వెలసె

అని తెలిపినాడు. కనుక బాపిరాజు మాటల వలన శ్రీనాథుడు ధనంజయ విజయమను కావ్యమును వ్రాసి దంతులూరి గన్న భూపాలునికి అంకితమిచ్చినట్లు తెలియుచున్నది. ఈ గన్న భూపాలుడు పెదకోమటి వేమారెడ్డి యొక్క మామయని పలువురు పండితుల అభిప్రాయము.

గ్రంథ నామమును బట్టి యిది కిరాతార్జునీయ కథ కావచ్చును. శ్రీనాథుని హరవిలాసము నందు కూడ కిరాతార్జునీయ కథ వచ్చును గదా. హరవిలాసమునందలి కథ సంగ్రహముగా నున్నదను భావముతో శ్రీనాథుడు సంతృప్తి నందక ప్రత్యేక ప్రబంధముగా వ్రాసియుండవచ్చునని బండారు తమ్మయ్య గారి ఊహ. (శ్రీనాథ మహాకవి-పుట-74)

**నందనందన చరిత్ర :**

గణపవరపు వేంకటకవి తన ప్రయోగ రత్నాకరమునందు. కస్తూరి రంగ కవి తన ఆనందరంగరాట్ఛందమునందు 'శ్రీనాథుని నందనందన చరిత్రము నుండి' అని రెండు సీస పద్య పాదములుదహరించినారు. అవి యివి -

1. 'రామానుజుండు నిరంతరము పదాఱు
   వేల నూటెనమండ్రు వెలఁదుల తమి'

2. 'శాశ్వత విశ్వవిశ్వంభరాభారమీ
   రాజు కుమారుఁ డేలంగలండు'

ఈ యుదాహరణముల ఆధారము తప్ప మఱియొక ఆధారము లేదు. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు ఈ ఆధారములను గూడ విశ్వసింపలేదు.

'రంగరాట్ఛందమున నుదహరింపఁబడిన యా సీస చరణములలో మొదటిది కుంటినడకతో నున్నది. రెండవది రేఫలకారముల యతిమైత్రి కలది. అవి శ్రీనాథ రచితములుగా నేను విశ్వసింపఁజాలకున్నాఁడను. విశ్వసించుట కితర ప్రమాణము లేఁకఁ గానరావు' (శృం. శ్రీనా. పుట. 279)

గ్రంథ నామము బట్టి దీనిలోని కథ కృష్ణ సంబంధము కావలెను. ఈ గ్రంథమును శ్రీనాథుడు వ్రాసినచో పంట మైలారురెడ్డికి అంకితమిచ్చినది యిదియే కావచ్చునని ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారు ఊహించిరి. (తెలుగు సాహిత్య చరిత్ర - ద్వితీయ: పుట-58)

**వల్లభాభ్యుదయము :**

పెదపాటి జగన్నాథకవి (జగ్గన్న) తన ప్రబంధ రత్నాకరమను సంకలన గ్రంథము నందు (3-199) శ్రీనాథునిదని యొక సీస పద్యముదాహరించినాడు.

రజనీ వధూ కర్ణ రత్న తాటంకంబు
  వలరాజు ధవళోష్ణ వారణంబు
ప్రోషిత యువతి హృత్పుట భేద దాత్రంబు
  బహుచకోర కుటుంబ పాన పాత్ర
మధుకైటభాసుర మథను దాఁపటి కన్ను
  చక్రవాకంబుల చల్ల జంపు
దుగ్ధ పాథోరాశి తొలుచూలి సంతతి
  రోహిణీదేవి తారుణ్య ఫలము

చంద్రకాంత శిలా మణిస్థల కృపీట
నిర్జరాంధోవ్యథా మోక్ష నియమ వైద్యుఁ
డంధకారచ్ఛటా హాలాహల ధరుఁడు
చంద్రుఁ డొప్పారెఁ గాంతి నిస్తంద్రుఁడగుచు

ఈ గ్రంథమునందలి వల్లభుడు తెనుగు వల్లభుడు. అనగా శ్రీకాకుళ క్షేత్రస్వామి. కనుక ఈ గ్రంథమునందలి కథ శ్రీకాకుళ క్షేత్ర మాహాత్మ్యము కావచ్చునని పరిశోధకుల భావము.

**కామ శాస్త్రము :**

ఈ గ్రంథము లభింపలేదు. ఈ గ్రంథమును గూర్చి బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి గారి మాటలివి.

'శ్రీనాథుఁడు కామశాస్త్ర విషయమున నేదో గ్రంథము రచించినట్టు తెలియుచున్నది. నెల్లూరి శివరామ కవి కామకళానిధి యను గ్రంథమున నా విషయమును బ్రస్తావించినాఁడు. పద్యైకదేశముదాహరింతును-

మఱియు శ్రీనాథు డాదియౌ సరసనుతులు
ఎంత దుష్కర మతినైన వృద్ధనైన....

ఈ శ్రీనాథుఁడు మన శ్రీనాథుఁడగునో కాఁడో యని సందేహించుటకు గూడ నవకాశమున్నది.' (శృం. శ్రీనా. పు. 280)

**కాటమరాజు కథ :**

పినయల్లయ అను నతడు ద్విపదలలో వ్రాసిన కాటమరాజు చరిత్రలో-

పినయల్లయనువాఁడు ప్రియముతో జనుల
వలనొప్ప శ్రీనాథు వచన పద్ధతిని
సలిపెను యదుశాస్త్ర చరితమంతయును'

అను మాటల వలనను; 'కాటమరాజు కథ' యను పద్య ప్రబంధము నందు-

'శ్రీనాథుఁడను కవి శ్రేష్ఠుండు ద్విపదగా
రచియించెఁ గాటమరాజు చరితము'

అను పద్య భాగము వలనను శ్రీనాథుడు కాటమరాజు కథ వ్రాసినట్లు తెలియుచున్నది.

ఇది చారిత్రక సత్యమైన ఇతివృత్తముతో గూడిన కావ్యము. పదమూడవ శతాబ్దములో నెల్లూరును పాలించిన మనుమసిద్ధి రాజునకును, ఎఱ్ఱగడ్డపాటి ప్రభువైన కాటమరాజునకును పుల్లరి విషయమై వివాదము పెరిగి యుద్ధముగా మారిన కథ దీనిలోని ప్రధాన విషయము. ఇది యాదవ వీరుల చరిత్ర. ఆంధ్ర మహాభారత కర్తయైన తిక్కన సోమయాజి పెద తండ్రి కుమారుడైన రణతిక్కన తన ప్రతాపమును ప్రదర్శించి సరమపదించినదీ యుద్ధమునందే.

శ్రీనాథుడు 'మానసోల్లాసము, రామాయణము పాట' అను గ్రంథములను కూడ వ్రాసినట్లు పరిశోధకులు పలుకుచున్నారు. గ్రంథములు కాని, శ్రీనాథుడు వ్రాసెనని తెలుపు సరియైన ఆధారములు కాని లభింపలేదు.

## పల్నాటి చరిత్రము

ఈ పల్నాటి చరిత్రము ద్విపదకృతి. ఈ గ్రంథమును తాను వ్రాసినట్లు శ్రీనాథుడెక్కడను చెప్పలేదు. శ్రీనాథుని గ్రంథము మొత్తము లభింపలేదు. కల్లు ప్రతిష్ఠ, బాలచంద్రుని యుద్ధము అను భాగములు మాత్రము శ్రీనాథునివి లభించినవి. తక్కిన భాగములలో కూడ శ్రీనాథుని హస్తము కలదని వాదించెడి వారు కలరు.

పల్నాటి చరిత్రకు భారత కథకు చిత్రముగా అనేక సామ్యములు కన్పడుచుండును. అందులకే దీనికి పల్నాటి భారతమని కూడ పేరు వచ్చినది.

ప్రస్తుతము ముద్రితమై లభించుచున్న పల్నాటి వీర చరిత్రము నందు కన్పడుచున్న భాగములివి. 1. అనుగురాజు పల్నాటి సంపాదనము 2. పల్నాటి రాజ్యవిభాగము 3. కోళ్ల పోరు గోపన విఱుగు 4. అరణ్యవాసము. 5. మందపోటు లంకన్న విలుగు. 6. గురజాల యుద్ధము. 7. ఆలరాజు రాయబారము 8. కల్లు ప్రతిష్ఠ 9. బాలచంద్రుని యుద్ధము 10 కొమ్మరాజు యుద్ధము 11. బ్రహ్మన్న విరుగు. ఈ పదునొకండు ప్రకరణములలోను తమ పేర్లు చెప్పుకొన్న కవులు ముగ్గురు. శ్రీనాథుడు. మల్లయ. కొండయ. కల్లు ప్రతిష్ఠ, బాలచంద్రుని యుద్ధ భాగములను శ్రీనాథుడు; కోళ్ల పోరును, గోపన్న విరుగును మల్లయ్య; కొమ్మరాజు యుద్ధమును కొండయ వ్రాసినట్లు కన్పడుచున్నది.

ఈ గ్రంథమునందు ఆ కాలము నాటి (క్రీ.శ. 1181-82) సాంఘిక. రాజకీయ విశేషములు, ఆచార వ్యవహారములు, ఆభరణములు కన్పడు చుండును. సాంఘిక దృష్టితో చూచిన ఈ గ్రంథము చాల ముఖ్యమైనది. ఆంధ్ర సాహిత్యము నందు ఆంధ్రదేశములో జరిగిన వృత్తాంతము ఇతివృత్తముగా వెలసిన ప్రథమ గ్రంథము. ఈ గ్రంథము శ్రీనాథ కృతమని కొందఱు, కాదని మరికొందఱు వాదములు చేసిరి. ఉభయ పక్షముల వారి వాదములకు అవకాశమున్నది. ఆ వాదముల సారాంశములివి-

**కర్తృత్వము :**

1. ఈ గ్రంథము యొక్క ప్రారంభము అనగా కల్లు ప్రతిష్ఠ యొక్క ప్రారంభము 'శ్రీరఘు నాయకు చిత్తమందెంచి' అను పాదముతో నుండును. అట్లే ఈ కల్లు ప్రతిష్ఠ భాగము యొక్క అవతారిక యందు 'చెన్నకేశవ పాదసేవారతుండ' అని కలదు. దీని ప్రకారము విష్ణుభక్తుడైన ఒక కవి వ్రాసి ఉండవలెను. ప్రసిద్ధుడైన శ్రీనాథుడు విష్ణుభక్తుడుగా ప్రసిద్ధుడు కాడు. అతడు ఈశ్వరార్చన కళాశీలుడు. కనుక ఈ గ్రంథము శ్రీనాథ కృతము కాదు అని ఒక వాదము.

ఈ వాదము సరియైనది కాదు. ఈ చరణము ప్రక్కనే

'పలను భారద్వాజ వంశవర్ధనుడ
కవి సార్వభౌముడ ఘనత కన్నట్టి
శ్రీనాథుడనువాడ శివభక్తిపరుడ'

అని కలదు. దీని ప్రకారము ఈ పలనాటి చరిత్ర కర్తయైన శ్రీనాథుడు భారద్వాజ వంశవర్ధనుడనియు, కవి సార్వభౌముడనియు ఘతన పొందిన శ్రీనాథ మహాకవి యనియు, శివభక్తి పరుడనియు స్పష్టమగుచున్నది. ఈ లక్షణములన్నియు ప్రసిద్ధుడైన శ్రీనాథుని లక్షణములే. శ్రీనాథుడు శివభక్తుడైనను విష్ణుద్వేషి కాడు కదా. హరవిలాసరము, శృంగార నైషధము విష్ణుస్తుతులతోనే ప్రారంభమగును. కనుక పల్నాటి చరిత్రము విష్ణుస్మరణముతో ప్రారంభమైనంత మాత్రముచే శ్రీనాథ గ్రంథము కాకుండగ పోదు.

2. ఇష్ట దేవతా స్తుతి మధ్యమున శీలమ్మ నాయకుని స్తుతి కలదు. శీలమ్మ నాయడన బ్రహ్మనాయడే కదా. అతనిని శ్రీనాథుడు దైవముగా భావించి స్తుతి చేయునా?

స్తుతింపడనుటకు ఆధారము లేదు. బ్రహ్మనాయని గూర్చి లోకమున అంతటి భక్తి కలదు. అశ్వత్థామ, ఆంజనేయాదులవలె ఇతడు చిరంజీవి అను ప్రచారము కూడ కలదు. కనుక శ్రోతల తృప్తికై వ్రాసియుండవచ్చును. అంతేకాదు. ఈ శీలమ్మ నాయని స్మరణ కొన్ని ప్రతులలో కన్పడదు. శ్రీనాథుని తర్వాత కొందఱు కల్పించినదైనను కావచ్చును.

3. ఈ గ్రంథ అవతారికలో చెన్నకేశవస్వామి స్వప్న సాక్షాత్కార వృత్తాంతమున్నది.

పలనాటి వీరుల భాగవతంబు
ప్రకటితంబుగ నీవు రచియించి మాకు
అంకితంబొనరింప ననువొందు సూవె

అని మాచెర్ల చెన్నకేశవుడు శ్రీనాథునకు కలలో కన్పడి కోరినట్లు కలదు. ఇట్లు, శ్రీనాథుడు తనకు కల వచ్చిన తరువాత ఏ గ్రంథమును వ్రాసినట్లు కన్పడదు. కనుక ఈ గ్రంథము శ్రీనాథ కృతము కాదు.

నిజమే. కాని ఏ గ్రంథమున లేనంత మాత్రమున ఈ గ్రంథమున ఉండకూడదని నియమమేదియు లేదు. పైగా చారిత్రికముగ జరిగినదని తెలిసిన కథకు ఈ విషయము వలన విలువ పెరుగును.

4. సంస్కృతమూలము లేకుండ ఏ చిన్న రచనను కాని పెద్ద రచనను కాని శ్రీనాథుడు చేపట్టినట్లు కన్పడదు. ఈ పల్నాటి చరిత్రకు సంస్కృత మూలము లేదు. కనుక శ్రీనాథ కృతము కాదని మరియొక వాదము.

ఇది సత్యము కాదు. హరవిలాసము నందలి చిరుతొండ నంబి కథకు కాని, ఆరాధ్య చరిత్ర గ్రంథమునకు గాని సంస్కృత మూలములు లేవు. కనుక ఈ వాదము బలములేని వాదము.

5. శ్రీనాథుడు పల్నాటి సీమపై నెన్నియో చాటువులు చెప్పినాడు. ఆ చాటువులన్నియు పల్నాటి సీమపై అసహ్యముతో చెప్పినవే. పల్నాటి సీమపై అంత హీన భావము గల శ్రీనాథుడు పలనాటి చరిత్రము వ్రాయునా? కనుక ఇది శ్రీనాథ కృతము కాదు ఒక వాదము.

శ్రీనాథునకు అసహ్యము కల్గించినవి అక్కడి ఆచార వ్యవహారములు, శుభ్రత లేని పల్లెటూళ్లు, శాస్త్రమ్మన్యులు. అంతేకాని పల్నాటి వీరుల చరితముకాదు. అంతియే కాక ఈ వాదమునకు మూలములు చాటువులు. ఆ చాటువులలో ఏవి శ్రీనాథునవో, ఏవి కావో నిర్ణయించుట అంత సులభమైన పని కాదు. చాటువులు సందిగ్ధ విషయములకు ప్రమాణములు కానేరవు.

6. ఈ గ్రంథము నందు భాషా దోషములుల, వ్యాకరణ విరుద్ధ ప్రయోగములు కోకొల్లలు. సకల విద్యా సనాథుడైన శ్రీనాథుని గ్రంథమైనచో ఇట్టి దోషములుండునా?

లభించిన బాలచంద్ర యుద్ధ భాగము, కల్లు ప్రతిష్ఠ భాగములందు దోషములున్న మాట వాస్తవమే. కాని అ దోషములెట్లు వచ్చినవో యోజింపవలసిన విషయము. ఈ గ్రంథము నైషధాది గ్రంథము వలె లేఖిన్యోపజన్యమైనది కాదు. పిచ్చుకుంటలను ఒక్కజాతివారి గాత్రమే జీవికగా కలది. కనుక ప్రతులు, ప్రత్యంతరములు ఏర్పడుట కవకాశము లేదు. పిచ్చుకుంటలు చదువునపుడు ఉచ్చారణ దోషములు ఏర్పడవచ్చును. సరిగ ధారణ చేయకపోయినచో కొన్ని చరణములు మారవచ్చును. కొన్ని పోవచ్చును. కొన్ని క్రొత్తవి రావచ్చును. వారు పండితులు కాకపోవుటచే కొన్ని దోషములు చేయవచ్చును. వారు మరచిన భాగములను సామాన్య పండితులు పూరించి ఉండవచ్చును. లేదా ఈ పిచ్చుకుంటలే కొన్ని క్రొత్త చరణములను కల్పించి ఉండవచ్చును. ఇట్లు దోషము లేర్పడుటకు అనేక అవకాశములు కలవు. కనుక కనబడు దోషములను బట్టి ఈ కృతి శ్రీనాథ కృతి కాదు అని అనలేము.

7. శ్రీనాథుని యితర గ్రంథములందు కన్పడు ఓజోగుణ సంపన్నమైన శైలి ఈ పల్నాటి చరిత్రమునందు కన్పడదు. కనుక ఇది శ్రీనాథ కృతికాదు అని ఒక వాదము.

ఇది అర్థము లేనివాదము. నైషధాది గ్రంథములందలి శైలి మార్గ కవితా శాఖకు చెందినది. పల్నాటి చరిత్రము దేశకవితా శాఖకు చెందినది. పల్నాటి చరిత్ర ద్విపద కృతి. ద్విపదలయందు వృత్తములలో వలె దీర్ఘసమాస రచన రక్తికట్టదు. అంతేకాదు. తక్కిన గ్రంథములవలె నిది పండితుల కొఱకు వ్రాసినది కాదు. జానపదుల ఆనందము కొఱకు సామాన్యులైన పిచ్చుకుంటలకు వ్రాసి యిచ్చినది. అంతేకాదు. ఇది గృహము నందు కూర్చుండి చదువుకొనుటకు వ్రాసినది కాదు. పామరులు గాన రూపముగా విని ఆనందించుటకు వ్రాసినది. శ్రీనాథుని పాండిత్య ప్రదర్శనమునకు ఈ గ్రంథము ఉచిత రంగస్థలము కాదు. మహా విద్వాంసుడైన శ్రీనాథుడు ఈ ఔచిత్యము నెరిగియే గానానుకూలముగా సులభశైలిలో రచనము కావించినాడు.

8. శ్రీనాథునకు పద కవిత్వమన్నను, అందులో ద్విపద అన్నను ఆభిముఖ్యము లేదు. ఇతని రచనలలో ద్విపద ఎక్కడను కన్పడదు. ద్విపదయే కాదు. రెండు ద్విపదలు కలిపిన అగు తరువోజ కూడ నెక్కడను కన్పడదు. కనుక ఈ ద్విపద కృతి శ్రీనాథునిది కాదు.

శ్రీనాథునకు పద కవిత్వ మన్న ఇష్టము లేదని వాదించు వారలకు ఆధార మొకచాటువు..

కం. 'ముదివిటులు విధవ లంజలు
పదకవితలు మారు బాస బాపని వారల్
చదువని పండిత వర్యులు
కదనార్భటి వీరవరులు కడిది పురమునన్'

ఈ పద్యము శ్రీనాథ కృతమనుటకు జనశ్రుతియే ఆధారము. ఒకవేళ ఈ పద్యము శ్రీనాథునిదే అనుకొన్నను బాధ లేదు. ఒకచోట హాస్యము చేసిన అంశమును మఱియొక చోట ఉపాస్యము చేసికొనుట శ్రీనాథుని తత్త్వమే. శృంగార నైషధమున (6-115) వైశ్యుని హాస్యము చేసెను. హరవిలాసము వైశ్యున కంకితమిచ్చెను. రాజమహేంద్రవరము నందు తర్క పండితులను పచ్చిబూతులు తిట్టెను. స్వయముగా నీతడే మహాతార్కికుడు. డిండిమ భట్టును ఓడించిన మహాతార్కికుడు. కనుక ద్విపద నీసడించినను మరల ద్విపద యందు కావ్యము వ్రాయుట శ్రీనాథుని యందు విచిత్ర విషయము కాదు. అంతే కాదు. ద్విపద కృతులైన బసవ పురాణమును, పండితారాధ్య చరితమును శ్రీనాథుడు అతి శ్రద్ధతో చదివినట్లు ప్రమాణములు కలవు కదా. కనుక పై వాదమునకు బలము లేదు.

9. పల్నాటి చరిత్ర ఈశ్వరార్చన కళాశీలుడైన శ్రీనాథుడు కాక మఱియొక శ్రీనాథుడు వ్రాసినదని మఱియొక విచిత్ర వాదము. ఆంధ్ర వాఙ్మయము నందు మఱియొక శ్రీనాథుడు కన్పడడు. అంతేకాదు. కవి సార్వభౌముడనియు, ఘనత కల్గిన వాడననియు కూడ చెప్పుకొనెను. కదా। కనుక ఇది అర్థరహితమైన వాదము.

10. క్రీడాభిరామము నందు పల్నాటి వీరుల కథాప్రసంగము కలదు. అక్కడ 'ద్రుత తాళంబున....(పద్యము-116)' అను పద్యము నందు "ద్విపద ప్రబంధమున" అని కలదు. అనగా క్రీడాభిరామము కాలము నాటికే పల్నాటి చరిత్రము ప్రసిద్ధికెక్కి యుండవలెను. ఈ క్రీడాభిరామము ప్రేమాభిరామమునకు అనువాదము. కనుక ప్రేమాభిరామ రచనా కాలము నాటికే ద్విపద కృతియైన పల్నాటి చరిత్రము పుట్టి ఉండవలెను. అనగా ద్విపద పల్నాటి చరిత్రము శ్రీనాథునకు ముందే పుట్టెను. కనుక ఈ కృతి శ్రీనాథ కృతి కాదు.

క్రీడాభిరామము ప్రేమాభిరామమునకు అనువాదమనునది వాస్తవము. క్రీడాభిరామము ప్రేమాభిరామమునకు ఎంతవరకు విధేయమో తెలిసికొనుటకు ప్రేమాభిరామము లభింపలేదు. క్రీడాభిరామము నందలి వర్ణనముల బట్టి క్రీడాభిరామము ప్రేమాభిరామమునకు యథామాతృకానువాదమనిపింపదు. అందువలన క్రీడాభిరామము నందలి ప్రతి పద్యము మూలమైన ప్రేమాభిరామములో ఉన్నదని చెప్పుట సాహసమగును. కనుక ఈ వాదమునకు కూడ బలము లేదు.

ఇట్లు ద్విపద కృతియైన పల్నాటి చరిత్ర శ్రీనాథ కృతము కాదు అని చేయువాదము లన్నింటిని పరాస్తము చేసిన పిమ్మట శ్రీనాథకృతమే అని తెలుపుటకు గల అవకాశములను సమీక్షింతము.

1. ప్రస్తుతము లభించిన పల్నాటి చరిత్ర అందలి బాలచంద్రుని యుద్ధభాగము సామాన్య కవిరచనముగా కాక రాజాస్థాన ప్రవేశము బాగుగా కలిగిన ఒక పండిత కవిరచనమని అనిపించును. నలగామరాజు యొక్క కొలువు వర్ణనము ఇందులకు మంచి సాక్ష్యము. దీనిలో రాజస్థానములకు సంబంధించిన అనేకాంశములు కలవు. విద్యాధికారిగ నున్న శ్రీనాథునకు రాజస్థానముల పద్ధతులు సుపరిచితములు.

2. బాలచంద్రుని యుద్ధ భాగమునందు శ్రీనాథుని రచనములనిపించు కొన్ని పదబంధములు, ప్రౌఢ సమాసములు కన్పించుచున్నవి.

ఉదా: పద్మరాగ ప్రభాపటలి, రాజవేశ్యావిట, ద్రాక్షాగుళుచ్ఛము మొదలగు పద బంధములు. దీపిత రత్న మౌక్తిక హేమయుక్త తాటంక భూషణ ద్వయము, ఉద్వేగభర జనితోగ్ర రోషాగ్ని భస్మీకృతాఖిల పరరాజ విపిన ఈషణ త్రయము - మొదలగు ప్రౌఢ సమాసములు కనబడుచుండును. ఇటువంటి రచనము సామాన్య కవి చేయుట కష్టము కదా.

3. శ్రీనాథుని రచనా విధానము నందు ఒక విశేషముండును. ఆ విశేషము ఆంధ్రదేశీయ వాతావరణము. బాలచంద్ర యుద్ధభాగము నందు మాంచాల శృంగార నైపథ్యమున 'చేర్చుక్క, కస్తూరి బిందువు, ముత్యపు ముంగర, ముత్యాల పట్టెడ' మొదలగు ఆంధ్రదేశీయములైన ఆభరణముల వర్ణనము కన్పడును.

4. బాలచంద్రుని యుద్ధభాగమునందు కొందఱు వీరనాయకులు బాలచంద్రుని యుద్ధమున కేగవలదని వారింతురు. అపుడు బాలచంద్రుడు తాను సామాన్యుడను కాననియు. పూర్వ జన్మములందు తాను లోహితాస్యుఁడు. ప్రహ్లాదుడు, అభిమన్యుడనని చెప్పుచు సిరియాలుడనని కూడ చెప్పును. ఈ సిరియాల చరిత్రము పాల్కురికి సోమన వ్రాసెను. సోమన వ్రాసిన కథలో తండ్రిపేరు సిరియాలుడు. కొడుకు పేరు సిరాలుడు. శ్రీనాథుని హరవిలాసము నందలి కథలో తండ్రిపేరు చిరుతొండనంబి. కొడుకు పేరు సిరియాలుడు. పల్నాటి చరిత్రము నందుకూడ హరవిలాసము నందువలె తండ్రిపేరు చిరుతొండనంబిగను, కుమారుని పేరు సిరియాలుడుగను ఉన్నవి. పల్నాటి చరిత్రము శ్రీనాథుని కృతి అని వాదించు వారలకు ఇది బలమైన అంశము.

5. శ్రీనాథుడే గ్రంథము వ్రాసినను ఇతర సంస్కృత కవుల శ్లోకములను. శ్లోక భాగములను సందర్భోచితముగా గ్రహించి ఆంధ్రీకరించును. ఈ లక్షణము పల్నాటి చరిత్రము నందు కూడ కనబడును. భగవద్గీత శ్లోకానువాదములు, రామాయణ శ్లోకానుసరణములు, తిక్కన గారి భారత పద్యచ్ఛాయలు కనబడుచుండును. ఈ కృతి శ్రీనాథకృతి అనుటకు ఈ అంశము ప్రాణస్థాయువు.

6. సామాన్య పండితులకు కాక వేదము బాగుగా జీర్ణము చేసికొన్న పండితులకు మాత్రము తెలియు శబ్దములు కొన్ని ఈ పల్నాటి చరిత్రము నందు కన్పడును. అట్టివానిలో 'స్నానము' అను శబ్దము ముఖ్యమైనది. ఈ స్నానము అను శబ్దమును శ్రీనాథుడు హరవిలాసము నందు కూడ ప్రయోగించినాడు. (హర. 2-37) ఈ మారుమూల ప్రయోగము

పల్నాటి చరిత్రము నందు కూడ ఉండుటచే ఈ గ్రంథము శ్రీనాథ కృతి అని కొందరి సమర్థనము.

ఇట్లు పల్నాటి చరిత్రము శ్రీనాథకృతి కాదు అని వాదించువారి వాదములు బలహీనములుగా నున్నవి. శ్రీనాథుని కృతియనుటకు కొన్ని అవకాశములు కూడ కన్పడుచున్నవి. అందులకే విమర్శక లోకము నందు పల్నాటి చరిత్రము శ్రీనాథుని కృతి అనియే ఎక్కువమంది భావించుచున్నారు.

ఇది ఇట్లుండగా - తెలుగు వీరగాథా కవిత్వముపై కృషి చేసిన డాక్టర్ తంగిరాల వేంకట సుబ్బారావు గారు, బాలచంద్ర యుద్ధము గాక ఆరణగండ్ల యుద్ధము, పెద్దన్న పెండ్లి రాయబారము, మందపోటు కథ అను మఱిమూడు కథలు శ్రీనాథ కృతములైనవి లభించినట్లుగా తెలుపుచున్నారు. (తెలుగు వీరగాథా కవిత్వము - రెండవ సంపుటము - పుటలు 240, 241)

లభించిన ఈ మూడు కథలు ఇంకను ప్రకటింపబడలేదు. అవికూడ శ్రీనాథ కృతములని పండిత లోకము ఆమోదించినచో, శ్రీనాథ మహాకవి పలనాటి చరిత్రము మొత్తము వ్రాసినట్లు తేలును.

## క్రీడాభిరామము

క్రీడాభిరామము 295 పద్య గద్యములతో కూడిన రసికోపనిషత్తు. ఈ గ్రంథము రావిపాటి త్రిపురాంతకుని ప్రేమాభిరామమునకు అనువాదము. లభించుచున్న గ్రంథమును బట్టి ఇది యథా మాతృకానువాదము కాక స్వతంత్రానువాదము అనిపించును. ప్రేమాభి రామమను నామమును క్రీడాభిరామముగా మార్చుటయే మొదటి సాక్ష్యము. శ్రీనాథుని క్రీడాభిరామము మూలమైన ప్రేమాభిరామమునకు ఎంతవఱకు విధేయమో, ఎంతవఱకు స్వతంత్రమో పరిశీలించుటకు మూలమైన ప్రేమాభిరామము లభ్యము కాలేదు.

ఈ క్రీడాభిరామము రూపకము రూపకముగా ఆంధ్రీకరింపబడిన తొలిగ్రంథము. దీనికి పూర్వము విద్ధసాలభంజిక అను రూపకమును అనుసరించి కేయూర బాహు చరిత్రము తెనుగున వ్రాయబడినది. కాని ఆ తెనుగు కేయూర బాహు చరిత్రము రూపకము కాదు. కనుక తొలి తెనుగు రూపకానువాదము క్రీడాభిరామము. ఇది దశవిధ రూపకములలో 'వీథి' అను శాఖకు చెందినది.

గోవింద మంచన శర్మ, టిట్టిభసెట్టి అను మిత్రద్వయము సలుపు సరస సంభాషణ ములే దీనిలోని ప్రధానేతివృత్తము. ఈ గ్రంథమునందు పదునాల్గవ శతాబ్దపు ఓరుగల్లు పట్టణమందలి సాంఘిక, మత సంబంధములైన అనేక విషయములు కనపడును. ప్రజల విశ్వాసములు, మూఢాచారములు, వినోద క్రీడలు, శృంగార వర్ణనలు, భోగములు, హేళనలు, పూటకూటిండ్లు, కోడి పందెములు మున్నగునవి ఎన్నియో దీనియందు కన్పడును.

**కర్తృత్వము :**

ఈ క్రీడాభిరామ గ్రంథ కర్తృత్వ విషయమై ఆంధ్రసాహిత్యములో పెద్ద గందరగోళము బయలుదేరినది. ఈ గ్రంథమునకు కర్త శ్రీనాథుడని కొందరు, వినుకొండ వల్లభరాయలని

కొందరు వాదించినారు. వాదించుచున్నారు. ఈ అంశమిప్పటికిని రావణకాష్ఠమే. ఉభయ పక్షముల వారికి కావలసినంత సాధన సంపత్తి కలదు. ఆ వాదోపవాదముల సంగ్రహ స్వరూపమిది-

లాక్షణికులు శ్రీనాథుని వీధినుండి అని కొన్ని పద్యముల నుదాహరించిరి. అట్లుదాహరించిన వారిలో అప్పకవి, కూచిమంచి తిమ్మకవి ప్రముఖులు. అప్పకవి చెప్పిన 'కందుకకేళిసల్పెడు (82)' 'కుసుమంబద్దిన చీరకొంగు (86)' అను రెండు పద్యములు ప్రస్తుతము లభించుచున్న క్రీడాభిరామమునందు కనబడుచున్నవి. కూచిమంచి తిమ్మకవి కూడ రెండు పద్యముల నుదాహరించెను. 'కుసుమంబద్దిన....' 'ఒచ్చెం బింతయు లేక....' అను పద్యములు. మొదటి పద్యము క్రీడాభిరామము నందు కలదని ముందే యనుకొంటిమి. రెండవ పద్యమైన 'ఒచ్చెం బింతయు లేక...' అనునది క్రీడాభిరామము నందు కన్పడదు. చాటువుగ కన్పడుచున్నది. కనుక ఈ లాక్షణికులు చెప్పు మాటల ప్రకారము శ్రీనాథుని వీధియనగా మనకు లభించుచున్న క్రీడాభిరామమే కావలయును. ఈ ఇరువురి గ్రంథములందేకాక వీరరాజీయము, లక్షణ దీపిక అను అముద్రిత గ్రంథములందు కూడ శ్రీనాథుని వీధినుండి అని కొన్ని పద్యములుదాహరింపబడినవి. ఈ లాక్షణికుల అభిప్రాయము ప్రకారము ఈ కృతి శ్రీనాథుని కృతి కావలయును.

చిత్రకవి పెద్దన, పెదపాటి జగ్గన్న, గణపవరపు వేంకటకవి, ముద్దరాజు రామన మొదలగు వారందరు కొన్ని పద్యములను 'వల్లభరాయల వీధినుండి' అని ఉదాహరించిరి.

లాక్షణికులలో ఏకాభిప్రాయము లేదని దీనివలన స్పష్టము. కొందరి మతమున ఈ కృతి శ్రీనాథ కృతము, మఱికొందరి మతమున వల్లభరాయ కృతము.

1. ప్రస్తుతము మనకు కనబడుచున్న క్రీడాభిరామమునందు ఈకృతి వల్లభరాయ కృతముగ నున్నది. 'ఇది శ్రీమాన్ మహామంత్రి శేఖర వినుకొండ అప్పయామాత్య నందన చందమాంబా గర్భపుణ్యోదయ సుకవిజన విధేయ వల్లభరాయ (నామధేయ) ప్రణీతంబైన క్రీడారామంబను వీధి నాటకంబున సర్వంబునేకాశ్వాసము' అని ఆశ్వాసాంతగద్య. ఇది గ్రంథ సాక్ష్యము కనుక పరమ ప్రమాణమని భావించి కొందరు ఈ కృతిని వల్లభరాయ కృతిగా భావించు చున్నారు.

2. క్రీడాభిరామ గ్రంథ ప్రారంభము నందు - అట్లే

గణన కెక్కిన దశరూపకముల యందు
వీధి రసభావ భావనా వీధి లెస్స'

అను పద్యము కలదు. దీని ప్రకారము దశరూపకముల యందు వీధి ఉత్తమోత్తమమైనదని గ్రంథకర్త ఉద్దేశ్యము కావలయును. అలంకార శాస్త్ర ప్రథమ పాఠములు పఠించిన వాడైనను దశరూపకములలో వీధి గొప్పదని అనలేడు. ఇక అలంకార శాస్త్రమును ఆపోశనము పట్టిన బ్రాహ్మీదత్తవర ప్రసాదుడు దశరూపకముల యందు వీధి గొప్పదని నవ్వులాటకైనను అనునా? కనుక నిస్సందేహముగ ఈ కృతి శ్రీనాథ కృతి కాదు. వల్లభరాయ కృతియే అనియొక వాదము.

3. ఈ గ్రంథము రూపక ప్రక్రియకు చెందినది. రూపకములందు అంకములని విభజనముండును గాని ఆశ్వాసములని ఉండదు. క్రీడాభిరామమున రూపక పద్ధతికి విరుద్ధముగా ఆశ్వాసమని కలదు. గ్రంథము శ్రీనాథ కృతము అనుటకు బాధ కల్గించు అంశమిది.

4. ఈ గ్రంథము యొక్క ప్రారంభము నందు కవిస్తుతి కలదు (36). ఈ స్తుతిలో చిమ్మపూడి (అమరాధిపుడు) అమరేశ్వరుని వంటి చిన్నకవిని స్తుతించుట శ్రీనాథుని మనస్తత్త్వమునకు విరుద్ధము. కనుక ఈ అంశము కూడ క్రీడాభిరామము శ్రీనాథ కృతము కాదని బలపరచుచున్నది.

5. శ్రీనాథుని ఇతర గ్రంథములందెక్కడను కన్పింపని దాదాపు ఏబది విలక్షణ పదములు ఈ క్రీడాభిరామమునందు కనబడుచున్నవి. 'ములికినాడు, రైరాజు, మాచకమ్మ, త్రస్తరించు, నిర్యాసము, జనప పెద్దలు' మొదలగునవి. కనుక ఈ కృతి శ్రీనాథుని కృతి కాదు అని కొందఱి వాదము.

ఇట్లు ఆంధ్ర సాహిత్యమున కొందఱు విమర్శకులు క్రీడాభిరామము శ్రీనాథ కృతము కాదని వాదించుచున్నారు. మఱికొందరు క్రీడాభిరామము శ్రీనాథుని రచనయని వాదించు చున్నారు. వారి వాదాంశము లివి.

1. కృతి కర్తృ ప్రశంసలో ఎనిమిది కంద పద్యములు కలవు. ఈ పద్యములు వల్లభరాయల వాగ్వైభవమును వర్ణించునవి. ఈ పద్యములందలి రచన మూడు మూర్తుల శ్రీనాథుని రచనవలె నున్నది. మచ్చునకు

కం. 'అమృత రసమథన సంభవ
ఘుమ ఘుమిత పయః పయోధి కోలాహలమున్
భ్రమియించుఁదిప్ప సచివో
త్తము వల్లభ విభుని చాటు ధారా ఫణితుల్' (26)

ఇటువంటి రచనను బట్టి ఈ క్రీడాభిరామము వల్లభరాయల కృతము కాదనియు. శ్రీనాథ కృతమనియు కొందఱి వాదము. అంతేకాదు. నిజముగా వల్లభరాయలే కర్తయైనచో అతడే తన కవిత్వమును అట్లు ప్రశంసించుకొనునా? అని వీరి తర్కము.

2. క్రీడాభిరామము చివరి ఆశీర్వచన పద్యమొకటి కలదు. ఆ పద్యమిది-

ముదమున ముల్కినాఁటి పుర మోహన శైల సువర్ణ కందరా
సదనుఁడు కాలభైరవుఁడు శంభుని పట్టి సమగ్ర వైభవా
భ్యుదయ పరంపరా విభవముల్ గృపసేయుఁ గవీంద్ర కాంక్షిత
త్రిదశ మహీరుహంబునకుఁ దిప్పయ వల్లభరాయమంత్రికిన్ (294)

ఈ ఆశీర్వచనపద్యము కూడ వల్లభరాయలే వ్రాసినచో తానే తుమ్ముకొని తానే చిరాయుః అని అనుకొనినట్లుండును. అంతేకాదు తన్ను గూర్చితానే 'త్రిదశ మహీరుహంబుగ' (కల్పవృక్షముగ) చెప్పికొనునా? కనుక ఈ కృతి వల్లభరాయ కృతి కాదు అని కొందరి వాదము.

3. ఈ గ్రంథము నందలి శైలిని చూచినచో శ్రీనాథుని శైలి అనిపించును. శ్రీనాథుని ఇతర గ్రంథములందు కనబడు ప్రౌఢ ప్రయోగములు, పద్యరచనా పద్ధతులు, ప్రీతికరములైన పదబంధములు, ఎన్నియో దీనిలో కన్పడును.

1. ణిసిథాత్వర్థ మనుగ్రహింప గదవే నీరేజపత్రేక్షణా. (90)
2. జ్వాలాజాల జటాల జాంగల తటీ వాచాల కోయష్టియై (153)
3. వీణాక్వాణపాణింధమంబు (100)
4. మధుకైటభారాతి మడుగు పాన్పు (221)
5. పంచారించిన.... (90)

మొదలగునవి యెన్నియో ఈ క్రీడాభిరామము నందు దర్శనమిచ్చును. కనుక నీకృతి శ్రీనాథ కృతమని వీరి అభిప్రాయము.

4. ఒక గ్రంథమును ఆంధ్రీకరించుచున్నపుడు మూల గ్రంథము నుండియే కాక ఇతర కవుల కృతుల నుండి కూడ గ్రహించి అనువదించుట శ్రీనాథుని స్వభావము. ఈ లక్షణము క్రీడాభిరామము నందు కూడ కన్పడును. మురారి అనర్ఘ రాఘవములోని (క్రీడా. 153, 209) హాలుని గాథా సప్తశతిలోని శ్లోకములను (క్రీడా. 60, 262) గ్రహించి అనువదించుట కనబడును. ఇది శ్రీనాథుని లక్షణము కనుక ఈ గ్రంథము శ్రీనాథుని కృతి.

5. ఒక గ్రంథములో వ్రాసిన పద్యమును మఱియొక గ్రంథము నందు వ్రాయుట శ్రీనాథునకు అలవాటు. హరవిలాసము నందు గల (6-70)

కటుకమగు విషము విషధర
కటకంబగు కేలఁబూని కౌతూహలియై
ఘుటికా సంసిద్ధుఁడు రస
ఘుటికయునుం బోలె శివుఁడు గుటుకున మ్రింగెన్

అను కంద పద్యము భీమేశ్వర పురాణము నందు (4-66) యథాక్షరముగ వ్రాసినాడు. అట్లే కాశీఖండము నందుగల (4-114)

అరుణగభస్తి బింబముదయాద్రి పయిం బొడతేర గిన్నెలోఁ
బెరుగును వంటకంబు వడపిందియలుం గుడువంగఁబెట్టు ని
ర్భర కరుణాధురీణయగు ప్రాణము ప్రాణము తల్లియున్నదే
హరహర! యెవ్వరింకఁ గడుపారసి పెట్టెదె రీప్సితాన్నముల్

అను పద్యము శివరాత్రి మాహాత్మ్యము నందు (3-19) యథాతథముగ వ్రాసినాడు. అట్లే భీమేశ్వర పురాణము నందు వ్రాసిన (3-41)

గార్గ్య సిద్ధాంత మత ముషఃకాలకలన
శకున మూనుట యది బృహస్పతి మతంబు
విప్రజన వాక్య మరయంగ విష్ణుమతము
సర్వసిద్ధాంత మభిజిత్తు సమ్మతమగు.

అను పద్యము నందలి "సర్వ సిద్ధాంత మభిజిత్తు సమ్మతమగు" అను పాదమునకు బదులుగా "వ్యాసమతము మనః ప్రసాదాతిశయము" అని మార్చి, తక్కిన మూడు పాదములను అట్లే యుంచి ఈ క్రీడాభిరామములో (66) వ్రాసినాడు.

ఈ పద్యము శ్రీనాథునిది. గ్రంథము వల్లభరాయలదైనచో, వల్లభరాయలు గ్రంథ చౌర్యము చేసిన వాడగును. కనుక ఈ గ్రంథము శ్రీనాథునిదే.

6. క్రీడాభిరామము నందు పలనాటి వీరుల ప్రసంగము కలదు. 'ద్రుత తాళంబున....(116) అను పద్యము నందు ద్విపద ప్రబంధమని కలదు. ద్విపద ప్రబంధమనగా ద్విపదలో వ్రాసిన పల్నాటి చరిత్ర. దీనిని వ్రాసినవాడు శ్రీనాథుడు. కనుక ఈ క్రీడాభిరామము శ్రీనాథునిదే అని వీరి వాదము.

ఈ విధముగా క్రీడాభిరామకర్త శ్రీనాథుడా? వల్లభరాయడా? అని నిర్ణయించుటకు అవకాశము లేకుండగ అనేక వాదములున్నవి. ఈ ఉభయ పక్షముల వారి వాదములకు తగినంత బలము కలదు. అందులకే ఈ వాదముల నన్నింటిని పరామర్శించిన పిదప నిర్ణయము చేయలేక కొందఱు గ్రంథము వల్లభరాయకృతమని అందు శ్రీనాథుని హస్తము కూడ కలదని మధ్యేమార్గమున తెలిపిరి.

## భీమేశ్వర పురాణము - ఆంధ్రీకరణమా?

భీమేశ్వర పురాణము శ్రీనాథుడు ప్రౌఢ నిర్భర వయః పరిపాకమున వ్రాసిన గ్రంథము. ప్రౌఢ నిర్భర వయః పరిపాకము అనగా ప్రౌఢ నిర్భర వయస్సు యొక్క పరిపక్వదశ. అనగా దాదాపు డెబ్బది సంవత్సరముల వయస్సు.

ఇది ఆరు ఆశ్వాసముల గ్రంథము. రాజమహేంద్రవర ప్రభువైన వీరభద్రారెడ్డి మంత్రి యైన బెండపూడి అన్నయ్యకు అంకితము. ఈ అన్నమంత్రి శ్రీనాథునకు బాంధవుడు కూడ.

శ్రీనాథుని గ్రంథములలో కుకవి నిరాకరణము ప్రప్రథముగా ఈ గ్రంథమునందే కన్పడును. అట్లే శ్రీనాథుని ఏ యితర గ్రంథములో కనబడని రాధామాధవ ప్రసక్తి ఈ గ్రంథము నందే కనబడుట ఒక విశేషము. శ్రీనాథుని గ్రంథములందేకాదు. ఆంధ్రసాహిత్యమునందే ఇది మొదటి రాధామాధవ ప్రసక్తి.

శ్రీనాథుడు ఈ గ్రంథమున 159 సీసములు వ్రాసినాడు. ఒక్క సీసపద్యము తరువాత కూడ ఆటవెలదిని వ్రాయలేదు. అట్లే ఈ గ్రంథములో 16 ఆటవెలదులను విడిగా వ్రాసినాడు. ఇన్ని ఆటవెలది పద్యములను శ్రీనాథుడే ఇతర గ్రంథము నందు వ్రాయలేదు. దక్షారామము లోని ఆటవెలదుల ప్రభావమేమొ!

వ్యాసమహర్షి భిక్ష దొరకక ఆకలిబాధతో కాశిని శపింపబూనగా, కాశీనాథుడు కోపముతో వ్యాసుని కాశి నుండి వెడలగొట్టును. వ్యాసుడు శిష్యసమేతుడై పార్వతి పలుకుల వలన దక్షారామము బయలుదేరును. త్రోవలో కారణాంతరము వలన దక్షిణ దేశములో నున్న అగస్త్యుని దర్శించును. వీరిరువురు దక్షారామము వచ్చి భీమేశ్వరుని దర్శింతురు. వ్యాసుడు భీమేశ్వరుని అనుగ్రహము పొందును. - ఇది భీమేశ్వర పురాణ మందలి సూత్రకథ.

ఈ స్వల్ప కథాంశమును ఆధారముగా చేసికొని శ్రీనాథ మహాకవి (ఇంచుమించు) తూర్పుగోదావరీ మండలమును తనివితీర వర్ణించి తన మాతృదేశాభిమానమును ప్రదర్శించి నాడు.

భీమమండలము, పిఠాపురము, కుమారారామము (సామర్లకోట భీమవరము) సర్ప పురము, సాంపరాయణ గ్రామము (సంపర) లను వర్ణించినాడు. ఇక దక్షారామపుర విశేషవర్ణనల విషయము చెప్పనక్కరలేదు. ఈ వర్ణనము లన్నియు ప్రబంధములందలి వర్ణనములవలె కల్పనములు కాక భౌగోళిక సత్యములు, చారిత్రికాధారాంశములు అగుట విశేషము.

తెలుగు సాహిత్యములో ఎఱ్ఱాప్రెగ్గడ వ్రాసిన శ్రీ లక్ష్మీనృసింహావతారము (నృసింహ పురాణము) మొదటి క్షేత్ర మాహాత్మ్య గ్రంథము. శ్రీనాథుని శ్రీ భీమేశ్వర పురాణము రెండవ క్షేత్ర మాహాత్మ్య గ్రంథము. నృసింహ పురాణములో స్థానిక విశేష కథనములు, స్థానిక ప్రకృతి చిత్రణములు లేవు. భీమేశ్వర పురాణమున ఇవి కోకొల్లలు. ఈ స్థానిక విశేషములు, ఈ ప్రకృతి చిత్రణములు ఆంధ్రదేశ పూర్వ స్వరూపమును చాటిచెప్పు ప్రకటన పత్రములు.

ఈ సందర్భమున చిలుకూరి పాపయ్య శాస్త్రిగారు వారు వ్రాసిన 'శ్రీనాథ కృతి సమీక్ష' అను గ్రంథము యొక్క 'ఆముఖము'లో

"ప్రాచీనాంధ్ర కవులలో నాంధ్రదేశ చరిత్రమును గూర్చి తాననుకొనకయే సమగ్రమైన రేఖా చిత్రమును గ్రంథస్థము చేసిన కవి శ్రీనాథుడొక్కడే" అని అన్న వాక్యము పరమ సత్యము.

ఈ గ్రంథమున కథకన్న వర్ణనము లెక్కువ. క్షేత్రమాహాత్మ్య ప్రదర్శకములైన అనేక వర్ణనములేకాక, సందర్భోచితముగా వాయువులు, భోజన పదార్థములు, సూర్యాస్తమయము, చంద్రోదయము, సూర్యోదయము, వసంతఋతువు మొదలగు వర్ణనములు చక్కని ఊహలతో కూడి ఎన్నో యున్నవి.

ఈ గ్రంథమున కథకన్న వర్ణనములు ఎక్కువగా నుండుటను గూర్చి ఆరుద్ర గారు సమగ్రాంధ్ర సాహిత్యంలో (భా. 4-పుట. 169) - అన్నమాటలివి-

"కథ లేకపోయినా ఫరవాలేదు. కమ్మని వర్ణనలుంటే చాలు అనే దృక్పథాన్ని మన సాహిత్యంలో ఈ కావ్యంలో ఇతడు ప్రవేశపెట్టాడు."

ఈ భీమేశ్వర పురాణము ధరించినది పురాణ వేషము. కాని పలుకుల తీరు కావ్యకన్య విధము. ఈ పలుకుల తీరులో - ఆదిశంకరుడు, భారవి, మయూరుడు, రాజశేఖరుడు, సుబంధుడు, వామన భట్టబాణుడు, కాళిదాసు, అమరుకవి మొదలగు వారి గీర్వాణవాణి తెలుగు గొంతుతో వినబడుచుండును. ఇంతమంది గీర్వాణ కవుల భావములు కన్పడుట వలన ఆంధ్రీకరణము కాదేమో అనిపించుచుండును.

ఆంధ్రీకరణము కానిచో - ఈ భీమేశ్వర పురాణము తెలుగు సాహిత్యములో తెలుగుదేశ భౌగోళిక వర్ణనములతో కూడిన ప్రథమ స్వతంత్ర కావ్యము.

ఇక ఈ భీమేశ్వర పురాణము ఆంధ్రీకరణము కాదు - అని లోకమున ఒక వదంతి కూడ ఎప్పటినుండియో యున్నది.

శ్రీ అక్కిరాజు ఉమాకాంతము గారు - 'ఆంధ్రదేశానికి సంబంధించిన భీమఖండాన్ని సంస్కృతంలో కూడ శ్రీనాథుడే రచించాడేమోనని నేనప్పుడప్పుడు అనుకొంటూ ఉంటాను' అని వ్రాసిన వాక్యముల వలన, నేడు లభ్యమగుచున్న సంస్కృత భీమఖండము శ్రీనాథుని భీమేశ్వర పురాణమునకు మూలము కాదనియు, ఆ సంస్కృత భీమఖండము కూడ శ్రీనాథకృతమే అను భావము వారికి కల్గుచుండెడిది అన్న విషయము స్పష్టము.

శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి గారు - 'దక్షారామము మీఁది యభిమానముచే శ్రీనాథుఁడే సంస్కృత గ్రంథమును గూడఁ గల్పించెనని యొక వదంతి కలదు. సత్యము కాకపోవచ్చును.' అని అన్నమాటల వలన శ్రీ అక్కిరాజు ఉమాకాంతం గారి అభిప్రాయమే లోకమున వదంతిగా కలదనియు, ఆ అభిప్రాయ మును 'అసత్యము' అని అనక 'సత్యము కాకపోవచ్చును' అని అనుట వలన ప్రభాకర శాస్త్రి గారు కూడ కొంత సందిగ్ధముగా నున్నట్లు స్పష్టము.

శ్రీ నిడుదవోలు వేంకటరావు గారు - శ్రీ బండారు తమ్మయ్య గారి - 'శ్రీనాథ మహాకవి' అను గ్రంథమునకు వ్రాసిన 'మున్నుడి'లో "శ్రీనాథుని కృతులలో సంపూర్ణముగా స్వతంత్రతా ముద్రగల రచన భీమఖండము. దక్షారామ భీమేశ్వర మాహాత్మ్యము తొలిసారిగా, కడపటిసారిగా దానిని తెలుగు వారి కందించిన కవి శ్రీనాథుడు" అని అన్నపలుకులు.

శివశ్రీ బండారు తమ్మయ్య గారు - శ్రీ చిలుకూరి పాపయ్య శాస్త్రి గారు ఈ వాదమును అంగీకరింపక భీమేశ్వర పురాణము సంస్కృత భీమ ఖండమునకు అనువాదమే యని భావించిరి.

ఇక గ్రంథ మూలమును గూర్చి భీమేశ్వర పురాణమందు శ్రీనాథుడు చెప్పిన మాటలు-

'శ్రీ మహాస్కాందంబను నాది పురాణమందు గోదావరీ ఖండంబు శ్రీమద్దక్షారామ భీమేశ్వర మాహాత్మ్య సంయుతంబగుటంజేసి భీమేశ్వర పురాణంబనం బరఁగు, నదియాంధ్ర భాషా ప్రబంధంబుగఁ జెప్పందొడంగితి....' అని గ్రంథ ప్రారంభము నందు (భీమ 1-30) కలదు. దీని ప్రకారము భీమేశ్వర పురాణము స్కాంద పురాణమందలి గోదావరీ ఖండమునకు ఆంధ్రీకరణము.

'స్కాంద పురాణంబునందు గోదావరీ ఖండంబు నందు జెప్పంబడిన భీమ ఖండంబు భీమేశ్వర మాహాత్మ్యంబును భీమేశ్వర పురాణంబనంబరఁగు....' అని గ్రంథాంతంబునందు (భీమ 6-107) కలదు. దీని ప్రకారము భీమేశ్వర పురాణము గోదావరీ ఖండము నందలి భీమ ఖండమునకు ఆంధ్రీకరణము.

కృతి భర్తయైన బెండపూడి అన్నయామాత్యుడు (భీమ. 1-27) అన్నమాటలు-

అరవిందాప్తకృత ప్రతిష్ఠుఁడగు దక్షారామ భీమేశ్వరే
శ్వరు మాహాత్మ్యము తోడఁగూడి భువన శ్లాఘాస్పదంబై యభం
గురమై స్కాందపురాణ సారమగు శ్రీ గోదావరీ ఖండమున్
బరిపాటి (న్రచియింపు మంధ్రజగతీభాషాప్రబంధంబుగన్

కృతిభర్త యొక్క ఈ మాటల ప్రకారము భీమేశ్వర పురాణము స్కాందపురాణ సారమైన గోదావరీ ఖండమునకు ఆంధ్రీకరణము అన్నది స్పష్టము. కాని శ్రీనాథుని మాటలవలన భీమేశ్వర పురాణమునకు మూలము స్కాందరాణమందలి గోదావరీ ఖండమా? లేక గోదావరీ ఖండమందలి భీమఖండమా? అనునది మాత్రము అస్పష్టము.

ఆచార్య కోర్లపాటి శ్రీరామమూర్తి గారు - 1. శ్రీనాథమహాకవి చేసిన మూల నిర్దేశమిట్లు అస్పష్టముగా నుండుట వలనను - 2. స్కంద పురాణ ఖండములలో గోదావరీ ఖండమనునది ఎక్కడను కన్పడకపోవుటవలనను - 3. సంస్కృత భీమ ఖండప్రతులు గోదావరీ మండలమునందు మాత్రమే లభ్యమగుట వలనను - 4. సంస్కృత భీమఖండప్రతులు నాగరలిపిలో కాక తెలుగు లిపిలో మాత్రమే లభ్యమగుట వలనను-

ఈ యంశముపై ప్రత్యేక శ్రద్ధతో పరిశోధన చేసిరి. వారి 'శ్రీనాథుడు' అను సిద్ధాంత గ్రంథమునందు 'ఫలస్వామ్యము'గా చెప్పిన వాక్యములు (పుట - 424)

"శ్రీనాథుని భీమఖండమునకు సంస్కృత భీమఖండము సంస్కృతీకరణమని కవితా సాక్ష్యమును బట్టి కరతలామలకము. మఱి శ్రీనాథుని భీమఖండము సంస్కృత భీమఖండము సమకాలిక గ్రంథములని చారిత్రిక సాక్ష్యమును బట్టి స్పష్టము."

"బెండపూఁడి అన్నయామాత్యుఁడన్నట్లు దక్షారామ భీమేశ్వరుని మాహాత్మ్యము తోడఁ గూడి స్కాంద పురాణ సారమగు భీమ ఖండమొకఁడు నిజముగ నుండి. శ్రీనాథుఁడదియే యాంధ్రభాషా ప్రబంధముగ సంతరించిన, శ్రీనాథుని భీమఖండమునకు మూలమైన స్కాంద పురాణ భీమఖండము కాలగర్భమునఁ గలిసిపోయి. యర్వాచీన కాలమున శ్రీనాథుని భీమఖండము సంస్కృతీకరింపఁబడుట యొక విధముగ సంభవము. అట్లుగాక బెండపూఁడి యన్నయామాత్యుని యాదేశమున, శ్రీనాథుని సమ్మతిని శ్రీనాథుని భీమఖండము సమకాలమునందే సంస్కృతీకరింపఁబడుట మఱొక విధముగ సంభవము."

"....ఇందు మొదటి విధము కంటె రెండవ విధమే యెక్కువ సమంజసము. అనఁగా బెండపూఁడి అన్నయామాత్యుని ప్రేరణము కారణము. దక్షారామ భీమేశ్వర భక్తి ఉద్బోధకము కాఁగ, శ్రీనాథుని భీమఖండము స్వతంత్ర కావ్యమనియు, సంస్కృత భీమఖండము శ్రీనాథుని భీమఖండమునకు సంస్కృతీకరణమనియు స్పష్టము."

## శివరాత్రి మాహాత్మ్యము అంకితమిచ్చెనా?

శివరాత్రి మాహాత్మ్య గ్రంథమునకు సంబంధించిన రెండు అంశములు చర్చలకు గుఱియైనవి. 1. ఈ గ్రంథమునకు మూలమేది? 2. ఈ గ్రంథమును శ్రీనాథుడు ముమ్మడి శాంతయ్యకు అంకితమిచ్చెనా?

గ్రంథమునకు మూలము ఒకచోట 'ఈశాన సంహిత' (1-44) అనియు, మఱియొక చోట 'శంకర సంహిత' (1-55) అనియునున్నది. ఇట్లు రెండు విధములుగా నుండుటయే మూలచర్చకు మూలము. కాని చివరకు మూలము ఈశాన సంహితయే అని తేల్చిరి. కాని శ్రీనాథుని శివరాత్రి మాహాత్మ్యము ఈశాను సంహితకు ఆంధ్రీకరణము కాదు. అనుసరణము.

"ఈశాన సంహిత యందతి సంగ్రహముగా నున్న కథను గైకొని సముచిత వర్ణనల నాయా ప్రకరణములందు జొప్పించి శ్రీనాథుడు శివరాత్రి మాహాత్మ్యము నొక ప్రబంధముగా తీర్చినాడు'' - అని అన్న డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయరావు గారి వాక్యము యథార్థము. (శివ. మాహా. తెలుగు విశ్వవిద్యాలయ ప్రచురణము- పీఠిక - పుట - 17)

ఇక రెండవ అంశమైన అంకితము - అవతారిక పేలవముగా నున్నదనుచు పండ్రెండు దోషములను కట్టి సాంబమూర్తి శాస్త్రి గారు తెలిపి, అందువలన అవతారిక, అశ్వాసాంత పద్యములు శ్రీనాథునివి కావనియు, శ్రీనాథుని అనంతరము శాంతయ్య అవతారికను, ఆశ్వాసాంత పద్యములను వ్రాయించుకొనెననియు భావించిరి.

అవతారికలో సాంబశివశాస్త్రి గారు తెలిపిన పండ్రెండు దోషములు దోషములు కావనియు దోషాభాసములు అనియు ఆచార్య బిరుదురాజు రామరాజు గారు, డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయరావు గారు వారి గ్రంథ పీఠికలలో తేల్చిరి.

శ్రీ చాగంటి శేషయ్య గారు - కృత్యాది యంతయు శ్రీనాథునిది కాదని అభిప్రాయ పడినను-

'కావున నిట్టి సందేహ సందర్భములలో శాంతయ్యపైన దోషమారోపించుట న్యాయము కాదనియెంచి సంశయ లాభమును శాంతయ్య కొసంగి పైన జెప్పినట్లే యితరాధారము లభించువఱకు శ్రీనాథుఁడే శాంతయ్యకుఁ గృతియీఁదలంచెనని నిర్ణయింతము' అని సారాంశముగా నిర్ణయించిరి.

ఈ నిర్ణయమునే శివరాత్రి మాహాత్మ్యము యొక్క పంచమాశ్వాసము వెలుగులోనికి తెచ్చి తెలుగు వారికి మహోపకారము చేసిన ఆచార్య బిరుదురాజు రామరాజు గారు, శివరాత్రి మాహాత్మ్యమునకు చేక్కని వ్యాఖ్య వ్రాసిన డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయరావు గారు సమర్థించిరి.

## శ్రీనాథుని పాండిత్యము

శ్రీనాథుడు మహా పండితుడు. సంస్కృత సాహిత్యమున 'కాశీఖండమయఃపండమ్. నైషధం విద్వదౌషధమ్' అని పొగడబడిన సంస్కృత కాశీఖండమును, శ్రీహర్షుని నైషధీయ చరితమును ఆంధ్రీకరించినవాడు.

ప్రౌఢదేవరాయల ఆస్థానములో కవి సార్వభౌముడైన గౌడ డిండిమభట్టును ఓడించి, అతని కంచు ఢక్కను పగులకొట్టించి, కవి సార్వభౌమ బిరుదమును గ్రహించి, కనకస్నానము చేసినవాడు.

**సమకాలికులు ఈ మహాకవి పాండిత్యమునకు పట్టిన నీరాజనములు -**

సంస్కృత ప్రాకృత శౌరసేనీ ముఖ్య<br>
భాషా పరిజ్ఞాన పాటవంబు<br>
పన్నగపతి సార్వభౌమ భాషిత మహా<br>
భాష్య విద్యా సమభ్యాస బలము

అక్షపాద కణాద పక్షిలోదీరిత
న్యాయకళా కౌశలాతిశయము
శ్రుతి పురాణాగమ స్మృతి సాంఖ్య సిద్ధాంత
కబళన వ్యుత్పత్తి గౌరవంబు
పూర్వ కవిముఖ్య విరచితాపూర్వ కావ్య
భావ రససుధా చర్వణ ప్రౌఢతయును
గందళింపఁగఁ గాశికా ఖండనైష
ధ ప్రముఖ వివిధ ప్రబంధము లొనర్చి

అని నాసికేతోపాఖ్యానములో (1-18) శ్రీనాథుని బావమఱదియైన దగ్గుపల్లి దుగ్గన-

బ్రాహ్మీదత్త వరప్రసాదుఁడ పురు ప్రజ్ఞా విశేషోదయా
జిహ్మస్వాంతుఁడ వీశ్వరార్చన కళా శీలుండ వభ్యర్హిత
బ్రహ్మాండాది మహాపురాణ చయ తాత్పర్యార్థ నిర్ధారిత
బ్రహ్మజ్ఞాన కళానిధానమవు నీభాగ్యంబు సామాన్యమే.

అని శృంగార నైషధమునందు (1-13) శృంగార నైషధ కృతి భర్తయైన మామిడి సింగన-

ఆగమజ్ఞాన నిధివి తత్త్వార్థ ఖనివి
బహుపురాణజ్ఞుఁడవు శుభ భవ్యమతివి
బాల సఖుఁడవు శైవ ప్రబంధమొకటి
యవధరింపుము నాపేర నంకితముగ

అని హరవిలాసములో (1-12) బాలసఖుడు, హరవిలాస కృతి భర్తయునైన అవచి తిప్పయసెట్టి-

వినిపించినాఁడవు వేమ భూపాలున
కఖిల పురాణ విద్యాగమములు
కల్పించినాఁడవు గాఢ పాకంబైన
హర్షనైషధ కావ్య మాంధ్రభాష
భాషించినాఁడవు బహుదేశ బుధులతో
విద్యా పరీక్షణ వేళలందు
వెదచల్లినాఁడవు విశదకీర్తిస్ఫూర్తి
కర్పూరములు దిశాంగణములందు।
బాకనాఁటింటి వాఁడవు బాంధవుఁడవు
కమలనాభుని పౌత్రుఁడ వమల మతివి
నాకుఁ గృపసేయు మొక ప్రబంధంబు నీవు
కలిత గుణగణ్య! శ్రీనాథ కవివరేణ్య!

అని భీమేశ్వర పురాణములో (1-23) భీమేశ్వర పురాణ కృతిభర్తయైన బెండపూడి అన్నయామాత్యుడు-

ఈక్షోణిన్ నినుఁబోలు సత్కవులులేరీనేఁటి కాలంబునన్
దక్షారామ చళుక్య భీమవర గంధర్వాప్సరో భామినీ
వక్షోజద్వయ గంధసారఘుసృణ ద్వైరాజ్యభారంబు న
ధ్యక్షించున్ గవిసార్వభౌమ। భవదీయ ప్రౌఢ సాహిత్యముల్

అని కాశీఖండములో (1-14) కాశీఖండ కృతిభర్తయైన వీరభద్రారెడ్డి అగ్రజుడైన వేమారెడ్డి.

ఒక్కముక్కలో చెప్పవలెనన్న - శ్రీనాథుడు ఆబాల్యపండితుడు.

## కవితారీతి

శ్రీనాథ మహాకవి రచనములు కావ్య కళా పచనములు. పురాణ ధోరణులు కావ్య సరణులు ఓతప్రోతముగ అల్లుకొనిన చిత్రవర్ణాంబరములు. పురాణ మూర్తులను కావ్యకళతో సంప్రోక్షించుట ఈ సాహిత్యార్చకుని నిత్యనిష్ఠ. శ్రీనాథుని కావ్యీకరణ కళాసామగ్రిలో ప్రధానములైనవి రెండు. 1. సందర్భోచిత రచనాబంధము 2. విలక్షణ వర్ణనాగంంధము.

**సందర్భోచిత రచనా బంధము :**

హరచూడా హరిణాంక వక్రతయుఁ గాలాంతస్ఫురచ్చండికా
పరుషోద్గాఢ పయోధర స్ఫుటతటీ పర్యంత కాఠిన్యమున్
సరసత్వంబును సంభవించెననఁగా సత్కావ్యము ల్దిక్కులం
జిరకాలంబు నటించుచుండుఁ గవిరాజీ గేహరంగంబులన్

అని భీమేశ్వరపురాణములో (1-11) శ్రీనాథుడే స్వయముగా చెప్పిన సత్కావ్యమున కుండవలసిన రచనా బంధము

వచియింతు వేములవాడ భీమన భంగి
 నుద్దండ లీల నొక్కొక్క మాటు
భాషింతు నన్నయభట్టు మార్గంబున
 నుభయ వాక్ప్రౌఢి నొక్కొక్కమాటు
వాక్రుత్తు తిక్కయజ్వ ప్రకారము రసా
 భ్యుచిత బంధముగ నొక్కొక్కమాటు
పరిఢవింతు ప్రబంధ పరమేశ్వరు తేవ
 సూక్తి వైచిత్రి నొక్కొక్కమాటు
నైషధాది మహాప్రబంధములు పెక్కు
చెప్పినాఁడవు మాకు నాశ్రితుఁడ వనఘ।
యిపుడు చెప్పఁ దొడంగిన యీ ప్రబంధ
మంకితము సేయు వీరభద్రయ్య పేర

అని కాశీఖండములో (1-13) అని వీరభద్రారెడ్డి అగ్రజుడైన వేమారెడ్డి శ్రీనాథుని రచనా బంధశక్తిని ప్రశంసించినవిధము.

ఈ రచనా బంధములో వేములవాడ భీమకవి ఉద్దండలీల, నన్నయభట్టు ఉభయ వాక్ప్రౌఢి, తిక్కయజ్వరసాభ్యుచిత బంధము, ఎఱ్ఱన సూక్తి వైచిత్రి, కుంతకుడను అలంకారికుడు తెల్పిన ఉక్తివక్రత సందర్భోచితముగా సాక్షాత్కరించును అని సారాంశము.

సంస్కృత వాఙ్మయ మహత్త్వమును తనలో నిముడ్చుకొనగల శక్తి తెనుగునకు కలదని నిరూపించినవాడు నన్నయ. భావ ప్రకటన శక్తిలో తెనుగు సంస్కృతమునకు ఏమాత్రము తక్కువ కాదని నిరూపించిన వాడు తిక్కన. వట్టి సంస్కృతమునకున్న మాధుర్యము కన్న తెనుగుతో కూడిన సంస్కృత మాధుర్యము మిన్న అని సందర్భోచిత రచనా బంధముతో కూడిన శయ్యతో నిరూపించినవాడు శ్రీనాథుడు.

**విలక్షణ వర్ణనా గంధము :**

వర్ణనములు కవి ప్రతిభకు కొలతబద్దలు. కావ్యకరణకారణమైన ప్రతిభాలతకు ప్రాకుడు కొమ్మలు. కవియను బిరుద ప్రదానము చేయు ఉపకరణములు.

శ్రీనాథుని వర్ణనావరవర్ణిని యొక్క అభిరుచులివి - ప్రకృతి, యథార్థ భౌగోళిక చారిత్రికాంశములు, స్తనములు, భోజన పదార్థములు, సుగంధ ద్రవ్యములు, వాయువులు. సంస్కృత కవుల ప్రయోగములు, భావములు.

శ్రీనాథ కవిసార్వభౌముడు తనకు కరతలామలకమైన ఈ సందర్భోచిత రచనా బంధముతో, తనకు క్రీడా విషయమైన బహుముఖ ప్రతిభావంతమైన ఈ విలక్షణ వర్ణనా గంధముతో - ఎఱ్ఱన నాచన సోమనలు స్థూలారుంధతీ న్యాయముతో సూచించిన ప్రబంధ బాలికను సర్వలక్షణ లక్షితమైన ప్రబంధ కన్యగా తీర్చిదిద్ది తరువాత రాబోవు ప్రబంధ వధువులకు వేషభాషల విధానముల నుపదేశించి ప్రబంధ కవికుల గురువైనాడు.

శ్రీనాథుని రచనామూర్తికి - బహుశాస్త్ర పాండిత్య శక్తి, పరమేశ్వర భక్తి పాదయుగము: మాతృదేశాభిమానము మనస్సు; భోగపరాయణత బుద్ధి; భౌగోళిక చారిత్రికాంశములు చక్షువులు; రసికత రసన; కావ్యీకరణము, పాత్ర రూపనిర్మాణము కరములు.

## శ్రీనాథుని చరమదశ

మహాభోగములనుభవించిన శ్రీనాథుడు, తన్ను పోషించిన ప్రభువులందరు కాలగర్భమున కలసిపోగా, జీవనము కొఱకై కృష్ణానదీ తీరమున 'బొడ్డుపల్లి' అను గ్రామమున వ్యవసాయము చేసినట్లును, పంట వరదకు కొట్టుకొనిపోగా, పొలము వ్యవసాయమునకిచ్చిన ప్రభువులకు ధనము చెల్లింపలేకపోవుటచే, వారు చాల బాధలు పెట్టిరనియు, తెలుపు చాటువు.

కవిరాజు కంఠంబు కౌఁగలించెను గదా
పురవీధి నెదురెండ బొగడ దండ
సార్వభౌముని భుజా స్తంభమెక్కెను గదా
నగరి వాకిట నుండు నల్లగుండు

వీరభద్రారెడ్డి విద్వాంసు ముంజేత
వియ్యమందెను గదా వెదురు గడియ
ఆంధ్రనైషధకర్త యంఘ్రియుగ్మంబున
దగిలియుండెను గదా నిగళయుగము.

కృష్ణవేణమ్మ గొనిపోయె నింతఫలము
బిలబిలాక్షులు తినిపోయె దిలలు పెసలు
బొడ్డు పల్లెను గొడ్డేఱి మోసపోతి
నెట్లు చెల్లింతు టంకంబు లేడునూర్లు

కవిసార్వభౌముని ఈ దీనావస్థను చూచి జాలిపడి ఎవరో శిక్ష తప్పించి యుండవచ్చును. లేదా శ్రీనాథ మహాకవి ఆ సమయమున తన్ను ఋణ విముక్తునిచేసి పోషించుటకు ఎవరున్నారు? అని బాధపడుచు గాని చెప్పినదనిపించు చాటువు-

కాశికా విశ్వేశుఁ గలిసె వీరారెడ్డి
రత్నాంబరంబు లేరాయఁడిచ్చుఁ?
గైలాసగిరిఁ బంట మైలారు విభుఁడుండె
దినవెచ్చమేరాజు తీర్పఁగలఁడు?
రంభఁగూడె దెనుంగు రాయరాహుత్తుండు
కస్తూరి కేరాజుఁ బ్రస్తుతింతు?
స్వర్గస్థుఁడయ్యె విస్సన మంత్రి మఱి హేమ
పాత్రాన్నమెవ్వని పంక్తిఁగలదు?

భాస్కరుఁడు మున్నెకదేవుని పాలికరిగె
కలియుగంబున నిఁకనుండఁ గష్టమనుచు
దివిజ కవివరు గుండియల్ దిగ్గురనఁగ
నరుగు చున్నాఁడు శ్రీనాథుఁ డమరపురికి

ఈ రెండు చాటువులు తప్ప శ్రీనాథుని చరమదశ తెలియుటకు ఇతరమైన ఆధారమేదియు లభింపలేదు. ఈ రెండు చాటువులు శ్రీనాథునివి కావేమో అని కొందరు శంకించిరి. కాని ఎక్కువమంది విమర్శకులు శ్రీనాథునివే అని భావించిరి.

శ్రీనాథుడు వ్యవసాయము చేసిన 'బొడ్డుపల్లి' అను గ్రామ మెచ్చటిదో స్పష్టముగా తెలియలేదు.

ఇక రెండవ పద్యములో చెప్పిన వీరారెడ్డి కాశీఖండ కృతిభర్తయైన వీరభద్రారెడ్డి. మైలారువిభుడు అనగా మైలారురెడ్డి. ఇతడు ముమ్మడిరెడ్డి కొడుకు. రెండవ దేవరాయల సామంతుడు; తెనుంగు రాయరాహుత్తుండు అనగా తెనుంగు రాయఁడు. సాంపరాయని కుమారుడు. శ్రీనాథుడు తెనుంగురాయనిపై చెప్పిన పద్యములు-

అక్షయ్యంబుగ సాంపరాయని తెలుంగాధీశ! కస్తూరికా
భిక్షాదానము సేయురా! సుకవిరాట్ బృందారక శ్రేణికిన్
దక్షారామ చళుక్యభీమవర గంధర్వాప్సరో భామినీ
వక్షోజద్వయ కుంభికుంభములపై వాసించుఁ దద్వాసనల్

ధాటీఘోట ఘరట్ట ఘట్టన మిళ ద్ద్రాఘిష్ఠ కల్యాణ ఘం
టా టంకార విలుంఠ లుంఠిత మహోన్మత్తాహిత క్షోణిభృ
త్కోటీరాంకిత కుంభినీధర సముత్కూటాటవీఝాట! క
ర్ణాటాంధ్రాధిప! సాంపరాయని తెలుంగా! నీకు దీర్ఘాయువౌ.

శ్రీ చాగంటి శేషయ్య గారు - 'శ్రీనాథునకు గస్తూరి నిచ్చిన తెలుంగు రాయలు నెల్లూరి మండలములోని పొదిలి తాలూకాను, దానిని జేరియున్న కర్నూలు మండలములోని ప్రదేశమును పరిపాలించిన యొక సంస్థానాధిపతి. ఇతని పరిపాలనలోని దేశమునందు గర్ణాటకమును నాంధ్రమును గూడ నుండెను. అందుచేతనే సింహాచల శాసనమ్మున గన్నడదేశమనుటయు, శ్రీనాథుని చాటువులో 'కర్ణాటాంధ్రాధిప' యని సంబోధించుటయు వచ్చినవి' అని తెలిపినారు. (ఆ.క.త. 5-202)

విస్సన మంత్రి - ఎవరో తెలియలేదు. ముప్పది ఇద్దరు మంత్రులలో నితడొకడు. ఇక భాస్కరుడు అనగా కాటయవేముని వద్ద మంత్రిగా నున్న రాయని భాస్కరుడు. వినుకొండ పాలకుడు.

## శ్రీనాథుని జీవిత యాత్రాదర్శని

అనేక సాహిత్య ప్రతుల సిద్ధాంతములను పరిశీలించి 'ఫలశ్రుతి'గా ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి గారు తెలిపిన శ్రీనాథ కవిరాజ జీవిత ఘట్టముల క్రమమిది (శ్రీనాథుడు - పుట - 283)

శ్రీనాథుని జనన కాలము ........................................ క్రీ.శ. 1360
మరుత్తరాట్చరిత్ర రచనా కాలము ........................... క్రీ.శ. 1372
శాలివాహన సప్తశతి రచనా కాలము ........................ క్రీ.శ. 1376
పండితారాధ్య చరిత్ర రచనా కాలము ..................... క్రీ.శ. 1382
శృంగారనైషధ రచనా కాలము ................................ క్రీ.శ. 1395
హరవిలాస రచనా కాలము ..................................... క్రీ.శ. 1400
పెదకోమటివేమారెడ్డి ఆస్థానమున
విద్యాధికారియైన కాలము ................................ క్రీ.శ. 1404
ధనంజయ విజయ రచనా కాలము ........................ క్రీ.శ. 1412
నందికంత పోతరాజు కఠారి తెచ్చిన కాలము ........... క్రీ.శ. 1418
కొండవీటి సామ్రాజ్య పతన కాలము ........................ క్రీ.శ. 1424
పంట మైలారు రెడ్డి ప్రాపునందిన కాలము ....... క్రీ.శ. 1424-29

నందనందన చరిత్ర రచనా కాలము ........................ క్రీ.శ. 1426
తెలుంగురాయలు కస్తూరి యొసగిన కాలము . క్రీ.శ. 1424-29
వల్లభాభ్యుదయ రచనా కాలము ........................... క్రీ.శ. 1428
భీమఖండ రచనా కాలము ..................................... క్రీ.శ. 1430
కనకాభిషేక సత్కారమందిన కాలము ...................... క్రీ.శ. 1431
కాశీఖండ రచనా కాలము ...................................... క్రీ.శ. 1433
వీరభద్రారెడ్డి విద్వాంసుడైన కాలము ................ క్రీ.శ. 1433-44
సర్వజ్ఞ సింగమనాయని సందర్శించిన కాలము ...... క్రీ.శ. 1435
రాజమహేంద్ర వర రాజ్యాంతకాలము .................... క్రీ.శ. 1444
శివరాత్రి మాహాత్మ్య రచనా కాలము ...................... క్రీ.శ. 1445
పల్నాటి వీరచరిత్ర రచనా కాలము ......................... క్రీ.శ. 1446
బొడ్డుపల్లిని గుత్తగొన్న కాలము .............................. క్రీ.శ. 1448
శ్రీనాథుని అవసాన కాలము ...................................... క్రీ.శ. 1450

'కవి మూర్ధన్య', బ్రహ్మశ్రీ కాకరపర్తి కృష్ణ శాస్త్రి గారు (కంచు ఢక్క - పుట - 11), శ్రీనాథ సాహిత్యమూర్తికి నొసగిన కవన నీరాజనము.

బ్రాహ్మీపయస్సుధాపాన మాకంఠంబుఁ
బొనరించి గబ్బుగబ్బునను ద్రేఁచె
విద్యాధికారియై వేమభూపాత్త భో
గాభోగ సుశ్రీలనూభవించె
రాజమహేంద్రవరక్రుద్ధ తార్కికా
వేశ సర్వస్వ మాపోశనించె
భావభాషాద్వయీ పరిపుష్టిఁ బూరించి
ప్రౌఢప్రబంధముల్ పరిఢవించెఁ

ప్రౌఢ దేవేంద్రరాయ సభాప్రసిద్ధ
గౌడడిండిమ భట్టఢక్కా విభేద
నైకకృతి సల్పి హైమాభిషేక మందె
నాఁడు కవితావిహారి శ్రీనాథసూరి

శ్రీనాథ మహాకవిని గూర్చి ఎందరెందరో శ్రీనాథ కవితా శ్రీనాథులు వివిధ కోణములలో పరిశోధన చేయుట జరిగినది. ఆ బహుశ్రుతులు చెప్పిన బహు విషయములలో కొన్ని మాటలకు పునశ్చరణము ఈ **అనుశ్రుతి.**

**గుంటూరు,**
**మే, 1997.**

**-డాక్టర్ గుండవరపు లక్ష్మీనారాయణ**

*****

# దక్షిణ కాశికా దర్శనము

శ్రీనాథుడు ప్రౌఢ నిర్భరవయః పరిపాకమున కొనియాడిన భీమనాయకుని మహిమ భీమేశ్వర పురాణము. పేరునకు పురాణము. తీరునకు కావ్యము. పురాణ ధోరణి కంటె కావ్య సరణి సమధికము. ఆ కావ్యసరణియును ప్రౌఢకావ్యసరణి. శ్రీనాథుని ప్రౌఢతమ కావ్యమైన శృంగార నైషధమునకు వ్యాఖ్యానము వెలువడిన ఎనుబదియేండ్లకు - ప్రౌఢతరకావ్య మైన కాశీఖండమునకు వ్యాఖ్యానము వెలువడినది. కాశీ ఖండమునకు వ్యాఖ్యానము వెలువడిన కతిపయ సంవత్సరములకే - ప్రౌఢ కావ్యమైన భీమేశ్వర పురాణమునకును వ్యాఖ్యానము వెలువడుట ముదావహము. అంతేకాదు. భీమేశ్వర పురాణ వ్యాఖ్యానము స్వయంప్రతిష్ఠితమగుట ప్రశంసాపాత్రము.

భీమేశ్వరపురాణ వ్యాఖ్యానమునకు దక్షిణకాశిక అని నామకరణము. భీమేశ్వర నిలయమైన దక్షారామక్షేత్రము దక్షిణకాశి అని ప్రసిద్ధము. దక్షిణకాశి అని భీమేశ్వర పురాణము నందు మాత్రమే గాక, దక్షారామ భీమేశ్వరాలయ శాసనము నందును కలదు. దక్షిణ కాశీ క్షేత్ర మాహాత్మ్య ప్రతిపాదకమైన భీమేశ్వర పురాణము వ్యాఖ్యానమునకు దక్షిణకాశిక అను నామకరణము సముచితము. తూర్పు గోదావరి మండలము నందలి దక్షారామములోని భీమలింగేశ్వరస్వామి కావ్య వ్యాఖ్యానము, గుంటూరు మండలము నందలి గుండవరములోని రామలింగేశ్వర స్వామికి అంకితము. ఇది అత్యంత సముచితము. స్థల, నామభేదములు వినా స్వామి ఒకడే కదా!

కవిత్వ నిత్యవ్రతుడు, సాహిత్య సత్యవ్రతుడు, శివశక్తి భక్తియుతుడు డాక్టర్ గుండవరపు లక్ష్మీనారాయణ ప్రధాన వ్యాఖ్యాత. సంప్రదాయ పండితుడు శ్రీ జన్నాభట్ల వీరేశ్వర శాస్త్రి, సాహిత్య వేత్త శ్రీ జక్కరాజు నరసింహారావు సహవ్యాఖ్యాతలు. మహాభారతమునకు కవిత్రయము వలె, భీమేశ్వరపురాణ మహాప్రబంధమునకు వ్యాఖ్యాతృ త్రయము! ఈ త్రిపుటి సంప్రదాయ నవ్యతల సంపుటి. కాఁబట్టి దక్షిణ కాశికా వ్యాఖ్యానము టీకా తాత్పర్యమాత్రము గాక, పరిశోధన విశేష పరిపూర్ణమైనది.

దక్షిణ కాశికా వ్యాఖ్యానము "ప్రతిపదార్థ భావ విశేష సహిత" మని వ్యాఖ్యాతృ ప్రతిపాదనము. ప్రతిపదార్థ భావములు ప్రతివ్యాఖ్యానమునకును ప్రాథమిక విషయములు. విశేషములు దక్షిణ కాశికా వ్యాఖ్యాన విశేషములు.

అర్థములు సుబోధకములు. సంస్కృత పదములకు అర్థములు మఱల సంస్కృత పదములు గాక, సాధ్యమైనంతవఱకు తేటతెనుగు పదములు కలవు. అక్కడక్కడ అభిధార్థము లకు బదులు ఫలితార్థములు కలవు. అవి స్పష్టార్థ ప్రతిపత్తికి సహకరించునవి.

భావములు అరటిపండ్లు ఒలిచి అఱచేతిలో పెట్టినట్లు కలవు. సమాస భూయిష్ఠము లైన సుదీర్ఘ వచనముల భావములు సరళాతిసరళముగ సంతరింపఁబడినవి.

విశేషములు అశేషములు. అవసరమైన పద్యముల లక్షణ నిర్దేశములు; అతి ముఖ్యములైన శబ్దముల రూప నిష్పాదనములు; అలంకార నిర్దేశములు; వక్రతాప్రభేద నిర్దేశములు; వైదికాంశములు, మంత్ర, యోగ, నాట్య శాస్త్ర విషయములు, పౌరాణిక, భౌగోళిక, చారిత్రిక వివరములు, స్థానిక విశేషములు; పద, పాద, పద్య సంవాదములు, పూర్వ కవితా చర్వణ పురస్కారములు మొదలైన బహు విశేషములు కలవు. అవి సమామ్నాత పూర్వకములైన సమన్వయములు మాత్రమేగాక, స్వోపజ్ఞములైన సోదాహరణ నిరూపణములు కూడ.

*"గిరిసార్వభౌమకన్యా*
*కరగ్రహణ సుమంగళైక కౌతుక సంప*
*త్పరిపూర్ణ హృదయు శంకరుఁ*
*గరుణా కింకరుని నురగ కంకణుఁ గొలుతున్." 124 ప.3 ఆ.*

ఇందు ద్వితీయ పాదము నందలి "కరగ్రహణ" సమానములోని రేఫము (ర) లఘువనుటకు సరస్వతీ కంఠాభరణము నుండి ప్రమాణము సూచింపఁబడినది. "**కరగ్రహణ మంగళైక కౌతుక**" అని కవిపాఠము కావచ్చును. అయినను, "స్థితస్య గతిశ్చిన్తనీయా" అను సంప్రదాయము పాటింపఁబడినది. శ్రీనాథుడు అఖండయతిని పాటించినట్లు కతిపయ స్థలము లందు కలదు.

1. *"వెస వసుధాస్థలంబునఁ గవీంద్రులు......" 12 ప-1 ఆ.*

ఇందు "వెస" లోని "వె"కు, కవి+ఇంద్రులు="కవీంద్రులు" లోని "వీ"కు అక్షరమైత్రి అఖండయతియే. కాని "వెస" శబ్దము వలె "ఎస" శబ్దమొకడు కలదు. అంతేకాదు. "నమ్రమై యెస సంక్రందనశాఖి డెందమునఁ బెంపెక్కించు మందాక్షమున్"అని శృంగార నైషధము నందు శ్రీనాథుని ప్రయోగము కలదు. (156 ప. 5 ఆ.) కనుక "ఎస వసుధా స్థలంబునఁ గవీంద్రులు" అని కవి పాఠము కావచ్చును.

2. *"తమ్మని వీరభద్ర వసుధాధిపు......" 34 ప. 1 ఆ.*

ఇందు "తమ్మని"లోని "త"కు, వసుధా+అధిపు="వసుధాధిపు"లోని "ధా"కు అక్షరమైత్రి, కవిజనాశ్రయములోని "భానుసహస్రభాసి వృషభాధిపుఁ దన్నటు లర్థయుక్తమై" (66 ప. సం. అ.) వంటి అఖండ యతియే అగును. కాని "తమ్మని వీరభద్ర **వసుధావరు**" అని కవిపాఠము కావచ్చును.

భీమేశ్వర పురాణమునకు తాళపత్ర గ్రంథములు రెండు మూడు మాత్రమే లభించినవి. అందువలన ముద్రిత గ్రంథములందు అపపాఠములు కలవు. ఒక ఉదాహరణము:

*"మగఁటిమిఁ జంద్రు గుజ్జురన మంటిన వామపదాంబుజంబుపై*
*నిగళము నాసురాసుర వినిర్జితమౌ బిరుదందె ఘల్లనన్*
*బొగడలు బొండుమల్లియలు పొన్నలు పావడచొళ్లియంబునన్*
*నిగిడిచి వీరభద్రుఁడు చనెన్ శశిమౌళి సమీప భూమికిన్." 112 ప. 5 ఆ.*

ఇందు మొదటి పాదము "మగఁటిమిఁ జంద్రు గుడ్డురక మట్టిన" అని కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణ సారసంగ్రహము నందు కలదు. అంతేకాదు. ఇదే విషయము "కొసర కెవ్వఁడు పదాంగుష్ఠ భాగంబున నుడురాజు పొట్ట గుజ్జుఱక నూదె" అని శ్రీనాథుని కాశీ ఖండము నందు కలదు. (32 ప. 3 ఆ.) కనుక **"మగఁటిమిఁ జంద్రు గుజ్జుఱక మట్టిన"** అని కవి పాఠమగును. అది "మగఁటిమి" అను ఎత్తుగడకు అనుగుణము. గుజ్జు=గుంజు. పొట్టలో గుంజు బైటికి వచ్చునట్లు త్రొక్కెననుట నుడికారము.

భీమేశ్వర పురాణము నందు సంస్కృత వ్యాకరణ సమ్మతములు కాని ప్రయోగములు రెండు కలవు. 1. కానినేయ శబ్దము 2. గ్రహయాళు శబ్దము.

1. *"భిక్ష లేదని యింత కోపింతురటయ్యె*
*కాశికాపట్టనము మీఁదఁ గానినేయ" 114 ప. 2 ఆ.*
*"భీమనాథునిఁ ద్రిభువనస్వామిఁ గొలుము*
*కార్య సంసిద్ధిఁ బొందెదుఁ గానినేయ" 214 ప. 3 ఆ.*

ఇందలి "కానినేయ" సంబుద్ధులు సంస్కృత భీమ ఖండమును సంవదించునవి కావు. కానీన శబ్దము సాధువు. కానినేయ శబ్దము అసాధువు. ఆ సాధుత్వాసాధుత్వ నిరూపణ మీ వ్యాఖ్యానము నందు కలదు.

"కానినేయ" అను శబ్ద సాధుత్వము చింత్యము. కన్యకు పుట్టినవాడు కానీనుడు అగును. కానీన - కన్యాయాః జాతః. (కన్యా+అణ్. కానీన ఆదేశము.)

ఇది రూప నిష్పాదనము. ఇట్లు కానినేయ శబ్దము నిష్పన్నము కాదు. కనుక అసాధువు. కాని. కానీన శబ్దముతోపాటు (213 ప. 3 ఆ.) కానినేయ శబ్దము శ్రీనాథుని ప్రయోగము. ప్రథమతః కానినేయ శబ్దము కాశీవిశాలాక్షీ ముఖనిర్గతము. తదుపరి కానీన. కానినేయ శబ్దములు అశరీర భారతి ముఖ నిర్గతములు. అప్రయుక్తపూర్వమైన సంస్కృత శబ్దమును ప్రయోగించుట శ్రీనాథుని పద్ధతి కాదు. ఇందుకు ప్రౌఢిమ శబ్దము ప్రబల నిదర్శనము. సంస్కృత వ్యాకరణ సమ్మతము కాని ప్రౌఢిమ శబ్దము మూకపంచశతి యందు ప్రయుక్తము. అట్లు కానినేయ శబ్దమును ప్రయుక్త పూర్వమగును.

2. *"హేమంతావధి సంప్రబోధ గురువుల్ హృజ్జాత తేజోగ్నిధా*
*య్యా మంత్రాక్షరముల్ పటీరగిరివన్యామందవాతూలముల్*
*వేమాఱుం గలశీతనూభవవధూవేణీభరాంతః ప్రసూ*
*నామోదగ్రహయాళువుల్ పొలసె దక్షారామ మధ్యంబునన్" - 95 ప. 5 ఆ.*

ఇది "గ్రహయాళవః" అను సంస్కృత భీమఖండమునకు సంవదించునది. (6శ్లో. 25 అ.) అది "గృహయాళవః" అనవచ్చును. ఇది "గృహయాళువుల్" అనిన గురుభంగము. గ్రహయాళు శబ్దమునకు ఈ వ్యాఖ్యానము నందు ఉట్టంకించిన గతికల్పనము కలదు. (పుట 643) అయినను ప్రయుక్త పూర్వమగును.

తెలుగు వ్యాకరణమునకు సంబంధించి తెగని సమస్య భీమేశ్వర పురాణము నందు "ఎల్లన్ శిష్యుల" అను శ్రీనాథుని ప్రయోగము.

*"తల్లీ! యిన్ని దినాల కేనియు సుధాధారారసస్యందియై*
*యుల్లంబున్ సుఖియింపఁజేయు పలుకెట్లో వింటి నీవీటిలోఁ*
*బెల్లాకొన్నతనాన నేనొకఁడనే భిక్షానకున్ వత్తునో*
*యెల్లన్ శిష్యులఁ గొంచు వత్తునొ నిజం బేర్పాటుగాఁ జెప్పుమా." 120 ప. 2 ఆ.*

ఇది కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణ సారసంగ్రహమునందు కలదు. మొదటిపాదము నందు "రస"కు "లవ" అని, రెండవ పాదము నందు "సుఖియింప"కు "తనియింప" అని, మూడవపాదము నందు "తనాన"కు "కతాన" అని పాఠాంతరములు కలవు. నాలుగవ పాదములోని "ఎల్లన్ శిష్యుల"కు పాఠాంతరము లేదు. ప్రత్యంతరములందును పాఠాంతరము లేదు. అయినను "ఎల్లా శిష్యుల" అను పాఠాంతరమును కల్పించి, అది కన్నడ సంప్రదాయ మనుట కేవలము కల్పనా గౌరవమునకు తావలము." ఎల్ల అనునది ద్రుత ప్రకృతికమగు అవ్యయము కాదు" అనుట చింత్యము. "సర్వపర్యాయంబైన యెల్ల శబ్దంబు ద్రుతాంతంబు" కానిచో పూర్వకవి ప్రయోగములకు బాధకము. శ్రీనాథుని భీమేశ్వర పురాణము నందలి, ఇదే ఆశ్వాసములోని ప్రయోగాంతరమునకు ప్రతిబంధకము.

*"ఆనందంబున నర్ధరాత్రములఁ జంద్రాలోకముల్ కాయఁగా*
*నానాసైకత వేదికా స్థలములన్ నల్దిక్కులన్ శంభుఁ గా*
*శీనాథున్ దరుణేందుశేఖరు శివున్ శ్రీకంఠునిన్ బాడుదు*
*న్మేనెల్లం బులకాంకురప్రకరముల్ నిండార మిన్నేటిలోన్." 91 ప. 2 ఆ.*

ఎల్ల శబ్దము ద్రుతాంతము కానిచో, "మేనెల్లం బులకాంకురప్రకరముల్" పాటమరించవు. "మేనెల్ల పులకాంకుర ప్రకరముల్" పాదమును - గణభంగమగును. కనుక ద్రుతప్రకృతికమే. "ఎల్లందు", "ఎల్లయందు" అను సప్తమీ విభక్తిక ప్రయోగములు కలవు గాని, అన్యవిభక్తిక ప్రయోగములు లేవు - ఎల్లరు అను పదము సవిభక్తికమగుట కంటె, ఎల్లవారు అను పదబంధమునకు విపరిణత రూపమగును. అట్టివారు అట్టిరు వలె ఎల్లవారు ఎల్లరు. అంతేకాదు. సర్వ పర్యాయమైన ఎల్లశబ్దమునకు బహువచన రూపము లేదు. కనుక అవ్యయమే. ఎల్ల శబ్దమునకు ఎల్లరు అను అర్థము కలదు. కాని ప్రథమాంతమైన ఎల్లరు శబ్దమునకు ఎల్లరన్ అను సప్తమ్యంతము వలె, అవ్యయమైన ఎల్ల శబ్దమునకు ఎల్లన్ అను సప్తమ్యంతము నిష్పన్నమగుట దుర్ఘటము. ప్రయోగాంతరమును మృగ్యము. **'ఎల్లర్ శిష్యుల'** అను కవి పాఠమునకు "ఎల్లన్ శిష్యుల" లేఖక దోషము కావచ్చును. భీమేశ్వర పురాణము నందే "గైకొన్విఘ్నరాజర్మిలిన్" అని ప్రయోగించిన శ్రీనాథుడు (110 ప. 5 ఆ.) 'ఎల్లర్ శిష్యుల' అని ప్రయోగించుట అసంభవము కాదు. "ఎల్లా శిష్యుల", "ఎల్లన్ శిష్యుల", "ఎల్లర్ శిష్యుల' అను మూడు అభిప్రాయములును ఈ వ్యాఖ్యానము నందు కలవు.

అలంకారముల నిర్దేశములు అంతట కలవు. అవి ప్రతి వ్యాఖ్యానమునకు వలె, దక్షిణ కాశికా వ్యాఖ్యానమునకును అలంకారములు. అంతకంటె వక్రతా ప్రభేదముల నిర్దేశములు దక్షిణ కాశికా వ్యాఖ్యానమునకు జీవరేఖలు. ఏ కావ్యము నందును కావ్యలక్షణము తెలుపని శ్రీనాథుడు, భీమేశ్వర పురాణము నందు సత్కావ్య లక్షణమును తెలుపుట గమనార్హమైన విశేషము.

*"హరచూడా హరిణాంక వక్రతయుఁ గాలాంతః స్ఫురచ్చండికా*
*పరుషోద్గాఢ పయోధర స్ఫుటతటీ పర్యంత కాఠిన్యమున్*
*సరసత్వంబును సంభవించె ననఁగా సత్కావ్యముల్ దిక్కులన్*
*జిరకాలంబు నటించుచుండుఁ గవిరాజీ గేహరంగంబులన్."* 11 ప. 1 ఆ.

ఇందు "హరచూడాహరిణాంకవక్రత" సత్కావ్యలక్షణమని ఇదమిత్థముగ కలదు. అది కుంతకుని వక్రోక్తి జీవితములోని వక్రత. అది ద్వివిధము. 1. శబ్దవక్రత=శబ్ద సౌందర్యము. 2. అర్థవక్రత=అర్థగాంభీర్యము. శబ్ద సౌందర్యము రీతివిషయము. అర్థగాంభీర్యము ధ్వని విశేషము.

*"నిషేధవేషో విధిరేవతేధునా*
*తథైవ యుక్తా ఖలు వాచి వక్రతా*
*విజృమ్భితం యస్య కిల ధ్వని రిదం*
*మిదగ్ధనారీవచనం తదాకరః* 51 శ్లో. 9 స.

అని శ్రీహర్షుని నైషధీయ చరితము నందు కలదు. "వక్రతా యక్తా" అనగా 'వక్రోక్తి స్తద్వచన విషయైవ యుక్తే రిత్యర్థః" అని, "ధ్వనేః" అనగా "ధ్వని సంజ్ఞకస్యోత్తమ కావ్యే" అని నారాయణ పండితుని వ్యాఖ్యానము నందు కలదు.

*"ఒల్ల నను మాట కర్థమో యుత్పలాక్షి*
*వలతునను మాట గాదుగా వక్రరీతి*
*విధి నిషేధరూపంబు భావించియున్న*
*విధియ యగు వ్యంగ్య వాసనా విలసనమున"* 76 ప. 4 ఆ.

అని శ్రీనాథుని శృంగార నైషధము నందు కలదు. ఇంద్రాగ్ని యమవరుణు లందు ఎవ్వనిని వరింపనను దమయంతి వచనమునకు వరింతునను అర్థము వివక్షితమైనచో, అది ధ్వన్యర్థమగును. అది వక్రతావచనమని శ్రీహర్షుడు. వక్రరీతి అని శ్రీనాథుడు. విధివాక్యమునకు నిషేధార్థము, నిషేధ వాక్యమునకు విధ్యర్థము వివక్షితమైన, అది ధ్వన్యర్థమే అగును. అదే అర్థవక్రత. శబ్దార్థ వక్రతలు సమ్యక్సమ్మిళితమైన కుంతకుని వక్రోక్తి జీవితములోని వక్రతా ప్రభేదములు ఈ వ్యాఖ్యానమునందు కలవు. అవి : 1. వర్ణ విన్యాసవక్రత. (36 ప. 1 ఆ: 22 ప. 2 ఆ; 33 ప 2ఆ; 102 ప. 2 ఆ; 155 ప. 2 ఆ; 165 ప. 3 ఆ; 94 ప. 4 ఆ; 135, 136,

137 ప. 5 ఆ.) 2. వాక్యవక్రత (153 ప. 2 ఆ; 45 ప. 3 ఆ) 3. పదపూర్వార్ధ వక్రత (107 ప. 4 ఆ.) 4. రూఢివక్రత (89 ప. 2 ఆ) 5. ఉపసర్గవక్రత (114 ప. 5 ఆ) మొదలగునవి.

"అధ్వర్యు వేదశాఖాధీతి నిష్ణాతు"ని (8ప.1ఆ. హ.వి.) శ్రీనాథుని భీమేశ్వర పురాణము నందు వైదికాంశములు కలవు.

*"వలవ దగ్నిష్టోమ వాజపేయాదుల*
*ధూమపానముఁజేసి దుఃఖపడఁగ*

--- --- ---

*సంతతంబును గృధ్రచాంద్రాయణాదుల*
*వరటుచు నుంట యెవ్వరికి మెచ్చు" 32 వ. 4 ఆ.*

అగ్నిష్టోమవాజపేయాదులు యజ్ఞములు. కృధ్రచాంద్రాయణాదులు వ్రతములు. అగ్నిష్టోమ, వాజపేయ యజ్ఞముల వైదిక వివరములు, చాంద్రాయణ వ్రత విశేషములును ఈ వ్యాఖ్యానము నందు కలవు.

భీమేశ్వర పురాణము నందు త్ర్యాయుష (114 ప. 1 ఆ.) అష్టాక్షర, ద్వాదశాక్షర (68ప. 2 ఆ.) షడంగ. ప్రాసాద పంచాక్షర (104 ప. 4 ఆ.) తారక (123 ప. 3 ఆ; 13 ప. 6 ఆ.) షడక్షర (27 ప. 6 ఆ.) మంత్రములును ప్రసక్తములైనవి. అంతేకాదు. "శతరుద్రసచ్ఛృతి స్వాధ్యాయ పాఠంబు" కలదు. (28 ప. 3 ఆ.) ఇట "శతరుద్రియశ్రుతి" అని పాఠాంతరము కలదు. అది సంస్కృత భీమఖండమును సంవదించునది (51-53 శ్లో. 8 ఆ.) ఆ పాఠ మీ వ్యాఖ్యానము నందు స్వీకృతము. శత రుద్రియమన శతరుద్రీయము. అందు రుద్రమంత్ర ములు కలవు. ఆ యీ మంత్రము లెల్ల ఈ వ్యాఖ్యానము నందు విశదీకరింపఁబడినవి.

ఇంకను యోగ శాస్త్ర విషయములు (45 ప. 3 ఆ; 160 ప. 5 ఆ: 90 ప. 4 ఆ.) ఖగోళ శాస్త్ర విషయములు (48 ప. 3 ఆ.) నాట్యశాస్త్రవిషయములు (118వచ.1 ఆ.; 94 ప. 6 ఆ.) మొదలైనవి ఇందు కలవు.

*"శ్లోకంబుల్ శతకోటిఁ గాండములుగా సూత్రించి రామాయణం*
*బేకైకాక్షర మెల్లపాపముల మాయింపంగ నిర్మించి సు*
*శ్లోకుండైన పురాణ సంయమివరున్ జూతు న్మనోవీథి వా*
*ల్మీకిన్ బ్రహ్మ పదావతీర్ణ కవితా లీలావతీ వల్లభున్." 5 ప. 1 ఆ.*

ఇది శ్రీనాథుని వాల్మీకి స్తుతి. ఇందు రామాయణ శ్లోక సంఖ్య శతకోటి అని ఇదమిత్థముగ కలదు. అది,

*"చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరం*
*ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్."*

అను ప్రసిద్ధమైన శ్లోకమునకు అనుసరణము. కాని వాల్మీకి రామాయణము నందు ఇఱువది నాలుగు వేల శ్లోకములే కలవు. కడమ తొంబది తొమ్మిది కోట్ల తొంబది తొమ్మిది

3ఆ.) మంకణముని వృత్తాంతము (115 ప. 3 ఆ.) విశ్వేదేవుల వృత్తాంతము (51ప. 5ఆ.) మొదలైనవి బ్రహ్మాది పురాణములను బట్టి వివరింపఁబడినవి.

కర్ణాట లాట భోటాది దేశములు (19 ప. 1 ఆ.) అష్టాదశ ద్వీపములు (32ప. 1ఆ) కుమ్మరోద్యానము (49 ప. 1ఆ) కొలను అగ్రహారము (55ప. 1ఆ.) ఝాడేశవన, సప్తమాడె, బారువా, దొంతి ప్రభృతి ప్రదేశములు (63ప. 1ఆ.) బోడసకుర్తి మహాస్థలము (65ప. 1ఆ.) పలివెల, పంచారామములు (78ప. 1ఆ.) మొదలైన ప్రదేశములతోపాటు, భీమమండలము నందు ప్రసక్తమైన సర్వస్థలముల భౌగోళిక వివరములును ఈ వ్యాఖ్యానమునందు కలవు.

భీమేశ్వర పురాణము రాజమహేంద్రవర రాజ్యాధిపతులు అల్లాడ వేమారెడ్డి వీరభద్రారెడ్డి సోదరుల మంత్రి బెండపూడి అన్నయామాత్యునికి అంకితము. అది నిమిత్తముగ అవతారికాశ్వాసాద్యంతాది పద్యగద్యములందు అనేక చరిత్రాంశములు కలవు. అవి ప్రకటిత పూర్వములు. అవి యెల్ల ఈ వ్యాఖ్యానము నందు కలవు. అందు రాజమహేంద్రవర రాజ్యము నకు ఆనువంశికాధారము కల కాటయ వేమారెడ్డి తనయ, వీరభద్రారెడ్డి భార్య అయిన అనితల్లి తల్లి దొడ్డాంబిక అని కలదు. (పుట 35) అట్లు వెనుకటి చరిత్ర గ్రంథములందు కలదు. ఇటీవల లభించిన అన్నవరప్పాడు శాసనమునందు అనితల్లి తల్లి అన్యమాంబ అని కలదు. ఇది గమనార్హము.

కావ్యభాగము నందు ఒక చరిత్రాభాసము కలదు.

*"పరమాశించుచు భీమే*
*శ్వరు ననుమతిఁ జేసి చోడవంశాభరణుం*
*డరికాలుఁడు కరికాలుఁడు*
*ధరణీధరపత్ని మనసు దైన్యము ముంచెన్" 115ప. 1ఆ.*

కరికాలుడు అరికాలుడే. చోడవంశాభరణుడే. తమిళచోళమహారాజు. మహాశివభక్తుడు. కావేరీ నదికి ఆనకట్ట కట్టించిన చరిత్ర ప్రసిద్ధుడు. అతని కాలము రెండవ శతాబ్ది. ఆ కాలమునందు దక్షారామ భీమేశ్వరాలయము చారిత్రికముగ లేదు. కనుక భీమేశ్వరుని కృపను మోక్షము నందుట చారిత్రిక సత్యము కాదు. ఈశ్వరుని కృపను మోక్షమునందుట చారిత్రిక సత్యము కావచ్చును. అదికూడ 1220 ప్రాంతము నందలి పాలకుఱికి సోమనాథుని బసవపురాణము నందుగాని, 1690 ప్రాంతము నందలి పొట్టి లింగన నవచోళచరిత్ర యందు గాని లేదు. తమిళ సాహిత్యము నందు కలదో? లేదో? - ఇది బహుశః దక్షారామ భీమేశ్వరాలయము ప్రాచీనతకు ప్రాంతీయ జనశ్రుతి అగును.

పద్యమునందు "ధరణీధరపత్ని" అని ముద్రిత గ్రంథములందు కలదు. "ధరణీధర= భూమిని భరించు ఆ రాజు" అని వ్యాఖ్యానము నందు కలదు. ధరణీధరపద బంధమునకు పర్వతమని ప్రసిద్ధార్థము. రాజను అర్థము ప్రసిద్ధము కాదు. "ధరణీధరపత్ని" అను ప్రథమ ముద్రణ దోషము క్రమ పరిప్రాప్తమైనది! అది **'ధరణీధవపత్ని'** అని కవిపాఠమగును.

లక్షల డెబ్బది యాఱు వేల శ్లోకములును ఎక్కడ కలవు? అందు ఇఱువది నాలుగు వేల శ్లోకములందును లేని విషయమేమి కలదు? శత కోటి సంఖ్య గుఱించి ఈ వ్యాఖ్యానము నందు ఇట్లు కలదు.

"శతమనగా మూడవ స్థానము. కోటి యనగా ఎనిమిదవ స్థానము. కనుక 3×8=24 వేల సంఖ్య యని కొందరు పెద్దలు చెప్పుచుండిరి."

ఇది సంకేతితార్థముగ వాల్మీకి రామాయణమునకు సుసంగతమగును.

ఇట్టి సమన్వయములు మాత్రమే గాక, పురాణ ప్రోక్తములైన చతుర్దశభువనములు (4ప. 1ఆ), వ్యాస శిష్యులు (79ప. 2ఆ.) పంచ మహాపాతకములు (24ప. 3ఆ) సప్తవాయువులు (98ప.3ఆ.) ద్వాదశాదిత్యులు (57ప. 3ఆ), సప్తసముద్రములు (87ప. 3ఆ.), అష్టసిద్ధులు (114ప. 3ఆ) చతుర్దశ మనువులు (206ప. 3ఆ.), అష్టమూర్తి (114ప. 4ఆ.) రౌరవాది నరకములు (23ప. 5ఆ.) అష్టవసువులు (25ప. 5ఆ.) ఏకాదశ రుద్రులు (25ప. 5ఆ.) లోకపాలకులు (51ప. 5ఆ.) సప్తజిహ్వలు (45ప. 6ఆ.) మొదలైన బహుపదబంధముల వివరములును ఈ వ్యాఖ్యానమునందు కలవు.

దక్షారామపుర వర్ణనము నందు "ముడువంగ నేర్తురు" అను సీసపద్యములోని ఎత్తు గీత మిట్లు కలదు.

*"చందురుని తోడఁ గల్పవృక్షములతోడఁ*
*దారతో లక్ష్మితో నమృతంబు తోడఁ*
*గౌస్తుభముతోడ మున్నీటఁ గలిగినారు*
*విబుధ గంధర్వ జాతు లవ్వీటి సతులు" 96 ప. ఆ.*

ఇది సంస్కృత భీమఖండమును సంవదించునది కాదు. సముద్ర మథన సమయము నందు చంద్రుడు, కల్పవృక్షము, లక్ష్మి, అమృతము, కౌస్తుభము ప్రభవించుట బహుపురాణ ప్రసిద్ధము. తార ప్రభవించుట అప్రసిద్ధము. అంతేకాదు. ఈ భీమేశ్వర పురాణములోని సముద్రమథన ఘట్టమునందే తార ప్రభవించినట్లు లేదు. శ్రీనాథుని హరవిలాసములోని సముద్ర మథన ఘట్టమునందును లేదు. ఈ వ్యాఖ్యానమునందు ఇట్లు కలదు.

"వాలి భార్య యగు తార కూడ ఐరావతాదులతో పాటుగ పాల సముద్రము నుండి జన్మించెనని కంబరామాయాణము నందలి యుద్ధకాండమున కలదు."

ఇట్లు అష్టాదశ పురాణములందు గాని, సంస్కృత కావ్యములందు గాని లేనిచో, కంబ రామాయణములోని అంశమే శ్రీనాథునికి ఆధారమగును. అది శ్రీనాథుని తమిళ సాహిత్య పరిచయమునకు తార్కాణమగును.

మాంధాతృ ప్రభృతుల వృత్తాంతములు (117 ప. 1 ఆ.) దివోదాసు వృత్తాంతము (98ప. 2ఆ.) గౌతమీగంగ వృత్తాంతము (21ప. 3ఆ) వాలఖిల్యుల వృత్తాంతము (65ప.

శ్రీనాథుని భీమేశ్వర పురాణము క్షేత్రమాహాత్మ్య కావ్యము. తెలుగు క్షేత్రమాహాత్మ్య కావ్యము లందు ద్వితీయమైనను అద్వితీయము. ప్రథమాంధ్ర క్షేత్ర మాహాత్మ్య కావ్యము లక్ష్మీనృసింహావతార కథ అయిన ఎఱ్ఱన నృసింహ పురాణము అహోబల క్షేత్రమునకు సంబంధించినది. కాని, అహోబలక్షేత్రము సాక్షాత్కారము కాదు. భీమేశ్వర పురాణము దక్షారామ క్షేత్ర మాహాత్మ్య ప్రతిపాదకమైన కావ్యము. ఇందు దక్షారామ క్షేత్రము విరాట్ స్వరూపముతో సాక్షాత్కారమగును. భీమేశ్వర పురాణము దక్షారామ క్షేత్రమునకు నిలువుటద్దము. దక్షారామ క్షేత్రము కల భీమమండలమునకు కంచుటద్దము. భీమ మండలము కల తూర్పు గోదావరి మండలమునకు మించుటద్దము. ఆలయముల సంప్రదాయములు, ఆచారములు, వ్యవహారములు మాత్రమే గాక, ప్రకృతి సంపద, పంటల సమృద్ధి, ఫల వృక్షముల ప్రాభవము మొదలైనవి భీమేశ్వర పురాణము నందు కవితా ముద్రాముద్రితములు. స్థానిక విశేషము లవికూడ ప్రకటిత పూర్వములు. అవియెల్ల ఈ వ్యాఖ్యానము నందు కలవు.

ప్రకటితపూర్వమైన ఒక స్థానిక విశేషము పరిశీలనార్హము.

*"కొమరేటి కల్యాణ కమల షండంబుల*
*సౌరభ్య భారంబు సంతరించి*
*నారికేళాటవీ నవపుష్ప కుహళికా*
*వితతి కన్నెఱికంబు వీడు కొలిపి*
*యప్సరః కాంతావిహార హాటకహర్మ్య*
*శశికాంతమణి గవాక్షముల దూఱి*
*భీమనాయకదేవు పేరురంబునఁ గ్రాలు*
*భుజగ హారములకు భుక్తి వెట్టి*
*రాజనారాయణస్వామి రమ్య భవన*
*తార్క్ష్య కేతనపతికి నర్తనము గఱపి*
*పొలసె నధ్వపరిశ్రాంతి పొడవడంగ*
*మాని వరుపైఁ గుమార వనానిలములు." 61ప. 2 ఆ.*

ఇది కుమారారామములోని వాయు ప్రసారము వర్ణనము. ఇందు చాళుక్య భీమేశ్వరాలయ విశేషముతోపాటు రాజనారాయణ స్వామ్యాలయ విశేషమును కలదు. అది "రాజనారాయణ స్వామి రమ్యభవన తార్క్ష్యకేతనపతికి నర్తనము గఱపి" అని ముద్రిత గ్రంథములందు కలదు. ఇది సంస్కృత భీమఖండము నందు "రాజనారాయణాగార తార్క్ష్య కేత్వాళిలాస్యగాః" అని కలదు. (48శ్లో. 3అ.) అది, ఇది చూచి కావించిన పూర్వసమన్వయమిది:

"శ్రీనాథుని నాడు గుడిమీద కేతనముగా నుండిన గరుత్మంతుడీనాడా తావునందు లేక ఆలయము క్రిందికి దిగినాడు." పుట 188. కేతన మేనాడును గుడిమీద ఉండదు.

మతేనాడును గుడిక్రిందికి దిగదు. కేతనమన ధ్వజము. అది కలది ధ్వజస్తంభము. రాజనారాయణ స్వామి దేవాలయ ధ్వజస్తంభము మీద గమనోత్తిష్ఠభంగిమను గరుడ విగ్రహము కలదు. అది నిమిత్తముగ "నర్తనము గఱపి" అని కవి సంభావము. "తార్క్ష్య కేతనపతికి = జెండాపై గల (ధ్వజస్తంభముపై గల) గరుత్మంతునికి" అను వ్యాఖ్యానములోని ఫలితార్థము సరియైనది. "తార్క్ష్యకేతనపతికి" అను పాఠము సరియైనది కాదు. రాజనారాయణ స్వామి దేవాలయ ధ్వజస్తంభము మీది గరుడ విగ్రహము గమనోత్తిష్ఠంభంగిమను గమనించిన, "రాజనారాయణ స్వామి రమ్యభవన తార్క్ష్యకేతన గతికి నర్తనము గఱపి" అను కవిపాఠము కరతలామలకమగును.

శ్రీనాథుని కృతులందు పదములు, పాదములు, పద్యములు ఆవృత్తములగును. అదొక ఆవృత్త శిల్పము. ఈ శిల్పమునకు ఆద్యుడు తిక్కన అగ్రేసరుడు శ్రీనాథుడు. ఉత్తర రామాయణములోని పద్యములు మహాభారతము నందు అవృతములైనవి. శృంగారనైషధ, హరవిలాసములలోని పద, పాద, పద్యములు భీమేశ్వర పురాణము నందు; భీమేశ్వర పురాణములోని పద. పాద. పద్యములు కాశీఖండ, శివరాత్రి మాహాత్మ్యము లందు ఆవృత్తములైనవి. అవి వ్యాఖ్యానము నందు ఉదాహరింపఁబడినవి. అందు కొన్ని:

"తఱపి చంద్రాతపము నేల చఱచి కాయ" 46 ప. 2 ఆ. భీ.పు.

"తఱపి వెన్నెలలోని ధావళ్య మొక కొంత" 123 ప. 1ఆ. కా. ఖం.

ఇట "తఱపి" అను పదము గోమహిషాదులందు పాడి విషయమున వ్యవహరింపబడుచుండును. శ్రీనాథుడు 'చిక్కని' అను అర్థమున ప్రయోగించుచుండును" అను వ్యాఖ్యాన విశేషము గమనార్హమైనది.

"భాగ్య సౌభాగ్య వైభవ ప్రాభవములు" 203ప. 8ఆ. శృం.నై.

"భాగ్య సౌభాగ్య వైభవ ప్రాభవములు" 3ప. 1ఆ. హ.వి.

"భాగ్య సౌభాగ్య వైభవ ప్రాభవములు" 83ప. 3ఆ. భీ.పు.

"భాగ్య సౌభాగ్య వైభవ ప్రాభవములు" 187ప. 3 ఆ. కా. ఖం.

"ధరియింప నేర్చిరి దర్భ వెట్టెడు వ్రేళ్ల
  *లీల మాణిక్యాంగుళీయకములు*
కల్పింప నేర్చిరి గంగ మట్టియ మీఁదఁ
  *గస్తూరికా పుండ్రకములు నొసట*
సవరింప నేర్చిరి జన్నిదంబుల మ్రోలఁ
  *దారహారములు ముత్యాల సరులు*
చేర్పంగ నేర్చిరి శిఖల నెన్నడుములఁ
  *గమ్మని క్రొత్త చెంగల్వవిరులు*

*ధామముల వెండియును బైఁడి దడబడంగ*
*బ్రాహ్మణోత్తము లగ్రహారముల లోన*
*వేమ భూపాలుఁ డనుజన్ము వీరభద్రు*
*ధాత్రి యేలింప గౌతమీ తటము నందు." 41ప. 1ఆ. భీ.పు.*

*"ధరియింప నేర్చిరి దర్భ వెట్టెడు వ్రేళ్ల*
*లీల మాణిక్యాంగుళీయకములు*
*కల్పింప నేర్చిరి గంగమట్టియ మీఁదఁ*
*గస్తూరికా పుండ్రకములు నొసల*
*సవరింపనేర్చిరి జన్నిదంబుల మోలఁ*
*దారహారములు ముత్యాల సరులు*
*చేర్పంగ నేర్చిరి శిఖల నెన్నడుములఁ*
*గమ్మని క్రొత్త చెంగల్వ విరులు*

*ధామముల వెండి పసిఁడియుఁ దడబడంగ*
*బ్రాహ్మణోత్తము లగ్రహారముల యందు*
*వేమ భూపాలుఁ డనుజన్ము వీరభద్రు*
*ధాత్రిఁ బాలింప గౌతమీ తటములందు" 37ప. 1ఆ. కా. ఖం.*

ఇందు నొసఁట - నొసల: వెండియును బైఁడి-వెండి పసిఁడియు: లోన- అందు; నందు లందు అలతి భేదములు. అవి లేఖక మూలకములగును. పద్యము యథాతథము. ఆవృత్తము. "ఏలింప" అను పాఠమే అర్థవంతము.

అన్నిటి కంటె అగ్రేసరమైనది శ్రీనాథుని పూర్వకవితా చర్వణము.

*"పూర్వకవిముఖ్యవిరచితాపూర్వకావ్య*
*భావరససుధాచర్వణ ప్రౌఢతయును*
*గందళింపంగఁ గాశికాఖండ నైష*
*ధప్రముఖ వివిధ ప్రబంధము లొనర్చి"*

అని శ్రీనాథుని కూరిమిసేయు మఱది దగ్గుపల్లి దుగ్గన నాసికేతోపాఖ్యానము నందు అందిచ్చిన సమాచారము. పూర్వకవిముఖ్యుల అపూర్వ కావ్య భావరససుధల చర్వణము పూర్వకవితాచర్వణము. ఇది సంస్కృతాంధ్రకవులకు సర్వసాధారణము. పూర్వకవిత్వము నవ్యకవిత్వమునకు మూలనిధి. దీని గుఱించి రాజశేఖరుని కావ్య మీమాంస యందు ప్రత్యేక మొక ప్రకరణము కలదు. అంతేకాదు. తెలుగు కవుల పూర్వ కవిస్తుతులు కేవలము గౌరవ సూచకములే కాదు; తత్కవితాచర్వణమునకు భంగ్యంతర కృతజ్ఞతా ప్రకటనములు కూడ. అందు ఉపలక్షణ సంప్రదాయమును అంతర్గతము. శ్రీనాథుడు భీమేశ్వర పురాణము నందు స్తుతించిన సంస్కృత ప్రాకృతాంధ్రకవులు 1. వాల్మీకి 2. వ్యాసుడు 3. కాళిదాసు 4. భట్టబాణుడు

5. ప్రవరసేనుడు 6. హర్షుడు 7. భాసుడు 8. శివభద్రుడు 9. సౌమిల్లుడు 10. భల్లుడు 11. మాఘుడు 12. భారవి. 13. బిల్హణుడు. 14. మల్హణుడు 15. భట్టి 16. చిత్తపుడు. 17. దండి 18. నన్నయ 19. తిక్కన. సంస్కృత ప్రాకృత కవుల సంగ్రహ పరిచయము దక్షిణ కాశికా వ్యాఖ్యానము నందు కలదు. చిత్తపుడు శాసనకవి కూడ. శృంగార నైషధము నందు స్తుతించిన ఇతర పూర్వకవులు 20. మయూరుడు 21. రాజశేఖరుడు 22. ఎఱ్ఱన. శివరాత్రి మాహాత్మ్యము నందు స్తుతించిన ఇతర పూర్వకవులు 23. సుబంధుడు 24. సోముడు 25. భవభూతి. ఉపలక్షణ సంప్రదాయమున 26. భట్టమురారి 27. వామన భట్టబాణుడు. ఇదొక తారాతోరణము. ఇంకను కలరు. అందఱు పూర్వకవుల అపూర్వ భావరససుధల చర్వణము శ్రీనాథుని పూర్వకవితా చర్వణము.

శ్రీనాథుని పూర్వకవితా చర్వణ పురస్కారములు అనేకము ప్రకటిత పూర్వములు. అవి మాత్రమే గాక, తదభ్యధిక విశేషములును దక్షిణ కాశికా వ్యాఖ్యానము నందు కలవు. అందు సుబంధు కవితా చర్వణములు అత్యపూర్వము. సుబంధుడు సుప్రసిద్ధ సంస్కృతకవి. అతని కృతి వాసవదత్తా. గద్య కావ్యము. మహాప్రౌఢము.

"ప్రత్యక్షర శ్లేషమయ ప్రపఞ్చ విన్యాస వైదగ్ధ్య నిధిం ప్రబన్ధమ్
సరస్వతీ దత్తవరప్రసాద శ్చక్రే సుబన్ధు స్సుజనైక బన్ధుః.

అని కవికంఠోక్తి. వాసవదత్తాగద్యకావ్యము బృహత్కథలోని వాసవదత్త కథకు స్వతంత్రానుసరణము. ప్రపంచీకరణమును. వక్కలంక వీరభద్రుని వాసవదత్తాపరిణయము (1690 ప్రాంతము) సుబంధుని వాసవదత్తా గద్యకావ్యమునకు స్వతంత్రానుసరణమైన పద్యకావ్యము. సుబంధుడు సరస్వతీ దత్తవరప్రసాదుడు. శ్రీనాథుడు బ్రాహ్మీదత్త వరప్రసాదుడు. సరస్వతీ దత్తవరప్రసాదుని కవిత్వము బ్రాహ్మీదత్త వరప్రసాదునికి సర్వస్వామ్య సంకలితము.

"కనకదర్పణ ఇవ ప్రతీచీ విలాసిన్యాః!"
అను సుబంధుని వాసవదత్తలోని వాక్యమునకు (పు. 185)
*"చరమాచల శిఖరంబునఁ*
*దిరమై యొక్కింత తడవు దినకరుఁడొప్పెన్*
*వరుణుని శుద్ధాంతంబున*
*నరవిందాక్షులకు మించుటద్దంబగుచున్." 27 ప. ఆ.*

అను శ్రీనాథుని భీమేశ్వర పురాణములోని పద్యము భావానుసరణమని ఈ వ్యాఖ్యానము నందే కలదు.

*"అనంతరం ...... శ్వేతాతపత్ర మివ మకరకేతోః*
*...... స్ఫాటికలింగ మివ గగనమహాతాపసస్య ......*
*పుండరీక మివ గగనగామి గంగాయాః ...... భగవా*
*నుడుపతి రుజ్జగామ."*

అను సుబంధుని వాసవ దత్తలోని అంశములకు (పుటలు 214-216)

"కాదు కా దుదయాద్రి కనకకూటం బిది
డంబైన పానవట్టంబు గాని
కాదు కా దిది సుధాకరపూర్ణబింబంబు
కాశ్మీర శంభులింగంబు గాని
కాదు కా దుదయరాగప్రకాశంబిది
నవకుంకుమాలేపనంబు గాని
కాదు కాదిది కళంకచ్ఛటారింఛోళి
పూజచేసిన కల్వపువ్వు గాని

యనఁగ సప్తార్ణవములు మిన్నంది కొనఁగఁ
జంద్ర కాంతోపలంబులు జాలువాఱ
సనమశరుసార్వభౌము ముత్యాల గొడుగు
విధుఁడు విశ్వంబు వెన్నెల వెల్లిఁ దేల్చె" 42 ప. 2 ఆ.

అను శ్రీనాథుని భీమేశ్వర పురాణములోని పద్యము భావానుసరణమని ఈ వ్యాఖ్యానము నందే కలదు.

కాశ్మీర శంభులింగము స్ఫాటికలింగమే. పుండరీకమన తెల్లదామర. కల్వపువ్వు కాదు. "పుండరీకం సితాంభోజమ్" అని అమరము. అదికూడ పూజ చేసినది కాదు. ఆకాశగంగలోనిది. మకరకేతువు శ్వేతాత పత్రము అసమశరసార్వభౌముని ముత్యాల గొడుగే. సుబంధుని వర్ణనము నందు చంద్ర సాదృశ్యమే కలదు. పానవట్టము లేదు. నవకుంకుమా లేపనము లేదు. శివలింగార్చనము లేదు. అది శ్రీనాథుని పద్యము నందు కలదు. ఇది శ్రీనాథుని ఈశ్వరార్చన కళాశీల కౌశలమే.

"ప్రాచీకుమారీలలాటతలఘటిత కుంకుమ తిలక బిందౌ"
"కనకదర్పణ ఇవ ప్రాచీ విలాసిన్యాః"
అను సుబంధుని వాసవ దత్తలోని పంక్తులకు (పుటలు 273, 272.)
"ప్రథమ సంధ్యాంగనాఫాలతలంబునఁ
జెలువారు సిందూర తిలక మనఁగఁ
గై సేసి పురుహూతు గారాపు టిల్లాలు
పట్టిన రత్నదర్పణ మనంగ" 49ప. 2ఆ.

అను శ్రీనాథుని భీమేశ్వర పురాణములోని సీసపాదములు తెనుగు సేతలని ఈ వ్యాఖ్యానము నందే కలదు. సుబంధుని కనకదర్పణము ఒక పద్యము నందు మించుటద్దము మఱొక పద్యము నందు రత్నదర్పణము.

ఇంకను శంకరాచార్యుల శివానందలహరిలోని శ్లోకమునకు (111 ప. 1 ఆ), భారవి కిరాతార్జునీయములోని శ్లోకములకు (35, 39 ప. 2 ఆ) శ్రీనాథుని కవితాచర్వణములు ఈ వ్యాఖ్యానము నందు కలవు.

ఇట్లు బహు విశేషములు భాసిల్లునది దక్షిణ కాశికా వ్యాఖ్యానము. ఇది భీమేశ్వర పురాణమునకు వ్యాఖ్యానము లేని కొఱతను తీర్చునది మాత్రమే కాదు; క్రొత్త వెలుగులను సమకూర్చునదికూడ. అంతే కాదు. దక్షిణ కాశికా వ్యాఖ్యానము కావ్యరసపిపాసువులకు అమృతకలశము. సారస్వత జిజ్ఞాసువులకు సర్వస్వసదృశము.

కాశికావృత్తి వ్యాకరణ ప్రకాశిక వలె దక్షిణ కాశికా వ్యాఖ్యానము కావ్య ప్రకాశిక. ఇంత సమగ్రమైన, సమర్థమైన వ్యాఖ్యానమును సంతరించిన వ్యాఖ్యాతృత్రయమునకు అభినందన చందన చర్చ.

**శ్రీనాథాక్షర మాధురీ మహిమయో, శ్రీ భీమనాథాలయ**
**ధ్యాన, స్థానిక సంప్రదాయ మనన, వ్యాసంగ మాహాత్మ్యమో**
**ఔనే దక్షిణ కాశికాఖ్య కవితా వ్యాఖ్యాన వైదగ్ధి! ల**
**క్ష్మీ నారాయణ ముఖ్య సంగ్రథనలక్ష్యీభూతసంకేతమై**

**-ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి,**
ఎం.ఏ., పిహెచ్.డి., డి.లిట్.,
విశ్రాంతాచార్యులు, తెలుగు శాఖ,
ఆంధ్ర విశ్వకళాపరిషత్, వాల్తేరు.

శ్రీరస్తు
శ్రీ మహా గణాధిపతయే నమః
శ్రీ మాణిక్యాంబా సమేత శ్రీ భీమేశ్వరస్వామినే నమః

# శ్రీ భీమేశ్వర పురాణము

## ప్రథమాశ్వాసము

### దక్షిణకాశికా వ్యాఖ్యానము

ఉ॥ శ్రీ స్తన గంధసార పరిషేక సమంచిత సాయక ప్రయో
గాస్త మహాపురత్రయుఁడహార్య ధనుర్ధరుఁడర్క కోటి దీ
ప్తి స్తవనీయ విగ్రహుఁడు భీమయ దేవుఁడు దక్షవాటికా
వాస్తుఁడు ప్రోచుఁగావుత ధ్రువంబుగ దేవయ యన్నధీమణిన్. 1

అర్థము :- శ్రీ=లక్ష్మీదేవి యొక్క, స్తన=పాలిండ్ల యందలి, గంధసార=చందనము యొక్క, పరిషేక=తడుపుతో, సమంచిత=బాగుగా అలంకరింపబడిన, సాయక=బాణమును, ప్రయోగ=ప్రయోగించుట చేత, అస్త=నశించిన, మహాపురత్రయుఁడు=గొప్పవియగు త్రిపురములు కలవాడు, అహార్య ధనుర్ధరుఁడు=మేరు పర్వతమును ధనుస్సుగ ధరించినవాడు, అర్క కోటి దీప్తి=కోటి సూర్యుల కాంతి చేత, స్తవనీయ=స్తుతింపదగిన, విగ్రహుఁడు=రూపము కలవాడు; దక్షవాటికా=దక్షారామము; వాస్తుఁడు=నివాసముగా కలవాడు; భీమయ దేవుఁడు= భీమేశ్వర స్వామి, ధ్రువంబుగన్=నిశ్చయముగా, దేవయ యన్న ధీమణిన్=దేవయ కుమారుడైన అన్న మంత్రియను ధీశాలిని, ప్రోచుఁగావుతన్=కాపాడునుగాక.

భావము :- లక్ష్మీదేవి స్తనముల పైగల గంధపు పూత హత్తుకొన్న వక్షము కలవాడు మహావిష్ణువు. అట్టి శ్రీ మహావిష్ణువును బాణముగ చేసి, మేరు పర్వతమును ధనుస్సుగ చేసికొని, త్రిపురములను దహించిన వాడును, కోటి సూర్యుల కాంతితో వెలుగొందు దివ్యమైన విగ్రహము కలవాడును, దక్షారామ నివాసియునైన శ్రీ భీమేశ్వర స్వామి ఈ భీమేశ్వర పురాణమునకు కృతిపతియైన దేవయ మంత్రి కుమారుడైన అన్నయ మంత్రిని రక్షించుగాక.

విశేషము : శ్రీకారము :- మంగళ ప్రదమైన శ్రీకారముతో గ్రంథమును ప్రారంభించు సంప్రదాయము పాటింపబడినది. అప్పకవి తన అప్పకవీయ గ్రంథము ఆశ్వా-2, 354 నుండి 359 వరకు గల గద్య పద్యములలో శ్రీకార మహత్త్వమును కొనియాడెను.

వేదములకు ఓంకారము ఆదియైనట్లు శ్రీకారము గ్రంథములకు ఆదియైనది. కావున కవులు దానినే కృత్యాది యందు నిల్పుదురు. శ్రీకారములో శకారము, రేఫము, ఈకారమును కలవు. శకారమునకు ఈకారమునకు లక్ష్మీదేవి అధిదేవత. రేఫము అగ్నిబీజము. అయినను "శ్రియమిచ్ఛేద్ధుతాశనాత్" అని పురాణవచనము గావున అగ్నియు లక్ష్మీప్రదుడే. కావున దేవతాత్రయము శుభప్రదము.

ఉత్పలమాల :- ఉత్పలమనగా పద్మము. కలువ యని రెండర్థములును కలవు. కావున శ్రీనాథుడు ఉత్పలమాలతో ప్రథమ పద్యమున ప్రధానముగ శివుని, తదస్త్రరూపమున కేశవుని స్తుతించెను. ఉత్పలమాల భగణము చూ.. అప్పకవీ.. 4-73.

గీ॥ "ఫలము ధన హేమ మణి వస్త్ర పశు తనూజ
పరిజనాశ్వాది సంప్రాప్తి భగణమునకు" అప్పకవీయము 4-83

పరమశివుడు మేరు పర్వతమును ధనుస్సుగ చేసికొని, శ్రీమహావిష్ణువును బాణముగ చేసికొని, త్రిపురములను త్రిపురాసురులను సంహరించిన గాథ పురాణ ప్రసిద్ధము. అంతేకాదు. ఈ గ్రంథమునందు కూడ చతుర్థాశ్వాసమున త్రిపురాసుర సంహారగాథ వచ్చును. గ్రంథ విషయ సూచనము కూడ గ్రంథ ప్రథమ పద్యమున చేయుట ఒక ఔచిత్యవంతమైన చమత్కారము. అర్థత శ్శబ్దతోఽపి మనాక్కావ్యార్థ సూచనమ్. అర్థముతోగాని శబ్దముతోగాని కొంచెము కావ్యార్థమును సూచింపవలెను అని నాందీ విషయమున ఆలంకారికుల మాట. పురాణము నందు కూడ ప్రథమ పద్యమున నాందీ లక్షణమును చొప్పించుట శ్రీనాథ మహాకవి చాతుర్యము.

## ఇష్టదేవతా ప్రార్థనము

ఉ॥ ఏనిక మోము తాల్పెలుక నెక్కిన రావుతు రాచవారు సే
నాని యనుంగుఁబెద్దన వినాయకదేవుఁడు కర్ణతాళ ఝుం
ఝానిల తాడనంబున నిరంతరమున్ బ్రబలాంతరాయ సం
తాన మహాఘనాఘన కదంబములన్ విదళించుఁగావుతన్. 2

అర్థము :- ఏనిక మోముతాల్పు=ఏనుగు ముఖమును ధరించిన వాడు, ఎలుకన్=ఎలుకను; ఎక్కిన=ఎక్కినటువంటి; రావుతు=రౌతులకు; రాచవారు=ప్రభువైన

వాడును; సేనాని= కుమారస్వామి యొక్క, అనుంగు+పెద్దన=ప్రేమాస్పదుడైన పెద్దన్నయు అగు, వినాయక దేవుఁడు=వినాయకస్వామి, కర్ణతాళ=తాటియాకుల వంటి చెవులయొక్క, ఝుంఝూనిల=పెనువానగాలి, తాడనంబునన్=తాకిడిచేత, ప్రబల=మిక్కిలి శక్తిమంతములైన, అంతరాయ సంతాన=విఘ్నముల సమూహమనెడు, మహా=గొప్ప, ఘనాఘన=మేఘముల యొక్క, కదంబములన్=గుంపులను, నిరంతరమున్=ఎల్లపుడును, విదళించుఁగావుతన్= నశింపజేయును గాక.

భావము :- ఏనుగు ముఖము కలవాడును, ఎలుక వాహనముగ కలవాడును, దేవతలకు సేనానియైన కుమారస్వామికి పెద్దన్నయునైన వినాయకస్వామి తాటియాకుల వంటి చెవులను విసరుటచే కల్గెడి పెనుగాలిచేత శక్తిమంతములైన విఘ్నముల సమూహములనెడి మేఘముల గుంపులను నిరంతరము పారద్రోలును గాక.

విశేషము :- ఎట్టి అంతరాయములు కలుగకుండుటకై కవి గ్రంథ ప్రారంభమున విఘ్నపతిని స్తుతించెను. కార్యారంభే గణేశశ్చ పూజనీయః ప్రయత్నతః, సర్వే విఘ్నా శ్శమం యాంతి గణేశస్తవ పారతః - అని కదా సంప్రదాయము.

రాచవారు :- శ్రీనాథ మహాకవి కిష్టములైన పదబంధములలోనిది యొకటి. గౌరవ వాచకముగ "రాచవారు" అనుపదబంధము శ్రీనాథుని కృతులలో "వడకు గుబ్బలి రాచవారు" (భీమ. 3-184), "వలరాచ రాచవారు" (శృ.నై. - 6-65) - మొదలగు విధములుగ కన్పించును. "'రావుతు' సంస్కృత 'రాజపుత్ర' శబ్దం మూలమూర్తిగా, మరాఠీ 'రావుత్త' సమీప మాతృకగా, అశ్వారోహకుడన్న అర్థంలో ప్రయుక్తమైంది. అర్వాచీన యుగంలో ఇదే 'రౌతు'గా తెలుగున కన్పిస్తుంది" - ఆచార్య తూమాటి దొణప్ప - శ్రీనాథసాహితిలో అన్యదేశ్య పదాలు.

**ఉ॥ వాలిక మోము మత్తవన బర్హి కిశోరకలాస్యలీలఁ బై**
**వాలిచి పచ్చ కప్పురపు వాసనతోడి ముఖారవింద తాం**
**బూలపు మోవి మోవిపయి మోపుచు రాధకునిచ్చు ధూర్త గో**
**పాలుఁడు ప్రోచుఁగావుత మపార కృపామతి మంత్రి యన్ననిన్. 3**

అర్థము :- వాలిక మోము=కోలముఖమును, మత్త=మదించిన, వనబర్హి కిశోరక=అడవి నెమలి పిల్ల యొక్క, లాస్యలీలన్=హావభావములతో ప్రేమను జూపు నృత్య భంగిమతో, పైవాలిచి=పైన ఆనించి, పచ్చ కప్పురపు వాసన తోడి=పచ్చ కర్పూరపు వాసనతో కూడిన, ముఖారవింద=ముఖపద్మము యొక్క, తాంబూలపు మోవి=తాంబూలముతో కూడిన పెదవిని, మోవిపయి మోపుచున్=(రాధాదేవి) పెదవిపై చేర్చుచు, రాధకున్=రాధకు, ఇచ్చు= ఇచ్చునట్టి, ధూర్త గోపాలుఁడు=కొంటెకృష్ణుడు, అపార కృపామతిన్=అపరిమితమైన దయగల మనస్సుతో, మంత్రి యన్ననిన్=అన్నయ మంత్రిని, ప్రోచుఁగావుతన్=రక్షించును గాక.

భావము :- మదించిన అడవి నెమలిపిల్ల లాస్యవిన్యాసము ననుకరించుచు తన కోల ముఖమును రాధ ముఖముపై నుంచి పచ్చకర్పూరపు వాసనలు గుబాళించుచున్న తాంబూలముతో తన పెదవిని (ముద్దుగొనుటకై) రాధకిచ్చునట్టి కొంటెకృష్ణుడు అంతులేని దయగలవాడై కృతిపతియైన అన్నయ మంత్రిని రక్షించుగాక.

విశేషము :- తెలుగు సాహిత్యమునందు రాధాకృష్ణుల శృంగారము మొదటగ ఈ పద్యమునందే కన్పించుచున్నది. రాధాకృష్ణుల శృంగారమును తెలుగు సాహిత్యమున ప్రవేశపెట్టిన ఘనత శ్రీనాథ మహాకవిది.

సీ॥ రాజీవ భవుని గారాపుఁ బట్టపు దేవి
　　యంచ బాబానెక్కు నలరుఁ బోణి
పసిఁడి కిన్నెర వీణెఁ బలికించు నెలనాఁగ
　　పదునాల్గు విద్యల పట్టుఁగొమ్మ
యీరేడు భువనంబు లేలు సంపద చేడె
　　మొలక చందురుఁదాల్పు ముద్దరాలు
వెలిచాయ కొదమ రాచిలుక నెచ్చెలికత్తె
　　ప్రణవ పీఠిక నుండు పద్మగంధి

తే॥ మందరాచల కందరా మథ్యమాన
దుగ్ధ పాథోధి లహరికా ధూర్తయైన
లలిత సాహిత్య సౌహిత్య లక్ష్మి నొసఁగు
వరదయై మాకు వినత గీర్వాణి వాణి 4

అర్థము :- రాజీవ భవుని=పద్మమునందు పుట్టిన బ్రహ్మయొక్క, గారాము+పట్టము+దేవి=ప్రియమైన పట్టపురాణి, అంచబాబాను=హంసవాహనమును, ఎక్కున్=ఎక్కునట్టి, అలరుఁబోణి=పూవు వంటి శరీరము కలది;

పసిడి కిన్నెర వీణన్=బంగారపు కిన్నెర వీణను, పలికించున్=వాయించునట్టి, ఎలనాఁగ=నవ యువతి, పదునాల్గు విద్యల=పదునాలుగు విద్యలకును, పట్టుఁగొమ్మ=ఆధారమైనట్టిదియు;

ఈరు+ఏడు=(2×7) పదునాలుగు, భువనంబులు=లోకములను, ఏలు=పాలించు, సంపద చేడె=సౌభాగ్యముకల స్త్రీ, మొలకచందురున్=చంద్రరేఖను, తాల్చు=ధరించునట్టి, ముద్దరాలు=సుందరియు;

వెలిచాయ=తెల్లని వన్నెగల, కొదమ రాచిలుక=చిన్నరామ చిలుక, నెచ్చెలికత్తె=ప్రియసఖిగా కలది; ప్రణవ పీఠికన్=ఓంకారమనెడి పీఠమునందు, ఉండు=ఉండునట్టి, పద్మగంధి=పద్మము యొక్క పరిమళము వంటి పరిమళము గలదియు, వినత గీర్వాణి=మ్రొక్కుచున్న దేవతా స్త్రీలు కలదియైన, వాణి=సరస్వతి, మాకు=మాకు, వరదయై=వరముల నిచ్చునదై; మందర+అచల=మందర పర్వతము యొక్క, కందరా=కొండచరియల చేత, మథ్యమాన=మథింపబడుచున్న, దుగ్ధపాథోధి=పాలసముద్రము యొక్క, లహరికా=తరంగములను; ధూర్త+ఐన=పీడించునదగు, లలిత=సుందరమైన, సాహిత్య=సాహిత్యము యొక్క, సౌహిత్య లక్ష్మిన్= సంపూర్ణ సంపదను, ఒసఁగున్=ఇచ్చుగాక.

భావము :- బ్రహ్మదేవుని పట్టపురాణి, హంస వాహనముగ గల పూబోణి, బంగరు వీణను వాయించు రమణీమణి, పదునాల్గు విద్యలకును ఆధారమైనది, పదునాలుగు లోకములను పాలించు మహారాజ్ఞి, చంద్రరేఖను సిగపూవుగ ధరించిన సుందరి, తెల్లని చిన్నారి రామచిలుకను ఇష్టసఖిగ కలది, ఓంకారమనెడి పీఠమునందు వసించు పద్మగంధి, దేవకాంతల మ్రొక్కులందుకొనునట్టిదియైన సరస్వతీదేవి - పాలసముద్రము యొక్క అలలను సైతము పీడింపగల సాహిత్య సౌహిత్య లక్ష్మిని మా కనుగ్రహించుగాక.

విశేషము :- పదునాల్గు విద్యలు : వేదములు నాలుగు, 5. శిక్ష, 6. వ్యాకరణము, 7. ఛందస్సు, 8. నిరుక్తము, 9. జ్యోతిషము, 10. కల్పము, 11. మీమాంస, 12. న్యాయము, 13. పురాణము, 14. ధర్మశాస్త్రము.

ఈరేడు భువనములు :- పదునాలుగు లోకములివి.

1. భూలోకము, 2. భువర్లోకము, 3. సువర్లోకము, 4. మహర్లోకము, 5. జనలోకము, 6. తపోలోకము, 7. సత్యలోకము - ఈ యేడును ఊర్ధ్వలోకములు.

1. అతలము, 2. వితలము, 3. సుతలము, 4. రసాతలము, 5. మహాతలము, 6. తలాతలము, 7. పాతాళము - ఈ యేడును అధోలోకములు - మొత్తము పదునాల్గు.

సరస్వతీదేవి వీణపేరు "కచ్ఛపి".

"విశ్వావసోస్తు బృహతీ తుంబురోస్తు కళావతీ
మహతీ నారదస్యస్యాత్ సరస్వత్యాస్తు కచ్ఛపీ        వైజయంతి నిఘంటువు.

విశ్వావసుడు, తుంబురుడు, నారదుడు, సరస్వతి అనువారల నలువురి వీణలకే బృహతి, కళావతి, మహతి, కచ్ఛపి అను పేర్లు కలవు.

సాహిత్యము :- కావ్య నాటక అలంకారాది గ్రంథముల అర్థజ్ఞానము.

సౌహిత్యము :- పరిపూర్తియను (లక్ష్మి)

## పురాతన కవీంద్ర గుణ కీర్తనము

శా॥ శ్లోకంబుల్ శతకోటిఁ గాండములుగా సూత్రించి రామాయణం
బేకైకాక్షర మెల్ల పాపముల మాయింపంగ నిర్మించి సు
శ్లోకుండైన పురాణ సంయమి వరున్ జూతున్మనోవీథి వా
ల్మీకిన్ బ్రహ్మపదావతీర్ణ కవితా లీలావతీ వల్లభున్. 5

అర్థము :- శ్లోకంబుల్ శతకోటిన్=అసంఖ్యాకమైన శ్లోకములను, కాండములుగా= కాండము(భాగము)లుగా, సూత్రించి=కూర్చి, ఏక+ఏక+అక్షర=ఒక్కొక్క యక్షరము, ఎల్లపాపములన్ =అన్ని పాపములను, మాయింపంగన్=పోగొట్టుటకై, రామాయణంబు= రామాయణ గ్రంథమును, నిర్మించి=రచించి, సుశ్లోకుండైన=మంచి కీర్తిని పొందిన వాడైన, పురాణ సంయమి వరున్=ప్రాచీన మహర్షి శ్రేష్ఠుడైన; బ్రహ్మ=బ్రహ్మదేవుని, పద=మాటచేత, అవతీర్ణ=అవతరించిన, కవితా లీలావతీ=కవిత్వ మనెడి విలాసినికి, వల్లభున్=భర్తయైన, వాల్మీకిన్=వాల్మీకిని, మనోవీథిన్=మానస వీథి యందు, చూతున్=తలంతును.

భావము :- అసంఖ్యాకములైన శ్లోకములను కాండములుగా కూర్చి ప్రత్యక్షరము సకల పాపహరమగునట్లుగా రామాయణ మహాకావ్యమును రచించి మంచి కీర్తిని పొందినవాడును, ప్రాచీన మహర్షి సత్తముడు, బ్రహ్మదేవుని యనుగ్రహముచేత కవితా విలాసినికి ప్రియపతియైన వాల్మీకిని నా మనసున తలంతును.

విశేషము :- శ్లోకంబుల్ శతకోటి : శతకోటియనగా నూరుకోట్లు అని ప్రాచీన ఆనంద రామాయణాది గ్రంథములందు చెప్పబడినది.

శతమనగా మూడవ స్థానము, కోటియనగా ఎనిమిదవ స్థానము. కనుక 3×8=24 వేల సంఖ్యయని కొందరు పెద్దలు చెప్పుచుండిరి. ప్రస్తుతము వాల్మీకి రామాయణము 24 వేల శ్లోకములు కల్గియున్నదగుటచేత ఈ అన్వయము సరిపడుచున్నది.

బ్రహ్మపదావతీర్ణ : బ్రహ్మదేవుని ఆజ్ఞానుసారమే వాల్మీకి ముని రామాయణమును రచించినట్లు బాలకాండమునందు కలదు.

"మచ్ఛన్దాదేవ తే బ్రహ్మన్ ప్రవృత్తేయం సరస్వతీ
రామస్య చరితం సర్వం కురు త్వమృషిసత్తమ." బాల-ద్వితీయ-31.

ఈ పద్యమున కాధారమైన శ్లోకమిది.

"చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరం
ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతక నాశనమ్"

"చతుర్వింశత్సహస్రాణి శ్లోకానాముక్తవాన్ ఋషిః
తథాసర్గ శతాన్ పఞ్చ షట్కాండాని తథోత్తరమ్". బాల-చతుర్థ-2 శ్లో.

అని వాల్మీకి ముని రామాయణమును ఏడు కాండలలో ఐదువందల సర్గలలో ఇరువది నాల్గు వేల శ్లోకములలో రచించెనని కలదు.

మ॥ తలతున్ భారత సంహితాధ్యయన విద్యానిర్మిత ప్రక్రియా
నలిన ప్రోద్భవునిన్ గళింద తనయాంతర్వేది పుణ్యస్థలీ
పులినాభోగకృతావతారు నపరాంభోజాక్షు నక్షీణ ని
ర్మల సాహిత్య కళా సమృద్ధికయి పారాశర్యమౌనీశ్వరున్. 6

**అర్థము** :- భారత సంహితా=భారత సంకలనమను, అధ్యయన విద్యా=వేద విద్య యొక్క, నిర్మితి ప్రక్రియా=రచనా విధానమునకు, నలిన ప్రోద్భవునిన్=బ్రహ్మయైన వానిని, కళింద తనయా=యమునానది యొక్క, అంతర్వేది=ద్వీపము యొక్క, పుణ్యస్థలీ=పవిత్ర ప్రదేశమైన, పులినాభోగ=విశాలమగు ఇసుక తిన్నెయందు, కృతావతారున్=జన్మమునొందిన వానిని, అపర+అంభోజాక్షున్=రెండవ విష్ణువైన వానిని (విష్ణుస్వరూపుని), పారాశర్య=పరాశరుని కుమారుడైన వ్యాసుడను, మౌనీశ్వరున్=ముని శ్రేష్ఠుని; అక్షీణ=తక్కువకాని, నిర్మల=పరిశుద్ధమైన, సాహిత్యకళా=సాహితీకళ(విద్య) యొక్క, సమృద్ధికయి=పరిపుష్టికై, తలతున్=స్మరించెదను.

**భావము** :- పంచమ వేదముగా ప్రఖ్యాతమైన భారతము యొక్క రచనా ప్రక్రియకు సృష్టికర్త(బ్రహ్మ)యైన వాడును, యమునా నది మధ్యనున్న ద్వీపము నందలి పవిత్ర స్థలమైన ఇసుక తిన్నెయందు జన్మించినవాడును, విష్ణుస్వరూపుడును, పరాశర మహర్షికి కుమారుడునునైన వ్యాస మహర్షిని అనంత సాహితీ కళా సమృద్ధికై ధ్యానించెదను.

**విశేషము** :- ఈ పద్యమును చదువగనే గుర్తుకు వచ్చెడి శ్లోకము.

"అచతుర్వదనో బ్రహ్మ ద్విబాహు రపరో హరిః
అఫాలలోచన శ్శంభుః భగవాన్ బాదరాయణః -

సీ॥ ప్రణుతింతు రసభావ భావనా మహనీయ
కవితా సముల్లాసుఁగాళిదాసు
గణుతింతు నిరవద్య గద్య పద్య నిబంధ
పరితోషిత స్థాణు భట్టబాణు

భజియింతు సాహిత్య పదవీ మహారాజ్య
భద్రాసనాసీనుఁ బ్రవరసేను
వర్ణింతు నంభోధి వార్వీచి గంభీర
తాసార వాక్సముత్కర్షు హర్షు

తే॥ భాస శివభద్ర సౌమిల్ల భల్లులకును
మాఘ భారవి బిల్హణ మల్హణులకు
భట్టి చిత్తప కవి దండి పండితులకుఁ
గీలు కొలుపుదు నొసలిపైఁగేలు దోయి. 7

అర్థము :- రసభావ=రసభావములను, భావనా=కలుగజేయుట(పోషించుట) యందు, మహనీయ=గొప్పదైన, కవితా=కవిత యొక్క, సముల్లాసున్=అతిశయమగు దీప్తికల వాడైన, కాళిదాసున్=కాళిదాసును, ప్రణుతింతున్=కొనియాడుదును;

నిరవద్య=దోషము లేని, గద్యపద్య నిబంధ=గద్యపద్యముల రచన చేత, పరితోషిత= సంతోషపెట్టబడిన, స్థాణున్=ఈశ్వరుడు కల, భట్టబాణున్=బాణభట్టును, గణుతింతున్= పొగడుదును;

సాహిత్య పదవీ=సాహిత్య పదవి యనెడి, మహారాజ్య=గొప్ప రాజ్యము యొక్క, భద్ర+ఆసన+ఆసీనున్=సింహాసనమును అధిష్ఠించిన, ప్రవరసేనున్=ప్రవరసేనుని, భజియింతున్=కొలిచెదను;

అంభోధి వార్+వీచి=సముద్రపు నీటి తరగల వలె, గంభీరతా=గాంభీర్యమును, సార=శ్రేష్ఠతగల, వాక్+సముత్కర్షున్=పల్కుల గొప్పదనము గల, హర్షున్= శ్రీహర్షుని, వర్ణింతున్=వర్ణించెదను;

భాస శివభద్ర సౌమిల్ల భల్లులకును=భాసుడు, శివభద్రుడు, సౌమిల్లకుడు, భల్లుడు అను కవులకును, మాఘ భారవి బిల్హణ మల్హణులకు=మాఘుడు, భారవి, బిల్హణుడు, మల్హణుడు అను కవులకును; భట్టి, చిత్తప కవి, దండి పండితులకు=భట్టి, చిత్తప కవి, దండి యను పండితులకును; నొసలిపై=నుదుటిపైన, కేలుదోయిన్=రెండు చేతులను, కీలు కొల్పుదు=జోడించెదను.

భావము :- రస భావములను పోషించుట యందు మహనీయమైన కవితా విలాసముగల కాళిదాసును కొనియాడెదను. నిర్దుష్టమైన గద్య పద్య రచనచేత ఈశ్వరునే సంతోష పరచిన బాణభట్టును పొగడెదను. సాహిత్యమనెడి మహా సామ్రాజ్య సింహాసనమును అధిష్ఠించిన ప్రవరసేనుని కొలిచెదను. సముద్ర తరంగముల వలె గాంభీర్యము,

సారవంతములునైన పల్కుల గొప్పదనముగల శ్రీహర్షుని కొనియాడెదను. భాసుడు, శివభద్రుడు, సౌమిల్లుడు, భల్లుడు, మాఘుడు, భారవి, బిల్హణుడు, మల్హణుడు అను కవులకును, భట్టి, చిత్రపకవి, దండి యను పండితులకును చేతులు జోడించి నమస్కరించెదను.

**విశేషము :-** 1. కాళిదాసు :- రఘువంశ కుమారసంభవ మేఘసందేశములను శ్రవ్య కావ్యములను; మాళవికాగ్నిమిత్రము, విక్రమోర్వశీయము, అభిజ్ఞాన శాకుంతలమనెడి నాటకములను మాత్రమేగాక మరెన్నిటినో సంస్కృత భాషయందు రచించిన మహాకవి. ఈయన క్రీ.పూ. ఒకటవ శతాబ్దివాడు.

2. బాణభట్టు :- హర్ష చరితము, కాదంబరి యను గద్య కావ్యములను, చండీ శతకమును రచించెను. ఈయన క్రీ.శ. 590-650 ప్రాంతము వాడు.

3. ప్రవరసేనుడు :- మహారాష్ట్రీ ప్రాకృత భాషయందు సేతుబంధమను పద్యకావ్యమును రచించెను. ఈయన క్రీ.శ. 415 ప్రాంతము వాడు.

4. హర్షుడు :- నైషధీయ చరితమను కావ్యమును, ఖండన ఖండ ఖాద్యమను శాస్త్ర గ్రంథమును, నవసాహసాంక చరిత్రమను చంపూ కావ్యమును, ఇంకను అనేక కృతులను రచించెను. ఈయన క్రీ.శ. 1130-1175 మధ్యనున్నవాడు. నాగానంద నాటక కర్త హర్షదేవుడు రాజకవి.

5. భాసుడు :- రూపక కర్తలలో ఆద్యుడు. రామకథాశ్రితములైన 'ప్రతిమ' 'అభిషేక' నాటకములను; మహాభారతకథాశ్రితములైన పంచరాత్రము, మధ్యమవ్యాయోగము, దూత ఘటోత్కచము, కర్ణభారము, దూతవాక్యము, ఊరుభంగము అను నాటకములను; భాగవతకథాశ్రితమైన బాలచరితము అను నాటకమును, లోకకథాశ్రితములైన దరిద్ర చారుదత్త అవిమారకాది పదమూడు నాటకములను వ్రాసెను. ఈయన క్రీ.పూ. 5-6 శతాబ్దుల యందున్నవాడు.

6. శివభద్రుడు :- ఈ కవి ఏమి వ్రాసెనో స్పష్టముగా తెలియుట లేదు. శివభద్ర కావ్యము ఇతడు వ్రాసినదని పీటర్సన్ అభిప్రాయము. Sanskrit Manuscripts Vol - IV. ఈ శివభద్రుడు వీరభద్ర విజయములో గూడ స్తుతింపబడినాడు. (1-9)

7. సౌమిల్లుడు :- రోమిల్ల సౌమిల్లులు శూద్రక కథను రచించినట్లు బిల్హణుడు చెప్పెను.

తౌ శూద్రక కథాకారౌ వంద్యౌ రోమిల సౌమిలౌ
యయోర్ద్వయోః కావ్యమాసీ దర్ధనారీశ్వరోపమమ్

8. భల్లుడు :- ఇతడు కాశ్మీరకవి. భల్లట శతక కర్త. క్రీ.శ. 883-902 ఈయన కాలము. నీతిధర్మ శృంగార బోధక మీతని శతకము. ఈ శతక శ్లోకములను ఆలంకారికు లుదాహరించిరి.

9. మాఘుడు :- ఈయన కాలము క్రీ.శ. 650-700 మధ్య. ఇరువది సర్గలు గల శిశుపాల వధ పద్యకావ్యమీతని కృతి.

10. భారవి :- రామచరిత్ర, కిరాతార్జునీయ పద్యకావ్యము లీతని కృతులు. క్రీ.శ. 7వ శతాబ్ది పూర్వభాగమితని కాలము.

11. బిల్హణుడు :- విక్రమాంక దేవ చరిత్రమను చారిత్రక పద్య కావ్యమును, కర్ణ సుందరి యను నాటకమును, శివస్తుతిని - ఈయన రచించెను.

12. మల్హణుడు :- ఈ కవిని గూర్చి సమాచారము లభింపలేదు.

13. భట్టి :- ఈయన రచించిన రామాయణము భట్టి కావ్యముగ ప్రసిద్ధము. వ్యాకరణబోధ దీని యుద్దేశము. ఈయన కాలము ఆరవ శతాబ్ది యుత్తరార్థము.

14. చిత్తపకవి :- శ్రీధరదాసు సదుక్తి కర్ణామృతమున ఈ చిత్తపకవి రచించిన శివస్తుతి- 22, 82; భైరవ స్తుతి - 90; గల శ్లోకములనుదహరించెను. సదుక్తి కర్ణామృతముననే ఛిత్తప లేక ఛిత్రిప అనుకవివి 32 శ్లోకములున్నవి. శ్రీనాథుడు పేర్కొనుటచేత యితడు సంస్కృత మహాకవియై యుండవచ్చును. చిత్తప కవికి చిత్తన కవియని పాఠాంతరమున్నది. శివరాత్రి మాహాత్మ్యమున కూడ శ్రీనాథ మహాకవి చిత్తప కవి అనియే స్మరించినాడు. (1-12) "చిత్త వాగ్జృంభణ ప్రఖ్యుఁజిత్తపాఖ్యు".

15. దండి పండితుడు :- దశకుమార చరిత్రము, అవంతి సుందరి కథయను గద్యకావ్యములను, కావ్యాదర్శమను అలంకారశాస్త్ర గ్రంథమును రచించెను. ఈయన క్రీ.శ. ఆరవ శతాబ్ది ప్రాంతమువాడు.

**క॥ నెట్టుకొని కొలుతు నన్నయ**
**భట్టోపాధ్యాయ సార్వభౌమునిఁ గవితా**
**పట్టాభిషిక్తు భారత**
**ఘట్టోల్లంఘన పటిష్ఠ గాఢ ప్రతిభున్. 8**

**అర్థము** :- కవితాపట్టాభిషిక్తున్=కవిత్వమను సింహాసనమును అధిష్ఠించిన వాడును, భారత ఘట్ట=భారతమునందలి దురవగాహమైన ఘట్టములను, ఉల్లంఘన=దాటుటలో, పటిష్ఠ=దృఢమైన, గాఢ ప్రతిభున్=గొప్ప ప్రజ్ఞగలవాడును, నన్నయ భట్ట=నన్నయ భట్టు

అను పేరుగల, ఉపాధ్యాయ సార్వభౌమునిన్=గురు సమ్రాట్టును, నెట్టుకొని=త్రోసికొని, కొలుతున్=భజించెదను.

భావము :- కవితా సామ్రాజ్యాధిపతియు భారత గ్రంథమందలి సులభముగ అర్థముగాని ఘట్టములను అనువదించుటలో గొప్ప ప్రజ్ఞ కనబరచిన వాడును, గురు సమ్రాట్టునునైన నన్నయ భట్టారకుని భజింతును.

విశేషము :- ప్రతిభ : "ప్రజ్ఞా నవనవోన్మేష శాలినీ ప్రతిభామతా" - నవనవోన్మేష శాలినియగు ప్రజ్ఞయే ప్రతిభ.

ఆదికవియైన నన్నయ భట్టారకుని "ఉపాధ్యాయ సార్వభౌము"డనియు, "నెట్టుకొని కొలుతు" ననియు చెప్పుట - శ్రీనాథ మహాకవి నన్నయ భట్టునకు గౌరవమున అగ్రతాంబూల మిచ్చెననుటకు సాక్ష్యములు.

ఉ॥ పంచమ వేదమై పరఁగు భారత సంహిత నాంధ్ర భాషఁగా
వించెఁ బదేను పర్వములు విశ్వజగద్ధిత బుద్ధి నెవ్వఁడ
క్కాంచన గర్భ తుల్యున కఖండిత భక్తి నమస్కరింతు ని
ర్వంచిత కీర్తి వైభవ విరాజికిఁదిక్కన సోమయాజికిన్ 9

అర్థము :- ఎవ్వఁడు=ఎవడు, పంచమ వేదమై=ఐదవ వేదమై, పరఁగు=ఒప్పునట్టి, భారత సంహితన్=మహాభారత గ్రంథమును, విశ్వజగత్=సమస్తమైన లోకమునకు, హితబుద్ధిన్ =శ్రేయమును కల్గించు తలంపుతో, పదేను పర్వములు=పదునైదు పర్వములను, ఆంధ్రభాషన్ =తెలుగు భాషయందు, కావించెన్=రచించెనో, ఆ+కాంచన గర్భతుల్యున్=ఆ బ్రహ్మ దేవునితో సమానుడైనట్టియు, నిర్వంచిత=వంచింపబడని, కీర్తి వైభవ=కీర్తి యొక్క వైభవము చేత, విరాజికిన్=ప్రకాశించు వాడునునైన, తిక్కన సోమయాజికిన్=తిక్కన సోమయాజికి, అఖండిత భక్తిన్=పరిపూర్ణమైన భక్తితో, నమస్కరింతున్=నమస్కరించెదను.

భావము :- పంచమ వేదముగా ప్రసిద్ధి పొందిన మహాభారత గ్రంథమును సమస్త లోకమునకు క్షేమము, లాభమును కల్గించు తలంపుతో పదునైదు పర్వములను తెలుగు చేసిన వాడును, కవి బ్రహ్మయను బిరుదు నామము కలవాడును, పవిత్ర కీర్తి వైభవముతో ప్రకాశించువాడును నైన తిక్కన సోమయాజికి పరిపూర్ణ భక్తితో నమస్కరించెదను.

విశేషము :- తిక్కన సోమయాజికి "కవి బ్రహ్మ" బిరుదము నిచ్చి సత్కరించిన వాడు ఎఱ్ఱా ప్రెగడ (హరివంశము - పూర్వకవి స్తుతి). ఆ బిరుదమునకు నిండు భక్తితో నమస్కరించిన రెండవ వాడు శ్రీనాథ మహాకవి(కాశీ - పూర్వకవి స్తుతి).

"పరిఢవింతు ప్రబంధ పరమేశ్వరునిఠేవ
సూక్తి వైచిత్రి నొక్కొక్క మాటు"

అని ఎఱ్ఱాప్రెగడను కాశీఖండములో స్తుతించిన శ్రీనాథ మహాకవి ఇక్కడ స్మరింపకుండుట విచిత్రము. ఎఱ్ఱనయు రెడ్డి ప్రభువుల ఆస్థాన కవియే గదా!

మ॥ కనకక్ష్మాధర ధీరు వారిధి తటీ కాల్పట్టనాధీశ్వరున్
ఘనునిన్ బద్మ పురాణ సంగ్రహ కళాకావ్య ప్రబంధాధిపున్
వినమత్కాకతి సార్వభౌముఁ గవితా విద్యాధరుంగొల్తు మా
యనుఁగుం దాతఁ బ్రదాత శ్రీ కమలనాభామాత్య చూడామణిన్. 10

అర్థము :- కనకక్ష్మాధర ధీరున్=మేరు పర్వతము వలె ధీరుడును, వారిధితటీ= సముద్రతీరమునందలి, కాల్పట్టన=కాల్పట్టణమునకు, అధీశ్వరున్=ప్రభువైన వానిని, పద్మ పురాణ సంగ్రహ=పద్మ పురాణ సంగ్రహమను పేరుగల; కళాకావ్య=కళతో గూడిన కావ్యము యొక్క; ప్రబంధ+అధిపున్=కూర్పుకు అధిపతియైన వానిని; వినమత్=నమస్కరించు చున్న, కాకతి సార్వభౌమున్=కాకతీయ సార్వభౌముడు కలవానిని, కవితా విద్యాధరున్=కవితా విద్యను ధరించిన వానిని, ప్రదాతన్=గొప్ప దాతయైన వానిని, మా యనుఁగున్ తాతన్=ప్రేమా స్పదుడైన మా తాతను, శ్రీ కమలనాభ=శుభంకరమైన కమలనాభుడనెడి పేరుగల, అమాత్య చూడామణిన్=మంత్రి శిరోమణిని, కొల్తున్=భజించెదను.

భావము :- మేరు పర్వతము వలె ధీరుడును, సముద్ర తీరమందుగల కాల్పట్టణము నకు అధిపతియు, పద్మ పురాణ సంగ్రహమను కావ్యమును రచించిన వాడును, కాకతీయ సార్వభౌముని చేత నమస్కరింప బడినవాడును, కవితా విద్యను ధరించిన వాడును, మహాదాత, మాకు కూరిమి తాతయు, మంత్రి శిరోమణియునైన శ్రీకమలనాభుని కొలిచెదను.

విశేషము :- కాకతి సార్వభౌముడనగా కాకతీయ సామ్రాజ్యాధిపతియైన ప్రతాపరుద్ర చక్రవర్తి (1289-1323).

కాల్పట్టనమును గూర్చి పలువురు పండితులు పలురకముల అభిప్రాయములను వెలిబుచ్చిరి. కాల్పట్టనము సముద్రతీరమున నుండవలెను. నేడు కాల్పట్టనము సముద్ర తీరమున నెచ్చటను లేదు. ఇదివరకున్నట్లాధారము లభింపలేదు. ఊహాజనితములైన యభిప్రాయములు ప్రమాణములు కావు. కనుక "కాల్పట్టనము" ఏదియో, ఎచ్చటనున్నదో తెలియదు.

మ॥ హరచూడా హరిణాంక వక్రతయుఁ గాలాంతస్ఫుర చ్చండికా
పరుషోద్గాఢ పయోధరస్ఫుట తటీ పర్యంత కాఠిన్యమున్
సరసత్వంబును సంభవించెననఁగా సత్కావ్యముల్ దిక్కులం
జిర కాలంబు నటించు చుండుఁ గవిరాజీ గేహరంగంబులన్ 11

అర్థము :- హర=శివుని యొక్క, చూడా=శిరముపైగల, హరిణాంక=చంద్రరేఖవలె, వక్రతయు=వక్రత్వమును; కాలాంత=ప్రళయ కాలమునందు, స్ఫురత్=ప్రకాశించు, చండికా=చండిక యొక్క, పరుష=కఠినమై, ఉద్గాఢ=అధికమైన, పయోధర=పాలిండ్ల యొక్క, స్ఫుట తటీ పర్యంత=స్పష్టమైన ప్రదేశములందలి చుట్టువారిన మేరగల ప్రాంతములందలి, కాఠిన్యమున్=గట్టిదనమును; సరసత్వంబును=సారస్యమును; సంభవించెన్=చేకూరెను, అనగాన్=అనునట్లుగా, సత్కావ్యముల్=మంచి కావ్యములు, దిక్కులన్=దిక్కులందును, కవిరాజీ=కవి సమూహముల యొక్క, గేహరంగంబులన్=గృహసీమల యందు, చిరకాలంబు=శాశ్వతముగా, నటించుచుండున్=నర్తించుచుండును.

భావము :- పరమ శివుని శిరసుపైగల చంద్రరేఖవలె ప్రకాశించు వక్రతయు, ప్రళయకాలమందలి చండికాదేవి యొక్క విస్తారములై కఠినములై చెలువొందు స్తనముల కాఠిన్యమును, సరసత్వమును కల్గిన మంచి కావ్యములు సమస్తమైన దిక్కులందును, కవి సమూహముల గృహరంగములందును చిరకాలము ప్రకాశించుచుండును.

విశేషము :- వక్రత, కాఠిన్యము, సరసత్వము -

1. వక్రత :- వక్రతయనగా వక్రోక్తి. కుంతకుడను ఆలంకారికుడు "వక్రోక్తిః కావ్య జీవితమ్". వక్రోక్తి కావ్యమునకు జీవితమని సూత్రించెను. అంతేకాదు వక్రతను - వర్ణ విన్యాస వక్రత, పదపూర్వార్ధ వక్రత, ప్రత్యయ వక్రత, వాక్య వక్రత, ప్రకరణ వక్రత, ప్రబంధ వక్రతయని ఆరువిధముల విభజించి సమన్వయించెను.

2. కాఠిన్యము :- కవి యీ పద్యమున నిచ్చిన స్తన కాఠిన్యము చేత ఓజఃప్రసాదముల సమ్మిశ్రణముచే గల్గు మార్దవ పూర్వక పారుష్యము, కొంచెము ప్రౌఢార్థ సందర్భముగల భారతీ వృత్తితోడి రచనమని భావింప వచ్చును.

3. సరసత్వము :- ఆయా సన్నివేశముల చారుతతో దీపించు రసపోషణము -

ఈ మూడును సత్కావ్యమునకు లక్షణములని శ్రీనాథుని వక్కణ. శ్రీనాథుని కవితా మోహనాంగికి ఉక్తి వక్రతపై మక్కువ యెక్కువని సకల సాహితీ వేత్తలు సమ్మతించిన విషయము.

## కుకవి నిరాకరణము

చ॥ వెస వసుధా స్థలంబునఁగవీంద్రులు గొందఱు శేముషీ మషీ
రసము మనఃకటాహకుహరంబుల నించి కలంచి జిహ్వికా
కిసలయ తూలికం గొని లిఖింతురు కబ్బము లెన్నఁగా మహా
వ్యసనముతో నిజానన వియత్తల తాళ పలాశ రేఖలన్ 12

**అర్థము** :- ఎన్నఁగా=ఆలోచింపగా, వసుధా స్థలంబునన్=భూమిపైన, కొందఱు కవీంద్రులు=కొందరు కవిరాజులు, శేముషీ=బుద్ధియనెడి, మషీరసము=సిరాను, మనః= మనస్సనెడి, కటాహ=కడవ(సిరా బుడ్డి) యొక్క, కుహరంబులన్=గుహలలో, నించి= పూరించి, కలంచి=కలియబెట్టి, జిహ్వాకాకిసలయ=చిగురాకు వంటి నాలుక, తూలికన్+కొని=కలమును తీసికొని; నిజ+ఆనన=తమ ముఖములనెడు, వియత్తల=ఆకాశ ప్రదేశము వంటి, తాళపలాశరేఖలన్= తాటియాకుల వరుసలందు, కబ్బములు=కావ్యములు, మహా వ్యసనముతో=అమితమగు ఆసక్తితో, వెసన్=వేగముగ, లిఖింతురు=వ్రాయుదురు.

**భావము** :- అలోచించి చూడగా లోకమున కొందరు కవీంద్రులు బుద్ధియనెడి సిరాను మనస్సనెడి సిరాబుడ్డి యందు నింపి, చిగురాకు వంటి నాలుక యనెడి కుంచెతో, తమ ముఖములనెడి ఆకాశ ప్రదేము వంటి తాటియాకుల వరుసలపై అమితాసక్తితో వేగముగ వ్రాయుచుందురు.

**విశేషము** :- ఈ పద్యమునందలి ప్రథమ పాదమున అఖండ యతి వేయబడినది. అచ్సంధిగల శబ్దములందు స్వరప్రధాన వడియే పాటింప వలసి యుండగా, ఆ శబ్దద్వయ మేళనము అఖండముగా (ఏకశబ్దముగా) భావించి, సంధి స్థలమున నిల్చియున్న వ్యంజనాక్షరమునకే యతి గూర్చుట యఖండ యతి యనబడును.

ఈ భీమేశ్వర పురాణములో అఖండ యతి కన్పడుచున్న మరికొన్ని పద్యములు

ఉ. తమ్ముని వీరభద్ర వసుధాధిపు .............. (1 - 34)

సీ. సొరిదినల్దిక్కుల సోమేశ్వరములందు
భక్తిఁ బ్రదక్షిణంబాచరించి (3 - 190)

శ్రీనాథ మహాకవి లభ్య కృతులలో ఈ భీమేశ్వర పురాణము నందే మొదటగ “కుకవి నిరాకరణము” అను అంశము కన్పించును. మరల శివరాత్రి మాహాత్మ్యమున(1 -15) కన్పించును.

ఈ పద్యమున సిరాను, కలమును చెప్పిన శ్రీనాథ మహాకవి యీ గ్రంథముననే 1 - 74 లో కాగితమును గూర్చి చెప్పెను. సిరా కలముతో కాగితముపై వ్రాయుట ఆనాటికే కలదనియు తాటి యాకులపై గంటముతో వ్రాయుట వెనుక బడినదనియు తెలియును.

అసిత గిరి సమం స్యాత్ కజ్జలం సింధు పాత్రం
సురతరు వర శాఖా లేఖినీ పత్ర ముర్వీ
లిఖతి యది గృహీత్వా శారదా సర్వకాలం
తదపి తవ గుణానామీశ! పారం న యాతి.

*శివ మహిమ్న స్తోత్రము శ్లో - 32*

ఓ పరమేశ్వరా! సముద్రమను పాత్రలో కైలాస పర్వతమంత కాటుకను వేసి (కలిపి) భూమిని కాగితముగ చేసికొని, కల్ప వృక్షపు కొమ్మను కలముగ చేసికొని సరస్వతీదేవి సర్వకాలమును వ్రాసినను నీ గుణముల తుదను చేరలేదు. ఇందు సిరాబుడ్డి, సిరా, కలము, కాగితము అనునవి చెప్పబడినవి.

ఈ స్తోత్ర కర్తయెవరో తెలియదు. పుష్పదంతుడను గంధర్వరాజు చెప్పినట్లు కథ.

తే॥ బోధమల్పంబు గర్వ మభ్యున్నతంబు
శాంతి నిప్పచ్చరంబు మత్సరము ఘనము
కూప మండూకములు(బోలెఁ గొంచెమెఱిఁగి
పండితంమన్యులైన వైతండికులకు 13

అర్థము :- కూపమండూకములు(బోలెన్=నూతిలోని కప్పలవలె, కొంచెము+ఎఱిఁగి= కొంచెమే తెలిసి, పండితంమన్యులైన=తమను తాము పండితులుగా భావించుకొనెడి వారైన, వైతండికులకు=వితండ వాదము చేయువారికి; జ్ఞానము=జ్ఞానము, అల్పంబు=చాల తక్కువ, గర్వము=అహంకారము, అభ్యున్నతంబు=మిక్కిలి యెత్తైనది, శాంతి=శాంతి, నిప్పచ్చరంబు= శూన్యము, మచ్చరము=మాత్సర్యము, ఘనము=అధికము.

భావము :- నూతిలోని కప్పల వలె కొంచెము మాత్రమే తెలిసి తామే సర్వజ్ఞులమైన పండితులమని భావించుచు వితండవాదము చేయువారికి జ్ఞానము స్వల్పము. గర్వమధికము. శాంత గుణము శూన్యము. మాత్సర్య గుణమధికము.

విశేషము :- రాజమహేంద్రవరమున అసందర్భవాదములు చేయు తర్క విద్వాంసులను గూర్చి శ్రీనాథుడు పల్కిన చాటువు ఈ సందర్భమున స్మరణీయము.

శా॥ హంసీయానకు(గామికిన్నధమ రోమాళుల్ నభః పుష్పముల్
సంసారద్రుమ మూల పల్లవ గుళుచ్ఛంబైన యచ్చోట వి
ద్వాంసుల్ రాజమహేంద్ర పట్టనమునన్ ధర్మాసనంబుండి ప్ర
ధ్వంసాభావము ప్రాగభావమనుచున్ దర్కింతురశ్రాంతమున్.

శివరాత్రి మాహాత్మ్యములోని కుకవినింద కూడ (1 - 15) ఈ భావమునకు ప్రతిబింబమే.

ఉ॥వైన సుకవికోటుల
తెలుగిదియని తప్పులెల్ల(దీర్తురు వశులై
యెఱుగరు సుకవుల(గుకవులు
కఱుకులు పలుకుటయె నేర్పు గర్వప్రౌఢిన్.

తే॥ నికటమున నుండి శ్రుతిపుటనిష్ఠురముగ
నడరి కాకులు బిట్టు పెద్దఱచి నప్పు
డుడిగి రాయంచ యూరక యుంట లెస్స
సైఁపరాకున్న నెందేనిఁ జనుట యొప్పు. 14

అర్థము :- నికటమునన్+ఉండి=దగ్గరగా నుండి, శ్రుతి పుట నిష్ఠురముగన్=కర్ణకఠోరముగ, అడరి=అతిశయించి, కాకులు=కాకులు, బిట్టు=వేగముగ, పెద్ద+అఱచి నప్పుడు=పెద్దగా అరచినపుడు, రాయంచ=రాజహంస, ఉడిగి=తగ్గి, మానుకొని, ఊరకయుంట=ఊరకుండుట, లెస్స=మంచిది, సైఁపరాకున్నన్=సహింపజాలని యెడల, ఎందేనిన్=ఎచ్చటికైనను, చనుట=వెడలుట, ఒప్పు=తగును.

భావము :- కాకిమూక చుట్టును చేరి కర్ణకఠోరముగ మాటిమాటికి యరచుచున్నపుడు రాజహంస యేమియు పలుకకుండ ఊరకుండుట మంచిది. సహింపజాలని యెడల ఆచోటును వీడి మరెచ్చటికైనను వెడలుట తగును.

విశేషము :- ఈ పద్యము రాజమహేంద్రవరములోని అసూయాగ్రస్తులైన రాజాస్థాన విద్వాంసులనుద్దేశించి వ్రాసినది. రాజమహేంద్రవర పండితులు ఎంతపరుషముగ దూషించి శ్రీనాథ మహాకవి మనసును బాధపెట్టిరో యీ పద్యము వలన తెలియుచున్నది.

అలంకారము - అప్రస్తుత ప్రశంస.

తే॥ ప్రౌఢిఁబరికింప సంస్కృత భాషయండ్రు
పలుకు నుడికారమున నాంధ్ర భాషయందు
రెవ్వరేమన్న నండ్రుగాకేల కొఱఁత
నా కవిత్వంబు నిజము కర్ణాట భాష. 15

అర్థము :- ప్రౌఢిన్=(నా కవిత్వమునందలి దీర్ఘ సమాస భూయిష్ఠమైన రచనా) ప్రౌఢిని, పరికింపన్ = చూచినచో, సంస్కృత భాష = సంస్కృత భాషయని, అండ్రు = అందురు, పలుకు నుడి కారమునన్ = పలుకులలోని నుడికారములచేత, ఆంధ్ర భాషయందురు = తెనుగు భాషయని యందురు. ఎవ్వరు + ఏమన్నన్+అండ్రు = ఎవరెవరు ఏమేమి యన్నను, ఏలకొఱత = ఏమిలోటు, నా కవిత్వంబు = నా కవిత్వము, నిజము = యథార్థముగా, కర్ణాట భాష = కన్నడ భాష.

భావము :- నా కవిత్వమునందలి దీర్ఘ సమాస రచనా ప్రౌఢిని చూచి సంస్కృత భాషయని కొందరందురు. పలుకులలోని నుడికారపు సొగసులను చూచి స్వచ్ఛమైన తెలుగు భాషయని కొందరందురు. ఎవరెట్లనుకొన్నను నాకేమి తక్కువ. నిజముగ నా కవిత్వము కర్ణాట భాష.

విశేషము :- శ్రీనాథుని రచనలో కన్నడ భాషా పదములు కొన్ని చేరిన మాట వాస్తవము. అది అవకాశముగ తీసికొని రాజమహేంద్రవర విద్వాంసులు శ్రీనాథ మహాకవిని విమర్శింపగా వారిని దృష్టియందుంచుకొని వారి మాటలను లెక్కచేయక ఆత్మ విశ్వాసముతో చెప్పిన పద్యమిది. అంతేకాని తన కవిత్వము కన్నడ భాషలోనున్నదనుట కాదు.

కర్ణే అటతి ఇతి కర్ణాటః - అను వ్యుత్పత్తిని బట్టి చెవులకింపయిన భాషయని శ్రీనాథుని అభిప్రాయమని కొందరి భావము.

శ్రీనాథుడు 'కర్ణ+అట' అని విడదీసి యతివేయుట గమనార్హము (భీమ - 1 - 73)

తెనుగు భాషను కర్ణాట భాష అని వ్యవహరించుట కూడ కలదు. వీరాచార్యులు సంస్కృతములో వ్రాసిన గణిత శాస్త్రమును ఎలుగంటి పెద్దనాచార్యుడు తెనుగునకు అనువదించుచు, కర్ణాటకమున వ్రాయుచున్నట్లు చెప్పినాడు.

"హాటకమైన ప్రకీర్ణము
పాటించి గుణింపఁజేతు బహుపద్ధతులన్
గాటంబగు లెక్కలు క
ర్ణాటకమున వెలయ సూర్యనారాయణుడా"

ఆంధ్రకవి తరంగిణి - ఐదవ సంపుటము, పుట - 11

"శ్రీ శాతకర్ణి, కుంతల శాతకర్ణి, సుందర శాతకర్ణి, చకోర శాతకర్ణి, అని యీ విధముగ చాలమందికి శాతకర్ణి పేరుండుట వలన వీరిని శాతవాహనులనే గాక కర్ణి రాజులనియు, వీరు పాలించిన దేశమునకు కర్ణినాడనియు పేరు కల్గినది. కర్ణినాడే కర్నాడు, కర్నాట దేశము నైనది." - శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ (ఆంధ్రదేశ చరిత్ర సంగ్రహము - 23 పుట)

ప్రౌఢి :-"ప్రౌఢి రుక్తే : పరీపాకఇతి కావ్యవిదో విదుః "ప్రతాపరుద్రీయము - గుణ ప్రక - 32 శ్లో. పల్కులందరి వైచిత్రీ విశేషమే ప్రౌఢియని కావ్యవేత్త లెరుగుదురు.

**వ. అని యిష్టదేవతా ప్రార్థనంబును బురాతన కవీంద్ర గుణ కీర్తనంబును గుకవి నిరాకరణంబునుంజేసి యాత్మగతంబున - 16**

**అర్థము** :- అని = అని, ఇష్టదేవతా ప్రార్థనంబును = ఇష్ట దేవతలను ప్రార్థించుటయును, పురాతన కవీంద్ర = ప్రాచీన కవీశ్వరుల యొక్క, గుణకీర్తనంబును = గుణములను కొనియాడుటయును, కుకవి నిరాకరణంబును = కుకవులను తిరస్కరించుటయును, చేసి = చేసి, ఆత్మగతంబున = మనసునందు.

**భావము** :- అని యీ విధముగ ఇష్టదేవతలను ప్రార్థించి, ప్రాచీన కవీశ్వరుల గుణములను కొనియాడి, కుకవులను తిరస్కరించి పిమ్మట నా మనసు నందు.

తే॥ నవ మరుత్తు చరిత్రంబు నైషధంబు
సప్తశతి పండితారాధ్య చరిత మనఁగఁ
గావ్యములు పెక్కు చెప్పియుఁగాంక్ష చనక
వెండియునుఁ గావ్యమొకటిఁ గావింపఁదలఁచి 17

అర్థము :- నవ మరుత్తు చరిత్రంబు = నవ మరుత్తుని చరిత్రము, నైషధంబు = శృంగార నైషధమును, సప్తశతి = శాలివాహన సప్తశతియు, పండితారాధ్య చరితము = పండితారాధ్య చరిత్రము, అనఁగన్ = అనునట్టి, కావ్యములు = కావ్యములు, పెక్కు చెప్పియున్ = అనేకములను రచించినప్పటికిని, కాంక్ష = కోరిక , చనక = తీరక, వెండియున్ = మరలను, కావ్యమొకటి = ఒక కావ్యమును, కావింపన్+తలఁచి = రచింపదలచి.

భావము :- నవమరుత్తుని చరిత్రము, శృంగార నైషధము, శాలివాహన సప్తశతి, పండితారాధ్య చరిత్రము అను అనేక కావ్యములను రచించినను కోరిక తీరక మరొక కావ్యమును రచింపవలెనని సంకల్పించి.

విశేషము :- శ్రీనాథ మహాకవి గ్రంథములనేకములు. అందు కొన్ని దొరికినవి. కొన్ని దొరకలేదు. దొరికిన వానిలో కొన్ని గ్రంథములు కర్తృత్వ విషయమున వివాద గ్రస్తములు. కొన్ని శ్రీనాథుని కృతులని యితరులు చెప్పుట వలన తెలిసినవి. శృంగార నైషధము, భీమేశ్వర పురాణము, కాశీఖండము, హరవిలాసము, శివరాత్రి మాహాత్మ్యము, పలనాటి చరిత్ర, క్రీడాభిరామము - ఇవి దొరికిన గ్రంథములు.

మరుత్తరాట్చరిత్ర, శాలివాహన సప్తశతి, పండితారాధ్య చరిత్ర - ఇవి తాను వ్రాసినట్లు చెప్పినను అవి దొరకలేదు.

పలనాటి చరిత్ర, క్రీడాభిరామము - ఇవి లభ్యములగుచున్నను కర్తృత్వ విషయమున వివాదగ్రస్తములైనవి.

ధనంజయ విజయము, వల్లభాభ్యుదయము, నందనందన చరిత్ర అను నీ మూడు కృతులు శ్రీనాథ మహాకవి రచించినట్లితరులు చెప్పిరిగాని యివియు దొరకలేదు.

శ్రీ భీమేశ్వర పురాణమును రచించుటకు ముందు శ్రీనాథ మహాకవి రచించిన గ్రంథములు - 1. మరుత్తరాట్చరిత్రము, 2. శాలివాహన సప్తశతి, 3. పండితారాధ్య చరిత్రము, 4. శృంగార నైషధము, 5. హరవిలాసము, 6. ధనంజయ విజయము, 7. నంద నందన చరిత్రము, 8. వల్లభాభ్యుదయము.

వ. ఉన్నంత. 18

అర్థము :- ఉన్నంత = ఇంకొక కావ్యము వ్రాయదలచి యున్నసమయమున.

## ఉపోద్ఘాతము

సీ॥ ఏ మంత్రి కులదైవ మిందు శేఖరుఁడు ద
క్షారామ భీమేశుఁడఖిల కర్త
యే మంత్రి యేలిక యిక్ష్వాకు మాంధాతృ
రామ సన్నిభుఁడైన వేమ నృపతి
యే మంత్రి సిత కీర్తి యేడు వారాసుల
కడకొండ యవుల చీఁకటికి గొంగ
యే మంత్రి సౌభాగ్య మిగురుఁ గైదువు జోదు
లాలిత్య లీలకు మేలు బంతి

తే॥ యతఁడు కర్ణాట లాట బోటాంగ వంగ
కురు కుకురు కుంతలావంతి ఘూర్జరాది
నృప సభాస్థాన బుధ వర్ణనీయ సుగుణ
మండనుఁడు బెండ పూడన్న మంత్రి వరుఁడు 19

అర్థము :- ఏ మంత్రి కులదైవము=ఏ మంత్రికి ఇలువేల్పు, అఖిల కర్త=సర్వమునకు కర్తయైన, ఇందు శేఖరుఁడు=చంద్రుని సిగ పూవుగ కలవాడు, దక్షారామ భీమేశుఁడు=దక్షారామము నందలి భీమ శంకర స్వామియో;

ఏ మంత్రి యేలిక=ఏ మంత్రి యొక్క ప్రభువు, ఇక్ష్వాకు మాంధాతృ రామ సన్నిభుఁడైన=ఇక్ష్వాకువు తోడను, మాంధాత తోడను, శ్రీరాముని తోడను సమానుడైన, వేమనృపతి=వేమభూపాలుడో;

ఏ మంత్రి సితకీర్తి=ఏ మంత్రి యొక్క తెల్లని కీర్తి, ఏడు వారాసుల=ఏడు సముద్రములకును, కడ కొండ=చివరనున్న కొండకు, అవుల=ఆవల గల, చీఁకటికి=చీకటికి, గొంగ= శత్రువగు చంద్రుడో;

ఏ మంత్రి సౌభాగ్యము=ఏ మంత్రి యొక్క సౌందర్యము, ఇగురుఁగైదువు జోదు=చిగురాకును బాణముగ గల యోధుడైన మన్మధుని, లాలిత్య లీలకు=మనోజ్ఞతా విలాసమునకు, మేలు బంతి=ఒరవడియో;

అతఁడు=అతడు, కర్ణాట=కర్ణాటము, లాట=లాటదేశము, బోట=బోట దేశము, అంగ=అంగ దేశము, వంగ=వంగ దేశము, కురు=కురు దేశము, కుకురు=కుకుర దేశము, కుంతల=కుంతల దేశము, అవంతి=అవంతి దేశము, ఘూర్జర=ఘూర్జర దేశము,

ఆదిగా=మొదలైన, నృప=రాజుల యొక్క, నభాస్థాన=నభల యందున్న, బుధ=విద్వాంసులచేత, వర్ణనీయ=వర్ణింప తగిన, సుగుణ మండనుఁడు=సుగుణములే అలంకారములుగ కలవాడు, బెండపూడి+అన్న మంత్రి వరుఁడు=బెండపూడి అన్నయ మంత్రివర్యుడు.

భావము :- ఏ మంత్రికి కులదైవము, చంద్రశేఖరుడైన దక్షారామ భీమశంకర స్వామియో, ఏ మంత్రికి ప్రభువు ఇక్ష్వాకువు, మాంధాత, శ్రీరాములతో సమానుడైన వేమభూపాలుడో, ఏ మంత్రి యొక్క తెల్లని కీర్తి సప్త సముద్రముల కవతలగల కొండ కావలి వైపున గల చీకటిని పారద్రోలు చంద్రుని వలె ప్రకాశించునో, ఏ మంత్రి యొక్క సౌందర్యము మన్మథుని సౌందర్య విలాసమునకు ఒరవడియో - అతడు కన్నడ, లాట, భోట, అంగ, వంగ, కురు, కుకురు, కుంతల, అవంతి, ఘూర్జరము మొదలైన దేశముల రాజాస్థానములందలి విద్వాంసులచే స్తుతింప తగిన సుగుణములే అలంకారములుగ గల బెండపూడి అన్నయ మంత్రివర్యుడు.

విశేషము :

1. కర్ణాట=కన్నడ దేశము.
2. లాటము=ప్రస్తుత దక్షిణ గుజరాతులోని కొంత భాగము.
3. భోటము=కస్తూరి కాకరమైన భోట యనునది. భూటానుగ తెలియుచున్నది.
4. అంగము=బీహారులోని భాగల్పూరు, ముంగేరు జిల్లాల ప్రాంతము.
5. వంగ=బెంగాలు.
6. కురు=కురుక్షేత్ర ప్రాంతము. ఉత్తరప్రదేశ్‌లో కలదు.
7. కుకురు=ఉత్తర భారతమునందలి జనపదము.
8. కుంతలము=ఆంధ్ర కన్నడ మహారాష్ట్రముల మధ్య ప్రదేశము. మైసూరు ప్రాంతము లోనిది.
9. అవంతి=ఉజ్జయినిగల ప్రదేశము-మధ్యప్రదేశము మాళవదేశము.
10. ఘూర్జరము=ఇప్పటి గుజరాతు రాష్ట్రములోని భాగము.

వ. ఒక్కనాడు 20

అర్థము :- ఒక్కనాడు = ఒక దినమున.

సీ॥ భాట్ట ప్రభాకర ప్రస్థాన సంవేద్యు
లుద్దండ పండితు లొక్క వంక
ఫణిప భాషిత భాష్య ఫక్కికాభావజ్ఞు
లుత్తమ ప్రాగల్భ్యు లొక్క వంకఁ

గణభుఙ్మత గ్రంథ గాఢార్థ విదులు బా
హు శ్రుత్య సంపన్నులొక్క వంక
వేదాంత వాసనా విశ్రాంత హృదయజ్ఞు
లుపనిషత్తత్త్వజ్ఞు లొక్క వంక
తే॥ నుభయ భాషా కవీశ్వరు లొక్క వంక
వేశ్యలొక వంక నొకవంక వీర భటులు
బలసి కొలువంగఁ గొలువుండి పిలువఁబంపె
బెండపూఁడన్న మంత్రీశ్వరుండు నన్ను. 21

అర్థము :- భాట్టప్రభాకర=కుమారిలభట్టు, ప్రభాకరుని యొక్క, ప్రస్థాన=పూర్వ మీమాంసా శాస్త్రముల మార్గమును, సంవేద్యులు=బాగుగా తెలిసిన వారును; ఉద్దండ పండితులు=నిరంకుశులైన పండితులు, ఒక్కవంకన్=ఒకవైపునను;

ఫణిప భాషిత=పతంజలి ప్రవచించిన, భాష్యఫక్కికా=మహాభాష్యరీతి యొక్క, భావజ్ఞులు=భావము తెలిసిన వారును, ఉత్తమ ప్రాగల్భ్యులు=పాండిత్యమునందు శ్రేష్ఠమైన దిట్టలు, ఒక్కవంకన్=ఒక దిక్కునను;

కణభుక్+మతగ్రంథ=కణాద మతగ్రంథమైన వైశేషికము యొక్క, గాఢ+ అర్థవిదులు=నిగూఢార్థములు తెలిసిన వారును; బాహు శ్రుత్య సంపన్నులు= అనేక ప్రకార విద్వాంసులనుండి భిన్న భిన్న శాస్త్రవిషయములను వినుటతో నిష్ణాతులైన వారు; ఒక్కవంకన్= ఒకప్రక్కను;

వేదాంత వాసనా=అధ్యాత్మ విద్యా సంస్కారముచే కల్గిన, విశ్రాంత=శాంతి యొక్క, హృదయజ్ఞులు=మర్మము నెరిగినవారు, ఉపనిషత్+తత్త్వజ్ఞులు=ఉపనిషత్తులలోని సారమును తెలిసిన వారును, ఒక్కవంకన్=ఒక దిశ యందును;

ఉభయ భాషా కవీశ్వరులు=సంస్కృతము తెనుగు భాషలు రెంటియందును కవిశ్రేష్ఠులైనవారు, ఒక్కవంకన్=ఒక వైపునను; వేశ్యలు=వెలయాండ్రు, ఒక వంకన్=ఒక దిక్కునను; ఒకవంకన్=ఒకవైపు, వీరభటులు= వీరులగు సైనికులును; బలసి= నిండియుండి, కొలువంగన్=కొలుచుచుండగా, కొలువుండి=సభయందుండి, బెండపూఁడన్న మంత్రీశ్వరుండు=బెండపూడి అన్నయ మంత్రివర్యుడు, నన్ను=నన్ను, పిలువఁబంపెన్= పిలిపించెను.

భావము :- పూర్వ మీమాంసా శాస్త్రమునందలి కుమారిలభట్టు, ప్రభాకరుల మతభేదములందలి విశేషములు తెలిసినవారును, ఉద్దండులైన పండితులును ఒక వైపు;

ఒక ప్రక్క పాణిని రచించిన వ్యాకరణమునకు పతంజలి వ్రాసిన మహాభాష్యములోని విశేషములను తెలిసినవారును, ఉత్తములైన విద్వాంసులును, కణాదుడు రచించిన వైశేషిక దర్శనములోని నిగూఢార్థములను తెలిసిన వారును, అనేకులైన శాస్త్ర విద్వాంసుల నుండి భిన్న భిన్న శాస్త్ర విషయములను వినుటతో నిష్ణాతులైన వారు ఒకవైపునను; ఒక దరి అధ్యాత్మ విద్యాసంస్కారముతో శాంతరస మర్మము నెఱిగిన వారును, ఉపనిషత్తుల సారము నెఱిగిన వారును; ఒక వంక సంస్కృతాంధ్ర భాషలలో కవివతంసులును, ఒక వంక వేశ్యలును, ఒక దిక్కున వీరభటులును నిండియుండి కొలుచుచుండగా కొలువులోనున్న బెండపూడి అన్నయ మంత్రి సత్తముడు నన్ను పిలువనంపెను.

విశేషము :- ఈ పద్యమున అనేకులైన వైయాకరణులు, పండిత వరేణ్యులు, కవివతంసులతోపాటు సభలో వేశ్యలకును స్థానమీయబడినది. ఈనాడు వేశ్యయన్నచో చిన్న చూపు కలదుగాని శ్రీనాథుని కాలమునను కృష్ణదేవరాయల కాలమునను వేశ్యలకు సంఘమున ఉన్నత స్థానమే కలదు. వేశ్యలానాడు సంగీత సాహిత్య నాట్యాది లలిత కళలందు నిష్ణాతలై సభాస్థానములందు ప్రాతినిధ్యము, గౌరవము పొందుచుండెడి వారనుట కిట్టి యుదాహరణ లెన్నేని కలవు. రాజులకానాడు పన్నుల రాబడి ఈ వేశ్యా వర్గము నుండియే అధికముగ వచ్చెడిది.

తే॥ ఇట్లు పిలిపించి సమ్మాన మెసక మెసఁగ
సముచితాసనమున నుంచి చతురలీల
నానతిచ్చెను రాయవేశ్యాభుజంగు
మంత్రి గంభీర ధీర సంభాషణముల. 22

అర్థము :- ఇట్లు పిలిపించి=ఈ విధముగ నన్ను సభకు పిలిపించి, సమ్మానము= గౌరవము, ఎసక మెసఁగ=అతిశయించునట్లుగా, సముచిత+ఆసనమునన్=తగిన ఆసనముపై, ఉంచి=కూర్చుండబెట్టి, రాయవేశ్యాభుజంగు మంత్రి='రాయ వేశ్యాభుజంగ' యను బిరుదుగల వేమభూపాలుని మంత్రియైన అన్నయ మంత్రి, గంభీర ధీర సంభాషణములన్=గంభీరములు, ప్రౌఢములు నైన పలుకులతో, చతురలీలన్=నేర్పుతోడి రీతిలో, ఆనతిచ్చెను=ఆజ్ఞాపించెను.

భావము:- "రాయవేశ్యాభుజంగ" అను బిరుదముగల వేమ భూపాలుని మంత్రియైన అన్నయ మంత్రివర్యుడు నన్నావిధముగ సభకు పిలిపించి తగిన ఆసనముపై కూర్చుండబెట్టి గౌరవించి గంభీరము, ప్రౌఢమునైన మాటలతో నేర్పరియై నన్నీవిధముగ కోరెను.

సీ॥ వినిపించినాఁడవు వేమభూపాలున
కఖిల పురాణ విద్యాగమములు;
కల్పించినాఁడవు గాఢపాకంబైన
హర్షనైషధ కావ్య మాంధ్రభాష;
భాషించినాఁడవు బహుదేశబుధులతో
విద్యాపరీక్షణ వేళలందు;
వెదచల్లినాఁడవు విశద కీర్తి స్ఫూర్తి
కర్పూరములు దిశాంగణములందుఁ;

తే॥ పాకనాటింటి వాఁడవు బాంధవుఁడవు
కమలనాభుని మనుమఁడ వమల మతివి
నాకుఁగృపసేయు మొక ప్రబంధంబు నీవు
కలిత గుణగణ్య; శ్రీనాథ కవివరేణ్య; 23

**అర్థము :-** కలిత గుణగణ్య=సంగతమైన గుణములచే గణింపతగిన వాడా! శ్రీనాథ కవి వరేణ్య=శ్రీనాథ కవివరా!, వేమ భూపాలునకు=వేమ నృపతికి, అఖిల పురాణ=సమస్తమైన పురాణములను, విద్యా= విద్యల యొక్క, ఆగమములు=సిద్ధాంతములను, వినిపించి నాఁడవు=వినిపించితివి;

గాఢపాకంబైన=బిగువైన పాకముగల, హర్షనైషధ కావ్యము=శ్రీ హర్షుని నైషధీయ చరితమును, ఆంధ్ర భాషన్=తెనుగు భాషయందు, కల్పించినాఁడవు=(అనువదించితివి) రచించితివి;

విద్యా పరీక్షణ వేళలందు=విద్యా పరీక్షల సమయములయందు, బహు దేశ బుధు లతో=పలుదేశముల పండితులతో, భాషించినాఁడవు=సంభాషించితివి;

దిశాంగణములందున్=దిక్కుల యొక్క ముంగిళ్ళ యందు, విశద కీర్తి స్ఫూర్తి= స్వచ్ఛమైన కీర్తిస్ఫురణలనెడు, కర్పూరములు=కప్పురములను, వెదచల్లినాఁడవు=వెదచల్లితివి;

పాకనాటింటి వాఁడవు=పాకనాటి(వంశము) గృహస్థుడవు, బాంధవుఁడవు=బంధువువు, కమలనాభుని=ప్రసిద్ధుడైన కమలనాభామాత్యుని, మనుమఁడవు=మనుమడవు, అమలమతివి=నిర్మలమైన మనసు కలవాడవు, నీవు=అట్టి నీవు, నాకు=నా కొఱకు, ఒక ప్రబంధంబు=ఒక కావ్యమును, కృపసేయుము=దయతో నిమ్ము.

**భావము :-** గుణగణ్యా! ఓ శ్రీనాథ మహాకవీ! నీవు వేమ భూపాలునకు సమస్తమైన పురాణములను, విద్యలలోని సిద్ధాంతములను విన్పించితివి. శబ్దార్థ గాంభీర్యముగల శ్రీ

హర్షుని నైషధీయ చరితమును శృంగార నైషధముగ తెనుగు భాషయందు రచించితివి. విద్యా పరీక్షా సమయములలో అనేక దేశముల పండితులతో మాటాడితివి. స్వచ్ఛమైన కీర్తి కర్పూరములను దిక్కుల యందు వెదచల్లితివి. పాకనాటి వంశము వాడవు, బంధువువు. సుప్రసిద్ధుడైన కమలనాభామాత్యుని మనుమడవు. నిర్మల హృదయుడవు. అట్టి నీవు దయతో నా కొఱకొక కావ్యమును రచించి అంకిత మిమ్ము.

విశేషము :- పాకనాటింటివాఁడవు : పాకనాఁడు శ్రీనాథుని ఇంటి పేరు కాదు. పాకనాఁటి నియోగి బ్రాహ్మణ వంశమునకు చెందిన వాడని భావము.

బాంధవుఁడవు, కమలనాభుని మనుమఁడవు :- శ్రీనాథుడు పరిచయము కాకముందే అన్న మంత్రి కమలనాభు నెరిగి యుండును. కమలనాభుడు 'వినమత్కాకతి సార్వభౌముడు' కదా!

పాకనాడు :- భీమ-(1 - 32) చెంత కలదు.

**తే॥ సప్త సంతానములు నాకు సంభవించె**
**నొక ప్రబంధంబు వెలితిగా సుకృత గరిమ**
**నా వెలితి మాన నా పేర నంకితముగ**
**శివ పురాణంబు తెనుఁగుఁగాఁజేయు మొకటి. 24**

**అర్థము** :- సుకృత గరిమన్=పుణ్యాతిశయము చేత, ఒక ప్రబంధంబు=ఒక కావ్యము, వెలితిగాన్=తక్కువగా, సప్తసంతానములు=(పుణ్యప్రదములైన ప్రసిద్ధములైన) సప్త సంతానములు, నాకు సంభవించెన్=నాకు సమకూడినవి. ఆ వెలితి=ఆ కొరత, మానన్= తీరునట్లుగా, నా పేరన్+అంకితముగ=నా పేరుతో అంకితముగా, శివపురాణంబు+ఒకటి=ఒక శివపురాణమును, తెనుఁగుఁగాన్+చేయుము=ఆంధ్రీకరింపుము.

**భావము** :- నా అదృష్ట విశేషముచేత ఒక్క కావ్యము కొరతగా సప్త సంతానములు నాకు సంభవించినవి. ఆ కొరత తీరునట్లుగా నీవొక శివ పురాణమును ఆంధ్రీకరించి నాకు అంకితము చేయుము.

**విశేషము** :- సప్తసంతానములు : 1. తటాకము, 2. నిధి, 3. అగ్రహారము, 4. దేవాలయము, 5. వనము, 6. ప్రబంధము, 7. పుత్రుడు - వీనినేర్పరచుటచే జీవరాశికి బహుధా ప్రయోజనకరమై కర్తకు కీర్తి, పుణ్యము కలుగునని ఆర్యవాక్కు.

**వ॥ అదియును 25**

**అర్థము** :- అదియును=ఆ కావ్యము.

క॥ బంధుర సపాద లక్ష
గ్రంథంబై యైదు పదులు ఖండంబులతో
సంధిల్లును స్కాందంబన
సింధువునకుఁ గాల్వ లమరిచిన చందమునన్. 26

అర్థము :- సింధువునకున్=సముద్రమునకు, కాల్వలు=కాలువలు, అమరిచిన= ఏర్పఱచిన, చందమునన్=విధముగా, స్కాందంబు+అన=స్కాందమను పేరుగల పురాణము, ఐదుపదులు=ఏబది, ఖండంబులతో=ఖండములనెడి భాగములతో, బంధుర=సాంద్రమైన, సపాదలక్ష గ్రంథంబై=లక్ష ఇరువదియైదు వేల శ్లోకములు కలదై, సంధిల్లును=కూడి యుండును.

భావము :- సముద్రమునకు కాలువ లేర్పరచిన విధముగా స్కాందపురాణమనునది ఏబది ఖండములతోను లక్ష యిరువది యైదువేల శ్లోకములతోను కూడియుండి ఒప్పుచున్నది.

విశేషము :- ఈ పద్యమునందు "ధ-థ" లకు ప్రాస వేయుట జరిగినది.

గ్రంథము :- ముప్పది రెండక్షరములుగల శ్లోకమునకు గ్రంథము అని సంకేతము.

మ॥ అరవిందాప్త కృత ప్రతిష్ఠుఁడగు దక్షారామ భీమేశ్వరే
శ్వరు మాహాత్మ్యము తోడఁగూడి భువన శ్లాఘాస్పదంబై యభం
గురమై స్కాంద పురాణ సారమగు శ్రీ గోదావరీ ఖండమున్
బరిపాటిన్ రచియింపు మంధ్ర జగతీ భాషా ప్రబంధంబుగన్. 27

అర్థము :- అరవిందాప్త=సూర్యుని చేత, కృత=చేయబడిన, ప్రతిష్ఠుఁడగు= పూజ(అభిషేకము) కలవాడైన, దక్షారామ=దక్షారామము నందలి, భీమేశ్వరేశ్వరున్=భీమేశ్వర స్వామి యొక్క, మాహాత్మ్యము తోడఁగూడి=మహత్త్వముతో కూడియుండి, భువన శ్లాఘా= లోకముల ప్రశంసకు, ఆస్పదంబై=నిలయమై, అభంగురమై=నాశనరహితమై, స్కాంద పురాణ= స్కాంద పురాణమునకు, సారమగు=సార(ముఖ్య)మైన, శ్రీ గోదావరీ ఖండమున్=శ్రీ గోదావరీ ఖండమను భాగమును, పరిపాటిన్=అనుక్రమముగా, అంధ్ర జగతీ భాషా ప్రబంధంబు గన్=ఆంధ్రదేశ భాషా కావ్యముగా, రచియింపుము=వ్రాయుము.

భావము :- సూర్యునిచే అభిషేకింపబడిన శ్రీ దక్షారామ భీమేశ్వర స్వామి యొక్క మహత్త్వముతో కూడియుండి, లోకముల ప్రశంసలకు నిలయమై, శాశ్వతమై, స్కాంద పురాణమునకు సారమైన శ్రీ గోదావరీ ఖండమును ఆంధ్రభాషయందు కావ్యముగ రచింపుము.

విశేషము :- దక్షారామము :- వేంగి దేశమున చాళుక్య, చోళ ప్రతినిధుల రాజధాని నగరము జననాథపురము. అదే నేటి తూర్పు గోదావరి జిల్లాలోని కాకినాడ వద్దగల ఇప్పటి దక్షారామము - ఆంధ్రదేశ చరిత్ర సంగ్రహము, పుట - 35 - శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ

వ॥ అని పలికి సబహుమానంబుగాఁ గర్పూర తాంబూల జాంబూనదాంబరా
భరణంబు లొసంగి వీడు కొలిపిన 28

అర్థము :- అని పలికి=అని పల్కి, సబహుమానంబుగాన్=సగౌరవముగా, కర్పూర తాంబూల=కర్పూర తాంబూలము, జాంబూనద+అంబర+అభరణంబులు=బంగారు జరీ అంచులు గల వస్త్రములను, ఆభరణములను, ఒసంగి=ఇచ్చి, వీడు కొలిపిన=పంపగా.

భావము :- అన్నయ మంత్రి సత్తముడిట్లు పల్కి సగౌరవముగా కర్పూర తాంబూలమును బంగారు అంచులు గల వస్త్రములను, ఆభరణములను కానుక చేసి పంపగా.

సీ॥ ధారాసురత్రాణ ధాటీసమారంభ
గర్వ పాథోరాశి కలశజులకు
సప్తమాడియరాజ ఝాడియక్ష్మాపాల
వందిత శ్రీపాద వనరుహులకు
సింహాద్రి పర్యంత సీమాంధ్ర మేదినీ
మండలీ పాలనాఖండలులకు
హరిదంత దంతి దంతావళీ లిఖ్యమా
నానేక జయశాసనాక్షరులకు

గీ॥ వీరభద్రేశ వేమ పృథ్వీధవులకు
ననుఁగు మంత్రి మహా ప్రధానాగ్రగణ్యు
బెండ పూఁడన్న జగనొబ్బ గండ బిరుద
సచివ దేవేంద్రుఁగృతి కధీశ్వరునిఁజేసి 29

అర్థము :- ధారా=జలధారవలె యెడతెగని, సురత్రాణధాటీ=సులతానుల దాడియొక్క, సమారంభ=ప్రారంభమునందలి, గర్వపాథోరాశి=గర్వమనెడి సముద్రమునకు, కలశజులకు= అగస్త్యులైన వారికి; సప్తమాడియరాజ=ఏడైన మన్యరాజ్యముల రాజుల చేత, ఝాడియ క్ష్మాపాల=ఝాడె ప్రాంతమును పాలించు రాజులచేతను, వందిత=నమస్కరింపబడిన, శ్రీపాద వనరుహులకు=సంపద్యుక్తములగు పాద పద్మములు గలవారికి;

సింహాద్రి పర్యంత సీమా=సింహాచలము వరకుండు ప్రదేశముగల, ఆంధ్రమేదినీ మండలీ=ఆంధ్రభూమండలమును, పాలన=పరిపాలించుటలో, ఆఖండలులకు=మహేంద్రు లైన వారికి;హరిత్+అంత=దిక్కుల చివరలందుగల, దంతి=ఏనుగుల యొక్క, దంతావళీ= దంతముల సమూహముపై, అనేక=అనేకములైన, శాసన+అక్షరులకు=జయశాసనము లందలి అక్షరములు కలవారికి;

వీరభద్రేశ వేమ పృథ్వీధవులకు=వీరభద్ర భూపతికిని, వేమభూపాలునకును, అనుఁగు మంత్రి=ప్రేమాస్పదుడైనమంత్రియును, మహాప్రధాన+అగ్రగణ్యున్=మహామంత్రులలో మొదటగ లెక్కింప తగినవాడును, బెండఁపూడన్న=బెండపూడి అన్నయను, జగనొబ్బగండ బిరుద="జగనొబ్బగండ"యను బిరుదము కల, సచివదేవేంద్రున్=మంత్రి శ్రేష్ఠుని కృతికిన్=కావ్యమునకు, అధీశ్వరునిఁజేసి=అధిపతిగా చేసి.

భావము :- ప్రవాహ జలధార వంటి సుల్తానుల దాడి యొక్క ప్రారంభ గర్వమనెడి సముద్రమును పీల్చివేయుట యందు అగస్త్య మహర్షులైనవారు, సప్తమాడియ, ఝూడె పాలకులచేత నమస్కరింపబడిన పాదపద్మములు కలవారు, సింహాద్రి వరకు గల ఆంధ్రదేశమును పాలించుటలో దేవేంద్రులైనవారు, దిగ్గజముల దంతముల సమూహముపై వ్రాయబడిన జయశాసనాక్షరములు కలవారునైన వీరభద్ర భూపతి వేమభూపాలురకు అనుంగు మంత్రియు, జగనొబ్బగండ బిరుదాంకితుడు, మహాప్రధానులలో శ్రేష్ఠుడునైన బెండపూడి అన్నయను ఈ కావ్యమునకు అధిపతిగ చేసి.

**విశేషము** :- అగస్త్యుఁడు : కృతయుగమున విష్ణుమూర్తి యాదేశము చేత, దేవతల అభ్యర్థనచేత లోక కళ్యాణమును కోరి సముద్రమున దాగిన కాలకేయులను క్రూర రాక్షస గణములను బయల్పరచుటకై అగస్త్య మహర్షి సముద్ర జలమునంతటిని ఒక్కసారిగా పుక్కిట పట్టెనట. రాక్షసులు బయల్పడిరి. దేవతలు ఆ రక్కసులను చంపిరట. ఈ సందర్భమున అగస్త్యుడు చేసిన పనికి మెచ్చిన దేవతలు "పీత సముద్రుడు" అని అగస్త్యుని కొనియాడిరట.

- మహర్షుల చరిత్రలు - పుట 11 - విద్వాన్ బులుసు వెంకటేశ్వర్లు.

సప్తమాడియ, ఝూడియ : ఝూడదేశ మిప్పటి జయపూరు బొబ్బిలి సంస్థానముల భాగమనియు, సప్తమాడియ - గంజాము ప్రాంతమందలి మన్నెదొరల ఏడు సంస్థానములనియు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు తెలిపిరి. (History of Reddy Kingdoms page 137 - 143. Part - V.) - చూడుడు భీమ 1-38; 1-63

జగనొబ్బగండ :- ఇది కన్నడ బిరుదము. జగదేక వీరుడు అని అర్థము.

**వ॥ సర్గ ప్రతిసర్గ వంశ మన్వంతర వంశాను చరితంబులను పంచ లక్షణంబుల తోడంగూడి సపాద లక్ష గ్రంథ సంఖ్యా సమన్వితంబై పంచాశత్ఖండ మండితంబై బహుసంహితా సమాకీర్ణంబై యొప్పు శ్రీ మహాస్కాందంబను నాది పురాణంబునందు గోదావరీ ఖండంబు శ్రీమద్దక్షారామ భీమేశ్వర మాహాత్మ్య సంయుతంబగుటఁజేసి భీమేశ్వర పురాణంబనం బరఁగు; నది యాంధ్ర భాషా ప్రబంధంబుగఁ జెప్పఁదొడంగితి; నమ్మహా ప్రారంభంబునకు మంగళాలంకారంబుగా**

నమ్మహా మంత్రీశ్వరుని నేలిన వీరభద్రేశ్వర వేమ భూపాలుర వంశావతారంబభి
వర్ణించెద. 30

అర్థము :- సర్గ=బ్రహ్మసృష్టి, ప్రతిసర్గ=ప్రజాపతుల సృష్టి, వంశ=బ్రహ్మాదుల పుత్ర పౌత్ర పరంపరానుగత శరీర సంఘాత ప్రవాహము, మన్వంతర=స్వాయంభువాది మనువుల కాలము, వంశాను చరితంబులు+అను=సూర్య చంద్రాది వంశ జాతులగు మహా పురుషుల చరిత్రములు అనెడి, పంచలక్షణంబుల తోడన్=ఐదు లక్షణములతో, కూడి=కలసి, సపాద లక్ష=ఒక లక్ష ఇరువది యైదువేల, గ్రంథ సంఖ్యా=శ్లోకముల సముదాయముతో, సమన్వితంబై =కూడుకొన్నదై, పంచాశత్=ఏబది, ఖండ=ఖండ(భాగ)ములతో, మండితంబై=అలంకరింప బడినదై, బహు సంహితా=అనేక సంహితలతో, సమాకీర్ణంబై=వ్యాపింపబడినదై, ఒప్పు= ప్రకాశించు, ఆదిపురాణంబునందు=ముఖ్య పురాణమునందు, గోదావరీ ఖండంబు= గోదావరీ ఖండమనెడి భాగము, శ్రీమత్+దక్షారామ భీమేశ్వర=సకలైశ్వర్య సంపన్నుడైన దక్షారామ భీమేశ్వర స్వామి యొక్క, మాహాత్మ్య=మహత్త్వముతో, సంయుతంబు= కూడియున్నది, అగుటంజేసి=అగుటచేత, భీమేశ్వర పురాణంబు+అనన్+పరగున్=భీమేశ్వర పురాణమని ప్రసిద్ధమగును. అది=ఆ భీమేశ్వర పురాణమును, ఆంధ్రభాషా ప్రబంధంబుగన్=ఆంధ్రభాషలో కావ్యముగా, చెప్పఁదొడంగితి=చెప్పబూనితిని. ఆ మహా ప్రారంభంబునకు=ఆ గొప్ప ప్రారంభమునకు, మంగళ+అలంకారంబుగాన్=శుభప్రదమైన అలంకారముగా, ఆ మహామంత్రీశ్వరున్=ఆ గొప్ప మంత్రి సత్తముని, ఏలిన=పాలించిన, వీరభద్రేశ్వర వేమ భూపాలుర=వీరభద్రుని యొక్క వేమ భూపాలుని యొక్క, వంశ+అవతారంబు=వంశోత్పత్తిని, అభివర్ణించెద=వివరించెదను.

భావము :- సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరము, వంశానుచరితములను ఐదు లక్షణములతో కూడి లక్ష యిరువది యైదువేల శ్లోకములతో నుండి ఏబది ఖండములతో శోభిల్లుచు అనేకానేక సంహితలతో వ్యాపించియున్నదైన శ్రీ మహాస్కాందమను ఆదిపురాణ మున గల గోదావరీఖండము శ్రీ దక్షారామ భీమేశ్వరస్వామి మాహాత్మ్యముతో కూడి యున్న దగుటచేత భీమేశ్వర పురాణముగ ప్రసిద్ధమైనది. దానిని తెలుగు భాషలో కావ్యముగ చెప్ప బూనితిని. ఆ మహాప్రారంభమునకు శుభాలంకారముగ ఆ మహామంత్రి నేలుచున్న వీరభద్రేశ్వర వేమభూపాలుర వంశమును గూర్చి వివరింతును.

విశేషము :- స్కాంద పురాణము :- శ్రీనాథుని భీమేశ్వర పురాణమును బట్టి స్కాంద పురాణము ఏబది ఖండములు, పెక్కు సంహితలు, లక్ష ఇరువది యైదు వేల శ్లోకములు కలది.

కాని స్కాంద పురాణము మొదట అఖండము. పిమ్మట ఏడు ఖండములైనది. తదుపరి ఏబది ఖండములైనది. అట్లే సంహితల విషయమున, గ్రంథ సంఖ్య విషయముునను భేదములు కన్పించుచున్నవి. ప్రారంభమున వామనావతారముగనున్న స్కాంద పురాణము కాలక్రమమున త్రివిక్రమావతారమెత్తినది.

శ్రీనాథుడు తన భీమేశ్వర పురాణమునకు మూలము గోదావరీ ఖండమని (1 - 27) చెప్పెను. స్కాంద పురాణమునందు గోదావరీ ఖండమనునది - కాలీ పురాణమునందు చెప్పిన యేబది ఖండములలో లేదు. శ్రీనాథుడన్నట్లుగ స్కాందపురాణమనునది ఒక మహాబ్ధి.

పురాణము :- సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ
వంశానుచరితం చైవ పురాణం పంచలక్షణమ్.

## వేమ భూపాల వంశావతార వర్ణనము

ఉ॥ కైటభదైత్యవైరి పదకంజమునందుదయంబు నొందె మి
న్నేటికి భూతధాత్రికిని నెంతయు నచ్చిన తోడఁబుట్టువై
హాటక గర్భముఖ్య నిఖిలామర మౌళి మహామణి ప్రభా
పాటల వర్ణమైన యొక పావన వర్ణముదీర్ణ సంపదన్. 31

అర్థము :- హాటకగర్భ=బంగరు అండమునుండి పుట్టిన బ్రహ్మదేవుడు, ముఖ్య=మొదలయిన, నిఖిల=సమస్తమైన, అమర=దేవతల యొక్క, మౌళి=శిరస్సులపైగల, మహామణి=విలువైన మణుల యొక్క, ప్రభా=కాంతితో, పాటల వర్ణమైన=తెలుపుమించిన యెరుపు రంగు గలదైన, ఒక పావన వర్ణము=ఒక పవిత్రమైన జాతి, ఉదీర్ణసంపదన్=అతిశయించిన విభవముతో, మిన్ను+ఏటికిన్=ఆకాశగంగానదికి, భూతధాత్రికిన్=సర్వజీవరాశిని ధరించు భూమికిని, ఎంతయు నచ్చిన=మిక్కిలి ప్రియమైన, తోడఁబుట్టువై=తోబుట్టువై, కైటభదైత్య వైరి=కైటభుడను రాక్షసునకు శత్రువైన విష్ణువు యొక్క పదకంజమునందు=పద్మము వంటి పాదమునందు, ఉదయంబునొందె=పుట్టెను.

భావము :- బ్రహ్మదేవాది దేవతా ప్రముఖులందరి శిరసులపై గల మణుల కాంతులతో పాటల వర్ణమైన ఒక పవిత్రజాతి మహావిభవముతో ఆకాశగంగకును భూమికిని తోబుట్టువై విష్ణుమూర్తి యొక్క పాదము నుండి పుట్టెను.

విశేషము :- పాటల వర్ణమనుటతో ఆ పవిత్రమైన జాతి యొక్క ఓజో గుణమునకు, కీర్తి మత్త్వమునకు చిహ్నముగ సూచింపబడినదని చెప్పవచ్చును.

"పద్భ్యాగ్ం శూద్రో అజాయత" అను వేదమంత్రానుసారము శూద్రజాతి విరాట్పురుషునకు పాదస్థానీయమైనది.

వ॥ అప్పుణ్య వంశంబు కంసాసురధ్వంసి చరణ పల్లవంబు దనకుఁ బుట్టినిల్లు గావునఁ గారణ గుణ సంక్రమంబునం బోలెఁ జామర తోమర ఛత్ర ధనుః ఖడ్గాది చిహ్నోపశోభితంబై చదలేటి నీటి వలని సోదరీయ స్నేహ లబ్ధంబులుంబోని పావనత్వ శుచిత్వ గాంభీర్య మాధుర్యంబులు చరితమనస్స్వభావ వచనంబుల ధరియించి, సైదోడుం బొదివి విశ్వవిశ్వంభరా క్రీడనంబు దనకు విదిర్చిన పరమ క్షాంతి యంతరంగంబున సంతరించి, నిఖిల ప్రపంచంబునకు నాధారంబై ప్రవర్తిల్లె. అందుఁబద్మనాయకులన, వెలమ లనఁ, గమ్మలన, సరిసర్లన, వంటర్లన, బహుప్రకార శాఖోపశాఖా భిన్నంబులైన మార్గంబులం ద్రిమార్గ గంగా ప్రవాహంబులుంబోలె గోత్రంబులెన్ని యేనియు జగత్పవిత్రంబులై ప్రవహించుచుండఁ, గల్పంబు లతిక్రమించి, మన్వంతరంబులు జరిగి, యుగంబులు సరికడచి, వత్సరంబులు చని కాలచక్రం బతిక్రమించుచుండఁ జతుర్థకుల మౌళి మండనంబై కీర్తి విహార ఘంటాపథంబైన పంట మహాన్వయంబు బాకనాఁటి దేశంబున భద్రపీఠంబు నధివసించి, సింహ విక్రమ నగర, దువ్వూరు, గండవరాది పట్టనంబులు నిజనివాసం బులుగా భ్రూలతాదిష్టాష్టాదశ ద్వీపాంతరాళులగు భూపాలగ్రామణులన్ ద్రిలింగ భూమండలాఖండలులను బోలయ వేమాన్న పోతాన్న వేమ కుమార గిరీశ్వరాదులం బూజ్య సామ్రాజ్య పీఠస్థులంగాంచె. తత్సంబంధ బాంధవంబున వసుంధరా భార ధౌరంధర్యంబునం గంధ సింధుర ఘటా కూట కపట కిటి కచ్ఛ పావతార నారాయణ భుజంగ భూధరంబులకుఁదోడు జోడై, రాయ గురు పరమేశ్వర సాధుజన విధేయ ఘోడెరాయ సకల కళాధామాది బిరుద భాస్వరుండై, భీమయ గురువరేణ్య పుణ్య కారుణ్య కటాక్షవీక్షా లబ్ధ సుస్థిరైశ్వర్యధుర్యుండై విజయధాటీ సమాటీకనంబుల దిశలల్లాడ నల్లాడ భూవల్లభుండు రాజమహేంద్రంబు రాజధానిగా సింహాద్రి పర్యంతంబుత్కళ కళింగ యవన కర్ణాట లాటాంతర్దీంపంబైన ప్రతాపంబున దిలీప నల నహుష నాభాగ భరత భగీరథ మాంధాతృ ధుంధుమార పూరు పురూరవః ప్రభావుండై విశ్వవిశ్వంభరా భువన మండలంబుం బరిపాలించెఁ; దదనంతరంబ. 32

అర్థము :- ఆ+పుణ్యవంశంబు=ఆ పవిత్రమైన వంశము, కంస+అసుర+ ధ్వంసి= విష్ణువు యొక్క, చరణ పల్లవంబు=చిగురు వంటి పాదము, తనకున్=తనకు, పుట్టినిల్లు

కావునన్=పుట్టిల్లగుట చేత, కారణ గుణ=క్రియానిష్పాదక హేతువులైన సుగుణముల యొక్క, సంక్రమంబునన్=చేరిక చేత, పోలెన్=వలె, చామర=వింజామర, తోమర=చిన్నగుదియ, ఛత్ర=గొడుగు, ధనుస్=ధనుస్సు, ఖడ్గ=కత్తి, ఆది=మొదలైన, చిహ్న=గుర్తులచే (లాంఛనములచే) శోభితంబై=ప్రకాశించినదై, చదలేటి నీటి వలని=ఆకాశ గంగా జలము వలని, సోదరీయ=సోదరునకు సంబంధించినదైన, స్నేహ లబ్ధంబులున్+పోని=చెలిమిచే పొందబడిన వానివంటివైన, పావనత్వ=పవిత్రత, శుచిత్వ=పరిశుద్ధత, గాంభీర్య=నిండుదనము, మాధుర్యంబులు=మంచితనములు, చరిత=ప్రవర్తనచేత, మనస్+స్వభావ= మనస్సు యొక్క నిజగుణము చేత, వచనంబులన్=మాటలచేత(మనసా వాచా కర్మణా) ధరియించి= ధరించి, సైదోడున్=సాటిదనమును, పొదివి=ఆక్రమించి, విశ్వ విశ్వంభరా=సమస్త భూ మండలము నందు, క్రీడనంబు=ఆడుట(ప్రవర్తించుట), తనకు=తనకు, విదిర్చిన= ప్రసాదించిన, పరమ క్షాంతి=మేలైన సహన గుణమును, అంతరంగంబున=హృదయము నందు, సంతరించి=ధరించి, నిఖిల=సమస్తమైన, ప్రపంచమునకు=లోకమునకు, ఆధారంబై= ఆశ్రయమై, ప్రవర్తిల్లె=ప్రవర్తించెను.

అందు=ఆ వంశమునందు, పద్మ నాయకులన=పద్మనాయకులనియు, వెలమలనన్=వెలమలనియు, కమ్మలనన్=కమ్మలనియు, సరిసర్లనన్=సరిసర్లనియు, వంటర్లనన్= వంటర్లనియు, బహు ప్రకార=అనేక విధములుగ, శాఖ+ఉపశాఖ=మహాభాగములు స్వల్ప విభాగములుగ(చిలువలు పలువలు)నై, భిన్నంబులైన=అనేకములైన, మార్గంబులన్= రీతులతో, త్రిమార్గ గంగా=ముప్పోకల యేఱైన గంగానది యొక్క, ప్రవాహంబులున్+ పోలె=ప్రవాహములవలె నెడతెగనివై, గోత్రంబులు=వంశంబులు, ఎన్నియేనియు=ఎన్నెన్నో, జగత్=లోకమును, పవిత్రంబులై=పవిత్రము చేయుచున్నవై, ప్రవహించు చుండన్= అవిచ్ఛిన్నముగ సాగుచుండగా, కల్పంబులు=బ్రహ్మదినములు, అతిక్రమించి=దాటి, మన్వంతరంబులు=డెబ్బది యొక్క దివ్యయుగముల ప్రమాణములు, జరిగి=దాటి, యుగములు=కృతాది యుగములు, సరికడచి=అతిక్రమించి, వత్సరంబులు=సంవత్సరములు, చని=కడచిపోయి, కాలచక్రంబు=అఖండ కాలమనెడి చక్రము, అతిక్రమించుచుండన్=దాటిపోవుచుండగా, చతుర్థకుల=నాల్గవ జాతి యొక్క, మౌళి మండనంబై= శిరస్సున కలంకారమై, కీర్తి=కీర్తి యొక్క, విహార=వేడుకగ సంచరించుటకైన, ఘంటాపథంబైన=రాచబాటయైనట్టి, పంట మహాన్వయంబు=పంటయను గొప్ప వంశము, పాకనాఁటి దేశంబున=పాకనాఁడు అను దేశమున, భద్రపీఠంబున్=రాజ సింహాసనముపై, అధివసించి= ఉండి, సింహ విక్రమ నగర=నెల్లూరు నగరము, దువ్వూరు=దువ్వూరు, గండవర=గండవరము, ఆది=మొదలైన, పట్టనంబులు=నగరములు, నిజనివాసంబులుగా=తమ నివాస

స్థానములుగా, భ్రూలతా=తీగలవంటి కనుబొమలచేత, ఆదిష్ట=ఆదేశింపబడిన, అష్టాదశ=పదునెనిమిది, ద్వీప=ద్వీపములు, అంతరాళులగు=(కూడలి) నడిమి ప్రదేశము కలవారగుచు, భూపాల గ్రామణులన్=రాజశ్రేష్ఠులను, త్రిలింగ భూమండల=శ్రీశైల దక్షారామ కాళేశ్వరములనెడి మూడు శైవ క్షేత్రముల నడిమి భూమికి, ఆఖండలులను=ఇంద్రులను, ప్రోలయ వేమ=ప్రోలయ వేముడు, అన్నపోత=అన్నపోతారెడ్డియు, అన్నవేమ=అనవేమారెడ్డియు, కుమార గిరీశ్వర=కుమార గిరి ప్రభువు, ఆదులన్=మొదలగువారిని, పూజ్య=గౌరవింపతగిన, సామ్రాజ్య=రాజ్యముల, పీఠస్థులన్=సింహాసనముల పైనున్న పాలకులను, కాంచెన్=పొందెను.

తత్+సంబంధ=అరాచరికపు సంబంధము యొక్క, బాంధవంబున=చుట్టరికము చేత, వసుంధరాభార=భూభారమును వహించుట యందలి, ధౌరంధర్యంబు నన్=కార్య నిర్వహణ సామర్థ్యము చేత, గంధ......ధరంబులన్. గంధ సింధుర ఘటాకూట=మదపు టేనుగు సమూహముల కూడలికి, కపట కిటి=మాయవరాహావతార మెత్తినట్టియు, కచ్ఛప+అవతార=ఆదికూర్మావతార మెత్తినట్టియు, నారాయణ=విష్ణువునకు, భుజంగ=సర్పము (ఆదిశేషువు) నకు, భూధరంబులకు=పర్వతములకు, తోడు జోడై=జతకాడై (సమానుడై), రాయగురు పరమేశ్వర="రాయగురు పరమేశ్వర" అనియు, ఘోడెరాయ= "ఘోడెరాయ" యనియు, సకల కళాధామ="సకల కళాధామ" యనియు, ఆది=మొదలైన, బిరుద=బిరుదు నామముల చేత, భాస్వరుండై=ప్రకాశమానుడై, భీమయ=భీమయ్యాయను, గురువరేణ్య=గురువర్యుని యొక్క, పుణ్య కారుణ్య=పవిత్రమైన కరుణ భావముతోడి, కటాక్ష వీక్షా=దయగల చూపులచే, లబ్ధ=పొందబడిన. సుస్థిర=మిక్కిలి నిలుకడైన, ఐశ్వర్య=సంపదను, ధుర్యుండై=వహించువాడై, విజయధాటీ=విజయములతోడి దండయాత్రల యొక్క, సమాటీకనంబులన్=మిక్కిలి గమనము(గంతు)లతో, దిశలు+అల్లాడ=దిక్కులల్లాడునట్లుగ, అల్లాడ భూవల్లభుండు= అల్లాడ భూపతి, రాజమహేంద్రంబు=రాజమహేంద్రమును, రాజధానిగా=రాజధాని నగరముగా, సింహాద్రి పర్యంతంబు=సింహాచలము వరకును, ఉత్కళ=ఓఢ్రదేశము, కళింగ=కళింగ దేశము, యవన=యవన దేశము, కర్ణాట=కన్నడ దేశము, లాట=లాటదేశముల, అంతర్దీపంబైన=లోపల నుండి వెలిగించునదైన, ప్రతాపంబున=శౌర్యము చేత, దిలీప=దిలీప మహారాజు యొక్క, నల=నల మహారాజు యొక్క, నహుష=నహుషుని యొక్క, నాభాగ=నాభాగుని యొక్క, భరత=భరతుని యొక్క, భగీరథ=భగీరథుని యొక్క, మాంధాతృ=మాంధాత యొక్క, ధుంధుమార=ధుంధుమారుని యొక్క, పూరు=పూరు మహారాజు యొక్క, పురూరవస్=పురూరవ మహారాజు యొక్క, ప్రభావుండై=బలము వంటి బలము కలవాడై, విశ్వవిశ్వంభరా భువన మండలంబున్=సమస్తమైన వానిని భరించునట్టి భూమండలమును, పరిపాలించెన్= పరిపాలించెను. తదనంతరంబు= ఆ తరువాత.

భావము :- ఆ పవిత్రమైన వంశమునకు విష్ణుపాదమే పుట్టిల్లు గావున క్రియాశీలమైన సుగుణ రాశిని పొందిన దానివలె వింజామర, ఈటె, గొడుగు, విల్లు, ఖడ్గము మొదలైన లాంఛనములతో ప్రకాశించుచున్నది. ఆకాశగంగతో సోదర సంబంధమును పొందినట్లుగా పవిత్రత, పరిశుభ్రత, నిండుదనము మంచితనములను త్రికరణ శుద్ధిగ పొంది భూభారమును వహించుట చేత కల్గిన విశేషమైన సహన గుణమును పొంది సమస్త లోకమునకు ఆశ్రయమై, ప్రవర్తిల్లినది. ఆ వంశము పద్మనాయకులని, వెలమలని, కమ్మలని, సరిసర్లని వంటర్లని అనేక శాఖోపశాఖలై గంగా ప్రవాహముల వలె లోకమును పవిత్రము చేయుచు వర్థిల్లినవి. ఈ అఖండ కాలమున కల్పములు కడచినవి. మన్వంతరములు దాటినవి. యుగములు మారినవి. సంవత్సరములు దాటినవి. ఇట్లు కాలచక్రము తిరుగుచుండగా నాల్గవ కులమున శ్రేష్ఠమై కీర్తిమంతమైన పంటవంశము పాకనాటిసీమ యందు సింహాసనము నాక్రమించి నెల్లూరు, దువ్వూరు, గండవరము మొదలైన పట్టణములు నివాస స్థానములుగ అలరారినది. వింటినారివలె ఎనిమిది దిక్కులందలి పదునెనిమిది ద్వీపములను కేంద్రస్థానముగ గల్గిన రాజశ్రేష్ఠులు త్రిలింగ దేశమునకు పాలకులైన ప్రోలయ వేమారెడ్డి, అన్నపోతారెడ్డి, అన్న వేమారెడ్డి, కుమారగిరి ప్రభువు మొదలైన రాజులకు జన్మము నిచ్చినది.

రాచరికపు సంబంధము చేత, భూభారమును సమర్థముగ నిర్వహించుట చేత మదపుటేనుగు గుంపుల కూటమితో, వరాహ కూర్మావతారము లెత్తిన విష్ణువుతో, ఆదిశేషునితో, పర్వతముతో సరితూగువాడై-రాయగురు పరమేశ్వర, సాధు జన విధేయ, ఘోడెరాయ, సకల కళాధామ మొదలగు బిరుదములతో ప్రకాశించుచు, గురువరేణ్యులైన భీమయగారి ఆశీర్వాదము కలిగి, స్థిరమైన ఐశ్వర్యమును భరించినవాడై దండయాత్రలుచేసి విజయమును సాధించిన అల్లాడ భూపతి రాజమహేంద్రవరము రాజధానిగ సింహాచల పర్యంతమును, ఉత్కళ కళింగ యవన కర్ణాట లాట దేశములకు తన ప్రతాపకాంతులను ప్రసరింపజేసి దిలీప, నల, నహుష, నాభాగ, భరత, భగీరథ, మాంధాత, ధుంధుమార, పూరు, పురూరవుల శక్తివంటి శక్తిని పొందినవాడై, సమస్తలోకమును పరిపాలించెను. ఆ తరువాత.

**విశేషము** :- అష్టాదశ ద్వీపములు :- 1. రమ్యకము, 2. రమణకము, 3. ద్వారక, 4. సింహళము, 5. కైవల్యము, 6. మలయము, 7. అశ్వభద్రము, 8. కేతుద్వీపము, 9. గోభిద్వీపము, 10. మాల్యవంతము, 11. పుష్కరము, 12. ఋషభము, 13. రైవతము, 14. నిమ్లోచనము, 15. నియామ్యము, 16. పారావారము, 17. చేరకృతము, 18. మాల్యదీపము.

పాకనాడు :- "పాకనాడనునది తూర్పున సముద్ర తీరము; ఉత్తరమున కందుకూరు తాలూకా; దక్షిణమున నెల్లూరు వేంకటగిరి తాలూకాలు; పశ్చిమమున ఉదయగిరి తాలూకా ప్రాంత మధ్యభూమి. -(ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము-పు-212 కుందూరి ఈశ్వరదత్తు)

ప్రోలయవేమారెడ్డి (1324 - 53) :- ఇతడు పాకనాటి దేశమున పంట వంశమునందు దేసటి శాఖకు చెందిన ప్రోలయరెడ్డి కుమారుడు. రెడ్డి రాజ్య స్థాపకుడు. ఇతని రాజధాని అద్దంకి. శ్రీశైల అహోబల క్షేత్రములలో సోపానములు నిర్మించిన దైవభక్తుడు. లొల్ల మహాదేవుని, ఎఱ్ఱాప్రెగడను ఆదరించిన సాహితీ ప్రియుడు. ఎఱ్ఱాప్రెగడ రామాయణమునకు, హరివంశమునకు కృతిభర్త.

అనపోతారెడ్డి (1353 - 64) :- ఇతడు ప్రోలయ వేమారెడ్డి తమ్ముడైన అన్నారెడ్డి కుమారుడు. అద్దంకి నుండి రాజధానిని కొండవీటికి మార్చినవాడు. ఇతని ఆస్థానమున ఎఱ్ఱాప్రెగడ, బాలసరస్వతి, వెన్నెలకంటి కవులు కలరు.

అనవేమారెడ్డి (1364 - 86) :- ఇతడు అనపోతారెడ్డి తమ్ముడు. కొండవీటి సామ్రాజ్యమును విస్తరింపచేసినవాడు. ధర్మవేమనగా ప్రసిద్ధుడు. కర్పూర వసంతరాయ బిరుదాంకితుడు. ఇతని ఆస్థానమున బాలసరస్వతి, త్రిలోచనాచార్యుడు అను సంస్కృత కవులు, ప్రకాశ భారతీయోగి అను తెలుగుకవి కలరు.

కుమారగిరి రెడ్డి (1386 - 1402) :- ఇతడు అనపోతారెడ్డి కుమారుడు. కాటయ వేమారెడ్డికి బావమఱది. లీలాగృహమైన గృహరాజ సౌధమును నిర్మించినవాడు. 'లకుమ' అను ఇతని ప్రేయసి ఈ సౌధమున నాట్యము సలిపెడిది. వసంతరాజ బిరుదాంకితుడు. ఇతడు రచించిన నాట్యశాస్త్ర గ్రంథము 'వసంతరాజీయము'.

తే॥ రాజరఘురాము లల్లాడ రమణ సుతులు
ధాత్రిఁబాలింతు రాచంద్రతారకముగ
వేమభూవల్లభుండును వీరవిభుఁడు
నన్నదమ్ములు హరియును హరియుఁబోలె. 33

అర్థము :- రాజరఘురాములు=రాజులందు శ్రీరాముని వంటివారైన, అల్లాడ రమణ సుతులు=అల్లాడ భూపతి కుమారులు, అన్నదమ్ములు=సోదరులైన, వేమభూవల్లభుండును= వేమభూపాలుడును, వీరవిభుఁడు=వీరభద్ర భూపతియు, హరియును=ఇంద్రుడును, హరియున్=ఉపేంద్రుడు, పోలె=వలె, ధాత్రిన్=భూమిని, ఆచంద్ర తారకముగ=చంద్రుడు చుక్కలు నున్నంత కాలము, పాలింతురు=పరిపాలింతురు.

భావము :- అల్లాడ భూపతికి కుమారులైన వేమభూపాలుడు వీరభద్ర భూపతియు రాజులలో శ్రీరాముని వంటివారు. ఆ అన్నదమ్ములిద్దరు ఇంద్రుడు విష్ణువుల వలె ఈ భూమిని ఆచంద్రతారకముగ పరిపాలింతురు.

విశేషము :- అల్లాడరెడ్డికి వేమారెడ్డి, వీరభద్రారెడ్డి, దొడ్డారెడ్డి, అన్నయ రెడ్డి అని నలుగురు పుత్రులు. అన్యాక్రాంతమైన రాజమహేంద్రవర రాజ్యమును వీరభద్రారెడ్డికి స్వాధీనపరిచినది సోదరుడైన వేమారెడ్డియే. వీరభద్రారెడ్డిని సింహాసన మెక్కించినవాడు కూడ వేమారెడ్డియే. అందువలననే వీరభద్రారెడ్డి రాజ్యప్రదాత, అగ్రజుడునైన వేమారెడ్డికి రాజ్యమున సర్వాధికారములను ఇచ్చినాడు. రాజ్యాధిపతిగ మెలగునట్లు చేసినాడు.

వీరభద్రారెడ్డి భార్య అనితల్లి. ఈమె కాటయ వేమారెడ్డికి దొడ్డాంబిక వలన పుట్టిన పుత్రిక. అల్లాడరెడ్డి కుమారులైన వేమారెడ్డి, వీరభద్రారెడ్డి రాజమహేంద్రవర రాజ్యమును పాలించిన కాలము (1423-45)

"రాజ రఘురాములల్లాడ రమణ సుతులు" అన్న పాదములోని "రఘురాములు" అనుదానిలో దాశరథులవలె నలుగురు అనుసూచన కలదు.

ఉ॥ తమ్ముని వీరభద్ర వసుధాధిపు విక్రమ వీరభద్రుని
స్సమ్మదలీల రాజ్యభరణస్థితిఁ బట్టముఁ గట్టి బాహుద
ర్పమ్మున వేమభూవరుఁడు వ్రాసె జగద్విజయ ప్రశస్తి వ
ర్ణమ్ములు దిగ్దురంధర సురద్విప కుంభ విషాణ మండలిన్ 34

అర్థము :- వేమభూవరుఁడు = వేమభూపతి, బాహుదర్పమ్మునన్ = భుజబలముతో, విక్రమవీరభద్రునిన్ = పరాక్రమమున వీరభద్రుడైన, తమ్ముని = సోదరుడైన, వీరభద్ర వసుధాధిపున్ = వీరభద్ర భూపతిని, సమ్మదలీలన్ = సంతోష విలాసములతో, రాజ్యభరణ స్థితిన్ = రాజ్యభారమును వహించుట యందు, పట్టముఁగట్టి = పట్టాభిషేకము చేసి, దిక్ + దురంధర = దిక్కుల బరువును మోయు, సురద్విప = దేవగజములయొక్క, కుంభ విషాణ = కుంభస్థలములందలి దంతముల యొక్క, మండలిన్ = సమూహములందు, జగత్ + విజయ = లోకము యొక్క విజయములకు సంబంధించిన, ప్రశస్తి వర్ణమ్ములు = ప్రశంసాక్షరము (శాసనము)లను, వ్రాసెన్ = వ్రాసెను.

భావము: వేమభూపాలుడు పరాక్రమమున వీరభద్రుడైన తన తమ్ముడు వీరభద్రభూపతిని రాజుగ పట్టాభిషిక్తుని చేసి, తన బాహుబలముతో విజయ శాసనములను దిగ్దంతుల కుంభస్థలములందలి దంతములపై వ్రాయించెను.

**విశేషము:** ఈ పద్యములో మొదటి పాదమున అఖండయతి వేయబడినది. విశేషములకు చూడుడు భీమ - 1-12.

అలంకారము - అతిశయోక్తి.

సీ॥ పాతాళ భువనాధిపతికి శేషాహికిఁ
ప్రియలతో మసకానఁ బెనఁగఁగలిగె
దిక్సింధురములకు దివ్యవాహిని లోనఁ
దేఁటి రాయిడి మానఁ దేల నొదవె
నుర్వీధరములకు నుదధిలోఁగాఁపున్న
కొలము సాముల యిండ్లఁ గుడువనబ్బెఁ
గుహనాకిటికి లక్ష్మి కుచకుంభముల మీఁది
కుంకుమంబున నుసుల్ కొనఁగఁ గూడె

తే॥ రాయ వేశ్యాభుజంగ వీరప్రతాప
భాసి యల్లాడ విభు వీరభద్ర నృపతి
సర్వసర్వంసహాచక్ర సర్వభరము
పృథు భుజాపీఠమున సంభరించుటయును. 35

**అర్థము:** రాయవేశ్యా భుజంగ=రాయవేశ్యా భుజంగ యనియు, వీరప్రతాప = వీరప్రతాప యనియు, బిరుదు నామములతో, భాసి = ప్రకాశించు, అల్లాడ విభు వీరభద్ర నృపతి = అల్లాడ భూపతి కుమారుడైన వీరభద్ర భూపతి, పృథు భుజాపీఠమున = గొప్ప భుజమనెడి గద్దెపై, సర్వ సర్వంసహాచక్ర = (అన్నింటిని భరించునదైన) భూమండలము యొక్క, సర్వ భరమున్ = పూర్తి భారమును, సంభరించుటయును = మోయగా;

పాతాళభువన + అధిపతికిన్ = పాతాళ లోకమునకు ప్రభువైన, శేషాహికిన్ = ఆదిశేషుడను సర్పరాజునకు, ప్రియలతో = ప్రియురాండ్రతో, మసకానన్ = సురతక్రీడ యందు, పెనఁగన్ = పెనవేసికొనుట, కలిగెన్ = సంభవించినది;

దిక్ + సింధురములకు = దిక్కులయందలి యేనుగులకు, తేఁటి = తుమ్మెదల యొక్క, రాయిడి = బాధ, మానన్ = తీరుటకై, దివ్యవాహినిలోనన్ = ఆకాశగంగలో, తేలన్= క్రీడించుట, ఒదవెన్ = కలిగినది;

ఉర్వీధరములకున్ = పర్వతములకు, ఉదధిలోన్ = సముద్రములో, కాఁపున్న = నివాసమున్న, కొలము సాముల = సజాతీయ రాజులయొక్క, ఇండ్లన్ = ఇండ్లయందు, కుడువన్ = భుజించుట, అబ్బెన్ = సిద్ధించినది;

కుహనా కిటికి = మాయవరాహమునకు (వరాహావతార మెత్తిన విష్ణువునకు), లక్ష్మి= లక్ష్మీదేవి యొక్క; కుచకుంభముల మీఁది = కుండలవంటి స్తనముల పైగల, కుంకుమంబు నన్ = లేపన ద్రవ్యముతో, నుసుల్కొనఁగన్ = మెదలుట (నలుపుట)కు, కూడెన్ = శక్యమయ్యెను.

**భావము:** రాయ వేశ్యాభుజంగ, వీరప్రతాప అను బిరుదములతో అలరారు వీరభద్రభూపతి సర్వ భూమండలము యొక్క పూర్తి భారమును తన భుజములపై మోయుచుండగా ఆదిశేషుడు భూమిని మోయుపని తప్పి ప్రియ నాగులతో సుఖించుచుండెను. దిగ్గజములు దిక్కులు మోయుపని లేక తుమ్మెదలబాధను తప్పించుకొనుటకై ఆకాశగంగలో క్రీడించుటకు వెళ్ళినవి. కుల పర్వతములు సముద్రములో నివాసమున్న తమ వంశాధిపతుల ఇండ్లలో సుష్టుభోజనము చేయుచుండెను. భూమిని కాపాడుటకు వరాహావతారమెత్తిన విష్ణువు నిర్విచారుడై లక్ష్మీదేవితో క్రీడించుచుండెను.

**విశేషము:** ఆదిశేషుడు, దిగ్గజములు, సప్త పర్వతములు, ఆదివరాహము - భూమిని మోయుచుండునని పురాణవాక్కు. వీరభద్రారెడ్డి భూభారమును వహించుటచేత పైవారికి కర్తవ్య భారము తొలగినది. అందుచే వారు సుఖించుచుండిరి అని కవి చమత్కారము.

అలంకారము - అతిశయోక్తి.

క. **వేరీ ధరణిపు లల్లయ**
**వీరక్ష్మాపతికి సాటి వితరణ గరిమన్**
**ధారాధరధారాధర**
**ధారాధరవాహదానధారానిధికిన్.** 36

**అర్థము:** ధారాధర ధారా = మేఘములు కురియించు నీటి ధారలచేత, అధర=క్రిందు చేయబడిన, ధారాధరవాహ=మేఘవాహనుడైన ఇంద్రుడుకల, దానధారా=దానధారలకు, నిధికిన్ = నిలయమైనవాడైన, అల్లయ వీరక్ష్మాపతికి = అల్లాడరెడ్డి కుమారుడైన వీరభద్ర భూపతికి, వితరణ గరిమన్ = దాన విభవమునందు, సాటి = ఈడువచ్చు, ధరణిపులు = రాజులు, వేరీ = ఏరి?

**భావము:** మేఘములు కురియించు వర్షధారలకంటె హెచ్చైన దానధారలను కురియించి, మేఘవాహనుడైన దేవేంద్రుని మించిన వితరణశీలియైన వీరభద్ర భూపతికి సాటిరాగల రాజులు లేరు.

విశేషము: ఈ పద్యము కాశీఖండము నందు కూడ శ్రీనాథుడు వ్రాసినాడు. (కాశీ-1-47)

ఈ పద్యమును శ్రీ మల్లంపల్లి శరభేశ్వర శర్మ గారిట్లు వ్యాఖ్యానించిరి.

ధారాధర = మేఘమునకు వలె; ధారాధర = రోహణ పర్వతమునకు వలె; ధారాధరవాహ = జీమూతవాహనునికివలె; దానధారా = దానధారలకు; నిధికిన్ = నిధానమైన; అల్లయ వీరక్ష్మాపతికిన్ = అల్లయ వీరభూపతికి; వితరణ గరిమన్ = దాన వైభవము నందు; సాటి = సాటియైన; ధరణిపులు = రాజులు; వేరీ = ఎచ్చట నున్నారో;

తాత్పర్యము: మేఘమునకు వలె, రోహణ పర్వతమునకు వలె, జీమూత వాహనునికివలె; దానధారానిధియైన, దాతృత్వ ప్రసిద్ధి గల యల్లయ వీరభద్రునికి వితరణ వైభవము నందు సాటియైన రాజు లెచ్చటనున్నారు?

-తెలుగు విశ్వవిద్యాలయ ప్రచురణ (కాశీ-పుట-52).

ఈ పద్యము నందు వర్ణ విన్యాస వక్రత కలదు.

మహాస్రగ్ధర: **ఫణిరాజ స్తబ్ధరోమ ప్రకటకమఠరాట్పర్వతశ్రేణి దిగ్వా**
**రణ ధౌరంధర్యధారారభటి సమధిక ప్రౌఢ బాహాప్రతాప**
**ప్రణత ప్రత్యర్థి పృథ్వీపతి మకుట మణీభాసమానాంఘ్రిపీఠున్**
**బ్రణుతింతున్ వీరభద్రుం బ్రతిభట ధరణీపాల కాలాగ్ని రుద్రున్. 37**

అర్థము: ఫణిరాజ . . . . పీఠున్. ఫణిరాజ = సర్పములకు రాజైన ఆదిశేషుడు స్తబ్ధరోమ = (నిక్కబొడిచిన వెంద్రుకలు కలది) ఆది వరాహము, ప్రకటకమఠరాట్ = ప్రసిద్ధమైన తాబేలురాజు (ఆదికూర్మము), పర్వతశ్రేణి = కొండల సమూహము, దిగ్వారణ = దిగ్గజములవలె; ధౌరంధర్యధారా = బరువు మోయుటల యెడతెగని వరుసలందు, ఆరభటి = సాహసము నందు, సమధిక = మిక్కిలి యెక్కువైన ప్రౌఢ = నిపుణమైన, బాహాప్రతాప = భుజపరాక్రమముచేత, ప్రణత = నమస్కరింపబడిన, ప్రత్యర్థి పృథ్వీపతి = శత్రురాజులయొక్క, మకుట = కిరీటములందలి, మణీ = మణుల కాంతులతో, భాసమాన = వెలుగుచున్న, అంఘ్రిపీఠున్ = పాదపీఠము గల, ప్రతి . . . రుద్రున్ = ప్రతిభట ధరణీపాల = శత్రు రాజులకు, కాలాగ్నిరుద్రున్ = ప్రళయకాలము నందలి అగ్నివంటి భయంకరుడైన, వీరభద్రున్ = వీరభద్రభూపతిని, ప్రణుతింతున్ = నమస్కరింతును.

భావము: ఆదిశేషునకన్న ఆదివరాహముకన్న ఆదికూర్మముకన్న కులపర్వత సమూహముకన్న దిగ్గజములకన్నను నిర్వహణ సామర్థ్యము నందు అధికమైన బాహు విక్రమము కలవాడు వీరభద్ర భూపతి. శత్రురాజులపాలిటి కాలాగ్నిరుద్రుడతడు. శత్రురాజులు నమస్కరించినపుడు వారి కిరీటములందలి మణుల కాంతులతో వీరభద్ర భూపాలుని పాదపీఠము కాంతిమంతమై ప్రకాశించుచుండును. అట్టి అల్లయ వీరభద్రభూపతిని కీర్తింతును.

విశేషము: మహాస్రగ్ధర వృత్తమునకు 'సతతనసరరగ' అనునవి గణములు. యతి.1-9-16.

సీ॥ **పండువాసురతాణి పావడం బిచ్చిన**
**భద్రేభములు వీథిఁ బాలె ముందు;**
**నొడ్డె ధాత్రీనాథుఁ డుపద పుత్తెంచిన**
**బింబారుణోష్ఠి సంబెళ వహించుఁ;**

గర్ణాట భూపతి కానుక యనిచిన
ముక్తాతపత్రంబు మ్రోల మెఱయు;
యవనాధిపతి యుపాయనముగా నొసఁగిన
పాగాహయంబులు వాగె వచ్చు;
తే॥ దూరమంతంత బారుహదొంతి మన్నె
సప్తమాడియ రాజన్య సమితి మ్రొక్కు
రాయవేశ్యాభుజంగ సంగ్రామ పార్థ
గాయ గోవాళ వేమన క్ష్మాధవునకు. 38

అర్థము: రాయ వేశ్యాభుజంగ = 'రాయ వేశ్యాభుజంగ' యనియు, సంగ్రామ పార్థ = 'సంగ్రామ పార్థ' యనియు, గాయ గోవాళ = 'గాయ గోవాళ' అనియు బిరుదములు కల, వేమన క్ష్మాధవునకు = వేమ భూపాలునకు;

పండువాసురతాణి = పండువారాజ్యమునేలు సుల్తాను, పావడంబు = కప్పముగ, ఇచ్చిన = ఇచ్చినట్టి, భద్ర + ఇభములు = భద్రజాతి యేనుగులు, వీథిన్ = రాజమార్గము నందు, పాలెముండున్ = కాపుండును;

ఒడ్డె ధాత్రీనాథుండు = ఓఢ్రదేశపు రాజు, ఉపద = కానుకగ, పుత్తెంచిన = పంపిన, బింబ + అధర + ఓష్ఠి = (దొండపండు వంటి యెఱ్ఱని పెదవిగల) సుందరి, సంబెళ = వక్కలాకులతిత్తిని, వహించున్ = పూనియుండును;

కర్ణాట భూపతి = కన్నడదేశపు రాజు, కానుక = బహుమానముగ, అనిచిన = పంపిన, ముక్త + ఆతపత్రంబు = ముత్యాలగొడుగు, మ్రోలన్ = సమీపమున, మెఱయు = ప్రకాశించు చుండును;

యవనాధిపతి = యవనదేశపు రాజు, ఉపాయనము గాన్ = కానుకగ, ఒసఁగిన = ఇచ్చిన, పాగాహయంబులు = పొగఱుబోతు గుఱ్ఱములు, వాగెవచ్చు = కళ్ళెపు పగ్గములు తగిలించు వారికి లొంగును;

బారుహదొంతి = బారుహదొంతి రాజ్యముల యొక్కయు, మన్నె సప్తమాడియ = ఏడైన మన్నె సంస్థానముల యొక్కయు, రాజన్య సమితి = రాజుల యొక్క సమూహము, దూరమంతంత = అంతంత దూరము నుండియే, మ్రొక్కున్ = నమస్కరించును;

భావము:- రాయవేశ్యా భుజంగ, సంగ్రామ పార్థ, గాయ గోవాళ మొదలైన బిరుదములు గల వేమభూపాలునకు పండువా దేశపు సుల్తాను కప్పముగ పంపిన భద్రజాతి యేనుగులు

రాజవీథియందు కాపుండును. ఓఢ్రదేశపు రాజు బహుమానముగ పంపిన సుందరి వక్కలాకుల తిత్తిని పట్టుకొని చెంతనుండును. కన్నడదేశపు రాజు కానుక చేసిన ముత్యాల వెల్లగొడుగు సమీపమున ప్రకాశించుచుండును. యవనదేశపు రాజు బహుమానముగ నిచ్చిన పాగరుబోతు గుఱ్ఱములు కళ్ళెములకు లొంగియున్నవి. బారుహదొంతి సప్తమాడె మన్నెరాజులు అంతంత దూరమునుండియే నమస్కరింతురు.

విశేషము: సప్తమాడె, బారుహదొంతి:- సప్తమాడె = గంజాము మన్నెదొరలఏడు సంస్థానములనియు; బారుహదొంతి = ఒరిస్సాలో భాగమనియు - శ్రీ మల్లంపల్లివారే తెల్పిరి.

పండువా : బెంగాలులోని యిప్పటి మాల్డాజిల్లా. -ఆంధ్రుల సాంఘిక చరిత్ర - పుట - 66. సురవరం ప్రతాపరెడ్డి. చూడుడు భీమ - 1-29, 1-63.

పదునాల్గు పదైదు శతాబ్దులలో పశ్చిమ బంగాళాన్ని పాలించిన సుల్తానుల రాజధానియైన 'ఫాండవా పట్టణం 'పండువా' అని శ్రీనాథుని ప్రయోగాల్లో కన్పిస్తుంది. ఆచార్య తూమాటి దొణప్ప - శ్రీనాథ సాహితిలో అన్యదేశ్యపదాలు.

రాజమహేంద్రవర రాజ్యముపై యుద్ధమున ఓడిన రాజులందరు కప్పములు, బహుమానములు సమర్పించుచుండిరి. ఇవన్నియు రెడ్డి రాజ్యమునకు చుట్టుపట్ల గల సామంతరాజ్యములు. ఈ పద్యమున చెప్పబడినవి వేమభూపాలుని విజయములు.

ఈ పద్యము కాశీఖండము నందును (1-35) యథాతథముగ కలదు.

శా॥ దేవ బ్రాహ్మణ భక్తి వర్ధిత ధరిత్రీచక్ర సామ్రాజ్య ల
క్ష్మీ వాస్తోష్పతి సంస్తుతింపఁగఁదగున్ శ్రీ వేమ పృథ్వీశ్వరున్
లావణ్యాపర మత్స్యలాంఛనుని నా లంకాపురీ శంకర
గ్రావాభ్యంతరకూలముద్వహయశః కల్లోలినీ వల్లభున్. 39

అర్థము: దేవ = దేవతల యందలి, బ్రాహ్మణ = బ్రాహ్మణుల యందలి, భక్తి = భక్తితో, వర్ధిత = పెంచబడిన, ధరిత్రీచక్ర = భూమండలము యొక్క, సామ్రాజ్యలక్ష్మీ = సామ్రాజ్య సంపదకు, వాస్తోష్పతి = ఇంద్రుడును, లావణ్య = సౌందర్యమునందు, అపర = మరియొక, మత్స్యలాంఛనునిన్ = (చేపను ధ్వజము గల) మన్మథుడైనవాడు, ఆ లంకాపురీ = ఆ లంకానగరము నుండి, శంకర గ్రావ = (శివుని పర్వతమగు) కైలాసముల యొక్క, అభ్యంతర = మధ్యప్రదేశమునందు, కూలముద్వహ = ఒడ్డులనొరసికొని ప్రవహించు, యశః కల్లోలినీ = యశమనెడి నదికి, వల్లభున్ = నాయకుడైన, శ్రీ వేమ పృథ్వీశ్వరున్ = శ్రీ వేమ భూపాలుని, సంస్తుతింపఁగన్ = మిక్కిలిగ ప్రశంసించుట, తగున్ = అర్హమగును.

భావము: శ్రీ వేమభూపాలుడు దేవతలయందు, బ్రాహ్మణులయందు భక్తితో పెంచబడిన సామ్రాజ్యసంపదకు ఇంద్రుడు. అందములో అపరమన్మథుడు. లంకానగరము నుండి కైలాస పర్వతమువరకు గల మధ్యప్రదేశమున ఒడ్డనొరసి ప్రవహించు యశోనదికి నాయకుడు. అట్టి వేమభూపాలుని గొప్పగ ప్రశంసించుట అర్థమే యగును.

విశేషము: చుట్టుపట్ల గల రాజ్యములను గెలిచి ఆయా రాజ్యముల రాజులను సామంతులుగ జేసికొనిన వేమారెడ్డి కీర్తి, దక్షిణమున లంకానగరము నుండి, ఉత్తరమునగల కైలాస పర్వతము వరకు గల సర్వ భారతదేశము నందును కూలముద్వహ కల్లోలినిగా వ్యాపించినది.

అలంకారము - అతిశయోక్తి.

**క॥ కాంచీ శ్రీగిరి కాశీ**
**పంచారామాది దేవభవనంబుల వ్రా**
**యించెను వేమక్ష్మాపతి**
**యంచితభూదానశాసనాక్షరపంక్తుల్.** 40

అర్థము: వేమక్ష్మాపతి = వేమ భూపాలుడు, కాంచీ = కంచి, శ్రీగిరి = శ్రీశైలము, కాశీ = కాశి, పంచారామ = ఐదు శైవ క్షేత్రములు, ఆది = మొదలైన, దేవభవనంబులన్ = దేవాలయములందు. అంచిత = ఒప్పిదమైన, భూదాన = భూమిని దానముచేయుటకు సంబంధించిన, శాసనాక్షర పంక్తుల్ = శాసనములలోని అక్షరములతో కూడిన వాక్యములను, వ్రాయించెను = వ్రాయించెను.

భావము: వేమభూపతి కంచి, శ్రీశైలము, కాశీ, పంచారామములు మొదలైనచోట్ల గల దేవాలయములందు ఒప్పిదమైన భూదాన శాసనములను వ్రాయించెను.

విశేషము: పంచారామములు = 1. అమరారామము, 2. సోమారామము, 3. క్షీరారామము, 4. కుమారారామము, 5. భీమారామము అనునవి

చూడుడు భీమఖండము ఆ-4. వచనము 151.

పంచారామ విశేషములు భీమ - 2-61 చెంత వివరింపబడినవి.

**సీ॥ ధరియింప నేర్చిరి దర్భ వెట్టెడు వ్రేళ్ళ**
**లీల మాణిక్యాంగుళీయకములు;**
**కల్పింపనేర్చిరి గంగమట్టియ మీఁదఁ**
**గస్తూరికా పుండ్రకములు నొసల;**

సవరింప నేర్చిరి జన్నిదంబుల ప్రోలఁ
దారహారములు ముత్యాల సరులు;
చేర్పంగ నేర్చిరి శిఖల నెన్నడుములఁ
గమ్మని క్రొత్త చెంగల్వ విరులు;

తే॥ ధామముల వెండియును పైఁడి దడఁబడంగ
బ్రాహ్మణోత్తము లగ్రహారములలోన
వేమ భూపాలుడనుజన్ము వీరభద్రు
ధాత్రి యేలింప గౌతమీతటమునందు. 41

అర్థము: వేమ భూపాలుడు = వేమ భూపతి, అనుజన్ము వీరభద్రు = తమ్ముడైన వీరభద్ర భూపతిచేత, ధాత్రిన్ = భూమిని, ఏలింపన్ = పాలింపజేయుచుండగా, గౌతమీ తటమునందు = గోదావరి తీరమందలి, అగ్రహారములలోన = పన్నులు లేకుండ దానమీయబడిన గ్రామములలోని, బ్రాహ్మణోత్తములు = బ్రాహ్మణ శ్రేష్ఠులు, ధామముల = ఇండ్లయందు, వెండియును = వెండియు, పైఁడి = బంగారము, తడబడంగన్ = నిండియుంటగా (ఒకదానికంటె మరొకటి యెక్కువై దొరలాడుచుండగా);

దర్భన్ + పెట్టెడు = దర్భ పవిత్రములను పెట్టుకొను, వ్రేళ్ళ = వ్రేళ్ళకు, లీల = విలాసముగ, మాణిక్య = కెంపులు పొదిగిన, అంగుళీయకములు = ఉంగరములు, ధరియింపనేర్చిరి = ధరించుట నేర్చుకొనిరి;

నొసలన్ = నుదుట, గంగమట్టియమీఁదన్ = స్నానానంతరము గంగ మట్టితో పెట్టుకొను బొట్టుమీదనే, కస్తూరికా = కస్తూరితో, పుండ్రకములు = నుదుటి బొట్టులు, కల్పింప నేర్చిరి = రచించుట నేర్చుకొనిరి;

జన్నిదంబుల ప్రోలన్ = జందెముల సమీపమున, తారహారములు = వెండిదండలు, ముత్యాలసరులు = ముత్యాలదండలు, సవరింపనేర్చిరి = ధరించుట నేర్చుకొనిరి;

శిఖల = జుట్టుముడుల (పిల్లజుట్టుల) యొక్క, నెన్నడుములన్ = నడిమి భాగములందు, కమ్మని = సువాసన గల, క్రొత్త చెంగల్వ విరులు = అప్పుడే వికసించిన ఎఱ్ఱకలువ పూలు, చేర్పంగ నేర్చిరి = (తురుముట) ఉంచుట నేర్చుకొనిరి.

భావము: వేమభూపతి తన తమ్ముడైన వీరభద్ర భూపతిచేత రాజ్యపాలన చేయించుచుండగా గోదావరి తీరము నందలి అగ్రహారములలోని బ్రాహ్మణోత్తముల ఇండ్ల

యందు వెండి, బంగారము లోకదానిని మించి మరియొకటి దొరలుచున్నవి. ఆ బ్రాహ్మణోత్తములు దర్భ పవిత్రములు ధరించు చేతివ్రేళ్ళకు కెంపులు పొదిగిన యుంగరములను ధరించుట నేర్చిరి. నొసట గంగమట్టి బొట్టు మీదనే కస్తూరితో బొట్టును తీర్చిదిద్దుట నేర్చిరి. జందెములతోపాటుగ వెండి దండలను ముత్యాల దండలను ధరించుట నేర్చుకొనిరి. జుట్టుముడుల మధ్య భాగములందు సువాసన లీనుచు అప్పుడే విరిసిన ఎఱ్ఱకలువ పూలను ధరించుట నేర్చిరి.

**విశేషము:** బ్రాహ్మణోత్తములు: వేదవిహిత కర్మనిష్ఠులైనవారు.

వీరభద్రభూపతి పరిపాలన కాలమున గోదావరీ తీరము నందలి అగ్రహారములు సంపన్నిలయములైనను - అందలి బ్రాహ్మణులు తమ విహిత కర్మనిష్ఠను మాత్రము వదలలేదు. కనుకనే దర్భ పవిత్రములతోపాటుగ కెంపుల యుంగరములను, నొసట గంగ బొట్టుపైననే కస్తూరి బొట్టును, జందెములతోపాటుగ వెండి దండలు, ముత్యాల దండలను, *శిఖలపైననే చెంగల్వలను ధరించిరి. కనుక ఈ భావము వారి వైదిక కర్మ నిష్ఠాగరిష్ఠతకు, ఐశ్వర్యమునకు చిహ్నము.

ఈ పద్యము కూడ కాశీఖండములో (1-37) యథాక్షరముగ కలదు.

తే॥ ధర్మ శాసన ఘన శిలాస్తంభమెత్తె
శ్రీ మృకండూద్భవ స్వామి శివుని మ్రోల
వీరభద్రేశుఁడాచంద్రతారకముగ
నగ్రహారాళి నఖిల మాన్యంబు లొసఁగి. 42

**అర్థము:** వీరభద్రేశుఁడు = వీరభద్ర భూపతి, ఆచంద్ర తారకముగన్ = చంద్రుడు నక్షత్రములు ప్రకాశించునంతవరకునని (శాశ్వతముగనని), అగ్రహారాళిన్ = అగ్రహారముల సముదాయమును, అఖిల మాన్యంబులు = సమస్తమును మాన్యములనుగ, ఒసఁగి = ఇచ్చి, శ్రీమృకుండూద్భవ స్వామి శివుని మ్రోలన్ = శ్రీమృకుండూద్భవ స్వామి యనుపేరు గల శంకరుని చెంత, ధర్మశాసన = దానము చేసినట్లు చూపు ఆజ్ఞావాక్యములను వ్రాసిన, ఘన శిలా స్తంభము = గొప్పరాతి స్తంభమును, ఎత్తెన్ = నెలకొల్పెను.

**భావము:** వీరభద్ర భూపతి అగ్రహారములను, సర్వమాన్యములను శాశ్వతముగ దానము చేసి, ఆ దానములకు సంబంధించిన ఆజ్ఞావాక్యములను పెద్ద రాతిస్తంభముపై చెక్కించి శ్రీమృకండూద్భవ స్వామివారి సమీపమున నెలకొల్పెను.

సీ॥ కమలాచలాగ్ర మార్కండేయ శివశిర
శ్శశి చంద్రికా ధౌత సౌధ వీథి
గోదావరీ పుణ్యకూలంకషా జల
స్ఫారిత శ్రీరుద్ర పాద యుగళి
బలవదభ్యున్నత ప్రాకార పరివేష
గండూషితాజాండ మండలంబు
గంధ దంతావళ గ్రైవేయ ఘంటికా
ఠంకార ముఖర ఘంటా పథంబు

తే॥ రాజబింబాననానూత్న రత్న పేటి
వీర రాహుత్త సుభట కంఠీరవాద్రి
వేమభూపాల రాజ్యాభివృద్ధికరము
సాంద్ర విభవంబు రాజమహేంద్రవరము. 43

అర్థము: రాజమహేంద్రవరము=రాజమహేంద్రవరమనెడి రాజధానీ నగరము, కమలాచల=కమలాచలము నందలి, మార్కండేయ శివ=మార్కండేయ శివుడను పేరుగల శంకరుని, శిరస్+శశి=తలపై గల చంద్రుని యొక్క, చంద్రికా=వెన్నెలచేత, ధౌత=తెల్లగా చేయబడిన, సౌధవీథి=మేడల వరుసలు కలది;

గోదావరీ=గోదావరియను, పుణ్య=పవిత్రమైన, కూలంకషాజల=నది యొక్క నీటిచేత, స్ఫారిత=విరివిగ చేయబడిన, శ్రీరుద్రపాద యుగళి=శుభంకరుడైన రుద్రుని పాదముల జంట కలది;

బలవత్ + అభ్యున్నత=దృఢమై మిక్కిలి యెత్తైన, ప్రాకార పరివేష=గాలిగుడి వంటి ప్రాకారము చేత, గండూషిత=పుక్కిలింపబడిన, అజాండమండలంబు=బ్రహ్మాండము యొక్క సమూహము కలది;

గంధ దంతావళ=మదపుటేనుగుల యొక్క, గ్రైవేయ=మెడల యందలి, ఘంటికా= చిఱు గంటల యొక్క, ఠంకార=ఠంఠమ్మను శబ్దములతో, ముఖర=మ్రోగు, ఘంటా పథమ్ము=రాజవీథులు కలది;

రాజబింబ+అననా=చంద్రబింబము వంటి మొగములు గల కాంతలనెడి, నూత్న రత్న=క్రొత్త రత్నములకు, పేటి=పెట్టెయైనది, వీరరాహుత్తసుభట=రౌతులు ఉత్తమ వీరులనెడి, కంఠీరవాద్రి=సింహ పర్వతమైనది, వేమ భూపాల=వేమభూపాలుని, రాజ్య=రాజ్యమునకు, అభివృద్ధికరము= పెంపుదలను కల్గించునది, సాంద్ర విభవంబు=దట్టమైన సంపద కలది.

భావము :- రాజమహేంద్రవర నగరము దట్టమైన సంపదలతో విరాజిల్లుచుండును. కమలాచలముపై వెలసిన మార్కండేయ శివుని శిరముపైగల చంద్రుని వెన్నెలతో ఆ నగర వీథులు తెల్లనగుచుండును. పవిత్ర గోదావరీ నదీ జలముతో సుసంపన్నమైన శ్రీరుద్ర పాదయుగము కలది. నగరమునకు చుట్టును గాలి గుడి వంటి ప్రాకారము విస్తరించియున్నది. మదపుటేనుగుల మెడలలోని చిఱుగంటలచేత ఆ నగర రాజవీథులు మ్రోగుచుండును. సుందరీమణులకు నిలయము. మహావీరులైన రౌతులనెడి సింహములకు పర్వతము. వేమభూపాలుని రాజ్యాభివృద్ధికరమైనది.

విశేషము :- రుద్రపాద యుగళి : చూడుడు భీమ. 3 - 21 పద్యవిశేషములు.

## కృతిపతి వంశ వర్ణనము

తే॥ వీరభద్రేశ వేమపృథ్వీధవులకు
మంత్రియగు బెండపూడఁన్న మంత్రివరుని
విమల వంశావతారంబు విస్తరింతు
నభ్యుదయ హేతువుగఁబ్రబంధాదియందు 44

అర్థము :- వీరభద్రేశ=వీరభద్రభూపాలునకును, వేమ పృథ్వీధవులకు=వేమ భూపాలునకును, మంత్రియగు=మంత్రియైనట్టి, బెండపూఁడన్న మంత్రివరుని=బెండపూడి అన్నయ మంత్రివర్యుని, విమల=పవిత్రమైన, వంశావతారంబు=వంశము యొక్కరూపమును, అభ్యుదయ హేతువుగన్=అభివృద్ధి సూచకముగ, ప్రబంధాదియందు=కావ్య ప్రారంభమునందు, విస్తరింతున్=వివరింతును.

భావము :- వీరభద్రభూపతికి వేమభూపతికిని మంత్రియైన బెండపూడి అన్నయ మంత్రి యొక్క పవిత్ర వంశ రూపమును గూర్చి ఆ వంశపు అభివృద్ధిని కోరి యీ కావ్య ప్రారంభమున వివరించెదను.

సీ॥ ఆకాశ లక్ష్మికి నవతంసకంబైన
మునిమండలములోని మొదలిచుక్క
యఖకాల బ్రహ్మాండ మప్పళించిన యట్టి
చిన్నివేల్పుల రాజుఁగన్న తండ్రి
యాది కల్పంబునాఁడఖిల ప్రపంచంబు
సృజియించు బ్రహ్మకుఁజేయిదోడు
పరశురాముని చేతఁ బాథోధి మేఖలా
భరము దానముఁగొన్న బ్రాహ్మణుండు

తే॥ పేరు దక్ష ప్రజాపతి పెండ్లి కొడుకు
కశ్యప బ్రహ్మ నిజవంశ కర్త గాఁగ
వెలసె నుభయాన్వయంబులు వృద్ధిఁబొంద
వ్రాలుఁబ్రాలును గల మంత్రి పోల మంత్రి 45

అర్థము :- ఆకాశలక్ష్మికిన్=ఆకాశమనెడు లక్ష్మీదేవికి, అవతంసకంబైన=తలమీది అభరణమైన, ముని మండలములోని=సప్తర్షివలయములోని, మొదలి చుక్క=మొదటి నక్షత్రమైన వాడును;

అఱకాలన్=అఱికాలితో, బ్రహ్మాండంబున్=భువన గోళమును, అప్పళించిన యట్టి=ఆక్రమించినటువంటి, చిన్ని వేల్పులరాజున్= (దేవేంద్రుని తమ్ముడైన) ఉపేంద్రుని, కన్నతండ్రి=కనిన తండ్రియైన వాడును;

ఆది కల్పంబునాఁడు=కల్పాది దినమున (బ్రహ్మ సృష్టిని మొదలు పెట్టినపుడు) అఖిల ప్రపంచంబున్=సమస్తమైన విశ్వమును, సృజియించు=పుట్టించు, బ్రహ్మకున్=బ్రహ్మ దేవునకు, చేయిదోడు=సహాయము చేసినవాడును;

పరశురాముని చేతన్=జమదగ్ని కుమారుడైన పరశురాముని చేత, పాథోధి మేఖలా భరమున్=సముద్రములే ఒడ్డాణముగ గల భూమిని, దానమున్ కొన్న=దానముగ పొందిన, బ్రాహ్మణుండు=బ్రహ్మజ్ఞాని యైనవాడును;

పేరు=అతిశయించు, దక్షప్రజాపతి=దక్షుడను ప్రజాపతి యొక్క, పెండ్లి కొడుకు=అల్లుడైన, కశ్యప బ్రహ్మ=కశ్యపుడను ప్రజాపతి, నిజవంశ కర్తగాఁగ=తన వంశమునకు మూల పురుషుడు కాగా, ఉభయాన్వయంబులు=తల్లిదండ్రులిద్దరి వంశములును, వృద్ధిఁబొందన్=అభివృద్ధి చెందగా, వ్రాలుఁబ్రాలును=గుండ్రని అక్షరములును, బియ్యమును, కల=కల్గిన, మంత్రి=మంత్రియైన, పోలమంత్రి=పోలయ మంత్రి, వెలసెన్= ప్రకాశించెను (ప్రసిద్ధి పొందెను).

భావము :- పోలయ మంత్రి పౌరుషశాలి. సమర్థుడు. ఇతని వంశ మూల పురుషుడు కశ్యప బ్రహ్మ. ఇతనినే కశ్యప ప్రజాపతియనియు, కశ్యప మహర్షియనియు అందురు. ఈ కశ్యపుడెట్టివాడు? ఆకాశమునకు శిరోభూషణమై ప్రకాశించు సప్తర్షి వలయమున మొదటి చుక్క. అరికాలితో బ్రహ్మాండ గోళమును వ్యాపించిన వామన మూర్తిని కన్న తండ్రి. సృష్ట్యాది యందు సృష్టించుటలో బ్రహ్మకు చేదోడుగ నున్నవాడు. పరశురాముని చేత భూమిని దానముగ పుచ్చుకొన్న బ్రహ్మజ్ఞాని. అట్టి ఆ కశ్యప ప్రజాపతి పోలమంత్రికి వంశకర్త.ఈ పోల మంత్రి

తన తల్లిదండ్రులిద్దరి వంశము అభివృద్ధి చెందు విధముగ విద్యాధన ధాన్య సంపదలతో ప్రసిద్ధిని పొందెను.

విశేషము :- ముని మండలము :- వైవస్వత మన్వంతరములోని సప్తర్షులు

"కశ్యపోత్రిర్భరద్వాజః విశ్వామిత్రోథ గౌతమః

జమదగ్నిర్వసిష్ఠస్య సప్తైతే ఋషయః స్మృతాః॥

కశ్యపుడు, అత్రి, భరద్వాజుడు, విశ్వామిత్రుడు, గౌతముడు, జమదగ్ని, వసిష్ఠుడును. అనువారలు సప్తర్షులు. దక్ష ప్రజాపతి పెండ్లి కొడుకు :- దక్షుడు బ్రహ్మమానస పుత్రుడు. ప్రజాపతి. ఇతని భార్య "అసిక్ని" దక్షునకీమె యందు హర్యశ్వులనువారు వేయి మంది, శబలాశ్వులనువారు వేయిమంది పుత్రులు కాక అరువది మంది పుత్రికలు పుట్టిరి. అందు ధర్మువునకు పదిమందిని, చంద్రునకు ఇరువదేడుగురును, అంగుష్ఠనేమికి నల్వురను, బాహు పుత్రున కిద్దరిని, అంగిరసునకిద్దరిని, కృశాశ్వునకిద్దరిని, కశ్యపునకు పదమూగురను ఇచ్చి వివాహము చేసెను.

కశ్యపుని భార్యలు : 1. అదితి, 2. దితి, 3. అరిష్ఠ, 4. సురస, 5. ఖస, 6. సురభి, 7. వినత, 8. తామ్ర, 9. క్రోధ, 10. వశ, 11. ఇర, 12. కద్రువ, 13. ముని - అనువారు. అదితి కశ్యపులకు కల్గిన కుమారుడే వామనమూర్తి.

అలంకారము - రూపకము.

క॥ సాటి చదలేటి నీటికి
హాటక గర్భుని వధూటి కమరద్రువనీ
వాటికి మధుకైటభరిపు
వీటికి శ్రీ పోలమంత్రి విశద యశంబుల్. 46

**అర్థము** :- శ్రీ పోలమంత్రి=పూజ్యుడైన పోలమంత్రి యొక్క, విశద=తెల్లని, యశంబుల్=కీర్తులు, చదలేటి=ఆకాశగంగ యొక్క, నీటికి=నీటికిని, హాటక గర్భుని=బంగరు అండము నుండి పుట్టిన బ్రహ్మ దేవుని యొక్క, వధూటికి=సరస్వతీ దేవికి, అమరద్రువనీ వాటికి=దేవతా వృక్షములు గల ఉద్యానవనమునకు మధుకైటభరిపు వీటికి=మధుకైటభులను రాక్షసులను సంహరించిన విష్ణువు నగరమైన వైకుంఠమునకు, సాటి=ఈడువచ్చును.

**భావము** :- పోలమంత్రి యశస్సు ఆకాశగంగా జలమునకు, సరస్వతీ దేవికి, అమరావతీ నగరమునకు, వైకుంఠమునకును సాటి వచ్చును.

**విశేషము** :- ఆకాశగంగ, సరస్వతీదేవి, అమరావతీ నగరము, వైకుంఠము - ఇవన్నియు ధవళములని(తెల్లనివని) పురాణ ప్రసిద్ధి.

అమరద్రుమములు :- 1. మందారము, 2. పారిజాతము, 3. సంతానము, 4.కల్పవృక్షము, 5. హరిచందనము అనునవి యైదును దేవతరువులు. వీనికే - కల్పవృక్షములని సామాన్యముగ వాడుక.

పవిత్రమైన యశస్సును తెలుపుగ భావించుట సంప్రదాయము. ఆకాశగంగ, సరస్వతి, అమరావతి, వైకుంఠములకు పోలమంత్రి యశస్సు సాటివచ్చుననుటతో అతని స్వచ్ఛమైన యశము యొక్క ఔన్నత్యము తెలియును.

క. **ఆ మంత్రికి నుదయించిరి**
**శ్రీమంతులు కార్యఖడ్గ జితవైరి మహా**
**సామంతులు శ్రీ యల్లా**
**డామాత్య గ్రామణియును నన్నవిభుండున్.** 47

అర్థము :- ఆ మంత్రికిన్=ఆ పోలమంత్రికి, శ్రీమంతులు=సౌందర్యము కలవారు, కార్య..మంత్రులు. కార్య=మంత్రాలోచన చేత, ఖడ్గ=యుద్ధములచేత, జిత=జయింపబడిన, వైరి మహాసామంతులు=శత్రువులైన గొప్ప సామంతరాజులు కలవారునైన, శ్రీ అల్లాడామాత్య గ్రామణియు=శ్రీఅల్లాడమంత్రి శేఖరుడును, అన్నవిభుండున్=అన్నయ ప్రభువు. ఉదయించిరి=పుట్టిరి.

భావము :- ఆ పోలమంత్రికి ఇరువురు కుమారులు. వారు అల్లాడమంత్రి, అన్నయమంత్రియును. వారు కార్యఖడ్గ నిపుణులు. గొప్ప వీరులైన సామంతరాజులను జయించినవారు.

క. **అల్లాడ విభుఁడు రిపుహృ**
**ద్భల్లాడంబరుఁడు వాఁడు భామల మనసుల్**
**గొల్లాడఁగ మదనుఁడు దిశ**
**లల్లాడఁగఁ జేయుఁ దద్భుజాటోపంబుల్.** 48

అర్థము :- అల్లాడ విభుఁడు=అల్లాడ ప్రభువు, రిపుహృత్=శత్రువుల హృదయములకు, భల్ల=బాణము యొక్క, ఆడంబరుఁడు=ఔద్ధత్యము వంటి ఔద్ధత్యము కలవాడు, వాఁడు=ఆ అల్లాడ ప్రభువు, భామల=కాంతల యొక్క, మనసుల్=మనసులను, కొల్లాడఁగన్=దోచుట యందు, మదనుఁడు=మన్మథుడు. తత్=ఆ అల్లాడ ప్రభువు యొక్క, భుజ=బాహువుల యొక్క, ఆటోపంబుల్=దర్పములు. దిశలు=దిక్కులు, అల్లాడఁగన్=క్షోభపడునట్లు, చేయున్=చేయును.

భావము :- అల్లాడ ప్రభువు శత్రువుల గుండెలకు బాణము. అతడు కాంతల మనసులను దోచుట యందు మన్మథుడు. అతని భుజబలము దిక్కులనల్లాడించును.

సీ॥ కాకతి క్ష్మాపాల గంధదంతావళ
ధ్వజినీమహాధురంధరుఁడనంగ
నవలక్ష కోదండనాథ రాజ్యాంబోధి
సంపూర్ణ పూర్ణిమా చంద్రుఁడనఁగ
నంధ్రభూమండలాధ్యక్ష సింహాసన
సంప్రతిష్ఠాపనాచార్యుఁడనఁగ
వీరరుద్రాశేష విశ్వంభరాధీశ
పృథుల దక్షిణ భుజా పీఠమనఁగ

తే॥ యవన సంహార విలయ కాలాగ్ని యనఁగ
ధాటి విఘటిత కుమ్మరోద్యానుఁడనఁగ
విశ్వలోక ప్రశస్తుఁడై వినుతి కెక్కె
నతుల బలసీరి పోలయ యన్నశౌరి. 49

అర్థము :- కాకతి ..... అనంగన్. కాకతి క్ష్మాపాల=కాకతీయ రాజుయొక్క, గంధదంతావళధ్వజినీ=మదపుటేనుగుల సేన యొక్క, మహాధురంధరుండు=గొప్పదగు భారము వహించు వాడు, అనంగన్=అనగను;

నవ......అనంగ. నవలక్ష కోదండనాథ='నవలక్ష కోదండనాథ'యను బిరుదము కల ఆ కాకతీయ రాజు యొక్క, రాజ్య=రాజ్యమనెడి, అంభోధి=సముద్రమునకు, సంపూర్ణ పూర్ణిమా=నిండు పున్నమనాటి, చంద్రుఁడనఁగ=చంద్రుడనగను;

అంధ్ర....అనంగ. అంధ్ర భూమండల=తెలుగు భూమండలమునకు, అధ్యక్ష=ప్రభువు యొక్క, సింహాసన=గద్దెను, సంప్రతిష్ఠాపన=చక్కగా నిలుపుటయందు, ఆచార్యుఁడు=గురువు, అనఁగ=అనగను;

వీర....అనఁగ. వీరరుద్ర=వీరరుద్రరాజు యొక్క, అశేష=సమస్తమైన, విశ్వంభరా=భూమికి, అధీశ=ప్రభువు యొక్క, పృథుల=విరివియైన, దక్షిణ=కుడి, భుజాపీఠము=పీటయైన భుజము, అనఁగ=అనగను;

యవనసంహార=యవనులను చంపుటయందు, విలయకాల=ప్రళయ కాలపు, అగ్నియనఁగ=అగ్గియనునట్లుగను, ధాటి=దండయాత్రల చేత, విఘటిత=పగులగొట్టబడిన,

కుమ్మర=కుమ్మరమను పేరుగల దుర్గమే, ఉద్యానుఁడు=ఉద్యానముగ గలవాడు, అనఁగ= అనునట్లును, విశ్వలోక=లోకమంతటను, ప్రశస్తుడై=ప్రశంసింపబడినవాడై, అతుల బలసీరి= అసమానమైన బలమునందు బలరాముడైన, పోలయ అన్నశౌరి=పోల మంత్రి కుమారుడైన అన్న మంత్రి, వినుతికెక్కెన్=ప్రసిద్ధిని పొందెను.

**భావము :-** పోలయ మంత్రి కుమారుడైన అన్న మంత్రి కాకతీయ వీరరుద్ర భూపతికి మంత్రి. ఆ రాజు యొక్క గజబలమునకు నేర్పరియైన నాయకుడు. ఆ వీరరుద్రుని రాజ్యమనెడి సముద్రమునకు పున్నమి చంద్రుని వంటివాడు. ఆ రాజు ఆంధ్రదేశమున సార్వభౌముడగుటకు దోహదకారియైన గురువు. ఆ రాజునకు కుడి భుజము. యవనుల పాలిటి కాలాగ్ని. దండయాత్రా నైపుణ్యమునకు కుమ్మరమను వనదుర్గ విజయమే సాక్షి. ఈవిధముగ బలమునందు బలరాముడై లోక ప్రసిద్ధిని పొందినాడీ అన్న మంత్రి.

**విశేషము :-** కుమ్మరము : హంపీ దేవాలయమునకు సమీపమున ''హోసమలె' యున్నదనియు, దాని చుట్టును అరణ్యము కలదనియు, ఆ అరణ్య మధ్య భాగమున హోసదుర్గము కలదనియు, దాని సమీపముననే కుమ్మటము లేక కుమ్మట దుర్గము కలదనియు తెలియుచున్నది. - ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము. పు. 92. కుందూరి ఈశ్వరదత్తు.

చ॥ కొలను ప్రతాపరుద్ర నృపకుంజరుచేత నరేఁడు సారణీ
సలిల వివర్ధమాన బహుసస్య సమాకుల మగ్రహారమై
వెలయ విభాకర గ్రహణవేళ దగంగఁ బరిగ్రహించి బం
ధుల భరియించె నన్నవిభుతో సరి యెట్లు ప్రధానులెవ్వరున్. 50

**అర్థము :-** కొలను ప్రతాపరుద్ర=కొలను దుర్గమును పాలించిన ప్రతాపరుద్రుడను, నృపకుంజరుచేతన్=రాజశ్రేష్ఠుని చేత, అరేఁడు=అరేడు గ్రామమును, సారణీ సలిల=కాలువల నీటిచే, వివర్ధమాన=బాగుగా వృద్ధినందుచున్న, బహుసస్య=అనేకములైన పైరులతో, సమాకులము=మిక్కిలిగ నిండినది, అగ్రహారమై=అగ్రహారముగనై, వెలయన్=ప్రసిద్ధి చెందగా, విభాకర గ్రహణవేళన్=సూర్య గ్రహణ పుణ్యకాలమునందు, తగంగన్=తగినట్లుగా, పరిగ్రహించి=స్వీకరించి, బంధులన్=బంధువులను, భరియించె=పోషించెను. ప్రధానులు= మంత్రులు, ఎవ్వరున్=ఎవరైనను, అన్న విభుతో=అన్నయ మంత్రితో, సరియెట్లు=ఏవిధముగ సమానమగుదురు.

**భావము :-** పంట కాల్వల నీటితో సస్యశ్యామలమైయున్న అరేడు అను గ్రామమును కొలనుదుర్గ పాలకుడైన ప్రతాపరుద్రుడను రాజశ్రేష్ఠుని నుండి సూర్యగ్రహణ పుణ్య

కాలమునందు దానముగ పరిగ్రహించి బంధు జనమును పోషించిన అన్నయ మంత్రితో ఇతర మంత్రులెవ్వరు సాటిరారు.

**విశేషము** :- కొలను అనగా పశ్చిమ గోదావరి జిల్లాలో కొల్లేటి సరస్సులోనున్న జలదుర్గమని ఒక అభిప్రాయము. కొలను అనగా ఏలూరు అని చాగంటి వారి అభిప్రాయము.

ఈ పద్యమునందలి "కొలను ప్రతాపరుద్ర..." అనుదానిలో 'కొలను' అను శబ్దమును 'కొలని' అని చదువవలెననియు, కొలని ప్రతాపరుద్రుడనగా ప్రతాపరుద్ర చక్రవర్తి కాదనియు, కొలని ప్రతాపరుద్రుడను నియోగి బ్రాహ్మణుడనియు, ఇతడు కాకతీయ ప్రతాపరుద్రుని దండనాయకుడనియు, ఇతని నుండే బెండపూడి అన్నమంత్రి 'అరేడు' అను గ్రామమును అగ్రహారముగా పొందెననియు శ్రీ చాగంటి శేషయ్యగారు (ఆంధ్రకవి తరంగిణి - ఐదవ భాగము - పుట - 62) వ్రాసిరి.

'అరేడు' అను గ్రామము పశ్చిమ గోదావరి జిల్లాలో భీమవరము ప్రాంతము నందున్నది.

అగ్రహారము :- గృహ్యంతి ఇతి గ్రహాః నగ్రహాః అగ్రహాః అగ్రహాఃఅరాః యేషు తే అగ్రహారాః - పన్నులు వసూలు చేయబడక వంశపరంపరగా ఇచ్చు గ్రామమే అగ్రహారము. - అని శ్రీ మల్లంపల్లి వారు.

శా॥ అయ్యన్నయ్యకు యావదర్థపదగర్హా నర్హ గంభీరవాక్
శయ్యన్గైటభ వైరిశయ్యకు ఘనుల్ షాడ్గుణ్య విద్యానిధుల్
త్రయ్యంతజ్ఞులు దేవధీమణియునున్ దల్ల ప్రభుండున్ సుతుల్
వియ్యంబందుఁదదీయ కీర్తులు దిశావేదండతుండాళితోన్. 51

**అర్థము** :- ఆ+అన్నయ్యకు=ఆ అన్న మంత్రికి, యావత్....శయ్యన్. యావత్=అన్ని, అర్థ=అర్థముల, పద=పదముల మొత్తముతో, గర్హ=నిందించుటకు, అనర్హ=తగని, గంభీరవాక్=లోతైన పలుకుల యొక్క, శయ్యన్=పదముల కన్యోన్య మైత్రితో నేర్పడు రీతిలో, కైటభవైరి శయ్యకు=విష్ణువునకు పానుపైన ఆదిశేషునకంటె, ఘనుల్=గొప్పవారు, షాడ్గుణ్య=ఆఱుగుణములకు సంబంధించిన, విద్యా నిధుల్=విద్యలకు నిలయమైన వారును, త్రయీ+అంతజ్ఞులు=వేదాంతముల నెఱిగిన వారు, దేవధీమణియునున్=మేధావియగు దేవమంత్రియు, తల్ల ప్రభుండున్=తల్లప్పమంత్రియు, సుతుల్=కుమారులు. తదీయ=వారి యొక్క, కీర్తులు=యశస్సులు, దిశావేదండ=దిక్కుల యందలి ఏనుగుల యొక్క, తుండ+ఆళితోన్=తుండముల సమూహముతో, వియ్యంబు=సంబంధమును, అందున్= పొందును.

భావము :- ఆ అన్నమంత్రికి దేవయ, తల్లయ అను నిర్వురు కుమారులు. వారు భాషాజ్ఞానమునందు ఆదిశేషుని కన్న మిన్నయైన వారు. వేదాంత జ్ఞానము గలవారు. షడ్గుణములకు సంబంధించిన విద్యలందు గనులు. వారి యశస్సులు దిగ్గజముల తుండములతో వియ్యమందును.

విశేషము :- అర్థము=అర్థము-వాచ్యము, లక్షణము, వ్యంగ్యమునని మూడు విధములు. ఈ మూటి పరిపక్వత అని యిట భావము.

శయ్య :- "యా పదానాం పరాన్యోన్యమైత్రీ శయ్యేతి కథ్యతే"

పదములకు అన్యోన్యము ఉత్తమము అగు మైత్రి కలిగియుండుటయే శయ్య అని ప్రతాపరుద్రీయము.

షడ్గుణములు :- రాజులు ప్రయోగింప తగిన 1. సంధి, 2. విగ్రహము, 3. యానము, 4. ఆసనము, 5. ద్వైధీ భావము, 6. సంశ్రయము. - అనునవి షడ్గుణములు. ఇవి గల రాజనీతి విద్యలన్నింటియందును గనుల వంటివారని భావము.

శా॥ లక్ష్మీదేవిఁబయోరుహేక్షణునిఁబోల్పం బాత్రులై యొప్పు శ్రీ
లక్ష్మీదేవికి నన్నమంత్రికి సుతుల్ లావణ్య సంపన్నిధుల్
లక్ష్మీవంతులు దేవమంత్రియును దల్లప్ప ప్రధానుండు స
ర్వక్ష్మాధీశ సభాంతరస్తుతనయప్రాగల్భ్య వాచస్పతుల్. 52

అర్థము :- లక్ష్మీదేవిన్=లక్ష్మీదేవి తోడను, పయోరుహ+ఈక్షణునిన్=పద్మపురేకుల వంటి కన్నులుగల వాడైన విష్ణువు తోడను, పోల్పన్=పోల్చుటకు, పాత్రులై=తగినవారై, ఒప్పు=ప్రకాశించు, శ్రీ లక్ష్మీదేవికిన్+అన్నమంత్రికి=శ్రీలక్ష్మీదేవీ అన్నమంత్రి దంపతులకు, లావణ్య సంపత్=సౌందర్యమను సంపదకు, నిధుల్=గనులు, లక్ష్మీవంతులు=భాగ్యవంతులు, సర్వ=సమస్తమైన, క్ష్మాధీశ=రాజుల యొక్క, సభాంతర=సభలలో, స్తుత=ప్రశంసింపబడిన, నయ=నీతిశాస్త్రమునందు, ప్రాగల్భ్య=మాటల నేర్పునందు, వాచస్పతుల్=బృహస్పతులైన, దేవమంత్రియును=దేవయ మంత్రియును, తల్లప్ప ప్రధానుండు=తల్ల మంత్రియు, సుతుల్=కుమారులు.

భావము :- శ్రీలక్ష్మీనారాయణుల వంటి శ్రీ లక్ష్మీదేవీ అన్నమంత్రి దంపతులకు ఇద్దరు కుమారులు. వారు దేవ మంత్రి తల్ల మంత్రి. వీరు సుందరులు, సంపన్నులు. సర్వరాజసభలయందు ప్రశంసలందుకొన్న దిట్టలు. నీతి శాస్త్రమునందును, మాట నేర్పరితనమునందు బృహస్పతులు.

విశేషము :- బృహస్పతి :- బృహస్పతి దేవతలకు గురువు.

క॥ పన్నీట గంధ జలమున
నన్నయ తల్ల ప్రధానుఁడభిషేకింపన్
గన్నప పుక్కిటి నీటను
గన్న యరోచికము వాయుఁ గఱకంఠునకున్. 53

అర్థము :- పన్నీట=పన్నీటితోను, గంధ జలమునన్=చందనము కలిపిన నీటితోను, అన్నయ తల్ల ప్రధానుండు=అన్నయ మంత్రికి కుమారుడైన తల్లన మంత్రి, అభిషేకింపన్=అభిషేకము చేయఁగా, కఱకంఠునకున్=నీలకంఠుడైన శివునకు, కన్నప=శివభక్తుడైన కన్నప్పయొక్క, పుక్కిటి నీటనున్=పుక్కిటి యందలి నీటితో, కన్న=పొందిన, అరోచికము=ఏవగింపు, పాయున్=తీరును.

భావము :- అన్న మంత్రి కుమారుడైన తల్లప మంత్రి పన్నీటితోను, సుగంధ జలముతోను శంకరునకభిషేకము చేయగా, పూర్వము తిన్నడు పుక్కిలి నీటితో అభిషేకము చేయుట వలన శివునకు కల్గిన ఏవగింపు తీరిపోవును.

విశేషము :- కన్నప : ఇతడు తండె, నాథ నాథదంపతుల కుమారుడు. నాథనాథుడు చెంచుల రాజు. తిన్నడు వేటకు వెళ్ళి అరణ్యమున ఒక చెట్టు క్రింద శివలింగమును జూచి భక్తిపరుడై శివలింగమునకు మ్రొక్కి అడవిలో ఒక అడవి పందిని వేటాడి చంపి కాల్చి ముక్కలు చేసి ఆ మాంసపు ముక్కలను పుల్లలకు గ్రుచ్చి ఆకు దొప్పలలో పెట్టుకొని రెండు చేతులలో రెండు దొప్పలను పట్టుకొని సువర్ణముఖీ నదీ జలమును పుక్కిలితోగొని వచ్చి ఆ పుక్కిలి నీటితో శివలింగమును కడిగి(అభిషేకము చేసి ఆ పుల్లలకు గ్రుచ్చిన మాంసపు ముక్కలను (కరకుట్లను) ఆహారముగ పెట్టెనట.

"విల్లొక చంక నంపపొది వీపున దొప్పలు కేలుదోయిఁబు
క్కిళ్ళఁబవిత్రకాంచన ముఖీజల మొప్పఁగ వచ్చి భక్తిరా
జిల్లఁ దదంబు మజ్జనము సేయుచు, దొప్పల నంజు డద్రిరా
జల్లుని నారగింపు మన నాపరమేశ్వరుఁడూరకుండినన్."

*శ్రీ కాళహస్తీశ్వర మాహాత్మ్యము 3 - 87*

సీ॥ ముక్కంటి దరహాసమున కనుప్రాసంబు
మిన్నేటి నీటికి మిక్కుటంబు
శారద జ్యోత్స్నా ప్రసాదంబునకు వీప్స
నలువ శుద్ధాంతంబున కనుభాష
కల్పకారామరేఖకుఁ బ్రతిచ్ఛందంబు

త్రిదశేంద్రు కరటి కామ్రేడితంబు
పుండరీకారణ్యమునకు నధ్యాహార
మమృతాంబునిధి కభిధాంతరంబు
తే॥ గంధసార తుషార పాణింధమంబు
దానవిద్యా విలాస విద్యాధరంబు
మంత్రి యన్నయదేవయ్య మహిత యశము
నిఖిల దిక్తట మంతయు నిండియుండె. 54

అర్థము :- మంత్రియన్నయ దేవయ్య=అన్నమంత్రి కుమారుడైన దేవమంత్రి యొక్క, మహిత యశము=గౌరవింప తగిన యశస్సు, నిఖిలదిక్=అన్ని దిక్కుల యొక్క, తటము+అంతయున్=అంచుల వరకు పూర్తిగా, నిండియుండెన్=వ్యాపించియున్నది;

ముక్కంటి=త్రినేత్రుని యొక్క, దరహాసమునకు=చిఱునవ్వుకు, అను ప్రాసంబు=సరిపోలునట్టిది, మిన్నేటి నీటికి=ఆకాశ గంగా జలమునకు, మిక్కుటంబు= అధికమైనది;

శారద జ్యోత్స్నా=శరత్కాలమందలి వెన్నెల యొక్క, ప్రసాదంబునకు=ప్రసన్నతకన్న, వీప్స=అధికమైన వ్యాప్తి కలది. నలువ=బ్రహ్మదేవుని, శుద్ధాంతంబునకు=రాణియైన సరస్వతికి, అనుభాష=పోలికయైనది;

కల్పక+ఆరామ రేఖకు=కల్పవృక్షముల ఉద్యానవనముల వరుసకు, ప్రతిచ్ఛందంబు=మాఱురూపు, త్రిదశేంద్రు=దేవేంద్రుని, కరటికి=ఏనుగైన ఐరావతమునకు, ఆమ్రేడితంబు=రెండవ రూపము;

పుండరీక=తెల్ల తామరల, అరణ్యమునకు=వనమునకు, అధ్యాహారము=పోలునది (భావనకు తెచ్చునది), అమృత+అంబునిధికి=పాలసముద్రమునకు, అభిధాంతరంబు=మరొక పేరు;

గంధసార=చందనము యొక్క, తుషార=కర్పూరము యొక్కయు, పాణింధమంబు= తిత్తియైనది, దాన విద్యా=దానము చేయు విద్యయను, విలాస=క్రీడయందు, విద్యాధరంబు= విద్యాధరుడు కలది.

**భావము** :- అన్న మంత్రి కుమారుడైన దేవ మంత్రి మహిత యశము దిగంతముల వరకు వ్యాపించినది. అతడు దాన విద్యయందు విద్యాధరుడు. ఆతని యశస్సు శంకరుని చిఱునవ్వునకు సరిపోలును. ఆకాశ గంగాజలమున కన్న మిన్న. శరత్కాలపు వెన్నెల యొక్క

ప్రసన్నత కంటె అధికమైన వ్యాప్తి కలది. సరస్వతీ దేవిని పోలునట్టిది, నందనోద్యానమునకు ప్రతిరూపము, ఐరావతమునకు మాఱురూపు. పాల సముద్రమునకు మారుపేరు. చందన కర్పూరముల నిలయము.

విశేషము :- యశస్సును తెల్లనిదిగ చెప్పుట సంప్రదాయము. శంకరుడు, సరస్వతి తెల్లనివారని ప్రతీతి. శరత్కాలపు వెన్నెల, ఆకాశ గంగాజలము, కల్పవృక్షములు, ఐరావతము, పాలసముద్రము, చందన కర్పూరములును తెల్లనివి. దేవ మంత్రి యొక్క మహిత యశము పైవానివలె పరిశుద్ధమై పవిత్రమై దిగంతముల వరకు వ్యాపించెనని చెప్పుటచే ఆతని కీర్తి విభవము యొక్క ఔన్నత్యము సూచితమైనది.

పారిభాషిక పదములతో ఇటువంటి పద్యమునే శృంగార నైషధము నందు కూడ (5-144) శ్రీనాథ భట్టసుకవి వ్రాసినాడు. ఆ పద్యమిది-

హరిదంత ద్విపదంత కుంతలముల కన్యాదేశ మాశీ విషా
భరణోత్తంస సుధాంశురేఖకు ననుప్రాసంబు కైలాస భూ
ధర కూట స్ఫటికోపల ప్రతతి కధ్యాహార మిమ్మేదినీ
శ్వర దేవేంద్రుని సాంద్ర నిర్మల యశోజాలంబు లీలావతీ!

అనుప్రాస :- ఒకే అక్షరము పలుమార్లు ప్రయుక్తమై అలంకరించినచో అది అనుప్రాసము. వీప్స=ఒకటి వెనుకనొకటి అక్రమింపనిచ్చు, అనుభాష=తిరిగి చెప్పుట, అధ్యాహారము=ఆకాంక్షతో పదములను తెచ్చుట, ఆమ్రేడితము=ద్విరుక్తము యొక్క పరరూపము.

అలంకారము - ఉపమ.

మహాస్రగ్ధర॥ **వియదాశాభూత ధాత్రీ విహృతి కలన నిర్విఘ్న సంభార నిఘ్నా**
**వ్యయకీర్తి స్ఫూర్తిముద్రా హసిత శశికిరీటాట్టహాస స్వయంభూ**
**దయితా మందార చంద్రాతప సురతటినీ తార నీహారుతో న**
**న్నయ దేవామాత్యు తోడన్ హరహర సరియే యన్యభూపాలమంత్రుల్. 55**

**అర్థము** :- వియ .... హారుతోన్. వియత్=ఆకాశము నందును, ఆశా=దిక్కులందును, భూతధాత్రీ=భూమియందును, విహృతి కలనన్=విహారము చేయుటయందు, నిర్విఘ్న= ఆటంకము లేని, సంభార నిఘ్న=చక్కగ భరించుటకు అధికమయిన, అవ్యయ=నాశనము లేని, కీర్తి స్ఫూర్తి ముద్రా=కీర్తి యొక్క నిండుదనపు గుర్తుతో, హసిత=నవ్వబడిన, శశికిరీట+అట్టహాస=చంద్రశేఖరుని పెద్దనవ్వును, స్వయంభూదయితా=బ్రహ్మదేవుని

భార్యయైన సరస్వతీ దేవియు, మందార=మందారమనెడి దేవ వృక్షమును, చంద్రాతప=చంద్రుని వెన్నెలయు, సురతటినీ=ఆకాశగంగయు, తార=నక్షత్రములును, నీహారుతోన్=మంచును కలవాడైన, అన్నయ దేవ+అమాత్యుతోడన్=అన్న మంత్రి కుమారుడైన దేవ మంత్రితో, హరహర=అయ్యారే, అన్యభూపాల మంత్రుల్=ఇతర రాజుల యొద్ద గల మంత్రులు, సరియే=సాటియా!

భావము :- ఆ దేవ మంత్రి కీర్తి భూమ్యాకాశముల యందును, దిగంతముల వరకును విహరించును. చంద్రశేఖరుని అట్టహాసమును, సరస్వతీ దేవిని, మందార వృక్షమును, చంద్రకాంతిని, ఆకాశగంగను, చుక్కలను, మంచును, పరిహరింపగల్గిన(మించిన) తెల్లదనముతోను, స్వచ్ఛతతోను, ఔన్నత్యముతోను ప్రకాశించుచుండును.

విశేషము :- ఈ పద్యమునందును శంకరుని అట్టహాసము నుండి మంచు వరకు చెప్పిన వన్నియు ధవళములని ప్రతీతి. వాని ధవళత, స్వచ్ఛత, ఔన్నత్యములతో దేవ మంత్రి కీర్తి పోల్చి చెప్పబడినది.

మహాస్రగ్ధర వృత్తమునకు "సతతనస రరగ" అనునవి గణములు, యతి 1-9-16.

ఉ॥ ధీరుఁడు దేవ మంత్రి నయధీగుణ నిర్జిత దేవమంత్రి శ్రీ
వీరయ దేవవల్ల్యధిప విశ్వవిభుప్రియ పుత్రి రామమాం
బారమణీ మణిన్ భువన పావనవర్తనఁబెండ్లియాడె నం.
భోరుహ నేత్రుఁ డంబునిధి పుత్రికఁ బెండిలియాడు కైవడిన్. 56

అర్థము :- ధీరుఁడు=ధైర్యశాలి, నయ=నీతిశాస్త్రముతోను, ధీ=తెలివిచేత, గుణ= మంచి గుణముల చేతను, నిర్జిత=జయింపబడిన, దేవమంత్రి=దేవతలకు మంత్రియైన బృహస్పతి కలవాడగు, దేవమంత్రి=దేవయ మంత్రి, శ్రీవీరయ దేవవల్లి+అధిప=శ్రీ వీరదేవ వల్లియను నగరమునకు నాయకుడైన, విశ్వవిభు=విశ్వనాయకుని యొక్క, ప్రియపుత్రి= గారాబు కూతురైన, భువన పావన వర్తనన్=లోకమునందు పవిత్రమైన నడవడిగల, రామమాంబా=రామమాంబయను పేరుగల, రమణీమణిన్=శ్రేష్ఠమైన యువతిని, అంభోరుహ నేత్రుఁడు=విష్ణువు, అంబునిధి పుత్రికన్=సముద్రుని పుత్రికయైన లక్ష్మీదేవిని, పెండిలియాడు కైవడిన్=వివాహము చేసికొన్నట్లుగ, పెండ్లియాడెన్=పెండ్లి చేసికొనెను.

భావము :- దేవయ మంత్రి ధీరుడు. రాజనీతి, తెలివితేటలు, సుగుణముల చేత బృహస్పతిని మించినవాడు. ఇతడు విశ్వనాథుని గారాబు కూతురైన రామమాంబను విష్ణుమూర్తి లక్ష్మీదేవిని వివాహమాడినట్లుగ వివాహమాడెను.

సీ॥ జగదేక సంస్తుత్య సౌభాగ్య సంపద
రతిదేవిఁ బోలు నీ రాజవదన
పరమ పాతివ్రత్య భాగ్య గౌరవమున
భూపుత్రిఁబోలు నీ పువ్వుఁబోణి
యక్షీణ మహిమఁ గళ్యాణ వైభవమునఁ
బార్వతిఁబోలు నీ పద్మగంధి
మృదు గభీర ప్రౌఢ మిత భాషణంబుల
భారతిఁబోలు నీ పరమ సాధ్వి

తే॥ యనుచు బంధులు వినుతింప నవనిమించె
నధిక శుభగాత్రి విశ్వనాయకుని పుత్రి
యన్నవిభు దేవమంత్రి యర్ధాంగ లక్ష్మి
రమ్య సద్గుణ నికురంబ రామమాంబ. 57

అర్థము :- ఈ రాజవదన=చంద్రబింబము వంటి మొగము గల ఈమె, జగదేక=లోకము నందు ముఖ్యముగ, సంస్తుత్య=మిక్కిలి కొనియాడతగిన, సౌభాగ్య సంపదన్=గాఢమైన దాంపత్య ప్రేమ యనెడి సంపద యందు, రతిదేవిన్=రతిదేవితో, పోలున్=సరివచ్చును;

ఈ పువ్వుఁబోణి=పూవు వంటి శరీరము గల యీ సుందరి, పరమ పాతివ్రత్య=శ్రేష్ఠమైన పతివ్రతా ధర్మమనెడి, భాగ్య గౌరవమునన్=అదృష్టము యొక్క గొప్పదనమునందు, భూపుత్రిన్=భూమిపుత్రికయైన సీతాదేవితో, పోలున్=ఈడు వచ్చును;

ఈ పద్మ గంధి=తామరపూవు వంటి మేని వాసన గల ఈమె, అక్షీణ మహిమన్=తరుగని ఐశ్వర్యముతో, కళ్యాణ వైభవమునన్=మంగళముల సంపదతోను, పార్వతిన్=పార్వతీదేవితో, పోలున్=సమానమగును;

ఈ పరమ సాధ్వి=గొప్పశీలవతియైన ఈమె, మృదు=కోమలమైన, గభీర=లోతైన, ప్రౌఢ=నేర్పు గల, మిత=పరిమితమైన, భాషణంబులన్=మాటలతో, భారతిన్=సరస్వతీదేవితో, పోలున్=సామ్యము వచ్చును;

అనుచు=అని పలుకుచు, బంధులు=చుట్టములు, వినుతింపన్=పొగడుచుండగా, అధిక శుభగాత్రి=మిక్కిలి శుభంకరమైన శరీరము కలది, విశ్వనాయకుని పుత్రి=విశ్వనాయకుని సుతయు, అన్న విభుదేవమంత్రి=అన్నమంత్రి కుమారుడైన దేవమంత్రి యొక్క, అర్ధాంగలక్ష్మి

=ధర్మపత్నియు, రమ్యసద్గుణ నికురంబ=అందమైన మంచి గుణముల సమూహము గలదై, రామమాంబ=రామమాంబ, అవని మించెన్=భూమిపై అతిశయించెను.

భావము:- ఈమె దాంపత్య ప్రేమ సంపద యందు రతిదేవితో సమానము. పతివ్రతాతత్త్వము నందు సీతాదేవితో సరితూగును. తరగని ఐశ్వర్యము నందు పార్వతీదేవితో మృదుమధుర గంభీర ప్రౌఢములైన మాటలయందు సరస్వతీదేవితో సమానమగును - అని బంధువులు పొగడుచుండగా శుభంకరమైన రూపము కలదియు, విశ్వనాయకుని పుత్రికయు, అందమైన సర్వసద్గుణములు కలదియు, దేవమంత్రికి ధర్మపత్నియునైన రామమాంబ భూమిపై ప్రసిద్ధురాలయ్యెను.

తే॥ సింధు కరికాళ భల్లాణసేనయాది
పరమ మాహేశ్వరాచార పరుల సరణి
నన్నవిభుదేవయామాత్యు నెన్నవచ్చుఁ
బార్వతీ వల్లభుని మీఁది భక్తిగరిమ 58

అర్థము:- అన్న విభుదేవయ+అమాత్యున్=అన్నమంత్రి కుమారుడైన దేవమంత్రి, పార్వతీ వల్లభుని మీఁది=పార్వతీపతియైన శంకరుని మీది, భక్తిగరిమన్=భక్తి యొక్క శ్రేష్ఠతతో, సింధు=సింధుడు, కరికాళ=కరికాలుడు, భల్లాణసేనయ=భల్లాణసేనుడు, ఆది=మొదలైన, పరమ=గొప్ప, మాహేశ్వర+ఆచారపరుల సరణిన్= శైవాచార పరాయణుల వరుసలో, ఎన్నవచ్చున్=గణింపవచ్చును.

భావము:- దేవయమంత్రి గొప్ప శివభక్తుడు. ఇతడు సింధుడు, కరికాళుడు, భల్లాణసేనుడు మొదలయిన మహాశివభక్తుల వరుసలో చేర్పతగినవాడు.

విశేషము:- సింధుడు, కరికాళ చోళుడు, భల్లాణసేనుడు - వీరశైవులు. ఈ శివభక్తుల ప్రస్తావన పాల్కురికి సోమనాథుని బసవ పురాణము నందును, పండితారాధ్యచరిత్రము నందును వచ్చును.

కరికాలచోడుడు తన శివభక్తి మహిమచే కనకవర్షము కురియింపచేసినవాడు.
"శివభక్తి కామధేనువు బసవనికిఁ
దవిలిచన్నవిసి యిబ్బునిఁగాఋునట్లు
కరుణించి శంభుండు కనకవర్షంబు
కరికాలచోడుఁడు గురియించె నాఁడు"

బసవ పురాణము - 7 అ - గుడ్డవ్వగారి కథ

శా॥ ఆరామాంబకు దేవమంత్రికిని దక్షారామ భీమేశ్వర
స్ఫారాపార కృపాగుణోదయమునం జన్మించిరాత్మోద్భవుల్
ధీరోదాత్తుఁడు లింగమంత్రి విభుఁడున్ ధీశాలి తల్లన్నయున్
బారావారగభీరుఁడన్నధరణీపాలుండు లక్ష్మీనిధుల్. 59

అర్థము:- ఆ రామాంబకు=ఆ రామాంబకును, దేవమంత్రికిని=దేవయ మంత్రికిని, దక్షా...దయమునన్. దక్షారామ=దక్షారామము నందలి, భీమేశ్వర=శ్రీ భీమేశ్వర స్వామి యొక్క, స్ఫార=సమృద్ధమైన, అపార=అంతులేని, కృపాగుణ=దయాగుణము యొక్క, ఉదయమునన్=పుట్టుకచేత, లక్ష్మీనిధుల్=సంపదలకు గనులగు, ఆత్మోద్భవుల్=కుమారులు, ధీరోదాత్తుఁడు=మహా సత్త్వాదికములు గల, లింగమంత్రి విభుఁడున్=లింగన మంత్రివరేణ్యుడును, ధీశాలి=ప్రతిభాశోభితుడగు, తల్లన్నయున్=తల్లన్నయును, పారావార గభీరుఁడు= సముద్రమువలె గంభీరుడైన, అన్నధరణీపాలుండు=అన్నభూపతియు, జన్మించిరి.=పుట్టిరి.

భావము:- ఆ రామాంబాదేవమంత్రి దంపతులకు దక్షారామ భీమేశ్వర స్వామి వరప్రసాదముగ సర్వసంపన్నులైన ముప్వురు కుమారులు కలిగిరి. అందు లింగనమంత్రి ధీరోదాత్తుడు. తల్లన ప్రతిభాశాలి. అన్నభూపతి గంభీరుడు.

విశేషము:- ధీరోదాత్తుడు: ''మహా సత్త్వోతిగంభీర: కృపావా నవికత్థన:'' క్రోధాదులకు లొంగని మనస్సు కలవాడు, బాధాదులు కల్గినను తొణకనివాడు, ఇతరుల దు:ఖమును పోగొట్టదలచువాడు, ఆత్మస్తుతి చేసికొననివాడు. -(ప్రతాపరుద్రీయము - నాయక ప్రకరణము 32 శ్లో.)

ఉ॥ సంగర సవ్యసాచికిఁ బ్రశస్తవితీర్ణి దధీచికి న్మహా
మంగళ చారుమూర్తికి సమంచిత నిర్మల ధర్మమూర్తికిన్
లింగన మంత్రికిన్ విశదనీతిధురావిబుధేంద్రమంత్రి కు
త్తుంగ తరప్రతాపగుణధూర్జటి కెవ్వరు సాటి ధారణిన్. 60

అర్థము :- సంగర సవ్యసాచికిన్=యుద్ధమునందు అర్జునుడైనట్టియు, ప్రశస్త వితీర్ణి=ప్రసిద్ధమైన దానగుణమున, దధీచికిన్=దధీచి మహర్షియైనట్టియు, మహామంగళ=గొప్ప శుభంకరమైన, చారుమూర్తికిన్=మనోహరమైన రూపముగలట్టియు, సమంచిత=మిక్కిలిగ ఒప్పునట్టి, నిర్మల ధర్మమూర్తికిన్=పవిత్రమైన ధర్మమే రూపముగ గలట్టియు, విశదనీతి=స్పష్టమైన రాజనీతి యొక్క, ధురా=అగ్రస్థానము నందు, విబుధేంద్ర=దేవేంద్రుని, మంత్రికిన్=మంత్రియైన బృహస్పతియైనట్టియు, ఉత్తుంగ...ధూర్జటికిన్, ఉత్తుంగతర=మిక్కిలి

ఉన్నతమైన, ప్రతాపగుణ=పరాక్రమము వలన కల్గిన ప్రతిష్ఠలో, ధూర్జటి=శంకరుడైన, లింగన మంత్రికిన్=లింగనమంత్రికి, ధారణిన్=భూమిపై, ఎవ్వరు=ఎవరు, సాటి=సమానము?

భావము :- లింగన మంత్రి యుద్ధరంగమున అర్జునుడు. దానగుణమునందు దధీచి మహర్షి. శుభంకరము, మనోహరమునైన రూపము కలవాడు. ప్రకాశమానమైన పవిత్ర ధర్మమూర్తి. స్పష్టమైన రాజనీతిజ్ఞత యందు బృహస్పతి. పరాక్రమముచేత కల్గిన ప్రతిష్ఠ యందు శంకరుడు. అట్టి లింగన మంత్రికి భూమిపై మరెవరు సాటిలేరు.

విశేషము :- అర్జునుడు: పాండవ మధ్యముడు. యుద్ధమున అపజయము లేనివాడై విజయుడను బిరుదునామము కలవాడు. ఇతడు సవ్యసాచి కూడ. అనగా రెండు చేతులతోను బాణప్రయోగము చేయగలవాడు.

దధీచి: ఇతడు మహర్షి. మహాశివభక్తుడు. సుకన్యాచ్యవనుల కుమారుడు. ఒకప్పుడు రాక్షసులు దేవతలనోడించి వారి అస్త్రములను లాగివైచుకొనుచుండిరి. దేవతలు పారిపోయివచ్చి దధీచి మహర్షిని ప్రార్థించి తమ అస్త్రశస్త్రములనాతని యొద్దదాచి యుంచి వెడలిరి. రాక్షసుల బెడద తొలగి దేవతలు వారివారి స్థానములందు సుఖభోగము లనుభవించుచుండిరేగాని దధీచి కడకు వచ్చి అస్త్రశస్త్రములను తీసికొనలేదు. దధీచి కాపాడలేక వానినన్నిటిని మ్రింగివేసెను. అవి జీర్ణమై అతని రక్తనాళములలోను ఎముకలలోను చేరెను. వృత్రాసురాదులతో యుద్ధము చేయవలసివచ్చినపుడు బ్రహ్మదేవుని ఆనతిపై దేవతలు వచ్చి ఆయుధములకై దధీచి నర్థించిరి. అపుడు దధీచి "దేవతలారా! మీరు నన్ను చంపి నా యస్థులు కొనిపొండు. నా యస్థులే శతాధిక బలసంపన్నములగు మీ యాయుధములగును' అని పల్కెను. దేవతలు దధీచిని చంప భయపడిరి. అపుడు దధీచి యోగాగ్నిని కల్పించుకొని పరబ్రహ్మానుసంధానమున దేహమును వదలి, పరమశివునిలో ఐక్యమయ్యెను. ఆ దధీచి యస్థులే (ఎముకలే) గోగణముచే శుద్ధిచేయబడిన పిదప వజ్రాయుధము, బ్రహ్మచక్రము మొదలగు ఆయుధములుగ చేసికొని దేవతలు అసురసంహారము చేసిరి.

ఈ దధీచి మహర్షియే నిరీశ్వరయాగసందర్భమున దక్షునిచే అవమానింపబడి "నీ యీ నిరీశ్వరయాగము అశుభ ప్రతిపాదకమగు గాక" యని శపించి యజ్ఞవాటము నుండి వెడలిపోయెను. (స్కాంద పురాణము)

*'మహర్షుల చరిత్రలు' - పుట. 134, 136. విద్వాన్ బులుసు వేంకటేశ్వర్లు.*

సీ॥ ఖండశర్కర జున్ను కండ చక్కెరలు దో
　　సెలు వడల్ సేవె పాసెములతోడఁ
గమ్మఁగాఁగాఁచిన కఱియాల నేతితోఁ
　　గమనీయ పంచభక్ష్యముల తోడఁ

సంబారములతోడి శాకపాకము తోడఁ
బక్వమైన పెసరపప్పు తోడఁ
దేనియధారతోఁ బానకంబులతోడఁ
శిఖరి షాడబరసశ్రేణి తోడ
తే॥ నచ్ఛలవణాదికము తోడ నమృతఖండ
పాండరంబైన దధితోడ బ్రాహ్మణులకు
భోజనము వెట్టు ద్వాదశీ పుణ్యవేళ
లింగమంత్రి నవీన రుక్మాంగదుండు 61

అర్థము:- నవీన రుక్మాంగదుండు=ఆధునికమైన రుక్మాంగదుడైన, లింగమంత్రి= లింగనమంత్రి, ద్వాదశీ పుణ్యవేళ=ద్వాదశి పవిత్ర సమయము నందు, బ్రాహ్మణులకు= బ్రాహ్మణులకు;

ఖండ శర్కర జున్ను=పంచదార కలిపిన జున్ను, కండచక్కెర=పటిక బెల్లమును, దోసెలు=అట్లు, వడల్=గారెలు, సేవె పాసెములతోడన్=సేమ్యా పాయసములతోను;

కమ్మగాన్ కాఁచిన=మంచివాసన వచ్చు నంతవరకు కాచినట్టి, కఱియాల=నల్లావుల నేతితోన్=నేతితోను, కమనీయ=మనోహరములైన, పంచభక్ష్యములతోడన్= ఐదు విధములైన భక్ష్యములతోను;

సంబారములతోడి=ఉప్పు, మిరప, చింతపండు మొదలగు వానిని కలిపి, శాకపాకము తోడన్=పాకము చేసిన కూరలతోను, పక్వమైన=ఉడికిన, పెసరపప్పు తోడన్=పెసరపప్పుతోను;

తేనియధారతో=తేనెధారలతోను, పానకంబులతోడన్=పానకములతోను, శిఖరి= దానిమ్మ పండ్ల రసము, షాడబరసశ్రేణి తోడన్=మురబ్బాల సమూహమై ఆరురసములతో కలిపి చేయు పానీయములతోను;

అచ్ఛలవణాదికము తోడన్=స్వచ్ఛమైన ఉప్పు మొదలైన వానితోను, అమృతఖండ= అమృతపు ముక్కలవలె, పాండరంబైన=తెల్లనైన, దధితోడన్=పెరుగుతోను, భోజనము= అన్నమును, పెట్టున్=పెట్టును.

భావము :- అపర రుక్మాంగదుడైన లింగనమంత్రి ద్వాదశి పారణ శుభవేళయందు బ్రాహ్మణులకు - పంచదార కలిపిన జున్ను, పటిక బెల్లము, అట్లు, గారెలు, సేమ్యా పాయసము, నల్లావుల పాలనుండి తీసి సువాసన వచ్చునంతవరకు కాచిన నేయి, పంచభక్ష్యములు, ఉప్పు, కారము మొదలగునవి కలిపి వండిన కూరలు, ఉడికిన పెసరపప్పు,

తేనెలు, పానకములు, దానిమ్మపండ్ల రసము, మురబ్బాల సమూహము కలిపి ఆరు రసములతో చేసిన పానీయములు, తెల్లని గడ్డ పెరుగులతో భోజనము పెట్టును.

**విశేషము :-** రుక్మాంగదుడు :- ఇతడొక పూర్వకాలపు రాజు. ఇతడు తన జీవితకాల మంతయు ఏకాదశీ వ్రతమును, ద్వాదశీ పుణ్య పారాయణ వ్రతమును ఆచరించినవాడు. దేవతలెన్ని విఘ్నములు కల్పించినను నిరంతరము ఏకాదశీ వ్రతమును కొనసాగించినవాడు.

ద్వాదశీ పుణ్యవేళ:- సంవత్సరమున 24 ఏకాదశులు వచ్చును. అధికమాసము వచ్చినచో మరిరెండధికము. వాని ప్రక్కనే ద్వాదశులు వచ్చును. దశమినాడు ఏకభుక్తము (ఒంటిపూట భోజనము). ఏకాదశినాడు ఉపవాసము, విష్ణుపూజనము, భగవత్కథా శ్రవణము, రాత్రి జాగరణము, భగవన్నామ సంకీర్తనము. ద్వాదశినాడు ప్రొద్దున ద్వాదశి పారణము - బ్రాహ్మణ భోజనము. ఏకభుక్తము, పగలు నిద్రింపకుండుట - మొదలగునవి ఏకాదశీ వ్రత విధాన నియమములు.

శిఖరి, షాడబరసము: శిఖరి: "తన్వీ శ్యామా శిఖరిదశనా" అను మేఘసందేశమున 2వ సర్గలోని యక్షపత్నీ వర్ణనము గల 19వ శ్లోకమున శిఖరి అను పదమునకు వ్యాఖ్యాతలు 'పండిన దానిమ్మ గింజలు' అని అర్థము చెప్పిరి. కనుక శిఖరి రసమనఁగా పండుదానిమ్మ గింజల రసము అని తెలియవలెను.

షాడబ : ఆమ్ల లవణాది ఆరు రసములును, పంచదార తేనె మొదలయిన మధుర ద్రవ్యములును కలిపి పానీయముగను, లేహ్యముగను, భక్ష్యముగను, చూర్ణముగను తయారుచేయ పదార్థములు. -సాహిత్య సమీక్ష పుట. 383, దీపాల పిచ్చయ్య శాస్త్రి.

క॥ **ప్రతిఘటియింపఁగ వచ్చునె**
**ప్రతిభటులకు నసమ సమర ఫల్గును తోడన్**
**శతకోటి దృఢ కఠార**
**క్షత శాత్రవు తోడ లింగసచివుని తోడన్** **62**

**అర్థము :-** అసమ సమర=సాటిలేని యుద్ధములందు, ఫల్గును తోడన్=అర్జునుడై నట్టియు, శతకోటి=వజ్రాయుధమువలె, దృఢ=కఠినమైన, కఠార=ఖడ్గముతో, క్షత= ఖండింపబడిన, శాత్రవుతోడ=శత్రువుకల, లింగసచివుని తోడన్=లింగన మంత్రితో, ప్రతిభటులకు= శత్రువులకు, ప్రతిఘటియింపఁగన్=ఎదిరించుట, వచ్చునె=తగునా!

**భావము:-** లింగనమంత్రి భీకరమైన యుద్ధ విద్య యందు అర్జునుడు. వజ్రాయుధము వంటి ఆతని కత్తికి శత్రుసైన్యము నాశనమైనది. అతని నెదిరించుట శత్రువులకు సాధ్యము కాదు.

సీ॥ ఝాడేశవన సప్తమాడె బారుహదొంతి
వంతునాది క్షితీశ్వరులఁ గెలిచి
యొడ్డాది మత్స్యవంశోదయార్జును చేతఁ
బల్లవాధిపు చేతఁ బలచమంది
దండకారణ్యమధ్య పుళిందరాజ రం
భాహివంశజులకు నభయమొసఁగి
భానుమత్కుల వీరభద్రాన్న దేవేంద్ర
గర్వ సంరంభంబుఁ గట్టిపెట్టి

తే॥ యవన కర్ణాట కటక భూధవులతోడఁ
జెలిమి పాటించి యేలించెఁదెలుఁగు భూమిఁ
దన నిజస్వామి నల్లాడ ధరణి నాథు
బళిరె యరియేటి లింగన ప్రభువరుండు. 63

అర్థము:- అరియేటి లింగన ప్రభువరుండు=అరేటి లింగన మంత్రి శ్రేష్ఠుడు, ఝాడేశవన=ఝాడెరాజ్యముల సమూహమును, సప్తమాడె=ఏడైన మన్య ప్రాంత సంస్థానములను, బారుహదొంతి=పంద్రెండు మన్య ప్రాంత రాజ్యములను, వంతునాది =జంత్రునాడు ప్రాంతమును పాలించు, క్షితీశ్వరులన్=రాజులను, గెలిచి=జయించి;

ఒడ్డాది=ఒడ్డాదిని పాలించు, మత్స్యవంశ=మత్స్యవంశపు రాజైన, ఉదయార్జునుచేతన్ =ఉదయార్జునుని చేతను, పల్లవాధిపు చేతన్=వీరకూటమునేలు పల్లవరాజు చేతను, పలచము+అంది=కప్పమును పొంది;

దండకారణ్య మధ్య=దండకారణ్యము యొక్క మధ్యభాగము నందలి, పుళిందరాజ= బోయరాజులైన, రంభ=రంపయను గిరి దుర్గమును పాలించు, అహివంశజులకున్= నాగవంశీయులకును, అభయమొసఁగి=అభయము నిచ్చియు;

భానుమత్కుల=సూర్యవంశీయులైన, వీరభద్ర+అన్నదేవేంద్ర=వీరభద్రుని అన్నదేవచోడుని యొక్క, గర్వ సంరంభంబున్=గర్వము యొక్క ఉద్రేకమును, కట్టి పెట్టి= అణచివేసి;

యవన=యవనుల యొక్క, కర్ణాట=కన్నడదేశము యొక్క, కటక=ఓఢ్రదేశము యొక్క, భూధవులతోడన్=రాజులతో, చెలిమిన్+పాటించి=స్నేహమును పాటించి, తన నిజ స్వామిన్=తనకు రాజైనట్టి, అల్లాడ ధరణినాథు=అల్లాడ భూపతిచేత, తెలుఁగు భూమిన్=తెలుగు దేశమును, బళిరె=బళియనునట్లుగ, ఏలించెన్=పాలించునట్లు చేసెను.

భావము :- అరేటి లింగన మంత్రి ఝూడేశవనము, సప్తమాడెములు, బారుహదొంతి, జంత్రునాడు రాజులను జయించి, ఒడ్డాదిని పాలించు మత్స్య వంశపు రాజు ఉదయార్జునుని, వీరకూట దుర్గమునేలు పల్లవరాజు రెండవ పురుషోత్తముని సామంతులుగ జేసికొని, దండకారణ్య మధ్యమునందలి పుళిందరాజులు రంభ దుర్గ పాలకులైన నాగవంశ నాయకులకు అభయమిచ్చి భయము తీర్చి, సూర్యవంశీయులైన వీరభద్ర అన్నదేవచోడుల గర్వమును అణచివేసి, యవన కన్నడ ఓఢ్ర దేశముల రాజులతో స్నేహమును చేసి తన రాజైన అల్లాడ భూపతి చేత తెలుగు దేశమును నిష్కంటకముగ పాలింపజేసెను.

విశేషము :- ఝూడేశవనము : ప్రస్తుత పార్వతీపురం, బొబ్బిలి, జయపూరులో కొంతభాగము.

సప్తమాడె :- గంజాంజిల్లాలోని ఏడు సంస్థానములు.

బారుహదొంతి :- గంజాం విశాఖ జిల్లాల నానుకొనియున్న ఒరిస్సాలోని పంద్రెండు రాజ్యముల వరుస.

వంతునాది :- జంత్రునాడు అని మల్లంపల్లివారి పాఠాంతరము. జంత్రునాడు విశాఖ జిల్లా శృంగవరపుకోట ప్రాంతము.

రంభ :- రంపకు సంస్కృతీకరణము. రంప తూర్పు గోదావరి జిల్లాలో చోడవరము తాలూకాలోగల గిరిదుర్గము.

ఒడ్డాది :- విశాఖ జిల్లా వీరవల్లి తాలూకాలో గలదు.

భీమ.(1-29; 1-38 చెంతకూడ వచ్చినవి.)

క॥ దేవ బ్రాహ్మణ భూములు
భూవరునకుఁజెప్పి ధారవోయించె భళీ
దేవయలింగన ప్రియసం
భావన నిరుపాధి సర్వమాన్యంబులుగన్. 64

అర్థము :- భళీ=ఆహా! దేవయ లింగన=దేవయ మంత్రికి కుమారుడైన లింగన మంత్రి, భూవరునకున్=రాజైన అల్లాడ భూపతికి, చెప్పి=చెప్పి ఒప్పించి, ప్రియ సంభావనన్=ప్రేమతోడి గౌరవముతో, నిరుపాధి=కపటము లేక, సర్వమాన్యంబులుగన్=ఏవిధమగు పన్నులులేక గౌరవార్థముగ ఇచ్చిన భూములగునట్లుగా, భూములు=పొలములను, దేవ బ్రాహ్మణ=దేవతల కొరకు, బ్రాహ్మణుల కొరకు, ధారవోయించె=ధారాదత్తము చేయించెను.

భావము :- ఆహా! లింగన మంత్రి తన ప్రభువైన అల్లాడ భూపతికి చెప్పి దేవతలకు, బ్రాహ్మణులకు భూములను దానము చేయించెను. ఆయాదానములను కపటములేని

మనస్సుతో, ప్రేమతోడి గౌరవముతో సర్వమాన్యములుగ ఇప్పించెను. కనుక ఆ భూములపై ఏ విధములైన పన్నులుండవు.

చ॥ అవుర ప్రతాప వేమ వసుధాధిపుచే నృపపట్టభద్రుచే
భువన మనోహరంబయిన బోడసకుర్తి మహాస్థలంబునన్
దివిరి పరిగ్రహించె మన దేవయ లింగన మంత్రి యన్నచో
డవర మహాగ్రహారముఁ గడంకఁగవిద్విజబంధురక్షకై. 65

అర్థము :- అవుర=భళీ! మన దేవయ లింగన మంత్రి=మన దేవ మంత్రి కుమారుడైన లింగన మంత్రి, ప్రతాప=ప్రతాపముగల, నృపపట్టభద్రుచే=పట్టాభిషిక్తుడైన వానిచేత, వేమవసుధాధిపుచే=వేమభూపతి చేత, కవి ద్విజ బంధు రక్షకై=కవులను బ్రాహ్మణులను, బంధువులను రక్షించుటకై, భువన మనోహరంబయిన=లోకముల మనసున కింపయిన, బోడసకుర్తి=బోడసకుర్తియను పేరుగల, మహాస్థలంబునన్=గొప్ప ప్రదేశమునందు, అన్నచోడవర=అన్నచోడవరమను గ్రామమును, మహాగ్రహారమున్=గొప్పదగు పన్నులులేని దానముగ, కడంకన్=పూనికతో, తివిరి=సిద్ధపడి, పరిగ్రహించెన్=స్వీకరించెను.

భావము :- దేవ మంత్రి కుమారుడైన లింగన మంత్రి కవులను, బ్రాహ్మణులను, బంధువులను ఆదరించు పూనికతో ప్రతాపమూర్తియైన వేమభూపతి నుండి బోడసకుర్తియను గొప్ప ప్రదేశమునందు అన్నచోడవరము అను గ్రామమును అగ్రహారముగ దానమును స్వీకరించెను.

విశేషము :- అల్లాడ భూపతి కుమారుడైన వేమ భూపతి ప్రతాప గుణమును గూర్చి వేమవరము శాసనమునందలి శ్లోకము.

"అల్లాడ క్షితిపాల వేమనృపతే సస్ఫీత ప్రతాపానలైః
చూరఃపూర్ణశిలా రటంతి కిటయః సాపల్లవాః పల్లవాః
లీనం మీనకులంజలే శ్రితబిలా భోగశ్చ నాగాగుహా
గావోయాంతి త్రిణాననా నివసతే సంఘౌ గజానాం పతిః"

వేమభూపాలుని ప్రతాపమనెడి కార్చిచ్చుచే కళింగదేశపాలకులు వారి ధ్వజ చిహ్నములైన పంది, చేప సర్పము, గోవు, ఏనుగులు విచ్ఛిన్నమై పారిపోవుట వర్ణింపబడినది.

**బోడసకుఱ్ఱు, అన్నచోడవరము** :- "ఇప్పుడన్నచోడవరమను నగ్రహారము కనబడుట లేదు. కాని బోడసకుఱ్ఱు అను గ్రామమున్నది. అది గోదావరి మండలమున వైనతేయమను నదికి దక్షిణపుటొడ్డుననున్నది. బోడసకుఱ్ఱున కత్యంత సమీపమున దొడ్డవరమను చిన్న గ్రామమొకటియున్నది. అదియే యీ యన్నచోడవరమయి యుండునేమో".

*చాగంటి -ఆంధ్రకవి తరంగిణి - 5వ భాగము పుట - 65*

సీ॥ వాహ్యాళి భూమి రేవంత నైషధులట్లు
హయరత్నముల నెక్కి యాడనేర్చుఁ
గవిబుధ శ్రేణికిఁజెవులు పండువులుగా
నాస్థానమున మాటలాడ నేర్చు
శక్తిత్రయంబునఁ జతురుపాయంబుల
షాడ్గుణ్యముల బుద్ధిఁజరుపనేర్చుఁ
గైసేసి ప్రత్యక్ష కందర్ప మూర్తియై
నిర్వికారంబున నిలువ నేర్చు
తే॥ నిష్ఠురాటోప విస్ఫూర్తి నృహరి కరణి
నతి కఠోర కుఠార ధారాంచలమున
వైరి వక్ష స్థలము వ్రచ్చి వైవనేర్చు
సంగరార్జునుఁడరియేటి లింగ విభుఁడు. 66

అర్థము :- సంగరార్జునుఁడు=యుద్ధరంగమున అర్జునుడైన, అరియేటి లింగవిభుడు= అరేటి లింగన మంత్రి, వాహ్యాళి భూమిన్=విహార ప్రదేశమునందు, రేవంత=సూర్యపుత్రుడైన రేవంతుని వలెను, నైషధులట్లు=నిషధదేశపు రాజైన నలుని వలెను, హయరత్నములను+ఎక్కి=మేలైన గుఱ్ఱముల నెక్కి, ఆడ నేర్చున్=సంచరించగలడు,

కవిబుధ=కవుల పండితుల యొక్క, శ్రేణికిన్=సమూహమునకు, చెవులు పండువులు గాన్=వీనులవిందులుగా, ఆస్థానమునన్=కొలువు కూటమునందు, మాటలాడనేర్చు= మాటలాడగలడు,

శక్తిత్రయంబునన్=మూడు శక్తులయందు, చతురుపాయంబులన్=నాలుగు పాయముల యందు, షాడ్గుణ్యముల=ఆరు గుణముల యందును, బుద్ధిన్=తన బుద్ధిని, జరుప నేర్చున్=వ్యాపింపజేయు గలడు;

కైసేసి=అలంకృతుడై, ప్రత్యక్ష కందర్పమూర్తియై=కన్నుల యెదుటనున్న మన్మథా కారము కలవాడై, నిర్వికారంబునన్=మనస్సుమారుపాటు లేక, నిలువ నేర్చున్=నిలువగలడు,

నిష్ఠుర=కఠినమైన, ఆటోప=గర్వము యొక్క, విస్ఫూర్తిన్=ప్రకాశమునందు, నృహరి కరణిన్=నరసింహమూర్తికి వలె, అతికఠోర=మిక్కిలి వాడియైన, కుఠార=గొడ్డలి యొక్క, ధార+అంచలమునన్=అంచు యొక్క మొనతో, వైరి వక్షస్థలము=శత్రువు యొక్క ఱొమ్మును, వ్రచ్చివైవ నేర్చున్=చీల్చి వేయగలడు.

భావము :- యుద్ధరంగమున అర్జునుడైన అరెటి లింగన మంత్రి విహార స్థలమునందు రేవంతునివలె, నలమహారాజువలె మేలుజాతి గుఱ్ఱములనెక్కి స్వారి చేయగలడు. ఆస్థానములో కవులకు పండితులకును వీనుల విందగునట్లు మాటాడగలడు. త్రిశక్తులతో చతురుపాయము లతో, షడ్గుణములతో బుద్ధిని వ్యాపింపజేయగలడు. మన్మథునివంటి రూపసి యైనను నిర్వికారుడై చలింపకయుండగలడు. పరాక్రమ విస్ఫూర్తితో, నిశ్శంక ప్రేటులతో శత్రువుల గుండెలను చీల్చివేయగలడు.

విశేషము :- రేవంతుడు, నైషధుఁడు=సూర్యుని కుమారుడు రేవంతుడు. నిషధ దేశాధీశుడు నలుడు. వీరిరువురు గుఱ్ఱపు స్వారి యందు ఘనులు.

శక్తిత్రయము :- ఉత్సాహ ప్రభు మంత్రములను మూడు.

చతురుపాయములు : సామము, దానము, భేదము, దండము - అను నాలుగు.

షడ్గుణములు - మా॥విశే॥ ఆశ్వా 1-పద్యము-51.

ఆ॥ లింగమంత్రి భామ గంగాంబికాదేవి
గనియె సుతుల నర్థి కల్పతరుల
భవ్యరూప పంచబాణావతారుల
మంత్రి మంత్రి దేవ మంత్రివరుల. 67

అర్థము :- లింగమంత్రి భామ=లింగన మంత్రికి భార్యయైన, గంగాంబికాదేవి= గంగాంబికాదేవి అను నామె. అర్థికల్పతరులన్=యాచకులకు కల్పవృక్షముల వంటివారు. భవ్యరూప=శుభంకరమైన రూపమునందు, పంచబాణ+అవతారులన్=మన్మథుని యవతారములైనవారు. మంత్రి మంత్రి=మంత్రియను పేరుగల మంత్రిని. దేవమంత్రి=దేవమంత్రియను, వరులన్=శ్రేష్ఠులైన, సుతులన్=కుమారులను, కనియె=కనెను.

భావము :- లింగన మంత్రి భార్య గంగాంబికాదేవి. ఈమెకు ఇద్దరు కుమారులు కల్గిరి. వారు మంత్రి మంత్రి, దేవ మంత్రి అనువారు. వీరిద్దరును యాచకుల పాలిట కల్పవృక్షములు. శుభంకరమైన రూపముగల మన్మథాకారులు.

తే॥ కశ్యపాన్వయ పాథోధి కల్పశాఖి
సర్వగుణ రత్న రోహణక్ష్మాధరేంద్ర
మభ్యుదయ మందు మంత్రి లింగయ్య సుతుఁడు
మదన గోపాల సన్నిభ మంత్రి మూర్తి. 68

అర్థము :- మంత్రి లింగయ్య సుతుఁడు=లింగన మంత్రికి కుమారుడు, మదనగోపాల =మదనగోపాలుడైన శ్రీ కృష్ణునితో, సన్నిభ=సమానమైనవాడు, కశ్యప+అన్వయ=కశ్యప మహర్షి వంశమనెడి, పాథోధి=సముద్రము నందలి, కల్పశాఖి=కల్ప వృక్షమును, సర్వగుణ రత్న=అన్ని సుగుణములనెడి రత్నములకు, రోహణ=రోహణమను పేరుగల, క్ష్మాధరేంద్రము=పర్వత శ్రేష్ఠమునై, మంత్రిమూర్తి=మంత్రి మంత్రి, అభ్యుదయమందు=అభివృద్ధిని పొందును.

భావము :- లింగన మంత్రికి కుమారుడైన మంత్రిమూర్తి కశ్యప మహర్షి వంశమనెడి పాల సముద్రమున పుట్టిన కల్పవృక్షము. సర్వ సుగుణములనెడి రత్నములకు నిలయమైన రోహణ పర్వతము. మదన గోపాలుని పోలిన రూపసియై అభివృద్ధిని పొందును.

విశేషము :- రోహణ పర్వతము : ఇది రత్నములకు నిలయమందురు. ఇది ప్రస్తుతము శ్రీలంకలో కలదు.

కల్పవృక్షములు :- ఇవి ఐదు - చూ ఆశ్వా 1 - పద్య విశేషము 46.

మదనగోపాల :- మన్మథుని వంటి అందమైన గోపాల కృష్ణుని దివ్యరూపము.

ఉ॥ చంచల లోచనా కుసుమ చాపుఁడు దాన కళాదధీచి యా
శాంచల వారణేంద్ర దశనాంకుర నిర్మల కీర్తి వైభవా
భ్యంచిత సర్వలోకుఁడనపాయ రమా విభవ ప్రపంచరా
త్రించర శాత్రవుండు మన దేవయ తల్లన మంత్రి మాత్రుఁడే. 69

అర్థము :- మన దేవయ తల్లన=మన దేవ మంత్రి కుమారుడైన తల్లన మంత్రి, చంచలలోచనా=చంచలాక్షులకు, కుసుమచాపుఁడు=మన్మథుడు, దానకళా=దానము చేయుటయను విద్యయందు, దధీచి=దధీచి మహర్షి. ఆశాం....లోకుఁడు. ఆశాంచల=దిక్కుల యొక్క అంచుల యందుగల, వారణేంద్ర=గజరాజుల, దశన+అంకుర=దంతముల మొలకలవలె, నిర్మల కీర్తి వైభవ=పవిత్రమైన యశస్సనెడి సంపదతో, అభ్యంచిత=మిక్కిలిగ ప్రకాశించుచున్న, సర్వలోకుఁడు=సమస్తమైన లోకములు కలవాడు, అన....శాత్రవుండు. అనపాయ=ఎన్నడును వీడని, రమావిభవ ప్రపంచ=లక్ష్మీవైభవ సమూహమునకు, రాత్రించర శాత్రవుండు=రాక్షస వైరియైన విష్ణుమూర్తి. మంత్రిమాత్రుఁడే=కేవలము మంత్రియా!

భావము :- దేవమంత్రి కుమారుడైన తల్లన మంత్రి కేవలము మంత్రి మాత్రుడు కాడు. అతడు సుందరీమణుల పాలిటి మన్మథుడు. దాన కళయందు దధీచి మహర్షి. ఆతని యశస్సు దిగ్గజముల దంతపు మొలకలవలె స్వచ్ఛమై, నిర్మలమై సర్వలోకములకు వ్యాపించినది. అక్షీణమైన లక్ష్మీ వైభవముతో అతడు విష్ణువే సుమా!

విశేషము :- దధీచి : చూ - ఆశ్వా - 1 - పద్యవిశేషము 60.

రమ : లక్ష్మీదేవి విష్ణువు నెప్పుడును వీడదు. అట్లే రమ(సంపద) తల్లన మంత్రినెప్పుడును వీడదని భావము.

కll ఈ వసుధామండలమున
నేవారును సరియె రూప హేలానుకృత
శ్రీవత్స లాంఛనునకును
దేవయ తల్లనికి మంత్రి దేవేంద్రునకున్. 70

అర్థము :- దేవయ తల్లనికి=దేవయ మంత్రి కుమారుడైన తల్లన మంత్రికి, రూప హేలా=ఆకార విలాసమున, అనుకృత=అనుకరింపబడిన, శ్రీవత్సలాంఛనునకు=విష్ణుమూర్తి కలవానికి, మంత్రి దేవేంద్రునకున్=దేవతలలో శ్రేష్ఠుడైన ఇంద్రునకు వలె మంత్రులలో శ్రేష్ఠుడైన ఈ తల్లన మంత్రికి, ఈ వసుధామండలమునన్=ఈ భూమండలమునందు, ఏవారును=ఎవరైనను, సరియె=సమానమా! కారు.

భావము :- తల్లన మంత్రి మంత్రులలో శ్రేష్ఠుడు. రూప రేఖా విలాసమునందు విష్ణువునకు సమానము. కనుక ఈ తల్లన మంత్రికి ఈ భూమండలమున ఎవ్వరును సాటిరారు.

విశేషము :- శ్రీవత్సము :- విష్ణువు వక్షస్థలమునందలి పుట్టు మచ్చ. ఇది అంగుష్ఠ ప్రమాణముతో తెల్లని వెంద్రుకలతో దక్షిణావర్తమగు సుడివంటి చిహ్నము.

కll నాళీకభవ వధూస్తన
పాళీ కహ్లార రమ్యపరిమళ లహరీ
శాలీనతావిధాయి వ
చోలీలలు తల్లనార్థి సురభికి నమరున్. 71

అర్థము :- నాళీ.....లీలయు. నాళీకభవ=బ్రహ్మదేవుని యొక్క, వధూ=భార్యయైన సరస్వతి యొక్క, స్తన పాళీ=కుచ ప్రదేశము నందలి, కహ్లార=కలువల యొక్క, రమ్య పరిమళ=మనోజ్ఞమైన సువాసనల యొక్క, లహరీ=తరంగములకు, శాలీనతా విధాయి= మర్యాదను కల్గించునట్టి, వచోలీలలు=వాగ్విలాసములు, తల్లన=తల్లన మంత్రియును, అర్థి సురభికిన్=యాచకుల పాలిటి కామధేనువైన వానికి, అమరున్=కలుగును.

భావము :- తల్లన మంత్రి యాచకుల పాలిటి కామధేనువు. ఆతని వాగ్విలాసములు సరస్వతీ దేవి వక్ష స్థలమునందలి సౌగంధికములను పేరుగల కలువపూల పరిమళ

ప్రవాహమునకు మర్యాదను, వినమ్రతను కల్గించును. అనగా సౌగంధికములకన్న మిన్నయైన మృదుత్వమును, మనోజ్ఞత, పరిమళము - తల్లన మంత్రి మాటలకుండునని భావము.

తే॥ తదనుసంభవుఁడఖిల విద్యావిరించి
యర్థిజన కామదుగ్ధేను వన్న మంత్రి
క్రీడసల్పును వాని సత్కీర్తికాంత
సప్తలోక మహోత్సవ సౌధవీథి. 72

అర్థము :- తత్+అనుసంభవుండు=ఆ తల్లన మంత్రికి తరువాత పుట్టిన, అన్నమంత్రి=అన్నయ మంత్రి, అఖిల విద్యా=సర్వవిద్యలందును, విరించి=బ్రహ్మదేవుని వంటివాడు. అర్థిజన=యాచకులైన జనులకు, కామధుక్=కోరికలను పిదుకు, ధేనువు=ఆవు (కామధేనువు). వాని=ఆ అన్నయ మంత్రి యొక్క, సత్కీర్తి కాంత=మంచి కీర్తి యనెడి కాంత, - సప్తలోక=ఏడు లోకములందలి, మహోత్సవ=మహోన్నతమైన, సౌధవీథి=మేడల యొక్క వరుసయందు. క్రీడ సల్పును=విహరించును.

భావము :- ఆ తల్లన మంత్రికి సోదరుడు అన్నయ మంత్రి. ఇతడు యాచకుల పాలిటి కామధేనువు. ఇతని కీర్తికాంత పైఏడులోకములందును మహోన్నతమైన మేడల వరుసయందు విహరించును.

విశేషము :- అలంకారము - రూపకము.

మ॥ అరబీ భాష తురుష్క భాష గజ కర్ణాటాంధ్ర గాంధార ఘూ
ర్జర భాషల్ మళయాళ భాష శకభాషా సింధు సౌవీర బ
ర్బర భాషల్ కరహాట భాష మఱియుం భాషా విశేషంబుల
చ్చెరువైవచ్చు నరేటి యన్ననికి గోష్ఠీ సంప్రయోగంబులన్. 73

అర్థము :- అరేటి యన్ననికి=అరేటి అన్నయ మంత్రికి, గోష్ఠీ సంప్రయోగంబులన్= సల్లాపములలోని పారస్పరిక సంబంధములందు. అరబీ భాష=అరబ్బుదేశ భాష, తురుష్క భాష=టర్కీ భాష, గజ=ఒరియా భాష, కర్ణాట=కన్నడ భాష, ఆంధ్ర=తెలుగు భాష, గాంధార= ఆఫ్ఘనుల భాష, ఘూర్జర భాషల్=గుజరాతీ భాషలును, మళయాళ భాష=కేరళదేశ భాష, శక భాషా=శక దేశభాష, సింధు=సింధు దేశపు, సౌవీర=సౌవీర దేశపు, బర్బర=బర్బర దేశపు, భాషల్=భాషలును, కరహాట భాష=కరహాట దేశ భాషయు, మఱియున్=ఇంకను, భాషావిశేషంబులు=ఇతర భాషలు, అచ్చెరువై=ఆశ్చర్యకరమగునట్లుగ, వచ్చు=వచ్చును.

భావము :- అరేటి అన్నయ మంత్రికి అనేకానేక సల్లాపములలోని పారస్పరిక సంబంధముచేత, అరబ్బీ, తురుష్క, ఒరియా, కన్నడ, ఆంధ్ర, గాంధార, గుజరాతీ, మళయాల, శక, సింధు, సౌవీర, బర్బర, కరహాట దేశ భాషలు మరికొన్ని భాషలును ఆశ్చర్యకరమగునట్లుగ మాటాడగలడు.

విశేషము :- అన్న మంత్రికి తెలుగు భాషతోపాటు అనేక ఇతర ప్రాంత భాషలు వచ్చును. ఆయా భాషలను అనర్గళముగ ఆయా దేశీయులతో వారి వారి భాషలలోనే మాటాడును.

1. అరబీ భాష - అరబ్బీ, 2. తురుష్క భాష - టర్కిష్ భాష, 3. గజ భాష - ఒరియా. 4. కర్ణాట - కన్నడము, 5. ఆంధ్రభాష - తెలుగు, 6. గాంధార భాష - ఆఫ్ఘనిస్తాన్ భాష, 7. ఘూర్జర భాష - గుజరాతీ, 8. మళయాళ భాష - కేరళ రాష్ట్ర భాష - మళయాళము.. 9. శక భాష - భారత దేశములో స్థిరపడిన విదేశీయుల భాష, 10. సింధు భాష - సింధీ, 11. సౌవీర భాష - ఛప్పన్నదేశాలలో గల భాష, 12. బర్బర భాష - ఉత్తర ఆఫ్రికన్ భాష, 13. కరహాట భాష - ఛప్పన్న దేశాలలో ఒకటియైన కరహాట దేశీయుల భాష.

ఉ॥ అన్నయ మంత్రి శేఖరుఁడహమ్మదు షాసురధాణ భూమిభృ
త్సన్నిధికి న్మది న్సముచితంబుగ వేమ మహీసురేంద్ర రా
జ్యోన్నతి సంతతాభ్యుదయ మొందఁగఁబారసి భాష వ్రాసినం
గన్నుల పండువై యమరుఁ గాకిత మందలి వర్ణపద్ధతుల్. 74

అర్థము :- అన్నయ మంత్రి శేఖరుఁడు=అరేటి అన్నయ మంత్రి శ్రేష్ఠుడు. మదిన్= మనసులో, సముచితంబుగ=తగినట్లుగ. వేమనుహీసురేంద్ర=వేమ భూపాలశ్రేష్ఠుని యొక్క. రాజ్య=పాలనమునందలి, ఉన్నతి=గొప్పతనము. సంతత=నిత్యము. అభ్యుదయము= అభివృద్ధి, ఒందఁగన్=కలుగుటకై, అహమ్మదుషా=అహ్మదుషా అను పేరుగల. సురధాణ=సుల్తాను యొక్క; భూమిభృత్=రాజు యొక్క, సన్నిధికిన్=సమక్షమునకు, పారసి భాష=పారసీక భాషలో, వ్రాసినన్=ఉత్తరమును వ్రాయగా, కాకితమందలి=ఆ జాబులోని. వర్ణ పద్ధతుల్= అక్షరముల పొందికలోని వైనములు, కన్నుల పండువై=చూచుటకు ముచ్చట గొల్పునవై, అమరున్=ఒప్పును.

భావము :- అన్నయ మంత్రి తన రాజైన వేమ భూపాలుని రాజ్య వైభవము ఎల్లప్పుడు ప్రకాశింపవలెనని భావించినవాడై, అహమ్మదుషా అను రాజునకు పారసీ భాషయందు లేఖ వ్రాసెను. ఆ లేఖలోని అక్షర నిర్మాణము కన్నుల పండువుగ నున్నది.

విశేషము :- కాకితము :- పారశీ భాషలోని 'కాఘజ్' లేదా 'కాఘిజ్' దీనికి మూలమూర్తి. మరాఠీలోని 'కాగద్' ద్వారా తెలుగులోనికి వచ్చింది - ఆచార్య తూమాటి దొణప్ప ఆకాశభారతి - పుట - 82.

దీనిని మొదటగ ప్రయోగించినవాడు శ్రీనాథుడు. ఈ గ్రంథముననే 1 - 12 లో కలము, సిరాలను గురించి కూడ సూచించినాడు. కనుక శ్రీనాథుని నాటికే తాటియాకులు, గంటములకు బదులుగ సిరా, కలము, కాగితములు ప్రవేశించినట్లు తెలియుచున్నది.

అహమ్మదుషా దక్కను పాలించిన బహమనీ సుల్తాను (క్రీ.శ. 1422-35).

సీ॥ రాజమహేంద్ర దుర్గమునఁ గావించె శ్రీ
వీరభద్రునకుఁ బ్రాకార రేఖ
నిలిపె మార్కండేయ నీలకంఠుని మ్రోల
రామేశుఁ దన తల్లి నామకముగ
సంగమేశ్వర దివ్య శంభు లింగమునకుఁ
గల్పించెఁ గళ్యాణ గర్భ గృహము
దక్షవాటికయందుఁదరుణేందు మౌళికి
మొగలి వాకిటధామమును రచించెఁ
తే॥ బ్రాగ్దిశా వప్రగోపుర ప్రాంగణమున
సప్తముని సింధు సోపాన సరణి కెలనఁ
దీర్చె భవనంబు భీమయ దేవు నగర
మంత్రి దేవయ యన్నయామాత్యవరుఁడు. 75

అర్థము :- మంత్రిదేవయ+అన్నయ=దేవయ మంత్రికి కుమారుడైన అన్నయ అను, అమాత్యవరుఁడు=మంత్రి శ్రేష్ఠుడు, రాజమహేంద్ర=రాజమహేంద్రవరమను, దుర్గమునన్=దుర్గమునందు, శ్రీవీరభద్రునకు=శ్రీ వీరభద్రుని ఆలయమునకు, ప్రాకార రేఖన్=చుట్టు గోడను, కావించెన్=కట్టించెను;

మార్కండేయ నీలకంఠుని=మార్కండేయ శివుని ఆలయము యొక్క, మ్రోలన్= సమీపమున, తన తల్లి నామకముగ=తన తల్లియైన రామాంబ యొక్క పేరుతో, రామేశున్= రామేశ్వర లింగమును, నిలిపెన్=ప్రతిష్ఠించెను;

సంగమేశ్వర=సంగమేశ్వరుడను, దివ్య=మహిమగల, శంభులింగమునకున్=శివ లింగమునకు, కళ్యాణ=శుభంకరమైన, గర్భగృహము=గర్భాలయమును, కల్పించెన్= కట్టించెను;

దక్షవాటికయందున్=దక్షారామమునందు, తరుణేందు+మౌళికి=శంకరునకు, మొగలి=వాకిలి సమీపమున, వాకిట=ముందరి, ధామమును=మంటపమును, రచించెన్= కట్టించెను;

భీమయదేవునగరన్=దక్షారామ భీమేశ్వర స్వామివారి ఆలయ ప్రాంతమున, ప్రాక్=తూర్పు, దిశా=దిక్కు యొక్క, వప్ర=తీరమండలి, గోపుర=గోపురము యొక్క, ప్రాంగణమున=ముందుభాగమున, సప్తముని సింధు=సప్తగోదావరమునకుగల, సోపాన సరణి=మెట్ల వరుసకు, కెలనన్=సమీపమున, భవనంబు=సౌధమును, తీర్చెన్=నిర్మించెను.

భావము :- అరేటి అన్నయ మంత్రి రాజమహేంద్రవరమున శ్రీ వీరభద్రాలయము నకు ప్రాకారమును కట్టించెను. మార్కండేయ శివాలయము చెంత తన తల్లియైన రామాంబ పేరు మీదుగా రామేశ్వర లింగమును ప్రతిష్ఠించెను. సంగమేశ్వరుని లింగమునకు గర్భాలయము కట్టించెను. దక్షారామ భీమేశ్వరాలయమునకు ప్రధాన గోపుర సమీపమున మంటపమును కట్టించెను. శ్రీ భీమేశ్వరాలయమునకు తూర్పుగోపుర ప్రాంతమున సప్తగోదావరి నదికిగల మెట్ల వరుసకు ప్రక్కగా ఒక భవనమును కట్టించెను.

విశేషము :- వీరభద్రేశుఁడు : వీరభద్రేశ్వరాలయమేదేనియానాడుండెనేమో! కాని యట్టి యాలయముండినట్లు నిదర్శనమేదియు కానరాదు. ఆనాటి రాజమహేంద్రవరమునకు పంచగిరి దుర్గమని ప్రసిద్ధి.

1. హేమగిరి :- ధవళేశ్వరమునకొక మైలు క్రిందనున్న నేటి వేమగిరి.
2. ధవళగిరి :- ధవళేశ్వరము.
3. పద్మగిరి :- గోదావరి స్టేషను సమీప ప్రదేశమైన రాజమహేంద్రవరము.
4. భద్రగిరి :- పట్టిస యొద్ద శ్రీ వీరభద్రేశ్వరుడు నెలకొన్న కొండ.
5. రామగిరి :- రాజమహేంద్రవరమునకు ఉత్తరముగ పది క్రోసుల దూరముననున్న రామగిరి దుర్గము.

గౌతమీ తీరమునంటియున్న పంచగిరులతో కూడి రాజమహేంద్రవరము శత్రుదుర్భేద్యమై యుండెడిది.

కావున రాజమహేంద్రవర దుర్గమునందలి వీరభద్రేశుడనగా పట్టిస శ్రీ వీరభద్రేశ్వరుడై యుండును.

మార్కండేయ శివుఁడు :- ఆనాటి మార్కండేయాలయముగాని, లింగము కాని, ప్రాకార గోపురాదులుగాని యీనాడు కానరావు. విధ్వస్తములై విలీనములగుటచే ఈ రామేశుడును కానరాడు.

సంగమేశ్వర దివ్యశంభులింగమనగా నేటి రామచంద్రపురము తాలూకాలోని తాపేశ్వరము ఏడిద మండపేటయను గ్రామములకు నడుమనుండిన సంగమేశ్వరుడు.

దక్షారామ భీమేశ్వరాలయమున భీమేశ్వరున కెదురుగ తిరుచుట్టుమాలెకు పడమట భాగమున విశాలమయిన మంటపమును నిర్మింపజేసినాడు. ఈ మంటపమునందే యేటేట శ్రీ భీమేశ్వరుని కళ్యాణ మహోత్సవములు, సాని కూతుల యభినయ ప్రదర్శనలు జరుగుచుండును.

తూర్పుదిక్కున నిర్మింపబడిన ప్రాకార గోపురమునకును సప్త గోదావరము మెట్లకును నడుమనొక పండ్రెండు స్తంభములుగల మంటపమును నిర్మించి యొక స్తంభమునందు శిలాశాసనమును వెలయించినాడు.

*శ్రీ భీమేశ్వరపురాణము పీఠిక. పుట - 26 - 28. శ్రీ చి.పా. శాస్త్రి.*

ఉ॥ భావన సంతసిల్లఁగ విభావనజాప్తుని విద్విషత్పరీ
భావ నవీన గాండివి ప్రభావ నమన్నిఖిలక్షమాజనున్
దీవనలిచ్చి యెప్పుడు సుధీవన రాశి నుతింతు రుత్తముల్
దేవన మంత్రి యన్నవిభు దేవనదీవనపావనాన్వయున్. 76

**అర్థము :-** విభా=కాంతియందు, వనజాప్తుని=కమలమిత్రుడైన సూర్యుడైనవాడును, విద్విషత్=శత్రువులను, పరీభావ=తిరస్కరించుట యందు, నవీనగాండివి=క్రొత్త అర్జునుడును, ప్రభావ=సామర్థ్యము చేత, నమత్=నమస్కరించుచున్న, నిఖిల క్షమా=సర్వభూమండలము నందలి, జనుస్=ప్రజ కలవాడును, సుధీవనరాశి=మంచి తెలివియను సముద్రము కలవాడును, దేవనదీ=ఆకాశగంగ యొక్క, వన=నీటివలె, పావన=పవిత్రమైన, అన్వయున్= వంశము కలవాడును ఐన, దేవన మంత్రి యన్న విభు=దేవన మంత్రికి కుమారుడైన అన్నయ శ్రేష్ఠుని, ఎప్పుడు=ఎల్లవేళలయందును, భావన సంతసిల్లఁగ=తలపు సంతసించు నట్లుగా, ఉత్తముల్=మంచివారు, దీవనలిచ్చి=ఆశీస్సులనిచ్చి, నుతింతురు=కొనియాడుదురు

**భావము :-** అన్నయ మంత్రి కాంతియందు సూర్యుడు. శత్రువులను ఓడించుట యందు అపర అర్జునుడు. అతని సామర్థ్యము సర్వభూమండలమునందలి ప్రజ గుర్తించి నమస్కరింతురు. మంచి తెలివియందు సముద్రమంతటివాడు. ఉత్తములు అట్టి అన్నయ మంత్రిని సర్వవేళల హృదయపూర్వకముగ ఆశీర్వదించి కొనియాడుదురు.

క॥ సిరి యేలికయగు నరకే
సరి యేమో కాని గర్వ సంరంభముమై
సరి యేపారఁగ నితరులు
సరియేయరియేటి యన్న సచివాగ్రణికిన్. 77

అర్థము :- అరయేటి యన్న=అరేటి అన్నయ అను, సచివాగ్రణికిన్=మంత్రి శేఖరునకు, గర్వ సంరంభముమై=అభిమానముతోడ ఉత్సాహముతో, సరి=సమమైన, ఏపు= ఔద్ధత్యము(విజృంభణము), ఒనరఁగన్=కల్గుట యందు, సిరి=లక్ష్మీదేవికి, ఏలికయగు= భర్తయైన, నరకేసరి=నరసింహమూర్తి, ఏమోకాని=సరిపోవునేమోకాని, ఇతరులు=మిగిలిన వారెవరును, సరియే!=సమానమా! కారు.

భావము :- అరియేటి అన్నమంత్రికి అభిమానోత్సాహ పరిపూర్ణమగు ఔద్ధత్యము కల్గుటలో లక్ష్మీపతియగు నరసింహుడు సమానమగునేమోకాని ఇతరులు సమానులగుదురా?

విశేషము :- ఈ పద్యము ద్విప్రాసముతో కూడియున్నది. శ్రీనాథ మహాకవి ఇట్లు వ్రాయుట అరుదు.

శా॥ కాంచీ కంకణ తారహార కటక గ్రైవేయ భూషావళుల్
లంచంబిత్తురు దూతికాతతికి లీలన్ బెండపూఁడన్ననిన్
బంచాస్త్రోపముఁ దారతార కవయన్ బ్రార్థించి లోలోపలన్
బంచారామములందుఁబల్వేల పురిం బ్రౌఢేందుబింబాననల్. 78

అర్థము :- పంచారామములందున్=ఐదు శైవ క్షేత్రములందలి, పల్వేలపురిన్= పల్వేల(పలివెల) పురము నందలి, ప్రౌఢ=గడి దేఱిన, ఇందుబింబాననల్=చంద్రబింబము వంటి మొగములుగల సుందరీ మణులు, పంచాస్త్ర=మన్మథునకు, ఉపమున్=పోలిన, బెండపూఁడన్ననిన్=బెండపూఁడి అన్నయ మంత్రిని, కవయన్=పొందుటకై, తారతార=ఎవరికి వారే తమలో తాము, లోలోపలన్=ఆంతరంగికముగ, ప్రార్థించి=మిక్కిలిగ కోరి, లీలన్=వేడుకగ, దూతికా తతికిన్=దూతికల సమూహమునకు, కాంచీ.......వళుల్, కాంచీ=మొలత్రాడులు, కంకణ=కరభూషణములు, తారహార=ముత్యాల దండలు, కటక=కాలి కడియములు, గ్రైవేయ=కంఠాభరణములు, భూష+ఆవళుల్=ఆభరణముల సమూహమును, లంచంబిత్తురు=లంచముగ ఇత్తురు.

భావము :- పంచారామములందలి, పల్వేల పురమునందలి ప్రౌఢలైన సుందరీ మణులు అపరమన్మథుడైన బెండపూడి అన్నయమంత్రిని పొందగోరి ఎవరికి వారే దూతికలను నియమించుకొని వారికి బంగరు మొలత్రాళ్ళు, కరభూషణములు. కాలికడియములు, ముత్యాలహారములు. కంఠాభరణములు మొ॥ వానిని లంచమిచ్చి తమకు మంత్రిని కూర్చుమని ప్రార్థింతురు

విశేషము :- పంచారామములు : చూడుడు భీమ. 1-40, 2-61

పల్వెలపురి :- "పల్వెల'బురిం' అని చిలుకూరి పాపయ్య శాస్త్రిగారు. శ్రీనాథ కృతి సమీక్ష - పుట - 31.

పలివెల :-దక్షారామమునకు మూడు యోజనముల దూరమున కౌంతేయి నదీ తీరమున (కౌశికి అను నదీ తీరమున) కలదు.

అన్నమంత్రిని (1-77) అరయేటి వంశీయుడనియు, ఈ పద్యమున బెండపూడి వంశీయుడనియు చెప్పుట గమనార్హ విషయము.

తే॥ తారగిరి మందరముల బృందారకాది
తారకారాజవదనలు తారుతార
తారతారశ్రుతిస్వరోదార లీలఁ
బాడుదురు బెండపూఁడన్న భవ్యకీర్తి. 79

అర్థము :- బెండపూఁడన్న=బెండపూడి అన్నయ మంత్రి యొక్క, భవ్యకీర్తిన్=మనోహరమైన కీర్తిని, తారగిరి మందరముల=వెండికొండ, మందర పర్వతములందలి, బృందారకాది=దేవతలు మొదలైన, తారకారాజ=నక్షత్రములకు నాయకుడైన చంద్రునివంటి, వదనలు=మొగములుగల కాంతలు, తార=ఓంకారమువలె, తారశ్రుతి=ఉచ్చైస్స్వరముతో, స్వర=ఉదాత్త అనుదాత్తాది రీతులు, ఉదారలీలన్=సంకీర్ణములు కానివిధముగ, పాడుదురు=గానము చేయుదురు.

భావము :- కైలాస మందరాది పర్వతములందలి దేవకాంతలు మొదలగు వారు బెండపూడి అన్నయ మంత్రి యొక్క కీర్తిని ఓంకారమును వలె ఉచ్చైస్స్వరముతో ఉదాత్త అనుదాత్తాది రీతులు సంకరముగాకుండ మనోహరముగ గానము చేయుదురు.

విశేషము :- అలంకారము - అత్యుక్తి.

సీ॥ కలకంఠముల ఛాయ గల కంఠకోణంబు
నాగకుండలముల నాగరికతఁ
జూడఁజూడఁగ నొప్పు సురసరిత్పూరంబుఁ
గాలఁగాల విభాళ కటకముద్ర
మేన మేనాత్మజా మానినీ రత్నంబుఁ
గేలికురంగంబుఁ గేలిప్రేల
భస్మోపవాహంబుఁబాండు దేహంబునఁ
గటిని పుట్టంబైన కరటి తోలు

తే॥ వికట శృంగారమున నొప్పువేల్పుఁజేని
నాగమోపనిషన్మనోహరుని హరుని
నర్చనము సేయు సంధ్యాత్రయంబులందు
బెండపూఁడన్న కన్నుల పండువుగను. 80

**అర్థము:-** బెండపూఁడన్న=బెండపూడి అన్నయ మంత్రి, సంధ్యాత్రయంబులందు=సంధ్యాసమయములు మూటియందును, కన్నుల పండువుగను=కన్నులకు ఆనందము కల్గునట్లుగ;

కలకంఠముల=కోకిలల వంటి ఛాయగల=రంగుగల, కంఠకోణంబు=కుత్తుక భాగము, నాగకుండలముల=సర్పములనెడి కర్ణాభరణముల యొక్క, నాగరికతన్=నాజూకు తనమును;

చూడన్=శిరముపై, చూడఁగన్=చూడగా, ఒప్పు=ప్రకాశించునట్టి, సురసరిత్=(ఆకాశగంగ) దేవనది యొక్క, పూరంబున్=ప్రవాహమును, కాలన్=కాలియందు, కాలవిభాళ=కాలయముని దండించిన, కటకముద్ర=చిహ్నమగు కడియమును;

మేన=శరీరమున, మేనాత్మజా=మేనాదేవి పుత్రికయైన, మానినీ రత్నంబున్=స్త్రీరత్నమైన పార్వతీదేవియు, కేలిఁవ్రేలన్=చేతి వ్రేలియందు, కేలికురంగంబున్=క్రీడా మృగమును;

పాండుదేహంబునన్=తెల్లని శరీరముపై, భస్మ=విబూదిని, ఉపవాహంబు=లేపంబుగ పూసికొనియు, కటిని=నడుమున, పుట్టంబైన=వస్త్రమైన, కరటితోఁలు=ఏనుగుతోలును కల్గి;

వికట=సొగసైన(వికారమైన) శృంగారమునన్=అలంకారముతో, ఒప్పు=ప్రకాశించు, వేల్పుఁజేనిన్=దేవనాయకుడైనట్టియు, ఆగమ=వేదములందును, ఉపనిషత్= వేదాంతముల యందును, చెప్పబడిన, మనోహరునిన్=మనసును దోచగలవాడైన వానిని, హరుని=శంకరుని, అర్చనము చేయున్=పూజించును.

**భావము :-** కోకిలవలె నల్లని కంఠము, సర్పభూషణములు, శిరముపై ఆకాశగంగా ప్రవాహము, కాలియందు యముని దండించిన చిహ్నమగు దండకడియము, శరీర భాగమున పార్వతీదేవి, చేతివ్రేలియందు విలాసముగ జింకకూన, తెల్లని శరీరముపై విబూదిపూత, నడుముకు వస్త్రముగ ఏనుగుతోలును కల్గి, వికృతమైన అలంకారంబులు గల దేవతా నాయకుడు, వేద వేదాంతములలో మనోహరమూర్తియైన శంకరుని - అన్నయ మంత్రి నిత్యము త్రిసంధ్యలయందును కన్నుల పండువుగ పూజ చేయును.

**విశేషము :-** త్రిసంధ్యలు - ఉదయ సంధ్య, మధ్యాహ్న సంధ్య, సాయం సంధ్యలు. కంఠము నుండి కటివరకు యోగిగమ్యమగు పరమ శివుని దివ్యరూపమును శ్రీనాథుడీ

పద్యమున పాఠకుల మనోనేత్రములకు ప్రత్యక్షమొనరించి తన ఈశ్వరాగ్ర్యన కళాశీలమును ప్రదర్శించినాడు.

సీ॥ అఖిల దిగ్దంతి దంతార్గళంబుల వ్రాయు
నధిపు దిగ్జయ శాసనాక్షరములఁ
గువలయాక్షుల మించు గుబ్బచన్నుల వ్రాయుఁ
గుంకుమపత్రభంగాంకురముల
గర్వితారాతి వక్షస్థలంబుల వ్రాయు
నయకార్యసరణి కిణాంకములను
నర్థి సందోహ ఫాలాంచలంబుల వ్రాయు
లక్ష్మీప్రదములైన లక్షణములఁ

తే॥ బసిఁడి గంటాన భూపాలు పార్శ్వసీమ
వ్రాయు నల కావ్యసరణి కేవలము కాదు
వేమధాత్రీకళత్రు గారాము మంత్రి
యతులగుణహారి బెండపూఁడన్న శౌరి.



అర్థము :- వేమ=వేమారెడ్డియను, ధాత్రీకళత్రు=భూపాలునకు, గారాము మంత్రి=ప్రీతిపాత్రుడైన మంత్రియు, అతుల గుణహారి=అసమానమైన గుణముల చేత మనోహరుడగు, బెండపూఁడన్న శౌరి=బెండపూడి అన్నయ మంత్రి శేఖరుడు, భూపాల=రాజైన వేమారెడ్డి యొక్క, పార్శ్వసీమన్=ప్రక్క ప్రదేశమునందు, నయకార్యసరణిన్=రాజనీతి పనుల విధమును, పసిఁడి గంటానన్=బంగారు గంటముతో, కేవలము వ్రాయున్=వ్రాయుట మాత్రమే కాదు.

అఖిలదిక్=అన్ని దిక్కులయందలి, దంతి=ఏనుగుల యొక్క, దంత+అర్గళంబుల పైన్=గడియల వంటి దంతములపై, శాసన=శాసనముల యొక్క, అక్షరములన్=అక్షరములను, వ్రాయున్=వ్రాయగలడు;

కువలయ+అక్షుల=నల్లకలువల వంటి కన్నులుగల కాంతల యొక్క, మించు=పెద్దవగు, గుబ్బచన్నులన్=గుండ్రని చన్నులపై, కుంకుమ=పరిమళ భరితమైన ఎఱ్ఱని రాగద్రవ్యములతో, పత్రభంగ=మకరము మొదలైన ఆకారముల యొక్క, అంకురములన్=చిహ్నములను, వ్రాయున్=రచింపగలడు;

గర్వితశ=గర్వించిన, అరాతి=శత్రువుల యొక్క, వక్షస్థలంబులన్=ఎదురు రొమ్ములపై, నయ కార్య=నీతిమంతమైన పనులయొక్క, సరణిన్ విధముతో, కిణ+అంకనములను=గాయపు గుర్తులను, వ్రాయున్=చేయగలడు;

అర్థి సందోహ=యాచకుల సమూహము యొక్క, ఫాల+అంచలంబులన్=నుదుటి చివరలపై, లక్ష్మీప్రదములైన=సంపన్నవంతములైన, లక్షణములన్=గుర్తులను, వ్రాయున్=రచింపగలడు;

భావము :- వేమ భూపాలునకు స్నేహపాత్రుడైన బెండపూడి అన్నయ మంత్రి, తన రాజునకు ప్రక్కన నుండి రాజనీతి విషయములను వ్రాయుట మాత్రమే కాదు, వేమ భూపాలుని దిగ్విజయ శాసనాక్షరములను అష్టదిగ్గజముల గండములపై వ్రాయగలడు. సుందరీమణుల చన్నులపై కుంకుమ పత్రభంగరచన చేయగలడు. తన ప్రతిభా సామర్థ్యములతో శత్రువుల గుండెలపై గాయములను చేయగలడు. యాచకుల నొసటి వ్రాతలను మార్చి సుసంపన్నులను చేయగలడు.

## షష్ఠ్యంతములు

క॥ ఇట్టి మహిమంబుగల జగ
జెట్టికి నర్థార్థి లోకచింతామణి కా
రట్ట హయఘట్టా సేనా
ఘట్టిత రిపుపట్టనోపకంఠక్షితికిన్. 82

అర్థము :- ఇట్టి=ఇటువంటి, మహిమంబు గల=మహత్త్వము గల, జగజెట్టికిన్=లోకైక శూరుడైన వానికి, అర్థ+అర్థిలోక=కోరికలు కోరిన జనులకు, చింతామణికిన్=చింతామణియనెడి మణియైన వానికిని, ఆరట్టహయ=అరట్టదేశము నుండి తెప్పించిన గుఱ్ఱముల యొక్క, ఘట్ట=సమూహముగల, సేనా=సైన్యముతో, ఘట్టిత=రాపిడి చేయబడిన, రిపు పట్టన=శత్రు నగరముల, ఉపకంఠ=సమీపమండలి, క్షితికిన్=భూమి కల్గిన వానికిని;

భావము :- ఇట్టి గొప్ప శూరుడైన వానికి, యాచకుల పాలిటి చింతామణియైన వానికి, ఆరట్టదేశపు గుఱ్ఱములతో కూడిన సైన్యముతో శత్రునగరములను జయించిన వానికిని;

విశేషము :- చింతామణి : అమృతమును కంటె ముందుగ పాలసముద్రము, లక్ష్మి, అప్సరసలతోపాటు పాలసముద్రము నుండి పుట్టి దేవేంద్రుని వద్దకు చేరిన మణి యిది. కోరిన కోరికలను తీర్చగలది యని ప్రతీతి.

ఆరట్ట : ఆరట్ట దేశమనగా నేటి పంజాబు రాష్ట్రమునందలి ఈశాన్యభాగము. ఈ దేశ మానాడు మేలుజాతి గుఱ్ఱములకు ప్రసిద్ధి.

కII కంఠీరవ విక్రమున క
కుంఠ ప్రతిభునకు దానగుణ సురభికి శ్రీ
కంఠాంఘ్రి కమల నయనో
త్కంఠా వైకుంఠునకు నఖండిత ధృతికిన్. 83

అర్థము :- కంఠీరవ విక్రమునకు=సింహ పరాక్రమము వంటి, పరాక్రమము కలవానికి, అకుంఠ=మొక్కవోని, ప్రతిభునకు=బుద్ధి వికాసము కలవానికి, దానగుణ=దానగుణమునందు, సురభికి=కామధేనువైన వానికి, శ్రీకంఠ=నల్లని గొంతుక గల శంకరుని యొక్క అంఘ్రికమల=పాదపద్మములను, నయన=పొందించు తహతహయందు, పొందునట్లు చేయు, ఉత్కంఠా=తహతహగల, వైకుంఠునకున్=విష్ణుదేవుడైన వానికి, అఖండిత=ఖండింపంబడని, ధృతికిన్=ధైర్యము కలవానికిని;

భావము :- సింహ పరాక్రమశాలికి, మొక్కవోని బుద్ధివికాసము కలవానికి, దాన గుణమున కామధేనువైన వానికి, శంకర పాదపద్మములందే తగులుగల విష్ణుమూర్తియైన వానికి, శాశ్వతమైన నశింపని ధైర్యము కలవానికిని;

కII దుగ్ధపయోధి సుధారస
ముగ్ధేందు ధరాట్టహాస మురహరశయ్యా
దిగ్ధూర్ధర కరటి ఘటా
స్నిగ్ధ యశోదిగ్ధరోదసీ కుహరునకున్. 84

అర్థము :- దుగ్ధపయోధి=పాలసముద్రము, సుధారస=అమృతరసము, ముగ్ధేందు ధర=చంద్రశేఖరుని యొక్క, అట్టహాస=పెద్దనవ్వు, మురహర=మురుడను రక్కసుని చంపిన విష్ణువు యొక్క, శయ్యా=పానుపైన ఆదిశేషుడు, దిక్=దిక్కులయొక్క, ధూర్=భారమును, ధర=ధరించు, కరటి ఘటా=ఏనుగుల సమూహము వలె, స్నిగ్ధ=మనోహరమైన, యశోదిగ్ధ=కీర్తిచే పూయబడిన, రోదసీకుహరునకున్=భూమ్యాకాశముల నడిమి ప్రదేశము కలవానికిని;

భావము :- అన్నయ మంత్రి కీర్తి పాలసముద్రము వలె, అమృతరసమువలె, చంద్రశేఖరుని అట్టహాసమువలె, ఆదిశేషునివలె తెల్లనైనది, పవిత్రమైనది. ఆకాశము వరకు, దిగంతముల వరకు వ్యాపించినట్టిది. అట్టివానికి

కII చెంచుమల చూఱకారున
కంచిత బాహాపరాక్రమాధారునకున్
పంచారామ వధూటీ
పంచాస్త్ర విహార కేలిపాంచాలునకున్. 85

అర్థము :- చెంచుమల చూఱకారునకు='చెంచుమల చూఱకార' అను బిరుదము కలవానికి, అంచిత=ఒప్పుచున్న, బాహుపరాక్రమ=భుజబలము, ఆధారునకున్=ఆధారముగ కలవానికి, పంచారామ వధూటీ=పంచారామ స్త్రీలతో, పంచాస్త్ర విహారకేలి=మదన క్రీడ యందు, పాంచాలునకున్=పాంచాల జాతి పురుషుడైన వానికిని;

భావము :- 'చెంచుమల చూఱకార'యను బిరుదము కలవానికి, గొప్పభుజబలము కలవానికి, పంచారామ స్త్రీలతో మదనక్రీడ సల్పుటయందు పాంచాల జాతి పురుషుడైన వానికిని;

విశేషము :- 'చెంచుమల చూఱకార' : చెంచులకొండను కొల్లకొట్టినవాడు.

పాంచాలునకున్ : "పునశ్చతుర్ధాకధికః కామశాస్త్రేషు జాతితః
దత్తోభద్రః కూచిమార: పాంచాల ఇతిసూరిభి:
పద్మినీవల్లభోదత్తో భద్రః స్యాచ్చిత్రిణీప్రియః
*పాంచాల కూచిమారౌతు హస్తినీ శంఖినీ ప్రియౌ"*

*కావ్యాలంకార సంగ్రహము. సన్నిధానము వ్యాఖ్యానము. పుట. 55.*

కామశాస్త్రమునందు జాతిభేదములతో నాయకులు నాలుగు విధములు. దత్తుడు, భద్రుడు, కూచిమారుడు. పాంచాలుడు అనువారు. దత్తుడు పద్మినీజాతి స్త్రీ ప్రియుడు. భద్రుడు చిత్రిణీ జాతి స్త్రీ ప్రియుడు, కూచిమారుడు శంఖినీజాతి స్త్రీ ప్రియుడు. పాంచాలుడు హస్తినీ జాతి స్త్రీ ప్రియుడు.

క॥ **శ్రీవీరభద్రవేమ**
**క్ష్మావర రాజ్యాభివృద్ధి కారణమునకున్**
**లావణ్యరూప సంపదఁ**
**బూవిలుకానికిని బెండపూఁడన్ననికిన్.** **86**

అర్థము :- శ్రీ వీరభద్ర వేమక్ష్మావర= శ్రీవీరభద్రారెడ్డి యొక్క, శ్రీవేమాభూపాల వరుని యొక్కయు, రాజ్య=రాజ్యము యొక్క, అభివృద్ధి=పెంపునకు, కారణమునకున్=కారణమైన వానికి, లావణ్యరూపసంపదన్=చక్కని సౌందర్య సంపదయందు, పూవిలుకానికిని= మన్మథుడైన వానికిని, బెండపూఁడన్ననికిన్=బెండపూడి అన్నయ మంత్రికి;

భావము :- శ్రీ వీరభద్రారెడ్డి శ్రీ వేమభూపాలుని రాజ్యాభివృద్ధికి కారణభూతుడైన వాడును, చక్కని రూప సంపదయందు మన్మథుడునైన అన్నయ మంత్రి వరునకు.

వ॥ **అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పంబూనిన యిమ్మహా ప్రబంధంబునకుఁ గథానాయకుండైన భీమేశ్వర మహాదేవునకుఁబ్రియధామంబైన దక్షారామ పురవరం బెట్టిదనిన.** **87**

అర్థము :- అభ్యుదయ పరంపర=శుభముల వరుస, అభివృద్ధిగాన్=పెరుగునట్లుగా, నా=నేను, ఒనర్పంబూనిన=రచింపదలచిన, ఈ+మహా=ఈ గొప్ప, ప్రబంధంబునకున్=గ్రంథమునకు, కథానాయకుండైన=కథకు నాయకుడైన, భీమేశ్వర=శ్రీ భీమేశ్వర స్వామియను, మహాదేవునకున్=దేవదేవుడైన శంకరునకు, ప్రియధామంబైన=ఇష్టనివాసమైన, దక్షారామ=దక్షారామమనెడి, పురవరంబు=శ్రేష్ఠమైన నగరము, ఎట్టిది+అనినన్=ఎటువంటిదన్నచో.

భావము :- అట్టి బెండపూడి అన్నయ మంత్రికి శుభపరంపర అభివృద్ధి కల్గునట్లుగా నేను రచింపదలచిన ఈ మహాగ్రంథమునకు కథానాయకుడైన శ్రీభీమేశ్వరస్వామికి ఇష్టనివాసమైన దక్షారామ నగర మెట్టిదన్నచో.

## దక్షారామ పురవర్ణనము

సీ॥ పర్యంత మందార పారిజాతకవనీ
రమమాణ నిర్జరీ సముదయంబు
సరస రసాసిద్ధ వరవారి సంపూర్ణ
గంభీరతర పరిఖా పయోధి
ప్రబల చింతారత్న పాషాణ సంఘాత
వప్రరేఖా చక్ర వలయితంబు
కామధేను సహస్ర కఠిన రింఖాటంక
దళన దంతురిత రథ్యాముఖంబు

తే॥ భద్ర పాతాళ భైరవ పాలితంబు
గుహవినాయక రక్షణా కుంఠితంబు
సప్తమాతృక పరివార సంకులంబు
వసుమతీ నూపురము దక్షవాటి పురము. 88

అర్థము :- దక్షవాటీపురము=దక్షారామనగరము, పర్యంత...దయంబు. పర్యంత=చుట్టియున్న, మందార=మందార వృక్షములు, పారిజాతక=పారిజాత వృక్షముల యొక్క, వనీ=వనములందు, రమమాణ=క్రీడించుచున్న, నిర్జరీ=దేవకాంతల యొక్క, సముదయంబు=సమూహము కలది;

సరస...పయోధి. సరస=రసవంతమైన, రసా=నది నుండి, సిద్ధ=లభించిన, వరవారి=మేలైన నీటితో, సంపూర్ణ=బాగుగా నిండిన, గంభీరతర=మిక్కిలి లోతైన, పరిఖా=అగడ్తయనెడి, పయోధి=సముద్రము కలది;

ప్రబల....వలయితంబు: ప్రబల=గొప్ప, చింతారత్న=చింతామణులనెడి, పాషాణ=రాళ్ళ యొక్క, సంఘాత=సమూహములతోడి, వప్రరేఖా చక్ర=విశాలమైన కోట గోడల సమూహముతో, వలయితంబు=చుట్టబడినది;

కామధేను......ముఖంబు. కామధేను సహస్ర=వేలకొలది గోవుల యొక్క, కఠిన=గట్టివగు, రింఖాటంక=ఉలుల వంటి గిట్టల యొక్క, దళన=భేదనము చేత, దంతురిత=మిట్టపల్లములుగ చేయబడిన, రథ్యాముఖంబు=రాజమార్గములు కలది;

భద్ర .... పాలితంబు. భద్రపాతాళ భైరవ=భద్రపాతాళ భైరవుడను నగర రక్షకునిచే, పాలితంబు=కాపాడబడుచున్నది. గుహవినాయక=గుహవినాయకుడను పేరుగల విఘ్నేశ్వరుని, రక్షణ=రక్షణముచే, అకుంఠితంబు=వికలము కానిది, సప్తమాతృక=ఏడుగురు దేవమాతలతోడను, పరివార=పరిజనముతోను, సంకులంబు=నిండియున్నది. వసుమతీ=భూమికి, నూపురము=కాలి అందెయైనట్టిది.

భావము :- దక్షారామమున మందార పారిజాత వనములున్నవి. అందు దేవకాంతలు విహరించుచుందురు. రసవంతమై స్వచ్ఛమైన నీటితో నిండి సముద్రము వలె కన్పించు అగడ్త కలదు. చింతామణులవంటి రాళ్ళ సమూహముతో విశాలమైన కోట గోడలు ఆ నగరము చుట్టును కలవు. వేలాది గోవుల పదఘట్టనల చేత గతుకులు పడిన రాజమార్గములున్నవి. ఆ నగరమును భద్రపాతాళ భైరవుడు రక్షించుచుండును. గుహవినాయకుడా నగరమును కనుగందకుండ కాపాడుచుండును. సప్తమాతృకలతోను, పరిజనులతోను నగరము నిండియుండును. భూకాంతకు కాలియందెయై ఆ నగరము ప్రకాశించుచుండును.

విశేషము : సప్తమాతృకలు :- బ్రాహ్మి, మాహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి. ఇంద్రాణి, చాముండ -లేక- కాళి, కౌశిక, ఉద్ధత, హవిష, శారిక, ఆర్య, వైధాత్రి.

అలంకారము - రూపకము.

సీ॥ కాంతి సంపదనేల కైవార మొనరింప
　　　విధుబింబమున నుద్భవించిరనిన
మాధుర్యగుణమేల మాటి మాటికిఁజెప్ప
　　　నమృతాబ్ధి నవతార మందిరనినఁ
దేజో విశేషంబు తెలుఁగు పల్కఁగ నేల
　　　విద్యుల్లతలలోన వెడలిరనిన
మోహనాకృతి యేల మునుమాడి కొనియాడఁ
　　　బుష్పచాపుని వింట బుట్టిరనిన

తే॥ సంభవించిరి గంధర్వజాతిననినఁ
గలితనంబేల పెన్నొటకంబు సేయ
ననఁగ భీమేశ్వరునిఁ గొల్తు రప్పురమున
సానులను పేరి యప్సరశ్చంద్ర ముఖులు. 89.

అర్థము :- విధుబింబమునన్=చంద్రబింబమునందు, ఉద్భవించిరి=పుట్టిరి, అనినన్=అని చెప్పగా, కాంతి సంపదన్=వారి శోభాసంపదను, కైవారము=స్తుతి, ఒనరింపన్=చేయుట, ఏల=ఎందులకు!

అమృతాబ్ధిన్=పాల సముద్రమునందు, అవతారమందిరి=పుట్టిరి, అనినన్=అనగా, మాధుర్యగుణము=మాధుర్యమను లక్షణమును, మాటిమాటికిన్=మాటి మాటికిని, చెప్పన్=చెప్పుట, ఏల=ఎందులకు!

విద్యుత్+లతలతోన్=మెఱపుతీగల నుండి, వెడలిరి=పుట్టిరి, అనినన్=అనుచుండగా, తేజో విశేషంబు=చురుకు తనము ఆధిక్యము యొక్క, తెఱఁగున్=విధమును, పల్కఁగన్=చెప్పుట, ఏల=ఎందులకు!

పుష్పచాపుని=మన్మథుని యొక్క, వింటన్=విల్లునుండి, పుట్టిరి=జన్మించిరి, అనినన్=అని చెప్పగా, మోహనాకృతి=మోహమును కల్గించు రూపములను, మునుమాడి=వరుసపెట్టి, కొనియాడన్=పొగడుట, ఏల=ఎందులకు!

గంధర్వ జాతిన్=గంధర్వుల జాతిలో, సంభవించిరి=పుట్టిరి, అనినన్=అని చెప్పుచుండగా, పెన్నొటకంబు+చేయన్=అతిశయించి చెప్పుటకు, కలితనంబు=వివాదము, ఏల=ఎందులకు, అనఁగన్=అనునట్లుగా, ఆ+పురమున=ఆ దక్షారామమున, సానులు+అనుపేరి=వేశ్యలు అనుపేరుగల; అప్సరస్+చంద్రముఖులు=చంద్రబింబముల వంటి అప్సరసలు; శ్రీ భీమేశ్వరుని=శ్రీ భీమేశ్వర స్వామిని, కొల్తురు=సేవింతురు.

భావము :- సానుల రూపమున నున్న అప్సరః కాంతలు దక్షారామమున శ్రీ భీమేశ్వర మహాదేవుని సేవించుచుందురు. చంద్రబింబము నుండి పుట్టిన వారిని కాంతి కలవారని కొనియాడు టెందులకు? పాలసముద్రము నుండి పుట్టిన వారి సౌందర్యమును మాటిమాటికి పొగడుటెందులకు? మెఱపు తీగలనుండి పుట్టిన వారి తేజస్సును గూర్చి చెప్పుటెందులకు? మన్మథుని వింటి నుండి పుట్టిన వారిని మోహనరూపులని కొనియాడనేల? గంధర్వ జాతిలో పుట్టిన వారి అందమును అతిశయించి చెప్పుటెందులకు?

విశేషము :- అలంకారము - రూపకము, కావ్యార్థాపత్తి.

మ॥ మొరయించున్ మరుఁడిక్షు చాప మనిశంబుం దక్షవాటీ మహా
పుర మధ్యంబున ముజ్జగంబు గెలువన్ బుత్తెంచు లీలన్ బురం
దర విశ్రాణిత దేవతాభువన గంధర్వాప్సరోభామినీ
చరణాంభోరుహ నూపుర స్వనములన్ జంకించు ఝుంకారముల్. 90

అర్థము :- పురందర=దేవేంద్రునిచేత, విశ్రాణిత=దానమీయబడిన, దేవతాభువన=దేవలోకమునందలి, గంధర్వ+అప్సరస్+భామినీ=అప్సరః కాంతల యొక్క, చరణ+అంభోరుహ=పద్మముల వంటి పాదములందలి, నూపుర=అందెల యొక్క, స్వనములన్=శబ్దములను, జంకించు=భయపెట్టు, ఝుంకారముల్=అల్లెత్రాటిమ్రోతలు, ముజ్జగంబు=మూడు లోకమును, పుత్తెంచులీలన్=పంపించురీతిగా, మరుడు=మన్మథుడు, దక్షవాటీ మహాపుర=దక్షారామమను మహానగరము యొక్క, మధ్యంబునన్=మధ్యభాగమునందు, అనిశంబున్=ఎల్లప్పుడును, ఇక్షుచాపము=చెఱకు వింటిని, మొరయించున్=మ్రోగించును.

భావము :- మన్మథుడు ముల్లోకములను జయించు తలంపుతో, దక్షారామ నగర మధ్యమున ఎల్లపుడును తన చెరకు వింటిని మ్రోగించును. ఆ చెరకు వింటి అల్లె త్రాటి మ్రోత ఇంద్రునిచే బహూకరింపబడి శ్రీ భీమేశ్వరాలయమునందు నాట్యము చేయుచున్న గంధర్వ అప్సరః కాంతల కాలియందెల నాదమును భయపెట్టును(మించును).

ఈ భావము వామన భట్టబాణుని వేమభూపాల చరితము నందు కూడ కలదు. "మన్మథ కోదండ శింజితానుకారిణా కాంచీ మంజీర రణితేన."

విశేషము:- "దక్షవాటికా వరునకు భీమనాథునకు వారవధూ త్రిశత ద్వయంబుతోన్' ఇంద్రుడు భీమమండలము నిచ్చినట్లు భీమ - 5 - 84లో కలదు.

శా॥ గంధర్వోపనిషద్రహస్యములు వక్కాణింతు రాలాప సం
బంధ ప్రస్ఫుట ఝుంటుఝుంటు పద గుంభస్థాన వర్ణావళీ
సంధానక్రమ దివ్యమంత్రకములన్ సాయాహ్న కాలంబులన్
గంధర్వాప్సరసల్ పురోపవనికా కల్పద్రుమచ్ఛాయలన్. 91

అర్థము :- గంధర్వ+అప్సరసల్=గంధర్వకాంతలు అప్సరః కాంతలును, పుర=దక్షారామ నగరమునందలి, ఉపవనికా=ఉద్యానవనములలో, కల్పద్రుమ=కల్పవృక్షముల, ఛాయలన్=నీడలందు, సాయాహ్న కాలంబులన్=సాయం సమయములందు; ఆలాప .... మంత్రకములన్. ఆలాప=పలుకులతో, సంబంధ=బాగుగా కలసిన, ప్రస్ఫుట=విశదమైన, ఝుంటు ఝుంటు=మోక్షదాయకములైన దివ్య మంత్రక గీతములలోని, పద=మాటల,

గుంభ=కూర్పు యొక్క, స్థాన=స.రి.గ. మాది స్వరములకు నియమితమైన శబ్దమును, వర్గ=మంద్రాది వర్గముల యొక్క, ఆవళి=సమూహముతో, సంధాన=జతచేయుట యందలి, క్రమ=పద్ధతితో, దివ్య మంత్రములన్=దివ్యమైన మంత్రభాగములతో; గంధర్వ+ఉపనిషత్=గాంధర్వమనెడి సంగీత సంబంధమైన వేదమునందలి, రహస్యములు=గుట్టులను, వక్కాణింతురు=పలుకుదురు.

భావము :- గంధర్వకాంతలు అప్సరః కాంతలును సాయంసంధ్యా సమయములందు దక్షారామమందలి ఉద్యానవనములలోని కల్పవృక్షముల నీడలయందు రాగాలాపన చేయుచు శ్రుతి తాళలయాన్వితముగను, స్థాన వర్గముల సమూహమును జతచేసి దివ్య మంత్రభాగములతో గంధర్వోపనిషత్తులోని రహస్యములు పలుకుచుందురు.

విశేషము :- ఝుంటు ఝుంటు=మోక్షదాయకములైన దివ్య మంత్రక గీతములు.

స్థానము=స్వరమునకు (స.రి. మొ॥వి) నియతమైన శబ్దము.

వర్గము :- మంద్రము, మధ్యమము, తార యనునవి స్థాయిలు. వీనినే వర్గములనియు అందురు.

సీ॥ చరణద్వయీ భూరి సౌభాగ్య సంపదఁ
  బరిభవింతురు హేమపద్మవనము
ఘన నితంబస్థలీ గౌరవాభ్యున్నతి
  సంప్రతింతురు నదీ సైకతముల
గంభీరతర నాభిగర్త విభ్రమముల
  వ్రక్కలింతురు జలావర్తశోభ
గురు పయోధర భార పరిణాహవిస్ఫూర్తి
  గుద్దలింతురు హేమకుంభగరిమ
తే॥ గారవింతురు కంఠోప కంఠ కాంతిఁ
గంబు మణి కాంతి బిబ్బోక డంబరంబు
మచ్చరింతురు ముఖచంద్రమండలములఁ
బూర్ణ శశిమండలము తోడఁబురము సతులు. 92

అర్థము :- పురము సతులు=ఆ దక్షారామమునందలి కాంతలు, చరణద్వయీ=పాదముల జంటల యొక్క, భూరి=బంగారపు, సౌభాగ్య=కాంతి యనెడి, సంపదన్=సమృద్ధి

చేత, హేమ పద్మవనమున్=బంగారు కమలముల సమూహమును, పరిభవింతురు= ఓడింతురు;

ఘన=గొప్ప, నితంబస్థలీ=పిఱుదు భాగముల యొక్క, గౌరవ=బరువు వలని, అభ్యున్నతిన్=ఔన్నత్యము చేత, నదీసైకతములన్=నదియందలి ఇసుక దిబ్బలను, సంప్రతింతురు=సరిచూచుదురు.

గంభీరతర=లోతు మిక్కిలిగగల, నాభిగర్త=బొడ్డు గుంటల యొక్క, విభ్రమములన్= సౌందర్య విలాసములచేత, జల+ఆవర్త=నీటి సుడుల యొక్క, శోభన్=అందమును, వ్రక్కలింతురు=తునుమాడుదురు;

గురు=పెద్దవైన , పయోధర భార=చన్నుల బరువు యొక్క, పరిణాహ విస్ఫూర్తి= వైశాల్యము వలని అందముచేత, హేమ కుంభగరిమన్=బంగరు కుండల శ్రేష్ఠతను, గుద్దలింతరు=పెల్లగింతురు.

కంఠ+ఉపకంఠ=గొంతుక సమీప భాగము యొక్క, కాంతిన్=వన్నె చేత, కంబు= శంఖము యొక్క, మణి=నగ యొక్క, కాంతి=దీప్తిని, బిబ్బోక=గర్వము వలని అనాదరము యొక్క, డంబున్=డాబును, గారవింతురు=లాలింతురు;

ముఖ చంద్రమండలములన్=మొగములనెడి చంద్రబింబములతో, పూర్ణ శశి మండలముతోడన్=నిండు చంద్రబింబముతో, మచ్చరింతురు=పోటీపడుదురు;

భావము :- దక్షారామమునందలి కాంతల పాదముల సౌభాగ్యము బంగరు కమలముల కన్న మిన్న. వారి పిఱుదులు నది యొక్క ఇసుక తిన్నెల కన్న ఉన్నతమైనవి. వారి బొడ్డుగుంటల సొగసులు నీటి సుడుల సొబగుల కన్న మిన్నయైనవి. వారి పెద్దవైన గుండ్రని చను జంటలు బంగరు కుండలను మించి యందగించును. వారి కంఠ భాగముల కాంతులు శంఖము నగలు మొదలగు వాని ప్రకాశ విలాసముకన్న అధికమైనవి. సుందరమైన వదనములతో వారు నిండు చంద్రునితో పోటీపడుచుండిరి.

విశేషము :- అలంకారము - ఉపమ.

శా॥ దక్షారామ విలాసినీ తతుల సౌందర్యంబు వర్ణింపఁగాఁ
జక్షు శ్శ్రోత్ర కులాధి నాయకునకున్ శక్యంబె తచ్చారు ఫా
ల క్షేత్రంబును బోలలేక మునిఁగెం లజ్జాభరక్రాంతుఁడై
నక్షత్రేశుఁడు శంభుశేఖర సుధాంధస్సింధుపూరంబులన్. 93

అర్థము :- దక్షారామ=దక్షారామ నగరమునందలి, విలాసినీ తతుల=వేశ్యల సమూహముల, సౌందర్యంబు=అందమును, వర్ణింపఁగాన్=కొనియాడుటకు, చక్షుస్=కన్నులే, శ్రోత్ర=చెవులుగగల సర్పముల, కుల=కులమునకు, అధినాయకునకున్=రాజైన ఆదిశేషునకు,

శక్యంబె=సాధ్యమా! తత్=ఆ కాంతల యొక్క, చారు=అందమైన, ఫాలక్షేత్రంబునన్=నుదురు స్థానమును, పోలలేక=సరిపోలలేక, నక్షత్ర=చుక్కలకు, ఈశుఁడు=రాజైన చంద్రుడు, లజ్జాభర క్రాంతుండై=సిగ్గు యొక్క భారముచే ఆక్రమింపబడినవాడై, శంభు....పూరంబులన్. శంభు=శంకరుని, శేఖర=తలపైగల, సుధ+అంధస్+సింధు=అమృతమే ఆహారమైన దేవతల నదియైన ఆకాశ గంగ యొక్క, పూరంబులన్=నీటి ప్రవాహములందు, మునిగెన్= మునిగిపోయెను.

భావము :- దక్షారామనగర మందలి వేశ్యల సౌందర్యమును కొనియాడుట ఆదిశేషున కును సాధ్యము కాదు. వారి నుదురులను పోలలేక చంద్రుడు సిగ్గుతో శంకరుని తలపైగల ఆకాశ గంగా ప్రవాహమున మునిగిపోయెను.

విశేషము :- శ్రీ భీమేశ్వర లింగము పై అర్ధచంద్ర చిహ్నామున్నది. అభిషేక సమయమున ఆ చంద్రరేఖ మునిగి పోవును. ఆ విషయమును దక్షారామ వేశ్యల నుదురులను పోలలేని చంద్రుడు సిగ్గుతో ఆకాశ గంగ యందు మునిగెనని చమత్కరించుట జరిగినది. విశేషములకు చూడుడు భీమ. - 2-44.

అలంకారము - ఉత్ప్రేక్ష.

ఈ భావము వామన భట్టబాణుని గ్రంథమున కూడ కలదు. "యత్రచ వామభ్రువా మనుపమలలాట తట కాంతి కదర్థనల జయామజ్జన మివాచరతి శంకర కోటీర శైవలినీ పయసి చంద్రమః శకలమ్."

సీ॥ అంబుధర శ్రేణి హరిణ లాంఛన రేఖ
కమ్ర కార్ముక వల్లికామతల్లి
జలచర ద్వంద్వంబు చంపక ప్రసవంబు
బింబంబు దాడిమ బీజరాజి
శష్కులీ యుగళంబు చారు దర్పణములు
శంఖంబు బిసములు జలరుహములు
పసిఁడి కుంభంబులు బయలంబువీచులు
పుష్కరావర్తంబు పులినతలము
తే॥ కదళికా హేమ కాహళ కచ్ఛపములు
మణుల బంతులు తారకా మండలములు
సంఘటించి పురంధ్రంబు వేశ్యల సృజించె
జాణదేవర శ్రీపంచశర విరించి. 94

అర్థము :- జాణదేవర=నేర్పరియైన దేవుడు, శ్రీపంచశర విరించి=మన్మథుడనెడి బ్రహ్మ, అంబుధరశ్రేణి=మేఘముల సమూహము, హరిణలాంఛన రేఖ=లేడి గుర్తుగ కల చంద్రుని కళ, క్రమకార్ముక వల్లికామతల్లి=శ్రేష్ఠమైన తీగెవంటి అందమైన ధనుస్సు;

జలచరద్వంద్వంబు=చేపల జంట, చంపక ప్రసవంబు=సంపెంగ పూవు, బింబంబు=దొండపండు, దాడిమ బీజరాజి=దానిమ్మగింజల సమూహము;

శష్కులీ యుగళంబు=చక్కిలముల జంట, చారుదర్పణములు=మనోహరములైన అద్దములు, శంఖంబు=శంఖము, బిసములు=తామర తూడులు, జలరుహములు= పద్మములు;

పసిఁడి కుంభంబులు=బంగారు కుండలు, బయలు=ఆకాశము, అంబు వీచులు= నీటి తరంగములు, పుష్కర+ఆవర్తంబు=నీటి సుడి, పులినతలము=చల్లని ఇసుక తిన్నెలు;

కదళికా=అరటి బోదెలు, హేమ కాహళ=బంగరు బాకాలు, కచ్ఛపములు=తాఁబేళ్ళు, మణుల బంతులు=మణులు పొదిగిన బంతులు, తారకా మండలములు=చుక్కల గుంపులు, సంఘటించి=కూర్చి, పురంబువేశ్యలన్=దక్షారామమునందలి వేశ్యలను, సృజించె=పుట్టించెను.

భావము :- నేర్పరియైన మన్మథుడనెడి బ్రహ్మదేవుడు మేఘముల సమూహము, చంద్రరేఖ, ధనుస్సు, చేపలు, సంపెంగపూవు, దొండ పండు, దానిమ్మ గింజలు, చక్కిలముల జంట, అందమైన అద్దములు, శంఖము, తామర తూడులు, పద్మములు, బంగారు కుండలు, ఆకాశము, నీటి తరంగములు, నీటి సుడి, చల్లని ఇసుక తిన్నెలు, అరటి బోదెలు, బంగరు బాకాలు, తాబేళ్ళు, మణుల బంతులు, చుక్కలు - లను కూర్చి దక్షారామనగరమునందలి వేశ్యలను నిర్మించెను.

విశేషము :- ఈ పద్యమున కవి స్త్రీ అవయవములకు ఉపమానములుగ పోల్చు వస్తువులను పేర్కొనెను. ఆ వస్తువులతోనే దక్షారామ విలాసినులను మన్మథుడనెడి బ్రహ్మ సృజించినట్లు చమత్కరించెను.

మేఘముల సమూహము - కొప్పు వెంట్రుకలు; చంద్రరేఖ - నుదురు; ధనుస్సు కనుబొమలు; చేపలు - కన్నులు; సంపెంగపూవు - ముక్కు; దొండపండు - పెదవులు; పండు దానిమ్మ గింజలు - దంతములు; చక్కిలములు - చెవులు; అద్దములు - చెక్కిళ్ళు; శంఖము - మెడ; తామరతూడులు - చేతులు; పద్మములు - అరచేతులు; బంగారు కుండలు - స్తనములు; ఆకాశము - నడుము; తరంగములు - నాభిప్రాంతమందలి ముడుతలు; ఇసుక తిన్నెలు - పిఱుదులు; అరటి బోదెలు - తొడలు; బంగారు బాకాలు -మీగాళ్ళు; తాబేళ్ళు - పాదముపై భాగములు; మణుల బంతులు - గిలకలు; నక్షత్రములు - గోళ్ళు.

సీ॥ ముడువంగ నేర్తురు మూలఁగమ్మని తావి
  గలుగు క్రొవ్విరులు లోఁగందకుండ
ముఱియంగ నేర్తురు మోహనాస్పదమైన
  మొగలి వాకిటి చాయ నగర వీథి
వలపింప నేర్తురు వలరాజు గెలిచిన
  పెద్దకాలము వేల్పు భీమనాథుఁ
బలుకంగ నేర్తురు పాటలాధరముల
  మొల్క లేనగవులు ముద్దుగురియఁ

తే॥ జందురుని తోడఁ గల్పవృక్షముల తోడఁ
దారతో లక్ష్మితో నమృతంబు తోడఁ
గౌస్తుభముతోడ మున్నీఁట గలిగినారు
విబుధ గంధర్వ జాతు లవ్వీటి సతులు 95

అర్థము :- విబుధ గంధర్వ జాతులు=దేవజాతి గంధర్వ జాతివారైన, ఆ+వీటి=ఆ దక్షారామము నందలి, సతులు=కాంతలు, కమ్మని తావి గలుగు=సువాసనలు గల, క్రొవ్విరులు =క్రొత్తపూలను, లోఁగందకుండ=ఏమాత్రము వాడిపోకుండగ, మూలన్=కొప్పులలో, ముడువంగ నేర్తురు=ధరింపగలరు;

మోహన=మోహింపజేయుటకు, ఆస్పదంబైన=స్థానమైన, నగరవీథిన్=పట్టణపు వీథియందలి, మొగలి వాకిటి చాయన్=తలవాకిలి సమీపమున, ముఱియంగ నేర్తురు= కులుకగలరు;

వలరాజు=మన్మథుని, గెలిచిన=జయించిన, పెద్దకాలము వేల్పు=సనాతన దైవమైన, భీమనాథున్=శ్రీ భీమేశ్వర స్వామినే, వలపింప నేర్తురు=ప్రేమింపజేయగలరు;

పాటల=తెలుపుమించిన యెరుపురంగుగల, అధరములన్=క్రింది పెదవులందు, మొల్క లేనగవులు=చిఱుదరహాసములు, ముద్దుగురియన్=అందములు చిందునట్లుగ, పలుకంగ నేర్తురు=మాటాడగలరు;

చందురుని తోడన్=చంద్రునితోను, కల్పవృక్షములతోడన్= కల్పవృక్షములతో పాటుగను, తారతోన్=తారతోపాటుగ, లక్ష్మితో=లక్ష్మీదేవితోను, అమృతంబుతోడన్= అమృతముతోపాటుగ, కౌస్తుభముతోడన్=కౌస్తుభరత్నముతోపాటుగ, మున్నీఁటన్= సముద్రమునుండి, కలిగినారు=పుట్టిరి.

భావము :- దేవ గంధర్వ జాతులవారైన ఆ దక్షారామ నగరకాంతలు సువాసనలుగల క్రొత్తపూలను ఏమాత్రము కసుగందకుండ కొప్పుల యందు ధరింపగలరు; నగర వీధి యొక్క తలవాకిలి వద్ద కులుకు లొలికింపగలరు; మన్మథునే గెలిచిన ఆ భీమేశ్వర స్వామినే వలపింపజేయగలరు. అందమైన అధరములపై చిఱుదరహాసములు ముద్దులొలుకునట్లు మాటాడగలరు. చంద్రుడు, కల్పవృక్షములు, తార, లక్ష్మీదేవి, అమృతము, కౌస్తుభ రత్నములతోపాటుగ పాలసముద్రము నుండి పుట్టినారు.

విశేషము :- దేవతలు రాక్షసులును అమృతము కొరకు పాలసముద్రమును చిలుకుచున్నపుడు చంద్రుడు, కల్పవృక్షములు, లక్ష్మీదేవి, కౌస్తుభరత్నము, అమృతము పుట్టినట్లు ప్రసిద్ధము. కాని వాలి భార్యయగు తార కూడ ఐరావతాదులతోపాటుగ పాలసముద్రము నుండి జన్మించెనని కంబరామాయణము నందలి యుద్ధకాండమున కలదు.

కం॥ పూఁబోణులకును విటులకు
వేఁబోకలఁదలరు సొంపు వీడ్కొలుపుఁబురిన్
వేఁబోకఁబోఁక తోఁటల
పూఁబాళల కమ్మతావి పొదలిన గాడ్పుల్ 96

అర్థము :- పురిన్=నగరమున, వేఁబోకన్=ప్రాతఃకాలమునందు, పోఁకతోఁటల= పోకచెట్ల తోటల, పూఁబాళల=పూల సమూహము యొక్క, కమ్మ తావి=సువాసన, పొదలిన= క్రమ్ముకొన్న, గాడ్పుల్=గాలులు, పూఁబోణులకును=వేశ్యలకును, విటులకు=వేశ్యా సఖులకు(పల్లవులకు)ను, వేఁబోకలన్=ప్రాతఃకాలములందు, తలరు=చెలరేగు, సొంపున్= సంతోషమును, వీడ్కొలుపున్=పోయిరమ్మని పంపించును.

భావము :- తెల్లవారుజామున నగరములోని పోకచెట్ల తోటలలోని పూల సువాసనలు కలిసిన గాడ్పులు సానులకును విటులకును తెల్లవారుజామున కలుగు సంతోషమును పోయిరమ్మని పంపించునట్లు వీచును.

ఉ॥ వీటికి నాల్గు వంకలను వెన్నెల తేటలఁబోలు నీళ్ళతో
హాటక పద్మమండితములైన కొలంకులు చూడ నొప్పుగున్
జీటికిమాటికిన్ హరుఁడు జృంభితలీల నటింప మౌళిమి
న్నేటి కృపీట నిర్ఝరము లింతట నంతటఁ జిందెనోయనన్. 97

అర్థము :- హరుఁడు=శంకరుడు, చీటికిమాటికిన్=మాటిమాటికి, జృంభితలీలన్= అతిశయించిన విలాసముతో, నటింపన్=నాట్యము చేయగా, మౌళి=శిరసుపై గల, మిన్ను+

సీ॥ ముడువంగ నేర్తురు మూలఁగమ్మని తావి
గలుగు క్రొవ్విరులు లోఁగందకుండ
మురియంగ నేర్తురు మోహనాస్పదమైన
మొగలి వాకిటి చాయ నగర వీథి
వలపింప నేర్తురు వలరాజు గెలిచిన
పెద్దకాలము వేల్పు భీమనాథుఁ
బలుకంగ నేర్తురు పాటలాధరముల
మొల్క లేనగవులు ముద్దుగురియఁ

తే॥ జందురుని తోడఁ గల్పవృక్షముల తోడఁ
దారతో లక్ష్మితో నమృతంబు తోడఁ
గౌస్తుభముతోడ మున్నీఁట గలిగినారు
విబుధ గంధర్వ జాతు లవ్వీటి సతులు 95

అర్థము :- విబుధ గంధర్వ జాతులు=దేవజాతి గంధర్వ జాతివారైన, ఆ+వీటి=ఆ దక్షారామము నందలి, సతులు=కాంతలు, కమ్మని తావి గలుగు=సువాసనలు గల, క్రొవ్విరులు =క్రొత్తపూలను, లోఁగందకుండ=ఏమాత్రము వాడిపోకుండగ, మూలన్=కొప్పులలో, ముడువంగ నేర్తురు=ధరింపగలరు;

మోహన=మోహింపజేయుటకు, ఆస్పదంబైన=స్థానమైన, నగరవీథిన్=పట్టణపు వీథియందలి, మొగలి వాకిటి చాయన్=తలవాకిలి సమీపమున, మురియంగ నేర్తురు= కులుకగలరు;

వలరాజు=మన్మథుని, గెలిచిన=జయించిన, పెద్దకాలము వేల్పు=సనాతన దైవమైన, భీమనాథున్=శ్రీ భీమేశ్వర స్వామినే, వలపింప నేర్తురు=ప్రేమింపజేయగలరు;

పాటల=తెలుపుమించిన యెరుపురంగుగల, అధరములన్=క్రింది పెదవులందు, మొల్క లేనగవులు=చిఱుదరహాసములు, ముద్దుగురియన్=అందములు చిందునట్లుగ, పలుకంగ నేర్తురు=మాటాడగలరు;

చందురుని తోడన్=చంద్రునితోను, కల్పవృక్షములతోడన్= కల్పవృక్షములతో పాటుగను, తారతోన్=తారతోపాటుగ, లక్ష్మితో=లక్ష్మీదేవితోను, అమృతంబుతోడన్= అమృతముతోపాటుగ, కౌస్తుభముతోడన్=కౌస్తుభరత్నముతోపాటుగ, మున్నీఁటన్= సముద్రమునుండి, కలిగినారు=పుట్టిరి.

భావము :- దేవ గంధర్వ జాతులవారైన ఆ దక్షారామ నగరకాంతలు సువాసనలుగల క్రొత్తపూలను ఏమాత్రము కసుగందకుండ కొప్పుల యందు ధరింపగలరు; నగర వీధి యొక్క తలవాకిలి వద్ద కులుకు లొలికింపగలరు; మన్మథునే గెలిచిన ఆ భీమేశ్వర స్వామినే వలపింపజేయగలరు. అందమైన అధరములపై చిఱుదరహాసములు ముద్దులొలుకునట్లు మాటాడగలరు. చంద్రుడు, కల్పవృక్షములు, తార, లక్ష్మీదేవి, అమృతము, కౌస్తుభ రత్నములతోపాటుగ పాలసముద్రము నుండి పుట్టినారు.

విశేషము :- దేవతలు రాక్షసులును అమృతము కొరకు పాలసముద్రమును చిలుకుచున్నపుడు చంద్రుడు, కల్పవృక్షములు, లక్ష్మీదేవి, కౌస్తుభరత్నము, అమృతము పుట్టినట్లు ప్రసిద్ధము. కాని వాలి భార్యయగు తార కూడ ఐరావతాదులతోపాటుగ పాలసముద్రము నుండి జన్మించెనని కంబరామాయణము నందలి యుద్ధకాండమున కలదు.

కం॥ పూఁబోణులకును విటులకు
వేఁబోకలఁదలరు సొంపు వీడ్కొలుపుఁబురిన్
వేఁబోకఁబోఁక తోఁటల
పూఁబాళల కమ్మతావి పొదలిన గాడ్పుల్ 96

అర్థము :- పురిన్=నగరమున, వేఁబోకన్=ప్రాతఃకాలమునందు, పోఁకతోఁటల= పోకచెట్ల తోటల, పూఁబాళల=పూల సమూహము యొక్క, కమ్మ తావి=సువాసన, పొదలిన= క్రమ్ముకొన్న, గాడ్పుల్=గాలులు, పూఁబోణులకును=వేశ్యలకును, విటులకు=వేశ్యా సఖులకు(పల్లవులకు)ను, వేఁబోకలన్=ప్రాతఃకాలములందు, తలరు=చెలరేగు, సొంపున్= సంతోషమును, వీడ్కొలుపున్=పోయిరమ్మని పంపించును.

భావము :- తెల్లవారుజామున నగరములోని పోకచెట్ల తోటలలోని పూల సువాసనలు కలిసిన గాడ్పులు సానులకును విటులకును తెల్లవారుజామున కలుగు సంతోషమును పోయిరమ్మని పంపించునట్లు వీచును.

ఉ॥ చీటికి నాల్గు వంకలను వెన్నెల తేటలఁబోలు నీళ్ళతో
హాటక పద్మమండితములైన కొలంకులు చూడ నొప్పగున్
జీటికిమాటికిన్ హరుఁడు జృంభితలీల నటింప మౌళిమి
న్నేటి కృపీట నిర్ఝరము లింతట నంతటఁ జిందెనోయనన్. 97

అర్థము :- హరుఁడు=శంకరుడు, చీటికిమాటికిన్=మాటిమాటికి, జృంభితలీలన్= అతిశయించిన విలాసముతో, నటింపన్=నాట్యము చేయగా, మౌళి=శిరసుపై గల, మిన్ను+

ఏటి=ఆకాశగంగ యొక్క, కృపీట=నీటి, నిర్ఝరములు=ప్రవాహములు, ఇంతటనంతటన్=అక్కడక్కడ, చిందెనోయనన్=చిందినవా అన్నట్లుగా, వీటికి=ఆ దక్షారామమునకు, నాల్గు వంకలను=నలువైపులయందును, వెన్నెల తేటలన్=వెన్నెల సారములతో, పోలు=సమానమైన, నీళ్ళతో=నీటితోను, హాటక పద్మ=బంగారు కమలములతోను, మండితములైన=అలంకరింపబడిన వైన, కొలంకులు=సరస్సులు, చూడన్=చూచుటకు, ఒప్పగున్=తగియుండును.

భావము :- శంకరుడు మాటిమాటికి తాండవ నృత్యము చేయగా తలపై గల ఆకాశగంగలోని నీటిప్రవాహములు అక్కడక్కడ చింది పడినవా అన్నట్లుగ, ఆ దక్షారామ నగరమునకు నలువైపులను సరస్సులు స్వచ్ఛమైన నీటితోడను, బంగరు కమలములతోను చూడముచ్చటగ నున్నవి.

సీ॥ తిలకంబు బలు తేనియలఁ బోఁక మోకల
పువ్వుఁబాళల తావిఁ బుక్కిలించి
కలమ గోపికల చక్కని చన్నుఁగవలపై
వట పల్లవంబులు వాయఁదట్టి
సప్త గోదావర జలతరంగారోహ
కేలీ సుఖంబు లంగీకరించి
దేవ గంధర్వ లీలావతీ హాటక
ప్రాసాద వలభి గర్భములుదూఱి

తే॥ ప్రతిదినము దక్షవాటీపురంబునందు
మలయ వేలావనీ మందమారుతంబు
గంధసార లతా కుడుంగముల మెలఁగు
చిలువ లేమలు సేవింప వెలితి పడుచు. 98

అర్థము :- ప్రతిదినమున్=ప్రతిదినమును, దక్షవాటీ=దక్షారామమనెడి పురంబునందు =నగరమునందు, మలయ=మలయపర్వతమే, వేలా=ఎల్లగా గల, వనీ=అడవి యొక్క, మందమారుతంబు=పిల్లగాలి, చిలువలేమలు=నాగకన్యలు, సేవింపన్=అనుభవింపగా, వెలితిపడుచు=తక్కువగుచు;

తిలకంబు=ఎఱ్ఱగోరంట పూలలోని, పలు=అనేకములైన, తేనియలన్= మకరందములను, పోఁకమోకల=పోకమొక్కలయొక్క, పువ్వుఁబాళలన్=పూల సమూహము నందలి, తావిన్=సువాసనను, పుక్కిలించి=పుక్కిటపట్టి;

కలమగోపికల=వరిమడులకు కాపుండు స్త్రీల యొక్క, చక్కని=అందమైన, చన్నుఁగవ లపై=చనుజంటలపై గల, వట=మఱ్ఱి యాకులవంటి, పల్లవంబులు=చీరచెరగులు, పాయన్=జారునట్లుగా, తట్టి=గట్టిగా తాకి;

సప్త....గీకరించి. సప్తగోదావర=సప్త గోదావరమను పేరుగల నది యొక్క, జలతరంగ=నీటి అలల యొక్క, ఆరోహ=ఎక్కుటయను, కేలీ సుఖంబులు=ఆటచే కల్గు ఆనందమును, అంగీకరించి=స్వీకరించి;

దేవ....దూఱి. దేవ గంధర్వ=దేవ, గంధర్వ జాతుల యందలి, లీలావతీ=అందగత్తెల యొక్క, హాటక=బంగారు, ప్రాసాద=చక్కని మేడల యొక్క, వలభి=పై భాగము యొక్క, గర్భములున్=లోపలి భాగముల యందు, దూఱి=చొరబడి, గంధసారలతా=జాతిమల్లెతీగల యొక్క, కుడుంగములన్=పొదరిండ్లలో, మెలఁగున్=సంచరించును.

భావము :- నాగకన్యలు ఆస్వాదించుటచే వెలితి పడుచున్నమలయ మారుతము నిత్యమును దక్షారామ నగరము నందలి ఎఱ్ఱగోరంట, పోక తోటలలోని పూలలోని మకరందమును పీల్చి, వరిపైరుకు కావలికాయు కాంతల చన్నులపై కప్పబడిన పమిటలు జారునట్లుగ గట్టిగతాకి, సప్త గోదావర నదిలోని ఉవ్వెత్తున ఎగయు అలల విలాసములను స్వీకరించి, ఆ నగరములోని దేవ, గంధర్వ జాతుల కాంతల యొక్క విలాసమందిరముల చంద్రశాలలందు దూరి, జాతి మల్లెతీగల పొదరిండ్లలో సంచరించును.

విశేషము :- శ్రీనాథ మహాకవికి మారుతవర్ణన మనిన చాల ఇష్టము. విశేషములకు చూడుడు - భీమ - 2-62.

తే॥ దక్షవాటికఁ బశ్చిమ ద్వార భూమిఁ
ప్రతివసించును సర్వాంగ రమ్య యగుచు
సేవకులపాలి సురశాఖి పూవుఁగొమ్మ
కోమలార్ధేందుధరు కొమ్మ గోఁగులమ్మ. 99

అర్థము :- దక్షవాటికన్=దక్షారామ నగరమున, పశ్చిమద్వార భూమిన్=పడమటి వాకిలి వైపు గల ప్రదేశమునందు, సర్వాంగరమ్య యగుచు=సర్వాంగ సుందరియై, సేవకుల పాలి=సేవించువారిపాలిటి, సురశాఖి=దేవవృక్షమైన కల్పవృక్షము యొక్క, పూవున్+కొమ్మ= పూలతోడి కొమ్మయైనదియు, కోమల=అందమైన, అర్థ+ఇందు=చంద్రకళను, ధరు=ధరించిన శివుని, కొమ్మ=భార్యయైన, గోఁగులమ్మ=గోగులమ్మయను గ్రామదేవత, ప్రతివసించును= నివసించును.

భావము :- దక్షారామ నగరమునకు పడమట దిక్కున శంకరుని భార్యయైన గోగులమ్మ గ్రామదేవతగ కాపురముండును. తన్ను సేవించిన వారిపాలిటి కల్పవృక్షపు పూఁగొమ్మ ఆ గోగులమ్మ.

తే॥ దక్షపురమున నుత్తర ద్వారమందు
నూర్జితంబుగ నుండు మహోజ్జ్వలాంగి
కామితార్థైక సంకల్ప కల్పవల్లి
మహిత సుగుణ మతల్లి శ్రీమండతల్లి. 100

అర్థము :- దక్షపురమునన్=దక్షారామ నగరమున, ఉత్తరద్వారమందున్=ఉత్తర దిక్కున గల వాకిలి ప్రదేశమునందు, మహా+ఉజ్జ్వల+అంగి=గొప్పగ ప్రకాశించు అవయములు కలది, కామిత=కోరబడిన, అర్థ=కోరికలకు, ఏక=ప్రధానమగు, సంకల్ప=ఆలోచనకు, కల్పవల్లి= కల్పలతయైనట్టి, మహిత=గొప్ప, సుగణమతల్లి=శ్రేష్ఠమగు మంచి గుణములు కల, శ్రీమండ తల్లి=పూజ్యురాలైన మండతల్లి, ఊర్జితంబుగన్=స్థిరముగ, ఉండున్=నివసించును.

భావము :- దక్షరామ నగరము యొక్క ఉత్తర ద్వారదేశమున తేజోవతి, సుగుణరాశి, మాతృమూర్తి, యాచకుల పాలిటి కల్పలతయై మండతల్లియను గ్రామదేవత స్థిర నివాసముండును.

క॥ సారమతి దక్షవాటిక
తూరుపు గవనిన్ బ్రసిద్ధితో వసియించున్
హేరాళ క్రీడాసం
చారిణి నూకాంబ భక్తజన రక్షకునై. 101

అర్థము :- దక్షవాటిక=దక్షారామ నగరము యొక్క, తూరుపు=తూర్పు దిక్కు నందలి, గవనిన్=వాకిలియందు, సారమతి=అమృత హృదయముతో, హేరాళ క్రీడా=విరివియైన కేళికై, సంచారిణి=తిరుగునదగు, నూకాంబ=నూకాంబయను గ్రామదేవత, భక్తజన=భక్తులైన ప్రజలను, రక్షకునై=కాపాడుటకై, ప్రసిద్ధితో=ఖ్యాతి కలదై, వసియించున్= నివసించును.

భావము :- దక్షారామ నగరమునకు తూర్పువైపున నూకాంబయను గ్రామదేవత భక్తజనులను రక్షించుటకై విరివిగ విహరించును.

క॥ మట్టయిన యట్టి దక్షుని
పట్టనమున దక్షిణంబు పార్శ్వపు గవనిన్
నెట్టుకొని వెలసి నిలిచిన
ఘట్టాంబికఁ గొల్వఁగలుగుఁ గామిత ఫలముల్. 102

అర్థము :- మట్టు+అయిన+అట్టి=చక్కనిది విస్తరించినది యైన, దక్షుని పట్టనమున =దక్షారామ నగరమున, దక్షిణంబు పార్శ్వపు=దక్షిణ దిక్కువైపు గల, గవనిన్=వాకిలియందు, నెట్టుకొని=పూని, వెలసి=అవతరించి, నిలిచిన=కొలువుండిన, ఘట్టాంబిక=ఘట్టాంబిక అను గ్రామదేవతను, కొల్వన్=పూజించినచో, కామిత=కోరబడిన, ఫలముల్=ప్రయోజనములు, కలుగున్=కల్గును.

భావము :- చక్కనిది విశాలమైనది దక్షారామ నగరము. ఆ నగరమునకు దక్షిణదిక్కు వైపుగ ఘట్టాంబిక యను గ్రామదేవత అవతరించి నివసించుచున్నది. ఆమెను సేవించినచో కోరికలు సిద్ధించును.

విశేషము :- పేరులు సరిగా తెలియరాకున్నను, నేటికిని నాలుగు దిక్కులందు గ్రామదేవతలు నిలిచి యున్నారు.

తే॥ పృథివిఁ బదునెనిమిది యోగపీఠశక్తి
గణములందెంచ సర్వశృంగారయగుచు
భీమనాథుని సన్నిధిఁ బ్రేమ వెలయు
మాణికాదేవి సకల కళ్యాణమూర్తి. **103**

అర్థము :- పృథివిన్=భూమిమీద, పదునెనిమిది=పదునెనిమిది, యోగపీఠశక్తి గణములందు=యోగపీఠములందలి శక్తుల సమూహములందు, ఎంచన్=తలంపగా, సర్వ శృంగార=సర్వాలంకార భూషిత, అగుచు=ఐ, సకల కళ్యాణమూర్తి=సర్వశుభలక్షణముల తోడి ఆకారము కలదై, మాణికాదేవి=మాణికాదేవి యనుశక్తి, ప్రేమన్=ప్రేమతో, భీమనాథుని= శ్రీ భీమేశ్వరస్వామి యొక్క, సన్నిధిన్=సమీపమునందు, వెలయున్=ప్రకాశించును.

భావము :- భూమి మీద పదునెనిమిది యోగశక్తి పీఠములు కలవు. అందొక్కొక్క శక్తికిని గణశక్తులుండును. అట్టి శక్తులలో గణింపదగినది మాణికాదేవి. ఈమె సర్వ శృంగార సకల కళ్యాణమూర్తి. ప్రేమతో శ్రీ భీమేశ్వరస్వామికి సమీపమున వెలసి ప్రకాశించుచున్నది.

విశేషము :- మాణికాంబ :- భూమిమీద పదునెనిమిది యోగపీఠములు, ఒక్కొక్క పీఠమున ఒక్కొక్క శక్తి ప్రధానదేవత. ప్రతి ప్రధానదేవతకు అంగదేవతలుందురు. వీరినే యోగపీఠశక్తి గణములనిరి. వారిలో శ్రేష్ఠమైనదీ మాణికాంబ.

మాణికాంబ మొదటి కన్యవేశ్య యను కథయు కలదు. శ్రీ భీమేశ్వర స్వామికి పవళింపు సేవగ స్వామివారిని అంతస్థు క్రింది నున్న మాణికాంబ వద్దకు చేర్చి పవళింపు సేవ చేయుచుందురు. చూడుడు భీమ - 1-112.

ఉ॥ ఏదెసఁ జూచినన్ విబుధు లేదెసఁ జూచిన మౌని మండలం
బేదెసఁ జూచినన్ హరిదధీశ్వర వర్గము వాసవాది యం
దేదెసఁ జూచినన్ నవ మహేశ్వర మూర్తులు శ్రీనికుంభ కుం
భోదరతండు భృంగిరిటి హూహుక హాహులు దక్షవాటికన్. 104

అర్థము :- దక్షవాటికన్=దక్షారామ నగరము నందు, ఏదెసన్=ఏవైపున, చూచినన్=పరిశీలించినను, మౌనిమండలంబు=మునుల సమూహము, ఏదెసన్+చూచినన్=ఏదిక్కున గమనించినను, వాసవ+ఆది=ఇంద్రుడు మొదలగు, హరిత్+అధీశ్వర వర్గము=దిక్పాలుర సమూహము, అందు=ఆ నగరమున, ఏదెసన్+చూచినన్=ఏ వంక పరికించినను, నవ=క్రొత్త, మహేశ్వరమూర్తులు=శంకరుని లింగరూపములు, శ్రీ=పూజ్యులైన, నికుంభ=నికుంభుడు, కుంభోదర=కుంభోదరుడు, తండు=తండువు, భృంగిరిటి=భృంగిరిటి, హూహుక=హూహూ అను గంధర్వుడు, హాహులు=హాహా అను గంధర్వుడును.

భావము :- దక్షారామ నగరము నందు ఏవైపు చూచినను దేవతలు, మునులు, ఇంద్రాది దిక్పాలకులు, క్రొంగ్రొత్త శివలింగ మూర్తులు, నికుంభుడు, కుంభోదరుడు, తండువు, భృంగిరిటి మొదలగు శంకర కింకరులైన ప్రమథగణ నాయకులును, హూహూ, హాహాయను గంధర్వులును ప్రకాశించుచు కన్పింతురు.

విశేషము :- "ఇందుఁబేర్కొనినట్టులు దక్షారామమునందే దిక్కునఁ జూచినను విబుధులు లింగ స్వరూపులై గానవచ్చుచునే యున్నారు. ఇంద్రాది దేవతా వర్గము, ఈశ్వరునకుఁ జేదోడువాదోడుగా నుండు నికుంభ కుంభోదరాదులు మాత్రము గానరారు."

*శ్రీనాథకృతి సమీక్ష - చిలుకూరి పాపయ్య శాస్త్రి - పు - 20*

సీ॥ విరుల దండల తోడి వేణికాభారంబు
    పొంకంబు పిఱుఁదులఁ బొరలియాడ
మణితులాకోటి కోమల ఝుణత్కారంబు
    రవల మట్టెల మ్రోత యవఘళింపఁ
గుదురునిండిన చిన్ని గుబ్బ చన్నుల మీఁద
    ముత్యాల త్రిసరంబు మురువుఁజూప
వలమాన తాటంక వజ్రాంకురచ్ఛాయ
    లేఁత వెన్నెలఁ బుక్కిలించి యుమియ

గీ॥ సాని యీశానియై మహోత్సవము నందుఁ
గేల నవచంద్రకాంతపు గిన్నెపూని
వీథి భిక్షాటన మొనర్చు వేళఁ జేయు
మరుల నృత్యంబు జగముల మరులు కొలుపు. 105

**అర్థము :-** సాని=వేశ్య (దేవదాసి), ఈశానియై=పార్వతీదేవి వేషము ధరించినదై, మహోత్సవము నందున్=గొప్ప పర్వదిన సందర్భమున;

విరుల దండలతోడి=పూలమాలలతోకూడిన, వేణికాభారంబు=బరువైన జడ, పొంకంబు=చక్కనైన, పిఱుదులన్=పిరుదులపైన, పొరలియాడన్=దొరలాడుచుండగా;

మణి=మణులు పొదిగిన, తులాకోటి=కాలియందెల, కోమల=మృదువైన, ఝణత్కారంబు=ఝణంఝణ శబ్దమును, రవల=వజ్రములు గల, మట్టెల=కాలి రెండవ వ్రేలికి ధరించు మట్టెలను ఆభరణముల యొక్క, మ్రోత=శబ్దమును, అవఘళింపన్=వ్యాపింపగా;

కుదురు నిండిన=ఉనికిపట్టును వ్యాపించిన, చిన్ని=అందమైన, గుబ్బచన్నులమీఁదన్=గుండ్రని చన్నులపై, ముత్యాల త్రిసరంబు=మూడుపేటల ముత్యాల దండ, మురువు చూపన్=సౌందర్యమును ప్రకటింపగా;

వలమాన=చలించుచున్న, తాటంక=చెవి కమ్మల యందలి, వజ్రాంకురచ్ఛాయ=వజ్రపుమొలకల కాంతి, లేఁత వెన్నెలన్=లేత వెన్నెలను, పుక్కిలించి=పుక్కిటపట్టి, ఉమియన్=ఉమ్మివేయగా;

కేలన్=చేతియందు, నవ=క్రొత్తదైన, చంద్రకాంతపు=చంద్రకాంత శిలచే చేయబడిన, గిన్నెపూని=పాత్రను ధరించి, వీథిన్=నగర వీథియందు, భిక్షాటన మొనర్చు=బిచ్చమెత్తుకొనుట చేయు, వేళన్=సమయమున, చేయు=చేయునట్టి, మరుల నృత్యంబు=మరుల నృత్యము, జగములన్=లోకములను, మరులు కొలుపున్=మోహపెట్టును.

**భావము :-** దక్షారామ నగరమున మహోత్సవ సమయమునందు దేవదాసియైన వేశ్య పార్వతి వేషమును ధరించి వీథిలో భిక్షాటనకు బయలుదేరినపుడామె కొప్పున పూలమాలలను ధరించి యుండును. ఆమె జడ నిడివి పిరుదులపై దొర్లాడుచుండును. మణులు, వజ్రములు పొదిగిన కాలియందెలు, మట్టెలు ఒకదానిని మించి మరియొకటి అతిశయించి మృదుమధుర శబ్దములను చేయుచుండును. నిండుగనున్న అందమైన గుండ్రని చన్నులపై ముప్పేట ముత్యాలహారము కాంతులీనుచు కదలాడుచుండును. అందమైన చెవి కమ్మలలోని వజ్రపు మొలకల కాంతులు క్రొత్త వెన్నెలను పుక్కిలించి ఉమ్మివేసినట్లుండును. చేతిలో చంద్రకాంతపు గిన్నెను ధరించి భిక్షాటనము చేయు సందర్భమున ఆమె చేయు మరుల నృత్యము లోకములను మోహపెట్టుచుండును.

విశేషము:- మరుల నృత్యము: దేవదాసియైన వేశ్య పార్వతివలె కిరీట త్రిశూలాదులను ధరించి వీథిలో భిక్షాటనము నభినయించుచు చేయు ఈనృత్యమును మరుల నృత్యమందురు.

దేవదాసి పార్వతి వేషము ధరించి భిక్షాటనము చేయుట దక్షారామము నందలి ఒక స్థానిక విశేషము.

ఈ పద్యము నందలి "కుదురు నిండిన చిన్ని గుబ్బచన్నుల మీఁద" అను పాదభాగము శృంగార నైషధము నందు (6-22); శివరాత్రి మాహాత్మ్యము నందు (2-26); హరవిలాసము నందు (5-45) కూడ కలదు.

సీ॥ వేదండ వదన శుండాదండ చుళికిత
  ప్రోజ్ఝితాంభశ్చటా ప్లుత నభంబు
దేవ గంధర్వాప్సరో వధూటీస్తన
  స్థాసక శ్రీగంధ ధవళితంబుఁ
గనక సౌగంధిక గంధోత్తమాగంధ
  సార నిష్పంద పుష్పంధయంబుఁ
జటుల వీచీ ఘటా ఝూట డోలారూఢ
  హంస సంసన్నినాదాలసంబు
తే॥ భూరి తీరావనీ ఘనీ భూతచూత
జాతివకుళవనీ సమాచ్ఛాద్యమాన
బహుళ సింధుధునీ వన బక మరాళి
దక్షపురి యొద్ద సప్త గోదావరంబు. 106

అర్థము :- దక్షపురి యొద్ద=దక్షారామమునకు సమీపమున, సప్తగోదావరంబు= సప్తర్షులచే కొనిరాబడిన గోదావరినది;

వేదండ....నభంబున్. వేదండ=ఏనుగుల యొక్క, వదన=ముఖములందలి, శుండాదండ=బోదెల వంటి తొండములతో, చుళికిత=బాగుగా పీల్చబడి, ప్ర+ఉజ్ఝిత=మిక్కిలిగ వదలబడిన, అంభస్=నీటి, ఛటా=సమూహముచే, ప్లుత=తడుపబడిన, నభంబున్=ఆకాశము కలదియును;

దేవ=దేవజాతికి, గంధర్వ=గంధర్వ జాతికి, అప్సరస్=అప్సరసల జాతికిని చెందిన, వధూటీ=కన్యలయొక్క, స్తన=చన్నులపై, స్థాసక=కుంకుమ పూతయైన, శ్రీగంధ=చందన లేపనముచే, ధవళితంబున్=తెల్లగ చేయబడినదియు;

కనక....ధయంబు. కనక సౌగంధిక=బంగరు చెంగలువలలోని, గంధోత్తమా=మకరందము నందలి, గంధసార=సువాసన సంపద చేత, నిష్పంద=చలింపని, పుష్పంధయంబు=తుమ్మెదలు కలదియు;

చటుల....అలసంబు. చటుల=చంచలమైన, వీచీ=అలల యొక్క, ఘటా=సమూహమనెడి, ఝాట=పొదరింటివంటి, డోల=ఊయలను, ఆరూఢ=ఎక్కిన, హంస సంసత్=హంసల గుంపు యొక్క, నినాద=సవ్వడిచే, అలసంబు=మందమైనదియు;

భూరి=పెద్దదగు, తీర=ఒడ్డు యొక్క, అవని=ప్రదేశమందు, ఘనీభూత=దట్టముగ కూడియున్న, చూత=మామిడి చెట్లచేతను, జాతి=జాజుల, పొగడ=పొగడల, వనీ=పొదరిండ్ల చేత, సమాచ్ఛాద్యమాన=బాగుగా కప్పివేయబడుచున్నదియు, బహాళ=సాంద్రమైన, సింధుధునీ=నదీప్రవాహములందలి, వన=నీటిలో, బక మరాళి=కొంగలు హంసలు కలదియు;

**భావము** :- దక్షారామ నగరము నానుకొని సప్త గోదావరము ప్రవహించుచున్నది. ఆ నది యందు ఏనుగులు విహరించుచు జలక్రీడలాడుచు నీటిని తమ తొండములతో పీల్చి పైకి వదలుచున్నవి. ఆ నీటి తుంపురలతో ఆకాశము తడియుచున్నది. దేవ, గంధర్వ, అప్సరస్జాతి కాంతల చన్నులపై పూసికొన్న శ్రీగంధ లేపనము తెల్లనైనది. నదిలోని బంగరు చెంగల్వపూవులందలి మకరందము నాస్వాదించి మదించి పూవులలోనే కదలకున్న తుమ్మెదలున్నవి. చంచలమైన తరంగముల సమూహమనెడి ఊయెల లెక్కి ఊగుచున్న హంస సమూహముల క్రేంకారములు కల్గియున్నది. నదీ తీరమందలి మామిడి, జాజి, పొగడల పొదరిండ్లు భూమిని కప్పివేయుచున్నవి. ఆ నదీ ప్రవాహములపై కొంగలు, హంసలు విహరించుచున్నవి.

**విశేషము** :- గంధోత్తమ=మకరందము.

'గంధోత్తమ' శబ్దమునకు నిఘంటువులలో - 'ఆసవము, పద్యము' అని మాత్రమే అర్థమున్నది. 'ఆసవము' అను పదమునకు 'మకరందము' అని అర్థమున్నట్లు సంస్కృత భాగవత ప్రయోగము కలదు. ''యన్ముఖాంబురుహాసవమ్'' 2-స్క. అధ్యా-4. శ్లో-24.

**సీ॥ సరివచ్చు ననవచ్చు శతమన్యు వీటికి**
**వివిధ దేవాగార విభ్రమమునఁ**
**బ్రతివచ్చు ననవచ్చుఁ బాలమున్నీటికి**
**నక్షయంబగు జీవనాభివృద్ధి**
**నెనవచ్చు ననవచ్చు నిందు బింబమునకు**
**సకల కళా విలాస ప్రవృద్ధి**
**దొరవచ్చు ననవచ్చుఁ దోయజాక్షుని మూర్తి**
**కభిరామలక్ష్మీ సమగ్ర మహిమఁ**

గీ॥ జెప్ప నొప్పదె యప్సర స్త్రీ సహస్ర
ధవళతర దీర్ఘ దృక్పుట ధాళధళ్య
సమ్మిళద్భీమనాథ భూషా శశాంక
తరళ దీధితి పరిపాటి దక్షవాటి. 107

అర్థము :- దక్షవాటి=దక్షారామము, వివిధ=అనేకములైన, దేవ+ఆగార=దేవాలయముల యొక్క, విభ్రమమునన్=శోభచేత, శతమన్యువీటికి=నూరుయాగములు చేసిన ఇంద్రుని నగరమైన అమరావతికి, సరివచ్చున్+అనవచ్చు=సాటివచ్చునని చెప్పవచ్చును;

అక్షయంబగు=క్షయములేని, జీవన=బ్రతుకుటకు వలయు వృత్తుల యొక్క, నీటి యొక్క, అభివృద్ధిన్=అభివృద్ధిచేత, పాలమున్నీటికి=పాలసముద్రమునకు, ప్రతి వచ్చున్+అనవచ్చున్=సరితూగునని చెప్పవచ్చును;

సకలకళా=నృత్యసంగీతాది సకల కళల, విలాస=సొగసుల యొక్క, ప్రవృద్ధి=అభివృద్ధిచేత, ఇందుబింబమునకు=చంద్రబింబమునకు, ఎనవచ్చున్+అనవచ్చు=ఈడువచ్చునని చెప్పవచ్చును;

అభిరామ లక్ష్మీ=మనోహరమైన సంపదలయొక్క, సమగ్ర మహిమన్=నిండైన గొప్పదనముచే, తోయజాక్షుని మూర్తికి=విష్ణుమూర్తి యొక్క రూపమునకు, దొరవచ్చున్+అనవచ్చు=సాటియగునని చెప్పవచ్చును;

అప్సర....పరిపాటి. అప్సర స్త్రీ సహస్ర=వేలాది అప్సరః కాంతల యొక్క, ధవళతర=మిక్కిలి తెల్లని, దీర్ఘ=పొడవైన, దృక్పుట=చూపుల యొక్క, ధాళధళ్య=ధళధళని కాంతితో, సమ్మిళత్=బాగుగా కలియుచున్న, భీమనాథభూషా=శ్రీ భీమేశ్వర స్వామికి అలంకారమైన, శశాంక=చంద్రుని యొక్క తరళ దీధితి=ఉత్తమమైన కాంతికి, పరిపాటిన్=పద్ధతిని, చెప్పన్=చెప్పుటకు, ఒప్పదె!=తగదా!

భావము :- పలువురు దేవతల నివాసము చేత దక్షారామము ప్రకాశించుచున్నది. అందుచే దక్షారామము అమరావతి పట్టణమునకు సాటివచ్చుననవచ్చును. బ్రతుకు తెరువునకు వలయు సర్వవృత్తుల యొక్క అభివృద్ధిచే, పుష్కలమగు జలసమృద్ధిచే పాలసముద్రమునకు సాటివచ్చునని చెప్పవచ్చును, సంగీత సాహిత్యాది సర్వకళలతో దక్షారామము అభివద్ధినందుటచేత, సర్వకళావిలాసములు గల చంద్రునకు ఈడువచ్చుననవచ్చును. దక్షారామమున సర్వసంపదలు సమగ్రముగ నున్నవి. లక్ష్మీ సంపన్నుడు విష్ణుమూర్తి. అందుచేత దక్షారామము విష్ణుమూర్తి రూపమునకు సాటివచ్చునని చెప్పవచ్చును. వేలాది అప్సరః కాంతల యొక్క, తెల్లని పొడవైన చూపులనెడి కాంతులతో కలసి శంకరుని శిరస్సున ప్రకాశించుచున్న ఉత్తమమైన ఆ చంద్రకాంతి కొనియాడదగదా?

విశేషము :- అలంకారము - ఉపమ.

కII రోధించు నభముఁ బటికపు
సౌధంబులు వీట భీమశంకర హర్షో
త్సేధాట్టహాస రేఖా
దీధితి మైత్రీ విధావిధేయము లగుచున్. 108

అర్థము :- వీటన్=దక్షారామమునందలి, పటికపు సౌధంబులు=తెల్లరాతిమేడలు, భీమ....అగుచున్. భీమశంకర=భీమేశ్వర స్వామి యొక్క, హర్ష=సంతోషము యొక్క, ఉత్సేధ=పొడవైన, అట్టహాస=పెద్దనవ్వు యొక్క, రేఖా=అతిశయము గల, దీధితి=కాంతితో, మైత్రీవిధా=స్నేహము యొక్క సమృద్ధికి, విధేయములగుచున్=వినయము గలవి అగుచు, నభమున్=ఆకాశమును, రోధించున్=అడ్డగించును.

భావము :- దక్షారామము నందలి తెల్లని మేడలు శ్రీ భీమేశ్వర స్వామి సంతోషాతి శయముతో కూడిన అట్టహాసమ్ముల కాంతులతో స్నేహభావముతో వినయముగల్గి మిక్కిలి యెత్తుగ (ఆకాశము నడ్డగించుచు) నున్నవి.

విశేషము :- అలంకారము - ఉపమ.

చII ప్రహరి చరింతు రెప్పుడును భైరవులర్ధనిశాగమంబులన్
గహకహనిష్ఠురాట్టహస గర్విత కంఠ కఠోర హుంకృతుల్
బహుల భుజాడమడ్డమరు భాంకృతి నాదము మేళగించి ది
క్కుహరము లోర్చు హాటకపుఁగోటల మీఁదట దక్షవాటికన్. 109

అర్థము :- దక్షవాటికన్=దక్షారామమునందు, హాటకపు=బంగారవు, కోటలమీఁదట=కోటల యొక్క పై భాగములందు, అర్ధనిశ=నడిరేయి, ఆగమంబులన్=వచ్చు సమయము లందు, భైరవులు=శివుని ప్రమథగణ నాయకులు, దిక్+కుహరములు=దిక్కులనెడి చెవులు మాత్రమే, ఓర్చు=సహించు, కహకహ=కహకహమను, నిష్ఠుర=కఠినమైన, అట్టహస=పెద్దనవ్వులతో, గర్విత=గర్వించిన, కంఠ=గొంతుకల యొక్క, కఠోర=భీకరమైన, హుంకృతుల్=హుంకారములను, బహుల=దట్టమైన, భుజా=చేతులలోని, డమడ్డమరు=డమడమ శబ్దము చేయు డమరువులను చర్మవాద్య విశేషముల యొక్క, భాంకృతి నాదము=భం భమ్మను శబ్దమును, మేళగించి=కలిపి, ఎప్పుడును=ఎల్లప్పుడును. ప్రహరి చరింతురు=కావలి తిరుగుచుందురు.

భావము :- దక్షారామమున నడిరేయి సమీపించినప్పటి నుండి బంగారు కోట గోడలపైన శివుని ప్రమథ గణనాయకులు దిక్కులనెడి చెవులు మాత్రము సహింపగల్గునట్లుగా,

కహకహమను కఠినమైన అట్టహాసముల తోడి హుంకారములకు, తమ బలమైన చేతులలోని డమరు వాద్యములను మ్రోగించుటచే కల్గిన భంభమ్మను శబ్దములను కలిపి నిత్యమును కావలి తిరుగుచుందురు.

వ॥ మరియు నప్పురంబు దళిత సమద కరి సహస్రంబులగు సుభట సహస్రంబుల వలన సింహసంహతియు, సమధిక వితరణ శాఖా నిరాఘాట కీర్తి స్ఫూర్తులగు వదాన్యుల వలనఁబారిజాతోద్యానంబును, ననేక శత సవన సమజ్యోతిర్ధా రియగు సుమనోవర్గంబు వలన సుధర్మాస్థానంబును, నభిరామ రామణీయక సౌభాగ్యరేఖా విలాస పక్ష్మాంత లక్ష్మీ విరాజమానంబగు రాజకుమార లోకంబువలన గంధర్వలోకంబును, మకర కచ్ఛప ముకుంద నిధి సనాథులగు వైశ్యుల వలన వైశ్రవణ స్థానంబు ననందగి, సకల భువన ప్రశస్తంబై; భారత వర్షంబునకు ఫల సంపదయునుంబోలె శాఖా నగర సహస్ర సంబాధ పరిసరంబై; సకల జగన్నిర్మాణ మాతృకయగు కృతయుగంబునకుం గారణంబనఁ గనక గిరి వప్రదీప్రప్రాకార బహు ప్రకార వప్ర ప్రకర పరివేష వలయ వలయితంబై; సలిల సంక్రాంత కనకావరణ మండల ప్రతిబింబంబగుటంజేసి కులిశ పతన భయావగాహ హాటక క్షితిధరంబగు నపరాంబురాశియుంబోని పరిఖా చక్రంబు చేతను, గ్రీడా గజ మద జల పంకిల ప్రాంగణంబులగు భృంగిరిటి నికుంభ కుంభోదర ప్రధాన ప్రమథగణ మణి భవన సౌధంబుల చేతను, నాసన్న దీర్ఘికా వీచీ పవన వికీర్యమాణ వికస్వర జలజ నిష్యంద మధుబిందు వర్షాంబు దూరీకృత శంభళీ కపోల కస్తూరికా పత్రభంగంబులగు నప్సరోంగనా వాటంబుల చేతను, గుట్టిమ ఖచిత మణికిరణ విసరణ జనితాకాండ ప్రసారిత కదళీ పలాశ సంగతి సంశోభిత కక్ష్యావిభాగంబులగు యక్ష గంధర్వ కిన్నర కింపురుష సిద్ధ విద్యాధర స్థానంబుల చేతను, గారుత్మత రత్నాంశు పటల ఘటిత పట యామినీ తారకాయ మానస్థల ఖచిత స్థూలముక్తాఫల శలాకా నికాయంబులగు భైరవాయతనంబుల చేతను, బ్రస్నిగ్ధ శ్యామల శిలోత్కీర్ణ రమ్యోపవాహ్యాశక్కరంబులగు శంకరాగార ద్వారంబుల చేతను, దులసీదల శీతలామోదముషిత కిల్బిషంబులగు విష్వక్సేన ధామంబుల చేతను, నిరంతర సంఫుల్ల మల్లీవల్లికా తల్లజ పుష్పనిష్యందమాన మధుమత్త పుష్పంధయ విరుతి పునీత హరిదుపఘ్నంబులగు విఘ్నేశ్వరావాస లలితోద్యానంబుల చేతను, బృధుల వారి

శీకర పటల పాన దరవికట కరటి ముఖ వికలిత వరాట కోశ వ్యాకోచ హాటక కుశేశయంబులగు సప్త గోదావర ప్రవాహ సలిలంబుల చేతను, గోమల కింజల్కాగ్ర గ్రసన జాగ్రచ్చక్రవాక చరణ నఖశిఖర సముల్లిఖిత కమల కువలయ కుముద షండంబులగు తీర్థకుండంబుల చేతను, గోదావరీ తుల్యభాగా కౌంతేయీ కణ్వాపగా నదీ మాతృకాయ మానంబులై యిరుగారునుం బంట పొసంగు పంటవలంతి కేదార క్షేత్రంబుల చేతను, నఖండితాం భస్సమృద్ధి విజృంభించి విశ్వంభరా భ్రూలతాకారి సేతు రేఖాలంకారంబులై తట తరు కుసుమాంతర క్షరద మంద మకరంద సందోహ స్యందన కల్లోలంబులై సలిల కేళీలోల కలహంస కామినీ కోలాహలాను కృత జలదేవతా చరణ మణి నూపురఝుణ ఝుణత్కారంబులై కారండవ పక్షవిక్షేప పరిచరిత పంకజ పరాగపాళీ విరచితాళీక సంధ్యాను బంధ చరిత చక్రవాక మిథునంబులై పయోధిగన్న బిడ్డలుంబోని యొడ్డు చెఱువుల చేతను, సరస సహకార శాఖా శిఖాధి రూఢ కోకిల కుటుంబినీ కంఠనాళ కోమల కుహూకార కోలాహల కలిత విరహిణీ హృదయ హాలాహల క్షేపంబులును, మధుకరనికర గుంజాయమాన మాధవీనికుంజ కుంజసన్నిహిత కిరణపుంజంబులును, సముద్భిన్న పున్నాగ కుసుమ పరిమళోద్గార నీహారంబులును, సముల్లసిత చంపక కళికా కలాప కల్పిత కందర్ప పావకాస్త్ర పరిత్రస్త పథికలోకంబులును, బాక పరిస్ఫుటిత పుండ్రేక్షు పర్వ ముఖోద్గీర్ణ ముక్తామణి దర్శితాకార రాకానిశాకర ప్రకాశంబులును, గోరక ప్రకర తారతారకిత కురువకానోకహంబులును, వనితా వదనాసవ సనాథ వకుళ వనంబులును, మహోరు కుచ కలశ కాంతి చోర ఫలకలిత లికుచ నిచయంబులును, మాతులుంగామోద హృదయంగమంబులును, నవనాగరంగ సంగ సుఖిత సారంగ మంగళ గాన సరస సంగీత ప్రసంగంబులును, భుజంగ లతా పరిష్వంగ ధన్య తరుణ పూగ ద్రుమంబులును, లలిత లవలీ లతాలింగిత లవంగంబులునునగు శృంగారారామంబుల చేతను, నభిరామంబై; కలిత చాతుర్వర్ణ్యస్థితి యగుటం ద్రైలోక్య తిలకంబును, సముద్భాసితా సంఖ్య దేవాలయంబగుట శతమఖ నగరంబును, నక్షయ జీవన ధృతియగుట ధర్మపాలమండలంబును, ననధిగత కంటక రుచిరంబగుటం బ్రజా భాగ్య ఘంటా పథంబును, బ్రచుర సన్మణివాసంబగుట వసుంధరాధిప స్థానంబునునై, గుహ్యక నగరంబునుంబోలె వివిధ మనుష్య ధర్మచరిత

పవిత్రంబును, లంకానగరంబునుంబోలెఁ బుణ్యజనాధ్యుషిత సన్నివేశంబును, గార్తవీర్యార్జునమూర్తియునుంబోలెఁ నవిరళ కర భూషితంబును, నృసింహ లీలాడంబరంబునుంబోలెఁ బ్రథితహిరణ్యకశిపు క్షయంబును, శరత్కాలంబునుంబోలె విలసత్ప్రకాశంబును, బ్రాహ్మణ జాతి ధర్మంబునుంబోలె నిగమశాలియునునై; మహద్భూషాన్వితంబయ్యును నిరాక్రోశంబును, బ్రకట భుజంగ ప్రచారంబయ్యును సదాహితాభయంబును, బలిరాజ నిలయ భూతంబయ్యును గంధర్వభూమియునై; వర్ణ సాంకర్యంబు వాసవ కోదండంబునంద, యహిభయంబు వల్మీకంబుల యంద, జీవన సంశయంబు వారిదంబుల యంద, వృషాతిక్రమంబు గృహంబుల యంద, పరదర్శనంబు యతుల యంద, దోషోల్లాసంబు కువలయంబులయంద, కౌరవ పదాను సరణంబు కిరాతులయంద, తరళత్వంబు కరికర సంతానంబుల యంద, విపక్షక్షోభంబు కొలంకుల యంద, యాత్త గంధత్వంబు చందనంబుల యంద, కాని తనయందు బొంద నీక విభవంబునకుఁబ్రభవంబును, విలాసంబునకు నివాసంబును, నపవర్గంబునకు సర్గంబును, ధర్మంబునకు మర్మంబును, దానంబునకు నిధానంబును, నానందంబునకు మూలకందంబును, విద్యకు నిషద్యయు, విశ్రామంబునకు ధామంబునునై, యొప్పునప్పట్టణంబున కధీశ్వరుండు. 110

అర్థము :- మఱియున్=ఇంకను, ఆ+పురంబు=ఆ దక్షారామ నగరము, దళిత....సహస్రంబు. దళిత=ఖండింపబడిన, సమద=మదించిన, కరిసహస్రంబులగు=వేలాది ఏనుగుల సమూహములు కలవారగు, సుభట సహస్రంబుల వలన=వేలాది ఉత్తమ యోద్ధలుండుట వలన, సింహసంహతియు=సింహముల సమూహము కలదియు;

సమధిక....వదాన్యుల. సమధిక=మిక్కిలి యెక్కువైన, వితరణ=దానగుణము గల, శాఖా=చేతి యొక్క, నిరాఘాట=హద్దులేని, కీర్తి=యశస్సుచే, స్ఫూర్తులగు=ప్రకాశించు, వదాన్యుల వలనన్=దానశీలుర చేత, పారిజాత+ఉద్యానంబును=కల్పవృక్షముల ఉద్యాన వనమైనదియు;

అనేకశత=లెక్కలేనన్ని వందల, సవన=యజ్ఞములతో, సమ=సమమగు, జ్యోతిర్=చైతన్యముతో, హారి=మనోహరమగు, సుమనస్+వర్గంబు వలన=పండితుల సమూహము చేత, సుధర్మాస్థానంబును=మంచి ధర్మంబునకు స్థానమైనదియు;

అభిరామ.....మానంబగు. అభిరామ=మనోహరము, రామణీయక=అందము, సౌభాగ్య=వైభవముల యొక్క, రేఖా=కాంతులతో, విలాస=విలాసముతో కూడిన,

పక్ష్మాంత=కనురెప్పల యందలి, లక్ష్మీ=శోభతో, విరాజమానంబగు=ప్రకాశించునట్టి, రాజకుమారలోకంబు వలన=యక్షకుమారుల సమూహము వలన, గంధర్వలోకంబును= గంధర్వులలోకమును;

మకర.....సనాథులగు. మకర కచ్ఛప ముకుంద నిధి=మకరము కచ్ఛపము ముకుందములను నిధులతో, సనాథులైన=కూడిన వారైన; వైశ్యుల వలన=కోమటుల వలన, వైశ్రవణ స్థానంబున్=కుబేరుని నిలయమైన అలకా నగరము (మకర కచ్ఛప ముకుందాది నవనిధులకు అధిపతి కుబేరుడగుట వలన)

అనన్+తగి=అని చెప్పుటకు తగియుండి; సకల భువన=అన్నిలోకములందును, ప్రశస్తంబై=ప్రసిద్ధి చెందినదై, భారత వర్షంబునకు=భారత దేశమునకు, ఫలసంపదయు నున్+పోలె=పంటయనెడి సంపద వలె, శాఖా....పరిసరంబై. శాఖానగర సహస్ర=వేలాది పేటల చేత, సంబాధ=ఇరుకైన, పరిసరంబై=పరిసరములు కలదై, సకల జగత్=సమస్త లోకములను, నిర్మాణ=నిర్మించుటయందు, మాతృకయగు=తల్లియగు, కృతయుగంబు నకున్=కృతయుగమునకు, కారణంబనన్=కారణమైనదన్నట్లుగా, కనక....వలయితంబై. కనకగిరి=బంగరు కొండయైన మేరుపర్వతము యొక్క, వప్ర=కోటగోడల, దీప్ర=కాంతి మంతమైన, ప్రాకార=ఉత్కృష్టమైన ఆకృతులతో, బహుప్రకార=అనేక విధములైన వప్రప్రకర= కోట స్తంభముల సమూహములను, పరివేష=వరదగుడి చేత, వలయ=గుండ్రగ, వలయి తంబై=చుట్టబడినదై;

సలిల.......అగుటంజేసి. సలిల=నీటియందు, సంక్రాంత=ప్రతిబింబించిన, కనక= బంగారు, ఆవరణ మండల=గుండ్రని ప్రాకారమునకు, ప్రతిబింబంబు=ప్రతిబింబము, అగుటన్+చేసి=అగుట చేత, కులి......బోని. కులిశ=వజ్రాయుధము యొక్క, పతన=పడు నను, భయ=భయముతో, అవగాహ=మునిగిన, హాటకక్షితిధరంబగు=మేరు పర్వతము కలదియగు, అపర+అంబురాశియుంబోని=మఱియొక సముద్రమువలెనున్న, పరిఖా చక్రంబుల చేతను=గుండ్రని అగడ్తల చేతను;

క్రీడా గజ.....సౌధంబుల చేతను. క్రీడా= విహారము కొరకైన, గజ=ఏనుగుల యొక్క, మదజల=గండస్థలముల నుండి స్రవించు మదజలముతో, పంకిల=బురదయైన, ప్రాంగణంబులగు=ముంగిళ్ళు కలవియగు, భృంగిరిటినికుంభదర ప్రధాన=భృంగిరిటి, నికుంభుడు, కుంభోదరుడు మొదలైన, ప్రమథగణ=శంకరుని కింకరులైన ప్రమథగణ నాయకుల యొక్క, మణి భవన= మణిమయములగు గృహముల చేతను, సౌధంబుల చేతను=మేడల చేతను;

ఆసన్న....భంగంబులగు. ఆసన్న=సమీపమునందలి, దీర్ఘికా=దిగుడు బావులలోని, వీచీ పవన=అలల గాలులచే, వికీర్యమాణ=వెదజల్లబడి, వికస్వర=వికసించిన, జలజ= పద్మముల యందలి, మధుబిందు=తేనెబిందువులను, వర్షాంబు=వాననీటి చేత, దూరీకృత=ఎడము చేయబడిన, శంభళీ=తార్పుడు కత్తెల, కపోల=చెక్కిళ్ళపైగల, కస్తూరికా= కస్తూరితో అద్దబడిన, పత్రభంగంబులగు=లీలా మకరము మొదలగు అలంకారములు కలవగు, అప్సరస్+అంగనా=అప్సరః కాంతల యొక్క, వాటంబుల చేతను=నివాసముల చేతను; కుట్టిమ....భాగంబులగు, కుట్టిమ=ముంగిళ్ళయందు, ఖచిత=పొదుగబడిన, మణికిరణ=మణుల కాంతులు, విసరణ=అలముకొనుట చేత, జనిత=పుట్టి, అకాండ= ఆకస్మికముగ, ప్రసారిత=విస్తారముగ ప్రసరింపజేయబడిన, కదళీ పలాశ=అరటి యాకులతో, సంగతి=చెలిమి చేసి, సంశోభిత=బాగుగా ప్రకాశించుచున్న, కక్ష్యావిభాగంబులగు=అంతస్తుల భాగములు కలవైన, యక్ష=యక్షుల, గంధర్వ=గంధర్వుల, కిన్నర=కిన్నరుల, కింపురుష= కింపురుషుల, సిద్ధ=సిద్ధుల, విద్యాధర=విద్యాధరుల యొక్కయు, స్థానంబుల చేతను= నివాసముల చేతను;

గారుత్మత....నికాయంబులగు. గారుత్మతరత్న=గరుడ పచ్చలను రత్నముల యొక్క, అంశుపటల=కాంతుల సమూహముతో, ఘటిత=కూర్పబడిన, పట=తెరవంటి, యామినీ= రాత్రియందు, తారకాయమాన=నక్షత్రములుగ చేయపడిన, స్థల=ప్రదేశమునందు, ఖచిత= పొదుగబడిన, స్థూలముక్తాఫల=పెద్దముత్యముల యొక్క, శలాకా నికాయంబులగు=మొలకల సమూహములు కలవైన, భైరవ=శంకరకింకరుల యొక్క, ఆయతనంబుల చేతను= నివాసముల చేతను;

ప్రస్నిగ్ధ.....శాక్కరంబులగు. ప్రస్నిగ్ధ=మిక్కిలి నునుపైన, శ్యామల శిల= నల్లని రాళ్ళయందు, ఉత్కీర్ణ=చెక్కిన, రమ్య=అందమైన, ఉపవాహ్య=వాహనములైన, శాక్కరంబులగు=నందీశ్వరులు కలవైన, శంకరాగార=శివాలయముల యొక్క, ద్వారంబుల చేతను=వాకిళ్ళ చేతను;

తులసీ....చేతను. తులసీదళ=తులసీదళముల యొక్క, శీతల=చల్లని, ఆమోద= సువాసన చేత, ముషిత=అపహరింపబడిన, కిల్బిషంబులగు=పాపములు కలవియైన, విష్వక్సేన=విష్ణువు యొక్క, ధామంబుల చేతను=ఆలయముల చేతను, నిరంతర..... ఉపఘ్నంబులగు. నిరంతర=ఎడతెరిపి లేకుండ, సంఫుల్ల=బాగుగా వికసించిన, మల్లీ=మల్లెల, వల్లికాతల్లజ=మేలైన తీగల యొక్క, పుష్ప=పూవులనుండి, నిష్యందమాన=స్రవించెడి, మధు= మకరందము చేత, మత్త పుష్పంధయ=మదించిన తుమ్మెదల యొక్క, విరుతి=విశేషమైన ఝుంకారములతో, పునీత=పవిత్రమైన, హరిత్=దిక్కులే, ఉపఘ్నంబులగు=ఆశ్రయముగాగల,

విఘ్నేశ్వరావాస=వినాయకుని ఆలయముల వద్దగల, లలిత=అందమైన, ఉద్యానంబులును= ఉద్యానవనములును;

పృథుల....కుశేశయంబులగు. పృథుల=విరివియైన, వారిశీకర= నీటితుంపురల, పటల=సమూహమును, పాన=త్రాగుటచే, దరవికట=కొంచెము విశాలమైన, కరటిముఖ=ఏనుగుల నోళ్ళచేత, వికలిత=ఖండితమైన, వరాటకోశ=దుద్దుల సమూహము లతో, వ్యాకోచ=వికాసముగల, హాటక=బంగారు, కుశేశయంబులగు=పద్మములు కలవియైన, సప్తగోదావర=సప్త గోదావరి యొక్క, ప్రవాహ=ప్రవాహములందలి, సలిలంబుల చేతను=నీటిచేతను;

కోమల.....షండంబులగు. కోమల=మృదువైన, కింజల్క=కేసరముల యొక్క, అగ్ర= చివరలను, గ్రసన=తినుటయందు, జాగ్రత్=పరాకులేని, చక్రవాక=చక్రవాక పక్షుల యొక్క, చరణ=పాదములకున్న, నఖ=గోళ్ళ యొక్క, శిఖర=మొనల చేత, సముల్లిఖిత=బాగుగా గీరబడిన, కమల=పద్మములు, కువలయ=నల్ల కలువలు, కుముద=తెల్ల కలువల యొక్క, షండంబులగు=సముదాయములు కలవైన, తీర్థకుండంబుల చేతను=పవిత్ర స్నానపు కొలకుల చేతను; గోదావరీ=గోదావరి, తుల్యభాగా=తుల్యభాగ, కౌంతేయీ=కౌంతేయి, కణ్వాపగా =కణ్వాపగ మొదలగు, నదీ మాతృకాయ మానంబై=నదీజలములచే పండెడు పంటలు కలదై; ఇరుగారునున్=రెండు మార్లుగా(సంవత్సరమునకు), పంట పొసంగు=పంటల కనుకూలమగు, పంటవలంతి=భూమియందలి, కేదార=కేదారమను ఒక జాతి వరిధాన్యము పండు, క్షేత్రంబుల చేతనున్=పొలముల చేతను;

అఖండిత=అంతులేని, అంభస్=నీటి యొక్క, సమృద్ధి=నిండుతనముతో, విజృంభించి=అధికమై, విశ్వం....కారంబులై. విశ్వంభరా=భూదేవి యొక్క, భ్రూలతా+ అనుకారి=తీగల వంటి కనుబొమలను అనుకరించు, సేతురేఖా=ఆనకట్టల వరుసలే, అలంకారంబులై=అలంకారములై, తట=ఒడ్డులందలి, తరు=చెట్ల యొక్క, కుసుమాంతర= పూలలోనుండి, క్షరత్=కారుచున్న, అమంద=అధికమైన, మకరంద సందోహ=పూలతేనెల సమూహములు, స్యందన=ప్రవాహములు చేత, కల్లోలంబులై=తరంగములు కలవియై, సలిల=నీటియందు, కేళీలోల=విహరించుట యందాసక్తములైన, కలహంస కామినీ= రాజహంస స్త్రీల, కోలాహల= కలకలముల చేత, అనుకృత=అనుకరింపబడిన, జలదేవతా= జలదేవతల యొక్క, చరణ=పాదములందలి, మణినూపుర=మణిఖచితములగు కాలి అందెల, ఝుణఝుణత్+ కారంబులై=ఝుణంఝుణ శబ్దములు కలవియై; కారండవ... మిథునంబులై. కారండవ=కన్నెలేడి పిల్లల యొక్క, పక్ష విక్షేప=ఱెక్కల నాడించుటచేత, పరిచరిత=సేవింపబడుచున్న పరిచలిత=బాగుగా కదలింపబడుచున్న, పంకజ=పద్మముల

లోని, పరాగపాళీ=పుప్పొడి సమూహములచే, విరచిత=కల్పింపబడిన, అళీక=అసత్యపు, సంధ్య+అనుబంధ=సంధ్యాసమయ సంబంధముచేత, చరిత=చరించిన, చక్రవాక మిథునంబులై= చక్రవాక పక్షుల జంటలు కలవై, పయోధి=సముద్రము యొక్క, కన్నబిడ్డలు(బోని= కన్నబిడ్డలవంటి, ఒడ్డు చెఱువుల చేతను=పెద్ద చెరువుల చేతను;

సరస ... క్షేపంబులును. సరస=రమణీయమైన, సహకార=తీయమామడి చెట్ల యొక్క, శాఖాశిఖా=కొమ్మల చివరలను, అధిరూఢ=ఎక్కిన, కోకిల కుటుంబినీ=ఆడుకోయిలల యొక్క, కంఠనాళ=గొంతుక్రోవి యందలి, కోమల=మృదువైన, కుహూకార=కుహుకుహూ శబ్దముల యొక్క కోలాహల=కలకలములతో, కలిత=తెలియజేయబడిన, విరహిణీ=భర్తల తోడి యెడబాటుగల స్త్రీల యొక్క, హృదయ=ఎడదలందలి, హాలాహల=హాలాహలమనెడి విషపు, క్షేపంబులును=ప్రేరేపణలు కలవియు; మధు.....పుంజంబులును. మధుకర నికర=తుమ్మెదల సమూహముచే, గుంజాయమాన=అవ్యక్తమధురముగ ధ్వని చేయు, మాధవీ నికుంజ= మాధవీలతల పొదరిండ్లయందు, సన్నిహిత=చక్కగనుంచబడిన, కిరణపుంజంబులును= కిరణముల సమూహము కలవియు; సముద్భిన్న....నీహారంబులును. సముద్భిన్న=బాగుగా వికసించిన, పున్నాగకుసుమ=పున్నాగ పూవుల, పరిమళ=సువాసనలను, ఉద్గార= వెడల(గక్కు, నీహారంబులును=మంచులు కలవియును; సముల్లసిత.....లోకంబులును. సముల్లసిత=మిక్కిలిగ ప్రకాశించుచున్న, చంపక కళికా=సంపెంగ మొగ్గల యొక్క, కలాప= సమూహముచే, కల్పిత=సృజింపబడిన, కందర్ప=మన్మథుని, పావకాస్త్ర=ఆగ్నేయాస్త్రము వలన, పరిత్రస్త=మిక్కిలి భయపడిన, పథిక లోకంబులును=బాటసారుల సమూహములు కలవియు; పాక.....ప్రకాశంబులును. పాక=పండుటచే, పరిస్ఫుటిత=బాగుగా పగిలిన, పుండ్రేక్షు=నలుపు మించిన ఎరుపు రంగుగల చెఱకు గడల యొక్క, పర్వముఖ=గనుపుల నుండి, ఉద్గీర్ణ= బయటకు వచ్చిన, ముక్తామణీ=ముత్యములచే, దర్శితాకార=చూపింపబడిన ఆకారము గల, రాకానిశాకర= పున్నమినాటి చంద్రుని యొక్క, ప్రకాశంబులును=కాంతులు కలవియు; కోరక....హంబులును. కోరక=మొగ్గల యొక్క, ప్రకర=సమూహమనెడి, తార=చుక్కలచే, తారకిత=ఆకాశమైన (నక్షత్రములు కలదిగ చేయబడినది), కురువక= ఎఱ్ఱగోరంట్ల, అనోకహంబులును చెట్లు కలవియు; వనితా....వనంబులును. వనితా=కాంతల యొక్క, వదన=ముఖములందలి, ఆసవ=మద్యముతో, సనాథ=కూడుకొన్న, వకుళ వనంబులును=పొగడ చెట్ల సమూహములు కలవియు; మహోరు.....నిచ యంబులును. మహోరు=మిక్కిలి శ్రేష్ఠమైన, కుచకలశ=కుండల వంటి చన్నుల, కాంతి=ప్రకాశమును, చోర=దొంగిలించిన, ఫల=పండ్లతో, కలిత=కూడుకొన్న, లికుచ=గజ నిమ్మల, నిచయంబులును=సమూహములు కలవియు, మాతులుంగ=మాదిఫలముల యొక్క, ఆమోద=పరిమళ

ముతో, హృదయంగమంబులును= హృదయమునకు హాయి గొల్పునవియు, నవ......సంగమంబులును. నవ=అందమైన, నాగరంగ=నారింజల యొక్క, సంగ=చెలిమి చేత, సుఖిత=సంతసించిన, సారంగ=తుమ్మెదల యొక్క, మంగళగాన=శుభంకరమైన గానములతో కూడిన, సరస=రసవంతమైన, సంగీత=సంగీతము యొక్క, ప్రసంగంబులును= విస్తరణలు కలదియు; భుజంగ.....ద్రుమంబులును భుజంగలతా=తమలపాకు తీగల యొక్క, పరిష్వంగ=అల్లికల చేత, ధన్య=కృతార్థత పొందిన, తరుణ=లేత, పూగద్రుమంబు లును= పోకచెట్లు కలదియు, లలిత.....గంబులును. లలిత=అందమైన, లవలీలతా=లవలీ తీగెలచేత, ఆలింగిత=అల్లుకొనబడిన, లవంగంబులునున్=లవంగ వృక్షములు కలవియు; అగు= అయినట్టి, శృంగార+ఆరామంబుల చేతను=ఉద్యానవనముల చేతను, అభిరామంబై= అందమైనదై;

కలిత=పొందబడిన, చాతుర్వర్ణ్య స్థితి=నాలుగు వర్ణముల మనుగడ కలది, అగుటన్=అగుటచేత, త్రైలోక్య=మూడు లోకముల మొత్తమునకు, తిలకంబును=శ్రేష్ఠమైనదియు;

(ఇచ్చటి నుండి శ్లేష విరోధాభాసములతో దక్షారామ పుర వర్ణనము చేయబడినది.)

అసంఖ్య=లెక్కకు మిక్కిలిగ, దేవాలయంబు=దేవాలయములు కలది, అగుటన్=అగుటచేత, శతమఖ నగరంబును=దక్షారామము; అసంఖ్య=లెక్కకు మిక్కిలిగ, దేవాలయంబు=దేవతల నివాసములు కలది, అగుటన్=అగుటచేత, శతమఖ నగరంబును=ఇంద్రుని నగరమైన అమరావతియు;

అక్షయ=నాశనములేని, జీవన=బ్రతుకు తెరువుకు వలయు వృత్తుల, ధృతియగుటన్=నిలుకడ కలది యగుట చేత, ధర్మపాల మండలంబును=దక్షారామము; అక్షయ=తరుగని, జీవన=ప్రాణులను, ధృతి=ధరించినది, అగుటన్=అగుటచే, ధర్మపాల మండలంబును=ధర్మపాలకుల సమూహము కలదియు;

అనధిగత=పొందబడని, కంటక=ముండ్లచేత, రుచిరంబగుటన్=అందమైనదగుటచేత, ప్రజాభాగ్య=సంపదల, ఘంటాపథంబును=దక్షారామము; అనధిగత= పొందబడని, కంటక=శత్రువులచేత, రుచిరంబగుటన్=అందమైనదగుటచేత, ప్రజాభాగ్య= పుట్టిన సంపదల యొక్క, ఘంటాపథంబును=రాజవీథియును;

ప్రచుర=విస్తారమైన, సన్మణి వాసంబగుట=సజ్జన శ్రేష్ఠుల నివాసమగుటచేత, వసుంధర+అధిప=రాజుల యొక్క, స్థానంబునునై=ఆస్థానములు కలదై; ప్రచుర=విస్తారమైన, సన్మణి వాసంబగుట=మంచి మణులకు నివాసమగుటచేత, వసుంధర=రత్నములను, మణులను, అధిప=ధరించిన శ్రేష్ఠులగు రాజులు, వైశ్యులు మొ॥ వారికి, స్థానంబునునై=నిలయమైనదై;

గుహ్యక నగరంబునుంబోలె=కుబేరుని నివాసమైన అలకానగరము వలె, వివిధ=అనేక ములయిన, మనుష్య=మానవుల, ధర్మ చరిత్ర=ధర్మముతో కూడిన నడవడితో దక్షారామము, పవిత్రంబును=పవిత్రమైనది; గుహ్యకనగరంబునుబోలె=అలకానగరము వలె, వివిధ=పలు విధము లైన, మనుష్య ధర్మ=కుబేరుని, చరిత్ర=నడవడితో, పవిత్రంబును=పవిత్రమైనదియు;

లంకానగరంబునుంబోలె=లంకానగరమునకు వలె, పుణ్యజన=రాక్షసులచే (యక్షాదులచే)త, అధ్యుషిత=నివాసముగ చేసికొనబడిన, సన్నివేశంబును=స్థానము కల; లంకా నగరంబునుంబోలె=లంకా నగరమునకు వలె, పుణ్యజన=పవిత్రులైన ప్రజలచేత, అధ్యుషిత=నివాసముగ చేసికొనబడిన, సన్నివేశంబును=స్థానము కలదియు; దక్షారామము;

కార్తవీర్యార్జున=కార్తవీర్యార్జునుడను రాజు యొక్క, మూర్తియునుంబోలె= ఆకారమునకు వలె, అవిరళ=విరివియైన, కర=చేతులతో, భూషితంబును=అలంకరింప బడిన; కార్తవీర్యార్జున=కార్తవీర్యార్జునుని, మూర్తియునుంబోలె= ఆకారమువలె (దక్షారామము), అవిరళ=విరివియైన; కర=పన్నులతో, భూషితంబును=అలంకరింపబడినదియు;

ప్రథిత=ప్రసిద్ధి పొందిన, హిరణ్యకశిపు=హిరణ్యకశిపుడను రాక్షసుని, క్షయంబును= నాశనము కల; నృసింహ=నృసింహ స్వామి యొక్క, లీలాడంబరంబునుంబోలె=క్రీడాదర్పము వలె, నృసింహ=రాజశ్రేష్ఠులు యొక్క, లీలాడంబరంబునుంబోలె=మహత్త్వము యొక్క దర్పమునకు వలె, ప్రథిత=ప్రసిద్ధి పొందిన, హిరణ్య+కశిపు+క్షయంబును=బంగారము, అన్నవస్త్రములును కలదియు;

విలసత్ ప్రకాశంబును= అధికముగ ప్రకాశించు రెల్లు పూలు కలదియు, శరత్కాలం బునుంబోలె=శరదృతు సమయము వలె, విలసత్ ప్రకాశంబును=మిక్కిలి శోభించుచున్న కాంతి కలదియు; (దక్షారామము)

నిగమ శాలియునై=వేదముల చేత సుసంపన్నమై; బ్రాహ్మణజాతి ధర్మంబునుంబోలె= బ్రాహ్మణజాతి ధర్మమునకువలె, నిగమశాలియునై=వర్తక సంఘములుచే వెలుగొందు నదియునై (దక్షారామము), మహద్భూష=గొప్ప అలంకారములతో, అన్వితంబు+అయ్యును= కూడినదైనను, నిరాక్రోశంబును=నిందలేకపోవుట కలదై, మహత్=గొప్పవారను, భూష= అలంకారముతో, అన్వితంబయ్యును=కూడియుం(డుటచేత)డినదైనను, నిరాక్రోశం బును=నిందలేకపోవుట కలదై;

ప్రకట=వెల్లడైన, భుజంగ=సర్పముల యొక్క, ప్రచారంబయ్యును=మిక్కిలి సంచారము కలదైనను, సదా=ఎల్లప్పుడు, హిత=మేలు చేయువారికి, అభయంబును=రక్షణ

కలదియు; ప్రకట=వెల్లడైన, భుజంగ=విటుల యొక్క, ప్రచారంబయ్యును=మిక్కిలి సంచారము కలదైనను, సదా=ఎల్లప్పుడు, ఆహిత=ఈయబడిన, అభయంబును= రక్షణకలదియు;

బలిరాజ=బలియను రాజు యొక్క, నిలయ భూతంబు=నివాస కారణమైనది. అయ్యును=ఐనను, గంధర్వ భూమియునై, గంధర్వుల నివాసలోకమునునై; బలి+రాజ= శ్రేష్ఠమైన పూజాదులకు, నిలయభూతంబయ్యును=స్థానమైనదైనను, గంధర్వభూమియునై= గాయకుల నివాసము కలదియునై;

వర్ణసాంకర్యంబు=రంగుల కలయిక, వాసవ కోదండంబునంద=ఇంద్ర ధనుస్సునందేగాని, వర్ణసాంకర్యంబు=కులముల సాంకర్యము, తన(దక్షారామము)యందు పొందనీక.

అహిభయంబు=సర్పముల వలని భయము, వల్మీకంబులయంద=పుట్టలయందే గాని, అహిభయంబు=స్వపక్షము వలని భయము, (తనయందు బొందనీకయు) దక్షారామమునకు లేదని.

జీవనసంశయంబు=నీరులేకపోవుట యనునది, వారిదంబులయంద మేఘముల యందేగాని, జీవన సంశయంబు=బ్రతుకు తెరువుల విషయమైన అనుమానము, (దక్షారామమునందు లేదని)

వృషాతిక్రమంబు=కామమును అతిక్రమించుట, గృహంబుల యంద= ఇండ్లయందేగాని, వృష+అతిక్రమంబు=న్యాయమును అతిక్రమించుట, దక్షారామమున లేదు. పరదర్శనంబు=పరమ్మాత్మను చూచుట, యతుల యంద=సన్యాసులయందేగాని, పరదర్శనంబు=వేరుగా చూచుట, (దక్షారామమున లేదు).

దోషా+ఉల్లాసంబు=రాత్రులయందు వికసించుట యనునది, కువలయంబులయంద =కలువ పూవులందేగాని, దోష+ఉల్లాసంబు=దోసముల యొక్క ప్రారంభము (దక్షారామమున లేదు.)

కౌరవ పద+అనుసరణంబు=కౌరవ పక్షుల అడుగు జాడలను అనుసరించి (వానిని పట్టుకొనుటకు) వెళ్ళుట, కిరాతులయంద=బోయవారియందేగాని; కౌరవ పద+అనుసరణంబు =కౌరవులైన దుర్యోధనాదులు దుష్ట మార్గముల ననుసరించుట (దక్షారామమున లేదు.)

తరళత్వంబు=చంచలత్వము, కరికర సంతానంబులయంద=ఏనుగు తొండముల సమూహములందేగాని, తరళత్వంబు=బేలుతనము, (దక్షారామమున లేదని); వి+పక్ష+ క్షోభంబు=పక్షుల ఱెక్కల కదలికలు, కొలంకుల యంద=కొలకులందేగాని, విపక్ష=శత్రువుల వలని, క్షోభంబు=కలత,(దక్షారామమునకు లేదు.)

ఆత్త= పొందబడిన, గంధత్వంబు=సువాసన కల్గియుండుట, చందనంబుల యంద=గంధపు చెట్లయందేగాని; ఆత్త=పొందబడిన, గంధత్వంబు=గర్వము కలిగి యుండుట, తనయందు= తనపై, పొందనీక=కలుగనీయకుండగ,

విభవంబునకు=సంపదకు, ప్రభవంబును=పుట్టుక కలదియు; విలాసంబునకు= క్రీడ(శోభ)కు, నివాపంబును=విత్తనములు చల్లినదియు, అపవర్గంబునకు=మోక్షమునకు, సర్గంబును=పుట్టుక స్థానమును, ధర్మంబునకు=ధర్మమునకు, మర్మంబును=ఆయువు పట్టును; దానంబునకు=దానగుణమునకు, నిధానంబును=స్థానమును; ఆనందంబునకు= సంతోషమునకు, మూల కందంబును=ముఖ్యమైన కారణము; విద్యకు=చదువునకు, నిషద్యయు=అంగడి వీధియు, విశ్రామంబునకు=ఊరట పొందుటకు, ధామంబును= నివాసమైనదియు; ఐ=అయి; ఒప్పు=ప్రకాశించెడి, ఆ+పట్టనంబునకు=ఆ దక్షారామ నగరమునకు, అధి+ఈశ్వరుండు=ప్రధాన దైవమైన శ్రీ భీమేశ్వర స్వామి.

**భావము** :- ఇంకను ఆ దక్షారామ నగరము సింహ పరాక్రములైన వేలాది యోధులతో కూడియున్నది. అమితమైన దానశీలము కల్గిన యశస్సుచే ప్రకాశించు వదాన్యులెందరో ఉండుటచేత పారిజాతోద్యానము; వందలాది యాగములను చేసిన దేవతల సమూహముగల సుధర్మ వలె, వందలాది యాగములు చేసిన పుణ్యమూర్తులుండుట చేత సుధర్మయను ఇంద్రసభ; మనోహరులు సుందరులు సంపన్నులునై పున్నమి చంద్రుని శోభతో ప్రకాశించు యక్షగంధర్వాది వారితోను, రాకుమారులతోను నుండుట చేత గంధర్వలోకము, మకర కచ్ఛప ముకుందాది నిధుల కధికారియైన కుబేరుని నగరమువలె మకర కచ్ఛప ముకుందాది నిధులు గల వైశ్యవరుల నివాసముచేత కుబేరుని నగరమైన అలకాపురియనదగియున్నదీ దక్షారామము.

సృష్టియందలి మొదటిదైన కృతయుగమునకు కారణమైనదన్నట్లుగ మేరుపర్వతము వంటి ఎత్తైన కోట గోడలీ దక్షారామమును చుట్టియున్నవి. కోటగోడల చుట్టును వెడల్పైన, లోతైన గుండ్రని అగడ్తయున్నది. దాని నిండుగ నీరున్నది. కోటగోడల ప్రతిబింబములా అగడ్తలోని నీటిలో ప్రతిబింబించి కదలాడుచున్నవి. ఇంద్రుని వజ్రాయుధపు తాకిడికి మేరుపర్వతము బెదరి పడినటువంటి మరియొక సముద్రమాయన్నట్లుదా అగడ్త.

కోట-గోడలలోపల భృంగిరిటి నికుంభ కుంభోదరాది ప్రమథగణ నాయకుల మణిమయ సౌధములున్నవి. ఆ సౌధముల ముంగిళ్ళ యందు ఏనుగులు విహరించుచున్నవి. ఆ ఏనుగుల మదజలములుకారి ఆ ముంగిళ్ళు తడిసియున్నవి. వారి సౌధముల సమీపములందు దిగుడు బావులున్నవి. వానిలోని పద్మవనములు వికసించి సువాసనలను వెదజల్లుచున్నవి. ఆ సువాసనలను మించిన కస్తూరి వాసనలు వచ్చుచున్నవి. అవి అప్సరసల

చెక్కిళ్ళ మీది లేపనముల వాసనలు. ఆ చుట్టు ప్రక్కల అప్సరసల సౌధములున్నవి. అవి మణిమయములు. ఇంకను యక్ష, గంధర్వ, కిన్నర కింపురుష సిద్ధ విద్యాధరుల మణిమయ భవనములున్నవి. వారి ముంగిళ్ళ యందు అరటి చెట్లున్నవి. గోడలకు పొదగబడిన మణుల కాంతులా అరటియాకులపై పడి, అవి మరల ప్రతిఫలించి ఆ భవనములు కాంతిమంతములగుచున్నవి. గరుడ పచ్చులనెడి రత్నముల కాంతులతో కూర్చబడిన నీలాకాశమున నక్షత్రముల వలె పెద్దముత్యముల మొలకలు పొదిగిన ప్రమథుల నివాసములున్నవి. అనేకములైన శివాలయములున్నవి. వాని ద్వారముల యందు మెఱుపు నల్లని రాళ్ళతో చెక్కబడిన నందీశ్వర విగ్రహములున్నవి. తులసీదళమాలలచేత పాప పరిహారకములైన విష్ణ్వాలయములున్నవి. వాని చుట్టును అనేక ఉద్యానవనములున్నవి. దానిలో మల్లెతోటలు. ఆ మల్లెలు వికసించినవి. మల్లెలలోని మకరందమును గ్రోలి మదించిన తుమ్మెదలు ఝంకారములు చేయుచున్నవి. సప్తగోదావర ప్రవాహములున్నవి. అందు ఏనుగులు జలక్రీడలాడుచుండును. ఆ క్రీడల తాకిడికి నీటిలోని పద్మములు వికసించి పరిమళములు వెదచల్లుచున్నవి. అనేకములైన స్నానపు కొలకులున్నవి. వానియందు పద్మములు తెల్లకలువలు వికసించియున్నవి. వానిలోని కింజల్కముల కొసలను తిని చక్రవాక పక్షులు విహరించుచుండగా వాని కాళ్ళ గోళ్ళ చివరలు ఆ పద్మముల, కలువల రేకులపై గీతలు పడుచున్నవి.

గోదావరి, తుల్యభాగ కౌంతేయి కణ్వాపగ మొదలగు నదుల నీటిచేత సంవత్సరము నకు రెండు పంటలు పండు సారవంతములైన భూములున్నవి. ఆ భూములందు కేదారమను వరి ధాన్యము మిక్కుటముగ పండును. నీటి సమృద్ధి కలిగి భూదేవి కనుబొమల వంటి అందమైన ఆనకట్టలున్నవి. కాల్వల ఒడ్డులయందు పూల చెట్లున్నవి. ఆ చెట్లపూలలోని మకరందము ధారగ కారి కాల్వలలో పడి నీరు సువాసనాభరిత మగుచున్నది. ఆ నీటిలో రాజహంస స్త్రీలు విహరించును. ఆ నీటి యలలపై ఊయలలూగుచు క్రేంకారములు చేయు చున్నవి. ఆ క్రేంకార శబ్దములు జలదేవతల మణిఖచిత పాదమంజీర నాదములవలెనున్నవి. కన్నెలేడి పిట్టరెక్కల గాలితాకిడికి పద్మములలోని పుప్పొడి పైకెగసి కృత్రిమముగ సంధ్యాసమయమైనట్లు చేసినది. చంద్రదర్శనము కొఱకు చక్రవాక మిథునము లాతృత పడినవి. సముద్రమునకు కన్నబిడ్డల వంటి అనేకములైన ఒడ్డు చెఱువులునున్నవి.

తీయ మామిడి తోటలున్నవి. వాని కొమ్మల చివరలందు ఆడు కోయిలలు కుహూరవములు చేయుచున్నవి. అవి భర్తల యెడబాటును పొందిన స్త్రీల బాధాతప్త మనోభావములను వివరించుచున్నట్లున్నవి. తుమ్మెదల సమూహములు మునిరిన

మాధవీలతల పొదరిండ్లున్నవి. పున్నాగ పూల పరిమళములు కలసిన మంచులున్నవి. సంపెంగ తోటలున్నవి. సంపెంగపూల సువాసనలు మన్మథుని ఆగ్నేయాస్త్రములు వలెనై బాటసారులను భయపెట్టుచున్నవి. చెఱకు తోటలున్నవి. చెఱకులు పండి నలుపు మించిన ఎరుపు రంగును కల్గియున్నవి. చెఱకు గనుపుల వద్ద పగిలి తెల్లని ముత్యముల వంటి బుడిపెలు పొడిచి పున్నమి చంద్రుని కాంతులవలె ప్రకాశించుచున్నవి. ఎఱ్ఱ గోరంట తోటలున్నవి. వాని పూలు నక్షత్రములను మించి ప్రకాశించుచున్నవి. కాంతల ముఖము లందలి మద్యముతో కూడుకొన్న పొగడపూల చెట్లున్నవి. గజ నిమ్మ తోటలున్నవి. కాంతల స్తనములకు మించిన ప్రకాశముతో గజ నిమ్మపండ్లు విరివిగనున్నవి. మాది ఫలముల తోటలున్నవి. అందలి మాది ఫలముల సువాసనలు హృదయంగమములుగ నున్నవి. అందమైన నారింజ తోటలున్నవి. ఆ చెట్లయందు తుమ్మెదల గుంపులు సరస సంగీత మంగళ గానముల నాలపించుచున్నవి. తమలపాకుల తీగలల్లు కొన్నపోక చెట్లును, లవలీ, తీగెలల్లుకొన్న లవంగ వృక్షములు నున్నవి. - ఇట్లెన్నియో ఉద్యాన వనములు ఆ దక్షారామమున కలవు.

దక్షారామము చాతుర్వర్ణ్య స్థితితో ముల్లోకములందును శ్రేష్ఠమైనది. లెక్కలేనన్ని దేవతల నివాసములతో ఇంద్రుని నగరమైన అమరావతివలె లేక లెక్కలేనన్ని దేవాలయములతో దక్షారామము అమరావతి యనదగియున్నది. నిత్యము జీవరాశితో ప్రకాశించు ధర్మపాలకుడైన యముని నగరమువలె బ్రతుకు తెరువుల వృద్ధితో దక్షారామము నిలుకడ కల్గియున్నది. ముళ్ళులేని రాచబాటవలె శత్రువులులేని విశాల వీథి యీ దక్షారామము. సన్మణుల నివాసమునకు రాజాస్థానమువలె సజ్జన శ్రేష్ఠుల నివాసమీ దక్షారామము. కుబేరుని నడవడితో అలకానగరము పవిత్రమైనట్లుగ ధర్మాచరణయందు సత్ప్రవర్తనగల జనులతో దక్షారామము పవిత్రము. రాక్షసుల నివాసముచే లంకానగరమెట్లు ప్రసిద్ధి పొందినదో యక్ష, కిన్నరాదుల నివాసములతో (లంకానగరము వలె) దక్షారామము ప్రసిద్ధము. కార్తవీర్యార్జునుని కరసహస్రములవలె విరివియైన పన్నులరాబడితో ఈ నగరము శోభాయమానము. హిరణ్యకశిపు వధతో నృసింహ స్వామి లీలాడంబరమువలె బంగారము, అన్న వస్త్రముల అభివృద్ధితో రాజశ్రేష్ఠుల లీలాడంబరములు కల్గియున్నదీ దక్షారామము. శరత్కాలమందలి తెల్లుపూల ప్రకాశమువలె విశేషకాంతి సుసంపన్నమైనట్లుగనే వర్తక సంఘముల వ్యాపార ధర్మముతో వన్నెకెక్కినదీ నగరము.

గొప్పవారను అలంకారములతో కూడియుండియు నిందింపబడనిదేకాదు - గొప్పమహత్త్వమే అలంకారముగ గల్గియు నిందలేనిది. సర్పముల విశేష సంచారము కలదైనను

సదారక్షణ కల్గియుండుటేకాదు, సదా విటుల విశేష సంచారము కలదైనను రక్షణ కలది. బలిచక్రవర్తి నివాసమైన పాతాళలోకమైనను గంధర్వ లోకమైనట్లు గాదు. శ్రేష్ఠమైన పూజాదులకు, గంధర్వాదులకు నివాస స్థానమగుటచేత గంధర్వలోక మీ నగరము.

వర్ణ (రంగుల) సాంకర్యము ఇంద్రధనుస్సు నందేగాని వర్ణ (కులముల) సాంకర్యము దక్షారామమున లేదు. సర్పభయము పుట్టలయందే గాని మేలు చేయు వారికెప్పుడు రక్షణ కలది. నీరు లేదను అనుమానము మేఘములందేగాని బ్రదుకు తెరువుల విషయమై అనుమానమీ నగరమునకు లేదు. కామమును అతిక్రమించుట ఇండ్లయందేగాని, న్యాయమును అతిక్రమించుట ఈ నగరమున లేదు. పరమాత్మ దర్శనము యతులయందేగాని వేరుగా చూచుట ఈ నగరమునకు లేదు. రాత్రులందు వికసించుట కలువపూల యందేగాని దోషప్రారంభ మీ నగరమునకు లేదు. కౌరవ పక్షుల పద చిహ్నములను అనుసరించి వేటాడుట కిరాతులందేగాని దుర్యోధ నాదుల దుష్టనీతి ననుసరించుట ఈ నగరమున లేదు. చంచలత్వము ఏనుగుల తొండము లందేగాని బోలుతనము దక్షారామమున లేదు. పక్షుల తెక్కల కదలికలు కొలకులందేగాని శత్రువుల వలనిక్షోభ మీ నగరమునకు లేదు.

సంపదలకు నిలయము, శోభకు జన్మస్థానము, మోక్షమునకు ప్రాప్తిస్థానము, ధర్మమునకు ఆయువుపట్టు, ఆనందమునకు మూలకందము, విద్యకు అంగడి వీధి, విశ్రాంతికి నిలయముగనై ఈ దక్షారామము ప్రకాశించును. అట్టి ఈ పవిత్రమైన నగరమునకు ప్రధానదైవమైన శ్రీ భీమేశ్వర స్వామి -

విశేషము :- ఈ సుదీర్ఘ దక్షారామపుర వర్ణన వచనము శ్రీనాథుని సమకాలికుడైన వామన భట్టబాణుడు రచించిన వేమభూపాల చరితమను సంస్కృత గద్యకావ్యమునందలి అద్దంకిపుర వర్ణనమునకు యథాక్షరముగా చేసిన ఆంధ్రీకరణము.

సీ॥ హాలాహలంబను నల్లో నేరెడు పండు
మిసిమింతుఁడును గాక మ్రింగినాఁడు
పెను వ్రేలి కొనగోర బిసరుహాసను మోముఁ
గెందమ్మి విరివోలె గిల్లినాఁడు
పంచవన్నియ తోడఁ బ్రసవ నారాచుని
నెఱ్ఱి చిచ్చుఱకంట జుట్టినాఁడు
మెఱుఁగు గోఱలు డుల్ల మృత్యుదేవత నోరు
ధట్టించి యఱకాలఁ దన్నినాఁడు

మాధవీలతల పొదరిండ్లున్నవి. పున్నాగ పూల పరిమళములు కలసిన మంచులున్నవి. సంపెంగ తోటలున్నవి. సంపెంగపూల సువాసనలు మన్మథుని ఆగ్నేయాస్త్రములు వలెనై బాటసారులను భయపెట్టుచున్నవి. చెఱకు తోటలున్నవి. చెఱకులు పండి నలుపు మించిన ఎరుపు రంగును కల్గియున్నవి. చెఱకు గనుపుల వద్ద పగిలి తెల్లని ముత్యముల వంటి బుడిపెలు పొడిచి పున్నమి చంద్రుని కాంతులవలె ప్రకాశించుచున్నవి. ఎఱ్ఱ గోరంట తోటలున్నవి. వాని పూలు నక్షత్రములను మించి ప్రకాశించుచున్నవి. కాంతల ముఖము లందలి మద్యముతో కూడుకొన్న పొగడపూల చెట్లున్నవి. గజ నిమ్మ తోటలున్నవి. కాంతల స్తనములకు మించిన ప్రకాశముతో గజ నిమ్మపండ్లు విరివిగనున్నవి. మాది ఫలముల తోటలున్నవి. అందలి మాది ఫలముల సువాసనలు హృదయంగమములుగ నున్నవి. అందమైన నారింజ తోటలున్నవి. ఆ చెట్లయందు తుమ్మెదల గుంపులు సరస సంగీత మంగళ గానముల నాలపించుచున్నవి. తమలపాకుల తీగలల్లు కొన్నపోక చెట్లును, లవలీ, తీగెలల్లుకొన్న లవంగ వృక్షములు నున్నవి. - ఇట్లెన్నియో ఉద్యాన వనములు ఆ దక్షారామమున కలవు.

దక్షారామము చాతుర్వర్ణ్య స్థితితో ముల్లోకములందును శ్రేష్ఠమైనది. లెక్కలేనన్ని దేవతల నివాసములతో ఇంద్రుని నగరమైన అమరావతివలె లేక లెక్కలేనన్ని దేవాలయములతో దక్షారామము అమరావతి యనదగియున్నది. నిత్యము జీవరాశితో ప్రకాశించు ధర్మపాలకుడైన యముని నగరమువలె బ్రతుకు తెరువుల వృద్ధితో దక్షారామము నిలుకడ కల్గియున్నది. ముళ్ళులేని రాచబాటవలె శత్రువులులేని విశాల వీథి యీ దక్షారామము. సద్గుణుల నివాసమునకు రాజాస్థానమువలె సజ్జన శ్రేష్ఠుల నివాసమీ దక్షారామము. కుబేరుని నడవడితో అలకానగరము పవిత్రమైనట్లుగ ధర్మాచరణయందు సత్ప్రవర్తనగల జనులతో దక్షారామము పవిత్రము. రాక్షసుల నివాసముచే లంకానగరమెట్లు ప్రసిద్ధి పొందినదో యక్ష, కిన్నరాదుల నివాసములతో (లంకానగరము వలె) దక్షారామము ప్రసిద్ధము. కార్తవీర్యార్జునుని కరసహస్రములవలె విరివియైన పన్నులరాబడితో ఈ నగరము శోభాయమానము. హిరణ్యకశిపు వధతో నృసింహ స్వామి లీలాడంబరమువలె బంగారము, అన్న వస్త్రముల అభివృద్ధితో రాజశ్రేష్ఠుల లీలాడంబరములు కల్గియున్నదీ దక్షారామము. శరత్కాలమందలి తెల్లపూల ప్రకాశమువలె విశేషకాంతి సుసంపన్నమైనట్లుగనే వర్తక సంఘముల వ్యాపార ధర్మముతో వన్నెకెక్కినదీ నగరము.

గొప్పవారను అలంకారములతో కూడియుండియు నిందింపబడనిదేకాదు - గొప్పమహత్త్వమే అలంకారముగ గల్గియు నిందలేనిది. సర్పముల విశేష సంచారము కలదైనను

సదారక్షణ కల్గియుండుటేకాదు, సదా విటుల విశేష సంచారము కలదైనను రక్షణ కలది. బలిచక్రవర్తి నివాసమైన పాతాళలోకమైనను గంధర్వ లోకమైనట్లు గాదు. శ్రేష్ఠమైన పూజాదులకు, గంధర్వాదులకు నివాస స్థానమగుటచేత గంధర్వలోక మీ నగరము.

వర్ణ (రంగుల) సాంకర్యము ఇంద్రధనుస్సు నందేగాని వర్ణ (కులముల) సాంకర్యము దక్షారామమున లేదు. సర్పభయము పుట్టలయందే గాని మేలు చేయు వారికెప్పుడు రక్షణ కలది. నీరు లేదను అనుమానము మేఘములందేగాని బ్రదుకు తెరువుల విషయమై అనుమానమీ నగరమునకు లేదు. కామమును అతిక్రమించుట ఇండ్లయందేగాని, న్యాయమును అతిక్రమించుట ఈ నగరమున లేదు. పరమాత్మ దర్శనము యతులయందేగాని వేరుగా చూచుట ఈ నగరమునకు లేదు. రాత్రులందు వికసించుట కలువపూల యందేగాని దోషప్రారంభ మీ నగరమునకు లేదు. కౌరవ పక్షుల పద చిహ్నములను అనుసరించి వేటాడుట కిరాతులందేగాని దుర్యోధ నాదుల దుష్టనీతి ననుసరించుట ఈ నగరమున లేదు. చంచలత్వము ఏనుగుల తొండము లందేగాని బోలుతనము దక్షారామమున లేదు. పక్షుల ఱెక్కల కదలికలు కొలకులందేగాని శత్రువుల వలనిక్షోభ మీ నగరమునకు లేదు.

సంపదలకు నిలయము, శోభకు జన్మస్థానము, మోక్షమునకు ప్రాప్తిస్థానము, ధర్మమునకు ఆయువుపట్టు, ఆనందమునకు మూలకందము, విద్యకు అంగడి వీధి, విశ్రాంతికి నిలయముగనై ఈ దక్షారామము ప్రకాశించును. అట్టి ఈ పవిత్రమైన నగరమునకు ప్రధానదైవమైన శ్రీ భీమేశ్వర స్వామి -

విశేషము :- ఈ సుదీర్ఘ దక్షారామపుర వర్ణన వచనము శ్రీనాథుని సమకాలికుడైన వామన భట్టబాణుడు రచించిన వేమభూపాల చరితమను సంస్కృత గద్యకావ్యమునందలి అద్దంకిపుర వర్ణనమునకు యథాక్షరముగా చేసిన ఆంధ్రీకరణము.

సీ॥ హాలాహలంబను నల్లొ నేరెడు పండు
మిసిమింతుఁడును గాక మ్రింగినాఁడు
పెను వ్రేలి కొనగోర బిసరుహాసను మోముఁ
గెందమ్మి విరివోలె గిల్లినాఁడు
పంచవన్నియ తోడఁ బ్రసవ నారాచుని
నెఱ్ఱి చిచ్చుఱకంట జుఱ్ఱినాఁడు
మెఱుఁగు గోఱలు దుల్ల మృత్యుదేవత నోరు
ధట్టించి యఱకాలఁ దన్నినాఁడు

తే॥ త్రిపుర దైత్యావరోధ నారీ విలాస
దంత తాటంకముల కెగ్గు దలఁచినాఁడు
దక్షపురి సానికూఁతులఁదవిలినాఁడు
విశ్వలోక కుటుంబి భీమేశ్వరుండు. 111

అర్థము :- విశ్వలోక కుటుంబి=సమస్త లోకములకు యజమానుడైన, భీమేశ్వరుండు= శ్రీ భీమేశ్వర స్వామి, హాలాహలంబను=హాలాహల విషమనెడి, అల్లనేరెడు పండు=పెద్ద నేరేడు పండును, మిసిమింతుఁడును గాక=అలసినవాడు కాకుండగ, మ్రింగినాఁడు=మ్రింగెను;

పెనుమ్రేలి=బొటనవ్రేలి యొక్క, కొన=చివరన కల, గోరన్=గోటితో, బిసరుహాసను= బ్రహ్మదేవుని, మోమున్=ముఖమును, కెంపు+తమ్మివిరివోలె=లేత తామరపూవును వలె, గిల్లినాఁడు=గిల్లెను;

పంచవన్నియ తోడన్=అయిదు రంగులుగల వాహనమగు చిలుకతో, ప్రసవనారా చునిన్=మన్మథుని, ఎఱ్ఱి=ఎఱ్ఱనైన, చిచ్చుఱకంటన్=అగ్గికంటితో, జుఱ్ఱినాఁడు=పీల్చెను;

మెఱుఁగు=వాడియైన, కోఱలు=పొడవు పన్నులు, డుల్లన్=ఊడిపడునట్లుగా, మృత్యుదేవత=మత్యువను దేవత యొక్క, నోరు=నోటిని, ధట్టించి=అదలించి, అఱకాలన్= పాదతలముతో, తన్నినాఁడు=తన్నెను;

త్రిపుర దైత్య=త్రిపురాసురుల యొక్క, అవరోధనారీ=అంతఃపుర కాంతల, విలాస= సుందరమైన, దంత తాటంకములకు=దంతములతో చేయబడిన చెవికమ్మలకు, ఎగ్గున్= అపకారమును, తలఁచినాఁడు=ఉద్దేశించెను, దక్షపుర=దక్షారామము నందలి, సానికూతులన్= సానుల కూతుండ్రను, తవిలినాఁడు=పొందెను.

భావము :- సమస్త లోకములకు యజమానుడైన శ్రీ భీమేశ్వర స్వామి హాలాహలమను పెద్ద నేరెడు పండును శ్రమలేకయే మ్రింగినాడు. బొటనవ్రేలి గోటి కొనతో బ్రహ్మదేవుని ముఖమును గిల్లివేసినాడు. చిలుకను వాహనముగ గల మన్మథుని తన నిప్పు కంటితో బూడిద చేసినాడు. మృత్యుదేవత యొక్క పదునైన కోరలూడిపడునట్లుగ అరికాలితో చావితన్నినాడు. త్రిపురాసురులను చంపి వారి భార్యల సౌభాగ్యములకు అపకారము చేసినాడు. దక్షారామ నగరము నందలి సానుల కూతుండ్రను పొందినాడు.

విశేషము :- 1. హాలాహల భక్షణ వృత్తాంత మీగ్రంథముననే నాల్గవ ఆశ్వాసమున కలదు.

2. బ్రహ్మ శిరస్సును ఖండించుట :- బ్రహ్మ, విష్ణువులు తమకు తామే అధికులమని తగవులాడుచుండ శివుడు వచ్చి పోరాటము మానుడనెను. విష్ణువు మానెను. బ్రహ్మ మానక

తన పంచమ శిరముతో శివుని దూషించెను. శివుడు కాల భైరవుని సృజించి ఆ పంచమ శిరమును ఖండింపుమనెను. ఆతనిని జూచుట తోడనే భయపడిన బ్రహ్మ తన పంచమ శిరము శివుని దగ్గర పడునట్లును, ఆ కపాలమున శివుడు భిక్షాటన చేయునట్లును కోరగా ఆయన అనుగ్రహించెను -

3. మన్మథ దహనము :- శంకరుడు హిమవంతముపై తపము చేయుట హిమ వంతుని పుత్రికయైన పార్వతి శంకరునకుపచారములు చేయుచుండుట - శివపార్వతుల కలయిక, ఫలితముగ కుమారస్వామి జననమునాశించిన దేవేంద్రాదుల ఆనతిపై మన్మథుడు హిమవంతమును చేరి వసంతమును సృజించి శివునిపై పూబాణములను ప్రయోగించుట. తపోభంగమైన శివుడు తన యెదుట గల పూబాణుడైన మన్మథుని తన మూడవ కన్ను తెరిచి భస్మముచేయుట, పిమ్మట రతి కోరికపై శివుడు మన్మథుని బ్రతికించుట - అన్నవి మన్మథ దహన వృత్తాంతమందలి ప్రసిద్ధ ప్రధానాంశములు.

4. మృత్యుదేవతను దండించుట :- మృకండ మహర్షి కుమారుడైన మార్కండేయుడు అల్పాయుష్కుడగుట, ఆతనికి పదారవ యేట మరణము గల్గునని తెలిసి మార్కండేయుని తలిదండ్రులు వగచుచుండ మార్కండేయుడు శివభక్తుడై శివలింగ సన్నిధానముననే శివుని ధ్యానించుచుండ యముడు మార్కండేయుని ప్రాణములను తీయుటకై తన పాశమును విసరుట, మార్కండేయుడు శివుని ప్రార్థించుట, లింగము నుండి శివుడుద్భవించి యముని దండించుట అన్నవి ఈ వృత్తాంతమందలి ప్రధానాంశములు.

5. త్రిపురాసుర సంహారము :- ఈ గ్రంథముననే నాల్గవ ఆశ్వాసమున కలదు.

6. ఈ పద్య ప్రథమ పాదమున హాలాహలమును నేరేడు పండుతో పోల్చుట జరిగినది. ఈ పోలిక ఆదిశంకరుల శివానందలహరి (శ్లో-32) నుండి గ్రహింపబడినది.

శివానందలహరిలోని శ్లోకమిది -

జ్వాలోగ్రస్సకలామరాతి భయదః క్ష్వేళః కథం వా త్వయా
దృష్టః కించకరేధృతః కరతలేకిం పక్వజంబూఫలమ్
జిహ్వాయాం నిహితశ్చ సిద్ధ ఘుటికా వా కంఠదేశే భృతః
కింతే నీలమణిర్విభూషణమయం శంభో మహాత్మన్వద

తీవ్రజ్వాలలు గ్రమ్ముచు సకలదేవతలకును భయంకరమైన యీ కాలకూట విషమును కన్నులతో గాంచుటయే కాక చేతితో నెత్తి అరచేతిలో నుంచుకొంటివి. అది నేరేడు పండా ఏమి? ఇదిగాక నాలుకమీద వేసికొన్నావు. సిద్ధ ఘుటికా ఏమి? మరియును కంఠమం దటులనే యుంచుకొంటివి. ఇది ఇంద్రనీల మాణిక్యమా ఏమి? చెప్పుము.

7. హాలాహలమును సిద్ధఘుటికగా పోల్చిన పోలికను గూడ ఈ శ్లోకము నుండియే శ్రీనాథ మహాకవి గ్రహించినాడు.

కటుకమగు విషము విషధర
కటకంబగు కేలఁబూని కౌతూహలియై
ఘుటికాసంసిద్ధుఁడు రస
ఘుటికయ్యునుంబోలె మృడుఁడు గుటుకున మ్రింగెన్ హర-(6-70); భీమ-(4-66)

8. అలంకారము - రూపకము.

మ॥ ఎనయం గల్గిన కూర్మి భృంగిరిటిఁ గానీ తండుఁ గానీ నికుం
భునిఁ గానీ కయిదండ పట్టుకొని సంభోగేచ్ఛ నంతఃపురాం
గనలం గన్ను మొఱంగి యప్పురమునం గన్నేఱు కాఁదారి ప్రా
ద్దున భీమేశుఁడు సానివాడ కరుగున్ ధూర్తప్రకారంబుగన్. 112

అర్థము :- భీమేశుఁడు=శ్రీ భీమేశ్వరుడు, ఆ పురమునన్=ఆ దక్షారామము నందు, కన్ను+ఏఱు=కంటిని బాధించు అనగా కన్ను పొడుచుకున్నను కానరాని, కాఁదారి ప్రొద్దున=అర్ధరాత్రి సమయమున, ఎనయంగల్గిన=పొందికగల, కూర్మిన్=స్నేహముతో భృంగిరిటిన్+కానీ=భృంగిరిటి అను కింకరుని గాని, తండున్ కానీ=తండుడను కింకరుని గాని, నికుంభునిన్ కానీ=నికుంభుడను కింకరుని గాని, కయిదండ పట్టుకొని=చేయూతగా చేసికొని, అంతఃపుర+అంగనలన్=రాణివాసస్త్రీలను (భార్యలను), కన్ను మొఱంగి= మోసగించి, భోగ+ఇచ్ఛన్=అనుభవించు కోరికతో, ధూర్త ప్రకారంబుగన్=మోసగానివలె, సానివాడకు=భోగము వారి వీథికి, అరుగున్=వెళ్ళును.

భావము :- శ్రీ భీమేశ్వరుడు ఆ దక్షారామమున కన్నుపొడుచుకున్నను కానరాని అర్ధరాత్రి సమయములందు భార్యలను మభ్యపెట్టి భృంగిరిటి, తండువు, నికుంభుడు అను ఆంతరంగికులైన కింకరులలో ఒకరిని తోడుచేసికొని సుఖాభిలాషియై మోసగానివలె సానివాడకు వెళ్ళును.

విశేషము :- దక్షారామమున భీమేశ్వరుడు మేడమీద నుండును. మాణిక్యాంబ మేడక్రింద తిరుచుట్టుమాలెలో నుండును. సానివాడ యనగా మాణిక్యాంబ గుడి. ప్రతి ఏకాదశినాడును మేడపైగల భీమేశ్వరుని ఉత్సవ విగ్రహమును భృంగిరిటి, తండువు, నికుంభుని ఉత్సవ విగ్రహములలో ఒకదానిని తోడుచేసి మాణిక్యాంబ గుడికి తీసికొనివచ్చి పవళింపుసేవ చేయుదురు. గర్భాలయములోని గంగా పార్వతుల విగ్రహములకు చాటుగా తీసికొని వత్తురు. ఇది భీమేశ్వరాలయము నందలి స్థానిక విశేషము.

క॥ పదునాల్గు మహాయుగముల
ముదుకగు భీమేశ్వరునకు మొగచాటై యుం
డదు సాని పెండ్లి యెప్పుడు
నది దక్షారామమహిమ మగునో కాదో. 113

అర్థము :- పదునాల్గు=పదునాలుగు, మహాయుగముల=మహాయుగముల కాలము మొత్తమంతటి వయస్సు గల, ముదుక+అగు=ముసలివాడగు, భీమేశ్వరునకు=శ్రీ భీమనాథునకు, ఎప్పుడున్=ఎపుడును, సానిపెండ్లి=సానులతోడి వివాహము, మొగచాటు+ఐ= వెగటు పుట్టినదై, ఉండదు=ఉండదు గదా! అది=ఆ విషయము, దక్షారామ=దక్షారామము యొక్క, మహిమము=గొప్పతనము, అగునో కాదో!=అవునోకాదో మరి.

భావము :- పదునాలుగు మహాయుగముల వయసు గల ముదుసలియైన శ్రీ భీమేశ్వర స్వామికి ఎపుడును సానులతో పెండ్లి వెగటు పుట్టలేదు. అది దక్షారామ క్షేత్రము యొక్క మహత్త్వమే కదా!

విశేషము :- కృతయుగము, త్రేతాయుగము, ద్వాపరయుగము, కలియుగము కలిసి ఒక మహాయుగము. అనగా 4,32,000 సంవత్సరములు. అట్టి మహాయుగములు పదు నాలుగు. నాటి కాలమున ప్రతిదినము శ్రీ భీమేశ్వరునకు సానితో పెండ్లి జరిగెడిది. దేవదాసి యనగా దేవుని వివాహమాడిన కన్య వేశ్య. అనగ దేవుని వివాహమాడిన సాని అని యర్థము.

సీ॥ నేదిష్ఠమున సప్త గోదావరంబున
నఘమర్షణస్నాన మాచరించి
త్ర్యాయుష మంత్రాక్షరాభి మంత్రితమైన
విమల భూతి త్రిపుండ్రము ధరించి
మొగలి వాకిలి దాఁటి దిగువ శాక్వరరాజు
నగరిపై వెన్నుని ననువుఁ జూచి
మణిశిలా సోపాన మధ్యమార్గంబుగా
నభ్రంకషంబైన హర్మ్యమెక్కి
తే॥ సప్తపాతాళ భువన విష్కంభములను
దెఱచి వెడలిన జ్యోతిః ప్రదీప్తమూర్తి
శంభు భీమేశ్వరేశ్వర స్వామిఁ గొలుచు
పరమ మాహేశ్వరున కేమి బ్రాఁతి ముక్తి. 114

అర్థము :- నేదిష్ఠమున=మిక్కిలి సమీపము నందలి, సప్త గోదావరంబునన్=సప్త గోదావరమనెడు నది యందు, అఘమర్షణ స్నానము=పాపములను పోగొట్టు స్నానమును, ఆచరించి=చేసి;

త్ర్యాయుష=త్ర్యాయుషమను, మంత్రాక్షర=అక్షర మంత్రములతో, అభిమంత్రితమైన=సంస్కరింపబడిన, విమలభూతి=పవిత్రమైన విబూదితో, త్రిపుండ్రము=నొసట పెట్టుకొను మూడురేఖల బొట్టును, ధరించి=పెట్టుకొని;

మొగలివాకిలి=ముఖద్వారమును, దూటి=దాటి, దిగువ=క్రిందనున్న, శాక్వరరాజున్=నందీశ్వరుని, నగరిపై=దేవాలయముపైన, వెన్నుని=విష్ణుదేవుని, ననువున్=అందమును, చూచి=చూచి;

మణిశిలా=జేగురు రాళ్ళతోడి, సోపాన=మెట్ల యొక్క, మధ్యమార్గంబుగాన్= మధ్యన గల త్రోవ గుండ, అభ్రంకషంబైన=ఆకసమునంటుచున్న, హర్మ్య మెక్కి=మేడనెక్కి;

సప్తపాతాళభువన=ఏడు పాతాళ లోకములనెడి, విష్కంభములను=వైశాల్యములను, తెఱచి వెడలిన=ఛేదించివచ్చిన, జ్యోతిః ప్రదీప్తమూర్తి=కాంతితో మిక్కిలిగ ప్రకాశించు ఆకారము కలవాడు, శంభు=శుభమును కల్గించు వాడైన, భీమేశ్వరేశ్వర స్వామిన్=శ్రీ భీమనాథేశ్వర స్వామిని, కొలుచు=సేవించునట్టి, పరమ మాహేశ్వరునకు=గొప్ప శివభక్తునకు, ముక్తి=మోక్షము, ఏమి బ్రాంతి=ఏమి అబ్బురము.

భావము :- దక్షారామ క్షేత్రము నానియున్న సప్త గోదావరమను నదిలో అఘమర్షణ స్నానము చేసి, త్ర్యాయుష మంత్రములతో పవిత్రీ కృతము చేయబడిన విబూదితో ఫాలభాగమున త్రిపుండ్రమును దిద్ది తీర్చుకొని, ముఖద్వారము దాటి దిగువన నున్న నందీశ్వరాలయమును పిమ్మట ఆ పైననున్న విష్ణుమూర్తి ఆలయమును చూచి, జేగురురాళ్ళ మెట్ల వరుస మధ్యగా కన్పించు త్రోవన ఎత్తైన మేడనెక్కి, శుభంకరుడు పాతాళమునుండి ఉద్భవించినవాడునైన శ్రీ భీమేశ్వర స్వామిని సేవించిన పరమ శివభక్తునకు ముక్తికల్గుట విశేషము కాదు. సులభము.

విశేషము :- త్ర్యాయుష మంత్రము :-

"త్ర్యాయుషం జమదగ్నేః కశ్యపస్య త్ర్యాయుషమ్
యద్దేవానాం త్ర్యాయుషం తన్మే అస్తు త్ర్యాయుషమ్"
*యాజుష పూర్వ ప్రయోగ చంద్రిక - పుట - 213, 214*

ఈ మంత్రమును భస్మాభిమంత్రణ మంత్రము, భస్మధారణ మంత్రము అని అందురు. ఈ మంత్రముతో విభూతిని అభిమంత్రించుచు నుదుటిపై మూడు రేకలుగా ధరింతురు.

అఘమర్షణ స్నాన మంత్రము :-
హిరణ్య శృంగం వరుణం ప్రపద్యే తీర్థం మే దేహియాచితః
యన్మయా భుక్త మసాధూనాం పాపేభ్యశ్చ పరిగ్రహః
యన్మే మనసా వాచా కర్మణా వా దుష్కృత్యం కృతమ్
తం నో ఇంద్రో వరుణో బృహస్పతి స్సవితాచ పునంతుపునఃపునః

*యాజుష పూర్వ ప్రయోగచంద్రిక-పుట-208*

కారణోత్తరాగమమునందు వివరింపబడిన అఘమర్షణ స్నానము చేయు విధానము.

"అస్త్రేణ మంత్రితం తోయం వామనాసాగ్రమానయన్
ఇడయాంతర్గతం తేన దగ్ధమేనో విచింతయేత్
బహిర్గతం పింగళయా భావయన్ దక్షిణే కరే
ధృత్వాజలం తత్ర పాపపురుషం భావయేత్తత
వామే భాగే వజ్రశిలాం ధ్యాత్వా తత్రక్షిపేజ్జలం
చూర్ణితం భావయే త్పాపనర మిత్యఘమర్షణం" (3-38-40)

అస్త్రమంత్రములచే మంత్రింపబడిన జలమును ఎడమ ముక్కుకొనను చేర్చి ఇడ అను నాడిచే నాజలము లోన ప్రవేశించునట్లును, అద్దానిచే లోని పాపము కాలిపోయినట్లు భావించి, అందు పాపపురుషుడున్నట్లు ధ్యానించి, ఎడమ ప్రక్కను వజ్రశిలయున్నట్లు భావించి, ఆ జలము నందువైచి, పాపపురుషుడు చూర్ణమయ్యెనని యెంచవలెను. ఇదియె అఘమర్షణ మగును.

సప్తపాతాళములు :- చూడుడు భీమ. 1-4.

కII పరమాశించుచు భీమే
శ్వరు ననుమతిఁజేసి చోడవంశాభరణుం
డరి కాలుఁడు కరికాలుఁడు
ధరణీధర పత్ని మనసు దైన్యము ముంచెన్. 115

**అర్థము** :- పరమ=మోక్షమును, ఆశించుచు=కోరుచు, భీమేశ్వరున్=శ్రీ భీమేశ్వర స్వామి యొక్క, అనుమతిన్ చేసి=సమ్మతి వలన, చోడవంశ=చోడవంశమునకు, ఆభరణుండు =అలంకారమైనవాడు, అరి=శత్రువులకు, కాలుఁడు=యముడైనవాడును, కరికాలుడు= కరికాలుడను మహా శివభక్తుడు, ధరణీధర పత్ని=భూమిని భరించు ఆ రాజు భార్య యొక్క, మనసు=హృదయమును, దైన్యము=దీనత యందు, ముంచెన్=ముంచెను.

**భావము** :- చోడవంశమున శ్రేష్ఠుడు, శత్రువులకు యముడు మహా శివభక్తుడునైన కరికాలుడను రాజు శ్రీ భీమేశ్వర స్వామి యనుమతితో మోక్షమును కోరి తన భార్యను దీనత యందు ముంచివేసెను.

**విశేషము**:- చూడుడు భీమ. 1-58.

సీ॥ గజ చర్మ మెన్నఁడో కాని నిచ్చలు గట్టు
 పసిఁడి కమ్ముల పట్టు పచ్చడంబుఁ
భసిత మెన్నఁడో కాని ప్రతిదినంబున యందు
 మలయజంబు కురంగ మదము గూర్చు
నిడుద పాములరాజు తొడవు లెన్నడొ కాని
 తార హారములు నిత్యము ధరించు
నృకరంకరుండమాలిక లెన్నఁడో కాని
 ధరియించు కహ్లారదామ మెపుడు

తే॥ కాటనడుచక్కి నెన్నఁడో కాని యుండు
దక్షవాటి సువర్ణ సౌధముల మీఁద
నెన్నఁడొ పిశాచులను గాని యిందు ముఖుల
నెల్లకాలంబుఁ దలఁచు భీమేశ్వరుండు. 116

అర్థము :- భీమేశ్వరుండు=శ్రీ భీమేశ్వర స్వామి, గజచర్మము=ఏనుగు తోలును, ఎన్నడొ కాని=ఎప్పుడో గాని, నిచ్చలు=ఎల్లపుడును, పసిడికమ్ముల=బంగారపు అంచులు గల, పట్టుపచ్చడంబున్= పట్టు వస్త్రమునే, కట్టున్=ధరించును;

భసితము=విబూది, ఎన్నఁడొకాని=ఎపుడోకాని, ప్రతిదినంబున యందు=ప్రతిదినము, మలయజంబు=గంధమును, కురంగమదమున్=శ్రేష్ఠమైన కస్తూరిని, కూర్చున్=అలంకరించుకొనును;

నిడుద=పొడవైన, పాముల రాజు=సర్పరాజగు వాసుకి అనెడి, తొడవులు= అలంకారములు, ఎన్నఁడొ కాని=ఎప్పుడోగాని, నిత్యము=ప్రతిదినము, తారహారములు= ముత్యాల దండలనే, ధరించున్=తాల్చును;

నృ=మానవుల, కరంక రుండ=కొబ్బరి కాయలవంటి శిరస్సుల, మాలికలు=దండలు, ఎన్నఁడో కాని, ఎపుడు=ఎల్లప్పుడు, కహ్లారదామము=కలువల పద్మముల మాలను, ధరియించు=తాల్చును;

కాటనడు చక్కి=శ్మశానము యొక్క మధ్య ప్రదేశము నందు, ఎన్నఁడో కాని=ఎపుడో గాని, దక్షారామ=దక్షారామము నందలి, సువర్ణ సౌధముల మీఁద=బంగరు మేడలపైన, ఉండున్=నివసించును, పిశాచులన్=పిశాచములను, ఎన్నఁడో కాని=ఏనాడో కాని,

ఎల్లకాలంబు=అన్ని వేళలందును, ఇందుముఖులన్=చంద్రబింబాననలైన సుందరీ మణులను, తలఁచున్=భావించును.

భావము :- దక్షారామము నందలి శ్రీ భీమేశ్వర స్వామి ఏనుగు తోలునెపుడో గాని ఎల్లవేళలందును బంగరు జరీ పట్టు వస్త్రములనే ధరించును. విబూది పుండ్రముల నెపుడో గాని నిత్యమును మంచి గంధము, కస్తూరి పుండ్రములనే అలంకరించు కొనును. పొడవైన సర్పరాజులను ఆభరణములుగ నెన్నడో గాని నిత్యము మంచి ముత్యాల హారములనే ధరించును. కొబ్బరికాయల వంటి నరుల పుఱ్ఱెల నెన్నడో గాని ప్రతి దినమును పద్మముల కలువల మాలలనే అలంకరించుకొనును. శ్మశానవాస మెన్నడోగాని నిత్యమును దక్షారామ నగరము నందలి బంగరు మేడల యందే నివసించును. పిశాచముల నెన్నడో గాని యెల్ల కాలము సుందరీమణులనే తలంచును.

విశేషము :- శ్రీ భీమేశ్వర స్వామికి నిత్యము అభిషేకము చేసి బంగరు తొడుగు నలంకరింతురు. అదియే పసిడికమ్ముల పట్టు పచ్చడము. భీమేశ్వర లింగమునకు గంధము, కస్తూరి పూయుదురు. తారహారము లలంకరింతురు. కల్హార పుష్పములతో పూజింతురు. దేవదాసీలే యిందు ముఖులు. ఆయన ఆలయమే మేడ. అది సువర్ణమయము. కనుక సువర్ణ సౌధము.

ఇది భీమేశ్వర స్వామి ఆలయములోని స్థానిక విశేషము.

ఇటువంటి వర్ణనము కల పద్యము హర విలాసమున (5-6) కలదు.

**జములపాములతోడి సాకతం బొల్లక**
**సవరించు బంగారు జన్నిదములు.**
**పచ్చ యేనిక తోలు పచ్చడంబుఁద్యజించి**
**గడితంపుఁ బట్టుఁ బచ్చడముఁ గట్టు**
**భస్మాంగరాగంబు పనికట్టువడఁ జేసి**
**కస్తూరితోడ శ్రీ గంధ మలఁదు**
**నస్థి మాల్యములపై ననురక్తి వర్జించి**
**రమణీయ తారహారములు తాల్చు**
**జడలు బాగడఁ జొళ్లెంబు సంతరించి**
**లేఁత రిక్కల రాయుఁ గీలించు నందు**
**మంచు గుబ్బలియింట సమ్మదము మీఱ**
**మనువు గుడువంగ నున్నప్డు మదనవైరి**

సీ॥ ఒకవేళ ధరియించు యువనాశ్వుఁడిచ్చిన
కట్టాణి ముత్యాల కంఠమాల
మాంధాతృఁడిచ్చిన మాణిక్యఖచిత కే
యూరంబు ధరియించు నొక్కవేళ
నిక్ష్వాకుఁడిచ్చిన హీరాంకురంబుల
యుంగరంబు ధరించు నొక్కవేళ
ఘన చక్రవర్తి యిచ్చిన ప్రవాళంబుల
యొడ్డాణంబు ధరించు నొక్కవేళ
తే॥ వేడ్క ధరియించు నొక్కొక్క వేళయందు
భరత దుష్యంత రంతి నాభాగ నహుష
నల భగీరథ నృగ మహీనాథ దత్త
హేమ మణి భూషణములు భీమేశ్వరుండు. 117

అర్థము :- భీమేశ్వరుండు=శ్రీ భీమేశ్వరస్వామి, ఒకవేళ=ఒక సమయమున, యువనాశ్వుఁడు=యువనాశ్వుడను రాజు, ఇచ్చిన=సమర్పించిన, కట్టాణి=మిక్కిలి గుండ్రనై మేలు జాతివైన, ముత్యాల=ముత్యములతో కూర్చిన, కంఠమాల=మెడయందు అలంకరించు కొను దండను, ధరియించున్=ధరించును;

ఒక్కవేళ=ఒక సమయమున, మాంధాతృఁడు=మాంధాతయను రాజు, ఇచ్చిన=సమర్పించిన, మాణిక్య ఖచిత=కెంపులు పొదిగిన, కేయూరంబు=భుజ కీర్తి అను ఆభరణ మును, ధరియించున్=తాల్చును;

ఒక్కవేళ=ఒక సమయమున, ఇక్ష్వాకుఁడు=ఇక్ష్వాకువు అను రాజు, ఇచ్చిన=కానుక చేసిన, హీరాంకురంబుల=తెల్లని రత్నపు మొలకలు పొదిగిన, ఉంగరంబు=వ్రేలి యుంగరమును, ధరించున్=తాల్చును;

ఒక్కవేళ=ఒక సమయమున, ఘన చక్రవర్తి=ఘనుడను చక్రవర్తి, ఇచ్చిన=కానుకగ ఇచ్చిన, ప్రవాళంబుల=పగడములు పొదిగిన, ఒడ్డాణము=బిళ్ళల మొలత్రాడు, ధరించున్= అలంకరించుకొనును;

ఒక్కొక్క వేళయందు=ఒక్కొక్క సమయమున, వేడ్కన్=కోరికతో, భరత=భరతుడను రాజు, దుష్యంత=దుష్యంతుడను రాజు, రంతి=రంతి దేవుడను రాజు, నాభాగ=నాభాగుడను రాజు, నహుష=నహుషుడను రాజు, నల=నలుడను మహారాజు, భగీరథ=భగీరథుడను రాజు,

నృగ=నృగుడను రాజు, మొదలయిన, మహీనాథ=రాజులచే, దత్త=ఈయబడిన, హేమ మణిభూషణములు=మణులు పొదిగిన బంగరు ఆభరణములను, ధరియించున్= అలంకరించుకొనును.

భావము :- శ్రీ భీమేశ్వరస్వామి ఒక వేళయందు యువనాశ్వుడిచ్చిన ముత్యాలమాల ధరించును. ఒకసారి మాంధాత కానుక చేసిన మాణిక్యములు పొదిగిన భుజకీర్తిని ధరించును. ఒక్కొక్క సమయమున ఇక్ష్వాకువు సమర్పించిన తెల్ల రత్నముల రవ్వల యుంగరమును తాల్చును. ఒక సమయమున ఘన చక్రవర్తి సమర్పించిన ప్రవాళముల ఒడ్డాణమును ధరించును. ఒక్కొక్క వేళయందు భరతుడు, దుష్యంతుడు, రంతిదేవుడు, నాభాగుడు, నహుషుడు, నలుడు, భగీరథుడు, నృగుడను మహారాజులు సమర్పించిన మణులు పొదిగిన బంగరు ఆభరణములను అలంకరించుకొనును.

విశేషము :- 1. యువనాశ్వుఁడు : ఇక్ష్వాకు వంశీయుడు. మాంధాత చక్రవర్తికి తండ్రి. సుద్యుమ్నుని పుత్రుడు. ప్రచుర దక్షిణలనిచ్చి వేయి అశ్వమేధ యాగములు చేసినవాడు.

2. మాంధాత :- ఇక్ష్వాకు వంశీయుడు. యువనాశ్వుని పుత్రుడు.

3. ఇక్ష్వాకువు :- వైవస్వత మనువునకు పుత్రుడు. సూర్యపుత్రుడనియు, ఇతని వంశము సూర్య వంశమనియు ప్రసిద్ధి చెందెను.

4. ఘన చక్రవర్తి :- ఘనమనగా మేఘము, వాని చక్రవర్తి ఇంద్రుడు కానోపు.

5. భరతుఁడు :- ప్రాచీన వాఙ్మయమున ఈ పేరుగల వారనేకులు కలరు. 1. శకుంతలా దుష్యంతుల కుమారుడు, 2. దశరథ కుమారుడు, 3. ఋషభుని కుమారుడు.

6. దుష్యంతుఁడు :- రథంతరీ ఇలు(రైభ్యు)ల కుమారుడు. శకుంతల భర్త.

7. రంతిదేవుఁడు :- సంకృతి రాజపుత్రుడు. ఈయన మహాదాత.

8. నాభాగుఁడు :- వైవస్వతమను పుత్రుడు. ఏడు దినములలో భూమిని జయించెను. యాగ దక్షిణగ రాజ్యమంతటిని దానము చేసెను. సత్యముతో ఉత్తమ లోకములను పొందెను.

9. నహుషుఁడు:- స్వర్భాను కుమారి ఆయువు అను దంపతుల పుత్రుడు.

10. నలుఁడు :- నిషధదేశపు రాజు. వీరసేనుని పుత్రుడు. దమయంతీ భర్త.

11. భగీరథుఁడు :- ఇక్ష్వాకు వంశీయుడు. దిలీప మహారాజు కుమారుడు.

12. నృగుఁడు :- ఇక్ష్వాకుని పుత్రుడు.

**వ॥ వెండియు భీమేశ్వరుండు పండువు పండువు నఖండ విభవంబున నాఖండలాది విబుధ మండలంబు పరివేష్టింపఁ జలిగొండరాచూలియుం దానును**

- మార్తాండ చంద్ర మండలంబు వలనను, బాలసముద్రంబు వలనను, మధుకైట భారి యూరు కాండంబు వలనను, గృపీటభవ జ్వాలా జాలంబు వలనను, గంధర్వ సార్వభౌము వలనను బ్రభవించి, కంతు కుంతంబులనఁ గాముతోమరంబు లన, మదను ముద్గరంబులన, శంబరారి కఠారంబులన, నంగభవుకొంగవాలులన, సిరిపట్టి సెలకట్టియలన, వలరాజు భిండివాలంబులనఁ దళతళంబొలయు తొలకరి మెఱుంగు మొలకలఁగలకలనగు కలికి తెలిగన్నుఁగవయును, జక్కవ కవలఁపెక్కువలుదక్కువ పఱచుచుఁగ్రిక్కిఱిసిన మెఱుంగు నిబ్బరంపు గబ్బి గుబ్బ చన్నులును, మిల మిలని జిలుఁగు వలిపంపు వలువల పొరల యెడల వెలువడి కేలి గడలుకొను పసిమిగల పసిండి తగటునుం దెగడు నునుఁదొడల జిగియును, బగడంపుఁ జిగురుటధరముల తుదలనిగుడుచుఁ జిఱుదినగవులు బిగియనగినం దెగిపడియెడినను వడువున నడుగడుగునకు వడవడ వడంకుచుం బిడికిట నడంగు నడుముల బెడంగునుం గల్గి, ఘుగఘుగం గురంగనాభి సౌరభ సారంబుల తోడంగూడి సంకుమదపంక పరిమళంబుల జంకించు కర్పూర వాసనా సముల్లాసంబును; గర్పూర వాసనా సముల్లాసంబు నుల్లసంబాడు కాలాగురు కర్దమామోదంబుననుంబునుంగు పసంబిసాళించు గొజ్జంగి నీటి నెత్తావియును, గొజ్జంగి నీటి నెత్తావిఁబిత్తరించు గందవడి పొలుపును, గందవడి పొలుపునుం గ్రుమ్మరించు ధమ్మిల్ల మల్లికా హల్లక వకుళ వాసంతికా జాతి కేతకీ కుంద కుసుమ గంధంబులును, నిఖిల దిక్సంధి బంధంబుతో బాంధవంబనుసంధింప, నిలింప గంధర్వాప్సరో జాతులగు సానికూఁతులు గొలువ; జగనొబ్బగండ, జగద గోపాల, పల్లవాదిత్య, పల్లవ త్రినేత్ర, కేళాదిరాయ, రాయవేశ్యా భుజంగ బిరుదాభిరామాల్లయ వేమభూపాల రాజ్యభారధురంధరుండైన బెండపూఁడన్నయామాత్యుఁడు గట్టించిన మొగసాల వాకిటి మహోత్సవ మంటపంబునందుఁబేరోలగంబుండి కుండలీ, దండలాసక, ప్రేరణీ, ప్రేంఖణ, సింధు, కందుక, ధమాళి, చేల, మత్తల్లీ, హల్లీసకాది నృత్యంబులవలోకించుచుఁ, బంతంబు లవధరించుచు, మేలంబులాలకించుచుఁ జంపూ చాటు నాట కోదాహరణ జయఘోష చక్రవాళ చతుర్భద్ర చతురాది ప్రబంధంబు లాకర్ణించుచు, వేణువీణా మృదంగ కాంస్య కాహళ పటహ ఢక్కాహుడుక్కానక, ఝల్లరీ హృద్య వాద్యానుషంగంబు లాదరించుచు; సంగీత భంగీ తరంగంబు లంగీకరించుచు,

నిగమంబులు గ్రహించుచుఁ, బురాణంబులు వినుచు నితిహాసంబు లిచ్ఛగించుచుఁదర్కంబులు వితర్కించుచు నాగమంబులు పరీక్షించుచు, నిఖిలలోక రక్షణార్థంబుగా వివిధ విద్యా కలాపంబుల వినోదించుచుండ. 118.

అర్థము :- వెండియు=మరియు, భీమేశ్వరుండు=శ్రీ భీమేశ్వర స్వామి, పండువు పండువున్=ప్రతి పండుగ దినమందును, అఖండ విభవంబున=సంపూర్ణ వైభవముతో, ఆఖండల=ఇంద్రుడు, ఆది=మొదలయిన, విబుధ మండలంబు=దేవతల సమూహము, పరివేష్టింపన్=చుట్టువారి యుండగా, చలిగొండరాచూలియున్=హిమవంతుని పుత్రికయైన పార్వతియు, తానును=తానైన శ్రీ భీమేశ్వర స్వామియు;

మార్తాండ=సూర్యుని, చంద్ర=చంద్రుని, మండలంబు వలనను=గోళముల నుండియు, పాల సముద్రంబు వలనను=పాల సముద్రము నుండియు, మధుకైటభ+అరి= విష్ణువు యొక్క, ఊరుకాండంబు వలనను=తొడ అనెడి భాగము నుండియు, కృపీటభవ=నీటి నుండి పుట్టిన అగ్ని యొక్క, జ్వాలా జాలంబు వలనను=మంటల సమూహము నుండియు; గంధర్వ సార్వభౌము వలనను=గంధర్వులకు రారాజైన చిత్రసేనుని వలనను, ప్రభవించి=పుట్టి; కంతు=మన్మథుని, కుంతంబులనన్=బల్లెములన్నట్లుగ, కాము=మన్మథుని, తోమరంబులనన్ =చిల్లకోలలన్నట్లుగ, మదన=మన్మథుని, ముద్గరంబులనన్=గదలన్నట్లుగ, శంబరారి= మన్మథుని, కఠారంబులనన్=కత్తులన్నట్లుగ, అంగభవు=మదనుని, కొంగవాలులనన్=వంపు కత్తులన్నట్లుగ, సిరిపట్టి=మదనుని, సెలకట్టియలనన్=బాణములన్నట్లుగ, వలరాజు= మన్మథుని, భిండివాలంబులనన్= ఇనుప మొన గల ఆయుధములన్నట్లుగ, తళతళన్= తళతళమని, పొలయు=ప్రసరించు, తొలకరి మెఱుంగు=వర్షకాల ప్రారంభపు మెఱుపుల యొక్క, మొలకలన్=అంకురముల వలె, కలకల నగు=కలకలమని నవ్వు, కలికి=మనోజ్ఞమైన, తెలికన్నుగవయును=తెల్లని కన్నుల జంటయును, జక్కవ కవలన్=చక్రవాక పక్షి జంటలను, తక్కువ పఱచుచు=చులకన చేయుచు, క్రిక్కిఱిసిన=ఎడము లేక వ్యాపించిన, మెఱుంగు నిబ్బరంబు=కాంతి యొక్క విరివిగల, గుబ్బచన్నులును=గుండ్రని చన్నులును, మిలమిలని= మిలమిల మెరయు, జిలుఁగు=కాంతులుకల, వలిపెంపు=పలుచని, వలువల పొరలన్=పొరల వంటి వస్త్రములు, ఎడలన్=తొలగగా, వెలువడి=బయటకు వచ్చి, కేలి=విలాసముగ, కడలు కొను=వ్యాపించు, పసిమిగల=పచ్చదనముగల, పసిండి తగటునున్=బంగరు జరీని, తెగడు=తిరస్కరించు, నును తొడల=నున్నని తొడల యొక్క, జిగియునున్=అందమును; పగడంపు=పగడముల వంటి, చిగురు+అధరముల=లేత క్రింది పెదవుల యొక్క, తుదలన్=చివరలందు, నిగుడుచు=వ్యాపించు, చిఱుతనగవులు=లేత నవ్వులు; బిగియ

నగినన్=పెద్దగ నవ్వినచో, తెగిపడియెడినను=తెగిపడిపోవునో అన్న, వడువునన్=పద్ధతిగా, అడుగడుగునకు=మాటి మాటికి, వడవడ వడంకుచున్=గడగడ వణకుచు, పిడికిటన్+ అడంగు=పిడికిట యిముడగల, నడుముల=నడుముల యొక్క, బెడంగునున్= చక్కదనమును, కల్గి=కల్గియుండి; ఘుగఘుగన్=ఘుగఘుగమని వ్యాపించు, కురంగ నాభి=కస్తూరి యొక్క, సౌరభ సారంబుల తోడన్=శ్రేష్ఠమగు సువాసనలతో, కూడి=కలసి, సంకుమదపంక= బురదవలెనైన జవ్వాది యొక్క, పరిమళంబులన్=సువాసనలను, జంకించు=భయపెట్టు, కర్పూరవాసనా=కర్పూర వాసన యొక్క; సముల్లాసంబును=మిక్కిలి దీప్తియు; కర్పూర వాసనా=ఆ కర్పూరపు సువాసనల, సముల్లాసంబును=మిక్కిలి దీప్తిని, ఉల్లసంబాడు= పరిహసించు, కాల+అగురు+కర్దమ=నల్లని అగురుతో చేసిన పరిమళ ద్రవ్యపు బురద యొక్క, ఆమోదంబునున్=పరిమళమును, పునుంగు=పునుగు అను సుగంధ ద్రవ్యము యొక్క, పసన్=సత్తాను(వాసనను), పిసాళించు=పరిహసించు, గొజ్జంగి నీటి=గొజ్జంగి పూలతో తయారైన పన్నీటి యొక్క, నెత్తావియును=నిండు పరిమళమును; గొజ్జంగి నీటి నెత్తావిన్=ఆ పన్నీటి నిండు పరిమళమును, బిత్తరించు=అతిశయించు, గందవడి=గంధపు పొడి యొక్క, పొలుపునన్=వాసన, క్రుమ్మరించు=మిక్కిలిగ వెలిగ్రక్కునట్టి, ధమ్మిల్ల=కొప్పులందలి, మల్లికా= మల్లె, హల్లక=చెంగలువ, వకుళ=పొగడ, వాసంతికా=అడవి మొల్ల, జాతి=జాజి, కేతకి=పచ్చమొగలి, కుంద=గన్నేరు, కుసుమ=పూవుల యొక్క, గంధంబులునున్= వాసనలును, నిఖిలదిక్=అన్ని దిక్కుల, సంధిబంధంబుతోన్=కలయికలను ముడులతో, బాంధవంబు=చుట్టరికమును, అనుసంధింపన్=ఏర్పరచుటకై, నిలింప గంధర్వ అప్సర= దేవతల, గంధర్వుల, అప్సరసల, జాతులగు=జాతుల వారగు, సానిపూఁతులు=భోగకాంతలు, కొలువన్=సేవింపగా;

జగనొబ్బగండ='జగనొబ్బగండ'యనియు, జగదగోపాల='జగద గోపాల'యనియు, పల్లవాదిత్య='పల్లవాదిత్య'యనియు, పల్లవత్రినేత్ర='పల్లవత్రినేత్ర'యనియు, కేళాదిరాయ='కేళాదిరాయ'అనియు, రాయవేశ్యా భుజంగ='రాయవేశ్యా భుజంగ'యనియు, బిరుద=బిరుదములతో, అభిరామంబై=మనోహరమై, అల్లయ వేమ భూపాల=అల్లాడ నృపతికి కుమారుడైన వేమ భూపాలుని యొక్క, రాజ్యభార=రాజ్యము యొక్క బరువును, ధురంధరుండై =సమర్థముగ భరించినవాడై, బెండపూఁడి+అన్నయామాత్యుండు=బెండపూడి అన్నయ మంత్రి, కట్టించిన=కట్టించిన, మొగసాల వాకిటి=ముఖద్వారమునకు సమీపమునందలి, మహా=గొప్ప, ఉత్సవమండపంబునందున్=ఉత్సవ మంటపమునందు, పేరోలగంబుండి= మహాసభయందుండి;

కుండలీ=కుండలియను పేరుగల నృత్యము, దండలాసక=కోలాటము, ప్రేరణి=

ప్రేరణియను పేరుగల, ప్రేంఖణ=ప్రేంఖణమను పేరుగల, సింధు=సింధువను పేరుగల, కందుక=కందుకమను పేరుగల, ధమాళి=ధమాళియను పేరుగల, చేల=చేల అను పేరుగల, మత్తల్లీ=మత్తల్లియను పేరుగల, హల్లీసక=హల్లీసకమను పేరుగల, ఆది=మొదలైన, నృత్యంబులు=నాట్యములు, అవలోకించుచు=చూచుచు, పంతంబులు= పోటీలను, అవధరించుచు=ఏకాగ్రతతో చూచుచు, మేలంబులు=పరిహాసములను, ఆలకించుచు= వినుచు, చంపూ=గద్యపద్యాత్మకములు, చాటు=హర్షదాయక పద్యములు కలవి, నాటకములు, ఉదాహరణ=ఉదాహరణమను రూపక భేదమును, జయఘోష= జయఘోషయనెడి, చక్రవాళ=చక్రవాళయనెడి, చతుర్భద్ర=చతుర్భద్రమనెడి, చతురాతి=చతురాతియనెడి, ప్రబంధములు=కావ్యములను, ఆకర్ణించుచు=వినుచు, వేణు=వేణువుల యొక్క, వీణా= వీణల యొక్క, మృదంగ=మృదంగ వాద్యముల యొక్క, కాంస్య=కంచుఢక్కల యొక్క, కాహళ=బాకాల యొక్క, పటహ=తప్పెటల యొక్క, ఢక్కా=ఢంకల యొక్క, హుడుక్క= చక్కియను చర్మవాద్య విశేషముల యొక్క, ఆనక=భేరిల యొక్క, ఝల్లరీ=మద్దెలలు అనెడి, హృద్యవాద్య=మనోహరములైన వాద్యముల యొక్క, అనుషంగంబులు=కలయికలను, ఆదరించుచు=మన్నించుచు; సంగీతభంగీ=సంగీత గతులలోని, తరంగంబులు=భేద భాగములను, అంగీకరించుచు=గ్రహించుచు, నిగమంబులు=వేదములను, గ్రహించుచు= తెలిసి కొనుచు, పురాణంబులు వినుచు=పురాణములను వినుచును, ఇతిహాసంబులు= పరంపరగా చెప్పుకొను పూర్వకథలను, ఇచ్ఛగించుచు=ఇష్టపడుచు, తర్కంబులు=తర్కశాస్త్ర విషయములను, వితర్కించుచు=చర్చించుచు, ఆగమంబులు=శాస్త్రములను, పరీక్షించుచు= పరిశీలించుచు; నిఖిలలోక=అన్ని లోకములను, రక్షణార్థంబుగాన్=రక్షించుట కొరకై, వివిధ విద్యా=అనేకములైన విద్యల యొక్క, కలాపంబులన్=సమూహములతో, వినోదించుచుండు= ఆనందించుచుండును.

భావము :- ఇంకను ప్రతిపర్వదినమునందును శ్రీ భీమేశ్వరస్వామి సర్వాలంకార శోభితుడై పార్వతీ సహితుడై శోభించుచుండును. ఇంద్రాది దేవతలు చుట్టు చేరియుందురు. సూర్యచంద్ర గోళముల నుండి, పాల సముద్రము నుండి, విష్ణుమూర్తి తొడనుండి, అగ్నిజ్వాలల నుండి, గంధర్వ సార్వభౌముని నుండి పుట్టిన దేవ గంధర్వ అప్సరో జాతి కాంతలు దక్షారామమున భోగకాంతలై పుట్టిరి. వారు మన్మథ బాణముల వలె సుందరీమణులు. తొలకరి మెఱుపు మొలకల వంటి తెల్లని విశాలమైన కనుజంటలు, ఎడతెరిపిలేక పెరిగిన పెద్దగట్టి గుండ్రని చనుజంటలు కల్గియుండిరి. మెరయుచున్న పలుచని బంగరు జరీ పట్టు వస్త్రములు ధరించియుండిరి. అవి గాలికి తొలగగా బంగరు జరీని మించిన పసిమిఛాయగల నునుపైన తొడలు, పగడముల వంటి అధరములు, ఆ క్రింది పెదవుల

చివరన అంకురించు చిరునగవులు, పెద్దగ నవ్వినచో తెగిపడునేమో యన్నట్లున్న సన్నని నడుములు, వారు శరీరములపై అలదుకొన్న కస్తూరి వాసనలతోడి జవ్వాజి పరిమళ ద్రవ్యపు లేపనము యొక్క సువాసనలు, ఆ వాసనలను మించిన కర్పూర వాసనలు, ఆ కర్పూర సువాసనలను మించిన నల్లని అగురు ద్రవ్యపు సువాసనలు, ఆ సువాసనలను మించిన పన్నీటి సువాసనలు, వానిని మించిన గంధపు పొడి పరిమళము, ఆ గంధపు పొడి సువాసనలను మించి వారు తమ కొప్పులందలంకరించుకొనిన మల్లె, చెంగల్వ, పొగడ, మొల్ల, జాజి, పచ్చ మొగలి, గన్నేరు పూల సువాసనలు గుబాళించుచున్నవి. సమస్తమైన బ్రహ్మాండముతో సంబంధమును భావించుటకై ఆ దేవ గంధర్వ అప్సర జాతివారలైన ఆ భోగకాంతలు శ్రీ భీమేశ్వరస్వామిని సేవించుచుందురు

జగనొబ్బగండ, జగదగోపాల, పల్లవాదిత్య, పల్లవత్రినేత్ర, కేళాదిరాయ, రాయవేశ్యా భుజంగ - అనెడి బిరుదు నామములుగల వేమ భూపాలుని రాజ్య రక్షణ భారమును వహించిన బెండపూడి అన్నయ మంత్రి భీమేశ్వరాలయ ముఖద్వార సమీపమున గొప్ప ఉత్సవ మంటపమును కట్టించెను. ఆ మంటపమున పార్వతీ సహితుడైన శ్రీ భీమేశ్వరస్వామి కొలువుదీరియుండి ఆ భోగకాంతలు చేయుచుండు కుండలి, దండలాసక, ప్రేరణి, ప్రేంఖణ, సింధు, కందక, ధమాళి, చేల, మత్తల్లి, హల్లీసకము అను నృత్య విశేషములను చూచు చుండును. నృత్యరీతుల యందలి వారిలోని పోటీలను గమనించుచు, పరిహాసములను గమనించుచు, వారు గానము చేయుచు నటించు, చంపూ, చాటు, నాటక, ఉదాహరణ, జయఘోష, చక్రవాళ, చతుర్భద్ర, చతురాతి మొదలగు ప్రబంధములను వినుచు, వారి నృత్యగానముల కనువుగ మ్రోగుచున్న వీణ, వేణు, మృదంగాది వాద్యముల మధుర శబ్దములను వినుచు అందలి సంగీత సంగతుల నంగీకరించుచుండును. వేదముల గ్రహించుచు, పురాణములను వినుచు, ఇతిహాసముల నిష్టపడుచు, తర్కశాస్త్ర విషయములను చర్చించుచు, శాస్త్రములను పరిశీలించుచు సర్వలోక రక్షణార్థముగ సర్వవిద్యా సమూహము లతో ప్రొద్దుపుచ్చుచుండును.

**క॥ ఏతాదృశ ప్రభావో**
**పేతుండగు దక్షవాటి భీమేశ్వరు వి**
**ఖ్యాత కథ చెప్పెదను శుక**
**తాత కృత పురాణ సరణి తప్పక యుండన్. 119**

**అర్థము :-** ఏతాదృశ=ఇటువంటి, ప్రభావ=మహిమలతో, ఉపేతుండగు=కూడిన వాడైన, దక్షవాటి=దక్షారామమునందలి, భీమేశ్వరు=శ్రీ భీమేశ్వరస్వామి యొక్క, విఖ్యాత

కథ=ప్రసిద్ధమైన చరిత్రమును, శుకతాత=శుక మహర్షికి తండ్రియైన వ్యాసునిచే, కృత=రచింపబడిన, పురాణ సరణి=పురాణమునందలి మార్గము, తప్పకయుండన్= వీడకుండగ, చెప్పెదన్=వివరించెదను.

భావము :- ఇట్టి మహామహిమాన్వితుడైన దక్షారామ భీమేశ్వరుని ప్రసిద్ధ చరిత్రమును - వేదవ్యాసునిచే రచింపబడిన పురాణమునందలి మార్గమును వీడకుండ వివరించెను.

## కథా ప్రారంభము

వ॥ ఇమ్మహాపురాణంబునకుఁగథాక్రమంబెట్టిదనిన :- నైమిశారణ్య పుణ్య క్షేత్రంబున ద్వాదశ వార్షికంబైన దీర్ఘసత్రంబు ప్రవర్తిల్లుచుండఁగులపతి శౌనకుండను పరమ ఋషి మొదలుగాఁగల సంయమీశ్వరులు యదృచ్ఛా సమాగతుఁడయిన రోమహర్షణ పుత్రుఁబాదరాయణ ప్రియ శిష్యుఁబౌరాణికు సూత్యాహసంభవు సూతు నర్చించి యతని వలనను పంచాశత్ఖండ మండితంబును బహు సంహితా సమాకీర్ణం బును, సపాదలక్ష గ్రంథ సంఖ్యా సమన్వితంబును నైన స్కాంద పురాణంబు విను వారును నందుఁబూర్వఖండంబునం బారాశర్యుండు నిజాపరాధంబు గారణంబుగా విశ్వనాథుచేత నధిక్షేపింపంబడి వారణాసి వెల్వడియెనని విన్న వారగుటంజేసి యట మీఁది వృత్తాంతంబు విను వేడుక నమ్మునీంద్రు నభినందించి యిట్లనిరి. 120

అర్థము :- ఈ+మహా=ఈ గొప్ప, ప్రబంధంబునకున్=కావ్యమునకు, కథాక్రమంబు=కథారీతి, ఎట్టిదనినన్=ఎటువంటిదన్నచో, నైమిశ+అరణ్య=నైమిశమనెడి అడవియను, పుణ్యక్షేత్రంబున=పవిత్ర స్థలమున, ద్వాదశ వార్షికంబైన=పండ్రెండు సంవత్సరములపాటు జరుగునదైన, దీర్ఘ సత్రంబు=దీర్ఘసత్రమనెడి యాగము, ప్రవర్తిల్లుచుండన్=జరుగుచుండగా, కులపతి=పదివేలమంది శిష్యులను అన్నదానాదులచే పోషించుచు అధ్యయనము చేయించు బ్రహ్మర్షియైన, శౌనకుండు=శౌనకుడు అను, పరమ ఋషి=మహర్షి, మొదలుగాన్=మొదలైన, సంయమీశ్వరులు=మునిశ్రేష్ఠులు, యదృచ్ఛా=తలవని తలంపుగా, సమాగతుఁడైన=విచ్చేసిన, రోమ హర్షణ పుత్రున్=రోమ హర్షణుడను మునికి కుమారుడును, బాదరాయణ ప్రియ శిష్యున్=వ్యాస మహర్షికి ప్రియ శిష్యుడును, పౌరాణికున్=పురాణములు చెప్పు నేర్పు కలవాడును, సూత్య+అహస్+సంభవున్=సూత్య అను యాగము జరుగు దినమున పుట్టినవాడు, సూతున్=సూత మహర్షిని, అర్చించి=పూజించి, అతని వలనన్=ఆ సూతముని నుండి, పంచాశత్=ఏబది, ఖండ=భాగములతో, మండితంబును=కూడినదియు, బహు=అనేక, సంహితా=ఉత్తమ విషయములు గలవానితో, సమాకీర్ణంబును=మిక్కిలిగ పెనవేసికొని

యున్నదియు, సపాదలక్ష=ఒక లక్ష ఇరువది యైదువేల, గ్రంథ సంఖ్యా=శ్లోకముల సమూహముతో, సమన్వితంబునునైన=కూడియున్నదియు ఐన, స్కాందపురాణంబు=స్కాందమను పేరుగల పురాణమును, వినువారును=వినుచుండిరి. అందు=అ స్కాంద పురాణమునందు, పూర్వఖండంబునన్=మొదటి భాగమునందు, పారాశర్యుండు=వ్యాసుడు, నిజ=తన, అపరాధంబు తప్పు, కారణంబుగా=నిమిత్తముగ, విశ్వనాథుచేత=శ్రీ కాశీవిశ్వనాథునిచేత, అధిక్షేపింపఁబడి=ఆక్షేపింపబడి, వారణాసి=కాశీనగరము నుండి, వెల్వడియెన్=బయటకు వచ్చెను. అని=అని చెప్పగా, విన్నవారగుటంజేసి=వినిన వారగుటచేత, అటమీఁది=ఆ తర్వాతి, వృత్తాంతంబు=విషయమును, విను వేడుకన్=వినెడి కుతూహలముతో, ఆ+మునీంద్రున్=ఆ సూత మహర్షిని, అభినందించి=మిక్కిలిగ కొనియాడి, ఇట్లనిరి=ఈవిధముగ పల్కిరి.

భావము :- ఈ గొప్ప కావ్యమునకు కథాక్రమ మెటువంటిదన్నచో : నైమిశారణ్యమను పవిత్ర ప్రదేశమున పంఁడ్రెండు సంవత్సరములపాటు సత్రయాగము జరుగుచున్నది. కులపతులైన శౌనకాది మహర్షులెందరో వచ్చిరి. తలవని తలంపుగ సూత మహర్షియు వచ్చెను. ఆ సూతముని రోమహర్షణమునికి పుత్రుడు. వేదవ్యాసుని ప్రియశిష్యుడు. పురాణ కథలు చెప్పుటలో దిట్ట. శౌనకాది మహర్షులందరు సూతమునిని సేవించిరి. స్కాందపురాణమును చెప్పుమని ప్రార్థించిరి. ఆ స్కాందపురాణము శివసంబంధమైనది. అనేకానేక ఉత్తమ విషయములందు కలవు. ఏబది భాగములతో ఒక లక్ష ఇరువదియైదువేల శ్లోకములతో కూడియున్నది. సూత మహర్షి వారి కోరికను మన్నించి స్కాందపురాణమును చెప్పుచుండెను. మొదటి భాగము చెప్పుచు వ్యాసుడు తాను చేసిన తప్పుకు కాశీ విశ్వేశ్వరుని చేత ఆక్షేపింపబడి, కాశీనగరమును వీడి వచ్చెనని చెప్పెను. మునులందరావాక్యమును వినినారు. ఆ సూతమునిని అందరు అభినందించినారు. తరువాతి విషయమును తెలిసికొనుట యందు కుతూహలము కలవారై యీవిధముగ పలికిరి.

**తే॥** **కాశి వెలువడి వచ్చి పరాశరాత్మ**
**జుండు ఖేదంబునొంది శిష్యులునుఁదాను**
**నెచట వసియించె నెచ్చోట నేమిచేసె**
**ననఘ! యేతీర్థమాడె మా కానతిమ్ము.** **121**

**అర్థము** :- అనఘ=పాపములేనివాడా! ఓ సూతమహర్షీ! పరాశర+ఆత్మజుండు=పరాశరమునికి కుమారుడైన వ్యాసుడు, ఖేదంబు నొంది=బాధపడి, కాశి=కాశీనగరమును, వెడలివచ్చి=విడిచివచ్చి, శిష్యులును+తాను=విద్యార్థులును తానును, ఎచట వసియించెన్=ఎక్కడ నివసించెను. ఎచ్చోటన్=ఎక్కడ, ఏమి చేసెన్=ఏమిచేసెను. ఏతీర్థమాడెన్=ఏ పుణ్య తీర్థమున స్నానము చేసెను, మాకు=మాకందరకు, ఆనతిమ్ము= చెప్పుము.

భావము :- పరిశుద్ధుడవైన ఓ సూత మహర్షీ! వ్యాస మహర్షి బాధపడి శిష్యులతో కాశీక్షేత్రమును వదలి వచ్చి ఎక్కడ నివసించెను? ఎక్కడెక్కడ ఏమేమి చేసెను? ఏ పుణ్యతీర్థ స్నానము చేసెను? అదంతయు మాకు దయతో చెప్పుము.

వ॥ అని యడిగిన. 122

అర్థము :- అని=అని, అడిగిన=అడుగగా,

భావము :- అని శౌనకాది మహర్షులు సూత మహర్షినడుగగా.

మ॥ సరసీజాసన వంశమౌక్తిక! కళాసర్వజ్ఞ విజ్ఞాన! శాం
కరి నాథాంఘ్రి సరోజ షట్పద! సమిద్గాండీవ కోదండ! భూ
భరణ ప్రౌఢ భుజాభుజంగ! మహిళాపాంచాల! వేమక్షమా
వర సామ్రాజ్య రమాధురంధర! జగద్వ్యాప్త ప్రతాపోదయా! 123

అర్థము :- సరసీజాసన=బ్రహ్మదేవుని యొక్క, వంశ=వంశమునకు, మౌక్తిక= ముత్యము వంటివాడా! కళా=కళలయందలి, సర్వజ్ఞ=సమస్తము తెలియుట చేత, విజ్ఞాన= విశేష జ్ఞానము కలవాడా! శాంకరినాథ=పార్వతీపతియైన శంకరుని, అంఘ్రి= పాదములనెడి, సరోజ=పద్మములందు, షట్పద=తుమ్మెదయైనవాడా! సమిత్= యుద్ధమునందు, గాండీవ కోదండ=గాండీవమను వింటిని ధరించిన అర్జునుడా! భూభరణ= భూభారమును వహించుట యందు, ప్రౌఢ=దిట్టతనముగల, భుజాభుజంగ=బాహువులనెడి సర్పములు కలవాడా! మహిళాపాంచాల=కాంతల కామపురుషుడా! వేమ క్షమావర= వేమ భూపాలుని యొక్క, సామ్రాజ్యరమా=సామ్రాజ్యలక్ష్మి యొక్క, ధురంధర=భారమును మోయువాడా! జగత్=లోకమును, వ్యాప్త=వ్యాపించిన ప్రతాప=పరాక్రమము యొక్క; ఉదయా=అభివృద్ధి కలవాడా!

భావము :- బ్రహ్మవంశమున పుట్టిన ముత్యమా! పదునాల్గు విద్యలందును విశేష జ్ఞానము కలవాడా! శంకర పాదపద్మములను సేవించువాడా! యుద్ధమునందు అర్జునుడా! భూభారమును వహించుటయందు ప్రౌఢ భుజంగుడా! వేమభూపాలుని రాజ్యలక్ష్మిని సమర్థముగ మోయువాడా! లోకములందు కీర్తిని వ్యాపింపజేసికొని ఉన్నతియందు మేరుపర్వతమైనవాడా! ఓ అన్నయ మంత్రి శేఖరా!

క॥ శ్రీ వీరభద్ర భూపతి
సేవా హేలా కటాక్ష సిద్ధ సమృద్ధ
శ్రీ విభవ పాకశాసన!
భావభవారాతి భక్తి పరతంత్రనిధీ! 124

అర్థము :- శ్రీ....సమృద్ధ. శ్రీ వీరభద్ర భూపతి=శ్రీ వీరభద్రారెడ్డి అను రాజు యొక్క, సేవా హేలా=కొలువు వలన కల్గిన సంతోషముతో కూడిన, కటాక్ష=కడకంటి చూపు వలన, సిద్ధ సమృద్ధ=ఎడతెగని నిండైన, శ్రీ విభవ=మేలైన ఐశ్వర్యమునకు, పాకశాసన= ఇంద్రుడవైనవాడా! భావభవ+అరాతి=మన్మథునకు శత్రువైన శంకరుని, భక్తిపరతంత్ర=భక్తికి లొంగుటయను నిధీ=నిధికలవాడా!

భావము :- వీరభద్ర భూపతికి కొలువుసేయుట వలన కలిగిన ఎడతెగని నిండైన మహైశ్వర్యమున ఇంద్రుడవైనవాడా! శంకర పాదసేవన వశంవదుడవైన మహాశివభక్తుడా! ఓ అన్నయ మంత్రి శేఖరా!

**మాలిని॥ అకుటిలనయమార్గా! యాశ్రితార్థి ప్రవర్గా!**
**సుకృతి సరణిపాంథా! శుద్ధకీర్తి ప్రబంధా!**
**సకల జన విధేయా! శారదా భాగధేయా!**
**ప్రకట సుగుణ సంగా! రాయ వేశ్యాభుజంగా! 125.**

అర్థము :- అకుటిల=కౌటిల్యములేని, నయమార్గా=రాజనీతి యొక్క త్రోవ కలవాడా! ఆశ్రిత=ఆశ్రయించిన, అర్థి=యాచకుల పాలిటి, ప్రవర్గా=విష్ణుమూర్తీ! సుకృతి సరణి=పుణ్యమూర్తుల యొక్క మార్గమునందు, పాంథా=బాటసారియైనవాడా! శుద్ధకీర్తి= పవిత్రమైన యశముతో కూడిన, ప్రబంధా=కావ్యములు(ఎడతెరిపి లేకపోవుట) కలవాడా! సకలజన=ప్రజలందరి యెడల, విధేయా=వినయము కలవాడా! శారదా=సరస్వతీదేవి యొక్క, భాగధేయా=భాగ్యమైనవాడా! ప్రకట సుగుణ=వెల్లడైన మంచి గుణముల యొక్క, సంగా=కలయిక కలవాడా! రాయవేశ్యాభుజంగా=రాజులనెడి వేశ్యలకు మిండమగడైనవాడా! "రాయవేశ్యాభుజంగ" అను బిరుద నామము కలవాడా!

భావము :- మోసములేని ధర్మమార్గ వర్తనుడా! ఆశ్రితుల పాలిటి విష్ణుమూర్తీ! పుణ్యమూర్తుల మార్గము ననుసరించినవాడా! పవిత్రమైన యశస్సుకలవాడా! ప్రజలందరి యెడల వినయముగ ప్రవర్తించువాడా! సరస్వతికి ఐశ్వర్యమైనవాడా! రాయవేశ్యా భుజంగ బిరుదాంచితుడా! ఓ అన్నయ మంత్రి శేఖరా!

విశేషము :- మాలిని వృత్తమునకు "ననమయయ" అనునవి గణములు. తొమ్మిదవ అక్షరము యతి మైత్రి.

**గద్య॥ ఇది శ్రీకమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర సుకవిజన విధేయ శ్రీనాథ నామధేయ ప్రణీతంబైన శ్రీ భీమేశ్వర పురాణంబను మహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసంబు.**

**అర్థము** :- ఇది=ఈ గ్రంథ భాగము, శ్రీ కమలనాభ పౌత్ర=శ్రీ కమలనాభుని మనుమడు, మారయామాత్య పుత్ర=మారయ మంత్రికి కుమారుడు, సుకవిజన=మంచి కవుల సమూహమునకు, విధేయ=అణకువ కలవాడు, శ్రీనాథ నామధేయ=శ్రీనాథుడను పేరుగల వానిచేత, ప్రణీతంబైన=నిర్మింపబడిన, శ్రీ భీమేశ్వర పురాణంబను=శ్రీ భీమేశ్వర పురాణమనెడి, మహా=గొప్ప, ప్రబంధంబునందున్=గద్య పద్యమయమగు చంపూ కావ్యము నందు, ప్రథమ=మొదటి, ఆశ్వాసంబు=భాగము.

**భావము** :- ఇది శ్రీ కమలనాభామాత్యుని మనుమడును, మారయ మంత్రి కుమారుడును, సుకవిజనులకు విధేయుడును నైన శ్రీనాథుడను పేరుగలవాడు రచించిన భీమేశ్వర పురాణమను గొప్ప ప్రబంధమునందు మొదటి ఆశ్వాసము సంపూర్ణము.

ఇది

శ్రీ భీమేశ్వర పురాణ ప్రథమాశ్వాసమునకు

**దక్షిణకాశిక**

అను ప్రతి పదార్థ భావ విశేష సహిత వ్యాఖ్యానము

# శ్రీ భీమేశ్వర పురాణము

## ద్వితీయాశ్వాసము

### దక్షిణ కాశికా వ్యాఖ్యానము

కం॥ శ్రీఖండ ఘుసృణ మకరీ
రేఖాలంకార సుందరీ స్తనయుగ పా
ళీ ఖచిత భుజాంతర విభ
వాఖండల! బెండపూఁడి యన్నామాత్యా! 1

అర్థము :- శ్రీఖండ=చందనము; ఘుసృణ=కుంకుమ పువ్వుల; మకరీ రేఖా+అలంకార=మొసలి ఆకృతిగల రేఖల అలంకారములతోడి; సుందరీ=రూపవతుల; స్తనయుగ=పాలిండ్ల జంటల; పాళీ=అంచులచే; ఖచిత=కూర్పబడిన; భుజ+అంతర=రొమ్ము యొక్క; విభవ=వైభవమునందు; ఆఖండల=ఇంద్రుడా!; బెండపూఁడి అన్న+అమాత్యా!=ఓ బెండపూడి అన్నయ మంత్రీ!

భావము :- చందనము కుంకుమ పువ్వుల మకర రూప రేఖలతో అలంకృతలైన రూపవతుల పాలిండ్ల జంటల అంచులచే కూర్పబడిన రొమ్ముకల భోగము అనుభవించు రసిక శ్రేష్ఠుడా! ఓ! బెండపూడి అన్నయ మంత్రీ!

విశేషము :- మకర రేఖ=మకరికా పత్రము. స్త్రీలకు చెక్కిళ్లపై లత్తుకతో చిత్రించెడు మొసలి ఆకృతికల రేఖ.

కృతి భర్తను సంబోధించు ఆశ్వాసాది పద్యము కంద పద్యమగుచుండును.

వ॥ అక్కథకుండు శౌనకాది మహామునులకుఁజెప్పందొడంగె. 2

అర్థము :- ఆ+కథకుండు=ఆ కథలను చెప్పువాడు=(రోమహర్షుని కుమారుడగు సూతుడు), శౌనక+ఆది మహా మునులకు=శౌనకుడు మొదలైన మహర్షులకు, చెప్పన్+తొడంగెన్=చెప్ప ప్రారంభించెను.

భావము :- రోమహర్షుని పుత్రుడు, వ్యాసుని శిష్యుడు అయిన సూతుడు శౌనకాది మహర్షులకు చెప్ప ప్రారంభించెను.

తే॥ మృడునిచే నిట్లు కోపానఁబడి కలంగి
గంగ దరి నుండి నిజ శిష్య గణము తోడ
మద్గురు స్వామి సకల ధర్మజ్ఞుఁడపుడు
పృథివిఁగల తీర్థముల లెక్క వెట్టి చూచి. 3

అర్థము :- సకల ధర్మజ్ఞుఁడు=సమస్త ధర్మములను తెలిసినవాడు; మద్గురు స్వామి=నా గురుదేవుడైన వ్యాసుడు; ఇట్లు= ఈవిధముగ; మృడునిచే=శివునిచే; కోపానన్+పడి=కోపము చేత భంగపడి; కలంగి=కలత చెంది; నిజ=తనయొక్క; శిష్యగణము తోడ=శిష్యుల సమూహముతో; గంగదరిన్+ఉండి=గంగ యొడ్డున నిలిచి; పృథివిన్+కల =భూమిపైగల; తీర్థముల=తీర్థములను; లెక్కపెట్టి చూచి=(మనస్సులో) గణించి చూచి; అపుడు=అప్పుడు.

భావము :- సకల ధర్మములను తెలిసినవాడు, నా గురుదేవుడైన వ్యాసుడు, ఈవిధముగ కాశీ విశ్వేశ్వరుని కోపమునకు గురియై, కలత చెంది, తన శిష్య సమూహముతో గంగ యొడ్డున నిలచి భూమిపై కల సమస్త తీర్థములను పర్యాలోచించి, 4

వ :- ఇట్లనియె

అర్థము :- ఇట్లు+అనియె=ఈవిధముగ్గ పలికెను.

విశేషము :- ఇక్కడ నుండి వ్యాసుని మాటలను సూతుడు చెప్పుచున్నాడు.

తే॥ "అంబ పార్వతి నాతోడ నానతిచ్చెఁ
గాశి యెక్కుడు క్షేత్ర సంఘములలోనఁ
గాశి కన్నను నెక్కుడు గౌరవమున
మోక్షభోగ నివాసంబు దక్షవాటి. 5

అర్థము :- క్షేత్ర సంఘములలోనన్=సమస్త క్షేత్రములందును; కాశి=కాశీ క్షేత్రము; ఎక్కుడు=గొప్పది; మోక్ష=మోక్షమునకును; భోగ=భోగమునకును; నివాసంబు=నిలయమైన; దక్షవాటి=దక్షారామ క్షేత్రము; గౌరవమున=గొప్పతనమున; కాశి కన్నను=కాశీ క్షేత్రము కన్నను; ఎక్కుడు=గొప్పది అని; అంబ=లోకమాతయైన; పార్వతి=గౌరి; నాతోడన్+ ఆనతి+ఇచ్చె=నాకు తెలిపెను.

భావము :- అన్ని క్షేత్రములలో కాశి గొప్పది. మోక్ష భోగముల నిలయమైన దక్షవాటి కాశికన్నను గొప్పదని గౌరి నాకు ఆనతినిచ్చెను.

విశేషము :- కాశి భోగ నిలయము కాదు. మోక్ష నిలయము మాత్రమే. దక్షారామము మోక్షమునకు, భోగమునకు నిలయము. చూడుడు. భీమ. 2-17.

వ॥ తొల్లి దక్ష ప్రజాపతి భూచర ఖేచరులగునఖిల గీర్వాణుల రప్పించి, హాటక గర్భ కైటభారులఁ బురస్కరించుకొని మహాధ్వరంబు సేయంబ్రారంభించి. 6

అర్థము :- తొల్లి=పూర్వము; దక్షప్రజాపతి=ప్రజాపతియైన దక్షుడు; భూచర=భూమిపై చరించు; ఖేచరులు=ఆకాశమున చరించు వారు; అగు=అయిన; అఖిల=సమస్త; గీః+ వాణుల= వాక్కులే బాణములుగాగల దేవతలను; రప్పించి=పిలిపించి; హాటక గర్భ=బ్రహ్మ; కైటభ+ అరుల=విష్ణువులను; పురస్కరించుకొని=ముందు పెట్టుకొని; మహా+అధ్వరంబు= గొప్ప యాగమును; చేయన్+ప్రారంభించి=చేయ మొదలిడి.

భావము :- పూర్వము దక్ష ప్రజాపతి సమస్త దేవతలను రప్పించి బ్రహ్మ విష్ణువులను దగ్గర పెట్టుకొని గొప్పయాగము చేయ మొదలుపెట్టి -

తే॥ అర్థితో నోషధీశ్వరుఁడాదియైన
పెండ్లి కొడుకుల నెల్లను బిలువనంపె;
గబ్బితనమున జగదీశుఁగాలకంఠుఁ
బిలువ పంపకమానె నబ్బిరుదులాఁడు. 7.

అర్థము :- ఆ+బిరుదులాడు=ఆ ప్రతిజ్ఞ చేసిన దక్షుడు;(గర్వము కలవాడు) గబ్బితనమున=గర్వమున; అర్థితో=ఆసక్తితో; ఓషధి+ఈశ్వరుడు+ఆదియైన=చంద్రుడు మొదలైన; పెండ్లి కొడుకులను+ఎల్లను=అల్లుండ్రందరను; పిలువనంపె=ఆహ్వానించెను; జగదీశు=లోకపతియైన; కాలకంఠున్=శివుని; పిలువన్=ఆహ్వానించుటకు; పంపకమానె=వార్త పంపక మానెను.

భావము :- గర్వముతో దక్షుడు చంద్రుడు మొదలైన అల్లుండ్రందరను యాగమునకు ఆహ్వానించెను. లోకపతియైన శివునకు వార్త పంపలేదు.

విశేషము :- దక్షుని 'బిరుదులాఁడు'; చంద్రుని 'ఓషధీశ్వరుడు'; శివుని 'కాలకంఠుడు' అని అనుట సాభిప్రాయ సార్థక పదములు. అల్లుని 'పెండ్లి కొడుకు' అని అనుట శ్రీనాథునకు ఒక ముచ్చట.

క॥ అజ్ఞానంబున హరున క
వజ్ఞదలఁచి యతని నొసలి వ్రాత ఫలమునన్
యజ్ఞము సేసెను సురల య
నుజ్ఞఁబురోవృద్ధి కప్పునులు సమకొనునే? 8

అర్థము :- అతని=ఆ దక్షుని; నొసలి=నొసటిపై; వ్రాత ఫలమునన్=(వ్రాసిన) వ్రాతల ఫలముగ; అజ్ఞానంబున=తెలివి తక్కువ తనముచే; హరునకు=శివునకు; అవజ్ఞన్+తలఁచి= అవమానము తలపెట్టి; సురల=దేవతల; అనుజ్ఞన్=అనుమతిచే; యజ్ఞము చేసెను= యాగము చేసెను; పురస్+వృద్ధికి=ముందు కలుగబోవు శుభములకు; ఆ+పనులు=అటువంటి చేష్టలు; సమకొనునె=తగునా?

భావము :- ఆ దక్షుడు తన నొసటి వ్రాత ఫలముగా దేవతల అనుమతిచే శివుని అవమానింపదలచి యాగము చేసెను. అటువంటి పనులు పురోభివృద్ధికి తగునా?

ఉ. అల్పపు బుద్ధి నీ క్రియ మహాక్రతు తంత్రముఁబన్నగాధిపా
కల్పునిఁ బాయఁబెట్టి కనుగానక దక్షుఁడు చేయఁజొచ్చి యా
వేల్పులుఁదాను దుర్దశలవేఁగె మహాప్రళయాగ్ని రుద్రునిం
బోల్పఁగ వచ్చునట్టి పటుభూరి విభుండగు వీరభద్రుచేన్. 9

అర్థము :- దక్షుఁడు=దక్షుడు; అల్పము+బుద్ధిన్=హీనమైన ఆలోచనముతో; కనుగానక=కన్నులు మూసికొనిపోయి; ఈ క్రియన్=ఈవిధముగ; పన్నగ+అధిప+ఆకల్పునిన్= సర్పరాజు ఆభరణముగా కల పరమేశ్వరుని; పాయఁబెట్టి=వెలివేసి; మహా=గొప్ప; క్రతు=యాగ; తంత్రము=కార్యము; చేయన్+చొచ్చి=ప్రారంభించి; ఆ వేల్పులు=ఆ దేవతలు; తాను=ఆ దక్షుడును; మహా=గొప్ప; ప్రళయ+అగ్ని=ప్రళయ కాలమునందలి నిప్పువలె భయంకరమైన; రుద్రునిన్=రుద్రునితో; పోల్పఁగ=పోల్చుటకు; వచ్చునట్టి=తగినటువంటి; పటు=బలమైన; భూరి=గొప్ప; విభుండు+అగు=ప్రభువగు; వీరభద్రుచేన్=వీరభద్రునిచే; దుర్దశల=పాడు అవస్థలచే; వేఁగెన్=తపించెను.

భావము :- దక్షుడు కన్నులు మూసికొనిపోయి, శివుని వెలివేసి యాగము ప్రారంభించి, ఆ దేవతలు తానును ప్రళయాగ్ని రుద్రుని వంటి వీరభద్రునిచే దురవస్థల పాలయి బాధ చెందెను.

తే॥ పువ్వు ముడిచిన పురవీథి భూమియందుఁ
గట్టె మోవంగ వలసిన కారణమున
వీరభద్రునిచే దైన్య వృత్తి నొందె
దక్షుఁడట్టి మహాధ్వర స్థానమునను. 10

అర్థము :- భూమియందు=పుడమిపైన; పువ్వుముడిచిన=పుష్పములు అలంకరించుకొన్న; పురవీథి=పట్టణ వీథియందు; కట్టె మోవంగ వలసిన కారణమున=కట్టెలు మోయవలసి వచ్చిన హేతువు చేత; దక్షుఁడు=ఆ దక్షుడు; అట్టి=అంతటి; మహా+అధ్వర స్థానమునను= గొప్పయాగ ప్రదేశమునందే; వీరభద్రునిచే=వీరభద్రునిచే; దైన్య వృత్తిని+ఒందె=దీన స్థితిని పొందెను.

భావము :- భూమిపై పూలనలంకరించుకొన్న ప్రదేశమునందే కట్టెలను మోయవలసి వచ్చిన విధముగ, దక్షుడు గొప్పగా తలపెట్టిన అంతటి ఆ యాగ ప్రదేశమునందే వీరభద్రునిచే అవమానముల పాలయ్యెను.

విశేషము :- 'పూలనమ్మినచోటనే కట్టెలనమ్ముట' అను సామెతను కవి పద్యములో ఇట్లు మలచెను.

అలంకారము - లోకోక్తి.

కII తుదిఁబోయి యమ్మహేశ్వరు
పద పద్మము లాశ్రయించి బ్రతికెం దానుం
ద్రిదశులు; పెద్దలు నయ్యై
యదనునఁజూపుదురు నిగ్రహానుగ్రహముల్. 11

అర్థము :- తానును=ఆ దక్షుడును; త్రిదశులు=దేవతలును; తుదిన్‌పోయి=చివరకు పోయి; ఆ+మహేశ్వరుని=ఆ శివుని; పద పద్మములు=కమలముల వంటి పాదములను; ఆశ్రయించి=శరణుపొంది; బ్రతికెన్=జీవించెను; పెద్దలు=గొప్పవారు; అయ్యై=ఆ+ఐ+ అదనునన్=ఆయా సమయమునందు; నిగ్రహ+అనుగ్రహముల్=కోపమును దయను; చూపుదురు=చూపుచుందురు.

భావము :- అవమానముల పాలయి చివరకు దక్షుడును, దేవతలును శివుని శరణు వేడి బ్రతికిరి. మహాత్ములు సమయానుకూలముగ కోపమును దయయును చూపుచుందురు.

విశేషము :- .... "పెద్దలు నయ్యై
యదనునఁజూపుదురు నిగ్రహానుగ్రహముల్" - అన్నది సూక్తి.

సీII దక్ష ప్రజాపతి తప్పులోఁగొని యాత్మఁ
గృపపుట్టి మిగుల రక్షించెఁగాన
హరివిరించి పురందరాది దైవతకోటి
మించి క్రమ్మఱ గారవించెఁగాన

నరిగి యంతర్ధాన మందిన తనదేవి
నెడమ మేనఁబరిగ్రహించెఁగాన
గోపాగ్నిఁగడుఁబరితాపంబు నొందెడు
రుసులకు నభయంబు లొసఁగెఁగాన

తే॥ నఱ్ఱుదెగ నేసి జన్నపుటిఱ్ఱి శిరము
గరిమ చెడకుండ దివిఁవ్రేలఁగట్టెఁగాన
నయముగల వేల్పు శ్రీ భీమనాయకుండు
దక్షవాటంబు తీర్థంబు ధరణియందు. 12

అర్థము :- దక్షప్రజాపతి=ప్రజాపతియైన దక్షుని; తప్పు=అపరాధమును; లోఁగొని=లోపల అడచుకొని; ఆత్మన్=మనస్సులో; కృప+పుట్టి=దయ కలిగి; మిగుల=ఎక్కువగా; రక్షించెన్ కాన=రక్షించెను కావునను.

హరి=విష్ణువు; విరించి=బ్రహ్మ; పురందర+ఆది=ఇంద్రుడు మొదలగు; దైవతకోటి=దేవతా సమూహమును; మించి=(పూర్వము కంటె) ఎక్కువగ; క్రమ్మఱ=మరల; గారవించెన్+కాన=గౌరవించెను కావున -

అరిగి=(వలదన్నను దక్షుని యాగమునకు) వెడలి; అంతర్ధానము+అందిన=దేహము చాలించిన; తన దేవి=తన భార్యయైన సతిని; ఎడమ మేనన్=శరీరమున ఎడమ వైపున; పరిగ్రహించెన్+కాన=చక్కగా చేర్చుకొనెను కావున -

కోప+అగ్ని=కోపమనెడి నిప్పు చేత; కడున్=మిక్కిలి; పరితాపంబును+ఒందెడి=పరితపించెడి; రుసులకున్=మునులకు; అభయంబున్=భయము లేని స్థితిని; ఒసఁగెన్+కాన=ఇచ్చెను కావున -

అఱ్ఱు=మెడను; తెగన్ ఏసి=నరికి వేసి; జన్నము+ఇఱ్ఱి శిరము=యజ్ఞ మృగము యొక్క శిరస్సును; గరిమ=శ్రేష్ఠత్వము; చెడకుండ=నశింపకుండగ; దివిన్=ఆకాశమున; వ్రేలన్+కట్టెన్+కాన=వ్రేలాడునట్లు నిల్పెను కావున -

శ్రీ భీమ నాయకుడు=శ్రీ భీమేశ్వరస్వామి; నయము కల వేల్పు=నీతికల గొప్ప దైవము; ధరణియందు=భూమిపైన; దక్షవాటంబు=(ఆ గొప్ప వేల్పునకు నిలయమైన) దక్షారామము మాత్రమే; తీర్థంబు=(నిజమైన) తీర్థము.

భావము :- తన యెడల తప్పు చేసినను మరచి దక్షుని రక్షించినవాడు కావున, తన్ను గౌరవింపక పోయినను బ్రహ్మ విష్ణువు దేవేంద్రుడు మొదలైన దేవతలను పూర్వము కంటె ఎక్కువగా గౌరవించినవాడు కావున, తన మాట వినక యాగమునకు వెడలి దేహము

చాలించిన తన భార్యకు సగము దేహమునిచ్చి గ్రహించిన వాడు కావున, తన కోపమునకు భయపడు మునులకు అభయమొసగినవాడు కావున, యజ్ఞ మృగ శిరస్సును తెగవేసి, మదల దాని గొప్పతనము చెడకుండ ఆకాశమున నిల్పినవాడు కావున శ్రీ భీమేశ్వరస్వామి నీతికల గొప్పదైవము, ఆ స్వామి నిలయమైన దక్షవాటియే భూమిపై గల నిజమైన క్షేత్రము.

విశేషము :- కాశీఖండమునందు యజ్ఞమృగ శిరస్సును శివుని కోపము వలన పుట్టిన వీరభద్రుడు ఖండించునట్లు కలదు.

తే॥ "అర్ధచంద్ర బాణంబున యజ్ఞమృగము
శిరముఁదెగనేసి కట్టెనంబరము మీఁద
ధాత సతి ముక్కు సోణంబు దాఁకఁగోసెఁ
బ్రకట విస్ఫూర్తి శ్రీ వీరభద్రమూర్తి" (కాశి 7-85)

శివునకు సంబంధించిన ఈ విశేషములన్నియు దక్షారామ భీమేశ్వరునివని చెప్పుట క్షేత్రమును, క్షేత్రస్వామిని ప్రచారము చేయు క్షేత్రమాహాత్మ్య ప్రశంసా లక్షణము.

కాశీ విశ్వేశ్వరుడు అవగింజంత చిన్న తప్పు చేయబోయిన వ్యాస మహర్షిని వెడల గొట్టిన కోపి. దక్షారామ భీమేశ్వరుడు తన యెడల పెద్ద తప్పులు చేసిన వారిని కూడ రక్షించు దయామయుడు - అని సూచన.

అలంకారము - ఉదాత్తము.

తే॥ కాలకూటోపసంహారకారియతఁడు
త్రిపుర దైత్యాధిపతుల మర్దించెనతఁడు
నిగ్రహానుగ్రహ ప్రౌఢి నిపుణుఁడతఁడు
సంతతము దేవ వేశ్యాభుజంగుఁడతఁడు. 13

**అర్థము** :- అతఁడు=ఆ భీమేశ్వరుడు; కాలకూట=కాలకూటమను విషమును ఉపసంహారకారి=నాశనము చేసినవాడు; అతఁడు=ఆ భీమేశ్వరుడు; త్రిపుర దైత్య+అధి పతుల=త్రిపురాసుర నాయకులను; మర్దించెన్=నాశనము చేసెను; అతఁడు=ఆ భీమేశ్వరుడు; నిగ్రహ+అనుగ్రహ ప్రౌఢిన్=శిక్షించు రక్షించు కౌశలము నందు; నిపుణుఁడు=ఆరితేరినవాడు; అతఁడు=ఆ భీమేశ్వరుడు; సంతతము=ఎల్లప్పుడు; దేవ వేశ్యా భుజంగుఁడు=దేవ వేశ్యల విటుడు.

**భావము** :- ఆ భీమేశ్వరుఁడు కాలకూట విషమును మ్రింగి దాని భయంకరత్వమును ఉపసంహరించినవాడు. త్రిపురాసురులను సంహరించినవాడు. శిక్షించుటయందు రక్షించుటయందు నిపుణుడు. ఎల్లవేళల దేవ వేశ్యలతో విహరించు విటుడు.

విశేషము :- శివుడు దుష్ట రాక్షసుల భక్తికి కూడ పరవశించి ప్రమాదకరములైన వరములిచ్చి తానుకూడ ఇబ్బందులలో పడుట పురాణాలలో కన్పడు విషయము. భీమేశ్వరుడు అట్లుకాదు. దుష్ట శిక్షణ శిష్ట రక్షణయందు నిపుణుడు. ఇది సంతతము సలుపు అమాయికుడు కాడు. సమయ సందర్భములు చూచి చేయు నిపుణుడు. దేవ వేశ్యా భుజంగుడు అగుట మాత్రము సంతతము జరుగు విషయమగును. ఇది శ్రీనాథ నాథుడైన భీమనాథుని ప్రత్యేకత.

'దేవ వేశ్యా భుజంగుడు' - అనునది దేవదాసీ వ్యవస్థాచిహ్నమైన బిరుదము.

తే॥ ఏమి చిత్రంబు భీమేశ్వరేశ్వరుండు
నిగ్రహానుగ్రహ క్రియా నిపుణుఁడగుట
యతని నిశ్వాసముల మాత్రనౌనొకాదొ
వేదములును జరాచర విశ్వజగము. 14

అర్థము :- భీమేశ్వరేశ్వరుండు=భీమేశ్వరస్వామి; నిగ్రహ=దండించుట; అనుగ్రహ= ప్రసాదించుట అనెడి; క్రియా=కార్యములందు; నిపుణుఁడు+అగుట=నైపుణ్యము కలవాడగుట; ఏమి చిత్రంబు=ఏమి ఆశ్చర్యము?; అతని=ఆ భీమేశ్వరుని; నిశ్వాసముల మాత్రన్=గాలిని బయటకు విడుచుటలచేత మాత్రమే; వేదములును=వేదములును; చర=చరించు నట్టి; అచర=చరింపనట్టి; విశ్వ జగము=సమస్త లోకము; ఔనొ కాదొ=అగునో? కాదో?

భావము :- భీమేశ్వరస్వామి దండించుటయందు, రక్షించుట యందు నిపుణడగుట ఏమి వింత? వేదములు, చరాచరమైన సమస్త లోకము అతని నిశ్వాసముల వలన ఏర్పడినది కదా!

విశేషము :- "యస్య నిశ్వసితం వేదాః"
ఆ పరమాత్ముని ఉచ్ఛ్వాస నిశ్వాసములే వేదములు.

వ॥ బ్రహ్మాది సంస్తుతుండై నిజార్ధ దేహంబుననున్న మాయారూపిణి, మహాదేవి, భువన మోహిని, దేవకార్య ప్రయోజనంబును, మేనకాదేవి భాగధేయంబును, హిమవంతుని తపో విశేషంబును, గారణంబుగా దద్దేహంబున జన్మింప నియోగించిన భువనేశ్వరి మహేశ్వరుని దేహంబు వలన నిర్ముక్తయయ్యెంగావున దక్షారామంబు ముక్తి క్షేత్రంబు నాఁబరఁగె, వెండియు. 15

అర్థము :- బ్రహ్మాది సంస్తుతుండై=బ్రహ్మాదుల చేత స్తుతింపబడినవాడై శివుడు; నిజ=తన యొక్క; అర్ధదేహంబుననున్న=సగము శరీరమునందున్న; మాయారూపిణి=మాయా రూపము కలది; మహాదేవి=గొప్ప దేవత; భువన మోహిని=లోకములను మోహింప చేయునది;

దేవకార్య=దేవతల పనికి; ప్రయోజనంబును=ఉపయోగించునది; మేనకాదేవి భాగధేయం బును=తల్లియైన మేనక యొక్క భాగ్యమును; హిమవంతుని తపోవిశేషంబును= తండ్రియైన హిమవంతుని తపఃఫలమును; కారణముగ=కారణముగ; తద్దేహంబున=ఆ అర్ధనారీశ్వర దేహము నుండి; జన్మింప=పుట్టుటకు; నియోగించిన=ఆజ్ఞాపించిన; భువనేశ్వరి= లోకమాత; మహేశ్వరుని=శివుని; దేహంబు వలన=శరీరము నుండి; నిర్ముక్త+అయ్యెన్+కావున= వదలబడినది కావున; దక్షారామంబు=దక్షారామ క్షేత్రము; ముక్తి క్షేత్రంబు నాఁబరఁగె=ముక్తి క్షేత్రము అను ప్రఖ్యాతి చెందినది; వెండియు=మరల.

భావము :- మహేశ్వరుడు తన అర్ధదేహము నందున్న భువనేశ్వరిని లోక కళ్యాణార్థము మేనకా హిమవంతుల పుత్రికగా పుట్టుటకు ఆజ్ఞాపించగా, శివుని దేహము నుండి ఆ భువనేశ్వరి నిర్ముక్తయయ్యెను. కావున దక్షారామమునకు ముక్తి క్షేత్రమను పేరు కల్గినది.

క॥ దక్షుని సవనాగారము
దక్షారామంబు శివుఁడు దన్మధ్యమునన్
సాక్షాత్కరించియుండుట
మోక్షము భోగంబు బ్రాఁతె ముజ్జగములకున్. 16

అర్థము :- దక్షారామము=దక్షారామక్షేత్రము; దక్షుని సవన+ఆగారము=దక్షుని యాగశాల; శివుఁడు=పరమేశ్వరుడు; తత్+మధ్యంబునన్=ఆ దక్షారామ మధ్యమున; సాక్షాత్కరించి+ఉండుటన్=ప్రత్యక్షమైయుండుట వలన; మూడు+జగములకున్=మూడు లోకములకును; మోక్షము భోగంబు=ముక్తియును, సుఖమునును, బ్రాతె=తక్కువ అగునా?

భావము :- దక్షుని యాగశాల దక్షారామము. దాని మధ్యలో శివుడు సాక్షాత్కరించియుండగా మోక్షభోగములకు అచ్చట ఏమి లోపము?

తే॥ ధాత్రి వలయంబులో భోగదములు కొన్ని
మోక్షదంబులు కొన్ని పరీక్ష సేయ
భోగ మోక్షములకు జన్మభూమియైన
దక్షవాటంబు లావు క్షేత్రముల కెల్ల. 17

అర్థము :- పరీక్ష చేయన్=పరిశీలింపగ; ధాత్రి వలయంబులో=భూచక్రములో; కొన్ని=కొన్ని క్షేత్రములు; భోగదములు=భోగము నిచ్చునవి; కొన్ని=మరి కొన్ని క్షేత్రములు; మోక్షదంబులు=మోక్షమునిచ్చునవి; క్షేత్రములకు+ఎల్లన్=అన్ని క్షేత్రములందు; భోగ

మోక్షములకు=భోగమునకు మోక్షమునకు; జన్మభూమియైన=పుట్టిక స్థలమైన; దక్షవాటంబు=దక్షారామ క్షేత్రము; రావు=నిలయము.

భావము :- భూమిపై కొన్ని క్షేత్రములు భోగమునిచ్చునవి, మరికొన్ని క్షేత్రములు మోక్షము నిచ్చునవి. కాని దక్షారామ క్షేత్రము భోగ మోక్షముల రెండింటిని ఇచ్చు గొప్ప క్షేత్రము.

విశేషము :- "భోగ మోక్షములకు జన్మభూమియైన" అను పాదము కాశీఖండములో (2-110) కాశీ క్షేత్ర మాహాత్మ్యమును వర్ణించుచు కూడ వ్రాసినాడు.

"పాణి యాహార కబళంబుఁబాఱవైచి
కూర్పరము నాకు పిసవెట్టి కూళవోలె
భోగ మోక్షములకు జన్మభూమియైన
కాశి విడిచి నరుండన్య దేశమరుగు"

తే॥ భీమనాథేశ్వరుని కన్న పెద్దవేల్పు
దక్షవాటంబు కంటె నుత్తమ పదంబు
సప్తగోదావరము కంటె సకల తీర్థ
సారమగు తీర్థరాజంబు జగతి లేదు. 18

అర్థము :- భీమనాథేశ్వరుని కన్న=భీమేశ్వరుని కన్న; పెద్దవేల్పు=గొప్ప దైవము; దక్షవాటంబు కంటె=దక్షారామము కంటె; ఉత్తమ పదంబు=గొప్ప స్థలము; సప్త గోదావరము కంటె=భీమేశ్వరుని ఆలయమునకు తూర్పున కల సరస్సు కంటె; సకల తీర్థసారమగు=సకల తీర్థముల సారమైన; తీర్థ రాజము=గొప్ప తీర్థము; జగతి లేదు=లోకమున లేదు.

భావము :- భీమేశ్వరుని కన్న గొప్పదైవము, దక్షారామము కంటె గొప్ప క్షేత్రము, సప్త గోదావరము కంటె గొప్ప తీర్థము లోకమున లేదు.

క॥ అచ్చమగు భోగ మోక్షము
లచ్చోటం దొరకుఁ గరతలామలకముగన్
విచ్చలవిడి బ్రతికిననుం
జచ్చినఁ గడులెస్స భీమశంకరునగరన్. 19

అర్థము :- అచ్చమగు=స్వచ్ఛమైన; భోగ మోక్షములు=ఐహికమైన భోగము, ఆ ముష్మికమైన మోక్షము, ఆ+చోటన్=ఆ దక్షారామమునందు; కరతల+ఆమలకముగన్= అరచేతి యందలి ఉసిరికాయవలె(చాల సులభముగ); దొరకున్=లభించును; భీమశంకరు=

భీమేశ్వరుని; నగరన్=పట్టణమైన దక్షారామమున; విచ్చలవిడి=(విశృంఖలముగ)నియమము లేకుండగ; బ్రతికిననున్=జీవించినను; చచ్చినన్=మరణించినను; కడులెస్స=చాల గొప్ప.

భావము :- దక్షారామమున నిసలైన భోగ మోక్షములు చాల సులభముగ లభించును. అక్కడ స్వేచ్ఛగ జీవించినను, మరణించినను గొప్పయే.

క॥ దక్షిణ వారాణసికిని
మోక్ష శ్రీ భోగవిభవ మూలంబునకున్
దక్షారామంబునకు స
దృక్షంబగునట్టి పుణ్యతీర్థము గలదే. 20

అర్థము :- మోక్షశ్రీ=మోక్ష సంపదకు; భోగ విభవ=భోగ వైభవమునకును; మూలమునకున్=ఆధారమైన దానికి; దక్షిణ వారాణసికిని=దక్షిణ కాశి అని ప్రసిద్ధి చెందిన దానికి; దక్షారామంబునకు=దక్షారామమునకు; సదృక్షంబు+అగునట్టి=సమానమగునట్టి; పుణ్య తీర్థము=పుణ్యతీర్థము; కలదే=కలదా?

భావము :- మోక్షభోగములకు మూలాధారమై దక్షిణ కాశిగా ప్రసిద్ధి చెందిన దక్షారామముతో సమానమైన పుణ్యతీర్థమున్నదా?

సీ॥ కాలకూట విషాగ్ని కబళ హేలాగ్రాస
కల్మాషితాసిత కంఠు చేతఁ
గుంభినీధరసుతా కుచకుంభ పరిరంభ
సంభావనాకేలి శాలి చేత
గగన కల్లోలినీ కల్లోల మాలికా
క్షాలిత బాలేందు మౌళి చేతఁ
గుటిల కుండలిరాజ కుండలాలంకార
విలసిత గండ మండలునిచేత

తే॥ ద్రుహిణ పంచమ మస్తక ద్రోహిచేత
భీమనాథునిచే జగత్స్వామి చేత
హరునిచేత సనాథయై యతిశయిల్లు
మోక్ష భోగ నిదానంబు దక్షవాటి" 21

అర్థము :- కాలకూట విష+అగ్ని=కాలకూట విషమను నిప్పును; కబళ హేలాగ్రాస=ముద్దవలె విలాసముగ తినుట వలన; కల్మాషిత+అసిత=మలినమై నల్లగానైన; కంఠుచేత=కంఠము కలవాని చేత -

కుంభినీధరసుతా=పర్వత పుత్రికయైన పార్వతి యొక్క; కుచకుంభ=కుంభముల వంటి పాలిండ్లను; పరిరంభ=కౌగిలించుకొను; సంభావనా=ఆదరణతో కూడిన; కేలిశాలి చేత=క్రీడతో శోభిల్లువానిచేత.

గగనకల్లోలినీ=ఆకాశ గంగ యొక్క; కల్లోల మాలికా=అలల సమూహము చేత; ఆస్ఫాలిత=చరచబడిన; బాల+ఇందు మౌళిచేత=బాల చంద్రుడు తలపైగలవానిచేత -

కుటిల కుండలిరాజ=వంకరగానున్న సర్పరాజులను; కుండల+అలంకార= పోగుల ఆభరణములతో; విలసిత=ఒప్పుచున్న; గండమండలుని చేత=చెక్కిళ్ళ ప్రదేశము కలవానిచేత-

ద్రుహిణ=బ్రహ్మ యొక్క; పంచమ మస్తక=ఐదవ తలకు; ద్రోహి చేత=కీడు తలపెట్టిన వానిచేత; భీమనాథుచే=భీమేశ్వరునిచేత; జగత్+స్వామి చేత=లోకనాథుని చేత; హరుని చేత=శివుని చేత; సనాథయై=రక్షింపబడునదియై; మోక్ష భోగ=మోక్ష భోగములకు; నిదానంబు=కారణము అయిన; దక్షవాటి=దక్షారామము; అతిశయిల్లు=గొప్పదియై యుండును.

భావము :- కాలకూట విషమును మ్రింగుట వలన నల్లనైన కంఠము కలవాడును, పార్వతి పాలిండ్ల కౌగలిని తలచుకొను శృంగారియును, ఆకాశ గంగ యొక్క అలలచే చరచ బడిన చంద్రుడు తలపై కలవాడును, బ్రహ్మ ఐదవ తలను త్రుంచినవాడును. అగు జగత్పతి యైన భీమేశ్వరుని ప్రభుత్వముతో మోక్షభోగములకు మూలస్థావరమై దక్షారామము అతి శయించుచుండును''

విశేషము :- వాక్య వక్రత, వర్ణ విన్యాస వక్రత.

22

వ॥ అని దక్షారామ మాహాత్మ్యం బభివర్ణించుచు -

అర్థము :- అని=ఈవిధముగ, దక్షారామ మాహాత్మ్యంబు=దక్షారామ క్షేత్రమహిమను, అభివర్ణించుచు=వ్యాస మహర్షి శిష్యులకు వివరించుచుండగ -

భావము :- ఇట్లు వ్యాస మహర్షి తన శిష్యులకు దక్షారామ క్షేత్ర విశేషములను వివరించుచుండగా -

మ॥ **కినుకంబుట్టిన యట్టిమౌని హృదయక్లేశంబు శాంతంబుగా**
**ముని శిష్య ప్రకరంబుతోడ గమనౌన్ముఖ్యంబునన్ ముచ్చటల్**
**తనియంజెప్పుచు వేల్పుటేటి నికట స్థానంబునందుండఁగా**
**వనజాతాప్తుని మండలంబు దిగియె న్వారాశి దిక్సీమకున్.** 23

అర్థము :- కినుకన్=(శివుని)కోపము వలన; పుట్టిన యట్టి=కలిగిన, మౌని=వ్యాసుని; హృదయ క్లేశంబు=మానసిక బాధ; శాంతంబుగాన్=ఉపశమించునట్లుగ; ముని శిష్య ప్రకరంబుతోడ=ముని శిష్యుల సమూహముతో; గమన+ఔన్ముఖ్యంబునన్=ప్రయాణ సన్నాహమున; ముచ్చటల్=వృత్తాంతములు; తనియన్+చెప్పుచు=తృప్తి కలుగునట్లు చెప్పుచు; వేల్పు+ఏటి = గంగానది యొక్క; నికట స్థానంబునందు+ఉండగా=సమీప ప్రదేశము నందుండగా; వనజాత+అప్తుని=పద్మబాంధవుడైన సూర్యుని; మండలంబు=బింబము; వారాశిదిక్+సీమకున్=సముద్రముకల పడమటి దిక్కునకు; దిగియెన్=వ్రాలెను.

భావము :- శివుడు కోపించుట వలన కలిగిన మానసిక వ్యధ శాంతించునట్లు వ్యాసుడు శిష్యులతో దక్షారామ క్షేత్ర విశేషములు వర్ణించుచు గంగానది చెంత నుండగా, సూర్యబింబము పడమటి దిక్కునకు దిగెను. అనగా సూర్యాస్తమయమయ్యెను.

విశేషము :- "ఇట్లనియె", అను 4 సంఖ్యగల వచనము దగ్గర నుండి "కినుకన్ పుట్టిన..." అను 23వ సంఖ్య కల ఈ పద్యము వరకు - వ్యాస మహర్షి చెప్పిన మాటలు. వ్యాసుని ఈ మాటలను, ఆయన శిష్యుడైన సూతుడు శౌనకాది మునులకు తెలిపెను.

## సూర్యాస్తమయ వర్ణనము :

తే॥ అల్లనల్లన గగన మధ్యమున నుండి
వ్రాలె నస్తాద్రి కరుణ సారథి రథంబు
పశ్చిమాంభోధి మారుతాస్ఫాలనమునఁ
గేతనము మీఁది పసిఁడి కింకిణులు మొరయ. 24

అర్థము :- అరుణ సారథి రథంబు=అరుణుడు సారథిగాగల సూర్యుని రథము; పశ్చిమ+అంభోధి=పడమటి సముద్రము యొక్క; మారుత+ఆస్ఫాలనమునన్=గాలి తాకిడిచే; కేతనము మీది=ధ్వజము మీది; పసిడి కింకిణులు=బంగారపు చిరుగంటలు; మొరయ=మ్రోగగ; గగన మధ్యమున నుండి=ఆకాశ మధ్యము నుండి; అల్లన+అల్లన=మెల్ల మెల్లగా; అస్త+అద్రికిన్=పడమటి కొండపై; వ్రాలెన్=దిగెను.

భావము :- పడమటి సముద్ర వాయువులచే జెండాపైగల బంగారపు చిరుగంటలు మ్రోగగ ఆకాశ మధ్యము నుండి సూర్య రథము మెల్లమెల్లగ పడమటి కొండపై దిగెను.

విశేషము :- "కేతనము మీఁది పసిఁడి కింకిణులు మొరయ" అన్న పద్యపాదము శ్రీనాథునకు ఇష్టమైనది. కాశీఖండములో కూడ కలదు. (కాశీ - ప్రథమ - 126).

తే॥ అభ్ర వీధికి లంఘించె నమ్మహాద్రి
గంధవాహ ప్రవాహాభిఘట్టనమునఁ
గేతనము మీఁది పసిఁడి కింకిణులు మొరయ
మెఱుఁగు మెఱసిన చందాన మిహిరు రథము.

కం॥ తారాపథాంచలము డిగి
వారిజహితమండలంబు వ్రాలె నపరది
క్పారావారంబునకై
పారావత పతగ పాద పాటలమగుచున్. 25

అర్థము :- వారిజహిత మండలంబు=పద్మబాంధవుడైన సూర్యుని బింబము; తారాపథ+అంచలము=ఆకాశపుటంచునుండి; డిగి=దిగి, అపరదిక్+పారావారంబునకై= పడమటి దిక్కు నందలి; పారావత=పావురమను; పతగ=పక్షియొక్క; పాద=పాదమువలె; పాటలము+ అగుచున్=ఎరుపురంగు కలదగుచు; వ్రాలెన్=దిగెను

భావము :- ఆకాశము యొక్క అంచునుండి దిగి పావురము యొక్క పాదము వలె ఎఱ్ఱగానున్న సూర్యబింబము పడమటి సముద్రము వైపు దిగెను.

విశేషము :- ఈ పద్యమునందలి ''పారావత పతగ పాద పాటలము'' అను భావము - బాణుని గద్యకావ్యమైన కాదంబరి యందలి ''పారావత చరణ పాటలరాగో రవి రంబర తలాదలంబత'' అను దాని అనుసరణము. (వావిళ్ల తెలుగు లిపి ప్రతి - పుట - 47 పంక్తి-17).

అలంకారము - ఉపమ.

తే॥ కూడి యొప్పారె నస్తాద్రి కూటకోటి
భానుబింబంబు కన్నుల పండువుగను
విశ్వనాథుని గుడిమీఁది విమల కాంతి
భాసురంబైన హేమ కుంభంబు వోలె. 26

అర్థము :- భానుబింబంబు=సూర్యబింబము; కన్నుల పండువుగను=కన్నులకు పండుగగ; విశ్వనాథుని=విశ్వేశ్వరుని; గుడిమీఁది=గుడిపైగల, విమల=స్వచ్ఛమైన; కాంతిన్=ప్రకాశముతో; భాసురంబు+ఐన=ప్రకాశించెడి; హేమ=బంగారపు; కుంభంబు+ పోలె=కలశము వలె; అస్త+అద్రి=పడమటి కొండ యొక్క; కూట=శిఖరము యొక్క; కోటి=అంచును; కూడి+ఒప్పారెన్=చేరి విరాజిల్లెను.

భావము :- సూర్యబింబము విశ్వేశ్వరుని గుడిమీద బంగారపు కలశము వలె పడమటి కొండ శిఖరాగ్రమున కన్నుల పండుగగ నుండెను.

విశేషము :- అలంకారము - ఉపమ.

కం॥ చరమాచల శిఖరంబునఁ
దిరమై యొక్కింత తడవు దినకరుఁడొప్పెన్
వరుణుని శుద్ధాంతంబున
నరవిందాక్షులకు మించుటద్దంబగుచున్. 27

అర్థము :- దినకరుఁడు=సూర్యుడు; చరమ+అచల=పడమటి కొండ యొక్క; శిఖరంబునన్=పై భాగమున; ఒక్కింత తడవు=కొంచెము సేపు; తిరము+ఐ=నిలచి; వరుణుని=పడమటి దిక్కునకు పతియైన వరుణుని; శుద్ధాంతంబునన్=అంతఃపురమున; అరవింద+అక్షులకు=పద్మనేత్రలకు; మించు=తళ తళల; అద్దంబు+అగుచున్=అద్దమగుచు; ఒప్పెన్=ప్రకాశించెను.

భావము :- పడమటి కొండ శిఖరముపై నిలచిన సూర్యుఁడు వరుణుని అంతఃపురకాంతల తళతళ కాంతుల అద్దము అగుచు ప్రకాశించెను.

విశేషము :- ఈ పద్యభావము :- "కనక దర్పణ ఇవ ప్రతీచీ విలాసిన్యాః - అను సుబంధుని వాసవదత్త వచనమునకు అనుకరణము. శంకరదేవ శాస్త్రి వ్యాఖ్యాన సహితమైన వాసవదత్త పు-185 (చౌకాంబ ప్రచురణము)

అలంకారము - రూపకము.

సీ॥ సిద్ధవాహిని నీటఁజిఱుబంతి పసుపాడి
శ్రీ విశాలాక్షి గైసేయఁదొడఁగె
మొరసె నంతర్గేహమున విశ్వనాయక
తాండవారంభ మర్దల రవంబు
మందార తరుపుష్ప మధుపాన గోష్ఠికిఁ
బ్రారంభ మొనరించె భైరవుండు
కొక్కొరోకోయని కొమరుసామిరథంబు
కంఠంబుసాఁచి క్రేంకారమిచ్చె.

తే॥ మొగుడఁబాఱిన యరవిందములను బాసి
గములు గములుఁగ మత్త భృంగములు గూడి
డుంఠి విఘ్నేశు చెక్కు లుత్కంఠఁజేరె
నభినవంబైన యపర సంధ్యాగమమున. 28

అర్థము :- అభినవంబు+ఐన=క్రొత్తదైన; అపర సంధ్యా+ఆగమమున=పడమటి సంజ యొక్క రాక వలన; శ్రీ విశాలాక్షి=శ్రీ విశాలాక్షి; సిద్ధవాహిని నీటన్=గంగా నది నీటిలో; చిఱుబంతి పసుపు+ఆడి=చాయ పసుపు పూసికొని స్నానమాడి; కైసేయన్=అలంకరించుకొన; తొడఁగె=ప్రారంభించెను.

అంతర్గేహమున=ఆలయము లోపల; విశ్వనాయక=విశ్వనాథుని; తాండవ+ఆరంభ=నృత్య ప్రారంభ సూచకమైన; మర్దల=మద్దెల; రవంబు=చప్పుడు; మొరసెన్=ప్రవర్తిల్లెను.

భైరవుఁడు=కాశీ క్షేత్ర పాలకుడైన భైరవుడు; మందారతరు=మందార వృక్షముల; పుష్ప=పూవుల; మధు=మకరందమును; పానగోష్ఠికి=త్రాగు కార్యక్రమమునకు; ప్రారంభము+ఒనరించె=ఉపక్రమించెను.

కొమరుసామి=కుమారస్వామి; రథంబు=వాహనమైన నెమలి; కొక్కొరోకోయని=కొక్కొరోకోయనుచు; కంఠంబు సాచి=మెడపైకెత్తి; క్రేంకారము+ఇచ్చె=క్రేంకారము చేసెను.

మత్తభృంగములు=మదించిన తుమ్మెదలు; కూడి=కలసి; గములు గములుగ=గుంపులు గుంపులుగ; మొగుడన్ పాఱిన=ముడుచుకొనిన; అరవిందములను=పద్మములను; పాసి=వీడి; ఉత్కంఠన్=వేగిరపాటుతో; డుంఠి విఘ్నేశు=డుంఠి అను పేరు కల వినాయకుని; చెక్కులు=చెక్కిళ్లను; చేరెన్=చేరెను.

భావము :- సాయంసంధ్యాకాలముకాగా - శ్రీ విశాలాక్షి పసుపు పూసికొని గంగానదిలో స్నానమాడి అలంకరించుకొనుటకు పూనుకొనెను. విశ్వనాథుని తాండవ ప్రారంభ సూచకముగ అంతర్గేహమున మద్దెల మ్రోగెను. నగర రక్షకుడైన భైరవుడు మధువును సేవించుటకు ఉపక్రమించెను. కుమారస్వామి వాహనమైన నెమలి మెడ పైకెత్తి క్రేంకార మొనర్చెను. గుంపులు గుంపులుగ తుమ్మెదలు ముకుళించుకొనుచున్న పద్మములను వీడి ఉత్కంఠతో గజముఖుడైన డుంఠి విఘ్నేశ్వరుని చెక్కిళ్లను చేరెను.

చ॥ ప్రమద మదాతిరేకమునఁబాశి విలాసవతీ కదంబకం
బుమిసిన తమ్ములంపుఁగఱయో యన నింగిలికంబు ఛాయచేఁ
గమిసిన దాసనంపుఁబువు కాంతికి డాసిన కూర్మి చుట్టమౌ
కొమరున సంజయంబరము కొంగున నూన్చెఁగుసుంభరాగమున్. 29

అర్థము :- ప్రమద=సంతోషము వలని; మద=గర్వము యొక్క; అతిరేకమున= అతిశయముచేత; పాశి=వరుణుని; విలాసవతీ=భోగ స్త్రీల; కదంబకంబు=సమూహము; ఉమిసిన=ఉమ్మివేసిన; తమ్ములము=తాంబూలపు; కఱయో+అనన్=మరకయోయనగ; ఇంగిలికంబు=ఎఱ్ఱని, ఛాయచే=రంగుచే; కమిసిన=అతిశయించిన; దాసనంపు+పువు=దాసన అనెడి పువ్వు యొక్క; కాంతికి=వర్ణమునకు, డాసిన=దగ్గరైన; కూర్మి=ప్రియమైన; చుట్టమౌ=బంధువైన; కొమరున=రీతిగ; సంజ=సంధ్యాకాలము; అంబరము=(వస్త్రము) ఆకాశము యొక్క; కొంగున=అంచున; కుసుంభ రాగమున్=కుంకుమ పువ్వు ఎఱ్ఱదనమును; ఊన్చెన్=పొందెను.

భావము :- వరుణుని భోగ స్త్రీలు మదాతిశయముచే ఉమిసిన తాంబూలపు మరకయోయనగ, ఎఱ్ఱని రంగుతో అతిశయించెడు దాసన పువ్వునకు ప్రియమైన బంధువు వలె, సంధ్యాకాలమునందలి ఆకాశము యొక్క అంచు కుంకుమ పువ్వు ఎఱ్ఱదనమును ధరించెను.

విశేషము :- వరుణుడు పడమటి దిక్కునకు అధిపతి. కనుక అతని విలాసవతుల తాంబూలపు మరక అని అనుట ఔచిత్యము.

అంబరము అనగా ఆకాశము, వస్త్రము; 'కొంగున' అను పదము వలన - ఆకాశము యొక్క అంచున, వస్త్రము యొక్క అంచున - అని రెండు అర్థములు స్ఫురించుచున్నవి.

ఈ పద్యమునందలి - "దాసనంపుఁబువు కాంతికి డాసిన కూర్మి చుట్టమౌ" అనునది సుబంధుని వచన కావ్యమైన 'వాసవదత్త'లోని "ఉదయాచల కూటకోటి ప్రరూఢ జపాకుసుమ కాంతిభిరివ" అనుదానికి 'కూర్మిచుట్టము'. (శంకర దేవశాస్త్రి వ్యాఖ్య పుట - 27)

ఈ భావము మాఘుని శిశుపాల వధ యందు కూడ కలదు.

గతవత్యా రాజత జపాకుసుమ స్తబక ద్యుతౌ దినకరేవ నతిమ్

బహాళానురాగ కురువింద దళ ప్రతిబద్ధ మధ్యమివ దిగ్వలయమ్ (9-8).

దధతీ వికసత్ కుసుంభ కుసుమారుణతామ్ (9-14)

ఈ పద్యమునందలి అలంకారములు - ఉత్ప్రేక్ష, ఉపమ.

**తే॥ సంజకెంపును దిమిర పుంజంపునలుపుఁ**
**గమిచి బ్రహ్మాండ భాండంబు గరము మెఱసె**
**పరమ పరిపాక దశ వృంత బంధమెడలి**
**పతనమగు తాటి పంటితోఁ బ్రతిఘటించి. 30**

అర్థము :- సంజకెంపును=సంధ్యాకాలపు ఎఱ్ఱదనము; తిమిర=చీకట్లు; పుంజంపు=సమూహపు; నలుపున్=నల్లదనము; కమిచి=ఆవరించి; బ్రహ్మాండ భాండంబు=భాండము ఆకారము వంటి భూగోళము; పరమ=మిక్కిలి; పరిపాక=పండిన; దశ=స్థితిలో; వృంత=తొడిమ; బంధంబును=సంబంధమును; ఎడలి=వీడి; పతనమగు= క్రిందికి రాలు; తాటి వంటితో=తాటి పండుతో; ప్రతిఘటించి=పోటీపడి; కరము=మిక్కిలి; మెఱసె=ప్రకాశించెను.

భావము :- సంధ్యాకాలపు ఎఱ్ఱదనము, చీకట్ల నల్లదనము దగ్గర దగ్గరగా పెరిగి, భూగోళము, బాగుగా పక్వదశలో నుండి తొడిమ వీడి క్రిందకు రాలుచున్న తాటి పండు వలెనుండెను.

విశేషము :- శ్రీనాథునకు ఇష్టమైన ఉపమానములలో తాటిపండు ఒకటి.

" అడుసులోపలఁదాటి పండదిమినట్టు
లదుముదునె కాదె పాతాళమంటికొనఁగ" కాశీ - 1 - 114

"హస్తములు రెంటనందంద యదిమి యదిమి
తాటి పండారగించెడు చీటకమున" కాశీ - 5- 81

అలంకారము - ఉపమ

తే॥ కామినీ విప్రయోగ దుఃఖమునఁగుందెఁ
జక్రవాకంబు సురనదీ సైకతమునఁ
గాశికా విప్రయోగ దుఃఖమునఁగుందు
బాదరాయణ మునిసార్వభౌము కరణి. 31

అర్థము :- కాశికా=కాశీ నగరము యొక్క; విప్రయోగ=ఎడబాటు వలన కలిగెడు; దుఃఖమున=ఖేదమున; కుందు=శోకించు; బాదరాయణ మునిసార్వభౌము కరణి=మునిశ్రేష్ఠుడైన వ్యాసుని రీతి; చక్రవాకంబు=చక్రవాక పక్షి; సురనదీ=గంగానది యొక్క; సైకతమున=ఇసుక తిన్నెపై; కామినీ=ఆడ చక్రవాక పక్షి యొక్క; విప్రయోగమున=ఎడబాటు వలన కలిగిన; దుఃఖమున=బాధతో; కుందె=తపించెను.

భావము :- కాశిని వదలి వెడల వలెననెడి దుఃఖముతో తపించుచున్న వ్యాస మహర్షి వలె, చక్రవాక పక్షి తన ప్రియురాలి ఎడబాటు వలన గంగానది ఇసుక తిన్నెపై తపించెను.

విశేషము :- ప్రకృతి వర్ణనమునందు కథాంశమును చొప్పించుట - అన్న ఈ అంశము మహాకవుల కథా కథన విధాన శిల్పసుందరి యొక్క ఒక విలాస వీక్షణము. ఈ పద్యమునకు తిక్కనామాత్యుని ప్రకృతి వర్ణన విధానము గురువు.

"కాశికా" శబ్దము స్త్రీలింగము, 'వ్యాస' శబ్దము పుంలింగము. కనుక "కాశికా విప్రయోగ దుఃఖము" అనుట గడుసు ప్రయోగము.

అలంకారములు - ఉపమ, ప్రతీపము.

శా॥ ఆకాశాంచల వీథులన్నిగిడె సంధ్యారాగ రేఖావళుల్
పాకోన్ముద్రిత పారిభద్రకళికా పాండిత్యవైతండికో
త్సేకస్ఫూర్జిత చండతాండవ రయోద్రేకారభట్యుద్భట
శ్రీకంఠస్థిర దీర్ఘపాటల జటాశ్రేణిన్ విడంబించుచున్. 32

అర్థము :- సంధ్యా=సంధ్యా కాలమునందలి; రాగ=ఎఱుపుగల; రేఖా=గీతల యొక్క; ఆవళుల్=సమూహములు; పాక=నిండుగా ఎదుగుట చేత; ఉన్ముద్రిత=ప్రకటింపబడిన; పారిభద్ర=దేవదారువు యొక్క; కళికా=మొగ్గల; పాండిత్య=సామర్థ్యముతో; వైతండిక=కలహశీలమగు; ఉత్సేక=గర్వము చేత; స్ఫూర్జిత=ప్రకాశించు; చండ=తీవ్రమైన; తాండవ=తాండవమను నాట్యము యొక్క; రయ=వేగముతో; ఉద్రేక=విజృంభణము యొక్క; ఆరభటి=అతిశయముకల; ఉద్భట=శ్రేష్ఠమయిన; శ్రీకంఠ=విషము కంఠము నందుగల శివుని; స్థిర=బలమైన; దీర్ఘ=పొడవైన; పాటల=ఎఱ్ఱని; జటాశ్రేణిన్=జడల సమూహమును; విడంబించుచున్=అనుకరించుచు; ఆకాశ=ఆకసము యొక్క; అంచల=చివరలనెడి; వీథులన్=రాజమార్గములందు; నిగెడెన్=వ్యాపించును.

భావము :- ఆకాశపు చివరి సందులందున్న సంధ్యాకాలపు ఎఱ్ఱని కాంతుల సమూహము - పండి వికసించిన దేవదారు మొగ్గల ఎఱ్ఱదనమును తిరస్కరించు నాట్యము చేయుచున్న శివుని ఎఱ్ఱని జడలను అనుకరించుచు వ్యాపించెను.

విశేషము :- 1. ఈ పద్యము భట్ట గోపాలుని సాహిత్య చూడామణి (కావ్య ప్రకాశ వ్యాఖ్యానము) యొక్క అవతారికలోని శ్లోక భాగ భావమును దత్తత తీసికొని గొంతు మార్చినది. - ఆ శ్లోక భాగమిది.

"భద్రం పక్ష్మలయంతు వో నరహరే రక్షుద్రశౌర్యానఖాః
పాకోన్ముద్రిత పారిభద్రకలికా పాణ్డిత్య పాటచ్చరాః"

పండి వికసించిన దేవదారు మొగ్గల ఎఱ్ఱదనమును దొంగిలించిన నరసింహుని వాడి గోళ్లు మిము్మ కాపాడుగాక - అని దీని బావము.

భట్ట గోపాలుని శ్లోకమున నరసింహుని నఖములు దేవదారు మొగ్గల ఎఱ్ఱదనమును దొంగిలించినవి. శ్రీనాథుని పద్యమున దేవదారు మొగ్గల ఎఱ్ఱదనమును శివుని పాటల జటలు తిరస్కరించినవి.

2. ఇట్లే కాశీఖండము నందలి - (1-5)
కంఠ పీఠిక నోంకార ఘంట మొరయఁ
జెలఁగుఁగావుత మన్మనః క్షేత్ర సీమఁ
గవి కుటుంబంబు పాలిటి దివిజ సురభి
జలజ సంభవు బోటి భాషా వధూటి
అను సరస్వతీ ప్రార్థనము కూడ ఈ భట్టగోపాలుని సాహిత్య చూడామణి అవతారికలోని
ప్రణౌమిక్వణదోంకార మణిఘంటా విభూషితామ్
కవిలోక కుటుంబస్య కామధేనుం సరస్వతీమ్ - అను శ్లోకానువాదమే.

అంతటను శివదర్శనము చేయు శ్రీనాథునకు సాయం సంధ్యా కాలారుణ్యమున నటరాజ తాండవ సమయ జటా సమూహము సాక్షాత్కరించినది.

నాట్యము ద్వివిధము. లలిత లలితముగ పరమేశ్వరి చేయునది లాస్యము. ఉద్ధతముగా పరమేశ్వరుడు చేయునది తాండవము.

అలంకారము - ఉపమ; వర్ణవిన్యాస వక్రత.

వ॥ అప్పుడు బాదరాయణుండు సంధ్యా సమయంబు నిరూపించి, యమర సింధు ప్రవాహంబునం గాలోచిత క్రియా కలాపంబులు నిర్వర్తించి, యొక్క నిర్మల సైకత ప్రదేశంబునం గూర్చుండి, పార్వతీ వల్లభుండు తనకుఁజేసిన యవమానం బునకు నుల్లంబునం దురపిల్లుచుండె నయ్యవసరంబున -. 33

అర్థము :- అప్పుడు=అంత; బాదరాయణుండు=వ్యాసుడు; సంధ్యా సమయంబు= సాయంకాలము; నిరూపించి=అగుట తెలిపి; అమర సింధు ప్రవాహంబునన్=దేవతల నదియైన గంగ యొక్క ప్రవాహములో; కాల+ఉచిత=కాలమునకు తగిన; క్రియా కలాపంబులు=పనుల సమూహములను; నిర్వర్తించి=పూర్తి చేసికొని; ఒక్క=ఒక; నిర్మల=స్వచ్ఛమైన; సైకత ప్రదేశంబున=ఇసుక తిన్నెపై; కూర్చుండి=ఆసీనుడై; పార్వతీ వల్లభుండు=శివుడు; తనకున్+చేసిన+అవమానంబునకున్=తనకు చేసిన అవమానమునకు; ఉల్లంబునన్=మనస్సులో; దురపిల్లుచుండెన్=దుఃఖించుచుండె; ఆ+అవసరంబున=ఆ సమయమున -

భావము :- అంత వ్యాసుడు సాయంకాలమగుట గ్రహించి, గంగానదిలో సాయంకాలోచిత విధులను పూర్తిచేసికొని, ఒక ఇసుక తిన్నెపై కూర్చుండి, శివుడు తనకు చేసిన అవమానమును తలచుకొని దుఃఖించు చుండెను. ఆ సమయమున -

కం॥ వెల్లిగొనె నఖిల దిక్కుల
నల్లని చీఁకటి నవాంజన ప్రతిభటమై
భల్లూక సటా వల్లిమ
తల్లీ విభ్రమదమై యదభ్ర స్ఫురణన్. 34

అర్థము :- అఖిలదిక్కులన్=అన్ని వైపుల; నల్లని చీఁకటి=నల్లనైన చీకటి; నవ+అంజన=క్రొత్త కాటుకను; ప్రతిభటమై=ఎదురించగలదై; భల్లూక=ఎలుగు బంటి; సటావల్లిమతల్లీ=తీగెల వంటి పెద్ద జూలు అను; విభ్రమమై=భ్రాంతి కల్గించునదియై; అదభ్ర=అధికమైన; స్ఫురణన్=స్ఫూర్తితో; వెల్లిగొనె=వ్యాపించెను.

భావము :- అన్ని దిక్కులందు క్రొత్త కాటుక వంటి, ఎలుగుబంటి జూలు వంటి నల్లని చీకటి వ్యాపించెను.

సీ॥ గిరి నికుంజములఁగుంజర పుంజమను శంకఁ
గంఠీరవంబు లుత్కంఠ నెగయఁ
బల్వలంబులఁగిరి ప్రకరంబులను శంక
నెఱుకురాజులు విండు లెక్కు వెట్టఁ
గడలి మధ్యంబునఁగాకోలమను శంక
జలదేవతలు భీతి సంభ్రమింప
నదములఁగువల కానన వాటియను శంక
నిందిందిర శ్రేణి లెదురు కొనఁగ

తే॥ రజత గిరియందు దాండ వారంభ రభస
భంగి పతిత పరశ్వథపాణి వికట
కంధరారుద్ధ గజకృత్తి కంథ శంక
ప్రమథులకుఁదోఁప నంధకారంబు ప్రబలె. 35

అర్థము :- గిరినికుంజములన్=కొండ పొదలను; కుంజరపుంజము+అను=ఏనుగుల గుంపు అను; శంకన్=అనుమానముతో; కంఠీరవంబులు=సింహములు; ఉత్కంఠన్=ఆసక్తితో; ఎగయన్=పైకి లేవగ -

పల్వలంబులన్=గుంటలను; కిరి=పందుల; ప్రకరంబులు+అను=గుంపు అను; శంకన్=భ్రాంతితో; ఎఱుకు రాజులు=ఎఱుకు నాయకులు; విండులు=ధనుస్సులు; ఎక్కువెట్ట=గురిపెట్టగ -

కడలి మధ్యంబునన్=సముద్ర మధ్యమున; కాకోలము+అను=కాకోల విషము అను; శంకన్=సందేహముతో; జలదేవతలు=జలమునందున్న దేవతలు; భీతి=భయముతో; సంభ్రమింప=వేగిరపడగ -

నదములన్=(పడమరగా ప్రవహించు)ఏరులను; కువల=నల్లకలువల; కాననవాటి=ఉద్యానము; అను=అను; శంకన్=అనుమానముతో; ఇందిందిర శ్రేణులు=తుమ్మెదల గుంపులు; ఎదురుకొనఁగ=సమీపింపగ -

రజత గిరియందు=వెండి కొండపై; తాండవ+ఆరంభ=నాట్య ప్రారంభమునందలి; రభస భంగి=వేగ విన్యాసమున; పతిత=పడిన; పరశ్వధ పాణి=శివుని; వికటకంధరా=వికటమైన మెడయందు; రుద్ధ=చుట్టబడిన; గజ కృత్తికంధ=ఏనుగు చర్మపు బొంత అను; శంకన్= అనుమానము; ప్రమథులకున్=శివకింకరులకు; తోఁపన్=తోచగా; అంధకారంబు=చీకటి ప్రబలె=అతిశయించెను.

భావము :- దట్టముగా వ్యాపించిన చీకటిలో - కొంద పొదలను ఏనుగుల గుంపు అని శంకించి సింహములు ఉత్కంఠతో పైకి లేచినవి. చిన్న చిన్న నీటి గుంటలను పందుల గుంపు అని శంకించి ఎఱుకరాజులు ధనుస్సులు ఎక్కుపెట్టిరి. సముద్ర మధ్యమును కాకోలము అను విషమని శంకించి జలదేవతలు భయముతో వేగిరపడిరి. నదమును నల్లకలువల ఉద్యానమని శంకించి తుమ్మెదల గుంపులు సమీపించినవి. వెండి కొండపై నాట్యారంభ వేగవిన్యాసమున జారిపడిన శివుని మెడకు గట్టిన ఏనుగు చర్మపు బొంత అని ప్రమథులు శంకించిరి.

విశేషము :- చీకటిని శివుని మెడకు కట్టిన గజ చర్మముతో పోల్చుట అన్న భావము భారవి కిరాతార్జునీయమునందలిది.

> ద్యాం నిరున్ధతి నీల ఘనాభం ధ్వాన్త ముద్యత కరేణ పురస్తాత్
> క్షిప్యమాణ మసితేతర భాసా శంభునేవ కరిచర్మ చకాసే (9-20)

ఆకాశమున ఆవరించినదియు, నీలమేఘమును పోలినదియును, ఉద్యతకరుడగు చంద్రునిచే తూర్పున ఉద్యమానమగు చీకటి-శివునిచే అగ్రభాగమున ఉంచబడియున్న ఏనుగు చర్మము వలె ప్రకాశించెను.

అలంకారము :- భ్రాంతి.

తే॥ ప్రబలమై యంధకారంబు బలిసియుండఁ
దారకంబులు కాంతి నెంతయును బెరసె
నీలిపుట్టంబుఁ బఱచి పైనిలిపినట్టి
వలుఁద ముక్తాఫలముల తావళములట్లు. 36

అర్థము :- ప్రబలమై=అధికమై; అంధకారంబు=చీకటి; బలసియుండన్=దట్టముగ వ్యాపించియుండ; నీలిపుట్టంబున్=నల్లని వస్త్రమును; పఱచి=పఱచి; పైనిలిపినట్టి=పైన నిలిపినట్టి; వలుఁద=లావైన; ముక్తా ఫలముల=ముత్యముల; తావళములట్లు=హారముల వలె; తారకంబులు=నక్షత్రములు; కాంతిని=కాంతితో, ఎంతయును=ఎంతయో; బెరసె=ప్రకాశించెను.

భావము :- చీకటి విస్తారమై అధికమై యుండగా, నక్షత్రములు నల్లని వస్త్రమును పఱచి దానిపై నుంచిన లావైన ముత్యముల దండవలె కాంతితో ప్రకాశించెను.

విశేషము :- అలంకారము - ఉపమ.

శా॥ శ్రీ వారాణసి విశ్వనాయక గళక్ష్వేళానుకారక్రియా
హేవాకోద్ధతిఁజీఁకువాల్ప్రబలఁగా హేలావతీ కోటిపైఁ
బూవుందూపుల జోదు పుచ్చుకొనియెన్ భూపాల లీలావతీ
భ్రూవల్లీ నిభ శృంగకంబగు లసత్పుండ్రేక్షు కోదండమున్. 37

అర్థము :- శ్రీ వారాణసి=(వరణ, అసి అను రెండు నదుల మధ్యకల) కాశీ నగరమందలి; విశ్వనాయక=విశ్వేశ్వరుని; గళ=కంఠమునందలి; క్ష్వేళ=నల్లని విషమును; అనుకార=అనుకరించుటయును; క్రియా=పనియందలి; హేవాక=నేర్పు యొక్క; ఉద్ధతిన్=పైకెగయుటతో; చీఁకువాల్=చీకటి; ప్రబలఁగా=అధికముకాగా; పూవుందూపుల జోదు=పూలబాణముల వీరుడైన మన్మథుడు, హేలావతీ కోటిపైన్=విలాసవతుల సమూహముపై; భూపాల లీలావతి=రాజ కాంతల; భ్రూవల్లీ=కనుబొమలతో; నిభ=సమానమైన; శృంగకంబగు=కొమ్ములతో; లసత్=ఒప్పుచున్న; పుండ్రేక్షు=చెరకు; కోదండమున్=ధనుస్సును; కొనియెన్=చేత ధరించెను.

భావము :- కాశీ విశ్వేశ్వరుని కంఠమునందలి నల్లని విషమువంటి చీకటి బాగుగా వ్యాపింపగా, మన్మథుడు విలాసవతులపై ఎక్కుపెట్టుటకు రాజకాంతల కనుబొమలవంటి చెఱకు వింటిని చేత ధరించెను.

విశేషము :- అలంకారము - ప్రతీపము

వ॥ అంత - అంత=అప్పుడు 38

## చంద్రోదయ వర్ణనము :

ఉ॥ ఆతత లీలఁగోమల నవాంశుకపాళి మహాంధకార సం
ఘాతము మీటె నద్భుతముగా శశిలాంఛనుఁడభ్రవీధికిన్
శ్వేత వరాహమూర్తియగు వెన్నుఁడు ప్రన్నని యొంటి కోఱ ధా
త్రీతల మెంత యంతయు ధరించిన యట్టి విజృంభణంబునన్. 39

అర్థము :- శ్వేత వరాహమూర్తి+అగు=తెల్లని వరాహావతార మెత్తిన; వెన్నుఁడు=విష్ణువు; ప్రన్నని=అందమైన; ఒంటి కోఱ=ఒక్క కోరతో; ధాత్రీతలము=భూతలము; ఎంత+అంతయు=ఎంత కలదో అంతయు; ధరించినయట్టి=పైకెత్తిన; విజృంభణంబునన్=అతిశయమున; శశిలాంఛనుఁడు=చంద్రుడు; ఆతతలీలన్=అంతటను వ్యాపించు రీతిగా; కోమల=సుకుమారమైన; నవ+అంశుక+పాళిన్=క్రొత్తవైన కిరణముల సమూహముతో; అభ్రవీధికిన్=ఆకాశమార్గమునకు; మహా+అంధకార=గొప్ప చీకటుల; సంఘాతము=సమూహమును; అద్భుతముగా=ఆశ్చర్యము కలుగునట్లు; మీటెన్=త్రోసి వేసెను.

భావము :- వరాహావతారమెత్తి విష్ణువు తన తెల్లని ఒంటి కోరతో భూగోళమునంతయు అవలీలగ పైకెత్తినవిధముగ - చంద్రుడు నెలవంకచే ఆకాశ వీధిలో చీకట్ల సమూహమును అద్భుతముగా త్రోసి వేసెను.

విశేషము :- చంద్రుడు వెన్నెలచే చీకటిని పైకెత్తుటను - ఆది వరాహము(విష్ణువు) కోరచే భూమండలమును పైకెత్తుటతో పోల్చుట-అన్న ఈ భావము భారవి కిరాతార్జునీయము నందలిది -

లేఖయా విమల విద్రుమ భాసా
సంతతం తిమిర మిందు రుదాసే
దంష్ట్రయా కనక టంక పిశంగ్యా
మండలం భువ ఇవాది వరాహః (9-22)

'చంద్రుడు విమల విద్రుమమైన కళచే సాంద్రమైన చీకటిని ఆదివరాహము బంగారపు కత్తి వర్ణముకల కోరచే భూమండలమును పైకెత్తినట్లుగ పైకెత్తెను.

అలంకారము - ఉపమ

తే॥ అర్ధమండల ముదయించు నమృతభానుఁ
డుదయ రాగంబుతోఁగూడ నొప్పు మిగిలెఁ
బ్రకట తాంబూల రాగ సంరక్తమైన
బ్రాగ్దిశా కాంత బింబాధరంబు వోలె. 40

అర్థము :- ప్రకట=వెల్లడి అగుచున్న; తాంబూల=తాంబూలము యొక్క; రాగ=ఎరుపుదనముచే; సంరక్తమైన=బాగుగా ఎఱ్ఱదనము కలిగిన; ప్రాక్+దిశాకాంత=తూర్పు దిక్కు అనెడి స్త్రీ యొక్క; బింబ=దొండ పండు వంటి; అధరంబు వోలె=క్రింది పెదవి వలె; అర్థ మండలము=సగము మండలముతో; ఉదయించు=ఉదయించుచున్న; అమృతభానుఁడు=చంద్రుడు; ఉదయ రాగంబుతోఁగూడన్=ఉదయకాలమందలి ఎఱుపుదనముతో; ఒప్పు=సౌందర్యముతో; మిగిలెన్=అతిశయించెను.

భావము :- ఎఱుపుదనముతో ఉదయించుచున్న చంద్రుని అర్ధబింబము - తాంబూలము వేసికొనుట వలన ఎఱ్ఱబడిన తూర్పుదిక్కు అనెడి స్త్రీ యొక్క క్రింది పెదవివలె శోభిల్లినది.

విశేషము :- చంద్రబింబము యొక్క అర్ధ భాగమును రెండు పెదవులతో కాక, కేవలము క్రింది పెదవితో మాత్రమే, అనగా నోటి యొక్క అర్ధ భాగముతోడనే పోల్చుట గమనింపదగిన అంశము.

కం॥ సంకలితోదయ రక్తి శ
శాంకుఁడు శోభిల్లె గైరికావనిధర వ
ప్రాంక క్రీడా పాటల
శంకర భృత కాలకూట సంకాశుండై. 41

అర్థము :- శశాంకుఁడు=కుందేలు చిహ్నముగాగల చంద్రుడు; సంకలిత=కూడిన; ఉదయ రక్తిన్=ఉదయకాలము నందలి ఎఱ్ఱదనముతో; గైరిక...సంకాశుండై. గైరిక+అవనిధర=జేగురు రంగుతో గూడిన పర్వతమునందు; వప్ర+అంక+క్రీడా=కొండ కొమ్ము ప్రదేశము నందలి ఆటచేత; పాటల=తెలుపును మించిన ఎఱుపుగల; శంకర=శివునిచే; భృత=ధరింపబడిన; కాలకూట=కాలకూటమను విషముతో; సంకాశుండై=సమానమైన వాడై; శోభిల్లెన్=ప్రకాశించెను.

భావము :- చంద్రుడు ఉదయ కాలమునందలి ఎఱ్ఱదనముతోగూడి జేగురు రంగుగల పర్వతము కొమ్ముపై విహరించుటచే, పాటల వర్ణముగల శంకరుడు తాల్చిన కాలకూట విషముతో సమానుడై ప్రకాశించెను.

విశేషము :- ఉదయ రక్తి జేగురు కొండతో, తెల్లని చంద్రుడు తెల్లని శంకరునితో, చంద్రునిలోని మచ్చ శివుని కంఠమందలి కాలకూట విషముతో పోల్చబడినది.

అలంకారములు - ఉపమ; పరికరాంకురము.

సీ॥ కాదుకాదుదయాద్రి కనక కూటంబిది
డంబైన పాన వట్టంబు గాని
కాదు కాదిది సుధాకర పూర్ణ బింబంబు
కాశ్మీర శంభు లింగంబు గాని
కాదు కాదుదయరాగ ప్రకాశంబిది
నవ కుంకుమా లేపనంబు గాని
కాదు కాదిది కళంకచ్ఛటా రింఛోళి
పూజ చేసిన కల్వ పువ్వు గాని

తే॥ యనఁగ సప్తార్ణవములు మిన్నంది కొనఁగఁ
జంద్రకాంతోపలంబులు జాలువాఱ
నసమశర సార్వభౌము ముత్యాల గొడుగు
విధుఁడు విశ్వంబు వెన్నెల వెల్లిఁదేల్చె. 42

అర్థము :- ఇది=ఇది; డంబైన=సుందరమైన; పాన వట్టంబుకాని=లింగపీఠము కాని; ఉదయ+అద్రి=తూర్పుకొండ యొక్క; కనక=బంగారపు; కూటంబు=శిఖరము; కాదుకాదు=కానే కాదు.

ఇది=ఇది; కాశ్మీర=కాశ్మీర దేశమునందలి; శంభులింగంబు కాని=శివలింగము కాని; సుధాకర=తెల్లని కిరణములుకల చంద్రుని; పూర్ణబింబంబు=నిండు బింబము; కాదుకాదు=కానే కాదు.

ఇది=ఇది; నవకుంకుమ=క్రొత్త కుంకుమ యొక్క; ఆలేపనంబు కాని=పూత కాని; ఉదయరాగ ప్రకాశము=ఉదయకాలమునందలి ఎఱ్ఱని కాంతి; కాదు కాదు=కానే కాదు.

ఇది=ఇది; పూజ చేసిన=శివునకు సమర్పించిన; కల్వ పువ్వు కాని=కలువ పూవు కాని; కళంకచ్ఛటా=చంద్రునిలోని మచ్చ కాంతి; రింఛోళి=సమూహము; కాదు కాదు=కానే కాదు.

అనఁగ=అనిపించునట్లు; సప్త+అర్ణవములు=ఏడు సముద్రములు; మిన్ను=ఆకాశమును; అందికొనఁగ=అంటుకొనగ; చంద్రకాంత+ఉపలంబులు=చంద్రకాంత శిలలు;

జాలువాఱన్=ద్రవింపగ; అసమశర సార్వభౌము=పంచబాణుడైన మన్మథుని; ముత్యాల గొడుగు=తెల్లని ముత్యముల గొడుగు అయిన; విధుఁడు=చంద్రుడు, విశ్వంబు=లోకమును; వెన్నెల వెల్లిన్=వెన్నెల వరదలో; తేల్చె=తేలునట్లు చేసెను.

భావము :- ఎదురుగా కన్పడునది - సుందరమైన శివుని పానవట్టముకాని, తూర్పు కొండ బంగారు శిఖరము కాదు. కాశ్మీర దేశపు శివలింగము కాని చంద్రుని తెల్లని బింబము కాదు. క్రొత్త కుంకుమపు పూత కాని ఉదయకాలమందలి ఎరుపు పూత కాదు. శివునకు పూజ చేసిన కలువ పూవు కాని, చంద్రుని మచ్చ కాదు. ఇట్లు అనిపించుచు - సప్త సముద్రములు ఆకాశమందుకొనగ, చంద్రకాంత శిలలు ద్రవింపగ మన్మథుని ముత్యాల గొడుగైన చంద్రుడు లోకమును వెన్నెలలో తేలునట్లు చేసెను.

విశేషము :- ఈ పద్యమునందలి కొన్ని భావములు సంస్కృత కవియైన సుబంధుని గద్యకావ్యమైన 'వాసవదత్త' యందలి వచనములకు తెలుగు వేషము.

"అనంతరం .....శ్వేతాత పత్రమివ మకరరేతోః ..... స్ఫాటికలింగమివ గగన మహాతాపసస్య ..... పుండరీకమివ గగనగామి గంగాయాః ..... భగవానుడుపతి రుజ్జగామ." - శంకరదేవ శాస్త్రి వ్యాఖ్యా సమేత వాసవదత్తా - చౌకాంబా ప్రచురణము - పుటలు-(214 - 216)

కాశ్మీర శంభు లింగంబు - స్ఫాటికలింగమివ గగన మహా తాపసస్య ;
పూజ చేసిన కల్వ పువ్వు - పుండరీకమివ గగన గామి గంగాయాః ;
అసమ శర సార్వభౌము ముత్యాల గొడుగు - శ్వేతాతపత్రమివ మకరకేతోః

ఈ కృతజ్ఞత తోడనే శ్రీనాథుడు శివరాత్రి మాహాత్మ్యమున(1-12) "బంధుర గాంభీర్య బంధు సుబంధు" అని ప్రశంసించినాడు.

అలంకారము - అపహ్నుతి.

**తే॥ ఉదయ రాగము నించించు కుజ్జగించి**
**నిండు చంద్రుండు కన్నుల పండువయ్యెఁ**
**ధావనానంతర స్నిగ్ధ దాక్షిణాత్య**
**రాజశుద్ధాంత దంత వజ్రముల కాంతి.** **43**

అర్థము :- నిండు చంద్రుండు=పూర్ణ చంద్రుడు; ఉదయ రాగము=ఉదయ కాలమునందలి ఎరుపును; ఇంచుక+ఇంచుక=కొంచెము కొంచెము; ఉజ్జగించి=విడిచి; ధావన+అనంతర=తోము కొనిన తరువాత; స్నిగ్ధ=నును పైన; దాక్షిణాత్య=దక్షిణ దేశీయులైన; రాజ=రాజుల; శుద్ధాంత=అంతఃపుర స్త్రీల; దంత వజ్రముల=తెల్లని వజ్రముల వంటి దంతముల; కాంతి=ప్రకాశము వలె; కన్నుల పండువయ్యె=కన్నుల పండుగ అయ్యెను.

భావము :- పూర్ణచంద్రుడు ఉదయరాగమును కొంచెము కొంచెము విడిచి, శుభ్రము చేసికొనిన తరువాత మెరసెడి దాక్షిణాత్య రాజకాంతల వజ్రముల వంటి దంతములవలె కన్నులకు పండువయ్యెను.

విశేషము :- దాక్షిణాత్య కాంతల దంతముల కాంతితో చంద్రకాంతిని పోల్చుట అన్న భావ విలాసమును శ్రీనాథునకు కన్నుల పండువు చేసినది బాలరామాయణ నాటక కర్తయైన రాజశేఖరుడు.

"సంబంధీ పురు భూభుజాం మనసిజ వ్యాపార దీక్షా గురు
ర్గౌరాంగీ వదనోపమా పరిచితస్తారావధూవల్లభః
సద్యోమార్జిత దాక్షిణాత్య తరుణీ దంతావదాతద్యుతి
శ్చంద్ర స్సుందరి! దృశ్యతామయ మితశ్చండేశ చూడామణి":

ఓ సుందరీ! తూర్పున చంద్రుడు ఉదయించినాడు. అతడు చండీశుని చూడామణి. పురు భూపతుల వంశకర్త. మన్మథ వ్యాపార దీక్షా గురువు. గౌరాంగీ వదనోపమా పరిచితుడు. తారావధూవల్లభుడు. అప్పుడే కడుగబడిన దాక్షిణాత్య తరుణి యొక్క దంతములవలె తెల్లని కాంతి కలవాడు.

రాజశేఖరుని ఈ శ్లోకము (అంకము-10;శ్లో-40)నందలి ఉత్తర భాగము శ్రీనాథుని ఈ పద్యభావమునకు పుట్టినిల్లు.

ఆ గౌరవము తోడనే శ్రీనాథుడు రాజశేఖరుని "రాజశేఖరు కవిరాజుఁ బ్రస్తుతించి" అని (శృం.నైష-1-7) స్మరించినాడు.

కన్నుల పండువు - ఒక జాతీయము.

అలంకారము - ఉపమ.

సీ॥ అభిషేక మొనరించు నమృతధారావృష్టి
మదనాంతకుని ముక్తి మంటపికకు
నలవోకగా విశాలాక్షీ మహాదేవి
నిద్దంపుఁజెక్కుల నీడఁజూచు
నెరియించు మిన్నేటి యిసుక తిన్నెల మీఁదఁ
జక్రవాకాంగనా సముదయంబు
దుంతి విఘ్నేశు నిష్ఠుర కంఠ వేదిపైఁ
గొదమ చుక్కల రాజుఁ గుస్తరించుఁ

తే॥ గాయు వెన్నెల యానంద కాననమునఁ
గాలభైరవు దంష్ట్రకు డాలు కొలుపు
విధుఁడు వారాణసీ సోమవీథి చక్కి
నభ్రఘంటాపథంబున నరుగునపుడు. 44

అర్థము :- విధుఁడు=చంద్రుడు; వారాణసీ=కాశీ నగరమందలి; సోమవీథి చక్కి=సోమ వీథి వైపు; అభ్రఘంటా పథంబున=గగన మార్గమున; అరుగునపుడు= పయనించునపుడు-

మదన+అంతకుని=విశ్వేశ్వరుని; ముక్తి మంటపికకున్=ముక్తి మంటపమునకు; అమృత ధారా వృష్టి=అమృత ధారల వర్షముతో; అభిషేకము+ఒనరించు=అభిషేకము చేయును.

అలవోకగా=చాల సులభముగ; విశాలాక్షీ మహాదేవి=విశాలాక్షీ మహాదేవి యొక్క; నిద్దంపు=స్వచ్ఛమైన; చెక్కుల=చెక్కిళ్లయందు; నీడన్+చూచును=తన ప్రతిబింబమును చూచుకొనును.

మిన్నేటి=గంగానది; ఇసుక తిన్నెల మీఁదన్=ఇసుక దిబ్బల మీద; చక్రవాక+అంగన= ఆడ చక్రవాక; సముదయంబును=సమూహమును; ఎరియించు=బాధ పెట్టును.

డుంఠి విఘ్నేశు=డుంఠి అను పేరుకల వినాయకుని; నిష్ఠుర=కఠినమైన; కంఠ వేదిపై=కంఠసీమపై కల; కొదమ=లేత; చుక్కల రాజు=చంద్రుని; కుస్తరించు=లాలించును.

ఆనంద కాననమునన్=కాశి యందు; వెన్నెలకాయు=వెన్నెల కాయును; కాలభైరవు= క్షేత్రపాలకుడైన కాలభైరవుని; దంష్ట్రకు=కోరకు, డాలు కొలుపును=కాంతినిచ్చును.

భావము :- చంద్రుడు కాశీనగరమందలి సోమవీథి ప్రాంతమున ఆకాశ మార్గమున పయనించునపుడు - విశ్వేశ్వరుని ముక్తి మంటపమును వెన్నెల వర్షముతో అభిషేకము చేయును. విశాలాక్షి స్వచ్ఛమైన చెక్కిళ్లపై ప్రతిబింబించును. గంగానది ఇసుక తిన్నెలపై చక్రవాకాంగనలను బాధపెట్టును. డుంఠి విఘ్నేశ్వరుని కంఠ సమీపమునగల లేత చంద్రుని లాలించును. కాశియంతయు వెన్నెల కాయును. క్షేత్ర రక్షకుడైన కాలభైరవుని కోరకు కాంతినిచ్చును.

**విశేషము :-** "డుంఠి విఘ్నేశు నిష్ఠుర కంఠవేదిపైఁ
గొదమ చుక్కలరాజుఁ గుస్తరించు"

అన్నపాదమునకు ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారి వివరణమిది. (ఈశ్వరార్చన కళాశీలుడు - పుట-56)

"కాశీ క్షేత్రములోని డుంఠి విఘ్నేశ్వరుని విగ్రహమును పరికించిన కంఠసీమయే కనిపించదు. కంఠము మీది వేదికగ వేదండ వదనము కనిపించును. ఆ కంఠ వేదికను తీర్చిదిద్దిన నెలవంక రేక కలదు. ఆ నెలవంక రేకయే కొదమ చుక్కల రాజు. చంద్రుడు వారణాసిలోని సోమవీథి ప్రదేశమున సంచరించునపుడు అలవోకగా విశాలాక్షీ మహాదేవి నిద్దంపుఁజెక్కుల నిగనిగలాడునుగాని, డుంఠి విఘ్నేశ్వరుని నిష్ఠురమైన కంఠవేదికను నెలవంకయే యున్నందున ఆ కొదమ చుక్కల రాజును కుస్తరించునని శ్రీనాథుని చమత్కారము."

విఘ్నేశ్వరుని కంఠవేదికను నెలవంక నెలకొని యుండుట కూడ చమత్కారమే.

సీ॥ రోహిణీ గాఢోప గూహనంబునఁగన్న
కస్తూరికా స్థాసకంబనంగ
రాహుదంష్ట్రా ఘాత రంధ్రమార్గంబున
లలిఁదోఁచు నాకాశ లవమనంగ
నైర్మల్యమునఁజేసి నడుమఁగానఁగవచ్చు
కమిచి మ్రింగిన యంధకారమనఁగ
జన్మవేళను మంథశైలాభి ఘట్టన
సంభవించిన కిణ స్థాన మనఁగ

తే॥ విరహ పరితాప వేదన వేఁగుచున్న
చక్రవాకాంగనల కటాక్షముల యగ్గి
నావహిల్లిన కఱదూప మనఁగ నొప్పు
నుడుగణాధీశ బింబంబు నడిమి మచ్చ. 45

అర్థము :- ఉడుగణ+అధీశ=నక్షత్ర సమూహమునకు పతియైన చంద్రుని; బింబంబు=మండలమందలి; నడిమిమచ్చ=మధ్యగల మరక -

రోహిణీ=భార్యయైన రోహిణి యొక్క; గాఢ+ఉపగూహనంబున=గాఢమైన కౌగిలి వలన; కన్న=పుట్టిన; కస్తూరికా=కస్తూరి యొక్క; స్థాసకంబు+అనంగ=పూత అనగ-

రాహు=రాహువు యొక్క; దంష్ట్రా=కోరల యొక్క; ఆఘాత=దెబ్బచే (గలిగిన); రంధ్రమార్గంబున=చిల్లి త్రోవలో; లలిన్=సొగసుగా; తోఁచు=కనబడు; ఆకాశ=ఆకాశము యొక్క; లవము+అనంగ= భాగము అనగ -

నైర్మల్యమునన్ చేసి=స్వచ్ఛముగా నుండుట వలన; నడుమన్=మధ్యలో; కానవచ్చు=కనబడు; కమిచి మ్రింగిన=కొరికి మ్రింగిన; అంధకారము+అనఁగ=చీకటి అనగ-

జన్మవేళను=పుట్టినపుడు; మంథశైల=మంథర పర్వతము యొక్క; అభిఘట్టన=గట్టి ఒరపిడి వలన; సంభవించిన=ఏర్పడిన; కిణస్థానమనఁగ=కాయ కాచినచోటు అనగ -

విరహ పరితాప వేదన=విరహ తాపముచే బాధపడుచున్న; చక్రవాక+అంగనల =ఆడచక్రవాక పక్షుల; కటాక్షము=కడగంటి చూపుల; అగ్గిని=నిప్పు వలన; ఆవహిల్లిన=కలిగిన; కఱదూపము+అనఁగన్=పొగచూరిన దుమ్ము అనగ; ఒప్పున్=ఉండెను.

భావము :- చంద్రబింబము మధ్యలోనున్న మచ్చ - రోహిణి కౌగలించు కొనినపుడు ఏర్పడిన కస్తూరి పూత అనగ, రాహువు కోరచే కొట్టగా ఏర్పడిన చిల్లిలో కనబడు ఆకాశపు ముక్క అనగ, స్వచ్ఛముగానుండుట వలన కొరికి మ్రింగిన చీకటి అనగ, పుట్టినపుడు మందర పర్వతము యొక్క ఒరపిడి వలన కాచిన కాయ అనగ; విరహ తాపముతో వేదనపడుచున్న ఆడ చక్రవాకముల కడగంటి చూపుల నిప్పు వలన కలిగిన గృహధూమము అనగ నుండెను.

విశేషము :-ఈ పద్యమును చదువగనే వెంటనే గుర్తుకు వచ్చు శ్లోకము -

అంకంకేపి శశంకిరే జలనిధేః పంకంపరే మేనిరే
సారంగం కతిచిచ్చ సంజగదిరే భూచ్ఛాయమైచ్ఛన్పరే
ఇందౌ యద్దలితేంద్ర నీల శకలశ్యామం దరీ దృశ్యతే
తత్సాంద్రం నిశిపీతమన్ధతమసం కుక్షిస్థమాచక్ష్మహే.

*కువలయానందము (అపహ్నుతి అలంకార వివరణము)*

అలంకారము - ఉత్ప్రేక్ష.

సీ॥ కాలభైరవుఁడు ఢక్కాడిండిమము మ్రోయ
బహుభూతములుఁదానుఁ బ్రహరి దిరుగఁ
జంద్రికా మధువాని చాకోరముల్ నిక్కి
దేవతా సౌధ వీథికల సొగయ
నానందకాననాభ్యంతరంబుల యందు
సిందువారమునఁబూ శిథిల పడగఁ
గడు నివాతములైన కలుమఠంబుల యందు
యతులు ప్రాణాయామ మభ్యసింప

తే॥ దొడ్డ వయసున శీతాంశుఁ డొడ్డగిల్లెఁ
దఱపి చంద్రాతపము నేల చఱచి కాయ
వంత దురపిల్లి వెన్నెల వగచి వగచి
గంధవతి పట్టి యొకభంగిఁగన్ను మోడ్చె. **46**

**అర్థము** :- కాలభైరవుఁడు=క్షేత్ర రక్షకుడైన కాలభైరవుడు; ఢక్కా=డంకా; డిండిమము=డిండిమమును; మ్రోయ=మ్రోగించుచు; బహుభూతములున్=అనేక భూతములు; తానున్=తానును; ప్రహరి తిరుగన్=పట్టణము చుట్టు తిరుగుచుండగ -

చంద్రికా మధువు+అని=వెన్నెల అను మద్యమును త్రాగి; చాకోరముల్=చకోర పక్షులు; నిక్కి=తలలెత్తి; దేవతా=దేవతల; సౌధ వీథికల=ఆలయముల వీథులలో; సొగయ= పరవశింపగ -

ఆనంద కానన=కాశి యొక్క; అభ్యంతరములందు=లోపలి భాగములందు; సిందు వారమునన్=సిందు వారము (వావిలి చెట్టు) అను వృక్షమునందలి; పూ=పూవు; శిథిలపడ గన్=క్రింద పడగ; -

కడు=మిక్కిలి; నివాతములు+ఐన=గాలి లేని; కలు=ఱాతి; మఠంబుల యందు= మఠములందు; యతులు=సన్యాసులు; ప్రాణాయామము=వాయువును నిరోధించు యోగమును; అభ్యసింప=సాధన చేయుచుండ; -

తఱపి=చిక్కనైన; చంద్ర+ఆతపము=వెన్నెల; చఱచికాయ=గట్టిగా కాయుచుండగా; డొడ్డ వయసున=పెద్ద వయసున; శీత+అంశుఁడు=చల్లని కిరణములుగల చంద్రుడు; ఒడ్డగిల్లెన్=అతిశయించెను; వంత=బాధచే; దురపిల్లి=దుఃఖించి; వెన్నెలన్=వెన్నెలలో; వగచి వగచి=శోకించి శోకించి; గంధవతి పట్టి=సత్యవతి కుమారుడైన వ్యాసుడు; ఒక భంగిన్= అశాంతితో అదొక విధముగ; కన్నుమోడ్చెన్=నిద్రించెను.

**భావము** :- కాలభైరవుడు ఢక్కాడిండిమములు మ్రోగించుచు భూతములతో తాను ప్రహరి తిరుగుచుండగ, వెన్నెల అను మధువును త్రాగి చకోరములు దేవాలయ వీథులలో పరవశము చెంద, ఆనంద కాననమున సిందువార వృక్ష పుష్పము వాడిపోవుచుండ, గాలిలేని రాతి మఠములందు యతులు ప్రాణాయామము అభ్యసించుచుండ, వయసు ముదిరిన చంద్రుడు ఒత్తిగిల్లెను. చిక్కని వెన్నెల కాయుచుండగా వ్యాసుడు శోకించి శోకించి ఎట్లో నిద్రించెను.

**విశేషము** :- 'తఱపి' అను పదము గోమహిషాదులయందు పాడి విషయమున వ్యవహరింపబడుచుండును. శ్రీనాథుడు 'చిక్కని' అను అర్థమున ప్రయోగించుచుండును.
"తఱపి వెన్నెలలోని ధావళ్యమొక కొంత..." కాశీ. 1-123.

వ॥ అంత. 47

అంత=అప్పుడు.

## సూర్యోదయ వర్ణనము :

చం. వెలవెలఁబాఱెఁ జంద్రుఁడును విన్నునఁదారక చక్ర వాళముల్
పలపలనయ్యెఁ దీర్ఘికలఁ బద్మవనంబుల షట్పదాంగనా
కలకలముల్ చెలంగె, వెడకన్ను మొగిడ్చె లలిం గుముద్వతుల్
తెలతెలవాఱె జంభరిపు దిక్కునఁదోఁచె ననూరు రాగముల్ 48

అర్థము :- విన్నునన్=ఆకాశమునందు; చంద్రుఁడును=చంద్రుడును; వెలవెలఁబాఱెన్=తెలతెలబోయెను; తారక=నక్షత్రముల; చక్రవాళముల్=సమూహములు; పలపలనయ్యె=కాంతిహీనములయ్యెను; దీర్ఘికలన్=దిగుడుబావులయందు; పద్మవనంబుల=తామర పూవుల గుంపులో; షట్పద+అంగన=ఆడ తుమ్మెదల; కలకలముల్=కలకలధ్వనులు; చెలంగెన్=అతిశయించెను; లలిన్=క్రమముగ; కుముద్వతుల్=తెల్లకలువలుండు చోటులు (సరస్సులు); వెడ=కొంచెముగా; కన్ను=నేత్రమును; మొగిడ్చె=మూసికొనెను; జంభరిపు దిక్కునన్=ఇంద్రుని దిక్కు అయిన తూర్పున; అనూరు=సూర్యరథసారథియైన అనూరుని (అరుణుని); రాగముల్=ఎరుపు రంగులు; తోఁచెన్=కన్పడెను.

భావము :- ఆకాశమున చంద్రుడు తెలతెలబోయెను. నక్షత్ర సమూహములు పలచన అయ్యెను. పద్మ వనములలో ఆడ తుమ్మెదల కలకలములు ఎక్కువయ్యెను. తెల్లకలువలు ముకుళించుకొనెను. తూర్పు దిక్కున అరుణ కాంతులు కన్పడెను.

సీ॥ ప్రథమ సంధ్యాంగనా ఫాలభాగంబునఁ
జెలువారు సిందూర తిలకమనఁగఁ
గైసేసి పురుహూతు గారాపు టిల్లాలు
పట్టిన రత్న దర్పణ మనంగ
నుదయాచలేంద్రంబు తుదఁబల్లవించిన
మంజు కంకేళి నికుంజ మనఁగ
శతమన్యు శుద్ధాంత సౌధకూటము మీఁద
గనుపట్టు కాంచన కలశమనఁగఁ

తే॥ గాలమనియెడు సిద్ధుండు గమిచి మ్రింగి
కుతుక మొప్పఁగ నుమిసిన ఘుటిక యనఁగ
గగన మందిర దీపికా కళికయనఁగ
భానుఁడుదయించె దేదీప్యమానుఁడగుచు. 49

అర్థము :- భానుఁడు=సూర్యుడు; దేదీప్యమానుఁడగుచు=మిక్కిలి ప్రకాశించుచు; ప్రథమ సంధ్యాంగనా=ప్రాతఃకాల సంధ్య అను స్త్రీ యొక్క; ఫాలభాగంబున=నుదుటి ప్రదేశమున; చెలువారు=ఒప్పు; సింధూర తిలకము+అనఁగన్=ఎఱ్ఱని సిందూరపు బొట్టు అనగ-

కైసేసి=అలంకరించుకొని; పురుహూతు=ఇంద్రుని; గారాము+ఇల్లాలు=ప్రియమైన భార్య అగు శచీదేవి; పట్టిన=చేత ధరించిన; రత్న=రత్నములతో నిర్మింపబడిన; దర్పణము+అనంగన్=అద్దమనగ -

ఉదయ+అచల+ఇంద్రంబు=తూర్పుకొండ; తుదన్=పై భాగమున; పల్లవించిన= చిగిర్చిన; మంజు=మనోహరమైన; కంకేళి=అశోక వృక్షపు; నికుంజము+అనఁగన్=పొదరిల్లు అనగ -

శతమన్యు=నూరు యాగములు చేసిన ఇంద్రుని; శుద్ధాంత=అంతఃపుర; సౌధకూటము మీఁదన్=భవన శిఖరము మీద; కనుపట్టు=కన్పించు; కాంచన=బంగారపు; కలశము+ అనఁగన్= కుండ అనగ-

కాలము+అనియెడి=కాలము అను; సిద్ధుఁడు=ఔషధ రహస్యవేత్త; కమిచి=కొరికి; మ్రింగి=మ్రింగి; కుతుకము+ఒప్పఁగన్=సంతోషముతో; ఉమిసిన=ఉమ్మివేసిన; ఘుటిక అనఁగన్=మాత్ర అనగ; గగన మందిర=ఆకాశము అనెడి గృహమున ప్రకాశించు; దీపికాకళిక+ అనఁగన్=మొగ్గవంటి దీపము అనగ; ఉదయించెన్=ఉదయించెను.

భావము :- ప్రాతఃకాల సంధ్య అను స్త్రీ యొక్క నుదుటి సిందూరపు బొట్టు అనగ. అలంకరించుకొనిన శచీదేవి చేత ధరించిన అద్దము అనగ, తూర్పుకొండపై చిగిర్చిన అశోక వృక్షపు పొదరిల్లు అనగ, ఇంద్రుని సౌధముపైగల బంగారు కలశము అనగ, కాలము అను సిద్ధుడు మ్రింగి ఉమిసిన మాత్ర అనగ, ఆకాశము అను మందిర మందలి ప్రకాశించు దీపకాంతి అనగ - సూర్యుడు ఉదయించెను.

**విశేషము :-** ఈ పద్యమునందలి "ప్రథమ సంధ్యాంగనా ఫాలభాగంబునఁజెలువారు సింధూర తిలకమనఁగ" అనుచరణము సుబంధుని గద్య గ్రంథమైన 'వాసవదత్త' యందలి

- "ప్రాచీ కుమారీ లలాట తట ఘటిత కుంకుమ తిలక బిందౌ" (పుట-273) అను వచనమునకు తెలుగు గొంతు.

ఇట్లే "కైసేసి పురుహూతు గారాపు టిల్లాలు పట్టిన రత్నదర్పణ మనంగ" - అను చరణము కూడ సుబంధుని "కనక దర్పణ ఇవ ప్రాచీ విలాసిన్యాః" (పుట-272) అనుదాని తెలుగు సేతయే.

సిద్ధుని గుళిక :- రస సిద్ధిని సాధించిన యోగులు ద్రవరూపమైన పాదరసమును గుళికగ(మాత్రగ) చేసి మ్రింగుదురు. ఇదియే సిద్ధుని గుళిక - రస ఘుటిక.

ఘుటికా సంసిద్ధుఁడు రస
ఘుటికయునుంబోలె శివుఁడు గుటుకున మ్రింగెన్ భీమ-(4-66)
అలంకారము - ఉత్ప్రేక్ష.

## వ్యాస మహర్షి యాత్రకు వెడలుట :

ఇట్లు సూర్యోదయంబగుటయు బాదరాయణుండు కాలోచిత కృత్యంబులు నిర్వర్తించి గమనోన్ముఖుండై కాశీ వియోగజనిత వేదనాభరంబు దుస్సహంబై యంతరంగంబుఁ గుందింప నెట్టకేలకు నేటి కెదురీఁదు విధంబున శిష్యులుం దానును గనద్ఘన కనక మణిమయ సౌధాట్ట విలాసంబైన యప్పట్టణంబునకుఁ బ్రదక్షిణ క్రమంబునఁ జనువాఁడై లోలార్క కేశవులకు నభివాదనంబును, భాగీరథికి నంజలి బంధంబును, విశ్వనాథునకు వినుతియు, విశాలాక్షికిఁ బ్రార్థనంబును, మోక్ష మంటపంబునకు జయకారంబును, నంతర్గేహంబున కామంత్రణంబును, గాల భైరవునకు జోహారును, డుంఠి వినాయకునకు శరణార్థము, దండపాణికి దండప్రణామంబును, గుక్కుట చతుష్టయంబునకు మ్రొక్కును సకల దేవతా కోటికి నేటికోళ్లును జేసి చనునప్పుడు కతిపయ దిన ప్రయాణంబున - 50

అర్థము :- ఇట్లు=ఈవిధముగ; సూర్య+ఉదయంబు+అగుటయు=సూర్యుడు ఉదయింపగా; బాదరాయణుండు=వ్యాసుడు; కాల+ఉచిత కృత్యంబులు=ఉదయమున సలుపవలసిన విధులను; నిర్వర్తించి=పూర్తి చేసికొని; గమన+ఉన్ముఖుండై=ప్రయాణమునకు సిద్ధమైనవాడై; కాశీవియోగ జనిత=కాశికి దూరమగు చుంటినను భావము వలన పుట్టిన; వేదనా భరంబు=బాధ యొక్క తీవ్రత; దుస్సహంబై=సహింపరానిదై; అంతరంగంబున్= మనస్సును; కుందింపన్=బాధపెట్ట; ఎట్టకేలకు=చిట్ట చివరకు; ఏటికి+ఎదురు+ఈఁదు

విధంబున= ప్రవాహమునకు ఎదురుగా ఈదురీతిగా; శిష్యులున్+తానును=శిష్యులును వ్యాసుడును; కనత్= ప్రకాశించుచున్న; ఘన=గొప్పవైన; కనక మణిమయ=బంగారము మణులతో నిండిన; సౌధ= భవనములతోడను; అట్ట=మేడపై వెనుకగల గదులతోడను; విలాసంబు+ఐన=విరాజిల్లు చున్న; ఆ+పట్టణంబునకు=ఆ కాశీ నగరమునకు; ప్రదక్షిణ క్రమంబునన్=కుడివైపుగా తిరిగి నమస్కరించుటకు; చనుఁవాఁడై=వెడలదలచిన వాడై-

లోలార్క కేశవులకు=లోలార్కునకు, కేశవునకు; అభివాదనంబును=పాదములు తాకిచేయు నమస్కారమును; భాగీరథికిన్=గంగకు; అంజలి బంధంబును=రెండు చేతులు కలిపి చేసెడి నమస్కారమును; విశ్వనాథునకు=విశ్వేశ్వరునకు; వినుతియు=స్తోత్రములతో కూడిన నమస్కారము; విశాలాక్షికిన్=విశాలాక్షికి; ప్రార్థనంబును=వేడుకొను నమస్కారమును; మోక్షమంటపంబునకు=ముక్తి మంటపమునకు; జయకారంబునున్=జయమగుగాక అని సేవక భావముతో పలుకు నమస్కారము; అంతర్గేహంబునకు=విశ్వేశ్వర మందిరము యొక్క లోపలి భాగమునకు; ఆమంత్రణంబునున్=వీడుటకు అనుమతి తీసికొను నమస్కారము; కాలభైరవు నకు=కాలభైరవునకు; జోహారును=గొప్ప ప్రకటించెడి నమస్కారమును; డుంఠి వినాయకునకు=డుంఠి విఘ్నేశ్వరునకు; శరణార్థము=ఆశ్రితుడుగచేయు నమస్కారమును; దండపాణికి=దండపాణికి; దండప్రణామంబును=కఱ్ఱవలె సాగిలిపడి చేసెడి నమస్కారమును; కుక్కుట చతుష్టయంబునకు=నాలుగు కోళ్లకు; మ్రొక్కును=అర్పణములతో కూడిన నమస్కారము; సకల దేవతా కోటికి=సమస్త దేవతల సమూహమునకు; ఏటికోళ్లునున్= మనస్సులో స్మరించు నమస్కారమును; చేసి=చేసి; చనునప్పుడు=బయలుదేరి; కతిపయ దిన ప్రయాణంబున=కొన్ని దినములు ప్రయాణము చేయగ -

భావము :- సూర్యోదయమున కాలకృత్యములు తీర్చుకొని వ్యాసుడు, కాశిని వీడుటకు చాల బాధపడి, కాశీ క్షేత్రమునగల ముఖ్య దేవతలందరకు నమస్కరించి, బయలుదేరి కొన్ని దినములు ప్రయాణము చేసి -

విశేషము :- ఈ సందర్భమున శ్రీనాథుడు కాశీక్షేత్రమునందలి లోలార్క కేశవులకు, భాగీరథికి, విశ్వనాథునకు, విశాలాక్షికి, మోక్షమంటపమునకు, అంతర్గేహమునకు, కాలభైరవునకు, డుంఠి వినాయకునకు, దండపాణికి, కుక్కుట చతుష్టయమునకు వ్యాసుని చేత నమస్కారములు చేయించి, ఆ కాశీ క్షేత్రమున ముఖ్యములైన వేవియో తెలిపినాడు. వీనిలో విశ్వనాథుడు, విశాలాక్షి, అంతర్గేహము(గర్భాలయము ముందర ప్రదేశము), భాగీరథి - అను వానిని వివరింప నవసరము లేదు. మిగిలిన లోలార్కుడు, కేశవుడు, మోక్షమంటపము, కాలభైరవుడు, డుంఠి వినాయకుడు, దండపాణి, కుక్కుట చతుష్టయము - అను వానిని గూర్చి కొంచెము పరిచయము అవసరము. వీనిని గూర్చి సంగ్రహ పరిచయమిది -.

**లోలార్కుడు** :- లోలార్కుడు అను నామముతో కాశీ క్షేత్రమున దక్షిణ దిక్కున కల సూర్యుడు - "కాశీ వాస నిమిత్తంబుగా మనంబు లోలంబగుట లోలార్కుండయ్యె" - అని కాశీఖండము (5-325).

తస్యార్కస్య మనోలోలం యదాసీత్కాశి దర్శనే

అతో లోలార్క ఇత్యాఖ్యా కాశ్యాం జాతా వివస్వతః కాశీ; అధ్యా-46, శ్లో-48.

కాశీక్షేత్రమున ద్వాదశాదిత్యులు కలరు. వీరిలో లోలార్కుడు ముఖ్యుడు. కాశిలోగల ద్వాదశాదిత్యులు విగ్రహమూర్తులు కారు. చక్ర రూపములో అర్చనలు అందుకొనుచుందురు. లోలార్కుడు తులసీఘాట్ వద్ద గోడపై చక్రాకారముతో ఉన్నాడు.

**కేశవుడు** :- ఆది కేశవస్వామి అను నామముతో కాశీ క్షేత్రమున ఉత్తర దిక్కునందుకల విష్ణువు. కాశిలో ఎందరో కేశవస్వాములు కలరు. కాశికి మొదటగా వచ్చిన విష్ణువు ఆదికేశవ స్వామి. "పాదోదకంబను ప్రథమతీర్థంబున నాది కేశవుఁడన నధివసించు" - అని కాశీఖండము,(6-120).

**మోక్షమంటపము** :- విశ్వేశ్వర మందిరమునకు దక్షిణముగానున్న మంటపము. ముక్తి మంటపము, అపవర్గ మంటపము, అని కూడ అందురు. మణి కర్ణికలో స్నానము చేసి ఈ మంటపమున శైవ పురాణ కథలు వినుట కర్తవ్యము - (కాశి 7-229).

**కాలభైరవుడు** :- కాశీ పట్టణ క్షేత్ర పాలకుడు. "వీటి పెద్ద తలారి, దిస్స మొలవేల్పు." (కాశీ - 2-38); "కత్తి ప్రీడాశూన్య కటి గోపురద్వార పరిరక్షకుండు కాలభైరవుండు" - అని కాశీఖండము (1-2).

**డుంఠి వినాయకుడు** :- 'డుంఠి' అను పేరుగల వినాయకుడు. ఈ వినాయకుని పేరు 'డుంఢియా? లేక డుంఠియా? అన్నది అనుమానమే.

అన్వేషణే డుఢిరయం ప్రథితోస్తి ధాతుః సర్వార్థ డుంఢి తతయా తవడుంఢి నామ

కాశీ ప్రవేశమపి కోలభతేత్రదేహీ తోషం వినా తవ వినాయక డుంఢిరాజ.

అని సంస్కృత కాశీఖండములో (అధ్యా-57.; శ్లో-33) 'డుంఢి' నామము కలదు.

కాని శ్రీనాథుడు 'డుంఠి' అను నామమునే స్వీకరించినాడు.

కంఠ పీఠాగ్రకరిరాజ! డుంఠిరాజ! కాశీ - 6-96

కంఠాగ్ర కరిరాజు డుంఠి విఘ్నేశుండు కాశీ - 1-2

డుంఠి విఘ్నేశు చెవులుత్కంఠఁజేరె భీమ - 2-28

కాశిలోనున్న డుంఠి వినాయకుని విగ్రహమున తుండము ఎడమ చేతి వైపు ఉండును. కంఠవేదిపై చంద్రుడు ఉండును.

**దండపాణి** :- కాశీ క్షేత్రమున కాలభైరవుని తరువాత రెండవ క్షేత్రపాలకుడు. హరికేశుడు అను యక్షుడు. శివుని దయకు పాత్రుడై ప్రమథ పరివారమునకు దండనాయకుడైనాడు. (కాశీఖండము - పంచమాశ్వాసము - హరికేశ చరిత్రము).

భరియించునాతండు పాణిపల్లవమున
వెండికట్టులతోడి దండయష్టి
వసియించు నాతండు వారాణసీపుర
ప్రాకార గోపుర ప్రాంత భూమి
ధరియించు నాతండు తప్తారకూట రు
క్పరిపాటలచ్ఛాయఁబల్లజడలు
సవరించునాతండు సతతంబు రుద్రాక్ష
భూషావిభూతి త్రిపుండ్రకములు
సౌమ్యరూపంబు వహియించు సజ్జనులకుఁ
బాపమతులకు వికృత రూపంబుఁదాల్చుఁ
బింగళాక్షుండు దీర్ఘగంభీర మూర్తి
చండికాపతి ప్రమథుండు దండపాణి

కాశీ. 5-128.

**కుక్కుట చతుష్టయము** :- మహానందుడు అను బ్రాహ్మణుడు, అతని భార్య, ఇద్దరు తనయులు చేయరాని పనులు చేసి ధనము సంపాదించి, దొంగలచే చంపబడి. మరుజన్మమున ఆ నలుగురు కోళ్లుగా పుట్టి పుణ్య కార్యములు చేసి, శివుని అనుగ్రహము వలన మోక్షము పొందిరి. ముక్తి మంటపమును ఆశ్రయించి మోక్షము పొందిన ఆ నాలుగు కోళ్లే కుక్కుట చతుష్టయము. (కాశీఖండము - సప్తమాశ్వాసము - విశ్వేశలింగ మాహాత్మ్యము).

సీ॥ గంగానదీ ప్రవాహఃకణము మాధవదేవు
దోరంతరంబు శ్రీ తులసి చిగురుఁ
బురుషోత్తమమునందుఁ బుండరీకాక్షుని
దివ్యపాదాంభోజ తీర్థజలము
శ్రీ కూర్మమున యందు శేషాహి పర్యంకు
కంఠంబు క్రొత్త చెంగల్వదండ
సింహాద్రియందు లక్ష్మీనృకంఠీరవ
సార్వభౌము ప్రసాద చందనంబుఁ

తే॥ గాశికావిప్రయోగోరు గాఢతాప
శాంతి కొదవెను శిశిరోపచారమగుచుఁ
జాయ తెరువున శ్రీ బాదరాయణునకు
హరి హరధ్యాన పూజా పరాయణునకు. 51

అర్థము :- హరిహర=విష్ణువును, శివుని; ధ్యాన=మనస్సులో స్మరించుట; పూజ= కొలుచుట యందు; పరాయణునకు=లగ్నమైన వానికి; బాదరాయణునకు=వ్యాసునకు -

గంగానదీ=గంగానది యొక్క; ప్రవాఃకణము=జలబిందువులు; మాధవ దేవు=వేణీ మాధవుడను దేవుని; దోః+అంతరంబు=ఱొమ్ముపై కల; శ్రీ తులసి=శ్రీ తులసి యొక్క; చిగురున్=లేత దళము -

పురుషోత్తమమునందున్=పురుషోత్తమము అను పేరుకల పూరీ క్షేత్రమునందు; పుండరీక+అక్షుని=విష్ణువు యొక్క; దివ్య=దివ్య; పాద+అంభోజ=పాద పద్మముల; తీర్థజలము=తీర్థము యొక్క నీరు.

శ్రీ కూర్మమున యందు=శ్రీ కూర్మము అను క్షేత్రమునందలి; శేష+అహి+పర్యంకు= శేషుడను సర్పమును శయ్యగాగల విష్ణువు యొక్క; కంఠంబు=మెడలోని; క్రొత్త=అప్పుడే వేసిన; చెంగల్వ దండ=ఎఱ్ఱకలువల దండ.

సింహాద్రి=సింహాద్రి అను క్షేత్రమునందు; లక్ష్మీనృకంఠీరవ=లక్ష్మీనరసింహుడను; సార్వభౌము=స్వామి యొక్క; ప్రసాద=ప్రసాదమైన; చందనంబున్=చందనము -

కాశికా=కాశి యొక్క; విప్రయోగ=ఎడబాటు వలన కలిగిన; ఉరు=గొప్ప; గాఢ= తీవ్రమైన; తాప=తాపము యొక్క; శాంతికి=ఉపశమించుటకు; శిశిర+ఉపచారము+అగుచున్ =చల్లదనము కలిగించు సపర్యయగుచు; చాయ తెరువున=నీడవలె; ఒదవెన్=ఒప్పెను.

భావము :- కాశీ వియోగముచే తపించుచున్న వ్యాసునకు-ప్రయాగ యందలి గంగా జలబిందువులును, వేణీ మాధవస్వామి తులసీదళము, పూరీ జగన్నాథ స్వామి పాదతీర్థము, శ్రీ కూర్మము శేషశాయి ఎఱ్ఱ కలువల దండ, సింహాచలము లక్ష్మీనృసింహ స్వామి చందనము - చల్లని నీడవలె శిశిరోపచారమగుచు శాంతి చేకూర్చెను.

విశేషము :- శ్రీనాథుడు ఒక్క పద్యముతో వ్యాసుని కాశి నుండి ఆంధ్రదేశమునకు చేర్చినాడు.

ప్రయాగ - ఉత్తరప్రదేశ్‌లోని అలహాబాదు చెంతగల ప్రదేశము. త్రివేణీ సంగమ మిక్కడే.

పురుషోత్తమము అనగా పూరి. ఇక్కడ ప్రధాన దైవము జగన్నాథ స్వామి. ఈ పూరి క్షేత్రము ఒరిస్సా రాష్ట్రమునందు భువనేశ్వర్ సమీపమునందున్నది.

విష్ణు క్షేత్రములను పురుషోత్తమము అని వ్యవహరించుట చాలచోట్ల కన్పడు విషయము. సింహాచలమును కూడ పురుషోత్తమము అని వ్యవహరించుట కలదు.

శ్రీ కూర్మము అను క్షేత్రము ఆంధ్రప్రదేశ్ అందలి శ్రీకాకుళము జిల్లాలో సూర్యక్షేత్రమైన అరసవిల్లికి సమీపమునందున్నది. అక్కడ ప్రధాన దైవము శ్రీకూర్మనాథ స్వామి. శ్రీ హరి కూర్మ రూపములో నుండుట ఇక్కడ ముఖ్య విశేషము. శ్రీ కూర్మనాథ స్వామి కాక గోవిందరాజస్వామి. చక్రనారాయణ స్వామి, బలినారాయణ స్వామి, నరనారాయణ స్వామి అను మూర్తులు కూడ ఇక్కడ కలవు.

సింహాద్రి ఆంధ్రప్రదేశ్‌లో విశాఖ పట్టణ సమీపమునందున్నది. ఇక్కడ ఒక్క అక్ష తృతీయ దినమున తప్ప సంవత్సరమంతయు చందనము పూసిన రూపముతో నుండి విగ్రహ మూర్తి కన్పడదు. అక్ష తృతీయ అనగా వైశాఖ శుద్ధ తృతీయ.(తదియ)

## పీఠికాపుర వర్ణనము

సీ॥ ఏ పట్టనము మ్రోల నేలేఱు ప్రవహించుఁ
బృథివికి ముత్యాల పేరువోలె
మున్నూట యఱువది మూర్తిభేదములతో
విహరించు నేవీట వేల్పుపిండు
పీఠాంబ చెలి యోగ పీఠిహుంకృతిదుర్గ
ననిచి కాపుండు నే నగరి కెలనఁ
గుంతీమహాదేవి కూర్మి మేనల్లుఁడు
మాధవుండే వీట మరగినాఁడు.

తే॥ పెద్ద గవఁకుల నే పుటభేదనమున
నెలమి నిలుచుండు వ్రీడా విహీనజఘనుఁ
డట్టి పీఠాపురముఁజేర నరుగు దెంచెఁ
పరమ శైవుండు శ్రీపరాశర సుతుండు.

52

అర్థము :- పరమ శైవుండు=గొప్ప శివభక్తుడైన; శ్రీ పరాశర సుతుండు=పరాశర మహర్షి కుమారుడైన వ్యాసుడు;

ఏ పట్టనము=ఏ నగరము యొక్క; మ్రోలన్=సమీపమునందు; ఏలేఱు=ఏలేరు అను పేరుకల నది; పృథివికి=భూమికి; ముత్యాల=ముత్యముల; పేరు వోలె=హారము వలె; ప్రవహించున్=ప్రవహించు చుండునో -

ఏవీట=ఏ పట్టనమునందు; మున్నూట యఱువది=మూడు నూరుల అరువది; మూర్తి భేదములతో=ఆకార భేదములతో; వేల్పు పిండు=దేవతల సమూహము; విహరించున్=సంచరించుచుండునో -

ఏ నగరి=ఏ పట్టనము యొక్క; కెలనన్=ప్రక్కన; పీఠాంబ చెలి=పీఠాంబ స్నేహితురాలైన; యోగపీఠి=ధ్యాన పీఠమునందు; హుంకృతి దుర్గ=హుంకార దుర్గ; అనిచి=ఆజ్ఞాపించి; కాపు+ఉండున్=కావలి యుండునో -

ఏవీట=ఏ పట్టనమున; కుంతీ మహాదేవి=కుంతి యొక్క; కూర్మి మేనల్లుడు= ప్రియమైన మేనల్లుడు; మాధవుండు=కుంతీ మాధవుడు; మరగినాఁడు=పరిచితమైన వాడో-

ఏపుట భేదనమున=ఏ పట్టణమున; వ్రీడా=సిగ్గు; విహీన=లేని; జఘనుఁడు=మొల కలవాడు - అనగా దిగంబరుడైన కాలభైరవుడు; పెద్ద గవఁకులను=గొప్ప గోపురముల కడ; ఎలమి=ప్రీతితో; నిలుచుండు=నిలుచుండునో -

అట్టి=అటువంటి; పీఠాపురమున్=పిఠాపురమును; చేరన్=సమీపింప; అరుగుదెంచెన్=వచ్చెను.

భావము :- ఎక్కడ-ఏలేరు ప్రవహించుచుండెనో; మూడు వందల అరువది దేవతలు సంచరించు చుండిరో; పీఠాంబ చెలియైన హుంకార దుర్గ కావలియుండెనో; కుంతీ మాధవ స్వామి యుండెనో; దిగంబరుడై కాలభైరవుడుండెనో - అట్టి పిఠాపురమును వ్యాస మహర్షి సమీపించెను.

విశేషము :- పిఠాపురము, పీఠాపురము, పీఠికాపురము - అను ఈ మూడు నామములు అర్వాచీనములు. ప్రాచీన నామము - పిష్టపురము. ఈ పిఠాపురము తూర్పు గోదావరి జిల్లాయందలిది. కుంతీ మాధవుడు పంచ మాధవులలో ఒకడు.

"పంచ మాధవుల లోపలఁగుంతి మాధవు
సదనమై మిగులఁబ్రశంస కెక్కె"

*పిఠాపుర వర్ణనము - సుకవి మనోరంజనము 1-81.*

పంచ మాధవులు :- కుంతీ మాధవుడు(పిఠాపురము); వేణీ మాధవుడు(ప్రయాగ); లీలామాధవుడు(రామతీర్థము); సేతుమాధవుడు(రామేశ్వరము); బిందుమాధవుడు(వారణాసి).

తే॥ నారికేళంపు మట్ట నెన్నడిమిచాయ
దళములందును బోలె సంతతముఁబాఱు
వేణికా పారణుల యందు విస్మయముగ
జగతి నెక్కడి వేలేటి సాటి నదులు. 53

అర్థము :- నారికేళంపు=కొబ్బరి చెట్ల; మట్ట=మట్టల; నెన్నడిమి చాయ=అందమైన మధ్య భాగమునందలి రంగు; దళములందునున్+పోలె=ఆకులందు ప్రవహించునట్లు; సంతతమున్=ఎల్లప్పుడు; విస్మయముగ=ఆశ్చర్యముగ; వేణికా పారణులందు=అనేక ప్రవాహములైన కాలువలందు; పారు=ప్రవహించు; ఏలేటి=ఏలేరు అను నదితో; సాటి= సమానమైన, నదులు=తరంగిణులు; జగతిన్=లోకమున; ఎక్కడివి=ఎక్కడ ఉన్నవి?

భావము :- కొబ్బరి మట్టల అందమయిన మధ్యభాగమునందుగల వర్ణము ఆకులందు ప్రవహించునట్లు, అనేక ప్రవాహముల రూపములగు కాలువలందు ఎల్లప్పుడు ఆశ్చర్యకరముగ ప్రవహించు ఏలేరు వంటి నదులు లోకములో నెక్కడ నున్నవి?

విశేషము :- కొబ్బరి మట్టవలె ఏలేరున్నది. అందుండి ప్రక్కలకు పోవు కాలువలు కొబ్బరి ఆకులవలె నున్నవి. మట్ట మధ్య అందముగానున్న చాయ ఆకులలోనికి పోవుచున్నట్లు, ఏలేరు నీరు కాలువలలో ప్రవహించుచున్నది.

అలంకారము - ఉపమ.

సీ॥ ఏఁటేఁట విరినీట నిరుగారునుంబండుఁ
బ్రాసంగు వరిచేలఁబసిఁడి చాయఁ
బరిపాకమున వేరుపనసపండుల తావి
యిందిందిరములకు విందు సేయు
వేఁబోఁకఁ బొలుపారు వింధ్యాద్రి పవనంబు
పోఁక పువ్వుల తావిఁ బుక్కిలించు
వేశ్యవాటికలందు విహరించు వలరాజు
ననయంబుఁ జెఱకు విల్లును ధరించు

తే॥ నారదంబుల వలపు పొన్నలఁబెనంగి
విచికిలామోదములతోడ వియ్యమంది
పాటలీ పుష్ప కేతకీ పరిమళములు
పొదల విలసిల్లుఁ బీఠికా పురము నందు 54

అర్థము :- పీఠికాపురమునందు=పిఠాపురమునందు; ఏఁటేఁట=ప్రతి సంవత్సరము; విరినీట=పుష్పములతో కూడిన నీటి వలన (విరివియైన జలముతో); ఇరు+కారునున్=తొలకరి, పైర - అను రెండు కాలములందు; చేలన్=పొలములందు; పసిఁడి చాయన్=బంగారు రంగు కల; ప్రాసంగు వరి=ప్రాసంగు అను వరి పంట; పండున్=పండును.

పరిపాకమున=మంచి పక్వమునకు వచ్చిన; వేరు పనస=వేరునకు కాయు పనస; పండుల తావి=పండుల వాసన; ఇందిందరములకు=తుమ్మెదలకు; విందు చేయు=విందు చేయును.

వేఁబోఁకన్=తెల్లవారుజామున; పొలుపారు=ఒప్పు; వింధ్య+అద్రి=వింధ్య పర్వతపు; పవనంబు=గాలి; పోఁక పువ్వుల=పోక పూల; తావి=వాసనను; పుక్కిలించు=నోట గ్రహించి క్రక్కును.

వేశ్యవాటికలందు=వేశ్యల గృహములందు; విహరించు=తిరుగు; వలరాజు= మన్మథుడు; అనయంబుఁ=ఎల్లవేళల; చెఱకు విల్లును=చెఱకు ధనుస్సును; ధరించు= పట్టుకొని యుండును.

నారదంబుల=నారింజలను; వలపు పొన్నలన్=సువాసన పొన్న చెట్లను; పెనంగి= చుట్టుకొని; విచికిల=మల్లె; ఆమోదములతోడ=వాసనలతో; వియ్యమంది=చుట్టరికము కలుపుకొని; పాటలీ పుష్ప=కవిగొట్టు పూల; కేతకీ పరిమళములు=మొగలి వాసనలు; పొదలన్= వ్యాపింపగా; విలసిల్లున్=విలసిల్లును.

భావము :- పిఠాపురమున ప్రతి సంవత్సరము రెండు కారులందు ప్రాసంగి వరి పండును. వేరు పనస వాసనలకు తుమ్మెదలు మూగును. (తెల్లవారుజామున) వింధ్య పర్వత వాయువులు పోకపూల వాసనతో నుండును. వేశ్యవాటికలలో నిత్యము మన్మథలీలలు సాగు చుండును. పాటలీపుష్పముల మొగలి వాసనలు - నారింజలతో, సువాసన పొన్న చెట్లతో పెనగులాడి, మల్లెవాసనలతో బంధుత్వము కలుపుకొని బాగుగా గుబాళించును.

**వ॥ వెండియు నవఖండ మండలంబగు మహీమండలంబునకు మకర కుండలాలంకారంబునుంబోలె భీమేశ్వర మండలంబు పొరువునఁద్రిలింగోత్కల తలంబుల సంధి వింధ్యాచల పాదంబునఁగేదార కుంభ కోణార్క స్థానంబుల కుపమానంబనఁజాలి యేలేటి మేటి కాలువల వలన నదీ మాతృకంబులగు పంటవలంతి సలిల ధౌత కలధౌత శలాకాశకల సంకోచంకరణంబులై యంకురించి నవియును, గొదమ పసరు ఱెక్కల పక్కిడాలు పుక్కిలించి యుమియంజాలు చాయ లేర్పడం బసరుపాఱు నవియును, దక్షారామ రామాజనంబుల చిఱుపిక్కల**

చక్కఁదనంబు నెకసక్కెంబాడు బిగువు పొట్టలం గనుపట్టునవియును, బధిక
నాసాపుటీ కుటీరంబులకుఁ గుటుంబకములగు కమ్మఁదనంబులీని పొలుకుడిచి
సుందరీ ప్రాయంబున నాము వలచునవియును, బదియాఱు వన్నె కుందనంపుఁ
దగడుఁదెగడుచుఁబండి యుద్దండ కేదారవలయ కుముద షండంబు
లాఘ్రాణింపనుంబోలెఁ గ్రైవ్రాలునవియు నగు కలమ శాలి శారదా ముఖాది వ్రీహి
సస్యంబుల వలనను, నిరంతర నారికేళచ్ఛదచ్ఛాయాచ్ఛన్న హరిదంతరంబుల
భుజంగ వల్లీమతల్లికాలింగిత క్రముక కంఠోపకంఠంబులఁ గ్రీడించు చిక్రోడ దశన
దష్ట స్వాదిష్ఠ పనస ఫల రససారణీ పరంపరా సంపూర్ణ చంపక ద్రుమాలవాల
వలయంబులు, వనదేవతా విలాస తాళ వృంతాయమాన రంభా పలాశ
సంభారంబులుఁ దిలకతిలకితంబులు, వికచ విచికిలంబులుఁ, గోరకిత
కురువకంబులు, నిబిడరసకేసరంబులు, నఖిల భువనాభిరామంబులునైన
యారామంబుల వలనను గన్నుల పండువై కుంతీ మాధవునకు విశ్రాంతి
ప్రదేశంబును, హుంకారిణీ మహాదేవికి విహార సంకేత భవనంబును, వీతాంబికా
లక్ష్మి కాటకూటంబును, హేలాసానికి హాలాపాన గోష్ఠీ మంటపంబును, ననందగి
భూత భేతాళ డాకినీ ప్రేత ప్రముఖ భైరవ వ్రాత నిర్మిత ప్రాకార వప్రహట్ట కుట్టిమంబగు
55
పీఠాపట్టనంబుఁబ్రవేశించి రంత -

అర్థము :- వెండియున్=మరల; నవఖండ మండలంబు+అగు=తొమ్మిది ఖండముల సమూహముతో కూడినదగు; మహీమండలంబునకు=భూమండలమునకు; మకర కుండల+అలంకారంబునున్+పోలె=మొసలి ఆకారముగానుండు చెవి ఆభరణము వలె; భీమేశ్వర మండలంబు=భీమ దేవుని మండలము; పొరువున=దాపున; త్రిలింగ+ఉత్కళ తలంబుల=త్రిలింగ, ఉత్కళ ప్రదేశముల యొక్క; సంధిన్=కలియుచోట; వింధ్య+అచల పాదంబున=వింధ్య పర్వతము యొక్క క్రింద భాగమున; కేదార కుంభకోణార్క స్థానంబులకు=కేదార కుంభ కోణార్క ప్రదేశములకు; ఉపమానంబు+అనన్+చాలి=సాటియనగ తగినదై.

ఏలేటి=ఏలేరు యొక్క; మేటి కాలువల వలన=గొప్ప కాలువల వలన; నదీ మాతృకంబులు+అగు=నదీ జలముచే పండెడు పైరుగలదియగు; పంట వలంతిన్=భూమి యందు; సలిలధౌత=నీటిచే కడుగబడిన; కలధౌత=వెండి; శలాకా=కడ్డీ; శకల=ముక్కలను; సంకోచం కరణంబులై=తక్కువ చేయునవియై; అంకురించినవియునున్=మొలకెత్తినవి యును;

కొదమ=లేత; పసరుఱెక్కల=పచ్చని రెక్కలుగల; పక్కిడాలు=పక్షి కాంతిని; పుక్కిలించి ఉమియన్+చాలు=పుక్కిలించి ఉమ్మివేయకల(లెక్క చేయని); చాయలు+ఏర్పడన్=రంగుతో కూడి; పసరు పాఱునవియును=పసరు పట్టినవియును;

దక్షారామ రామాజనంబుల=దక్షారామమునందలి యువతుల; చిఱుపిక్కల= చిన్నపిక్కల; చక్కఁదనంబున్=అందమును; ఎకసక్కెంబు+ఆడు=పరిహసించు; బిగువు పొట్టలన్=బింకమైన పొట్టలతో; కనుపట్టునవియున్=కన్పడునవియును;

పథిక=బాటసారుల; నాసా పుటీ=ముక్కు ముందరి భాగములనెడి; కుటీరం బులకు=నిలయములకు; కుటుంబకములు+అగు=చుట్టములగు; కమ్మఁదనంబులు+ ఈని=సువాసనలు ప్రసవించి; పాలుకుడిచి=పాలుపట్టి; సుందరీ ప్రాయంబున= యౌవనోదయ మగు వయస్సున; నాము+వలచునవియును=గింజపట్టని వరి మున్నగువానితో సువాసన వెదచల్లునవి;

పదియాఱు వన్నె=పదునారు వన్నెగల; కుందనంపు=బంగారపు; తగడు=రేకును; తెగడుచు=నిందించుచు; పండి=పండి; ఉద్దండ=పొడవైన; కేదారవలయ=వరి మడికి చుట్టును కల; కుముద=కలువల; షండంబులు=సమూహములను, ఆఘ్రాణింపనున్ పోలెన్= వాసన చూచుటకో అనునట్లు; క్రైవాలునవియును=వంగినవియును; అగు=అయిన కలమశాలి శారదాముఖాది=కమలశాలి, శారదాముఖము అను మొదలైన పేరులు కల; వ్రీహి=వరి; సస్యంబుల వలనను=పైరుల వలనను;

నిరంతర=ఎడములేని; నారికేళ=కొబ్బరి; ఛదచ్ఛాయాచ్ఛన్న=ఆకులనీడలచే కప్పబడిన; హరిత్+అంతరంబుల=దిక్కుల మధ్య; భుజంగ వల్లీమతల్లికా=శ్రేష్ఠమైన తమలపాకుల తీగలచే; ఆలింగిత=కౌగలింపబడిన; క్రముక=పోకచెట్ల; కంఠ+ఉపకంఠంబు లను=అగ్రప్రదేశము, సమీప ప్రదేశములందు; క్రీడించు=ఆడు; చిక్రోడదశన దష్ట=ఉడతల దంతములచే కొరకబడిన; స్వాదిష్ఠ=అత్యంత మధుర; పనస ఫలరస సారణీ=పనస పండ్ల రస ప్రవాహముల; పరంపరా=వరుసలచే; సంపూర్ణ=నిండైన; చంపకద్రుమ=సంపెంగ చెట్ల ఆలవాల వలయంబులు=గుండ్రని పాదులు;

వనదేవతా=వనదేవతల; విలాస=విలాసమైన; తాళవృంతాయమాన=(తాటియాకుల) విసన కఱ్ఱలగుచున్న; రంభా=అరటి; పలాశ=ఆకుల; సంభారంబులున్=సామగ్రియును;

తిలక+తిలకితంబులు=ఎఱ్ఱగోరంటచే అలంకరింపబడినవియును; వికచ+ విచికిలంబులున్=వికసించిన మల్లెలును; కోరకిత కురువకంబులున్=మొగ్గ తొడిగిన కురువకములు; నిబిడ రసకేసరంబులు=దట్టమైన రసముతోడి పొన్నచెట్లు; అఖిల

భువన+అభిరామంబులును+ఐన=సకల లోక సుందరములైన; ఆరామంబుల వలననున్=తోటల తోడను; కన్నుల పండువై=కన్నులకు పండుగయై;

కుంతీ మాధవునకు=కుంతీ మాధవ స్వామికి; విశ్రాంతి ప్రదేశంబును=విశ్రమించు స్థలమును, హుంకారిణీ మహాదేవికి=హుంకారిణీ దేవతకు; విహార సంకేత భవనంబున్=ప్రేమికులు కలిసి విహరించుటకు నిర్ణయము చేయబడిన ఇల్లును; పీఠాంబికా లక్ష్మికి=పీఠాంబికకు; ఆటకూటంబును=క్రీడా స్థలమును; హేలాసానికి=హేలాదేవికి; హాలాపాన గోష్ఠీ మంటపంబునున్=మధుపానమునకు సల్లాపమునకు తగిన భవనము; అనన్+తగి=అనునట్లుగా నుండి; భూత భేతాళ డాకినీ ప్రేత ప్రముఖ భైరవ వ్రాత=భూత భేతాళ డాకినీ ప్రముఖ ప్రేత ప్రముఖ భైరవ సమూహముచే; నిర్మిత=నిర్మింపబడిన; ప్రాకార=ప్రాకారములు; వప్ర=కోట గోడలు; హట్ట=వీధుల; కుట్టిమంబు+అగు=జాతి కట్టడము నేల గలది; అగు=అయిన; పీఠా పట్టనంబు =పిఠాపురము; ప్రవేశించిరి=ప్రవేశించిరి; అంత=అప్పుడు.

**భావము :-** వింధ్యపర్వతమునకు దక్షిణముగా నున్నదియు, మంచి వరి పంటలతో, కొబ్బరి తోటలతో, అరటి తోటలతో కళకళలాడునదియు, కుంతీ మాధవస్వామికి, హుంకారిణీదేవికి, పీఠాంబికకు, హేలాదేవికి నిలయమైనదియునైన పిఠాపురమును వ్యాస మహర్షి శిష్యులతో ప్రవేశించెను.

**విశేషము :-** 1. నవఖండములు - భరత ఖండము, ఇంద్ర ఖండము: పురుఖండము: గభస్తి ఖండము; నాగఖండము; తామ్ర ఖండము; వారుణ ఖండము: సౌమ్యఖండము: గంధర్వ ఖండము.

భారతదేశము భరత ఖండమునందలిది. భరత ఖండము భరత వర్షమునందలిది. "జంబూద్వీపే భరత వర్షే భరత ఖండే...." అనునది భరత వర్షము జంబూద్వీపమునందలిది. హస్తానుహస్తికగా వేల సంవత్సరముల నుండి సంకల్పము ద్వారా సంప్రదాయమందించిన భౌగోళిక సమాచారము.

2. "కేదార కుంభ కోణార్క స్థానంబులకు" - అన్నచోట- కుంభ, కోణార్క స్థానంబులా? కుంభకోణ, అర్క స్థానంబులా? "కేదార కుంభకోణ కోణార్క స్థానంబులకు...." అని అయియుండునేమో!

నానా సమృద్ధి సంపన్నం విఖ్యాతం క్షేత్రముత్తమమ్
కేదార కుంభకోణాది పుణ్యక్షేత్ర సమంమహత్ -

అని సంస్కృత భీమఖండము(అధ్యా-3; శ్లో-11). దీనిలో 'కోణార్క' ప్రసక్తి లేదు. కనుక "కేదార కుంభకోణ స్థానంబుల" అని కాని 'కేదార కుంభకోణ కోణార్క స్థానంబుల" అని కాని శ్రీనాథ మహాకవి వ్రాసి యుండును.

3. ఇచ్చట - దక్షారామ రామాజనంబుల చిఱుపిక్కల చక్కఁదనంబు నెకసక్కెంబాడు బిగువు పొట్టలంగనుపట్టునవియును - అని చెప్పినట్లుగా -

కాశీఖండమున(7-26) - ఆర్యావర్తదేశ మత్తకాశినీ జంఘాకాండ పాండిత్యంబు గండూషించి చిగురు పొట్టలఁగనుపట్టునవియును - అని చెప్పినాడు.

భీమేశ్వర పురాణమున అచ్చటి దక్షారామ రామాజనములను, కాశీఖండమున అచ్చటి ఆర్యావర్త మత్తకాశినులను గ్రహించుట గమనింపదగిన అంశము.

4. "పథికా నాసాపుటీ కుటీరంబులకుఁగుటుంబకములు" - అను ప్రయోగము - శ్రీ హర్షుని నైషధీయ చరితము 18-9 నుండి గ్రహించినది.

క్వాపి యన్నికట నిష్కుట స్ఫుట త్కోరక ప్రకర సౌరభోర్మిభిః

సాంద్ర మధ్రియత భీమనందినీ నాసికా పుటకుటీ కుటుమ్బితామ్.

ఆ భవన సమీపమునందలి ఉద్యానవనమున వికసించిన పూలనుండి వెల్వడు పరిమళ తరంగములు దమయంతి యొక్క ముక్కుల రంధ్రములనెడు కుటీరమున కాపురముండినవి - అని శ్లోక భావము.

5. "పదియాఱు వన్నెకుందనంపుఁదగడుఁదెగడుచుఁబండి యుద్దండ కేదార వలయ కుముద షండంబు లాఘ్రాణింపనుంబోలెఁ గ్రైవ్రాలునవియు...." అను భావము భారవి కిరాతుర్జునీయము నందలిది (4-26).

అమీ పృథుస్తంబ భృతః పిశంగతాం గతావిపాకేన పలస్య శాలయః

వికాసి వప్రాంభసి గంధ సూచితం నమంతి నిఘ్రాతు మివాసి తోత్పలమ్

పెద్ద పెద్ద కంకులు గలవియు, పంట యొక్క పరిపాకము చేత పసుపు పచ్చదనము నందినవియునునైన వరి మొక్కలు - పొలమందలి నీటియందు వికసించి, సుగంధముచే సూచింపబడుచున్న నల్ల కలువలను ఆఘ్రాణించుటకోయన్నట్లుగా వంగుచున్నవి - అని శ్లోక భావము.

సీ॥ త్రపుస పుష్పలతామతల్లీ పటోలికా
కారవేల్ల కుడుంగకముల తోడఁ
గూష్మాండ వృంతాక కోలకచించికా
కాయమాన కదంబకములతోడ
శాకినీమూల కచ్ఛత్రాక సారణీ
ధాన్యాక మేఘనాదముల తోడఁ
బిప్పిల్యుపోదకీ పీత పలాండుక
వాస్తుశాఖా కోటి వాటితోడ

తే॥ రాజనలతోడ శృంగబేరములతోడఁ
జిఱుగడఁపుఁబెండలముతోడఁజేమతోడ
నొప్పు నాలుగు పొలములం దుపవనములు
భువనసారము పీఠికాపురవరమున. 56

అర్థము :- భువనసారము=లోక సారము అయిన; పీఠికాపురవరమున=గొప్పదైన పిఠాపురమున; నాలుగు పొలములందు=నాలుగు వైపుల కల ఊరి బయటి ప్రదేశములందలి; ఉపవనములు=తోటలు;

త్రపుస=చేదుదోస; పుష్పలతామతల్లీ=పూల తీగలు; పటోలికా=పొట్ల; కారవేల్ల=కాకర; కుడుంగకములతోడన్=పొదరిండ్లతోడ-

కూష్మాండ=గుమ్మడి; వృంతాక=బచ్చలి; కోలక=మిరియము; చించికా=చింత; కాయమాన=పందిరుల; కదంబకములతోడన్=సమూహముల తోడ -

శాకినీ=పెరుగు తోటకూర; మూలక=ముల్లంగి; ఛత్రాక=పుట్టగొడుగు; సారణీ=గొంతెమ గోరు చెట్టు; ధాన్యాక=ధనియము; మేఘనాదములతోడన్=చిర్జికూరలతోడ -

పిప్పిలి=పిప్పిలి తీగ; ఉపోదకీ=దుంపబచ్చలి; పీత=పసుపు; పలాండుక=చిన్న వెల్లుల్లి; వాస్తు శాఖా=ఆకుకూర; కోటివాటి తోడన్=సమూహ ప్రదేశముల తోడ -

రాజనలతోడన్=వరిపైరుల తోడ; శృంగ బేరముల తోడన్=అల్లముతోడ; చిఱుగడపు=చిలకడ దుంప; పెండలము తోడ=పెండలము తోడ; చేమతోడ=చేమతో; ఒప్పు=విలసిల్లును.

భావము :- పిఠాపురమునందలి నేలమంచిసారము కలది అగుటచే, అక్కడ అన్ని రకముల పంటలు పండును.

ఉ॥ హాటక పానపాత్రయును నారఁగఁబండిన మాతులుంగమున్
ఖేటము లోహదండము నొగిం ధరియించి పురోపకంఠ శృం
గాటకభూమి భాగమునఁగాఁపుర ముండెడు పీఠికాంబకుం
గైటభ దైత్య వైరి ప్రియకాంతకు మ్రొక్కెనతండు భక్తితోన్. 57

అర్థము :- అతండు=ఆ వ్యాసుడు; హాటకపాన పాత్రయును=బంగారపు మధు పాత్రయును; ఆరఁగఁబండిన=బాగుగా పండిన; మాతులుంగమున్=మాదీ ఫలమును; ఖేటము=డాలు; లోహదండము=ఇనుప కడ్డీ; ఒగిన్=చక్కగా; ధరియించి=పట్టుకొని; పుర=పట్టణము యొక్క; ఉపకంఠ=సమీపమునందలి; శృంగాటక=నాలుగు త్రోవలు కలయు;

భూమి భాగమున= ప్రాంతమున; కాపురము+ఉండెడి=నివసించెడు; కైటభదైత్యవైరి=విష్ణువు యొక్క; ప్రియకాంతకు=భార్యకు; పీఠికాంబకున్=పీఠికాంబికకు; భక్తితోన్+మ్రొక్కెన్=భక్తితో మ్రొక్కెను.

భావము :- వ్యాస మహర్షి పిఠాపుర శృంగాటకమునందు బంగారు మధుపాత్ర, మాదీఫలము, డాలు, ఇనుప దండము చేతులందుకల విష్ణుపత్నియైన పీఠికాంబికకు నమస్కరించెను.

విశేషము : "ఈ పీఠాంబ.... పిఠాపురమునకు సమీపమున నాలుగు వీథులు కలిసెడి చోటున శ్రీనాథుని నాడుండినట్లు ఈ పద్యము తెలుపుచున్నది. ఇట్టి విగ్రహమొకటి యీనాడు పిఠాపురము కొత్తపేటలో నున్న కుమారస్వామి యాలయము నందున్నది. ఈ విగ్రహమునకు నాలుగు చేతులు. నాలుగు చేతులలోను పైన తెల్పిన సామగ్రియు నిమిడియున్నవి."

*శ్రీనాథ కృతి సమీక్ష-పు-10. చిలుకూరి పాపయ శాస్త్రి.*

శా॥ అంతర్వాణి భజించెఁ గుక్కుటపతిన్ హాలాహల గ్రీవునిన్
శాంత స్వాంతుఁడు గొల్చె దానవచమూ సంహారిణిన్ హుంకృతిన్
జింతించెన్ మునిసార్వభౌముఁడు పురక్షేత్రాధిదైవంబులం
గుంతీమాధవుఁ బూజచేసె ఋషి వాక్పుష్పోపహారంబులన్. 58

అర్థము :- అంతర్వాణి=పండితుడు అగు వ్యాసుడు; హాలాహలగ్రీవునిన్=గరళ కంఠుడైన; కుక్కుటపతిన్=కుక్కుటేశ్వరుని; భజించెన్=కొలిచెను; శాంత స్వాంతుఁడు=శాంత మనస్కుడు; దానవచమూ=రాక్షస సైన్యమును; సంహారిణిన్=సంహరించినదగు; హుంకృతిన్= హుంకారిణీ దేవతను; కొల్చెన్=కొలిచెను; మునిసార్వభౌముఁడు=మునిశ్రేష్ఠుడు; పురక్షేత్ర= పిఠాపుర పుణ్యప్రదేశమందలి; అధిదైవంబులన్=రక్షక దేవతలను; చింతించెన్=ధ్యానించెను; ఋషి=ముని; వాక్+పుష్ప+ఉపహారంబులన్=వాక్కులు అనెడి పూల కానుకలతో; కుంతీ మాధవున్=కుంతీమాధవ స్వామిని; పూజచేసె=పూజించెను.

భావము :- మునిశ్రేష్ఠుడైన వ్యాసుడు పిఠాపురము నందలి కుక్కుటేశ్వరుని భజించెను. హుంకారిణీదేవిని కొల్చెను. క్షేత్ర రక్షకదేవతలను ధ్యానించెను. కుంతీమాధవ స్వామిని స్తుతించెను.

విశేషము : 1. ప్రధాన దేవతలు అధిదేవతల ప్రత్యధి దేవతల సహితులైయుందురు. 2. శ్రీనాథ మహాకవి పిఠాపురమునందలి దైవములలో కుక్కుటేశ్వరునకు ఎక్కువ ప్రాధాన్యమిచ్చినట్లు కన్పడదు. ఇక్కడ మాత్రమే కొంచెము స్మరించినాడు.

కుక్కుటేశ్వరుని లింగము కుక్కుటాకారములో నుండును. లింగమునకు కోడివలె రెండువైపుల రెక్కలు స్పష్టముగా కనబడుచుండును.

తే॥ హేల నేలాతరంగిణీ కూల నిలయ
బాల బాలారుణాశోక పల్లవోష్ఠి
వేల వేలావనోద్దేశ విహృతిలోల
నేల నేలాయనక పాడె ఋషివరుండు. 59

అర్థము :- ఋషివరుండు=మునిశ్రేష్ఠుడైన వ్యాసుడు; ఏలాతరంగిణీ=ఏల అను నది యొక్క; కూల నిలయన్=ఒడ్డున ఆలయము కలదియు; బాల+అరుణ+అశోక+పల్లవ+ఓష్ఠి=లేత ఎరుపు రంగు కల అశోక వృక్షపు చిగురుటాకు వంటి పెదవికల దాని; బాల=పదునారేండ్ల లోబడిన వయస్సు కలదియునగు; హేలన్=హేల అనుదేవతను; వేలన్=సముచిత సమయమున; వేలావన+ఉద్దేశ విహృతిలోల=పొలిమేరలందు కల వన ప్రదేశములందు విహరించు స్వభావము కలదానిని; ఏలా+అనక=ఏమి ప్రయోజనము అని అనుకొనక; ఏలన్=జోలపాటను; పాడె=పాడెను.

భావము : ఋషి శ్రేష్ఠుడైన వ్యాసుడు, ఏలయను నది యొక్క ఒడ్డునందు ఆలయము కలదియు, లేత ఎరుపు రంగుగల అశోక వృక్షపు చిగురుటాకు వంటి పెదవి కలదియు, పదునారేండ్ల లోబడిన వయస్సు కలదియు, పొలిమేరలందు కల వనప్రదేశములందు విహరించు స్వభావము కలదియునగు హేలయను దేవతను సముచిత సమయమున ఏమి ప్రయోజనము అని అనుకొనక జోలపాట పాడెను.

విశేషము : 55వ వచనము నందు - "హుంకారిణీ మహాదేవి, పీఠాంబికా లక్ష్మి, హేలాసాని" అని ముగ్వురు దేవతామూర్తుల పేరులు కలవు. 57లో పీఠికాంబికను, 58లో హుంకారిణీదేవిని వ్యాసుడు మ్రొక్కినట్లు, కొల్చినట్లు కలదు. కనుక 59లో హేలాసాని సేవనమే చేసినట్లు ఎన్నవలెను. ఈ పద్యములో నున్నది హేలాదేవత మాత్రమే.

వ. అనంతరంబ యొకింత మార్గాంతరంబతిక్రమించి 60

అనంతరంబ=తరువాత; ఒక్కింత=కొంచెము; మార్గాంతరంబు=దారిని (దూరమును); అతిక్రమించి=ప్రయాణము చేసి-

భావము :- తరువాత వ్యాసుడు పిఠాపురము నుండి కొంత దూరము ప్రయాణము చేసి-

## కుమారారామ వర్ణనము :

శా॥ ఆలోకించె మహామునీంద్రుఁడు గుమారారామమున్ వింధ్యకు
క్ష్మాలోపాంత ధరాలలామము బహుక్రీడా వనశ్యామమున్
బ్రాలేయాచల కన్యకాధవజటాభారాసనార్ధేందురే
ఖాలానాయిత హేమకూటకలధౌతాట్టాలక గ్రామమున్. 61

అర్థము :- మహామునీంద్రుఁడు=మహర్షియైన వ్యాసుడు; వింధ్య కుక్షీల=వింధ్య పర్వత; ఉపాంత=సమీపము నందలి; ధరాలలామము=భూమియందు శ్రేష్ఠమైనది; బహు=అనేకములైన; క్రీడావన=ఉద్యానవనములచే; శ్యామమున్=చామన చాయ అయిన దానిని; ప్రాలేయ+అచల+కన్యకా+ధవ=హిమవత్పర్వత పుత్రియైన పార్వతి భర్త అగు శివుని; జటాభార+ఆసన=జటా భారము ఆసనమైన; అర్థ+ఇందురేఖా=అర్థ చంద్రరేఖకు; ఆలానాయిత=కట్టుకొయ్య(బంధ స్తంభము) అయినదియు; హేమకూట=(హిమవంతమునకు ఉత్తరమున మేరువునకు దక్షిణముననున్న)హేమ కూటమను పర్వతము వలె; ధౌత=వెండివలె నున్న; అట్టాలక=సౌధోపరి భాగముల యొక్క; గ్రామమున్=సమూహము కలదియునగు; కుమారారామమున్=కుమారారామమును; ఆలోకించెన్=చూచెను.

భావము :- వ్యాస మహర్షి - వింధ్య పర్వత సమీప భూమియందు శ్రేష్ఠమైనది, అనేక ఉద్యానవనములచే చామన చాయ అయినది, శివుని జటాభారము ఆసనమైన అర్థచంద్రునకు కట్టు కొయ్య అయినది, హేమ కూటము అను పర్వతము వలె వెండివలెనున్న సౌధోపరి భాగముల సమూహము కలదియును - అయిన కుమారారామమును చూచెను.

విశేషము :-కుమారారామమునకు స్కందారామమను నామము కూడ ఉన్నది. చాళుక్యభీమునిచే అభివృద్ధి చేయబడుటచే చాళుక్య భీమవరము అను పేరు కూడ ఏర్పడినది. కుమారారామము పంచారామములలో ఒకటి.

పంచారామములు : 1. అమరారామము :- గుంటూరు జిల్లాలో గుంటూరునకు 35 కి.మీ దూరములోనున్న అమరావతి అను పట్టనములో నున్నది. దైవము పేరు అమరేశ్వరుడు. ఇక్కడ లింగము 15 అడుగుల ఎత్తు ఉండును. ఇది ఆరామములలో మొదటిది. అందులకే ఆదిమారామము, ప్రథమారామము అని అందురు.

2. దక్షారామము :- తూర్పు గోదావరి జిల్లాలో రామచంద్రపురమునకు 5 కి.మీ. దూరములో నున్నది. దైవము పేరు భీమేశ్వరుడు. లింగము మూల పీఠము మీద 8 అడుగుల ఎత్తు ఉండును.

3. కుమారారామము :- తూర్పు గోదావరి జిల్లాలోని సామర్లకోటలో ఉన్నది. దైవము పేరు భీమేశ్వరుడు. లింగము 18 అడుగుల ఎత్తు ఉండును.

4. క్షీరారామము :- పశ్చిమ గోదావరి జిల్లాలోని నరసాపురమునకు 8 కి.మీ దూరములో నున్న పాలకొల్లు అను ఊరి యందున్నది. దైవము పేరు క్షీరారామ లింగేశ్వరుడు. లింగము ఎత్తు పీఠము నుండి 2 అడుగులు ఉండును.

5. సోమారామము :- పశ్చిమ గోదావరి జిల్లాలోని గునుపూడి భీమవరము నందున్నది. భీమవరము ఇప్పుడు పట్టణమైనది. దైవము పేరు సోమేశ్వరుడు. లింగము 2 అడుగుల ఎత్తు ఉండును. ఈ ఆరామమునకు ప్రాచ్యారామము అను పేరు కూడ కలదు.

సీ॥ కొమరేటి కల్యాణ కమల షండంబుల
సౌరభ్య భారంబు సంతరించి
నారికేళాటవీ నవపుష్ప కుహళికా
వితతి కన్నెఱికంబు వీడు కొలిపి
యప్సరః కాంతా విహార హాటక హర్మ్య
శశికాంతమణి గవాక్షములఁదూఱి
భీమనాయక దేవు పేరురంబునఁ గ్రాలు
భుజగహారములకు భుక్తి వెట్టి
తే॥ రాజనారాయణ స్వామి రమ్య భవన
తార్క్ష్య కేతనపతికి నర్తనము గఱపి
పొలసె నధ్వ పరిశ్రాంతి పొడవడంగ
మౌనివరుపైఁ గుమారవనానిలములు. 62

అర్థము :- కుమారవన+అనిలములు=కుమారారామ వనము వాయువులు; కొమరేటి=కొమరేరు(అను ప్రవాహము) నందలి; కల్యాణ=శుభప్రదములైన; కమల షండంబుల=పద్మముల సమూహము యొక్క; సౌరభ్య భారంబు=సువాసనల బరువును; సంతరించి=పోగు చేసికొని -

నారికేళ+అటవీ=కొబ్బరి తోటల; నవపుష్ప=క్రొత్త పూల; కుహళికా వితతి=పోక పొత్తుల సమూహము యొక్క; కన్నెఱికము=కన్యాత్వమును; వీడుకొలిపి=పొమ్మని చెప్పి -

అప్సరఃకాంతా విహార=దేవదాసీ జనము విహరించు; హాటక=బంగారపు; హర్మ్య=భవనముల; శశికాంతమణి=చంద్రకాంతమణుల; గవాక్షముల దూఱి=కిటికీల యందు ప్రవేశించి;

భీమనాయక దేవ=భీమేశ్వరుని; పేరు+ఉరంబున=పెద్ద రొమ్ముపై; క్రాలు=ప్రకాశించు; భుజగ హారములకు=సర్పహారములకు; భుక్తి+పెట్టి=ఆహారము పెట్టి;

రాజనారాయణ స్వామికి=రాజనారాయణ స్వామి; రమ్యభవన=రమణీయమైన అలయ ధ్వజ స్తంభముమీద కల; తార్క్ష్యకేతన పతికి=జెండాపైగల(ధ్వజస్తంభము పైగల) గరుత్మంతునికి; నర్తనము+కఱపి=నాట్యము నేర్పి; అధ్వ పరిశ్రాంతి=దారి బడలిక; పొడవడంగ=రూపుమాయగ; మౌనివరుపైన్=మునిశ్రేష్ఠుడైన వ్యాసునిపై; పొలసెన్=వీచెను.

భావము :- కుమారారామ వనములందలి గాలులు - కొమరేటి పద్మముల వాసనలను పోగుచేసికొని, కొబ్బరిపోక తోటల క్రొత్తపూల కన్నెఱికమునకు వీడ్కోలు చెప్పి, దేవదాసీ గృహముల కిటికీల యందు దూరి, భీమేశ్వరుని రొమ్ముపై కల సర్పములకు ఆహారము పెట్టి, రాజ నారాయణ స్వామి ఆలయ ధ్వజస్తంభముపైనున్న గరుడునకు నాట్యము నేర్పి, దారి బడలిక పోవునట్లుగ వ్యాసునిపై వీచెను.

విశేషము :- తార్క్ష్యకేతనపతి :- తార్క్ష్యుడు అను పేరుకల కేతనపతి. సంభావన పూర్వపద కర్మధారయ సమాసము. అలంకారము - సమాసోక్తి.

"శ్రీనాథుని నాడు గుడిమీద కేతనముగా నుండిన గరుత్మంతుడీనాడా తావునందు లేక ఆలయము క్రిందికి దిగినాడు." శ్రీనాథకృతి సమీక్ష - పు.-15, చిలుకూరి పాపయ్య శాస్త్రి.

శ్రీనాథునకు ఇష్టములైన వర్ణనములలో వాయువుల వర్ణనమొకటి. మచ్చునకు కొన్ని శ్రీనాథుని వాయు వర్ణనములు -

1. పూఁబోణులకును విటులకు
వేఁబోకలఁదలరు సొంపు వీడ్కోలుపుఁబురిన్
లేఁబోకఁబోఁక తోఁటల
పూఁబాళల కమ్మతావిఁ బొదలిన గాడ్పుల్ — భీమ - 1-96.

2. తిలకంబు బలు తేనియలఁబోఁక మోకల
పువ్వుఁబాళలతావిఁ బుక్కిలించి
కలమ గోపికల చక్కని చన్నుఁగవలపై
పటపల్లవంబులు వాయఁదట్టి
సప్తగోదావర జలతరంగారోహ
కేలీ సుఖంబులంగీకరించి
దేవ గంధర్వ లీలావతీ హాటక
ప్రాసాద వలభి గర్భములు దూఱి
ప్రతిదినము దక్షవాటీపురంబునందు
మలయ వేలావనీ మందమారుతంబు
గంధసార లతా కుడుంగముల మెలఁగు
చిలువ లేమలు సేవింప వెలితి పడుచు — భీమ - 1-98.

3. హేమంతావధి సంప్రబోధ గురువుల్ హృజ్జాత తేజోగ్ని ధా
య్యా మంత్రాక్షరముల్ పటీరగిరి వన్యామంద వాతూలముల్
వేమాఱుం గలశీతనూభవ వధూవేణీభరాంతఃప్రసూ
నామోద గ్రహయాళువుల్ పొలసె దక్షారామ మధ్యంబునన్. — భీమ - 5-95

4. జంభారాతి తనూజు మీఁదఁబొలిచెన్ సావిత్ర వర్మంబునన్
సంభిన్నోదర శాతకుంభ నలినీ నాలీక సంవాసనా
సంభారంబులు సోడుముట్ట సవిధ స్వర్లోక కల్లోలినీ
గంభీరాంబు తరంగ సంభ్రమములం గల్యాణ వాతూలముల్
అర్జునుని మీఁదఁబొలిచెఁ బథ్యంతరమున
నభ్రగంగానదీ తరంగానిలంబు
నందనోద్యాన వీథికా నవ లతాంత
సారభాసుర హరినీల హారమగుచు. హర - 7-114,115.

5. సంభోగ పరిఖిన్న శబర సీమంతినీ
స్వేద వార్బిందు విచ్ఛేదకారి
విఘటమానాంభోజ విపినషండమధూళి
పరిమళా సార సంపర్క సురభి
సమద కాంతార కాసరయూథ రోమంథ
సంభూత డిండీర శకల వాహి
లలిత లుంగ లవంగ లవలీమతల్లికా
లాస్యోపదేశ లీలా గురుండు
యామినీ శేష తుహిన ధారానుషంగ
జడిమ భర మంద సంచార చతురశాలి
యల్లనల్లనఁ బొలుపారె నడవిలోనఁ
గాల్య సంధ్యా సుగంధుండు గంధవహుఁడు. శివరాత్రి - 4ఆ-4ప.

6. అహరారంభములందుఁ బ్రస్రవణ శైలాధిత్యకా కందరా
కుహర క్రోడ కటాహ గద్గద నదద్గోదావరీ సింధు వా
ర్లహరీ శీకర మాలికా శిశిరముల్ పంపా సఖుల్ దండకా
గహన గ్రాహులు వాయువుల్ దపసికిం గావించె నాహ్లాదమున్. కాశీ - 3-14.

7. పరిరంభంబొనరించెఁగుంభ భవునిం బాతాళ గంగాంబు ని
ర్ఘర కల్లోల ఘటా పృషద్వ్యతికర ప్రాలేయముల్ హాటకే
శ్వర జూటీకృత మాల్యకేసర రజస్సౌరభ్య సంపన్నముల్
కరివక్త్రాభరణాహి పీత పరిముక్తంబుల్ వనీ వాయువుల్. కాశి - 3-53.

**తే॥ బాదరాయణుఁడత్యంత భక్తి నియతి**
**దివ్యవాహినిఁగొమరేటఁ దీర్థమాడి**
**శిష్యవర్గంబుఁదాను దర్శించి మ్రొక్కె**
**శాశ్వతునకుఁజాళుక్య భీమేశ్వరునకు.**

63

అర్థము :- బాదరాయణుఁడు=వ్యాసుడు; అత్యంత=మిక్కిలి; భక్తి నియతి=భక్తి నియమములతో; దివ్యవాహినిన్=గొప్ప ప్రవాహమైన; కొమరేటన్=కొమరేరునందు; తీర్థమాడి=స్నానము చేసి; శిష్య వర్గంబున్=శిష్య సమూహమును; తాను=తానును; దర్శించి=చూచి; శాశ్వతునకున్=నిత్యుడైన; చాళుక్య భీమేశ్వరునకు=చాళుక్య భీమేశ్వర దేవునకు; మ్రొక్కెన్=మ్రొక్కెను.

భావము :- వ్యాసుడు భక్తితో కొమరేటి యందు స్నానము చేసి, శిష్య సమేతుడై చాళుక్య భీమేశ్వరస్వామికి మ్రొక్కెను-

వెండియుఁగొంత దవ్వు చని. 64

అర్థము :- వెండియు=మరల; కొంత దవ్వు=కొంత దూరము; చని=వెళ్ళి.

భావము :- వ్యాస మహర్షి కుమారారామము నుండి బయలుదేరి కొంత దూరము ప్రయాణము చేసి -

## సర్పపుర వర్ణనము :

శా॥ కాంచెన్ సర్పపురాభిధానముఁద్రిలింగక్ష్మోణి వైకుంఠమున్
ముంచెన్ నారద కుండికా జలములన్ మోదంబుతో దేహమున్
జించెన్ గాశి వియోగ దుఃఖము మహాక్షేత్రంబు వీక్షించి ద
ర్శించెన్ సన్మునిలోచనోత్సవముగా శ్రీ భావనారాయణున్. 65

అర్థము :- సత్+ముని=వ్యాసుదు; సర్పపుర+అభిధానమున్=సర్పపురము అను పేరుగల దానిని; త్రిలింగ క్షోణి=త్రిలింగ దేశపు; వైకుంఠమున్=విష్ణు క్షేత్రమును; కాంచెన్=చూచెను; మోదంబుతో=సంతోషముతో; దేహమున్=శరీరమును; నారద కుండికా జలములన్=నారద కుండము నీటియందు; ముంచెన్=ముంచెను; మహాక్షేత్రంబు=ఈ గొప్ప క్షేత్రమును, వీక్షించి=చూచి; కాశి వియోగ దుఃఖము=కాశిని వీడిన బాధను; చించెన్=చించెను; లోచన+ఉత్సవముగా=కనుల పండుగగ; శ్రీ భావనారాయణున్=శ్రీ భావనారాయణ స్వామిని; దర్శించెన్=దర్శనము చేసికొనెను.

భావము :- వ్యాసుడు తెలుగు దేశమందలి వైకుంఠమైన సర్పవరమును చూచెను. నారద కుండమునందు స్నానము చేసెను. ఈ క్షేత్రమును చూచి కాశీ వియోగ దుఃఖమును పోగొట్టుకొనెను. శ్రీ భావనారాయణ స్వామిని కనుల పండువుగా దర్శించెను.

విశేషము :- సర్పపురము అనునది ప్రాచీన నామము. ప్రస్తుతము దీని పేరు సర్పవరము. ఇది తూర్పు గోదావరి జిల్లాయందలి కాకినాడకు 5 కి.మీ. దూరమునందున్నది. సర్పవరమునకు సర్పనగరము అని కూడ నామాంతరమున్నది. విష్ణుక్షేత్రమగుటచే పురుషోత్తమము అను పేరు కూడనున్నది. ఇక్కడ ప్రధాన దైవము భావనారాయణ స్వామి.

నారదకుండము - అనగా ఆలయమునకు ఎదురుగానున్న కొలను.

సీ॥ శ్రీ సుదర్శన శంఖ చిహ్నాంకితము గాక
యెపుడు మిన్నకయున్న యిల్లు లేదు;
బహులోర్ధ్వపుండ్ర సంపద లేక వృథయైన
ఫాలరేఖలతోడి ప్రజయు లేదు;
వైష్ణవోత్తమ భాగవత సాత్త్వికుల గోష్ఠి
వెలియైన వాటికా వేది లేదు;
నలినేక్షణుఁడు భావనారాయణ స్వామిఁ
దప్పించి పరదైవతంబులేదు;

తే॥ పరమ గీర్వాణ యాగ వైభవము నెలవు
నిఖిల కల్యాణ గుణకేళి నిలయ మనఁగ
దివ్యములు నూట యెనిమిది తిరుపతులకుఁ
బరమపదమైన శ్రీ సర్పపురమునందు.. 66

అర్థము :- పరమ=గొప్ప; గీర్వాణ=దేవతల; యాగ=యజ్ఞముల; వైభవము=సంపదకు; నెలవు=నిలయమును; నిఖిల=సకల; కల్యాణ=శుభప్రదములైన; గుణకేళి=గుణముల విహారమునకు; నిలయము=స్థానము; అనఁగ=అనగ; దివ్యములు= మహిమలు కలిగిన; నూట=యెనిమిది తిరుపతులకున్=నూట యెనిమిది తిరుపతులకు; పరమ పదము+ఐన=మిక్కిలి ఉన్నతమైన; శ్రీ సర్పపురమునందు=సర్పవరము అను వైష్ణవ క్షేత్రమునందు -

శ్రీ సుదర్శన=విష్ణు చక్రమైన సుదర్శనము యొక్క; శంఖ=విష్ణువు యొక్క శంఖము యొక్క; చిహ్న+అంకితము గాక=ముద్రలు వేయించు కొనకుండ; ఎపుడు=ఏ వేళయందైన; మిన్నక ఉన్న=ఊరక ఉన్న; ఇల్లు లేదు=గృహము లేదు.

బహుల=దట్టమైన; ఊర్ధ్వపుండ్ర=నిలువుగా పెట్టెడు నామముల; సంపద లేక=భోగము లేక; వృథయైన=వ్యర్థముగానున్న; ఫాలరేఖలతోడి=నుదుటి కాంతులతోడ; ప్రజయు లేదు=జనుడు(ఒక్కడును)లేడు.

వైష్ణవ+ఉత్తమ=శ్రేష్ఠులైన విష్ణుభక్తుల; భాగవత=భగవద్భక్తుల; సాత్త్వికుల=సజ్జనుల; గోష్ఠి=సల్లాపము; వెలియైన=దూరమైన; వాటికా వేది=గృహముల మధ్యలోనుండు అరుగు; లేదు=లేదు.

నలిన+ఈక్షణుడు=పద్మనేత్రుడయిన; భావనారాయణస్వామిన్=భావనారాయణ స్వామిని; తప్పించి=వీడి; పర+దైవతంబు లేదు=మరియొక దేవుడు లేడు.

భావము :- నూట యెనిమిది తిరుపతులకు పరమపదమైన సర్వపురమున - విష్ణుచిహ్నాంకితము కాని ఇల్లు లేదు. ఊర్ధ్వ పుండ్రము లేని ప్రజ లేదు. వైష్ణవోత్తముల గోష్ఠి లేని అరుగు లేదు. భావనారాయణ స్వామి తప్ప మరియొక దేవుడు లేడు.

విశేషము :- వైష్ణవులకు ప్రధానములగు నూట యెనిమిది తిరుపతులలో సర్వపురము కన్పింపదు.

మ॥ శనివారోత్సవ మాచరించె ముని శిష్యవ్రాతముం దానుఁగ
మ్మని పణ్యారముతోడ బూరెగమితో మండెంగ తండంబుతో
ననుగుంబాసెముతోడఁబాండు కలమాహారంబుతో నేతితో
ఘనరంభాఫల ఖండ శర్కరలతోఁ గారుణ్య పాథోధికిన్. 67

అర్థము :- ముని=వ్యాసుడు; శిష్యవ్రాతమున్=శిష్యుల సమూహమును; తానున్=తానును; కారుణ్య పాథోధికిన్=కరుణా సముద్రుడైన విష్ణువునకు; కమ్మని=రుచి కలిగిన; పణ్యారముతోడ=నాన పప్పుతోడ; బూరెగమితో=బూరెల సమూహముతో; మండెంగ తండంబుతోన్=చక్కెర లేని గోధుమ పూరీల సమూహముతో; అనుగుం బాసెముతోడన్=మంచి పాయసముతో; పాండు=తెల్లని; కలమ+ఆహారంబుతో=వరి అన్నముతో; నేతితో=నేతితో; ఘన=పెద్దవగు; రంభాఫల=అరటి పండ్లతో; ఖండ శర్కరలతోన్=కండ చక్కెరతో; శనివార+ఉత్సవము=శనివారము చేయు వ్రతమును; ఆచరించెను=చేసెను.

భావము :- వ్యాసుడు శిష్యులతో కూడి శ్రీ భావనారాయణ స్వామికి మంచి పిండి వంటలతో శనివారోత్సవము చేసెను.

విశేషము :- శనివారోత్సవము - సర్వపురమునందు శనివారము భావనారాయణ స్వామికి వైభవముగ జరుగు ఉత్సవము. ఇంతకన్నను ఈ ఉత్సవ విశేషములు తెలియుటలేదు.

తే॥ ద్వాదశాక్షర దివ్యమంత్రమునఁబూన్చెఁ
జెంగలువ పువ్వుదండ లక్ష్మీధవునకు
శ్రీమదష్టాక్షరమున నర్చించెఁదపసి
భావనారాయణ స్వామిఁ బసిఁడి విరుల. 68

**అర్థము** :- తపసి=ముని; ద్వాదశ+అక్షర=పంద్రెండు అక్షరములతో కూడిన; దివ్య=శ్రేష్ఠమైన; మంత్రమునన్=మంత్రముతో; లక్ష్మీధవునకు=విష్ణువునకు; చెంగలువ పువ్వుదండ=ఎఱ్ఱ కలువల హారమును; పూన్చెన్=సమర్పించెను; శ్రీమత్+అష్ట+అక్షరమునన్=శ్రీమంతమైన ఎనిమిది అక్షరములతో కూడిన మంత్రముతో; పసిడి విరుల=బంగారు పూలతో; భావనారాయణ స్వామిన్=శ్రీ భావనారాయణ స్వామిని; అర్చించెన్=పూజ చేసెను.

**భావము** :- వ్యాస మహర్షి ద్వాదశాక్షర మంత్రసహితముగా ఎఱ్ఱ కలువలను విష్ణువునకు సమర్పించెను. అష్టాక్షర సహితముగా పసిడి పూలతో భావనారాయణ స్వామిని అర్చించెను.

**విశేషము** :- అష్టాక్షరి, ద్వాదశాక్షరి - అనునవి విష్ణు మంత్రములు. "ఓం నమో నారాయణాయ" - అనునది అష్టాక్షరీ మంత్రము; "ఓం నమో భగవతే వాసుదేవాయ" - అనునది ద్వాదశాక్షరీ మంత్రము. ఈ పద్యమున లక్ష్మీధవుని, భావనారాయణ స్వామిని విడివిడిగా వ్యాసుడు పూజించినట్లున్నది. అనగా అక్కడ భావనారాయణ స్వామి కాక విష్ణుమూర్తి కూడ నుండవలెను. కాని నేడు భావనారాయణ స్వామి తప్ప విష్ణుమూర్తి ఆ దేవాలయమున కన్పడడు. శ్రీనాథుని కాలమున రెండు విగ్రహములు ఉండెడివేమో!

"ఇప్పుడు సర్పవరమున గర్భాలయముననున్న దైవము భావనారాయణ స్వామి. ప్రాకార మంటపమున మఱొక భావనారాయణ స్వామి విగ్రహము కలదు. అది గాక ప్రాకార మంటప పాతాళ గృహమున(నేలమాళిగ) పాతాళ భావనారాయణ స్వామి ప్రత్యేక దైవము. విష్ణుదేవుని విగ్రహము నేడు విడిగా కానరాదు. ప్రాకార మంటపములోని భావనారాయణ స్వామి ప్రాయశః స్థలాంతరితుడైన విష్ణుదేవుడేమో! మఱొకచో నున్న ఆళ్వారుల మందిరమున నున్న విగ్రహములలో నొక విగ్రహము విష్ణుమూర్తి యనిపించుచున్నది. ఒకవేళ అదియే విష్ణుదేవు విగ్రహమేమో! కాలయవనిక మాటుననేమి జరిగినదో!"

శ్రీనాథుడు - పుట-407, ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి

**వ॥ అనంతరంబ కతిపయ ప్రయాణంబులఁ దుల్యాభాగా తీరంబున - 69**

**అర్థము** :- అనంతరంబ=తరువాత; కతిపయ ప్రయాణంబులన్=సర్పపురము నుండి బయలుదేరి కొన్ని మజిలీలతో కూడిన ప్రయాణములు చేసి; తుల్యభాగా తీరంబున=తుల్యభాగ అను నది యొడ్డున-

**విశేషము** :- తుల్యభాగ ఉత్పత్తి క్రమము చతుర్థాశ్వాసము 186వ పద్యము నుండి వచ్చును.

శా॥ చేతోమోద మెలర్పఁగట్టెదురఁగాంచెన్ భారతామ్నాయ వి
ద్యాతంత్రగ్రథనాబ్జ సంభవుఁడు వేదవ్యాసుఁడభ్యర్థిత
జ్యోతిర్లింగమయ స్వరూపుల జటాజూటాసనార్ధేందులన్
వాతాపీల్వల వైరి గౌతమనదీ వాస్సంగమేశానులన్. 70

అర్థము :- భారత=భారతము అను; ఆమ్నాయ=వేదమునందు; విద్యా=ఆత్మ జ్ఞానమును; తంత్ర=ప్రధాన విషయముగ; గ్రథన=కూర్చుటయందు; అబ్జ సంభవుఁడు=బ్రహ్మ అయిన; వేద వ్యాసుఁడు=వేద విభాగము చేసిన వ్యాసుడు; అభ్యర్థిత=పూజింప తగిన; జ్యోతిర్లింగమయ స్వరూపుల=ప్రకాశవంతములైన లింగాకారుల; జటాజూట+ఆసన+ అర్ధేందులన్=జటాజూటము ఆసనముగాగల అర్ధచంద్రులు కలవారైన; వాతాపి+ఇల్వల వైరి+గౌతమ నదీ వాః+సంగమ+ ఈశానులన్=వాతాపీశ్వరుని, ఇల్వలేశ్వరుని, గోదావరీనదీ జలము సంగమించిన చోటునగల సంగమేశ్వరుని; చేతో మోదము+ఎలర్పన్= మానసికానందము అతిశయింపగా; కట్టెదురన్= ఎట్ట ఎదురను; కాంచెన్=చూచెను.

భావము :- భారతమును వ్రాసిన వేదవ్యాసుడు, అగస్త్యేశ్వర, సంగమేశ్వరులను చూచెను.

విశేషము :- రామచంద్రపురము తాలూకాలోగల తాపేశ్వరము, ఏడిద, మండపేట అను గ్రామముల నడుమ నుండిన శివుడు సంగమేశ్వరుడు. తాపేశ్వరమునందలి శివలింగము వాతాపీశ్వరుడు. ఇప్పనపాడు(ఇల్వలపురము)నందలి శివుడు ఇల్వలేశ్వరుడు. గౌతమనదియు తుల్యభాగా నదియు సంగమించిన చోట నెలకొనినవాడు గావున సంగమేశ్వరుడయినాడు. ఈయనయే "గౌతమ నదీ వాస్సంగమేశానుడు." (చి.పా.శా. పీఠిక పే-71)

తే॥ వేదశాఖా విభాగ సంవేది యతఁడు
లలిత బిల్వ త్రిశాఖా పలాశ సమితి
సంగమేశ ఘటోద్భవ శంకరులకు
నర్చనము సేయుఁబ్రణవ పంచాక్షరముల. 71

అర్థము :- వేద=వేదముల; శాఖా=శాఖలను; విభాగ=విభజించుటయందు; సంవేది= జ్ఞానియైన; అతఁడు=ఆ వ్యాస మహర్షి; లలిత=సుకుమారమైన; బిల్వ=మారేడు; త్రిశాఖా= (బిల్వ)మూడు చీలికలుగల పత్రముల; పలాశ=ఆకుల; సమితి=సమూహముతో; ప్రణవ= ఓంకార సహితమైన; పంచాక్షరముల=పంచాక్షరీ మంత్రముతో; సంగమేశ=సంగమేశ్వర; ఘట+ ఉద్భవ=అగస్త్యేశ్వర; శంకరులకు=శివులకు; అర్చనము చేయున్=పూజ చేయును.

భావము :- తుల్యభాగ నదీ తీరమున కల సంగమేశ్వర, అగస్త్యేశ్వరులకు వేద విభాగము చేసిన వ్యాస మహర్షి మూడు ఆకులు గల బిల్వదళములతో ప్రణవ పంచాక్షర మంత్రముతో పూజ చేయును.

విశేషము :- 'నమశ్శివాయ' - అనునది పంచాక్షరీ మంత్రము. 'ఓం' అనునది ప్రణవము. 'ఓం నమశ్శివాయ' - అనునది ప్రణవముతో కూడిన పంచాక్షరి. దీనిని 'షడక్షరి' అని కూడనందురు.

**వ॥ మఱియుఁ దుల్యభాగా తీరంబున సాంపరాయణ గ్రామంబు చేరువ బిల్వాటవీ వాటిఁ గపట భిల్లుండైన చలికొండ జేని యల్లుని ముక్తీశ్వరు దర్శించి - 72**

అర్థము :- మఱియున్=మరియు; తుల్యభాగా తీరంబున=తుల్యభాగ అనునది యొడ్డున కల; సాంపరాయణ గ్రామంబు చేరువ=సాంపరాయణపుర సమీపమున; బిల్వ+ అటవీ=మారేడు వనము కల; వాటిన్=ప్రదేశమునందున్న; కపట భిల్లుండైన=మాయా కిరాతుడైన; చలికొండ జేని+అల్లుని=హిమవత్పర్వత రాజు యొక్క అల్లుడైన; ముక్తీశ్వరు= ముక్తీశ్వరుడను పేరుతోనున్న శంకరుని; దర్శించి=చూచి.

భావము :- తుల్యభాగా తీరమున సాంపరాయణ గ్రామము చెంత కల ముక్తీశ్వరుని వ్యాసుడు దర్శించెను.

విశేషము :- సాంపరాయణ గ్రామమును 'సాంపరాయపురము' అని అనుట కలదు (భీమ - 3-39). ఈ గ్రామమునకు ప్రస్తుత నామము - 'సంపర'. ఇది తూర్పు గోదావరి జిల్లాలో కాకినాడకు సమీపమునందున్నది.

**ఉ॥ వేదవిభాగముంబరిఢవించిన పుణ్యుఁడు వేడ్కఁబూన్చె బి**
**ల్వీదళ పూజనంబు గడు లెస్సఁగఁగూరిమి శిష్య పంక్తితో**
**నాదిమభిల్లు నిత్యకరుణామృత పూరముఁ జల్లు పుండరీ**
**కోదర భల్లుఁగృత్తకరి యూథపు మల్లునిఁ గొండయల్లునిన్. 73**

అర్థము :- వేద విభాగమున్=వేద విభజనము; పరిఢవించిన=కావించిన; పుణ్యుఁడు= వ్యాసుడు; కూరిమిశిష్య పంక్తితో=ప్రియమైన శిష్య సమూహముతో; ఆదిమభిల్లు=ఆది కిరాతుని; నిత్య=ఎల్లప్పుడు; కరుణ+అమృత=దయా సుధల; పూరమున్=ప్రవాహమును; చల్లు= చిలుకరించు; పుండరీక+ఉదర=విష్ణువు; భల్లు=బాణముగా కలవాడు; కృత్త=ఛేదింప బడిన; కరియూథపు=ఏనుగుల గుంపు యొక్క; మల్లునిన్=జెట్టిని; కొండ అల్లునిన్=హిమవత్పర్వతపు అల్లుని; కడు లెస్సఁగన్=చాల చక్కగ; బిల్వీదళ పూజనంబు=మారేడు పత్రముల పూజ; వేడ్కన్=వేడుకతో; పూన్చె=కూర్చెను.

భావము :- వేదవ్యాసుడు శిష్య సమూహముతో ముక్తీశ్వరునకు బిల్వార్చన సమకూర్చెను.

విశేషము :- ఈ పద్యమున అంత్య ప్రాసము కలదు. శ్రీనాథుడిట్లు వ్రాయుట చాల అరుదు.

తే॥ పదియు నార్వన్నె బంగారుఁ బరిహసించు
నవనవారగ్వధప్రసూనములు గోసి
సాంపరాయ మహాగ్రామ సవిధనిలయు
నభవుఁబూజించెఁబుండరీకాక్షమూర్తి. 74

అర్థము :- పుండరీక+అక్ష+మూర్తి=విష్ణుదేవుని అవతారమగు వ్యాసుడు; పదియు నార్వన్నె=పదునారు వన్నెల; బంగారున్=బంగారమును; పరిహసించు=నవ్వు; నవనవ+ ఆరగ్వధ ప్రసూనములు=క్రొంగ్రొత్త రేల పుష్పములు; కోసి=కోసి; సాంపరాయ మహాగ్రామ= సాంపరాయ పురము యొక్క; సవిధ నిలయు=సమీపము నివాసముగా కల; అభవున్= ముక్తీశ్వరుని; పూజించెన్=అర్చన చేసెను.

భావము :- వ్యాస మహర్షి సంపర గ్రామ సమీపమునందున్న ముక్తీశ్వరుని ఆరగ్వధ పుష్పములతో పూజించెను.

విశేషము :- శ్రీనాథునకు ఆరగ్వధ పుష్పములన్న చాల ప్రీతి. తన కవిత్వమును ఆరగ్వధ పుష్ప వాసనలతో పోల్చుకొనినాడు.

"పంపా విరూపాక్ష బహుజటా జూటికా
· రగ్వధ ప్రసవ సౌరభ్యములకు ......"

కం॥ పంచ బ్రహ్మంబుననున్
బంచాక్షర మంత్రముననుఁ బంచాననునిం
బంచమ వేదం బభిని
ర్మించిన ముని పూన్చెఁ బుండరీక కళికలన్. 75

అర్థము :- పంచమ వేదంబు=భారతమును; అభినిర్మించిన=చక్కగా నిర్మించిన; ముని=వ్యాస మహర్షి; పంచ బ్రహ్మంబుననున్=సద్యో జాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానములు అను పంచ బ్రహ్మ మంత్రములతో; పంచాక్షర మంత్రముననున్=పంచాక్షరీ మంత్రముతో; పంచానననునిన్=శివుని; పుండరీక కళికలన్=తామర మొగ్గలతో; పూన్చెన్= కొలిచెను.

భావము :- పంచమ వేదమైన భారతమును నిర్మించిన వ్యాసముని పంచ బ్రహ్మ సహితమైన పంచాక్షరీ మంత్రము పఠించుచు తామర మొగ్గలతో పంచాననుని పూజించెను.

విశేషము :- పంచబ్రహ్మ మంత్రములు.

1. సద్యోజాతం ప్రపద్యామి సద్యోజాతాయవై నమోనమః. భవేభవే నాతిభవే భవస్వమాంభవోద్భవాయనమః.

2. వామదేవాయనమో జ్యేష్ఠాయనమ శ్రేష్ఠాయ నమో రుద్రాయనమః కాలాయనమః కల వికరణాయ నమో బలాయనమో బలవికరణాయ నమో బలప్రమథనాయనమ స్సర్వభూత దమనాయ నమో మనోన్మనాయ నమః.

3. అఘోరేభ్యోథఘోరేభ్యః ఘోర ఘోర తరేభ్య స్సర్వేభ్య స్సర్వశర్వేభ్యో నమస్తే అస్తు రుద్రరూపేభ్యః.

4. తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహి తన్నో రుద్రః ప్రచోదయాత్.

5. ఈశాన స్సర్వవిద్యానా మీశ్వర స్సర్వ భూతానాం బ్రహ్మాధిపతి ర్బ్రహ్మణోధిపతి ర్బ్రహ్మాశివో మే అస్తు సదాశివోం.

షడంగ మంత్రములు :-

ఓం హ్రాం హృదయాయనమః ఓం హ్రీం శిరసే స్వాహా

ఓం హ్రూం శిఖాయైవషట్ ఓం హ్రైం కవచాయ హుం

ఓం హ్రౌం నేత్రత్రయాయవషట్ ఓం హ్రః అస్త్రాయ ఫట్

వ॥ ఇవ్విధంబునఁగాల కంఠునకుఁ బ్రభాత కాల పూజ నిర్వర్తించి సాత్యవతే యుండు గమనో న్ముఖుండైయున్న సమయంబున 76

అర్థము :- ఈ+విధంబున=ఈ రీతిగ; కాలకంఠునకు=శివునకు; ప్రభాత కాలపూజ నిర్వర్తించి=ఉదయ సమయమున సలుపవలసిన పూజను పూర్తి చేసికొని; సాత్యవతేయుండు= సత్యవతి కుమారుడైన వ్యాసుడు; గమన+ఉన్ముఖుండై=ప్రయాణమునకు సిద్ధమైన వాడై; ఉన్న సమయంబున=ఉన్న వేళ -.

భావము :- ఈవిధముగ శివునకు ప్రాతఃకాల పూజను పూర్తి చేసికొని వ్యాస మహర్షి ప్రయాణమునకు సిద్ధమైన సమయమున -.

సీ॥ ఎవ్వాఁడు వింధ్యాద్రి నిఱ్ఱింకు లింకించె
గంభీర హుంకార గర్జనమునఁ
బ్రణవ పంచాక్షరోపనిషత్ప్రపంచంబు
లెవ్వాఁడు శివునిచే నెఱిఁగి కొనియె

గడసిల్లు ధర యొడ్డగెడవైన నెవ్వాఁడు
త్రాసుపైఁగట్లె చందమున వంచె
నంభోధు లేడింటి నాపోశనంబెత్తి
కలిగించె నెవ్వాఁడు క్రమ్మఱంగ

తే॥ భీమనాథేశ్వరుఁడు గౌరిఁబెండ్లియాడి
దక్షిణాముఖ కల్యాణ దర్శనమున
వత్సరము వత్సరంబు నెవ్వానిఁ జూచు
నతఁడు గగనాగ్ర మాణిక్య మరుగుదెంచె. 77

అర్థము :- ఎవ్వాఁడు=ఎవడు; గంభీర=గంభీరమైన; హుంకార='హుం' అను; గర్జనమున=ధ్వనితో; వింధ్య+అద్రి=వింధ్య పర్వతమును; ఇట్టింకులు+ఇంకించె=భయపెట్టి మిక్కిలి అణగునట్లు చేసెనో -

ఎవ్వాఁడు=ఎవడు; ప్రణవ=ఓంకార సహితమైన; పంచాక్షర=ఐదు అక్షరములతో కూడిన; ఉపనిషత్+ప్రపంచంబు=ఉపనిషత్తుల సమూహమును; శివునిచే=మహేశునిచే; ఎఱిఁగి కొనియె=తెలిసి కొనెనో -

ఎవ్వాఁడు=ఎవడు; గడసిల్లు=సమముగానున్న; ధర=భూమి; ఒడ్డ గెడవు+ఐన= తలక్రిందులైన; త్రాసుపై=త్రాసుపై; కట్లె చందమున=తూచు గుండ్ల వలె; వంచెనో=సరి చేసెనో -

ఎవ్వాఁడు=ఎవడు; అంభోధులు+ఏడింటిని=ఏడు సముద్రములను; ఆపస్+ అశనంబెత్తి=పుడిసిలితో త్రాగి; క్రమ్మఱంగ=మరల; కలిగించెన్=యథాస్థితిలో నుంచెనో -

ఎవ్వానిన్=ఎవనిని; భీమనాథేశ్వరుఁడు=భీమేశ్వర స్వామి; గౌరిన్+పెండ్లి+ఆడి= పార్వతిని వివాహమాడి; వత్సరము వత్సరంబున్=ప్రతి ఏడు; దక్షిణాముఖ కల్యాణ దర్శనమున=దక్షిణ దిశయందుగల ద్వారమున వివాహానంతరము; చూచున్=చూచునో; గగన+ అగ్ర మాణిక్యము=ఆకాశము చివరనుండు మాణిక్యమైన; అతఁడు=ఆ అగస్త్య మహర్షి; అరుగుదెంచె=వచ్చెను.

భావము :- వింధ్య పర్వత గర్వమును అణచినవాడు, శివునిచే పంచాక్షరీ మంత్రముపదేశము పొందినవాడు, ఒక ప్రక్కకు ఒరిగిపోవు భూమిని సరిచేసినవాడు, సప్త సముద్రములను ఒక్క గుక్కలో మ్రింగి మరల వదలినవాడు, ప్రతి ఏడు వివాహానంతరము భీమేశ్వరునిచే చూడబడెడివాడును, గగనమునకు మాణిక్యమైనవాడు - అగు అగస్త్య మహర్షి అక్కడకు వచ్చెను.

విశేషము :- శరదృతు వర్ణనములో అగస్త్యోదయ వర్ణనములు :-

మ. అతిగాంభీర్య విభూతి నేక చుళుకా హంకార నిశ్శేష శో
షిత పాథోధి పయస్కుడైన ముని దోఁచెం బుణ్య తేజోమయా
కృతి నయ్యామ్య దిగంత వీథిఁ బ్రకటక్రీడా కళాగర్వ గ
ర్జిత మండూక కళంకితాంబు శుచితా సిద్ధి ప్రదాచార్యుఁడై. అరణ్యపర్వము. 4-146.

కుంభజుడు దక్షిణాభిముఖుండగుటయు
నదను వీక్షించి వచ్చెనోయనఁగ వచ్చె
శంబరారి ప్రతాపాగ్ని సామిధేని
నవశరద్వేళ శ్రీ భీమనాథుఁగొలువ కాశీ - 3-20

అలంకారము - రూపకము.

తే॥ మలయ దర్దుర గిరిగుహా మందిరుండు
తామ్ర పర్ణీజలస్నాన ధౌత మలుఁడు
కలుషితాంభః ప్రసాదైక కతక ఫలము
కోమలియుఁదాను నేతెంచెఁగుంభ భవుఁడు 78

అర్థము :- మలయ=మలయము అను; దర్దుర=దర్దురము అను: గిరి=పర్వతముల; గుహా=గుహలు; మందిరుండు=ఇండ్లు అయినవాడు; తామ్రపర్ణీ=తామ్రపర్ణి అను నది యొక్క: జల=నీటిలో; స్నాన=స్నానము చేయుటచే; ధౌత=కడుగబడిన; మలుఁడు=మాలిన్యము కలవాడు; కలుషిత+అంభస్=మురికి నీటికి: ప్రసాద=వరమైన(నిర్మలముగా జేయు); ఏక కతక ఫలము=ఒకే ఇండుపకాయ అయిన; కుంభ భవుండు=అగస్త్యుడు; తాను=తాను: కోమలియు=అతని భార్యయైన లోపాముద్రయు; ఏతెంచెను=వచ్చెను.

భావము :- మలయ దర్దుర పర్వత గుహలలో నుండువాడు. తామ్ర పర్ణీనదిలో స్నానము చేసి పవిత్రమైనవాడు, కలుషితమైన నీటిని శుభ్రపరచువాడు - అయిన అగస్త్య మహర్షి భార్యయైన లోపాముద్రతో అక్కడకు వచ్చెను.

విశేషము :- అగస్త్యుడు - "కలుషితాంభఃప్రసాదైక కతక ఫలము" - శరత్కాలమున అగస్త్య నక్షత్రము ఉదయించును. బురద నీరు స్వచ్ఛమగుట అప్పుడే ప్రారంభించును. వెనుకటి పద్యములో 'గగనాగ్ర మాణిక్యము' అని అగస్త్యుని వర్ణించెను కదా!

సీ॥ వానకాలమునాడు వంద్రు పట్టిన నీటి
కాలుష్యముడిపెడు కతక ఫలము. కాశీ - 2-160.

మలయ దర్దురములు దక్షిణదేశ ప్రసిద్ధ పర్వతములు.

1. మలయేనచ వింధ్యేన మేరుణా మందరేణచ
దర్దురేణ చ తే దేవి శపే మూలఫలేనచ -సుందరకాండ. 36 స. 38 శ్లో.

2. సనిర్విశ్యయథా కామం తటేష్వాలీఢచందనౌ
స్తనావివ దిశస్తస్యాశ్శైలౌ మలయ దర్దురౌ. కాళిదాసు - రఘు-4-51.

తామ్రపర్ణి :- నీలగిరి నుండి కన్యాకుమారి వఱకు గల పడమటి కనుమలను మలయ పర్వతమందురు. అందులోని అగస్త్యమల అను పర్వత ప్రదేశము నుండి బయలుదేరి బంగాళాఖాతములో కలియు నది ఈ నది. ఈ నదిలోని ఇసుక ఎఱ్ఱగా నుండును. దీని తీరములో గల చెట్ల ఆకులు ఎఱ్ఱగానుండును. అందువలన తామ్రపర్ణి అని దీనికి నామమేర్పడినది. అలంకారము - రూపకము.

శా॥ ద్వీపాంతోద్భవుఁడైన సంయమి కులాధీశుండు కాలోచిత
వ్యాపారంబులు దీర్చి రేపకడ దక్షారామ యాత్రోద్యమం
బాపాదించుచు నోంక్రియా నగర పర్యంతార్ధమార్గంబునన్
లోపాముద్రయుఁదాను వచ్చుముని నాలోకించె దౌదవ్వులన్ 79

అర్థము :- ద్వీప+అంత+ఉద్భవుడైన=ద్వీప మధ్యమునందు పుట్టిన వాడైన; సంయమి=మునుల; కుల+అధీశుండు=సంఘశ్రేష్ఠుడు అయిన వ్యాసుడు; కాల+ఉచిత వ్యాపారంబులు=కాలమున చేయవలసిన పనులు; తీర్చి=పూర్తి చేసికొని; రేపకడ= ఉదయము ననే; దక్షారామ యాత్రా+ఉద్యమంబు=దక్షారామమునకు వెళ్లుటకు ప్రయత్నము; ఆపాదిం చుచున్=కలిగించుచు; ఓంక్రియా నగర=ఓం క్రియానగరము; పర్యంత+అర్థ+మార్గంబునన్= చివరగాగల త్రోవకు నడుమ; లోపాముద్రయున్=లోపాముద్రయు; తాను=తాను; వచ్చు మునిన్=వచ్చు అగస్త్య మునిని; దౌదవ్వులన్=దూర దూరముగ; ఆలోకించె=చూచెను.

భావము :- వ్యాస మహర్షి ప్రాతఃకాలమున దక్షారామమునకు బయలుదేరి వెళ్లుచు ఓంక్రియా నగర మార్గ మధ్యమున అగస్త్యుని, ఆయన భార్యయైన లోపాముద్రను దూరముగా చూచెను.

విశేషము :- ఓంక్రియా నగరము అన్నది పాతపేరు. దీని ప్రస్తుత నామము ఓదూరు. ఇది తూర్పు గోదావరి జిల్లా రామచంద్రపురమునకు సమీపమునందున్నది.

తే॥ ద్వాదశ క్షేత్రయాత్రా విధాన నియతి
భీమ మండలిఁ జరియింపఁ బృథుల భక్తిఁ
గుక్కుటేశ్వరు దర్శింపఁ గోర్కిపుట్టి
యట్టి పీఠాపురంబున కరుగు వాని. 80

అర్థము :- ద్వాదశ క్షేత్ర యాత్రా విధాన నియతి=ద్వాదశ క్షేత్రములను చూడవలెనను నియమముతో; భీమమండలిన్=భీమ మండలమునందు; చరియింపన్=సంచరింప; పృథులభక్తిన్=అధిక భక్తితో; కుక్కుటేశ్వరు=కుక్కుటేశ్వర స్వామిని; దర్శింపన్+కోర్కి పుట్టి= చూడ కోరిక కలిగి; అట్టి=ఆ కుక్కుటేశ్వరుడున్న; పీఠాపురంబునకు=పిఠాపురమునకు; అరుగు వాని=వెళ్ళుచున్న అగస్త్యుని.

భావము :- ద్వాదశక్షేత్ర యాత్రల నియమముతో భీమ మండలములో సంచరించుచు, కుక్కుటేశ్వరుని చూడకోర్కి పుట్టి పిఠాపురము వెడలు అగస్త్యుని -

విశేషము :- ద్వాదశ క్షేత్రముల వివరణము తృతీయాశ్వాసములో(3-74) వచ్చును.

> వేపులు భీమలింగము గుఱించి జపంబొనరించి నిచ్చలున్
> మాపటి దాఁకఁ దీర్థముల మజ్జన మాడుచు నుండు వానిఁబీ
> ఠాపురి కుక్కుటేశ్వరుని డాయఁగఁ బోయెడు వానిఁదుల్యభా
> గాపగ చెంత శంకర గృహాంగణ బిల్వవనాంతరంబునన్. 81

అర్థము :- నిచ్చలన్=ఎల్లప్పుడు; వేపులు=ప్రాతఃకాలములందు; భీమలింగము గుఱించి=భీమేశ్వరుని గూర్చి; జపంబు+ఒనరించి=జపము చేసి; మాపటి దాఁకన్=సాయంకాలము వరకు; తీర్థముల=తీర్థములందు; మజ్జనము+ఆడుచున్+ఉండువాని=స్నానములు చేయుచుండు వానిని; పీఠాపురి కుక్కుటేశ్వరుని=పిఠాపురమునందున్న కుక్కుటేశ్వర స్వామిని; డాయఁగన్ పోయెడు వాని=సమీపించుటకు వెడలుచున్న వానిని; తుల్యభాగ+ఆపగ చెంత= తుల్యభాగానది చెంత; శంకరగృహ+అంగణ=శివాలయమునకు ముందున్న; బిల్వవన+ అంతరంబునన్=మారేడు తోట మధ్యలో -

భావము :- ఎల్లప్పుడు ప్రొద్దుట భీమేశ్వర జపము. సాయంకాలము వరకు తీర్థస్నానములు చేయు వానిని, పిఠాపురము నందున్న కుక్కుటేశ్వర స్వామిని చూచుటకు వెడలుచున్న వానిని, తుల్యభాగ నదీ తీరమున శివాలయ ప్రాంగణమందలి మారేడు తోట మధ్యలో నున్న -

వ॥ అప్పరమ మాహేశ్వరుం గనుంగొని సాత్యవతేయుండు ప్రత్యుత్థానంబు చేసి యెదుర్కొనియె నతండును - 82

అర్థము :- ఆ+పరమ మాహేశ్వరున్=ఆ మహాశివ భక్తుడైన అగస్త్యుని; కనుంగొని= చూచి; సాత్యవతేయుండు=వ్యాసుడు; ప్రతి+ఉత్థానంబు చేసి=గౌరవముగా లేచి; ఎదుర్కొనియెన్=ఎదురేగెను; అతండును=ఆ అగస్త్యుండును -.

భావము :- ఆ మహాశివభక్తుడైన అగస్త్యుని చూచి వ్యాసుడు గౌరవముగా లేచి ఎదురేగెను. ఆ అగస్త్యుడును -

సీ॥ భస్మత్రిపుండ్రాంక ఫాలప్రదేశుని
రుద్రాక్ష మాలికారూఢ వక్షు
నుపవీత కృష్ణాజినోత్తరాంగునిఁబల్ల
వారుణాంచిత జటాపటల ధారుఁ
దామ్ర పాత్రాంగుళీ దర్భమూల పవిత్రుఁ
దరుణ కింశుక లతా దండధారుఁ
బ్రావృషేణ్య వినీల పాథోధర శ్యాము
సాల వృక్ష ప్రాంశుఁజారు దేహుఁ

తే॥ బరమ భాగవతోత్తమ ప్రథమ గణ్యు
విమల మాహేశ్వరాచార వీథి పథికు
నఖిల నీవారముష్టింపచాగ్ర వరునిఁ
బులిన సంభవుఁ బొడగాంచెఁ గలశజుండు. 83

అర్థము :- భస్మ త్రిపుండ్ర+అంక=మూడు విబూది గీతల చిహ్నముల; ఫాల ప్రదేశుని=నొసలు కలవానిని; రుద్రాక్ష మాలికా=రుద్రాక్షల హారము; ఆరూఢ=కలిగిన; వక్షు= రొమ్ము కలవానిని;

ఉపవీత=ఎడమ భుజముపై సవ్యముగా వేసికొన్న జందెము; కృష్ణ= నల్లజింక; అజినము=తోలు; ఉత్తర+అంగుని=ఎడమ భుజము పైభాగమునకల శరీరము కలవానిని; పల్లవ+ అరుణ=లేత చిగురుటాకు ఎరుపు రంగుతో; అంచిత=ఒప్పిన; జటా=జడల; పటల= సమూహము; ధారున్=కలవానిని;

తామ్రపాత్ర=రాగిచెంబు; అంగుళీ=వ్రేలికి; దర్భమూల=దర్భల మూలముల; పవిత్రున్=(పవిత్రము) ఉంగరము కలవానిని; తరుణ=లేత; కింశుకలతా= మోదుగ చెట్టుయొక్క సన్నని; దండధారున్=దండము ధరించిన వానిని;

ప్రావృషేణ్య=వర్షాకాల; వినీల=నల్లనైన; పాథోధర=మేఘమువంటి; శ్యాము=నల్లని వర్ణము కలవానిని; సాలవృక్ష= మద్దిచెట్టువలె; ప్రాంశు=పొడవైన వానిని; చారుదేహున్= మనోహరమైన శరీరము కలవానిని;

పరమ భాగవతోత్తమ ప్రథమగణ్యున్=గొప్పభక్తులలో మొదటి లెక్కింపదగినవానిని; విమల=స్వచ్ఛమైన; మాహేశ్వర+ఆచార=శైవాచారములనెడి; వీధిపథికున్=వీధులందు పయనించువాడు; అఖిల=సకలమైన; నీవార ముష్టింపచ+ అగ్రవరు=గుప్పెడు తృణ ధాన్యము వండుకొనితిను మునుల ముందరి వారిలో శ్రేష్ఠుడు; పులిన సంభవున్=వ్యాసుని; కలశజుండు=అగస్త్యుడు; పొడగాంచెన్=చూచెను.

**భావము** :- నొసటిపై భస్మ త్రిపుండ్రములు కలవానిని, రొమ్ముపై రుద్రాక్షల హారము కలవానిని, ఎడమ భుజముపై జందెము జింకచర్మము కలవానిని, ఎఱ్ఱని జడలు కలవానిని, రాగిచెంబు, పవిత్రము (దర్భ ఉంగరము) చేతివ్రేళ్ళయందు కలవానిని, మోదుగ దండము పట్టుకొనిన వానిని, వర్షాకాల మేఘవర్ణ శరీరము కలవానిని, మద్దిచెట్టువలె ఎత్తైనవానిని, ఆకర్షణీయమైన ఆకారము కలవానిని. భక్తాగ్రేసరుని మహాశైవాచార పథానువర్తిని, మునిశ్రేష్ఠుని - వ్యాసుని అగస్త్యుడు చూచెను.

**విశేషము** :- వ్యాస మహర్షి రూపము కన్నులకు కట్టినట్లుగా వర్ణించిన ఈ పద్యము తిక్కనగారి (భీష్మ 1-71)

ప్రాంశుఁ బయోదనీల తనుభాసితు నుజ్జ్వల దండధారుఁ బిం
గాంశు జటాచ్ఛటాభరణు నాగమపుంజ పదార్థ తత్త్వ ని
స్సంశయకారుఁ గృష్ణ మృగచర్మ కృతాంబర కృత్యు భారతీ
వంశ వివర్ధనున్ త్రిదశ వందితు సాత్యవతేయుఁ గొల్చెదన్

అన్న పద్య రూపమునకు పెద్దదిగా గీసిన చిత్రము.

వ్యాసుని 'పులిన సంభవు'డు' - అనియు; అగస్త్యుని 'కలశజుండు' అని అనుటయు ఒక చమత్కారము.

ఉ॥ **యోజనగంధినందనుఁడు నూర్వశి పట్టియు నిర్నిరోధ ని**
**ర్వ్యాజ నిరంకుశ ప్రణయవైభవ సంపద సొంపు మానసాం**
**భోజములం దలిర్ప మునిపుంగవు లొండొరుఁగౌఁగలించి వి**
**భ్రాజితలీలఁ జల్పిరి పరస్పరముం గుశల ప్రసంగముల్.** **84**

**అర్థము** :- యోజన గంధినందనుఁడు=సత్యవతి కుమారుడు వ్యాసుడు; ఊర్వశి పట్టియు=ఊర్వశి కుమారుడు అగస్త్యుడును అయిన; మునిపుంగవులు=మునిశ్రేష్ఠులు; నిర్నిరోధ=అడ్డులేని; నిర్వ్యాజ=కపటములేని; నిరంకుశ=అదుపులేని; ప్రణయ=ప్రేమయొక్క; వైభవ=గొప్పతనపు; సంపద=సమృద్ధి; సొంపు=అందము; తలిర్ప=చిగురింప; ఒండొరున్=

ఒకరినొకరు; కౌగిలించి=ఆలింగనము చేసికొని; విభ్రాజితలీలన్=మిక్కిలి ప్రకాశించువిధముగ; పరస్పరమున్=ఒకరినొకరు; కుశల ప్రసంగముల్=క్షేమ సంభాషణము; చల్పిరి=చేసిరి.

భావము :- వ్యాసుడు, అగస్త్యుడును అపారమైన ప్రేమతో ఒకరినొకరు కౌగిలించుకొని, కుశల ప్రసంగములు చేసిరి.

**విశేషము** :- వెనుకటి పద్యమున 'పులిన సంభవుడు, కలశజుండు' అని పుట్టుకలను గూర్చి; ఇక్కడ యోజన గంధినందనుడు; ఊర్వశి పట్టి' అని తల్లులను గూర్చి తెలియునట్లుగా వారి నామములను వ్రాసి; వారు కారణజన్ములైన మహానుభావులని సూచించినాడు.

**కం॥ వినయము భక్తియు సంభ్రమ**
**మును సౌహార్దంబు హృదయముల మొలతేరన్**
**వినుతి యొనర్చి రగస్త్యున**
**కును వైశంపాయనాదికులు మునిశిష్యుల్. 85**

**అర్థము** :- వైశంపాయన+ఆదికులు=వైశంపాయనుడు మొదలైన; మునిశిష్యుల్=వ్యాసమహర్షి శిష్యులు; అగస్త్యునకును=అగస్త్య మహర్షికిని; వినయము=వినయము; భక్తియు=భక్తియు; సంభ్రమమును=తొట్రుపాటు; సౌహార్దంబు=ప్రేమ; హృదయముల=మనస్సులలో; మొలతేరన్=కలుగగా; వినుతి యొనర్చిరి=స్తుతి చేసిరి.

భావము :- వ్యాసుని శిష్యులైన వైశంపాయనాదులు భక్తి శ్రద్ధలతో, వినయ విధేయతలతో అగస్త్యునకు నమస్కరించిరి.

**వ॥ అనంతరం బాతుల్యభాగాతీర బిల్వతరు వనాంతరంబున శశికాంత శీతల శిలాతల ప్రదేశంబున నాసీనులై యిల్వలాసుర దమనుండును బరాశర నందనుండును గొంత తడవి ష్టకథా వినోదంబులఁ బ్రొద్దుపుచ్చి రప్పుడగస్త్యుఁడు సాత్యవతేయున కిట్టులనియె. 86**

**అర్థము** :- అనంతరంబు=తరువాత; తుల్యభాగాతీర=తుల్యభాగనది యొక్క ఒడ్డున గల; బిల్వతరువన+అంతరమున=మారేడు తోటలో; శశికాంత శీతల=చంద్రకాంతమణులవలె చల్లనైన; శిలాతల ప్రదేశంబున=బండలు కల స్థలమున; ఆసీనులై=కూర్చుండి; ఇల్వల+అసుర దమనుండునున్=ఇల్వలుడు అను రాక్షసుని సంహరించిన అగస్త్యుడును; పరాశర నందనుండునున్=పరాశర మహర్షి కుమారుడైన వ్యాసుడును; కొంత తడవు=కొంచెముసేపు; ఇష్టకథా వినోదంబులన్=ప్రీతికరములైన విషయములతో; ప్రొద్దుపుచ్చిరి=కాలము గడిపిరి; అప్పుడు=అంత; అగస్త్యుఁడు=అగస్త్య మహర్షి; సాత్యవతేయునకు=సత్యవతి కొడుకైన వ్యాసునకు; ఇట్టులు+అనియె=ఈ విధముగా అనెను.

భావము :- తరువాత వ్యాసుడు అగస్త్యుడు తుల్యభాగ తీరమున మారేడుతోటలో-చల్లని రాళ్ళపై కూర్చుండి కొంచెముసేపు ఇష్టములైన విషయ సంభాషణములతో కాలము గడిపిరి. అప్పుడు అగస్త్య మహర్షి వ్యాసమహర్షితో ఈవిధముగా పలికెను.

## అగస్త్యుఁడు వ్యాసమహర్షిఁగాశిఁబాసి వచ్చుటకుఁ గారణంబడుగుట :

తే॥ "ఆననము నందు వైవర్ణ్యమగ్గలించెఁ
గన్నుఁగవయందు దైన్యంబు గానఁబడియె
నార్తి యేదేని యొకటి నీ యంతరంగ
మూనియున్నది యిది యెట్టులొక్కొ యనఘ! 87

అర్థము :- అనఘ=పుణ్యాత్ముడా!; ఆననమునందు=ముఖమునందు; వైవర్ణ్యము=వెల్లబాటు; కన్ను+కవ+అందు=కనుజంట యందు; దైన్యంబు=దీనత; కానబడియెన్=కనిపించెను; నీ అంతరంగము=నీ మనస్సు; ఆర్తి=బాధ; ఏదేని ఒకటి=ఏదియో ఒకటి; ఊని ఉన్నది= కలిగియున్నది; ఇది ఎట్టులు ఒక్కొ=ఈ బాధ ఏవిధమైనదో!

భావము :- పుణ్యాత్ముడా! నీ ముఖము నందు కాంతి తగ్గెను. కన్నులలో దైన్యము కనబడుచున్నది. నీ మనస్సు ఏదో ఒక దుఃఖముతో కూడి ఉన్నది. ఇది ఏ విధమైన దుఃఖము?

సీ॥ లోలార్కునకు నీకు లోలోన నేమేనిఁ
బోటు పుట్టదు గదా? మాట మాట
వెనకయ్య శ్రీడుంఠి విఘ్నేశ్వర స్వామి
ధిక్కరింపఁడు గదా? తెగువ నిన్ను
నాఁకొన్న నిన్ను మధ్యాహ్న కాలంబున
నరయకుండదు గదా? యన్నపూర్ణ
నెపమేమియును లేక నీయెడాటమ్మునఁ
బాటిఁదప్పఁడుగదా? భైరవుండు
తే॥ ఎట్టు పాసితి మిన్నేటి యిసుకతిప్ప?
యెట్టు పాసితి వాస్థలం బేనుక్రోసు?
లెట్టు పాసితి వవిముక్తహట్ట భూమి?
యెట్టు పాసితి విశ్వేశు నిందుధరుని? 88

అర్థము :- లోలార్కునకు=లోలార్కుడను సూర్యునకు; నీకు=నీకు; లోలోన=లోలోపల; ఏమేనిన్=ఏదేని; మాటమాట=మాటమీదమాట వచ్చి; పోటు పుట్టదు కదా=వివాదము కలుగదు కదా!

శ్రీడుంఠి విఘ్నేశ్వర స్వామి=డుంఠి విఘ్నేశ్వరుడు అనుపేరు కల; వెనకయ్య= వినాయకుడు; తెగువన్=సాహసముతో; నిన్నున్=నిన్ను; ధిక్కరింపఁడు కదా=తిరస్కరింపడు కదా.

అన్నపూర్ణ=అన్నపూర్ణాదేవి; మధ్యాహ్న కాలంబునన్=మధ్యాహ్న సమయమున; ఆఁకొన్న నిన్ను=ఆకలితోనున్న నిన్ను; అరయకుండదు కదా=పట్టించుకొనక ఉండదు కదా!

భైరవుండు=(క్షేత్రపాలకుడైన) కాలభైరవుడు; నెపము+ఏమియును లేక=కారణము ఏమియు లేకుండగ; నీ ఎడాటమ్మునన్=నీ విషయమున; పాటిన్+తప్పఁడు కదా=న్యాయము తప్పడు కదా.

మిన్నేటి=గంగానది యొక్క; ఇసుక తిప్పలు=ఇసుక తిన్నెలను; ఎట్టు పాసితి= ఎట్లు వీడితివి; ఏనుక్రోసులు=ఐదుక్రోసులు గల; అస్థలంబు=ఆ కాశీ నగర ప్రదేశమును; ఎట్టు పాసితి=ఎట్లు వీడితివి; అవిముక్త=కాశియందలి; హట్టభూమిన్=విపణి వీధీ ప్రదేశమును; ఎట్టు పాసితి=ఎట్లు వీడితివి; ఇందుధరుని=చంద్రశేఖరుడైన; విశ్వేశున్= విశ్వనాథుని; ఎట్టు పాసితి=ఎట్లు వీడితివి?

భావము :- లోలార్కునకు నీకు లోలోపల ఏమైన మాటమాట వచ్చి మనస్పర్థ కలుగలేదు కదా! డుంఠి విఘ్నేశ్వరుడు సాహసించి నిన్ను తిరస్కరింపడు కదా! మధ్యాహ్న కాలమున ఆకలితో నున్న నిన్ను అన్నపూర్ణ పట్టించుకొనకుండ నుండదు కదా! కారణము ఏమియు లేక భైరవుడు నీ విషయమున న్యాయము తప్పడు కదా! మిన్నేటి ఇసుక తిప్పలను, ఐదుక్రోసుల కాశిని, చక్కని అంగడులతో కూడిన వీథులను, విశ్వనాథుని ఎట్లు వీడి వచ్చితివి?

కం॥ కాళీ నందన కంఠే
కాలుర శిరములకు విరులు కల్పించునొకో
లీలావనాంతరమునను
మా లోపాముద్రయిడిన మల్లీవల్లుల్. 89

అర్థము :- లీలావనాంతరమునను=(విలాసమైన) ఉద్యానవనము నందు; మా లోపాముద్ర=నా భార్యయైన లోపాముద్ర; ఇడిన=నాటిన; మల్లీవల్లుల్=మల్లెతీగలు; కాళీనందన= పార్వతీపుత్రుడైన వినాయకుని; కంఠేకాలుర=నీలకంఠుని; శిరములకు=తలలకు; విరులు=పుష్పములు; కల్పించునొకొ=పూచి ఇచ్చుచున్నవా?

**భావము** :- ఉద్యానవనము నందు మా లోపాముద్ర నాటిన మల్లెతీగెలు వినాయకుని, నీలగ్రీవుని శిరస్సులకు పూలు అందించుచున్నవా?

**విశేషము** :- కాళీనందన=కాళి అను నామాంతరము గల సత్యవతి కుమారుడవైన వ్యాసా!; కంధేకాలురశిరములకు=కాశిలోగల శివలింగముల శిరస్సులకు - అనియు అర్థము చెప్పవచ్చును.

పదపూర్వార్థ వక్రత యందలి రూఢి వక్రత ఈ పద్యము నందు కలదు.

శా॥ **ఆ మందాకిని యా త్రివేణి వలనం బా బాహ్య కక్ష్యాస్థలం**
**బా మధ్యాంతర కక్ష్య లా విమల దివ్యజ్యోతి రుజ్జృంభణ**
**శ్రీమద్విశ్వపతీశ లింగము మదిం జింతింపఁ గాశీమహా**
**గ్రామంబిప్పుడు నా కనుంగవకు సాక్షాత్కారముం గైకొనున్.** 90

**అర్థము** :- మదిన్=మనస్సులో; చింతింపన్=ఆలోచింపగా; ఆ మందాకిని=ఆ గంగానది; ఆ త్రివేణి వలనంబు=ఆ త్రివేణి మెలికలు తిరుగుట; ఆ బాహ్య కక్ష్యా స్థలంబు=ఆ బయటి గ్రామ ప్రదేశము; ఆ మధ్యాంతర కక్ష్యలు=ఆ లోపలకల మేడల గదులు; ఆ విమల=ఆ స్వచ్ఛమైన; జ్యోతిః+ఉజ్జృంభణ=వెలుగు యొక్క అతిశయ రూపమగు; శ్రీమత్+విశ్వపతి+ఈశ లింగము=శ్రీమంతమైన విశ్వనాథ స్వామి లింగము (కల); కాశీ మహాగ్రామంబు=గొప్పదగు కాశీ పట్టణము; ఇప్పుడు=ఇప్పుడు; నా కనుంగవకు=నా రెండు నేత్రములకు;సాక్షాత్కారమున్+కైకొనున్=ప్రత్యక్షమగుటను గ్రహించుచున్నది.

**భావము** :- మనస్సులో తలచుకొనగనే - ఆ గంగానది, ఆ త్రివేణీ సంగమము, ఆ దేవాలయమునకు బైట లోపలగల వసారాలు, మహాప్రకాశవంతమైన ఆ విశ్వనాథుని లింగము, ఆ కాశీ పట్టణము ఇప్పుడు నా కన్నులకు కన్పడుచున్నది.

**విశేషము** :- మందాకిని=మందం అకతి గచ్ఛతీతి మందాకిని. కాశీ ప్రాంతము నందు గంగ నిండుగ గంభీరముగ ప్రవహించును. వరణ, అసి, గంగా నదులు కలియుట=త్రివేణి. గంగానదిలో అవి కలియునపుడు వాని ప్రవాహములు మెలికలు తిరుగును.

శా॥ **ఆనందంబున నర్ధరాత్రమునఁ జంద్రాలోకముల్ కాయఁగా**
**నానా సైకత వేదికా స్థలములన్ నల్దిక్కులన్ శంభుఁ గా**
**శీనాథున్ దరుణేందుశేఖరు శివున్ శ్రీకంఠునిన్ బాడుదు**
**న్మేనెల్లం బులకాంకుర ప్రకరముల్ నిండార మిన్నేటిలోన్** 91

అర్థము :- మిన్నేటిలోన్=గంగానదిలో; నానా సైకత వేదికా స్థలములన్=అనేకములైన ఇసుక తిన్నెల ప్రదేశములందు; నల్దిక్కులన్=నాలుగు దిక్కులందు; అర్ధరాత్రమున= నడిరేయిని; చంద్రాలోకముల్=వెన్నెలలు; కాయఁగా=విరియగా; ఆనందంబునన్= ఆనందముతో; శంభున్=సుఖము గలిగించువాడును; తరుణ=కొంగ్రొత్తయగు, ఇందు= చంద్రుడు, శేఖరున్=సిగదండగాగల వాడును, శ్రీకంఠునిన్=విషము కుత్తుకలో గలవాడును; కాశీనాథున్=కాశీపట్టణమునకు ప్రభువగు, శివున్=విశ్వేశ్వర స్వామిని; మేను+ఎల్లన్= శరీరమంతయు; పులక+అంకుర ప్రకరముల్=(ఆనందము) నిక్కపొడుచుకొన్న వెంద్రుకల సమూహములు; నిండారన్=అతిశయింపగ; పాడుదున్=స్తుతించెడివాడను.

భావము :- అర్ధరాత్రమున వెన్నెలలు కాయుచుండగా, ఆనందముతో శరీరము గగుర్పాటు చెందునట్లుగా గంగానదిలో కాశీ విశ్వనాథుని స్తోత్రము చేయుచుండెడి వాడను.

విశేషము :- "శంభుఁ గాశీనాథున్ దరుణేందు శేఖరు శివున్ శ్రీకంఠునిన్" అని ఇన్నిసారులు శివ నామములు స్మరించుట - అగస్త్యుడు తలచుకొని తన్మయత చెందుటను తెలుపుచున్నది.

కం॥ గంగా యమునా తీరో
త్సంగమునఁ బ్రయాగను న్సదాశివు విశ్వే
శుం గూర్చి తపము చేసితి
నంగుష్ఠము ధరణి మోపి యతి ఘోరముగన్. 92

అర్థము :- సదాశివు విశ్వేశుంగూర్చి=సకల శుభప్రదుడైన విశ్వనాథుని కూర్చి; అతి ఘోరముగన్=మిక్కిలి తీవ్రముగ; అంగుష్ఠము+ధరణిమోపి=బొటన వ్రేలు నేలపై మోపి; గంగా యమునా=గంగానది యమునా నదుల; తీర+ఉత్సంగమునన్=ఒడ్డు యొక్క పైభాగములందు; ప్రయాగను=ప్రయాగలో; తపముచేసితి=తపస్సు చేసితిని.

భావము :- గంగానది యమునానది కలయు చోటైన ప్రయాగలో బొటనవ్రేలు మాత్రమే నేలకు ఆనునట్లుగా నిలచి విశ్వనాథుని కూర్చి మిక్కిలి భయంకరమైన తపస్సు చేసితిని.

తే॥ విస్మయము నాకు మదిలోన విస్తరిల్లెఁ
బరమ ధర్మజ్ఞ! కాశికా పట్టనమున
నుండు మూఢాత్ముడైనను నొండుకడకుఁ
బోవఁ దలఁపఁడు నీకెట్లు బుద్ధి పుట్టె?" 93

అర్థము :- పరమ ధర్మజ్ఞ=ధర్మములు తెలిసిన వారిలో గొప్పవాడా!; నాకు=నాకు; మదిలోన=మనస్సులో; విస్మయము=ఆశ్చర్యము; విస్తరిల్లెన్=కలిగెను; కాశికా పట్టనమునన్= కాశీనగరమున; ఉండు=నివసించు; మూఢాత్ముఁడైనను=మూర్ఖుడైనను; ఒండుకడకున్= ఇంకొకచోటునకు; పోవన్+తలఁపఁడు=పోవుటకు ఇష్టపడడు; నీకు+ఎట్లు=పరమధర్మజ్ఞుడవైన నీకెట్లు; బుద్ధిపుట్టె=బుద్ధి పుట్టినది?

భావము :- పరమ ధర్మజ్ఞ! నాకు ఆశ్చర్యము కలుగుచున్నది. కాశీలోనుండు మూఢుడైనను కాశిని విడిచి ఇంకొకచోటునకు పోవుటకు ఇష్టడడు. నీకెట్లు ఈ బుద్ధి పుట్టినది?"

వ॥ అనినఁ బారాశర్యుండు వాతాపి దమనున కిట్లనియె- 94

అర్థము :- అనినన్=అగస్త్యుడు ఇట్లు ప్రశ్నింపగా; పారాశర్యుండు=పరాశర మహర్షి కొడుకైన వ్యాసుడు; వాతాపి=వాతాపి అను రాక్షసుని; దమనునకు=సంహరించిన వానికి; (అగస్త్యునకు) ఇట్లనియె=ఈ విధముగ అనెను.

భావము :- అగస్త్యుడు ఇట్లు ప్రశ్నింపగా వ్యాసుడు ఈ విధముగ సమాధానము చెప్పెను-

## వ్యాసుఁడు తాను కాశిఁ బాసిన కారణంబుఁ జెప్పుట :

చం॥ "సమధిక సత్కవీశ్వరులు జైమిని పైల సుమంతులాదిగా
శమదమ సద్గుణాన్వితులు సాధులు శిష్యులుతోడఁగూడిరాఁ
గ్రమమున క్షేత్రయాత్రకు ధరాతలమందఖిలంబు ద్రొక్కి భా
వము భవభక్తియుక్తముగ వచ్చితిఁగాశికిఁబుణ్యరాశికిన్" 95

అర్థము :- సమధిక=మిక్కిలి అధికమైన; సత్కవీశ్వరులు=ఉత్తమ కవి శ్రేష్ఠులు; శమదమ సద్గుణ+అన్వితులు=శాంతియు దాంతియునను మంచి గుణములతో కూడినవారు; సాధులు=మంచివారు; శిష్యులు=అంతేవాసులు అయిన; జైమిని పైల సుమంతులు+ఆదిగా= జైమిని, పైలుడు, సుమంతుడు మొదలైనవారు; తోడన్+కూడిరాన్=వెంటరాగా; క్రమమున= వరుసగ; క్షేత్రయాత్రకు=క్షేత్రములను చూచు ప్రయాణమున; ధరాతలమందు=భూమిపై; అఖిలంబు+త్రొక్కి=సమస్తము తిరిగి; భావము=మనస్సు; భవభక్తి యుక్తముగ=శివభక్తితో గూడినది కాగా; పుణ్యరాశికిన్=పుణ్యములకు కుప్పయైన; కాశికిన్=కాశీక్షేత్రమునకు; వచ్చితిన్=వచ్చితిని.

భావము :- గొప్ప కవులు, సాధువులు, శిష్యులు అయిన జైమిని, పైలుడు, సుమంతుడు మొదలైన శిష్యులతో భూమిపైగల సకల క్షేత్రములు చూచి, శివునిపైగల భక్తితో కాశికి వచ్చితిని.

విశేషము :- శమము అనగా అంతరింద్రియ నిగ్రహము. దమము అనగా బహిరింద్రియ నిగ్రహము. శమము వలన కలుగునది శాంతి. దమము వలన కలుగునది దాంతి.

కం॥ **ఏమి శకునమునఁజొచ్చితి**
**మో? మన్మథదమను వీడహోరాత్రంబుల్**
**మే మేడు నాళ్లదనుకను**
**స్వామీ! యుపవాసముండి జడిసితిమి మదిన్.** **96**

అర్థము :- స్వామీ! మన్మథదమను వీడు=మన్మథుని రూపుమాపిన శివుని పట్టనమును; ఏమి శకునమునన్=ఏ శకునమున; చొచ్చితిమొ=ప్రవేశించితిమో; మేము=మేము; అహోరాత్రంబుల్=పగలును రాత్రియును; ఏడునాళ్ల=ఏడు దినములు; దనుకను=వరకును; ఉపవాసము+ఉండి=అన్నము లేక యుండి; మదిన్=మతిలో; జడిసితిమి=స్రుక్కితిమి.

భావము :- స్వామీ! ఏ దుష్ట శకునమున కాశిలో అడుగు పెట్టితిమో; మేము ఏడు రోజులు అహోరాత్రములు ఉపవాసముండి స్రుక్కితిమి.

విశేషము :- 'స్వామీ' అను దీర్ఘాంతమైన సంబోధము వ్యాసుని దీనతను, సూచించుచున్నది.

'ఏమి' అను పదముచే బాధ సూచింపబడుటచే ఇది కుంతకుడు చెప్పిన పద పూర్వార్ధ వక్రత.

కం॥ **గేహముల కేఁగి 'భిక్షాం '**
**దేహి, యనన్వీట నొక పతివ్రత యైనన్**
**సౌహార్దంబునఁ దెడ్డెం**
**డాహారము పెట్టదయ్యె నా దినములలోన్.** **97**

అర్థము :- ఆ దినములలోన్=ఆ ఏడునాళులందు; వీటన్=పట్టణమందు; గేహములకు+ఏఁగి=ఇండ్లకు వెడలి; భిక్షాందేహి=భిక్షను పెట్టుము; అనన్=అనగా; సౌహార్దంబునన్=మంచి మనస్సుతో; ఒక పతివ్రతయైనన్=ఒక్క ఇల్లాలైనను; తెడ్డెండు=తెడ్డెడు; ఆహారము=అన్నమును; పెట్టదయ్యె=పెట్టకుండెను.

భావము :- ఆ దినములలో కాశిలో గృహములకు వెడలి భిక్షను కోరగా, ఒక్క పతివ్రత కూడ తెడ్డెడు అన్నము పెట్టలేదు.

శా॥ శ్రీ విశ్వేశ్వర దేవదేవుని కృపాశ్రీచే దివోదాసు బా
హా విక్రాంత బలంబు చేత ధనధాన్యాయ ప్రజావృద్ధి నొ
ప్పై విశ్రావము కల్గి సుస్థిరతరంబై యుండి భాసిల్లఁగా
నీ వారాణసిలోన భిక్ష కఱవయ్యెంజూడుమీ కుంభజా! 98

అర్థము :- కుంభజా!=ఓ అగస్త్య మహర్షీ!; శ్రీ విశ్వేశ్వర దేవదేవుని=దేవతలకు దేవుడగు శ్రీ విశ్వనాథ స్వామి యొక్క; కృపాశ్రీచే=దయా సంపదచే; దివోదాసు=(కాశీ రాజు అయిన) దివోదాసు యొక్క; బాహా=బాహువులందు; విక్రాంత=స్తిమితముకల; బలంబుచే= శక్తిచే; ధన+ధాన్య+అయ+ప్రజావృద్ధిన్+ఒప్పై=ధనము యొక్క, ధాన్యము యొక్క, పన్ను యొక్క, ప్రజల యొక్క వృద్ధిచే ప్రకాశించునదియై; విశ్రావము=ప్రఖ్యాతి; కల్గి=కల్గి; సుస్థిర తరంబై=అధికతరముగా నిలుకడ కలిగియుండి; భాసిల్లఁగాన్=ప్రకాశింపగా; ఈ `వారాణసి లోన= ఇటువంటి కాశీ పట్టణమునందు; భిక్ష=బిచ్చము; కఱవు+అయ్యెన్=లేమి కలిగినది; చూడుమీ=(ఈ విచిత్రమును) కనుమా.

భావము :- శ్రీ విశ్వనాథుని కృపచే, దివోదాసు ధర్మ పరిపాలనచే ఎంతయో ప్రఖ్యాతి పొందిన కాశీ పట్టణమున భిక్ష లభించుట లేదు అగస్త్యా! ఎంత విచిత్రమో చూడుము.

విశేషము :- దివోదాసుడు కాశిని పాలించిన ప్రభువు.

ఒకప్పుడు భూమిపై భయంకరమైన క్షామము వచ్చెను. అప్పుడు సృష్టికర్త మనువంశజుడైన రిపుంజయుడు అను రాజర్షిని భూమిని పాలింపుము అని కోరును. దానికి రిపుంజయుడు "బహు నాయకత్వము కుదరదు. కాశిలో గల సమస్త దేవతలు కాశిని విడిచి వెళ్లవలెను" అను నియమమును పెట్టును. ఈ నియమము వలన విశ్వనాథుడు కూడ కాశిని విడిచి పరివారముతో మందర పర్వతమునకు వలస వెళ్లును. రిపుంజయుడు సకల దేవతలను తనయందు ఆవిష్కరించుకొని ధర్మ పరిపాలనము చేసి, సశరీరుడై కైలాసమునకు చేరును.

ఈ రిపుంజయుని బిరుద నామము దివోదాసు.

"దివోపి దేవాదాస్యంతి రత్నాని కుసుమానిచ
ప్రజాపాలన సంతుష్టా మహారాజ ప్రతిక్షణమ్
'దివోదాస' ఇతిఖ్యాత మతోనామత్వమా ప్స్యసి
మత్ప్రభావాచ్చ నృపతే! దివ్యం సామర్థ్యమస్తుతే"

అని సృష్టికర్త ఇతని కిచ్చిన వరము. కాశి-39 అధ్యా-శ్లో-38,39.

శా॥ వైశంపాయనుఁడెంతయున్ సుడివడె న్వాడెన్సుమంతుండతి
క్లేశంబందిరి పైలజైమినులు దుఃఖించెన్ మదిన్ దేవలుం
డాశాంతంబులు చూచె దాల్భ్యుడుదరోదగ్ర క్షుధాక్షోభచేఁ
గాశీ పట్టన విప్రవాటికల భిక్షాలబ్ధి లేకుండుటన్. 99

అర్థము :- కాశీ పట్టన=కాశీ నగరమందలి; విప్ర వాటికల=బ్రాహ్మణుల ఇండ్ల వరుసలలో; భిక్షాలబ్ధి=బిచ్చము దొరకుట; లేకుండుటన్=లేక పోవుటచే; వైశంపాయనుఁడు= వైశంపాయనుడు; ఎంతయున్=ఎంతయో; సుడివడెన్=చలించెను; సుమంతుండు= సుమంతుడు; వాడెన్=వడలి పోయెను; పైల జైమినులు=పైలుడు, జైమినియు; అతిక్లేశంబు+అందిరి=మిక్కిలి బాధ పడిరి; దేవలుండు=దేవలుడు; మదిన్=మనస్సులో; దుఃఖించెన్=శోకించెను; దాల్భ్యుఁడు=దాల్భ్యుడు; ఉదర+ఉదగ్ర+క్షుధా+క్షోభచేన్=కడుపులో పెరిగిన ఆకలి బాధచే; ఆశాంతంబులు చూచె=దిక్కులు చూచెను.

భావము :- కాశీ పట్టనమున బ్రాహ్మణ గృహములలో భిక్ష లభింపక పోవుటచే ఆకలి బాధతో శిష్యులైన వైశంపాయనుడు, సుమంతుడు, పైలుడు, జైమిని, దేవలుడు, దాల్భ్యుడు మిక్కిలి దుఃఖించిరి.

విశేషము :- వైశంపాయనుడు - మహాభారతమును గురునాజ్ఞచే జనమేజయునకు చెప్పినవాడు; సుమంతుడు, పైలుడు :- వేద మహాభారతములను వ్యాసుని యొద్ద అధ్యయనము చేసినవారు; జైమిని :- జనమేజయుని సర్పయాగములో బ్రహ్మత్వమును నిర్వహించినవాడు; దేవలుడు :- ఏక పదార్థ అసిత ముని దంపతుల పుత్రుడు; దాల్భ్యుడు:- ఎవరో తెలియ లేదు; వీరందరు వ్యాసుని శిష్యులు.

తే॥ అక్కటా యేమి చెప్ప వింధ్యాద్రి దమన!
కాశిలో నేడునాళ్లు నిష్కారణంబు
చట్టులును నేను నిట్రుపాసంబు వడితి
మమరగంగా నదీ సైకతముల యందు. 100

అర్థము :- వింధ్య+అద్రి+దమన=వింధ్య పర్వతమును అణచిన వాడా! అక్కటా= అయ్యో! ఏమి చెప్ప=ఏమి చెప్పను; కాశిలో=కాశియందు; నిష్కారణంబు=అకారణముగ; నేనున్=నేనును; చట్టులును=శిష్యులును; ఏడునాళ్లు=ఏడు దినములు; అమర గంగానదీ=ఆకాశ గంగానది యొక్క; సైకతముల యందు=ఇసుక దిబ్బలయందు; నిట్రుపాసంబు+పడితిమి= శుష్కోపవాసము పొందితిమి.

భావము :- వింధ్యాద్రి దమనా! అయ్యో! ఏమి చెప్పెదను. కాశిలో ఏడు దినములు నేను నా శిష్యులు గంగానది యొడ్డున అకారణముగ ఉపవాసములు చేసి శుష్కించితిమి.

విశేషము :- భీమేశ్వరపురాణమున వ్యాసుడు శిష్యులతో ఏడునాళ్ళు భిక్ష దొరకక ఉపవాసము చేసినట్లున్నది. కాని కాశీఖండమున - "వాసరద్వయోపవాస సంప్రభూత జఠర గోళ క్షుధాగ్ని తాపంబుపశమించె" - (కాశి 7-192) అని రెండు దినములు ఉపవసించి నట్లున్నది. ఇట్లు రెండు విధముల వ్రాసినది శ్రీనాథుడే.

'ఏమి' అను సర్వనామముచే బాధ వ్యక్తపరచుటచే ఇచట పదపూర్వార్ధ వక్రత కలదు.

వ॥ అష్టమ దివసంబునం దరుణోదయ కాలంబున గంగా పులినోత్సంగంబులం గుశశయనంబున మేలుకాంచి, యాఖండల దిశా వేదండ కంఠ గ్రైవేయ కనకఘంటికా ఠంకారంబునుంబోలె నభ్యుదితంబైన మార్తాండ మండలం బుదయగిరి శిఖరితట సవిధంబునఁ గుంకుమ రజస్త్రసరేణు విసరంబునుంబోని నిగనిగ నునుజిగి గీలుకొని కోమలంపు జిలుఁగు జిగికొనలు గగనతల మలమికొనుకొలఁది మణికర్ణికాంభః ప్రవాహంబున నఘమర్షణ స్నానంబాచరించి, యత్త్రివాసిజన విరచిత వాలుకా లింగంబులకుఁ బీఠార్చనా శంభులింగంబులకును మంత్రాక్షత పుష్ప పూర్వకంబుగా నభివాదనంబుఁజేసి, పంచబ్రహ్మ పంచాక్షరీ మంత్ర ప్రధానంబులు జపియించి, సిద్ధముని పరంపరా సంకులంబైన ఘంటా పథంబునం గంగా బహిర్గేహ దేహళీ విభాగంబులును నంతర్గేహ సౌధవీథి కాట్ట కుట్టిమ ప్రఘణంబులును గడిచి, లోలార్క కాలభైరవ డుంఠి వినాయక విశాలాక్షీ ప్రముఖ పరివార దేవతా కోటికి నేటికోళ్ళు సమర్పించి, విశ్వేశ్వరు, విరూపాక్షు, నక్షీణ మోక్ష లక్ష్మీ సామ్రాజ్య సింహాసనారూఢుం, దారకోపదేశ దేశికు, దాక్షిణ్య పుణ్య కరుణా కటాక్ష వీక్షాపేక్షునిఁ బ్రదక్షిణ క్రమ దండప్రణామ పురస్సరంబుగా సేవించి, ముక్తిమంటపంబునఁ గొంత తడవుండి, మధ్యాహ్నకాలంబగుట నిరూపించి, భిక్షాపాత్రంబులఁగేలఁబూని, యతి కఠోర జఠర క్షుధాగ్ని తాపంబునకుఁదోడగు తపన సమయ ప్రచండ కిరణకాండ ప్రకాండంబులు నెత్తి మండింప, "లేదు, నడువుండు; పొండు; కూడ"దను నిషేధ వాక్యంబులు చెవులు నిండికొన విప్రవాటంబులఁ బ్రతిగేహంబును బరిభ్రమించి, విసికి విసిమాలి

**వేసరి యలసి యారటఁబొంది సొలసి జూఁకించి తూలి దూఁపటిలి యుల్లంబునఁ గ్రోధంబుద్భవించిన** **101**

అర్థము :- అష్టమ దివసంబునందు=ఎనిమిదవ దినమునందు; అరుణ+ఉదయ కాలంబున=ఉషఃకాలమున; గంగాపులిన+ఉత్సంగంబులన్=గంగానది యొక్క ఇసుక తిన్నెలపై ప్రదేశమున (ఇసుక దిబ్బలపై); కుశశయనంబున=దర్భల చాపనుండి; మేలు కాంచి=నిద్రలేచి; ఆఖండల దిశా=ఇంద్రుని దిక్కు అయిన తూర్పున కల; వేదండ= ఐరావతము యొక్క; కంఠ=మెడకు గల; గ్రైవేయ=కంఠాభరణమగు; కనక=బంగారపు; ఘంటికా=గంట యొక్క; ఠంకారంబునుంబోలె=ఠంకారము వలె; అభి+ఉదితంబైన= ఉదయించిన; మార్తాండ మండలంబు=సూర్యబింబము; ఉదయగిరి=తూర్పుకొండ; శిఖరి తట=కొమ్మ ప్రదేశమునకు; సవిధంబున=సమీపమున; కుంకుమ రజః=కుంకుమ పుప్పొడి యొక్క; త్రసరేణు=పరమాణువుల; విసరంబునుంబోని= సమూహము వంటి; నిగనిగ= నిగనిగలాడు; నునుజిగి=మనోహర కాంతితో; గీలుకొని= తగుల్కొని; కోమలంపు=సుకుమారమై; జిలుఁగు=అందమైన; జిగికొనలు=కాంతి రేఖలు; గగన తలము=ఆకాశ ప్రదేశమును; అలమికొను కొలఁది=వ్యాపించు కొలది; మణికర్ణిక+ అంభఃప్రవాహంబున=మణికర్ణిక అను ఘట్టము నందలి నీటి ప్రవాహమున; అఘమర్షణ స్నానంబు+ఆచరించి=అఘమర్షణ మంత్రములతో స్నానము చేసి; ఆ+తీర వాసి=ఆ ఒడ్డున కల; జన విరచిత=భక్త జనములచే నిర్మింపబడిన; వాలుకా లింగంబులకు=ఇసుక లింగములకు; పీఠ+అర్చనా శంభు లింగంబులకును=పానవట్టమునందలి పూజింపవలసిన శివలింగంబులకును; మంత్ర+ అక్షత+పుష్ప+పూర్వకంబుగ=మంత్రములతో, అక్షతలతో, పుష్పములతో; అభివాదనంబున్ చేసి=నమస్కారము చేసి; పంచబ్రహ్మ పంచాక్షరీ మంత్ర ప్రధానంబులు=ప్రధానములైన పంచబ్రహ్మ మంత్రములు, పంచాక్షరీ మంత్రము; జపియించి=జపించి; సిద్ధముని=సిద్ధులగు మునుల; పరంపరా=వరుసలతో; సంకులంబైన= సమ్మర్దమైన; ఘంటాపథంబునన్= రాజవీథిలో; గంగా బహిర్గేహ దేహళీ విభాగంబులనున్=గంగ వెలుపలి గృహముల గడపల విభాగములందు; అంతర్గేహ సౌధ వీథికా=లోపలి గృహములైన మేడల వీధులలోను; అట్టకుట్టిమ=మేడల వెనుకటి ఊతి కట్టడముల నేల ప్రదేశమును; ప్రఘణంబులను= తలవాకిట ప్రక్క నుండెడి చిన్న గదులను; కడిచి=దాటి; లోలార్క కాలభైరవ డుంఠి వినాయక విశాలాక్షీ ప్రముఖ పరివార దేవతా కోటికి=లోలార్కుడు మొదలగు పరివార దేవతా సమూహమునకు; ఏటికోళ్లు=నమస్కారములు; సమర్పించి=చేసి; విశ్వేశ్వరు= ప్రపంచమును నియమించినవాడును; విరూపాక్షు=బేసి సంఖ్య కన్నులు కలవాడు; అక్షీణ= నశింపని; మోక్షలక్ష్మీ సామ్రాజ్య సింహాసనా రూఢున్=మోక్ష=ముక్తియనెడి, లక్ష్మీ=సంపదకల, సామ్రాజ్య=

సామ్రాజ్యము యొక్క(అనేక ప్రదేశములు అధీనములోనుండి ఒకే సమ్రాట్టు అధికారము గలిగిన రాజ్యము సామ్రాజ్యము), సింహాసన=సింహాసనమును, ఆరూఢున్= అధిరోహించిన వానిని; దాక్షిణ్య పుణ్య కరుణా కటాక్ష వీక్షా పేక్షుని. దాక్షిణ్య=నేర్పు, పుణ్య= పవిత్రత, కరుణా=దయల, కటాక్ష వీక్షా=క్రీగంటి చూపులకు, అపేక్షుని=కార్యకారణ సంబంధము గలవానిని(విశ్వనాథ దేవుని); ప్రదక్షిణ క్రమ దండ ప్రణామ పురస్సరంబుగా= గుడిచుట్టు కుడివైపుగా తిరిగి, ఎదురుగా వచ్చి సాగిలపడు నమస్కారముల పూర్వకముగా; సేవించి= కొలిచి; ముక్తి మంటపంబున=ముక్తి మంటపమునన్; కొంతతడవు+ఉండి=కొంచెము సేపు ఉండి; మధ్యాహ్న కాలంబు+అగుట=మధ్యాహ్న సమయమగుట; నిరూపించి=తెలిపి; భిక్షా పాత్రంబులన్+కేలన్+పూని=భిక్షాపాత్రలను చేత ధరించి; అతి కఠోర=మిక్కిలి క్రూరమైన; జఠర క్షుధాగ్ని తాపంబునకున్=కడుపు ఆకలి అనెడి అగ్ని బాధకు; తోడగు=తోడైన; తపన సమయ=వేసవి కాలమందలి; ప్రచండ=సహింప శక్యముకాని; కిరణకాండ ప్రకాండంబులు= కిరణముల శ్రేష్ఠ సమూహములు; నెత్తి మండింప=తలను వేడెక్కింప; లేదు .... కూడదను నిషేధ వాక్యంబులు చెవులు నిండికొన=లేదు, నడువుండు .... అను వ్యతిరేక వాక్యములతో చెవులు నిండిపోవగా; విప్రవాటంబుల=బ్రాహ్మణ గృహముల వరుసలతో; ప్రతిగేహంబునున్= ప్రతి గృహమును; పరిభ్రమించి=తిరిగి; విసికి=విసిగిపోయి; విసిమాలి=మిక్కిలి విసిగిపోయి; వేసరి=బాధపడి; అలసి=అలసిపోయి; ఆరటన్+పొంది=దుఃఖము చెంది; సొలసి=నీరసించి; జూఁకించి=తత్తరపడి; తూలి=ఊగాడి; దూపటిలి=బడలి; ఉల్లంబునన్=మనస్సులో; క్రోధంబు=కోపము; ఉద్భవించిన=పుట్టిన -

భావము :- ఎనిమిదవ దినమున ఉషోదయ కాలమున గంగా తీరమున మేలుకొని మంత్ర పూర్వకముగా శివజపము చేసి, కాశిలో గల ప్రముఖదేవతా కోటికి నమస్కారములు సలిపి విశ్వేశ్వరునర్చించి, మోక్షమంటపమున మధ్యాహ్నము వఱకు ఉండి, ఆకలి బాధతో భిక్షా పాత్రలు చేతబూని, విప్రవాటికల తిరిగి భిక్ష దొరకక సొమ్మసిల్లి కోపము కలిగిన -.

**శా॥ కుక్షి ప్రోద్భవ నిష్ఠుర క్షుధిత దుష్క్రోధాంధకారంబునం**
**జక్షుల్ రెండును జిమ్మచీఁకటులుగా సంరంభశుంభద్గతిం**
**బ్రేక్షచ్ఛాత్రులు భీతిఁబొందఁగడు నుద్రేకించి హట్టంబునన్**
**భిక్షాపాత్రము రాతిమీఁద శతధా భిన్నంబుగా వైచితిన్. 102**

అర్థము :- కుక్షి=పొట్టయందు; ప్ర+ఉద్భవ=బాగుగా పుట్టిన; నిష్ఠుర=కఠినమైన; క్షుధిత=ఆకలిచేత కల్గిన; దుష్క్రోధ+అంధకారంబునన్=పాడుకోపమనెడి చీకటితో; చక్షుల్ రెండును=రెండు కన్నులు; చిమ్మ చీఁకటులుగా=గాఢాంధకారముకాగాఁ; సంరంభ=

వేగిరపాటుతోడి; శుంభత్+గతిన్=ప్రకాశించుచున్న నడకతో; ప్రేక్షత్+ఛాత్రులు=చూచుచున్న శిష్యులు; భీతిన్+పొందన్=భయపడగ; కడున్=మిక్కిలి; ఉద్రేకించి=విజృంభించి; హట్టంబునన్=అంగడి వీథిని; భిక్షాపాత్రము=భిక్షను స్వీకరించెడి పాత్రను; రాతిమీఁద=రాతిమీద; శతధా=నూరు భాగములుగా; భిన్నంబుగా=ముక్కలగునట్లుగా; వైచితిన్=వేసితిని.

భావము :- ఆకలి బాధతో పుట్టిన క్రోధాంధకారముతో కన్నులు మూసికొనిపోయి శిష్యులు భయపడి చూచుచుండగా ఉద్రేకముతో భిక్షాపాత్రను అంగడివీథిలో రాతిమీద నూరు ముక్కలగునట్లు పగుల కొట్టితిని -

విశేషము :- ప్రేక్షిచ్ఛాత్రులు అని పాఠాంతరము. ప్రేక్షి శబ్దము బిల్హణుడు ప్రయోగించెను.

క్రోధమును సూచించుటకై సంయుక్తాక్షరములను అధికముగా ప్రయోగించెను. ఇది వర్ణవిన్యాస వక్రత.

కం॥ అటు పౌరవీథి చక్కటిఁ
బటుకునఁబడవైచి క్రోధ పరిపాటి మెయిం
గటములదరంగ భ్రూకుటి
నిటలములను జెమట నీరు నిండి ఘటిల్లన్. 103

అర్థము :- అటు=ఆవిధముగ; పౌరవీథి=నడి వీథి; చక్కటిన్=ప్రదేశమున; పటుకునన్=పటుక్కున పగులునట్లుగ; పడవైచి=భిక్షాపాత్రను క్రింద పడవేసి; క్రోధ=కోపము యొక్క; పరిపాటి మెయిన్=అధికమగు రీతితో; కటములు+అదరంగ=కణతలు అదరగ; భ్రూకుటి=కనుబొమల (మధ్యము)నందు; చెమట నీరు=చెమట నీరు; నిటలములను=నుదుటి భాగములందు; నిండిఘటిల్లన్=నిండినట్లు కలుగగా -

భావము :- అట్లు భిక్షాపాత్రను నడివీథిలో పటుక్కున క్రింద పడవేసి, కోపముతో చెక్కిళ్లు అదరగ, నుదురు చెమట నీటితో నిండగా -.

కం॥ ఏమియని చెప్పుదును లో
పాముద్రా ప్రాణనాథ! ప్రజ్ఞా విభవం
బేమోయయి చెడిపోవఁగ
నామది నెన్నండు లేని నైచ్యము పొడమెన్. 104

అర్థము :- లోపాముద్రా ప్రాణనాథ=లోపాముద్రకు భర్తయైన ఓ అగస్త్య మహర్షీ!; ఏమి అని చెప్పుదును=ఏమి అని చెప్పుదును; ప్రజ్ఞావిభవంబు=వివేక సంపద; ఏమో

అయి చెడిపోవఁగ=మాటలతో చెప్పవీలులేనిదై క్షీణింపగ; నామదిన్=నా మనస్సులో; ఎన్నండు లేని=ఎప్పుడును లేని; నైచ్యము=నీచ స్థితి; పొడమెన్=పుట్టెను.

విశేషము :- 'ఏమి' అను పదముతో బాధను వ్యక్తపరచుట వలన ఇచట పదపూర్వార్థ వక్రత కలదు.

భావము :- ఓ అగస్త్య మహర్షీ! ఏమని చెప్పుదును. నా ప్రజ్ఞ నశింపగా, నా మనస్సులో నీచమైన ఆలోచన పుట్టెను.

సీ॥ ఏలా విచారింప నిందురేఖా మౌళి
విమల మోక్ష విధాత విశ్వనాథు?
నేలా వితర్కింప హిమశైల శేఖరో
ష్ణీష కౌశేయంబు సిద్ధతటిని?
నేలా పరీక్షింప నిభరాజ వదనుని
డుంఠి విఘ్నేశు మండూక జఠరు?
నేలా విలోకింప వ్రీళాకళాశూన్య
కటిఁ గాలభైరవు వటుకనాథు?

తే॥ నిఖిల కైవల్యకల్యాణ నిలయమైన
కాశిపైఁగూడు లేకుండు కారణమున
నలిగి శపియింపఁగాఁబూని యందుకొంటి
ధృత కమండులు భాగీరథీజలంబు. 105

అర్థము :- ఇందురేఖా మౌళిన్=చంద్ర శేఖరుని; విమల=నిర్మలమైన; మోక్ష=మోక్షమును; విధాతన్=కలిగించు; విశ్వనాథుని=విశ్వేశ్వర స్వామిని; ఏలా విచారింపను=ఎందులకు తలచలేకపోతినో;

హిమశైలశేఖర=మంచుకొండ యొక్క శిఖరములకు; ఉష్ణీష=తలపాగయగు; కౌశేయంబు=పట్టువస్త్రమైన; సిద్ధతటినిన్=గంగను; ఏలా వితర్కింపన్=ఎందులకు ఆలోచింప లేకపోతినో!

ఇభరాజ వదనుని=గజముఖుడును, మండూక జఠరున్=కప్పపొట్ట వంటి పొట్ట కలవాడునగు; డుంఠి విఘ్నేశ్వరున్=డుంఠి వినాయకుని; ఏలా పరీక్షింపన్=ఎందులకు పరిశీలింపలేకపోతినో!

వ్రీళాకళాశూన్యకటిన్=(దిసమొల కలవానిని) సిగ్గులో స్వల్పభాగమును వస్త్రము లేనివాడును; వటుకనాథున్=వటుకనాథుడు అనుపేరుకల; కాలభైరవున్=కాలభైరవుని; ఏలా విలోకింపన్= ఎందులకు గమనింపలేకపోతినో!

కూడు లేకుండు కారణముననన్=భిక్ష లభింపని కారణముచే; నిఖిల=సమస్తమైన; కల్యాణ=శుభములకు; నిలయమైన=స్థానమైన; కాశిపై=కాశీనగరముపై; అలిగి=కోపించి శపియింపఁగాన్+పూని=శపించుటకు యత్నించి; కమండలు=కమండలువునందున్న; భాగీరథీజలంబు=గంగాజలమును; అందుకొంటి=తీసికొంటిని.

భావము :- కాశిలో అన్నము దొరకని కారణముగా విశ్వనాథుని, గంగను, డుంఠి వినాయకుని, కాలభైరవుని మనస్సులో ఆలోచింపలేక సకల కల్యాణ నిలయమైన కాశిని శపింపతలచి కమండలువులోని గంగా జలమును అందుకొంటిని.

ఉ॥ "కోపము సంహరింపు ముని కుంజర!" యంచులలాటదేశ సం
స్థాపిత పాణిపద్మయుగ సంఘటితాంజలి బంధులై మహా
తాపస శిష్య బృందములు ధర్మపథంబును దెల్పిచెప్పఁగా
శాప జలంబు పూనితి ప్రశాంతి విహీనత నేమిచెప్పుదున్? 106

అర్థము :- మునికుంజర=మునిశ్రేష్ఠుడా! కోపము సంహరింపు=క్రోధమును ఉపసంహరించుకొనుము; అంచు=అనుచు; లలాటదేశ=నుదుటి ప్రదేశమునందు; సంస్థాపిత=చక్కగా నుంచబడిన; పాణిపద్మయుగ=తామరలవంటి రెండు అరచేతులతో; సంఘటిత=దగ్గరగా కూర్పబడిన; అంజలి బంధులై=బంధింపబడిన దోసిళులు కలవారై; మహా తాపస= గొప్ప తపస్వులైన. శిష్యబృందములు=శిష్యసమూహములు; ధర్మపథంబును= ధర్మమార్గమును; తెల్పి చెప్పగా=సూచించి వివరింపగా; ఏమి చెప్పుదును=ఏమని చెప్పెదను; ప్రశాంతి విహీనతన్=మిక్కిలి శాంతి లేకపోవుటచే (వికలమైన మనస్సుతో); శాపజలంబు పూనితి=శపించుటకై నీటిని గ్రహించితిని.

భావము :- మునివరా! కోపమును తగ్గించుకొనుము అని శిష్యులు నమస్కరించుచు ధర్మ మార్గమును తెల్పుచున్నను, ఏమని చెప్పుదును? మానసిక శాంతి లేక శపించుటకు నీటిని తీసికొంటిని.

**వ॥ ఇవ్విధంబున సప్తవాసరోపవాసాయాస సంభూత ప్రభూత రోషావేశంబున నంగుళీ పవిత్ర సనాథంబైన హస్తంబున మణికర్ణికా జలంబులు ధరియించి యిట్లని శపియింప నుద్యోగించితి-** 107

అర్థము :- ఈ+విధంబున=ఇట్లు; సప్తవాసర=ఏడుదినములు; ఉపవాస+ఆయాస= అన్నము లేకపోవుటచేత కలిగిన బడలికచేత; సంభూత=పుట్టిన; ప్రభూత=అధికమైన; రోష+ఆవేశంబునన్=కోపము యొక్క తొందరపాటుతో; అంగుళీ పవిత్ర సనాథంబు+ఐన= వ్రేలియందలి దర్భ ఉంగరముతో కూడినదైన; హస్తంబున=చేతితో; మణికర్ణికా జలంబులు ధరియించి= (కమండలువు నందున్న) మణికర్ణికా ఘట్ట జలమును తీసికొని; ఇట్లు+అని శపియింపన్=ఈ విధముగ (కాశిని) శపించుటకు; ఉద్యోగించితి=పూనుకొంటిని.

భావము :- ఈ విధముగ ఏడు దినములు అన్నము లేకపోవుట వలన కలిగిన కోపముతో కాశిని శపింపతలచి కమండలువులోని మణికర్ణికా జలమును చేతధరించితిని.

## వ్యాసమహర్షి కాశిని శపింపఁబూనుట :-

మాభూ త్రైపూరుషీ విద్యా మాభూ త్రైపూరుషం ధనమ్
మాభూ త్రైపూరుషీ భక్తిః కాశ్యాం నివసతాం సదా. 108

అర్థము :- కాశ్యాం=కాశియందు; సదా=ఎల్లప్పుడు; నివసతామ్=నివసించు వారలకు; త్రై పూరుషీ=మూడు తరముల వరకు; విద్యా=విద్య; మా+అభూత్=లేకుండుగాక; త్రైపూరుషం=మూడు తరములు; ధనమ్=ధనము; మా+అభూత్=లేకుండుగాక; త్రైపూరుషీ= మూడు తరములు; భక్తిః=భక్తి; మా+అభూత్=లేకుండుగాక.

భావము :- కాశిలో నివసించు వారికి మూడు తరముల వరకు విద్య ధనము. భక్తి లేకుండా గాక -.

విశేషము :- ఈ శ్లోకము యథాక్షరముగ సంస్కృత భీమఖండము నందున్నది (5 అధ్యా - 66 శ్లో.)

ఈ ఘట్టము కాశీఖండమునందు కూడ వచ్చును. శ్రీనాథ మహాకవి అక్కడ శ్లోకము వ్రాయక పద్యమును వ్రాసినాడు.

ధనము లేకుండెదరు మూఁడు తరములందు
మూఁడు తరములుఁజెడుఁగాక మోక్ష లక్ష్మి
విద్యయును మూఁడు తరముల వెడల వలయుఁ
బంచజనులకుఁగాశికా పట్టణమున. కాశి 7-158

ఈ పద్యము సంస్కృత కాశీఖండ శ్లోకమునకు అనువాదము-కాశీఖండశ్లోకమిది -
మాభూత్త్రైపూరుషీ విద్యా మాభూత్త్రైపూరుషంధనమ్
మాభూత్త్రైపూరుషీ ముక్తిః కాశీం వ్యాసః శపన్నితి అధ్యా - 96; శ్లో - 125

ఈ కాశీఖండ శ్లోకమునకు శ్రీనాథుని భీమేశ్వరపురాణ శ్లోకమునకు భేదము స్వల్పమని స్పష్టము.

సంస్కృత కాశీఖండమున వ్యాసుడు కాశీ నగరమును శపింప దలపెట్టినట్లు స్పష్టము. కాని తెనుగు కాశీఖండమున వ్యాస మహర్షి కాశిని కాదు, కాశీ నగరవాసులను శపింప దలచినాడు. భీమేశ్వర పురాణమున కూడ కాశీనగరవాసులనే శపింపబూనినాడు. వ్యాసుడు కాశీనగరవాసులను శపింపదలచినను, పార్వతీ పరమేశ్వరులు మాత్రము వ్యాసుడు కాశిని శపింపదలచినట్లే భావించి మాటలాడినారు. (భీమ 2 - 114)

కాశీనగరమునకును అందలి ప్రజలకును అభేదము భావింపవలెను. 105వ పద్యములో కాశిపై అలిగి శపియింపబూనినట్లు కలదు కదా.

తే॥ అని శపింపఁగ బూను నయ్యవసరమున
నేమి చెప్పుదునో సంయమీంద్ర వంద్య!
యుదిలగొని కంపమందుచు నుండెఁగాని
శాపజలమందుకోఁ గేలు సాఁగదయ్యెఁ 109

అర్థము :- ఓ సంయమి+ఇంద్ర+వంద్య=మునిశ్రేష్ఠులచే నమస్కరింపబడు ఓ అగస్త్య మహర్షీ!; ఏమి చెప్పుదును=ఏమని చెప్పుదును?; అని శపింపఁగన్=అని శపింపబోవు; ఆ+అవసరమున=ఆ సమయమున; ఉదిలగొని=త్వరపడుచు; కేలు=హస్తము; కంపము+ అందుచునుండెన్+కాని=వణకుచుండెను కాని; శాపజలము+అందుకోన్=శాప జలమును గ్రహించుటకు; సాఁగదయ్యెఁ=రాదయ్యెను.

భావము :- ఓ అగస్త్య మహర్షీ! ఏమని చెప్పుదును! చేయి త్వరపడుచు కంపించుచుండెను కాని శాపజలమును అందుకొనుటకు సాగలేదు.

విశేషము :- ఈ ఘట్టమున 'ఏమి చెప్పుదును' అనుమాట వ్యాసుడు అనేక పర్యాయములు అనినాడు - అది వ్యాసుని పశ్చాత్తాపమునకు సూచనము.

వ॥ ఆ సమయంబునఁ గాశికా నగర సోమవీథికా భవన వాటికా మధ్యంబున నొక్కయింటి మచ్చెకంటి పంచాశద్వర్ష దేశీయ పలితసారంబైన వేణికాభరంబుగైవడ ముదుసలి చక్రవాకంబులతో నెకసక్కెంబాడు వీఁగు చన్నుల వ్రేఁగుఁదనంబునఁదన తనూవల్లి జలదరింపఁ గంకణ ఝుణ ఝుణత్కారంబు దోరంబుగాఁగ్రక్కున గోపుర ద్వారంబు బోరు తలుపు వాయందట్టి యందియల రవళితోడంగూడిన మట్టియల మ్రోఁతఁద్రిభువనంబులు నులివిగొనం దెరవు గడప యోరం జరణ పల్లవంబుఁజాఁచి

**యనంగ ధ్వజపట కఠోర పాఠీనచ్ఛాయా దాయాదంబులైన వెడఁద కన్నులు తలచుట్టునుం బలసి పొలయు కల మధుర వీణా క్వాణ పాణింధమంబైన యెలుంగునెత్తి యో బ్రాహ్మణోత్తమా! శాపము సంహరించి యిటు రమ్మని నన్నుఁ జేరం బిలిచిన.** **110**

**అర్థము :-** ఆ సమయంబునన్=అప్పుడు; కాశికానగర=కాశీపట్టణమందలి; సోమవీథికా=సోమవీథిలోని; భవన వాటికా మధ్యంబునన్=ఇండ్ల వరుస మధ్యలో; ఒక్క ఇంటి మచ్చెకంటి=ఒక ఇల్లాలు; పంచాశత్+వర్షదేశీయ=ఇంచుమించు ఏబది సంవత్సరములు కలది; పలితసారంబైన=సరసినను సర్వోత్తమమగు; వేణికాభారంబు=కేశ పాశ భారము; కైవడన్=క్రిందికి ఒరగగా; ముదుసలి చక్రవాకంబులతోన్=ముసలి చక్రవాక పక్షులతో; ఎకసక్కెంబాడు=పరిహాసము చేయు; వీఁగు చన్నుల=చలించు పాలిండ్ల; వ్రేఁగుదనంబునన్=భారమున; తన=తన యొక్క; తనూవల్లి=తీగవంటి సన్నని శరీరము; జలదరింపన్=కంపింపగ; కంకణ=చేతి కంకణముల; ఝణ ఝణత్కారంబు=ఝణ ఝణ అను ధ్వని; తోరంబుగా=అధికముకాగ; గ్రక్కునన్=వెంటనే; గోపుర ద్వారంబు=వీధి వైపు వాకిలి; బోరు తలుపు=పెద్ద రెక్క తలుపు; పాయందట్టి=విడిపోవునట్లు త్రోసి; అందియల=కాలి అందియల; రవళి తోడన్ కూడిన=ధ్వనులతో కూడిన; మట్టియల మ్రోఁతన్=వ్రేళ్ల మట్టియల చప్పుడుచే; త్రిభువనంబులున్=మూడు లోకములు; ఉలివుగొనన్=ధ్వనింపగ; తెరువుగడప ఓరన్=వీథివైపుగల గడప అంచున; చరణ పల్లవంబు=చిగురుటాకు వంటి పాదమును; చాఁచి=చాచి; అనంగధ్వజ=మన్మథుని జెండా; పట=గుడ్డపై; కఠోర=నిండిన; పాఠీనచ్ఛాయా దాయాదంబులైన=చేప పోలికకు సమానములైన(చేప వంటి); వెడఁదకన్నులు=విశాలములైన నేత్రములు; తలచుట్టునన్+బలసి+పొలయ=తలచుట్టును బాగుగా వ్యాపింప; కల మధుర=అవ్యక్త మధురమైన; వీణాక్వాణ పాణింధమంబైన ఎలుంగునెత్తి=వీణాధ్వనిని చప్పట్లుచరచి పారద్రోలునదగు గొంతుతో; ఓ బ్రాహ్మణ+ఉత్తమా!=ఓ విప్ర శ్రేష్ఠుడా!; శాపము+ఉపసంహరించి=శపించుట మాని; ఇటు రమ్ము+అని=ఇటు రావలసినదియని; నన్నున్=నన్ను; చేరన్ పిలిచిన=దగ్గరకు ఆహ్వానించిన;

**భావము :-** అప్పుడు కాశీనగర సోమవీథిలో ఇంచుమించు ఏబది యేండ్ల యీడుగల ఒక ఇల్లాలు తలుపు తెరచి మధుర స్వరముతో 'ఓ బ్రాహ్మణోత్తమా! శపించుట మాని రమ్మని' భిక్షుకు ఆహ్వానించెను.

**విశేషము :-** శ్రీనాథునకు ఇష్టములైన ప్రయోగములో 'వీణాక్వాణ పాణింధమము' ఒకటి.

" కర్తృకరణార్థములు గల పాణి శబ్దమునకుఁబరమైన "ధ్మా" ధాతువునకు 'ధమ' ప్రత్యయమును, పాణి శబ్దమునకు మకారాగమమును వచ్చును. పాణి+ధ్మా=పాణింధమ. పాణయః ధ్మాయంతే అత్ర అంధకారావృతత్వాత్ - చీకటిగా నుండుట వలన నిచ్చట చప్పట్లు చఱతురు; పాణింధమము=కొలిమి తిత్తి. పాణిభ్యాం ధ్మాయతే" తత్సమ చంద్రిక - పుట - 24.

ఈ 'పాణింధమ' పదబంధమును శ్రీనాథునకు ప్రసాదించినది భట్ట మురారి -

"నవ భవద్గీర్వాణ పాణింధమా పంథానో దివి సంకుచంతి" (అనర్ఘరాఘవము. 4-20)

ఉ॥ సంతసమంది యేనపుడు శాపజలంబులు పాఱఁజల్లి వే
దాంతవచో మహోపనిషదర్థమయిన్ శుభరూప వృద్ధ సీ
మంతినిఁ గాశికా నగర మధ్యనివాసిని విశ్వనాథు శు
ద్ధాంతము డాయఁబోయితిఁబ్రియంబును భక్తియునుం దలిర్పఁగన్. **111**

అర్థము :- ఏను=నేను, అపుడు=అప్పుడు; సంతసమంది=సంతోషించి; శాపజలంబులు=(చేతిలోగల) శాపజలములు; పాఱన్+చల్లి=పారచల్లి; వేదాంత వచస్=వేదాంత వాక్కులతో గూడిన; మహా+ఉపనిషత్+అర్థమయిన్=గొప్ప ఉపనిషత్తుల సారమైన దానిని; శుభరూప=మంగళ రూపము కలదానిని; వృద్ధ సీమంతినిన్=ముదుసలియైన స్త్రీని; కాశికా నగర మధ్య నివాసిని=కాశీ పట్టణము యొక్క మధ్యలో నివసించు దానిని, విశ్వనాథు శుద్ధాంతమున్=విశ్వనాథుని భార్యయైన దానిని; ప్రియంబును=ప్రేమయును; భక్తియున్=భక్తియు; తలిర్పన్=చిగురింపగా; డాయన్ పోయితి=సమీపించితిని.

భావము :- ఆ ఇల్లాలు అట్లు పిలువగా, అప్పుడు నేను సంతోషముతో శాప జలము పారజల్లి విశ్వనాథుని ఇల్లాలైన పార్వతిని భక్తితో సమీపించితిని -

ఆ॥ డాయఁబోయి యప్పుడాయమ్మ యెవ్వరో
యేకులంబు నదియొ యెఱుఁగకయును
నే జొహారు నిడితి హృదయంబనేరుచు
నెదురు ప్రాభవంబు నేర్పరింప. **112**

అర్థము :- అప్పుడు=అంత; డాయన్+పోయి=సమీపించి; ఆయమ్మ=ఆ గృహిణి; ఎవ్వరో ఏ కులంబునదియో=ఎవరో, ఏ కులముదో; ఎఱుఁగకయును=తెలిసికొనకయే; నే జొహారును+ఇడితి=నేను నమస్కరించితిని; ఎదురు=ఎదుటి; ప్రాభవంబు=గొప్పతనము; ఏర్పరింప=తెలిసికొనుటకు; హృదయంబ=హృదయమే; నేరుచు=శక్తి కలది అగును.

**భావము** :- ఆ ఇల్లాలు ఎవరో ఏ కులముదో తెలియకయే సమీపించి నమస్కరించితిని. ఎదుటి వారి గొప్పతనమును తెలిసికొనుటకు మనస్సే సమర్థమైనది.

**అంత నన్నుం జేరఁబిలిచి యక్కాంత యిట్లనియె. 113**

**అర్థము** :- అంత=అప్పుడు; నన్నున్+చేరన్+పిలిచి=నన్ను దగ్గరకు రమ్మని పిలిచి; ఆ+కాంత=ఆ స్త్రీ; ఇట్లు+అనియె=ఈ రీతిగా అనెను.

**భావము** :- అప్పుడు ఆమె నన్ను దగ్గరకు పిలిచి ఈ విధముగా ననెను -

**తే॥** **"భిక్షలేదని యింత కోపింతురయ్య**
**కాశికా పట్టణము మీఁదఁ గానినేయ!**
**నీ మనశ్శుద్ధిఁ దెలియంగ నీల కంఠుఁ**
**డింత చేసెను గాక కూడేమి బ్రాఁతి. 114**

**అర్థము** :- కానినేయ=కన్యకు పుట్టిన వ్యాసా! కాశికా పట్టణము మీఁదన్=కాశీనగరము మీద; భిక్ష లేదని=భిక్ష దొరకలేదని; ఇంత కోపింతురయ్యా=ఇంతగా కోపించవచ్చునటయ్యా; నీలకంఠుఁడు=నీలమైన కంఠము కలవాడు; నీ మనఃశుద్ధి=నీ చిత్తశుద్ధిని; తెలియంగన్=తెలిసికొనుటకు; ఇంత చేసెను గాక=ఇట్లు(భిక్ష దొరకకుండగ) చేసెను కాని; కూడేమి బ్రాఁతి=(కాశిలో) భిక్షకు ఏమి లోపము?

**భావము** :- వ్యాసుడా! భిక్ష దొరక లేదని కాశిపై ఇంతగా కోపింపవచ్చునా? విశ్వనాథుడు నీ మనశ్శుద్ధి తెలిసికొన ఇట్లు పరీక్ష చేసెను కాని కాశిలో భిక్షకు లోపముండునా?

**విశేషము** :- 'కానినేయ' అను శబ్ద సాధుత్వము చింత్యము. కన్యకు పుట్టినవాడు 'కానీనుడు' అగును. 'కానినేయ' అను శబ్దము మఱియొక చోట కూడ శ్రీనాథుడు వాడెను.

"కార్య సంసిద్ధిఁబొందెదు కానినేయ" భీమ - 3-214.

కానీన - కన్యాయాః జాతః (కన్యా+అణ్, కానీన ఆదేశము). అవివాహితయగు స్త్రీకి కలిగిన పుత్రుడు.

**తే॥** **శ్రీ విశాలాక్షి బంగారు త్రెడ్డునందు**
**నమృతపాయస మొసఁగు నభ్యాగతులకుఁ**
**గాశికాపురి మధ్యాహ్న కాలమనఁగ**
**వినియు నెఱుఁగవె యాతిథ్యవేళలందు. 115**

అర్థము :- కాశికాపురిన్=కాశీనగరమున; మధ్యాహ్న కాలము=మధ్యాహ్న సమయమున; శ్రీ విశాలాక్షి=శ్రీ విశాలాక్షి; అభ్యాగతులకున్=అన్నమునకై వచ్చిన వారికి; బంగారు త్రెడ్డునందున్=బంగారపు గరిటెతో; అమృత పాయసమొసఁగున్=అమృతమయమైన పాయసము పెట్టును; అనఁగన్=అనగా; ఆతిథ్య వేళలందు=భోజనము పెట్టు సమయము లందు; వినియున్+ఎఱుఁగవె=వినిగూడ తెలిసికొన లేవా?

భావము :- కాశిలో విశాలాక్షి మధ్యాహ్న కాలమున అభ్యాగతులకు బంగారు త్రెడ్డుతో అమృత పాయసము పెట్టును అను మాట ఆతిథ్య సమయములందు వినియుండలేదా?

ఉ॥ ఏడు దినంబులన్నమునకెడ్డెము పుట్టిన యంత మాత్రలో
నేడుచుచున్నవాఁడవు మునీశ్వర! నేఁడును నీదు ధీరతల్
పాడఱి పోయెనే శివుని భార్యకుఁగాశికిఁ బుణ్య రాశికిం
గాడునొనర్పఁజూచెదవు కంఠపుఁగ్రోధము పెచ్చులెచ్చఁగన్. 116

అర్థము :- మునీశ్వరా=మునీంద్రా! ఏడు దినంబులు=ఏడు నాళ్లు; అన్నమునకు= ఆహారమునకు; ఎడ్డెము పుట్టిన=ఇబ్బంది కలిగిన; అంతమాత్రలో=అంత మాత్రమునకే; ఏడుచుచున్న వాఁడవు=వగచు చున్నావు; నీదు ధీరతల్=నీ దిట్టతనములు; పాడఱి పోయెనే= నశించి పోయెనే? కంఠము+క్రోధము=గొంతుదాక ఉన్న కోపము; పెచ్చు లెచ్చఁగన్=అధికము కాగా; పుణ్యరాశికిన్+శివుని భార్యకున్+కాశికిన్=పుణ్యముల రాశి, శివుని భార్య అయిన కాశికి; కాడున్+ఒనర్పన్+చూచెదవు=చేటును చేయ చూచెదవు.

భావము :- మునీశ్వరా! ఏడు దినములు అన్నము లభింపనంత మాత్రమున వగచుచున్నావు. నీ ధీరత్వము నశించెనే? పుణ్యముల రాశి శివుని భార్య అయిన కాశిని గొంతుదాక ఉన్న క్రోధముతో శ్మశానము చేయచూచెదవు.

ఉ॥ క్రొన్నెల పువ్వుదాల్పునకుఁగూరిమి భోగ పురంధ్రి కక్కటా
యిన్నగరీలలామమున కీపరిపాటికి నిట్టి కోపమే
లన్న! ఘటించెదో మునికులాగ్రణి! నిక్కమువో "బుభుక్షితః
కిన్నకరోతిపాప"మను కేవల నీతి దలంచి చూడఁగన్. 117

అర్థము :- క్రొత్త+నెల=నూతన చంద్రుడు - చంద్రరేఖయను; పువ్వు+తాల్పునకున్= పూవును దాల్చిన శివునకు; కూరిమి=ఇష్టమైన - ప్రియమైన; భోగ=పూజింపదగిన; పురంధ్రికి= (స్వజన సహితం పురంధారయతి) పుణ్యస్త్రీ వంటిదగు; ఈ+నగరీ లలామమునకు=ఈ శ్రేష్ఠ నగరమైన కాశికి; ఈ పరిపాటికిన్=ఇంత సామాన్యమైన దానికి; ఇట్టి కోపము+ఏలన్న=

ఇటువంటి కోపమెందులకయ్యా; ఘటించెదు=కలుగజేసెదవు; నిక్కము+పో=నిజమగులే; బుబుక్షితః=ఆకలితోనున్నవాడు; కిం=ఏమి; పాపమ్=పాపమును; న కరోతి=చేయడు? అను= అనునది; తలంచి చూడఁగన్=ఆలోచించి చూడగా; కేవల నీతి=ప్రధాన నీతి.

భావము :- మునికులాగ్రణీ! శివునకు ప్రియ భార్యయైన ఈ కాశిపై ఇంత చిన్న విషయమునకు అంత కోపమేల పూనెదవు. అవునులే, ఆలోచించిన ఆకలితోనున్నవాడు ఏ పాపము చేయడు? అన్నదే ప్రధాన నీతి.

తే॥ కాశిపైఁగోపగింపఁగఁ గాదు నీకు
నెంత కోపించునో యింత కిందుమౌళి
విప్రుఁడవు గాన నేరము వెదకఁదగదు
భిక్షఁగొన రమ్ము మాటలు పెక్కులేల." 118

అర్థము :- నీకున్+కాశిపైన్+కోపగింపఁగన్+కాదు=నీవు కాశిపై కోపింప కూడదు; ఇందు మౌళి=శివుడు; ఇంతకు=దీనికి; ఎంత కోపించునో=ఎంత కోపించునో! విప్రుఁడవు గాన నేరము వెదకఁదగదు=బ్రాహ్మణుడవు కావున తప్పు పట్టరాదు; మాటలు పెక్కులేల= మాటలు ఎక్కువ ఎందులకు; భిక్షఁగొనరమ్ము=భిక్షను గ్రహించుటకు రమ్ము.

భావము :- నీవు కాశిపై కోపింప కూడదు. దీనికి శివుడెంత కోపించునో! బ్రాహ్మణుడవు కావున తప్పు వెదక కూడదు. పలు మాటలేల? భిక్ష గ్రహించుటకు రమ్ము."

విశేషము :- 'ఇంతకు' అను సర్వనామము వ్యాసుని తెలివితక్కువ చేష్టను, 'ఎంత' అను సర్వనామము విశ్వనాథుని ఆగ్రహ తీవ్రతను సూచించుచున్నవి. ఇది పదపూర్వార్థ వక్రత.

వ॥ అనిన నవ్వాలుఁగంటికి నిట్లంటి 119

అర్థము :- అనిన=(ఆమె)ఇట్లు అనగా; ఆ+వాలుఁగంటికి=ఆ సుందర నయనతో; ఇట్లు+అంటి= ఈ విధముగా పలికితిని.

భావము :- (ఆమె) ఇట్లు అనగా, ఆ స్త్రీతో ఈ రీతిగా నంటిని.

శా॥ "తల్లీ! యిన్నిదినాలకేనియు సుధాధారా రసస్యందియై
యుల్లంబున్ సుఖియింపఁజేయు పలుకెట్లో వింటి నివ్వీటిలోఁ
బెల్లాకొన్న కతాన నేనొకఁడనే భిక్షానకున్ వత్తునో
యెల్లన్ శిష్యులఁగొంచు వత్తునొ నిజం బేర్పాటుగాఁ జెప్పుమా. 120

అర్థము :- తల్లీ=అమ్మా! ఇన్ని దినాలకు+ఏనియు=ఇన్ని దినములకైనను; ఈ+ వీటిలోన్=ఈ నగరములో; సుధా ధారా=అమృత ధారల; రసస్యందియై=రసమును స్రవించు నదియై; ఉల్లంబున్=మనస్సును; సుఖియింపన్+చేయు=సుఖింప చేయు; పలుకు+ఎట్లో వింటిన్=మాట ఏదో విధముగ వింటిని; పెల్లు+ఆకొన్న కతాన=ఎక్కువ ఆకలి ఉన్నందున; నేను+ఒకఁడనే=నేను ఒక్కడనే; భిక్షానకున్+వత్తునో=భిక్ష తీసికొనుటకు వచ్చెదనా? ఎల్లన్+ శిష్యులన్=శిష్యులను ఎల్లరను; కొంచు వత్తునో=తీసికొని వచ్చెదనా? నిజంబు=సత్యము; ఏర్పాటుగాన్+చెప్పుమా=స్పష్టముగా చెప్పవలసినది.

భావము :- "అమ్మా! ఇన్ని దినములకైనను ఈ పట్టణమున అమృత తుల్యమై మనస్సునకు సంతోషము కలుగు మాటను ఎట్లో వింటిని. ఎక్కువ ఆకలిగా నుండుటచే భిక్షకు నేను ఒక్కడనే వచ్చెదనా? శిష్యులందరను తీసికొని వచ్చెదనా? నిజము స్పష్టముగా చెప్పుము.

విశేషము :- ఈ పద్యమునందలి "ఎల్లన్ శిష్యులు" అన్నది చర్చకు గురియైన ప్రయోగము. "సమాసంబున యందు ద్రుతంబునకు లోపంబగు"; ఎల్ల యర్థములు; ఎల్ల కలుషములు. "సర్వ పర్యాయంబైన యెల్ల శబ్దంబు ద్రుతాంతంబైన యవ్యయంబు - దీని కసమాసంబున విశేష్యంబునకు ముందు ప్రయోగంబు లేదు" - అని చిన్నయ సూరి బాల వ్యాకరణము - (సంధి - 24).

ఈ నియమము ప్రకారము "ఎల్ల శిష్యుల..." అని కావలెను. "ఎల్లన్ శిష్యుల" అని కాదు. "ఎల్ల శిష్యుల" అన్నచో గణభంగమగును.

దీనిని సవరించుటకు బండారు తమ్మయ్యగారు "ఎల్లా శిష్యుల..." అని శ్రీనాథుడు కర్ణాట సంప్రదాయానుగుణముగా ప్రయోగించినాడేమో అని సర్ది చెప్పిరి. కాని అట్లు సర్ది చెప్పనవసరము లేదు. (శ్రీనాథ మహాకవి పుట-217).

చిన్నయసూరి చెప్పినట్లుగా - "ఎల్ల" అనునది ద్రుతప్రకృతికమగు అవ్యయము కాదనియు, 'ఎల్ల' అను దానికి "ఎల్లరన్" అను అర్థమున్నదనియు చిన సీతారామ శాస్త్రిగారి ఆంధ్ర వ్యారకణ సంహితా సర్వస్వ వివరణము (ప్రథమ - పుట - 333)

ఆ॥ "………. అనుమాన

మింత లేక యాడు మెల్ల వినఁగ" — ఉద్యో 4-189

తే॥ "ఏఁగుడని పల్కె భార్గవుండెల్ల వినఁగ" — అను. 2-282

ఈ పద్యములలోని "ఎల్ల" అనుదానికి "ఎల్లరు" అని అర్థము. కనుక "ఎల్ల" అనుదానికి "ఎల్లరన్" అను అర్థమున భారత ప్రయోగములున్నవి.

శ్రీనాథుడు కూడ ఇట్లే "ఎల్లన్ శిష్యుల" - అను దానిని "ఎల్లరన్ శిష్యుల -." అను అర్థమున ప్రయోగించినాడు. కనుక శ్రీనాథుని "ఎల్లన్ శిష్యుల -." ప్రయోగము వ్యాకరణ విరుద్ధము కాదు. పైగా ఈ ప్రయోగము శ్రీనాథుని భారత భాషా ప్రయోగ పరిశీలన పాటవ ప్రదర్శనమునకు ఒక నిదర్శనము.

'ఎల్లన్ శిష్యులు' అను చోట "ఎల్లర్ శిష్యులు" అని శ్రీనాథుడు ప్రయోగించెనేమోయని కొందరి అనుమానము. "గ్రుక్కిళ్ళింగుచు" అని శ్రీనాథుని ప్రయోగము (కాశీ - 4-123) కలదు కదా అని వీరి కొలమానము.

భిక్షార్థమేక ఏవాహ మాగమిష్యామి వోగృహం

శిష్యైః కిం వాఖిలై స్సాకమేకం నిత్యంచ మేవద సం.భీమ. 6-1

ఈ పద్యము నందలి "ఇన్నిదినాలకేనియు" యందలి 'యు' అను సముచ్చయము వలన వక్రోక్తి కలదు.

తే॥ ఈవు పెట్టిన భిక్ష మేమిందఱమును
బంచుకొని చేయువారము ప్రాణ రక్ష
నాతి! యందఱవియును బ్రాణములు కావె
నాయదియె ప్రాణమని వత్తునా భుజింప?" 121

అర్థము :- నాతి=అమ్మా!; ఈవు పెట్టిన భిక్ష=నీవు పెట్టిన భిక్ష; మేము అందఱమును పంచుకొని=మేము అందరమును పంచుకొని; ప్రాణ రక్ష చేయువారము=ప్రాణములను రక్షించు కొందుము; అందఱవియును ప్రాణములు కావె=అందరివి ప్రాణములు అగును కదా!; నాయదియె=నా ఒక్కనిదే; ప్రాణము అని=ప్రాణము అని; భుజింప వత్తునా=తినుటకు వచ్చెదనా?

భావము :- అమ్మా! నీవు పెట్టిన భిక్ష మేము అందరము పంచుకొని ప్రాణములను నిలుపుకొందుము. అందరివి ప్రాణములే కదా - నా ఒక్కనిదే ప్రాణమని తినుటకు వచ్చెదనా?

వ॥ అనిన మందస్మిత వదనారవిందయై యయ్యిందు బింబానన యిట్లనియె. 122

అర్థము :- అనిన=వ్యాసుడిట్లు అనగా; మందస్మిత=చిరునవ్వుతో కూడిన; వదన+ అరవిందయై= ముఖ పద్మము కలదియై; ఆ+ఇందు బింబ+ఆనన=చంద్రబింబము వంటి ముఖము కల ఆ స్త్రీ; ఇట్లు+అనియె=ఈవిధముగననెను.

భావము :- వ్యాసుడిట్లు అనిన నవ్వుచు ఆ చంద్రబింబానన ఇట్లు అనెను.

శా॥ "అంతేవాసులు నీవుఁగూడుకొని మధ్యాహ్నాభిషేక క్రియల్
శాంత స్వాంతత జాహ్నవిం జలిపి పెల్చన్ రండు నేనింతలో
నంతర్గేహమునన్ సమగ్రముగ మీకాహారముల్ వేగఁ గ
ల్పింతున్ భోజన మిష్టమందరకుఁదృప్తిన్ బొందఁగాఁబెట్టెదన్. 123

అర్థము :- అంతేవాసులు=నీ శిష్యులు; నీవున్=నీవును; కూడుకొని=కలసి; శాంత స్వాంతతన్=ప్రశాంతమైన మనస్సుతో; మధ్యాహ్నాభిషేక క్రియల్=మధ్యాహ్నము సలుపవలసిన స్నానము మొదలగు క్రియలు; జాహ్నవిన్+చలిపి=గంగానదిలో చేసి; పెల్చన్=త్వరగా; రండు= రండు; నేను+ఇంతలో=నేను ఈలోపున; అంతర్గేహమునన్=లోపలి గృహమునందు; సమగ్రముగ=సంపూర్ణముగ; మీకు+ఆహారముల్=మీకు(భోజన) పదార్థములు; వేగన్=వెంటనే; కల్పింతున్=కూర్చెదను; ఇష్టము=ప్రియమైన; భోజనము=అన్నము; అందరకున్=అందరకు; తృప్తిన్+పొందగాన్=తృప్తి కలుగునట్లుగ; పెట్టెదన్=పెట్టెదను.

భావము :- శిష్యులు నీవును కలసి గంగ చెంత మధ్యాహ్నాభిషేకములు పూర్తి చేసికొని త్వరగా రండు. నేనింతలో సంపూర్ణముగ ఆహారములను కల్పింతును. ఇష్టాన్నము మీ అందరకు తృప్తిగా పెట్టెదను.

కం॥ ఆఁకొంటి రిన్ని దినములు
పోఁకంతయు భిక్ష వీటఁ బుట్టక యునికిన్
ఆఁకట దూఁకట నలిగితి
రేఁకట వాయంగ భిక్ష లిడియెద రండీ." 124

అర్థము :- ఇన్నిదినములు=ఇన్ని నాళ్లు; వీటన్=పట్టణమందు; పోఁక+అంతయు= పోక చెక్క అంతైనను; భిక్ష=భిక్ష; పుట్టక+ఉనికిన్=లభింపక పోవుటచే; ఆకొంటిరి=(బాగుగా) ఆకలి గొనియున్నారు; ఆఁకట=ఆకలిచే కలిగిన; దూఁకటన్=దుఃఖముతో; నలిగితిరి= బడలితిరి; ఏఁకట+పాయంగ=బాధ వీడునట్లు; భిక్షలు+ఇడియెద=భిక్షాన్నము పెట్టెదను. రండీ=రండు.

భావము :- ఇన్ని దినములు పట్టణములో పోఁక ముక్కంతైన భిక్ష లభింపక ఆకలితో నుంటిరి. ఆకలి బాధతో నలిగితిరి. బాధ తొలగునట్లు భిక్షలు పెట్టెదను. రండి."

విశేషము :- నాల్గు పాదములందును అర్ధ బిందువుతో కూడిన 'క'కారము ప్రాస వేయబడినది.

వ॥ అనిన నేమును వియల్లోక కల్లోలినికిం జని యాప్లవనం బాచరించి యుభయ పవిత్రంబులు ధరియించి వేదంబులు పఠియించుచు వచ్చి యమ్మచ్చెకంటి యింటి మొగసాలఁగూర్చుంటిమి. 125

అర్థము :- అనినన్=ఆమె ఇట్లనగా; ఏమును=మేమును; వియల్లోక కల్లోలినికిన్+చని=ఆకాశ వాహినియైన గంగకు వెడలి; ఆప్లవనంబు+ఆచరించి=స్నానము చేసి; ఉభయ పవిత్రంబులు ధరించి=రెండు దర్భ ఉంగరములను ధరించి; వేదంబులు పఠియించుచు=వేదము వల్లించుచు; ఆ+మచ్చెకంటి=ఆ స్త్రీ యొక్క; ఇంటి మొగసాలన్ కూర్చుంటిమి=ఇంటి తలవాకిటి పంచలో కూర్చుంటిమి.

భావము :- ఆమె ఇట్లు పలుకగా మేము గంగకు వెడలి స్నానము చేసి, ఉభయ పవిత్రములు ధరించి వేదములు పఠించుచు వచ్చి ఆమె యింటి వసారాలో కూర్చుంటిమి.

కం॥ మున్నూఱు శిష్యులును నే
నన్నెలఁతుక తోడ మాటలాడిన యయ్యు
భ్యున్నత సౌధము మీఁదను
సున్నము నిగిడించినట్టి జోడరుఁగులపై. 126

అర్థము :- మున్నూఱు శిష్యులును=మూడు నూరుల శిష్యులును; నేను=నేను; ఆ+నెలఁతుక తోడ=ఆ స్త్రీ తోడ; మాటలాడిన=మాటలాడిన; ఆ+అభి=ఉన్నత+సౌధము మీఁదను=ఆ ఎత్తైన తెల్లని మేడయందు; సున్నము=వెల్ల; నిగిడించినట్టి=వేసినట్టి; జోడు+అరుఁగులపై=రెండు అరగులపై.

భావము :- మూడు వందల శిష్యులును నేను ఆ స్త్రీ తోడ మాటలాడిన ఎత్తైన తెల్లని భవనమునందు సున్నము వేసిన రెండరుగులపై -

వ॥ ఉండి యాసార ప్రసారంబులు చేయు శంభళీ జనంబుల చేతను మా రాక యెఱింగించిన నబ్బోటి హాటకమయంబైన గొడుగు పావలు గిలుకలు గులుకరింపఁ గుసుమ కోదండ సమ్మోహన కాండంబునుఁబోని యొక్క రెండవ వయసు తాంబూల కరండ వాహినిం గైదండ పట్టుకొని యేతెంచి రండు విచ్చేయుండని సబహుమానంబుగాఁ దోడ్కొని పోయి చంద్రికా సంకాశ కౌశేయ శత సహస్ర సందానిత

వితానోపశోభితంబును, గాలాగురు ధూపధూమ వాసనా సనాథంబును, గర్పూర రచిత రంగవల్లీ వేల్లితంబును, గస్తూరికా లేపన సురభి శశికాంత మణిశిలా కుట్టిమంబును నగు చతుశ్శాలా భోజన మందిరంబున వృద్ధానుపూర్వకంబుగ నుచితాసనంబులం గూర్చుండ నియమించిన. 127

అర్థము :- ఉండి=కూర్చుండి; ఆసార ప్రసారంబులు చేయు=రాకపోకలు సలుపు; శంభళీ జనంబుల చేతను=దాసీ జనముల చేతను; మా రాక+ఎఱింగించిన=మేము వచ్చినది తెలిపిన; ఆ+బోటి=ఆ స్త్రీ; హాటకమయంబు+ఐన=బంగారముతో చేయబడిన; గొడుగు పావలు, గిలుకలు=గొడుగు పావలు గిలుకలు అను పాదాభరణములు; కులుక రింపన్=కులుకుచుండగ; కుసుమ కోదండ సమ్మోహన కాండంబునుంబోని= మన్మథుని సమ్మోహన బాణము వంటి; ఒక్క=ఒక; రెండవ వయసు=యౌవనములోనున్న; తాంబూల కరండ వాహినిన్=తాంబూలపు సెజ్జ ధరించు పడతి యొక్క; కైదండ పట్టుకొని=భుజము పట్టుకొని; ఏతెంచి=వచ్చి; రండు విచ్చేయుండని= రండు విచ్చేయుండని; సబహుమానంబుగాన్+తోడ్కొనిపోయి=సాదరముగ వెంట పెట్టుకొని; చంద్రికా సంకాశ=వెన్నెల వంటి; కౌశేయ=పట్టు వస్త్రములు; శత సహస్ర=వందల వేలతో; సందానిత=కట్టబడిన; వితాన+ఉపశోభితంబును=మేలు కట్టులతో విలసిల్లునదియును; కాలాగురు ధూప ధూమ వాసనా సనాథంబును=అగురు, ధూపము యొక్క ధూమము, వాసనలతో కూడినదియును; కర్పూర=కర్పూరముతో; రచిత=వేసిన; రంగవల్లీ= ముగ్గులతో; వేల్లితంబును=చుట్టుకొనబడి యున్నదియును; కస్తూరికా=కస్తూరి యొక్క; లేపన=పూతల; సురభి=సువాసనలతోనున్న; శశికాంత మణిశిలా కుట్టిమంబును= చంద్రకాంత మణులతోడి ఱాతి కట్టడముల నేలగలదియు; అగు=అయిన; చతుశ్శాలా భోజన మందిరంబునన్=విశాలమైన నాలుగిండ్ల భవంతియగు భోజనశాల యందు; వృద్ధ+అను పూర్వకంబుగ=పెద్దలు ముందు తరువాత పిన్నలుగా; ఉచిత+ఆసనంబులన్=తగిన పీటలపై; కూర్చుండ నియమించిన=కూర్చుండ పెట్టిన.

భావము :- అరగులపై కూర్చుండి వచ్చిపోవు దాసీ జనముచే మా రాక నెరిగించిన, ఆ వృద్ధ స్త్రీ బంగారు పాదాభరణముల ధరించి, ఒక యౌవనవతి భుజము పట్టుకొని వచ్చి, రండని ఆహ్వానించి, రమణీయమైన భోజనశాలయందు పీటలపై కూర్చుండుమని చెప్పిన -

కం॥ మొగి విరిసి కఱకు గూడక
పగులక వెడలుపును నిడుపుఁబసిమియుఁగల లేఁ
జిగురరఁటాకులు పెట్టిరి
దిగదిగ నద్దేవి యాజ్ఞ దివ్యపురంధ్రుల్. 128

అర్థము :- ఆ+దేవి యాజ్ఞన్=ఆ వృద్ధ స్త్రీ ఆనతితో, దివ్య పురంధ్రుల్=ఉత్తమ గృహిణులు; మొగి=మొత్తముగా; విరిసి=వికసించి; కఱకు=పెళుసుతనము; కూడక=లేక; పగులక=చినుగక; వెడలుపును=వెడలుపును; నిడుపు=పొడవును; పసిమియున్+కల= పచ్చతనము కల; లేత+చిగురు+అరఁటాకులు=లేత చిగురు వంటి అరటి ఆకులు; దిగదిగ= శీఘ్రముగ; పెట్టిరి=వేసిరి.

భావము :- ఆ వృద్ధ సీమంతిని ఆజ్ఞచే గృహిణులు బాగుగా వికసించిన, పెళుసుతనము లేక, చినుగక యున్న పెద్ద పెద్ద లేత అరటి ఆకులను శీఘ్రముగ పీటలముందు వేసిరి.

విశేషము :- సుదీర్ఘాణి విశాలాని సాగ్రాణి మృదులానిచ

అచ్ఛిద్రాణి నవీనాని రంభాపర్ణాని తాదదుః సం.భీమ. 6-40.

వ॥ అనంతరంబు 129

అర్థము :- అనంతరంబు=ఆ తరువాత.

తే॥ అర్చనలు చేసి గంధ పుష్పాక్షతముల
ధూపమిచ్చెఁగాలాగురు ధూమ రేఖఁ
గప్పురంబు నివాళించెఁగమల నేత్ర
పంక్తి పంక్తికి నేతెంచి బ్రాహ్మణులకు. 130

అర్థము :- కమలనేత్ర=పద్మనేత్ర; పంక్తి పంక్తికిన్+ఏతెంచి=వరుస వరుసకు వచ్చి; గంధ+పుష్ప+అక్షతముల=గంధముతో పూలతో అక్షతలతో; అర్చనలు చేసి= పూజించి; బ్రాహ్మణులకు=విప్రులకు; కాల+అగురు+ధూమ రేఖన్=నల్లని అగురు పొగల పంక్తుల; ధూపము+ఇచ్చెన్=ధూపము నిచ్చెను; కప్పురంబు=కర్పూరమును; నివాళించెన్=నీరాజన మిచ్చెను.

భావము :- కమలనేత్ర వరుస వరుసకు వచ్చి గంధ పుష్పాక్షతలతో అర్చించి, అగరు పొగలతో ధూపమిచ్చి, కర్పూరముతో బ్రాహ్మణులకు నీరాజనమిచ్చెను.

ఉ॥ "ఇందఱుఁగూడి శాంతి పఠియింపుఁడు; మజ్జన మాచరింపుఁడ
ర్ధేందు కళా కిరీటునకు; నీ యమృతాన్నము లీ పదార్థముల్
మందగతిం భుజింపుఁడు; సమస్త జగత్పతి కాశికాపురీ
మందిర విశ్వనాయకుఁడుమాపతి ప్రీతి వహించుఁగావుతన్. 131

అర్థము :- ఇందఱున్+కూడి=ఇంత మందియు కలసి; శాంతి పఠియింపుఁడు=శాంతి పాఠమును పఠింపుడు; అర్ధ+ఇందు కళా కిరీటునకు=అర్ధచంద్రుని కళ కిరీటముగా గలవానికి; మజ్జనము+ఆచరింపుడు=(స్నాన కార్యమును) అభిషేకమును చేయుడు; ఈ+అమృత+అన్నములు=ఈ మధురాన్నములు; ఈ పదార్థముల్=ఈ పదార్థములు; మందగతిన్=మెల్లగా; భుజింపుఁడు=ఆరగింపుడు; సమస్త జగత్పతి=సకల లోకములకు నాథుడు; కాశికా పురీ మందిర=కాశీ నగరమునందలి గృహములోగల; విశ్వనాయకుఁడు=విశ్వనాథుడు; ఉమాపతి=పార్వతీ భర్త; ప్రీతిన్+వహించున్+కావుతన్=ప్రీతి పొందునుగాక.

భావము :- ఇంతమందియు కలసి శాంతి పాఠము వల్లించి, శివాభిషేకము చేసి, నిదానముగా భుజింపుడు. పరమేశ్వరుడు తృప్తి చెందును.

వ॥ అని పంక్తి పంక్తి నడుమ నిలుచుచు నయ్యింతి భక్తి శ్రద్ధా తాత్పర్య విశ్వాస పూర్వకంబుగా నుర్వీ గీర్వాణ వర్గంబులఁ బ్రార్థించుచు నాపోశనంబులు వోయింప నుండె; నప్పుడేను బైల సుమంత జైమిని వైశంపాయనాది శిష్య ప్రకరంబు నెమ్మనంబుల నిట్లని వితర్కించుచుంటిమి. 132

అర్థము :- అని=ఇట్లని; పంక్తి పంక్తి నడుమ=వరస వరుస మధ్య; నిలుచుచు=నిలుచుచు; ఆ+ఇంతి=ఆ స్త్రీ; భక్తి శ్రద్ధా తాత్పర్య విశ్వాసపూర్వకంబుగాన్=వినయము, దీక్ష, ఆసక్తి, నమ్మకములు ముందుండునట్లుగా; ఉర్వీ గీర్వాణ వర్గంబులన్=బ్రాహ్మణ సంఘములను; ప్రార్థించుచున్=ప్రార్థించుచు; ఆపోశనంబులు+పోయింపనుండె=ఆపోశనములు పోయింప బోవుచుండె; అప్పుడు+ఏను=అప్పుడు నేను; పైల సుమంత జైమిని వైశంపాయనాది=పైలుడు సమంతుడు, జైమిని, వైశంపాయునుడు మొదలగు; శిష్య ప్రకరంబు=శిష్య సమూహము; నెమ్మనంబులన్=మనస్సులలో; ఇట్లని=ఈ రీతి; వితర్కించు చుంటిమి= సంశయించు చుంటిమి.

భావము :- ఇట్లని ప్రతి పంక్తి మధ్యలో నిలచి భక్తితో బ్రాహ్మణులను ప్రార్థించుచు ఆపోశనము పోయింప నుండగా, నేను నాశిష్యులు మనస్సులో ఇట్లు తర్కించు చుంటిమి.

ఉ॥ "వండిన చొప్పునుం బొగపు వాసనయుం బొగపాఱుచందమున్
భాండ సమృద్ధి సంపదయుఁ బాక విభూతియు సర్వమంగళం;
బండజ యాన రిత్త ప్రియమాడెడు; నేఁడును భోజనంబు లే
కుండుట గాననయ్యె; నసితోత్పలగంధియు నేమి మాయయో. 133

అర్థము :- వండిన చొప్పునున్=వండిన విధము; పొగపు వాసనయున్=తాలింపుల వాసనయు; పొగపొఱు చందమున్=పొగ వెడలు విధమును; భాండ సమృద్ధి సంపదయున్=పాత్రలలో నింపిన పదార్థముల బాహుళ్యము; పాక విభూతియు=వంటల ఆధిక్యము; సర్వ మంగళంబు=శూన్యము; అండజయాన=హంసయాన; రిత్త ప్రియము+ఆడెడు=శుష్క ప్రియములు పలుకుచున్నది; నేడును భోజనంబు లేకుండుట గాననయ్యె=నేడు కూడ అన్నము ఉండునట్లు లేదు; అసిత+ఉత్పల గంధియును=నల్లకలువ సువాసన వంటి సువాసన కల ఈమెయు; ఏమిమాయయో=ఏమి మాయయో!

భావము :- "వండిన విధముగాని, తాలింపు వాసనగాని, పొగపారుట కాని, పాత్రలు సందడి కాని, వంటల ఆధిక్యము కాని; ఏమియు కన్పడవు. ఈమె శుష్క ప్రియములు పల్కుచున్నది. నేడు కూడ భోజన మందునట్లు లేదు. ఈమెయును ఏమి మాయయో!

ఉ॥ చల్లని సౌమ్య దృష్టియుఁబ్రసాదము మాధురియున్వివేకము
న్వెల్లఁదనంబు మౌగ్ధ్యమును నిర్మలినత్వముఁజూడవచ్చినం
గల్లయొకింత యేనిఁ బొడగానఁగరా; దరటాకుఁ జూచినన్
ఝల్లనె గుండె యోగిరము శాకములుం బొడగాన రామికిన్. 134

అర్థము :- చల్లని సౌమ్య దృష్టియు=చల్లని తిన్నని చూపును; ప్రసాదమున్=దయయు; మాధురియున్=మంచితనమును; వివేకమున్=తెలివియును; వెల్లఁదనంబు=స్వచ్ఛత; మౌగ్ధ్యమును=అమాయికత; నిర్మలినత్వమున్=నిష్కపటత్వమును; చూడవచ్చినన్=చూడరాగా; కల్ల=మోసము; ఒకింతయేని=కొంచెమైన; పొడగానఁగ రాదు=కన్పడదు; ఓగిరము=అన్నము; శాకములున్=కూరలును; పొడ గానరామికిన్=కనబడకుండుటచే; అరటాకున్+చూచినన్=విస్తరి చూచిన; గుండె+ఝల్లనె=గుండె అదిరినది.

భావము :- ఆమె చల్లని చూపు దయ మంచితనము అమాయికత చూచిన ఆమె మాటలు అసత్యములనిపించుట లేదు - కాని విస్తరిలో భోజన పదార్థములు ఏమి కనబడకుండుటచే గుండె ఝల్లనెను.

తే॥ పాత్ర సంశుద్ధి కాజ్యం బుపస్తరించి
యూరకుండిరి యిదియేమి యొక్కొవీరు
కాన రావిష్ట శాకపాకములు నెదుర
మనకు నిజమయ్యె నలచందమామ ఘుటిక. 135

అర్థము :- వీరు=వడ్డించు వారు; పాత్ర సంశుద్ధికిన్=పాత్ర సంశుద్ధికై; ఆజ్యంబు= నేతిని; ఉపస్తరించి=అభిఘరించి; ఊరకుండిరి=ఊరకుండిరి; ఇది యేమి+ఒక్కో=ఇది ఏమి వింతయో; ఎదుర=ఎదురుగా; శాకపాకములు=కూరలు వంటలు; ఇప్డు=ఇప్పుడు; కానరావు=కన్పడవు. అలచందమామ ఘుటిక=ఆ చందమామను పసి పిల్లలకు చూపించుచు చెప్పు అసత్యపు మాటలు; మనకు నిజమయ్యెన్=మన పట్ల నిజమయ్యెను.

భావము :- పాత్రల శుద్ధికై నేతిని అభిఘరించి, ఏమి వింతయో, వడ్డించువారు ఊరక యుండిరి - ఎదుట విస్తరిలో శాకపాకములు లేవు - చందమామ ఘుటిక - అను మాట మనపట్ల నిజమైనది.

విశేషము :- చందమామ ఘుటిక :- చంటి పిల్లలు ఆకలితో ఏడ్చునపుడు, వారిని ఓదార్చుటకై ఆకాశములోని చందమామను చూపించుచు చెప్పు అసత్యపు మాటలు. చందమామలో అమృతము ఉన్నది. దానిని తిన్నచో ఆకలి తీరును. దానిని తీసికొని వచ్చి నీకిచ్చెదను. ఏడ్వకుము. - అని ఓదార్చుచు చెప్పు అసత్యపు మాటలు. చందమామ ఘుటిక నే - శశాంక ఘుటికా కథ అని కూడ అందురు.

చందమామ గుటక -(చి.పా.శా.) పాఠము.

మ॥ అవుగాకేమి నిజంబు తేటపడఁగా నర్చించె గంధాక్షతా
ది విశేషంబుల శాంతి పాఠమును సందీపించె విశ్వేశ్వరున్
శివునుద్దేశము చేసి మ్రొక్కి వివిధాశీర్వాదముల్ గైకొనెం
ధవళాంభోరుహ నేత్ర; యింతయును మిథ్యాసృష్టి గానేర్చునే. 136

అర్థము :- అవుగాకేమి=ఇట్లయిన అవుగాక; ధవళ+అంభోరుహనేత్ర=తెల్లని పద్మముల వంటి కన్నులు కల ఆ ఇల్లాలు; నిజంబు తేటపడఁగాన్=సత్యము కనబడు నట్లుగా; గంధ+ అక్షత+ఆది విశేషంబుల=గంధము, అక్షతలు మొదలగువాని సమృద్ధు లతో; అర్చించె=పూజించె; శాంతి పాఠమును సందీపించె=శాంతి పాఠమును బాగుగా పఠింపజేసెను; (విశ్వేశ్వరున్)శివున్+ఉద్దేశించి=పరమేశ్వరుని గూర్చి; మ్రొక్కి=మ్రొక్కి; వివిధ+ఆశీర్వాదముల్=అనేకములైన ఆశీర్వచనములు; కైకొనెన్=పొందెను; ఇంతయు=ఇది అంతయును; మిథ్యాసృష్టి=అసత్య సృష్టి; కానేర్చునే=అగునే!

భావము :- విస్తరిలో శాకపాకములు లేకపోవచ్చునుగాక. కాని ఆ స్త్రీ గంధాక్షతలతో అర్చించెను. శాంతి పాఠము పఠింపజేసెను. విశ్వేశ్వరు నర్చించి ఆశీర్వాదములు పొందెను. ఇది అంతయు అసత్యమగునా?

కం॥ కానీ యీ దివసంబును
నే నిన్నఁటి యట్లగాక యేమనఁగ నపో
సానంబులు వడ్డించిరి
మానవతీ జనులు లీల మహిదివిజులకున్. 137

అర్థము :- కానీ=కానిమ్ము; ఈ దివసంబును=ఈ దినమును; నిన్నఁటి యట్లకాక= నిన్నటి వలె అగును కాక; ఏమి+అనఁగన్=ఏమగును అని అనుకొనుచుండగ; మానవతీ జనులు=స్త్రీలు; లీల=విలాసముగ; మహిదివిజులకున్=బ్రాహ్మణులకు; అపోసానంబులు= ఆపోశనములు; వడ్డించిరి=వేసిరి.

భావము :- ఈ దినము కూడ నిన్నటివలె అయిన అగు గాక. ఏమగును అని అనుకొనుచుండగ స్త్రీలు బ్రాహ్మణులకు ఆపోశనములు వడ్డించిరి.

తే॥ పోసిరా యెల్లవారి కాపోశనములు?
"నారగింపుఁడు లెండు మీకమృతమస్తు
ప్రొద్దుబోయెను జుం"డని బుజ్జగించి
మ్రొక్కి యంజలి యెత్తె నమ్ముదుక పణఁతి. 138

ఎల్లవారికిన్=అందరికిన్; ఆపోశనములు పోసిరా?=(స్త్రీలు) ఆపోశనములు వడ్డించిరా? పోసిరా? అని; ఆ+ముదుక పణఁతి=ఆ ముదుసలియైన స్త్రీ; ఆరగింపుఁడు= భుజింపుడు; లెండు= కానిండు; మీకు=మీకు; ప్రొద్దు పోయెను జుండు+అని=ప్రొద్దు పోయెను సుమా అని; బుజ్జగించి=లాలించి; అమృతమస్తు=(ఆపోశనమిచ్చిన తరవాత యజమానుడు పలుకు మాట) అమృతమస్తు అని పలికి; మ్రొక్కి=నమస్కరించి; అంజలి ఎత్తెన్=దోసిలొగ్గెను.

భావము :- స్త్రీలు బ్రాహ్మణులందరకు ఆపోశనములు ఇచ్చిరా? అని శ్రద్ధతో తెలిసికొని - ఆ ముదుసలి స్త్రీ 'అరగింపుడు ఇప్పటికే ప్రొద్దు పోయినది. 'అమృతమస్తు' అని పలికి రెండు చేతులెత్తి నమస్కరించినది -

విశేషము :- 1. విస్తరిలో పదార్థము లన్నియు వడ్డించిన తరువాత యజమానుడు అతిథులకు ఆపోశనమిచ్చుట సంప్రదాయము-ఇక్కడ స్త్రీలు ఆపోశనమిచ్చుట జరిగినది.

2. ఇక్కడ భోజనమునకు ఆహ్వానించినది అన్నపూర్ణాదేవి, యజమానుడైన పరమేశ్వరుడు కాదు.

3. ఆపోశనమిచ్చిన తరువాత యజమానునకు, భోక్తకు సంప్రదాయములో జరుగు సంభాషణమిది-

అమృతమస్తు, అమృతోపస్తరణమసి, శ్రద్ధాయాం ప్రాణే నివిష్టో అమృతం జుహోమి, అని గృహస్థుడనగా, ప్రాణాయ స్వాహా, అని భోక్త అనును.

శ్రద్ధాయాం అపానే నివిష్టో అమృతం జుహోమి, అని యజమానుడనగా, అపానాయస్వాహా, అని భోక్త అనును.

శ్రద్ధాయాం వ్యానే నివిష్టో అమృతం జుహోమి, అని యజమానుడనగా, వ్యానాయస్వాహా, అని భోక్త అనును.

శ్రద్ధాయాం ఉదానే నివిష్టో అమృతం జుహోమి, అని యజమానుడనగా, ఉదానాయస్వాహా, అని భోక్త అనును.

శ్రద్ధాయాం సమానే నివిష్టో అమృతం జుహోమి, అని యజమానుడనగా, సమానాయస్వాహా, అని భోక్త అనును.

శా॥ ఆ ముత్తైదువయాజ్ఞ విప్రనికరం బాపోశనం బెత్తినన్
సామర్థ్యంబది యెట్టిదో నిఖిలమున్ సంపూర్ణమై పత్రపా
త్రీ మధ్యంబునఁబిండి వంటకములుం దివ్యాన్నముల్ షడ్రసీ
సామగ్రీరుచిమత్పదార్థచయముల్ సంధిల్లె నొక్కుమ్మడిన్. 139

అర్థము :- ఆ ముత్తైదువ=ఆ సుమంగళి; ఆజ్ఞ=అనతిచే; విప్రనికరంబు= బ్రాహ్మణ సమూహము; ఆపోశనంబు+ఎత్తినన్=ఆపోశన జలము త్రాగగా; సామర్థ్యంబు+ అది యెట్టిదో=ఆమె శక్తి యెట్టిదో కాని; ఒక్కుమ్మడిన్=ఒక్కసారిగా; పిండి వంటకములు= పిండి వంటలు; దివ్యాన్నముల్=శ్రేష్ఠములైన అన్నములు; షడ్రసీ సామగ్రీ రుచిమత్=అరు రసముల కమ్మదనముగల వస్తు సముదాయముతో; పదార్థ చయముల్=పదార్థముల సమూహములు; పత్రపాత్రీ మధ్యంబునన్=అరటి ఆకుల విస్తరుల మధ్యమున; నిఖిలమున్=సమస్తము; సంపూర్ణమై=నిండినవై; సంధిల్లెన్=సమకూడెను.

**భావము:-** ఆ ముత్తైదువు ఆజ్ఞచే బ్రాహ్మణులందరు ఆపోశనము చేయగా, ఆమె సామర్థ్యమేమియో! ఒక్కసారిగ పిండివంటలు, దివ్యాన్నములు, షడ్రసముల పదార్థములు సంపూర్ణముగ అరటి ఆకులలో ప్రత్యక్షమైనవి.

**విశేషము :-** షడ్రసములు :- 1. కషాయము(వగరు), 2. మధురము(తీపి), 3. లవణము(ఉప్పు), 4. కటువు(కారము), 5. తిక్తము(చేదు), 6. ఆమ్లము(పులుపు).

ఉ॥ పప్పును బిండివంటలును బాయసముల్ ఘృతముల్ గుడంబులుం
గుప్పలు గాఁగఁ జుట్టునను గూర్పఁగఁగూడిన యేరుఁబ్రాల తె
ల్లప్పురభోగి వంటకము గమ్మని తాలిపు సొజ్జ పిండితో
నొప్పులుగా భుజించిరి బుధోత్తము లాఁకటి చిచ్చు పెచ్చునన్. 140

అర్థము :- బుధ+ఉత్తములు=పండిత శ్రేష్ఠులు; ఆఁకటి=ఆకలి అనెడి; చిచ్చు=అగ్ని; పెచ్చునన్=అధికముకాగా; పప్పును, పిండి వంటలును, పాయసముల్= పాయసములు; ఘృతముల్=నేతులు; గుడంబులున్=బెల్లములు; కుప్పలు కాఁగన్+చుట్టునను=చుట్టు కుప్పలుగా; కూర్పఁగన్=కల్పింపగా; కూడిన=కలిపిన; ఏరుఁబ్రాల=ధాన్య విశేషము; తెల్లప్పుర భోగి వంటకము=కప్పుర భోగి అను బియ్యముతో వండిన అన్నము; కమ్మని తాలిపు=మంచి తాలింపు వేసిన; సొజ్జ పిండితో=వేయించిన బియ్యముతో చేసిన పిండితో; ఒప్పులుగా భుజించిరి=తృప్తిగా భుజించిరి.

భావము :- మునీశ్వరులు ఆకలిగానుండుటచే రకరకములైన పదార్థములతో కూడిన అన్నమును తృప్తిగా భుజించిరి.

కం॥ తరుణి యిది యన్నపూర్ణా
పరమేశ్వరి గాని యితర భామిని గాదం
చరవాయి గొనక మెసఁగిరి
పరమ మునీశ్వరులు పంచభక్ష్యాన్నంబుల్. 141

అర్థము :- తరుణి యిది=ఈ స్త్రీ; అన్నపూర్ణా పరమేశ్వరి కాని=పరమేశ్వరి అయిన అన్నపూర్ణాదేవి కాని; ఇతర భామిని కాదు అంచు=ఇతర(మైన) స్త్రీ కాదని అనుకొనుచు; అరవాయి గొనక=అనుమానింపక; పంచభక్ష్య+అన్నంబుల్=పంచభక్ష్యములతో కూడిన అన్నములను; పరమ మునీశ్వరులు=మహర్షులు, మెసఁగిరి=భుజించిరి.

భావము :- ఈమె అన్నపూర్ణాదేవి కాని, సామాన్య స్త్రీ కాదని తలచుచు, మునీశ్వరులు పంచభక్ష్యాన్నములను సందేహింపక భుజించిరి -

విశేషము :- పంచభక్ష్యములు :- భక్ష్యములు, భోజ్యములు, లేహ్యములు, చోష్యములు, పానీయములు.

శా॥ ద్రాక్షపానక ఖండశర్కరలతో రంభాఫలశ్రేణితో
గోక్షీరంబుల తోడ మండెఁగలతోఁ గ్రొన్నేతితోఁబప్పుతో
నక్షయ్యంబగు నేరుఁబ్రాల కలమాహారంబు నిశ్శంకతం
గుక్షుల్ నిండఁగ నారగించితిమి యక్షుద్రక్షుధాశాంతికిన్. 142

అర్థము :- అక్షుద్ర=అధికమైన; క్షుధా=ఆకలి; శాంతికిన్=ఉపశమించుటకు; ద్రాక్షాపానక ఖండశర్కరలతో=ద్రాక్షాపానకముతో; కండ చక్కెరతో; రంభా ఫలశ్రేణితో= అరటి పండ్లతో; గోక్షీరంబులతోడ=ఆవు పాలతోడ; మండెఁగలతోన్=పంచదార లేని గోధుమ పిండి వంటతో; క్రొన్నేతితోన్=అప్పుడే కాచిన నేతితో; పప్పుతోన్=పప్పుతో; అక్షయ్యం బు+అగు=తరగక-కావలసినంత ఉన్న; ఏరుఁబ్రాల=ఏరిన బియ్యముకల; కలమ+ ఆహారంబు=కలమ జాతి వరి అన్నము; నిశ్శంకతన్=సంకోచము లేకుండగ; ఆరగించి తిమి=భుజించితిమి.

భావము :- ఆకలి తీరుటకు రకరకములైన పదార్థములతో కూడిన మంచి వరి అన్నపు భోజనము తృప్తిగా అరగించితిమి.

ఆ॥ ఎవ్వఁడే పదార్థమెంతేనిఁజింతించు
నతనికా పదార్థమంత గలిగి
యరఁటియాకు మీఁద నవతారమై యుండు
నిట్టి మహిమ చూడ మెన్నఁడేని. 143

అర్థము :- ఎవ్వడు+ఏ పదార్థము+ఎంతేనిన్+చింతించున్=ఎవడు ఏ పదార్థమును ఎంత కోరుకొనునో; అతనికి+ఆ పదార్థము+అంత కలిగి=అతనికా పదార్థము అంత కలిగి; అరఁటి+ఆకు+మీఁదన్=అరటి యాకుపై; అవతారము+ఐ ఉండున్=ప్రత్యక్షమగును. ఎన్నఁడేని=ఎప్పుడైనను; ఇట్టి మహిమ=ఇటువంటి మహిమను; చూడము=చూడము.

భావము :- ఎవరు ఏ పదార్థమెంత మనస్సులో కోరుకొనునో, అతనికి ఆ పదార్థమంత అరటి ఆకుపైన అవతరించును. ఇటువంటి మహిమను ఎన్నడు చూడము.

ఉ॥ వేలుపు గిడ్డియుం బరుసవేదియుఁ గల్పకుజంబుఁదోడరా
లాలిత పాదనూపుర ఝుళంఝుళనాదము లుల్లసిల్లఁ బైఁ
జేల చెఱంగు దూలఁగ విశృంఖల వృత్తిఁ జరించుచుండె నీ
లాలక యన్నపూర్ణ యమృతాన్నముఁబెట్టుచు నన్నిపంక్తులన్. 144

అర్థము :- వేలుపు గిడ్డియున్=కామధేనువును; పరుసవేదియున్= చింతామణి యును; కల్పకుజంబున్=కల్పవృక్షము; తోడరాన్=వెంటరాగ; లాలిత=లలితమైన; పాదనూపుర ఝుళంఝుళనాదములు=కాలి అందెల ఝుళం ఝుళ అను ధ్వనులు; ఉల్లసిల్లన్=వ్యక్తము కాగా; పైన్+చేల చెఱంగు=పైట చెరగు; తూలఁగ=కదలగ; నీలాలక అన్నపూర్ణ=నల్లనికురులు కల అన్నపూర్ణాదేవి; అన్నిపంక్తులన్=అన్ని వరుసలలో; అమృత+

అన్నమున్ పెట్టుచు=అమృతము వంటి అన్నము వడ్డించుచు; విశృంఖల వృత్తిన్= నిరాఘూటమైన రీతిగ; చరించుచుండెన్=తిరుగుచుండెను.

భావము :- కామధేనువు, చింతామణి, కల్పవృక్షము తోడురాగా, పాదమంజీరములు ధ్వనించుచుండ, పైట చెంగుజారగ, ఆ అన్నపూర్ణ అన్ని పంక్తులలో మధురాన్నము వడ్డించుచు స్వేచ్ఛగ సంచరించుచుండెను.

విశేషము :- ఇక్కడ పరుసవేది అనగా ఇనుమును బంగారముగా చేయు రసవిశేషము కాదు. కామధేనువు కల్పవృక్షములతోపాటు చింతామణి యుండుట సమంజసము.

వ॥ ఇవ్విధంబున నాజ్యధారా ప్రవాహంబును; శర్కరాక్షోద సికతాంచితంబును, బాయసాపూప సంపన్నంబగు కలమాన్నపూర్ణంబును, ద్రాక్షాగోక్షీర క్షౌద్రపుండ్రేక్షు ఖండ మండితంబును, రంభా నారికేళ ఫలపాకశాక సాకల్య కల్యంబును; షాడబ రసావళీ పానక ప్రచురంబును, శరచ్చంద్ర చంద్రికా ధవళదధి సమృద్ధంబును నైన భోజనోత్సవంబు వైశంపాయన మనః ప్రమోద సంపత్సంపాదన లంపటంబును సుమంతు సంతోష కారణంబును, పైల రసనా తపఃఫలంబును, జైమిని కామనా కామధేనువును, దేవల ముదావహంబును, రోమహర్షణ హర్షోత్కర్షావహంబును, సూతకౌతూహల హేతు భూతంబును, నస్మన్మనోరథ విహారఘంటాపథంబునునై ప్రవర్తిల్లెఁ దదనంతరంబు - 145

అర్థము :- ఇవ్విధంబునన్=ఈ రీతిగ; ఆజ్యధారాప్రవాహంబును=నేతి ధారల ప్రవాహము కలదియు; శర్కరా+క్షోద+సికత+అంచితంబును=ఇసుకవలెనున్న పంచదార పొడితో సుందరమైనదియు; పాయస+అపూప+సంపన్నంబగు=పాయసము పిండివంటలతో కూడినదియునగు; కలమ+అన్నపూర్ణంబును=మంచి వరి అన్నముతో నిండినదియును; ద్రాక్షా=ద్రాక్ష పండ్లు; గోక్షీర=ఆవు పాలు; క్షౌద్ర=తేనె; పుండ్రేక్షుఖండ=చారల చెఱకు ముక్కలతో; మండితంబును=అలంకృతమును; రంభా=అరటి; నారికేళ=కొబ్బరి; ఫల=పండ్లు; పాక=పాకములు; శాకసాకల్యకల్యంబును=వివిధములైన కూరల మొత్తముతో పవిత్రమైనది; షాడబ రస+ఆవళీ పానక ప్రచురంబును=మధురస సమూహముల పానకములతో కూడినదియును; శరత్+చంద్ర+చంద్రికా+ధవళ+ దధి+సమృద్ధంబునున్=శరత్కాలపు చంద్రుని వెన్నెల వలె తెల్లని పెరుగుతో నిండినదియును; ఐన= అయిన; భోజన+ఉత్సవంబు=భోజనపు పండుగ; వైశంపాయన=వైశంపాయనుని;

మనఃప్రమోద=మానసికానందమను; సంపత్+సంపాదన=సంపదను సంపాదించుట యందు; లంపటం బును=శ్రమ చేయునదియును; సుమంతు=సుమంతుని; సంతోష కారణంబును=సంతోష హేతువును; పైల=పైలుని; రసనా=నాలుక యొక్క; తపఃఫలం బును=తపః ఫలమును; జైమిని=జైమిని; కామనా=వాంఛల; కామధేనువును=కామ ధేనువును, దేవల= దేవలునికి; ముదా వహంబును=సంతోషమును కలిగించునది యును; రోమహర్షణ= రోమ హర్షణునికి; హర్ష+ఉత్కర్ష+ఆవహంబును=సంతోషాతి శయమును కలిగించు నదియు; సూత=సూతుని; కౌతూహల=కుతూహలమునకు; హేతు భూతంబును=కారణమైనదియును; అస్మత్+మనోరథ=నా కోరిక; విహార= తిరుగుటకు; ఘంటాపథంబు నునై=రాజమార్గమునై; ప్రవర్తిల్లెన్=ఒప్పెను; తదనంత రంబ=ఆ తరువాత

భావము :- ఆ ఇల్లాలు పెట్టిన రకరకములైన పదార్థములతో కూడిన భోజనము శిష్యులకు నాకు పండుగవలె అపరిమితానందము కలిగించినది.

విశేషము :- "షాడబములనునవి, ఆమ్ల లవణాదులును, చక్కెర, తేనె మొదలగు మధుర ద్రవ్యములను చేర్చి, ద్రవ రూపమునను, లేహ్యాపాకమునను, భక్ష్యరూపమునను తుదకు చూర్ణముగను తయారుచేయబడు పదార్థములు." (దీ.పి. శాస్త్రి సాహిత్య సమీక్ష పు. 383)

ఆ॥ హస్తములను గడిగి యాచమన క్రియా
వ్యాప్తిదీర్చి దేవియాజ్ఞ మేము
విమల సౌధమధ్య వేదికా స్థలమున
విశ్రమించియున్న వేళయందు. **146**

అర్థము :- మేము=మేము; హస్తములను గడిగి=చేతులను కడిగికొని; ఆచమన క్రియా=భోజనానంతరము చేయు ఆచమనము మొదలగు పనుల; తీర్చి=నెరవేర్చి; వ్యాప్తిన్=విస్తృతిని; దేవి ఆజ్ఞ=అన్నపూర్ణ అనతితో; విమల=స్వచ్ఛమైన; సౌధ మధ్య= భవనమునకు మధ్యలోనున్న; వేదికా స్థలమున=అరుగున్న ప్రదేశ మున; విశ్రమించి యున్న=విశ్రాంతి తీసికొనుచున్న; వేళయందు=సమయమునందు-

భావము :- మేము చేతులు కడుగుకొని, ఆచమనము మొదలగు భోజనానంతర కృత్యములను నిర్వర్తించి, అన్నపూర్ణ చెప్పిన ప్రకారము సౌధ మధ్యమున కల వేదికా స్థలమున విశ్రాంతి తీసికొనుచుండగా-.

వ॥ అభ్యంతర భవనంబు నందుండి - **147**

అర్థము :- అభ్యంతర భవనంబునందుండి=ఇంటి లోపలి నుండి -

భావము :- ఇంటి లోపలి నుండి.

## విశ్వనాథుఁడు పార్వతి తోడ వ్యాసాదులుండిన వేదిక కడకు విజయము చేయుట

సీ॥ చంద్రబింబానన చంద్రరేఖా మౌళి
నీలకుంతల భార నీలగళుఁడు
ధవళాయతేక్షణ ధవళాఖిలాంగుండు
మదన సంజీవని మదనహరుఁడు
నాగేంద్ర నిభయాన నాగకుండలధారి
భువన మోహన గాత్ర భువన కర్త
గిరిరాజకన్యక గిరిరాజ నిలయుండు
సర్వాంగ సుందరి సర్వగురుఁడు

తే॥ గౌరి శ్రీ విశ్వనాథుండు కనకరత్న
పాదుకలు మెట్టి చట్టలు పట్టికొనుచు
నేఁగుదెంచిరి యొయ్యార మెసక మెసఁగ
విహరణక్రీడ మాయున్న వేదికపుడు. 148

అర్థము :- అపుడు=ఆ సమయమున; మాయున్న=మేము విశ్రాంతి తీసికొనుచున్న; వేదికి=అరుగు చెంతకు; చంద్రబింబానన+చంద్రరేఖామౌళి= చంద్రబింబము వంటి ముఖము కల పార్వతియు; చంద్రుని తలపై ధరించిన పరమేశ్వ రుడును; నీల కుంతలభార, నీలగళుఁడు=నల్లని కేశభారము కల పార్వతియు, నల్లని కంఠము కల శివుడును; ధవళాయ తేక్షణ, ధవళాఖిలాంగుడు=తెల్లని విశాలమైన నేత్రములు కల పార్వతియును, తెల్లని సర్వావయవములు కల శివుడును; మదన సంజీవని, మదన హరుఁడు=మన్మథుని బ్రతికించిన పార్వతియు; మన్మథుని సంహరించిన శివుడును; నాగేంద్ర నిభయాన, నాగకుండలధారి=నాగేంద్రముతో (గజేంద్రముతో) సమానమైన నడక కల పార్వతియును, నాగకుండలము (సర్ప కుండలము) ధరించిన శివుడును; భువన మోహనగాత్ర, భువనకర్త= లోకములను మోహింప చేయు శరీరము కల పార్వతి యును, లోకములకు కర్తయైన శివుడును; గిరిరాజ కన్యక, గిరిరాజ నిలయుండు= పర్వతరాజైన హిమవంతుని పుత్రికయైన పార్వతియు, పర్వత రాజమైన కైలాసము నిలయముగా కల శివుడును; సర్వాంగసుందరి, సర్వగురుఁడు=సకలాంగములు సుందర

మైన పార్వతియు, సకలమునకు గురుడైన శివుడును; అగు గౌరి శ్రీవిశ్వనాథుండు=పార్వతియు విశ్వనాథుడును; కనక రత్న పాదుకలు మెట్టి=బంగారమునందు రత్నములు పొదిగిన పాదుకలు తొడిగికొని; చట్టలుపట్టికొనుచు=(భుజములు) చేతులు పట్టికొనుచు; ఒయ్యారము=విలాసము; ఎసకమెసఁగ=అతిశయింపగ; విహరణక్రీడ=విహార క్రీడగ; ఏఁగుదెంచిరి=వచ్చిరి.

భావము :- మేము విశ్రాంతి తీసికొనుచున్న అరుగు చెంతకు చెట్టలు పట్టుకొనుచు విహార క్రీడగా పార్వతీ విశ్వనాథులు విచ్చేసిరి.

విశేషము :- ఈ పద్యమున శబ్దసారూప్యము వలన పార్వతీ పరమేశ్వరులకు సమానత్వము సూచింపబడినది.

ఇక్కడ శ్రీనాథుడు పార్వతీ పరమేశ్వరులకు ఎనిమిది విశేషములు ఉపయోగింపగా, సంస్కృత భీమఖండమున (7-2 నుండి 11) ఇరువది విశేషములు ఉపయోగింపబడినవి.

తే॥ జయయు విజయయు నొకవంక సరసరారు
నందికేశుండు ముందర నడచి రాఁడు
ప్రథమ దంపతు లేమి సంభ్రమము లేక
యరుగుదెంచుట యద్భుతమయ్యెమాకు. 149

అర్థము :- జయయు, విజయయు=జయ, విజయ అను స్త్రీలు; ఒకవంక సరసరారు=ఒక ప్రక్క సమీపమున రారు; నందికేశుండు=నందీశ్వరుడు; ముందర నడచిరాఁడు=ముందర నడచి రాడు; ప్రథమ దంపతులు=ఆది దంపతులైన పార్వతీ పరమేశ్వరులు; ఏమి సంభ్రమము లేక=ఏవిధమైన ఉత్సాహము లేక; అరుగుదెంచుట=విచ్చేయుట; మాకు అద్భుతమయ్యె=మాకు ఆశ్చర్యము కలిగించినది.

భావము :- జయ విజయలు ప్రక్కన లేకుండగ, నందికేశ్వరుడు ముందు లేకుండగ ప్రథమ దంపతులు వచ్చుట మాకు ఆశ్చర్యము కలిగించినది.

శా॥ గౌరింజూచినయప్పుడంచిత మహాకారుణ్య సంపత్తియుం
దారానాయక మౌళిఁజూచినపుడుద్యత్క్రోధ సంరంభముం
దోరంబై యపుడంతరంగముల సంతోషంబు సంత్రాసముం
బూరించెన్విను మేమి చెప్పుదు మహాపుణ్యాత్మ! కుంభోద్భవా 150

అర్థము :- మహాపుణ్యాత్మ! కుంభోద్భవా!=ఓ పుణ్యాత్మ! అగస్త్య మహర్షీ; వినుము+ఏమి చెప్పుదు=వినుము, ఏమని చెప్పుదును; గౌరిన్+చూచిన+అప్పుడు= పార్వతీదేవిని చూచినపుడు; అంచిత=పూజింపదగిన, మహా=గొప్పదగు, కారుణ్య=దయ యొక్క, సంపత్తియున్=సంపదయును; తారానాయక=నక్షత్రములకు ప్రియుడగు చంద్రుడు; మౌళి=శిరస్సునగల శివుని; చూచినపుడు=చూచినపుడు; ఉద్యత్= ఉదయించుచున్న; క్రోధ=కోపము యొక్క, సంరంభమున్=ఉద్రేకమును; తోరంబు+ఐ= అధికమై; అపుడు=ఆ సమయమున; అంతరంగముల=మా మనస్సులలో; సంతోషము=ఆనందము; సంత్రాసమున్= భయమును; పూరించెన్=నింపెను.

భావము :- ఓ అగస్త్య మహర్షీ! ఏమి చెప్పుదును.పార్వతిని చూచినపుడు మహాప్రేమ, పరమేశ్వరుని చూచినపుడు మహా క్రోధము కన్పడగ మా మనస్సులు సంతోషముతో, భయముతో నిండినవి.

**తే॥ కాశి శివునకు శుద్ధాంత కాంతగాన**
**దానిపై నల్గి కోప పాత్రంబనైతిఁ**
**గాశి గౌరికి సవతియౌఁగాననేను**
**దానిపై నల్గి ప్రేమ పాత్రంబనైతి. 151**

అర్థము :- నేను=నేను; కాశి=కాశీ పట్టణము; శివునకు=విశ్వేశ్వరునకు; శుద్ధాంత కాంతగాన=భార్యకావున; దానిపై=ఆ కాశిపై; అల్గి=కోపగించి; కోప పాత్రంబనైతి= (శివునకు) కోపపాత్రుడనైతిని; కాశి=కాశి; గౌరికి=పార్వతికి; సవతి+ఔన్+కాన=సపత్ని కావున; దానిపైన్+అల్గి=ఆ కాశిపై కోపించి; ప్రేమ పాత్రంబను+ఐతి= (గౌరికి)ప్రేమ పాత్రుడనైతిని.

భావము :- కాశీ పట్టణము శివునకు భార్య కావున దానిపై అలిగి నేను శివునకు కోపపాత్రుడనైతిని. కాశి గౌరికి సపత్ని కావున దానిపై నలిగి పార్వతికి ప్రేమ పాత్రుడనైతిని.

**వ॥ అనంతరంబ యేము ప్రత్యుత్థానంబు చేసి యా పురాణ దంపతులకుఁ బ్రణామంబు లాచరించి మడిసందులం జేతులిడి యొక్క కెలన నిలచియుంటిమి. పార్వతీ పరమేశ్వరులు వేదికా స్థలంబున విజయంబుచేసి కూర్చుండిరప్పుడు శంభుండు కోప సంరంభంబున నా దిక్కు చూచి ధిక్కరించి యిట్లనియె - 152**

అర్థము :- తదనంతరంబు=ఆ తరువాత; ఏము=మేము; ప్రత్యుత్థానంబు చేసి= లేచి యెదురుగా వెడలి; ఆ పురాణదంపతులకున్=ఆ ఆదిదంపతులకు; ప్రణామం

బులు+అచరించి=నమస్కారములు చేసి; మడిసందులన్=చంకలందు; చేతులు+ఇడి=చేతులను పెట్టుకొని; ఒక్క కెలన=ఒక ప్రక్కన; నిలచియుంటిమి=నిలువబడి యుంటిమి; పార్వతీ పరమేశ్వరులు=గౌరీవిశ్వనాథులు; వేదికాస్థలంబున=అరుగుకల చోటు చెంతకు; విజయంబు చేసి=వచ్చి; కూర్చుండిరి=కూర్చుండిరి; అప్పుడు=అంత; శంభుండు=విశ్వనాథుడు; కోప సంరంభంబున=కోపము యొక్క(వేగిరపాటుతో) ఆవేశముతో; నాదిక్కుచూచి=నా వైపు చూచి; ధిక్కరించి+ఇట్లనియె=తిరస్కరించి ఇట్లనియె.

భావము :- ఆ తరువాత మేము లేచి ఎదురుగా వెడలి ఆ పురాణ దంపతులకు నమస్కరించి చంకలందు చేతులు పెట్టుకొని ఒక ప్రక్కన నిలబడితిమి. పార్వతీ పరమేశ్వరులు వేదిక చెంతకు వచ్చి కూర్చుండిరి. అప్పుడు విశ్వనాథుడు కోపముతో నా వైపు చూచి ఇట్లనెను -

## శంభుండు వ్యాసుని శిష్యులతోడఁ గాశి వెడలి పొమ్మనుట :

సీ॥ "ఓరి దురాత్మ! నీవార ముష్టింపచా
భాస! యోజన గంధి ప్రథమ పుత్త్ర!
దేవరన్యాయ దుర్భావనా పరతంత్ర!
బహుసంహితావృథా పాఠపఠన!
భారత గ్రంథ గుంభన పండితంమన్య!
నీవా మదీయపత్నికి నశేష
కైవల్య కల్యాణ ఘంటాపథమునకుఁ
గాశికాపురికి నిష్కారణంబ

తే॥ శాపమిచ్చెదనని యనాచార సరణి
నడుగు వెట్టినవాఁడ వహంకరించి
పొమ్మునిర్భాగ్య! మాయూరి పొలము వెడలి
యెచటికేన్ శిష్యులును నీవు నీక్షణంబ. 153

అర్థము :- ఓరి దురాత్మ=ఓరి దుర్మార్గుడ; నీవార ముష్టింపచ+ఆభాస=తృణ ధాన్యమును పిడికెడు వండుకొని తిను మునివలె కన్పించు వాడా!; యోజన గంధి ప్రథమ పుత్త్ర=(పెండ్లి కాక మునుపు)సత్యవతికి పుట్టిన మొదటి పుత్త్రుడా!; దేవర న్యాయ

దుర్భావనా పరతంత్ర=సోదరుల భార్యలతో సంగమించు పాడు ఆలోచన యందు అస్వతంత్రుడా!; బహుసంహితా వృథా పాఠపఠన=అనేక సంహితలను వ్యర్థముగా పఠించువాడా!; భారత గ్రంథ గుంభన పండితంమన్య=భారత గ్రంథమును కూర్చుటచేత పండితుడనని భావించువాడా! నీవా=ఇటువంటి నీవా; మదీయ పత్నికి=నా భార్యకు; అశేష=సమస్తమైన; కల్యాణ=శుభములకు; ఘంటాపథమునకు=రాచబాట అగు; కాశికా పురికి=కాశీనగరమునకు; నిష్కారణంబ=అకారణముగ; శాపమిచ్చెదను+అని= శాపమిచ్చెదనని; అనాచారసరణిన్=సంప్రదాయ విరుద్ధముగ; అహంకరించి= గొప్పవాడవను కొనుచు; అడుగు వెట్టినవాఁడవు=కాలు పెట్టినాడవు; నిర్భాగ్య= దౌర్భాగ్యుడా; ఈక్షణంబ= ఈ క్షణమే; శిష్యులును నీవు=శిష్యులును నీవు; మా యూరి పొలము వెడలి పొమ్ము=మా కాశీ ప్రదేశము నుండి వెళ్లి పొమ్ము.

భావము :- ఓరీ! దురాత్మా! పండితంమన్యా! నీవా? నా భార్యకు, సకల శుభములకు నిలయమైన కాశికి అకారణముగ శాపమిచ్చెడివాడవు? నీవు నీ శిష్యులతో వెంటనే ఈ కాశిని విడచి వెడలి పొమ్ము.

విశేషము :- వాక్యవక్రత ఈ పద్యమున కలదు.

కం॥ పోక నడగొట్టి తేనియు
రాకింతుఁజుమీ మొగంబు రాచట్టుపయిం
శ్రీ కాశిక నిందించిన
నీకింతట నేల పోవు నీచ చరిత్రా! 154

అర్థము :- నీచ చరిత్రా!=నీచమైన నడవడి కలవాడా! పోక=పోకుండగ; నడగొట్టితివి+ఏనియు=నిలిచితివేని; రాచట్టుపయిన్=రాతిపై; మొగంబు=ముఖమును; రాకింతు జుమీ=చిదుకకొట్టెదను సుమీ; శ్రీ కాశిక=కాశీపురిని; నిందించిన=దూషించిన; నీకు=నీకు; ఇంతటన్+ఏలపోవు=ఇంతటితో ఏవిధముగ పోవును?

భావము :- నీచచరిత్రా! ఈ ఊరును విడిచి పోకుండగ నిలచితివేని, నీముఖమును రాతిమీద చితక కొట్టెదను సుమా! శ్రీ కాశికను నిందించిన నీకు ఇంతటితో ఏల పోవును?

కం॥ వడి విడువక యివ్వడువున
నుడుపతి మకుటుండు చెవులకొనరని నుడుగుల్
నొడివిన నే నయ్యురువుర
యడుగులఁబడి కాశి వెడలి యరిగెడు వేళన్. 155

అర్థము :- ఉడుపతి మకుటుండు=చంద్రుడు కిరీటముగాగల శివుడు; వడి విడువక= వేగము వదలక(ఆవేశముతో); ఈ+వడువునన్=ఈ విధముగ; చెవులకు+ ఒనరని=వినతగని; నుడుగుల్=పలుకులు; నాడివిన=పలికిన; నేను=నేనును; ఆ+ ఇరువుర=ఆ ఇద్దరి; అడుగులన్+పడి=పాదములపైబడి; కాశి వెడలి=కాశి నుండి బయలుదేరి; అరిగెడి వేళన్=వెళ్లునప్పుడు.

భావము :- విశ్వేశ్వరుడు మహా కోపముతో ఈ రీతిగా వినలేని పల్కులు పలుకగా, నేను వారిరువురకు నమస్కరించి, కాశిని వీడి బయలుదేరుచుండగా -

విశేషము :- ఈ పద్యమును శ్రీనాథుడు తెనుగు పదములతో నింపినాడు. 'డ' వర్ణ విన్యాసము ప్రదర్శింప చేసినాడు. ఇది వర్ణవిన్యాస వక్రత.

చం॥ "వెఱవకుమోకుమార! పదివేల విధంబులనైన నిన్ను నే
మఱవ; మఱేడకుం జనుట మాని సుఖంబున దక్షవాటికిన్
దుఱఁగలిగొన్న సమ్మదముతో గమనింపుము; భీమనాయకుం
డఱగొఱ లేని వేల్పు నిఖిలాభ్యుదయంబులు నీకునయ్యెడున్." 156

అర్థము :- ఓ కుమార=ఓ కుమార!; వెఱవకుము=భయపడకుము; పదివేల విధంబులనైన=ఎన్నివిధాలనైన; నిన్నునే మఱవ=నిన్ను నేను మరువను; మఱేడకున్ చనుట మాని=ఎక్కడకో వెడలుట మాని; దక్షవాటికిన్=దక్షారామమునకు; తుఱఁగలి గొన్న=అతిశయించిన; సమ్మదముతో=సంతోషముతో; గమనింపుము= ప్రయాణము కమ్ము; భీమనాయకుండు=భీమేశ్వర స్వామి; అఱగొఱలేని వేల్పు=కపటము లేని దైవము; నిఖిల+అభ్యుదయంబులు=సకల శుభములు; నీకున్+అయ్యెడున్=నీకు కలుగును.

భావము :- "ఓ కుమారా! భయపడకుము - నిన్ను నేను మరువను. ఎక్కడకు వెడలకుండదక్షారామమునకు ఏగుము. అక్కడి భీమేశ్వర స్వామి కపటము లేని దైవము - నీకు సకల శుభములు కలుగును."

వ॥ అనిన నంబవచనంబులు విని, విశ్వేశ్వర దేవరచిత న్యక్కార మహోపద్రవ సంభూత వేదనా దూయమాన మానసుండనయ్యును, భవానీ కృపాపాంగ వీక్షా విక్షేప దాక్షిణ్యంబున నొక్కింత యంకిలి దెలిసి, శిష్యసహితుండనై యెన్నఁడెన్నఁడు భీమేశ్వరు దర్శింతునోయని యువ్విళ్లూరి యేతెంచుచున్న వాఁడఁ, బరమ మాహేశ్వరుండవైన నిన్నుం గనుంగొంటి, నింక నా మనోరథం బవ్యాహత గతిం బ్రవర్తింప గలయది - 157

అర్థము :- అనినన్=అనగా; అంబవచనంబులు విని=పార్వతి పలుకులు విని; విశ్వేశ్వర=విశ్వనాథునిచే; రచిత=చేయబడిన; న్యక్కార=పరాభవమను; మహా+ఉపద్రవ= గొప్ప కష్టము వలన; సంభూత=పుట్టిన; వేదనా=బాధచే; దూయమాన=తపించుచున్న; మానసుండనయ్యును=మనస్సు కలవాడనయ్యును; భవానీ=పార్వతి; కృపా+అపాంగ+ వీక్షా=దయతో కూడిన కడకంటి చూపుల; విక్షేప=పరపుటచే కలిగిన; దాక్షిణ్యంబున= నమ్రతతో; ఒక్కింత=కొంచెము; అంకిలి తెలిసి=కిటుకు తెలిసి; శిష్యసహితుండనై= శిష్యులతో కూడినవాడనై; ఎన్నఁడు+ఎన్నండు=ఎప్పుడెప్పుడు; భీమేశ్వరుదర్శింతునో= భీమనాయకుని చూచెదనో; అని ఉవ్విళ్లూరి=అని ఉవ్విళ్లూరి; ఏతెంచుచున్న వాఁడన్= వచ్చుచున్న వాడను; పరమ మాహేశ్వరుండవైన=మహా శివభక్తుడవైన; నిన్నున్+కనుం గొంటిన్=నిన్ను చూచితిని; ఇంక=ఇంక; నా మనోరథంబు=నా కోరిక; అవ్యాహతగతిన్= అడ్డులేని విధముగ; ప్రవర్తింపఁగలయది=జరుగును.

భావము :- పార్వతి ఇట్లు పలుకగా, విశ్వనాథుని ధిక్కారము వలన బాధపడిన వాడనయ్యును, అంబ దయవలన మార్గము తెలిసికొని శిష్యసమేతుడనై దక్షారామ భీమేశ్వరుని దర్శించుటకు వచ్చుచుంటిని. ఇంతలో మహాశివభక్తుడవైన నిన్ను చూచితిని - ఇంక నా కోరిక ఆటంకములేక తీరును.

తే॥ అనవధానత యావగింజంత సూవె
పర్వతంబంత యపరాధ భరము కొలిపి
కాశి వెడలంగ మొత్తిన గాసిఁబొంది
తిరుగుచున్నాఁడ నిదెయేను దిక్కుమాలి. 158

అర్థము :- అనవధానత=అశ్రద్ధ; ఆవగింజంత సూవె=ఆవగింజంత మాత్రమే సుమా; పర్వతంబంత=కొండంత; అపరాధభరము=తప్పు అనెడి బరువును; కొలిపి= కలిగించి; కాశి వెడలంగ=కాశి నుండి వెళ్లిపోవునట్లు; మొత్తిన=కొట్టగా; గాసిన్+పొంది= నలిగిపోయి; ఏను=నేను; ఇదె=ఇట్లు; దిక్కుమాలి=దిక్కులేక; తిరుగుచున్నాఁడన్= సంచరించుచున్నాను.

భావము :- ఆవగింజంత పొరపాటు కొండంత అపరాధమునై కాశినివీడునట్లుగా నన్ను మొత్తిన నలిగి దిక్కులేక ఇట్లు తిరుగుచున్నాను.

విశేషము :- 'ఆవగింజంత' అనునది తెనుగు నుడికారము.

తే॥ కడు దయాళురు దేవతా గణము లెల్లఁ;
గాలభైరవు చిత్తంబు కఠినపాక
మీరసము పెద్దడుంఠి విఘ్నేశ్వరునకుఁ
గాశి మనబోంట్ల కెల్లను గాని బ్రతుకు." 159

అర్థము :- దేవతాగణములు=దేవతల సమూహములు; ఎల్లన్=అన్ని; కడు= మిక్కిలి; దయాళురు=దయకలవారు; కాలభైరవు చిత్తంబు=కాలభైరవుని మనస్సు; కఠిన పాకము=కర్కశమైనది; డుంఠి విఘ్నేశ్వరునకు=డుంఠి అను పేరుగల వినాయకునకు; ఈరసము=అసూయ; పెద్ద=ఎక్కువ; కాశి=కాశీ పట్టణము; మనబోంట్ల కెల్లను=మన వంటి వారి అందఱికిని; కాని బ్రతుకు=బ్రతుకు స్థలము కాదు.

భావము :- దేవతా గణములు కడు దయాళురు. కాని కాలభైరవుని మనస్సు జాలి లేనిది. డుంఠి వినాయకునకు అసూయ ఎక్కువ. మనవంటి వారికి కాశి బ్రతుకలేని స్థలము.''

కం॥ అని కుంభ సంభవునకును
దన వృత్తాంతంబు చెప్పి దైన్యము నొందెన్
గనుఁగవ నశ్రులు దొరఁగఁగ
ననఘుఁడు సత్యవతిసూనుఁడని చెప్పుటయున్. 160

అర్థము :- అని=అని ఈవిధముగ; అనఘుఁడు=పాపరహితుడు; సత్యవతీ సూనుఁడు=వ్యాసుడు; కుంభ సంభవునకును=అగస్త్యునకు; కనుఁగవన్=రెండు కన్నులందు; అశ్రులు=కన్నీరు; తొరఁగఁగన్=స్రవింపగా; తన వృత్తాంతంబు=తన కథ; చెప్పి=వివరించి; దైన్యమున్+ఒందెన్=దీనత పొందెను; - అని చెప్పుటయున్=అని(ఆ సూతుడు శౌనకాది మహామునులకు) చెప్పగా -.

భావము :- అని ఈవిధముగ పాపరహితుడైన వ్యాసుడు అగస్త్యునకు కన్నుల నీరు స్రవింప తన వృత్తాంతము చెప్పి దైన్యము పొందెను - అని ఆ సూతుడు శౌనకాది మునులకు చెప్పగా -.

వ॥ అటమీఁది వృత్తాంతంబెయ్యదియని యడిగిన. 161

అటమీఁది=ఆ తరువాత; వృత్తాంతంబు+ఎయ్యది=కథ ఏమి; అని అడిగిన=అని శౌనకాదులు సూతుని అడుగగా -.

మ॥ స్మరజిద్భూధర దిక్కరి ద్రుహిణయోషా చంద్రికాభ్రాపగా
శరదభ్రాభ్రమువల్లభ ప్రతిభట స్ఫారస్ఫురత్కీర్తి ని
ర్భర గర్భోదయ! భూర్భువస్స్వరఖిల బ్రహ్మాండ భాండోదరా!
యరి వేదండఘటా విఘట్టన కఠోరాటోప కంఠీరవా! 162

అర్థము :- స్మరజిత్+భూధర=మన్మథుని జయించిన శివుని పర్వతమైన కైలాసము; దిక్కరి=దిగ్గజము; ద్రుహిణయోషా=బ్రహ్మభార్యయైన సరస్వతి; చంద్రికా=వెన్నెల; అభ్ర+ఆపగా=ఆకాశ గంగ; శరత్+అభ్ర=శరత్కాలమునందలి మేఘము; అభ్రము వల్లభ=ఐరావతములతో; (అభ్రము=తూర్పు దిగ్గజమైన ఐరావతము యొక్క భార్యయైన ఆడ ఏనుగు పేరు); ప్రతిభట=సాటియైన; స్ఫార=విస్తారమై; స్ఫురత్=ప్రకాశించుచున్న; కీర్తి=కీర్తియను, నిర్భర=పరిపూర్ణమైన, గర్భ=బిడ్డ యొక్క; ఉదయ=పుట్టుకతో గూడిన, భూర్భువః+స్వర్+అఖిల+బ్రహ్మాండభాండ+ఉదరా=భూర్భువ స్స్వరఖిల బ్రహ్మాండ భాండములే ఉదరముగా గలవాడా! అరి వేదండ=శత్రువులను ఏనుగుల; ఘటా=సమూహ మును; విఘట్టన=బాధ కలిగించు; కఠోర=తీక్ష్ణమగు; ఆటోప=సంరంభములో; కంఠీరవా=సింహమైనవాడా!

భావము :- కైలాసము, దిగ్గజము, సరస్వతి, వెన్నెల, ఆకాశ గంగ, శరత్కాల మేఘము, ఐరావతముల తెల్లదనమును తిరస్కరించు కీర్తితో వెల్గెడి సమస్త లోకములు కలవాడా! శత్రువులనెడి ఏనుగుల సమూహమునకు బాధ కలిగించు కఠోర సంరంభములో సింహమైనవాడా!

విశేషము :- భూః, భువః స్వః- అనునవి ఊర్ధ్వలోకము లేడింటిలో మూడు లోకముల పేర్లు. చూ - ఆ-1-పద్యం. 4 పదునాలుగు లోకములు విశేషములు.

కం॥ అసమ సమ విషమ సమర
ప్రసృమర రిపు సుభట నిటలపట్ట విఘట్ట
వ్యసన దృఢ దోః కఠారా!
కుసుమ శరాసన సమానకోమలమూర్తీ! 163

అర్థము :- అసమ సమ విషమ సమర=రకరకములైన యుద్ధముల; ప్రసృమర=ప్రసరించు; రిపు=శత్రువుల; సుభట=ఉత్తమ యోధుల, నిటల పట్ట=ఫలకమువంటి; నుదుటి ఫాలపట్టమును; విఘట్ట=చీల్చుట యందు; వ్యసన= అత్యాసక్తిగల; దృఢ=బలమైన; దోస్+కఠారా=బాహువునందు ఖడ్గము కలవాడా!; కుసుమ శరాసన=పుష్ప ధన్వితో; సమాన=తుల్యమైన; కోమలమూర్తి=సుకుమార శరీరము కలవాడా!

భావము :- రకరకాల సమరములలో శత్రు సైనికుల నుదుటి పట్టములను చీల్చుటయందు ఆసక్తికల బాహువునందు ఖడ్గము కలవాడా! మన్మథునితో సమానమైన కోమల శరీరము కలవాడా!

విశేషము :- అసమ సమరము=తనకన్న ఎక్కువ వారితో యుద్ధము; సమ సమరము=తనతో సమానులగు వారితో యుద్ధము; విషమ సమరము=తనకన్న తక్కువ వారితో యుద్ధము.

స్రగ్విణి॥ రామమాంబా సుతా! రాజ విద్యాధరా!
కామితార్థైక సంకల్ప కల్పద్రుమా!
వేమన క్షోణిభృద్వీరభద్రేశ్వరా!
స్వామి కార్యాభిరక్షాక్రియాదక్షిణా! 164

అర్థము :- రామమాంబా సుతా=రామమాంబ పుత్రుడా! రాజవిద్యాధరా=రాజ విద్యను ధరించినవాడా; కామిత=కోరబడిన; అర్థ=ధనము యొక్క; ఏక=ప్రధానమగు; సంకల్ప=ఆలోచనకు; కల్పద్రుమా=కల్పవృక్షమైనవాడా!; వేమనక్షోణిభృత్=వేమ భూపాలుని; వీరభద్రేశ్వర=వీరభద్రారెడ్డియను; స్వామి కార్య=ప్రభువుల యొక్క పనులను; అభిరక్షా=చక్కగా రక్షించుటయను; క్రియా=పనియందు; దక్షిణా=సమర్థుడా!

భావము :- రామమాంబా పుత్రుడా! రాజ విద్యను నేర్చినవాడా! ఆశ్రితుల కోర్కులకు కల్పవృక్షమైనవాడా! వేమభూపాలుడు, వీరభద్రారెడ్డి అను ప్రభువుల కార్యములను నిర్వర్తించుటయందు సమర్థుడా!

విశేషము :- ఇది స్రగ్విణీ వృత్తము. నాలుగు 'ర' గణములు. ఏడవ అక్షరము యతి మైత్రీ స్థానము.

**ఇది శ్రీ కమలనాభ పౌత్ర మారయామాత్యపుత్ర సుకవిజన విధేయ శ్రీనాథనామధేయ ప్రణీతంబైన శ్రీ భీమేశ్వర పురాణంబను మహా ప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.**

ఇది

శ్రీ భీమేశ్వర పురాణ ద్వితీయాశ్వాసమునకు

**దక్షిణకాశిక**

అను ప్రతి పదార్థ భావ విశేష సహిత వ్యాఖ్యానము

# శ్రీ భీమేశ్వర పురాణము

## తృతీయాశ్వాసము

### దక్షిణ కాశికా వ్యాఖ్యానము

కం॥ శ్రీ భీమేశ్వర కరుణా
లాభ సముజ్జృంభమాణ లక్ష్మీ విభవా!
ప్రాభవ కశ్యపముని వం
శాభరణా! బెండపూఁడి యన్నామాత్యా! 1

**అర్థము :-** శ్రీ......విభవా; శ్రీ=అలౌకిక శక్తి గల, భీమేశ్వర=భీమేశ్వర స్వామి యొక్క, కరుణా లాభ=కరుణ కలుగుటచేత, సముజ్జృంభమాణ=మిక్కిలి అధికమగుచున్న, లక్ష్మీ= సంపదతోగూడిన, విభవా=ఔదార్యము గలవాడా; ప్రాభవ....ఆభరణా; ప్రాభవ=ఉత్కృష్ట మగు=(గొప్పదియగు); కశ్యపముని=కశ్యపుడను ముని యొక్క, వంశ=వంశమునకు, ఆభరణా=అలంకారమైనవాడా, బెండపూఁడి అన్నమాత్యా=బెండపూఁడి అన్నమంత్రీ (వినుము).

**భావము :-** శ్రీ భీమేశ్వర స్వామి వారి దయా విశేషము లభించుటచేత నిరంతరము అభివృద్ధి నందుచున్న సంపదయు ఔదార్యమును కలవాడా! మహోన్నతమగు కశ్యప మునీంద్రుని వంశమునకు భూషణమైన బెండిపూడి అన్నమంత్రీ! వినుము.

**విశేషము :-** ''లక్ష్మీ విభవ ప్రాభవ'' అని చిలుకూరివారి సంస్కరణములోని పాఠము. సంపదయు, నౌదార్యమును, దొరతనమును గలవాడా అని దాని కర్థము.

వ. అక్కథకుండు శౌనకాది మహామునులకుం జెప్పం దొడంగె 2

**అర్థము :-** ఆ+కథకుండు=కథను చెప్పు ఆ సూతుడు; శౌనక+ఆది=శౌనకుడు మున్నగు; మహామునులకున్=మహామునులకు; చెప్పన్+తొడంగెన్=చెప్పసాగెను.

**భావము :-** సూతుడు శౌనకాది మహామునులకు తరువాత కథను చెప్పసాగెను.

తే. అవ్విధంబున బాష్పధారాకులాక్షుఁ
డగుచు సత్యవతీ సూనుఁ డడలుటయును
నెలఁతయును దానుఁ గన్నుల నీరునించెఁ
గరుణ చిత్తంబులో నుబ్బఁ గలశ భవుఁడు 3

అర్థము :- సత్యవతీ సూనుఁడు=(సత్యవతీదేవి కుమారుడు) వ్యాసుడు, బాష్పధారా= కన్నీటి ధారలచేత, ఆకుల=నిండిన, అక్షుఁడు+అగుచు=కన్నులు గలవాడగుచు, ఆ+విధంబు నన్=ఆవిధముగా (ద్వితీయాశ్వాసములో చెప్పినట్లు) అడలుటయును=దుఃఖింపగా, కలశ భవుఁడు=(కుండలో నుండి జన్మించినవాడు) అగస్త్యుడు; నెలఁతయును=స్త్రీ-లోపాముద్రయును; తానున్=తానును, చిత్తంబులోన్=మనస్సులో, కరుణ=జాలి, దయ, ఉబ్బన్=ఉబుకగ, కన్నుల, నీరునించెన్=కన్నీరు పెట్టుకొనెను.

భావము :- సత్యవతీనందనుడగు వ్యాసమహర్షి కాశీ బహిష్కరణ వృత్తాంతమును జెప్పుచు కన్నులనుండి దుఃఖ బాష్పధారలు ప్రవహించుచుండ, దుఃఖించెను. ఆ సన్నివేశ మును జూచి మనస్సులో కరుణ మిక్కుటము కాగా అగస్త్య మహర్షియు, లోపాముద్రాదేవియు కన్నీరు పెట్టుకొనిరి.

విశేషము :- వింధ్య పర్వత విజృంభణము నరికట్టుటకు వారాణసిని దేవతలు ప్రార్థింప లోకక్షేమమునకై వీడివచ్చిన అగస్త్య మహర్షి పరితాప వృత్తాంతము కాశీఖండములో గలదు. కారణములు వేరైనను కాశీ విరహము మహర్షులిరువురికి సమానధర్మము.

వ. అనంతరంబ యంతరంగంబున సంతాపంబు డిందుపఱచుకొని సత్యవతీ నందనుండు కమండలు జలంబులఁగన్నులఁ దడుపుకొని నిట్టూర్పు నిగుడించి కాశికా వియోగ క్లేశంబున సమాన వ్యసనుండైన కుంభ సంభవున కిట్లనియె. 4

అర్థము :- అనంతరంబ=వెంటనే, సత్యవతీ నందనుండు=వ్యాసుడు, అంతరంగం బున=హృదయములో గల, సంతాపంబున్=విచారమును, డిందుపఱచుకొని=ఉపశమింప జేసికొని, కమండలు జలంబులన్=కమండలువులోని నీటితో, కన్నులన్=కన్నులను, తడుపు కొని=తడుపుకొని, నిట్టూర్పు నిగుడించి=దీర్ఘ నిశ్వాసములను వెలువరించి, కాశికా వియోగ క్లేశంబునన్=కాశీనగరము యొక్క ఎడబాటు వలన గలిగిన దుఃఖమునందు, సమాన వ్యస నుండు+ఐన=సమాన కష్టము గలవాడైన, కుంభసంభవునకు=అగస్త్యునితో, ఇట్లు=ఈ విధముగా, అనియె=అనెను.

భావము :- తరువాత వ్యాసమహర్షి హృదయములో గల విచారమును ఉపశమింప జేసికొని కమండలువులో నున్న జలముతో కన్నులు తడుపుకొని నిట్టూర్పులు విడచుచు కాశీనగరముతో గలిగిన ఎడబాటులో తనతో సమానమగుబాధ గల అగస్త్యునితో నిట్లనెను.

ఉ. "ఈవును నేనపోలెను మునీశ్వర! భాగ్యము లేమిఁజేసి కా
శీ విరహాగ్ని తాపమునఁజేడ్పడినాఁడవు; చెప్పవయ్య! నా
త్రోవ; మహాత్మ! దక్షపురి ధూర్జటి శంభుఁడు భీమనాథుఁడా
ర్యా విభుఁడాశ్రయింపనగునా? నను నేలికొనం దలంచునా? 5

అర్థము :- ముని+ఈశ్వర=మునిశ్రేష్ఠా, ఈవును=నీవుకూడ, నేను+అ+పోలెను= నావలెనే, భాగ్యము=పుణ్యము, లేమిఁజేసి=లేకపోవుటవలన, కాశీ.... తాపమున, కాశీ విరహ+ అగ్ని=కాశీ నగరముతో నెడబాటనెడి అగ్నియొక్క, తాపమునన్= తాపముతో, చేడ్పడినాఁడవు= బాధపడితివి. నా త్రోవన్=నాకు మార్గమును, చెప్పవయ్య=చెప్పుమయ్యా, మహాత్మ=మహా పురుషా, దక్షపురిన్=దక్షారామము నందలి, ధూర్జటి=బరువైన జడలుగలట్టియు, శంభుఁడు= మంగళకరుడును, ఆర్యావిభుఁడు=పార్వతీపతియగు, భీమనాథుఁడు=భీమేశ్వరస్వామి, ఆశ్రయింపన్=ఆశ్రయించుటకు, అగునా=తగునా? ననున్=నన్ను, ఏలికొనన్=కైకొనుటకు, తలంచునా=ఆలోచించునా? (ఎలుకొనందలంచునా=కైకొనగోరునా?)

భావము :- అగస్త్య మునీంద్రా! నీవు గూడ నావలెనే అదృష్టము లేకపోవుట చేతనే కాశీ విరహాగ్ని తాపముతో బాధపడుచున్నావు. అయ్యా! నాకు త్రోవ చూపుము. మహాత్మా! దక్షారామములోని ధూర్జటియు, శంభుడును, పార్వతీపతియగు భీమేశ్వరస్వామి నాశ్రయింపదగునా? ఆ స్వామి నన్ను గైకొన దలంచునా?

విశేషము :- కాశీనాథుడు వెడలగొట్టగా భీమనాథుడు నన్ను అనుగ్రహించునా? అను భావము వ్యాసుని ఆతురతను, ఆసక్తిని, సూచించుచున్నది.

అలంకారము :- రూపకము.

మ. జగతీమౌళి వతంసభూషణము, విశ్వఖ్యాతముం గాశికా
నగరంబుం బెడఁబాసి నీకును జగన్మాన్యైక చారిత్ర యీ
చిగురుం బోఁడికి నాకునుం గటకటా! చేడ్పాటు వాటిల్లె; నీ
ముగురిం గూర్చిన ముండదైవమునకు న్మోమోట లేదో సుమీ. 6

అర్థము :- జగతీ.... భూషణము, జగతీ=భూదేవి యొక్క, మౌళి=శిరస్సు నందలి, వతంస=శ్రేష్ఠమగు, భూషణమున్=అలంకారమైనదియు, విశ్వఖ్యాతమున్=ప్రపంచ

ప్రసిద్ధమును నగు, కాశికా నగరంబున్=కాశీ పట్టణమును, పెడఁబాసి=ఎడబాసి, నీకును= నీకును (అగస్త్యునకును), జగత్=లోకముచేత, మాన్య=పూజింపదగిన, ఏక=సాటిలేనిదగు, చారిత్ర=శీలముగల, ఈచిగురుంబోఁడికిన్=(చివురుటాకు వంటి శరీరము గల) ఈమెకును, నాకునున్=నాకును, కటకటా=అయ్యో, చేడ్పాటు=దుఃఖము, పాటిల్లెన్=కలిగినది. ఈముగురిన్=ఈ మన ముగ్గురిని, కూర్చిన=(ఇచ్చట) చేర్చిన, ముండదైవమునకున్= పనికిమాలిన (నింద్యమగు) విధికి, మోమోట=మోమోటము (కనికరము), లేదో సుమీ=లేదేమో సుమా.

భావము :- సమస్త భూమండలమునకు శిరోలంకారమైనదియు, ప్రపంచ ప్రఖ్యాతమును నగు కాశీ నగరమునకు దూరమైన నీకును, లోక ప్రసిద్ధమగు సచ్ఛీలము గల యీ లోపాముద్రాదేవికిని, నాకును - మనకు ముగ్గురికిని అయ్యో! ఆపద కలిగినది గదా! మనలను ముగ్గురిని ఇచ్చట చేర్చిన నింద్యమగు విధికి ఏమాత్రము కనికరము లేదుసుమా!

విశేషము :- 'ముగురింగూర్చిన ముండ దైవమునకు' అనునది తెనుగు నుడికారము. "ముగురం గూర్చిన ముండదైవమునకున్ మ్రొక్కంచు జేజేయనున్" అను పాదము జక్కన విక్రమార్క చరిత్రలో (8-80) కూడ కలదు.

లోకోక్తి అలంకారము.

సీ. నిండి పాఱుచునుండునే నిదాఘములందుఁ
దళుకొత్తు సప్త గోదావరంబు?
షట్కాల శంభు పూజా విధానములకుఁ
బల్లవ ప్రసవ దర్భలును గలవె?
కాంతాజనంబులు కమియార నిడుదురే
పురములోఁ దత్కాల పుణ్యభిక్ష?
ఘన తపంబునకు విఘ్నంబు సేయరు గదా
యమరేంద్రుఁ డొసఁగిన యప్సరసలు?

తే. కాలభైరవ విఘ్నేశ కార్తికేయ
వీరభద్రాది పరివార వీరగణము
స్వాగతము సేయునే కార్యసాధకులకు?
దక్షవాటిక యందు వాతాపిదమన! 7

అర్థము :- వాతాపి దమన=వాతాపియను రాక్షసుని అణచివైచిన అగస్త్యా!, దక్షవాటిక యందు=దక్షారామములో, తళుకొత్తు=వ్యాపించియున్న, సప్త గోదావరంబు= సప్తగోదావరమను సరస్సు, నిదాఘములందున్=వేసవికాలములందు గూడ, నిండి=జలపూర్ణమై, పాఱుచు నుండునే=ప్రవహించుచుండునా?

షట్కాల=ఆఱుకాలములలోను, శంభు=భీమేశ్వరస్వామివారి, పూజా విధానముల కున్=పూజచేయుట అను విధానములకు, పల్లవ=చివురుటాకులును, ప్రసవ=పూవులును, దర్భలును=దర్భలుగూడ, కలవె=ఉన్నవా (లభించునా?)

కాంతా జనంబులు=పుణ్యస్త్రీలు, పురములోన్=దక్షారామములో, తత్కాల=ఆ సమయమున (మధ్యాహ్నమున) పుణ్యభిక్షన్=పవిత్రమగు భిక్షను, కమియారన్=తృప్తి కలుగునట్లు, ఇడుదురే=పెట్టుదురా?

అమర+ఇంద్రుడు=దేవేంద్రుండు, ఒసఁగిన=ఇచ్చిన, అప్సరసలు=అప్సరసలు, ఘనతపంబునకున్=గొప్పదగు తపస్సునకు, విఘ్నంబు=విఘ్నమును, చేయరుగదా= చేయరుగదా!

కాల....గణము; కాలభైరవ=కాలభైరవుడు, విఘ్నేశ=వినాయకుడు, కార్తికేయ= కుమారస్వామి, వీరభద్ర+ఆది=వీరభద్రుడు మున్నగు, పరివార=సేనలోని, వీరగణము=వీరుల సముహము, కార్యసాధకులకు=తమపనులను నెరవేర్చుకొనువారికి, స్వాగతము=క్షేమముగా వచ్చితిరా అని అడుగుటను, చేయునే=చేయునా?

భావము :- అగస్త్య మహర్షీ! దక్షారామములో జలసమృద్ధితో సప్తగోదావరము వేసవి కాలములో గూడ నిండి పారుచుండునా? ప్రతిదినము ఆరు కాలములలోను శ్రీ భీమనాయక దేవుని పూజకు కావలసిన బిల్వాదులగు పత్రములు, పూవులు, దర్భలును లభించుచున్నవా? ఆ పట్టణములోని పుణ్యస్త్రీ సముహము మధ్యాహ్న సమయమైన సమృద్ధిగా భిక్ష పెట్టుచుండునా? దేవేంద్రుడు కానుకగా నిచ్చిన అప్సరసలు అచటి తాపసుల తపస్సునకు విఘ్నములను గలిగించుటలేదుగదా! కాలభైరవుడు, వినాయకుడు, కుమారస్వామి, వీరభద్రుడు మున్నగు పరివారములోని వీరుల సమూహము తపస్సు మొదలగు కార్యక్రమములను సాధించుకొనవచ్చువారికి స్వాగతము చెప్పుదురా?

విశేషము :- "సప్త గోదావరము, భీమనాథ సంప్రతిష్ఠకై సప్తర్షులచే నంతః ప్రవాహ రూపముగా సముపస్థితమై, యీనాఁడొక చిన్న కొలనుగా భీమేశ్వరుని యెదుట నున్నది. ఆనాఁడందు అప్సరసలు జలకమాడు చుండెడివారఁట. దానిలో నీనాఁడు తైర్థికులు పుణ్య మార్జింపఁదలఁచి స్నానము చేయవలయునట్టి పరిమిత జలము జతగూడియున్నది.' చిలుకూరి పీఠిక - 78.

షట్కాల శంభుపూజనము :- దీనినే షట్కాల లింగార్చనమందురు. శివపూజలోని శైవ సంప్రదాయమిది.

అరుణస్యోధయే సూర్యస్యోదయే సంగవే తథా
మధ్యాహ్నేచ తతస్సాయ మర్ధరాత్రేచ సువ్రతా

అరుణోదయము (సూర్యోదయమునకు పూర్వము), సూర్యోదయము, సంగవము (సూర్యోదయానంతరము ఏడు గడియల కాలము అనగా 2 గం. 48 ని. కాలము), మధ్యాహ్నము, సాయంకాలము, అర్ధరాత్రము అనునీయవి షట్కాలములు. శైవదీక్షాపరులు ఈ సమయములలో పరమేశ్వరు నర్చింతురు.

అమరేంద్రుఁడొసఁగిన యప్సరసలు :- ఇంద్రుడు భీమనాయకునకు మార్గశిరశుద్ధ చతుర్దశినాడు రోహిణీ నక్షత్రయుక్త సిద్ధయోగమున సముద్రము గోదావరి తుల్యభాగ సరిహద్దులుగల భూమిని ఆరువందల వేశ్యలతో నొసగినట్లు 5. ఆ. 84 ప. గలదు.

కాలభైరవాదులు భీమేశ్వరాలయమున గలరు.

ఉ. ముక్కు మొగంబు సూడకొక మోసపుమాటకు విశ్వనాయకుం
డెక్కడికైనఁ బొమ్మనుచు నెఱ్ఱని చూపులఁజూచి యల్కతో
ధిక్కరణంబు సేయఁ జనుదెంచితి కాశిక నుండి నాకుఁ దా
దిక్కయి భీమనాయకుఁడు దీర్చునొకో యవమాన దుఃఖముల్? 8

అర్థము :- విశ్వనాయకుండు=విశ్వేశ్వర స్వామి, ఒకమోసము+మాటకు=ఒకేఒక పొరపాటు మాటకు, ముక్కు మొగంబు+చూడక=మొగమోటములేక, ఎక్కడికైనన్= ఏచోటికైనను, పొమ్ము=వెళ్ళుము, అని, అనుచున్=అనుచు, ఎఱ్ఱని చూపులన్=ఎఱ్ఱనైన చూపులతో, చూచి=చూచి, అల్కతోన్=కోపముతో, ధిక్కరణంబు=అవమానము, చేయన్= చేయగా, కాశిక నుండి=కాశీనగరము నుండి, చనుదెంచితిన్=వచ్చితిని, భీమనాయకుఁడు= భీమేశ్వర స్వామి, తాను=తనంతతాను, నాకున్=నాకు, దిక్కు+అయి=రక్షకుడై, అవమాన దుఃఖమున్=అవమానము వలన గలిగిన దుఃఖమును, తీర్చునొకో=పోగొట్టునా?

భావము :- విశ్వేశ్వరస్వామి నేను పలికిన ఒకే ఒక పొరపాటు మాటకు ఏమాత్రము మొమోటములేక ఎక్కడికైన వెళ్ళుమని, కోపముతో నెఱ్ఱనైన కన్నులతో జూచి అవమానింపగా కాశీ నగరము నుండి వచ్చితిని. భీమేశ్వర స్వామి తానే నాకు దిక్కై ఆ యవమాన దుఃఖమును పోగొట్టునా?

విశేషము :- వ్యాసుని మాటలలో అవమాన దుఃఖము, పరితాపమును సూచితములు. "ఒక మోసపుమాట" 2. ఆ. లోని 108వ పద్యము. కోపముతో శివుడు ఎక్కడికైన పొమ్మని చెప్పినది 2 ఆ. 158 సీసపద్యము. "ముక్కు మొగము చూడక" అనునది తెలుగు నుడికారము.

ఆ. నన్నుఁ గన్నతల్లి యన్నపూర్ణా మహా
దేవి విశ్వనాథ దేవుతరుణి
గుఱుతు చెప్పితన్నుఁ గొలువంగఁ బుత్తేర
వచ్చినాఁడ నేలవలదె తనకు? 9

అర్థము :- విశ్వనాథదేవు తరుణి=విశ్వేశ్వర స్వామి భార్యయు, నన్నున్=నన్ను, కన్నతల్లి=కన్నతల్లియగు, అన్నపూర్ణాదేవి=అన్నపూర్ణా దేవి, గుఱుతు=ఈచోటును గూర్చి, చెప్పి, తన్నున్=తన్ను (భీమేశ్వరస్వామిని), కొలువంగన్=సేవించుటకు, పుత్తేరన్=పంపగా, వచ్చినాఁడన్=వచ్చితిని, తనకున్=తనకు (భీమేశ్వర స్వామికి), ఏలవలదె=పరిగ్రహింపవలదా?

అర్థము :- నాకు కన్నతల్లి వంటిదియు, విశ్వేశ్వరస్వామి భార్యయగు అన్నపూర్ణాదేవి భీమమండలమును గూర్చిచెప్పి ఆయనను సేవించుటకు పంపగా ఇచ్చుటకు వచ్చితిని. భీమేశ్వరస్వామి నన్ను కాపాడవలయును గదా!

విశేషము :- అన్నపూర్ణాదేవి వ్యాసునకు హితోపదేశము చేసిన విషయము 2-156లో గలదు.

సీ. భీమేశ్వరేశ్వర శ్రీమహాదేవుండు
కరుణించునే నన్నుఁ బరమశైవ!
సప్త గోదావరోత్సంగ ధాముఁడు నన్ను
నాదరించునె యిల్వలాసురారి!
సప్త పాతాళ విష్కంభ మూలస్తంభ
మూరడించునె నన్ను నుపరతాత్మ!
దక్షిణాంభోరాశి తట మేదినీభర్త
రక్షించునే నన్ను బ్రహ్మవాది!

తే. స్వాగతము సేయునే నాకుఁ జంద్రమౌళి?
కాంక్షితం బిచ్చునే నాకుఁ గాలగళుఁడు?
కాశిలోఁబద్ధ మానభంగంబు వాయఁ
గుస్తరించునె నను శూలి కుంభ జన్మ! 10

అర్థము :- .పరమ శైవ=ఉత్తమమైన శివభక్తుడా, భీమేశ్వర+ఈశ్వర=భీమేశ్వరుడనెడి ప్రభువగు, శ్రీమహాదేవుండు=పరమశివుడు, నన్నున్=నన్ను, కరుణించునే=దయచూచునా?

ఇల్వల=ఇల్వలుడనెడి, అసుర=రాక్షసునకు, అరి=శత్రువైనవాడా, సప్తగోదావర=సప్త గోదావరమను సరస్సు యొక్క, ఉత్సంగ=ఒడియే, ధాముఁడు=నివాసముగల శివుడు, నన్నున్=నన్ను, ఆదరించునె=కాపాడునా?

ఉపరతాత్మ=(లోక విషయముల నుండి) విరమించిన మనస్సు గలవాడా, సప్త....స్తంభము, సప్త పాతాళ=ఏడు పాతాళముల యొక్క, విష్కంభ=విస్తారమునకు, మూలస్తంభము=ఆధారస్తంభము (భీమేశ్వరుడు), నన్నున్=నన్ను, ఊరడించునె=ఓదార్చునా?

బ్రహ్మవాది=వేదాంతీ!, దక్షిణ....భర్త, దక్షిణ+అంభోరాశి=దక్షిణ సముద్రము యొక్క, తట=ఒడ్డునందున్న. మేదినీభర్త=భూమండలాధిపతి, నన్నున్=నన్ను, రక్షించునే=రక్షించునా?

చంద్రమౌళి=చంద్రరేఖ శిరస్సున గల భీమేశ్వరుడు, నాకున్=నాకు, స్వాగతము+ చేయునే=స్వాగతము కలిగించునా? కాలగళుఁడు=నలుపు కంఠము నందు గలవాడు, నాకున్= నాకు, కాంక్షితంబు=కోరినది, ఇచ్చునే=ఇచ్చునా? కుంభజన్మ=అగస్త్యా, శూలి=భీమేశ్వరుడు, కాశిలోన్=కాశీనగరములో, పడ్డ=పడిన, మానభంగంబు=అవమానము, పాయన్=పోవునట్లుగా, కుస్తరించునె=బుజ్జగించునా?

భావము :- పరమశైవా! భీమేశ్వరస్వామి నన్ను కరుణించునా? ఇల్వల శత్రువా! సప్తగోదావరీ తీరమున గల దేవుడు నన్ను ఆదరించునా? వైరాగ్యపూర్ణా! సప్తపాతాళ లోకము లకు మూలస్తంభమగు దైవము నన్ను ఊరడించునా? వేదాంతీ! దక్షిణ సముద్రతీరమునకు ప్రభువగు పరమాత్మ నన్ను రక్షించునా? చంద్రమౌళి నాకు స్వాగతము జెప్పునా? కాలకంఠుడు నా కోరిక తీర్చునా? శంకరుడు కాశిలో పడిన అవమానము మరచిపోవు నట్లు నన్ను బుజ్జ గించునా?

విశేషము :- సప్త పాతాళములు. అతలము, వితలము. సుతలము. రసాతలము, తలాతలము, మహాతలము, పాతాళము అను నీ యేడును క్రింది లోకములు. భూలోకము నుండి సత్యలోకము వరకు గల సప్తలోకములు ఊర్ధ్వలోకములు. అధోలోకములలో చివరిది పాతాళము.

శివజ్యోతిర్లింగము ఊర్ధ్వాధోలోకముల నతిక్రమించి వ్యాపించెననియు, దాని ఆద్యంతముల నెఱుగుటకై బ్రహ్మ హంస రూపము దాల్చి ఊర్ధ్వమునకును, విష్ణువు వరాహరూపముతో నధోలోకములకును వెళ్ళి విఫలయత్నులై తిరిగివచ్చినట్లు లింగ పురాణము 17 అధ్యాయములో గలదు.

దక్షిణాంభోరాశి=అగస్త్యుడు ఉత్తరదేశము నుండి వచ్చిన వాడగుటచే దక్షిణ దిక్కునందలి సముద్రము అని అనును.

ఉ॥ దోసము పెద్ద లేదనక ధూర్జటి నిష్ఠుర కంఠహుంక్రియా
భ్యాసముమై నదల్చి యదయస్థితిఁ గాశి వెలార్చె; నింక నే
నాసరి సంయమీంద్రుల ననాథత నేమెయిఁ జూతు దక్షవా
టీ సదనుండు ప్రేమము ఘటింపక తాను నుపేక్ష సేసినన్." 11

అర్థము :- ధూర్జటి=విశ్వేశ్వరుడు; దోసము=నా తప్పు; పెద్ద=అంత యెక్కువగా; లేదు+అనక=లేదని అనక; నిష్ఠుర .....మై; నిష్ఠుర=కఠినమగు; కంఠ=గొంతులోనిదగు; హుంక్రియా=హుంకారము యొక్క; అభ్యాసముమైన్=అలవాటు చొప్పున; అదల్చి=భయపెట్టి; అదయ స్థితిన్=దయలేని అధికారముతో, కాశి=కాశీ నగరము నుండి; వెలార్చెన్=(నన్ను) వెడల గొట్టెను; ఇంకన్=ఇటు మీద; దక్షవాటీ సదనుండు=భీమేశ్వరుడు; ప్రేమము= వాత్సల్యము; ఘటింపక=కలుగజేయక; తానును=తాను గూడ; ఉపేక్ష చేసినన్=అశ్రద్ధచేసినచో; నేన్=నేను; నాసరి=నాతో సమానులగు; సంయమి+ఇంద్రులన్=మునిశ్రేష్ఠులను; అనాథతన్= దిక్కులేని స్థితిలో; ఏమెయిన్=ఏవిధముగ; చూతున్=చూడగలను?

భావము :- నా తప్పు అంత పెద్దది కాదు అని భావింపక విశ్వేశ్వరుడు అలవాటు చొప్పున కఠోరమగు హుంకారముతో నన్ను భయపెట్టి నిర్దయుడై నిరంకుశాధికారముతో కాశీనగరము నుండి వెడలగొట్టెను. ఇకమీద దక్షారామ ప్రభువగు భీమేశ్వరస్వామి వాత్సల్యము జూపక తానుగూడ నుపేక్షించినచో దిక్కులేనివాడనై నాతోటి మునీంద్రుల నెట్లుచూడగలను?"

## అగస్త్యుఁడు వ్యాసునకు దక్షారామ మహిమంబు చెప్పుట :-

వ॥ అనినఁ బారాశర్యున కత్తపోధనవర్యుండిట్లనియె. 12

అర్థము :- అనినన్=అనియనగా, పారాశర్యునకు=వ్యాసునకు, ఆ+తపోధనవర్యుండు= (తపస్సే ధనముగా గలవారిలో శ్రేష్ఠుడగు) అగస్త్యుడు, ఇట్లు=ఈ విధముగా, అనియెన్= అనెను.

భావము :- అని చెప్పగా అగస్త్యుడు వ్యాసునితో నిట్లనెను.

మ॥ "వితతాష్టాదశ సంహితాగమకథావీథీ సహస్రంబు భా
రత తంత్రంబఖిలంబు నీయది; యపారంబైన యామ్నాయ సం
తతి నీచే వివరింపఁగాఁబడియె; విద్యావర్ధనా! నీవు నీ
క్షితిలో గానని తీర్థముల్ గలవె? యీ చింతాభరంబేటికిన్? 13

అర్థము :- వితత ..... సహస్రంబు; వితత=విశాలమైన; అష్టాదశ=పదునెనిమిదితో; సంహిత=కూర్పబడిన, ఆగమ=వేదములందలి; కథా=చరిత్రల యొక్క; వీథీ=వరుసల యొక్క; సహస్రంబు=వేలు గలదగు; భారత=మహాభారతమందలి; తంత్రంబు=ప్రధాన విషయము, అఖిలంబు=సమస్తమును; నీయది=నీకు సంబంధించినదే; అపారంబు+ఐన= అంతములేనిదగు; ఆమ్నాయ=వేదముల యొక్క, సంతతి=సమూహము, నీచేన్=నీ చేత; వివరింపఁగాఁబడియె=వివరింపబడినది; విద్యావర్ధనా=ఆత్మవిద్యను పెంపొందించినవాడా; ఈ క్షితిలోన్=ఈ భూమండలములో, నీవు=నీవు; కానని=చూడని; తీర్థముల్=పుణ్యక్షేత్రములు, కలవె=ఉన్నవా? ఈ చింతాభరంబు=ఈ దుఃఖాతిశయము; ఏటికిన్=ఎందులకు?

భావము :- ఆత్మ జ్ఞానమును పెంపొందించిన వ్యాస మహర్షీ! సువిశాలమగు పదునెనిమిది పర్వములతో గూర్పబడినదియు, వేలకొలది వేద వృత్తాంతములు గలదియునగు మహాభారతములోని ప్రధాన విషయమంతయు నీకు సంబంధించినదే. అనంతమగు వేదరాశిని విభాగరూపమున వివరించితివి. ఈ భూమండలములో నీవు దర్శింపని పుణ్యతీర్థములున్నవా? ఇంత దుఃఖింపనేల?

విశేషము :- వేద విభాగము, మహాభారత రచనము, అష్టాదశ పురాణ నిర్మితి, బ్రహ్మసూత్ర సంగ్రథనము వ్యాసమహర్షి అపార విజ్ఞానమునకు సజీవ శాశ్వతోదాహరణములు. విద్యావర్ధనుడగు ఆ మహర్షికిగూడ కాశీ నిందారూపమగు దోషము కలిగినది. అనాది కర్మవాసనా బద్ధమగు జీవలక్షణము ఆ మహాత్మునిలోను తొంగిచూచినది. విద్యావర్ధనుడు గావుననే ఆ ఆచార్య శ్రేష్ఠుని "నారాయణం పద్మభువం వశిష్ఠం శక్తించ తత్పుత్ర పరాశరంచ వ్యాసం శుకం" అని గురుపరంపరలో అధ్యాత్మ విద్యావేత్తలు ప్రతిదినము స్మరించుచుందురు.

వ్యాసమహర్షిని శ్రీనాథుడు 1. ఆ. 6వ పద్యములో ఇందలి భావసాదృశ్యముతో "పురాతన కవీంద్రగుణ కీర్తనము"లో కొనియాడెను.

అలంకారము :- పరికరాంకురము.

**వ॥ భీమలింగమాహాత్మ్యంబు నీవెఱుంగనియదియుంగలదె? దక్షారామ పుణ్యక్షేత్రంబఖిల పురాణ ప్రసిద్ధంబుకాదే? నీ మనోవిషాదంబునంజేసి యెఱుంగని వాఁడవుంబలె నడిగెదవు గాక యైన నడిగిన యర్థంబు చెప్పెద నాకర్ణింపుము.14**

అర్థము :- భీమలింగ=భీమేశ్వర లింగము యొక్క; మాహాత్మ్యంబు=మహిమ; నీవు=నీవు; ఎఱుంగని+అదియున్=ఎరుగనిది కూడ; కలదె=ఉన్నదా? దక్షారామ=దక్షారామ మనెడి; పుణ్యక్షేత్రంబు=పుణ్యక్షేత్రము; అఖిల=సమస్తమైన; పురాణ=పురాణములందు:

ప్రసిద్ధంబు=ప్రసిద్ధమైనది; కాదె=కదా; నీ=నీ యొక్క; మనోవిషాదంబునన్+చేసి= మనస్సునందలి దుఃఖము వలన; ఎఱుంగని వాఁడవుంబలె=ఏమియు తెలియని వానివలె, అడిగెదవు=అడుగుచున్నావు; కాక=అంత మాత్రమే; ఐనన్=అయినను; అడిగిన+అర్థంబు= అడిగిన ప్రకారముగా (విషయము); చెప్పెదన్=చెప్పుదును; ఆకర్ణింపుము=వినుము -

భావము :- భీమేశ్వరలింగ మహిమ నీకు తెలియనిదేమున్నది? దక్షారామమను పేరుగల పుణ్యక్షేత్రము సమస్త పురాణములలోను ప్రసిద్ధమైనదేకదా! అవమానము వలన మనస్సులో దుఃఖము కలుగుటచేత ఏమియు తెలియని వానివలె నడుగుచున్నావు. అంతే. అయినను నీవడిగినయట్లు ఆ క్షేత్రమును గూర్చి చెప్పెదను వినుము.

విశేషము :- "దక్షారామ పుణ్యక్షేత్రంబఖిల పురాణ ప్రసిద్ధంబుకాదే" - దక్షుని చరిత్రమును, దక్షాధ్వర ధ్వంసమును, శివుని యనుగ్రహము దక్షునకు గలుగుట మున్నగు విషయములు బహుపురాణ ప్రసిద్ధములే కాని దక్షారామము - ప్రస్తుతగ్రంథోక్తము అఖిలపురాణ ప్రసిద్ధ మేనాడును గాదు. ద్వాదశ జ్యోతిర్లింగముల వర్ణనలో "డాకిన్యాంభీమశంకరం" అని డాకిని అనుచోట భీమశంకరుడున్నాడని కలదు. ఈ 'డాకిని' ఏదియో స్పష్టము గాలేదు. మహారాష్ట్రలో, బీహారులో, ఉత్తరప్రదేశ్‌లో, అస్సాములో భీమశంకరలింగములున్నవి. దక్షారామమునకు తెలుగు పేరగు "డాకరేమి" 'డాకిని' కాదు గదా!

శా॥ మోక్షస్థానము భోగభూమియునునై మున్నూఱు తీర్థంబులన్
సాక్షాద్బ్రహ్మపదంబనంగ నపర స్వర్గంబునా నొప్పుగున్
దక్షారామము భీమనాయక మహాధామంబు లోకత్రయీ
చక్షుఃప్రాహుణకాయమాన సుషమా సంపత్సముద్దామమై. 15

అర్థము :- దక్షారామము=దక్షారామము; భీమనాయక=భీమేశ్వర స్వామి యొక్క; మహాధామంబున్=గొప్ప ఆలయమును; లోక ..... ఐ; లోకత్రయీ=మూడు లోకముల వారియొక్క; చక్షుస్+ప్రాహుణకాయమాన=కన్నులకు విందుచేయు; సుషమా=మహత్తర శోభయనెడి; సంపత్=సంపదచేత; సముద్దామము+ఐ=మిక్కిలి గర్వించినదై; మూడు+నూఱు =మూడువందల, తీర్థంబులన్=పుణ్యక్షేత్రములలో; సాక్షాత్=సాక్షాత్తుగా; బ్రహ్మపదంబు+ అనంగన్=పరబ్రహ్మ పదవి అనగా; మోక్ష స్థానము=ముక్తికి చోటు; అపర స్వర్గంబునాన్= మరియొక స్వర్గమో అన్నట్లుగా; భోగభూమియును+ఐ=సుఖములకు స్థానమై; ఒప్పు+అగున్ =సుందరమైనదగును.

భావము :- భీమేశ్వరస్వామివారి దివ్యదేవాలయమగు దక్షారామము ముల్లోకములవారి కన్నులకు విందుచేయు మహత్తర సౌందర్య గర్వము గలిగి సాక్షాత్తుగా పరబ్రహ్మ పదవియో యనునట్లు మోక్షము గలిగించు స్థానమును, మరియొక స్వర్గమో అనునట్లు సమస్త భోగములకుచోటై ఒప్పుచుండును.

విశేషము :- భీమనాయకుని ధామమగుట చేతనే పరబ్రహ్మపదమువలె మోక్షస్థానము, జనుల కన్నుల కింపుగ నుండుటచేతనే సర్వసంపత్సమృద్ధమై అపరస్వర్గమువలె భోగ భూమియునునైయున్నది దక్షారామము. భోగమోక్షములు విరుద్ధ ధర్మములు. ఇంద్రియముల వలన మనస్సు అనుభవించు భోగములు క్షణికములు, అనుభవమాత్రపర్యవసాయులు. మనస్సునకు, మాటలకు అందనిది, శాశ్వతమైనది, స్వస్వరూపావస్థాన రూపము మోక్షము. విరుద్ధ విషయములొకేచోట నుండుట భీమనాయకుని మహిమ.

తే॥ రాజవంశజుఁడగు భగీరథుని వెనుకఁ
బాఱు తెంచిన చదలేఱు పాటియగునె
సప్తమునిరాట్ప్రతాప సంప్రాప్తమైన
సప్తగోదావరంబుతో సారమహిమ. 16

అర్థము :- సప్తమునిరాట్=సప్తమహర్షి శ్రేష్ఠుల యొక్క; ప్రతాప=గొప్పదగు తపస్సు వలన; సంప్రాప్తము+ఐన=వచ్చిన; సప్తగోదావరంబుతో=సప్త గోదావర సరస్సుతో; సారమహిమన్=శ్రేష్ఠమయిన గొప్పతనమునందు; రాజవంశజుఁడు+అగు=రాజవంశములో జన్మించిన వాడైన; భగీరథుని వెనుకన్=భగీరథుని వెంట, పాఱుతెంచిన=పరుగెత్తుకొని వచ్చిన చదలేఱు= ఆకాశ గంగ, పాటి=సమానము, అగునె=అగునా?

భావము :- సప్తమహర్షి శ్రేష్ఠుల తపఃప్రభావమున వచ్చిన సప్త గోదావర సరోవరముతో ఇక్ష్వాకురాజవంశీయుడగు భగీరథుని వెనుక వచ్చిన ఆకాశగంగ సాటియగునా?

విశేషము :- కేవలము భగీరథుని తపస్సు వలన వచ్చినది గంగానది. ఒక వ్యక్తి తపస్సు మాత్రమే అందులకు కారణము. ఏడుగురు మహర్షుల తపో విశేషము వలన వచ్చినది సప్తగోదావరము. అనగా వారివెంట దక్షారామమునకు వచ్చినది. అంతేకాదు. సత్త్వగుణ ప్రధానులు సప్తర్షులు; రజో గుణ ప్రధానమగు రాజవంశజాతుడు భగీరథుడు. ఈ కారణముల వలన భాగీరథీ గంగకన్న సప్తర్షి సమానీత సప్తగోదావరము సర్వోన్నతమని సారాంశము.

21వ పద్యములోని విశేషములలో "గౌతమీ గంగ" ప్రాదుర్భావమున నిచ్చిన బ్రహ్మపురాణ శ్లోకములు ప్రస్తుత పద్యమునకు స్ఫూర్తిదాయకములు.

సీ॥ దక్షప్రజాధినాథ మహాధ్వరక్రియా
దీక్షాధిగమ పుణ్యదేశమునకు,
బ్రహ్మవిష్ణు పురందర ప్రధాన సుపర్వ
పరమ సంయమి సభా భవనమునకు,
దాక్షాయణీయోగ దహనార్చి రున్మేష
సామిధేనీ మంత్ర జాతమునకు,
వీరభద్ర భుజా విహారహేలాసమా
రంభ నాటక నాట్యరంగమునకు,

తే॥ నమృతమయ దివ్యతేజస్స్వయంభు లింగ
శాంత భీమేశ్వరేశ్వర స్థానమునకు,
దక్షవాటంబునకు మోక్షధామమునకు,
భోగ జన్మస్థలమున కే పురముసాటి? 17

అర్థము :- దక్ష.....దేశమునకు; దక్ష=దక్షుడనెడి; ప్రజా+అధినాథ=ప్రజాపతి యొక్క; మహా=గొప్పదగు; అధ్వర=యజ్ఞమనెడి; క్రియా=కార్యమునందు; దీక్షా=దీక్షను; అధిగమ=పొందుట చేత; పుణ్యదేశమునకు=పవిత్రమగు ప్రదేశమైనదియు;

బ్రహ్మ.....భవనమునకు; బ్రహ్మ=బ్రహ్మ. విష్ణు=విష్ణువు; పురందర=ఇంద్రుడు; ప్రధాన సుపర్వ=ముఖ్యులైన దేవతల యొక్క. పరమ సంయమి=పరమ ఋషుల యొక్క. సభా భవనమునకు=కొలువు కూటమైనదియు;

దాక్షాయణీ.....జాతమునకు; దాక్షాయణీ=దక్షపుత్రికయగు సతీదేవి యొక్క; యోగదహన=యోగాగ్ని యొక్క; అర్చిస్=జ్వాలలను; ఉన్మేష=వెలిగించుటకు; సామిధేనీ మంత్ర=సామిధేని అనుపేరుగల మంత్రముల, జాతమునకు=సమూహమైనదియు;

వీరభద్ర.....రంగమునకు; వీరభద్ర=వీరభద్రుని యొక్క; భుజ=భుజముల యొక్క; విహార=విహరించుట అనెడి; హేలా=విలాసము యొక్క; సమారంభ=చక్కని ప్రారంభముగల; నాటక=నాటకమునందలి, నాట్య=అభినయమునకు; రంగమునకు=రంగస్థలమైనదియు .....

అమృతమయ.....స్థానమునకు; అమృతమయ=అమృత స్వరూపమగు. దివ్య=దేవ సంబంధమైన; తేజస్=ప్రకాశముగల; స్వయంభు=తనంత తాను ఆవిర్భవించిన; లింగ =లింగమగు; శాంత=శాంతమైన, భీమేశ్వర+ఈశ్వర=భీమేశ్వర స్వామివారి యొక్క; స్థానమునకు =నివాసమైనదియు; మోక్షధామమునకు=ముక్తికి స్థానమైనదియు. భోగజన్మస్థలమునకు=

భోగములకు పుట్టిల్లు అయినదియు; దక్షవాటంబునకు=దక్షారామమునకు, ఏ పురము=ఏ పట్టణము; సాటి=సమానమగును?

భావము :- దక్షప్రజాపతి గొప్ప యజ్ఞము చేయుటకు దీక్షను పొందిన పవిత్ర ప్రదేశమును, బ్రహ్మ, విష్ణువు, ఇంద్రుడు మున్నగు ప్రధాన దేవతలకు, మహర్షులకు సభాభవన మైనదియు, దక్షపుత్రికయగు సతీదేవి యొక్క యోగాగ్ని జ్వాలలను హెచ్చు చేయుటకు సామిధేని అను ఋక్కుల సమూహమైనదియు; వీరభద్రుని భుజముల విహార విలాసముల ఆరంభమనెడి నాటకమునకు నాట్యరంగస్థలమైనదియు; అమృతమయము, దివ్యతేజోమయమునగు స్వయంభు లింగమైన భీమేశ్వర స్వామివారికి స్థానమైనదియు; మోక్షస్థానమును, భోగజన్మ భూమియునగు దక్షారామమునకు ఏ పట్టణము సమానమగును?

విశేషము :- దక్షయజ్ఞము, సతీదేవి అగ్నిపాలగుట, వీరభద్ర విజృంభణము మున్నగు పౌరాణిక వృత్తాంతములిందు సూచితములు. 2.ఆ.12.ప. లోనివి గలవు.

ఋక్ సామిధేనీ ధాయ్యాచయాస్యాదగ్నిసమిన్ధనే. అమరకోశము

అగ్నిని ప్రజ్వలింపజేయు ఋక్కు సామిధేనీ లేక ధాయ్యా అనబడును.

"సోమయాగాదులందు 'ఘర్మము' అనుపాత్రలో నేయి మఱుగుచుండగ మఱియొక పాత్రతో నా క్రాగెడి నేతిలో పాలు చిలుకుచుందురు. అపుడు రేకెత్తిన మంటలను చేటలతో నణచుచుందురు. ఈ జ్వాలా సంధుక్షణ సమయమున పఠించు ఋఙ్మంత్రములను సామిధేనీ మంత్రములు లేక ధాయ్యా మంత్రములు అనియందురు." చి.పా.శా. పీఠిక - పు - 109.

5 ఆ - 95వ పద్యములో 'ధాయ్యా' అను పేరు వచ్చును.

**వ॥ వెండియుఁజండభానుకృత ప్రతిష్ఠుండును, ఆఖండలముఖ బర్హిర్ముఖ శిఖామణి మయూఖ రేఖా కిమ్మీరిత చరణారవిందుండును, సప్తపాతాళభువన విష్కంభ నిర్భేద సమాసాదితావిర్భావుండును, దివ్యామృత స్వయంభూర్జ్యోతి ర్లింగమయ మూర్తిధరుండునైన భీమేశ్వరుండు భోగ మోక్ష ప్రదాన దీక్షాధురంధరుండై యందు నివసించియుండు. నమ్మహాదేవుచేత నప్పుణ్యక్షేత్రంబు భీమమండలం బనఁబండ్రెండు యోజనంబుల మేర కైవల్య కల్యాణ మండపంబును, భోగలక్ష్మీ విలాస భవన పుండరీకంబునై కుండలాముఖ సంవేద్య శార్దూల తీర్థంబులు మొదలుగాగల శాఖోపశాఖా తీర్థంబులు గలిగి దక్షిణ జలధివేలా వనోపకంఠంబున వేదండవదనశుండా కాండ చుళికితోన్ముక్త సప్తగోదావర సలిలధారా ఝుణత్కార బృంహిత బ్రహ్మాండగోళంబును, దుల్యభాగాప్రవాహలహరికా ఘోషఘుమఘుమాయ**

మాన దిగ్విభాగంబును, నేలానదీమాతృకాయమాన కేదారక్షేత్ర సంవర్ధితా నేకవ్రీహిభేద సంపత్సంపన్నంబును, ఫలభరిత నారికేళ షండమండిత ప్రౌఢపీఠికాపు రోపకంఠసీమా బహిర్భాగంబును, మాతృకాయమాన గోదావరీ పుణ్యాగ్రహార పరంపరా భూనిలింప సంసత్సంపాదితాధ్వరక్రియా సమాహూతపురుహూతాది దేవతాకదంబ సంబాధ సంచరితంబును, గౌంతేయ వాహినీ ప్రాంత సంతన్యమాన, సహకారకాంతార ఫలరసా స్వాదమోదమాన పుంస్కోకిల కుటుంబ కంఠనాళ కోమల కుహూకార కోలాహల ప్రపంచిత పంచమంబును, హరివంశంబునుంబోలె బలభద్ర ప్రద్యుమ్నానిరుద్ధ పురుషోత్తమాధిష్ఠితంబునై మహాక్షేత్రంబన, మహాలింగస్థానంబన, దక్షిణ కాశియనఁ, గల్యాణ నిలయంబనఁ, గైలాస ప్రతిబింబంబన ననశ్వరమహైశ్వర్యంబును, నప్రతిమ వైభవంబును, నవాఙ్మానస గోచరంబును, నసంఖ్యాత ప్రమథగణ సమాకీర్ణంబునునై యశేషకల్యాణ నిలయంబై యొప్పు నమ్మహాస్థానంబునందు. 18

అర్థము :- వెండియున్=మరియును; చండభాను=సూర్యునిచేత; కృత=చేయబడిన; ప్రతిష్ఠుండును=అభిషేకము గలవాడును; ఆఖండల.....అరవిందుండును; ఆఖండల ముఖ=ఇంద్రుడు మొదలైన, బర్హిర్ముఖ=దేవతల యొక్క; శిఖా=సిగయందలి; మణి=మణుల యొక్క, మయూఖ రేఖా=కిరణముల సమూహము చేత; కిమ్మీరిత=చిత్ర వర్ణములు గలవిగా చేయబడిన, చరణ+అరవిందుండును=పాదపద్మములు గలవాడును; సప్త..... ఆవిర్భావిండును; సప్త పాతాళ=ఏడు పాతాళములను, భువన=లోకముల; విష్కంభ= వైశాల్యమును; నిర్భేద=చీల్చుట చేత; సమాసాదిత=పొందబడిన; ఆవిర్భావుండును= పుట్టుకగలవాడును; దివ్య.....ధరండు; దివ్య=లోకాతీతమై; అమృత=పరబ్రహ్మమైన; స్వయంభూః=తనంత తాను వెలసిన; జ్యోతిర్లింగమయ=తేజోలింగమయమగు; మూర్తి=ఆకారమును; ధరుండును+ఐన=తాల్చినవాడైన; భీమేశ్వరుండు=భీమేశ్వరుడు; భోగ.....ధరుండై; భోగ=భోగములను; మోక్ష=మోక్షమును, ప్రదాన=ఇచ్చుటయను; దీక్షా=దీక్షలో; ధురంధరుండు+ఐ=అగ్రేసరుడై; అందు=ఆ దక్షారామములో; నివసించి+ఉండున్= కాపురముండును.

ఆ+మహాదేవుచేతన్=ఆ పరమేశ్వరుని చేత, ఆ+పుణ్యక్షేత్రంబు=ఆ పుణ్యక్షేత్రము, భీమమండలంబు+అనన్=భీమమండలము అను నామముతో, పంద్రెండు యోజనంబుల మేర=పంద్రెండు ఆమడల ప్రదేశము; కైవల్య=మోక్షమునకు; కల్యాణ మండపంబును =కల్యాణ మండపమును; భోగ=భోగములనెడి; లక్ష్మీ=లక్ష్మీదేవికి; విలాస భవన=క్రీడాస్థానమగు;

పుండరీకంబును+ఐ=పద్మమై; కుండలాముఖ=కుండలాముఖము; సంవేద్య=సంవేద్యము; శార్దూల=శార్దూలముననెడి; తీర్థంబులు=పుణ్యక్షేత్రములు; మొదలుగా+కల=మొదలైనవి గల; శాఖా+ఉపశాఖాతీర్థంబులు=లెక్క లేనన్ని పవిత్ర భూములు; కలిగి=కలిగియుండి;

దక్షిణ జలధి=దక్షిణ సముద్రము యొక్క, వేలా=తీరమునందలి; వన=వనము యొక్క; ఉపకంఠంబున్=సమీపమునందు; వేదండ.....గోళంబును; వేదండవదన=వినాయకుని యొక్క; శుండాకాండ=తామర కాడవంటి తొండముతో, చుళికిత+ఉన్ముక్త=పుడిసిలి పట్టబడి వదలబడిన; సప్త గోదావర=సప్తగోదావరము యొక్క; సలిల ధారా=నీటి ధారల; ఝణత్కార=కంకణ ధ్వని వంటి ధ్వనితో; బృంహిత=వృద్ధి చేయబడిన, బ్రహ్మాండ గోళంబును=గోళాకారమగు బ్రహ్మాండము కలదియు; తుల్యభాగా.....విభాగంబును; తుల్యభాగా =తుల్యభాగ అను నది యొక్క; ప్రవాహ=ప్రవాహము యొక్క, లహరికా=తరంగముల; ఘోష=ఘోషచేత; ఘుమఘుమాయమాన=ఘుమఘుమ అని ప్రతిధ్వనిచేయు(తరంగముల ధ్వన్యనుకరణము)చున్న; దిగ్విభాగంబును=దిక్కుల విభాగములు గలదియు; ఏలా..... సంపన్నంబును; ఏలానదీ=ఏల అను పేరుగల నది; మాతృకాయమాన=(తల్లిగా గల) ఆ నదీజలముతో పండునట్టి; కేదార క్షేత్ర=వరి పంట పొలములందు; సంవర్ధిత=బాగుగా పెరిగిన; అనేక=పలు విధములగు; వ్రీహిభేద=వడ్లజాతులనెడి; సంపత్=ధాన్య సంపదతో, సంపన్నంబును=సమృద్ధి గలదియు; ఫల.....భాగంబును; ఫలభరిత=పండ్లతో నిండిన; నారికేళ షండ=కొబ్బరి చెట్ల సమూహముతో, మండిత=అలంకరింపబడిన; ప్రౌఢ=గంభీరమైన; పీఠికాపుర=పిఠాపురము యొక్క, ఉపకంఠ=సమీపమునందలి, సీమా=పొలిమేర; బహిర్భాగంబును=బయటి ప్రదేశముగలదియు;

మాతృకా.....చరితంబును; మాతృకాయమాన=తల్లియగుచున్న; గోదావరీ= గోదావరి తీరమునందలి; పుణ్య=పవిత్రమయిన; అగ్రహార=అగ్రహారముల యొక్క; పరంపరా= వరుసలందున్న; భూనిలింప=బ్రాహ్మణుల యొక్క; సంసత్=పరిషత్తులచేత; సంపాదిత= నిర్వహింపబడిన; అధ్వర క్రియా=యజ్ఞకార్యములందు; సమాహూత=ఆదరముతో పిలువబడిన; పురుహూత+ఆది=ఇంద్రుడు మొదలగు; దేవతా=దేవతల యొక్క, కదంబ= సమూహము యొక్క; సంబాధ=మిక్కిలి ఇరుకైన; సంచరితంబును=సంచారము గలదియు;

కౌంతేయ.....పంచమంబును; కౌంతేయవాహినీ=కౌశికీ నది యొక్క; ప్రాంత= సమీపమునందు; సంతన్యమాన=బాగుగా విస్తరింపబడుచున్న; సహకార కాంతార=మామిడి తోపులందలి; ఫల=పండ్ల యొక్క; రస=రసమును; ఆస్వాద=రుచి చూచుటచేత; మోదమాన=ఆనందించుచున్న; పుంస్కోకిల కుటుంబ=మగ కోయిలల సమూహము యొక్క; కంఠనాళ=గొంతు క్రోవియందలి, కోమల=మధురమైన; కుహూకార=కుహూ ధ్వనుల యొక్క;

కోలాహల=కలకలముచేత; ప్రపంచిత=విస్తరింపజేయబడిన; పంచమంబును=పంచమ స్వరము గలదియు;

హరివంశంబునుంబోలె=హరివంశమువలె; బలభద్ర=బలరామునిచేత (దృఢమైన మనుజులచేత); ప్రద్యుమ్న=ప్రద్యుమ్నుని చేత (గొప్ప బలముగల వారిచేత); అనిరుద్ధ= అనిరుద్ధునిచేత (లొంగని వారిచేత); పురుషోత్తమ=విష్ణువుచేత (ఉత్తమ పురుషులచేత); అధిష్ఠితంబును+ఐ=అధిష్ఠింపబడినదై; మహాక్షేత్రంబు=గొప్పదగు తీర్థము; అనఁగాన్= అనగాను; మహాలింగ స్థానంబు+అనన్=మహత్తరమగు లింగమునకు స్థానమనగాను; దక్షిణకాశి+అనన్=దక్షిణ దేశమునందలి కాశీ పట్టణమనగాను; కల్యాణ నిలయంబు+ అనన్=మంగళములకు నివాస స్థానమనగాను; కైలాస ప్రతిబింబంబు+అనన్=కైలాసమునకు ప్రతిబింబమో అనునునట్లును; అనశ్వర=నాశములేని; మహా+ఐశ్వర్యంబును=గొప్పదగు సంపదగలదియు; అప్రతిమ=సాటిలేని, వైభవంబును=వైభవము గలదియు; అవాఙ్మానస గోచరంబును=మాటలకు మనస్సునకు తోచనిదియు; అసంఖ్యాత=లెక్కింప వీలులేని; ప్రమథగణ=ప్రమథగణములచేత; సమాకీర్ణంబునున్=వ్యాపింపబడినదియు, ఐ=అయి; అశేష=సమస్తమైన; కల్యాణ=శుభములకు; నిలయంబు+ఐ=నివాసమై; ఒప్పు=ప్రకాశించు; ఆ+మహాస్థానంబునందు=ప్రభావముగల ఆ పవిత్ర ప్రదేశమునందు (తరువాతి పద్యములోని కన్వయము).

భావము :- మఱియును ఆ భీమేశ్వరస్వామి సూర్య ప్రతిష్ఠితుడు. ఇంద్రాది దేవతలు నమస్కరింపగా వారి శిరస్సులందలి మణుల కిరణ సమూహములు ఆయన పాదపద్మము లందు చిత్ర వర్ణములను గలిగించుచుండును. అతలాదులగు సప్తపాతాళ లోకముల (వైశాల్య మును) ఛేదించుకొని ఆయన ఆవిర్భవించెను. దివ్యము పరబ్రహ్మ రూపమునగు జ్యోతిర్లింగ మయమగు నాకారమును దాల్చినవాడు. ఆ స్వామి భోగ మోక్షముల నొసగుటయను దీక్షా భారమును వహించి దక్షారామములోనుండును. ఆ మహాదేవుని నివాసము చేతనే ఆ పుణ్య క్షేత్రము భీమమండలము అను పేరుతో పన్రెండామడలమేర మోక్షమునకు కల్యాణమండప మును, భోగరూపయైన లక్ష్మీదేవికి క్రీడాస్థానమైన పద్మమైయుండును. కుండలాముఖము. సంవేద్యము, శార్దూలము మున్నగు తీర్థములతోపాటు శాఖోపశాఖలగు ననేక తీర్థములా మండలములో నున్నవి.

దక్షిణసముద్రతీరమునందలి వన సమీపమునందు వినాయకుడు తొండముతో సప్తగోదావరజలమును పీల్చి వెదజిమ్మిన జలధారల ఝణఝణత్కారముతో బ్రహ్మాండ గోళము వృద్ధినందినట్లుండెను. తుల్యభాగానదీప్రవాహ తరంగ ధ్వనితో దిగ్విభాగములు

ప్రతిధ్వనించుచున్నవి. ఏలానదీ జలముతో పండు వరి పొలములలో బాగుగా వృద్ధినందిన అనేక విధములగు ధాన్య సంపత్సమృద్ధి అట గలదు. ఫలములతో నిండిన నారికేళ వృక్షములతో నలంకృతమగు పిఠాపుర సమీపమునందలి సరిహద్దుల కావలినేల భీమమండలమున నున్నది.

అచటి గోదావరీమాత అన్నివిధముల పోషించు పవిత్రములగు నగ్రహారములలో నివసించు ద్విజులు నిర్వహించు యజ్ఞములలో హవిస్సులను గైకొనుటకై పిలువబడిన దేవతలు క్రిక్కిరిసి సంచరించుదురు. కౌంతేయ నదీప్రాంతమున మిక్కిలి విస్తారముగానున్న మామిడి పండ్ల రసమును ఆస్వాదించి ఆనందించు మగ కోకిలల సమూహముల గొంతుల నుండి వెలువడు మధురములగు కుహూకుహూ ధ్వనుల కలకలముతో పంచమస్వరము వ్యాపించుచున్నది.

ఆ భీమమండలములో హరివంశమునందు బలరాముడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు, శ్రీకృష్ణుడు నున్నట్లు దృఢమైన మనుజులు, గొప్పబలము గలవారు. పరులకు లొంగనివారునగు పురుషోత్తములుండిరి. పై విశేషముల వలన ఆ మహాస్థానము, గొప్ప పుణ్యక్షేత్రమనియు, దివ్యమగు భీమలింగమునకు నివాసమనియు, దక్షిణ దేశమునందలి కాశియనియు, సమస్త శుభములకు నిలయమనియు, కైలాస పర్వతమునకు ప్రతిబింబ మనియు ప్రసిద్ధమైనది. అచట నాశములేని ఐశ్వర్యమున్నది. సాటిలేని వైభవమున్నది. దానిమహిమ మాటలకు మనస్సునకు అందనిది. అచట లెక్కలేనంత ప్రమథగణ సమూహము వ్యాపించియున్నది. సమస్త మంగళములకు నదిప్రదేశమైయుండెను. అట్టి భీమమండల ములో

విశేషము :- ఈ వచనములో కవి భీమేశ్వర స్వామిని, భీమ మండలమును, అందలి ప్రకృతి శోభాసంపదను కన్నులకు గట్టునట్లు వర్ణించెను.

భీమమండలము :- దక్షిణ కాశియగు దక్షారామమునకన్ని దిక్కులందును మూడు యోజనముల మేరలో నుండిన భూమి భీమమండలము. దీనికి తూర్పు సరిహద్దు సముద్రము. ఇది గౌతమీ నది సముద్రమునఁ గలిసిన సంగమ ప్రదేశము. దీనిని భైరవపాలె సముద్ర మందురు. అచటి యీశ్వరుఁడు భైరవేశ్వరుఁడు. దక్షిణమునకును సముద్రమే సీమ. అదివసిష్ఠా సాగర సంగమ స్థలమైన అంతర్వేది క్షేత్రము. అచటి తీర్థాధి దైవతములు నీలకంఠేశ్వరుఁడు నృసింహస్వామియును. పశ్చిమమునకు అఖండ గౌతమి (రాజమహేంద్రవరము) సీమ. మార్కండేయ స్వామి తదధిదైవతము. ఉత్తర దిక్కునకు మేర మూడు యోజనములు. ఈమేర పిఠాపురమునకుఁజేరును. (చి.పా.శా. పీఠిక. పు. 74.)

భీమ మండలపు సరిహద్దులు - 3-33; 5-77; 5-89; 6-14; చెంత వచ్చినవి.

సీ॥ పాటలంబగు జటాజూటంబు నడునట్టు
పూపచుక్కలరాజు పొడవుచూపు;
వెడఁదయైన లలాటవీథీ విటంకంబు
కట్టెఱ్ఱ క్రొవ్వేఁడి కన్నుఁగూర్చుఁ;
గంబు సన్నిభమైన కంఠప్రదేశంబు
గరళ కూటము ఛాయఁ గ్రాచియుమియుఁ
గడు మనోజ్ఞములైన కర్ణపార్శ్వములందుఁ
బెను పాఁప పోఁగులు బిత్తరించు;

తే॥ భీమ మండలికా పుణ్యభూమియందు
వివిధ కైవల్య కల్యాణ వేది ననఁగఁ
గీటపక్షి సరీసృప క్రిమిచరాది
జంతు సంతతి ప్రాణావసానవేళ. 19

అర్థము :- వివిధ.....వేదిన్. వివిధ=నానావిధములైన; కైవల్య=మోక్షములకు; కల్యాణ వేదిన్=కల్యాణ వేదికయగు; భీమ.....యందు; భీమమండలికా=భీమమండల సంబంధమగు; పుణ్యభూమియందు=పవిత్రమగు భూమియందు; కీట.....సంతతి; కీట=పురుగు; పక్షి=పక్షి; సరీసృప=పాము; క్రిమి=(కృమి) సాలెపురుగులను; చర=జంగమములు; ఆది=మొదలగు; జంతు సంతతి=ప్రాణుల సమూహము; ప్రాణ+అవసానవేళన్=మరణ సమయమునందు; అనఁగన్=తలపగా;

పాటలంబు+అగు=మిక్కిలి ఎఱ్ఱనైన, జటా జూటంబు=(జడల సముదాయ బంధము) జటాజూటము యొక్క; నడునట్టు=నడిమిచోట; పూప=లేతయైన; చుక్కల రాజు= చంద్రుడు; పొడవు చూపు=కనిపించును;

వెడఁద+ఐన=విశాలమైన; వీథీ విటంకంబు=మార్గమువలె విశాలమైన; లలాట= నుదుట; కడు+ఎఱ్ఱ=మిక్కిలి ఎఱ్ఱనైనదియు; క్రొత్త+వేడి=మిక్కిలి వేడిగల; కన్నున్=కంటిని; కూర్చున్=కల్పించును.

కంబు సన్నిభము=శంఖము వంటి; కంఠ ప్రదేశంబు=కంఠమునందలి చోటు; గరళ కూటము=విష సమూహము యొక్క; ఛాయన్=కాంతిని; క్రాచి=కాంక్రించి; ఉమియున్= ఉమ్మివేయును;

కడు=మిక్కిలి; మనోజ్ఞములు+ఐన=మనోహరములైన; కర్ణపార్శ్వములందు=చెవుల భాగము(తమ్మె)లందు; పెనుపాఁపపోగులు=పెద్ద పాములనెడి పోగులు, బిత్తరించు= ఊగుచుండును.

భావము :- నానావిధములగు మోక్షములకు కల్యాణ వేదికయగు భీమమండల పుణ్యభూమిలో పురుగులు, పక్షులు, సర్పములు, సాలెపురుగులు మున్నగు ప్రాణుల సమూహములు మరణ సమయమున (భీమేశ్వరుని) తలంచినంతనే మిక్కిలి ఎఱ్ఱనగు జటాజూట మధ్యమునందు లేత చంద్రరేఖ కనిపించును. విశాలమైన నుదుట మిక్కలి ఎఱ్ఱనిదియు మిక్కిలి వేడిగలకన్నును కన్పించును. శంఖము వంటి కంఠము గరళ విషచ్ఛాయను కాంక్షించి ఉమ్మివేయునట్లుండును. మిక్కిలి అందమైన చెవి తమ్మెలకు పెద్దపాములే పోగులై ఊగుచుండును.

విశేషము :- భీమమండలములో మరణించు సమస్త ప్రాణులు ఆ స్వామి స్మరణమున ఆయన రూపమునందును. సాలోక్య సారూప్య సామీప్య సాయుజ్యములని ముక్తులు నాలుగు విధములు. వానిలో నిందు వర్ణిత ముక్తి సారూప్య ముక్తి.

సీ॥ ఒకచోటఁగోటి పల్ల్యుడురాజకోటీర
విభ్రాజితోత్సంగ వృద్ధగంగ,
యొకచోటఁ బీతాంబి కోన్నత స్తనభరా
స్ఫాలజరిత కల్లోల యేల,
యొకచోటఁజటుల నక్ర కుళీర పాఠీన
తోయగర్భాభోగ తుల్యభాగ,
యొకచోట నప్సరో నికర సంసేవితాం
తరము శ్రీ సప్తగోదావరంబు
తే॥ నమరు నాగరఖండ సిద్ధాంత జాతి
నాగవల్లీ సమాక్రాంత పూగఖండ
మండితోద్యానవాటికాఖండవిభవ
పాత్రమగు భీమమండలీక్షేత్రమునకు. 20

అర్థము :- నాగర.....పాత్రము; నాగర=గోరంట (నారింజ) చెట్లతో; ఖండ=చెఱకు తోటలతో సిద్ధాంత=పవిత్ర సుందరములగు; జాతి=జాజి తీగెలతో; నాగవల్లీ=తమలపాకు తీగెలతో; సమాక్రాంత=బాగుగా చుట్టుకొనబడిన; పూగషండ=పోకచెట్ల గుంపులతో; మండిత=

అలంకరింపబడిన; ఉద్యాన వాటికా=విహార వనములతో; అఖండ=ఎడతెగని; విభవ= వైభవముచేత; పాత్రము+అగు=యోగ్యమగు; భీమ మండలీ=భీమమండలమను; క్షేత్రమునకు=పుణ్యదేశమునకు;

ఒకచోటన్=ఒక ప్రదేశమునందు (దక్షిణ దిక్కున); కోటిపల్లి=కోటిపల్లియందలి; ఉడురాజ=నక్షత్రములకు రాజు - చంద్రుడు; కోటీర=జటాజూటమునందుగల సోమేశ్వరుని చేత, విభ్రాజిత=మిక్కిలిగా ప్రకాశించిన, ఉత్సంగ=ఒడిగల; వృద్ధగంగ=వృద్ధ గంగ; అమరున్ =ఒప్పును.

ఒకచోటన్=(మఱి)యొక ప్రదేశమునందు (ఉత్తర దిక్కున). పీఠాంబికా=(పిఠాపురము లోగల) పీఠికాదేవి యొక్క; ఉన్నత=ఎత్తయిన; స్తనభర=స్తనభరము యొక్క, ఆస్ఫాల= రాపిడిచేత; జర్జరిత=తునియలుగాజేయబడిన; కల్లోల=పెద్ద పెద్ద అలలుగల; ఏల=ఏలానది; అమరున్=ఒప్పును.

ఒకచోటన్=ఒక ప్రదేశమునందు; చటుల.....తుల్యభాగ; చటుల=చలించుచున్న, నక్ర=మొసళ్ళు, కుళీర=ఎండ్రకాయలు; పాఠీన=వేయికోఱల చేపలుగల; తోయగర్భ=నీటిలో నుండుటచేత; ఆభోగ=పరిపూర్ణతగల; తుల్యభాగ=తుల్యభాగానదియు; అమరున్=ఒప్పును.

ఒకచోటన్=ఒక ప్రదేశమునందు(తూర్పున); అప్సరస్+నికర=అప్సరసల సమూహముచేత; సంసేవిత=(స్నానాదులచే) సేవింపబడిన; అంతరము=లోపలిభాగముగల; సప్తగోదావరంబు=సప్తగోదావరమును; అమరున్=ఒప్పును.

భావము :- గోరంటలతో (నారింజ చెట్లతో) చెఱకు తోటలతో పవిత్ర సుందరములగు జాజులతో, తమలపాకుల తీవెలు చుట్టుకొన్న పోక చెట్లతో నలంకృతములైన తోటలు చుట్టు నుండుటచేత భీమమండల క్షేత్రము సర్వోన్నతమై విరాజిల్లుచున్నది. ఆ పుణ్యక్షేత్రమునకు దక్షిణ దిక్కునందు కోటిపల్లి అను క్షేత్రములోనున్న సోమేశ్వర స్వామి వారి ఆలయ సమీపము నందు వృద్ధ గంగ ప్రవహించుచుండును. మరియొకచోట - ఉత్తర దిక్కునందు పిఠాపురములో గల పీఠికాదేవి మహోన్నత స్తనభారము నొరిసికొని ప్రవహించుట చేత ఏలానదీ మహోత్తుంగ తరంగములు శిథిలములగుచుండును. మఱియొకచోట - (పశ్చిమ దిశయందు?) తీవ్ర వేగముతో సంచరించు మొసళ్ళు, ఎండ్రకాయలు, సొరచేపలు నీటి లోపల నుండుటచే పరిపూర్ణమైన తుల్యభాగయును; ఇంకొకవైపు - (ఆలయమునకు తూర్పున) స్నానాదులతో నప్సరసలు సేవించు జలముగల సప్తగోదావరమును అమరియున్నవి.

**విశేషము :-** భీమమండలములో నలుదిక్కులగల జలసమృద్ధ నదులు ఇందు వర్ణితములు. వాని వలననే అచటి లతావృక్షసస్యాదులు పచ్చపచ్చగ నుండుట సూచితము.

సీ. త్ర్యంబకాచల శిఖాగ్రంబునందుదయించి,
పొదలి యార్యావర్తభూమిఁ దఱిసి,
మలఁగి దండకవనీ మధ్య భాగమున నా
ప్రస్రవణాచల ప్రస్థ మొఱసి,
పట్టిస శ్రీ వీరభద్రేశు సేవించి,
తిలసోమనాథు మందిరము డాసి,
యేచి యనంత భోగేశ్వర స్థానంబు,
రుద్ర పాదములపైఁ ద్రోవ గాఁగఁ,

తే. గోటిపల్లీశు కోమలాంఘ్రులకు మ్రొక్కి,
కుండలాముఖ తీర్థంబు గుస్తరించి,
భీమమండలి డాపలఁ బెట్టి కొనుచు
గౌతమీ గంగ లవణాబ్ధిఁ గౌఁగలించె. 21

అర్థము :- గౌతమీ గంగ=గోదావరీనది, త్ర్యంబక+అచల=త్ర్యంబకమను పర్వతము యొక్క, శిఖ+అగ్రంబునందు=శిఖరముపైన (కొండకొమ్ము నందు), ఉదయించి=పుట్టి, పొదలి=అభివృద్ధి నంది, ఆర్యావర్త భూమిన్=ఆర్యావర్తము నందలి భూమిని, తఱిసి= సమీపించి, మలఁగి=తిరిగి, దండకవనీ=దండకారణ్యము యొక్క, మధ్యభాగమునన్=మధ్య ప్రదేశములో, ఆ=ప్రసిద్ధమైన, ప్రస్రవణ+అచల=పాపికొండల యందలి, ప్రస్థము= చదునగుచోటిని, ఒఱసి=ఒఱసికొని, పట్టిస=పట్టిసక్షేత్రము నందలి, శ్రీ వీరభద్ర+ఈశున్=శ్రీ వీరభద్ర స్వామిని, సేవించి=సేవించి, తిలసోమనాథు=తిల తీర్థమునందలి సోమనాథ శివుని, మందిరమున్=ఆలయమును, డాసి=సమీపించి, ఏచి=విజృంభించి, అనంతభోగేశ్వర= అనంతభోగేశ్వరుని యొక్క, స్థానంబున్= నిలయమును, రుద్రపాదములు=పుష్పగిరి (వత్ర్యంత పర్వతములు) పాదముల, పైన్=పైనుండి, త్రోవ=మార్గము, కాఁగన్=కాగా, కోటిపల్లి+ఈశు= కోటిపల్లిలోని శివుని; కోమల+అంఘ్రులకు= మృదువైన పాదములకు, మ్రొక్కి=నమస్కరించి, కుండలాముఖ తీర్థంబున్=కుండలా ముఖమను తీర్థమును, కుస్తరించి=సేవించి, భీమ మండలి=భీమమండలమును, డాపలన్=ఎడమ ప్రక్కన, పెట్టికొనుచు=ఉంచుకొనుచు, లవణ+అబ్ధిన్=ఉప్పు సముద్రమును, కౌఁగలించెన్=కౌగలించెను.

భావము :- గోదావరీ నది త్ర్యంబకాచల శిఖరాగ్రమునందు జన్మించినది. క్రమముగా నభివృద్ధినంది ఆర్యావర్తము నమీపించినది. అట నుండి తిరిగి దండకారణ్య మధ్యభాగమునందుగల పాపికొండలను ఒరిసికొనుచు ప్రవహించినది. తరువాత పత్తిసీమలో

పర్వతముపైగల శ్రీ వీరభద్ర స్వామిని సేవించినది. అనంతరము తిలసోమనాథస్వామివారి ఆలయమును సమీపించినది. అనంతభోగేశ్వరస్వామి దేవళము కడకు విజృంభించి వచ్చినది. అట నుండి రుద్రపాదముల సమీపము తరువాతి త్రోవగా ప్రవహించి కోటిపల్లి శివదేవుని మృదుపాదములకు మ్రొక్కినది. కుండలాముఖ తీర్థములో గల కుండలేశ్వరుని సేవించినది. తుదకు భీమమండలము ప్రక్కగా వెడలి లవణ సముద్రమును కౌగిలించినది. అందులో లీనమైనది.

విశేషము :- గోదావరీ నది జననము మొదలు సాగరములో గలయునంతవఱకు గల విశేషములు వివరింపబడినవి.

త్ర్యంబకము :- మహారాష్ట్రములో ప్రసిద్ధమగు నాసిక్ నుండి 30 కి.మీ. దూరములో త్ర్యంబకమను పుణ్యక్షేత్రమున్నది. ద్వాదశజ్యోతిర్లింగములలో నిచ్చటి శివలింగము మూడవది. లింగాకారమగు ఆరు అంగుళముల గుంటలో బ్రహ్మ విష్ణు మహేశ్వరులును, గోదావరి ఊటయునుండును. పైన కవచముండును. ఇచట పర్వత పంక్తి గలదు. ఇచట గౌతమ మహర్షి తపస్సు చేసి శంకరుని ప్రసన్నునొనర్చుకొనెను. ఆ దేవుని అనుగ్రహమున గోదావరి ఆవిర్భవించెను. మొదట నీ నది బ్రహ్మగిరిపై నుద్భవించి గుప్త అయ్యెను. తరువాత గంగా ద్వారమను పర్వతముపై వ్యక్తమయ్యెను. అచటను గుప్తమయ్యెను. అంతకు క్రింద మహర్షికుశ(దర్భ)లతో గోదావరీ ప్రవాహమునాపెను. దానినే నేడు కుశావర్తమను పేరుతో వ్యవహరింతురు. బ్రహ్మశాపమున శివుడు పర్వతరూపుడయ్యెను. ఈ పర్వతమునకు సద్యోజాతము, వామదేవము, అఘోరము, తత్పురుషము, ఈశానము అను నామములతో నైదు శిఖరములు గలవు. త్ర్యంబక క్షేత్ర సమీపముననున్నందునను, పర్వతము గూడ శివరూపమున ప్రసిద్ధమగుటచేతను దీనిని త్ర్యంబకాచలమని యనుట జరిగినది.

గౌతమీ గంగ :- గౌతమునిచేత భూమిపైకి తేబడిన గంగ. అనగా గోదావరి. దీనినే దక్షిణ గంగ అందురు. ఈ విషయమై బ్రహ్మపురాణము 74 అధ్యాయములో నిట్లుగలదు.

శ్లో॥ మహేశ్వర జటస్థాయా ఆపో దేవ్యో మహామునే,
తాసాంచద్వివిధోభేద ఆహర్తుర్ద్వయకారణాత్ 3

ఏకాంశో బ్రాహ్మణేనాత్ర వ్రతదాన సమాధినా,
గౌతమేన శివంపూజ్య ఆహృతో లోకవిశ్రుతః 4

అపరస్తు మహాప్రాజ్ఞ! క్షత్రియేణ బలీయసా,
ఆరాధ్యశంకరందేవం తపోభిర్నియమై స్తథా 5

నారదునకు బ్రహ్మదేవుడిట్లు చెప్పెను. "పరమశివుని జటాజూటములోగల జలమే భూమిపైకి తెచ్చినవారు ఇరువురగుట చేత ద్వివిధమగు భేదముతో ప్రసిద్ధమయ్యెను. వ్రతదాన సమాధిపూతుడు, బ్రాహ్మణుడగు గౌతముడు శివుని పూజించి లోకవిశ్రుతమగునట్లు గంగను భూమిపైకి తెచ్చెను. మఱియొక జలభాగమును బలవంతుడగు క్షత్రియుడు భగీరథుడు తపోనియమములతో పరమేశ్వరుని ఆరాధించి భూమిపైకి తెచ్చెను.

వింధ్యస్య దక్షిణే గంగా గౌతమీ సా నిగద్యతే
ఉత్తరే సాఽపి వింధ్యస్య భాగీరథ్యభిధీయతే.

వింధ్యపర్వతమునకు - దక్షిణ దిక్కునగల గంగ గౌతమి అనియు, ఉత్తర దిక్కునందు గల గంగ భాగీరథి అనియు చెప్పబడుచున్నది.

**ఆర్యావర్తము** :- "ఆర్యావర్తః పుణ్యభూమిః మధ్యం వింధ్యహిమాగయోః

వింధ్య హిమవంతముల మధ్యనున్న దేశము ఆర్యావర్తము అని అమరకోశము (ద్వితీయకాండ) నుడువుచున్నది. "ఆర్యాఃధార్మికాః వర్తంతే అస్మిన్నిత్యార్యావర్తః" ధార్మికులగు వారు ఉండుదేశము.

**దండకారణ్యము** :- దండకారణ్యము, సైంధవారణ్యము, పుష్కరారణ్యము, నైమిశా రణ్యము, కురుజాంగలము, ఉత్పలావర్తకారణ్యము, జంబూమార్గము, హిమవదరణ్యము, అర్బుదారణ్యము అని ప్రాచీన భారతదేశమునందు తొమ్మిది అరణ్యములు ప్రసిద్ధములు. అందు దండకారణ్యము మొదటిది. దండుని వృత్తాంతము శ్రీమద్వాల్మీకి రామాయణము, ఉత్తరకాండ 79, 80, 81 సర్గలలో గలదు. "అధర్మమును అనుసరించుటచేత దండుని శుక్రుడు శపించెను. నాటినుండి ఆతడేలిన మధుమంతమను రాజ్యము మృత్తికావర్షముచేత నాచ్ఛాదితమగుటచేత దండకారణ్యమయ్యెను. ఇది మహారాష్ట్రము, ఆంధ్రదేశములలో కొంత భాగము వ్యాపించియున్నది.

**ప్రస్రవణాచలము** :- ఇదియే నేటి పాపికొండలు. భద్రాచలము రాజమహేంద్రవరము మధ్య నీ పర్వతముగలదు. గోదావరీ నదీప్రవాహవేగమున నీకొండ పాపిడిపెట్టుగా జీలుటచే పాపిడికొండయయ్యెను. ఆ పదములో 'డి' అను వర్ణము వ్యవహారములో చ్యుతమయ్యెను. అనగా ప్రస్రవణాచలమే పాపిడికొండ - పాపికొండయైనది. ఇచట నదీజలము మిక్కిలిలోతు, ప్రవాహవేగము తీవ్రతరము. నది వైశాల్యము గోల్పోయి సన్నగనుండును.

**పట్టిసము** :- దీనినే పత్తిసీమయందురు. ఇది పశ్చిమ గోదావరి జిల్లాలో గలదు. గోదావరీ మధ్యమునందుగల దేవకూట పర్వతముపైనున్నది. శ్రీశైలము, కాశీ, కేదారము, శ్రీకాళహస్తి, పట్టిసము అనునవి పంచకాశీ క్షేత్రములుగా ప్రసిద్ధములు.

శ్లో॥ పట్టిసాద్రి సమంక్షేత్రం నాస్తిబ్రహ్మాండగోళకే
వీరభద్రసమోదేవో నభూతో నభవిష్యతి.

బ్రహ్మాండ గోళములో పట్టిసాద్రితో సమానమగు క్షేత్రమును, వీరభద్రస్వామితో సమానుడగు దేవుడును పూర్వము లేదు; ఇకముందు ఉండడు అని ఒక విశ్వాసము.

పట్టిసము అనగా వెడలుపైన ఖడ్గము. దీనినే అడ్డకత్తి అందురు. "దక్షారామములో యజ్ఞధ్వంస సమయమున వీరభద్రుడు దేవతలను నఱికిన తరువాత ఈ పర్వతమును జేరి పట్టిసమును గోదావరీజలముతో కడిగినాడు." అని కాశీఖండము 3. ఆ. 30 లో గలదు. అందుచేత ఆ క్షేత్రమునకు పట్టిసము అన్న పేరు వచ్చెను.

**తిలసోమనాథుడు :-** పట్టిసమునకు 10 కి.మీ. దూరమున గోదావరీ పశ్చిమతీరమున తాళ్ళపూడి అను గ్రామము గలదు. అచటి శివుడు సోమనాథుడు. అచటి గోదావరీ తీర్థమునకు తిలతీర్థమని పేరు. కావున నా తీరమున నున్న శంకరుడు తిలసోమనాథుడు.

**అనంతభోగేశ్వరుడు :-** తిలసోమనాథ మందిరమునకు దిగువన 5 కి.మీ. దూరములో అనంతభోగేశ్వరస్వామి ఆలయము గోదావరీ తీరమున నుండెడిది. అది నదిలో బడుటచేత తత్సమీప గ్రామమగు కుమారదేవములో ఆస్వామి ప్రతిష్ఠితుడైనాడు.

**రుద్రపాదములు :-** రాజమండ్రి వద్దగల రైలు వంతెనకు ఉత్తర దక్షిణములందున్న పాదముల వలెనున్న రాతిచోటు. పాదమనగా పర్వతమునంటి పాదమువలె క్రిందికి సాగిన రాతి ప్రదేశము. ఇవే రాజమండ్రియందలి పుష్పగిరి పాదములు.

**కోటిపల్లి :-** రుద్రపాదములనుండి గోదావరీ తీరమున నేగగా 40 కి.మీ. దూరములో కోటిపల్లి గలదు. అచట సోమేశ్వరస్వామియున్నాడు. ఆయన రజత కిరీటము నెల్లపుడు దాల్చియుండును. కావున నాయన అర్ధేందుధరుడు.

**కుండలాముఖము :-** కోటిపల్లికి 35 కి.మీ. దూరములో వృద్ధ గౌతమీ శాఖాతీరమున నీ తీర్థము గలదు. శివలింగాగ్రము మకరకుండలాకారము దాల్చియుండును. కావున నచటి ఈశ్వరుడు కుండలేశ్వరుడు.

భీమేశ్వరమండలము గౌతమీశాఖకు ఎడమ వైపుననే గలదు. ఈ పద్యములో శైవక్షేత్ర ప్రధానముగా గౌతమీ గంగ ప్రవహించిన మార్గము ప్రదర్శితమైనది. గౌతమీ గంగ అనునొక పుణ్యవతి పుట్టినింటి నుండి బయలుదేరి బహు రూపములతో బహునామములతో వెలుగొందు పరమ శివుని భక్తిశ్రద్ధలతో సేవించి తుదకు లవణాబ్ధియను పతిని సమీపించి ఆయన ప్రేమరసములో లీనమగుట ఇందు సూచితము.

కాశీఖండము 3.ఆ.16.ప.లో అగస్త్యుని ప్రయాణవర్ణనలో శ్రీనాథుడు పట్టిసాది భీమేశ్వర నివాసము వఱకుగల తీర్థక్షేత్రములను జెప్పెను.

తే॥ నీరుకడఁ గోళ్ళఁగూడి మున్నీటిఁగవయు
మొగులుబడి వాహినుల కెట్లు మొరయవచ్చు?
వార్ధు లేడింటికి వలపు వనితయైన
మంగళోత్సంగ గౌతమీ గంగ యెదుర. 22

అర్థము :- వార్ధులు=సముద్రములు, ఏడింటికిన్=ఏడింటికిని, వలపు వనిత+ఐన= ప్రియమైన భార్యయైనట్టియు, మంగళ+ఉత్సంగ=మంగళకరమైన ఒడిగల, గౌతమీ గంగ= గౌతమియను పేరుగల గంగయొక్క, ఎదురన్=ఎదుట, నీరుకడన్=స్వల్పజలముగల, కోళ్ళన్+ కూడి=ఊరి వెలుపలి కాలువలగూడి, మున్నీటిన్=సముద్రమును, కవయు=కలియు, మొగులు బడి వాహినులకు=మేఘములను - వర్షముననుసరించి ప్రవహించు నదులకు, ఎట్లు=ఏవిధముగా, మొరయవచ్చున్=ధ్వనింపవచ్చును?

భావము :- సప్తసముద్రములకు ప్రియభార్యయు, మంగళకరమగు నొడిగల గౌతమీ గంగ యెదుట స్వల్పజల ప్రవాహములతో నేగునవియు, వర్షము కురిసినప్పుడు మాత్రమే ప్రవహించు కోళ్లు అగు నితర నదులు ఎట్లు ధ్వనిచేయగలవు?

విశేషము :- గోదావరి జీవనది. అనగా ఏకాలముననను నెండిపోక నిరంతరమై ప్రవహించునది. తక్కిన నదులు అట్టివికావు. వర్షము కురిసిననే అవి ప్రవహించును. లేనిచో నెండిపోవును. ఏడు పాయలతో సప్త సముద్రములను గలిసినది. తక్కిన నదులకు కొన్ని ప్రదేశములే పవిత్రములు. కాని గోదావరీ తీరమంతయు పవిత్రమే. కావుననే ఆ నది మంగళోత్సంగ.

కోడు=ఊరి దరి నీటి కాల్వ. దీని బహువచనము 'కోళ్లు'.

ఉ॥ ఎక్కడఁ జూచినన్ సరసి, యెక్కడఁ జూచిన దేవమందిరం,
బెక్కడఁజూచినం దటిని, యొక్కడఁజూచిన పుష్పవాటికం,
బెక్కడఁజూచినన్నది, మహీవలయంబున భీమమండలం
బెక్కడ? యన్యమండలము లెక్కడ? భావన చేసి చూచినన్. 23

అర్థము :- ఎక్కడన్=ఏ ప్రదేశమున, చూచినన్=చూచినను, సరసి=చెరువే, ఎక్కడన్= ఏ ప్రదేశమున, చూచినన్=చూచినను, దేవమందిరంబు=దేవాలయమే, ఎక్కడన్=ఏ ప్రదేశమున, చూచినన్=చూచినను, తటిని=ఏరే, ఎక్కడన్=ఏ ప్రదేశము, చూచినన్= చూచినను, పుష్పవాటికంబు=పూలతోటయే, ఎక్కడన్=ఏ ప్రదేశమున, చూచినన్= చూచినను, నది=నదియే, భావన చేసి=ధ్యానము చేసి, చూచినన్=చూచినచో, మహీవలయంబునన్=

భూమండలములో, భీమమండలంబు=భీమమండలము, ఎక్కడ=ఎక్కడ, అన్యమండల ములు=ఇతర దేశములు, ఎక్కడ=ఎక్కడ.

భావము :- భీమమండలములో ఎక్కడ చూచినను తటాకమే. ఎక్కడ చూచినను దేవాలయమే. ఎక్కడ చూచినను ఏరే. ఎక్కడ చూచినను పూల తోటయే. ఎక్కడ చూచినను నదియే. ఈ సమస్త భూవలయములో ధ్యానించి చూచినచో భీమమండలమెక్కడ? ఇతర మండలములెక్కడ? భీమమండలముతో నేమండలములు సాటిరావనుట.

విశేషము :- జల సమృద్ధియున్నచోట ధాన్య సమృద్ధియుండును. అట అన్నపానము లకు లోపముండదు. పూలతోటలు లౌకిక సుఖసూచకములు కాగా దేవమందిరములు ఆధ్యాత్మిక దృష్టికి సూచకములు. భీమమండలము ఇహపర సాధకము.

తే॥ బ్రహ్మహత్యాదులగు మహాపాతకములు
ధాత్రిజనులకు నిమిషమాత్రమునఁబాయు
భీమనాథ మహాదేవు పెండ్లినాఁటి
దక్షిణాముఖ కల్యాణదర్శనమున. 24

అర్థము :- భీమనాథ=భీమేశ్వరుడను, మహాదేవు=శివుని యొక్క, పెండ్లినాఁటి= వివాహకాలమప్పటి, దక్షిణాముఖ=కుడి దిక్కున, (మనోజ్ఞమయిన), కల్యాణ దర్శనమునన్= కల్యాణమును చూచుటచేత, ధాత్రిజనులకు=భూమియందలి మానవులకు, బ్రహ్మహత్య+ ఆదులు+అగు=బ్రహ్మహత్యమున్నగు, మహాపాతకములు=గొప్ప పాపములు, నిమిషమాత్రము నన్=రెప్పపాటు కాలములో, పాయున్=పోవును.

భావము :- భీమేశ్వరుని వివాహమునాటి దక్షిణమున ప్రధానమగు కల్యాణమును దర్శించుటచేత భూలోక జనులకు బ్రహ్మహత్య మున్నగు మహాపాతకములు రెప్పపాటు కాలములో పోవును.

విశేషము :- బ్రాహ్మణుని చంపినవాడు, మద్యపానము చేయువాడు, బంగారము దొంగిలించువాడు, గురుభార్యను పొందువాడు అను నలుగురు మహాపాతకులు. వీరిలో నే యొక్కనితోనైన నొక సంవత్సరము కలసి యుండువాడును మహాపాతకియే. వీరు ఐదుగురు పంచమహాపాతకులని స్మృతులు పలుకుచున్నవి.

బ్రహ్మహా మద్యపస్తేయీ తథైవ గురు తల్పగః
ఏతే వేద విదాం శ్రేష్ఠాః మహాపాతకినః స్మృతాః
ఏభి స్సహవసేద్యస్తు సంవత్సర మసావపి

సూత సంహిత - జ్ఞాన యోగ ఖండము. అధ్యా-7. శ్లో-2

తే॥ కార్తికిక వేళ భీమశంకరుని నగరఁ
దూఱు నెవ్వాఁడు చిచ్చుఱతోరణంబు
నతఁడు దూఱఁడు ప్రాణ నిర్యాణవేళ
ఘోర యమ పట్టణద్వార తోరణంబు. 25

అర్థము :- ఎవ్వాఁడు=ఏమనుజుడు, కార్తికిక వేళన్=కార్తిక పూర్ణిమనాడు, భీమ శంకరుని=భీమేశ్వరస్వామి యొక్క, నగరన్=దేవాలయమునందు, చిచ్చుఱ తోరణంబున్= అగ్నితో గూడిన తోరణముననను, దూఱున్=ప్రవేశించునో, అతఁడు=ఆ మనుజుడు, ప్రాణ నిర్యాణవేళన్=ప్రాణములు పోవు(మరణ) సమయమునందు, ఘోర=భయంకరమగు, యమ పట్టణ=యమధర్మరాజు నగరము యొక్క, ద్వారతోరణంబు=ద్వారమునందలి తోరణమును, దూఱఁడు=ప్రవేశింపడు.

భావము :- కార్తీకమాసములోని పూర్ణిమనాడు భీమేశ్వరాలయములోని జ్వాలా తోరణము దూరిపోవువాడు మరణ సమయమున భయంకరమగు యమనగర ద్వారతోరణ ములో దూరడు.

విశేషము :- చిచ్చుఱతోరణము 'జ్వాలాతోరణము' :- కాశీఖండమున అగస్త్య మహర్షి అర్థాంగియగు లోపాముద్రతోపాటు దక్షారామములో కార్తిక మాసమునందు జ్వాలాతోరణము దూరినట్లుగలదు.

తే॥ కార్తికిక వేళ భీమశంకరుని నగర
వింధ్యసంస్తంభయిత దూరె విమలబుద్ధిఁ
దొయ్యలియుఁదాను జిచ్చుఱతోరణంబు
కలుష సంహతి సంహారకారణంబు కాశి. 3-24

పరమేశ్వర తేజమును అగ్నిదేవుడు భరింపలేక గంగానదిలో విడిచెను. ఆమెయు ఆ తేజముదాల్ప అశక్తయై తన తీరమునందలి రెల్లు గడ్డిలో వదలెను. ఆ తేజస్సే కుమారస్వామి అయ్యెను. తన్ను జంపువాడు రెల్లు గడ్డిలో నున్నాడని తెలిసి తారకాసురుడు ఆ రెల్లునంతను తగులబెట్టించెను. అయినను కుమారుడు కనుగందలేదు. అది కార్తికపూర్ణిమానాడు జరిగినదనియు, దానికి స్మృతిగా జ్వాలాతోరణమును శివాలయ ప్రాంగణమున ఆనాడు వెలిగించి దానిక్రింద దూరుట పాపహరమనియు విశ్వాసము.

కారణాగమములో జ్వాలాస్తంభ నిర్మాణము, ఆజ్యసిక్తవస్త్రావృతమగు దానిని నలువైపుల నుండి వెలిగించి జ్వాలామూర్తియగు ఆస్తంభమును జ్యోతిర్లింగముగా ధ్యానించుచు ముమ్మారు ప్రదక్షిణము చేయవలెననియు గలదు.

భీమేశ్వరాలయమున ఆ తోరణమును గడ్డితో నిర్మింతురు. ఆ తోరణమునకు కూర్చిన గడ్డిని తెచ్చుకొని వ్యవసాయదారులు వారి పశువులకు తినిపించుట నేటికిని కలదు. అట్లు తినిపించిన పాడి పంటలు సమృద్ధిగ నుండునని వారి విశ్వాసము.

తే॥ ద్వాదశక్షేత్ర పుణ్యతీర్థములతోడ
రమ్యమగు సప్తగోదావరంబుతోడ
వరద భీమేశ్వరేశ్వరావాసమైన
దక్షవాటంబు కల్యాణధామ మమరు. 26

అర్థము :- ద్వాదశ క్షేత్ర=పంద్రెండు క్షేత్రములు, పుణ్యతీర్థములతోడన్=పవిత్రమగు తీర్థములతోను, రమ్యము+అగు=మనోహరమగు, సప్తగోదావరంబుతోడన్=సప్తగోదావరమను సరస్సుతోను, వరద=వరములనిచ్చు, భీమేశ్వర+ఈశ్వర=భీమేశ్వర స్వామికి ఆవాసము+ఐన= నివాసమైన, దక్షవాటంబు=దక్షారామము, కల్యాణధామము=మంగళములకు స్థానమై, అమరున్=ఒప్పియుండును.

భావము :- ద్వాదశక్షేత్రములతోను, పవిత్ర తీర్థములతోను, మనోహరమగు సప్త గోదావరముతోను, కోరికలీడేర్చు భీమేశ్వరుని నివాసమగు దక్షారామము సర్వవిధమంగళ నిలయమైయున్నది.

విశేషము :- ద్వాదశక్షేత్రములు, తీర్థములు 3-97 నుండి 152 వఱకు వర్ణితములు. ఇందు క్షేత్ర తీర్థములు అన్యోన్యాశ్రయములు.

"ఈ తీర్థములు కొన్ని సాగుబడి భూములుగా మాఱినవి. లింగములు మాత్రమన్నియు నిలిచియున్నవి. తీర్థములు నిలిచియున్నవైనను నామ మాత్రావశిష్టములైయున్నవి. పేరు మాయకుండ నాఁటి విభవము లేకుండినను నిలిచియున్నది సప్త గోదావర తీర్థమొక్కటియే'
'. (చి.ప.శా. పీఠిక. పు. 100)

ద్వాదశ క్షేత్ర నామములు 3-ఆ.74లో చెప్పబడినవి.

తే॥ అప్పురంబు ప్రభావంబు చెప్పనేల?
తిరిగి పాఱంగ యోజనత్రితయ భూమి
వాపికా కూప గర్త పల్వల తటాక
తీర్థ జలములు భాగీరథీ జలములు. 27

అర్థము :- యోజన=యోజనముల యొక్క, త్రితయ=మూడింటి సమూహముగల, భూమిన్=నేలయందలి, వాపికా.....జలములు; వాపికా=కోనేరులు, కూప=బావులు,

గర్త=గుంటలు, పల్వలు=చెలమలు, తటాక=చెరువులులోని, తీర్థజలములు=పవిత్రమగు నీరు, భాగీరథీ జలములు=గంగా జలమై, తిరిగి=(సుడులు)తిరిగి, పాఱంగన్=ప్రవహింపగా, ఆ+పురంబు=ఆ దక్షారామ పట్టణము యొక్క, ప్రభావంబున్=మహిమను, చెప్పనేల=వేరె చెప్పవలయునా?

భావము :- మూడు యోజనముల నేలయందలి కోనేరులు, బావులు, గుంటలు, చెలమలు, చెరువులలోని పవిత్ర జలములు గంగాజలమై సుడులు తిరిగి ప్రవహించుచుండగా ఆ దక్షారామము ప్రభావమును వేరె చెప్పవలెనా?

సీ॥ పంచాక్షరీ మంత్ర పారాయణంబులు
 జపియించు శారికా సముదయములు
నీలకంఠ స్తోత్ర కోలాహల ప్రౌఢిఁ
 జూపు నున్మత్త పుంస్కోకిలములు
శతరుద్రియ శ్రుతి స్వాధ్యాయ పాఠంబుఁ
 బఠియించుఁ గిశోర బంభరములు
ప్రణవాక్షరాభ్యాస పరిపాటిఁ బాటించు
 నానావిధంబుల నమలిపిండు
తే॥ సప్తగోదావరాంబు నిర్ఝర సహస్ర
సారణీసేక సాంతత్య సంప్రవృద్ధ
వివిధ తరు గుల్మ వల్లికా వేల్లమైన
తత్పురోద్యాన వీథికాంతరమునందు. 28

అర్థము :- సప్త.....మైన, సప్తగోదావర=సప్తగోదావరము యొక్క, అంబు=నీటితోడ, నిర్ఝర=సెలయేళ్ళవంటి, సహస్ర=వేనకువేలు, సారణీ=కాలువల ద్వారా, సేక=తడుపుటచేత, సాంతత్య=ఎల్లప్పుడు, సంప్రవృద్ధ=బాగుగా నభివృద్ధి చెందిన, వివిధ= పలురకములైన, తరు=చెట్లు, గుల్మ=పొదలు, వల్లికా=తీగెలు, వేల్లము+ఐన=చుట్టుకొనుట గలవైన, తత్.....నందు; తత్=ఆ, పుర=పట్టణము నందలి, ఉద్యాన=ఉపవనముల, వీథికా+ అంతరమునందు=వరుసల మధ్యలో;

శారికా సముదయములు=గోరువంకల సమూహములు, పంచాక్షరీ మంత్ర=పంచాక్షరి అను మంత్రమును, పారాయణంబులు=అంతయు చదువుట గలవై, జపియించున్= ధ్యానము చేయుచుండును.

ఉన్మత్త=మిక్కిలి మదించిన, పుంస్కోకిలములు=మగకోయిలలు, నీలకంఠ=శివుని, స్తోత్ర=స్తుతించుటతో, కోలాహల ప్రౌఢిన్=కలకలము సృష్టించుటలో సామర్థ్యమును, చూపున్=చూపుచుండును.

కిశోర బంభరములు=పిల్ల తుమ్మెదలు, శతరుద్రియ=శతరుద్రియము(నమకము) అను, శ్రుతి=వేదము యొక్క, స్వాధ్యాయ=అధ్యయనము తోడి, పారంబున్=చదువుటతో, పరిఢవించున్=సందడి చేయును.

నానావిధంబుల=అనేకవిధములైన, నమలిపిండు=నెమళ్ళ సమూహము, ప్రణవ+అక్షర=ఓంకారమను నక్షరము యొక్క, అభ్యాస=అభ్యసించుటయందు, పరిపాటిన్=క్రమమును, పాటించున్=గ్రహించును.

**భావము** :- సప్తగోదావరము కాలువలలో ప్రవహించు జలముతో తడియుటచేత నిరంతరము నభివృద్ధినందుచున్న నానావిధములగు వృక్షములు, పూపొదరిండ్లు తీవెలతో సంచలించుచున్న దక్షారామమునందలి ఉద్యానవనములలో గోరువంకలు పంచాక్షరీమంత్ర పారాయణ జపము చేయుచుండును. ఉన్మత్తములగు కోకిలలు పరమశివ స్తోత్రములతో కలకలమును సృష్టించుటలో సామర్థ్యమును జూపును. పిల్లతుమ్మెదలు నమక మంత్రములతో వేదాధ్యయనముతో సందడి చేయుచుండును. నానావిధములగు నెమళ్ళ సమూహములు ఓంకారమును జపించుటలో వలసిన క్రమమును గ్రహించుచుండును.

**విశేషము** :- దక్షారామమునందలి పక్షులు గూడ పరమేశ్వర ధ్యానతత్పరములై యుండగా నితరుల సంగతి చెప్పవలసినదేమి యుండును?

శతరుద్రీయము :- రుద్రమంత్రాః శతం తస్మాత్ శతరుద్రీయముచ్యతే. నూరు రుద్రమంత్రములుండుటచేత తత్సమూహమును శతరుద్రీయమందురు.

'నెమలి' అనుదానికి 'నమలి' అని ప్రయోగించుట గమనార్హము.

ఈ పద్యము నన్నయ భట్టారకుని కణ్వముని ఆశ్రమ వర్ణనమునందలి సీస పద్యమునకు చాయ.

సీ॥ "శ్రవణ సుఖంబుగా సామగానంబులు
చదివెడు శుకముల చదువు దగిలి" (ఆది-4-23)

**సీ॥ నిఖిల పుణ్యక్షేత్ర నివహంబునందును**
**నత్యంత మాశ్రయంబనఁగ నెగడి**
**యైంద్ర సంపదకెల్ల నాధారభూతమై**
**దక్షుని యజ్ఞంబు తానకమయి**

ద్వాదశ పుణ్యతీర్థములతో సంధిల్లి
భోగమోక్ష విహార భూమియగుచు
నియమ యాత్రామాత్ర నిశ్శేష దోషాప
హరణంబొనర్ప సమర్థమగుచు

తే॥ సిద్ధ నిర్మల నిరవధి శ్రీ స్వయంభు
ధన్య భీమేశ్వరేశ్వర స్థాణులింగ
దైవతస్థితి సంభవ స్థానమైన
దక్షవాటంబు వర్ణింపఁదరమె మనకు? 29

అర్థము :- నిఖిల.....నందును; నిఖిల=సమస్తమైన, పుణ్యక్షేత్ర=పుణ్యక్షేత్రముల యొక్క, నివహంబునందును=సమూహములోను, అత్యంతము=మిక్కిలి, ఆశ్రయంబు= ఆశ్రయము. అనఁగన్=అనగా, నెగడి=కీర్తి కెక్కి.

ఐంద్ర సంపదకు=ఇంద్రునిదగు సంపత్తికి, ఎల్లన్=అంతకును, ఆధారభూతమై= ఆశ్రయమునకు తగినదై, దక్షుని యజ్ఞంబు=దక్షుని యజ్ఞమునకు, తానకము+అయి=చోటై.

ద్వాదశ పుణ్యతీర్థములతోన్=పండ్రెండు పవిత్ర తీర్థములతో, సంధిల్లి=కూడి, భోగ= భోగములకు, మోక్ష=మోక్షమునకు, విహారభూమి=విహరించు స్థానము; అగుచున్= అగుచు.

నియమ.....హరణంబు; నియమ=నియమములతో గూడిన, యాత్రామాత్ర=యాత్రతో మాత్రమే. నిశ్శేష=మిగులకుండ. దోష=పాపములను, అపహరణంబు=తొలగించుటను, ఒనర్పన్=చేయుటకు. సమర్థము=శక్తిగలది, అగుచున్=అగుచు.

సిద్ధ.....ఐన; సిద్ధ=అలౌకిక శక్తి సంపన్నమైన, నిర్మల=స్వచ్ఛమైన, నిరవధి= అంతములేని, శ్రీ=శోభగలట్టియు, స్వయంభు=తనంత తాను అవతరించిన, ధన్య= సర్వోత్కృష్టమగు, భీమేశ్వర=భీమేశ్వరుడను, ఈశ్వర=స్వామియనెడి, స్థాణు=అచలమైన (లింగరూపుడైన), దేవత=దేవుని యొక్క, స్థితి=ఉనికి, సంభవ=కలుగుటకు, స్థానము+ఐన= పట్టణమైన, దక్షవాటంబున్=దక్షారామమును, మనకున్=మనకు, వర్ణింపన్+తరమె= వర్ణింపతరమా?

**భావము** :- దక్షారామము సమస్తమైన పుణ్యక్షేత్ర సమూహములోను అధికముగా నాశ్రయింపదగినదని కీర్తికెక్కినది. మహేంద్రుని సంపదకంతకు నాధారభూతమైనది. దక్షుడొనర్చిన యజ్ఞమునకు స్థానమైనది. పండ్రెండు పవిత్రతీర్థములతోగూడి భోగములకు మోక్షమునకు విహారస్థానమైనది. నియమపూర్వకముగ యాత్రచేసిన మాత్రముననే

పాపములేవియు మిగులకుండ పోగొట్టుటలో సమర్థమైనది. అలౌకిక శక్తి సంపన్నము, నిర్మలము, అంతములేని శోభగలిగి స్వయంభువును సర్వోత్కృష్టుడగు భీమేశ్వరస్వామి యనెడు స్థాణులింగ రూపుడగు దేవదేవుని నివాస పట్టణమగు ఆపురమును మనము వర్ణింపగలమా?

క॥ దక్షిణ కాశీ నగరము
దక్షారామంబు భీమ ధామము ధన్య
త్కుక్షిక్షోణీమండల
రక్షామణి దానిఁ బొగడ బ్రహ్మకు వశమే? 30

అర్థము :- భీమధామము=భీమేశ్వరుని స్థానమగు, దక్షారామంబు=దక్షారామము, దక్షిణ కాశీనగరము=దక్షిణ దిక్కునందున్న కాశీనగరము, ధన్యత్.....మణి; ధన్యత్=మెచ్చుకొన దగినదగుచున్న, కుక్షి=మధ్యభాగముగల, క్షోణీమండల=భూమండలమును, రక్షామణి= రక్షించుటలో శ్రేష్ఠమైనది, దానిన్=ఆ భీమమండలమును, పొగడన్=స్తుతించుట(కు), బ్రహ్మకున్=బ్రహ్మకైనను, వశమే=శక్యమా?

భావము :- భీమేశ్వరస్వామి నివాసమగు దక్షారామము దక్షిణ దిక్కునందున్న కాశీనగరమే. కృతార్థమగు భూమండలమును రక్షించు మణియగు ఆ నగరమును పొగడుట బ్రహ్మకైనను వశమగునా?

సీ॥ భీమేశ్వరేశ్వర శ్రీమహాదేవుండు
హిమధామ మౌళి విశ్వేశ్వరుండు;
సప్తగోదావర సలిల ప్రవాహంబు
సాక్షాత్కరించిన జహ్నుకన్య;
తిరుచుట్టుమాలెలో తిరమైన గణపతి
యేకాంత ఢుంఠి విఘ్నేశ్వరుండు;
దక్షిణంబుననున్న దండపాణీశుఁ డూ
హింపంగ దండపాణీశ్వరుండు;

తే॥ భైరవ స్వామి శ్రీకాలభైరవుండు;
నంది నందీశ్వరుండేమి సందియంబు;
దక్షవాటంబు కాశికా స్థలము కాదె
తీవ్రకరతేజ! సత్యవతీ తనూజ! 31

**అర్థము** :- తీవ్రకర=వేడియగు కిరణములుగల సూర్యుని, తేజ=తేజస్సువంటి తేజస్సుగలవాడా! సత్యవతీ తనూజ=సత్యవతీ కుమారా! వ్యాసమహర్షీ!

భీమేశ్వర+ఈశ్వర=భీమేశ్వరస్వామియను, శ్రీమహాదేవుండు=శ్రీ మహేశ్వరుడే, హిమధామ=(చల్లని కిరణములుగల) చంద్రుడు, మౌళి=శిరస్సునందుగల, విశ్వేశ్వరుండు= విశ్వనాథ స్వామి;

సప్తగోదావర=సప్తగోదావరములోని, సలిల ప్రవాహంబు=జల ప్రవాహమే, సాక్షాత్క రించిన=ప్రత్యక్షమైన, జహ్నుకన్య=జహ్నుని పుత్రికయగు గంగ;

తిరుచుట్టుమాలెలో=ఆలయ ప్రదక్షిణ మార్గములో, తిరమైన=స్థిరముగానున్న, గణపతి=వినాయకుడే, ఏకాంత=ఒంటరిగానున్న, డుంఠి విఘ్నేశ్వరుండు=డుంఠి విఘ్నేశ్వరుడు;

దక్షిణంబునన్=దక్షిణపు దిక్కులో, ఉన్న=ఉన్నట్టి, దండపాణీశుఁడు=దండపాణి స్వామియే, ఊహింపంగన్=ఊహచేయగా, దండపాణీశ్వరుండు=దండపాణి స్వామి;

భైరవస్వామి=భైరవదేవుడే, శ్రీకాలభైరవుండు=శ్రీ కాలభైరవుడు, నంది=నందియే, నందీశ్వరుండు=నందీశ్వరుడు, (పై విషయములలో), ఏమి సందియంబు=సందేహ మేమున్నది? దక్షవాటంబు=దక్షారామము, కాశీకాస్థలము=కాశీస్థానము, కాదె=కదా!

**భావము** :- సూర్యతేజా! వ్యాసమహర్షీ! దక్షారామములోనున్న భీమేశ్వరస్వామియే కాశీలోనున్న విశ్వనాథస్వామి. సప్తగోదావర ప్రవాహమే ప్రత్యక్షముగా నున్న గంగానది; ఆలయ ప్రదక్షిణమార్గములో పశ్చిమ గోపురము కడనున్న మందిరములోగల ఏకాంత గణపతియే డుంఠి విఘ్నేశ్వరుండు. ఆలయమున దక్షిణ దిక్కుననున్న దండపాణీశ్వరుడే దండపాణి; ఇచటనున్న భైరవుడే అచటి భైరవుడు. ఈ నందీశ్వరుడే ఆ నందీశ్వరుడు. ఈ విషయములో సందేహము లేదు. దక్షారామమే కాశీక్షేత్రము గదా!

**విశేషము** :- కాశీక్షేత్రములోగల ప్రధాన దేవతలు దక్షారామములోనున్నారు. కావుననే ఇది దక్షిణ కాశియనదగును.

వ॥ మఱియు భీమేశ్వర మండలమునకు సీమావిభాగంబు. 32

**అర్థము** :- మఱియున్=ఇంకను, భీమేశ్వరమండలమునకు=భీమేశ్వర భూఖండము నకు, సీమావిభాగంబు=సరిహద్దుల విభజనము.

**భావము** :- భీమమండలమునకు సరిహద్దుల నిర్ణయమీ క్రింది విధముగానున్నది.

తే॥ జంభరిపు దిక్కునకు సీమ సలిలరాశి;
పశ్చిమమునకు సీమ త్ర్యంబక తనూజ;
ద్యుమ్నపతి దిక్కునకు సీమ తుల్యభాగ;
దక్షిణమునకు వృద్ధ గౌతమియె సీమ. 33

అర్థము :- జంభరిపు=(జంభుడను రాక్షసునకు శత్రువగు) నింద్రునిదగు, దిక్కునకు= దిక్కునకు - తూర్పునకు, సీమ=పొలిమేర, సలిల రాశి=(జలరాశి) సముద్రము, పశ్చిమము నకు=పడమటి దిక్కునకు, సీమ=సరిహద్దు, త్ర్యంబక తనూజ=(త్ర్యంబకేశ్వర పర్వతము నుండి పుట్టినది) గోదావరి, ద్యుమ్నపతి=(ధనపతి) కుబేరునిదగు, దిక్కునకున్=ఉత్తర దిక్కునకు, సీమ=సరిహద్దు, తుల్యభాగ=తుల్యభాగానది, దక్షిణమునకున్=దక్షిణ దిక్కునకు, సీమ=సరిహద్దు, వృద్ధ గౌతమియె=వృద్ధ గోదావరియె.

భావము :- భీమమండలమునకు తూర్పు దిక్కునందలి సరిహద్దు సముద్రము. పశ్చిమ దిక్కునందలి సరిహద్దు గోదావరీ నది. ఉత్తర దిక్కునందలి సరిహద్దు తుల్యభాగానది. దక్షిణమునందలి సరిహద్దు వృద్ధగోదావరీనదియే.

విశేషము :- "ఈ పద్యమునఁబేర్కొనిన ప్రాక్పశ్చిమ దిక్సీమలగు సలిల రాశియు గౌతమియు సమానములే. ఉత్తరమున తుల్యభాగ సీమయనుటచే, తుల్యభాగాతీరమునకు సమీపమునందున్న కుమారారామ భీమేశ్వరుఁడను కొనిన సరిపడును. దక్షిణమునకు వృద్ధ గౌతమి సీమయనుట యంతగ సరిపడునట్లు గానరాదు. వృద్ధ గౌతమీ సాగర సంగమము తూర్పుదిక్కునకే చేరినదగును. ఇఁక వృద్ధ గౌతమీ శాఖా ప్రారంభము మాత్రము దక్షిణ దిక్కునకుఁజెందినదయి యుండుటచే సరిపెట్టుకొనవలెను." చి.పా.శా. పీఠిక-పు-75, 76.

ఈ సీమా విభాగము 5-77యందు, 5-89యందు, 6-14యందు కూడ వచ్చును.

తే॥ భోగ మోక్ష మహైశ్వర్యయోగ కాంక్ష
భీమ మండలిఁ గాపుండఁ బ్రియము పుట్ట
మర్త్య యోని జనింపంగ మది దలంత్రు
వివిధ గంధర్వ కిన్నర విబుధ వరులు. 34

అర్థము :- భోగ.....కాంక్ష, భోగ=భోగములందు, మోక్ష=మోక్షమునందు, మహా+ఐశ్వర్య =గొప్పదగు నైశ్వర్యమునందు, యోగ=యోగమునందు, కాంక్షన్=కోరికతో, వివిధ.....వరులు; వివిధ=పలురకములైన, గంధర్వ=గంధర్వులలో, కిన్నర=కిన్నరులలో, విబుధ వరులు= దేవతలలో శ్రేష్ఠులు, భీమమండలిన్=భీమమండలములో, కాపుండన్= కాపురముండుటకు,

ప్రియము=కోరిక, పుట్టన్=కలుగగా, మర్త్యయోనిన్=మానవ జాతిలో, జనింపన్=పుట్టుటకు, మదిన్=మనస్సులో, తలంత్రు=తలచుదురు.

భావము :- మానవలోక భోగములందు, మోక్షమునందు, మహైశ్వర్యమునందు యోగమునందు కోరిక కలుగుటచేత దేవలోకవాసులగు గంధర్వులు, కిన్నరులు, దేవశ్రేష్ఠులు భీమమండలములో కాపురముండ తీవ్ర కాంక్ష కలుగగా మానవ జాతిలో జన్మింప గోరుదురు.

విశేషము :- దేవలోకములో కేవలము సుఖమే తప్ప దుఃఖము ఉండదు. సుఖదుఃఖ ముల మిశ్రము మానవ జాతి. మానవులకే మోక్షము సులభము. దుఃఖానంతర మనుభవించి నప్పుడే సుఖము విలువ తెలియును. మానవ జాతిలో జనించుట, భీమమండలములో నివసించుట అను రెండును భోగమోక్షప్రదములు.

తే॥ భీమమండలికా పుణ్యభూమియందుఁ
దేజరిల్లెడు పంద్రెండు తీర్థములకు
జాతరలు సేయు నప్సర స్సతులతోడ
నాకమున నుండి యేతెంచి నముచి వైరి. 35

అర్థము :- నముచివైరి=(నముచియను రాక్షసుని శత్రువగు) ఇంద్రుడు, అప్సర స్సతులతోడన్=అప్సరఃస్త్రీలతోగూడ, నాకమున నుండి=స్వర్గలోకము నుండి, ఏతెంచి= వచ్చి, భీమమండలికా=భీమమండలములోని, పుణ్యభూమియందు=పవిత్ర ప్రదేశమునందు, తేజరిల్లెడు=వెలుగొందు, పంద్రెండు తీర్థములకు=పంద్రెండు పుణ్యక్షేత్రములకు, జాతరలు= యాత్రలు, చేయున్=చేయును.

భావము :- ఇంద్రుడు అప్సరసలతో గూడ స్వర్గలోకమునుండి వచ్చి పవిత్రమగు భీమమండలములో వెలుగొందు పంద్రెండు తీర్థములకు తీర్థయాత్రలు చేయును.

సీ॥ ఏడు రసాతల క్రోడంబులు విని
ర్భేదించి వెడలిన పెద్దవేల్పు;
మార్తాండుచే నభోమణిచేత రవిచేఁ బ్ర
తిష్ఠఁ బొందిన మహాదివ్యమూర్తి;
సప్తర్షులరుదేర సప్త గోదావరం
బవగాహనము చేసినట్టి ప్రోడ;
తొలు మామయగు దక్షు నెలఁదోట నడుచక్కి
విహరణం బొనరించు వేడ్కకాఁడు;

తే॥ విశ్వపతి భీమనాథేశ్వరేశ్వరుండు
కర్తయై యుండి భోగమోక్షములనిచ్చు
భక్త జనులకు నట్టి వైభవ పదంబు
మండనము మేదినికి భీమ మండలంబు. 36

అర్థము :- ఏడు=ఏడు సంఖ్యగల, రసాతల=భూమి క్రింది లోకముల యొక్క, క్రోడంబులు=మధ్యభాగములను, వినిర్భేదించి=చీల్చుకొని, వెడలిన=బయలుదేరిన, పెద్దవేల్పు=గొప్ప దేవుడును.

మార్తాండుచేన్=మృతమగు అండము నుండి జనించి నట్టియు, నభోమణిచేత= ఆకాశమునకు మణివలె నలంకారమైనట్టి, రవిచేన్=సూర్యునిచేత, ప్రతిష్ఠన్=నిలుపబడి పూజా సంస్కారమును, పొందిన=పొందినట్టి, మహాదివ్య మూర్తి=గొప్పది కాంతిమంతమునగు స్వరూపము గలవాడును.

సప్తర్షులు=ఏడుగురు మహామునులు, అరుదేరన్=తీసికొనిరాగా, సప్త గోదావరంబు= సప్త గోదావర సరస్సులో, అవగాహనము=స్నానము, చేసినట్టి=చేసినటువంటి, ప్రోఢ= సమర్థుడును;

తొలుమామ+అగు=మొట్టమొదటి మామయైన, దక్షు=దక్షుని యొక్క, ఎలఁదోటన్= లేతయగు తోటయందలి, నడుచక్కిన్=మధ్యప్రదేశములో, విహరణంబు+ఒనరించు= విహారముచేయు, వేడ్కకాఁడు=కోర్కిగలవాడును;

విశ్వపతి=ప్రపంచమునకు ప్రభువగు, భీమనాథ+ఈశ్వర+ఈశ్వరుండు= భీమనాథస్వామి, కర్త+ఐ+ఉండి=కర్తయగుచునుండి, భక్తజనులకు=భక్తులగు మానవులకు, భోగమోక్షములను=భోగములను మోక్షమును, ఇచ్చున్=ఇచ్చును. భీమమండలంబు= భీమమండలము. అట్టి=అటువంటి, వైభవ=విభవమునకు, పదంబు=స్థానమును, మేదినికిన్ =భూమికి, మండనంబున్=అలంకారమును, (ఐయున్నది).

భావము :- విశ్వపతియగు భీమనాథేశ్వరస్వామి భూమిక్రిందనున్న అతలాదులగు ఏడు పాతాళ లోకముల మధ్యభాగములను చీల్చుకొని ఆవిర్భవించిన గొప్పదేవుడు. మృతాండ సంభవుడును, ఆకాశాలంకారమునగు సూర్యునిచే ప్రతిష్ఠింపబడిన మహత్తర ప్రకాశముతో గూడిన స్వరూపముగలవాడు; గౌతమాదులగు సప్తమహర్షులు తీసికొనిరాగా సప్తగోదావరములో స్నానము చేసిన సర్వసమర్థుడు; తనకు మొట్టమొదటి మామగారగు దక్షుని యుద్యాన వనములో విహరించు కోరికగలవాడు; ఆయనయే కర్తగానుండి తన భక్తులకు భోగములను మోక్షమును నిచ్చుచుండును. భీమమండలము అట్టివైభవమునకు స్థానమును, భూమండలమునకు అలంకారమును నైయున్నది.

విశేషము :- సప్తాధోలోకములు 3-10 చెంత చెప్పబడినవి.

మార్తాండుడు :- సూర్యుని నామాంతరము. మృతమగు అండమునుండి జన్మించిన వాడు. మార్కండేయ పురాణములో ఈ విషయమై ఒక ఇతిహాసమున్నది.

హవిర్భాగములను దేవతల కందకుండ దైత్యులపహరించుటచే అదిత్యులార్తినొందిరి. పుత్రులగాపాడుటకై అదితి సూర్యునారాధించెను. ప్రత్యక్షమైన ఆయనను తన పుత్రునిగా జన్మించి దేవతల రక్షింపగోరెను. సూర్య కిరణములనుండి సుషుమ్న అను రశ్మి అదితి గర్భమున ప్రవేశించెను. గర్భవతి అయ్యును నుపవాసములు చేయుచుండగా కశ్యపుడు "ఉపవాసముతో నీగర్భమునందున్న అండమును మారణము చేయుదువా?'' అని మందలింపగా అదితికి కోపము వచ్చెను. ఆమె గర్భము నుండి అండము బయట పడెను. మృతమగునండము నుండి పుట్టినవాడే మార్తాండుడు.

సీ॥ ఎచ్చోటఁ దాఁబాఱె నిఱ్ఱి రూపముఁ దాల్చి
యతి సాధ్వసంబుతో నధ్వరంబు;
పాటిల్లె నెచ్చోట భాషా వధూటికి
నతి జుగుప్సితమైన యంగ వికృతి;
యెచ్చోట ముచ్చిచ్చు నేడేసి నాల్కలు
కొండ నాల్కలు దాఁకఁ గోఁత వడియె;
నెచ్చోట నులివేఁడి యెండఁ బండులు రాలి
పూషార్కు వదనంబు బోసి వడియె;
తే॥ దక్షుఁ డెచ్చోటఁ బొట్టేలి తలధరించెఁ;
జిందు వందయ్యె నెచ్చోట నిందుఁడనుచుఁ;
జెప్పుదురు వీరభద్ర విజృంభణంబు
భీమమండలి నుండు ప్రాఁబెద్ద మునులు. 37

అర్థము :- అధ్వరంబు=యజ్ఞము, ఎచ్చోటన్=ఎక్కడ, తాన్=తాను, ఇఱ్ఱి రూపమున్= జింక యొక్క ఆకారమును, తాల్చి=ధరించి, అతిసాధ్వసంబుతోన్=అధికమగు భయముతో, పాఱెన్=పారిపోయెనో; (ఆచోటిది).

ఎచ్చోటన్=ఎక్కడ, భాషావధూటికిన్=సరస్వతీదేవియను స్త్రీకి, అతిజుగుప్సితము+ ఐన=మిక్కిలి రోత గలిగించునదగు, అంగ వికృతి=అంగ వైకల్యము, పాటిల్లెన్=కలిగెనో; (ఆచోటిది).

ఏ+చోటన్=ఏ ప్రదేశములో, ముచ్చిచ్చున్=త్రేతాగ్నుల యొక్క, ఏడేసి నాల్కలు=ఏడు నాలుకలు, కొండ నాల్కలు=కొండ నాలుకలు, తాఁకన్=అంటునట్లుగా, కోఁతవడియెన్=కోయుటను పొందినవో (ఆచోటిది).

ఏ+చోటన్=ఏ ప్రదేశమునందు, నులివేఁడి=కొంచెము వేడిగల, ఎండన్= ఎండతో పాటు, పండులు=దంతములు, రాలి=రాలిపోయి, పూష+అర్కు=పూషుడు అను పేరుగల సూర్యుని యొక్క, వదనంబు=నోరు, బోసివడియెన్=బోసిపోయెనో (ఆచోటిది).

ఏ+చోటన్=ఏ ప్రదేశమునందు, దక్షుఁడు=దక్షుడు, పొట్టేలితలన్=గొఱ్ఱెపోతు తలను, ధరించెన్=తాల్చెనో, ఏ+చోటన్=ఎక్కడ, ఇందుఁడు=చంద్రుడు, చిందువందు+అయ్యెన్=క్షోభము నందెనో (ఆచోటు ఇది). అనుచున్=అనుచు, భీమమండలిన్= భీమమండలములో నుండు, ప్రాఁబెద్దమునులు=పురాతనులగు వృద్ధమునులు, వీరభద్ర విజృంభణంబున్=వీరభద్రుని సామర్థ్య ప్రకాశనమును, చెప్పుదురు=చెప్పుచుందురు.

భావము :- "యజ్ఞము మగ జింక రూపమును ధరించి మిక్కిలి భీతితో పరుగెత్తినది ఇచ్చటి నుండియే. సరస్వతీదేవికి మిక్కిలి రోతగలిగించు అంగవైకల్యము (ముక్కుతెగుట) కలిగినదిచ్చటనే. త్రేతాగ్నులలో ప్రతియొక అగ్ని యొక్క ఏడునాలుకలును కొండనాలుకవరకు కోతపడినదిచ్చోటనే. మిక్కిలి లేతఎండతోగూడిన పూష అను పేరుగల సూర్యుని దంతములు రాలి నోరుబోసి అయినది ఇక్కడనే. దక్షుడు గొఱ్ఱెపోతు తల ధరించినది ఇక్కడనే. చంద్రుడు క్షోభపడినది ఇక్కడనే." అని వీరభద్రస్వామి విజృంభణ వృత్తాంతమును భీమమండలములో నున్న ప్రాచీనులగు వృద్ధ మునులు క్రొత్తగా వచ్చినవారికి ఆయా ప్రదేశములను జూపుచు వివరించి చెప్పుచుందురు.

విశేషము :- దక్షయజ్ఞ ధ్వంసములో వీరభద్రుడుచేసిన ఈ విజృంభణము కాశీఖండమునందు కూడవచ్చును. (కాశీ - సప్తమ - 84, 85)

ఈ ఘట్టము చాల ప్రసిద్ధము. అనేక గ్రంథములందు వర్ణింపబడినది.

**వ. నీవు విశ్వేశ్వర దేవ విరచితావమాన మనశ్శల్యంబున దస్సి ఖిన్నుండవై యున్నవాఁడవు. నిన్ను విడిచి పోవుట నాకు నుచితంబు గాదు; నీవు నేనునుం గూడి ద్వాదశ పుణ్యక్షేత్ర యాత్రా ప్రసంగంబునఁ గుక్కుటేశ్వరదేవు దర్శింపంగలవార; మీవేళ దక్షారామంబునకు మగిడిపోదము; లెమ్మని యతండును దానును లోపాముద్రయును శిష్యమండలంబునుం గదలి యిష్టాలాపంబులం బ్రొద్దుపుచ్చుచుం జనిచని.**

అర్థము :- నీవు=నీవు, విశ్వేశ్వర .... శల్యంబునన్, విశ్వేశ్వరదేవ=విశ్వనాథస్వామిచేత, విరచిత=కల్పింపబడిన, అవమాన=అవమానమనెడి, మనశ్శల్యంబునన్=మనస్సులోని ముల్లు (బాధ) చేత, డస్సి=అలసి, ఖిన్నుండవు+ఐ+ఉన్నవాఁడవు=దీనుడవైయున్నావు; నిన్నున్=నిన్ను, విడిచిపోవుటకు=విడచి వెళ్ళుటకు, నాకున్=నాకు, ఉచితంబు=తగినది, కాదు=కాదు; నీవున్=నీవును, నేనునున్=నేనుగూడ, కూడి=కలసి, ద్వాదశ .... ప్రసంగంబునన్. ద్వాదశ=పండ్రెండయిన, పుణ్యక్షేత్ర=పవిత్రములగు క్షేత్రములను గూర్చి, యాత్రా=ప్రయాణము యొక్క, ప్రసంగంబునన్=(సంబంధముతో) సంభాషణముతో; కుక్కుటేశ్వర=కుక్కుటేశ్వరుడను, దేవున్=దేవుని, దర్శింపగలవారము=దర్శనము చేయగలము. ఈవేళన్=ఈనాడు, దక్షారామంబునకున్=దక్షారామమునకు, మగిడిపోవుదము=తిరిగిపోవుదము, లెమ్ము=లెమ్ము; అని=అని, అతండును=ఆ వ్యాసుడును, తానును=అగస్త్యుడును, లోపాముద్రయును=లోపాముద్రయు, శిష్యమండలంబును=శిష్యుల సమూహమును, కదలి=బయలుదేరి, ఇష్ట+ఆలాపంబులన్=ప్రియమైన సంభాషణములతో, ప్రొద్దు పుచ్చుచున్=కాలము గడపుచు, చని+చని=వెళ్ళివెళ్ళి.

భావము :- వ్యాసమహర్షీ! విశ్వేశ్వరస్వామి చేసిన అవమానముచే గలిగిన బాధతో అలసి దీనుడవైయున్నావు. అట్టి నిన్ను విడచి వెళ్ళుట నాకు తగదు. మనమిద్దరము ద్వాదశ పుణ్యక్షేత్ర యాత్రలో కుక్కుటేశ్వర స్వామిని దర్శింపగలము. ఈనాడు దక్షారామమునకే తిరిగి వెళ్ళుదము. లెమ్ము.'' అని వ్యాసమహర్షియు, నగస్త్యుడును, లోపాముద్రయు, శిష్యసమూహమును బయలుదేరి ఇష్ట సంభాషణములతో కాలముగడుపుచు వెళ్ళివెళ్ళి.

విశేషము :- ద్వాదశ పుణ్యక్షేత్రములు ఈ ఆశ్వాసములోని 74వ పద్యములో గల ద్వాదశ తీర్థములేయగును. ఇవి దక్షారామమునకు 8 దిక్కులందును తీర్థములు, లింగములు గలగియున్నవి.

సీ. తుల్యభాగాతటీ ద్రుమమండితంబైన
సాంపరాయ పురంబు సరణిఁబట్టి;
చూతాటవీవాటి శోభమానంబైన
పులిగుర్త సోమేశు వలపలించి;
యోంకారపురిఁ ద్రికూటోపరిస్థితులైన
హరిహరబ్రహ్మల నభినుతించి;
శీలా మహాగ్రామ సింహాసనస్థున
కురగ హారున కెదురుండి మ్రొక్కి;

తే. యరుగువారు మునుల్పరాశర సుతునకు
దక్షవాటిఁ బ్రవేశింపఁ దగిన యట్టి
శుభ ముహూర్తంబునకుఁ గాలశుద్ధిఁ దెలియఁ
దలఁచి కూర్చుండి రొక వివిక్త స్థలమున. 39

అర్థము :- తుల్య .... ఐన. తుల్యభాగా=తుల్యభాగయను పేరుగల నది యొక్క, తటీ=ఒడ్డునందలి, ద్రుమ=చెట్లచేత, మండితంబు+ఐన=అలంకరింపబడిన, సాంపరాయ పురంబు=సాంపరాయ పట్టణము యొక్క, సరణిన్+పట్టి=త్రోవపట్టి.

చూత .... ఐన; చూత=మామిడిచెట్ల యొక్క, అటవీ=అడవివలె నున్న, వాటి= తోటలతో, శోభమానంబు+ఐన=వెలుగొందుచున్న, పులిగుర్త సోమేశున్=పులిగుర్త సోమేశ్వర స్వామిని, వలపలించి=కుడివైపు ఉండునట్లుచేసి.

ఓంకారపురిన్=ఓంకార పట్టణములోని, త్రికూట+ఉపరి=త్రికూట పర్వతముపై, స్థితులు+ఐన=ఉన్నవారైన, హరిహర బ్రహ్మలన్=విష్ణు శివ బ్రహ్మలను, అభినుతించి= స్తోత్రము చేసి.

శీలా .... స్థునకున్. శీలామహాగ్రామ=శీలయను పేరుగల పెద్ద గ్రామములోని, సింహాసన స్థితునకున్=సింహాసనముపైన నున్న, ఉరగహారునకు=సర్పములే హారముగా గల శివునకు, ఎదురుండి-ఎదురు+ఉండి=ఎదుట నుండి, మ్రొక్కి=నమస్కరించి,

అరుగువారు=వెళ్ళునట్టి, మునుల్=మునులు, పరాశరసుతునకు=(పరాశర మహర్షి పుత్రుడగు) వ్యాసునకు, దక్షవాటిన్=దక్షారామములో, ప్రవేశింపన్=ప్రవేశించుటకు, తగిన+అట్టి=యోగ్యమగు, శుభముహూర్తంబునకున్=మంచి ముహూర్తమునకు, కాలశుద్ధిన్=పవిత్ర సమయమును, తెలియన్+తలఁచి=తెలిసికొనగోరి, ఒక=ఒక, వివిక్త స్థలమునన్=పవిత్రమైన ప్రదేశము నందు, కూర్చుండిరి=కూర్చుండిరి.

భావము :- తుల్యభాగా నదీతీరమునందలి వృక్షములచే నలంకృతమగు సాంపరాయ పట్టణపు త్రోవను బట్టియు, మామిడి తోటలతో శోభిల్లుచున్న పులిగుర్త సోమేశ్వర స్వామివారి ఎడమవైపు నుండి ప్రయాణించియు, ఓంకార పట్టణమునందలి త్రికూట పర్వతముపైనున్న బ్రహ్మ విష్ణు మహేశ్వరులను స్తోత్రముచేసియు, శీలా మహాగ్రామము నందలి మహా సింహాసనముపై గల పరమేశ్వరున కెదురుగా నుండి నమస్కరించియు వెళ్ళునట్టి మునులు వ్యాసమహర్షి దక్షారామమునందు ప్రవేశించుటకు దగిన ముహూర్తమునకు కాలశుద్ధిని (పవిత్ర సమయమును) తెలిసికొనదలచి ఒక విజన ప్రదేశమునందు గూర్చుండిరి.

విశేషము :- సాంపరాయపురము అనగా కాకినాడ ప్రాంతము నందలి నేటి 'సంపర'

ఓంకారపురి యన్నను, ఓంక్రియానగరమన్నను రామచంద్రపుర ప్రాంతము నందున్న నేటి 'ఓదూరు.'

తుల్యభాగ అనునది ధవళేశ్వరము యొద్ద గౌతమి నుండి చీలిన నదీశాఖ.

శీలా మహాగ్రామము అనగా కాకినాడ ప్రాంతము నందలి 'శీల' అను ఊరు.

**వ॥ అప్పుడు కాలశుద్ధి విమర్శించి మైత్రావరుణుండు పరాశరసుతున కిట్లనియె. 40**

**అర్థము** :- అప్పుడు=ఆ సమయమునందు, కాలశుద్ధిన్=సమయ పవిత్రతను, విమర్శించి=శోధించి, మైత్రావరుణుండు=అగస్త్యుడు, పరాశరసుతునకు=వ్యాసునితో, ఇట్లు= ఈవిధముగా, అనియెన్=అనెను.

**భావము** :- అప్పుడు అగస్త్య మహర్షి కాలశుద్ధిని శోధించి వ్యాస మహర్షితో నిట్లనెను.

**విశేషము** :- మైత్రావరుణుడు. అగస్త్యుడు, వసిష్ఠుడు - వీరిద్దరును, మైత్రావరుణులే. కుంభసంభవులే. మిత్రావరుణులు మార్గమునందు వచ్చుచు ఊర్వశిని జూచిరి. వారికి వీర్యస్ఖలనము జరిగెను. ఊర్వశి ఆ యిరువురి తేజస్సును కుంభమునందుంచెను. అందుండి ఆ మహర్షులిరువురు జనించిరి. ఊర్వశి ప్రయత్నమునవారు జన్మించుటచే ఔర్వశేయులు నగుచున్నారు.

**తే॥ "గార్గ్య సిద్ధాంత మత ముషఃకాలకలన;**
**శకున మూనుట యది బృహస్పతి మతంబు;**
**విప్రజన వాక్య మరయంగ విష్ణుమతము;**
**సర్వసిద్ధాంత మభిజిత్తు సమ్మతమగు. 41**

**అర్థము** :- ఉషఃకాలకలన=వేకువ సమయము నెఱుగుటయే -(చేయుటయే) గార్గ్య=గార్గ్యుని యొక్క, సిద్ధాంత=నిశ్చితమగు, మతము=అభిప్రాయము, శకునము= నిమిత్తమును - (శుభసూచకమగు దానిని), ఊనుట+అది=అవలంబించుట యనునది, బృహస్పతి=బృహస్పతి యొక్క, మతంబు=సిద్ధాంతము, అరయంగన్= పరిశీలింపగా, విప్రజన=బ్రహ్మణుల యొక్క, వాక్యము=మాట, విష్ణుమతము=విష్ణువను స్మృతికర్త అభిప్రాయము, అభిజిత్తు=విజయ ముహూర్తము, సర్వసిద్ధాంతము=అందరి నిశ్చయమై, సమ్మతము=అంగీకరింపబడినది, అగున్=అగును.

**భావము** :- పురప్రవేశమునకు వేకువ జాము సమయము తగిన ముహూర్తమని గార్గ్య మహర్షి నిశ్చితాభిప్రాయము. శుభశకునము నవలంబించుట బృహస్పతి అభిప్రాయము.

బ్రాహ్మణుడు ఇది మంచి సమయమని చెప్పుట ముహూర్తమని విష్ణువను స్మృతికర్త అభిప్రాయము. అభిజిత్తు అందఱు నామోదించిన యోగ్య సుముహూర్తము.

విశేషము :- అభిజిత్తు :- మధ్యాహ్నము గం. 11.45 నుండి 12.30 వఱకుగల సమయమును అభిజిన్ముహూర్తమందురు. పగటిలోని ఎనిమిదవ ముహూర్తము. దీనిని విజయముహూర్తమందురు.

ఉషశ్శశంస గార్గ్యస్తు శకునంతు బృహస్పతిః
మనోజవంతు మాండవ్యః విప్రవాక్యంజనార్దనః

అని సంప్రదాయములో వినబడుచున్న శ్లోకము.

ఇందు మాండవ్యుడు మనోజవము ప్రశస్తము అన్నట్లు గలదు.

మంచనశర్మ టిట్టిభ సెట్టియను చెలికానితో ఏకశిలా నగర ప్రవేశముహూర్తమును నిర్ణయించుచు చెప్పిన పద్యమొకటి క్రీడాభిరామములో ఇటువంటిదే కలదు.

గార్గ్య సిద్ధాంతమతముషః కాలకలన;
శకునమూనుట యది బృహస్పతి మతంబు;
వ్యాసమతము మనః ప్రసాదాతిశయము;
విప్రజన వాక్య మరయంగ విష్ణుమతము (66)

భీమఖండ పద్యములోని మూడు పాదములిందు సమములు.

ఈ సందర్భమున సంస్కృత భీమఖండము నందున్న శ్లోకమిది -
ఉషస్స్యాద్గార్గి సిద్ధాంత శ్శకునంతు బృహస్పతేః
త్వన్మతం చిత్తనైర్మల్యం విప్రవాక్యం హరేర్మతమ్ 9-6

**తే॥ అసుర పురముల సాధించె నంధకారి;**
**యమర పాథోధి మథియించి రమరవరులు;**
**దివ్య సింహాసనం బెక్కె దివిజ భర్త**
**సిద్ధ మధ్యాహ్న వేలాభిజిత్తునందు. 42**

అర్థము :- సిద్ధ.....అందు; సిద్ధ=సఫలమగు, మధ్యాహ్న వేలా=మధ్యాహ్న సమయమునందలి, అభిజిత్తునందు=అభిజిత్తు (విజయ) మహూర్తమునందు, అంధకారి= (అంధకుడను రాక్షసునకు శత్రువగు) శివుడు, అసురపురములన్=త్రిపురాసురల పట్టణములను, సాధించెన్=సాధించెను; అమరవరులు=దేవశ్రేష్ఠులు, పాథోధిన్= సముద్రమును; అమరన్=ఒప్పునట్లుగా, మథియించిరి=చిలికిరి, దివిజ భర్త=ఇంద్రుడు, దివ్య=పవిత్రమగు, సింహాసనంబు=సింహాసనమును, ఎక్కెన్=అధిష్ఠించెను.

భావము :- మధ్యాహ్న సమయాన వచ్చు సఫలమగు అభిజిల్లగ్నమునందు పరమ శివుడు త్రిపురాసుర సంహారమొనర్చెను. అదే లగ్నమున దేవతలు సముద్ర మథనము నారంభించిరి. ఆ శుభలగ్నముననే ఇంద్రుడు దేవరాజ్య సింహాసనము నధిష్ఠించెను. (అంత మందికి మేలు గలిగించిన అభిజిల్లగ్నము వ్యాసునకు దక్షారామ ప్రవేశమున క్షేమకరమని అగస్త్య మహర్షి అభిప్రాయము.)

విశేషము :- త్రిపురాసుర సంహారము, సముద్ర మథనము ఈ గ్రంథములో చతుర్థాశ్వాసమున నున్నవి.

వ॥ ఇంకనొక్క విచారంబు. 43

అర్థము :- ఇంకన్=మఱియు, ఒక్క=ఇంకొక్క, విచారంబు=ఆలోచనము.

భావము :- మఱియొక ఆలోచన చెప్పెదను. వినుము.

తే॥ నాభిమండలమిచ్చోటు నడుము గాన
భీమమండలికా పుణ్యభూమినెల్ల
నిచ్చటననుండి వీక్షింతమే మునీంద్ర!
యాకసంబెక్కి యోగవిద్యాబలమున. 44

అర్థము :- ముని+ఇంద్ర=మునిశ్రేష్ఠా! నాభిమండలము=నాభివలయుమగు, ఈ+చోటు=ఈ ప్రదేశము, నడుము కాన=మధ్యమగుటచేత, భీమమండలికా= భీమమండల మనెడి, పుణ్యభూమిన్=పవిత్రమగు భూమిని, యోగవిద్యా బలమునన్=యోగవిద్యవలన గలుగు బలముతో, ఆకసంబు=ఆకాశమును, ఎక్కి=ఎక్కి, ఇచ్చటన నుండి=ఈ ప్రదేశము నుండియే, వీక్షింతమే=చూతమా?

భావము :- వ్యాసమునీంద్రా! దక్షారామ భూమండలమునకు నాభివంటి ఈ ఓంకార పురప్రాంతము మధ్య ప్రదేశము కావున నిక్కడనుండి యోగ విద్యాబలముతో ఆకసమునకెగిరి భీమమండల పుణ్యభూములను చూతమా?

క॥ భద్రగతి నేను లోపా
ముద్రయు నిర్ణిద్ర యోగ ముద్రాశక్తిన్
రుద్ర విహారాలయము స
ముద్రముతోఁ గూడఁజూతు మో మునివర్యా! 45

అర్థము :- ఓ మునివర్యా!=ఓ మునిశ్రేష్ఠా! నేనున్=నేనును, లోపాముద్రయున్= లోపాముద్రయును, నిర్ణిద్ర=వికాసమునందిన, యోగముద్రా=యోగవిద్యా రహస్యము యొక్క,

శక్తిన్=సామర్థ్యముచేత, భద్రగతిన్=శ్రేష్ఠమగు గమనముతో, రుద్ర=శివుని యొక్క, విహార=విహరించుటకు, ఆలయము=స్థానమగు భీమమండలమును, సముద్రముతోన్+కూడన్=సముద్రముతో గూడ, చూతుము=చూచుచుందుము.

భావము :- వ్యాస మహర్షీ! ప్రతిదినము నేనును, లోపాముద్రయును చక్కగా నభ్యసింపబడిన యోగవిద్యారహస్య శక్తితో దక్షారామమును సముద్రమును జూచుచుందుము.

విశేషము :- యోగాభ్యాసులకు ఆకాశగమనము సులభమని పాతంజల యోగదర్శన మిట్లు పలుకుచున్నది.

సూ : కాయాకాశయోః సంబంధ సంయమాల్లఘు తూల సమాపత్తే శ్చాకాశగమనమ్. విభూతి పాదము. సూ. 42.

శరీరాకాశముల సంబంధమునందు సంయమము చేయుటచేతను, దూది మున్నగు తేలిక వస్తువునందు సంయమము చేయుట చేతను ఆకాశగమన శక్తి లభించును.

శరీరమునకు ఆకాశమునకు గల సంబంధమును సంయమముతో పూర్తిగా ప్రత్యక్ష మొనర్చుకొన్న తరువాత యోగి ఈ తత్త్వమును చక్కగా నెఱుగును. శరీరములోని అవయవ ములు సూక్ష్మస్థితి నుండి స్థూలస్థితికి పరిణతములగుటయు మరల స్థూలము నుండి సూక్ష్మములగుటయు అనుభవపూర్వకముగ నెఱుగును. కావున నాతడు స్వశరీరమును మిక్కిలి తేలిక చేసికొని కావలసినచోటికి ఆకాశ గమనము చేయగలుగును.

**తే॥ ఇపుడు ఘటికాద్వయంబయ్యె నినుఁడు పొడిచి**
**దవ్వుచాలదిచ్చోటికి దక్షవాటి**
**కేవలము మంచి నడకైనఁ గీసవెల్తి**
**రెండు జాములు; నిట నూరకుండనేల? 46**

అర్థము :- ఇపుడు=ఇప్పుడు, ఇనుఁడు=సూర్యుడు, పొడిచి=ఉదయించి, ఘటికా ద్వయంబు=రెండు గడియలు(48 ని.లు.), అయ్యెన్=అయినది, ఈ+చోటికిన్=ఈ ప్రదేశము నకు, దక్షవాటి=దక్షారామము, దవ్వు=దూరము, చాలదు=తగినంత లేదు, మంచినడక+ఐనన్=వేగముగా నడచినను, (దూరము), రెండు జాములు=8 గంటలు, కీస=కొంచెము, వెల్తి=తక్కువ అని, కేవలము=నిర్ణీతమైనది, ఇటన్=ఇక్కడ, ఊరక=వ్యర్థముగా, ఉండన్+ఏల=ఉండుట ఎందులకు.

భావము :- సూర్యోదయమై ఇప్పటికి రెండుగడియలైనది. దక్షారామము ఇక్కడికి ఎక్కువ దూరము లేదు. బాగుగా నడచినచో రెండు జాములు కాలము పట్టదు. కావున నిక్కడ ఊరకుండుట ఎందులకు?

వ॥ ఈ యోంకార పుణ్యక్షేత్రంబునం ద్రికూట దివ్య భవన వాటంబున ముని సంఘంబు లుండునది; మనము నభోమండలంబున కెగసి ముహూర్త మాత్రంబునం గన్నుల పండువుగా భీమమండలీ పుణ్యక్షేత్రంబు గనుగొంద" మనుటయుఁ; బా రాశర్యుండు సబహుమానంబుగా సమ్మతించిన. 47

అర్థము :- ఈ+ఓంకార పుణ్యక్షేత్రంబునన్=ఓంకారేశ్వరమను పేరుగల ఈ పవిత్ర క్షేత్రములోనున్న, త్రికూట దివ్య భవనవాటంబునన్=త్రికూటమను పేరుగల దివ్యమగు భపన సమూహమునందు, మునిసంఘంబులు=మునుల సమూహములు, ఉండునది= ఉండవలెను. మనము=మనము, నభోమండలంబునకు=(వలయాకారముగల) ఆకసము నకు, ఎగసి=ఎగిరి, ముహూర్తమాత్రంబునన్=కొంచెముసేపు - (పంద్రెండు క్షణముల మాత్రములో), కన్నుల పండువుగాన్=నేత్రానందకరముగా, భీమమండలీ పుణ్యక్షేత్రం బున్=భీమమండలము అను పవిత్ర ప్రదేశమును, కనుగొందము=చూతము, అనుటయున్= అనగా, పారాశర్యుండున్=వ్యాస మహర్షి, సబహుమానంబుగాన్=సగౌరవముగా, సమ్మతించి నన్=అంగీకరింపగా (తరువాతి పద్యముతోనన్వయము)

భావము :- మనతో వచ్చిన ముని సమూహమంతయు ఓంకారేశ్వరమను నీ పుణ్య క్షేత్రములో త్రికూటభవన సమూహము నందు నుండవలెను. అప్పుడు మనము (లోపాముద్రా గస్త్య వ్యాసులు) ఆకసములోనికెగసి స్వల్పకాలము నయనానందకరముగా భీమమండలమను పుణ్యక్షేత్రమును దర్శింతము'' అని అగస్త్య మహర్షి అనెను. అప్పుడు వ్యాసుడు ఆ ప్రతిపాదనమును గౌరవపూర్వకముగా నంగీకరించెను.

## వ్యాసాదు లాకసంబుననుండి భీమమండలంబు కనుంగొనుట :-

మ॥ పరమర్షుల్ భృతరోమహర్షులయి లోపాముద్రయుం దారు నం
బరమధ్యంబున నావహంబను జగత్ప్రాణ ప్రవాహంబుపైఁ
బరిలంఘించిరి భుక్తి ముక్తి రమణీ ప్రత్యగ్ర లీలా స్వయం
వర సౌధంబగు భీమమండలము సర్వంబున్ విలోకింపఁగన్. 48

అర్థము :- భుక్తి.....సౌధంబు ; భుక్తి=ఆహారము - (ఇహలోక సుఖము); ముక్తి= మోక్షము అనెడి, రమణీ=సుందరి యొక్క, ప్రత్యగ్ర=ప్రధానమగు, లీలా=విలాసయుక్తమగు,

స్వయంవర=తనకుదానుగా వరించుటకు, సౌధంబు=మేడ, అగు=అయిన, భీమ మండలము= భీమమండలమును, సర్వంబున్=సమస్తమును, విలోకింపఁగన్=చూచుటకై, పరమర్షుల్=మహర్షులు, భృతరోమహర్షులు=(శరీరములందు) నింపబడిన పులకరింతలు గలవారై, లోపాముద్రయున్=లోపాముద్రయును, తారున్=తామును, అంబరమధ్యంబు నన్=ఆకాశ మధ్య ప్రదేశమునందు, ఆవహంబు+అను=ఆవహము అను పేరుగల, జగత్ప్రాణ=వాయువు యొక్క, ప్రవాహంబుపైన్=వెల్లువపైన-(మీదికి), పరిలంఘించిరి= అధిరోహించిరి.

భావము :- భక్తి ముక్తులనెడి కాంత యొక్క నూతన లీలా స్వయంవరమునకు భవనమగు భీమమండలమునంతను విహంగమ దృష్టితో జూచుటకై మహర్షులు శరీరములు పులకింపగా లోపాముద్రా దేవితో గూడ ఆకాశమధ్యమునందుగల ఆవహము అను పేరుగల వాయు ప్రవాహము పైకేగిరి.

విశేషము :- భుక్తి ముక్తి అను పదములు సంస్కృతమున స్త్రీలింగములు. కావుననే భుక్తి ముక్తి రమణి యనుట చమత్కారము. భీమమండలము భుక్తి - ఇహలోక సుఖములను, ముక్తిని నొసంగును. స్వయంవరకాంతను జూచిన వరులకు శరీరములు పులకించును. భీమమండల దర్శనభావమే మహర్షులను పులకిత శరీరుల నొనర్చినది.

లోపాముద్ర :- "ముద్రాణాం తత్తన్మృగాదిజాతిగతానా మసాధారణానాం చిహ్నానాం కమనీయచక్షుష్ట్వాదీనాంలోప ఇవలోప స్తిరస్కారో యయాసా లోపాముద్రా".(మహాభారతము, వనపర్వము అధ్యా 96. శ్లో. 24. నీలకంఠ వ్యాఖ్య) మృగాదులగు నాయాజాతులలోగల అందమైన కన్నులు మొదలగు అసాధారణ సౌందర్య లక్షణములను లోపములనుగా జేయునది లోపాముద్ర. అనగా లేడికన్నులకన్న అందమైన కన్నులు మొదలగునవయవములు గలదని భావము

ఆవహము :-

ఆవహః ప్రవహశ్చైవ సంవహశ్చోద్వహస్తథా
వివహాఖ్యః పరివహః పరావహ ఇతిక్రమాత్.
సప్తైతే మారుతస్కంధా మహర్షిభి రుదాహృతాః
ఆవహోవర్తయేద్వాయుర్మేఘోల్కా వృష్టి విద్యుతః
వర్తయేత్ప్రవహశ్చైవ తథామార్తాండ మండలం
సంవహోమారుత స్కంధ స్తథాశీతాంశుమండలం,
వర్తయేదుద్వహశ్చాపి తథా నక్షత్రమండలం

పంచమోవివహాఖ్యశ్చ తథైవ గ్రహమండలం
సప్తర్షిచక్రం స్వర్గం గాంషష్ఠః పరివహస్తథా
పరావహస్తథా వాయుర్వర్తయే ధ్రువమండలమ్.
(వాల్మీకి రామాయణము. బాల. 47 సర్గ. 22 శ్లో. మహేశ్వర తీర్థీయము)

ఆవహము, ప్రవహము, సంవహము, ఉద్వహము, వివహము, పరివహము, పరావహము అనునవి ఏడును మారుతస్కంధములని మహర్షులుదాహరించిరి. ఆవహము అను వాయువు మేఘములను, ఉల్కలను, వర్షమును మెఱపులను వ్యాపించియుండును. ప్రవహమను వాయువు సూర్యమండలమును వ్యాపించి యుండును. సంవహమను వాయువు చంద్రమండలమునావరించి యుండును. ఉద్వహమను వాయువు నక్షత్రమండలమును వ్యాపించియుండును. ఐదవదగు వివహమను వాయువు గ్రహమండలము నావరించి యుండును. పరివహమను వాయువు సప్తర్షిమండలమును స్వర్గంగను (స్వర్గమును భూమిని) వ్యాపించియుండును. పరావహమను సప్తమ వాయువు ధ్రువమండలమును వ్యాపించి యుండును).

భూమికి దగ్గరగా - వర్షించు మేఘములున్నంత ఎత్తులో వ్యాపించియుండు వాయువు ఆవహము.

ఆవహములోనున్నప్పుడు భూమి, అందలి విశేషములు ఎట్లు కన్పించునో కాళిదాస మహాకవి అభిజ్ఞాన శాకుంతలములో 7వ అంకమునందు మాతలి దుష్యంత సంవాదములో వర్ణించెను.

అలంకారము :- రూపకము.

**వ॥ ఇవ్విధంబున నావహస్కంధ గంధవాహప్రవాహ మధ్యంబునఁదమ ప్రభావావష్టంభంబున నిలిచి, కుంభసంభవుండు బాదరాయణున కిట్లనియె. 49**

**అర్థము** :- ఈ+విధంబునన్=ఈవిధముగా, ఆవహస్కంధ=ఆవహస్కంధమను పేరుగల, గంధవాహ=వాయువు యొక్క, ప్రవాహ మధ్యంబునన్=ప్రవాహముయొక్క మధ్యలో, తమ=తమ యొక్క, ప్రభావ=మహిమ యొక్క, అవష్టంభంబునన్=ప్రాపుతో, నిలిచి= నిలువబడి, కుంభసంభవుండు=అగస్త్యుడు, బాదరాయణునకు=వ్యాసునితో, ఇట్లు= ఈవిధముగా, అనియెన్=అనెను.

**భావము** :- ఈవిధముగా ఆవహస్కంధమను వాయుప్రవాహ మధ్యమున తమ తపో మహిమతో నిలచి అగస్త్యుడు వ్యాసునితో నిట్లనెను.

సీ॥ అంధ్రభూ భువన మధ్యము పుండరీకంబు;
సప్తగోదావర జలము తేనె;
బ్రహ్మసంవేద్యాది బహుతీర్థములు రేకు;
లకరులు చారు దివ్యస్థలములు;
నాళంబు లవణాబ్ధి వేలావిభాగంబు;
కళ్యాణ భోగమోక్షములు తావి;
దక్షవాటీమహాస్థానంబు కర్ణిక;
హంసంబు భీమనాయకుఁడు శివుఁడు;

తే॥ గౌతమీ సింధు కౌంతేయ కణ్వనదులుఁ
దుల్యభాగయు నేలేరు దుమ్మికొనలు
భువన సంభావ్యమైన యీ పుణ్యభూమి
యనఘ! సంసార తాప శాంత్యౌషధంబు. 50

అర్థము :- అనఘ=పుణ్యాత్ముడా! అంధ్ర ..... మధ్యము. అంధ్రభూ=ఆంధ్రభూమి యనెడి; భువన మధ్యము=జగత్తు యొక్క మధ్యప్రదేశము, పుండరీకంబు=తెల్లని పద్మము; సప్తగోదావర జలము=సప్తగోదావరమను సరస్సులోగల నీరు; తేనె=తేనె.

బ్రహ్మసంవేద్య+ఆది=బ్రహ్మసంవేద్యము మున్నగు, బహుతీర్థములు=అనేక పవిత్ర స్థానములు, రేకులు=దళములు. చారు.....స్థలములు; చారు=అందమైన, దివ్యస్థలములు= దేవతలకు సంబంధించిన ప్రదేశములు, అకరులు=కింజల్కములు;

లవణ.....భాగంబు; లవణ+అబ్ధి=ఉప్పు సముద్రము యొక్క, వేలా=చెలియలి కట్ట అనెడి, విభాగంబు=భాగము; నాళంబు=తామర కాడ; కల్యాణ.....ములు; కల్యాణ= మంగళకరములగు, భోగ=ఇహలోక సౌఖ్యములు, మోక్షములు=ముక్తి అనునవి, తావి= సువాసన;

దక్ష.....స్థానంబు. దక్షవాటీ=దక్షారామము అనెడి; మహాస్థానంబు=గొప్ప పట్టణము; కర్ణిక=దుద్దు; భీమనాయకుఁడు=భీమేశ్వరుడను, శివుఁడు=శంకరుడు; హంసంబు=హంస;

గౌతమీ.....నదులున్. గౌతమీ సింధు=గోదావరీనది; కౌంతేయ=కౌంతేయ నది; కణ్వ నదులున్=కణ్వనామక నదులును, తుల్యభాగయున్=తుల్యభాగానదియును, ఏలేరున్=ఏలేరును; దుమ్మికొనలు=పాచి కొనలు; భువన=లోకములచేత, సంభావ్యము+ఐన =గౌరవింపదగిన, ఈ పుణ్యభూమి=ఈ పవిత్రమగు భూమి, సంసార.....ఔషధంబు.

సంసార=జనన మరణ రూపమగు సంసారము వలన కలుగు, తాప=దుఃఖము యొక్క, శాంతి=ఉపశమించుటకు, ఔషధంబు=తగినమందు.

భావము :- "అర్యా! ఆంధ్రభూమండల మధ్యము తెల్లని శతపత్ర పద్మము. సప్తగోదావర సరస్సులోగల జలము ఆ పద్మములోని మకరందము. బ్రహ్మసంవేద్యము మున్నగుననేక తీర్థములు ఆ పద్మమునకున్న రేకులు. పవిత్రమైన పుణ్యక్షేత్రములు కింజల్కములు. లవణ సముద్రతీరము తామరకాడ. మంగళకరములగు భోగమోక్షములే అందలి సుగంధము. దక్షారామమే దాని మధ్యమునగల దుద్దు. భీమేశ్వరస్వామి వారే రాజహంస. గోదావరి, కౌంతేయ, కణ్వనది, తుల్యభాగ, ఏలేరు అను నదులు ఆ పద్మము చుట్టుగల శైవాల లతా సముదాయము. సర్వలోకములచే పూజింపదగిన ఈ దేశము జనన మరణాదిరూపమగు సంసారమున గలుగు ఆధ్యాత్మికము, ఆధిదైవికము, ఆధిభౌతికము అను తాపత్రయము ఉపశాంతమగుటకు ఔషధము వంటిదగును.

విశేషము :- ఆకసము నుండి చూచునపుడు భూమిమీది బృహత్పదార్థములు స్వల్పరూపమున గన్పించును. ఆంధ్రదేశాభిమాన ప్రదర్శనమునకు ఊహావైదగ్ధ్యమునకు ఈ పద్యము ఈ గ్రంథమున ప్రథమోదాహరణము.

అలంకారము-రూపకము :

సీ॥ సర్వంసహకుఁ గాసె సమకట్టు పుట్టంబు;
గగనంబునకు నల్ల కలువసెజ్జ;
యవటంబు మేఘవాహను గంధ కరటికి;
నభ్యవహార మౌర్వాగ్ని శిఖకు;
వంటిల్లు యామినీశ్వర కళామౌళికిఁ;
దరిచోటు నిఖిల బృందారకులకుఁ;
గూట కచ్ఛప నాయకునకు నిశాంతంబు;
మరు జనకునకును మనికిపట్టు;

తే॥ ఘనతరోద్దండ పాఠీన కమఠ నక్ర
తిమి తిమింగిల చక్ర విక్రమ విహార
ఘుమఘుమారంభ గంభీర ఘోష ఘటిత
లట దిశాప్రతిశబ్దోపలబ్ధి యబ్ధి.

51

అర్థము :- ఘన.....లబ్ధి; ఘనతర=మిక్కిలి గొప్పవియు; ఉద్దండ=భయంకరమైనవి యునగు, పాఠీన=వేయి కోఱల చేపల; కమఠ=తాబేళ్ళ; నక్ర=మొసళ్ళ; తిమి=నూరు యోజనముల పొడవుగల చేపల; తిమింగిల=తిమిని మ్రింగెడు పెద్ద చేపల; చక్ర= సమూహము యొక్క, విక్రమ=పరాక్రమముతో గూడిన; విహార=సంచారముచేతను; ఘుమఘుమ= తరంగముల ధ్వనియొక్క; ఆరంభ=ప్రారంభముతో, గంభీర=(చెవులతో) గ్రహింపవీలుగాని, ఘోష=పెద్ద ధ్వనితో; ఘటిత=కూర్పబడిన లట - (రలయోరభేదః) రట= కలకలముతో; దిశా=అన్నివైపుల(నుండి వచ్చిన)దగు, ప్రతి శబ్ద=ప్రతిధ్వనులను; ఉపలబ్ధి=పొందుట గల; అబ్ధి=సముద్రము.

సర్వంసహకున్=భూమికి; కాసె=కాసెకోకగా; సమకట్టు=ఏర్పడిన, పుట్టంబు=వస్త్రము; గగనంబునకు=ఆకసమునకు; నల్లకలువ=నల్లకలువలతో(నేర్పరచిన), సెజ్జ=మెత్తని ప్రక్క;

మేఘవాహను=(మేఘములే వాహనముగాగల) ఇంద్రుని యొక్క; గంధకరటికిన్= మదించిన ఏనుగగు ఐరావతమునకు; అవటంబు=(ఏనుగులను పట్టుకొనుటకేర్పఱచిన) గొయ్యి; ఔర్వ=ఔర్వమను పేరుగల; అగ్నిశిఖకు=అగ్ని జ్వాలకు; అభ్యవహారము=ఆహారము;

యామినీ+ఈశ్వర=రాత్రికి ప్రభువగు చంద్రుని యొక్క; కళా=కళయే; మౌళికి= శిరస్సునగల శివునికి; వంట+ఇల్లు=వంట యిల్లు (శివుడందుండి వచ్చిన విషమును ఆహారమును జేసికొనెను గావున); నిఖిల=సమస్తమైన, బృందారకులకు=దేవతలకు; తరిచోటు=చిలుకుటగల ప్రదేశము (అమృతమునకై చిలికిరి కావున).

కూట కచ్ఛపనాయకునకున్=కపటపు - (పర్వతశిఖరము వంటి) ఆదికూర్మమునకు; నిశాంతంబు=ఇల్లు; మరుజనకునకున్=మన్మథుని తండ్రియగు విష్ణుదేవునకు; మనికిపట్టు=నివాసము.

భావము :- ఆ సముద్రములో మిక్కిలి పెద్దవియు భయంకరమైనవియునగు వేయి కోరల చేపలు, తాబేళ్ళు, మొసళ్ళు, తిములు, తిమింగిలములు గుంపులు గుంపులుగా గలవు. అవి విజృంభించి విహరించుటచేత మహత్తరమగు ధ్వని గలుగుచున్నది. ఉత్తుంగ తరంగముల ఘోష దానితో గలియుటచేత కలకలము గలిగి ప్రతిధ్వనించు చున్నది. అట్టి సముద్రము భూదేవికి కాసె కోకగా నేర్పఱచిన మెత్తని ప్రక్కవలెనున్నది. ఇంద్రుని వాహనమగు మదమత్తమగు నైరావతమునకు ఏర్పఱచిన పెద్ద గొయ్యివలెను, ఔర్వాగ్నికి ఆహారమునునై యున్నది. చంద్రశేఖరుడగు పరమేశ్వరునకు భోజనశాల వలెను, దేవతలకు పెరుగు త్రచ్చు ఇంటివలెను నున్నది. కపటరూపుడగు (పర్వత శిఖరతుల్యుడగు) ఆదికూర్మ స్వామికి ఇల్లును, శ్రీ మహావిష్ణువునకు నివాస స్థానమునైయున్నది.

విశేషము :- ఇందు లోకోత్తరమగు సూహ్రప్రపంచము సాక్షాత్కరించుచున్నది. అది ఉల్లేఖాలంకార రూపమున నభివ్యక్తమగుచున్నది. తేటగీతిలోని సుదీర్ఘ సమాసము సముద్ర వైశాల్యమునేగాక అందలి జలజంతువుల దైర్ఘ్యాదులను, భిన్న భిన్న ధ్వనుల సమ్మేళనమును వ్యక్తీకరించుచున్నది.

అలంకారము - రూపకము, ఉల్లేఖము

సీ॥ జనమేజయారబ్ధ సర్పాధ్వరాహూత
చక్షుశ్శ్రవ స్సహస్రములఁబోలి;
బ్రహ్మాండమండల ప్రాసాద సంభార
హరిమణిస్తంభ సంహతులనంగఁ;
జంభారి దోస్తంభ దంభోళి ఖండితాం
జనశైల శిఖర పుంజములఁబెనఁగి;
సంహారసమయ ఝుంఝూమారుతోద్ధూత
కాలాంబువాహ సంఘముల గెలిచి;

తే॥ యాడుచున్నవి తీండ్రిల్లి యంబరమునఁ;
జేయుచున్నవి త్రిభువనాశ్లేషకంబు;
నబ్జనాభుని తూఁగుటుయ్యేలలు గంటె
వేనవేలు పయోరాశి వీచిఘటలు. 52

అర్థము :- అబ్జనాభుని=పద్మము నాభియందుగల విష్ణుదేవునికి; తూఁగు+ఉయ్యేలలు=తూగుటుయ్యాలలగు; పయోరాశి=జలరాశియగు సముద్రమునందలి, వేనవేలు=వేలకు వేలు; వీచిఘటలు=తరంగముల సమూహములు.

జన.....సహస్రములన్; జనమేజయ=జనమేజయ మహారాజు చేత; ఆరబ్ధ=ప్రారంభింపబడిన; సర్ప+అధ్వర=సర్పయాగమునందు, ఆహూత=పిలువబడిన; చక్షుస్+శ్రవస్=(కన్నులే చెవులుగాగల) సర్పముల యొక్క, సహస్రములన్=వేలతో; పోలి=సమానమై.

బ్రహ్మాండ.....సంహతులు; బ్రహ్మాండ=బ్రహ్మాండముల యొక్క; మండల=సమూహమనెడి; ప్రాసాద=భవనముల యొక్క; సంభార=చక్కగా భరించు; హరిమణిస్తంభ=ఇంద్రనీల మణిస్తంభముల యొక్క; సంహతులు=సమూహములో; అనంగన్=అనగా;

జంభారి.....పుంజములన్; జంభ+అరి=(జంభుడను రాక్షసునకు శత్రువగు) ఇంద్రుని యొక్క, దోస్+స్తంభ=స్తంభమువంటి చేతియందలి, దంభోళి=వజ్రాయుధము చేత; ఖండిత=

నఱకబడిన; అంజనశైల=కాటుక కొండ యొక్క; శిఖర పుంజములన్=కొండ కొమ్ములతో; పెనఁగి=పెనుగులాడి;

సంహార.....సంఘములన్; సంహార సమయ=ప్రళయ కాలమునందలి; ఝంఝా మారుత=తుపాను గాలిచేత; ఉద్ధూత=ఎగుర గొట్టబడిన, కాల=ప్రళయకాలము నందలి; అంబువాహ=మేఘముల యొక్క, సంఘములన్=సమూహములను, గెలిచి=జయించి;

తీండ్రిల్లి=అతిశయించి; అంబరమునన్=ఆకాశములో; ఆడుచున్నవి= క్రీడించు చున్నవి; త్రిభువన=మూడులోకముల; ఆశ్లేషకంబు=కౌగలించుటను; చేయుచున్నవి= చేయుచున్నవి; కంటె=చూచితివా?

**భావము** :- విష్ణుదేవునికి తూగుటుయ్యాలలై సముద్రములో వేలకువేలుగానున్న తరంగ సమూహములు - జనమేజయ మహారాజు ప్రారంభించిన సర్పయాగములో ఋత్విక్కులు హోమము చేయుటకు పిలిచిన సర్పసమూహముల వలెనున్నవి. బ్రహ్మాండముల సమూహమనునట్టి భవనములను మోయు ఇంద్రనీల మణిస్తంభముల సముదాయమో అనునట్లున్నవి. ఇంద్రుడు స్తంభ సదృశమగు హస్తములోని వజ్రాయుధముతో ఖండించిన కాటుక కొండల శిఖరముల సమూహముతో పెనుగులాడుచున్నవి. సర్వలోక సంహార సమయమునందు విజృంభించు పెనుగాలులచే ఎగురగొట్టబడిన కాలమేఘ సముదాయములను గెలిచినవి. ఆ సముద్రతరంగములు అతిశయించుచు ఆకసములో నాడుకొనుచున్నవి. ముల్లోకములను కౌగలించుకొనుచున్నవి. చూచితివా?!

**విశేషము** :- తూర్పు సముద్రములో నిరంతరము ఎగసిపడు ఉత్తుంగ తరంగములు ఆకసము నుండి కన్పించు తీరును కవి రూపకోత్ప్రేక్షలతో పాఠకుల మనోరంగమున నిలుపుచున్నాడు.

జనమేజయుని సర్పయాగ వృత్తాంతము మహాభారతము ఆదిపర్వములో నున్నది.

అలంకారము - రూపకము.

**"కాశింజచ్చినఁయంతఁగాని పడయంగారాని కైవల్య మ**
**క్లేశంబై సమవేద్య నాయకునిచే లీలాగతిం జేరు రా**
**రో! శీఘ్రంబున మర్త్యులార!" యను నారూపంబున న్మ్రోయు నా**
**కాశాస్ఫాలన గౌతమీ జలధి సంఘస్థాన కల్లోలముల్.** 53

**అర్థము** :- మర్త్యులార=మనుజులారా! కాశిన్=కాశీ నగరములో; చచ్చిన+అంతన్+ కాని=మరణించిననే గాని; పడయంగా రాని=పొంద వీలులేని; కైవల్యము=మోక్షము; సమవేద్య

నాయకునిచేన్=సమవేద్యమునకు నాయకుడగు శివుని చేత; అక్లేశంబు+ఐ=ఎట్టి శ్రమలేనిదై; లీలాగతిన్=సులభమగు విధముగా, చేరున్=దొరకును; శీఘ్రంబునన్=త్వరగా; రారో=రండు; అను=అనునట్టి; ఆ రూపంబునన్=ఆ రీతితో; ఆకాశ.....కల్లోలముల్. ఆకాశ=ఆకసమును; ఆస్ఫాలన=రాచుకొనునట్టి; గౌతమీ=గోదావరి యొక్కయు, జలధి= సముద్రము యొక్కయు; సంఘస్థాన=కలిసిన ప్రదేశమందలి; కల్లోలముల్=తరంగములు; మ్రోయున్=ధ్వనిచేయు చుండును.

భావము :- "మానవులారా! కాశీలో మరణించినగాని లభింపని ముక్తి బ్రహ్మ సంవేద్య నాయకుడగు శివుని అనుగ్రహముచే సుఖముగా ఎట్టి శ్రమయు లేక లభించును. కావున రండు" అనుచున్న రీతిగా ఆకసమునంటు గోదావరీ సముద్ర సంగమములో నేర్పడుచున్న ఉత్తుంగ తరంగములు ధ్వనించుచున్నవి.

విశేషము :- తరంగములు చేతులుగ తరంగ ఘోష పిలుపుగ ఊహించుటచే అలంకారము ఉత్ప్రేక్ష; అతిశయోక్తి

మ॥ అదె సంవేద్యము; కోటిపల్లియదె; దక్షారామమన్పట్టణం
బదె; యభ్రంకష సౌధకూటఘనహేలావాస, ముచ్ఛ్రాయ సం
పద సొంపారెడు భీమలింగము, మహాప్రాసాద భూమీధరం
బిదె; సప్తర్షినదీ ప్రవాహమిదె; సంవీక్షింపు మేకాగ్రతన్. 54

అర్థము :- సంవేద్యము=సంవేద్యమను తీర్థము; అదె=అదియే; కోటిపల్లి=కోటిపల్లి; అదె=అదియే; దక్షారామము=దక్షారామము; అన్+పట్టణంబు=అను పేరుగల పట్టణము, అదె=అదియే; అభ్రంకష.....వాసము; అభ్రంకష=ఆకసమును ఒరిసికొను; సౌధ=మేడ యొక్క; కూట=శిఖరము నందలి; ఘన=మేఘములకు, హేలా+ఆవాస=విలాస నివాసము; ఉచ్ఛ్రాయ సంపదన్=సర్వోన్నతి యనెడు సంపదతో; సొంపారెడు= అందగించు; భీమలింగము=భీమేశ్వర లింగము (అందున్నది); మహాప్రాసాద=గొప్ప ఆలయముగల; భూమీధరంబు=పర్వతము; ఇదె=ఇదియే; సప్తర్షి నదీ ప్రవాహము=సప్త గోదావర ప్రవాహము; ఇదె=ఇదియే; ఏకాగ్రతన్=స్థిరమగు చిత్తముతో; సంవీక్షింపుము= చూడుము.

భావము :- వ్యాస మహర్షీ! అటు చూడుము. అదియే గౌతమీ సాగర సంగమ సమీపమునగల బ్రహ్మసంవేద్యమను క్షేత్రము. మఱియొక దెసజూడుము. అదియే సోమేశ్వర నిలయమగు కోటిపల్లి. అదిగో అదియే దక్షారామమను పట్టణము. అచ్చటి ఆలయములో మిక్కిలి ఎత్తయిన భీమేశ్వర లింగము విలసిల్లుచున్నది. ఆ దేవాలయముగల పర్వతము ఇదిగో! ఇదియే. సప్త గోదావరీ ప్రవాహము ఇదిగో! ఏకాగ్రమగు మనస్సుతో జూడుము.

విశేషము :- సంవేద్యాదులు చుట్టు ప్రక్కల దూరమున నుండుటచే "అదె" అను సర్వనామమును, దగ్గరగా నుండుటచేత మహాప్రాసాద భూమిధరాదులను "ఇదె" అను సర్వనామమును కవి ఉపయోగించెను.

సమవేద్యము - సంవేద్యము :- గౌతమీ నది సప్తశాఖలలో భారద్వాజ, గౌతమి ఒకే గౌతమీ శాఖగానున్నవి. కోటిపల్లి నుండి 16 కి.మీ. దూరములోగల సముద్రములో గలియు వఱకు ఇంజరము మొదలు సాగర సంగమము వఱకు భరద్వాజ్యంతర్భూత గౌతమియని వ్యవహరింపబడుచున్నది. 1. గౌతమి, 2. భారద్వాజ, 3. రేవ, 4. ఇంద్ర, 5. అహల్య అనునైదు తీర్థములు సంగమించుటచే ఈ ప్రదేశమును "తీర్థాల మొండి" యందురు. దీనికే సంవేద్యమని వ్యవహారము.

కోటిపల్లి :- దక్షారామమునకు ఒక యోజనము దూరములో గౌతమీ తీరమునన్న క్షేత్రము. ఇచటి దైవము సోమేశ్వరుడు. భీమేశ్వర లింగము సూర్యునిచే ప్రతిష్ఠితము. సూర్య ప్రతిష్ఠితమైన లింగమునకు అన్ని దిక్కులయందును సోమ ప్రతిష్ఠిత లింగములుండును. అష్టదిక్కుల యందుండు సోమ ప్రతిష్ఠితములైన అష్ట సోమేశ్వరులలో కోటిపల్లి సోమేశ్వరుడు ఒకడు.

సీ॥ అదె పట్టిస స్థానమందుండు వీరభ
ద్రేశ్వరస్వామి యర్ధేందు మౌళి;
యదె పుండరీకాద్రి యచట మార్కండేయు
నిలువేల్పు ముక్కంటి వెలసెఁదొల్లి;
యదె కుమారారామ మా హర్మ్య రేఖయ
చాళుక్య భీమేశు సదనవాటి;
యదె కుక్కుటేశ్వరం బయ్యుపాంతము మేడ
హుంకారిణీదేవి యోలగంబు;

తే॥ వాఁడె మాయింటి వేల్పు పల్వల పురమునఁ
గొప్పు లింగంబు ఫణిరాజ కుండలుండు;
సప్తముని సింధు సంగమేశ్వరుఁడు వాఁడె;
కుండలాముఖ మదె మౌనికులవరేణ్య!" 55

అర్థము :- మౌనికులవరేణ్య=మునుల సమూహములో శ్రేష్ఠుడవగు వ్యాసా!; పట్టిస స్థానము=పట్టిసమను పుణ్య ప్రదేశము; అదె=అదిగో అదియే; అందు=ఆ క్షేత్రములో; అర్థ+

ఇందుమౌళి=అర్ధచంద్రుడు శిరస్సునగల; వీరభద్రేశ్వరస్వామి=వీరభద్రేశ్వరుడను దేవుడు; ఉండున్=ఉండును.

పుండరీక+అద్రి=పద్మాద్రి; అదె=అదియే; అచట ఆ పద్మాద్రిపైన; మార్కండేయు=మార్కండేయుని యొక్క; ఇలువేల్పు=ఇంటి దైవమగు, ముక్కంటి=(మూడు కన్నులు కలవాడు) శివుడు; తొల్లి=పూర్వము; వెలసెన్=అవతరించెను.

కుమార+అరామము=కుమారారామమను దివ్యక్షేత్రము; అదె=అదియే; ఆ హర్మ్య రేఖ+అ=ఆ సౌధ పంక్తియే; చాళుక్య భీమేశు=చాళుక్య భీమేశ్వర స్వామివారి; సదనవాటి=ఆలయ ప్రదేశము.

అదె=అదియే; కుక్కుటేశ్వరంబు=కుక్కుటేశ్వరుడను శివుని ఆలయము. ఆ+ఉపాంతము=ఆ సమీపమునందలి; మేడ=సౌధము; హుంకారిణీదేవి=హుంకారిణి అను పేరుగల దేవత యొక్క; ఓలగంబు=కొలువు కూటము.

పల్వేలపురమున=పలివెల అను పట్టణమునందున్న; ఫణిరాజకుండలుండు=సర్పరాజు కుండలములుగాగల, కొప్పు లింగము=(శిరస్సుపై) కొప్పు గుర్తు అగు బొడెపెగల శివలింగము; వాఁడె=ఆయనయే; సప్తముని=ఏడుగురు మునులు తెచ్చిన నది; సింధు=సముద్రముల; సంగమ=కూడలిలోనున్న, సంగమేశ్వరుఁడు=సంగమేశ్వరస్వామి, వాఁడె=ఆయనయే; అదె=అదియే; కుండలాముఖము=కుండలాముఖమను క్షేత్రము.

భావము :- మునీంద్రా! అదియే పట్టిసమను పుణ్యక్షేత్రము. ఆ ప్రదేశములో శశిరేఖ శిరస్సునందుగల వీరభద్రేశ్వరస్వామియున్నాడు. అదియే పద్మాద్రి. దానిపైన మార్కండేయ మహర్షికి ఇలువేలుపగు శివుడు పూర్వము వెలసెను. అదిగో అదియే కుమారారామము. ఆ భవన సముదాయమే చాళుక్య భీమేశ్వర స్వామివారి ఆలయము. అదియే కుక్కుటేశ్వరము. దానికి సమీపమునందలి భవనమే హుంకారిణీదేవి సభా భవనము. పల్వేల పట్టణములోని కొప్పులింగ రూపుడగు ఆ పరమేశ్వరుడే మా కులదైవము. సప్తగోదావరీ సాగర సంగమములో గల సంగమేశ్వర స్వామి ఆయనయే. ఆదియే కుండలాముఖము."

**విశేషము :-** "అర్ధేందు మౌళి" విశేషంబు సార్థకము. వీరభద్రేశ్వర శివలింగము పీఠముపై రెండడుగుల యెత్తు, 3 అడుగుల కైవారము గలిగియున్నది. ఫాలదేశమున సూర్యచంద్రులు నేత్రములయిన గుర్తులున్నవి. శిరోభాగమున నొక బొడిపి గలదు. దానినే జటాజూటమందురు. దానిపైన రజత కిరీటము గలదు. నాగాభరణము బయటకు దీయుటకు ముందు రజత కిరీటము తీయవలెను.

**పుండరీకాద్రి :-** పుష్పగిరి లేక పద్మగిరి లేక కమలాద్రి. రాజమహేంద్రవరమున గౌతమీతీరము నందున్నది.

కుమారారామము :- సామర్లకోట భీమవరము. చాళుక్య భీమ నిర్మితము.

కుక్కుటేశ్వరము :- పిఠాపురము. కుక్కుటేశ్వరుడుగలడు. కాని హుంకారిణీశక్తిగాని, ఆమె సభా భవనముగాని నేడు కన్పింపవు. పలివెలలోని అగస్త్యేశ్వర స్వామి తరువాత కొప్పులింగమయినాడు. దీనికొక ఐతిహ్యము గలదు.

సప్తముని సింధు సంగమేశ్వరుడు :- తుల్యభాగానదీ తీరమునంటి (ఏడిద సమీపమునఁగల సంగమేశ్వరుఁడు) సప్తమునులు గొనితెచ్చిన గౌతమీ తుల్యభాగా నదుల సంగమక్షేత్ర వాసియైన ఈశ్వరుఁడు-చి.పా.శా. పీఠిక-94.

సంవేద్యము, కోటిపల్లి :- 3-54 చెంత వివరింపబడినవి.

పట్టిసము, కుండలాముఖము :- భీమ. 3-21 చెంత వివరింపబడినవి.

క॥ అని చూపి చెప్పి కుంభజుఁ
డినుఁగనుఁగొని "శుభముహూర్తమిదె యేతెంచెన్
మనము దిగవలయు" ననుచును
మునిమండలి మ్రోల దిగిరి ముగురున్ ధరకున్. 56

అర్థము :- అని=అని; చూపి=చూపించి; చెప్పి=చెప్పి; కుంభజుఁడు=అగస్త్యుడు. ఇనున్=సూర్యుని; కనుఁగొని=చూచి; ఇదె=ఇదియే; శుభముహూర్తము=శుభమగు ముహూర్తము; ఏతెంచెన్=వచ్చినది; మనము=మనము; దిగవలయున్=(క్రిందికి) దిగవలయును; అనుచును=అనుచు, ముగురున్=ముగ్గురును; మునిమండలిమ్రోలన్= మునుల సమూహము నెదుట; ధరకున్=భూమిపైకి; దిగిరి=దిగిరి.

భావము :- అని వ్యాస మహర్షికి అగస్త్యుఁడు ఆకసము నుండి కన్పించు క్షేత్రాదులను చూపి, వానిని గూర్చి వివరించి ఆకసమువైపు -సూర్యుని వైపు చూచెను. "ఇదియే అభిజిల్లగ్నముగల శుభముహూర్తము వచ్చినది. మనము దిగవలయును." అని చెప్పి అగస్త్య లోపాముద్రా వ్యాసులు భూమిపైకి దిగిరి.

వ॥ అనంతరంబ కుంభసంభవ పులిన సంభవులు సంబవులం దోడిగికొని కదలి, కదళికా రామంబుల రామణీయకంబును, నుల్లసిత బిల్వ చిరిబిల్వ విటపంబుల పొల్పును, ద్రాక్షా రుద్రాక్ష ఖర్జూర కేసర సరళ పున్నాగ నారంగంబుల రంగంబును, లవంగ లుంగ లవలీ మల్లీవల్లీమతల్లీవేల్లనంబుల యుల్లాసంబును, ఘోంటా కురంటక ఝంటికా కంటక ఫల కపిత్థ లోధ్ర జంబూ జంబీర పారిభద్ర భద్రదారు

శాల్మలీ గుల్మలీలా హేవాకంబు నుద్రేకంబును, గోమలతర తమాలమాలాకార శాకోటవిటపి షండంబుల మెండును, చెఱకు ముఱకటంబును, బ్రాసంగు మిసిమియుఁ, జెంగల్వతావి తేవయు, గుసుమ వాటి యెసకంబును, నుభయ పార్శ్వంబులఁ గల ఘంటా మార్గంబునుగా నెడనెడం గుసుమ భారారంభ సంభార కుసుమ గుచ్ఛ చ్ఛాయా విభాత సంధ్యారాగంబును, గంది యందంబును, వెసర సిరియును, మినుము నలుపును, గోధూమశ్యామాకవరగయును, మాషపర్ణి సమున్మేషంబును, నేపె యేపును, ననంతిసనకేతనంబును, నువ్వు మవ్వంబును, కుళుత్థశుద్ధార్థమాన వృద్ధియుఁ బత్తి సంపత్తియు, బొబ్బర యుబ్బరంబును, నంద సందర్భంబును, యవ యావనాళ ప్రియంగు జంతి జంతిల పరిస్ఫూర్తియుఁ, ద్రవ్వొందల సందడియు, గంటెకొఱ్ఱ తఱచును, గసగసలి వయసును, జెంగలించు జాంగల క్షేత్రంబులు నేత్రంబులకు నింపు సొంపు సంపాదింప, ననంతాంతరాంత రంబులు తరతరంబు తరళతర తరంగ రింఛోళికాంచలంబులం జెలంగులం దువాళించుచు, నతి శిశిర సలిల శీకర నికర నిరత కరణ పరిణతిం గ్రొవ్విరి పోఁక మోఁకల పూవుబాళలనెత్తావికిం దావలంబులై కేవలంబు పొలయు సప్తగోదావర సమీరణంబులు నాసికాపుటకుటీరంబులకుఁ గుటుంబకంబుగా మందమంద గమనంబున నహిమకరబింబం బంబర వీథీ సౌధకూటంబున హాటకకలశభంగి నంగీకరించు కొలఁది, నభిజిద్వేళ వేలావనోప కంఠ కంఠాలంకారహారధామంబైన దక్షారామంబుఁ బ్రవేశించిరంత. 57

అర్థము :- అనంతరంబ=తరువాతనే; కుంభ సంభవ పులిన సంభవులు=అగస్త్య వ్యాసులు; సంబవులన్=పావుకోళ్ళను, తొడిగికొని=తొడిగికొని, కదలి=బయలుదేరి.

కదళికా+ఆరామంబుల=అరటి తోటల; రామణీయకంబును=సౌందర్యమును; ఉల్లసిత=వికాసమునందిన; బిల్వ=మారేడు; చిరిబిల్వ=క్రానుగు; విటపంబుల=వృక్షముల యొక్క; పొల్పును=అందమును; ద్రాక్షా.....వంగంబును. ద్రాక్షా=ద్రాక్షల; రుద్రాక్ష=రుద్రాక్షల, ఖర్జూర=ఖర్జూరముల; కేసర=పొగడ(పొన్న)ల; సరళ=తెల్ల తెగడల; పున్నాగ=సురపొన్నల; నారంగంబుల=నారింజ చెట్ల; రంగంబును=సౌందర్యమును; లవంగ.....ఉల్లాసంబును. లవంగ=లవంగముల; లుంగ=మాదీఫల వృక్షముల, లవలీ=పసుపు పచ్చని యొకవిధమగు తీగల, మల్లీవల్లీ మతల్లీ=శ్రేష్ఠమగు మల్లెతీగలతో; వేల్లనంబుల=చుట్టుకొనుటల; ఉల్లాసంబును =వికాసమును; ఘోంటా.....ఉద్రేకంబును; ఘోంటా=పోక, రేగుల, కురంటక=గోరింటల,

కంటకఫల=పనసల, కపిత్థ=వెలగల; లోధ్ర=లొద్దుగ; ఇప్ప చెట్లు; జంబూ=నేరేడుల; జంబీర=నిమ్మల; పారిభద్ర=వేపల; భద్రదారు=మేడి; దేవదారువుల; శాల్మలీ=బూరుగుల; గుల్మ=పొదల, లీలా హేవాకంబున్=విలాసముల ప్రౌఢిమ యొక్క; ఉద్రేకంబును=విజృంభణంబును; కోమల.....మెండును; కోమలతర=మిక్కిలి మృదువయిన; తమాల=చీకటి చెట్లు; మాలా=గుంపు యొక్క; ఆకార=రూపము వంటి రూపముగల; శాకోట విటపి=టేకు మ్రానుల; షండంబుల=సమూహముల; మెండును=ఆధిక్యమును;

చెఱకు=చెఱకుగడల; ముఱకటంబును=ఎక్కువగా నుండుట(త్రిప్పాటయు); ప్రాసంగు=ఒక జాతి వడ్లు యొక్క; మిసిమియున్=నూతన కాంతియును; చెన్ను+కల్వల=ఎఱ్ఱ కలువల, తావి=సువాసన యొక్క; శేవయున్=ఒప్పిదమును; కుసుమవాటి= పూలతోటల; ఎసకంబును=అతిశయమును; ఉభయ పార్శ్వంబులన్=రెండు ప్రక్కల; కల=ఉన్న; ఘంటా మార్గంబును గాన్=రాజ మార్గము కలుగగా; ఎడనెడన్=అక్కడక్కడ; కుసుమ..... రాగంబును; కుసుమ భార=పూల బరువు యొక్క; ఆరంభ=ప్రారంభ క్రియయందలి; సంభార=సర్వపూర్ణత్వముగల; కుసుమ గుచ్ఛ=పూల గుత్తుల; ఛాయా=రంగుతో; విభాత=ప్రభాతకాలము నందలి; సంధ్యారాగంబును=సంజ ఎఱుపును;

కంది=కందుల; అందంబును=సొగసును; పెసర=పెసరల; సిరియును=సంపదయును; మినుము=మినుముల; నలుపును=నల్లదనమును; గోధుమ=గోధుమల; శ్యామాక=చామల; వరగయును=ప్రకాశమును; మాషపర్ణి=కారుమినుము యొక్క; సమున్మేషంబును=వికాసమును; ఏపె=నల్లమద్ది యొక్క; ఏపును=వృద్ధియును; అనంతి= ఉసిరిక; ననకేతనంబును=చివురుల చిన్నెలు; నువ్వు=నువ్వుల; మవ్వంబును= మృదుత్వమును; కుళుత్థ=ఉలవ పంట యొక్క; శుద్ధార్థమాన వృద్ధియున్=తెల్ల ఆవాల పరిమాణ అభివృద్ధియు; ప్రత్తి=ప్రత్తి యొక్క, సంపత్తియున్=సమృద్ధియు; బొబ్బర=అలచందల, ఉబ్బరంబును=వృద్ధియును, నంద=పెద్ద నేరేడు, సందర్భంబును=విస్తారమును; యవ.....స్ఫూర్తియున్. యవ=వరి యొక్కయు; యావనాళ=జొన్నల; ప్రియంగు=నల్లావాలు; తిల=నువ్వు యొక్క; పరిస్ఫూర్తియున్= పరిపూర్ణతయును; తవ్వెందల=చోడి పైరుల; సందడియున్=అతిశయమును; గంటె కొఱ్ఱ=సజ్జ కొఱ్ఱల; తఱచును=ఆధిక్యమును; గసగసల=గసగసాల; ఇవయును=చల్లదనమును.

చెంగలించు=అతిశయించునట్టి; జాంగల క్షేత్రంబులు=అనేక ధాన్యాదులతో గూడిన పొలములు; నేత్రములకు=కన్నులకు; ఇంపు సొంపు=ఆనంద సౌఖ్యములను; సంపాదింపన్=కలిగింపగా; అనంత=లెక్క లేనన్ని; అంతరాంతరంబులు=నట్టనడిమి చోటులు; తరతరంబు=క్రమక్రమముగా; తరళ.....అంచలంబులన్. తరళతర=మిక్కిలి చంచలములైన; తరంగ=

తరగల; రింఛోళికా=సమూహముల; అంచలంబులన్=చివరల యొక్క; చెలంగులన్=వ్యాపనములతో; దువాళించుచు=ప్రసరించుచు; అతి.....పరిణతిన్. అతి శిశిర=మిక్కిలి చల్లనయిన; సలిలశీకర=నీటి బిందువుల; నికర=సమూహమును; నిరత=అవిచ్ఛిన్నమైన దానినిగా; కరణ=చేయుటచే(గలిగిన); పరిణతిన్=పరిపాకము చేత; క్రొవ్విరి-క్రొత్త+విరి=నూతన పుష్పములు; పోఁకమోఁకల=పోక చిగుళ్ళ, పూవు బాళల=పూల మొగ్గల; నెఱ+తావికిన్=చక్కని సుగంధమునకు; తావలంబులు+ఐ= స్థానములై; కేవలంబు=స్వచ్ఛముగా; పొలయు=వ్యాపించు; సప్తగోదావర=సప్తగోదావరమను సరస్సుపై నుండి వచ్చు; సమీరణంబులు=పిల్లగాలులు; నాసికాపుట=ముక్కుపుటము లనెడి; కుటీరంబులకున్=పాకలకు; కుటుంబకంబుగాన్=స్వజనముకాగా;

మందమందగమనంబునన్=మెల్లమెల్లనడకతో; అహిమకరబింబంబు=సూర్యబింబము; అంబరవీథీ=ఆకాశమార్గమునందలి; సౌధకూటంబున=భవనము యొక్క శిఖరమునందు; హాటకకలశభంగిన్=బంగారు కుండ విధమును; అంగీకరించు కొలఁది=స్వీకరించు స్థితిలో; అభిజిత్+వేళన్=అభిజిత్తు అను శుభలగ్న సమయములో, వేలావన=చెలియలి కట్ట సమీపమునందలి అడవికి; ఉపకంఠ=సమీపమనెడు; కంఠ=మెడకు; అలంకార=భూషణమగు; హార=ముత్యాలహారమునకు; ధామంబు+ఐన=స్థానమైన; దక్షారామంబున్=దక్షారామమును; ప్రవేశించిరి=ప్రవేశించిరి; అంతన్=అటు తరువాత(తరువాతి పద్యములోని కన్వయము).

భావము :- తరువాత నగస్త్యవ్యాసులు పావుకోళ్ళను తొడిగికొని ఓదూరు నుండి బయలుదేరిరి. త్రోవలో వారికి అందమైన అరటి తోటలు, సుందరములగు మారేడు, క్రాసుగు, ద్రాక్ష, రుద్రాక్ష, ఖర్జూర కేసర సరళ పున్నాగములు, నారింజ చెట్లును, లవంగములు, మాదీఫలములు, లవలులు, మల్లెల తీగలు, పోకరేగు, గోరింట. పనసలు, వెలగలు, లొద్దుగ నేరుడు, నిమ్మ వేప మేడి బూరుగచెట్లు, విజృంభణము సమధికమగు తమాలములు; టేకు చెట్లు కన్పించినవి.

చెఱకు గడలు, మిసమిసలాడు వరి, సువాసనల వెదజల్లు కలువ పూలు, పూలతోటల వైభవము, త్రోవకిరువైపుల అటనటగల పూల గుత్తుల ఎఱ్ఱదనము వలన గలుగు సంధ్యారాగము, కంది, పెసర, మినుము, గోధుమ, ఛామ ధాన్యముల అందమును, కారు మినుము, నల్ల మద్ది, ఉసిరిక, నువ్వు పంటల మార్దవము, ఉలవ తెల్ల ఆవాల పంటల విస్తారమును, వరి, జొన్న, నల్ల ఆవ, నువ్వు పంటల సమృద్ధిని, చోడి, సజ్జ, కొఱ్ఱ పంటల అతిశయమును, గసగసాలు అధికముగాగల పొలములు వారికి నేత్రానందము కలిగించినవి. కొంగ్రొత్త పూవుల, పోకమోకల పూవుల సువాసనలతో గూడి జలబిందువులతో ఎక్కువ చల్లదనమును గలిగించు

సప్త గోదావర తరంగములపై నుండి మందానిలములు వారి నాసికాపుటములలో చోటుచేసి కొన్నవి.

అప్పుడు మందగమనముగల సూర్యబింబము ఆకాశవీధియను సౌధమునకు బంగారు కలశమువలె నుండెను. అభిజిల్లగ్నసమయమిది. అప్పుడు సముద్రతీరస్థమగు అడవికి ముత్యాలహారముగా వెలుగొందుచున్న దక్షారామమును అగస్త్య వ్యాసులు ప్రవేశించిరి.

## వ్యాసాదులు దక్షారామంబు ప్రవేశించుట

క॥ ఇటు కృష్ణద్వైపాయన
ఘటజన్ములు భీమనాయకస్వామి మహా
కటకము ముక్తివధూటీ
కటకాభరణంబుఁ జొచ్చి కడువేడుకతోన్. 58

అర్థము :- ఇటు=ఈ రీతిగా; కృష్ణద్వైపాయన ఘట జన్ములు=వ్యాసాగస్త్యులు; ముక్తి.....ఆభరణంబున్. ముక్తి=మోక్షమనెడి, వధూటీ=స్త్రీ యొక్క; కటక=ఒడ్డాణమను; ఆభరణంబున్=అలంకారమైన; భీమనాయకస్వామి=భీమేశ్వరుడను దేవుని; మహాకటకమున్= గొప్ప రాచనగరును; కడువేడుకతోన్=మిక్కిలి కోరికతో; చొచ్చి=ప్రవేశించి

భావము :- ఈవిధముగా వ్యాసాగస్త్యులు మోక్ష లక్ష్మికి ఒడ్డాణము వంటి అలంకార మగు భీమేశ్వరస్వామి రాచనగరును మిక్కిలి కోరికతో ప్రవేశించి(రి).

విశేషము :- అలంకారము - రూపకము.

తే॥ కర్ణికారాంబికా మహాకాళిగుడికి
నందముగ నూలువట్టిన యట్టిచాయ
సూర్యవీథికిఁజనిరి సంశుద్ధమతులఁ
బశ్చిమద్వారమునకునై పరమమునులు. 59

అర్థము :- కర్ణికారాంబికా=కర్ణికారాంబిక అనుపేరుగల; మహాకాళి గుడికి=పరమేశ్వరి ఆలయమునకు; అందముగన్=సుందరముగ; నూలు=దారము; పట్టిన+అట్టి చాయన్=పట్టిన విధముగానున్న; సూర్యవీథికిన్=సూర్యుని పేరుతో ప్రసిద్ధమైన వీథికి; పశ్చిమద్వారమునకునై= పడమటి వాకిలిలో నుండి ప్రవేశించుటకై; సంశుద్ధమతులన్=నిర్మలములగు మనస్సులతో; పరమ మునులు=మహర్షులు; చనిరి=వెళ్ళిరి.

భావము :- కర్ణికారాంబిక అను పేరుగల మహాకాళి గుడికి దారము పట్టినట్లుగా వంకర లేక చక్కగానున్న సూర్యవీథిలో పశ్చిమద్వారము నుండి ప్రవేశించుటకు పరమ మునులు వెళ్ళిరి.

విశేషము :- 'కర్ణికారాంబిక' అనునామము 'గోగులమ్మ' అనుపేరునకు సంస్కృతీకరణము. పశ్చిమ ద్వారముననున్నది గోగులమ్మ. (భీమ. 1-99)

అలంకారము - ఉపమ.

వ॥ అప్పుడు ఘటోద్భవుండమ్మహాస్థానంబు సత్యవతీ సూనునకుఁజూపి వెండియు నిట్లనియె. 60

అర్థము :- అప్పుడు=ఆ సమయమున; ఘట+ఉద్భవుండు=అగస్త్యుడు; ఆ+మహాస్థానంబున్=ఆ పవిత్ర ప్రదేశమును, సత్యవతీ సూనునకున్=వ్యాసునకు; చూపి=చూపించి; వెండియున్=మరల, ఇట్లు+అనియె=ఈ విధముగా పలికెను.

భావము :- అప్పుడు అగస్త్యుడు, భీమేశ్వర ఆలయాదులను జూపుచు వ్యాసునితో మరలనిట్లు పలికెను.

సీ॥ "లీలావిలాస లాలిత లోకహర్షంబు,
గోమేధికాకల్పగోపురంబు,
గోపుర స్థిత శాత కుంభ కుంభిశతంబు,
దివ్యరత్న నిబద్ధ దేవగృహము,
దేవగేహాకీర్ణ దివిజాప్సర శ్రేణి,
యఖిలవస్తు ప్రపూర్ణాపణంబు,
వివిధాపణ స్వర్ణ వేదికాధ్యాసిత
యక్షగంధర్వ విద్యాధరంబు,

తే॥ శంఖ భేరీ మృదంగ నిస్సాణ పటహ
ఝల్లరీ వేణు వీణాది శబ్దనివహ
కలకలోద్వేజితాశేష కల్మషంబు
నయన భాగ్యంబు దక్షిణానందవనము. 61

అర్థము :- నయన భాగ్యంబు=కన్నుల కానందమగు; దక్షిణ+ఆనందవనము=దక్షిణ దిక్కునందున్న కాశీనగరమగు దక్షారామము; లీలావిలాస=శృంగార క్రీడలచేత; లాలిత=

ప్రసన్నమైన; లోక=జనము యొక్క; హర్షంబు=సంతోషము గలది; గోమేధికా క్లప్త=గోమేధిక మణులచే నిర్మితమగు, గోపురంబు=(ఆలయము ముందు) గోపురము గలది.

గోపుర స్థిత=గోపురముపైనున్న; శాతకుంభ=బంగారముతో(జేయబడిన); కుంభి శతంబు=వందల కొలది ఏనుగులు గలదియు; దివ్య=దేవసంబంధములగు, రత్న= రత్నములచేత; నిబద్ధ=కట్టబడిన; దేవగృహము=దేవాలయములు గలది;

దేవగేహ=దేవాలయములందు; ఆకీర్ణ=వ్యాపించిన; దివిజ=దేవలోకమునందు పుట్టిన; అప్సరస్=అప్సరసల యొక్క; శ్రేణి=సమూహము గలది; అఖిల=సమస్తమయిన; వస్తు= వస్తువులచేత, ప్రపూర్ణ=బాగుగానిండిన; ఆపణంబు=దుకాణములు గలది;

వివిధ.....విద్యాధరంబు; వివిధ=పలుకరములైన, ఆపణ=దుకాణములందలి; స్వర్ణవేదికా=బంగారపుటరుగులపైన; అధ్యాసిత=కూర్చుండబెట్టబడిన; యక్ష=యక్షులు; గంధర్వ=గంధర్వులు; విద్యాధరంబు=విద్యాధరులు గలది;

శంఖ.....కల్మషంబు; శంఖ=శంఖము; భేరీ=భేరి; మృదంగ=మద్దెల; నిస్సాణ= చర్మవ్యాద్యము; పటహ=తప్పెట; ఝల్లరీ=డక్కి-పెద్ద డోలు; వేణు=పిల్లన గ్రోవి; వీణ=వీణ; ఆది=మున్నగువాని; శబ్దనివహ=ధ్వనుల సమూహము వలన గలిగిన, కలకల=కలకలముచేత; ఉద్వేజిత=భీతిల్లిన; అశేష=మిగులులేని; కల్మషంబు=పాపములు గలది.

భావము :- "దక్షిణ కాశియగు దక్షారామము భక్తులకన్నులకానంద సంధాయకము. అందలి జనులు లీలావిలాసములతో ప్రసన్నులు, సంతుష్టులు. అచటి దేవాలయ గోపురములు గోమేధికములను మణులచే నిర్మితములు. ఆ గోపురములపైన బంగారముతో జేసిన లెక్కకు మిక్కిలి బంగారు ఏనుగుల ప్రతిమలున్నవి. ఆపురమునందలి దేవాలయము లన్నియు దివ్యరత్ననిర్మితములు. ఆ దేవాలయములలో దివ్యాప్సరసల సమూహము లుండును. ఆ పురములోని దుకాణములన్నియు సమస్తవస్తు పరిపూర్ణములు. ఆ దుకాణముల లోని బంగరుటరుగులపై యక్ష గంధర్వ విద్యాధరుల ప్రతిమలున్నవి. ఆ పట్టణమునందు నిరంతరము మ్రోగు శంఖము, భేరి, మద్దెల, తప్పెట, డక్కి, పిల్లన గ్రోవి, వీణ మున్నగువాని పవిత్ర ధ్వనుల కలకలమును విని సమస్త పాపములు భీతిల్లును.

అలంకారము :- ముక్తపదగ్రస్తము.

సీ॥ **ఘల్లుఘల్లని రత్నకంకణంబులు మ్రోయ**
**గంధవాహుని యాలు కసవు నూడ్చు;**
**లక్ష్మి కెంగేలి లీలారవిందమ్మునఁ**
**గలయంపి చిలికించుఁ గమ్మఁదేనెఁ;**

తామ్రపర్ణియుఁదాను దారకాపథ గంగ
వలిముత్యముల రంగవల్లి దీర్చు;
నధివాసనము సేయు యముని శుద్ధాంతంబు
ధూమోర్ణ మహిసాక్షి ధూమఘుటిక;

తే॥ సప్తపాతాళ నాగేంద్ర చంద్రముఖులు
ఫణమణి జ్యోత్స్న దివియ గంబములగుదురు;
సోమ మకుటుని గారాబు జోటియైన
దక్షవాటికఁ బ్రతి మహోత్సవమునందు. 62

**అర్థము** :- సోమమకుటుని=చంద్రుడు కిరీటమైన శివుని యొక్క; గారాబు=ప్రియమగు; జోటి+ఐన=భార్య అయిన; దక్షవాటికన్=దక్షారామములో; ప్రతిమహోత్సవము నందున్=ప్రతి గొప్ప పండుగనాడుగూడ;

రత్నకంకణములు=రత్నములతో గూడిన గాజులు; ఘల్లుఘల్లు+అని=ఘల్లు ఘల్లు మని; మ్రోయన్=మ్రోగుచుండగా; గంధవాహుని=వాయుదేవుని; ఆలు=భార్య; కసవున్=ఇంటిలో పడు చెత్తను; ఊడ్చు=ఊడ్చును.

లక్ష్మి=లక్ష్మీదేవి; కెంపు+కేలి=ఎఱ్ఱనిదగు చేతియందలి; లీలా+అరవిందమ్మునన్=విలాసము కొఱకైన పద్మమునందలి; తేనెన్=తేనెతో; కలయంపిన్=కళ్ళాపిని, చిలికించున్=చల్లును.

తారకాపథ=నక్షత్రమార్గములోనున్న; గంగ=గంగ-ఆకాశ గంగ; తామ్రపర్ణియున్=తామ్రపర్ణి అనునదియు, తానున్=తానును; వలిముత్యములన్=చల్లదనము గూర్చు మేలి ముత్తెములతో; రంగవల్లి=ముగ్గు; తీర్చున్=దిద్దును-వేయును.

యముని శుద్ధాంతంబు=యముని రాణియగు; ధూమోర్ణ=ధూమోర్ణయనునామె; మహిసాక్షి=మహిసాక్షి అను; ధూమఘుటికన్=పొగవచ్చు మాత్రతో; అధివాసనము=ధూపము వేయుటను; చేయున్=చేయును.

సప్తపాతాళ=ఏడు అధోలోకములలోని; చంద్రముఖులు=చంద్రునివంటి ముఖములు గల స్త్రీలు; ఫణ=పడగలయందలి; మణి=మణుల యొక్క; జ్యోత్స్నన్= వెన్నెలలతో; దివియగంబములు=దీపస్తంభములు; అగుదురు=అగుదురు.

**భావము** :- పరమశివుని గారాబు ఇల్లాలయిన దక్షారామములో ప్రతిమహోత్సవము లోను రత్నకంకణములు ఘల్లుఘల్లుమని ధ్వనించుచుండగా వాయుదేవుని భార్య కసవు

చిమ్మును. లక్ష్మీదేవి అరుణహస్తమునందలి లీలాపద్మములోని తేనెతో కళ్ళాపి చల్లును. ఆకాశ గంగ తామ్రపర్ణితో గలిసి చల్లదనమునిచ్చు మేలిముత్తెములతో ముగ్గులు వేయును. యమధర్మరాజు భార్యయగు ధూమోర్ణయనునామె మహిసాక్షితో ధూపము వేయును. సప్తపాతాళములలోనున్న నాగకాంతలు పడగల యందలి మణులకాంతులతో దీపస్తంభము లుగా నిలచి రాత్రి చీకటిని పోగొట్టుదురు.

విశేషము :- దక్షారామములో జరుగు అన్నియుత్సవములలోను దేవకాంతలు దేవాలయ సేవలో పాల్గొనుట వారి పరమేశ్వర భక్తినేకాక, ఆస్వామి మహత్తును వ్యంజించు చున్నది.

మ॥ ధనకోటీ వినిబద్ధ కేతన శత ద్రాఘిష్ఠ వైశ్యాలయం;
బనువేల ధ్వనితార్థ దానవిధి ఘంటారావ వేశ్యాగృహం;
బనిమేషాక్షి నిరీక్షితేశ్వర మహేడ్యక్షోణి బృందారకం;
బనుసంధ్యాగత లోక పాలకము దక్షారామ మత్యున్నతిన్. 63

అర్థము :- ధన.....ఆలయంబు; ధనకోటీ=కోట్లకొలది ధనముతో; వినిబద్ధ=నిర్మింప బడిన; కేతనశత=వందల కొలది పతాకములతో; ద్రాఘిష్ఠ=మిక్కిలి పొడవయిన; వైశ్య=వైశ్యుల యొక్క; ఆలయంబు=ఇండ్లుగలదియు; అను.....గృహంబు; అనువేల=సమయసమయము లందు-ఎల్లప్పుడు; ధ్వనిత=మ్రోగింపబడు; అర్థ దాన=ధన దానము యొక్క; విధి=కాలము నందలి; ఘంటారావ=గంటల మ్రోతలతో గూడిన, వేశ్యాగృహంబు=వేశ్యల యిండ్లు కలదియు; అనిమేష.....బృందారకంబు; అనిమేష=ఱెప్పపాటులేని; అక్షి=కన్నులతో; నిరీక్షిత= ఎదురుచూడబడిన; ఈశ్వర=పరమేశ్వరుడు గల; మహ్+ఈడ్య=గొప్పగా ప్రశంసింపదగిన; క్షోణి బృందారకంబు=బ్రాహ్మణులు కలదియు; అను.....పాలకము; అనుసంధ్యా=ప్రతి సంధ్యాసమయము నందును; ఆగత=వచ్చిన; లోకపాలకము=దిక్పాలకులు కలదియునగు; దక్షారామము=దక్షారామము; అత్యున్నతిన్=మహోన్నతితో (నొప్పుచున్నది).

భావము :- మహోన్నతినందిన దక్షారామములో కోట్లకొలది ధనముతో నిర్మితములు, వందలకొలది పతాకలతో నలంకృతములు, సుదీర్ఘములగు వైశ్యుల భవనములును; ఎల్లప్పుడు ధనాదులను దానముచేయుటను సూచించు ఘంటాధ్వనులుగల వేశ్యలగృహములును; మిక్కిలి సంస్తుత్యులగు బ్రాహ్మణులు పరమేశ్వరుని ఱెప్పపాటుగూడలేని కన్నులతో చూచుట యును; ప్రతి సంధ్యా సమయములోను దిక్పాలకులు పరమేశ్వర దర్శనమునకు వచ్చుటయు గలవు.

విశేషము :- వేశ్యలు అనేకదానములు చేయుదురనుటకు కొమరగిరిరెడ్డికి ప్రియా సదృశీప్రియయగు లకుమాదేవి "వితరతి బహూనర్థా నర్థి ప్రజాయ సహస్రశః" (యాచకులగు జనులకు వేలకొలది దానములను చేయుచున్నది) అను శాసనవాక్యము ప్రమాణము.

ఇందు సమాసముల వలన విషయము పోషింపబడినది. ఇది పద పూర్వార్థ వక్రత యందలి వృత్తి వక్రోక్తి.

తే॥ మొగులు ముట్టిన సురసద్మ మూర్ధవీథిఁ
గోటిపడగలఁ బొలుపారుఁ గూటకోటిఁ
బట్టణంబు నిజాంగుళీ పల్లవముల
నెట్టుకొని పాపములఁబాయఁదట్టుకరణి. 64

అర్థము :- మొగులు=మేఘము; ముట్టిన=తాకిన; సురసద్మ=దేవాలయము యొక్క; మూర్ధవీథిన్=పైభాగపు వరుసయందలి; కోటిపడగలన్=కోట్లకొలది పతాకముల; కూటకోటిన్=శిఖరముల సమూహముతో; పట్టణంబు=దక్షారామ నగరము; నిజ=తన యొక్క; అంగుళీ పల్లవములన్=చివురుటాకుల వంటి వ్రేళ్ళతో; నెట్టుకొని=త్రోసికొని; పాపములన్=పాపములను; పాయన్=పోవునట్టు; తట్టుకరణిన్=నెట్టివేయు రీతిగా; పొలుపారున్=ప్రకాశించును.

భావము :- దక్షారామనగరము-ఆకసమునంటు దేవాలయ శిఖర భాగములందుగల కోట్లకొలది పతాకముల అందగించు శిఖర సమూహమను చివురుటాకుల వంటి చేతివ్రేళ్ళతో త్రోసికొనుచు వచ్చి పాపములను పోవునట్లు నెట్టివేయు విధముగానున్నది.

విశేషము :- అలంకారము - ఉత్ప్రేక్ష, అతిశయోక్తి

సీ॥ ఎచ్చోటఁ దీర్థంబు లేఁకారు జనుల కి
చ్ఛామాత్ర భోగమోక్షప్రదములు;
కీర్తింతు రెద్దాని కీర్తి గంధర్వులు
గాంధర్వమున యక్ష గానసరణి;
జంకించు నెద్దాని శబల సౌధోపరి
ధ్వజపటంబులు దేవతాగృహముల;
వసియింతు రెద్దాన వాలఖిల్యాదులు
తపసులష్టాశీతి దశ శతములు;

తే॥ నెద్ది యమరేంద్ర పురలక్ష్మి కింత పెద్ద
యట్టి శ్రీదక్షవాటీ మహాపురంబు
నద్భుతంబంది చూచిరి యాదిమునులు
సత్యవతి నందనుఁడు కుంభ సంభవుండు. 65

అర్థము :- ఎచ్చోటన్=ఏ దక్షారామమునందు గల, తీర్థంబులు=పవిత్ర జలములు; ఏఁకారుజనులకు=బాధపడు మనుజులకు; ఇచ్ఛామాత్ర=కోరుటతోడనే; భోగ=సుఖములను; మోక్ష=ముక్తిని; ప్రదములు=ఇచ్చునవియో.

ఎద్దాని=దేనియొక్క; కీర్తిన్=యశస్సును; గంధర్వులు=ఒక జాతి దేవతలు - గాయకులు; యక్షగాన సరణిన్=యక్షగాన రీతిలో; గాంధర్వమునన్=సంగీతముతో; కీర్తింతురు= పొగడుదురో.

ఎద్దాని=దేనియందలి; శబల=చిత్రవర్ణములుగల; సౌధ+ఉపరి=మేడలపైగల; ధ్వజపటంబులు=జెండా గుడ్డలు; దేవతా గృహములన్=(స్వర్గములోని) దేవతల ఇండ్లను, జంకించున్=బెదరించునో.

ఎద్దానన్=ఏ నగరములో; వాలఖిల్య+ఆదులు=వాలఖిల్యులు మొదలగు; అష్ట+ అశీతి దశశతములు=ఎనుబది ఎనిమిది వేలమంది; తపసులు=మునులు; వసియింతురు= నివసింతురో.

ఎద్ది=ఏ నగరము; అమర+ఇంద్రపుర లక్ష్మికిన్=ఇంద్రుని పట్టణమగు అమరావతి శోభకన్న; ఇంత పెద్ద=ఎక్కువ పెద్దదో; అట్టి=అటువంటి; దక్షవాటీ=దక్షారామమను; మహా పురంబున్=గొప్ప పట్టణమును; సత్యవతి నందననుఁడు=వ్యాసుడు; కుంభసంభవుండు= అగస్త్యుడు అను; ఆదిమునులు=ముని ముఖ్యులు; అద్భుతంబంది=ఆశ్చర్యపడి, చూచిరి= చూచిరి.

**భావము** :- దక్షారామ పట్టణమును మునిముఖ్యులగు వ్యాసాగస్త్యులు ఆశ్చర్య పరవశులై దర్శించిరి. అందలి తీర్థములు బాధాపూర్ణజనులకు కోరినంతనే భోగమోక్షముల నొసంగును. దాని కీర్తిని గంధర్వులు యక్షగాన రీతిలో సంగీత పూర్ణముగా స్తుతింతురు. అందలి సౌధములు చిత్రవిచిత్ర వర్ణభూషిత పతాకా శోభితములై దేవతల గృహములను గూడ భయపెట్టును. ఆ నగరములో వాలఖిల్యాదులగు 88 వేలమంది మహర్షులు నివసింతురు. మహేంద్ర పట్టణమగు నమరావతి శోభకన్నను దక్షారామ శోభ మహత్తరమైనది.

**విశేషము** :- వాలఖిల్యులు :- వీరి జననాదులు మహిమను గూర్చి మహాభారతము, బ్రహ్మవైవర్తపురాణము, బ్రహ్మాండ పురాణము, వామన పురాణము, విష్ణుపురాణము తెలిపినవి. వారి జననాదికము, సంఖ్యయును భిన్న భిన్నములుగ నున్నవి.

బ్రహ్మదేవుని మానస పుత్రుడగు క్రతువను మహర్షి సంతతి వాలఖిల్యులు. అంగుష్ఠ మాత్రులగు వీరు తండ్రివలె తపస్వులు, తేజస్వులు, సత్యవ్రతులు. వీరు సూర్యునికి ముందు ఏగుచుందురు. (భారతము. ఆదిపర్వము. 66 అధ్యా. 4 నుండి 9 శ్లో.)

యక్షగానము :- పూర్వకాలమున జన సామాన్య రంజనమునకై నటులు అభినయముతోఁబాడెడి రగడ భేదములు గల పురాణ గాథ(సూ.ని.).

సీ॥ దక్షాధ్వరానల త్రయతీర్థమొక్కటి
యోగాగ్ని నెందేని నురిసె గౌరి;
యఖిలేష్ట సంసిద్ధి యండ్రు రెండవతీర్థ
మెందేని నుమ గాంచె నిష్టసిద్ధి;
సోమేశ్వరంబండ్రు సొరిది మూఁడవతీర్థ
మెందేని యఘము లిఙ్కింకు లింకు;
హైమవతంబందు రది నాలుగవ తీర్థ
మెందేని హిమవంతుఁడొందె వరము;

తే॥ సప్తగోదావరంబు పంచమము తీర్థ
మఖిల శుభములు నెందేని నావహిల్లుఁ
బంచ తీర్థంబు లివి యాడి పంచజనుఁడు
పాయుఁబంచేంద్రి యోద్భవ పాతకంబు. 66

అర్థము :- ఎందేనిన్=దేనియందలి, యోగాగ్నిన్=యోగాగ్నిలో; గౌరి=సతీదేవి; ఉరిసెన్=కాలిపోయెనో; అది, దక్ష=దక్షుని యొక్క; అధ్వర=యజ్ఞమునందలి; అనలత్రయ= మూడగ్నులు గల దక్షాధ్వరానల త్రయమను పేరుగల; తీర్థము=పుణ్యజలముగలది; ఒకటి= మొదటి తీర్థము.

ఎందేనిన్=దేనియందు; ఉమ=పార్వతీదేవి; ఇష్టసిద్ధిన్=కోరికలు నెరవేరుటను; కాంచెన్=పొందెనో; అది, అఖిల+ఇష్టసిద్ధి=(సమస్తములగు కాంక్షలు సిద్ధించునది) అఖిలేష్ట సిద్ధి అని; రెండవ తీర్థము=రెండవ తీర్థమును; అండ్రు=అందురు.

ఎందేని=దేనియందు; అఘములు=పాపములు; ఇంకులు+ఇంకులు=ఇఙ్కింకు లింకు=మిక్కిలి క్షీణించునో; సొరిది=క్రమములో; మూఁడవ తీర్థము=మూడవ తీర్థమును; సోమేశ్వరంబు=సోమేశ్వరమని; అండ్రు=అందురు.

ఎందేని=దేనియందు; హిమవంతు(డు=హిమవంతుడు; వరమున్=వరమును; పొందెన్=పొందెనో; అది=అది, నాలుగవ తీర్థము=నాలుగవ తీర్థము, దానిని, హైమవతంబు= హైమవతము అని; అందురు=అందురు.

ఎందేని=దేనియందు; అఖిల శుభములున్=సమస్త మంగళములు; ఆవహిల్లున్= కలుగునో; అది, సప్తగోదావరంబు=సప్తగోదావరమను నది; పంచమంబు=అయిదవదగు; తీర్థము=తీర్థము; ఇవి=ఈపైజెప్పబడినవి; పంచతీర్థంబులు=పంచతీర్థములు; వీనియందు; ఆడి=స్నానము చేసి; పంచజను(డు=మనుజుడు; పంచ+ఇంద్రియ=కన్ను మున్నగు అయిదు ఇంద్రియముల వలన; ఉద్భవ=కలిగినట్టి; పాతకంబున్=పాపమును; పాయున్= పోగొట్టుకొనును.

భావము :- సతీదేవి యోగాగ్నితో కాలిపోయినచోట నేర్పడినది దక్షాధ్వరానలత్రయ తీర్థమనునది మొదటిది. పార్వతీదేవి ఇష్ట సిద్ధినందిన రెండవ తీర్థమును అఖిలేష్టసిద్ధి తీర్థము అని అందురు. పాపములను నాశనము చేయు మూడవ దానిని సోమేశ్వర తీర్థమందురు. హిమవంతుడు వరమునందిన చోటిని హైమవతమను నాలుగవ తీర్థమందురు. సకల శుభములను గలిగించునది ఐదవదగు సప్తగోదావరము. ఇవి పంచతీర్థములు. వీనిలో స్నానముచేయు నరుడు పంచేంద్రియముల వలన గలుగు పాపములను బోగొట్టుకొనును.

విశేషము :- 1. దక్షాధ్వరానలత్రయ తీర్థము, 2. అఖిలేష్ట సంసిద్ధి, 3. సోమేశ్వరము, 4. హైమవతము, 5. సప్తగోదావరము. ఇవి పంచతీర్థములు. 3-159లో "పంచతీర్థంబులు వివరించెద"నని అక్కడ భూధరేశ్వర తీర్థము - ఇందలి హైమవతమును మాత్రమే కవి పొగడెను.

తే॥ శిష్టమునిలోక విబుధాభిసేవ్యమైన<br>
యిమ్మహాతీర్థముల శక్తినేమి చెప్ప?<br>
వానిపైఁ బాఱి వెడలెడు వాయువేనిఁ<br>
జీమకైనను గైవల్య సీమ నొసఁగు." 67

అర్థము :- శిష్ట.....ఐన; శిష్ట=సదాచారముగల; మునిలోక=ముని సమూహము చేతను; విబుధ=దేవతలచేత-పండితులచేత; అభిసేవ్యము+ఐన=సేవింపదగినవైన; ఈ+మహాతీర్థముల=ఈ గొప్ప తీర్థముల యొక్క; శక్తిన్=సామర్థ్యమునుగూర్చి; ఏమి=ఏమని; చెప్పన్=చెప్పగలను; వానిపైన్= ఆ పంచతీర్థములపై నుండి; పాఱివెడలెడు=ప్రసరించి వెళ్ళు; వాయువు+ఏనిన్=గాలియైనను; చీమకు+ఐనను=చీమకైనను; కైవల్యసీమన్= ఉన్నతమగు మోక్షమును; ఒసఁగున్=ఇచ్చును.

భావము :- మహామునులకు దేవతలకు సేవ్యమగు ఈ తీర్థముల మాహాత్మ్యము నెంతని చెప్పగలను? వానిపై నుండి వీచు గాలి గూడ చీమకైనను మోక్షము నిచ్చును."

వ॥ అని దక్షారామ మాహాత్మ్యంబు వర్ణించుచుఁబ్రదక్షిణ క్రమంబున భీమేశ్వరు దివ్యమందిరంబు వలపలించి, సప్తగోదావరంబునకు డిగ్గి, కృతస్నానులై; రప్పుడు సాత్యవతేయుండు కుంభసంభవున కిట్లనియె. 68

అర్థము :- అని, దక్షారామ=దక్షారామము యొక్క, మాహాత్మ్యంబున్=మహిమను; వర్ణించుచున్=స్తోత్రముచేయుచు, ప్రదక్షిణ క్రమంబునన్=ప్రదక్షిణ విధితో; భీమేశ్వరు దివ్యమందిరంబు=భీమేశ్వరస్వామి వారి పవిత్ర దేవాలయమును; వలపలించి=ప్రదక్షిణము చేసి; సప్తగోదావరంబునకున్=సప్తగోదావరమను సరస్సులోనికి; డిగ్గి=దిగి; కృతస్నానులు+ఐరి=చేయబడిన స్నానముగల వారైరి. అప్పుడు, సాత్యవతేయుండు= వ్యాసుడు; కుంభ సంభవునకు=వ్యాసునితో; ఇట్లు=ఈవిధముగా; అనియెన్=అనెను.

భావము :- అని దక్షారామ మహిమను వర్ణించుచు భీమేశ్వరస్వామి ఆలయమునకు కుడివైపుగా ప్రదక్షిణము చేసిరి. తరువాత సప్తగోదావరములో దిగి స్నానము చేసిరి. అప్పుడు వ్యాసుడు అగస్త్యునితో నిట్లనెను.

తే॥ "ద్వాదశక్షేత్ర శివలింగ దర్శనంబు
మొదలఁ జేయంగ వలయుట ముఖ్యపక్ష;
మానతీఁదగు నాకు నీ వానుపూర్వి
శంభులింగము లవియెవ్వి కుంభజన్మ! 69

అర్థము :- కుంభజన్మ=అగస్త్య మహర్షీ! మొదలన్=మొట్టమొదట; ద్వాదశ..... దర్శనంబు; ద్వాదశ క్షేత్ర=పండ్రెండు పుణ్య క్షేత్రములలోని; శివలింగ=శివలింగముల; దర్శనంబు=దర్శనము; చేయంగవలయుట=చేయవలసియుండుట; ముఖ్యపక్షము= ప్రధానమగు విధి; నీవు=నీవు; నాకు=నాకు; ఆనుపూర్విన్=వరుసను; ఆనతి+ఈఁదగున్= ఆనతీయ వలయును; అవి=ఆ వరుసలోని; శంభులింగములు=శివలింగములు; ఎవ్వి=ఏవి?

భావము :- "అగస్త్యా! దక్షారామ దర్శనములో మొట్టమొదట ద్వాదశ క్షేత్రములలోని శివలింగములను దర్శించుట ముఖ్యపక్షము గదా! వానిలో దేని తరువాత దేనిని దర్శింపవలెనో ఆ క్రమమును ఆనతిమ్ము.

క॥ ఇటమున్న దక్షవాటీ
కటకంబున యందు పెద్దకాలంబు వసిం
చుటఁ దీర్థంబులు నీకున్
ఘటసంభవ! యాడినవియ కావె తలంపన్." 70

అర్థము :- ఘటసంభవ=అగస్త్యా! ఇటమున్న=ఇంతకు మునుపే; దక్షవాటీ=దక్షారామమను: కటకంబునయందు=రాచనగరులో, పెద్దకాలంబు=చాలకాలము; వసించుటన్=నివసించుట చేత; నీకున్=నీకు, తీర్థంబులు=పవిత్ర జలాశయములు; తలంపన్=ఊహింపగా; ఆడిన+అవియ+కావె= స్నానమాడినవే కదా!

భావము :- అగస్త్యా ఇంతకు మునుపు చాలకాలము నీవు దక్షారామములో నుండుట చేత అన్ని పుణ్యతీర్థములలో స్నానము చేసియేయుందువు కదా!"

వ॥ అనిన విని యగస్త్యుఁడు సాత్యవతేయునకిట్లనియె. 71

అర్థము :- అనినన్=అనగా; విని=విని; అగస్త్యుఁడు=అగస్త్యుడు, సాత్యవతేయునకు=వ్యాసునితో; ఇట్లు=ఈవిధముగా; అనియె=అనెను.

భావము :- ఆ మాటలు విని అగస్త్యుడు వ్యాసునితో నిట్లనెను.

తే॥ "పూర్వజన్మ కృతంబైన పుణ్యరాశి
పాకదశఁ బొందు నెప్పు డప్పాఁటగాని
సకల సంసార దురిత నిస్తారమైన
శివకథా గోష్ఠి చెవులకుఁ జవులుగాదు." 72

అర్థము :- పూర్వ.....రాశి. పూర్వజన్మ=వెనుకటి జన్మములలో; కృతంబు+ఐన=చేయబడినదగు; పుణ్యరాశి=పున్నెము రాశి; పాకదశన్=పండిన స్థితిని; ఎప్పుడు=ఏ సమయములో; పొందున్=పొందునో; అప్పాటన్+కాని=ఆ సమయములో గాని, సకల.....ఐన; సకల=సమస్తమైన; సంసార=సంసారము వలన గలుగు; దురిత=పాపముల నుండి; నిస్తారము +ఐన=తరింపజేయునదగు; శివకథాగోష్ఠి=శివుని కథలకు సంబంధించిన సల్లాపము; చెవులకున్=చెవులకు; చవులు=రుచించునది; కాదు=కాదు.

భావము :- "వ్యాసా! అనేక పూర్వజన్మములందు చేసిన పుణ్యరాశి పరిపాకమునంది నప్పుడుకాని సమస్త సంసార పాపముల నుండి ఉద్ధరించు శివ కథా సంభాషణము చెవులకు రుచింపదు."

వ॥ అని పలికి సత్యవతీ సూనునకుఁ గుమారవక్త్రంబునఁ దాను విన్న ప్రకారంబున మైత్రావరుణుండు ద్వాదశ తీర్థ మాహాత్మ్యంబు నిట్లని చెప్పందొడంగె. 73

అర్థము :- అని=అని; పలికి=చెప్పి; మైత్రావరుణుండు=అగస్త్యుడు; కుమార వక్త్రంబునన్=కుమారస్వామి నోటినుండి; తాను=తాను; విన్న ప్రకారంబునన్=వినిన విధముగా; ద్వాదశ తీర్థమాహాత్మ్యంబున్=పండ్రెండు తీర్థముల మహిమను; సత్యవతీ సూనునకున్= వ్యాసునకు; ఇట్లు=ఈవిధముగా; అని=అని; చెప్పందొడంగె=చెప్పసాగెను.

భావము :- అని చెప్పి అగస్త్యుడు పూర్వము తాను కుమారస్వామి ముఖమున విన్న రీతిగా ద్వాదశతీర్థ మాహాత్మ్యమును వ్యాసునితో ఈవిధముగా చెప్పసాగెను.

సీ॥ "ఇంద్రేశతీర్థంబు ఋషిసమాకీర్ణంబు;
సిద్ధేశ్వరంబు సర్వ సిద్ధికరము;
యోగీశతీర్థంబు యోగలక్ష్మీదాయి;
కాళేశ్వరము భక్తకల్పతరువు;
శమనేశ తీర్థంబు శాంతిదాంతి విధాయి;
వీరభద్రేశంబు విశ్వమతము;
బ్రహ్మేశతీర్థంబు బ్రహ్మర్షిసేవ్యము;
హైశ్వర్యదము కపాలైశ్వరంబు;

తే॥ కుక్కుటేశంబు కాశికిఁగొంత వెలితి;
సోమనాథేశ్వరము ముక్తి సూచకంబు;
శ్రీమహేశ్వరతీర్థంబు శివుని మెచ్చు;
త్రిభువనాభ్యర్చితంబుమాతీర్థమనఘ! 74

అర్థము :- అనఘ=మహాత్మా! ఇంద్రేశ తీర్థంబు=ఇంద్రేశ తీర్థము; ఋషి= మహర్షుల చేత; సమాకీర్ణంబు=క్రిక్కిఱిసినది; సిద్ధేశ్వరము=సిద్ధేశ్వరమను తీర్థము; సర్వ సిద్ధికరము=అన్ని సిద్ధులను కలిగించునది;

యోగీశతీర్థంబు=యోగీశ తీర్థము; యోగలక్ష్మీదాయి=యోగసంపదనిచ్చునది; కాళేశ్వరము=కాళేశ్వర తీర్థము; భక్తకల్పతరువు=భక్తులకు కల్పవృక్షము.

శమనేశ తీర్థంబు=యమేశ్వర తీర్థము; శాంతి=సహనమును; దాంతి=కర్మేంద్రియ నిగ్రహమును; విధాయి=ఏర్పఱచునది; వీరభద్రేశంబు=వీరభద్రేశ్వర తీర్థము; విశ్వమతము= ప్రపంచమునకు పూజింపదగినది.

బ్రహ్మేశ తీర్థంబు=బ్రహ్మేశ్వరమను తీర్థము; బ్రహ్మర్షి=బ్రహ్మ ఋషులచేత; సేవ్యము =సేవింపబడునది; కపాలైశ్వర్యంబు=కపాలేశ్వర తీర్థము; అష్ట+ఐశ్వర్యదము=అష్టైశ్వర్యములనిచ్చునది.

కుక్కుటేశంబు=కుక్కుటేశ్వరతీర్థము; కాశికిన్=కాశీక్షేత్రమునకన్న; కొంత=కొంచెము; వెలితి=తక్కువైనది; సోమనాథేశ్వరము=సోమనాథేశ్వర తీర్థము; ముక్తికి=మోక్షమునకు; సూచకంబు=తెలుపునది; శ్రీమహేశ్వరతీర్థంబు=శ్రీమహేశ్వరమను తీర్థము; శివుని మెచ్చు= శివునికి ప్రీతికరము; ఉమాతీర్థము=ఉమాతీర్థము. త్రిభువన=ముల్లోకములచేత; అభ్యర్చితంబు=పూజింపబడినది.

భావము :- వ్యాసా! ఇంద్రేశ తీర్థమున మహర్షులు క్రిక్కిఱిసియుందురు. సిద్ధేశ్వర తీర్థము సర్వసిద్ధులను గలిగించునది. యోగేశతీర్థము యోగసంపద నొసగును. కాళేశ్వరతీర్థము భక్తుల పాలిటి కల్పవృక్షము. శమనేశ తీర్థము శాంతిదాంతుల నిచ్చును. వీరభద్రేశ్వర తీర్థము సర్వ ప్రపంచమునకు పూజింపదగినది. బ్రహ్మేశ్వరతీర్థమును బ్రహ్మర్షులు సేవింతురు. కపాలేశ్వర తీర్థము అష్టైశ్వర్యముల నిచ్చును. కుక్కుటేశ్వర తీర్థము ముక్తిని తెలుపును. మహేశ్వర తీర్థము శివుని మెప్పు పొందినది. ఉమాతీర్థమును ముల్లోకములు పూజించును.

విశేషము :- అష్టైశ్వర్యములు :- అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశిత్వము, వశిత్వము. వీనినే అష్టసిద్ధులందురు. చూ. 3. ఆ. 114

క॥ గూఢములు నిగూఢంబులు
గూఢాగూఢములు నగుచుఁ గోటుల సంఖ్యల్
గాఢ మహేశ్వర భక్తిని
రూఢిం దీర్థములు గలవు రుద్రుని వాటిన్. 75

అర్థము :- రుద్రుని వాటిన్=శివుని తోటయగు దక్షారామములో; గూఢములు= దాగియున్నవి-రహస్యమైనవి; నిగూఢంబులు=తెలియనివి; గూఢ+అగూఢములు=రహస్యమైనవి, ప్రకాశమైనవి; అగుచున్=అగుచు; కోటుల సంఖ్యల్=కోట్ల లెక్కగలిగి; తీర్థములు= పుణ్యజలాశయములు, గాఢ=గాఢమగు; మహేశ్వర=పరమేశ్వరుని యందలి; భక్తి=భక్తిచేత; నిరూఢిన్=మిక్కిలి ప్రసిద్ధమైనవి; కలవు=ఉన్నవి.

భావము :- దక్షారామమునందు రహస్యములు, మిక్కిలి రహస్యమైనవి; రహస్యములు, ప్రకాశములునైన తీర్థములు కోటాను కోట్లుగా పరమశివునందు భక్తి గలిగించునవి గలవు.

తే॥ గరుడ గంధర్వ యక్ష కిన్నరులచేత
దివిజ ఖేచర దైత్య దానవులచేత
ద్వాదశక్షేత్ర తీర్థమధ్యంబునందు
భక్తిశివలింగ కోటి నిల్పంగఁబడియె. 76

అర్థము :- గరుడ.....చేత. గరుడ=గరుడులచేత; గంధర్వ=గంధర్వులచేత; యక్ష=యక్షులచేత; కిన్నరులచేత=కిన్నరుల చేత; దివిజ.....చేత. దివిజ=దేవతల చేత; ఖేచర=ఆకాశచారులచేత; దైత్య=దితి సంతతిచేత; దానవులచేత=దను సంతతిచేత; ద్వాద..... నందు; ద్వాదశ=పండ్రెండు; క్షేత్రముల=క్షేత్రముల యొక్క; తీర్థ=తీర్థముల యొక్క; మధ్యంబునందు=మధ్యలో; భక్తిన్=భక్తితో; శివలింగ కోటి=శివలింగముల యొక్క కోటి; నిల్పంగఁబడియె=ప్రతిష్ఠింపబడెను.

భావము :- పండ్రెండు క్షేత్రముల తీర్థముల మధ్యమునందు గరుడులు, గంధర్వులు, యక్షులు, కిన్నరులు, అదితి కుమారులు, ఆకాశచారులు, దితి సంతతి, దనువు సంతతి భక్తితో కోట్ల కొలది శివలింగములను ప్రతిష్ఠించిరి.

క॥ ద్వాదశతీర్థక పరివే
షోదరమున భీమనాథుఁడుజ్జ్వలతేజః
ప్రాదుర్భావుండొప్పగు
నాదిత్యుఁడు పరిధి నడుమ నడరెడు భంగిన్. 77

అర్థము :- పరిధినడుమన్=పరివేషము మధ్యలో; ఆదిత్యుఁడు=సూర్యుడు; అడరెడు భంగిన్=శోభిల్లునట్లు; ద్వాదశ.....ఉదరమునన్. ద్వాదశ=పండ్రెండు; తీర్థక=తీర్థములనెడి, పరివేష=కైవారము యొక్క; ఉదరమునన్=మధ్యభాగమున; ఉజ్జ్వల=ప్రకాశవంతమగు; తేజస్=తేజస్సుతో; ప్రాదుర్భావుఁడు=అవతరించుట కలవాడగు; భీమనాథుఁడు=భీమేశ్వర స్వామి; ఒప్పు=సుందరుడు; అగున్=అగును.

భావము :- పరివేష మధ్యమునందు సూర్యుడు శోభిల్లునట్లు పండ్రెండు తీర్థముల కైవారము మధ్యమునందు ఉజ్జ్వలమగు తేజస్సుతో నవతరించిన భీమేశ్వరస్వామి ఒప్పియున్నాడు.

విశేషము :- సూర్యునకు, చంద్రునకు కొన్ని సమయములందు చుట్టును తెల్లని వలయమేర్పడును. దానిని పరివేషము అందురు. అది వర్షాది సూచకము.

అలంకారము - ఉపమ.

తే॥ ద్వాదశక్షేత్ర వికచ పత్రములతోడి
దక్షవాటిక యనెడి కెందమ్మి విరికి
సప్తగోదావరాంబు నిర్ఝరము తేనె
నడుమ రాయంచ శ్రీ భీమనాయకుండు. 78

అర్థము :- ద్వాదశ.....తోడి; ద్వాదశ=పండ్రెండు; క్షేత్ర=క్షేత్రములనెడి; వికచ=వికసించిన; పత్రముల తోడి=రేకులతోడి; దక్షవాటిక=దక్షారామము అను; కెంపు+తమ్మి విరికి=ఎఱ్ఱని తామరపూవునకు; సప్త.....నిర్ఝరము; సప్తగోదావర=సప్తగోదావర సరస్సులోని; అంబు నిర్ఝరము=సెలయేటి నీరు; తేనె=తేనె; నడుమ=దాని మధ్యముననున్న; రాయంచ=రాజహంస; శ్రీ భీమనాయకుండు=శ్రీ భీమేశ్వరస్వామి వారే.

భావము :- పండ్రెండు క్షేత్రములనెడి వికసించిన రేకులతో గూడిన దక్షారామమే ఎఱ్ఱని తామరపూవు. సప్తగోదావర ప్రవాహమే అందలి మకరందము. దానిమధ్యముననున్న శ్రీ భీమనాయకస్వామివారే రాజహంస.

విశేషము :- అలంకారము - రూపకము.

తే॥ భైమ మీశాన లింగం బపారతేజ
మక్షయం బప్రధృష్యం బనాదినిధన
మమ్మహాజ్యోతి రత్న దీపాంకురంబు
కనక గర్భాండ భవన విష్కంభమునకు. 79

అర్థము :- భైమము=భీమ సంబంధమగు; ఈశానలింగంబు=శివలింగము; అపార తేజము=అంతులేని తేజస్సుగలది; అక్షయంబు=నాశము లేనిది; అప్రధృష్యంబు=జయింప వీలుగాలేనిది; అనాది నిధనము=మొదలు చివర లేనిది; కనక.....విష్కంభమునకు; కనకగర్భ+అండ=బ్రహ్మాండమనెడి; భవన=మేడ యొక్క; విష్కంభమునకు=విస్తార(వైశాల్య)మునకు; ఆ+మహాజ్యోతి=ఆ గొప్ప వెలుగే; రత్నదీప+అంకురంబు=రతనముల దీపపు మొలక (అగును).

భావము :- భీమేశ్వర శివలింగము అపారమగు తేజముగలది; క్షయము లేనిది; జయింప వీలుగానిది; మొదలుగాని, తుదిగాని లేనిది. విశాలమగు బ్రహ్మాండమనెడి భవనమునకు ఆ మహాజ్యోతి రత్నదీపాంకురమగును.

విశేషము :- అలంకారము - రూపకము.

చ॥ అమృత పయోనిధానమున యందుదయించెఁగళా సమృద్ధిఁద
న్నమర సుధాకరుండు, నిజమారఁగఁజూచిన దక్షవాటికా
రమణుఁడు భీమ నాయకుఁడు రాజశిఖాభరణుండు; గానినాఁ
డమరమునీంద్ర సంఘము కరాంబుజముల్ మొగుడంగనేర్చునే? 80

అర్థము :- సుధాకరుండు=అమృతకిరణుడగు చంద్రుడు; అమృత పయోనిధానమున యందు; అమృతమయమగు సముద్రమునందు; కళాసమృద్ధిన్=కళల పెంపుతో; తన్పు=చల్లదనము; అమరన్=కలుగగా; ఉదయించెన్=పుట్టెను; నిజము=సత్యమును; ఆరఁగన్=ఒప్పుగా; చూచినన్=చూచినచో: దక్షవాటికా=దక్షారామమునందు; రమణుఁడు=క్రీడించువాడగు; భీమనాయకుఁడు=భీమేశ్వరుడు; రాజశిఖా+ఆభరణుండు=చంద్రుడు జటాజూటమునందు అలంకారముగాగలవాడు; కానినాఁడు=అట్లుకాని దినమున; అమర=దేవతల; ముని+ఇంద్ర=మునిశ్రేష్ఠుల; సంఘములు=సమూహము యొక్క; కర+అంబుజముల్=హస్తపద్మములు; మొగుడంగ నేర్చునే=ముడుచుకొనిపోగలుగునా?

భావము :- అమృత కిరణుడగు చంద్రుడు అమృతమయమగు సముద్రమునందు షోడశకళా పరిపూర్ణుడై చల్లదనము గలిగి జనించెను. నిజమును పరిశీలించినచో దక్షారామమున (క్రీడించు) కధిపతియగు భీమేశ్వరస్వామికి చంద్రుడు జటాజూటముపై నలంకారముగా నున్నాడు. కావుననే దేవతల, మునీంద్రుల హస్తపద్మములు ముకుళించుచుండును.

విశేషము :- పద్మములు సూర్యోదయమున వికసించును. చంద్రోదయమున ముకుళితములగును. శివుడు చంద్రశేఖరుడు గావున ఆయనను దర్శించిన అమర మునుల హస్తపద్మములు ముకుళించెనని కవి చమత్కరించెను.

అలంకారము :- శ్లేష : రూపకము.

తే॥ విమల పాథోధిఁబుట్టిన యమృతమూర్తి
భీమనాథుఁడు; మాస్వామి కేమి చోద్య
మహరహంబును బాదసేవానురక్త
భక్తజనలోక భవరోగ భంజనంబు. 81

అర్థము :- భీమనాథుఁడు=భీమేశ్వరస్వామి, విమల=నిర్మలమగు; పాథోధిన్=సముద్రమునందు; పుట్టిన=జన్మించిన; అమృతమూర్తి=సుధాస్వరూపుడు; అహరహంబును=

ప్రతిదినమును; పాద.....భంజనంబు; పాదసేవా=(తన) పాదముల యొక్క సేవయందు; అనురక్త=ప్రేమగల; భక్తజన=భక్తులగు నరుల యొక్క; లోక=సమూహము యొక్క; భవ= సంసారమనెడు; రోగ=అనారోగ్యమును; భంజనంబు=విఱచివేయుట; మాస్వామికి=మా ప్రభువగు భీమేశ్వరస్వామికి; ఏమిచోద్యము=ఏమి ఆశ్చర్యము(ఆశ్చర్యము కాదనుట).

భావము :- భీమేశ్వరస్వామి నిర్మలమగు సముద్రము నుండి జన్మించిన అమృత స్వరూపుడు. నిరంతరము తన పాదసేవ చేయుట యందనురక్తులగు జనుల సంసార తాపమనెడు రోగమును పోగొట్టుట ఆ స్వామికి అచ్చెరువగునా?

విశేషము :- అమృత పదమునకు ధన్వంతరి, ఔషధము, పాదరసము అనియు; సేవించుట అనగా సేవచేయుట, ఔషధమును పుచ్చుకొనుట అనియు, పాదమనగా చరణము, నాలుగవ వంతు అనియు. భవమనగా పుట్టుక, సంసారము, శ్రేష్ఠము అనియు నర్థములున్నవి.

ఉత్తమమగు ఔషధమును కొంచెము సేవించినను ఎంత గొప్ప రోగమైనను నశించునట్లు అమృతమూర్తియగు భీమేశ్వరస్వామి వారి పాదసేవ చేయువారికి భవము నాశమగును అను నర్థము ఇందలి పద శ్లేషచే కలుగుచున్నది.

అలంకారము :- శ్లేష : రూపకము.

తే॥ భీమనాథుని త్రిభువన స్వామి, నాథుఁ,
బార్వతీనాథు; శశ్వత్కృపాసనాథు,
దక్షవాటాధినాథు వేదత్రయైక
నాథు, నానాథుఁగొలుతు శ్రీనాథు నాథు. 82

అర్థము :- త్రిభువన=మూడులోకములకు; స్వామి=అధిపతియగు నింద్రునికి; నాథున్=ప్రభువైనట్టియు; పార్వతీ=పార్వతీదేవికి; నాథున్=భర్తయైనట్టియు; శశ్వత్=ఎల్లప్పుడు; కృపా=దయతో; సనాథున్=కూడినట్టియు; దక్షవాట=దక్షారామమునకు; అధినాథున్= సర్వాధికారియైనట్టియు; వేదత్రయ=మూడు వేదములకు; ఏకనాథున్=ప్రధాన దైవమును; నానాథున్=నాకు దిక్కైనట్టియు; శ్రీనాథు నాథున్=విష్ణువునకు ప్రభువైన; భీమనాథున్= భీమేశ్వరస్వామిని; కొలుతున్=సేవింతును.

భావము :- భీమేశ్వరస్వామి మూడులోకములకు అధిపతియగు నింద్రునికిని అధిపతియైనవాడు. పార్వతీదేవికి భర్త. నిరంతరము దయాసహితుడు. దక్షారామమునకు సర్వాధికారి. ఋగ్యజుస్సామములను మూడు వేదములచే ప్రతిపాద్యదైవము. విష్ణువునకును స్వామియైనవాడు. నాకు దిక్కైన ఆ స్వామిని సేవింతును.

విశేషము :- ఇందు నాథపదము పలుమారులు ఆవృత్తినందినది. "న అథ విద్యతే ఇతినాథః" ఇంతకన్నను వేరు దిక్కు లేదు అను వ్యుత్పత్తిని నాథశబ్దమునకు జెప్పిరి. "నాథ్" అను ధాతువునకు 'అచ్' ప్రత్యయము చేరగా నాథ శబ్దమేర్పడినది. ఈ ధాతువునకు యాచించుట, కష్టము కలిగించుట, ఆశీర్వదించుట, ప్రభువగుట అనునవి అర్థములు. "శ్రీనాథు నాథు" అను సమాసము గ్రంథకర్తయగు శ్రీనాథునికి దిక్కైన స్వామి అను భావము వ్యక్తమగును.

సీ. భవు, భవానీభర్త, భావ సంభవ వైరి,
భవరోగ భంజను భాలనయను,
భోగప్రదుని, భోగి, భోగిరాజ విభూషు,
భూనభోఽభివ్యాప్త, భువన వంద్యు,
భగవంతు, భర్గుని, భసితాంగ రాగుని,
భానుకోటి ప్రభాభాసమాను,
భాగీరథీమౌళి, భగదృగ్విపాటను,
భూరథాంగుని, భద్రభూతిధరుని,

తే. భామినీ సువిలాసార్థ వామ భాగు,
భక్తితోడ భజింపరో భవ్యమతులు
భావనా భాజుల కతండు ఫలము లొసఁగు
భాగ్య సౌభాగ్య వైభవ ప్రాభవములు. 83

అర్థము : భవున్=అంతయు తానేయగువానిని, భవానీ భర్తన్=పార్వతీపతిని, భావసంభవ=(మనస్సులో పుట్టువానికి) మన్మథునికి, వైరిన్=శత్రువును, భవ=సంసారమను, రోగ=రోగమును, భంజనున్=విఱుచువానిని, భాలనయనున్=నుదుటియందు కన్నుగలవానిని.

భోగప్రదున్=భోగముల నిచ్చువానిని, భోగిన్=(సర్వము) ననుభవించు వానిని, భోగిరాజ=సర్పశ్రేష్ఠుడగు వాసుకి, విభూషున్=అలంకారముగా గలవానిని, భూ=భూమిని, నభస్=ఆకసమును, అభివ్యాప్తున్=అంతట వ్యాపించిన వానిని, భువనవంద్యు=సర్వ లోకములకు నమస్కరింపదగినవానిని.

భగవంతున్=షడ్గుణైశ్వర్య సంపన్నుని, భర్గునిన్=కామకాలాదులను కాలపాకము బొందించిన వానిని, భసిత=భస్మమే, అంగరాగుని=మైపూతగ గలవానిని, భానుకోటి= కోటిమంది సూర్యుల, ప్రభా=కాంతివంటి కాంతితో, భాసమాను=ప్రకాశించువానిని.

భాగీరథీమౌళిన్=గంగశిరస్సున గలవానిని, భగ=భగుడను సూర్యుని యొక్క, దృక్=కంటిని, విపాటనున్=పెఱికివైచినవానిని, భూ=భూమియే, రథాంగునిన్=రథమునకు అవయవముగా గలవానిని, భద్ర=మంగళకరమగు, భూతి=విభూతిని, ధరుని=తాల్చినవానిని.

భామినీ....భాగు, భామినీ=స్త్రీయే, సువిలాస=చక్కని విలాసమునకై, అర్ధ=సగము, వామభాగున్=(శరీరములో) ఎడమ భాగమైన వానిని, భవ్యమతులు=శుభమనస్కులారా, భక్తితోడన్=భక్తితో, భజింపరో=సేవింపుడు, అతండు=ఆయన, భావనాభాజులకు=భక్తికి పాత్రులగువారికి, భాగ్య=ధనము, సౌభాగ్య=సౌందర్యము, వైభవ=ఐశ్వర్యము, ప్రాభవములు= ప్రభుత్వము అను, ఫలములు=లాభములను, ఒసఁగున్=ఇచ్చును.

భావము :- పవిత్ర మనస్కులారా! అంతయు తానేయగువాడును, పార్వతీపతి, సంసార రోగనాశకుడు, భాలనేత్రుడు, భోగములనిచ్చువాడు, సర్వమునుభవించువాడు, సర్వాలంకారుడు, భూమ్యాకాశములను వ్యాపించియున్నవాడు, సమస్తలోకములచే నమస్కరింపబడువాడు, షడ్గుణైశ్వర్య సంపన్నుడు, తేజోరూపుడు, భస్మమే మైపూతగాగలవాడు, కోటి సూర్యులవలె ప్రకాశించువాడు, గంగాధరుడు, భగుని కన్నులను పెరికివైచినవాడు, భూమిరథావయమైనవాడు, మంగళకరమగు విభూతిదాల్చినవాడు, అర్ధనారీశ్వరుడగు పరమేశ్వరుని భక్తితో స్తుతింపుడు. ఆ స్వామి భక్తిపాత్రులగు వారికి ధనము, సౌందర్యము, ఐశ్వర్యము, అధికారము అను సత్ఫలముల నొసగును.

విశేషము :- ఇందు భకారాది పదములను కవి యుపయోగించెను. సమగ్రమగు నైశ్వర్యము, వీర్యము, యశస్సు, శ్రీ జ్ఞానము, వైరాగ్యము అను నాఱును భగసంజ్ఞితములు. అవి గలవాడు భగవంతుడు.

"భాగ్య సౌభాగ్య వైభవ ప్రాభవములు" - అన్న తేటగీతి పాదము యథాతథముగా శృంగార నైషధమునందు (8-203); హరవిలాసమునందు (1-3); కాశీఖండమునందు (3-187) కన్పడుచున్నది. ద్వాదశాదిత్యులలలో భగుడొకడు.

'భ'వర్ణా వృత్తిచే - వర్ణవిన్యాస వక్రత

క॥ **తేజిత విష్ణు శిలీముఖుఁ**
**దేజఃప్రదు దక్షవాటి తీర్థైక మహా**
**రాజాధిరాజ రాజును**
**రాజకళాధరు భజింపరారో విబుధుల్!** 84

అర్థము :- తేజిత=పదును పెట్టబడిన; విష్ణు=విష్ణువను; శిలీముఖున్=బాణము గలవాడును; తేజస్+ప్రదున్=కాంతినిచ్చువాడును; దక్ష.....రాజును; దక్షవాటి=దక్షారామమను; తీర్థ=పుణ్యక్షేత్రమునకు; ఏక=ఒకే ఒక; మహారాజ=గొప్పరాజులకు; అధిరాజ=చక్రవర్తులకు; రాజును=ప్రభువైన; రాజకళాధరున్=చంద్రరేఖను దాల్చిన భీమేశ్వరస్వామిని; భజింపన్= సేవింపగా; విబుధుల్=దేవతలారా(పండితులారా), రారో=రండు.

భావము :- పదునైన విష్ణువను బాణము గలట్టియు, కాంతినిచ్చునట్టియు, దక్షారామ పుణ్యక్షేత్రమునకు సర్వరాజాధిరాజుల కేకైక సమ్రాట్టును; చంద్రరేఖను జటాజూటమున దాల్చిన భీమేశ్వరస్వామిని సేవింప విబుధులారా! రండు.

విశేషము :- త్రిపుర దాహ సమయమున శివునకు విష్ణువు బాణమయ్యెను. చూ. 4. ఆ. 127.ప.

క॥ రారోప్రియ శుద్ధాంత వ
రారోహావహులు విబుధులంబుజ హంస
క్షీరామలదేహుని ద
క్షారామపురీనివాసు నభవుని గొలువన్. 85

అర్థము :- ప్రియ....వహులు; ప్రియ=ఇష్టమైన; శుద్ధాంత=అంతఃపురములోని; వరారోహా=స్త్రీలను; వహులు=భరించు; విబుధులు=దేవతలారా! అంబుజ.....దేహుని. అంబుజ=పద్మము వలెను; హంస=హంసవలెను; క్షీర=పాలవలెను; అమల=స్వచ్ఛమైన; దేహుని=శరీరముగలట్టియు; దక్ష.....నివాసున్; దక్షారామ=దక్షారామమనెడు; పురీ=పట్టణమే; నివాసున్=కాపురముగాగల; అభవునిన్=భీమేశ్వరుని; కొలువన్=సేవించుటకు; రారో=రండు.

భావము :- ప్రియమైన అంతఃపుర స్త్రీల రక్షణ భారము వహించు దేవతలారా! దక్షారామపురీ నివాసుడగు భీమేశ్వరస్వామిని దర్శింప రాణివాసముతో రండు. ఆ దేవుడు పద్మమువలెను, హంసవలెను, పాలవలెను, నిర్మల శరీరుడు. నిర్మల విజ్ఞాన విగ్రహుడు.

ఉ॥ నంది వినాయకాది గణనాథులు గూడి ధృతాస్త్రశస్త్రులై
యెందఱు పాళెముందురు మహీధరకన్యకు సావధానులై
నంది వినాయకాది గణనాథులు గూడి ధృతాస్త్రశస్త్రులై
యందఱు పాలెముందురు మహాప్రభువీటికి దక్షవాటికిన్. 86

అర్థము :- నంది.....నాథులు. నంది=నందీశ్వరుడు; వినాయక=వినాయకుడు; ఆది=మొదలగు; గణనాథులు=ప్రమథగణముల నాయకులు; ధృత=ధరింపబడిన; అస్త్ర=

(మంత్రయుక్తముగా ప్రయోగింపబడు) ఆయుధములు, శస్త్రులు+ఐ=సామాన్యముగ నుపయోగించు ఆయుధములు గలవారై; కూడి=కలిసి; సావధానులు+ఐ=శ్రద్ధగలవారై; మహీధరకన్యకు=పార్వతీదేవికి; ఎందఱు=ఎంతమంది; పాళెముందురు=కావలియుందురో; నంది.....నాథులు; నంది=నందీశ్వరుడు; వినాయక=వినాయకుడు; ఆది=మొదలగు; గణనాథులు=ప్రమథ గణముల నాయకులు; ధృత=ధరింపబడిన; అస్త్రశస్త్రులు+ఐ= అస్త్రములు శస్త్రములు గలవారై; కూడి=కలిసి; అందఱు=అంతమందియు; మహాప్రభు= మహాచక్రవర్తియగు భీమేశ్వరుని, వీటికిన్=నగరమగు, దక్షవాటికిన్= దక్షారామమునకు, పాళెముందురు=కావలియుందురు.

భావము :- నందీశ్వరుడు, వినాయకుడు మున్నగు ప్రమథగణ నాయకులు శస్త్రాస్త్రములను ధరించి సావధానులై యెంతమంది పార్వతీదేవికి - విశాలాక్షీదేవికి కావలియుందురో అందఱును - అనగా నందీశ్వరుడు, వినాయకుడు మున్నగు ప్రమథగణ నాయకులు శస్త్రాస్త్రములను దాల్చి యేకమై భీమేశ్వరస్వామి నగరమగు దక్షారామమునకు కావలియుందురు.

విశేషము :- ఈ పద్యము నందు మొదటి పాదము, మూడవ పాదము సమానము. సమానత్వము సూచించుటకై శ్రీనాథుడిట్లు వ్రాయుచుండును. కాశీఖండము నందు కూడ వింధ్య పర్వతమునకు, మేరు పర్వతమునకు సమానత్వము సూచించుటకై ఇట్లే సమానపాదములు వ్రాసినాడు. (కాశీ. 1-103)

నాతో నీవిపు డెట్టు లాడితి ప్రధానత్వం బపేక్షించి ప్ర
స్ఫీతాటోప మహాప్రతాప గుణ గంభీరార్థ యుక్తంబుగా
నాతో నట్లన యాడె మేరువు ప్రధానత్వం బపేక్షించి ప్ర
స్ఫీతాటోప మహాప్రతాప గుణ గంభీరార్థ యుక్తంబుగా.

సీ॥ **భానుమండలములు పండ్రెండు నుదయించి**
**కఱవాడి బిట్టెండ కాయకుండ,**
**సంరంభమున నేడు ఝంఝూనిలంబులు**
**వెగ్గలంబగు మ్రోఁత విసర కుండఁ,**
**బుష్కలావర్తకంబులు లోనుగాఁగల**
**క్రొమ్మేఘములు వృష్టి గురియ కుండఁ,**
**బఱపి లంఘించి సప్త మహార్ణవంబులు**
**విన్నంది పెనువెల్లి విరియకుండ,**

తే॥ నాజ్ఞ వెట్టించుఁ బ్రమథ నాయకుల చేత
విశ్వపతి యైన భీమేశ్వరేశ్వరుండు
దక్షవాటికి నాత్మ శుద్ధాంతమునకు
నవహిత స్వాంతుఁ డగుచుఁ గాలాంత వేళ. 87

**అర్థము :-** కాల+అంతవేళన్=ప్రళయకాలమునందు; విశ్వపతి+ఐన=ప్రపంచము నకు ప్రభువగు; భీమేశ్వర+ఈశ్వరుండు=భీమేశ్వరస్వామి; అవహిత=ఏకాగ్రమగు; స్వాంతుఁడు= మనస్సుగలవాడు; అగుచున్=అగుచు; ఆత్మ=తనయొక్క; శుద్ధాంతమునకు=అంతఃపుర మగు; దక్షవాటికిన్=దక్షారామమునకు.

భానుమండలములు=సూర్యమండలములు; పంద్రెండు=పది రెండు; ఉదయించి= ఉదయించి; కఱవాడి=మిక్కిలి తీవ్రమగు; బిఱ్ఱు=ఉద్ధతమగు; ఎండ=ఎండ; కాయకుండన్= ప్రసరింపకుండగను.

ఏడు ఝంఝా+అనిలములు=వానలతో గూడిన ఏడు గాలులు; సంరంభమునన్= ఆటోపముతో; వెగ్గలంబు+అగు=అధికమగు; మ్రోఁతన్=ధ్వనితో; విసరకుండన్=వీచకుండను;

పుష్కలావర్తకంబులు=పుష్కలావర్తకములు; లోనుగాన్+కల=మొదలుగానున్న; క్రొత్త+మేఘములు=క్రొంగ్రొత్తవగు మేఘములు; వృష్టి=వర్షము; కురియకుండన్= కురియకుండగను.

సప్తమహార్ణవములు=మహాసముద్రము లేడును; పఱపి=విరివిగలిగి; లంఘించి= దూకి; విన్ను+అంది=ఆకసమునంటి; పెనువెల్లి=పెద్ద ప్రవాహము; విరియకుండన్=ఉప్పొంగ కుండగను.

ప్రమథ నాయకులచేత=ప్రమథగణముల నేతలచేత; ఆజ్ఞ+పెట్టించు=ఆజ్ఞను చేయించును.

**భావము :-** విశ్వప్రభువగు భీమేశ్వరస్వామి ప్రళయకాలమునందు తన అంతఃపుర మగు దక్షారామమును రక్షించుటలో సావధానుడై పంద్రెండు సూర్యమండలములు నొకేమారు ఉదయించి మిక్కిలి తీక్ష్ణము, తీవ్రమునగు ఎండ కాయకుండునట్లును; వానలతో గూడిన గాలులేడును సంరంభముతోడను, అధిక ధ్వనితోడను వీచకుండునట్లును; పుష్కలావర్త కాదులగు క్రొంగ్రొత్త మేఘములు వర్షములు కురియకుండగను, మహాసముద్రము లేడును విస్తారములై లంఘించి ఆకసము నంటుచు మహాప్రవాహములతో ఉప్పొంగకుండగను ప్రమథగణముల ఆజ్ఞల చేత అదుపుచేయించును.

విశేషము :- ధర్మరాజునకు మార్కండేయ మహర్షి ప్రళయ ప్రకారమును జెప్పిన వృత్తాంతము సంస్కృత మహాభారతము అరణ్యపర్వము 18వ అధ్యాయములోను; ఆంధ్ర మహాభారతము అరణ్యపర్వము చతుర్థాశ్వాసము 242 నుండి 250 వరకుగల గద్య పద్యములలో నున్నది. మహాయుగ సహస్ర పర్యంత కాలము బ్రహ్మకొకదినము. ఆ దినాంతమున ప్రళయము గలుగును. అప్పుడు గలుగు ప్రకృతి నాశమునే శ్రీనాథుడు సూచించెను. దక్షారామము పరమశివ స్థానమగుటచే ప్రళయకాలమునను చెక్కుచెదరదు. ఆయన కాలకాలుడు, మహాకాలుడు గదా!

ద్వాదశాదిత్యులు :- ధాత, మిత్రుడు, అర్యముడు, రుద్రుడు, వరుణుడు, సూర్యుడు, భగుడు, వివస్వంతుడు, పూష, సవిత, త్వష్ట, విష్ణువు.

సప్తమారుతములు :- చూ.3.ఆ.48 పద్యవిశేషములు.

పుష్కలా(రా)వర్తకములు. (రలయోరభేదః)

పుష్కరానామ యేమేఘా బృహంతస్తోయమత్సరాః

పుష్కరావర్తకాస్తేన కారణేనేహ శబ్దితాః (విష్ణుపురాణము)

పుష్కరములను మేఘములు జలమును ఆవర్తనము (భ్రమణము) చేయుటచేత పుష్కరావర్తక శబ్దముచే జెప్పబడినవి. మేఘముల నాయకునొకనిని జ్యోతిషము పుష్కరుడనినది. మేఘముల మాతృవంశ పితృవంశములలో ప్రధానపురుషులు పుష్కరుడు, ఆవర్తకుడుగావచ్చును. వారి సంతతియగు మేఘునే మేఘసందేశమున యక్షుడు "జాతం వంశే భువన విదితే పుష్కరావర్తకానాం" అని ప్రశంసించెను. ప్రళయకాలమునందు సృష్టిని సంహారమొనర్చు మేఘములు పుష్కరావర్తకములు.

సప్త సముద్రములు :- "లవణ క్షీర దధ్యాజ్య సురేక్షు స్వాదువారయః" (అభిధాన చింతామణి). లవణ సముద్రము, క్షీర సముద్రము, దధి సముద్రము, ఆజ్య సముద్రము, సురా సముద్రము, ఇక్షు సముద్రము, మధురజల సముద్రము అనునవి.

తే॥ భైరవుం డర్ధరాత్రంబు ప్రహరి దిరుగుఁ
బాయకుండును నడురేయి ప్రమథ గణము
గవని కాఁపుల వారు దిక్పాలవరులు
దక్షవాటికి భీమేశుధామమునకు." 88

అర్థము :- భీమేశు=భీమేశ్వరస్వామి యొక్క; ధామమునకు=గృహమగు; దక్షవాటికి= దక్షారామమునకు; అర్ధరాత్రంబు=నడిరేయి; భైరవుండు=భైరవుడు; ప్రహరి దిరుగున్=(రక్షణకై)

ప్రహరించుట్టును తిరుగును; ప్రమథగణము=ప్రమథుల సమూహము, నడురేయి=అర్ధరాత్రి సమయమునందును; పాయకుండును=(ఆ నగరమును) వీడకుండును; దిక్పాలవరులు= దిక్కులను రక్షించువారగు దేవతలు, గవని=సింహద్వారమునకు; కాఁపులవారు=కావలి కాయువారు.

భావము :- భీమేశ్వరుని నివాసమగు దక్షారామమునకు అర్ధరాత్రి సమయమునందును భైరవుడు రక్షణగా ప్రాకారము చుట్టు తిరుగును. ప్రమథగణము నడురేయి సమయములోను ఆ పట్టణమును వదలకుండనుండును. దిక్పాలకులందఱును సింహద్వారమును రక్షించు చుందురు."

వ॥ అని ప్రసంగించి శివలింగార్చనా పరాయణుండైన మైత్రావరుణుండు త్రిలింగ విషయ మంగళాలంకారంబగు భీమేశ్వర మండలంబునఁ బంద్రెండు శివలింగ స్థానంబులు వివరించువాఁడై యిట్లనియె. 89

అర్థము :- శివలింగ=శివలింగమును; అర్చన=పూజించుట యందు; పరాయణుండు=తత్పరత గలవాడు; ఐన=అయినట్టి; మైత్రావరుణుండు=అగస్త్యుడు; అని=అని, ప్రసంగించి=విస్తరించి మాటాడి; త్రిలింగ విషయ=త్రిలింగ(తెలుగు) దేశమునకు; మంగళ+ అలంకారంబు+అగు=శోభాకరమగు భూషణమైన, భీమేశ్వర మండలంబునన్=భీమమండల ములో; పంద్రెండు=పదిరెండు; శివలింగస్థానంబులు=శివలింగములున్న ప్రదేశములను గూర్చి; వివరించువాఁడు+ఐ=విస్తరించి చెప్పువాడై; ఇట్లు=ఈవిధముగా; అనియెన్=అనెను.

భావము :- శివలింగార్చనాపరుడగు అగస్త్యుడు పైరీతిగా విస్తారముగా చెప్పి త్రిలింగ దేశమునకు మంగళాలంకారమగు భీమమండలములోగల పంద్రెండు శివలింగ స్థానములను వివరింపగోరి ఇట్లనెను.

తే॥ "ఉత్సవంబుత్సవము దప్పకుండ సురలు
వత్తు రౌత్సుక్యమున దక్షవాటమునకు
శాంభవీశక్తి మర్త్యవేషంబు దాల్చి
భీమలింగంబు త్రిభువన స్వామిఁగొలువ. 90

అర్థము :- శాంభవీశక్తిన్=పరమేశ్వరుని శక్తియగు మాణిక్యాంబను; త్రిభువన=మూడు లోకములకు; స్వామిన్=ప్రభువగు; భీమలింగంబున్=భీమేశ్వర లింగమును; కొలువన్= సేవించుటకై; ఉత్సవంబు+ఉత్సవము=పండుగకు పండుగకు; సురలు=దేవతలు; మర్త్యవేషంబున్=మానవ వేషమును, తాల్చి=ధరించి; దక్షవాటమునకు=దక్షారామమునకు; ఔత్సుక్యమునన్=తీవ్రమగు కోరికతో; తప్పకుండ=విడువకుండ; వత్తురు=వచ్చుదురు.

భావము :- "పరమేశ్వరుని శక్తియగు దేవిని, ముల్లోకముల కధిపతియగు భీమేశ్వర లింగమును సేవించుటకు ప్రతి పండుగకు దేవతలు మానవ వేషము దాల్చి దక్షారామమునకు తీవ్రమగు కాంక్షతో విడువక వత్తురు.

క॥ తాండవమాడుఁ గుమార శి
ఖండి మహోత్సవము వేళ గంభీరములై
డిండిమ నిర్ఘోషంబులు
పండువు పండువున నుఱుము భంగి వహింపన్. 91

అర్థము :- పండువు పండువున=ప్రతి పండుగయందును; మహా+ఉత్సవము వేళన్=మహోత్సవ సమయమున; డిండిమ=తప్పెట, డోలు యొక్క; నిర్ఘోషంబులు=పెద్దపెద్ద ధ్వనులు; గంభీరములై=భరింపరానివై; ఉఱుము భంగిన్=ఉఱుము రీతిని; వహింపన్= ధరింపగా; కలుగునప్పుడు; కుమారశిఖండి=కుమారస్వామి వారి నెమలి; తాండవమాడున్= నృత్యము చేయును.

భావము :- ప్రతి పండుగయందు జరుగు మహోత్సవములో డిండిమ ధ్వనులు ఉఱిమినట్లు మ్రోగుచుండుటచేత కుమారస్వామి నెమలి సంతోషముతో నృత్యము చేయును.

విశేషము :- భ్రాంతిమదలంకారము.

తే॥ మర్త్యభామలు విబుధ భామలును గలిసి
యుత్సవములందు వర్తించుచున్నయపుడు
దక్షవాటంబువీట భేదంబు దెలియు
దృఙ్నిమేషానిమేష ప్రదీప్తి వలన. 92

అర్థము :- మర్త్యభామలు=మానవ స్త్రీలును; విబుధ భామినులు=దేవకాంతలును; దక్షావాటంబు వీటన్=దక్షారామ నగరములో; ఉత్సవములందు=ఉత్సవములలో; కలిసి= కలిసి; వర్తించుచున్నయపుడు=ఉన్న సమయమున; దృక్.....వలన. దృక్=కన్నుల యొక్క; నిమేష=రెప్పపాటుల; అనిమేష=రెప్పపాటు లేకుండుటల యొక్క; ప్రదీప్తి వలన=కాంతి వలన; భేదంబు=భేదము; తెలియున్=తెలియును.

భావము :- దక్షారామములో జరుగు నుత్సవములలో మానవ స్త్రీలు, (మానవ స్త్రీల రూపముతో) దేవకాంతలు పాల్గొందురు. కనురెప్పపాటు ఉండుటచేత వీరు మానవ స్త్రీలనియు, రెప్పపాటు లేకపోవుటచేత తక్కినవారు దేవకాంతలనియు తెలియును.

విశేషము :- చెమటపట్టకుండుట, అనిమేషత్వము, పాదములు నేలకానకుండుట, ధరించిన పూలమాలలు వాడకుండుట మున్నగునవి పంచనళీయములో ఇంద్రాది దేవతల కుండుటయు, నలుడు తద్భిన్నముగా నుండుటయు దమయంతి నలుని గుర్తించుటకు హేతువులయ్యెనని మహాభారతము అరణ్యపర్వములోని నలోపాఖ్యానములో (అధ్యా 57. శ్లో.24) - గలదు.

అలంకారము :- విశేషకము.

శా॥ అర్కేందూపల రత్ననిర్మిత మహాహర్మ్యాగ్ర భాగంబులం
దార్కొన్ తారకమండలంబుగని ముగ్ధ స్త్రీలు రేలప్పురిం
గర్కంధూఫల సన్నిభంబయిన ముక్తాజాల మన్శంక చేఁ
దర్కింపం దిలకించి నవ్వుదురు గంధర్వాంగనా పల్లవుల్. 93

అర్థము :- రేలు=రాత్రులందు; ఆ+పురిన్=ఆ పట్టణములో; ముగ్ధ స్త్రీలు=అమాయిక స్త్రీలు; అర్క.....భాగంబులన్=అర్క+ఇందు+ఉపల రత్న=సూర్యకాంత చంద్రకాంతమణుల చేత; నిర్మిత=కట్టబడిన; మహా హర్మ్య=గొప్పవైన మేడల యొక్క; అగ్రభాగంబులన్=పై భాగములందు; తార్కొన్= తాకునట్టి; తారకమండలంబున్=నక్షత్రమండలమును; కని=చూచి; కర్కంధూ ఫల=గంగరేగు పండ్లతో; సన్నిభంబు+అయిన=సమానమయిన; ముక్తాజాలము= ముత్తెముల సమూహము; అన్=అను; శంకచేన్=ఆలోచనతో; తర్కింపన్=ఊహింపగా; తిలకించి=చూచి; గంధర్వ+అంగనా=గంధర్వ కాంతల యొక్క; పల్లవుల్=విటులు; నవ్వుదురు=పరిహసింతురు.

భావము :- దక్షారామములో రాత్రులందు అమాయికలగు స్త్రీలు సూర్యకాంతమణులు చంద్రకాంతమణులచేత నిర్మితములగు ఆకసమునంటు పెద్ద పెద్ద మేడల పైభాగములను తాకునట్టి నక్షత్ర సమూహమును జూచి ఆ నక్షత్రములు గంగరేగు పండులంతటి ముత్యములే అను నాలోచనతో నూహించుచుందురు. వారి ముగ్ధత్వము కాంచి దేవయోని విశేషమగు గంధర్వ స్త్రీల విటులు పరిహసించుచుందురు.

విశేషము :- అలంకారము - భ్రాంతి.

తే॥ దక్షముని రాజు నంతరుద్యానవనము
దక్షవాటంబు శివుని యుత్తమ పురంబు
బహుళకైవల్యఫల ధర్మపాదపంబు
దీనిఁ గాతురు చుట్టును దిరిగి సురలు. 94

**అర్థము :-** దక్షవాటంబు=దక్షారామము; శివుని=శంకరుని యొక్క; ఉత్తమపురంబు=శ్రేష్ఠమగు పట్టణము; అగునది, దక్ష.....వనము. దక్ష=దక్షుడను; మునిరాజు=మునిశ్రేష్ఠుని యొక్క; అంతర్+ఉద్యానవనము=రాణివాసమునకు సంబంధించిన తోట; బహుళ..... పాదపంబు= (అది) బహుళ=అధికమైన; కైవల్య=మోక్షమనెడి; ఫల=పండ్లను (ఇచ్చు); ధర్మపాదపంబు=ధర్మరూపమగు వృక్షము; దీనిన్=ఈ ఉద్యాన రూపమగు దక్షవాటమును, సురలు=దేవతలు; చుట్టును=నలువైపుల; తిరిగి=ప్రదక్షిణము చేసి; కాతురు=రక్షింతురు.

**భావము :-** శివుని ఉత్తమ పట్టణమగు దక్షారామము మహర్షి శ్రేష్ఠుడగు దక్షుని రాణివాసపు ఉద్యానవనము. ఇది సమృద్ధమైన మోక్షఫలములనిచ్చు ధర్మరూపమగు వృక్షము. దేవతలు దీని చుట్టును ప్రదక్షిణము చేయుచు రక్షించుచుందురు.

**విశేషము :-** అలంకారము - రూపకము.

**తే॥** **గౌరి యొక్కతె యాకాశ గంగ యొకతె**
**కాశి యొక్కతె దక్షిణకాశి యొకతె**
**నలుగురును శంభునకు లోక నాయకునకు**
**రాణివాసంబు లనురాగ రసము పేర్మి.** 95

**అర్థము :-** గౌరి=పార్వతి; ఒక్కతె=ఒకతెయును; ఆకాశగంగ=గంగానది; ఒకతె= ఒకతెయును; కాశి=వారాణసి; ఒక్కతె=ఒకర్తుకయును; దక్షిణకాశి=దక్షిణ దేశములోగల దక్షారామము; ఒకతె=ఒకతెయును; నలుగురును=నలుగురును; అనురాగ=ప్రేమ యొక్క; రస=సారము యొక్క; పేర్మిన్=అతిశయము చేత; లోకనాయకునకు=లోకములను నడిపించువాడగు; శంభునకు=శివునకు; రాణివాసంబులు=భార్యలు.

**భావము :-** పార్వతీదేవి, గంగానది, కాశి, దక్షిణకాశి అను నీ నలుగురు లోకనాయకుడగు శంకరునకు అనురాగాధిక్యముచేత అంతఃపుర స్త్రీలు - భార్యలు.

**వ॥** **ఒక్క సమయమ్మున మహేంద్రుండు దక్షారామమ్మున కేతెంచి భీమమండలంబునందు.** 96

**అర్థము :-** ఒక్క సమయమ్మున=ఒకానొకప్పుడు; మహేంద్రుండు=ఇంద్రుడు; దక్షారామమ్మునకు=దక్షారామమునకు; ఏతెంచి=వచ్చి; భీమమండలంబునందు= భీమమండలమునందు.

**భావము :-** ఒకప్పుడు ఇంద్రుడు దక్షారామము దర్శింపవచ్చి భీమమండలములో (తరువాతి పద్యముతో నన్వయము)

కం॥ శోభన ముహూర్తమున భుజ
గాభరణుఁ బ్రతిష్ఠ చేసి యర్చించి మహా
వైభవ మొనర్చి పొందె మ
నోభిమతము విబుధ నాథుఁ డధిక స్ఫురణన్. 97

అర్థము :- విబుధ నాథుఁడు=దేవతలకు ప్రభువగు నింద్రుడు; అధిక స్ఫురణన్=మిక్కుటమగు స్ఫూర్తితో; శోభన=మంగళకరమగు, ముహూర్తమునన్=ముహూర్తములో; భుజగ+ఆభరణున్=సర్పములే అలంకారములుగాగల శివుని; ప్రతిష్ఠ చేసి=ప్రతిష్ఠించి; అర్చించి=పూజించి; మహావైభవము=గొప్ప సంపదను; ఒనర్చి=కలిగించి; మనస్+అభిమతము=మనస్సులో కోరుకొన్నది; పొందెన్=పొందెను.

భావము :- ఇంద్రుడు అధికమగు స్ఫూర్తితో శుభముహూర్తములో పరమేశ్వరుని ప్రతిష్ఠచేసి పూజించి మహత్తర సంపదను కల్పించి కావలసిన కోరికలను పొందెను.

తే॥ దేవతా భర్త శంభుఁ బ్రతిష్ఠఁజేసి
సుర గణంబుల లోక పాలురను జూచి
యనియె "మీరును భీమనాయకుని వీట
సిద్ధ శివలింగములఁ బ్రతిష్ఠింప వలయు. 98

అర్థము :- దేవతా భర్త=దేవేంద్రుడు; శంభున్=శివుని; ప్రతిష్ఠన్=ప్రతిష్ఠను; చేసి=చేసి; సురగణంబులన్=దేవతల సమూహమును; లోకపాలురను=లోకములను పాలించు వారిని; చూచి=చూచి; అనియెన్=ఇట్లనెను; మీరును=మీరుగూడ; భీమనాయకుని=భీమేశ్వరస్వామి యొక్క; వీటన్=పట్టణమునందు; సిద్ధ శివలింగములన్=అలౌకిక శక్తి సంపన్నములగు శివలింగములను, ప్రతిష్ఠింప వలయున్=ప్రతిష్ఠ చేయవలయును.

భావము :- ఇంద్రుడు శివలింగ ప్రతిష్ఠచేసి దేవగణమును, దిక్పాలకులను జూచి ఇట్లనెను. "మీరును భీమేశ్వరస్వామి పట్టణములో సిద్ధ శివలింగములను ప్రతిష్ఠింపవలయును.

## ఇంద్రుఁడు దేవతలకు శివలింగ మాహాత్మ్యంబు చెప్పుట :

సీ॥ శ్రీకంధరుని ప్రతిష్ఠించు నెవ్వఁడు వాఁడు
పాపి యైనను శంభు పదము గాంచు;
శివలింగ పదయాత్ర శివలింగ సంవీక్ష
శివలింగ సంస్పృష్టి శివ సమర్చ;
నాక లోకాధిరాజ్యైక కారణము లౌ

నయమార సాధారణ స్థలములఁ;
గల్యాణ భోగ మోక్ష నివాసమైన యీ
దక్షవాటీపుర స్థానభూమిఁ;

తే॥ జెప్పనేఁటికి? సకల సంసిద్ధి గోరి
దక్షిణాంభో నిధానంబు తటము నందు
సంప్రతిష్ఠింపుఁ డీశానుఁ జంద్రమౌళి
విశ్వలోకాధినాథు నో విబుధులార! 99

అర్థము :- ఓ విబుధులార!=ఓ దేవతలారా! ఎవ్వఁడు=ఎవడు; శ్రీకంధరుని=(విషము కుత్తుకలో గల) శివుని; ప్రతిష్ఠంచున్=ప్రతిష్ఠ చేయునో; వాఁడు=అతడు; పాపి+ఐనను= పాపములుగల వాడైనను; శంభుపదమున్=శివుని నివాసమును; కాంచున్=పొందును; సాధారణ స్థలములన్=సామాన్యమయిన ప్రదేశములలో; శివలింగ=శివలింగమును దర్శించుటకు; పదయాత్ర=నడిచిచేయు యాత్రయును; శివలింగ=శివలింగమును; సంవీక్ష= దర్శించుటయు; శివలింగ=శివలింగము యొక్క; సంస్పృష్టి=సంబంధమును; శివ=శివుని యొక్క; సమర్చ=పూజించుటయు; నాక.....కారణములు; నాకలోక=స్వర్గలోకము యొక్క; అధిరాజ్య=చక్రవర్తిత్వమునకు; ఏక కారణములు=ప్రధాన హేతువులు; నయమారన్= న్యాయముగా; ఔన్=అగును; కల్యాణ.....ఐన; కల్యాణ=మంగళములకు; భోగ=సుఖములకు; మోక్ష=ముక్తికి; నివాసము=ఉనికి; ఐన=అయినటువంటి; ఈ దక్షవాటీపురీ స్థానభూమిన్= దక్షారామ పట్టణమునకు స్థానమైన ఈ ప్రదేశమును గూర్చి; చెప్పనేఁటికి=వేరె చెప్పవలసిన దేమున్నది? సకలసంసిద్ధిన్=సమస్త కాంక్షల యొక్క చక్కని సిద్ధిని; కోరి=కోరి; దక్షిణ.....అందు. దక్షిణ=దక్షిణ దిక్కునగల; అంభోనిధానంబు=సముద్రము యొక్క; తటమునందు= తీరమునందు; విశ్వ=ప్రపంచములోని; లోక=లోకములకు; అధినాథున్=ప్రభువైనట్టియు; చంద్రమౌళిన్=చంద్రుడు శిరస్సున గలట్టియు; ఈశానున్=శివుని; సంప్రతిష్ఠింపుఁడు=చక్కగా ప్రతిష్ఠచేయుడు.

భావము :- దేవతలారా! పరమేశ్వర ప్రతిష్ఠచేయువాడు ఎంత పాపాత్ముడైనను పరమ శివపదమునందును, సాధారణ స్థలములందును ధర్మానుసారము శివలింగము వద్దకు నడచిపోవుటయు, శివలింగమును దర్శించుటయు, శివలింగ సంబంధమును, శివలింగ మును పూజించుటయు స్వర్గరాజ్యపదవి నందుటకు ప్రధాన కారణములు. అట్టితతి శుభము లకు, సుఖములకు, మోక్షమునకు నివాసమగు దక్షారామమును గూర్చి వేరె చెప్పవలయునా?

కావున మీరు సర్వకాంక్షా పరిపూర్తినిగోరి దక్షిణ సముద్ర తీరమునందు సర్వలోకములకు దిక్కు అయినట్టి వాడును, చంద్రమౌళియునగు శివుని ప్రతిష్ఠింపుడు.

కం॥ సిద్ధించు మీ కభీష్టము;
సిద్ధమిది యమర్త్యులార! శీఘ్రమున జటా
రుద్ధశశి మహోపనిష
త్సిద్ధాంత రహస్యమును బ్రతిష్ఠింపుఁడిఁకన్. 100

అర్థము :- అమర్త్యులార=దేవతలారా! మీకు=మీకు; అభీష్టము=కోరిక; సిద్ధించున్=సిద్ధించును; ఇది=ఈ మాట; సిద్ధము=ప్రసిద్ధమైనది. జటా= జటాజూటమునందు; రుద్ధ=అరికట్టబడిన; శశి=చంద్రుడుగల; మహా.....రహస్యమును; మహా= గొప్పవగు; ఉపనిషత్=వేదాంతముల యొక్క; సిద్ధాంత=నిర్ణయమైన; రహస్యమును=రహస్య విషయమైన శివుని; ఇఁకన్=ఇక; శీఘ్రమునన్=త్వరగా; ప్రతిష్ఠింపుఁడు=ప్రతిష్ఠచేయుడు.

భావము :- దేవతలారా! మీకోరికలన్నియును సిద్ధించునను విషయము పూర్వమే సిద్ధమయినది. కావున మహత్తరములగు నుపనిషత్తులచే నిశ్చయింపబడిన రహస్యమును, శశిమౌళియగు శివుని ఇక త్వరగా ప్రతిష్ఠింపుడు.

తే॥ దర్శనము కంటె మేలు సంస్పర్శనంబు;
సంస్పృశించుట కంటె నర్చనము లెస్స;
యర్చనము సేయుకంటె ననంత ఫలద
మసిత గళుని ప్రతిష్ఠించు టమరులార! 101

అర్థము :- అమరులార=దేవతలారా! అసితగళుని=(నల్లదనము కంఠమునందుగల) శివుని; దర్శనము కంటెన్=దర్శించుట కంటె; సంస్పర్శనంబు=తాకుట; మేలు=శ్రేష్ఠము; సంస్పృశించుట కంటెన్=చక్కగా స్పృశించుట కంటె; అర్చనము=పూజించుట; లెస్స=మేలైనది; అర్చనము=పూజ; చేయు కంటెను=చేయుటకన్న; ప్రతిష్ఠించుట (శివలింగమును) ప్రతిష్ఠ చేయుట; అనంత ఫలదము=లెక్కకు మించిన పుణ్యఫలమునిచ్చును.

భావము :- దేవతలారా! శివలింగ దర్శనమునకన్న స్పృశించుట, దానికన్నను పూజించుట శ్రేష్ఠము. అర్చించుట కంటెను శివలింగ ప్రతిష్ఠ చేయుట అనంతమైన పుణ్యఫలమునిచ్చును.

**విశేషము** :- ఇందు ఉత్తరోత్తరాధిక్యము చెప్పబడినది. సారాలంకారము.

సీ॥ సకల లోక ప్రపంచమును లింగ మయంబు,
త్రిజగంబు లింగ ప్రతిష్ఠితంబు,
సంభవ స్థితి లయ స్థానంబు లింగంబు,
లీనార్థ గమకంబు లింగమనఁగ,
లింగ ప్రసాదంబు లేక సిద్ధింపవు
భోగమోక్షంబు లే యోగములును;
లింగాజ్ఞ వెలిగాఁగ లేశ మాత్రంబును
సంచలింపదు పో తృణాంచలంబు;
తే॥ మంటినైనను లింగంబు మలిచి కొలుఁడు;
ఇసుక నైనను లింగంబు నేర్చి కొలుఁడు;
పేఁడ నైనను లింగంబుఁ బెట్టి కొలుఁడు;
నీట నైనను లింగంబు నిలిపి కొలుఁడు." 102

అర్థము :- సకల=సమస్తమైన; లోక=లోకములతో గూడిన; ప్రపంచమును= విశ్వమును; లింగమయంబు=లింగ వికారమే; త్రిజగంబు=ముల్లోకమును; లింగ=లింగము నందే; ప్రతిష్ఠితంబు=నెలకొల్పబడినది;

లింగంబు=శివలింగము; సంభవ.....స్థానంబు. సంభవ=(ప్రపంచ) సృష్టికి; స్థితి= ఉనికికి: లయ=నాశమునకు; స్థానంబు=తావైనది; లింగము+అనఁగ=లింగము అనగా; లీన+అర్థ=లీనము అను నర్థమును; గమకంబు=బోధకము;

లింగ ప్రసాదంబు=శివలింగము యొక్క అనుగ్రహము; లేక=లేకుండ; భోగ మోక్షంబులు=సుఖములు, ముక్తి అనునవియు; ఏ యోగములును=(హఠము మున్నగు) ఏయోగములును; సిద్ధింపవు=సమకూరవు.

లింగ+ఆజ్ఞ=శివలింగము యొక్క అనుమతి; వెలి+కాఁగన్=లేకుండ; తృణ+ అంచలంబు=గడ్డిపోచకొన గూడ; లేశమాత్రంబును=కొంచెము గూడ; సంచలింపదుపో= కదలదు సుమా!

మంటిని+ఐనను=మట్టినైనను; లింగంబు=శివలింగముగా; మలిచి=నిర్మించి; కొలుఁడు=సేవించుడు; ఇసుకను+ఐనను=ఇసుకనైనను; లింగంబున్=శివలింగముగా; ఏర్చి= ఏర్పఱచి; కొలుఁడు=కొలువుడు; పేఁడనైనను=పేడతోనైనను; లింగంబు=శివలింగమును; పెట్టి=ఉంచి; కొలుఁడు=సేవింపుడు; నీటను+ఐనను=నీటితోనైనను; లింగంబు=శివలింగము ను; నిలిపి=నిర్మించి; కొలుఁడు=సేవింపుడు.

భావము :- సమస్త ప్రాణులతో గూడిన విశ్వమంతయు శివలింగవికారమే. ముల్లోకము శివలింగములోనే నెలకొని యున్నది. సృష్టి స్థితిలయములు శివలింగ స్వరూపమే. సమస్తము తనయందు లీనమైయుండు ననునర్థమును సూచించునది లింగము. భోగ మోక్షములును, ఎటువంటి యోగములును శివలింగానుగ్రహము లేక సిద్ధింపవు. శివలింగమునాజ్ఞ లేక గడ్డి పోచమొనకొద్దిగ కూడ కదలదు. కాబట్టి మట్టితోనైన శివలింగమును చేసి కొలువుడు. ఇసుకను లింగాకారముగా నేర్పఱచి కొలువుడు. పేడతోనైన లింగమును చేసి పూజింపుడు. నీటిలోనైనను లింగమును ప్రతిష్ఠించి కొలువుడు."

విశేషము :- "లీనార్థగమకం చిహ్నం లింగమిత్యభిధీయతే". అవ్యక్తావస్థనందిన పరతత్త్వమును సూచించునది (లీన+గ) లింగమని చెప్పబడుచున్నదని శివపురాణములోని విద్యేశ్వర సంహితలో గలదు.

లింకారం లయమిత్యుక్తం గకారం సృష్టిరుచ్యతే,
లయనాదుదయం ప్రోక్తం లింగ శబ్ద మితీరితమ్.

"లిం" అనునది లయము అని చెప్పబడినది. "గ" కారము సృష్టిని చెప్పును. లయము నుండి ఉదయము - సృష్టి జరుగునని చెప్పునది లింగ శబ్దము. అని కారణాగమము.

"విష్ణువు ఇంద్రనీల మణిమయ లింగమును, ఇంద్రుడు పద్మరాగమయమును, కుబేరుడు హిరణ్యకృతమును, విశ్వేదేవతలు రజతమయమును, వసువులు కాంతికమును (పాదరసమును), వాయువు ఆరకూట (ఇత్తడి) మయమును, అశ్వినులు పార్థివము(మట్టి)ను, వరుణుడు స్ఫటికమయమును, ఆదిత్యులు తామ్ర నిర్మితమును, సోముడు మౌక్తికకృతమును, అనంతాది నాగులు ప్రవాళమయమును, దైత్యులు, రాక్షసులు అయో(ఇనుము) మయమును, గుహ్యకులు త్రిలోహ మయమ్మును, గణములు సర్వ లోహ మయమును, చాముండాది మాతలు సైకతమయమును, నైరృతి దారు నిర్మితమును, యముడు మరకతమయమును, నీలాదులు రుద్రులు భస్మమయమును, లక్ష్మీ(బిల్వ) వృక్షమయమును, లక్ష్మియు, స్కందుడు, గోమయాత్మకమును, మునులు కుశాగ్రమయమును, వామాదులు పుష్పలింగమును, మనోన్మని గంధలింగమును, సరస్వతి రత్నమయమును, దుర్గ హైమమును, మంత్రములు ఆజ్యమయమును, వేదములు దధిమయమును, పిశాచములు సీస నిర్మితమును, బ్రహ్మప్రసాదము వలన విశ్వకర్మ నిర్మితములను స్వీకరించిరి. (లింగపురాణము అధ్యా.74. శ్లో.1. నుండి 11 వఱకు).

**వ॥ అనియుపన్యసించి యింద్రుండు తానును లోకపాలకులును దివిజులునుం దమతమ పేర శివలింగంబులఁ బ్రతిష్ఠించిరి.** 103

అర్థము :- అని=అని; ఉపన్యసించి=విస్తరించి చెప్పి; ఇంద్రుండు=ఇంద్రుడు; తానును=తానును; లోకపాలకులును=అన్నిలోకములను రక్షించువారును; దివిజులునున్=దేవతలును; తమతమ పేర=తమతమ నామములతో, శివలింగంబులన్=శివలింగములను, ప్రతిష్ఠించిరి=నిలిపిరి.

భావము :- అని విస్తరించి చెప్పి ఇంద్రుడును, లోకపాలకులు, దేవతలు తమతమ నామములతో శివలింగములను ప్రతిష్ఠించిరి.

మ॥ హిమధామార్ధ జటా కిరీటుఁడభవుం డింద్రేశ్వరుం డింద్రుచే
నమరవ్రాతముతోడఁ గూడఁగఁ బ్రతిష్ఠాంతంబునం భక్తి సం
భ్రమ తాత్పర్య సమగ్రుచేఁ గయికొనెం బాథోధి వధ్వాపగా
విమల స్వర్ణ సరోజ పూజ హృదయావిర్భూత సంతుష్టిమై. 104

అర్థము :- హిమ.....కిరీటుఁడు; హిమధామ=(చల్లని కాంతిగల) చంద్రుని యొక్క; అర్ధ=సగము గల; జటా=జడలే; కిరీటుఁడు=మకుటముగా గలట్టియు; ఇంద్రేశ్వరుండు= ఇంద్రేశ్వరుడను పేరుగల; అభవుండు=శివుడు; అమరవ్రాతము తోడన్=దేవతా సమూహముతో; కూడఁగన్=కలియగా; భక్తి.....సమగ్రుచేన్; భక్తి=భయముతో గూడిన ప్రేమ; సంభ్రమ=తొట్రుపాటు; తాత్పర్య=భగవంతుని యందు లీనమగుట అనునవి; సమగ్రుఁడై= సంపూర్ణముగా గలవాడైన; ఇంద్రుచేన్=ఇంద్రునిచేత; ప్రతిష్ఠా+అంతంబునన్=ప్రతిష్ఠ చేయబడిన తరువాత; హృదయ=మనస్సునందు; ఆవిర్భూత=కలిగిన; సంతుష్టిమైన్= సంతృప్తితో; పాథోధి.....పూజన్; పాథోధి=సముద్రుని యొక్క; వధూ= భార్యయగు గంగ యందలి; విమల=నిర్మలమైన-స్వచ్ఛమైన; స్వర్ణసరోజ=బంగారు కమలములతోడి; పూజన్= పూజను; కయికొనెన్=స్వీకరించెను.

భావము :- జటాజూటమునందు చంద్రరేఖగల ఇంద్రేశ్వరనామకుడగు శివుడు ప్రతిష్ఠితుడయిన తరువాత భక్తి, తొట్రుపాటు, తాత్పర్యముగల ఇంద్రుడు దేవతలతోగూడి ఆకాశగంగలోని బంగరు తామరపూవులతో జేసిన పూజను మనస్సులో సంతృప్తికలుగగా స్వీకరించెను.

ఉ॥ ఆగమ మంత్రతంత్రములు సాంగములై నడువంగ సర్వవి
ద్యాగురుఁడైన ప్రెగ్గడ బృహస్పతి తోడుగ వీతిహోత్ర ధి
గ్భాగమునం బురందరుఁడు భక్తి ఘటించిన వాసవేశ్వరున్
భోగి విభూషణుం గొలుచు పుణ్యుల కబ్బును భోగ మోక్షముల్. 105

అర్థము :- ఆగమ=వేదములందలి; మంత్రతంత్రములు=ఋక్కులు, కర్మకాండలు; స+అంగములై=అంగములతో గూడినవై; నడువంగన్=సంచరింపగా; సర్వవిద్యా=విద్యలన్నింటికి; గురుఁడు+ఐన=ఆచార్యుడైన; ప్రెగ్గడ=మంత్రియగు; బృహస్పతి=గురువు; తోడుగ=సహాయముగా; వీతిహోత్ర దిగ్భాగమునన్=ఆగ్నేయ దిక్కునందు; పురందరుఁడు=ఇంద్రుడు; భక్తితో=భక్తితో; ఘటించిన=ప్రతిష్ఠించిన; వాసవేశ్వరున్=ఇంద్రేశ్వరుడను పేరుగల; భోగివిభూషణున్=(సర్పములే అలంకారములుగా గల) శివుని; కొలుచు=సేవించు; పుణ్యులకున్=పుణ్యముగలవారికి; భోగమోక్షముల్=సుఖములు ముక్తి అనునవి; అబ్బును=లభించును.

భావము :- వేదములందలి మంత్రములు, ప్రతిష్ఠా విధానము అన్ని అంగములతో గూడి యథావిధిగా ప్రవర్తింపగా, సమస్త విద్యలను బోధించువాడు మంత్రియగు బృహస్పతి సహాయకుడు కాగా, ఇంద్రుడు ఆలయమునకు ఆగ్నేయ దిక్కునందు భక్తితో ప్రతిష్ఠ చేసిన ఇంద్రేశ్వర శివలింగమును సేవించు పుణ్యాత్ములకు సర్వ సుఖములు, ముక్తియు లభించును.

తే॥ ఇంద్రుఁ డేఁటేఁట జాతర కేఁగుదెంచి
సప్తగోదావరమున సుస్నాతుఁడగుచు
భుజగభూషణు నింద్రేశుఁ బూజసేయు
ధవళ మందార తరు పుష్ప దామములను. 106

అర్థము :- ఇంద్రుఁడు=ఇంద్రుడు; ఏఁటన్+ఏఁటన్=ప్రతి సంవత్సరము; జాతరకు=యాత్రకు; ఏఁగుదెంచి=వచ్చి; సప్తగోదావరమునన్=సప్తగోదావర సరస్సులో; సుస్నాతుఁడు=యథావిధిగా స్నానము చేసినవాడు; అగుచు=అగుచు; భుజగ భూషణున్=సర్పములే అలంకారముగాగల; ఇంద్రేశున్=ఇంద్రేశ్వర శివలింగమును; ధవళ..... దామములను; ధవళ=తెల్లని, మందారతరు=మందారమను వృక్షము యొక్క; పుష్పదామములను=పూలమాలతో; పూజసేయున్=పూజించును.

భావము :- ఇంద్రుడు ప్రతి సంవత్సరమును దక్షారామమునకు యాత్రకు వచ్చి సప్తగోదావరములో యథావిధిగా స్నానము చేసి సర్పాలంకారుడగు ఇంద్రేశ్వర స్వామిని తెల్లని మందార పూలమాలతో పూజించును.

క॥ ఇంద్ర ప్రతిష్ఠితుండగు
నింద్రేశ్వరుఁ గొలువ నెవ్వఁ డేకాగ్రతమై
రుంద్రమతి సప్తసింధువు
నం ద్రిషవణ మాడు నతఁడు నాకంబెక్కున్. 107

అర్థము :- ఇంద్ర ప్రతిష్ఠితుండు+అగు=ఇంద్రునిచే నెలకొల్పబడిన వాడైన; ఇంద్రేశ్వరున్=ఇంద్రేశ్వరుని; ఎవ్వఁడు=ఎవడు; ఏకాగ్రతమైన్=ఒకేవిషయమునందు లగ్నమై; రుంద్రమతిన్=విస్తరించిన మనస్సుతో, సప్తసింధువునన్=సప్తగోదావరములో; త్రిషవణము= మూడు కాలములందు; ఆడున్=స్నానము చేయునో; అతఁడు=వాడు; నాకంబు=స్వర్గమును; ఎక్కున్=అధిరోహించును.

భావము :- ఇంద్రునిచే ప్రతిష్ఠ చేయబడిన ఇంద్రేశ్వరుని, ఏకాగ్రత విస్తరించిన మనస్సుతో సేవించుటకై బయలుదేరి సప్తగోదావరములో త్రికాల స్నానము చేయువాడు దేహాంతమున స్వర్గము నధిరోహించును.

క॥ సకృ దాలోకనమున మఱి
సకృదర్చన సకృదుపాస సకృదానతులన్
సకృదాలయ ప్రదక్షిణ
సకృజ్జపంబుల మహేంద్ర శంభుఁడు మెచ్చున్. 108

అర్థము :- (తన్ను) సకృత్=ఒక్కమారు; ఆలోకనమునన్=దర్శించుట చేతను; మఱి= మఱియు; సకృత్.....ఆనతులన్; సకృత్=ఒక్కమారు; అర్చన=పూజించుట చేతను; సకృత్= ఒక్కమారు; ఉపాస=ధ్యానించుట చేతను; సకృత్=ఒక్కమారు; ఆనతులన్= నమస్కారముల చేతను; సకృత్.....జపంబులకు. సకృత్=ఒక్కమారు; ఆలయ=తన దేవాలయమునకు; ప్రదక్షిణ=ప్రదక్షిణము చేయుట చేతను; సకృత్=ఒక్కమారు; జపంబులన్= జపము చేయుట చేతను; మహేంద్ర శంభుఁడు=ఇంద్రుడు ప్రతిష్ఠ చేసిన శివుడు; మెచ్చున్= మెచ్చుకొనును.

భావము :- ఇంద్రుడు ప్రతిష్ఠించిన శివలింగము; తన్ను ఒక్కమారు దర్శించినను; పూజించినను, ధ్యానించినను, నమస్కరించినను, తదాలయమునకు ప్రదక్షిణము చేసినను, జపము చేసినను సంతోషించును.

విశేషము :- సకృత్ అను అవ్యయము పూజావిధానములోని క్రియలకన్నింటికి కలిసియుండుట ఇంద్రేశ్వర మాహాత్మ్య సూచకము.

తే॥ ఇంద్ర పద భోగ మెవ్వఁడే నభిలషించు
నాతఁ డింద్రేశ్వరేశ్వరు నాలయమునఁ
బ్రణవ పంచాక్షరీ మంత్రపాఠ నియతి
నమ్మహాఫల మొందుఁ దత్ప్రార్థమిదియ. 109

అర్థము :- ఎవ్వఁడేన్=ఎవ్వడైనను; ఇంద్రపద=ఇంద్రుని పదవి యందలి; భోగము=అధికారమును, సుఖమును; అభిలషించున్=కోరునో; అతఁడు=వాడు; ఇంద్రేశ్వర+ఈశ్వరు=ఇంద్రేశ్వరుడను శివుని యొక్క, ఆలయమునన్=నివాసమునందు; ప్రణవ..... నియతిన్; ప్రణవ=ఓంకారముతో గూడిన; పంచాక్షరీ=అయిదు అక్షరములుగల; మంత్ర=మంత్రము యొక్క; పాఠ=చదువుట-జపించుటయును; నియతి=నియమము చేత; ఆ+మహాఫలమున్=ఆ గొప్పదగు ఫలితమును; ఒందున్=పొందును; ఇది+అ=ఇదే; తత్త్వ+అర్థము=సత్యమైన ప్రయోజనము-వస్తు స్థితి.

భావము :- ఇంద్ర పద భోగమును గోరువాడు ఇంద్రేశ్వరస్వామి దేవాలయములో ఓంకారపూర్వకమగు పంచాక్షరీ మంత్రమును నియమపూర్వకముగ జపించినచో ఆ మహాఫలమును పొందును. ఇదియే యథార్థము.

తే॥ స్నాన దానాగ్నిహోత్ర దీక్షావిధాన
మంత్ర వాదములైన కర్మంబులొకటి
కోటి గుణితంబు శ్రీదక్షవాటియందు
సప్తగోదావరేంద్రేశ సవిధ భూమి. 110

అర్థము :- శ్రీ దక్షవాటియందు=మోక్షదాయకమగు దక్షారామమునందలి; సప్త.....భూమి. సప్తగోదావర=సప్తగోదావర సరస్సు (సమీపము) నందలి; ఇంద్రేశ= ఇంద్రేశ్వరుడను శివుని యొక్క; సవిధ భూమిన్=సమీప ప్రదేశమునందు; స్నాన.....ఐన; స్నాన=స్నానము; దాన=దానము; అగ్నిహోత్ర=హోమము; దీక్షా=నియమము; విధాన=అనుష్ఠానము; మంత్ర వాదములు+ఐన=మంత్రోపదేశము అను; కర్మంబులు=పుణ్యకార్యములు; ఒకటి=ఒక్కొక్కటి - ప్రతి యొకటి; కోటి గుణితంబు=కోటితో హెచ్చింపబడినది - కోటిరెట్లు(అగును).

భావము :- దక్షారామములోని సప్తగోదావరీ తీరమునందుగల ఇంద్రేశ్వరుని సమీప భూమియందు చేసిన స్నానము, దానము, హోమము, నియమము, అనుష్ఠానము, మంత్రోపదేశము అను పుణ్యకార్యములలో ప్రతి యొకటియు కోటిరెట్లు పుణ్యమునిచ్చును.

వ॥ అటమీఁద సిద్ధేశ్వర స్థానంబు సిద్ధలింగాధిష్ఠితంబు. ధర్మార్థకామ మోక్షపురుషార్థ సిద్ధికై యాసిద్ధ లింగంబు సిద్ధులచేతఁ బ్రతిష్ఠింపఁబడి, సిద్ధసాధ్య గంధర్వ గీర్వాణ విద్యాధరారాధ్యంబై యుండు; నాస్థానంబు దక్షయజ్ఞ ప్రాగ్వంశక్షేత్రంబు. 111

అర్థము :- అటమీఁద=దాని తరువాత; సిద్ధేశ్వర స్థానంబు=సిద్ధేశ్వరమను ప్రదేశము; సిద్ధలింగ=సిద్ధ లింగముచేత; అధిష్ఠితంబు=ఉనికిగా జేసికొనబడినది; ధర్మ.....సిద్ధికై. ధర్మ=ధర్మము; అర్థ=అర్థము; కామ=కామము; మోక్ష=మోక్షమునను; పురుషార్థ=మానవ ప్రయోజన

ములు; సిద్ధికై=ఈడేరుటకై; సిద్ధులచేత=సిద్ధులను దేవజాతి వారిచేత; ఆ సిద్ధలింగంబు=ఆ సిద్ధలింగము; ప్రతిష్ఠింపబడి=స్థాపింపబడి; సిద్ధ.....ఆరాధ్యము; సిద్ధ=సిద్ధులు; సాధ్య= సాధ్యులు; గంధర్వ=గంధర్వులు; గీర్వాణ=సురలు; విద్యాధర=విద్యాధరులు - అను దేవ జాతులచేత; ఆరాధ్యంబు=పూజింపబడునది; ఐ+ఉండున్=అయియుండును. ఆ స్థానంబు= ఆ ప్రదేశము; దక్షయజ్ఞ=దక్షుని యొక్క యజ్ఞమునకు; ప్రాగ్వంశ=యజ్ఞశాలకు సమీపమునగల; క్షేత్రంబు=భూమి.

**భావము :-** దాని తరువాత సిద్ధలింగమునకు నివాసమైన సిద్ధేశ్వర స్థానము. సిద్ధులు ధర్మార్థ కామమోక్షములను చతుర్విధ పురుషార్థముల సిద్ధినిగోరి ఆ లింగమును ప్రతిష్ఠించిరి. ఆ శివలింగమును సిద్ధులు, సాధ్యులు, గంధర్వులు, సురలు, విద్యాధరులు అను దేవజాతి వారు సేవించుచుందురు. ఆ స్థానము దక్షుని యజ్ఞశాలకు సమీపమునగల ప్రదేశము.

క॥ జపహోమ దానయజ్ఞము
లుపవాసాది వ్రతంబు లొక్కక్కటి కో
టి పరిమితంబులు సిద్ధే
శ పదంబున సాధకులకు సత్యం బరయన్. 112

**అర్థము :-** సిద్ధేశ పదంబున=సిద్ధేశ్వరలింగ స్థానమునందు; జప=(మంత్ర)జపము; హోమ=హోమము; దాన=దానము; యజ్ఞములు=యజ్ఞములును; ఉపవాస+ఆది= (నియమాంగముగా) భోజనము చేయకుండుట మున్నగు; వ్రతంబులు=వ్రతములు; ఒక్క+ ఒకటి=ప్రతి యొకటియు; సాధకులకు=సాధన చేయువారికి; కోటి పరిమితంబులు=కోటితో సమానములు; అనుట; అరయన్=చూడగా; సత్యంబు=నిజము.

**భావము :-** సిద్ధేశ్వరలింగ సమీపమునందు సాధకులకు జపము, హోమము, దానము, యాగము, ఉపవాసము మున్నగు వ్రతములు ఒక్కొక్కటి కోటి సంఖ్యతో సమానమగును.

**వ॥ మఱి యోగీశ్వరంబను స్థానంబునందు యోగీశ్వరేశ్వరుండు సనక సనందనాది యోగీశ్వరులచేతం బ్రతిష్ఠితుం డని చెప్పంబడును.** 113

**అర్థము :-** మఱి=మఱియు; యోగీశ్వరంబు=యోగీశ్వరము; అను స్థానంబునందు= అనుపేరుగల చోట; యోగీశ్వరేశ్వరుండు=యోగీశ్వరుడను పేరుగల శివుడు; సనక సనందన+ ఆది=సనకుడు, సనందనుడు మున్నగు పేరులుగల; యోగీశ్వరుల చేతన్=యోగిశ్రేష్ఠులచేత; ప్రతిష్ఠితుండు=నిలుపబడినవాడు; అని=అని; చెప్పంబడును=చెప్పబడును.

**భావము :-** ఇంకను యోగీశ్వరము అను ప్రదేశమునందు సనక సనందనాదులగు యోగీశ్వరులు యోగీశ్వరుడు అను పేరుతో శివలింగ ప్రతిష్ఠ చేసిరి అని చెప్పుదురు.

విశేషము :- సనక సనందన సనత్కుమార సనత్సుజాతులను నలువురు బ్రహ్మ మానస పుత్రులు. నిరంతరము పరమాత్మను మనస్సులలో అనుసంధానము చేయువారు.

**ఆ॥ అది భవాబ్ధి తరణి, యదిసాధకవ్రాత**
**కల్పవృక్ష, మది జగత్ప్రసిద్ధ,**
**మది యుపాసకులకు నణిమాదికైశ్వర్య**
**లాభమునకుఁ గరతలంబు పసిఁడి. 114**

అర్థము :- అది=ఆ యోగీశ్వర స్థానము; భవ=సంసారమనెడి; అబ్ధి=సముద్రమును (దాటుటకు); తరణి=నావ; అది=ఆ ప్రదేశము; సాధక వ్రాత=సాధనము చేయువారి సమూహమునకు; కల్పవృక్షము=కోరినవి ఇచ్చు చెట్టు; అది=ఆ స్థానము; జగత్=లోకములో; ప్రసిద్ధము=ప్రఖ్యాతము; అది=ఆ నెలవు; ఉపాసకులకున్=భక్తులకు; అణిమ+ఆదిక=అణిమ మున్నగు; ఐశ్వర్య=సంపదలయొక్క; లాభమునకున్=ప్రాప్తికి; కరతలంబు=అరచేతి యందలి, పసిఁడి=బంగారము(అగును).

భావము :- ఆ యోగీశ్వరస్థానము సంసార సాగరమును దాటుటకు నావయును, సాధకులకు కల్ప వృక్షమును, లోకములో ప్రసిద్ధమును, ఉపాసకులకు అణిమ మున్నగు ఐశ్వర్యములను ఇచ్చుటకు అరచేతిలోనున్న బంగారమునునై యున్నది.

విశేషము :- దేవలోకమునందలి కాంక్షితముల నిచ్చు వృక్షములు అయిదున్నవి. 1.మందారము, 2. పారిజాతము, 3. సంతానము, 4. కల్పవృక్షము, 5. హరిచందనము.

అణిమాదికైశ్వర్యములు-8. అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశిత్వము, వశిత్వము.

"తతోఽణిమాది ప్రాదుర్భావః".....యోగదర్శనము. 3పా. 45 సూ. పంచభూత జయము చేత నణిమాదులగు నష్టసిద్ధులు సాధకునకు వ్యక్తములగును. వాని స్వరూపమిది.

1. అణిమ :- అణువుతో సమానముగా రూపము ధరించుట.
2. మహిమ :- శరీరమును పెద్దదిగా జేయుట.
3. గరిమ :- శరీరమును బరువుగా జేయుట.
4. లఘిమ :- దేహమును తేలిక చేయుట.
5. ప్రాప్తి :- కోరిన భౌతిక పదార్థమును సంకల్ప మాత్రమున పొందుట.
6. ప్రాకామ్యము :- భౌతిక పదార్థ కాంక్ష నిర్విఘ్నముగా, అనాయాసముగ పూర్ణమగుట.
7. ఈశిత్వము :- భూత భౌతిక పదార్థములను నానారూపముల నుత్పన్నముల నొనర్చుట. వానిని శాసింపగలుగుట.

8. వశిత్వము :- పంచభూతములను తజ్జన్య పదార్థములను వశము చేసికొనుట.

అలంకారము :- రూపకము.

సీ॥ మంకణుండను మహామౌని యోగీశ్వర
  శ్రీమహాదేవుని శివు భజించి
బ్రహ్మ సాక్షాత్కార పర్యంతమైన ప్ర
  బోధ సంపద ముక్తి పొలము గాంచె;
నొకమాఱు సప్తసింధూదకంబులఁ గ్రుంకి
  నరుఁడు యోగీశ్వరేశ్వరుని గాంచ
నణిమాదికాష్ట విధైశ్వర్య సంసిద్ధిఁ
  బొందు; యోగీశు నర్ధేందు ధరుని

తే॥ సప్తగోదావరము నీట జలక మార్చి
పుష్ప గంధాక్షతమ్ములఁ బూజచేసి
కలి భవంబైన కలుషంబు గ్రాఁచిపుచ్చి
మర్త్యుఁ డొందును వేగం బమర్త్య పదవి. 115

అర్థము :- మంకణుండు+అను=మంకణుడను పేరుగల; మహామౌని=గొప్ప ముని; యోగీశ్వర=యోగీశ్వరుడను పేరుగల. శ్రీమహాదేవుని=దేవతలలో శ్రేష్ఠుడైన; శివున్=శంకరుని; భజించి=సేవించి.

బ్రహ్మ=పరమాత్మ యొక్క; సాక్షాత్కార పర్యంతము+ఐన=ప్రత్యక్షము వరకైన; బోధ సంపదన్=జ్ఞానమను సంపత్తితో; ముక్తిపొలమున్=మోక్ష ప్రదేశమును; కాంచెన్=పొందెను.

నరుఁడు=మనుజుడు; ఒకమాఱు=ఒక్కమాఱు; సప్తసింధు=సప్త గోదావరము యొక్క; ఉదకంబులన్=నీటిలో; క్రుంకి=స్నానము చేసి; యోగీశ్వర=యోగీశ్వరుడను నామముగల; ఈశ్వరునిన్=శివుని; కాంచన్=దర్శింపగా; అణిమ+ఆదిక=అణిమ మొదలగు; అష్టవిధ= ఎనిమిది రీతులైన; ఐశ్వర్య=ఈశ్వరత్వము యొక్క; సంసిద్ధిన్=ఉత్తమమగు సిద్ధిని; పొందున్= పొందును.

మర్త్యుఁడు=నరుడు; యోగీశున్=యోగీశుడను; అర్ధ+ఇందుధరుని=అర్ధచంద్రుని తలదాల్చిన శివుని; సప్త గోదావరము=సప్త గోదావరమునందలి; నీటన్=జలముతో; జలక మార్చి=అభిషేకము చేసి; పుష్ప.....అక్షతమ్ములన్; పుష్ప=పూలతో; గంధ=గంధముతో; అక్షత

మ్ములన్=అక్షతలతో; పూజచేసి=పూజించి; కలిభవంబు+ఐన=కలికాలములో గలిగినదైన; కలుషంబున్=పాపమును; గ్రాఁచిపుచ్చి=కాల్చి పోగొట్టి; వేగంబ=త్వరగానే; అమర్త్య పదవిన్= అమర స్థానమును; ఒందును=పొందును.

భావము :- పూర్వము మంకణుడను మహర్షి యోగీశ్వర శివలింగము నర్చించి పరమాత్మ సాక్షాత్కార పర్యంతమగు జ్ఞాన సంపదనంది ముక్తిపదము నధిష్ఠించెను. మానవుడు జీవితములో ఒక్కమారైనను సప్తగోదావరములో స్నానముచేసి యోగీశ్వర శివలింగమును దర్శించిన అణిమాదులగునెనిమిది ఐశ్వర్యముల సిద్ధిని పొందును. సప్తగోదావరజలముతో యోగీశ్వర స్వామికి అభిషేకము చేసి పూవులు, గంధము, అక్షతలతో పూజించు నరుడు కలికాలములో గలుగు పాపమును కాల్చివేసి త్వరగా స్వర్గలోకము పొందును.

విశేషము :- మంకణ వృత్తాంతము :- మంకణ వృత్తాంతము మహాభారతములో వనపర్వము 83 అధ్యాయములోను, శల్యపర్వము 38వ అధ్యాయములోను గలదు. మంకణకుడని నామాంతరము శల్యపర్వములో కలదు.

సుకన్యకు వాయుదేవుని వలన జన్మించిన కుమార బ్రహ్మచారియగు మంకణుడు ప్రతిదినము సరస్వతీ నదిలో స్నానము చేయుచుండువాడు. ఒకనాడు స్నానము చేయు ఆ ముని ఆ నదిలోనే నగ్నయై స్నానము చేయుచున్న జయంతి యను దివ్య సుందరిని గాంచెను. వెంటనే ఆయనకు తేజస్ స్ఖలనమయ్యెను. దాని నాయన కలశములోనికి దీసికొనెను. కలశములోని ఆ వీర్యము నుండి ఏడుగురు జన్మించిరి. వాయువేగుడు, వాయుబలుడు, వాయుహుడు, వాయుమండలుడు, వాయుజ్వాలుడు, వాయురేతుడు, వాయుచక్రుడు అనునవి వారి నామములు. వీరే మరుద్గణములకు జనకులగువారు.

ఒకప్పుడు కుశాగ్రము గ్రుచ్చుకొనగా మంకణ మహర్షిచేతి నుండి రక్తమునకు మారుగా శాకరసము కారసాగెను. దానిని గాంచి హర్షపూర్ణుడై ఆయన నర్తనము గావించుచుండెను. ఆయన తేజోమోహితమై అటగల స్థావర జంగమాత్మక సృష్టి అంతయు నాట్యమొనరింప సాగెను. దానిని గాంచి మహర్షులు, దేవతలు, బ్రహ్మదేవుడు పరమేశ్వరుని వద్దకేగి ఆయన నృత్యమాపవలసినదిగా నర్థించిరి.

అంత పరమేశ్వరుడు (మారు రూపములో) వచ్చి మంకణ మహర్షి ఆనందమునకు, నృత్యమునకు కారణమేమనగా ఆయన నా చేతిలో నుండి కారు శాకరసమే ఇందులకు కారణమనెను. "ఇది నాకు విశేషము అనిపించుట లేదు. ఇటు చూడుము" అని పరమేశ్వరుడు అంగుళితో బొటనవ్రేలికి గాయము చేసికొనెను. అందుండి హిమసన్నిభమగు భస్మము రాసాగెను. దానిని గాంచి మహర్షి ఆయన శంకరుడని భావించి సంస్తుతించెను.

"నా అహంకారమును క్షమింపు" మని మంకణు డర్థింపగా పరమేశ్వరుడు ప్రసన్నుడై "మహర్షీ! నా అనుగ్రహమున నీ తపస్సు అభివృద్ధినందును. నీతోగూడ ఈ ఆశ్రమములో నుందును. నన్ను పూజించువానికి దుర్లభమేమియు నుండదు. వారు సారస్వత లోకమున కేగుదురు" అని అనుగ్రహించెను.

**వ॥ మఱియు యమేశ్వర లింగంబు యమప్రతిష్ఠితంబు; సకృద్దర్శన మాత్రంబున మర్త్యుండు యమభయంబును బాయు; వెండియు. 116**

అర్థము :- మఱియున్=ఇంకను; యమేశ్వర లింగంబు=యమేశ్వరుడను పేరుగల శివలింగము; యమ=యమునిచేత; ప్రతిష్ఠితంబు=నిలుపబడినది; సకృత్=ఒక్కమారు; దర్శన మాత్రంబున=దర్శించుట చేతనే; మర్త్యుండు=మనుజుడు; యమ=యముని వలన గలుగు; భయంబును=భయమును; పాయున్=వదలును; వెండియున్=ఇంకను.

భావము :- ఇంకను యమేశ్వర లింగమును యమధర్మరాజు ప్రతిష్ఠించెను. ఆ శివుని ఒక్కమారు దర్శించిననే నరుడు యమభయ దూరుడగును. మఱియును -

**సీ॥ యజ్ఞతటాకంబు నందుఁ గ్రుంకులు వెట్టి**
**బ్రహ్మర్షి పితృతృప్తిఁ బ్రస్తరించి**
**యమలింగ సన్నిధి నష్టోత్తర సహస్ర**
**సంఖ్య మృత్యుంజయ జపముచేసి**
**జప విధానము నందు సరవి మృత్యుంజయు**
**నపమృత్యు భయశాంతి నర్థినడుగ**
**నపమృత్యు దేవతాహంకార భవమైన**
**సంత్రాస మొందఁడు సాధకుండు;**

**తే॥ శ్రాద్ధ పిండోదకాది విశ్రాణనముల**
**శ్రీయమేశ్వర తీర్థానఁ జేసి మనుజుఁ**
**డుద్ధరించును నరక కూపోదరముల**
**బెగ్గడిలు నేడుతరముల పితృగణము. 117**

అర్థము :- సాధకుండు=ఉపాసకుడు; యజ్ఞతటాకంబునందు=యజ్ఞమను పేరుగల చెరువులో; క్రుంకులువెట్టి=మునుకలు వేసి (స్నానము చేసి); బ్రహ్మర్షి=బ్రహ్మర్షులకు; పితృ=పితృదేవతలకు; తృప్తి=సంతృప్తిని; ప్రస్తరించి=విస్తరించి; యమలింగ=యమేశ్వర లింగము యొక్క; సన్నిధిన్=చేరువన; అష్టోత్తర సహస్ర=వేయి యెనిమిది; సంఖ్యతో=లెక్కతో; మృత్యుంజయ=మృత్యుంజయ మంత్రము యొక్క, జపముచేసి=జపము...

జపవిధానమునందు=జపము యొక్క విధానములో; సరవిన్=క్రమముతో; మృత్యుం జయున్=(మృత్యుంజయ మంత్రమునకధి దేవతయగు) పరమేశ్వరుని; అపమృత్యు=అకాల మరణము వలన గలుగు; భయ=భయము యొక్క; శాంతిన్=శాంతించుటను; అర్థిన్= కోరికతో; అడుగన్=ప్రార్థింపగా.

అపమృత్యు.....సంత్రాసము; అపమృత్యు=అకాల మరణమను; దేవతా=దేవత యొక్క; అహంకార=కోపము వలన; భవము+ఐన=కలిగినదగు; సంత్రాసము=భయము; ఒందఁడు=పొందడు.

మనుజుఁడు=నరుడు; శ్రీ యమేశ్వర తీర్థానన్=శ్రీయుక్తమగు యమేశ్వరమను పవిత్రోదక స్థానమునందు; శ్రాద్ధ.....విశ్రాణములన్; శ్రాద్ధ=పితృకర్మమునందలి; పిండ=పిండములను; ఉదక=తర్పణము; ఆది=మొదలగు వానిని; విశ్రాణనములన్=ధనాదులను ఇచ్చుటను; చేసి= చేసి; నరక కూప=నరకమనెడి బావి యొక్క; ఉదరములన్=మధ్యభాగములందు; బెగ్గడిలున్= భయపడునట్టి; ఏడుతరముల=సప్తపురుషాంతరములదగు; పితృగణమున్=పితృదేవతల సమూహమును; ఉద్ధరించున్=రక్షించును.

భావము :- సాధకుడగువాడు యజ్ఞతటాకములో స్నానముచేసి బ్రహ్మర్షులకు, పితృ దేవతలకు సంతృప్తిని విస్తరింపజేసి యమేశ్వరుని సన్నిధిలో మృత్యుంజయ మహామంత్ర మును వేయినెనిమిదిమారులు జపము చేయవలెను. ఆ జపవిధానములో అపమృత్యు భయము శాంతింపవలెనని మృత్యుంజయుని ప్రార్థించువాడు అపమృత్యు భయము నందదు. యమేశ్వర తీర్థములో స్నానము చేసి శ్రాద్ధము చేసినచో నరకకూపము లందు భయమగ్నులగు సప్త పురుషాంతరముల వారగు పితృదేవతలు ఉద్ధరింపబడుదురు.

విశేషము :- "త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టి వర్ధనమ్, ఉర్వారుకమివ బంధనాన్మృత్యోర్ముక్షీయ మామృతాత్" అను రుద్రము నందలి మంత్రమును మహా మృత్యుంజయ మంత్రమందురు. ఆ మంత్రజపము సర్వవిధములగు అపమృత్యువులను పోగొట్టునని శాస్త్రము.

పవిత్ర తీర్థములందు దేవఋషి పితృదేవతలకు శ్రాద్ధము పెట్టుట, పిండ ప్రదానము, తిలతర్పణము చేయుట అనునవి అనూచానమగు భారతీయ సంప్రదాయములు.

ఏడు తరములలోని జ్ఞాతులను సపిండులందురు. తమ వంశములోని మూల పురుషుడు వీరికి సమానుడగును. అశౌచాదులు ఏడు పురాషాంతరముల వఱకు నుండును.

క॥ **శ్రీకాళేశ్వరు సన్నిధి**
**నేకాంతము జపము వ్రేల్మి యోగియు శ్రాద్ధం**
**బేకైకము కోటి గుణం**
**బై కలిగించును సమగ్రమైన ఫలంబుల్.** 118

అర్థము :- శ్రీకాళేశ్వరు=శ్రీకాళేశ్వరస్వామివారి; సన్నిధిన్=సమీపమునందు; ఏకాంతము=దేవునిపై మనస్సు గాఢముగా నిలుపుట; జపము=(మంత్రమును) జపము చేయుట; వ్రేల్మి=హోమము చేయుట; ఈగియున్=దానమును; శ్రాద్ధంబు=శ్రాద్ధము పెట్టుట యు (అనువానిలో); ఏక+ఏకము=ఒక్కొక్కటి; కోటిగుణంబు+ఐ=కోటిరెట్లై; సమగ్రము+ఐన= సంపూర్ణమైన; ఫలంబుల్=ఫలితములను; కలిగించును=చేకూర్చును.

భావము :- శ్రీ కాళేశ్వరస్వామివారి సన్నిధిలో ఏకాంతము (ధ్యానము), మంత్రజపము, హోమము చేయుట, దానము, శ్రాద్ధము పెట్టుట అనువానిలో ప్రతియొక్కటియు కోటిరెట్లై సంపూర్ణ సత్ఫలితముల నిచ్చును.

తే॥ వీరభద్రాది దేవతా వీరగణము
శంభు లింగంబు నిలిపె ప్రశస్తవేళ
దక్షవాటిఁ దదాఖ్య సంస్థాపనమున
వీరభద్రేశుఁడయ్యె నవ్వేల్పు ఱేఁడు. 119

అర్థము :- దక్షవాటిన్=దక్షారామమునందు; ప్రశస్తవేళన్=శుభమగు సమయములో; వీరభద్ర+ఆది=వీరభద్రుడు మున్నగు; దేవతా=దేవతలలోని; వీరగణము=వీరుల సమూహము; శంభులింగంబు=శివలింగమును; నిల్పెన్=ప్రతిష్ఠించెను; తత్+ఆఖ్య=ఆ పేరుతో; స్థాపనమునన్=ప్రతిష్ఠించుట చేత; ఆ+వేల్పుఱేఁడు=ఆ దేవతా సార్వభౌముడు; వీరభద్రేశుఁడు=వీరభద్రేశ్వరుడు అను పేరుగలవాడు; అయ్యెన్=ఆయెను.

భావము :- మంచి శుభలగ్నమునందు దక్షారామములో వీరభద్రుడు మున్నగు దేవతలలోని వీరుల సమూహము శివలింగమును ప్రతిష్ఠించెను. ఆయన పేరుతో స్థాపితుడగుట చేత ఆదేవ ప్రభువు వీరభద్రేశుడను నామముతో ప్రసిద్ధుడయ్యెను.

క॥ శ్రీవీరభద్ర లింగము
సేవించిన మానవుండు చిరకాలమునం
గేవల గాణాపత్యమ
హా విభవము నొందు శివుని యాస్థానమునన్. 120

అర్థము :- శ్రీ వీరభద్రలింగమున్=శ్రీ వీరభద్రేశ్వర లింగమును; సేవించిన=కొలిచిన; మానవుండు=మనుజుడు; శివుని=శంకరుని యొక్క; ఆస్థానమునన్=కొలువులో; చిరకాలమునన్=చాలకాలము; కేవల=కేవలము; గాణాపత్య=గణములకు పతిత్వమను; మహావిభవమున్=గొప్పదగు వైభవమును; ఒందున్=పొందును.

భావము :- శ్రీ వీరభద్రేశ్వర లింగమును సేవించినవాడు చిరకాలము శివుని కొలువులో కేవలము గాణాపత్యము అను మహద్వైభవమునందును.

తే॥ వీరభద్రేశ దేవతా విభుని యాజ్ఞఁ
గలుగు ధర్మార్థ కామ మోక్షములు జనుల
కక్షయంబైన దక్షవాటాభిధాన
భోగమోక్ష రమా జన్మ భూమియందు. 121

అర్థము :- అక్షయంబు+ఐన=నశింపనిదగు; వీర.....అజ్ఞన్; వీరభద్రేశ= వీరభద్రేశ్వరుడను; దేవతా విభుని=దేవతలకు ప్రభువు యొక్క; అజ్ఞన్=ఆజ్ఞచేత; జనులకు= మానవులకు; దక్ష.....అందు; దక్షవాట=దక్షారామమను; అభిదాన=పేరుగల; భోగ=సుఖము; మోక్ష=ముక్తి అను; రమా=లక్ష్మీదేవికి; జన్మ భూమియందు=పుట్టిన చోటునందు; ధర్మ= ధర్మము; అర్థ=అర్థము; కామ=కామము; మోక్షములు=మోక్షములు; కలుగు=లభించును.

భావము :- నాశములేనిదగు వీరభద్రేశ్వరస్వామి ఆజ్ఞచేత జనులకు భోగమోక్షలక్ష్మికి జన్మభూమియగు దక్షారామమునందు ధర్మార్థ కామమోక్షములు కలుగును.

తే॥ అగ్నిహోత్రంబు దాన మధ్యయన జపము
లాదియగు నిత్య నైమిత్తికాది విధులు
బహు ఫలంబుల నొసఁగు సద్భక్తి యుక్తి
దక్షవాటిక వీరభద్ర స్థలమున. 122

అర్థము :- దక్షవాటిక=దక్షారామములోని; వీరభద్రస్థలమునన్=వీరభద్రేశ్వరస్వామి యున్న చోట; అగ్నిహోత్రంబు=హోమము, దానము=దానము చేయుట; అధ్యయన= వేద పాఠము; జపములు=మంత్రమును జపించుటలు; ఆది+అగు=మొదలగు; నిత్య= ప్రతిదినము చేయవలసినవియు; నైమిత్తిక=ఏదియో ఒక హేతువుతోచేయునవియగు; విధులు= కార్యములు; సద్భక్తి=మంచి భక్తితో; యుక్తిన్=కూడుట చేత; బహు=అనేకములైన; ఫలములన్=ఫలితములను; ఒసఁగున్=ఇచ్చును.

భావము :- దక్షారామములోని వీరభద్రేశ్వరస్వామి సన్నిధిలో చేసిన హోమము, దానము, వేదాధ్యయనము, జపము మొదలగు నిత్యములు, నైమిత్తికములగు కార్యములు మంచి భక్తితో గూడినచో ననేక సత్ఫలముల నిచ్చును.

విశేషము :- కర్మలు త్రివిధములు. నిత్యములు, నైమిత్తికములు, కామ్యములు. నిత్యములు - ప్రతిదినము విడువక చేయవలసిన కర్మలు. సంధ్యావందనము, తర్పణము,

అగ్నిహోత్రము మున్నగునవి; నైమిత్తికములు - ఒక నిమిత్తము (హేతువు) ననుసరించి చేయునవి - పండుగలు, శ్రాద్ధాదులు; కామ్యములు - కోరికలతో జేయు కర్మలు. సత్యనారాయణస్వామి వ్రతాదులు.

ఉ॥ యాగ తటాక తీర్థమున యందును, నంబుధి సార్వభౌమ ది
గ్భాగ విభూషణంబయిన పద్మిని యందును దీర్థమాడి ని
ష్ఠా గరిమంబునం ద్రిపుర శాసను దక్ష పురోపకంఠ ధా
త్రీ గృహమేధిఁగొల్వుఁడు ప్రతిష్ఠిత భర్గుని వీరభద్రునిన్. 123

అర్థము :- అంబుధి.....అయిన; అంబుధి=సముద్రములకు; సార్వభౌమ=చక్రవర్తియగు వరుణుని యొక్క; దిక్+భాగ=పశ్చిమ దిక్కు యొక్క స్థానమునకు; విభూషణంబు+అయిన=అలంకారమైన; పద్మినియందున్=సరస్సునందు; యాగతటాక=యజ్ఞ తటాకమను; తీర్థమున యందును=తీర్థమునందు; తీర్థమాడి=స్నానము చేసి; నిష్ఠాగరిమంబునన్=శ్రేష్ఠమగు భక్తితో, దక్ష.....మేధిన్; దక్షపుర=దక్షారామము యొక్క; ఉపకంఠ=సమీపమునందలి; ధాత్రీ=భూమియందున్న; గృహమేధిన్=గృహస్థుని; త్రిపురశాసను=మూడు పట్టణములను నాశము చేసిన శివుని; ప్రతిష్ఠిత=నిలుపబడిన; భర్గుని=శివుడు కల; వీరభద్రునిన్=వీరభద్రేశ్వర స్వామిని; కొల్వుఁడు=సేవింపుడు.

భావము :- మానవులారా! పశ్చిమ దిక్కునకు అలంకారముగా నున్న యాగతటాకమను తీర్థములో స్నానముచేసి ఉత్తమ భక్తితో దక్షారామ సమీపము నందున్న పరమేశ్వరుని, వీరభద్రుని సేవింపుడు.

వ॥ తొల్లి బ్రహ్మాదులగు దేవతలు సురేంద్ర విహిత విభవుండైన భీమనాథేశ్వరు దర్శించు వేడుకంజేసి; బ్రహ్మ లోకంబున నుండి భోగమోక్ష క్షేత్రంబైన దక్షారామంబునకు వచ్చి; సప్త గోదావరంబునఁ బంచతీర్థంబులాడి; పండ్రెండు దివ్యలింగ స్థానంబులు దర్శించి; యమృతమయ స్వయంభూ జ్యోతిర్లింగమూర్తి; నిఖిల దేవతా చక్రవర్తియగు భీమేశ్వరు దర్శించి; పరమానందకందళిత స్వాంతులై యిట్లనిరి. 124

అర్థము :- తొల్లి=పూర్వము; బ్రహ్మ+ఆదులు+అగు=బ్రహ్మ మొదలగు; దేవతలు=వేల్పులు; సురేంద్ర=దేవేంద్రునిచేత; విహిత=కలిగింపబడిన; విభవుండు+ఐన=సంపదగలవాడైన; భీమనాథ+ఈశ్వరున్=భీమేశ్వరుడను శివుని; దర్శించు=దర్శనము చేయవలెనను; వేడుకన్+చేసి=కోరికతో; బ్రహ్మలోకంబున నుండి=చతుర్ముఖుని లోకమునుండి;

భోగ=సుఖములకు; మోక్ష=ముక్తికి; క్షేత్రంబు+ఐన=పవిత్ర స్థానమగు; దక్షారామంబునకు=దక్షారామమునకు; వచ్చి=వచ్చి; సప్తగోదావరంబునన్=సప్త గోదావరమునందు; పంచ తీర్థంబులు=అయిదు పుణ్య జలముల తీర్థములలో; ఆడి=స్నానము చేసి; పండ్రెండు=పండ్రెండు; దివ్య లింగస్థానంబులు=పవిత్రములగు శివలింగములున్న ప్రదేశములను; దర్శించి=చూచి; అమృతమయ=సుధా వికారమును; స్వయంభూ=తనంత తాను కలిగిన; జ్యోతిర్లింగమూర్తి=తేజోమయ లింగస్వరూపుడును; నిఖిల=సమస్తమైన; దేవతా=దేవతలకు, చక్రవర్తి+అగు=ప్రభువగు; భీమేశ్వరున్=భీమేశ్వరస్వామిని; దర్శించి=దర్శనము చేసి; పరమ=గొప్పదగు; ఆనంద=సంతోషముతో; కందళిత=వికసించిన; స్వాంతులు+ఐ=మనస్సులుగల వారై; ఇట్లు=ఈవిధముగా; అనిరి=పలికిరి.

భావము :- పూర్వము బ్రహ్మమున్నగు దేవతలు దేవేంద్రుడు సమర్పించిన సంపదతో తులతూగుచున్న భీమేశ్వరుని దర్శింపగోరిరి. అందుచేవారు సత్యలోకము నుండి భోగమోక్షములకు క్షేత్రమగు దక్షారామమునకు వచ్చిరి. సప్తగోదావరములో పంచతీర్థములలోను స్నానములు చేసిరి. ద్వాదశ లింగములను దర్శించిరి. అమృతమయుడు, స్వయంభువు, జ్యోతిర్లింగము, సమస్త దేవతా సార్వభౌముడగు భీమేశ్వరస్వామిని దర్శించిరి. అందుచే కలిగిన ఆనందముతో మనస్సులు వికసింపగా నిట్లనిరి.

## బ్రహ్మాదులు భీమేశ్వరు నభివర్ణించుట :

శా॥ "ఆహా! యింత మనోహరంబగునె దక్షారామ! మివ్వీటిలో
నీహారాంశు కళాకిరీటుఁడు భవానీ భర్త దివ్యాప్సరో
వ్యూహంబుల్ ప్రతి సంధ్యముం గొలువఁగా నున్నాఁడు గోదావరీ
వాహిన్యబ్ధి సమీర పానకలనా వర్ధిష్ణు కేయూరుఁడై. 125

అర్థము :- ఆహా!=ఔరా! దక్షారామము=దక్షారామము; ఇంత=ఇంతటి; మనోహరంబు=మనస్సునకింపైనది; ఔనె=అగునా! ఈ+వీటిలోన్=ఈ పట్టణములో; నీహార.....కిరీటుఁడు; నీహార+అంశు=మంచువలె చల్లనగు కిరణములుగల చంద్రుని యొక్క; కళా=కళ; కిరీటుఁడు=జటాజూటమునందు గలవాడు; భవానీ భర్త=పార్వతీపతి యగు శంకరుడు; దివ్య=దేవలోకములోని వారగు; అప్సరస్=అప్సరసల యొక్క; వ్యూహంబుల్=సమూహములు; ప్రతి సంధ్యమున్=ప్రతి సంజవేళయందును; కొలువఁగాన్=సేవింపగా; గోదావరీ.....కేయురుఁడై; గోదావరీ=గోదావరియను పేరుగల; వాహినీ=నది యొక్కయు; అబ్ధి=సముద్రము యొక్కయు; సమీర=గాలిని; పానకలనా=త్రాగుట చేయుట చేత; వర్ధిష్ణు=అభివృద్ధినందు; కేయూరుఁడు+ఐ=భుజకీర్తులు గలవాడై; ఉన్నాఁడు=ఉన్నాఁడు.

భావము :- "ఆహా! దక్షారామము ఇంత మనోహరమైనదా? ఈ పట్టణములో చంద్రశేఖరుడు, భవానీ భర్తయగు శంకరుడు ప్రతిదినము సంధ్యా కాలమున అప్సరస్సమూహము సేవింపగా గోదావరీ సముద్రములపైనుండి వచ్చు గాలిని త్రావి తాను బాహు పురులుగా దాల్చిన సర్పములు వృద్ధినందుచుండగా నచట కొలువున్నాడు.

విశేషము :- చూడుడు. 3-186.

క॥ ముంగిటను సప్తసింధువు,
చెంగటఁ గ్రతు సరసి నడుమ శ్రీ భీమ మహా
లింగము దక్షారామము
సంగతి నెన్నంగఁ బురము జగతిని గలదే? 126

అర్థము :- ముంగిటను=ముందర - ఎదుట; సప్తసింధువు=సప్త గోదావరమును; చెంగటన్=సమీపమునందు; క్రతు సరసి=యజ్ఞ తటాకమును; నడుమన్=(ఆ రెంటికి) మధ్యమునందు; శ్రీ భీమమహాలింగము=శ్రీ భీమేశ్వరుని గొప్ప లింగమును(గలవు). జగతిని=లోకములో; దక్షారామము=దక్షారామముతోడి; సంగతిన్=పొత్తుతో; ఎన్నంగన్=ఎన్నిక చేయుటకు; పురము=మఱియొక పట్టణము; కలదే=ఉన్నదా?

భావము :- ఎదుట సప్తగోదావరమును, సమీపమునందు యజ్ఞతటాక తీర్థమును, మధ్యమునందు భీమేశ్వరలింగమునుగల దక్షారామముతో పొత్తునకు ఎన్నదగిన మఱియొక పట్టణము విశ్వములో నున్నదా?

తే॥ శివశివా! యొంత భాగ్యంబు చేసినారొ!
దక్షవాటీపురీ మహాస్థాన జనులు
కన్నులారంగ దర్శించుచున్నవారు
భీమనాథేశ్వరేశ్వర స్వామిమూర్తి. 127

అర్థము :- శివశివా=మంగళరూపుడవగు శంకరా! దక్షవాటీ పురీ=దక్షారామ పురమును; మహాస్థాన=గొప్ప పవిత్ర ప్రదేశములోని; జనులు=నరులు; ఎంత భాగ్యంబు=ఎంత పుణ్యము; చేసినారో=చేసిరో కదా! భీమనాథ=భీమేశ్వరుడను; ఈశ్వర+ఈశ్వర=ప్రభువులకు ప్రభువగు; స్వామి=దేవుని యొక్క; మూర్తిన్=ఆకృతిని; కన్నులారంగన్=కన్నుల నిండుగా; దర్శించు చున్నవారు=దర్శనము చేయుచున్నారు.

భావము :- మంగళరూపుడవగు శంకరా! దక్షారామములోని నరులు భీమేశ్వరస్వామి వారి దివ్య మంగళ రూపమును ప్రతి నిత్యము దర్శించుచున్నారు. వారు ఎంత పుణ్యము చేసినారో కదా!

చ॥ అహహ! దయారసానుగతమైన మనంబున దక్షవాటికా
గృహపతి భీమనాయకుఁడు కీట పతంగ సరీసృపాళికిన్
సహజ జహత్సమీరమగు సంకట కాలము వీనులం దను
గ్రహ మొనరించునట్టె మధురంబగు తారక మంత్ర రాజమున్. 128

అర్థము :- అహహ=ఆహాహా! దక్షవాటికా=దక్షారామములోని; గృహపతి=గృహస్థు అగు; భీమనాయకుఁడు=భీమేశ్వరుడు; దయారస=కరుణారసమును; అనుగతము+ఐన= అనుసరించినదైన; మనంబునన్=మనస్సుతో; కీట.....ఆళికిన్; కీట=పురుగులు; పతంగ= పక్షులు; సరీసృప=సర్పములు - అనువాని యొక్క; ఆళికిన్=సమూహమునకు; సహజ= ప్రకృతి సిద్ధముగ; జహత్=వదలుచున్న; సమీరము+అగు=ప్రాణవాయువుగలదగు, సంకట కాలము=కష్ట సమయమునందు; వీనులన్=చెవులలో; మధురంబు+అగు=తీయనైన; తారకమంత్రరాజమున్=ఓంకారమను మంత్రశ్రేష్ఠమును; అనుగ్రహము+ఒనరించునట్టె= దయతో నిచ్చుటను జేయునట!

భావము :- ఆహా! దక్షారామమునకు యజమానుడగు భీమేశ్వరస్వామి కరుణా రసముతో గూడిన మనస్సుతో సహజమగు మరణము కలిగినప్పుడు - ఆ కష్ట సమయములో పురుగులకు; పక్షులకు; సర్పములకు గూడ చెవులలో మధురమగు తారకమంత్రమును వినిపించునట!

విశేషము :- తారకమంత్రము - ప్రణవము.

సీ॥ భీమనాథేశ్వర శ్రీమన్మహాలింగ
భాస్వత్పరబ్రహ్మ భవనమునకు,
కల్పాంత సమయ భీకర సాగరౌద్ధత్య
భీత త్రిలోక మహా తరికిని,
ద్వాదశ క్షేత్ర తీర్థ పలాశ మండల
వ్యాకోచ నవ పుండరీకమునకు,
జంబూతరుద్వీప సర్వసర్వంసహా
పాటీర లేప నైపథ్యమునకు,

తే॥ శివ కళత్రమునకు, శివక్షేత్రమునకు,
శివుని మూర్తికి, శ్రీ సదాశివుని కీర్తి
కితర తీర్థంబు సరిపోల్చ నెట్లు వచ్చు
దక్షవాటంబునకు మహాస్థానమునకు. 129

అర్థము :- భీమ.....భవనమునకు; భీమనాథ=భీమేశ్వరుడను, ఈశ్వర=శివుని యొక్క; శ్రీమత్=శోభావంతమగు; మహాలింగ=గొప్పలింగమను; భాస్వత్=ప్రకాశించుచున్న, పరబ్రహ్మ=పరమాత్మ యొక్క; భవనమునకున్=ఆలయమైనట్టియు;

కల్పాంత.....తరికిని; కల్పాంత సమయ=ప్రళయ కాలమునందలి; భీకర=భయంకరమైన; సాగర=సముద్రము యొక్క; ఔద్ధత్య=ఉద్దండతచే - తీవ్రతచే; భీత=భయపడిన; త్రిలోక=ముల్లోకములకు; మహాతరికిని=గొప్ప ఓడ ఐనట్టియు;

ద్వాదశ.....పుండరీకమునకు; ద్వాదశ=పండ్రెండు; క్షేత్ర=ఆలయములలో; తీర్థ=పుణ్యోదక స్థానములనెడు; ఫలాశమండల=దళముల సమూహము యొక్క; వ్యాకోచ=విచ్చుకొనుటగల; నవ=క్రొత్తదైన; పుండరీకమునకు=పద్మమైనట్టియు;

జంబూ.....నైపథ్యమునకు; జంబూతరుద్వీప=నేరేటిచెట్టు దీవియందలి; సర్వ=సమస్తమైన; సర్వంసహా=భూమి యొక్క; పాటీరలేప=మంచి గందపు పూతకు; నైపథ్యమునకు=నాట్యరంగమైనట్టియు; అలంకరణశాలయైనట్టియు;

శివకళత్రమునకు=శివుని భార్యయైనట్టియు; శివక్షేత్రమునకు=శివుని పుణ్యస్థలమైనట్టియు; శివుని మూర్తికి=శివుని స్వరూపమైనట్టియు; శ్రీ సదాశివుని=శోభాయుక్తుడగు శంకరుని యొక్క; కీర్తికి=యశస్సు అయినట్టియు; మహాస్థానమునకు=గొప్ప నెలవైనట్టియు; దక్షవాటంబునకు=దక్షారామమునకు; ఇతర తీర్థంబున్=మఱియొక పుణ్యక్షేత్రమును; ఎట్లు=ఏవిధముగా; సరి=సమానమని; పోల్పవచ్చు=పోల్చుట తగును?

భావము :- గొప్ప నెలవగు దక్షారామము భీమేశ్వరుడను పరబ్రహ్మరూప తేజోలింగమునకు భవనము. ప్రళయకాలము నందలి భయంకరమగు సముద్రపు ఔద్ధత్యమునకు భీతిల్లినవారికి నౌకయైనది. పండ్రెండు తీర్థములు క్షేత్రములను రేకులతో వికసించిన నవ పద్మము. జంబూద్వీపములోని సమస్త భూమి యొక్క మంచి గంధపు పూతకు రంగస్థలమైనది - అలంకరణశాలయైనది. శివుని భార్యయైనది. శివుని నివాసమగు పుణ్యస్థలము. శివరూపము. శివుని కీర్తిరూపమైనది. ఇట్టి దక్షారామముతో ఇతర క్షేత్రములు ఎట్లు సాటివచ్చును?

విశేషము :- అలంకారము - రూపకము.

క॥ మంకణ మహామునీశ్వర
సంకల్ప వితీర్ణి కల్పశాఖికి, భువనా
లంకృతికి, దక్షవాటికి
శంకర నట నటన నాట్యశాలకు జేజే. **130**

అర్థము :- మంకణ=మంకణుడను; మహామునీశ్వర=గొప్ప మహర్షి శ్రేష్ఠుని యొక్క; సంకల్ప=కోరికను; వితీర్ణి=దానము చేయుటలో; కల్పశాఖికి= కల్పవృక్షమైనదియు; భువన= లోకములకు; అలంకృతికి=అలంకారమైనట్టియు; శంకర= శివుడనెడి; నట=నటుని యొక్క; నటన=అభినయమునకు; నాట్యశాలకు=రంగస్థలమైన; దక్షవాటికి=దక్షారామమునకు; జేజే= జయము.

భావము :- మంకణ మహాముని సంకల్పించినది ఇచ్చుటలో కల్పవృక్షమయినది, జగత్తున కలంకారమైనది, పరమేశ్వరుడను మహానటుని అభినయమునకు రంగస్థలమైనదియు నగు దక్షారామమునకు జయమగుగాక.

విశేషము :- శివుడు నటరాజగుటచేత మహానటుడు.

అలంకారము - రూపకము.

క॥ కాశీప్రతిబింబమునకుఁ,
గాశీ ప్రతినిధికిఁ, గాశికా ప్రతికృతికిం,
గాశీ ప్రతిమకు, దక్షిణ
కాశికి శ్రీ దక్షవాటి కటకంబునకున్. 131

అర్థము :- కాశీ ప్రతిబింబమునకున్=కాశీనగరమునకు మాఱురూపు ఐనదియు, కాశీ ప్రతినిధికిన్=కాశీ పట్టణమునకు మాఱు అయినదియు; కాశికా ప్రతికృతికిన్=కాశీ పురమునకు మాఱుసేత అయినదియు; కాశీప్రతిమకున్=కాశిని పోలినదియు; దక్షిణ= దక్షిణ దిక్కునందున్న; కాశికిన్=కాశీనగరమైన; శ్రీ=సంపదతో కూడిన, దక్షవాటి=దక్షారామము అను; కటకంబునకున్=రాచనగరుకు, (జేజే=నమస్కారము).

భావము :- కాశికి ప్రతిబింబమైనది, కాశికి మాఱురూపైనది, కాశికి మాఱైనది, కాశితో సమానమైనది, దక్షిణ కాశి అయిన దక్షవాటిక యను రాచనగరునకు జయము.

విశేషము :- స్థానభేదము తప్ప కాశికిని దక్షారామమునకు నితరభేదము లేదు.

క॥ మోక్ష స్థానంబునకున్
దక్షారామమున కమృత ధామంబునకున్
దక్షాధ్వరక్రియోచిత
దీక్షా క్షేత్రమున కభవు దేవికి జేజే." 132

అర్థము :- మోక్ష=ముక్తికి; స్థానంబునకున్=తావైనదియు; అమృతధామంబునకున్=అవినాశియగు శోభగలదియు, దక్ష.....క్షేత్రమునకున్; దక్ష=దక్షుని యొక్క; అధ్వర=యజ్ఞమను; క్రియా=కార్యమునకు; ఉచిత=తగిన; దీక్షాక్షేత్రమునకున్=దీక్షకు పాలమైనదియు; అభవు=శివుని యొక్క; దేవికి=భార్యయునగు; దక్షారామమునకు=దక్షారామమునకు; జేజే=నమస్కారము.

భావము :- మోక్షమునకు తావు అయినది, అవినాశియగు శోభకలది, దక్షుని యజ్ఞమునకు దగిన దీక్షాస్థానమును, శివుని దేవియగు దక్షారామమునకు నమస్కారము."

వ॥ అని నమస్కరించి శతానందుండు. 133

అర్థము :- అని=పలికి; నమస్కరించి=మ్రొక్కి; శతానందుండు=బ్రహ్మ.

భావము :- ఇట్లుపలికి బ్రహ్మ నమస్కరించి -

మ॥ శివలింగంబు ప్రతిష్ఠచేసి కణఁకన్ శ్రీ సప్తగోదావరాం
బువులం జేసెను మంత్రపూర్వకముగాఁ బుణ్యాభిషేకంబు; వై
భవముల్ పెక్కు విధంబులం జరిపె; శ్రీ బ్రహ్మేశ్వరుం డంబుజో
ద్భవ వంద్యుండది యాదిగాఁ గరుణమైఁ బాలించు భక్తావళిన్. 134

అర్థము :- కణఁకన్=పూనికతో; శివలింగంబు=శివలింగమును; ప్రతిష్ఠచేసి=నిలిపి; శ్రీ=శోభాయుక్తమగు, సప్తగోదావర=సప్త గోదావర సరస్సు యొక్క; అంబువులన్=నీటితో; మంత్రపూర్వకముగాన్=వేదమంత్రములు మొదలుగా; పుణ్య= పవిత్రమైన; అభిషేకంబు=అభిషేకము; చేసెను=చేసెను; పెక్కువిధంబులన్= పలురీతులుగా, వైభవముల్=భోగములను; జరిపె=చేసెను; అది+ఆదిగాన్= అది మొదలు; అంబుజ+ఉద్భవ=(పద్మము నుండి జన్మించిన) బ్రహ్మచేత, వంద్యుండు=నమస్కరింపదగినవాడగు, బ్రహ్మేశ్వరుండు=బ్రహ్మేశ్వర శివలింగము; కరుణమైన్=దయతో; భక్త+ఆవళిన్=భక్తుల సమూహమును; పాలించును=రక్షించును.

భావము :- పూనికతో శివలింగమును ప్రతిష్ఠచేసి సప్తగోదావరి జలముతో వేదమంత్రపూర్వకముగా పవిత్రమగు నభిషేకము చేసెను. అనేక విధములగు సేవలు చేసెను. ఆనాటినుండి బ్రహ్మాది వంద్యుడగు బ్రహ్మేశ్వరుడు దయతో భక్తబృందమును పాలించును.

వ॥ అంత దేవసిద్ధ సాధ్యవిద్యాధర గంధర్వోరగాదులును దమతమ నామధేయంబుల లింగంబులఁ బ్రతిష్ఠించిరి; తదనంతరంబ. 135

అర్థము :- అంతన్=తరువాత; దేవ.....ఆదులును; దేవ=దేవతలు; సిద్ధ= సిద్ధులు; సాధ్య=సాధ్యులు; విద్యాధర=విద్యాధరులు; గంధర్వ=గంధర్వులు; ఉరగ+ఆదులు= నాగులు మున్నగువారు; తమతమ=తమతమ; నామధేయంబులన్=పేరులతో; లింగంబులన్= శివలింగములను; ప్రతిష్ఠించిరి=నిలిపిరి; తదనంతరంబ=అటు తరువాత.

భావము :- తరువాత దేవతలు, సిద్ధులు, సాధ్యులు, విద్యాధరులు, గంధర్వులు, నాగులు మున్నగు వారు తమ తమ పేరులతో శివలింగములను నిలిపిరి. అటు తరువాత.

సీ॥ బ్రహ్మప్రతిష్ఠితు బాలేందుశేఖరుఁ
 బురుహూతుఁ డతి భక్తిఁ బూజ చేసె;
నలువ యర్చించె నానా ప్రకారంబుల
 హరిహయ స్థాపితుండగు మహేశు;
దక్షవాటికఁ జూచి దక్షప్రజాపతి
 పొగడె నల్మోర్ల నంభోజ భవుఁడు;
ప్రణమిల్లె దక్షుఁడు భారతీ భర్తకు
 నాత్మ ప్రశంసకు నలఁగి యలఁగి;

తే॥ వేల్పు లందఱుఁ దారును నిల్పినట్టి
శంభు లింగంబులకు మ్రొక్కి చనిరి దివికి
సరసిజాసనుచే ననుజ్ఞాతు లగుచు;
సత్యలోకంబునకు నర్థిఁ జనియె విధియు. 136

అర్థము :- పురుహూతుఁడు=ఇంద్రుడు; బ్రహ్మ=విధిచేత; ప్రతిష్ఠితున్=నిలుపబడిన; బాల+ఇందు=చిన్న జాబిల్లి; శేఖరున్=శిరమునందుగల శివుని; అతిభక్తిన్=మిక్కిలి భక్తితో; పూజ చేసెన్=పూజించెను.

నలువ=బ్రహ్మ; హరిహయ=ఇంద్రునిచేత; స్థాపితుండు+అగు=ప్రతిష్ఠింపబడిన వాడగు; మహేశున్=శివుని; నానాప్రకారంబులన్=పలురీతులుగా; అర్చించెన్=పూజించెను.

అంభోజభవుడు=పద్మమునందు జనించిన బ్రహ్మ; దక్షవాటికన్=దక్షారామములో; దక్షప్రజాపతిన్=దక్షుడను పేరుగల ప్రజాపతిని; చూచి=చూచి; నల్మోర్లన్=నాలుగు మోరలన్= నాలుగు ముఖములతో; పొగడెన్=మెచ్చుకొనెను.

దక్షుఁడు=దక్షప్రజాపతి; ఆత్మ=తనయొక్క; ప్రశంసకున్=మెప్పునకు; అలఁగి+అలఁగి=జంకి జంకి; భారతీ భర్తకున్=సరస్వతీపతియగు బ్రహ్మకు; ప్రణమిల్లెన్=నమస్కరించెను.

వేల్పులు+అందఱు=దేవతలందఱును; తారును=తాముగూడ; నిల్పిన=ప్రతిష్ఠించిన; శంభులింగంబులకున్=శివలింగములకు; మ్రొక్కి=నమస్కరించి; సరసిజాసనుచేన్=(పద్మము పీఠముగాగల) బ్రహ్మ చేత; అనుజ్ఞాతులు=అనుమతింపబడినవారు; అగుచున్=అగుచు; దివికి=దేవలోకమునకు; చనిరి=వెళ్ళిరి. విధియున్=బ్రహ్మయును; అర్థిన్=కోరికతో; సత్యలోకంబునకున్=సత్యలోకమునకు; చనియెన్=వెళ్ళెను.

భావము :- బ్రహ్మదేవుడు ప్రతిష్ఠించిన బ్రహ్మేశ్వర లింగమును ఇంద్రుడు మిక్కిలి భక్తితో పూజించెను. ఇంద్రుడు స్థాపించిన ఇంద్రేశ్వరుని బ్రహ్మ నానావిధముల పూజించెను. దక్షారామములో దక్షునిగాంచి చతుర్ముఖుడు నలుమోములతో మెచ్చుకొనెను. ఆయన ప్రశంసకు జంకి దక్షుడు బ్రహ్మకు నమస్కరించెను. దేవతలందఱును తాము ప్రతిష్ఠించిన శివలింగములకు నమస్కరించి బ్రహ్మదేవుని అనుజ్ఞగొని దేవలోకమున కేగిరి. బ్రహ్మయును సత్యలోకమున కేగెను.

క॥ బ్రహ్మ ప్రతిష్ఠితుండగు
బ్రహ్మేశ్వర దేవుఁగొలుచు భాగ్యాఢ్యులకున్
బ్రహ్మక్షత్రాదులకును
బ్రహ్మచ్యుత శంభు భవన పదవులు గలుగున్. 137

అర్థము :- బ్రహ్మ=చతుర్ముఖునిచేత; ప్రతిష్ఠితుండు+అగు=స్థాపింపబడినవాడగు; బ్రహ్మేశ్వరదేవున్=బ్రహ్మేశ్వరుడను దేవుని; కొలుచు=సేవించు; భాగ్య+ఆఢ్యులకున్=సుకృత సంపన్నులగు; బ్రహ్మ=బ్రాహ్మణులు; క్షత్ర=క్షత్రియులు; ఆదులకున్=మొదలగువారికి; బ్రహ్మ=బ్రహ్మ యొక్కయు; అచ్యుత=విష్ణువు యొక్కయు; శంభు=శివుని యొక్కయు; భవన=లోకములలోని; పదవులు=స్థానములు; కలుగున్=లభించును.

భావము :- బ్రహ్మదేవుడు స్థాపించిన బ్రహ్మేశ్వరుని సేవించునట్టి పుణ్యాత్ములగు బ్రాహ్మణ క్షత్రియాదులకు (చతుర్వర్ణములవారికి) సత్యలోక విష్ణులోక శివలోకములలోని పదవులు లభించును.

క॥ అధ్యయన శ్రుత దాన త
పోధ్యాన సమాధి మంత్ర పూజాది మహా
విధ్యనుసంధానమున న
సాధ్యంబులు లేవు బ్రహ్మ శంకర పదవిన్. 138

అర్థము :- బ్రహ్మ శంకరు పదవిన్= బ్రహ్మేశ్వర లింగ సన్నిధిలో; అధ్యయన..... సంధానమునన్; అధ్యయన=వేదము చదువుట; శ్రుత= శాస్త్రము చదువుట; దాన=దానము; తపస్=తపస్సు; ధ్యాన=ధ్యానము; సమాధి=నియమము; మంత్ర=మంత్రము; పూజా= అర్చనము; ఆది=మొదలగు; మహావిధి=గొప్ప కార్యముల యొక్క; అనుసంధానము నన్=కూర్చుట చేత; అసాధ్యంబులు=సాధింపవీలుకానివి; లేవు=లేవు.

భావము :- బ్రహ్మేశ్వరస్వామి సన్నిధిలో వేదపారము,శాస్త్ర పఠనము, దానము, తపస్సు, ధ్యానము, సమాధి, మంత్రజపము, పూజ మున్నగు ఉత్తమ కార్యములను చేయువారికి అసాధ్యకార్యము లుండవు.

వ॥ మఱియుఁ గపాలేశ్వర స్థానంబు. 139

అర్థము :- మఱియున్=ఇంకను; కపాలేశ్వర స్థానంబు=కపాలేశ్వరుని సన్నిధి కలదు.
భావము :- తరువాత కపాలేశ్వరస్థానము గలదు.

ఉ॥ చిక్కని కాలభైరవుని చేతి విధాతృ కపాల పాత్ర యే
చక్కటియందు జాఱిపడె సప్తనదీతట భీమ భూమియం
దక్కడ నుద్భవించిన శశాంక కిరీటుఁ గపాలి శంభు స
మ్యక్కృతిఁ గొల్చు మానవుల మానుగఁ జేరవు పాతకౌఘముల్. 140

అర్థము :- చిక్కని=దృఢమైన; కాలభైరవుని=కాలభైరవుని యొక్క; చేతి= హస్తము నందలి; విధాతృ=బ్రహ్మ యొక్క; కపాల=పుఱ్ఱెయను; పాత్ర=భిక్షాపాత్ర; సప్తనదీతట=సప్త గోదావర తీరమునందలి; భీమ భూమియందు=భీమమండలమునందలి; ఏచక్కటి యందు= ఏ నెలవునందు; జాఱి=(చేతి నుండి) జాఱి, పడెన్=పడినదో; అక్కడ=ఆ ప్రదేశమునందు; ఉద్భవించిన=వెలసిన; శశాంక కిరీటున్=చంద్రుడు శిరస్సునగలట్టియు; కపాలి శంభున్= కపాలేశ్వర లింగమును; సమ్యక్+కృతిన్=(పూజాదులగు) సత్కార్యములతో; కొల్చు=సేవించు; మానవులన్=మనుజులను; పాతక+ఓఘముల్=పాప సమూహములు; మానుగన్=క్షీణింపగా; చేరవు=సమీపింపవు.

భావము :- బలిష్ఠమగు కాలభైరవుని చేతిలోని బ్రహ్మకపాల పాత్ర సప్తగోదావర తీరమునందలి భీమేశ్వరుని భూమిలో జారిపడినచోట ఆవిర్భవించిన కపాలేశ్వరస్వామిని యథావిధిగా పూజించినచో పాపములు నశించును; దరిచేరవు.

ఆ॥ ఆ కపాల మోచనాభిధానంబైన
పుణ్యతీర్థరాజమునను జలుపఁ
గడిఁదిఁ గోటిఫలము గాంచు నొక్కొక్కటి
దానహోమయజ్ఞ తంత్ర విధులు. 141

అర్థము :- ఆ కపాలమోచన=ఆ కపాలమోచనమను; అభిధానంబు+ఐన= పేరుగలదైన; పుణ్య=పవిత్రమైన; తీర్థరాజమునన్=తీర్థశ్రేష్ఠమునందు; దాన.....విధులు. దాన=ఈవి, హోమ=వేలిమి; యజ్ఞతంత్ర=జన్నము నియమముల యొక్క; విధులు=విధానములను; కడిఁదిన్=తీవ్రముగా; చలుపన్=చేయగా; ఒక్క+ఒక్కటి=ప్రతి యొకటియు; కోటిఫలమున్=కోటి రెట్ల ఫలితమును; కాంచును=పొందును.

భావము :- ఆ కపాల మోచనమను పుణ్య తీర్థతటమునందు దానము, హోమము, యజ్ఞము, తదితర నియమములు యథావిధిగా తీవ్రనిష్ఠతో చేసినచో నొక్కొక్కటి కోటి రెట్ల ఫలమునిచ్చును.

చ॥ అట వరుణేశ్వరంబనఁగ నాదిప్రచేతసుచేత వాహినీ
తటమునఁ దొంటి నిల్పఁబడి దక్షమహేశ కరారవింద సం
పుటమునకున్ వరాటకము వోలె వెలింగెడు బాలతారకా
విట మకుటావతంసునకు విక్రమ కారణమై తపోనిధీ! 142

అర్థము :- తపోనిధీ=తపస్సునకు ధనాగారమైన వ్యాసా. అట=దానికి తరువాత - అక్కడ; వరుణేశ్వరంబు+అనఁగన్=వరుణేశ్వరమను పేరుతో, ఆది ప్రచేతసుచేత=(ప్రచేతసనాములలో మొదటి వాడగు) వరుణుని చేత; తొంటి=వెనుకటి; వాహినీ తటమునన్=(సప్త గోదావర) నదీతీరమునందు; నిల్పఁబడి=ప్రతిష్ఠింపబడి; దక్ష.....మునకున్. దక్ష=సమర్థుడగు; మహేశ=పరమేశ్వరుని యొక్క; కర+అరవింద=హస్త పద్మమను; సంపుటమునకున్=బరిణెకు; వరాటకము+పోలెను=గవ్వ వలెను; బాల.....అవతంసునకున్; బాల=శిశువైన; తారకా=నక్షత్రములకు; విట=కాముకుడగు చంద్రుడు; మకుట=కిరీటమునకు; అవతంసునకున్=అలంకారముగాగల శివుని యొక్క; విక్రమ=పరాక్రమమునకు; కారణమై=హేతువై; వెలింగెడున్=ప్రకాశించును.

భావము :- వ్యాస మహర్షీ! అచట పూర్వము వరుణుడు సప్తగోదావర సమీపమునందు వరుణేశ్వర లింగమును ప్రతిష్ఠించెను. ఆయన చంద్రశేఖరుడగు దక్షారామ భీమేశ్వర స్వామి హస్తపద్మమను బరిణలోనున్న గవ్వవలె నుండి ఆయన పరాక్రమ హేతువై వెలుగుచున్నాడు.

విశేషము :- అలంకారము - ఉపమ.

తే॥ వరుణ లింగంబునకుఁ దీర్థవారిధార
వేయి ఘటముల నభిషేక విధి యొనర్ప
వఱపు దోసంబు వాయంగ వాన కురియుఁ
గొండ్రలం బండు నారబ కోటులెల్ల. 143

అర్థము :- వరుణలింగంబునకున్=వరుణేశ్వర లింగమునకు; తీర్థ=పుణ్య జలాశయములోని; వారిధారన్=జలధారతోడి; వేయి ఘటములన్=వేయి కుండలతో; అభిషేక విధిన్=స్నానము చేయించుట అను విధానమును; ఒనర్పన్=చేయగా; వఱపు=అనావృష్టి-వానలేకుండుట అను; దోసంబు=హాని; పాయంగన్=పోగా; వాన=వర్షము; కురియున్=కురియును; కొండ్రలన్=దున్నిన పొలములలో, ఆరబకోటులు+ఎల్లన్=అన్ని తొలి పైరులును; పండున్=పండును.

భావము :- ఆ వరుణ లింగమునకు తీర్థజలముతో సహస్ర ఘటాభిషేకము చేసిన అనావృష్టి దోషముపోయి పొలములలో తొలి పైరు పండును.

ఉ॥ కుక్కుట పక్షి సంఘము లకుంఠిత భక్తిఁబ్రదక్షిణంబు స
మ్యక్కృతిఁ జేసి యెవ్వని కృపాతిశయంబున మోక్ష సత్పదం
బెక్కె, సమస్తలోకముల కెల్లఁబ్రియుం దరుణేందు శేఖరుం
గుక్కుటనాథదేవు ఫణికుండలునిం గొలువుండు మానవుల్. 144

అర్థము :- కుక్కుట=కోడి మొదలగు; పక్షి సంఘములు=పక్షుల సమూహములు; అకుంఠిత=మొక్కవోని; భక్తిన్=భక్తితో; ప్రదక్షిణంబు=దేవతాదుల నుద్దేశించి కుడివైపునకు తిరిగివచ్చుట; సమ్యక్+కృతిన్=సముచితకార్యముగా; చేసి=చేసి; ఎవ్వని=ఏ స్వామి యొక్క; కృపా=దయ యొక్క; అతిశయంబునన్=అధిక్యముతో; మోక్ష=ముక్తియను; సత్పథంబు=సజ్జనమార్గమును; ఎక్కె=అధిరోహించెనో; మానవుల్=మానవులారా; (అటువంటి), సమస్త=అన్నియునగు; లోకములకు+ఎల్లన్=లోకములకు అంతటను; ప్రియున్=ఇష్టమైనట్టియు; తరుణ+ఇందుశేఖరున్=నూతన చంద్రరేఖ శిరస్సున గలట్టియు; కుక్కుట నాథదేవున్=కుక్కుటేశ్వరుడను పేరుగల దేవుడైనట్టియు; ఫణికుండలునిన్=(సర్పములే కర్ణభూషణములు గాగల) శివుని; కొలువుండు=సేవింపుడు.

భావము :- కోళ్ళగుంపులు మొక్కవోని భక్తితో చక్కగా ప్రదక్షిణముచేసి ఆ స్వామి కరుణాధిక్యముతో మోక్షమార్గమున నేగెను. ఆయనయే కుక్కుటేశ్వరుడు. ఆయన సమస్త లోకములలో అంతటను ఇష్టమైన వాడు. బాలచంద్రుడు శిరముననున్నవాడు; సర్ప కుండలుడు. మానవులారా! ఆ దేవుని సేవింపుడు.

విశేషము :- కుక్కుట చతుష్టయ వృత్తాంతము కాశీఖండము. 7.ఆ. 260, 261 పద్యములలో గలదు. భీమ 2-50 చెంత వివరింపబడినది.

తే॥ ఒక్క పక్షంబు లెంతయు నుర్వి మోవ
గుడిఁ బ్రదక్షిణ మొనరించు కుక్కుటముల
కక్షయంబగు మోక్షమే యయ్య యొసఁగె
నట్టి శివుఁ గుక్కుటేశ్వరు నాశ్రయింతు. 145

అర్థము :- ఒక్క పక్షంబులు=ఒక వైపు ఱెక్కలు; ఎంతయున్=ఎక్కువగా; ఉర్వి= భూమి; మోవన్=మోయగా; గుడిన్=ఆలయమును; ప్రదక్షిణము+ఒనరించు=ప్రదక్షిణము చేయునట్టి; కుక్కుటములకు=కోళ్ళకు; అక్షయంబు=నశించుటలేనిది; అగు=అయినట్టి; మోక్షము=ముక్తిని; ఏ+అయ్య=ఏ తండ్రి; ఒసఁగెన్=ఇచ్చెనో; అట్టి=అటువంటి; కుక్కుటేశ్వరున్=కుక్కుటేశ్వరుడను; శివున్=శివుని, ఆశ్రయింతున్=అండగొందును.

భావము :- ఒక వైపు ఉండునట్టి ఱెక్కలే భూమిపై బాగుగా ఆనగా ఆలయమునకు ప్రదక్షిణము చేయు కోళ్ళకు శాశ్వత మోక్షము నిచ్చిన కుక్కుటేశ్వరదేవుని ఆశ్రయింతును.

క॥ చరణాయుధేశ్వరేశ్వరు
శరణాగత కల్పతరువు సంపూర్ణ మహా
కరుణా వరుణాలయునిం
దరుణామృత కిరణ ధరుని దర్శింపవలెన్. 146

అర్థము :- శరణాగత=శరణుపొందిన వారికి; కల్పతరువు=కల్ప వృక్షమును; సంపూర్ణ= నిండిన; మహా=గొప్పదగు; కరుణా=దయకు; వరుణాలయునిన్=సముద్రమును; తరుణ= నూతనుడగు; అమృతకిరణ=చంద్రుని; ధరునిన్=తాల్చినవాడును; చరణాయుధ+ఈశ్వర= కుక్కుటేశ్వరుడను; ఈశ్వరున్=శివుని; దర్శింపవలెన్=దర్శనము చేయవలెను.

భావము :- శరణందిన వారికి కల్ప వృక్షమును, కరుణాపుర్ణ మహాసముద్రమును, నూతన చంద్రరేఖాధారియునగు కుక్కుటేశ్వర శివుని దర్శింపవలయును.

విశేషము :- చరణ వేవాయుధం యస్య సః చరణాయుధః - కాళ్లే ఆయుధముగా గలది - చరణాయుధము (కోడి) - గురుబాల ప్రబోధిక.

క॥ కోణార్కక్షేత్రము, వా
రాణశి కేదార తీర్థరాజము, కుంభీ
కోణంబు కుక్కుటేశ
స్థాణు స్థానంబు మోక్షధామము లెందున్. 147

అర్థము :- కోణార్క క్షేత్రము=కోణార్కమను సూర్యక్షేత్రమును; వారాణశి=కాశి; కేదార= కేదారమను పేరుగల; తీర్థరాజము=క్షేత్రశ్రేష్ఠము; కుంభకోణము=కుంభకోణము; కుక్కుటేశ= కుక్కుటేశ్వరుడను; స్థాణు=శివుని యొక్క; స్థానంబు=నిలయము; ఎందున్=అన్నిటి యందును; మోక్షధామములు=మోక్ష స్థానములు.

భావము :- కోణార్కము, కాశి, కేదారము, కుంభకోణము, కుక్కుటేశ్వరము అనునవి ఐదు అన్ని పుణ్యక్షేత్రములకన్నను మోక్షస్థానములు.

విశేషము :- హిమాలయములలోని బదరి, పశ్చిమ సముద్రతీరమునందలి ద్వారక, పూర్వ సముద్రతీరమున గల జగన్నాథపురి, దక్షిణ సముద్రమధ్యమునగల రామేశ్వరము అను నాలుగు చతుర్ధామములుగా ప్రసిద్ధములు. శ్రీనాథుడు ఈ పద్యములో శివుని అయిదు ధామములను జెప్పుచున్నాడు.

1. కోణార్కము :- సూర్యాలయము..పూరీ క్షేత్రము నుండి 33 కి.మీ.
2. వారణాసి :- జగత్ప్రసిద్ధమగు కాశీక్షేత్రము. జ్యోతిర్లింగము.
3. కేదారము :- హిమాలయములలో గలదు. జ్యోతిర్లింగము.
4. కుంభకోణము :- తమిళనాడులో పెక్కు ఆలయములు గల పట్టణము.

చూ - 2 ఆ. 55. వ - కేదార కుంభ కోణార్క స్థానంబుల కుపమానంబనంజాలి...

తే॥ అచట దానంబు హోమ మధ్యయన విధులు
శ్రాద్ధమును దేవతా సమర్చనము వ్రతము
లొక్కటొక్కటి కోటి గుణోపలబ్ధి
సంభవించును సతతంబు సాధకులకు. 148

అర్థము :- అచట=ఆ కుక్కుటేశ్వరస్థానములో; దానంబు=దానము చేయుట; హోమము=వ్రేల్చుట; అధ్యయన=వేదపఠనము అనువాని; విధులు=విధానములు; శ్రాద్ధమును=తద్దినము పెట్టుట; దేవతా=ఆ దేవుని; సమర్చనము=పూజయు; వ్రతము=నోము; అనువానిలో; ఒక్కటి+ఒక్కటి=ప్రతియొకటియు; సాధకులకు=సాధన చేయువారికి; సతతంబు=ఎల్లప్పుడును; కోటిగుణ=కోటిరెట్లు; ఉపలబ్ధి=పొందుట(పుణ్యము); సంభవించును=కలుగును.

భావము :- కుక్కుటేశ్వర స్థానములో దానము, హోమము, వేదపాఠము, శ్రాద్ధము, దేవపూజ, వ్రతము అనువాని నాచరించిన వానిలో ప్రతియొక్కటియు కోటిరెట్లు పుణ్యము సాధకులకు లభింపజేయును.

వ॥ మఱియు సోమేశ్వర తీర్థంబు సర్వదేవతా నమస్కృతంబు.

అర్థము :- మఱియు=ఇంకను; సోమేశ్వర తీర్థంబు=సోమేశ్వరమను తీర్థము; సర్వదేవతా=సమస్త దేవతలచేత; నమస్కృతంబు=నమస్కరింపబడినది.

భావము :- సోమేశ్వర తీర్థమును సర్వదేవతలు నమస్కరింతురు.

క॥ అమృత మయుఁడైన సోముఁడు
సమయంబున నే మహేశు సంస్థాపించెన్
విమల సుధా జ్యోతిర్లిం
గము సోమేశ్వరుని నీలకంఠు భజింతున్. 150

అర్థము :- అమృతమయుఁడు=అమృతవికారుడైన; సోముఁడు=చంద్రుడు; సమయంబునన్=దు:ఖసమాప్తి కాలములో-ప్రతిజ్ఞతో; ఏ మహేశున్=ఏ శివుని; సంస్థాపించెన్=ప్రతిష్ఠించెనో; ఆ; విమల=నిర్మలమగు; సుధా=అమృతమయమగు; జ్యోతిర్లింగము=తేజోమయలింగము; సోమేశ్వరుని=సోమేశ్వరుడను పేరుగల; నీలకంఠున్=శివుని; భజింతున్=సేవింతును.

భావము :- అమృతమయుడగు చంద్రుడు ఒక సమయములో నిర్మలసుధా జ్యోతిర్లింగమును సోమేశ్వరుడను పేరుతో ప్రతిష్ఠించెను. ఆ దేవుని సేవింతును.

సీ॥ సోమతీర్థము నందు సుస్నాన మొనరించి
శ్రీసోమశంభు భజించు ధన్యుఁ
డిహజన్మమున యందు నేపాప మొనరించెఁ
బాపమెద్ది యొనర్చెఁ బ్రాగ్భవమున
నది యశేషంబును నాక్షణంబునఁ బాసి
దేహాంతమునఁ గూడుఁ ద్రిపురహరునిఁ
ద్యాగంబు భోగంబు దానంబు సత్యంబు
భాగ్యంబు కీర్తి సౌభాగ్యలక్ష్మి

తే॥ బుద్ధి దత్సేవ నెంతయు వృద్ధిఁబొందు;
సతత ధర్మంబు నిచ్చు నక్షయ ఫలంబు
తత ఫలంబులు పిత్రర్థ దైవికములు
సత్యమిది సోమనాథ ప్రసాదమహిమ. 151

అర్థము :- సోమతీర్థమునందు=సోమతీర్థములో; సుస్నానము=చక్కగా స్నానము; ఒనరించి=చేసి; శ్రీ సోమశంభున్=శ్రీ సోమేశ్వర స్వామిని, భజించు=సేవించునట్టి; ధన్యుఁడు= పుణ్యాత్ముడు; ఇహజన్మమునయందున్=ఇప్పటి పుట్టుక యందు; ఏ పాపము=ఏ పాతకమును; ఒనరించెన్=చేసెనో; ప్రాగ్భవమునన్=వెనుకటి జన్మములో; ఎద్ది+పాపము=ఏ పాపము; ఒనర్చెన్=చేసెనో; అది=ఆ పాపము; అశేషంబునున్=మిగులకుండ-పూర్తిగా; అక్షణంబునన్=ఆ నిమిషములోనే; పాసి=వదలి; దేహాంతమునన్=మరణించిన తరువాత; త్రిపురహరునిన్=(మూడు పురములను నాశము చేసిన) శివుని; కూడున్=చేరును.

తత్=ఆ సోమేశ్వరుని యొక్క; సేవన్=సేవచేత; త్యాగంబు=ఉదారతయు; భోగంబు= (సుఖములను) అనుభవించుట; దానంబు=ఈనియు; సత్యంబు=నిజము చెప్పుట; భాగ్యంబు=సమృద్ధియు; కీర్తి=కీర్తియు; సౌభాగ్య=సౌందర్యము; లక్ష్మి=సంపద; బుద్ధి=జ్ఞానము అనునవి. ఎంతయున్=అధికముగా; వృద్ధిన్+పొందును=అభివృద్ధినందును; సోమనాథ= సోమేశ్వరుని; ప్రసాద మహిమన్=అనుగ్రహ మహిమచే; సతత=ఎడతెగని; ధర్మంబు=ధర్మా చరణము; అక్షయ ఫలంబున్=తరిగిపోని ఫలితమును; ఇచ్చున్=ఇచ్చును; పితృ+అర్థ= పితృదేవతలకు ప్రయోజనకరములు; దైవికములు=దేవతలకు సంబంధించిన కార్యములు; తత=వృద్ధినందు; ఫలములు=ప్రయోజనము గలవగును. ఇది=ఈ మాట; సత్యము=నిజము.

భావము :- సోమతీర్థములో యథావిధిగా స్నానము చేసి శ్రీ సోమేశ్వరుని సేవించు పుణ్యాత్ముడు ఈ పుట్టువులో చేసినవి; తొలి పుట్టువులో చేసిన పాపములను పూర్తిగా క్షణములో వదలి మరణానంతరము పరమేశ్వరుని జేరును. ఆయనను సేవించుటచేత త్యాగము, భోగము, దానము, సత్యము, సమృద్ధి, కీర్తి, సౌందర్యము, సంపద, జ్ఞానము అనునవి మిక్కిలిగా వృద్ధినందును. సోమేశ్వరుని ప్రసాద మహిమచేత ఎడతెగక చేయు ధర్మమక్షయ పుణ్యము నొసగును. పితృశ్రాద్ధాదులు, దేవతలకు సంబంధించిన వ్రతాదులు సమృద్ధ ఫలములనొసగును. ఇది యథార్థము.

క॥ సురలును విద్యాధరులును
గరుడోరగ కిన్నరులును గంధర్వులు కిం
పురుషులు యక్షులు సోమే
శ్వరదేవుని గొల్తు రధిక వరభక్తిమెయిన్. 152

అర్థము :- సురలును=దేవతలును; విద్యాధరులును=విద్యాధరులును; గరుడ=గరుడులును; ఉరగ=నాగులును; కిన్నరులును=కిన్నరులును; గంధర్వులు=గంధర్వులును, కింపురుషులు=కింపురుషులును; యక్షులు=యక్షులును; అధిక=మిక్కిలియగు; వర=శ్రేష్ఠమగు; భక్తిమెయిన్=భక్తితో; సోమేశ్వర దేవున్=సోమేశ్వర స్వామిని; కొల్తురు=సేవింతురు.

భావము :- దేవతలు, విద్యాధరులు, గరుడులు, ఉరగులు, కిన్నరులు, గంధర్వులు, కింపురుషులు, యక్షులు అను దేవజాతుల వారందఱును అధిక శ్రేష్ఠభక్తితో సోమేశ్వరుని సేవింతురు.

వ॥ మఱియు మాహేశ్వర తీర్థంబు సర్వదేవ నమస్కృతంబు, ముని సిద్ధ చారణ విద్యాధరులచేతం బ్రతిష్ఠితంబైన యది; అందు పితృపిండ దానం బేక వింశతి కులంబునకుఁ దృప్తికరంబు. 153

అర్థము :- మఱియున్=ఇంకను; మాహేశ్వర తీర్థంబు=మాహేశ్వరమను పేరుగల తీర్థము, సర్వదేవ నమస్కృతంబు=దేవతలందరిచేత నమస్కరింపబడినది; ముని=మునుల చేత; సిద్ధ=సిద్ధులచేత; చారణ=చారణులచేత; విద్యాధరులచేతన్=విద్యాధరులచేత; ప్రతిష్ఠితంబు+ఐన+అది=స్థాపింపబడినది; అందు=ఆ మాహేశ్వర తీర్థములో; పితృ=పితృ దేవతలకొఱకు; పిండదానంబు=పిండముల నిచ్చుట; ఏకవింశతి=ఇరువది యొకటి; కులంబునకున్=వంశములకు(తరములకు); తృప్తికరంబు=సంతృప్తినిచ్చునది.

భావము :- ఇంకను మాహేశ్వర తీర్థము గలదు. దానికి దేవతలందఱు నమస్కరింతురు. ఆ తీర్థమును మునులు, సిద్ధులు, చారణులు, విద్యాధరులు ప్రతిష్ఠించిరి. అచట పితృదేవతలకు పిండదానము చేసినచో నది ఇరువది యొక్క కులము(తరము)లను తృప్తి పఱచును.

తే. సప్త గోదావరంబను సార తీర్థ
ముత్తమోత్తమ; మందు మర్త్యుండు చేయు
శ్రాద్ధ తిల తర్పణాదు లక్షయ ఫలంబు
తత్సదా సేవనము శివస్థానదంబు. 154

అర్థము : సప్తగోదావరంబు అను=సప్తగోదావరమను పేరుగల; సార=శ్రేష్ఠమగు; తీర్థము=జలాశయము; ఉత్తమ+ఉత్తమము=ప్రధానమైనవానిలో ప్రధానమైనది; అందు=దానిలో; మర్త్యుండు=మానవుడు; చేయు=చేయునట్టి; శ్రాద్ధ=శ్రాద్ధము; తిలతర్పణ=నూవులతో జలదానము; ఆదులు=మొదలగునవి; అక్షయ=తరుగని; ఫలంబు=పుణ్యము (నిచ్చును);

తత్=ఆ సప్త గోదావరమును; సదా=ఎల్లప్పుడు; సేవనంబు=ఉపయోగించుట; శివస్థాన దంబు=శివనివాసమగు కైలాసము నిచ్చును.

భావము : సప్తగోదావరము శ్రేష్ఠమగు తీర్థము. అది ఉత్తమ తీర్థములలో నుత్తమము. ఆ సరస్సులో నరుడుచేయు శ్రాద్ధములు, తిలతర్పణములు మున్నగునవి అక్షయ పుణ్యము నిచ్చును. స్నానాదులకు ఆ తటాకజలము నుపయోగించువానికి కైలాసవాసము కలుగును.

తే. దత్త మిష్టంబు హుతమధీతంబు నరుల
కచట నక్షయఫలము చేయంగఁ జాలు
శ్రాద్ధ పిండ ప్రదానాది సకలవిధులు
నందు ఫలియించు నగ్గయ యందుఁబోలె. 155

అర్థము : అచటన్=ఆ సప్త గోదావరములో; దత్తము=దానము చేయబడినది; ఇష్టంబు=యాగము (చేయబడినది); హుతము=వ్రేల్చబడినది; అధీతంబు=అధ్యయనము చేయబడినది; నరులకు=మనుజులకు; అక్షయఫలము=నాశములేని పుణ్యమును; చేయంగఁ జాలున్=కలిగింప సమర్థమగును; అందు=ఆ సరస్సులో; శ్రాద్ధ.... విధులు; శ్రాద్ధ=తద్దినము పెట్టుట; పిండప్రదాన=పిండములనిచ్చుట; ఆది=మొదలగు; సకలవిధులు=సమస్తమైన ధార్మిక విధానములు; ఆ+గయయందున్+పోలె=ఆ గయాక్షేత్రము నందువలె; ఫలియిం చును=ఫలవంతములగును.

భావము : సప్తగోదావరములో దానము, యజ్ఞము, హోమము, అధ్యయనము అనునవి అక్షయ ఫలము నిచ్చును. శ్రాద్ధము పిండప్రదానము మున్నగునవి గయలో వలె ఆ తటాకము నందు పుణ్యప్రదములు.

విశేషము : భారతదేశములో ఐదు ప్రధాన పితృ తీర్థములు కలవు.

1. గయ :- బీహారు రాష్ట్రములో నున్నది. దీనిని గయా శిరఃక్షేత్ర మందురు.
2. యాజపుర వైతరిణి :- ఒరిస్సాలోని నాభి గయాక్షేత్రము.
3. పిఠాపురము :- పాద గయాక్షేత్రము. ఆంధ్రప్రదేశ్‌లో కలదు.
4. సిద్ధపురము :- మాతృగయ. గుజరాతులో నున్నది.
5. బదరీనాథ్ - హిమాలయములో గలదు. బ్రహ్మకపాలము.

క. మఱి రామేశ్వర తీర్థము
కఱకంఠున కాటపట్టు; కామిత ఫలముల్
తఱుగని ధాన్యము లగుచును
నెఱయంగ ఫలించు, నందు నిష్ఠయుఁ గలుగున్. 156

అర్థము : మఱి=మఱియును; రామేశ్వర తీర్థము=రామేశ్వరమను తీర్థము; కళుకందు కు=(నల్లదనము కంఠమునందు గల) శివునకు; ఆటపట్టు=నివాసము; అందు=ఆ ర్థమునందు; కామిత=కోరిన; ఫలముల్=ఫలితములు; తఱుగని=తగ్గిపోని; ధాన్యములు+ ౹గుచును=పంటలగుచు; నెఱయంగన్=అతిశయింపగా; ఫలించును=పండును; నిష్ఠయున్= ్రద్ధయును; కలుగున్=లభించును.

భావము : రామేశ్వర తీర్థము శివుని నివాసము. అచట కోరిన కోరికలు తఱుగని ధాన్యము వలె మిక్కిలిగా ఫలించును. శ్రద్ధా భక్తులు కలుగును.

క. శ్రీ రుద్ర పాదయుగళీ
శ్రీరామేశ్వర సమీప సీమం బిత్రృ య
జ్ఞారంభం బొనరింప న
పార ఫలప్రాప్తి చెందుఁబంచ జనులకున్. 157

అర్థము : శ్రీ రుద్రపాదయుగళీ=శోభాకరమగు రుద్రపాదద్వయమును; శ్రీ రామేశ్వర=శ్రీ రామేశ్వరస్వామి యొక్క; సమీప సీమన్-దగ్గరిదగు ప్రదేశము నందు; పిత్రృయజ్ఞ=పిత్రృదేవతల కొఱకగు యాగము-శ్రాద్ధము యొక్క; ఆరంభంబు=ప్రారంభము; ఒనరింపన్=చేయగా; పంచజనులకున్=మానవులకు; అపార=అంతములేని; ఫల=ఫలితము యొక్క; ప్రాప్తి= లభించుట; చెందున్=కూడును.

భావము : రుద్రపాదములు, శ్రీ రామేశ్వర స్వామివారల సమీప ప్రదేశములో పిత్రృయజ్ఞము (శ్రాద్ధమును), ప్రారంభింపగా నరులకు అపారఫలము గలుగును.

విశేషము : రుద్రపాదములు. చూడుడు భీమ. 3.21.

తే. ప్రథితమగు సప్త గోదావరంబునకును
నభవునకు భీమనాథున కంతరమున
నేమి సుకృతంబు చేసిన నేకతంబ
వేయి విధములఁ ఫలియించు వేయునేల? 158

అర్థము : ప్రథితము+అగు=ప్రసిద్ధమైన; సప్తగోదావరంబునకునున్=సప్తగోదావరము నకును; భీమనాథునకు=భీమేశ్వరుడను పేరుగల; అభవునకు=శివునకును; అంతరమునన్= మధ్యమున; ఏకతంబ=ఒంటరిగానే; ఏమి సుకృతంబు=ఎటువంటి పుణ్యము; చేసినన్= చేసినను; వేయి విధములన్=వేయి ప్రకారముల; ఫలియించును=ఫలవంతమగును; వేయును+ఏల=వేయిమాటలేల?

భావము : ప్రసిద్ధమగు సప్త గోదావరమునకు భీమేశ్వరస్వామి వారికిని మధ్యమునగల ప్రదేశములో ఒంటరిగానైన ఎట్టి పుణ్యము చేసినను అది నానా విధముల ఫలవంతమగును. పలుమాటలేల?

సీ. వినుము పారాశర్య! వేవేల మాటలఁ
బనియేమి? తీర్థముల్ పదియు రెండు
నని చెప్పనేల? దక్షారామ మండలిఁ
దీర్థంబు గాని ప్రదేశమెద్ది?
సప్తగోదావరోత్సంగ స్థలమునకుఁ
గాశి కేదార మక్షయ వటంబు
తరముగా; వితర తీర్థమ్ములు సాటియె?
భోగ మోక్షములకుఁ బుట్టినిల్లు

తే. రుద్రవాటిక భీమేశ్వరుని నివాస;
మందు రామేశ్వర స్థాన మభ్యధికము;
రామతీర్థంబు నందు సారంబు సాటి
ధర్మమర్మంబు రుద్ర పాదస్థలంబు. 159

అర్థము : పారాశర్య=వ్యాసా! వినుము=వినుము; వేయి+వేల మాటలన్=వేలవేల మాటలతో; పని+ఏమి=ఏమి ప్రయోజనము? తీర్థముల్=(దక్షా రామములోగల) తీర్థములు; పదియు రెండును+అని=పండ్రెండు అని; చెప్పన్+ఏల=చెప్పుట యెందులకు? దక్షారామ మండలిన్=దక్షారామము యొక్క మండలము నందు; తీర్థంబు=పవిత్రక్షేత్రము; కానిది= కానట్టిది; ఎద్ది=ఏది యున్నది?

సప్తగోదావర=సప్తగోదావరము యొక్క; ఉత్సంగ స్థలమునకున్=ఒడిలోని ప్రదేశము నకు; కాశి=కాశీ నగరముగాని; కేదార=కేదారక్షేత్రముగాని; అక్షయవటంబు=(ప్రయాగలో గల) అక్షయ వటవృక్షముగాని; తరముగావు=పోలిక (సమానము) గావు (అనగా) ఇతర తీర్థమ్ములు= తదితరములగు పుణ్యదేశములు; సాటియె= సమానమగునా?

భీమేశ్వర నివాసము=భీమేశ్వరుని ఇల్లు; రుద్రవాటిక=శివుని ఉద్యానవనము; భోగ=సుఖములకు; మోక్షములకున్=మోక్షములకు; పుట్టినిల్లు=జన్మస్థానము; అందు=ఆ భీమేశ్వర వనములోను; రామేశ్వర స్థానము=రామేశ్వర లింగమున్న ప్రదేశము; అభ్యధికము= ఇంకను ఎక్కువైనది; రామతీర్థంబు=రామతీర్థము (లోని జలము) సారంబు=అమృతముతో;

సాటి=సామ్యమును; అందున్=పొందును; రుద్రపాద స్థలంబు=రుద్రపాదములున్న ప్రదేశము, ధర్మ మర్మంబు=పుణ్యమునకు గుప్తస్థానము.

భావము :- వ్యాసా? వినుము. వేలవేల మాటలతో అవసరమేమున్నది? దక్షారామ మండలములో పండ్రెండు తీర్థములే అని చెప్పనేల? అచట తీర్థముగాని ప్రదేశమేమున్నది? సప్త గోదావరము ప్రదేశమునకు కాశి గాని, కేదారము గాని, అక్షయవటముగాని సాటిరావు అనగా ఇతర తీర్థములు దానితో సమములెట్లగును? భీమేశ్వరుని నివాసమగు ఆరుద్రవనము భోగ మోక్షములకు పుట్టిల్లు. అందులోనను రామేశ్వరస్వామి యున్న ప్రదేశము మిక్కిలి అధికమైనది. అందలి రామతీర్థ(జల)ము అమృతముతో సమానమగును. రుద్రపాదము లున్నచోటు ధర్మమును గుప్తముగా నుంచునది.

## అగస్త్యుఁడు వ్యాసునకుఁ బంచ తీర్థంబులు వివరించుట

**వ. మఱియుఁ బంచతీర్థంబులు వివరించెద; నవహితుండవై యాకర్ణింపుము. 160**

అర్థము :- మఱియున్=ఇంకను; పంచ తీర్థంబులు=అయిదు పవిత్ర జలస్థానములను; వివరించెదన్=విస్తరించి చెప్పెదను; అవహితుండవు+ఐ=ఏకాగ్రత కలవాడవై; ఆకర్ణింపుము=వినుము.

భావము :- ఇకమీద పంచతీర్థములను గూర్చి వివరించి చెప్పెదను: ఏకాగ్రతతో వినుము.

**చ. అహిపతి కంకణుండు తన యల్లుఁడుగా మదిఁ గోరి నిష్ఠతోఁ**
**దుహిన ధరాధరేంద్రుఁడు చతుర్దశ దివ్య మహాబ్దముల్ సుదు**
**స్సహముగఁ జేసె నయ్యెడఁ బ్రచండతపం; బచటన్ శివుం డను**
**గ్రహమున నుద్భవించెనని క్రచ్చఱఁ బల్కుఁ బురాణ సంహితల్. 161**

అర్థము :- తుహిన ధరాధరేంద్రుడు=పర్వతాధిపతియగు హిమవంతుడు; ఆ+ఎడన్=ఆ ప్రదేశములో; అహిపతి కంకణుండు=నాగరాజు హస్తభూషణముగా గల శివుడు; తన=తనకు; అల్లుఁడు+కాన్=అల్లుడగుటను; మదిన్=మనస్సులో; కోరి=కోరి; నిష్ఠతోన్=పట్టుదలతో; చతుర్దశ=పదునాలుగు; దివ్య=దేవతలకు సంబంధించిన; మహా+అబ్దముల్= మహత్తరములగు సంవత్సరములు; ప్రచండ=మిక్కిలి తీవ్రమగు; తపంబు=తపస్సును; సుదుస్సహముగన్=సహించుటకు వీలులేనంత అధికముగా; చేసెన్=చేసెను; శివుండు=శంకరుడు; అనుగ్రహమునన్=(హిమవంతునిపై గలిగిన) దయతో; అచటన్=ఆ ప్రదేశమునందు; ఉద్భవించెను=ఆవిర్భవించెను; అని=అని; పురాణసంహితల్=పురాణములు (వేదములు, ధర్మశాస్త్రములు); క్రచ్చఱన్=ఏకకంఠముగా; పల్కున్=చెప్పుచున్నవి.

భావము :- శివుడు తనకు అల్లుడు కావలెనని కోరి హిమవంతుడు దక్షారామ ప్రాంతములో 14 దివ్య వర్షములు కఠోర నిష్ఠతో సుదుస్స్పహమగు ప్రచండ తపస్సును చేసెను. నగరాజు ననుగ్రహించి శివుడు అచ్చట ఆవిర్భవించెనని పురాణములు ఏకకంఠముగా పల్కుచున్నవి.

విశేషము :- దివ్య వర్షములు :- మానవ మానానుసారము ఒక సంవత్సరము దేవతలకు ఒక అహోరాత్రము. అందులో ఉత్తరాయణము ఆరు నెలలు దేవతలకు పగలు; దక్షిణాయనము ఆరు నెలలు రాత్రి. 360 దేవతల అహోరాత్రములు - అనగా 360 మానవ సంవత్సరములు దేవతలకు ఒక సంవత్సరము. అట్టి 14 దివ్య వర్షములు హిమవంతుడు శివుని గూర్చి ఘోర తపమొనర్చెను.

సుదుస్స్పహముగ - అను శబ్దము వలన దక్షుని తపో తీవ్రత సూచింపబడినది. ఒకటికంటె ఎక్కువ ఉపసర్గలు వాడుట శ్రీనాథుని రచనలో బాగుగా కనపడు ఒక లక్షణము.

క॥ అది యాదిగఁ దీర్థంబులు
పదియును రెండయిన తీర్థపాలీ జాతం
బదియును నెక్కువయై యు
న్నది సప్తతటంబు నందున న్మునివర్యా! 162

అర్థము :- మునివర్యా!=మునిశ్రేష్ఠా! అది=శివుడవతరించుట; ఆదిగన్=మొదలుగా; తీర్థంబులు=పవిత్ర జలస్థానములు; పదియును రెండు+అయిన=పండ్రెండు అయిన; తీర్థపాలీజాతంబు=తీర్థస్థాన సమూహము; అదియును=అదిగూడ; సప్తతటంబు నందునన్= సప్త గోదావర తీరమునందు; ఎక్కువ=అధికము; ఐ+ఉన్నది=అయియున్నది.

భావము :- మునీంద్రా! శివుడవతరించినది మొదలు పండ్రెండు తీర్థము లేర్పడెను. అ తీర్థస్థాన సమూహములో ఎక్కువ భాగము సప్తగోదావర సరస్తీరముననే యుండెను.

క॥ లంకించి యరుంధతి పతి
మంకణునకుఁ జెప్పె ననుఁగు మామకు గిరికిన్
సంకల్ప సిద్ధిదుండగు
శంకరుఁ డఖిలార్థి పారిజాతం బనుచున్. 163

అర్థము :- అనుఁగుమామకు=ప్రియమగు మామగారగు; గిరికిన్=హిమవంతునకు; సంకల్ప=ఉద్దేశ్యము - నిశ్చయము యొక్క; సిద్ధిదుండు+అగు=సిద్ధిని సాఫల్యమును ఇచ్చిన వాడగు; శంకరుఁడు=శివుడు; అఖిల=సమస్తమైన; అర్థి=యాచకులకు; పారిజాతంబు=

(కోరికలు తీర్చు దేవవృక్షమగు) పారిజాతము; అనుచున్=అనుచు; అరుంధతిపతి= అరుంధతీదేవి భర్తయగు వసిష్ఠుడు; మంకణునకున్=మంకణుడను మహర్షికి; లంకించి= (మనస్సుతో) పెనవేసికొనునట్లు; చెప్పెన్=చెప్పెను.

**భావము :-** అనుగు మామయగు హిమవంతుని ఉద్దేశ్యమును సఫలము చేసిన శంకరుడు యాచకుల పాలిటి కల్పవృక్షమని వసిష్ఠ మహర్షి మంకణ మహర్షి మనస్సునకు హత్తుకొనునట్లు చెప్పెను.

క॥ గిరిసార్వభౌమ కన్యా
కరగ్రహణ సుమంగళైక కౌతుక సంప
త్పరిపూర్ణ హృదయు శంకరుఁ
గరుణా కింకరుని నురగ కంకణుఁ గొలుతున్. 164

**అర్థము :-** గిరి.....హృదయున్. గిరి సార్వభౌమ=(పర్వత చక్రవర్తియగు) హిమ వంతుని; కన్యా=పుత్రికయగు పార్వతి యొక్క; కరగ్రహణ=పాణిగ్రహణము - అను; సుమంగళ=అధిక శుభమునందు; ఏక=ప్రధానమగు; కౌతుక=సంతోషమనెడి; సంపత్= సంపదచేత; పరిపూర్ణ=బాగుగా నిండిన; హృదయున్=మనస్సుగలట్టియు; కరుణా=దయకు; కింకరున్=సేవకుడైనట్టియు; ఉరగకంకణున్=సర్పమే చేతికడియముగాగల; శంకరున్=శివుని; కొలుతున్=సేవింతును.

**భావము :-** పార్వతీ పాణిగ్రహణ మంగళము వలన గలిగిన ఆనందపూర్ణ హృదయు డును, దయకు దాసుడగువాడును, దయామయుడు, నాగకంకణుడునగు శంకరుని సేవింతును.

**విశేషము :-** ఈ పద్య ద్వితీయ పాదము నందు "కరగ్రహణ" అను సమాన మధ్యగత మగు 'గ్ర' అను సంయుక్తాక్షరముచే 'కర'లోని రేఫము గురువు అగును. అట్లైన గణభంగ మగును.

ఇది సంస్కృత సమాస మధ్యగతము. "రహావ్యంజన సంయోగే" మున్నగు సూత్రములంబట్టి వ్యంజనయుక్తములైన 'ర, హ' వర్ణములు తేలికగా ఉచ్చరింపబడుట కవకాశము గలదు. అట్లగుటచేత తత్పూర్వవర్ణము గురువు కావలసిన నిర్బంధము లేదు. (సరస్వతీ కంఠాభరణము ప్రథమ సంపుటి. స్ఫూర్తిశ్రీ అనువాదము, పు - 212).

కావున ప్రస్తుత పద్యమున 'కర'లోని రేఫము లఘువని కవి అభిప్రాయము. శ్రీనాథుని మరి రెండు ప్రయోగములు.

ఉ॥ వివిధామర ముఖ్య ప్రతిష్ఠితంబులై — భీమ 4-31

తే॥ తాఁబ్రవర్తిల్లు లక్షగ్రంథంబు తోడ — కాశీ 1-72

బిందు పూర్వక "క" కారము యొక్క ఆవృత్తి యుండుటచే ఇచట వర్ణవిన్యాస వక్రత కలదు. శివ పర్యాయ పదముగా వాడిన 'శంకర' నామము ఇట సార్థకము. కనుక పర్యాయ వక్రత కూడ కలదు.

క॥ నీహార భూధరేశ్వరు
నీహా రమణీయ మూర్తి నిందుకర హిమా
నీ హార హీర కుముద సు
ధాహార సమాన కాంతి నభివర్ణింతున్. 165

అర్థము :- నీహార భూధర+ఈశ్వరున్=మంచుకొండ ప్రభువైన హిమవంతుని యొక్క; ఈహా=కోరికచేత; రమణీయ=అందమైన; మూర్తిన్=ఆకారము గలట్టి; ఇందుకర= చంద్ర కిరణములతో; హిమానీ=మంచుతో; హార=ముత్యాలహారముతో; హీర=వజ్రముతో; కుముద=తెల్లకలువతో; సుధాహార=అమృతాహారులతో; సమాన=తుల్యమైన; కాంతిన్=దీప్తిగల పరమేశ్వరుని; అభివర్ణింతున్=స్తుతింతును.

భావము :- హిమవంతుని కోరికచేత అందమైనవాడును, వెన్నెల, మంచు, ముక్తా హారము, వజ్రము, తెల్ల కలువ, అమృతాహారుల కాంతివంటి శరీర కాంతిగల పరమేశ్వరుని స్తుతింతును.

విశేషము :- అలంకారము - మాలోపమ; హకార, రకారముల ఆవృత్తిచే వర్ణవిన్యాస వక్రత.

సీ॥ భూధరేశ్వర తీర్థమునఁ గృత స్నానుఁడై
భూధరేశ్వరుఁ గొల్చు బోధ ఘనుఁడు
నిత్యమంగళుఁడు నిర్నిద్ర భద్రుండును
లక్ష్మీవిలాసైక లక్ష్మయుతుఁడు
నగుఁ; దీర్థములలోన నత్యుత్తమంబైన
తీర్థంబు భుక్తి ముక్తిప్రదంబు
మంగళ మంగళాత్మకము కల్యాణ క
ల్యాణ స్వరూప మీ యాస్పదంబు;

తే॥ ధరణి ధర నాయకునకుఁ బ్రత్యక్షమైన
యవ్విరూపాక్షు నగర మధ్యాహ్నవేళ
భోగ ఘంటా స్వనము విన్నభూజనులకు
నవల వినవచ్చు ముక్తి కల్యాణ ఘంట. 166

అర్థము :- భూధరేశ్వర తీర్థమునన్=భూధరేశ్వర నామకమగు పవిత్ర జలస్థానము నందు; కృతస్నానుఁడై=చేయబడిన స్నానము గలవాడై; భూధర+ఈశ్వరున్=(గిరీశుని) శివుని; కొల్చు=సేవించు; బోధఘనుఁడు=జ్ఞానపూర్ణుడగువాడు; నిత్యమంగళుఁడు=ఎల్లప్పుడు శుభములు గలవాడు. నిర్నిద్ర భద్రుండును=జాగ్రత్తయందు సర్వోత్తముడు; లక్ష్మీ.....యుతుఁడు. లక్ష్మీ=శ్రీదేవి యొక్క; విలాస=విలాసమనెడు; ఏక=ప్రధానమైన; లక్ష్మ=చిహ్నముతో; యుతుఁడున్=కూడినవాడును; అగున్=అగును.

ఈ+ఆస్పదంబు=భూధరేశ్వర తీర్థమున్నచోటు; తీర్థములలోనన్=అన్ని తీర్థములలోను; అత్యుత్తమంబు+ఐన=మిక్కిలి శ్రేష్ఠమైన; తీర్థంబు=తీర్థము(అగును) అది; భుక్తి=భోగమును; ముక్తి=మోక్షమును; ప్రదంబు=ఇచ్చునది; మంగళ=శుభముల యొక్క; మంగళాత్మకము=సమృద్ధి స్వభావము గలది; కల్యాణ=నాశములేని; కల్యాణ స్వరూపము=మంగళప్రదమగు నాకారము గలది.

ధరణీధర=పర్వతములకు; నాయకునకున్=నేతయగు హిమవంతునకు; ప్రత్యక్షము+ఐన=కన్నులకు కన్పించిన; ఆ+విరూపాక్షునగరన్=ఆ శివుని నగరునందు; మధ్యాహ్నవేళన్=అహ్నము యొక్క మధ్య సమయమునందు; భోగ=(శివునికి) నివేదనము చేయునప్పుడు మ్రోగు; ఘంటాస్వనము=గంటమ్రోత; విన్న=వినిన; భూజనులకు=నరులకు; అవలన్=తరువాత(మరణానంతరము); ముక్తి=మోక్షమునకు సంబంధించిన, కల్యాణ=మంగళకరమగు; ఘంట=ఘంటాధ్వని; వినవచ్చున్=విన్పించును.

భావము :- భూధరేశ్వర తీర్థములో స్నానముచేసి భూధరేశ్వరుని సేవించు జ్ఞానపూర్ణుడగువాడు ఎల్లప్పుడు శుభములుగలవాడు, సర్వోత్తమ జాగ్రత్తగలవాడు; లక్ష్మీవిలాస చిహ్నమగు మహత్తర ధనముగల వాడగును. ఈ పుణ్యదేశము తీర్థములలో నుత్తమోత్తమ తీర్థము. భుక్తి ముక్తులనిచ్చునది. శుభ సమృద్ధిమంతము. లాభదాయకము, మంగళప్రదమగు నాకారము గలది. హిమవంతునకు ప్రత్యక్షమైన ఆ శివుని నగరులో ఘంటాధ్వని వినువాడు మరణానంతరము ముక్తి కల్యాణఘంటారవమును వినును.

విశేషము :- భగవంతునకు మహానివేదన సమయమున ఘంటను మ్రోగించుట అర్చనవిధానములోని ఒక అంగము.

మ॥ హిమవద్భూధర సార్వభౌమ వర విశ్వేశోపహారక్రియా
క్రమ సంతాడిత ఘంటికా ఘణఘణత్కారంబు విన్నట్టి యు
త్తమపుణ్యుండు వినండు ప్రాణపవనోత్క్రాంతి వ్యథావేళ దు
ర్దమ వైవస్వత హాహ ఘోర మహిష గ్రైవేయ ఘంటాధ్వనుల్. 167

అర్థము :- హిమవత్.....ఘణత్కారంబు; హిమవత్=హిమవంతుడను; భూధర=పర్వతముల; సార్వభౌమ=చక్రవర్తికి (సంబంధించిన); వర=పెండ్లికొడుకు(శ్రేష్ఠుడు) అగు; విశ్వేశ=శంకరునికి; ఉపహార=నైవేద్యమను; క్రియా=పూజావిధియందు; క్రమ=వరుసగా; సంతాడిత=బాగుగా మ్రోగింపబడిన; ఘంటికా=గంటయొక్క; ఘణఘణత్కారంబు=గణగణ ధ్వనిని; విన్నట్టి=వినినటువంటి; ఉత్తమ పుణ్యుండు=పుణ్యాత్ములలో శ్రేష్ఠుడగువాడు; ప్రాణ పవన=ప్రాణవాయువు యొక్క; ఉత్క్రాంతి=(దేహము నుండి) బయటకు వెళ్ళుటచేత గలుగు; వ్యథా=బాధ గలుగు; వేళన్=సమయమునందు; దుర్దమ...ధ్వనుల్. దుర్దమ=అణచ వీలుగాని; వైవస్వత=యమధర్మరాజును; వాహ=మోయునట్టి; ఘోర=భయంకరమగు; మహిష=ఎనుబోతు యొక్క; గ్రైవేయ=కంఠభూషణమగు; ఘంటా=గంట యొక్క; ధ్వనుల్=మ్రోతలను; వినండు=వినబోడు.

భావము :- హిమవదీశ్వరునికి మహానివేదనము చేయునప్పుడు మ్రోగించు ఘంటాధ్వనిని విను ఉత్తమ పుణ్యాత్ముడు అవసాన సమయమున ప్రాణములు పోవునప్పుడు భయంకరమగు యముని మహిషము మెడలోని ఘంటాధ్వనులను వినడు. (ఆ పుణ్యాత్ముడు కైలాసమున కేగును).

విశేషము :- ఇటువంటి పద్యమే కాశీఖండము నందు కూడ (కాశి. 5-27) కలదు.

శా॥ అర్ణోరాశి పరీత భూభువన మధ్య స్వర్ణఖండంబు, సం
పూర్ణైశ్వర్య సమృద్ధిఁ గాశిఁ గృత పాపుండైనఁ దత్పట్టణా
భ్యర్ణక్షోణుల నైదు క్రోశములఁ బ్రాణాంతంబునన్ మర్త్యుఁడా
కర్ణింపండు కృతాంత వాహ మహిష గ్రైవేయ ఘంటాధ్వనుల్

అలంకారము : పర్యాయోక్తము.

**తే॥ శ్రాద్ధ పిండప్రదానాది సకలవిధులు**
**నొక్కటొక్కటి కోటి గుణోదయమునఁ**
**దృప్తిఁగల్పించు దివి పితృదేవతలకు**
**ధరణిధరరాజ శంభు తీర్థంబునందు. 168**

అర్థము :- ధరణి ధరరాజ=హిమవంతుడు ప్రతిష్ఠించిన; శంభు తీర్థంబునందు=శివతీర్థమునందు; శ్రాద్ధ=తద్దినము; పిండ ప్రదాన=పిండములనర్పించుట; ఆది=మొదలగు; సకల=సమస్తమైన; విధులు=విధానములు; ఒక్కటి+ఒక్కటి=(వానిలో) ప్రతియొక్కటియు;

కోటిగుణ=కోటి రెట్లు; ఉదయమునన్=అభివృద్ధిలో; దివి=దేవలోకములోగల; పితృదేవత లకున్=పితృదేవతలకు; తృప్తిన్=సంతృప్తిని; కల్పించున్=కలిగించును.

భావము :- హిమవంతుడేర్పఱచిన శివతీర్థమునందు చేసిన శ్రాద్ధము, పిండ ప్రదానము మున్నగు సమస్త విధులలో ప్రతి యొక్కటియు కోటిరెట్లు అభివృద్ధితో దేవ లోకములోనున్న పితృదేవతలకు తృప్తి కలిగించును.

తే॥ సప్తగోదావరముఁదెచ్చి సప్తమునులు
సప్త సప్తేందు శిఖి విలోచనుని నిలిపి;
రమ్మహా శంభులింగ మభ్యర్చితులకుఁ
గామితార్థ ప్రదానైక కల్పకంబు. 169

అర్థము :- సప్తమునులు=ఏడుగురు మహర్షులు, సప్తగోదావరమున్=సప్తగోదావరము (గోదావరి నుండి ఏడుపాయలను); తెచ్చి=తీసికొని వచ్చి; సప్తసప్తి=(ఏడు గుఱ్ఱములుగల) సూర్యుడు; ఇందు=చంద్రుడు; శిఖి=అగ్ని-ఈ ముగ్గురు; విలోచనుని=కన్నులుగాగల శివుని; నిలిపిరి=ప్రతిష్ఠించిరి; ఆ+మహాశంభులింగము=ఆ గొప్పదగు శివలింగము; అభ్యర్చితులకున్= పూజించిన వారికి; కామిత=కోరిన; అర్థ=కోరికలను; ప్రదాన=ఇచ్చుటలో; ఏక=ప్రధానమగు; కల్పకంబు=కల్ప వృక్షము.

భావము :- సప్త మహర్షులు సప్తగోదావరమును తెచ్చి త్రిలోచనుడగు శివుని ప్రతిష్ఠించిరి. ఆ శివలింగము పూజించిన వారి కోరికలనిచ్చుటలో కల్పవృక్షమే.

విశేషము :- సూర్యుడు-చంద్రుడు-అగ్ని-శివుని నేత్రములు.

క॥ ఒకమాటు జలకమార్చిన
నొకమాటొక పువ్వు మౌళి నునిచిన నొకమా
టకుటిలమతి గుడిఁ దిరిగిన
సకలేప్సితముల నతఁడు సంపాదించున్. 170

అర్థము :- ఒకమాటు=ఒక్కమారు; జలకమార్చినన్=అభిషేకము చేసినను; ఒకమాటు=ఒక్కమారు; మౌళిన్=ఆ శివలింగము శిరస్సుపైన; ఒక పువ్వు=ఒక పుష్పమును; ఉనిచినన్=ఉంచినను; అకుటిలమతిన్=కపటములేని మనస్సుతో; ఒకమాటు=ఒక్కమారు; గుడిన్=ఆలయమును; తిరిగినన్=ప్రదక్షిణము చేసిన; అతఁడు=ఆతడు; సకల=సమస్తమైన; ఈప్సితములన్=కోరికలను; సంపాదించున్=గడించును.

భావము :- నిర్మలమైన మనస్సుతో సప్తర్షి ప్రతిష్ఠిత శివలింగమునకు ఒక్కమారు అభిషేకము చేసినను, ఒకమారు ఒక పువ్వు నా శివునిపై నుంచినను, ఒక్కమారు గుడికి ప్రదక్షిణము చేసినను ఆ మనుజుడు కావలసిన వానినన్నింటిని సంపాదించుకొనును.

తే॥ భీమనాథేశ్వరుని పార్శ్వ భూమి యందుఁ
బంచ శివ లింగములకు నాస్పదములైన
పంచతీర్థములను నాడు పంచజనులు
పాయుదురు పంచవిధ మహాపాతకములు. 171

అర్థము :- భీమనాథ+ఈశ్వరుని=భీమేశ్వర స్వామియొక్క; పార్శ్వభూమియందున్=ప్రక్కనగల ప్రదేశములోగల; పంచ శివలింగములకున్=అయిదు శివలింగములకు; ఆస్పదములు+ఐన=స్థానములైన; పంచతీర్థములనున్=అయిదుతీర్థములందు; ఆడు= స్నానము చేయు; పంచజనులు=మనుజులు; పంచ విధ=అయిదు రకములగు; మహాపాతకములు=గొప్ప పాపములను; పాయుదురు=పోగొట్టుకొందురు.

భావము :- భీమేశ్వరస్వామి వారికి ప్రక్కనగల ప్రదేశములోగల అయిదు శివలింగములకు స్థానములగు పంచతీర్థములందు స్నానము చేయు మానవులు పంచమహాపాతక ముక్తులగుదురు.

విశేషము :- 3-24 వద్ద పంచమహాపాతక వివరణ గలదు.

తే॥ అందు వాపి తటాక కుల్యాదులందుఁ
దీర్థమాడ వివేకి బుద్ధిం దలంపఁ
బంచతీర్థంబు లందించుఁ బంచజనుల
కాత్మసలిలావగాహ పుణ్యాతిశయము. 172

అర్థము :- అందు=ఆ భీమేశ్వర శివలింగపార్శ్వ భూమియందుగల; వాపి=బావులందు, తటాక=చెఱువులందు, కుల్యా+ఆదులందు=కాలువలు మున్నగు వానియందు; వివేకి=బుద్ధిమంతుడు; తీర్థమాడన్=స్నానముచేయగా; బుద్ధిన్=జ్ఞానముతో; తలంపన్=అనుకొనగా; పంచ జనులకు=మనుజులకు; పంచతీర్థంబులు=ఐదు తీర్థములు; ఆత్మ=తమయొక్క; సలిల=నీటియందు; అవగాహ=స్నానముచే గలుగు; పుణ్య=పున్నెము యొక్క; అతిశయమున్=ఆధిక్యమును; అందించున్=ఇచ్చును.

భావము :- ఆ భీమేశ్వరస్వామి పార్శ్వ భూమియందున్న బావులు, చెఱువులు, కాలువలు మున్నగు వానియందు స్నానము చేయవలెనని బుద్ధిమంతుడు అనుకొన్నచో పంచతీర్థములు అట్టి జనులకు తమ నీటిలో స్నానము చేసిన లభించు అధిక పుణ్యమును అందించును.

వ॥ అగస్త్యేశ్వర రామేశ్వర నాకులేశ్వర గణేశ్వర పాతాళభైరవేశ్వరులను దేవతా పంచకంబుఁబంచ తీర్థంబుల దర్శించి మానవుఁడు, పండ్రెండు పుణ్యక్షేత్రంబులు దర్శించిన ఫలంబులందు; మూలస్థానేశ్వర లింగం బాదిమూలం, బద్దివ్యలింగంబు దర్శించి భీమమండలంబునందు శివలింగ స్థానంబు లెన్నిగల వన్నియు దర్శించిన ఫలంబు గైకొను; వెండియు. 173

అర్థము :- అగస్త్యేశ్వర.....భైరవేశ్వరులు; అగస్త్యేశ్వర=అగస్త్యేశ్వరుడు; రామేశ్వర= రామేశ్వరుడు; నాకులేశ్వర=నాకులేశ్వరుడు; గణేశ్వర=గణేశ్వరుడు; పాతాళ భైరవేశ్వర=పాతాళ భైరవేశ్వరుడు; అను=అను పేరులుగల; దేవతా పంచకంబున్=ఐదుగురు దేవతలను; పంచ తీర్థంబులను=అయిదు తీర్థములను; దర్శించి=దర్శనము చేసి; మానవుండు=మనుజుడు; పండ్రెండు=పండ్రెండు సంఖ్యగల; పుణ్యక్షేత్రంబులు=పవిత్రాలయములను; దర్శించిన= దర్శనము చేసిన(గలుగు); ఫలంబులు=పుణ్య ఫలితములను; అందున్= పొందును; మూలస్థానేశ్వర లింగంబు=మూలస్థానేశ్వర నామకమగు శివలింగము; ఆదిమూలంబు= మొదటి పునాది వంటిది. ఆ+దివ్యలింగంబు=ఆ మహిమగల శివలింగమును; దర్శించి= దర్శనముచేసి; భీమమండలంబునందు=భీమమండలములో; ఎన్ని=ఎన్ని; శివలింగ స్థానంబులు=శివలింగములుగల ప్రదేశములు; కలవు=ఉన్నవో; అన్నియున్=వానినన్నింటిని; దర్శన ఫలంబు=దర్శనము చేసిన ఫలితమును; కైకొనున్=గ్రహించును; వెండియు= మఱియును.

భావము :- అగస్త్యేశ్వరుడు, రామేశ్వరుడు, నాకులేశ్వరుడు, గణేశ్వరుడు; పాతాళ భైరవేశ్వరుడు అను నైదుగురు దేవతలను, పంచతీర్థములను దర్శించిన మానవుడు పండ్రెండు పుణ్యక్షేత్రములను దర్శించిన గలుగునంత ఫలము నందును. అచటనున్న వానిలో మూలస్థానేశ్వరమను శివలింగము మొట్టమొదట ఆ క్షేత్రమునకు పునాది వంటిది. ఆ దేవుని దర్శించినచో భీమమండలములోగల అన్ని శివలింగ ప్రదేశములను దర్శించినంత పుణ్యము గలుగును. మఱియును.

తే. సప్తగోదావరము భీమశంకరునిని
నాకులేశ స్వయంభుఁ బినాకపాణి
రుద్రపాదంబులను సమారూఢభక్తిఁ
దలఁతు రెవ్వారు వారపో ధన్యమతులు." 174

అర్థము :- సప్తగోదావరమున్=సప్తగోదావరమును; భీమశంకరునిని=భీమేశ్వర స్వామిని; నాకులేశ=నకులేశ్వరుడు స్థాపించిన; స్వయంభున్=స్వయముగా నావిర్భవించిన; పినాకపాణిన్=(పినాకమను పేరుగల ధనుస్సు హస్తమునందుగల) శివుని; రుద్రపాదంబులను=(రాజమహేంద్రవరము వద్దగల) రుద్రపాదప్రదేశమును; సమారూఢ=బాగుగా వృద్ధి పొందిన; భక్తిన్=భక్తితో; ఎవ్వారు=ఎవరు; తలంతురు=స్మరింతురో; వార=వారే; ధన్యమతులు పో=నిశ్చయముగ కృతార్థమగు మనస్సుగలవారు.

భావము :- సప్తగోదావరమును, భీమేశ్వరుని, నాకులేశ్వరుడను శివలింగమును, రుద్రపాదములను దర్శించువారే నిశ్చయముగా కృతార్థులు."

వ॥ అని దక్షారామ మాహాత్మ్యంబును, భీమలింగ మహిమంబును, సప్తగోదావర ప్రశస్తియు, ద్వాదశ తీర్థ ప్రభావంబును, బంచతీర్థ ప్రయోజనంబును వినిపించి కుంభ సంభవుండు. 175

అర్థము :- అని=అని; కుంభ సంభవుండు=అగస్త్యుడు; దక్షారామ=దక్షారామము యొక్క; మాహాత్మ్యంబును=మహిమను; భీమలింగ=భీమేశ్వర లింగము యొక్క; మహిమంబును=మాహాత్మ్యమును; సప్తగోదావర=సప్తగోదావరము యొక్క; ప్రశస్తియున్=ప్రసిద్ధిని; ద్వాదశతీర్థ=పండ్రెండు తీర్థముల యొక్క; ప్రభావంబును=మహిమను; పంచతీర్థ=ఐదు తీర్థముల యొక్క; ప్రయోజనంబును=లాభమును; వినిపించి=చెప్పి.

భావము :- అని అగస్త్య మహర్షి వ్యాసునకు దక్షారామ మహిమను, భీమేశ్వర లింగ మాహాత్మ్యమును, సప్తగోదావర ప్రసిద్ధిని, పండ్రెండు తీర్థముల ప్రభావమును, పంచతీర్థముల వలన గలుగు ప్రయోజనమును వినిపించెను.

తే॥ "భీమనాథుని త్రిభువన స్వామిఁగొలువఁ
బోదమే యిప్డు మధ్యాహ్న భోగవేళఁ
నదె విజృంభించె నాట్య సౌధాంతరమున
నృత్య జగఝుంకృత మృదంగ నిస్వనంబు." 176

అర్థము :- మధ్యాహ్న=మధ్యాహ్నమునందలి, భోగవేళన్=భోగము-మహా నివేదనము యొక్క సమయమగు; ఇప్డు=ఇప్పుడు, త్రిభువన=మూడు లోకములకు; స్వామి=ప్రభువగు; భీమనాథునిన్=భీమేశ్వరుని; కొలువఁన్=సేవించుటకు; పోదమే=వెళ్ళుదమా? నాట్యసౌధ=నర్తనశాలయగు భవనము యొక్క; అంతరమునన్=లోపల; నృత్య.....నిస్వనంబు; నృత్య=నృత్తమునకు సంబంధించిన; జగఝుంకృత=గొప్పదగు నూపుర ధ్వనితో గూడిన; మృదంగ=మద్దెల యొక్క; నిస్వనంబు=ధ్వని; అదె=అదిగో; విజృంభించెన్=చెలరేగినది.

భావము :- "ఇపుడు మధ్యాహ్నమున జరుగు మహానివేదన సమయమున జగన్నాథుడగు భీమేశ్వరస్వామిని దర్శింప బోవుదమా? అదిగో! నాట్య భవనములో నృత్య సమయమున పాద భూషణ ధ్వనితో గూడి మద్దెల మ్రోత చెలరేగుచున్నది."

వ॥ అనిపలికి యనంతరం బయ్యిరువురు రాజమార్గంబున. 177

అర్థము :- అని=అని; పలికి=చెప్పి; అనంతరంబు=తరువాత; ఆ+ఇరువురు=ఆ ఇద్దరు; రాజమార్గంబునన్=రాజ వీధిలో.

భావము :- అని పలికి, తరువాత అగస్త్య వ్యాసులు రాజమార్గమునందు నడువసాగిరి.

## అగస్త్య వ్యాసులు భీమేశ్వరాలయంబు దర్శించుట :

సీ॥ త్రిపుర సంహారంబు, దివిజ నాయక భుజా
స్తంభ దంభోళి సంస్తంభనంబు,
గరళ కూటమహాగ్ని కబళ నాటోపంబు,
దక్షాధ్వర క్రియా ధ్వంసనంబు,
మత్స్యలాంఛన దర్ప మథన సంరంభంబు,
దేవదారు వన ప్రదేశ విహృతి,
నురు లింగమూర్తి విస్ఫురణ విలాసంబు,
గాత్యాయనీ కరగ్రహణకేళి,

తే॥ గండవేదండ దానవ ఖండనంబు,
దండపాణి జలంధ రాంధక వధంబుఁ
బాడు గంధర్వపతులచే భరితమైన
మొగలి వాకిలిఁ జొచ్చి రమ్మౌని వృషభులు. 178

అర్థము :- త్రిపుర సంహారంబు=మూడు పట్టణములనంతము చేయుట; దివిజ..... స్తంభనంబు; దివిజ నాయక=దేవేంద్రుని యొక్క; భుజ=బుజమనెడి; స్తంభ=కంబము నందలి; దంభోళి=వజ్రాయుధము యొక్క, సంస్తంభనంబు=చేష్టలుడుగునట్లు చేయుట.

గరళకూట=విషరాశియనెడి; మహా+అగ్ని=గొప్పదగు అగ్నిని, కబళన=మ్రింగుట యందలి; ఆటోపంబు=తొందర; దక్ష=దక్షుని యొక్క; అధ్వరక్రియా=యజ్ఞమను కార్యమును; ధ్వంసనంబు=ధ్వంసము చేయుట.

మత్స్యలాంఛన=(చేప జెండా గుర్తుగాగల) మన్మథుని; దర్ప=గర్వమును; మథన= నాశము చేయుట యందలి; సంరంభంబు=ఉత్సాహము; దేవదారువన=దేవదారు వనమును; ప్రదేశ=స్థలమునందు; విహృతి=విహారము చేయుట.

ఉరు=గొప్పదగు; లింగమూర్తి=లింగస్వరూపము యొక్క; విస్ఫురణ=కాంతి, విలాసంబు=క్రీడయును; కాత్యాయనీ=పార్వతీదేవి యొక్క; కరగ్రహణ=పాణిగ్రహణము-వివాహ మాడుటయను; కేళి=క్రీడయు.

గండ వేదండ=మత్తగజమను; దానవ=రాక్షసుని; ఖండనంబు=త్రుంచుట; దండ..... వధంబు; దండపాణి=యముని; జలంధర=జలంధరుని; అంధక=అంధకుని; వధంబు= చంపుట - హింసించుట - అను శివలీలలను; పాడు=గానము చేయు; గంధర్వపతులచే= గంధర్వాధిపతులచేత; భరితము+ఐన=నిండియున్న; మొగలి వాకిలిన్=ప్రధాన ద్వారమును; అ+మునివృషభులు=ఆ మహర్షి శ్రేష్ఠులు; చొచ్చిరి=ప్రవేశించిరి.

భావము :- మునిశ్రేష్ఠులగు అగస్త్య వ్యాసులు భీమేశ్వరాలయ మహాద్వారమును ప్రవేశించిరి. అప్పుడు అక్కడ గంధర్వ శ్రేష్ఠులు పరమేశ్వరుడొనర్చిన త్రిపురాసుర సంహారము, ఇంద్ర భుజస్తంభనము, కాలకూటకబళనము, దక్షాధ్వర ధ్వంసము, మదన సంహారము, దేవదారు వనవిహారము; లింగాకారధారణము, పార్వతీ వివాహము, గజాసుర సంహారము, యమ విజయము, జలంధర వధ, అంధక సంహారము అను శివలీలలను స్తుతించుచు గానము చేయుచుండిరి.

విశేషము :- ఇందు పరమ శివలీలలలో పండ్రెండు ప్రస్తావింపబడినవి. ఇవి యన్నియు ప్రసిద్ధములే.

సీ॥ పంచాంగ శుద్ధిగాఁ బరిఢవించుచు భృంగి
మతి నాడు నెందేని ప్రతిదినంబు;
త్రిదశ వర్గంబు ముప్పది మూఁడు కోట్లును
నేకదేశమున నెందేని యుండుఁ;
బలుకుఁబూఁబోఁడి యర్వది నాల్గు కళలతో
విహరించు చెందేని విద్య చూపు;
సాని యీశానియై సవరించు నెందేని
మహిత పింఛాలీల మరులు పుట్ట;

తే॥ నెద్ది కైలాస శిఖరికిఁ బెద్ద యుద్ది;
పాల మున్నీటి కెయ్యది ప్రసవ భూమి
చంద్ర లోకంబునకు నెద్ది సాటి యట్టి
భవుని కల్యాణ మణి మండపంబు గనిరి.

**అర్థము :-** భృంగి=భృంగీశ్వరుడు; మతిన్=కోరికతో; పంచాంగ శుద్ధిగాన్=అయిదంగములు పవిత్రములగునట్లుగా; పరిఢవించుచున్=ప్రవర్తించుచు; ప్రతిదినంబు=ప్రతి దినమును; ఎందేని=ఏ కల్యాణ మండపములో; ఆడున్=నాట్యము చేయునో.

త్రిదశవర్గంబు=దేవతల సమూహము, ముప్పది మూఁడు కోట్లును=ముప్పది మూడు కోట్లమంది; ఎందేనిన్=దేనియందు; ఏకదేశమునన్=ఒక్క ప్రదేశములో మాత్రమే; ఉండున్=నివసించునో.

పలుకు+పూఁబోఁడి=వాగ్దేవి; అర్వది నాల్గు=అరువది నాలుగు; కళలతోన్= కళలతో; విహరించుచు=విహారము చేయుచు; ఎందేని=ఏ మంటపమునందు; విద్య చూపు=తన విద్యా ప్రదర్శనము చేయునో.

సాని=వేశ్య; ఈశానియై=పరమేశ్వరి వేషము దాల్చి; మరులు పుట్టన్=(చూచువారికి) మన్మథ వికారము కలుగగా; మహిత=గొప్పదగు; పింఛాలీలన్=నెమలి పింఛము ధరించు విలాసమును; ఎందేని=దేనియందు; సవరించున్=అలంకరించు కొనునో.

ఎద్ది=ఎయ్యది; కైలాస శిఖరికిన్=కైలాసమను పర్వతమునకు; పెద్ద యుద్ది=అధిక సమానమో; ఏ+అది=ఏది; పాలమున్నీటికిన్=క్షీర సముద్రమునకు; ప్రసవ భూమి=పుట్టినిల్లో; ఎద్ది=ఏది; చంద్రలోకంబునకు=చంద్రలోకమునకు; సాటి=సమానమో; అట్టి=అటువంటి; భవుని=శివుని యొక్క; కల్యాణ మండపంబు=కల్యాణ మండపమును; కనిరి=(మహర్షులు) దర్శించిరి.

**భావము :-** అగస్త్య వ్యాసులు భీమేశ్వరస్వామి వారి కల్యాణ మండపమును దర్శించిరి. అచ్చట భృంగీశ్వరుడు ప్రతి దినము పంచాంగ శుద్ధిగా కోరికతో నాట్యము చేయును. ముప్పది మూడు కోట్ల దేవతలు అందలి ఒక భాగమున మాత్రమే నివసింతురు. సరస్వతీ దేవి అరువది నాలుగు కళలతో నట విహరించుచు తన విద్యా వైభవమును ప్రదర్శించును. వేశ్య పరమేశ్వరి వేషము దాల్చి చూచువారికి కోరిక కలుగునట్లుగా శిరమునందు నెమలి పింఛమును దాల్చును. అది కైలాస పర్వతముతో సమానము. పాల సంద్రమునకు పుట్టినిల్లు. చంద్రలోకముతో సమానమైనది.

**విశేషము :-** అఱువది నాలుగు కళలు. వీనినే చతుష్షష్టి కళలు అందురు. వీనిని భోజదేవుడు ఇట్లు చెప్పెను.

1. గీతము, 2. వాదిత్రము, 3. నృత్తము, 4. నాట్యము, 5. చిత్రము, 6. పుస్తక కర్మ, 7. పత్రచ్ఛేద్యము, 8. లిపిజ్ఞానము, 9. వచన కౌశలము, 10. వైలక్షణ్యము, 11. మాల్యవిధి, 12. గంధయుక్తి, 13. ఆస్వాద్య విధానము, 14, అనురంజన జ్ఞానము, 15.

రత్న పరీక్ష, 16. సీవ్యము, 17. ఉపకరణ క్రియ, 18. ఆజీవ జ్ఞానము, 19. పశ్వాది వైద్యము, 20. మాయాకృతము, 21. పాషండ సమయ జ్ఞానము, 22. క్రీడా కౌశలము, 23. సంహనము, 24. శరీర సంస్కార కౌశలము, 25. ఆయప్రాప్తి, 26. రక్షావిధానము, 27. రూప సంఖ్య, 28. క్రియా మార్గము, 29. జీవగ్రహణము, 30. నయజ్ఞానము, 31. చిత్రవిధి, 32. గూఢరాశి, 33. తులావిధి, 34. క్షిప్త గ్రహణము, 35. అనుప్రాప్తి, 36. లేఖ, 37. స్మృత్యనుక్రమము, 38. లీలావ్యాపార మోహములు, 39. గ్రహణాదానము, 40. ఉపస్థాన విధి, 41. యుద్ధము, 42. తతము, 43. గతము, 44. స్త్రీ పురుష భావ గ్రహణము, 45. స్వరాగ ప్రకాశనము, 46. ప్రత్యంగదానము, 47. నఖవిచారము, 48. దంత విచారము, 49. నీవీస్రంసనము, 50. గుహ్యస్పర్శనలోభ్యము, 51. పరమార్థ కౌశలము, 52. భూషణము, 53. సమానార్థత, 54. ప్రోత్సాహనము, 55. మృదు క్రోధ ప్రవర్తనము, 56. క్రుద్ధ ప్రసాదనము, 57. సుప్తపరిత్యాగము, 58. పరమ స్వాపనము, 59. గుహ్య గ్రహము, 60. సాశ్రుపాతనము, 61. రమణ వీక్షణము, 62. స్వయం శపథ క్రియ, 63. ప్రస్థితాను గమనము, 64. పునర్నిరీక్షణము.

రఘువంశము అష్టమ సర్గలో 67వ శ్లోకము క్రింద వ్యాఖ్యాత మల్లినాథసూరి ఇచ్చినది పై పట్టిక. దానిని సూ.ని. "చతుష్షష్టి కళలు" అను పదము క్రింద నుదాహరించినది.

పంచాంగములు :- భృంగి నాట్యము గావున - మనస్సు, కన్నులు, కనుబొమలు, చేతులు, కాళ్ళు అను నైదంగములు శుద్ధముగా నుండుట.

త్రిదశులు - ఎప్పుడును ముప్పది యేండ్లవయస్సున నుండువారు. బాల్య కౌమార యౌవన, వార్ధకములను నాల్గు దశలలో మూడవ దశ - యౌవనమునందే ఎప్పుడు నుండువారు.

సాని ఈశానియైనప్పటి విశేషములు 1. ఆ. 105 పద్యములో వర్ణితములు.

ఉ॥ దానికిఁ దూర్పుదిక్కున సుధాకరబింబ సహస్ర కోటి శో
భా నిభ కాంతితో గగన భాగము రాయుచు భీమనాయకే
శాన మహాట్టహాస రుచి సంపద సొంపు వహించినట్టి శ్రీ
భానుజధార మండపము భవ్యమునీంద్రులు గాంచిరయ్యెడన్. 180

**అర్థము** :- దానికిన్=ఆ శివుని కల్యాణ మంటపమునకు, తూర్పు దిక్కునన్=తూర్పు దిక్కునందు; సుధా.....కాంతితోన్; సుధాకరబింబ=చంద్రబింబముల యొక్క; సహస్ర కోటి= వేయి కోట్లు యొక్క; శోభా=దీప్తితో; నిభ=సమానమగు; కాంతితోన్=వెలుగుతో; గగన భాగము= ఆకాశ ప్రదేశమును; రాయుచు=ఒరసికొనుచు; భీమ.....సంపద; భీమనాయక=భీమేశ్వరుడను;

ఈశాన=శివుని యొక్క; మహా=గొప్పదగు; అట్టహాస=పెద్ద నవ్వు యొక్క; రుచి సంపద=కాంతి శోభతో; సొంపు వహించినట్టి=అందమును దాల్చిన; శ్రీ=శోభాయుక్తమగు; భానుజ=(సూర్యుని కాంతిగల) భానుజమను పేరుగల; ధారమండపమున్=ధార మండపమును; భవ్య=అదృష్ట వంతులగు; ముని+ఇంద్రులు=మునిశ్రేష్ఠులు; ఆ+ఎడన్=ఆ ప్రదేశమునందు-ఆ సమయము నందు; కాంచిరి=చూచిరి.

భావము :- ఆ కల్యాణ మండపమునకు తూర్పుదిక్కునందు వేయికోట్ల చంద్ర బింబముల శోభవంటి కాంతితో నాకసమునంటుచు భానుజ ధారమంటపమున్నది. అది భీమేశ్వరస్వామి అట్టహాసమువలె తెల్లని కాంతి కలిగియున్నది. అగస్త్య వ్యాసులు దానిని దర్శించిరి.

విశేషము :- భానుజ వైరి మండపము అని పాఠాంతరము. ధారమండపము భీమేశ్వరుని అట్టహాసముతో పెంపొందినదనుటకు కాళిదాసుని మేఘసందేశములోని శ్లోకపాదము మూలరూపముగా వచ్చును.

రాశీభూతః ప్రతిదిన మివ త్ర్యంబకస్యాట్టహాసః (1-62)

పరమేశ్వరుడు ప్రతిదినము చేయు అట్టహాసము రాశీభూతమైనట్లు కైలాస పర్వతమున్నది.

వ॥ అనంతరం బా బహిర్గేహ ప్రదేశంబున. 181

అర్థము :- అనంతరంబు - తరువాత. ఆ బహిర్గేహ ప్రదేశంబున - గృహమునకు - దేవాలయమునకు బయటి స్థలములో.

భావము :- భీమేశ్వరాలయమునకు వెలుపలిచోట

తే॥ నిఖిల పరివార దేవతా నివహమునకు
వందన మొనర్చి రుత్తర ద్వారభూమి
దండపాణీశ శశికలా మండనునకుఁ
జేసి రభివాదనంబులు సిద్ధ మునులు. 182

అర్థము :- సిద్ధమునులు=పవిత్రులగు ఋషులు; నిఖిల=సమస్తమైన; పరివార= కుటుంబములోని పరిజనులగు; దేవతా=దేవతల యొక్క; నివహమునకున్=సమూహమునకు; వందనము=నమస్కారములు; ఒనర్చిరి=చేసిరి; ఉత్తరద్వార భూమిన్=ఉత్తర దిక్కునగల వాకిలియున్న ప్రదేశమునందున్న, దండపాణి+ఈశ=దండపాణి స్వామియును; శశికలామండనునకున్=చంద్రరేఖ అలంకారముగాగల శివునకు; అభివాచనంబులు= నమస్కారములు; చేసిరి=చేసిరి.

భావము :- సిద్ధమునులగు అగస్త్య వ్యాసులు భీమేశ్వరస్వామివారి పరివార దేవతలకు నమస్కారములు చేసిరి. తరువాత ఆ ఆలయమునకు ఉత్తర దిక్కునగల ప్రదేశమునందున్న దండపాణి రూపుడగు పరమేశ్వరునకు నమస్కారములు చేసిరి.

విశేషము :- పరివార దేవతలు :- ప్రతిష్ఠితుడగు ప్రధాన దైవమునకు భార్యా పుత్రమంత్రి సామంత పరిచారకుల వంటి దేవతలు.

శశికళామండనునకును శంకరునకు - అని పాఠాంతరము.

ఉ॥ తండు భుజార్గళా కలితతప్త మహాకలధౌత ఘంటికా
మండిత వేత్ర దండ పరిమర్దన భీతివశాత్పలాయితా
ఖండల ముఖ్య దైవత నికాయము సంయమి భాగధేయమున్
ఖండకుఠారు మోసల సుఖంబునఁ జొచ్చిరి శైవపుంగవుల్. 183

అర్థము :- తండు.....నికాయము; తండు=తండువను పేరుగల బెత్తమువాని; భుజ+అర్గళా=గడియ వంటి బుజము(చేతి)చేత; కలిత=పట్టుకొనబడిన; తప్త=(కాల్చబడిన)-పుటము వేయబడిన; మహాకలధౌత=గొప్పదగు బంగారపు; ఘంటికా=చిఱు గంటలతో; మండిత= అలంకరింపబడిన; వేత్రదండ=బెత్తముతో; మర్దన=కొట్టునోయను; భీతివశాత్= భయవశమున; పలాయిత=పారిపోయిన; ఆఖండల=ఇంద్రుడు; ముఖ్య=మొదలగు; దైవత నికాయము= దేవతల సమూహము గలదియు; సంయమి=మహర్షులకు; భాగధేయమున్=భాగ్యమైనదియు నగు; ఖండకుఠారు=(ఖండ పరశువు ఆయుధముగాగల) శివుని, మోసలన్=నగరి తల వాకిలి పంచను; శైవ పుంగవుల్=శైవ శ్రేష్ఠులగు అగస్త్య వ్యాసులు, సుఖంబునన్=సుఖముగా; చొచ్చిరి=ప్రవేశించిరి.

భావము :- శైవపుంగవులగు అగస్త్య వ్యాసులు మహర్షుల భాగ్యమగు భీమేశ్వరాలయ తలవాకిలి ప్రధానద్వార ప్రదేశములో సుఖముగా ప్రవేశించిరి. అచటి నుండి శివగణ శ్రేష్ఠుడగు తండువను వేత్రహస్తుడు చేతిలోని బంగారు చిరుగంటల నలంకృతమగు వేత్రదండముతో శిక్షించునను భీతితో ఇంద్రాది దేవతలు పారిపోవుట గలది మోసల.

విశేషము :- వేత్రహస్తుల విజృంభణము ప్రాచీన వాఙ్మయములో బహుళము. భీతివశాత్ పలాయిత - సంస్కృత సమాసములో విభక్తి లోపింపకుండుట.

వ॥ ప్రవేశించి భక్తిశ్రద్ధానుపూర్వకంబుగా నంతర్భవన ప్రదక్షిణంబు సేయునప్పుడు తిరుచుట్టు మాలిక యందు. 184

అర్థము :- ప్రవేశించి=చొచ్చి; భక్తి శ్రద్ధా+అనుపూర్వకంబు గాన్=భయముతో గూడిన ప్రేమ, సమ్మానములు ఒకదాని తరువాత నింకొకటి కలుగగా; అంతర్భవన=(ప్రాకారములోని) ప్రధాన దేవాలయమునకు, ప్రదక్షిణంబు=ప్రదక్షిణము; చేయునప్పుడు=చేయునట్టి సమయములో; తిరుచుట్టు మాలికయందు=మంటప ప్రాకారమునందు.

భావము :- ఆ మహర్షులు మహాద్వారము నుండి ప్రవేశించి భక్తి శ్రద్ధలతో ప్రధాన దేవాలయమునకు ప్రదక్షిణము చేయునప్పుడు మంటప ప్రాకారములో.....

సీ॥ వణఁకు గుబ్బలి రాచవారి కూరిమి కన్య
భీమయ్య శుద్ధాంత భామఁ గొలిచి,
కంధరంబున నుండి గంధ సింధురమైన
గుజ్జువేల్పుఁ గుమార గురుని గొలిచి,
కైవల్య నిధికి దుర్గా మహాదేవికి
సర్వమంగళకు నంజలి ఘటించి,
యాశాతటీ పటలీ శాటికా కటు
వటుక భైరవు నిష్టవరదుఁ జూచి,

తే॥ నలువ సేవించి యిందిరానాథుఁగాంచి
యితర పరివార దేవతా ప్రతతి కెల్ల
నేటికోళ్ళిచ్చి యెక్కి రమ్మేటి మునులు
మృడుని హాటక శైలంబు మీఁది నిలువు. 185

అర్థము :- ఆ+మేటి మునులు=శ్రేష్ఠులగు నామహర్షులు, వణఁకు గుబ్బలి=హిమ వంతుడను; రాచవారి=రాజుగారి; కూరిమి కన్య=ప్రియపుత్రికయగు; భీమయ్య=భీమేశ్వరుని; శుద్ధాంత భామన్=అంతఃపుర స్త్రీయగు పార్వతిని, కొలిచి=సేవించి;

కంధరంబున నుండి=మెడపై నుండి, గంధ సింధురము+ఐన=మత్తగజ (ముఖ) మైన; గుజ్జు వేల్పున్=మరుగుజ్జు దేవుడును; కుమార గురునిన్=కుమారస్వామి అన్నయగు వినాయకుని; కొలిచి=సేవించి.

కైవల్య నిధికిన్=మోక్షమునకు గనియును; సర్వమంగళకున్=అన్ని శుభములు గలదియునగు; దుర్గా మహాదేవికిన్=దుర్గయను పేరుగల మహారాజ్ఞికి; అంజలి ఘటించి= దోసిలొగ్గి.

ఇష్టవరదున్=కావలసిన వరములిచ్చునట్టి; ఆశా.....భైరవున్; ఆశాతటీ=దిగంతముల; పటలీ=సమూహమే; శాటికా=వస్త్రమైన; కటున్=నడుముగల; వటుక భైరవున్=వటుక భైరవస్వామిని; చూచి=దర్శించి.

నలువన్=బ్రహ్మను; సేవించి=పూజించి; ఇందిరానాథున్=విష్ణువును; కాంచి=దర్శించి; ఇతర=తక్కిన; పరివార దేవతా=పరిజనమగు దేవతల యొక్క; ప్రతతికి+ఎల్లన్=సమూహమునకంతకును; ఏటికోళ్ళు=నమస్కారములు; ఇచ్చి=సమర్పించి; మృడుని=శివుని; హాటక శైలంబు=వెండికొండకన్న; మీఁది=పైదగు-ఎక్కువదగు; నిలువున్=అంతస్తును; ఎక్కిరి=అధిరోహించిరి.

భావము :- అగస్త్య వ్యాసులు హిమవంతుని ప్రియపుత్రికయు, భీమేశ్వరస్వామి అంతఃపుర స్త్రీయగు పరమేశ్వరిని సేవించిరి. తరువాత కుమారస్వామి అన్నయు, గజముఖుడగు వినాయకుని సేవించిరి. మోక్ష స్థానమును, సర్వ మంగళయునగు దుర్గాదేవికి నమస్కారములు చేసిరి. దిగంబరుడు, అభీష్ట ప్రదాతయగు వటుక భైరవస్వామిని దర్శించిరి. బ్రహ్మను పూజించిరి. విష్ణువును దర్శించిరి. ఇతర పరివార దేవతా సమూహమునకు నమస్కారము లర్పించిరి. తరువాత పరమేశ్వరుని వెండి కొండకన్న గొప్పదగు పై అంతస్తును ఎక్కిరి.

విశేషము :- శ్రీ భీమేశ్వరస్వామి వారి పరివార దేవతలను దర్శించు క్రమము ఇందు వివరింపబడినది. క్రింది భాగమున రెండవ ప్రాకారము లోపల నెలకొనియున్న పరివార దేవతలు వీరు.

శ్రీనాథునకు-శివుని "మంచుంగొండయనుంగు పెండ్లికొడుకు" అని అనుటయు. పార్వతిని" వణఁకు గుబ్బలి రాచవారి కూరిమి కన్య" అని అనుటయు చాల ఇష్టము.

శా॥ సందర్శించిరి భీమనాథుఁ ద్రిజగత్సమ్మోహనాకారు న
ర్ధేందూత్తంసుని దక్షిణాబ్ధి లహరీ హేలా విహార క్రమా
స్పందాయాత సుగంధవాహ పరిషత్పానాతిరేక స్ఫుర
త్తుందిస్వాంగక దందశూక కటకాస్తోకేష్టబాహార్గళున్. 186

అర్థము :- దక్షిణ.....అర్గళున్; దక్షిణ+అబ్ధి=దక్షిణ దిక్కునందలి సముద్రము యొక్క; లహరీ=తరంగములపై; హేలా=విలాసముతో; విహారక్రమ=విహరించుటయందలి పూనికతో; ఆస్పంద=కొంచెము కదలికతో; ఆయాత=వచ్చిన; సుగంధవాహ=చక్కనిగాలుల; పరిషత్=సమూహమును; పాన+అతిరేక=హెచ్చుగా త్రావుటచేత; స్ఫురత్=ప్రకాశించుచున్న-మిలమిల

లాడుచున్న; తుంది=(పెద్ద పొట్టగల)-నిండైన; స్వ+అంగక=తమ శరీరములుగల; దందశూక= సర్పముల; కటక=కంకణములచేత; అస్తోక=గొప్పవగు; ఇష్ట+బాహ+అర్గళున్=ప్రియమైన గడియల వంటి బాహువులు గలట్టియు; త్రిజగత్=ముల్లోకములను; సమ్మోహన=మోహింప జేయు; ఆకారున్=రూపము గలట్టియు; అర్ధ+ఇందు+ఉత్తంసుని=అర్ధచంద్రుడు - చంద్రరేఖ జటాజూటమునందు గలట్టి; భీమనాథున్=భీమేశ్వరస్వామిని; సందర్శించిరి=దర్శనము చేసిరి;

భావము :- ముల్లోకములను మోహింపజేయు దివ్యరూపము గలిగి చంద్రశేఖరుడగు భీమేశ్వరుస్వామిని అగస్త్య వ్యాసులు దర్శించిరి. దక్షిణ సముద్ర తరంగములపై నుండి వచ్చు గాలులను త్రావుటచే బలిసిన సర్పములే ఆయన హస్తకంకణములైయున్నవి.

విశేషము :- "వాయువులు త్రాగి బలసిన సర్పములు హస్త కంకణములుగా కలిగి యున్నవాడు" - అను భావము గల పద్యము శివరాత్రి మాహాత్మ్యము నందు కూడ శ్రీనాథుడు వ్రాసినాడు.

ఉ॥ ఆ చపలాయతాక్షి కనకాంబురుహంబులఁ బూజసేయు, విం
ధ్యాచల కందరా నిలయు, నద్రిసుతా ప్రియనాథు, నర్మదా
వీచి పరంపరా సలిల విప్రుషదాశ్రయ శీత గంధ వా
హాచమన ప్రవృద్ధ భుజగాధిపకంకణు నోంకృతీశ్వరున్ (శివ. 2-20)

క॥ దృష్టించి భక్తి పరతను
సాష్టాంగం బెరఁగి యమ్మహాదేవుని నా
శిష్ట మునుల్పూజించిరి
యష్టాపద నిర్మితంబులగు కుసుమములన్. 187

అర్థము :- ఆ శిష్టమునుల్=సాధువులు - (సదాచార సంపన్నులగు ఆ మహర్షులు); దృష్టించి=ఏకాగ్రతతో దర్శించి; భక్తిపరతను=భక్తియొక్క ఆధిక్యముతో; స+అష్టాంగంబు= (శరీరములోని) ఎనిమిది అవయవములు భూమికి ఆనునట్లు - సాగిలబడి; ఎరఁగి=నమస్క రించి; ఆ+మహాదేవునిన్=ఆ పరమేశ్వరుని; అష్టాపద=బంగారము చేత; నిర్మితంబులు=చేయ బడిన; కుసుమములన్=పూలతో; పూజించిరి=పూజ చేసిరి.

భావము :- సదాచార సంపన్నులగు అగస్త్య వ్యాసులు భీమేశ్వరస్వామిని దర్శించి భక్తిపరులై సాష్టాంగ నమస్కారము చేసి బంగరు పూలతో పూజించిరి.

విశేషము :- శ్లో. ఉరసా శిరసా దృష్ట్యా, వచసా మనసా తథా
పద్భ్యాం కరాభ్యాం కర్ణాభ్యాం ప్రణామోऽష్టాంగ ఉచ్యతే.

వక్షఃస్థలము, శిరస్సు, కన్నులు, మనస్సు, మాట, పాదములు, చేతులు, చెవులు - అనునవి దేహములోని అవయవములలో ముఖ్యములు. శివాభిషేకమునకు మొదట ప్రయుక్త మగు మహాన్యాసములో ఒక్కొక్క మంత్రము ఒక్కొక్క అవయవముతో నమస్కరించునప్పుడు చెప్పుదురు. పై ఎనిమిది అవయవములు నేలను తాకునట్లు సాగిలబడుట సాష్టాంగ ప్రణామము.

**ఉ॥ కేవల భక్తి సంపదలు గీలుకొనన్ హృదయాంబుజంబులన్**
**దేవరకుం గృపానిధికి దేవశిఖామణి కర్థి సప్తగో**
**దావర వాహినీ కనక తామరసంబులఁ బూజ చేసె మై**
**త్రావరుణుండు దానును బరాశరసూనుఁడు గూడి వేడుకన్. 188**

అర్థము :- మైత్రావరుణుండు=అగస్త్యుడు; పరాశరసూనుండు=(పరాశరుని కుమారుడగు) వ్యాసునితో; తానును=తాను గూడ; కూడి=కలిసి; వేడుకన్=సంతోషముతో; హృదయ+అంబుజంబులన్=మనఃపద్మములందు; కేవల=విశిష్టమగు-అసాధారణమగు; భక్తి సంపదలు=భక్తి సమృద్ధులు; కీలుకొనన్=నాటుకొనగా; దేవశిఖామణికిన్=దేవతలలో శ్రేష్ఠుడును; కృపానిధికిన్=దయకు స్థానమైనవాడునగు; దేవరకున్=భీమేశ్వర స్వామికి; అర్థిన్=కోరికతో; ఆసక్తితో; సప్త.....తామరసంబులన్; సప్తగోదావర=సప్తగోదావరమను; వాహినీ=నదియందలి; కనక=బంగారు వికారములగు; తామరసంబులన్=పద్మములతో; పూజచేసెన్=పూజించెను.

భావము :- అగస్త్య మహర్షి వ్యాసునితో గూడి సంతోషముతో, హృదయపద్మములందు విశిష్ట భక్తి కలుగగా దయాసముద్రుడు, దేవశ్రేష్ఠుడగు భీమేశ్వరుని సప్తగోదావరములోని బంగారు తామరపూవులతో పూజించెను.

**వ॥ అప్పుడు పారాశర్యుండు పెన్నిధానంబు గన్న పేదయుంబోలె పరమానందం బునుంబొంది కుంభసంభవుంజూచి "మునీంద్రా! నీ ప్రసాదంబున భీమమండలం బవలోకించితి; ద్వాదశక్షేత్ర తీర్థంబులు చూచితిఁ; బంచతీర్థంబు లాడితి; దక్షారామంబు గంటి; భీమేశ్వరు దర్శించితి; ధన్యుండనైతి; నిఁక నీవు పత్నీ సహితంబుగా నే వలన నైన నుండి తపంబుసేయుము. నేనును విశ్వనాథ రచితావమాన ఖేదంబు వాయ నీ స్వామిని సేవించెద" నని పలికి సముచిత ప్రకారంబున నమ్మహాత్ముని వీడుకొలిపి యనంతరంబ శిష్యులుందానును - 189**

అర్థము :- అప్పుడు=ఆ సమయమున; పారాశర్యుండు=వ్యాసుడు; పెద్ద+ నిధానం బున్=పెద్ద ధనాగారమును-నిధిని; కన్న=చూచిన; పేదయున్+పోలెన్= దరిద్రునివలె; పరమ+

ఆనందంబునున్=గొప్పదగు ఆనందమును; పొంది=పొంది; కుంభసంభవున్=అగస్త్యుని; చూచి=చూచి; ముని+ఇంద్రా=మునిశ్రేష్ఠా; నీ ప్రసాదంబునన్=నీ అనుగ్రహముతో; భీమ మండలంబు=భీమమండలమును; అవలోకించితిన్=చూచితిని; ద్వాదశ=పండ్రెండు సంఖ్య గల; క్షేత్ర=క్షేత్రములను; తీర్థంబులు=తీర్థములను; చూచితిన్=దర్శించితిని; పంచ తీర్థంబులు= అయిదు తీర్థములందు; ఆడితి=స్నానము చేసితిని. దక్షారామంబున్=దక్షారామమును, కంటిన్=చూచితిని; భీమేశ్వరున్=భీమేశ్వరస్వామిని; దర్శించితి=దర్శనము చేసితిని; ధన్యుండను+ఐతిన్=కృతార్థుడనైతిని; ఇఁక=ఇంక; నీవు=నీవు; పత్నీసహితంబుగా=భార్యతో గూడ; ఏవలనన్+ఐనన్=ఎక్కడనైనను; ఉండి=నివసించి; తపంబు=తపస్సు; చేయుము= చేయుము; నేనును=నేనుగూడ; విశ్వనాథ=(కాశీలోని) విశ్వేశ్వరస్వామిచేత; రచిత=కలిగింప బడిన; అవమాన=పరాభవము వలన గలిగిన; ఖేదంబు=బాధ; పాయన్=పోవునట్లుగా; ఈ స్వామిని=ఈ భీమేశ్వరస్వామిని; సేవించెదన్= కొలిచెదను; అని=అని; పలికి=చెప్పి; సముచిత ప్రకారంబునన్=తగిన రీతిగా; ఆ+మహాత్మునిన్=ఆ మహానుభావుని; వీడుకొలిపి=వెళ్ళి రమ్మని; అనంతరంబ=తరువాత; శిష్యులున్=శిష్యులును; తానును=తానుగూడ(తరువాతి పద్యము లోని కన్వయము)

భావము :- అప్పుడు వ్యాసుడు పెన్నిధిగన్న పేదవలె మహానందమునంది వ్యాసుని జూచి "మునిశ్రేష్ఠా! నీయనుగ్రహము వలన భీమమండలమును దర్శించితిని; ద్వాదశక్షేత్ర తీర్థములను జూచితిని; పంచతీర్థములందు స్నానము చేసితిని. దక్షారామము గాంచితిని; భీమేశ్వర స్వామిని దర్శించితిని; కృతార్థుడనైతిని; ఇక నీవు నీ భార్యయగు లోపాముద్రతోగూడ నెచటనైన నుండి తపస్సు చేయుము. నేను కాశీ విశ్వనాథుడు గలిగించిన అవమాన దుఃఖము పోవునట్లు ఈ స్వామిని సేవింతును" అని ఆయనను వీడ్కొని శిష్యులతో గలిసి-

## వ్యాసుండు భీమేశ్వరార్చనంబు సలుపుట

సీ॥ పంచతీర్థము లాడి భవలింగ సన్నిధిఁ
బ్రాసాద పంచాక్షరము జపించి
సొరిది నల్దిక్కుల సోమేశ్వరములందు
భక్తిఁ బ్రదక్షిణం బాచరించి
కుక్కుటేశ్వర కేళకూళి నుద్భవమైన
మణికర్ణిక నొనర్చి మజ్జనంబు
నోంకారపురిఁ ద్రికూటోపరి స్థితులైన
హరిహర బ్రహ్మల నభినుతించి

తే॥ తుల్యఁగోదావరీ నదిఁ దోయనిధిని
సప్త గోదావరంబున స్నానమాడి
యాచరించు శివార్చనం బనుదినంబు
దక్షవాటిక నుండి సత్యవతి సుతుఁడు. 190

అర్థము :- సత్యవతి సుతుఁడు=సత్యవతీపుత్రుడగు వ్యాసుడు, పంచతీర్థములు+ ఆడి=అయిదు పుణ్యజలయుక్త సరస్సులందు స్నానము చేసి; భవలింగ సన్నిధిన్= శివలింగము యొక్క సమీపమునందు; ప్రాసాద పంచాక్షరిన్=ప్రాసాద పంచ క్షరియను పేరుగల మంత్రమును; జపించి=జపముచేసి;

సొరిదిన్=క్రమముగా; నల్దిక్కులన్(నలు+దిక్కులన్)=నాలుగు దిక్కులందుగల; సోమేశ్వరములందున్=సోమేశ్వరనామక శివస్థానములందు; భక్తిన్=భక్తితో; ప్రదక్షిణంబు= ప్రదక్షిణమును; ఆచరించి=చేసి;

కుక్కుటేశ్వర=కుక్కుటేశ్వరస్వామి యొక్క; కేళకూళిన్=క్రీడా సరస్సునుండి; ఉద్భవము+ఐన=జనించిన; మణికర్ణికన్=మణికర్ణికయను తీర్థమునందు; మజ్జనంబు= స్నానమును; ఒనర్చి=చేసి;

ఓంకారపురిన్=ఓంకార పట్టణమునందలి (ఓదూరు నందు); త్రికూట+ఉపరి= త్రికూట పర్వతముపైన; స్థితులైన=ఉన్న; హరిహరబ్రహ్మలన్=విష్ణువును, శివుని, బ్రహ్మను; అభినుతించి=స్తోత్రము చేసి;

తుల్యన్=తుల్యభాగయందును; గోదావరి నదిన్=గోదావరి నదిలోను; తోయనిధిన్= సముద్రమునందును; సప్త గోదావరంబునన్=సప్త గోదావరములోను; స్నానమాడి=స్నానము చేసి; అనుదినంబున్=ప్రతిదినమును; దక్షవాటికన్=దక్షారామములో; ఉండి=నివసించి; శివ+అర్చనంబు=శివపూజ; ఆచరించున్=చేయును.

భావము :- వ్యాస మహర్షి పంచతీర్థములందు స్నానము చేసి శివలింగ సాన్నిధ్యములో ప్రాసాద పంచాక్షరీ మంత్రమును జపించును. తరువాత క్రమముగా ఆలయము నకు నాలుగు దిక్కులందున్న సోమేశ్వరాలయములకు భక్తితో ప్రదక్షిణము చేయును. కుక్కుటేశ్వరస్వామి వారి క్రీడా సరస్సు నుండి ఆవిర్భవించిన మణికర్ణికలో స్నానము చేయును. ఓంకారపురము (ఓదూరు) నందు త్రికూట పర్వతము పైనున్న హరిహర బ్రహ్మలను స్తోత్రము చేయును. తుల్యభాగయందును, గోదావరిలోను, సముద్రములోను, సప్తగోదావరము నందును స్నానముచేసి దక్షారామములో నుండి ప్రతిదినము శివార్చన చేయును.

**విశేషము :-** సూర్య ప్రతిష్ఠితమైన లింగమునకు నలుదిక్కులందును సోమ ప్రతిష్ఠిత లింగములుండుట పరిపాటి. భీమేశ్వరాలయమునకు అష్టదిక్కులందును సోమేశ్వర లింగములున్నవి.

1. దక్షారామమునకు తూర్పున ఆత్రేయీ నదీతీరమునందలి కోలంక గ్రామములో సోమేశ్వరుడు గలడు.

2. ఆగ్నేయమున కణ్వనదీతీరమునందు దంగేరు గ్రామములో సోమేశ్వరుడు గలడు.

3. దక్షిణమున గౌతమీ నదీతీరమునందు కోటిపల్లి సోమేశ్వరుడు గలడు.

4. నైరృతి దిక్కునందు గౌతమీ తీరమునందలి కోరుమిల్లిలో సోమేశ్వరుడు గలడు.

5. పశ్చిమమున తుల్యభాగా సమీపమునందు సోమేశ్వరమునందు సోమేశ్వరుడు గలడు. ఈయనయే పులుగుర్తి సోమేశ్వరుడు.

6. వాయవ్య దిక్కునందు వెల్లగ్రామమున సోమేశ్వరుడు గలడు.

7. ఉత్తర దిక్కునందు తుల్యాసాగర సంగమ స్థల సమీపమునందు చొల్లంగి సోమేశ్వరుడున్నాడు.

8. ఈశాన్యమునందు ఆత్రేయీసాగర సంగమ స్థల సమీపమునందు పటవల సోమేశ్వరుడున్నాడు.

ఈ సోమేశ్వర లింగములన్నియు దక్షారామమునకు ఒక యోజనము దూరములో నున్నవి.

కాని వ్యాసుడు నాలుగు దిక్కులందున్న సోమేశ్వర క్షేత్రములకే ప్రదక్షిణ మాచరించి నట్లు ప్రస్తుత పద్యములో నున్నది.

రెండవ పాదమునందు "భక్తిఁబ్రదక్షిణంబాచరించి" అనుచోట అఖండ యతి.

క॥ **భీమేశ్వర మహిమంబున**
**నామోదము తోడ నోలలాడుచు నుండున్**
**భీమేశ్వర చరణారుణ**
**తామరసంబులకు సంతతము ప్రణమిల్లున్.** 191

**అర్థము** :- (వ్యాసుడు) భీమేశ్వర=భీమేశ్వరస్వామి యొక్క; మహిమంబునన్= మహిమయందు; ఆమోదము తోడన్=సంతోషముతో; ఓలలాడుచునుండున్= మునుగు చుండును; భీమ.....తామరసంబులకు; భీమేశ్వర=భీమేశ్వరస్వామియొక్క చరణ=పాదము లనెడి; అరుణ=ఎఱ్ఱని; తామరసంబులకున్=పద్మములకు; సంతతము= ఎల్లప్పుడును; ప్రణమిల్లున్=నమస్కరించును.

**భావము** :- వ్యాసమహర్షి భీమేశ్వరస్వామివారి మహామహిమలో సంతసముతో మునిగి తేలుచుండును. భీమేశ్వరస్వామివారి అరుణ చరణ కమలములకు ఎల్లప్పుడు నమస్కరించును.

సీ॥ మాతృ గర్భాగార జాత ఖేదము వాయ
హరుని గర్భాగార మాశ్రయించుఁ,
బరమేశ్వరార్చనా పరత నించుక తన్ను
నత్యంత ధన్యుఁగా నాత్మఁ దలఁచు,
హర్షించి హర! శివ! త్ర్యంబకాచల గర్భ!
భవ! యంచు రోమాంచ పటలిఁ దాల్చుఁ;
గరతాళ కలన శంకర గీతములు పాడు
లజ్జాభిమానంబు లుజ్జగించి

తే॥ "భీమ! భీమేశ్వరేశ్వర! భీమనాథ!
దక్షవాటీ పురాధ్యక్ష! దర్పకారి!
సప్తగోదావరోత్సంగ! జయ మహేశ!
నన్ను రక్షింపు" మనుచు విన్నపము సేయు. 192

అర్థము :- (వ్యాసుడు) మాతృ.....ఖేదము; మాతృగర్భ=తల్లిగర్భమనెడి; అగార=ఇంటియందు; జాత=కలిగిన; ఖేదము=దుఃఖము; పాయన్=పోవునట్లుగా; హరుని=భీమేశ్వరుని యొక్క; గర్భ+అగారము=గర్భాలయమును; ఆశ్రయించున్=ఆశ్రయించును.

ఇంచుక=కొంచెము; పరమేశ్వర=పరమశివుని యొక్క; అర్చనా=పూజయందలి; పరతన్=ఆసక్తితో; తన్ను=తన్ను; అత్యంత=మిక్కిలి; ధన్యున్+కాన్=కృతార్థునిగా; ఆత్మన్=మనస్సులో; తలఁచున్=తలంచును.

హర=హరా; శివ=శివా; త్ర్యంబక+అచల=త్ర్యంబకమను పేరుగల పర్వతము; గర్భ=లోపలి భాగము - ఆలయముగా గలవాడా; భవ=భవా; అంచున్=అనుచు; హర్షించి=సంతోషించి; రోమాంచ=పులకల యొక్క; పటలిన్=సమూహమును; తాల్చున్=ధరించును.

లజ్జ+అభిమానంబులు=సిగ్గు గర్వములను; ఉజ్జగించి=వదలి; కరతాళ=చప్పట్లు కొట్టుట; కలన=చేయుటతో; శంకర గీతములు=శివునిపై పాటలు; పాడున్=గానము చేయును.

భీమ=భీమా; భీమేశ్వర+ఈశ్వర=భీమేశ్వరస్వామీ; భీమనాథ=భీమనాథా; దక్షవాటీ=దక్షారామమను; పుర=పట్టణమునకు; అధ్యక్ష=అధిష్ఠానమైనవాడా; దర్పక=మన్మథునకు; అరి=శత్రువైన వాడా; సప్తగోదావర=సప్తగోదావరము; ఉత్సంగ=సమీపమున గలవాడా; మహేశ=పరమేశ్వరా! జయ=జయము; నన్ను=నన్ను; రక్షింపుము=కాపాడుము; అనుచున్=అనుచు; విన్నపము+చేయున్=మనవి చేయును.

భావము :- వ్యాసుడు మాతృగర్భ నివాసము వలన గలిగిన దుఃఖము పోవునట్లుగా భీమేశ్వరస్వామివారి గర్భాలయము నాశ్రయించును. స్వల్పముగా పరమేశ్వరు నర్చించుట చేతనే తాను మిక్కిలి ధన్యాత్ముడైనట్లుగా మనస్సులో తలంచును. హరా! శివా! త్ర్యంబకాచల నివాసా! భవా! అని పలుకుచు సంతోషముతో పులకిత శరీరుడగును. సిగ్గు అభిమానమును వదలి చప్పట్లు కొట్టుచు పరమేశ్వరునిపై గీతములు పాడును. "భీమా! భీమేశ్వరస్వామీ! భీమనాథా! దక్షారామ పట్టణమున కధిష్ఠానదైవమా! జయము. నన్ను రక్షింపుము అని మనవి చేయును.

విశేషము :- వ్యాసుని శివభక్తి ఇందు కన్నులకు కట్టినట్లు వర్ణితమైనది.

క॥ బాలోన్మత్త పిశాచ ద
శాలంబనమునఁ జరించు నంగడివీథిన్
వ్రీడాశూన్యతఁ గంఠే
కాలుని పాదముల మీఁదఁ గలుగు విరాళిన్. 193

అర్థము :- (వ్యాసుడు) కంఠేకాలుని=(కంఠమునందు విషము వలన గలిగిన నల్లదనముగల) శివుని యొక్క; పాదములమీఁదన్=పాదములపైన; కలుగు=కలుగుచున్న; విరాళిన్=భక్తితో; వ్రీడాశూన్యతన్=సిగ్గు లేకపోవుటచేత; బాల......ఆలంబనమునన్; బాల= బాలుని యొక్క; ఉన్మత్త=పిచ్చివాని యొక్క; పిశాచ=దయ్యము పట్టిన వానియొక్క; దశా= స్థితిని; ఆలంబనమునన్=ఆశ్రయించుట చేత; అంగడి వీథిన్=దుకాణములుండు వీథిలో; చరించున్=సంచరించును.

భావము :- వ్యాసుడు పరమేశ్వరుని పాదపద్మములందు మిక్కిలి భక్తి కలుగుటచేత సిగ్గు నశించి బాలునివలె, ఉన్మత్తునివలె, పిశాచగ్రస్తునివలె విపణి వీథియందు సంచరించు చుండెను.

సీ॥ పరిరంభ మొనరించు బాహాద్వయంబున
దేవదేవుని సుధా దివ్యమూర్తిఁ;
దాఁకించుకొను జటా స్తబకంబు విరియంగఁ
బానవట్టము తోడి భాలతలము;
గురు దక్షపురి తోడఁ గూడఁ బట్టణమున
కంగప్రదక్షిణం బాచరించుఁ;
బాతాళ భైరవ ప్రముఖ నానాదిశా
పరివార దేవతా ప్రతతిఁ దెలఁచుఁ;

తే॥ "గాశికా పట్టణద్రోహిఁ గావు మభవ!
విశ్వపతి దూషితుని బ్రోవు విశ్వనాథ!
కల్ల చేసితి రక్షింపు కాలకంఠ!"
యనుచుఁ బ్రార్థించు భీమనాయకునిఁ దపసి. 194

అర్థము :- తపసి=తపస్వియగు వ్యాసుడు; దేవదేవుని=దేవతలకు దేవుడగు భీమేశ్వర స్వామి యొక్క; సుధా=అమృతముతో; దివ్యమూర్తిన్=మహిమగల లోకాతీతమగు లింగాకృతిని; బాహాద్వయంబునన్=రెండు చేతులతో; పరిరంభము=కౌగలించుట; ఒనరించున్=చేయును;

జటాస్తబకంబు=జడలనెడి పూలగుత్తి; విరియంగన్=వికసింపగా; పానవట్టము తోడన్=శివలింగ పీఠముతో; భాలతలమున్=నుదుటి చోటును; తాఁకించుకొనున్=తాకునట్లు చేయును.

గురు=గొప్పదగు; దక్షపురితోడన్=దక్షారామముతో; కూడన్=కలియునట్లుగా; పట్టణము నకు=నగరమునకు; అంగప్రదక్షిణంబు=గుడిచుట్టు దొర్లుచు చేయు ప్రదక్షిణమును; ఆచరించున్=చేయును.

పాతాళ.....ప్రతతిన్; పాతాళభైరవ=పాతాళ భైరవుడు; ప్రముఖ=మొదలైన; నానా దిశా=అనేక దిక్కులందున్న; పరివార దేవతా=పరివార దేవతల యొక్క; ప్రతతిన్=సమూహ మును; తెలఁచున్=సేవించును.

అభవ=శివా! కాశికా=కాశి అను పేరుగల; పట్టణ=నగరమునకు; ద్రోహిన్=ద్రోహము చేసిన నన్ను; కావుము=రక్షింపుము; విశ్వనాథ=ప్రపంచమునకు ప్రభువైన దేవా!; విశ్వపతి= లోకమునకు నాథుడగు వానిచేత-విశ్వనాథునిచేత; దూషితునిన్=భంగపఋపబడిన నన్ను; బ్రోవు=రక్షింపుము; కాలకంఠ=నల్లదనము కంఠమునందుగల శివా; కల్ల చేసితి=అపరాధము చేసితిని; రక్షింపు=కావుము; అనుచున్=అనుచు; భీమనాయకునిన్=భీమేశ్వరస్వామిని; ప్రార్థించున్=వేడును.

భావము :- వ్యాస మహర్షి అమృతమూర్తియగు భీమేశ్వరస్వామిని రెండు బాహువులతో కౌగలించుకొనును. జటాభారము విరివియగునట్లు పానవట్టమునకు తన నుదుటిని తాకించును. మహత్తరమగు దక్షారామముతో గూడిన పట్టణమునకు అంగ ప్రదక్షిణము (పొర్లుదండములు) చేయును. పాతాళ భైరవుడు మున్నగు నానా దిక్కులందున్న పరివార దేవతలను సేవించును. "పరమేశ్వరా! కాశీ పట్టణమునకు ద్రోహము చేసితిని; రక్షింపుము; విశ్వనాథునిచే భంగపాటు నందిన నన్ను విశ్వేశ్వరా! కావుము. కాలకంఠా! తప్పు చేసితిని రక్షింపుము'' అని భీమేశ్వర స్వామిని ప్రార్థించును.

విశేషము :- అంగప్రదక్షిణము :- దేవాలయాదులచుట్టును దేహము సమస్తము నేలకు తగులునట్లుచేయు ప్రదక్షిణము. మ్రొక్కుకొనినవారు సచేల స్నానముచేసి తడిబట్టలతోనే హస్తములతోడి నమస్కారముద్రను వీడకుండ మ్రొక్కుకొన్న నియమానుసారము దొర్లుచు ప్రదక్షిణములు చేయుదురు.

సీ॥ "అఘముల కొండు ప్రాయశ్చిత్తములు లేవు
నిన్నుఁజూచుట కంటె నీలకంఠ!
నీ మండలంబున నిఖిల జంతువులకుఁ
దారకం బలభ్రాంతి దశను దోఁచుఁ;
గలియుగంబున యందుఁ గడు దుర్లభంబులు
భవదీయ దర్శన స్పర్శనములు;
నీ దక్షవాటికా నిలయంబు నందుండు
జనులకు భోగమోక్షములు వలఁతి;

తే॥ శిష్యులును నేను మిమ్ముఁ గొల్చెదము భక్తి;
విశ్వపతి కోపమునఁ గాశి వెడలివచ్చి;
తరసి రక్షింపు మమ్ము దయార్ద్ర హృదయ!
శాంత! భీమేశ్వరేశ్వరస్వామి! నాథ!" 195

అర్థము :- నీలకంఠ=శంకరా!; నిన్నున్=నిన్ను; చూచుట కంటెన్=దర్శించుట కంటె; అఘములకు=పాపములకు; ఒండు=మఱియొక; ప్రాయశ్చిత్తములు=పాప పరిహారార్థము చేయు పనులు; లేవు=లేవు.

నీ మండలంబునన్=నీదగు భీమమండలములోని; నిఖిల జంతువులకున్=సమస్త ప్రాణులకు; అల=ఆ ప్రసిద్ధమగు; భ్రాంతి దశను=తెలివి తప్పిన వేళయందు-మిథ్యా మతి కలుగు స్థితిలో; తారకంబు=(సంసారము నుండి) తరింపజేయు ప్రణవము; తోఁచున్=స్ఫురించును;

కలియుగంబునయందున్=కలియుగములో; భవదీయ=నీ యొక్క; దర్శన=చూచుట; స్పర్శనములు=తాకుట అనునవి; కడు=మిక్కిలి; దుర్లభంబులు=కష్టముతోడను లభింపనివి.

నీ=నీ యొక్క; దక్షవాటికా=దక్షారామమను; నిలయంబునందు=ఆలయమునందు; ఉండు=నివసించు; జనులకు=మనుజులకు; భోగమోక్షములు=సుఖములు, ముక్తులు; వలఁతి=లోబడి యుండును.

దయా=కరుణచేత; ఆర్ద్ర=ఆర్ద్రమైన; హృదయ=మనస్సుగలట్టియు; శాంత=ప్రశాంతమైనట్టియు; నాథ=దిక్కైనట్టియు; భీమేశ్వర+ఈశ్వర=భీమేశ్వరస్వామియను; స్వామి=దేవా!; శిష్యులును=నా శిష్యులును; నేనున్=నేనును; భక్తిన్=భక్తితో; మిమ్మున్=మిమ్ములను; కొల్చెదము=సేవింతుము; విశ్వపతి=విశ్వేశ్వరుని యొక్క; కోపమునన్=కోపము చేత; కాశిన్=కాశీ నగరము నుండి; వెడలి=బయదేరి; వచ్చితిన్=వచ్చితిని; మమ్ము=మమ్ములను; అరసి=కనిపెట్టి; రక్షింపు=కాపాడుము.

భావము :- దయార్ద్ర హృదయా! శాంత స్వరూపా! నాథా! భీమేశ్వరా! నీలకంఠా! నిన్ను దర్శించుటకంటె పాపములకు వేరు ప్రాయశ్చిత్తములు లేవు. నీ భీమమండలములో నుండు ప్రాణులన్నింటికిని ఆ భ్రాంతి దశలో (మరణ సమయమునందు) తారకమగు ప్రణవము స్ఫురించును. కలియుగములో నీ దర్శనము, నిన్ను తగులుట అనునవి మిక్కిలి కష్టమున మాత్రమే లభించునవి. నీ దక్షవాటికలో నుండు జనులకు భోగ మోక్షములు లోబడియుండును. నేనును శిష్యులును మిమ్ములను భక్తితో సేవింతుము. విశ్వనాథస్వామి వారి కోపము కారణముగా కాశీనగరమును వీడి వచ్చితిని. నన్ను కనిపెట్టి రక్షింపుము.

విశేషము :- శ్లో. ప్రాణ ప్రయాణ వేళాయాం తారకం సర్వదేహినాం
కర్ణమూలే కథయసి త్వం మహీమండలే ప్రభో. సం. భీమ. 13-25

దేవా! భీమమండలమున సర్వదేహులకు మరణ సమయమున చెవిలో తారకమును చెప్పుదువు.

వ॥ అని మఱియుఁ గృష్ణద్వైపాయనుండు. 196

అర్థము :- అని=అని; మఱియున్=ఇంకను; కృష్ణద్వైపాయనుండు (ద్వీపము జన్మస్థానముగాగల నల్లనివాడగు) వ్యాసుడు.

భావము :- అని ఇంకను వ్యాసుడు భీమేశ్వరు నిట్లు స్తుతించెను.

## వ్యాసుండీశ్వరుని స్తుతించుట

సీ॥ "దేవదేవునకు నాదికి నాదియగు వాని
కంబికాపతికి, దక్షాధ్వరారి
కహిత పురత్రయాధ్యక్ష సంహరునకు
హరి లోచనాంబుజాభ్యర్చితునకు

బ్రహ్మాది దేవతోపాస్య సన్మూర్తికి
నమృత మూర్తికిని స్వయంభువునకు
నిగమార్థ విద్యోపనిషదంగనా మౌళి
చుంబిత శ్రీ చరణాంబుజునకు

తే॥ భోగమోక్షంబు లతిపాప బుద్ధులకును
గరుణ నొసఁగెడు ప్రత్యక్ష కల్ప శాఖి,
కఖిల గంధర్వ యక్ష సిద్ధాది దివ్య
వంద్యునకు, మ్రొక్కెదను భక్త వత్సలునకు. 197

**అర్థము :-** దేవదేవునకున్=దేవతల కందఱకు దేవుడయినట్టియు, ఆదికిన్=మొదటికి; ఆది=మొదలు; అగువానికిన్=అయినట్టియు; అంబికా పతికిన్=పార్వతీదేవికి భర్తయైనట్టియు; దక్ష=దక్షుని యొక్క; అధ్వర=యజ్ఞమునకు; అరికిన్=శత్రువైనట్టియు; అహిత=శత్రువుల యొక్క; పురత్రయ=పట్టణములు మూడింటికి; అధ్యక్ష=అధిపతులను; సంహరునకు= చంపినట్టియు; హరి=విష్ణువు యొక్క; లోచన+అంబుజ=పద్మముల వంటి కన్నులచేత; అభ్యర్చితునకు=పూజింపబడినట్టియు; బ్రహ్మ+ఆది=బ్రహ్మ మున్నగు; దేవతా=దేవతలచేత; ఉపాస్య=ఉపాసనము చేయదగిన; సత్=సద్రూపమగు; మూర్తికిన్=ఆకారముగలట్టియు; అమృతమూర్తికిని=సుధాస్వరూపముగలట్టియు; స్వయంభువునకున్=తనంత తాను ఆవిర్భవించినట్టియు; నిగమ.....అంబుజునకు; నిగమ=వేదముల యందలి; అర్థ=పరమార్థ మగు; విద్యా=జ్ఞానరూపమగు; ఉపనిషత్=వేదాంతములనెడి; అంగనా=స్త్రీ యొక్క; మౌళి= శిరస్సు చేత; చుంబిత=ముద్దిడబడి; శ్రీ=శోభాయుక్తమగు; చరణ+అంబుజునకు=పాద పద్మములు గలట్టియు; అతి=మిక్కిలియగు; పాపబుద్ధులకును=పాపముతో గూడిన మనస్సు గల వారికిని; కరుణన్=దయతో; భోగ=భోగములను; మోక్షంబులు=ముక్తులను; ఒసఁగెడు= ఇచ్చునట్టి; ప్రత్యక్ష=కన్నుల ఎదుటనున్న; కల్పశాఖికి=కల్పవృక్షమైనట్టియు; అఖిల= సమస్తమైన; గంధర్వ=గంధర్వులు; యక్ష=యక్షులు; సిద్ధ=సిద్ధులు; ఆది=మొదలగు; దివ్య= దేవతలచేత; వంద్యునకు=నమస్కరింపబడునట్టియు; భక్త=భక్తులయందు; వత్సలునకున్= ప్రేమగల భీమేశ్వరస్వామిని; మ్రొక్కెదను=నమస్కరింతును.

**భావము :-** దేవతలకు దేవుడును, కారణమునకు కారణమును, పార్వతీపతియును, దక్షయజ్ఞ శత్రువును, త్రిపురపతుల నాశకుడును, విష్ణుదేవుని నయన పద్మార్చితుడును, బ్రహ్మాదిదేవతలచే నుపాస్యుడును, అమృతమూర్తియును, స్వయంభువును, వేదాంత

విద్యాంగనా మస్తకముతో నమస్కరించిన పాదపద్మములు గలవాడును, పాపాత్ములకును కరుణామూర్తియై భోగమోక్షములనిచ్చు ప్రత్యక్ష కల్పవృక్షమైన వాడును; గంధర్వ యక్ష సిద్ధాదులచే నమస్కృతుడును, భక్తవత్సలుడునగు భీమేశ్వరస్వామిని నమస్కరింతును.

విశేషము :- అలంకారము - రూపకము.

సీ॥ శ్రీ భీమనాయక శివనామధేయంబు
చింతింప నేర్చిన జిహ్వజిహ్వ;
దక్షవాటీ పురాధ్యక్ష మోహనమూర్తి
చూడంగ నేర్చిన చూపుచూపు;
దక్షిణాంబుధి తట స్థాయి పావనకీర్తి
చే నింప నేర్చిన చెవులు చెవులు;
తారక బ్రహ్మ విద్యా దాత యౌదల
విరులు పూన్పఁగ నేర్పు కరము కరము;

తే॥ ధవ . . .ప శేఖరునకుఁ బ్రదక్షిణంబు
నర్థిఁ దిరుగంగ నేర్చిన యడుగు లడుగు;
లంబికా నాయక ధ్యాన హర్ష జలధి
మధ్యమునఁ దేలి యాడెడి మనసు మనసు. 198

అర్థము :- శ్రీ=సంపద్యుక్తుడగు; భీమనాయక=భీమేశ్వరుడను; శివ=పరమేశ్వరుని యొక్క; నామధేయంబు=పేరును; చింతింప=ధ్యానించుటను; నేర్చిన=అభ్యసించిన; జిహ్వ=నాలుకయే; జిహ్వ=నాలుక.

దక్షవాటీ=దక్షారామమను; పుర=పట్టణమునకు; అధ్యక్ష=పాలకుడగు శివుని; మోహన=సుందరమైన; మూర్తి=రూపమును; చూడంగ=చూడగా; నేర్చిన=నేర్చుకొన్న; చూపు=దృష్టియే; చూపు=దృష్టి.

దక్షిణ+అంబుధి=దక్షిణ దిక్కునందలి సముద్రము యొక్క; తట=ఒడ్డునందు; స్థాయి=ఉండునట్టి శివుని యొక్క; పావన=పవిత్రమగు; కీర్తిచే=కీర్తితో; నింపన్=నింపుట; నేర్చిన=అభ్యసించిన; చెవులు=కర్ణములే; చెవులు=కర్ణములు;

తారక=తరింపజేయు; బ్రహ్మవిద్యా=మోక్ష విద్యను; దాత=ఇచ్చు శివుని యొక్క; ఔదలన్=శిరస్సునందు; విరులు=పూవులను; పూన్పఁగన్=ధరింపజేయుటకు; నేర్చు=అభ్యసించు; కరము=చేయియే; కరము=చేయి.

ధవళకర=తెల్లని కిరణములుగల చంద్రుడు; శేఖరునకు=శిరోభూషణమైన శివునకు; అర్థిన్=కోరికతో; ప్రదక్షిణంబు=ప్రదక్షిణమును; తిరుగన్=తిరుగుటను; నేర్చిన=అభ్యసించిన; అడుగు=పాదమే; అడుగు=పాదము.

అంబికానాయక=పార్వతీపతియగు శివుని యొక్క; ధ్యాన=ధ్యానించుటచేత గలిగిన; హర్ష జలధి=సంతోష సముద్రము యొక్క; మధ్యమునన్=మధ్యమున; తేలియాడెడి=తేలియాడునట్టి; మనసు=మనస్సే; మనసు=మనస్సు.

భావము :- భీమేశ్వరస్వామియను శివుని నామమును కీర్తించు నాలుకయే నాలుక. దక్షారామ ప్రభుని మోహనాకారమును చూడనేర్చిన చూపే చూపు. దక్షిణ సముద్ర తీరమునందు నివసించు స్వామి పవిత్ర కీర్తితో తమ్ము నింపుకొనుట అభ్యసించిన చెవులే చెవులు. సంసారము నుండి తరింపజేయు మోక్షమునిచ్చు స్వామి శిరస్సుపైన పూలతో నలంకరించుట నేర్చిన చేయియే చేయి. చంద్రశేఖరుడగు భీమేశ్వరస్వామికి ప్రదక్షిణము చేయుట నేర్చిన పాదములే పాదములు. పార్వతీపతిని ధ్యానించుటచే గలుగు ఆనంద సముద్ర మధ్యమునందు తేలియాడు మనస్సే మనస్సు.

విశేషము :- పాల్కురికి సోమనాథుని మనఃప్రభవమైన ఈ రచనా రమణి ఎఱ్ఱన నృసింహ పురాణములో నిలబడినది. శ్రీనాథుని భీమేశ్వర పురాణములో నడువసాగినది. పోతన భాగవతములో పరుగులు తీసినది.

ఉ॥ మాటలు పెక్కులేటికిని మందర భూధర మంథనక్రియా
పాటల ఘూర్ణమాన జలభార మహోదధి కాలకూట సం
ఘూట కృపీట సంభవ శిఖావికట స్ఫుట విస్ఫులింగ వి
స్ఫోట పవిత్ర సద్భువన భూత భయాపహు నాశ్రయించెదన్. 199

అర్థము :- మందర.....అపహున్; మందర=మందరమను పేరుగల; భూధర=పర్వతముతో; మంథన=తరచుట-చిలుకుట అను; క్రియా=పనిచేత; పాటల=తెలుపును మించిన ఎఱుపుతో; ఘూర్ణమాన=తిరుగుచున్న; జల=నీటి యొక్క; భార=ప్రచండతతో-అతిశయముతో గూడిన; మహా+ఉదధి=గొప్పదగు సముద్రమునందలి; కాలకూట= కాలకూట మను పేరుగల విషము యొక్క; సంఘాట=సమూహమను? (సం-ఘట్=చేష్టాయాం. (ఆం.శ.ర)); కృపీట సంభవ=అగ్ని యొక్క; శిఖా=జ్వాలల; వికట=మిక్కిలి వంకరైన; స్ఫుట=స్పష్టమైన; విస్ఫులింగ=అగ్నికణముల; విస్ఫోట=పగులుటచేత; పవిత్ర=శుద్ధమైన; సద్భువన=శ్రేష్ఠమైన లోకములయందలి; భూత=ప్రాణుల యొక్క; భయ=భీతిని; అపహున్=పోగొట్టు (శివుని); ఆశ్రయించెదన్=ఆశ్రయింతును; మాటలు=ఇతర వచనములు; పెక్కులు=అనేకము; ఏటికిని=ఎందులకు?

భావము :- మహత్తరమగు సముద్రజలమును మందర పర్వతముతో చిలుకుటచేత జనించిన కాలకూట విషాగ్ని జ్వాలల విస్ఫులింగములకు సమస్త ప్రాణులు భయపడగా ఆ విషాగ్నిని మ్రింగి శంకరుడు భయమును పోగొట్టెను. అట్టి స్వామిని ఆశ్రయించెదను.

స్రగ్ధర॥ కౌక్షింభర్యంబు దీర్పం గడుపున కిడుదుం గాల సంప్రాప్త భిక్ష
సీక్షింతుం బోధభక్తి న్విషయముల మది న్నిస్పృహత్వంబు దాల్తున్
దక్షారామాధినాథున్ ధవళవరకరోత్తంస జూటా విటంకు
న్వీక్షింతు న్భీమనాథుం ద్రిభువన నమితు న్నేత్రముల్ తృప్తి పొందన్.200

అర్థము :- కౌక్షింభర్యంబు=పొట్ట నింపుకొనుటను - ఆకటిని; తీర్పన్=తీర్చుకొనుటకై; కడుపునకు=కుక్షికి; కాల=తగిన సమయమునందు; సంప్రాప్త=లభించిన; భిక్షన్=భిక్షాన్నమును; ఇడుదున్=పెట్టుదును; బోధ భక్తిన్=జ్ఞానముతో గూడిన భక్తితో; విషయములన్=ఇంద్రియార్థములను-వస్తువులను; వీక్షింతున్=చూచుదును; మదిన్=మనస్సులో; నిస్పృహత్వంబు=కోరికలు లేకుండుటను; తాల్తున్=ధరింతును; త్రిభువన=ముల్లోకములచేత; నమితున్=నమస్కరింపబడినట్టియు; దక్షారామ=దక్షారామమునకు; అధినాథున్=ప్రభువైనట్టియు; ధవళవరకర=శ్రేష్ఠములైన తెల్లని కిరణములు కల చంద్రుడు; ఉత్తంస=శిరోభూషణముగల; జూటా=జటాజూటము చేత; విటంకున్=సుందరుడైనట్టియు; భీమనాథున్=భీమేశ్వరుని; నేత్రముల్=కన్నులు; తృప్తిపొందన్=తృప్తిపడగా; వీక్షింతున్=దర్శింతును.

భావము :- ఆకలి తీరుటకు మధ్యాహ్నకాలమునందు లభించిన భిక్షను పొట్టకు పెట్టుదును. ఐహిక విషయములను జ్ఞానముతోడి భక్తితో దర్శింతును. మనస్సును కోరికలు లేకుండ చేయుదును. చంద్రుడను భూషణముతో సుందర జటాజూటముగలవాడును; త్రిలోకవంద్యుడును; దక్షారామాధిపతియునగు భీమేశ్వర స్వామివారిని దర్శింతును.

విశేషము :- స్రగ్ధరా వృత్తములో "మ, ర, భ, న, య, య, య" అను సప్తగణములుండును. ప్రతి పాదమునందును 1-8-15 అక్షరములు యతి స్థానములు.

శా॥ అష్టాశీతి సహస్ర సంయమి జన వ్యాకీర్ణ తీరద్వయీ
జుష్టో దంచిత సప్తసింధు సలిల స్రోతోవగాహక్రియా
తుష్ట స్వాంతుఁడనై భజింతుఁ గరుణా దుగ్ధాబ్ధి భీమేశ్వరున్
దృష్టాదృష్ట ఫల ప్రదాన విభవాధిష్ఠాన చేతస్కునిన్. 201

అర్థము :- అష్ట.....స్వాంతుఁడనై; అష్ట+అశీతి సహస్ర=ఎనుబది యెనిమిదివేల; సంయమిజన=మహర్షి సమూహముతో; వ్యాకీర్ణ=వ్యాపించిన; తీరద్వయీ=రెండు ఒడ్డులతో;

జుష్ట=సంపన్నమై; ఉదంచిత=ఎగజిమ్మబడిన; సప్త సింధు=సప్త గోదావరమునందలి; సలిల= నీటి యొక్క; స్రోతస్=ప్రవాహమునందలి; అవగాహ=స్నానము చేయుటయను; క్రియా= పనిచే; తుష్ట=సంతోషించిన; స్వాంతుఁడను+ఐ=మనస్సుగల వాడనై; దృష్ట.....చేతస్కునిన్; దృష్ట=కన్పించు-అనుభవములోనికి వచ్చునట్టియు; అదృష్ట=కన్పింపనట్టియు; ఫల= ఫలితములను; ప్రదాన=ఇచ్చుటయను; విభవ=వైభవమునకు; అధిష్ఠాన=ఆధారమైన; చేతస్కునిన్=మనస్సుగలట్టియు; కరుణా=దయకు; దుగ్ధ+అబ్ధి=పాలసముద్రమైన; భీమేశ్వరున్=భీమేశ్వరుని; భజింతున్=సేవింతును.

**భావము :-** సప్తగోదావర సరస్సు యొక్క రెండు యొడ్డులందును ఎనుబది యెనిమిది వేలమంది మహర్షులు వ్యాపించియుందురు. అట్టి ఆ సరః ప్రవాహమునందు స్నానము చేయుటచేత నా మనస్సు తృప్తినందును. కరుణా సముద్రుడును, భోగమోక్షముల నొసగుట యందే ఆసక్త మనస్కుడగు భీమేశ్వరస్వామిని సేవింతును.

**ఉత్సాహము॥ యక్ష సిద్ధ సాధ్య ఖేవిహార గరుడ కిన్నరా**
**ధ్యక్ష మణి కిరీట కోటి తరుణ కిరణమంజరీ**
**ప్రేక్షణీయ చరణ కమలు భీమనాథ దేవునిన్**
**దక్షవాటికా పురైక ధాము నాశ్రయించెదన్. 202**

**అర్థము :-** యక్ష.....కమలున్; యక్ష=యక్షుల; సిద్ధ=సిద్ధుల; సాధ్య=సాధ్యుల; ఖేవిహార=ఆకాశ సంచారుల; గరుడ=గరుడుల; కిన్నర=కిన్నరుల యొక్క; అధ్యక్ష= అధికారుల; మణి=మణులతోడి; కిరీట=కిరీటముల యొక్క; కోటి=అంచులందలి; తరుణ= నవములైన; కిరణ=కిరణములనెడి; మంజరీ=పూలగుత్తులతో; ప్రేక్షణీయ=దర్శింపదగిన; చరణకమలున్= పాదపద్మములు గలట్టియు; దక్షవాటికా=దక్షారామమను; పుర=పట్టణమే; ఏక=ప్రధానమైన; ధామున్=నివాస స్థానముగాగల; భీమనాథ దేవునిన్=భీమేశ్వరస్వామిని; ఆశ్రయించెదన్= ఆశ్రయింతును.

**భావము :-** యక్షులు, సిద్ధులు, సాధ్యులు, దేవతలు, గరుడులు, కిన్నరులు అను వారల అధిపతులు నమస్కరించునప్పుడు వారి కిరీటములలోని మణుల కాంతులు భీమేశ్వర స్వామి వారి పాదపద్మములపై పడిన పూలగుత్తులవలె సుందరములై దర్శింపదగి యుండును. అట్టి దక్షారామ నివాసియగు భీమేశ్వరస్వామివారి నాశ్రయింతును.

**విశేషము :-** ఉత్సాహము :- ప్రతి పాదమున 7 సూర్యగణములు(హ,న) తుద గురు వుండవలెను. 4 గణములపై (అనగా 5వ గణము మొదటి అక్షరము) యతి. ప్రథమ పాదముననున్న హగణ నగణ క్రమమే తక్కిన మూఁటిలో నుండవలెనను నియమము లేదు.

ఇచ్చ వచ్చినట్లు సూర్యగణ ద్వయము కూర్పవచ్చు. రెండు గణములు కలిసి యుండవలెను. ఏకగణము మాత్రము రచితము కారాదు. ఉత్సాహము వృత్తము కాదు. (ఛందో రీతులు- పుట - 152 - రావూరి దొరసామి శర్మ.)

ఉత్సాహము॥ నిష్ఠతో భజింతు భీమునిన్ భుజంగ హారునిన్
దిష్ఠుని న్రవీంద్ర సంప్రతిష్ఠునిం గరిష్ఠు భూ
యిష్ఠు దక్షవాటికా స్థలీశు దేవతాకుల
జ్యేష్ఠుని న్వసిష్ఠ ముఖ్య శిష్ట ముని జనార్చితున్. 203

అర్థము :- భుజంగ=పాములు; హారునిన్=మాలికలైనట్టియు; తిష్ఠునిన్=స్థిరముగా నుండునట్టియు; రవి=సూర్యునిచేత; ఇంద్ర=ఇంద్రునిచేత; సంప్రతిష్ఠునిన్=నిలుపబడి నట్టియు; గరిష్ఠునిన్=మిక్కిలి శ్రేష్ఠుడైనట్టియు; భూయిష్ఠునిన్=బహుతరుడైనట్టియు; దక్షవాటికా=దక్షారామమను; స్థలీ+ఈశున్=ప్రదేశమునకు ప్రభువైనట్టియు; దేవతాకుల= దేవతల వంశ(సమూహ)మునకు; జ్యేష్ఠునిన్=పెద్ద అయినట్టియు; వసిష్ఠముఖ్య=వసిష్ఠుడు మున్నగు; శిష్ట=పవిత్రమైన-విధేయతగల; మునిజన=మునుల సమూహముచేత; అర్చితున్= పూజితుడగు; భీమునిన్=భీమేశ్వరుని; నిష్ఠతోన్=పట్టుదలతో; భజింతున్= సేవింతును.

భావము :- సర్పహారుడును, సుస్థిరుడును, సూర్యుడు, ఇంద్రుడు అను దేవతా ద్వయముచే ప్రతిష్ఠితుడును, సర్వశ్రేష్ఠుడును, సమృద్ధుడును, దక్షారామాధిపతియు, దేవ సమూహమునకు జ్యేష్ఠుడును, వసిష్ఠాది ముని సముహముచే పూజితుడును నగు భీమేశ్వరస్వామిని నిష్ఠతో సేవింతును.

విశేషము :- శ్రీనాథ మహాకవి, ఈ సందర్భమున ఉత్సాహ ఛందములో రచించుట వలన, వ్యాసుని భక్త్యుత్సాహము సూచింపబడినది.

లయగ్రాహి॥ నేమమున మ్రొక్కెదను హేమగిరి చాపునకు,
సామజ జలంధర ముఖామర విరోధి
గ్రామ మద హారి, కభిరామ శుభనిర్మల సు
ధామయ శరీరునకుఁ గ్రామిత వితీర్ణ
శ్రీ మహిమ శాలికి, జరామరణ దోష పరి
శామక నిజాంఘ్రి యుగళీమతికి, దక్షా
రామ పుర ధామునకుఁ గోమల జటా ముకుట
ధామ హిమధామునకు, భీమునకు భక్తిన్. 204

అర్థము :- హేమగిరి=మేరుపర్వతము; చాపునకు=ధనుస్సుగా గలట్టియు; సామజ..... హారికి; సామజ=గజాసురుడు; జలంధర=జలంధరుండు; ముఖ=మొదలైన; అమర విరోధి= దేవతా శత్రువులగు రాక్షసుల; గ్రామ=సమూహము యొక్క; మదహారికిన్=గర్వమును హరించి నట్టియు; అభిరామ=మనోహరమైన; శుభ=మంగళకరమైన; నిర్మల=స్వచ్ఛమైన; సుధామయ= అమృతమయమగు; శరీరునకున్=దేహముగలట్టియు; కామిత=కోరికలను; వితీర్ణ= ఇచ్చుటయను; శ్రీ=సంపద యొక్క; మహిమ=గొప్పతనముచేత; శాలికిన్= ప్రకాశించునట్టియు; జరా.....మతికి; జరా=ముసలితనము; మరణ=మృత్యువు అను; దోష= దోషములను; పరిశామక=ఉపశమింపజేయు; నిజ=తన; అంఘ్రి యుగళీ=పాదముల జంటయందు; మతికి=మనస్సున్నవాడు గలట్టియు; దక్షారామ=దక్షారామమను; పుర=పట్టణము; ధామునకు=నివాసముగా గలట్టియు; కోమల.....ధామునకు; కోమల=మృదువైన; జటామకుట=కిరీటము వంటి జడలే; ధామ=నివాసముగాగల; హిమధామునకున్=(చల్లని కిరణములుగల) చంద్రుడుగల; భీమునకు=భీమేశ్వరస్వామికి; నేమమునన్=నియమముతో; భక్తిన్=భక్తితో; మ్రొక్కెదను=నమస్కరింతును.

భావము :- భీమేశ్వరస్వామిని భక్తితో నియమపూర్వకముగా నమస్కరింతును. ఆయన మేరుధన్వుడు. గజాసుర జలంధరాదులగు రాక్షసుల మదమణచినవాడు. మనోహరా మృతమయ శరీరుడు. భక్తాభీష్టప్రదుడు. తన పాదములకు నమస్కరించిన వారికి జరామరణాదులను బోగొట్టువాడు. దక్షారామ నివాసి. మృదులములగు ఆయన జటా జూటముపై చంద్రుడున్నాడు.

విశేషము :- లయగ్రాహి మాలికావృత్తము. ఉద్ధుర మాలావృత్తమనియు, ఉపరి వృత్తమనియు కూడనందురు - ప్రతిపాదమున 39 మాత్రలు. 30 అక్షరములుండును. "భజసనభజసనభయ" అను పది గణములుండును.

8+8+8 పై ప్రాసయతులుండవలెను. యతి యుండదు. పాద ద్వితీయాక్షర ప్రాసతో కలిపి ప్రతి పాదమునకు నాలుగు ప్రాసములుండును. ద్వితీయాక్షర ప్రాస నాల్గు పాదములందు సమముగాన ఈ పద్యమందు నాల్గు పాదములందు కలిపి 16 స్థానములలో ప్రాస మైత్రి నిలుపవలసియుండును. (ఛందోరీతులు-పు-128, 129 - రావూరి దొరసామి శర్మ.)

**సీ॥ కొలుతు సద్యోజాతుఁ గోమలైందవ తనుఁ**
**పెద్ద గుబ్బలి రాజు పెండ్లికొడుకు;**
**సేవింతు శ్రీవామదేవు మహాదేవు**
**నేడు లోకంబులు నేలు తేనిఁ;**

గ్రహ=సూర్యాదిగ్రహములు; తారక=నక్షత్రములు;ఎవ్వని=ఏ దేవుని; ఆజ్ఞన్= అనుమతితో; నిక్కముగన్=నిస్సంశయముగా; వర్తిల్లును=నడచుకొనునో; అట్టి=అటువంటి; దేవరకుఁగాక=దేవునికి కాక;

యత్=ఎవరి యొక్క; ఆజ్ఞా శక్తిన్=అనుమతి యొక్క సామర్థ్యముతో, మనువులు= మనువులు; పదునాల్గురును=పదునాల్గు మందియు; వర్తింతురు=ఉందురో; అట్టి దేవరకున్= అట్టి దేవునకు; కాక=కాక;

యత్=ఎవరియొక్క; భ్రూలతా=తీవెలవంటి కనుబొమల; ఆజ్ఞాయుక్తిన్=ఆజ్ఞతో గూడి; భువన పాలకులు=లోక రక్షకులు; వర్తింతురు=ప్రవర్తిల్లుదురో; అట్టిదేవరకున్= అటువంటి దేవునకు; కాక=కాక.

ధూర్జటికిన్=జటాభారము దాల్చు శివునకు; కాక=కాక; భీమనాథునకున్=భీమేశ్వరునికి; కాక=కాక; నిఖిల=సమస్తమైన; కారుణ్యా=దయకు; కల్యాణ=మంగళములకు; నిధికిన్=తావైన వానికి; కాక=కాక; అధిక భక్తిన్= మిక్కుటమగు భక్తితో; అన్యదైవంబులకున్=ఇతర దేవతలకు; కర+అంబుజ=హస్త పద్మములతో గూడిన; అంజలి పుటంబు=దొన్నెవంటి దోసిలిని; ఏల= ఎందులకు; సంఘటింతున్=బాగుగా కూర్చుదును?

భావము :- పదునాలుగు లోకములను తన యాజ్ఞతో ప్రవర్తింపజేయువాడును, సూర్యాది గ్రహములను తారకములను తన అనుమతితో నడచునట్లుచేయువాడును; పదునలువురు మనువులను తన సమ్మతి బలముతో నడచునట్లు చేయువాడును, నిఖిల భువన పాలకులను తన కనుబొమల కదలికలతో ప్రవర్తిల్లజేయువాడును, దయకు, మంగళము లకు నిధియు, ధూర్జటియగు భీమేశ్వరునికి దప్ప తక్కిన దేవతలకు అధిక భక్తితో ఏల దోసిలొగ్గుదును?

విశేషము :- భూలోకాదులేడును, అతలాదులు ఏడును, పదునాలుగు లోకములు. సూర్య, చంద్ర, కుజ, రాహు, గురు, శని, బుధ, కేతు శుక్రులు నవగ్రహములు.

స్వాయంభువు, స్వారోచిషుడు, ఉత్తముడు, తామసుడు, రైవతుడు, చాక్షుషుడు, వైవస్వతుడు, సావర్ణి, బ్రహ్మ సావర్ణి, రుద్రసావర్ణి, మేరు సావర్ణి, దక్ష సావర్ణి, భౌత్యుడు, రౌచ్యుడు అను పదునలువురు మనువులు. వీరి కాలమును మన్వంతరమందురు. ప్రస్తుతము నడచుచున్నది సప్తమమగు వైవస్వత మన్వంతరము.

ఇంద్ర, అగ్ని, యమ, నిరృతి, వరుణ, వాయు, కుబేర ఈశానులు ఎనిమిది మంది అష్ట దిక్పాలకులు - వీరే భువన పాలకులు.

కం॥ క్షమియింపు భీమనాయక!
కమల భవాద్యమరరాజ కాంచన మకుటీ
సముదయ మణి ఘృణి రేఖా
కమనీయ పదాంబు జోపకంఠోద్దేశా! 207

అర్థము :- కమల.....ఉద్దేశా!; కమల భవ=(పద్మమునందు జన్మించిన) బ్రహ్మ; ఆది=మొదలగు; అమరరాజ=దేవతా శ్రేష్ఠుల యొక్క; కాంచన=స్వర్ణ మయమగు; మకుటీ= కిరీటముల యొక్క; సముదయ=సమూహమునందలి; మణి=మణుల యొక్క; ఘృణి= వెలుగుల; రేఖా=పంక్తిచేత; కమనీయ=అందమయిన; పద+అంబుజ=పాదపద్మము; ఉప కంఠ+ఉద్దేశా=సమీప ప్రదేశముగల; భీమనాయక=భీమేశ్వరా! క్షమియింపు=మన్నింపుము.

భావము :- బ్రహ్మ మున్నగు దేవశ్రేష్ఠులు బంగారు కిరీటములలోనున్న మణుల కాంతులతో అందమయిన పాదపద్మ సమీప ప్రదేశముగల భీమేశ్వరా! మన్నింపుము.

క॥ కావుము దక్షారామ పు
రీ వల్లభ! భీమనాథ! త్రిజగదధీశా!
కైవల్య భోగలక్ష్మీ
ప్రావీణ్యప్రదకటాక్ష! భక్తాధీనా! 208

అర్థము :- దక్షారామ=దక్షారామమను; పురీ=పట్టణమునకు; వల్లభ=పతీ; త్రిజగత్= ముల్లోకములకు; అధీశా=ప్రభూ!; కైవల్య.....కటాక్ష; కైవల్య=మోక్షము; భోగ= సుఖము అనెడి; లక్ష్మీ=సంపదలందు; ప్రావీణ్య=సామర్థ్యమును-నేర్పును; ప్రద=ఇచ్చునట్టి; కటాక్ష= క్రీగంటి చూపులు గలవాడా! భక్త+అధీనా=భక్తులకధీనుడా!; కావుము=రక్షింపుము.

భావము :- దక్షారామపతీ! త్రిలోకనాథా! ముక్తి సౌఖ్య సంపదలందు ప్రావీణ్యమునిచ్చు కటాక్షము గలవాడా! భక్తులకధీనుడా! భీమేశ్వరా! రక్షింపుము.

క॥ కృప గల్గి భీమనాయక!
యపరాధము సైఁచు తండ్రి వౌదో కావో!
కృప గల్గి సుతుఁడు చేసిన
యపరాధము తండ్రి సైఁచు టర్థంబె కదా!" 209

అర్థము :- భీమనాయక=భీమేశ్వరా! కృప=దయ; కల్గి=కలిగి; అపరాధము=తప్పును; సైఁచు=క్షమించు; తండ్రివి=జనకుడవు; ఔదో=అగుదువా! కావో=కావా!; తండ్రి=జనకుడు;

కృప=దయ; కల్గి=కలవాడై; సుతు(డు=కుమారుడు; చేసిన=చేసినట్టి; అపరాధము=తప్పును; సై(చుట=క్షమించుట; అర్హంబు+ఎ=తగినదే; కదా=కాదా!

భావము :- భీమేశ్వరా! నీవు దయతో తప్పులను మన్నించి తండ్రివగుదువా? కాదా? పుత్రుడు చేసిన తప్పులను తండ్రి దయతో క్షమించుట సముచితము గదా!"

**వ॥ అని ప్రార్థించి భక్త్యావేశంబున గద్గద స్వరకంఠుండును; బాష్పాకుల లోచనుండును; రోమాంచ పటల కంచుకిత నిఖిలావయవుండునై వెండియును. 210**

అర్థము :- అని=అని; ప్రార్థించి=ప్రార్థన చేసి; భక్తి=భక్తి యొక్క; ఆవేశంబునన్= పూనకముతో - వ్యాప్తితో; గద్గద స్వర=డగ్గుత్తిక పడిన స్వరముగల; కంఠుండును=గొంతు కలవాడును; బాష్ప=ఆనందము వలన గలిగిన కన్నీటితో; ఆకుల=నిండిన; లోచనుండును= కన్నులు గలవాడును; రోమాంచ=పులకల యొక్క; పటల=సమూహముచేత; కంచుకిత= కంచుకము (కవచము) గానైన; నిఖిల=సమస్తమయిన; అవయవుండును=అంగములు గలవాడును; ఐ=అయి; వెండియును=మఱల; (ఇట్లనెను).

భావము :- అని ప్రార్థించిన వ్యాస మహర్షికి భక్తి ఆవేశించుటచేత కంఠము బొంగురు పోయినది. కన్నులు ఆనంద బాష్పములతో నిండినవి. సమస్త దేహము పులకాంకురమను కవచము దాల్చినది. శరీరమంతయు పులకించినది. (ఆయన మఱల నిట్లు భీమేశ్వరుని స్తుతించెను).

**సీ॥ గరళకూట వినీల కంఠాయ శంభవే**
**మదనాంతకా యోం నమశ్శివాయ**
**కాద్రవేయాధిప గ్రైవేయ భూషాయ**
**మధుభిత్సఖా యోం నమశ్శివాయ**
**కుంభినీ ధరసుతా కుచకుంభ పరిరంభ**
**మహలోలుపా యోం నమశ్శివాయ**
**వేదాది నిశ్శేష విద్యావధూమాళి**
**మణికలాపా యోం నమశ్శివాయ**

**తే. గంధ దంతావళ జలంధరాంధకాది**
**విబుధ పరిపంథి వాహినీ నిబిడ వర్గ**
**బంధ ఘోరాంధకార సంభార కిరణ**
**మాలినే శాశ్వతా యోం నమశ్శివాయ. 211**

**అర్థము** :- గరళకూట=హాలాహలమను విషముచేత; వినీల=బాగుగ నల్లనైన; కంఠాయ=కుత్తుకగలట్టియు; శంభవే=శుభమును గలిగించు నట్టియు; మదన=మన్మథునకు; అంతకాయ=యముడైన; ఓం= ఓంకారరూపుడైన; శివాయ=శివునికి; నమః=నమస్కారము.

కాద్రవేయ=కద్రువపుత్రులగు సర్పములకు; అధిప=రాజగు వాసుకి; గ్రైవేయ= మెడకు సంబంధించిన, భూషాయ= అలంకారమైనట్టియు; మధుభిత్=మధువను రాక్షసుని ఖండించిన విష్ణువు; సఖాయ=మిత్రుడుగాగల; ఓం నమశ్శివాయ.

కుంభినీధర=(భూమిని దాల్చు పర్వతమగు) హిమవంతుని; సుతా=పుత్రికయగు పార్వతి యొక్క; కుచకుంభ=కడవలవంటి స్తనములను; పరిరంభ=కౌగలించుకొనుటయను; మహ=ఉత్సవము-సంతోషము నందు; లోలుపాయ=లోలుడైన ఓంనమశ్శివాయ.

వేద....కలాపాయ; వేద+ఆది=వేదములు మున్నగు; నిశ్శేష=సమస్తమైన; విద్యా= విద్యలనెడి; వధూ=స్త్రీ యొక్క; మౌళి=శిరస్సునందలి; మణి=మణుల; కలాపాయ= సమూహము-అలంకారముగల; ఓం నమశ్శివాయ.

గంధ....మాలినే; గంధ దంతావళ=మత్త గజాసురుడు; జలంధర=జలంధరుడు; అంధక=అంధకుడు; ఆది=మొదలగు; విబుధ=దేవతలకు; పరిపంథి=శత్రువుల; వాహినీ=సేనలచేత; నిబిడ=దట్టమైన; వర్గ=సమూహముల; బంధ=కలియుటచే గలిగిన; ఘోర=భయంకరమగు; అంధకార=దట్టమగు చీకటి యొక్క; సంభార=రాశికి; కిరణమాలినే= సూర్యుడైనట్టియు; శాశ్వతాయ=నిత్యుడైన; ఓం నమశ్శివాయ.

**భావము** :- హాలాహల పానముచే నీలకంఠుడు, మదనాంతకుడు, వాసుకి కంఠాభరణ మైనవాడు, విష్ణు మిత్రుడును, పార్వతి నాలింగన మొనర్చుకొని ఆనందించు వాడును, వేదాది సమస్త విద్యాదేవి శిరోమణుల కలాపము గలవాడు, గజాసుర జలంధరాంధకాసురులు, మున్నగు దేవ శత్రువుల దట్టమగు సైన్యములను మహాంధకారమును పోగొట్టు సూర్యుడగు ఓంకారరూప శివునకు నమస్కారము.

**విశేషము** :- సంస్కృత భాషలో తెలుగు సీసపద్యము వ్రాయుట గమనార్హము. శ్రీనాథునకు పూర్వులైన పాల్కుఱికి సోమనాథుడు, నాచన సోమనాథుడు ఇట్టి ప్రయోగములు చేసినారు.

అలంకారము - రూపకము.

**వ. ఓం జయ! జయ! దేవదేవ! గంధర్వ సిద్ధ విద్యాధర చారణ కిన్నరకింపురుష లహంపూర్వికా సంపుల్ల పుటంబులగు చేతస్సంపుటంబులఁ బుటపుటనగు భక్తి**

విశేషంబుల శేషాహికటక భూషావిశేషాభిరామంబులగు మీ కోమల శ్రీ పాదకిసలయం బుల ఘుసృణమణికోటీర కోటీవిటంక సందానితమందారమాలికా మరందబిందు ధారా ధోరణీ ప్రవాహంబుల నహరహంబు నభిషేకింతురు; కంఠేకాలా! మీ కంఠమూలంబునం గలువ దండ కైవడిం గనుపట్టు కరాళకాలకూట విషమషీ కళంకపంక చ్ఛాయాచ్ఛటాగుళుచ్ఛంబుల వలన నిఖిల లోకసంరక్షణంబు నిగమ వ్యాఖ్యాతంబు; మహానటా! మీ జటాజూట పటలంబున డిగిన వియద్గంగా నిర్ఝర స్రోతశ్శలాకా నికాయంబులఁ ద్రిలోకీ కంఠోపకంఠంబులు తారహారవల్లీ మతల్లి భంగి నంగీకరించు. శంకరా! నీవు సంకర్షణ రుద్రావతారంబునఁ బాతాళ గోళంబు వెడలి విషదహన విస్ఫులింగ వికట దంష్ట్రాటంక కిటకిటత్కార ఘోరంబును, జిహ్మాలంబును నగు వదన గహ్వరంబునఁ బుండరీక భవాండ పిండంబు లొండొండ యణంగఁ గమిచి మ్రింగుదు; ధూర్జటీ! విలయ పర్జన్య గర్జాడంబరంబును విడంబించు కహకహాట్టహాసంబునన్ బిట్టు ధట్టించి యవష్టంభ సంభార దుర్వార గర్వారంభ సముజ్జృంభితుండగు జంభారిభుజార్గళా విజృంభణంబు హస్తధృత దంభోళితోడ సంస్తంభించితి. ధనదసఖా! నిఖిల కకు బవధి వలయంబులఁ గలయఁ గనత్కనక నఖ శలాకా నికాయచ్ఛాయాదాయాదంబులగు సముజ్జ్వల జ్వాలా జాలంబులు విజృంభింప ననలస్తంభ దివ్యలింగాకారంబున నావిర్భవించి నీవు భూభువన చక్రవాళ పర్యంతం బాక్రమించి పెరిగినప్పుడు విరించి రాయంచయుఁ గైటభారి కిటియునునై యెగసి యుడిగియును దుదమొదలుఁ దెలియరైరి; రుద్రా! నీవు భద్ర దేవదారు ద్రుమాటవీవాటియందు దిసమొల దూబఱ దిండి మిండజంగంబవై ఋషుల పుణ్యాంగనల యీలువు లపాంగ రంగస్థలీ లాస్యలంపటంబులగు కటాక్షవీక్షణంబుల హరించుచు భిక్షాటన క్రీడను నటించితి; చండీశ్వరా! నీవు మేరుకోదండంబునఁ బుండరీకాక్ష కాండంబు దొడిగి కుండలి జ్వాలా వల్లరీ ఝల్లరీ ఝుంకారంబునఁ బంకరుహభవాండంబు బీఁటగిల నిశాట పుటభేదనంబు లొక్క యేటున ఛటచ్ఛటనేసితివి; నీలలోహితా! యహరహోవధి సంధ్యాసమయారంభంబుల నుద్దేశదినావసానంబుల సానందంబుగాఁ బరిఢవించు జగఝుంకారంబైన యారభటీ తాండవ సముద్దండ పాదభ్రమణ విభ్రమంబునఁ ద్రిభువన భీకరంబు గావించితి; సర్వజ్ఞా! నిర్వికల్పంబు నిరస్త సమస్తోపాధికంబును సత్య జ్ఞానానందంబునకు

నికేతనంబుననగు నిష్కలంక స్వరూపంబును వేదానువచన శాంతి దాంతి క్షాంతి శ్రవణ నిదిధ్యాసనాదులగు సాధనంబుల నిర్నిరోధ నిరవగాఢ నిరవబోధ కక్ష్యా విభాగంబునం దక్షీభవించి ముముక్షువులు లాభలక్ష్యంబును నభీక్షణంబును, నభీప్సితంబును ననుభవింతురు. భర్గా! భార్గవ భృగ్వాంగిరస ప్రధాన నానాముని సమూహ విహిత చరితాఘమర్షణ స్నానాహ్నికౌఘయు నిజజలావగాహపహ నిఖిలాఘయు జాహ్నవీ సపత్నియు నగు గోదావరీ మహానది నీకుం గేళి విహారంబగు కేళాకూళి; నిటలనయనా! గిటగిటని నడుగునడుగునడుఁకు నడుములు వెణఁదలగు తెలికన్నులును నెఱికురులును వలుదకుచములును గలిగి ననవిల్తునకుఁ బసగల పసిండి మెఱుంగు ములుకు లనం గలికి చిలుకల కొలుకులగు బిసరుహ దళనయనలు ముసురుకొని బలసి నిలిచికొలువఁ బ్రతిసంక్రమణ వారోత్సవాదుల యందుఁ బేరోలగంబవధరింతువు. శర్వా! నీవుశర్వరీ సార్వభౌము నొక్కహజ్జున గుజ్జుఱుక మట్టితివి. బిసరుహభవుని కిసల యోష్ఠినాసికాతిల ప్రసూనంబు నఖశిఖరాగ్రంబున మొదలంటం జిదిమితి; వృషభధ్వజా! నీవు పూషుండను పేరి రవిపండ్లు రాలఁగొట్టితివి; యీశ్వరా! నీవు వైశ్వానరుని సప్తజిహ్వా పల్లవంబులు పెల్లగిల గిల్లితి; విరూపాక్షా! నీవు దక్షప్రజాపతి కంఠంబున మేషంబుతల నిల్పితివి; మృగవ్యాధా! నీ వధ్వర మృగంబు మస్తకంబు నభస్తలంబున వ్రేలఁగట్టితి; ముక్కంటీ! నీకు మ్రొక్కెదను; శివా! నీకు సేవాంజలి; భవా! నీ కభివాదనంబు; పాండురాంగా! నీకు దండంబు; రాజశేఖరా! నీకు జేజే; హరా! నీకు జోహారు; గిరీశా! నీకు వరివస్య; యష్టమూర్తీ! నీకుఁ బ్రతిష్ఠ. యీశానా! నీకు దాస్యంబు. త్రిపురహరా! నీకుపాసన; మృడా! నీకు శరణు; మృత్యుంజయా! నీకుఁ బ్రపత్తి; ప్రమథాధిపా! నీకు నారాధనంబు; పినాకీ! నీకు నమస్కారంబు; కైలాసనిలయా! నీకుఁ గొలువు; పశ్యల్లలాటా! నీకు నేటికోళ్ళు; గౌరీమనోహరా! నీకు నమస్కారంబు; జయజయ జలంధరాంతకా! గంధ సింధురాది దనుజ కంధరా పీఠధమనీ గళిత రక్తధారాభిషిక్త ప్రచండ ఖండ పరశు భిండివాలశూల ప్రముఖ బహువిధ ప్రహరణ పరంపరాభీల మహాకారా! జయజయ! జగత్సంభారకుంభ కల్పనా కుంభకారా! కుంభీనస భూషణ! భీషణ భూతప్రేత పిశాచ శాకినీ డాకినీ ప్రౌఢపరివారా! జయజయ! వియద్వాయుధరణీ తరణి శీతభాను బృహద్భాను సలిలయజమానమూర్తి కల్పితాష్టభేద ప్రపంచిత విశ్వప్రపంచ!

పంచవదన పంచాక్షరీ మూలమంత్రకారణ పాంచభౌతిక వ్యవహారా! నిర్మల జ్యోతిర్లింగమయమంగళాకారా! జయజయ! సప్తపాతాళ భువన విష్కంభ నిర్భేదన సమాసాదితావిర్భావ! భావజసంహారా! సర్వమంగళాకుచకలశ పాళీకేళీతూలికాకార మకరికా ముద్రికా భీమ ముద్రితోరః ప్రదేశ! మహేశ! జయజయ! భక్త భావనాసులభ! స్వభావనాతీత పావనాకార ధావళ్య విగ్రహా! శ్రీమన్మహాదేవ! దేవతారాధ్య! దక్షవాటీపురాధ్యక్షా! ఆపద్ధ్వాంత దివాకరా! పరమ దయాకరా! జయజయ భీమేశ్వరా! నమస్తే నమస్తే నమ". 212

అర్థము :- ఓం=ప్రణవరూపా. జయజయ=జయము జయము; దేవదేవ=దేవతలకు దేవుడవయినవాడా! గంధర్వ....కింపురుషులు; గంధర్వ=గంధర్వులు; సిద్ధ=సిద్ధులు; విద్యాధర=విద్యాధరులు; చారణ=చారణులు; కిన్నర=కిన్నరులు; కింపురుష=కింపురుషులు; అహం పూర్వికా=నేను ముందనగా నేను ముందని; సంఫుల్ల=బాగుగా వికసించిన; పుటంబులు+అగు=(డొప్పలు) రేకులు గల; చేతస్+సంపుటంబులన్=మనస్సులనెడి అంజలులతో; పుట పుటన+అగు=అధికమగుచున్న; భక్తి విశేషంబులన్=విశేషమగు భక్తితో; శేష+అహి=ఆదిశేషుడను సర్పము; కటక=బంగారు కడియము; భూషా విశేష=విశిష్టమగు నలంకారముతో; అభిరామంబులు+అగు=మనోహరములగు మీ=మీయొక్క కోమల=మృదువైన, శ్రీ=శోభగల; పాదకిసలయంబులన్=చివురుటాకుల వంటి పాదములను. ఘుసృణ=కుంకుమ పూవుతోడి; మణికోటీర=మణులు గల కిరీటముల యొక్క; కోటీవిటంక=ఉన్నతములగు చివరలయందు; సందానిత=కూర్పబడిన. మందారమాలికా=మందార పుష్పముల దండల యందలి; మరంద=మకరందము యొక్క; బిందు=బిందువుల; ధారా ధోరణీ=ధారల పంక్తుల. ప్రవాహంబులన్=వెల్లువలతో: అహరహంబున్=ప్రతిదినమును: అభిషేకింతుము=అభిషేకము చేయుదుము.

కంఠేకాలా=గొంతునందు నల్లదనము గల శివా! మీ=యొక్క; కంఠమూలంబునన్=గొంతు యొక్క మొదటియందు; కలువదండకైవడిన్=కలువపూవుల మాలికవలె; కనుపట్టు=అగుపించు; కరాళ=భయము కలిగించు; కాటకూట=హాలాహలమను, విష=గరళము యొక్క; మషీ=కాటుక వంటి: కళంకపంక=చిహ్నమనెడి బురద యొక్క: ఛాయా=నల్లదనము-రంగు యొక్క; ఛటా=కాంతియనెడి: గుళుచ్ఛంబుల వలన=గుత్తులవలన; నిఖిల=సమస్తమైన; లోకరక్షణంబు=జగత్తులను కాపాడుట: నిగమ=వేదములచేత: వ్యాఖ్యాతంబు=చెప్పబడినది.

మహానటా=నటశ్రేష్ఠుడవగు శివా; మీ=మీయొక్క: జటాజూట=కపర్దమనెడి: పటలంబున=కప్పునుండి: డిగిన=దిగిన: వియద్గంగా=ఆకాశగంగ యొక్క. నిర్ఝర=సెలయేళ్ళ

స్రోతస్=ప్రవాహములనెడి; శలాకా=సన్నని లోహపు కడ్డీల (తీగలు); నికాయంబులన్= సమూహములతో; త్రిలోకీ=ముల్లోకముల; కంఠ=గొంతుల యొక్క, ఉపకంఠంబులు=సమీప ప్రదేశములు; తారహార=మంచి ముత్యాల దండల; వల్లీమతల్లి=శ్రేష్ఠమగు తీగెల, భంగిన్= రీతిని; అంగీకరించు=స్వీకరించును

శంకరా=సుఖము గలిగించు శివా; నీవు=నీవు, సంకర్షణా=సంకర్షణుడను పేరుగల; రుద్రావతారంబునన్=రుద్రుని అవతారమునందు, పాతాళ గోళంబు=పాతాళమను మండల మును; వెడలి=బయలుదేరి; విషదహన=విషాగ్నుల; విస్ఫులింగ=నిప్పుల వంటి; వికట= భయంకరమైన; దంష్ట్రాటంక=ఉలులవంటి కోరల=(దంతముల); కిటకిటత్కార=పటపట కొరకుటచేత; ఘోరంబును=భయంకరమును; జిహ్మలంబును=వంకరయైనది-మందమైనది; వదనగహ్వరంబునన్=గుహవంటి నోటితో; పుండరీక భవ+అండపిండంబులు=బ్రహ్మాండము లనెడి ముద్దలను; ఒండు+ఒండ=పరస్పరము; అణంగన్=అడగిపోవగా; కమిచి=నలుగగొట్టి- (అతిశయించి); మ్రింగుదు=మ్రింగివైచెదవు.

ధూర్జటీ=జటాభారము దాల్చుశివా! విలయ=ప్రళయకాలము నందలి; పర్జన్య= మేఘుని యొక్క; గర్జా+ఆడంబరంబును=ఉరుము యొక్క ఔద్ధత్యమును; విడంబించు= అనుకరించు; కహకహ=(ధ్వన్యనుకరణము) కహకహయను; అట్టహాసంబునన్=పెద్దనవ్వుతో; బిట్టు=అధికముగా, ధట్టించి=అదలించి; అవష్టంభ=కోపము యొక్క; సంభార=సమకూర్చు కొనుటచేత; దుర్వార=అడ్డుకొన వీలుగాని; గర్వ=పొగరు యొక్క; ఆరంభ=ప్రారంభము చేత; సముజ్జృంభితుండు+అగు=తీవ్రముగా చెలరేగినవాడగు; జంభ+అరి=(జంభుడను రాక్షసునికి శత్రువగు) ఇంద్రుని: భుజ+అర్గళా=గడియ కఱ్ఱవంటి బుజము యొక్క; విజృంభణంబు= వ్యాప్తిని-తీవ్రతను: హస్తధృత=చేతదాల్చిన; దంభోళితోడన్=వజ్రాయుధముతో గూడ; సంస్తం భించితి=కదలకుండునట్లు చేసితివి.

ధనదసఖా!=కుబేరునిమిత్రుడవగు శివా!; నిఖిల=సమస్తమయిన, కకుప్+అవధి= దిక్కుల మేరలను, వలయంబులన్=చుట్టునుగల; కలయన్=వ్యాపింపగా; కనత్=ప్రకాశించు చున్న; కనకనఖ=లోపములేని బంగారు; శలాకా=కడ్డీల; నికాయ=సమూహము యొక్క, ఛాయా=కాంతికి; దాయాదంబులు=సమానములు; అగు=అయినట్టి; సముజ్జ్వల=మిక్కిలిగా వెలుగుచున్న; జ్వాలా జాలంబులు అగ్నిశిఖల సమూహములు, విజృంభింపన్=రేగగా, అనలస్తంభ=అగ్నిస్తంభమువలె; దివ్య=పవిత్రమైన; లింగ+ఆకారంబునన్=లింగము యొక్క ఆకృతితో; ఆవిర్భవించి=అవతరించి. నీవు=నీవు; భూభువన=భూలోకము నుండి: చక్రవాళ పర్యంతంబు=భూమిని చుట్టుకొనియున్న కొండవఱకు; ఆక్రమించి=ఆక్రమించి. పెరగి

నప్పుడు=పెరిగిన సమయములో; విరించి=బ్రహ్మ; రాయంచయున్=హంసమును; కైటభ+అరి=కైటభుని శత్రువగు విష్ణువు; కిటియును=శ్వేతవరాహమును; ఐ=అయి; ఎగసి=పైకి (క్రిందికి) వెళ్ళియు, ఉడిగియును=విరమించియును; తుద మొదలున్= అంతమును ఆదిని; తెలియరైరి=తెలిసికొనలేకపోయిరి.

రుద్రా!=శివా!; నీవు=నీవు; భద్ర=మంగళకరమగు; దేవదారుద్రుమ=దేవదారువులను చెట్లతో గూడిన; అటవీవాటియందు=అరణ్య ప్రదేశమునందు; దిసమొల=దిగంబరముగా; దూబఱదిండి=దుష్టుడగు; మిండజంగంబవు+ఐ=విటుడైన జంగమదేవరవై, ఋషుల=మహర్షుల యొక్క; పుణ్యాంగనల=పవిత్రలగుభార్యల; ఈలువులు=మంచినడతలు-పాతివ్రత్యములు; అపాంగ=కడకన్నులనెడు; రంగస్థలీ=నాట్యశాలయందలి; లాస్య=నృత్యము నందు; లంపటంబులు+అగు=ఆసక్తములగు, కటాక్షవీక్షణంబులన్=క్రీగంటి చూపులతో; హరించుచు=కొల్లగొట్టుచు; భిక్షాటన క్రీడను=బిచ్చము కొఱకు తిరుగుట-బిచ్చమెత్తుట అనులీలను; నటించితి=అభినయించితివి.

చండీశ్వరా!=పార్వతీపతీ!; నీవు=నీవు; మేరుకోదండంబునన్=మేరుపర్వతమను ధనుస్సునందు; పుండరీకాక్ష=(పద్మములవంటి కన్నులు గలవాడగు) విష్ణువనెడి; కాండంబు=బాణమును; తొడిగి=సంధించి; కుండలి=ఆదిశేషుడనెడి; (జ్యా?) జ్వాలావల్లరీ=అగ్నిశిఖలనెడి తీవెలవంటి నారి యొక్క, ఝల్లరీఝుంకారంబునన్=వాద్యవిశేషము యొక్క ధ్వనివంటి ధ్వనితో; పంకరుహభవాండంబు=బ్రహ్మాండము; బీఁటగిలన్=పగుళ్ళువార; నిశాటపుట భేదనంబులు=త్రిపురాసురుల పట్టణములను; ఒక్క+ఏటునన్=ఒక్కదెబ్బతో; ఛటచ్ఛటన్=పటపట (ధ్వన్యనుకరణము) పగులునట్లు; ఏసితివి=బాణము వేసితివి.

నీలలోహితా!=కంఠమున నల్లదనము కేశములందు ఎఱ్ఱదనముగల శివా! అహస్+అహస్+అవధి=ప్రతిదినమునకు హద్దుగా నుండు; సంధ్యా సమయ=సంజవేళ యొక్క; ఆరంభంబుల=ప్రారంభములందు; ఉద్దేశదిన+అవసానంబులన్=నిర్దేశించిన పగళుల చివరలందు; సానందంబుగాన్=ఆనందముతో; పరిఢవించు=ప్రవర్తించు; జగఝుం కారంబు+ఐన=గొప్పదగు అందియల ధ్వనితోడిదగు; ఆరభటి=నాట్యవృత్తులు నాల్గింటిలో నొకటగు; తాండవ=తాండవమునందు; సముద్దండ=మిక్కిలి తీవ్రమగు; పాదభ్రమణ=పాదములను కదలించుటయును; విభ్రమంబునన్=విలాసముతో; త్రిభువన=మూడులోకములకు; భీకరంబు=భయంకరము; కావించితి=చేసితివి.

సర్వజ్ఞా!=అంతయు తెలిసిన శివా!; నిర్వికల్పంబు=అఖండమై యుండునదియు; నిరస్త=తొలగింపబడిన; సమస్త=సర్వమునగు; ఉపాధికంబును=(శరీరాదులు) ఉపాధులు

గలదియు; సత్యజ్ఞానానందంబునకు=సత్యమునకు, జ్ఞానమునకు, ఆనందమునకు; నికేతనంబునున్+అగు=తావును అగునట్టి; నిష్కలంక+స్వరూపంబును=గుణాదులతో కళంకము లేని పరతత్త్వమును; వేదానువచన=వేదాధ్యయనము; శాంతి=రాగాదులు లేకుండుట; దాంతి= ఇంద్రియజయము; క్షాంతి=సహనము; శ్రవణ=(ఉపనిషత్తులు) వినుట; నిదిధ్యాసన= (వినినదానిని) మననము-పలుమారులు ధ్యానించుట; ఆదులు+అగు= మొదలుగా గల, సాధనంబు లన్=ఉపాయములతో, సాధనములతో; నిర్నిరోధ=ఆటంకము లేనిది; నిరవగాధ=తెలిసికొన బడనిది; నిరవబోధ=బోధింపవీలుగానివాని; కక్ష్యా విభాగంబు నన్=ఆవరణ భాగమునందు; దక్షీభవించి=నిపుణులై; ముముక్షువులు=ముక్తిని పొందగోరు వారు; లాభలక్ష్యంబునున్=జ్ఞానమను గుఱిని సాధింపదగినదానిని; అభీక్ష్ణంబునున్=అత్యధిక మైనదియు; అభీప్సితంబునున్=కోరుకొన్నదగు దానిని; అనుభ వింతురు=పొందెదరు;

భర్గా=శివా; భార్గవ=భృగువంశీయులు; భృగు=భృగు మహర్షియు; అంగిరస= అంగిరసుడు; ప్రధాన=ముఖ్యులైన; నానా=అనేకమైన; ముని సమూహ=మునుల గుంపులకు; విహిత=మిక్కిలి ఇష్టమైనది; చరిత=ఆచరింపబడిన; అఘ మర్షణస్నాన=పాపములను పోగొట్టు మంత్రములతో జేయు స్నానముల; ఆహ్నిక=పగలు ఆచరింపదగిన పనుల; ఓఘము= సమూహము (ప్రవాహము) గలదియు; నిజజల=తన నీటి యందు; అవగాహ=స్నానముచేత; అపహ=పోగొట్టబడిన; నిఖిల=సమస్తమయిన; అఘయు=పాపములు గలదియు; జాహ్నవీ= గంగకు; సపత్నియున్+అగు=సవతియునగు; గోదావరీ మహానది=గోదావరి అనుపేరుగల గొప్పనది; నీకున్=నీకు; కేళాకూళి=క్రీడా సరస్సు.

నిటలనయనా=నొసట కన్నుగల శివా; గిటగిటనిన్=కృశించినదగుటచేత; అడుగు నడుఁగు=ప్రతిపదమునందును-అడుగడుగునందును; నడుఁకు=వణకు; నడుములు= మధ్యమములును; వెడఁదలు+అగు=విశాలములగు; తెలికన్నులును=స్వచ్ఛములగు కన్నులును; నెఱికురులును=అందమైన కేశములును; వలుదకుచములును=స్థూలములగు స్తనములును, కలిగి=కలవారై; ననవిల్తునకున్=పూవులే బాణములుగాగల మన్మథునకు; పసగల=కాంతిగల; పసిండి=బంగారముతో చేసిన; మెఱుంగుములుకులు+అనన్=తళుకుగల బాణములనగను; కలికి=అందమగు; చిలుకల కొలుకులు+అగు=చిలుకల కొలుకుల వంటి కొలుకులు గలవారునగు; బిసరుహదళనయనలు=(పద్మపురేకులపంటి కన్నులుగల) స్త్రీలు; ముసురుకొని=క్రమ్ముకొని; బలిసి=అధికమయి; నిలిచి=నిలిచియుండి; కొలువన్=సేవింపగా; ప్రతిసంక్రమణ వార+ఉత్సవ+ఆదులయందున్=అన్నిసంక్రాంతులు వారములందు జరుగు నుత్సవములు మున్నగువానిలో; పేరోలగంబు=పెద్దసభను; అవధరింతువు=శ్రద్ధ వహింతువు.

శంభో=శివా; నీవు=నీవు; శర్వరీ సార్వభౌమున్=రాత్రికి ప్రభువగు చంద్రుని; ఒక్కపాఙ్ఘ్నన్=ఒక్క అంగలో; గుజ్జు+ఊఱుకన్=(శరీరములోని) వసబయటకు వచ్చునట్లు; నుఱ్ఱితివి=త్రొక్కితివి; బిసరుహ భవుని=బ్రహ్మదేవుని యొక్క; కిసలయ+ఓష్ఠి=చివురుటాకు వంటి పెదవి గల (సరస్వతి) భార్య యొక్క, నాసికా తిలప్రసూనంబు=నూవు పూవువంటి ముక్కును, నఖ శిఖాగ్రంబునన్=కొనగోటి చివరతో, మొదలంటన్=మొదలంటునట్లు పూర్తిగా, చిదిమితి=గిల్లివేసితివి, వృషభధ్వజా=జెండాయందు వృషభ చిహ్నము గల ఓ శివా, నివు=నీవు; పూషుండు+అను పేరి=పూష అను పేరుగల; రవి పండ్లు=సూర్యుని దంతములు; రాలగొట్టితివి=రాలునట్లు కొట్టితివి; ఈశ్వరా=శివా, నీవు=నీవు; వైశ్వానరుని=అగ్ని యొక్క; సప్త జిహ్వా పల్లవంబులు=చివురుటాకులవంటి ఏడు నాలుకలు; పెల్లగిలన్=మొదలంటు ఊడిపోవునట్లు, గిల్లితి=గిల్లివైచితివి; విరూపాక్షా=(మూడు కన్నులు గల) శివా నీవు=నీవు; దక్ష ప్రజాపతి=దక్షుడను పేరుగల ప్రజాపతి యొక్క, కంఠంబునన్=మెడయందు మేషంబు తల=పొట్టేలు తలను, నిల్పితివి=ఉంచితివి; మృగవ్యాఘా=వేటగాడవగు శివా, నీవు=నీవు, అధ్వర మృగంబు=మృగరూపము దాల్చిన యజ్ఞము యొక్క మస్తకంబు=తలను, నభస్థలంబునన్=ఆకాశప్రదేశమునందు; వ్రేలన్=వ్రేలాడునట్లు; కట్టితి=కట్టితివి.

ముక్కంటీ=మూడు కన్నులు గల శివా, నీకు=నీకు; మ్రొక్కెదను=నమస్కరింతును; శివా=శంకరా; నీకు=నీకు; సేవా+అంజలి=సేవతో కూడిన దోసిలి (అర్పింతును) భవా=శివా, నీకు=నీకు; అభివాదనంబు=నమస్కారము; పాండుర+అంగా=ధవళశరీరా శివా; నీకు=నీకు; వందనంబు=వందనము, రాజశేఖరా=చంద్రశేఖరా; నీకు=నీకు; జేజే=నమస్కారము; హరా=శివా, నీకు=నీకు జోహారు=నమస్కారము, గిరీశా=కైలాసాధిపతీ నీకు=నీకు, వరివస్య=సేవ (చేయుదును); అష్టమూర్తి=ఎనిమిది రూపములు గల శివా నీకున్=నీకు; ప్రతిష్ఠ=కీర్తి (కలదు); ఈశానా=శివా; నీకున్=నీకు; దాస్యంబు=సేవ(చేయుదును), త్రిపురహరా=మూడు పట్టణములను నాశనము చేసిన శివా;నీకున్=నీకు;ఉపాసన=పూజ (చేయుదును); మృడా=సుఖము గూర్చు శివా; నీకు=నీకు; శరణు=శరణము (వేడెదను); మృత్యుంజయా=మృత్యువును జయించిన శివా; నీకు=నీకు; ప్రపత్తి=శరణాగతి (చేయుదును); ప్రమథ+అధిపా=ప్రమథ గణములకు ప్రభువగు శివా; నీకున్=నీకు, ఆరాధనంబు=పూజ (చేయుదును); పినాకీ=శివా; నీకు=నీకు, నమస్కారంబు=వందనము; కైలాసనిలయా=కైలాసవాసా; నీకున్=నీకు, కొలుపు=సేవ(చేయుదును, ఫాలలలాటా=త్రిణయనా! శివా; నీకున్=నీకు; ఎటికోళ్ళు=నమస్కారములు; గౌరీమనోహరా=పార్వతీప్రియా; నీకు=నీకు; నమస్కారంబు=ప్రణామము.

జలంధర=జలంధరుడను రాక్షసునికి; అంతకా=మృత్యువైన శివా! జయజయ= జయము జయము; గంధ....ఆకారా; గంధసింధుర+ఆది=మదించిన గజాసురుడు మున్నగు; దనుజ=రాక్షసుల; కంధరాపీఠ=పీఠమువంటి కంఠమునందలి; ధమనీ=నరములనుండి; గళిత=జారిన (కారిన); రక్తధారా=రక్తధారలచేత; అభిషిక్త-స్నానము చేయింపబడిన (తడుపబడిన); ప్రచండ=తీక్ష్ణమైన; ఖండపరశు=గండ్రగొడ్డలి; భిండివాల=ఇనుప మొనల ఆయుధము; శూల=శూలము; ప్రముఖ=మొదలైన; బహువిధ=పలురకములైన; ప్రహరణ= ఆయుధముల యొక్క; పరంపరా=వరుసలచేత; ఆభీల=భయంకరమగు; మహా=గొప్ప ఆకారా=స్వరూపము గలవాడా; జయజయ=జయము జయము.

జగత్సంభార=లోకములను బాగుగా భరింపగల; కుంభకల్పనా=కుండను నిర్మించు నట్టి; కుంభకారా=కుండలు చేయువాడా; కుంభీనస=పాములే; భూషణ=అలంకారములుగా గలవాడా; భీషణ=భయపెట్టు; భూత=భూతములు; ప్రేత=ప్రేతములు; పిశాచ=పిశాచములు; శాకినీ=శాకినులు; డాకినీ=డాకినులను; ప్రౌఢ పరివారా=సమర్థమైన సేవకగణముగ గలవాడా; జయజయ=జయము జయము; వియత్....ప్రపంచ; వియత్=ఆకసము; వాయు=గాలి; ధరణి=భూమి; తరణి=సూర్యుడు; శీతభాను=చంద్రుడు; బృహద్భాను=అగ్ని; సలిల=నీరు; యజమాన=యజమానుడు నను; మూర్తి=ఎనిమిది రూపములచేత; కల్పిత=కల్పింపబడిన; అష్టభేద=ఎనిమిది భేదములచేత; ప్రపంచిత=విస్తరింపబడిన; విశ్వప్రపంచ=విశ్వరూపమగు ప్రపంచము గలవాడా; పంచవదన=అయిదు ముఖములు; పంచాక్షరి=పంచాక్షరియను మూలమంత్ర=ప్రధాన మంత్రము; కారణ=హేతువైన; పాంచభౌతిక=పంచ భూతములచే నిర్మిత శరీరరూపమున; వ్యవహారా=వ్యవహరించువాడా; నిర్మల=స్వచ్ఛమగు; జ్యోతిర్లింగ మయ=జ్యోతిర్లింగ రూపమగు; మంగళ+ఆకారా=శుభకరమైన ఆకారము గలవాడా జయజయ=జయము జయము.

సప్త.....ఆవిర్భావ; సప్త పాతాళ=ఏడు పాతాళములను; భువన=లోకముల యొక్క విష్కంభ=విస్తారమును; నిర్భేదన=భేదించుటచేత; సమాపాదిత=పొందబడిన ఆవిర్భావ=పుట్టుక గలవాడా; భావజ=మన్మథుని; సంహారా=చంపినవాడా; సర్వ.....ప్రదేశ; సర్వమంగళా=పార్వతీదేవి యొక్క; కుచకలశపాళీ=కుండల వంటి స్తనముల ప్రదేశమునందు కేళీ తూలికా+ఆకార=విలాసము కొఱకైన కుంచె యొక్క నిర్మాణమయిన; మకరికా+ముద్రిత మొసలి ఆకారముగల గుర్తులచేత; అభీమ=భయంకరముగాని; ముద్రిత=నిర్మితమైన; ఉరః ప్రదేశ=వక్షః స్థలము గలవాడా; మహేశ=శివా; జయజయ=జయము జయము.

భక్త=భక్తుల యొక్క; భావనా సులభ=ధ్యానముచేత సులువుగా లభించువాడా స్వభావనా=స్వ=తన(భక్తుని యొక్క); భావనా=ధ్యానమునకు; అతీత=దాటినదగు; పావన=

పవిత్రమగు; ఆకార=స్వరూపముచేత; ధావళ్య విగ్రహా=తెల్లని దేహముగలవాడా; శ్రీమత్=శోభాయుక్తుడవగు; మహాదేవా=దేవశ్రేష్ఠా; దేవతా+ఆరాధ్య=దేవతలచే పూజింపబడువాడా; దక్షవాటీపుర=దక్షారామమను పట్టణమునకు; అధ్యక్షా=ప్రభువైనవాడా; ఆపత్=అపదలనెడి; ధ్వాంత=చీకటికి; దివాకరా=సూర్యుడవైనవాడా; పరమ=గొప్పదగు; దయా=కరుణకు; ఆకరా=గని అయినవాడా; జయజయ=జయము జయము; భీమేశ్వరా=భీమేశ్వరస్వామీ; తే=నీకు; నమః=వందనము; తే=నీకు; నమః=ప్రణామము; నమః=ప్రణామము.

భావము :- ఓంకార రూపా జయము జయము. దేవదేవా! గంధర్వులు, సిద్ధులు, విద్యాధరులు, చారణులు, కిన్నరులు, కింపురుషులు అధిక భక్తి విశేషములతో మనః పద్మములు వికసింపగా నేను ముందనగా నేను ముందనుచు ఆదిశేషుడు అందెలుగాగల మీ పాదపల్లవములను తమ కిరీటములపై నలంకృతములగు మందారమాలికలలోని మకరంద బిందువుల కలయికచే నేర్పడిన ధారా ప్రవాహములతో నభిషేకింతురు.

నీలకంఠా! మీకంఠమునందు కలువ దండవలె నున్నదియు, పంకము వలె నల్లనగు కాలకూట విషమనెడు గుళుచ్ఛములు మీరు పూర్వము చేసిన లోకరక్షణ వృత్తాంతమును నిగమములు వివరించుచున్నవి.

మహానటా! మీ జటాజూట సమూహము నుండి క్రిందకు దిగిన ఆకాశ గంగా ప్రవాహము యొక్క తీవెల వంటి సన్నని ధారలు మూడు లోకములందు ముత్యాల దండల వలె నున్నవి.

శంకరా! నీవు సంకర్షణ రుద్రావతారము నందు పాతాళము నుండి బయల్వెడలి విషాగ్ని నిప్పుకలను వెదజల్లు పండ్లు పటపట కొఱకుచు మహాగుహ వంటి భయంకరమగు నోటితో బ్రహ్మాండములు ఒకదానితో నొకటి కొట్టుకొని అణగునట్లు చేసి మ్రింగుదువు.

ధూర్జటీ! ప్రళయ కాలమునందలి మేఘము యొక్క ఉరుమువంటి వికటాట్ట హాసముతో తీవ్రముగా అదలించి దురహంకారముచే గలిగిన కోపముతో విజృంభించు ఇంద్రుని వజ్రాయుధముతోడి హస్తమును స్తంభింప జేసితివి.

కుబేరుని చెలికాడా! దిగంతముల వఱకు వ్యాపించుచు బంగారు కడ్డీలవలె వెలుగొందు అగ్నిజ్వాలలు విజృంభింపగా అగ్ని స్తంభము వంటి దివ్య లింగాకారముతో నవతరించి నీవు భూమి నుండి చక్రవాళ పర్వతము వఱకు వ్యాపించి పెరిగినప్పుడు బ్రహ్మ రాజహంస రూపముతో పైకి, విష్ణువు శ్వేతవరాహ రూపముతో క్రిందకు వెళ్ళిరి. కాని బ్రహ్మ ఆ లింగపు పైభాగమును, విష్ణువు మొదలును కానజాలక తిరిగి వచ్చిరి.

రుద్రా! నీవు దేవదారు వనవాటికలో దుష్టుడగు మిండజంగము రూపముతో దిగంబరుడవై సంచరించుచు ముని భార్యల పాతివ్రత్యమును కటాక్ష వీక్షణములతో నపహరించుచు భిక్షాటనమను లీల నభియించితివి.

చండీశ్వరా! నీవు మేరుపర్వతమను ధనుస్సునకు విష్ణువను బాణమును ఆదిశేషుడను అల్లెత్రాటితో సంధించి ధనుష్టంకారముతో బ్రహ్మాండము పగుళ్ళువారగా పురత్రయము పటపట పగులునట్లు వేసితివి.

నీలలోహితా! ప్రత్యేక దినములలో ప్రతిదినము సాయం సంధ్యా ప్రారంభ సమయమునందు ఆనందముతో విలసిల్లుచు కాలియందెలు ధ్వనించుచుండగా ఆరభటి వృత్తితోడి తాండవములో మిక్కిలి తీవ్రము, వేగవంతమగు పదవిన్యాస విలాసముతో ముజ్జగములను భీతిల్లజేసితివి.

సర్వజ్ఞా! అఖండమును సమస్తోపాధి శూన్యమును, సత్య జ్ఞానానందరూపమును, త్రిగుణ రహితమగు పరతత్త్వమును ఉపనిషత్సారమును శాంతిదాంతి తితిక్షలతోగూడి శ్రవణమననాదులగు సాధనములతో మముక్షువులు ఆటంకము లేకుండుట, తెలియకపోవుట, బోధింప వీలుగాకుండుటయను ఆవరణ భేదన నిపుణులై జ్ఞానమను లక్ష్యమును నిరంతరము ననుభవింతురు.

భర్గా! భార్గవులు, భృగువు, అంగీరసులు మున్నగు మునుల సమూహము నిరంతరము అఘమర్షణ స్నానము, ఆహ్నికములను గోదావరీ నదిలో నిర్వర్తింతురు. ఆ నది తన జలముల స్నానముచేయు వారి పాపములను పోగొట్టును. అది గంగానదికి సవతి. అట్టి గోదావరి నీకు క్రీడా సరస్సు.

ముక్కంటీ! నీవు ప్రతి సంక్రాంతియందు, ప్రతి వారమునందు జరుగు నుత్సవము లలో పెద్ద కొలువు నిర్వర్తింతువు. అందు సుందరాంగులు, పద్మనయనలగు చిలుకల కొలుకులు అధికముగా నిన్ను చుట్టు ముట్టి సేవించుచుందురు. కృశమధ్యలగుటచేత అడుగడుగునను వారి నడుములు వణకుచుండును. వారి కన్నులు విశాలములు, స్వచ్ఛములు. కేశపాశములు మనోహరములు. స్థూల కుచలగు నా భామినులు మన్మథుని బంగారు బాణములవలె నుందురు.

శర్వా! నీవు ఒక్క దూకులో పొట్టలోని వస బయటకు వచ్చునట్లు చంద్రుని త్రొక్కితివి. బ్రహ్మదేవుని పత్నియగు సరస్వతి నువ్వు పువ్వు వంటి ముక్కును గోటితో సమూలముగా గిల్లితివి. వృషభధ్వజా! నీవు పూషుడను సూర్యుని దంతములు రాలగొట్టితివి. శివా! నీవు అగ్నిదేవుని ఏడు నాలుకలను పెల్లగిలునట్లు గిల్లివేసితివి. దక్ష ప్రజాపతి కంఠమునందు మేష శిరస్సును పెట్టితివి. మృగవ్యాధా! నీవు మృగ రూపము దాల్చిన యజ్ఞ శిరస్సును ఆకసమున వ్రేలాడ దీసితివి.

త్రినయనా! నీకు నమస్కారము. శంకరా! నీకు సేవాంజలి సమర్పించుచున్నాను. భవా! నమస్కారము. ధవళ శరీరా! వందనము. చంద్రశేఖరా! నమస్సులు. హరా! వందనము.

కైలాసనాథా! సేవ చేయుదును. శంకరా! నీకు ప్రతిష్ఠ గలదు. ఈశానా! నిన్ను సేవింతును. త్రిపురాంతకా! నిన్ను పూజింతును. సుఖకరా! నీవే శరణు. మృత్యుంజయా! నీకు ప్రపత్తి చేయుదును. ప్రమథనాథా! నిన్నారాధింతును. పినాకీ! వందనము. కైలాసవాసా! నిన్నే కొలుచుదును. త్రినయనా! నీకు దండప్రణామము. గౌరీకాంతా! నీకు నతులు.

జలంధర నాశకా! జయము జయము. గజాసురాదులగు రాక్షసుల కంఠములందలి ఖండిత నరముల నుండి కారిన రక్త ధారలతో తడిసిన గండ్రగొడ్డల, శూలము మున్నగు ననేకాయుధములచేత భయంకరుడవగు శివా! నీకు జయము జయము

జగత్తులను కుంభములను నిర్మించు కుంభకారా! సర్పాలంకారా! భయంకరములగు భూతప్రేత పిశాచాదులగు ప్రౌఢులు పరివారముగా గల శివా! జయము జయము. ఆకసము, గాలి, భూమి, సూర్యుడు, చంద్రుడు, అగ్ని, నీరు, యజమానుడు అను నష్టమూర్తులతో ప్రపంచమును విస్తరించినవాడా! పంచముఖములు, పంచాక్షరియను మూలమంత్రము హేతువుగా నిర్మిత పాంచభౌతికమగు లోకవ్యవహారము గలవాడా! నిర్మల జ్యోతిర్లింగమయ మంగళస్వరూపముగల శివా! జయము జయము.

సప్త పాతాళ వైశాల్యమును ఛేదించి అవతరించినవాడా! మన్మథాంతకా! పార్వతీ దేవి వక్షఃస్థలమునందు నీవు తూలికతో చిత్రించిన మకరికా పత్రములు తదాలింగనముచేత ముద్రిత వక్షఃస్థలముగల శివా! జయము జయము.

భక్తులకు ధ్యానముచే సులభతరా! భక్తుని భావనాతీతమును పవిత్రమును ధవళమునగు రూపముగలవాడా! మహాదేవా! దేవతలచే నారాధ్యుడా! దక్షారామాధిపా! ఆపదలను చీకటిని పారద్రోలువాడా! దయాసముద్రా! జయము జయము. భీమేశ్వరా! నీకు నమస్కారము. నమస్కారము. నమస్కారము."

విశేషము :- "ఇది వచన ప్రక్రియ. చూర్ణిక. గద్య, బిరుదుగద్య, వచనము, విన్నపము అని వివిధ నామముల విలసిల్లిన ప్రక్రియా విశేషము. అంతేకాదు. భక్తి వాఙ్మయమున భద్రాసనమున భాసించునది. శివకవులైన మల్లికార్జున పండితారాధ్యుని గద్యలను, పాల్కురికి సోమనాథుని గద్యలను, వైష్ణవ కవి కృష్ణమాచార్యుల వచనములను అనుసరించుటయే కాదు; శ్రీనాథుని వచన గీతమిది అతిశయించునది కూడ. పాల్కురికి సోమనాథుని పంచ ప్రకార గద్య కంటె శ్రీనాథుని వచనము బహుప్రకార భాసమానము. అంతేకాదు. భావ వైపుల్యము, రచనా వైవిధ్యము పరాకాష్ఠ నందినవి. అంతేకాదు. శైలీ విన్యాసము భక్త్యావేశమును ప్రస్ఫుటీ కరించునది. అది వ్యాసుని భక్త్యావేశమనుట కథార్థము. శ్రీనాథుని భక్త్యావేశమగుట యథార్థము" ఈశ్వరార్చన కళాశీలుడు - పుట-92. ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి.

మ॥ అనుచుం దాండవమాడుచుండె శివభక్త్యావేశలీలార్భటి
న్ముని శార్దూలము దక్షవాటి నడుమ న్లోలజ్జటాభారుఁడై;
వినిపించె న్నశరీర భారతి నభోవీథీ విటంకంబునన్
"నిను రక్షించెను భీమనాయకుఁడు కానీనా! సుఖంబుండుమీ. **213**

**అర్థము** :- అనుచున్=అనుచు; ముని శార్దూలము=మునిశ్రేష్ఠుడగు వ్యాసుడు; లోలత్=సంచలించుచున్న; జటాభారుఁడై=బరువైన జటలు గలవాడై, దక్షవాటి నడుమన్=దక్షారామము యొక్క మధ్యమునందు; శివ=శివుని యందలి; భక్తి=భక్తి యొక్క; ఆవేశ లీలా+ఆర్భటిన్=స్ఫూర్తి తోడి చేష్టల విజృంభణముతో; తాండవమాడుచుండె=నృత్యము చేయుచుండెను; కానీనా=కన్యాపుత్రా వ్యాసా; నినున్=నిన్ను, భీమనాయకుఁడు=భీమేశ్వరుడు; రక్షించెను=కాపాడెను, సుఖంబున్+ఉండుమీ=సుఖముగా నుండుమా అని; సభోవీథీ=ఆకసమను రాజమార్గము యొక్క, విటంకంబునన్=సర్వోన్నత ప్రదేశమునందు; అశరీర భారతి=ఆకాశవాణి. వినిపించెన్=వినిపించెను.

**భావము** :- అని స్తుతించుచు వ్యాసమహర్షి శివభక్తి యొక్క ఆవేశముతో గూడిన చేష్టా విజృంభణముతో దక్షారామ మధ్యమునందు కెంజడలు సంచలింపగా తాండవము చేయుచుండెను. అప్పుడు "వ్యాసా! భీమేశ్వరస్వామి నిన్ను కాపాడెను. సుఖముగా నుండుము.' అని విశాలాకాశ వీధి నుండి అశరీరవాణి వినిపించెను.

తే॥ కాచె నీతప్పు కల్మాష కంధరుండు
శిశిర కర శేఖరుండు రక్షించె నిన్ను;
భీమనాథుని త్రిభువన స్వామిఁ గొలువుము
కార్య సంసిద్ధిఁ బొందెదు కానినేయ!" **214**

**అర్థము** :- కానినేయ=కన్యాపుత్రా వ్యాసా! కల్మాషకంధరుండు=నల్లదనము కంఠమునందు గలవాడు; శివుడు. నీతప్పు=నీ దోసమును; కాచెన్=సహించెను; శిశిర కర శేఖరుండు=చల్లని కిరణములుగల చంద్రుడు శిరస్సునందు గల శివుడు; నిన్ను=నిన్ను; రక్షించెన్=కాపాడెను; త్రిభువన స్వామిన్=ముల్లోకములకు ప్రభువగు, భీమనాథునిన్=భీమేశ్వరుని; కొలువుము=సేవింపుము, కార్య సంసిద్ధిన్=కార్య సిద్ధిని; పొందెదు=పొందెదవు

**భావము** :- వ్యాసా! శివుడు నీ తప్పు క్షమించెను. చంద్రశేఖరుడు నిన్ను రక్షించెను. త్రిలోకాధిపతియగు భీమేశ్వరుని సేవింపుము. నీకు కార్యసిద్ధి గలుగును.

విశేషము :- కానినేయ :- ఈ పదము భీమ - 2-114 చెంతకూడ వచ్చినది. ఈ శబ్ద సాధుత్వచర్చ అచట చేయబడినది.

**వ॥ అని యివ్విధంబున నశరీరవాణి పలికిన విని యయ్యంతర్వాణి శర్వాణీ వల్లభుం దలంచి పునఃప్రణామంబులు చేసి నితాంత సంతోష తరంగితాంతరంగుండై. 215**

అర్థము :- అని=అని; ఈ+విధంబునన్=ఈవిధముగా; అశరీరవాణి=ఆకాశవాణి; పలికినన్=పలుకగా; విని=విని; ఆ+అంతర్వాణి=శాస్త్రవేత్తయగు ఆ వ్యాసుడు; శర్వాణీ వల్లభున్=పార్వతీపతిని; తలంచి=స్మరించి; పునఃపునః=మరల మరల; ప్రణామంబులు= నమస్కారములు; చేసి=చేసి; నితాంత=అధికమగు; సంతోష=సంతసముచేత; తరంగిత= సంచలించుచున్న; అంతరంగుండు+ఐ=మనస్సుగలవాడై.

భావము :- అని ఈవిధముగా ఆకాశవాణి పలుకగా విని, వ్యాసుడు శంకరుని స్మరించి మరల మరల నమస్కారములు చేసి సంతోష తరంగిత మనస్సుగలవాడై(ఇట్లనెను).

**సీ॥ "పైల! దక్షారామ పతి భీమనాథుండు**
**మనపాలి కల్పక క్ష్మాజమయ్యె**
**నోసుమంతుఁడ! దక్షిణోద్యాన వాటికా**
**నిలయుండు మనపాలి ఫలము సువ్వె**
**జైమిని! దేవతాసార్వభౌముఁడు విరూ**
**పాక్షుండు ప్రత్యక్షమయ్యెఁజువ్వె**
**దేవల! సప్త గోదావరీ తీరైక**
**వాసుండు మనవంక వ్రాలెఁ జువ్వె**
**తే॥ భారతాది బహు గ్రంథ పారవశ్య!**
**యోయి జనమేజయుండ! యీ యుక్త గమనుఁ**
**డంబికా భర్త యఖిల కల్యాణములును**
**మనకుఁ గృపసేయఁ గలఁడు సమ్మదము తోడ. 216**

అర్థము :- పైల=పైలుడా; దక్షారామపతి=దక్షారామమునకు ప్రభువగు; భీమ నాథుండు=భీమేశ్వరుడు; మనపాలి=మనపాలిటి; కల్పకక్ష్మాజము=కల్పవృక్షము; అయ్యెన్= అయినాడు;

ఓసుమంతుఁడ=ఓ సుమంతా! దక్షిణ=దక్షిణ దిక్కునందలి; ఉద్యానవాటికా= ఉద్యానవనమే (దక్షారామమే); నిలయుండు=నివాసముగలవాడు; మనపాలి=మనపాలిటి; ఫలము సువ్వె=ఫలము సుమా;

జైమిని=జైమినీ; దేవతా సార్వభౌముఁడు=దేవతలకు ప్రభువగు; విరూపాక్షుండు= ముక్కంటి, శివుడు; ప్రత్యక్షము+అయ్యెన్+చువ్వె=ప్రత్యక్షమయినాడు సుమా;

దేవల=దేవలా; సప్తగోదావరీ=సప్తగోదావరము యొక్క; తీర=తీరమే; ఏకవాసుండు= ప్రధాన నివాస స్థానముగాగలవాడు; మనవంకన్=మనవైపు; వ్రాలెన్+చువ్వె=ఒరిగెను సుమా;

భారత+ఆది=భారతము మున్నగు; బహుగ్రంథ=అనేక గ్రంథముల (శ్రవణము)చేత; పారవశ్య=పరవశుడవైన; ఓయి జనమేజయుండ=ఓయీ జనమేజయా; ఈ+ఉక్షగమనుఁడు= వృషభ వాహనుడగు; అంబికా భర్త=పార్వతీపతి; సమ్మదము తోడన్=సంతసముతో; అఖిల కల్యాణములును=సమస్త శుభములను; మనకున్=మనకు; కృప+చేయఁగలఁడు= దయచేయగలడు.

భావము :- పైలా! దక్షారామాధిపతియగు భీమేశ్వరుడు మనపాలిటి కల్పవృక్ష మయ్యెను. సుమంతా! దక్షిణోద్యానపతి మనపాలిటి సత్ఫలమైనాడు. జైమినీ! దేవతా సార్వ భౌముడు పరమేశ్వరుడు మనకు ప్రత్యక్షమయ్యెను సుమా! దేవలా! సప్తగోదావరతీర నివాసి మనవైపు మొగ్గెను సుమా! భారతాదులగు ననేక గ్రంథ శ్రవణముచే పరవశించిన జనమేజయా! వృషభ వాహనుడగు నీ పార్వతీపతి సంతోషముగా సకల శుభములను మనకిచ్చును.

విశేషము :- 2 ఆశ్వాసము 99 పద్యములో వైశంపాయనాదులగు ఆరుగురి పేర్లు కలవు. ఆ ఆశ్వాసములోనే 145వ వచనమునందు వ్యాస శిష్యులు ఏడుగురి నామములు కలవు. పై రెండింటిలో లేనిదగు జనమేజయుని పేరు ఇందు గలదు. ఇచట వైశంపాయనుని పేరుండుట సముచితము.

సంస్కృత భీమఖండములో ఈ సందర్భమున (13-100) వైశంపాయనుని నామమున్నది.

"వైశంపాయన దేవేశో బహుదాస్యతి నశ్శుభమ్."

అధ్యా 6 - 78, 79 శ్లోకములలో సుమంత పైల జైమిని దేవలసూత రోమహర్షణులను వ్యాస శిష్యుల నామములు మాత్రమున్నవి. వైశంపాయనుని ప్రసక్తి లేదు.

**వ॥ ఇంకఁ గృతార్థుల మైతి" మని శిష్య వర్గంబునుం దానును దక్షారామంబున నభిరామంబైన పరమజ్ఞానానంద సుఖం బనుభవించు చుండె. 217**

అర్థము :- ఇంకన్=ఇకమీద; కృతార్థులము+ఐతిమి=కృతకృత్యులము అయితిమి; అని=అని; శిష్యవర్గంబునున్=శిష్యుల సమూహమును; తానును=తాను(వ్యాసుడు గూడ); దక్షారామంబున్=దక్షారామమునందు; అభిరామంబు+అయిన=ఇంపయిన; పరమ=

ఉత్తమమైన; జ్ఞాన=జ్ఞానముచే గలిగిన; ఆనందసుఖంబు=అనంగము వలన నేర్పడు సుఖమును. అనుభవించుచుండెన్=అనుభవించుచుండెను.

భావము :- ఇక మనము కృతార్థులమైతిమి! అని వ్యాసమహర్షి శిష్యులును తాను దక్షారామమునందు ఇంపైన ఉత్తమ జ్ఞానముచే గలుగు ఆనంద సౌఖ్యమును అనుభవించు చుండెను.

క॥ శ్రీరామాయణమును ద
క్షారామాయణముఁ గలిమలాపహములు స
త్సారమతులు వాల్మీకికిఁ
బారాశర్యునకు వినుతి పాత్రములయ్యెన్. 218

అర్థము :- శ్రీరామాయణమును=శ్రీరాముని చరిత్రమును. దక్షారామాయణమున్= దక్షారామ వృత్తాంతమును; కలిమల=పాపమనెడు మాలిన్యమును; అపహములు=పోగొట్టునవి; సత్+సారమతులు=శ్రేష్ఠమైన ధర్మముతోడి మేధశ్శక్తి గలవారగు. వాల్మీకికిన్=వాల్మీకి మహర్షికి; పారాశర్యునకున్=వ్యాసునకును; వినుతిపాత్రములు=స్తుతింప యోగ్యములు; అయ్యెన్= అయినవి.

భావము :- శ్రీమద్రామాయణమును, దాక్షారామ చరిత్రమును పాపమాలిన్యములను పోగొట్టునవి. ఉత్తమధర్మపూర్ణమతులగు వాల్మీకి వ్యాసుల స్తుతి పాత్రము లయ్యెను.

విశేషము :- శ్రీనాథుడు అవతారికలోని స్తుతిలో "శ్లోకంబుల్ శతకోటి కాండములుగా" అను 5వ పద్యములో "వాల్మీకిన్ బ్రహ్మపదావతీర్ణ" అని వాల్మీకి మహర్షిని; అందే "తలతున్ భారత సంహితాధ్యయన" అను 6వ పద్యములో "పారాశర్య మునీశ్వరున్" అని వ్యాస మహర్షిని స్తుతించెను. ఆ ప్రార్థన పద్యములలోని ఆ మహర్షుల నామద్వయమును కవి ఈ పద్యమునందు అట్లే గ్రహించుట విశేషము.

వ॥ అని చెప్పిన విని యభినందించుటయు భీమేశ్వర మాహాత్మ్యంబు విను వేడుకం "బరమేశ్వరుం డుద్భవించిన విధంబును సప్తఋషులు సప్తగోదావరంబుఁ దెచ్చిన విధంబును నా స్వామిని బ్రతిష్ఠ చేసిన భంగియు నెఱింగింపవే" యని ప్రార్థించిన. 219

అర్థము :- అని=అని; చెప్పినన్=(సూతుడు) చెప్పగా; విని=విని; అభినందించుట యున్=మెచ్చుకొనుటయును; భీమేశ్వర=భీమేశ్వర స్వామి వారి; మాహాత్మ్యంబు=మహిమను, వినువేడుకన్=వినవలెనను కోరికతో; పరమేశ్వరుండు=భీమేశ్వరుడు; ఉద్భవించిన= అవతరించిన; విధంబును=రీతియు; సప్తఋషులు=ఏడుగురు మహర్షులు; సప్తగోదావరంబున్=సప్త

గోదావరమును; తెచ్చిన విధంబునున్=తెచ్చిన గతియును; ఆస్వామిని=ఆ భీమేశ్వరస్వామిని; ప్రతిష్ఠచేసిన=నిలిపిన భంగియున్=విధమును; ఎఱింగింపనే=తెలుపుమా; అని=అని (శౌనకాదులు) ప్రార్థించినన్= కోరగా;

భావము :- అని సూతుడు చెప్పగా విని శౌనకాదులు ఆయనను అభినందించిరి. భీమేశ్వరస్వామివారి మాహాత్మ్యమును వినవలెనను కోరికతో వారు "ఆ పరమేశ్వరుడవతరించిన విధమును, సప్తర్షులు గోదావరిని భీమేశ్వరాలయము వద్దకు తెచ్చిన రీతిని; ఆస్వామిని ప్రతిష్ఠ చేసిన విధమును తెలుపు"మని సూతుని ప్రార్థించిరి.

శా॥ గాంధర్వోపనిషన్మతంగ! రసవత్కావ్యానుసారానుధౌ
రంధర్యాపర భోజరాజ! రమణీ ప్రద్యుమ్న! దోర్వీర్యగ
ర్వాంధారాతి వరూథినీ పరివృఢ ప్రాణానిలాహార వా
తాంధః క్రూరకృపాణ! రాజహిత కార్యారంభ పారంగతా! 220

అర్థము :- గాంధర్వ=సంగీతములోని; ఉపనిషత్=రహస్యముల(నెఱుగుట)లో; మతంగ=మతంగుడను సంగీత విద్వాంసుని వంటివాడా; రసవత్=రసవంతములగు; కావ్య= కావ్యములను, అనుసార=అనుసరించు; అనుధౌరంధర్య=తగిన శ్రేష్ఠత్వములో; అపర భోజరాజ=సర్వోత్కృష్టుడైన (మరియొక) భోజరాజైన వాడా! రమణీ ప్రద్యుమ్న!=స్త్రీలకు మన్మధుడవైనవాడా!-వాతాంధః....కృపాణ; దోర్వీర్య=భుజబలముచేత గలిగిన; గర్వ=పొగరుచేత; అంధ=కన్నుగానని; అరాతివరూథినీ=శత్రుసేన యొక్క; పరివృఢ= రాజుల; ప్రాణ+అనిల= ప్రాణవాయువులే, ఆహార=తిండియైన, వాతాంధస్=(గాలియే ఆహారముగాగల) సర్పమువంటి; క్రూర=భయంకరమైన; కృపాణ=ఖడ్గముగలవాడా; రాజ= ప్రభువునకు; హిత=మేలైన, కార్య=పనులను; ఆరంభ=మొదలిడుటయందు; పారంగతా= తుదముట్టినవాడా (అన్నమంత్రీ).

భావము :- అన్నమంత్రీ! నీవు సంగీతశాస్త్ర రహస్యముల నెఱుగుటలో మతంగముని వంటివాడవు. రసవంతములగు కావ్యముల ననుసరించు సముచిత శ్రేష్ఠత్వములో మఱియొక భోజరాజువు. స్త్రీలకు మన్మథుడవు. భుజబలముతో గర్వించిన శత్రు రాజుల ప్రాణవాయువు లను త్రాగు సర్పము నీ చేతిలోని ఖడ్గము. మీ ప్రభువగు వీరభద్రారెడ్డికి మేలు గలుగు పనుల నారంభించుటలో మేటివి.

విశేషము :- ఆశ్వాసాంత పద్యముల రచించుట నన్నయతోనే ఆంధ్ర సారస్వతములో నారంభమైనది. ఆ సంప్రదాయమునే శ్రీనాథుడును పాటించెను. సంబోధన రూపమున నీ పద్యములు మూడు మాత్రమే యుండుటయు, అందు కృతిపతి ప్రాధాన్య ప్రాశస్త్య వైభవ పాండిత్యాదులను గూర్చుటయు ఆశ్వాసాంత పద్యరచనలోని సంప్రదాయము

సంగీత శాస్త్రాద్యాచార్యులలో మతంగుడు ప్రముఖుడు. సాహిత్య పోషణములో భోజరాజు సుప్రసిద్ధుడు. యువతీ మన్మథుడనుట అన్నమంత్రి సౌందర్య సూచకము. అంతకు ముందున్న విశేషములు కృతి భర్త సంగీత సాహిత్యపారంగతత్వమును వ్యక్తీకరించుచున్నవి. మలి విశేషణమునకు ముందున్న సమాసము మంత్రి ధరించు ఖడ్గ ప్రశంసారూపమున ఆయన పరాక్రమమును వ్యంజిత మొనర్చుచున్నది. తుది విశేషణము అన్నమంత్రి రాజనీతి పారంగతత్వమును స్పష్ట మొనర్చుచున్నది.

క॥ దక్షారామవధూటీ
వక్షోరుహ మృగమదాది వాంఛిత విలస
ద్వక్షఃకవాట! బాంధవ
రక్షావిధి వజ్రపంజర! కృపాజలధీ! 221

అర్థము :- దక్షారామ.....కవాట; దక్షారామ=దక్షారామమునందలి; వధూటీ=స్త్రీల; వక్షోరుహ=స్తనములందలి; మృగమద=కస్తూరి; ఆది=మున్నగువానిచేత; వాంఛిత=కోరబడిన; విలసత్=శోభించుచున్న; వక్షస్+కవాట=బోరుతలుపులవంటి ఉరఃస్థలము గలవాడా; బాంధవ=చుట్టములను; రక్షావిధి=రక్షించుటను చేయుటయందు; వజ్రపంజర= వజ్రముతో నిర్మితమగు పంజరము వంటివాడా; కృపాజలధీ=దయాసముద్రుడా!

భావము :- అన్నమంత్రీ! బోరుతలుపులవలె విశాలమగు నీ వక్షఃస్థలమును దక్షారామ స్త్రీల వక్షోజములందలి కస్తూరికాదులు కోరుచుండును. (దక్షారామములోని యువతులు నిన్నాలింగన మొనర్ప గోరుదురు). బంధువులను, మిత్రులను వజ్రపంజరమువలె రక్షింతువు. నీవు దయాసముద్రుడవు.

పంచ చామరము॥ అభంగవీర విక్రమార్క! యాజి గాండివాయుధా!
ప్రభాతకాలభానుసన్నిభ ప్రభావిభాస్వరా!
ఇభద్విడుగ్ర విక్రమా! సమిద్ధ నర్తన భ్రమ
న్నభస్సరిత్పయః పృషద్గణచ్ఛవి స్ఫురద్యశా! 222

అర్థము :- అభంగ=భంగపాటు, అపజయము లేకుండుటయందు; వీర విక్రమార్క= వీరుడైన విక్రమార్కుడా; ఆజి=యుద్ధమునందు; గాండివ+ఆయుధా=గాండీవము ఆయుధముగాగల అర్జునా! ప్రభాత......భాస్వరా; ప్రభాతకాల=ఉదయ కాలమునందలి; భాను=సూర్యునితో; సన్నిభ=సమానమైన; ప్రభా=కాంతితో; విభాస్వరా=మిక్కిలిగా వెలుగొందు వాడా! ఇభద్విట్=ఏనుగులకు శత్రువగు సింహము యొక్క; ఉగ్ర=భయంకరమైన; విక్రమా=

పరాక్రమము వంటి పరాక్రమముగలవాడా; సమిద్ధ.....యశా; సమిద్ధ=దీప్తమగు; నర్తన= నాట్యముచేత; భ్రమత్=భ్రమించుచున్న; నభస్సరిత్=ఆకాశగంగయందలి; పయస్+ పృషత్+ గణ=నీటి తుంపురుల సమూహమువలె; ఛవి=కాంతితో; స్ఫురత్=ప్రకాశించు చున్న; యశా=కీర్తికలవాడా.

**భావము :-** అన్నమంత్రీ! విజయమునందు నీవు విక్రమార్కుడవు. యుద్ధమునందు అర్జునుడవు. ఉదయ కాలమునందలి సూర్యునివలె వెలుగొందువాడవు. సింహ పరాక్రముడవు. దీప్తమై త్రుళ్ళిపడుచున్న ఆకాశగంగాజల బిందువులవలె నీ యశస్సు నిర్మలమై ప్రకాశించుచున్నది.

**విశేషము :-** పంచచామరమునకు ప్రతిపాదమునందును జ, ర, జ, ర, జ, గ అను గణములుండును. 16 అక్షరములుండును. ప్రతి పాదమునందును 10వ అక్షరము యతి మైత్రి గల్గి యుండును.

**గద్య : ఇది శ్రీమత్కమలనాభ పౌత్ర మారయామాత్య పుత్ర సుకవిజన విధేయ శ్రీనాథ నామధేయ ప్రణీతంబైన శ్రీ భీమేశ్వర పురాణంబను మహా ప్రబంధంబునందు తృతీయాశ్వాసము.**

ఇది

శ్రీ భీమేశ్వర పురాణ తృతీయాశ్వాసమునకు

## దక్షిణకాశిక

అను ప్రతిపదార్థ భావ విశేష సహిత వ్యాఖ్యానము

# శ్రీ భీమేశ్వర పురాణము

## చతుర్థాశ్వాసము

### దక్షిణ కాశికా వ్యాఖ్యానము

కం॥ శ్రీధామ! యశేషదిశా
సౌధాగ్ర స్ఫటిక కుంభ సంభార కళా
సాధీయ స్సిత కీర్తి! బు
ధాధార! యరేఁటి యన్నయామాత్య మణీ! 1

అర్థము :- శ్రీధామ=సంపదలకు నిలయమైనవాడా! అశేష.....ధార; అశేష=సమస్తమైన; దిశాసౌధ=దిక్కులందలి మేడల యొక్క; అగ్ర=చివరలయందున్న; స్ఫటిక=స్ఫటిక మణిమయమైన; కుంభ=కుండలను; సంభార=చక్కగా ధరించుట యనెడి; కళా=కళయందు; సాధీయస్=శ్రేష్ఠమైన; సిత కీర్తి=తెల్లని కీర్తికలవాడా! బుధ=పండితులకు; ఆధార=ఆధారమైనవాడా! అరేఁటి=అరేఁటి వంశమున పుట్టిన; అన్నయ=అన్నయ అను పేరుగల; అమాత్య మణీ=శ్రేష్ఠుడవైన మంత్రీ!

భావము :- సంపదలకు నిలయమైనవాడా! సమస్త దిక్కులందలి సౌధములపైగల స్ఫటిక మణిమయ కుంభముల ధరించుటయను కళలో శ్రేష్ఠమైన తెల్లని కీర్తికలవాడా! పండితుల కాధారమైన వాడా! అరేటి అన్నయ మంత్రి శేఖరా!

వ॥ అక్కథకుండు శౌనకాది మహామునుల కిట్లనియె. 2

అర్థము :- ఆ+కథకుండు=పురాణ కథలు చెప్పు ఆ సూత మహర్షి; శౌనక+ఆది=శౌనకుడు మొదలయిన; మహామునులకు=మహర్షులకు; ఇట్లు+అనియెన్=ఈవిధముగా చెప్పెను.

భావము :- పురాణ కథలు చెప్పుటలో నేర్పరియైన సూత మహర్షి శౌనకాది మహామునులకు ఈవిధముగా చెప్పెను.

తే॥ “బాదరాయణునకుఁ గుంభ భవుఁడు చెప్పి
నట్టి యాత్రాక్రమంబిది యనఘు లార!
యమర ముని నారదుఁడు మునీంద్రాదులకును
నర్థిఁజెప్పిన పరిపాటి యది వినుండు.

అర్థము :- అనఘులార! =పాపము లేనివారా! (ఓ పుణ్యమూర్తులారా!); ఇది= మీరడిగిన-సప్తర్షులు సప్తగోదావరమును తెచ్చిన విధము మొదలైన విషయముల సమూహము; బాదరాయణునకున్=వ్యాసునకు; కుంభ భవుఁడు=అగస్త్యుడు; చెప్పినట్టి=చెప్పినటువంటి; యాత్రాక్రమంబు=యాత్రల వరుస; అది=అదే యాత్రాక్రమము; అమరముని=దేవమునియైన; నారదుఁడు=నారద మహర్షి; మునీంద్రాదులకునున్=వసిష్ఠ మహర్షి మొదలగు వారికిని; అర్థిన్=ఆసక్తితో; చెప్పిన=చెప్పినటువంటి; పరిపాటి=తగిన వరుస; వినుండు=వినుడు.

భావము :- ఓ మహర్షులారా! శ్రీ భీమేశ్వర మాహాత్మ్యమునకు సంబంధించి మీరడిగిన విషయములను వ్యాసునకు అగస్త్యుడు చెప్పినటువంటిది. అదే విషయమును నారదుడు వసిష్ఠముని మొదలగు వారికిని చెప్పిన వరుసన మీకు నేను చెప్పెదను వినుడు.

వ॥ మీర లడిగిన యర్థంబుఁ బర్యాయ క్రమంబున వినిపించెద. 4

అర్థము :- మీరలు+అడిగిన=మీరడిగిన; అర్థంబు=విషయమును; పర్యాయ క్రమంబున=ఒకదాని తరువాత ఒకటిగ (తగిన వరుసలో); వినిపించెద=చెప్పెదను.

భావము :- ఓ మునులారా! మీరడిగిన విషయములను తగిన వరుసలో వివరించి చెప్పెదను.

తే॥ “పోయె వారణాసికి బాదరాయణుండు
శిష్యులును దాను గైవల్య సిద్ధిఁగోరి
మనము పోదము గా” కంచు మనసు వేడ్క
నరిగి రభ్యర్థితులు వసిష్ఠాది మునులు. 5

అర్థము :- బాదరాయణుండు=వ్యాస మహర్షి; శిష్యులును+తాను=శిష్యులును తానును; కైవల్య సిద్ధిన్=మోక్షప్రాప్తిని; కోరి=కోరుకొని; వారణాసికి=కాశీనగరమునకు; పోయె= వెళ్ళెను; మనము పోదముగాక=మనము కూడ వెళ్ళుదము; అంచు=అనుచు; అభ్యర్థితులు= పూజింపతగినవారైన; వసిష్ఠాది=వసిష్ఠుడు మొదలైన; మునులు=ఋషులు; మనసు వేడ్కన్= మనసులలోని కుతూహలముతో; అరిగిరి=(కాశీనగరమునకు) వెళ్ళిరి.

భావము :- "మోక్షమును పొందగోరి వ్యాసమహర్షి శిష్యులతో కాశీనగరమునకు వెళ్ళెను కదా! మనము కూడ వెళ్ళుదము". అని పూజ్యులైన వసిష్ఠాది మహర్షులును కాశీనగరమును చేరిరి.

కం॥ యాత్రాజిగమిషఁ బుణ్య
క్షేత్రంబుల మీఁదఁ దీర్థ సేవాపరులై
మైత్రావరుణ బృహస్ప
త్యత్రి భరద్వాజ ముఖ్యులగు ముని ఋషభుల్. 6

అర్థము :- మైత్రావరుణ=వసిష్ఠుడు; బృహస్పతి=బృహస్పతియు; అత్రి=అత్రియు; భరద్వాజ ముఖ్యులగు=భరద్వాజుడు మొదలగు; ముని ఋషభుల్=మునిశ్రేష్ఠులు; యాత్రా జిగమిషన్=యాత్రలకు వెళ్ళు కోరికతో; పుణ్యక్షేత్రంబుల మీఁదన్=పవిత్ర స్థలములందలి; తీర్థ సేవాపరులై=పవిత్ర జలములను సేవించుటయందు ఆసక్తి కలవారై; (తర్వాతి పద్యముతో అన్వయము).

భావము :- వసిష్ఠుడు, బృహస్పతి, అత్రి, భరద్వాజుడు మొదలగు మునిశ్రేష్ఠులు తీర్థయాత్రలు చేయు పూనిక తోడను, పుణ్యస్థలములందలి పవిత్ర జలములను సేవింపవలె నను కోరిక తోడను -

ఉ॥ కాశికి నేగుదెంచి మణికర్ణిక యందుఁ బ్రయాగ యందు నా
కాశ నదీ ప్రవాహమునఁ గాయము దొప్పగఁ దోఁగి శంభు వి
శ్వేశు శశాంక శేఖరు ననేక విధంబులఁ గొల్చి సంతత
క్లేశ వినాశ హేతువునఁ గేవలతా సుఖ మిచ్చఁగోరుచున్. 7

అర్థము :- కాశికిన్+ఏగుదెంచి=కాశీ నగరమునకు వచ్చి; మణికర్ణిక యందున్= మణికర్ణిక యనెడి ఘట్టమునందును; ప్రయాగయందున్=ప్రయాగ అనెడి ఘట్టము నందును; ఆకాశ నదీ ప్రవాహమునన్ = గంగా ప్రవాహమధ్యము నందును; కాయము = శరీరమును; దొప్పగన్+తోఁగి=బాగుగా ముంచి; సంతత=అంతులేని; క్లేశ=కష్టములు; వినాశ=నశించుట యను; హేతువునన్= కారణము చేత; కేవలతాసుఖము=అచ్ఛమైన సుఖమును(మోక్షమును); ఇచ్చన్=మనసులో; కోరుచున్=కోరుకొనుచు; శంభున్=సుఖమును కల్గించు వానిని; విశ్వేశు= విశ్వమంతటికి ప్రభువైన వానిని; శశాంక శేఖరున్=కుందేటి గుర్తు(మచ్చ) కల చంద్రుని శిరస్సున ధరించిన శివుని; అనేక విధంబులన్=అనేకములైన రీతులలో; కొల్చి=సేవించి.

భావము :- బృహస్పతి మొదలగు మునీశ్వరులు కాశీనగరమునకు వచ్చిరి. మణికర్ణికా ఘట్టములోను, ప్రయాగ ఘట్టములోను, గంగా ప్రవాహమధ్యము నందును స్నానమాడిరి.

అంతములేని కష్టములు నశించుటను, మోక్షమును కోరి కాశీ విశ్వేశ్వరుని అనేక విధముల సేవించిరి.

**విశేషము :-** ప్రయాగ :- కాశిలో గంగానది యొడ్డున కల అనేక ఘట్టములలో ప్రయాగ అను ఘట్ట మొకటి.

**కం॥ "కేవల తాయకరంబును**
**భావలతా వాటి మలయ పవనాగమమై**
**కేవలతా లీలావతి**
**కే వల తా కాశి మరగు కృతమతి మనసా!" 8**

**అర్థము :-** కృతమతి=సుశిక్షితమైన; మనసా=ఓ హృదయమా! కేవలత=ఏకైకమైన; అయకరంబును=శుభమును కూర్చునది; భావ.....గమమై; భావలతా=భావములనెడి తీగలుగల; వాటి=తోటకు; మలయ పవన=మలయ మారుతము (మలయ పర్వతము వైపు నుండి వీచు గంధ పరిమళముగల గాలుల) యొక్క; ఆగమమై=రాకయై; కేవలతా.....కాశి. కేవలతా=మోక్షమనెడి; లీలావతికే=కాంతకు; వల=కుడియైన; కాశి=కాశీ తీర్థమునందు; తా=నీ యంతట నీవుగా; మరగు=అలవాటు పడుము.

**భావము :-** "సుశిక్షితమైన ఓ మనసా! కాశీ క్షేత్రము ముక్తిదాయకము. భావములనెడి తీగలుకల తోటకు మలయ మారుతము. మోక్ష లక్ష్మికి ఒప్పిదమైనట్టిది. అట్టి కాశీ తీర్థమునకు నీకు నీవుగ స్వాధీనమగుము."

**విశేషము :-** ఈ పద్యమున త్రిప్రాసము వేయుట జరిగినది. భీమ 1-77లో ద్విప్రాసము కలదు. శ్రీనాథ మహాకవి ఇట్లు వ్రాయుట చాల తక్కువ.

**వ॥ అని కాశీనగరంబునందుఁ గైవల్యాపేక్షఁ బెద్దకాలంబుండ నిశ్చయించి సాత్యవతేయు వెదకి యెచ్చుటం గానక. 9**

**అర్థము :-** అని=అని భావించి; కాశీనగరంబునందున్=కాశీ నగరమున; కైవల్య+అపేక్షన్=మోక్షమును పొందవలెనను కోరికతో; పెద్దకాలంబు+ఉండన్=చాల కాలముండుటకై; నిశ్చయించి=నిర్ణయించి; సాత్యవతేయున్=సత్యవతీ కుమారుడైన వ్యాసుని; వెదకి=వెదకి; ఎచ్చుటన్=ఎక్కడను; కానక=చూడలేక -

**భావము :-** అని భావించి మోక్షమును కోరి కాశీనగరమున చాలకాలముండదలచి వ్యాసుని కొరకు వెదకిరి. కాశీనగరము నందెక్కడను వ్యాసుడు కనిపింపలేదు.

శా॥ కాశీస్థాన నివాసులన్ యతుల భిక్షా వృత్తులంగాంచి "పా
రాశర్యుండెటఁబోయె" నంచు నడుగన్ "బ్రజ్ఞా విహీనాత్మకుం
డా శుంఠుండెటఁబోయెనో యెఱుఁగ మయ్యా! మీరు పోపొండు వి
శ్వేశద్రోహి నెఱుంగ నేమిపని? వాఁడెచ్చోటికిం బోయెనో." 10

అర్థము :- కాశీస్థాన నివాసులన్=కాశీనగరమున స్థిర నివాసమున్న వారిని; యతులన్=సంన్యాసులను; భిక్షావృత్తులన్=బిచ్చగాళ్లను; కాంచి=చూచి; పారాశర్యుండు=పరాశరుని కుమారుడైన వ్యాసుడు; ఎటన్+పోయెన్=ఎచ్చటికి వెళ్లెను; అంచున్+అడుగన్=అని అడుగగా; ప్రజ్ఞా విహీన+ఆత్మకుండు=జ్ఞానము లేని ఆత్మ కలవాడైన; ఆశుంఠుండు=ఆ మూఢుడు; ఎటన్+పోయెన్=ఎచటికి వెళ్లెనో; ఎఱుఁగము+అయ్యా!=మాకు తెలియదయ్యా!; విశ్వేశద్రోహిన్=శంకరునకే కీడు చేసిన వానిని గూర్చి; ఎఱుఁగన్= తెలిసికొనుటకు; ఏమిపని=అవసరమేమి; వాఁడు=ఆ వ్యాసుడు; ఎచ్చోటికిన్=ఎచటికి; పోయెనో=వెళ్లెనో (తెలియదు); మీరు=మీరు; పోపొండు=పొండి.

భావము :- కాశీలో స్థిర నివాసమున్న వారిని, సంన్యాసులను, బిచ్చగాళ్లను వ్యాసుని గూర్చి అడుగగా వారు "అయ్యా! జ్ఞానము లేనివాడు, మూఢుడునైన ఆ వ్యాసుడు ఎచటికి వెళ్ళెనో తెలియదు. ఆ కాశీపతికే కీడు చేసిన అతనిని గూర్చి తెలిసికొను అవసరము లేదు. మీరు పొండి."

వ॥ అని సాత్యవతేయుండు చేసిన యపరాధంబు తేటపడంజెప్పిన - 11

అర్థము :- అని=అని; సాత్యవతేయుండు=వ్యాసుడు; చేసిన=చేసినట్టి; అపరాధంబు=తప్పిదమును; తేటపడన్=తెలియునట్లు; చెప్పినన్=చెప్పగా;

భావము :- అని వారు వ్యాసుడు చేసిన తప్పిదమును తెలియజెప్పగా.

తే॥ కూడు పెట్టక యేన్నాళ్ళు కుతిలపఱచి
గాసి సేయుట యిది తప్పు గాదె తనకు?
నెదురు కెదురేల కోపించె నిందుధరుఁడు
అకట గ్రుడ్డెఱ్ఱ బాదరాయణుని మీఁద. 12

అర్థము :- కూడు పెట్టక=అన్నము పెట్టక; ఏడు+నాళ్ళు=ఏడు దినములు; కుతిల పఱచి=బాధపెట్టి; గాసిసేయుట=బాధపెట్టుటయను; ఇది=ఈ పని; తనకున్=తనకు (శివునకు); తప్పు+కాదె=దోషము కాదా!; అకట=అయ్యో!; ఇందుధరుఁడు=చంద్రశేఖరుడైన

శివుడు; బాదరాయణుని మీఁద=వ్యాసునిపై; గ్రుడ్డెఱ్ఱన్=కన్నెఱ్ఱ చేయుచు; ఎదురుకెదురు=బదులుకు బదులుగా; ఏల కోపించెన్=ఎందులకు కోపించెను.

భావము :- ఏడు దినములు అన్నము లేకుండ చేసి వ్యాసుని బాధపెట్టి శుష్కింపజేయుట ఆ ఈశ్వరునకు తప్పుకాదా! అయ్యో! ఆ శివుడు బదులుకు బదులుగ తానేల ఆ వ్యాసునిపై కన్నెఱ్ఱ చేసెను.

కం॥ ద్వైపాయన ముని వెడలం
ద్రోపించిన కోపగాఁడు ధూర్జటి యీ కా
శీపతి మనలను ననుకం
పాపరుఁడై యిచట నేల బ్రతుకఁగ నిచ్చున్. 13

అర్థము :- ధూర్జటి=బరువైన జడలుగల; ఈ కాశీపతి=ఈ కాశీనాథుడైన శివుడు; ద్వైపాయనమునిన్=వ్యాస మహర్షిని; వెడలన్+ద్రోపించిన=వెళ్లగొట్టించిన; కోపగాఁడు=కోపదారి; మనలన్=మనలను; అనుకంపాపరుఁడై=దయ కలవాడై; ఇచటన్=ఈ కాశీనగరమున; ఏల=ఎందులకు; బ్రతుకఁగనిచ్చున్=బ్రతుకనిచ్చును.

భావము :- వ్యాస మహర్షిని కాశీనగరము నుండి వెడల గొట్టించిన కోపదారి ఈ ధూర్జటి. మనలను మాత్రము ఈ కాశీ విశ్వేశ్వరుడు దయాహృదయుడై ఈ నగరమున బ్రతుకనిచ్చునా!

వ॥ "కృష్ణద్వైపాయను తోడిద లోకంబుగాక" యనుచు నమ్ముని లోకంబు కాశీ నగరంబు వెలువడి శాఖోపశాఖల నతని చొప్పు పట్టుకొని దక్షారామంబు ప్రవేశించి. 14

అర్థము :- ఆ+మునిలోకంబు=ఆ మునుల సమూహము; కృష్ణద్వైపాయను తోడిద=వ్యాసునితో కలసియుండుటయే; లోకంబుగాక=సర్వస్వము కావలెను; అనుచు=అని భావించుచు; కాశీనగరంబు=కాశీనగరము నుండి; వెలువడి=బయటకు వచ్చి; శాఖ+ ఉపశాఖలన్=గుంపులు గుంపులుగా చీలి; అతని=ఆ వ్యాసుని; చొప్పు=జాడ; పట్టుకొని= అనుసరించి; దక్షారామంబున్=దక్షారామ క్షేత్రమును; ప్రవేశించి=చేరి.

భావము :- బృహస్పతి మొదలగు మునులు తమకు వ్యాసుని తోడిదే లోకముగ భావించి అందరు ఆ వ్యాసుని మార్గమునే అనుసరించి కాశీనగరమును వదలి పెట్టి దక్షారామమును చేరిరి.

విశేషము :- ఒక్క పద్యములో కథాస్థలమును శ్రీనాథ మహాకవి కాశినుండి దక్షారామమునకు మార్చినాడు. ఇట్లే ఒక్క పద్యములో (భీమ 2-51) కథాస్థలమును కాశి నుండి ఆంధ్రదేశమునకు మార్చినాడు.

తే॥ తీర్థయాత్రాక్రమంబులు తెలియలేక
నారదుండు నానా పురాణజ్ఞుఁడగుట
నతనిఁ బూజించి యందఱు నడిగి రప్పు
డత్రి జమదగ్ని భృగు వసిష్ఠాది మునులు. 15

అర్థము :- అత్రి=అత్రి; జమదగ్ని=జమదగ్ని; భృగు=భృగువు; వసిష్ఠ+ఆది=వసిష్ఠుడు మొదలగు; మునులు=ఋషులు; తీర్థయాత్రాక్రమంబులు=తీర్థయాత్ర వరుసలు; తెలియలేక=తెలిసికొనలేక; నారదుఁడు=నారద మహర్షి; నానా=అనేకములైన; పురాణజ్ఞుఁడు+అగుటన్=పురాణములు తెలిసిన వాడగుట చేత; అతనిన్=ఆ నారద మునిని; పూజించి=పూజచేసి; అప్పుడు=అపుడు; అందఱు=అందరు కలసి; అడిగిరి=(తీర్థయాత్రా క్రమమునుగూర్చి) అడిగిరి.

భావము :- అత్రి, జమదగ్ని, భృగువు, వసిష్ఠుడు మున్నగు మహర్షులందరు తీర్థయాత్రాక్రమము నెరుగ లేక నారదముని నానా పురాణ విషయములు తెలిసిన వాడు గావున ఆయనను ప్రార్థించి పూజించి తరువాత తీర్థయాత్రాక్రమమును గూర్చి అడిగిరి.

మత్త॥ "నీ వెఱుంగని తీర్థముల్ ధరణీ తలంబున లేవు స
ద్భావ మొప్పఁగ జెప్పు దైవత తాపసోత్తమ! తీర్థయా
త్రా విధానము దక్షవాటి కథాక్రమంబును, సప్త గో
దావర ప్రథిమంబు, భీమ సదాశివోద్భవ లీలయున్." 16

అర్థము :- దైవత తాపస+ఉత్తమ=దేవ మునిశ్రేష్ఠుడా! (ఓ నారద మహర్షి); ధరణీ తలంబున=భూమండలము మీద; నీవు+ఎఱుంగని=నీవు తెలిసికొనని; తీర్థముల్=పుణ్యక్షేత్రములు; లేవు=లేవు. తీర్థయాత్రా విధానము=తీర్థయాత్రలు చేయు పద్ధతిని; దక్షవాటి=దక్షారామము యొక్క; కథాక్రమంబును=కథయొక్క వరుసను; సప్త గొదావర=సప్త గోదావరము యొక్క; ప్రథిమంబు=గొప్పతనమును; భీమ=భీముడను పేరుగల; సదాశివ=శంకరుని యొక్క; ఉద్భవ=ఆవిర్భావమను; లీలయున్=క్రీడయును; సద్భావము=మంచి అభిప్రాయము; ఒప్పఁగన్=తేటపడునట్లుగా; చెప్పు=చెప్పుము.

భావము :- "ఓ నారద మహర్షీ! ఈ భూమండలము మీద నీవెరుగని పుణ్యతీర్థములు లేవు. మాకు ఇచటి తీర్థయాత్రా విధానమును, దక్షారామ కథను, సప్త గోదావరము గొప్పతనమును, శంకరుడు ఈ దక్షారామమున శ్రీ భీమేశ్వరుడుగ వెలసిన లీలా విలాసమును సద్భావము తేటపడునట్లు వివరింపుము."

విశేషము :- మత్తకోకిల వృత్తమునకు "ర-స-జ-జ-భ-ర-" గణములు. యతిమైత్రి స్థానము పదునొకండవ అక్షరము.

వ॥ అని యడిగిన నారదుండిట్లనియె. 17

అర్థము :- అని+అడిగిన=అని ఋషులడుగగా, నారదుండు=నారద మహర్షి, ఇట్లనియె=ఈవిధముగా అనెను.

భావము :- అని మునులడుగగా నారద మహర్షి ఈవిధముగా చెప్పెను.

తే॥ అఖిల తీర్థోత్తమోత్తమం బనఘులార!
పావనంబైన సప్తగోదావరంబు
తనకుఁదాన మహానదీతటమునందు
నెలమినున్నాఁడు భీమేశ్వరేశ్వరుండు. 18

అర్థము :- అనఘులార=పాపము లేనివారా! (ఓ మునులారా); పావనంబు+ఐన= పవిత్రమైన; సప్తగోదావరంబు=సప్తగోదావరమనెడి యీ తీర్థము; అఖిల తీర్థ=సమస్తమైన పుణ్యక్షేత్రములలో; ఉత్తమ+ఉత్తమంబు=మిక్కిలి శ్రేష్ఠమైనది; మహానదీ=ఈ గొప్ప నది యొక్క; తటమునందు=ఒడ్డున; భీమేశ్వరేశ్వరుండు=శ్రీ భీమేశ్వరస్వామి; ఎలమిన్=ప్రేమతో; తనకున్+తాన=తనకు తానుగనే; ఉన్నాడు=వెలసియుండెను.

భావము :- ఓ మునులారా! సప్తగోదావరమనెడి యీ పవిత్ర తీర్థము తీర్థములలోకెల్ల సర్వశ్రేష్ఠమైనది. శ్రీ భీమేశ్వరస్వామి ఈ మహానది ఒడ్డున తనకు తానుగ ప్రేమతో వెలసియుండెను.

తే॥ సప్తగోదావరంబు నిర్ఝరమనంగ
భీమనాథేశ్వరస్వామి వేలుపనఁగ
ధర్మపరులార! శబ్ద భేదంబ గాని
యర్థ భేదంబు లేదు పదార్థ సరణి. 19

అర్థము :- ధర్మపరులార=ధర్మముల నాచరించుటయందు ఆసక్తికల ఓ మునులారా!; సప్తగోదావరంబు=సప్తగోదావరమును; నిర్ఝరము+అనంగ=నదియనుట; భీమనాథేశ్వరస్వామి= శ్రీ భీమేశ్వరుని; వేలుపు+అనఁగ=దేవుడనుట; శబ్దభేదంబ+కాని= శబ్దములలో భేదమేకాని; పదార్థ సరణిన్=వస్తురీతిలో; అర్థభేదంబు=పరమార్థమునందు భేదము; లేదు=లేదు.

భావము :- ఓ మునులారా! సప్తగోదావరము నదియని శ్రీ భీమనాథుడు దేవుడని చెప్పుట సామాన్య భావన. కాని సప్తగోదావరము, భీమనాథేశ్వరుడు అను పదములే భిన్నములు గాని పరమార్థమొకటే. ప్రయోజనమునందు భేదము లేదు.

విశేషము :- శ్రీ భీమేశ్వర స్వామికి, సప్తగోదావరమునకు శక్తియందు అభేదము చెప్పబడినది. ఈ ఆశ్వాసమునందలి 22, 23 శ్లోకములందును చెప్పబడినది. సప్తగోదావరము - చూడుడు - 3ఆ - 7ప.

గోదావరి శాఖలు :- తుల్యాత్రేయీ భరద్వాజీ గౌతమీ వృద్ధ గౌతమీ
కౌశికీచ వసిష్ఠాచ సప్తశాఖాః ప్రకీర్తితాః

అని సంప్రదాయ శ్లోకము.

కాని గౌతమీ, వాసిష్ఠ, విశ్వామిత్ర, వామదేవి, భారద్వాజ, ఆత్రేయ, జామదగ్ని - గోదావరి శాఖలు - అని మధునాపంతుల - తెలుగునాట దేవాలయాలు - పుట - 27.

తే॥ **విమలమతి సప్తగోదావరమునఁగ్రుంకి**
**సప్త సప్తి ప్రతిష్ఠఁ బ్రసన్నుఁడైన**
**భీమనాథేశ్వరేశ్వర స్వామిఁజూచు**
**మనుజులకుఁ బాయు సప్తజన్మముల యఘము.** 20

అర్థము :- విమలమతిన్=పవిత్రమైన మనస్సుతో; సప్తగోదావరమునన్=సప్తగోదావరమనెడి తీర్థమున; క్రుంకి=మునిగి (స్నానము చేసి); సప్త సప్తి=(ఏడు గుఱ్ఱముల రథము నధిరోహించు) సూర్యుని యొక్క; ప్రతిష్ఠన్=ప్రతిష్ఠచేత; ప్రసన్నుఁడు+ఐన=అనుగ్రహము కలవాడైన; భీమనాథేశ్వరేశ్వర స్వామిన్=శ్రీ భీమేశ్వరుడను పేరుతో వెలసిన శంకరుని; చూచు=చూచెడి; మనుజులకున్=మానవులకు; సప్త జన్మముల=ఏడు జన్మములందలి; అఘము=పాపము; పాయున్=నశించును.

భావము :- పవిత్రమైన హృదయముతో సప్తగోదావరమున స్నానమాడి సూర్యునిచే ప్రతిష్ఠింపబడిన అనుగ్రహమూర్తియైన శ్రీ భీమనాథేశ్వరుని దర్శించు మానవులకు ఏడు జన్మములందలి పాపములు నశించును.

వ॥ **సప్తగోదావర స్నాన మంత్రద్వయ శ్లోకములు.** 21

అర్థము :- సప్తగోదావర=సప్తగోదావరమనెడి తీర్థమునందు; స్నాన=స్నానము చేయుటకు; మంత్రద్వయ=రెండు మంత్రములగు; శ్లోకములు=శ్లోకములు.

భావము :- సప్తగోదావర తీర్థమున పవిత్ర స్నానము చేయుటకు రెండు మంత్రములగు శ్లోకములు.

శ్లో॥ **సప్తగోదావరం తీర్థం సర్వతీర్థోత్తమోత్తమమ్**
**అత్ర సన్నిహితో రుద్రో భీమనాథేశ్వరేశ్వరః** 22

శ్లో॥ నమస్తే భీమనాథాయ సప్తగోదావరాంభసే
పాపేంధనాగ్నయే తుభ్యం నిమజ్జామి హర! త్వయి. 23

అర్థము :- సప్తగోదావరం=సప్తగోదావరమనెడి; తీర్థం=పవిత్ర తీర్థము; సర్వతీర్థ=అన్ని తీర్థములందును; ఉత్తమ+ఉత్తమమ్=సర్వశ్రేష్ఠమైనది; అత్ర=ఇక్కడ, దీనియందు; భీమనాథేశ్వరేశ్వరః=శ్రీ భీమనాథేశ్వరుడు అను పేరుగల; రుద్రః=శివుడు; సన్నిహితః=సన్నిధిచేసి (వెలసి) యున్నాడు;

భీమనాథాయ=శ్రీ భీమనాథుడను; తే=నీకు; నమః=నమస్కారము; సప్తగోదావర+అంభసే=సప్తగోదావరమందలి నీటిని కలవానికి; పాప+ఇంధన=పాపములనెడి కట్టెలకు; అగ్నయే=నిప్పు అయిన; తుభ్యం=నీకు; నమః=నమస్కారము; హర=ఓ భీమనాథేశ్వరా! త్వయి=నీయందు; నిమజ్జామి=మునుగుచున్నాను.

భావము :- సప్తగోదావరమొక పవిత్ర తీర్థము. తీర్థములన్నింటిలో ఉత్తమోత్తమమైనది. దీనియందు (ఇక్కడ) శంకరుడు శ్రీ భీమనాథేశ్వరుడను పేరుతో వెలసియుండెను.

శ్రీ భీమేశ్వరా! నీకు నమస్కారము. సప్తగోదావర జలములు కలవాడవు. పాపములనెడి కట్టెలకు అగ్నివి నీవు. అట్టి నీకు నమస్కరించుచుంటిని. ఓ హరా! నీయందు మునుగుచుంటిని.

విశేషము :- ఈ రెండు శ్లోకములు సంస్కృత భీమఖండమునందును (అధ్యా-14; శ్లో 30, 31) యథాక్షరముగ నున్నవి.

ఉ॥ ఆతత భక్తి భావమున నాది యుగంబున సప్తసంయముల్
గౌతమ ముఖ్యు లైందవ కళాధరు భీమయదేవు భక్తివి
స్ఫీతిఁబ్రతిష్ఠ చేసి యభిషేక జలార్థము తోడితెచ్చి ర
న్వీత సమస్త తీర్థమయి విశ్రుతి కెక్కిన సప్త సింధువున్. 24

అర్థము :- ఆది యుగంబున=మొదటి (కృత) యుగమున; సప్తసంయముల్=ఏడుగురు మునులు (సప్తర్షులు); గౌతమ ముఖ్యులు=గౌతముడు మొదలైనవారు; ఆతత=విశాలమైన; భక్తి భావమునన్=భక్తి భావముతో; ఐందవ కళాధరున్=చంద్రరేఖను ధరించిన వానిని; భీమయదేవున్=శ్రీ భీమేశ్వర స్వామిని; భక్తి విస్ఫీతిన్=భక్తి యొక్క వైశాల్యముచే; ప్రతిష్ఠచేసి=స్థాపించి; అభిషేక=(శంకరునకు) స్నానము చేయించుటకు తగిన; జల+అర్థము=నీటి కొరకు; అన్వీత=కూడుకొనిన; సమస్తతీర్థమయి=అన్ని తీర్థములు కలదై; విశ్రుతికి+ఎక్కిన=ప్రసిద్ధి పొందిన; సప్త సింధువున్=సప్త గోదావరమును; తోడి తెచ్చిరి=తీసికొని వచ్చిరి.

భావము :- కృతయుగమునందు గౌతముడు మొదలైన సప్తర్షులు నిండైన

భక్తిభావముతో చంద్రశేఖరుడైన శ్రీ భీమేశ్వరస్వామిని ప్రతిష్ఠచేసి ఆయనకు అభిషేకము చేయుటకై అన్ని తీర్థములతో కూడుకొన్న సప్తగోదావరమును తీసికొని వచ్చిరి.

మ॥ తన తీరంబునుఁ బాయకున్నఁ దనపాథః పూరముల్ గ్రోలినం
దన వీచీతతిఁ దేలినం దనమరుద్వ్రాతంబు సేవించినం
దనుఁ గీర్తించిన లోకపావనునిఁగా ధన్యాత్ముఁగాఁబుణ్యుఁగా
నొనరించున్ నరు సప్త సింధువది యంహో భంజన ప్రౌఢిమన్. 25

అర్థము :- సప్తసింధువు+అది=ఆ సప్త గోదావరము; తన తీరంబునున్=తన ఒడ్డును; పాయక+ఉన్నన్=విడువకున్నను; తన=తనయొక్క; పాథఃపూరముల్=జలప్రవాహములను; గ్రోలినన్=త్రాగినను; తన=తన యొక్క; వీచీతతిన్=అలలసమూహమున; తేలినన్=తేలియాడి నను; తన=తన యొక్క; మరుత్+వ్రాతంబు=గాలుల సమూహమును; సేవించినన్= ఆఘ్రాణించి నను; తను=తన్ను; కీర్తించినన్=కొనియాడినను; అంహస్=పాపములను; భంజన=నశింపజేసెడి; ప్రౌఢిమన్=గొప్పతనముచే; నరున్=మానవుని; లోకపావనునిఁగాన్= లోకమున పవిత్రమైన వానిగను; ధన్యాత్ముఁగాన్=ధన్యమైన ఆత్మకలవానిగను; పుణ్యుఁ గాన్=పుణ్యమూర్తి గను; ఒనరించున్=చేయును.

భావము :- సప్తగోదావరము తనకుగల పాపనాశన ప్రౌఢిచేత మానవుడు తన తీరమును విడువక యుండినను, తన నీటిని త్రాగినను, తన అలలపై తేలియాడినను, తన గాలులను పీల్చినను, తన్ను కీర్తించినను - ఆ నరుని లోకపావనునిగ, ధన్యాత్మునిగ, పుణ్యాత్మునిగను చేయును.

కం॥ చూడుం డాస్వాదింపుం
డాడుఁడు భీమేశ్వరేశ్వ రాకృతిఁ దటినీ
చూడారత్నము జడధి
క్రోడాభరణంబు సప్తగోదావరమున్. 26

అర్థము :- భీమేశ్వరేశ్వర=శ్రీ భీమనాథుని; ఆకృతిన్=రూపమును; తటినీ=నదులకు; చూడారత్నము=శిరోభూషణమును; జడధి=సముద్రమునకు; క్రోడ+ఆభరణంబు= వక్షస్థలమందలి నగయైన; సప్తగోదావరమున్=సప్తగోదావర తీర్థమును; చూడుండు=తనివి తీర చూడుడు; ఆస్వాదింపుడు=చవిచూడుడు; ఆడుఁడు=కొనియాడుడు.

భావము :- శ్రీ భీమేశ్వరస్వామిది దివ్యరూపము. నదులలో తలమానికమైనది సప్తగోదావరము. సముద్రమునకు వక్షస్థలాభరణము. అట్టి శ్రీ భీమేశ్వరస్వామిని, అట్టి సప్తగోదావరమును చూడుడు, ఆస్వాదింపుడు, కీర్తింపుడు.

సీ॥ పాతాళ శ్రీకాలభైరవస్వామికి
నందికి నభివాదనం బొనర్చి
నాకులేశ్వర దేవునకుఁ దాండవాకార
గణనాయకునకును బ్రణతి సేసి
కొమరసామిని విష్ణుఁ గొల్చి విరూపాక్ష
నాగేంద్రులకు వందనంబు నడిపి
నీహారగిరి నందినికి మహాలింగంబు
భీమనాథేశ్వరస్వామి కెరఁగి

తే॥ మర్త్యుఁడేకాదశేంద్రియ మదవికార
సంభృతములై యనన్యైక సాధ్యములయి
జన్మ జన్మాంతరంబులఁ జాగుచుండు
కల్మషంబులఁ బాయుఁద త్క్షణము నంద. 27

అర్థము :- పాతాళ=భూమిలోపలగల; శ్రీకాలభైరవస్వామికి=శ్రీకాలభైరవ దేవునకును; నందికిన్=శివుని వాహనమైన నందికిని; అభివాదనంబు=నమస్కారమును; ఒనర్చి=చేసి; నాకులేశ్వర దేవునకున్=నాకులేశ్వరుడను దేవునకును; తాండవ+ఆకార=తాండవము చేయుచున్నట్లు రూపముకల; గణనాయకునకున్=వినాయకునకును; ప్రణతి=నమస్కారమును; చేసి=చేసి;

కొమర సామిన్=కుమారస్వామిని; విష్ణున్=విష్ణువును; కొల్చి=పూజించి; విరూపాక్ష=బేసి కన్నులుగల ముక్కంటికి; నాగేంద్రులకు=నాగరాజైన వాసుకికి; వందనంబు=నమస్కారమును; నడిపి=చేసి;

నీహారగిరి నందినికి=హిమవత్పర్వతుని పుత్రికయైన పార్వతికి; మహాలింగంబు=గొప్ప లింగాకారుడైన; భీమనాథేశ్వర స్వామికిన్=శ్రీ భీమేశ్వరస్వామికిని; ఎరఁగి=నమస్కరించి;

మర్త్యుఁడు=జీవి; ఏకాదశ=పదునొకండు, ఇంద్రియ= ఇంద్రియముల వలన కలుగు; మదవికార=గర్వము, తెగులుతో; సంభృతములై=పోషింపబడినవై; అనన్య+ఏక+ సాధ్యములయి=మరేవిధముగను సాధ్యముకాని; జన్మ జన్మాంతరంబులన్=ఈ జన్మమునందును, ఇతర జన్మముల యందునను; చాగుచుండు=కొనసాగుచున్న; కల్మషంబు=పాపములను; తత్+క్షణమునంద=ఆ క్షణమునందే; పాయున్= విడచును.

భావము :- పాతాళ శ్రీకాలభైరవునకు, నందికి నమస్కరించి; నాకులేశ్వరునకు, తాండవ గణనాయకునకు మ్రొక్కి; కుమారస్వామిని, విష్ణువును సేవించి; విరూపాక్షునకు,

నాగేంద్రునకు వందనము చేసి; పార్వతీదేవికిని, శ్రీ భీమేశ్వరస్వామికిని సాగిలపడి నమస్కరించి-జీవి పదునొకండింద్రియముల వలన కలుగు గర్వము, తెగులులతో పోషింపబడి జన్మ జన్మాంతరములందు కొనసాగుచు మరేవిధముగను నాశముగాని పాపములను నాశము చేసికొనవచ్చును.

విశేషము :- నాకులేశ్వరుఁడు :- నకులుడను పాశుపతునిచే ప్రతిష్ఠింపబడిన శివలింగము గనుక నాకులేశ్వరుడును నామమేర్పడినది.

ఏకాదశేంద్రియములు :- జ్ఞానేంద్రియములు ఐదు :- చర్మము, కన్నులు, చెవులు, ముక్కు, నాలుక - అనునవి; కర్మేంద్రియములు ఐదు :- వాక్కు, చేతులు, కాళ్లు, గుదము, మర్మావయవము - అనునవి; ఒకటి=మనస్సు; మొత్తము పదునొకండు.

శా॥ జ్ఞానాజ్ఞాన కృతంబులైన యఘముల్ సర్వంబు నొక్కెత్తున
న్మాను న్మానవ కోటి కుద్ధరగతి న్సప్తాపగా తీర సం
స్థానావాసుని రామనాథుని జటాఝూటాటవీ వాటికా
స్థానాధిష్ఠిత దుర్గ కంఠ నవ ముగ్ధ స్నిగ్ధ కీర్తిద్యుతిన్. 28

అర్థము :- సప్తాపగా=సప్తగోదావరము యొక్క; తీర=ఒడ్డు అనెడి; సంస్థాన=శ్రేష్ఠమైన ప్రదేశము; ఆవాసుని=నివాసముగ కలవానిని; రామనాథుని=రామనాథేశ్వరుడను శంకరుని; జటా.....ద్యుతిన్; జటా ఝూట=జడల సమూహమనెడి; అటవీ వాటికా=అరణ్యముల వరుసకు; ఆస్థాన=ప్రదేశమగు కంఠమును; అధిష్ఠిత=ఆశ్రయించిన; దుర్గ=కోటవంటి, కంఠ= కంఠ భాగమునందలి; నవ=మృదువైన; ముగ్ధ=అందమైన; స్నిగ్ధ=చక్కని; కీర్తి=యశము యొక్క; ద్యుతిన్=కాంతి వలన; మానవకోటికి=నరులందరికి; జ్ఞాన+అజ్ఞాన+కృతంబులైన= తెలిసిగాని తెలియకగాని చేయబడినవైన; అఘముల్=పాపములు; సర్వంబు=అన్నియు; ఒక్క+ఎత్తునన్=ఒక్కసారిగా; ఉద్ధరగతిన్=సమర్థముగా; మానున్=పోవును.

భావము :- సప్తగోదావర తీరము నందుండు శ్రీరామనాథుని యొక్క మహారణ్య సదృశమైన జటాజూటమును దాల్చిన కంఠము నందలి నవీన సుందర కీర్తి కాంతివలన మానవులకు తెలిసి చేసినవియు; తెలియక చేసినవియునగు పాపములన్నియు ఒక్కసారిగ పూర్తిగ నశించును.

తే॥ ద్వాదశక్షేత్ర శివలింగ దర్శనమున
నెట్టి సుకృతంబు సిద్ధించునట్టి సుకృత
మా క్షణంబున సిద్ధించు దక్షవాటి
రామనాథేశుఁగన్నులారంగఁ గనిన. 29

అర్థము :- ద్వాదశ=పండ్రెండు; క్షేత్ర=పుణ్యక్షేత్రములందలి; శివలింగ= శివలింగ మూర్తులను; దర్శనమునన్=చూచుటచేత; ఎట్టి=ఎటువంటి; సుకృతంబు=పుణ్యము; సిద్ధించున్=కలుగునో; అట్టి=అటువంటి; సుకృతము=పుణ్యము; దక్షవాటి=దక్షారామము నందలి; రామనాథేశున్=శ్రీరామనాథేశ్వరుని; కన్నులారంగన్=కనులార; కనినన్=చూచినచో; ఆక్షణంబ=ఆ వెంటనే; సిద్ధించున్=కలుగును.

భావము :- భీమమండలములోని పండ్రెండు దివ్యక్షేత్రములందలి శివలింగ రూపములను దర్శించుట వలన ఎటువంటి పుణ్యము కలుగునో అటువంటి అంతటి పుణ్యము దక్షారామములోని శ్రీరామనాథేశ్వరుని కనులార చూచిన వెంటనే కలుగును.

విశేషము :- ద్వాదశ క్షేత్రములు :- చూ - 3వ ఆశ్వా. 103 నుండి 157.

తే॥ ద్వాదశక్షేత్ర తీర్థ యాత్రాభివృద్ధి
నిర్జితేంద్రియులై సేయ నేర్చిరేని
పాపములు చేసినట్టి నిర్భాగ్యులైన
డాయఁ బోవరు జముని పట్టనము గవను. 30

అర్థము :- ద్వాదశ క్షేత్ర=పండ్రెండు (శైవ) క్షేత్రముల; తీర్థయాత్ర=తీర్థయాత్రలు చేయుటయందు; అభివృద్ధిన్=పెంపును; నిర్జిత+ఇంద్రియులై=జయింపబడిన ఇంద్రియ ములు కలవారై; చేయనేర్చిరేని=చేయగల్గినచో; పాపములు=పాపములను; చేసినట్టి=చేసినటు వంటి; నిర్భాగ్యులైన=దురదృష్టవంతులైనను; జముని పట్టనము=యమధర్మరాజు పట్టణపు; గవను=ద్వారమును; డాయన్=చేరుటకు; పోవరు=పోరు.

భావము :- పాపములు చేసినట్టి నిర్భాగ్యులైనను జితేంద్రియులై భీమమండలములోని పండ్రెండు శైవక్షేత్రముల తీర్థయాత్రలు చేసినచో యమపుర ద్వారమును గుహను సమీపింపరు.

ఉ॥ దక్షిణ కాశికాతుహిన ధామ కిరీటుని దిక్కు సీమగా
దక్షపురంబునందు బహుధామములన్ శివలింగముల్ సహ
స్రాక్ష హుతాశనాది వివిధామర ముఖ్య ప్రతిష్ఠితంబులై
లక్షల సంఖ్యలున్నవి యలక్ష్యములయ్యును గానవచ్చియున్. 31

అర్థము :- దక్షిణ.....కిరీటుని; దక్షిణ కాశికా=దక్షిణ కాశిగా ప్రసిద్ధి చెందిన దక్షారామమునందలి; తుహినధామ=వెన్నెల వెలుగైన చంద్రుని; కిరీటుని=కిరీటముగ గల శంకరుని; దిక్కు సీమగా=సరిహద్దుగా; దక్షపురంబునందు=దక్షారామమునందు; బహు= అనేకములైన; ధామములన్=చోటులందు; సహస్రాక్ష=ఇంద్రుడు; హుతాశన=అగ్ని; ఆది=

మొదలైన; వివిధ=అనేకులైన; అమర ముఖ్య=దేవతా ప్రముఖుల చేత; ప్రతిష్ఠితంబులై= స్థాపింపబడినవై; శివలింగముల్=శివలింగములు; కానవచ్చియున్=కనిపించియు; అలక్ష్యములు+అయ్యును=కనిపింపనివైనను; లక్షల సంఖ్యలు=లక్షలకొద్ది; ఉన్నవి=ఉన్నవి.

భావము :- దక్షిణ కాశిగా ప్రసిద్ధి పొందిన దక్షారామమునందు శ్రీ భీమేశ్వరలింగము సరిహద్దుగా ఇంద్రుడు, అగ్ని మొదలగు దేవతా ప్రముఖులు ప్రతిష్ఠించిన శివలింగములు లక్షలకొద్ది ఉన్నవి. అందుకొన్ని కన్పించుచున్నవి. కొన్ని కన్పించుట లేదు.

విశేషము :- "వివిధామర ముఖ్య ప్రతిష్ఠితంబులై" అను మూడవ పాదమున రేఫ సంయుక్తమగు "ప్ర"కు పూర్వాక్షరమైన "ఖ్య" లఘువు. రేఫ సంయుక్తమునకు పూర్వాక్షరము గురువు కావచ్చును. లఘువు కావచ్చును. విశేషములకు - చూడుడు భీమ - 3-164.

సీ॥ వలవ దగ్నిష్టోమ వాజపేయాదుల
ధూమపానముఁ జేసి దుఃఖ పడఁగఁ
దీర్థ సేవార్థమై దేశాంతరంబులు
గాలు చేడ్పడ దన కేల తిరుగ?
నశ్వ గో మహిష రూప్య సువర్ణ వస్త్రంబు
లెన్ని వెచ్చించిన నేమి ఫలము?
సంతతంబును గృఛ్ర చాంద్రాయణాదుల
వరటుచు నుంట యెవ్వరికి మెచ్చు?
తే॥ దూరమున నుండి తలఁచిన దురిత హరుని
జేరి కొలిచిన సకలార్థ సిద్ధికరుని
నంతి మావస్థ మోక్షదీక్షైక గురుని
భీమనాథేశ్వరేశ్వర స్వామిఁ గొలుఁడు. 32

అర్థము :- తనకు=తనకు (మానవునకు) అగ్నిష్టోమ=అగ్నిని పూజించుచు చేయు యజ్ఞము; వాజపేయ=నేయి మాత్రమే ఆహారముగ చేయు యాగము; ఆదుల=మొదలగు వానియందు; ధూమపానమున్=పొగను త్రాగుట; చేసి=చేసి; దుఃఖపడఁగన్=బాధపడుట; వలవదు=అక్కర లేదు;

తీర్థ సేవ+అర్థమై=పుణ్యక్షేత్రములను సేవించుట కొరకై; దేశాంతరంబులు=ఇతర ప్రదేశములను; కాలు చేడ్పడన్=పాదములు బాధించునట్లు; తిరుగన్=తిరుగుట; తనకు=నరునకు; ఏల=ఎందులకు;

అశ్వ.....వస్త్రంబులు. అశ్వ=గుఱ్ఱములను; గో=ఆవులను; మహిష=దున్నలను; రూప్య=ధనమును; సువర్ణ=బంగారమును; వస్త్రంబు=బట్టలను; ఎన్ని=ఎంతగ; వెచ్చించినను=దానము చేసినను; ఫలము=ఫలితము; ఏమి=ఏముండును;

సంతతంబునున్=ఎల్లప్పుడు; కృచ్ఛ్రచాంద్రాయణ=కృచ్ఛ్రచాంద్రాయణ వ్రతము; ఆదులన్=మొదలగు వ్రతముల నాచరించుచు; వరటుచున్+ఉంట=ఎండుచుండుట; ఎవ్వరికి=ఎవరికి; మెచ్చు=ప్రీతి కల్గించును;

దూరమున నుండి=దూర ప్రదేశమున నుండి; తలఁచినన్=భావించుటచేత; దురితహరునిన్=పాపములను పోగొట్టువానిని; చేరి=సమీపించి కొలిచిన=సేవించినచో; సకల=సమస్తమైన; అర్థ=కోరికలను; సిద్ధికరునిన్=నెరవేర్చు వానిని; అంతిమ=చివరిదైన; అవస్థన్=దశయందు; మోక్ష=ముక్తియను; దీక్షా=దీక్షకు; ఏకగురునిన్=ప్రధాన గురువైన; భీమనాథేశ్వరస్వామిన్=శ్రీ భీమనాథ మహాదేవుని; కొలుఁడు=సేవించుడు.

**భావము :-** అగ్నిష్టోమము, వాజపేయము మొదలగు యజ్ఞములు చేయునపుడు హోమకుండము నుండి వెలువడు పొగలను పీల్చి బాధపడనక్కరలేదు. తీర్థయాత్రలు చేయుటకై పాదములు నొచ్చునట్లు దేశదేశములు తిరుగనక్కరలేదు. గుఱ్ఱములను, ఆవులను, దున్నలను, ధనము, బంగారము మొదలగు వాని నెన్ని దానము చేసినను ప్రయోజన ముండదు. కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతములనాచరించి నిత్యము బాధపడుచు కృశింప నవసరము లేదు. శ్రీ భీమేశ్వరస్వామిని దూరమునుండి తలచినను పాపములను పోగొట్టగలడు. సమీపించి సేవించిన వారికి అన్ని కోరికలను తీర్చగలడు. పురుషార్థములలో చివరిదైన మోక్షమను విద్యను నేర్పు ఏకైక గురువైన ఆ భీమేశ్వరస్వామిని సేవింపుడు.

**విశేషము :-** అగ్నిష్టోమము :- ఇదొక విశిష్ట వైదిక యజ్ఞము. జ్యోతిష్టోమ యజ్ఞ విస్తారము అగ్నిష్టోమము. ఈ యజ్ఞమును వసంత ఋతువులో చేయవలెను. ఇందు సోమరసము ముఖ్యద్రవ్యము. ఇంద్రవాయ్వాదులు ముఖ్యదేవతలు. ఇందు 16గురు ఋత్విక్కులు నాలుగు గణములుగ నుందురు. ఇది ఐదు దినములు జరుగును. మొదటి దినమున దీక్షాదులు, రెండవ దినమున సోమలతా క్రయాదులు, మూడు నాల్గవ దినములలో ప్రవర్గ్య ఉద్వాసనాదులు, ఐదవ దినము రాత్రి వరకు అవబృథ యాగాదులు జరుగును. అన్య యజ్ఞములు దీనికి అంగములగును. ఇంకను అనేక విశేష విధానములిందు గలవు.

**వాజపేయము :-** సోమ యజ్ఞములు ఏడింటిలో నిదియొకటి. ఇందును సోమరస పానముండును. దీని ఫలము అన్న శక్త్యాదులు లభించుట. ఇందు స్తోత్రములు, దక్షిణ వస్తువులు, యూపప్రమాణము, యూప పరిధానములు, దానములు మున్నగునవి పదునేడు

సంఖ్య కల్గియుండును. ఒకరాజపుత్రుడు చత్వాలము, ఉత్కరము అనువాని మధ్యనుండి ఒక బాణమును విడచును. అది పడిన చోటు నుండి మరియొక బాణమును విడచును. ఇట్లు పదునేడుమార్లు చేయును. యజమానుని రథముతోపాటు పదునేడు రథములు ఒక్కొక్క దానికి మూడశ్వములు కట్టినవి పోటీపడి పరుగెత్తును. ఇందింకను అనేక విశేషములు కలవు.

చాంద్రాయణము :- "చంద్రస్యాయన మివాయనం చరణం యస్మిన్ కర్మణి హ్రాస వృద్ధిభ్యాం తచ్చాంద్రాయణమ్" -యాజ్ఞవల్క్య స్మృతి.

చంద్రుని వృద్ధి క్షయముల ననుసరించి భోజనము నియమముగ చేయు వ్రతము. ఇది ఐదు విధములుగ నున్నది. యవమధ్యము, పిపీలికామధ్యము, యతిచాంద్రాయణము, సర్వతో ముఖి, శిశు చాంద్రాయణము.

సీ॥ నేఁగొమ్ముటేనుఁగు నే విహంగంబను
నే స్తబ్ధరోమంబ నేను గొఱియ
నేను బకంబను నేను గర్కటకంబ
నే నచ్ఛభల్లంబ నేను నక్క
నేను మండూకంబ నేను గించులికంబ
నేను గీటంబ నే వానరంబ
నే శుకకీటంబ నేఁ బుండరీకంబ
నే ఖంజరీటంబ నేను దోమ

తే॥ నేను మానిసి మున్నంచు నేకతమున
నొండొరుల తోడుతను జెప్పు కొందు రుబుసుఁ
దారక బ్రహ్మ మణిపేటి దక్షవాటి
సంభవించిన ప్రత్యగ్ర చంద్రధరులు. 33

అర్థము :- తారక బ్రహ్మ=తరింపజేయు శివుడను; మణి=మణికి; పేటి=పెట్టెయైన; దక్షవాటి=దక్షారామమునందు; సంభవించిన=పుట్టిన; ప్రత్యగ్ర చంద్రధరులు=క్రొంగ్రొత్త చంద్రరేఖను దాల్చిన శివరూపులైన జీవులు;

నేన్=నేను; మున్ను=పూర్వము; కొమ్ముటేనుఁగున్=మగ ఏనుగును; ఏన్=నేను; విహంగంబను=పక్షిని; నే=నేను; స్తబ్ధ రోమంబన్=పందిని; ఏను=నేను; గొఱియన్=గొఱ్ఱెను;

ఏను=నేను; బకంబను=కొంగను; నేను=నేను; కర్కటకంబన్=ఎండ్రిని; ఏన్=నేను; అచ్ఛభల్లంబన్=ఎలుగుబంటిని; ఏను=నేను; నక్కన్=నక్కను;

ఏను=నేను; మండూకంబన్=కప్పను; ఏన్=నేను; కించులికంబన్=వానపామును; ఏను=నేను; కీటంబన్=పురుగును; ఏన్=నేను; వానరంబన్=కోతిని;

ఏన్=నేను; శుకకీటంబన్=చిమటను; ఏన్=నేను; పుండరీకంబన్=బెబ్బులిని; ఏన్=నేను; ఖంజరీటంబన్=కాటుక పిట్టను; ఏను=నేను; దోమన్=దోమను; ఏను=నేను; మానిసి=మానవుడను; అంచు=అనుచు; ఏకతమున=ఏకాంతమున, ఒండొరుల తోడుతన్=ఒకరితో నొకరు; ఉబుసున్=పనిలేనపుడు (కాలక్షేపమునకై); చెప్పుకొందురు=చెప్పుకొనెదరు.

**భావము** :- తారకబ్రహ్మమనెడి మణిని కల్గిన పెట్టె ఈ దక్షారామము. ఈ క్షేత్రమున సంభవించిన శివభక్తులు తీరిక వేళలందు తోటి వారితో తాము పూర్వ జన్మములో - నేను మగ ఏనుగును, నేను పక్షిని, నేను పందిని, నేను గొఱ్ఱెను, నేను కొంగను, నేను ఎండ్రిని, నేను ఎలుగుబంటిని, నేను నక్కను, నేను కప్పను, నేను వానపామును, నేను పురుగును, నేను కోతిని, నేను చిమటను, నేను బెబ్బులిని, నేను కాటుక పిట్టను, నేను దోమను, నేను మానవుడనని చెప్పుకొందురు.

**విశేషము** :- గత జన్మములలో వివిధములైన జంతురూపములుగ పుట్టి పెరిగి శ్రీ భీమేశ్వరుని సేవించి మరుసటి జన్మమున దక్షారామమున మానవ జన్మమునెత్తుటయేగాక శివభక్తులైరి. తుదకు జనన మరణ రహితులై శివరూపములను పొందిరి. అనగా సారూప్యమును పొందిరి. సర్వ జీవరాశి తారక బ్రహ్మ మణియైన దక్షారామ భీమేశ్వరుని సేవతో ముక్తి పొందవచ్చునని యిందు చెప్పబడినది.

**తే॥ అఖిల తీర్థ ప్రదేశంబు లడవు లిండ్లు**
**యజ్ఞవాటిక వల్లకాడను విభేద**
**మించుకయు లేదు భీమనాథేశ భూమి**
**జంతువులు శంభులగుదురు చచ్చినపుడు. 34**

**అర్థము** :- భీమనాథేశ=శ్రీ భీమనాథుని; భూమి=నగర ప్రదేశమునందు; అఖిల=సమస్తమైన; తీర్థ ప్రదేశములు=పవిత్ర స్థలములు; అడవులు=అరణ్యములు; ఇండ్లు=నివాసములు; యజ్ఞ వాటిక=హోమశాల; వల్లకాడు=శ్మశానము; అను=అనునట్టి; విభేదము=తారతమ్యము; ఇంచుకయు=కొంచెమైనను; లేదు=లేదు; చచ్చినపుడు=(ఈ ప్రాంతమున) మరణించినపుడు; జంతువులు=జీవులు; శంభులు+అగుదురు=శివులగుదురు.

**భావము** :- శ్రీ భీమేశ్వరస్వామి కొలువున్న దక్షారామమునందలి పవిత్ర స్థలములని, అడవులనియు, ఇండ్లనియు, యజ్ఞవాటికలని, శ్మశానమనియు భేదమేమాత్రము లేదు. ఈ ప్రాంతమునందు చచ్చిన జీవులు శివరూపులగుదురు.

శా॥ సాక్షాద్దక్షిణ కాశికానగరి దక్షస్థాన మవ్వీటిలో
మోక్షార్థాక్షర దీక్ష నక్షయ సుఖంబుం బ్రాణికిన్ సత్కృపా
వీక్షాసంకలితానురాగుఁ డగుచున్ విశ్వేశు చందంబునం
ద్ర్యక్షుండీశుఁడు భీమనాథుఁ డొసఁగుం బ్రాణావసానంబునన్. 35

అర్థము :- దక్షస్థానము=దక్షారామము; సాక్షా.....నగరి. సాక్షాత్+దక్షిణ=సాక్షాత్ దక్షిణ దేశమునందలి; కాశికా నగరి=కాశీ నగరము; అ+వీటిలో=అట్టి దక్షారామమున; ప్రాణికిన్=జీవికి; ప్రాణ+అవసానంబునన్=ప్రాణము పోవు సమయమున; విశ్వేశు=కాశీనాథుడైన శ్రీ విశ్వేశ్వర మహాదేవుని; చందంబునన్=వలె; సత్కృపా.....డగుచున్; సత్+కృపా=మంచి దయగల; వీక్షా=చూపులతో; సంకలిత=కూడుకొన్న; అనురాగుఁడు=ప్రేమకలవాడు; అగుచున్=అగుచు; త్ర్యక్షుండు=ముక్కంటి; ఈశుఁడు=ప్రభువగు; భీమనాథుఁడు=శ్రీ భీమేశ్వరస్వామి; మోక్షా.....సుఖంబున్; మోక్ష=ముక్తి; అర్థ=ప్రయోజనముగగల; అక్షరదీక్షన్=అక్షరమును (ఓంకారమును) ఉపదేశించుటను; అక్షయ సుఖంబున్=నశింపని ఆనందము (మోక్షము)ను; ఒసఁగున్=ఇచ్చును.

భావము :- దక్షారామము సాక్షాత్ దక్షిణకాశి. అట్టి దక్షారామమున శ్రీ భీమేశ్వరస్వామి కాశీ విశ్వేశ్వర మహాదేవుని వలెనే జీవికి ప్రాణము పోవు సమయమున దయామయమైన చూపులతో కూడుకొన్న ప్రేమకలవాడై మోక్షము ప్రయోజనముగాగల ఓంకారము నుపదేశించి శాశ్వతానందదాయకమైన మోక్షమును ప్రసాదించును.

విశేషము :- ఈ అంశమున కాశీఖండమునందలి ఈ పద్యము గమనార్హము.

సీ॥ పాలిండ్లు కదలంగఁ బసపుఁ బయ్యెద వీచు
నచలాధిపతి కూర్మియాడుబిడ్డ
ఘూత్కార మొనరించి తొండంబు ముక్కున
శీకరాసారంబుఁ జిలుకు దుంరి
ప్రత్యక్షమై వచ్చి భాగీరథీ గంగ
మృదుల హస్తము సాఁచి మేను నివురుఁ
బ్రమథోత్తముఁడు భృంగి భయ రక్షణార్థంబు
ఫాలాగ్రమునఁదీర్చు భసిత రేఖ

తే॥ దక్షిణ శ్రుతి మీఁదుగా ధాత్రిఁ ద్రెళ్ళి
పెద్ద నిద్రకు మ్రాఁగన్ను పెట్టువేళఁ
బంచ జనులకుఁ దారక బ్రహ్మ విద్య
యభవుఁ డుపదేశ మొనరించు నపుడు కాశి. (కాశి. 2-53)

శా॥ శ్రీ భీమేశ్వర పాదపీఠ విలుఠ చ్ఛ్రీ సప్త గోదావర
వ్యాభుగ్నోర్మిపరంపరా ఘుమఘుమ ప్రారంభ కోలాహల
క్షోభోద్వేజిత పాత కౌఘము జగ చ్చూడావతంసంబుల
క్ష్మీ భద్రాసన మొప్పు దక్షనగరీ క్షేత్రంబు ధాత్రీ స్థలిన్." 36

అర్థము :- ధాత్రీస్థలిన్=భూమియందు; శ్రీ భీమేశ్వర.....పాతకౌఘము. శ్రీ భీమేశ్వర=శ్రీ భీమేశ్వరస్వామి; పాదపీఠ=పాదములుంచుకొను పీటయందు; విలుఠత్=మిక్కిలిగ పొరలు చున్న; సప్తగోదావర=సప్తగోదావరము యొక్క; వ్యాభుగ్న=మిక్కిలిగ చలించుచున్న; ఊర్మి పరంపరా=అలల సమూహము యొక్క; ఘుమ ఘుమ=గలగల శబ్దములు; ప్రారంభ= మొదలగుటచే (కలిగిన); కోలాహల=కలకలము యొక్క; క్షోభ=చలనముచే; ఉద్వేజిత=బాగుగా భయపెట్టబడిన; పాతక+ఓఘము=పాపముల సమూహము కలది; జగ.....తంసంబు; జగత్=భూమికి; చూడ+అవతంసంబు=తలమానికమైనది; లక్ష్మీ=సంపదలకు; భద్రాసనము= సింహాసనమైన; దక్షనగరీ క్షేత్రంబు=దక్షారామమనెడి పుణ్యక్షేత్రము; ఒప్పున్=ప్రకాశించును.

భావము :- దక్షారామ క్షేత్రము నందలి దైవము శ్రీ భీమేశ్వరస్వామి. ఆ స్వామికి పాదపీఠమున ప్రవహించునది సప్తగోదావరము. ఆ నదియందు అలలు ఎగసిపడుచుండుటచే కలుగు అతిశయమైన శబ్దములకు పాప సమూహము భయపడును. (అణగును.) ఈ దక్షారామము జగత్తుకు తలమానికము. సంపదలకు భద్రసింహాసనము."

వ॥ అని నారదుండు చెప్పిన విని తపోధనులు భీమనాథు మాహాత్మ్యంబునకు, దక్షారామ ప్రభావంబునకు, సప్తగోదావర మహిమంబునకు విస్మయంబందియు, దర్శించియు, నమస్కరించియు ధన్యులైన యాత్మారాము లమ్మహారామం బునఁ జరియించు వారునగుచు సత్యవతీసుతుం గాంచి దక్షారామాయణుండైన బాదరాయణువలన నప్పుణ్య స్థానంబున మఱియుంగల యశేష విశేషంబు లెఱింగి. 37

అర్థము :- అని=అని; నారదుండు=నారద మహర్షి; చెప్పినన్=చెప్పగా; విని=వినిన వారై; తపోధనులు=మునులు; భీమనాథు=శ్రీ భీమేశ్వరస్వామి యొక్క; మాహాత్మ్యంబునకు= మహిమకును; దక్షారామ=దక్షారామము యొక్క; ప్రభావంబునకు=గొప్ప శక్తికిని; సప్తగోదావర= సప్తగోదావరము యొక్క; మహిమంబునకు=గొప్పతనమునకును; విస్మయంబు=ఆశ్చర్య మును; అందియు=పొందియు; దర్శించియు=చూచియు; నమస్కరించియు=మ్రొక్కియు; ధన్యులైన=కృతార్థులైన; ఆత్మారాములు=ఆత్మలయందే ఆనందించువారు; ఆ+మహా

రామంబునన్=గొప్పదగు ఆ దక్షారామములో; చరియించు వారున్=తిరుగుచున్న వారు; అగుచు=అగుచు; సత్యవతీసుతున్=వ్యాసుని; కాంచి=చూచి; దక్షారామ+అయనుండైన= దక్షారామము నివాసముగ గలవాడైన; బాదరాయణువలనన్=ఆ వ్యాసమహర్షి వలన; ఆ+పుణ్య స్థానంబున=ఆ పుణ్యక్షేత్రమునందలి; మఱియున్+కల=ఇంకను గల; అశేష విశేషంబులు= సమస్తములైన సంగతులను; ఎఱింగి=తెలిసికొని.

భావము :- అని నారద మహర్షి చెప్పగా సప్తర్షులు వినినారు. శ్రీ భీమేశ్వరస్వామి మహత్త్వమునకు, దక్షారామ ప్రభావమునకు, సప్తగోదావర మహిమమునకు అబ్బురపడినారు. స్వామిని, నదిని చూచినారు. నమస్కరించినారు. కృతార్థులైనారు. ఆత్మలయందానందించి నారు. ఆ దక్షారామమునందే తిరుగుచున్నారు. దక్షారామమునందు నివసించుచున్న వ్యాస మహర్షిని చూచినారు. ఆ వ్యాసమహర్షి వలన ఆ పుణ్యక్షేత్రమైన దక్షారామమునందలి మిగిలిన సమస్తములైన సంగతులను తెలిసికొని.

చ॥ **అటఁజని యొక్కచోటఁ గమలాసన బంధము పూని వాహినీ**
**తటమున బిల్వకానన లతా గృహ మధ్యమునందు నాసికా**
**పుట శిఖరాగ్ర దృష్టియగు పుణ్యునిగాంచిరి మౌనిపుంగవుల్**
**ఘటమున నుద్భవించిన యగస్త్యయశోనిధి నిల్వలాంతకున్.** 38

అర్థము :- మౌనిపుంగవుల్=మునిశ్రేష్ఠులు; అటన్=ఆ దక్షారామమునందు; చని= నడచి; ఒక్కచోటన్=ఒకచోట; వాహినీతటమున=నది యొడ్డున; బిల్వ.....మధ్యము. బిల్వకానన=మారేడు వనమునందలి; లతాగృహమధ్యమునందు=పొదరింటి మధ్యభాగమున; కమలాసన బంధము=పద్మాసనమను బంధమును; పూని=తాల్చి; ధరించి; నాసికా.....దృష్టి; నాసికా పుట=ముక్కురంధ్రముల యొక్క; శిఖర+అగ్ర=చివరి అంచులయందే; దృష్టి= చూపుకలవాడు; అగు=అయిన; పుణ్యునిన్=పుణ్యమూర్తిని; ఘటమునన్=కుండయందు; ఉద్భవించిన=పుట్టిన; యశః+నిధిన్=యశస్సే ధనముగ కలవాడును; ఇల్వల+అంతకున్= ఇల్వలుడను రక్కసుని చంపినవాడునగు; అగస్త్యున్=అగస్త్య మహర్షిని; కాంచిరి=చూచిరి.

భావము :- ఆ సప్తర్షులు దక్షారామ నగరమున తిరుగుచు సప్తగోదావరనదీతీరమున ఒకచోట మారేడు వనము నందలి ఒక పొదరింటి మధ్యభాగమున పద్మాసనము వేసికొని చూపును భ్రూమధ్యమునందు నిలిపి తపము చేయుచున్న కుంభసంభవుడు, యశోనిధి, ఇల్వలదమనుడునైన అగస్త్య మహర్షిని చూచిరి.

వ॥ **తదనంతరంబ యతనితో సల్లాపంబుల నపనయించి తీర్థమాహాత్మ్యం బడిగిన నతండిట్లనియె.** 39

అర్థము :- తత్+అనంతరంబ=ఆ తరువాత; అతనితో=అగస్త్యునితో; సల్లాపంబులన్= అనవసర ప్రీతి సంభాషణలను; అపనయించి=మాని; తీర్థమాహాత్మ్యంబు=పవిత్ర స్థలము యొక్క గొప్పతనమును గూర్చి; అడిగినన్=అడుగగా; అతండు=ఆ అగస్త్యమహర్షి; ఇట్లు+అనియె=ఈ విధముగ పల్కెను.

భావము :- సప్తర్షులు అగస్త్య మహర్షినిచేరి అనవసర ప్రీతి సంభాషణములను ఆపి దక్షారామ తీర్థమహత్త్వము నడిగినారు. అగస్త్యుడు వారికిట్లు చెప్పెను.

విశేషము :- సల్లాపము - సమ్+లాపము; లాపము అనగా వదరుట లేక ప్రేలుట. అనగా అనవసరమైన భాషణము. సల్లాపము అనగా అనవసరమైన సంభాషణము.

## అగస్త్యుఁడు తీర్థమాహాత్మ్యంబుఁజెప్పుట

సీ॥ "జహ్నుకన్యాతీర సన్నివేశమునకు
దక్షిణాంభోరాశి తటము సాటి
కమనీయ మణికర్ణికా ప్రవాహమునకు
సప్తగోదావర జలము సాటి
కటక రక్షకుఁడైన కాలభైరవునకుఁ
బ్రకట పాతాళ భైరవుఁడు సాటి
విశ్వాధిపతియైన విశ్వనాయకునకు
భీమనాథేశ్వర స్వామి సాటి

తే॥ మోక్ష విభవంబునకు సాటి మోక్షలక్ష్మి
భోగ మహిమంబునకు సాటి భోగమహిమ
వారణాసికి శ్రీ దక్షవాటమునకుఁ
దారతమ్యంబుఁ జర్చింప ధర్మమగునె? **40**

అర్థము :- జహ్నుకన్యా=గంగానది యొక్క; తీర=ఒడ్డునగల; సన్నివేశమునకు= చోటుకు, దక్షిణ+అంభోరాశి=దక్షిణ దేశమందలి సముద్రము యొక్క; తటము=ఒడ్డు; సాటి= సమానము;

కమనీయ=మనోహరమైన, మణికర్ణికా=మణికర్ణికయందలి, ప్రవాహమునకు=జల ప్రవాహమునకు, సప్తగోదావర=సప్తగోదావరమునందలి; జలము=నీరు, సాటి=ఈడు వచ్చును;

కటక రక్షకుఁడు+ఐన=నగర రక్షకుడైన; కాలభైరవునకున్=కాలభైరవస్వామికి, ప్రకట= ప్రసిద్ధుడైన; పాతాళ భైరవుఁడు=పాతళ భైరవస్వామి, సాటి=సరివచ్చును;

విశ్వాధిపతి+ఐన=విశ్వమంతటికి నాయకుడైన; విశ్వనాయకునకున్=కాశీ విశ్వేశ్వర స్వామికి; భీమనాథేశ్వరస్వామి=శ్రీ భీమేశ్వరస్వామి; సాటి=సరివచ్చును;

మోక్షవిభవంబునకు= అక్కడి మోక్ష సంపదకు; మోక్ష లక్ష్మి=ఇక్కడి మోక్ష లక్ష్మి; సాటి=సరిపోలును; భోగ మహిమంబునకు=అక్కడి సుఖఫలమునకు; భోగమహిమ=ఇక్కడి సుఖ మహత్త్వము; సాటి= సరిజోడు; వారణాసికిన్=కాశీనగరమునకును; శ్రీ దక్షవాటమునకున్=శ్రీ దక్షారామమునకును; తారతమ్యంబున్=హెచ్చుతగ్గులను; చర్చింపన్= ఆలోచించుట; ధర్మము+అగునె=పద్ధతి అగునా?

భావము :- ఆ గంగా నదీతీరమునకు ఈ గోదావరీ తీరము సాటి. ఆ మనోహర మణికర్ణికా ఘట్టమునకు ఈ సప్తగోదావరము సాటి; వారణాసిని రక్షించు కాలభైరవునకు దక్షారామములోని పాతాళభైరవుడు సమానము. కాశీ విశ్వేశ్వరునకు దక్షారామ భీమేశ్వరుడు సాటి. అచటి మోక్షసంపదకు, భోగమహిమకు ఇక్కడి మోక్షలక్ష్మి, భోగమహిమ సమానములు. వారణాసి తీర్థమునకు దక్షారామ తీర్థమునకును హెచ్చుతగ్గులాలోచించుట పద్ధతి కాదు.

విశేషము :- కాశీ నగరముననున్న వన్నియు దక్షారామమున నుండుటచే దక్షారామము దక్షిణ కాశియనుట అన్వర్థమని సారాంశము.

తే॥ తరమె వర్ణింప సప్త గోదావరంబు
సలిల కల్లోల శిఖర హస్తంబు లెత్తి
పాతకంబులఁ జంకించు బహువిధముల
ఘుమఘుమారంభ హుంకార ఘోష మెసఁగ." 41

అర్థము :- సప్తగోదావరంబు=సప్తగోదావరమునందుగల; సలిల=నీటియందలి; కల్లోల శిఖర=పెద్ద పెద్ద తరంగములనెడి శృంగములవంటి; హస్తంబులు=చేతులను; ఎత్తి= చాచి; ఘుమఘుమ=ఘుంఘుమ్మను; ఆరంభ=ప్రారంభమగు; హుంకార ఘోషము=గర్జనల శబ్దములు; ఎసఁగన్=అతిశయింపగా; పాతకంబుల=పాపములను; బహువిధముల= పలురకములుగ; జంకించున్=భయపెట్టును. సప్తగోదావరంబు=అట్టి సప్తగోదావరమును; వర్ణింపన్=పొగడుట; తరమె=సాధ్యమా!

భావము :- సప్తగోదావరము యొక్క నీటియందలి శృంగముల వంటి పెద్ద పెద్ద తరంగములనెడి చేతులను చాచి ఘుమఘుమమను ప్రారంభ శబ్దములతో పాపములను పలువిధముల భయపెట్టును. అట్టి సప్తగోదావరమును స్తుతించుట సాధ్యము అగునా?"

**వ॥ అని కుంభ సంభవుండు చెప్పిన విని యమ్మహాత్ము వీడ్కొని నగర ప్రదక్షిణ పూర్వకంబుగా భీమేశ్వరు దర్శించి కృతార్థులై యొక్క రమ్య స్థలంబున నమ్మహా మునులు గూర్చుండిరి. అనంతరంబ.** 42

అర్థము :- అని=అని; కుంభసంభవుండు=అగస్త్యుడు; చెప్పినన్=చెప్పగా; విని=విననవారై; ఆ+మహాత్ము=ఆ గొప్పవానిని; వీడ్కొని=వదలి; నగర=నగరమునకు; ప్రదక్షిణ పూర్వకంబుగా=ప్రదక్షిణము చేసిన పిమ్మట; భీమేశ్వరున్=శ్రీ భీమేశ్వర స్వామిని; దర్శించి=చూచి; కృతార్థులై=ధన్యులై; ఒక్క=ఒకానొక; రమ్యస్థలంబునన్=ఇంపైన ప్రదేశమునందు; ఆ+మహామునులు=ఆ మహర్షులు; కూర్చుండిరి=కూర్చుండిరి; అనంతరంబ=ఆ తరువాత.

భావము :- అని అగస్త్యుడు చెప్పినాడు. సప్తర్షులు వినినారు. ఆ మహర్షి యొద్ద సెలవు తీసికొనినారు. నగర ప్రదక్షిణము చేసినారు. శ్రీ భీమేశ్వరస్వామిని దర్శించినారు. కృతార్థులైనారు. ఒక మంచి ప్రదేశమున కూర్చుండిరి. తరువాత.

ఉ॥ ఆ ముని మండలంబునకు నంజలి బంధముతోఁ బ్రదక్షిణ
గ్రామ నమస్కృతుల్ గడపి గారవ మారఁగ మంకణుండు ఋ
క్సామయజుర్విశారదుఁడు శైవపురాణ కథారహస్య గో
ష్ఠీ ముదితాంతరంగుఁడు ప్రసిద్ధుఁడు భక్తిదలిర్ప నిట్లనున్. 43

అర్థము :- ఋక్సామ.....శారదుఁడు. ఋక్=ఋగ్వేదమునందు; సామ= సామవేదము నందు; యజుస్=యజుర్వేదమునందు; విశారదుఁడు=విద్వాంసుడు; శైవ..... రంగుఁడు. శైవ పురాణ=శివపురాణములందలి; కథ=కథలలోని; రహస్య=గుట్టుల; గోష్ఠి=సల్లాపములతో; ముదిత=సంతసించిన; అంతరంగుఁడు=హృదయము కలవాడు; ప్రసిద్ధుఁడు=ఖ్యాతి పొందిన వాడు; మంకణుఁడు=మంకణుడను ముని; ఆ ముని మండలంబునకు=అవసిష్ఠాది ముని సమూహమునకు; అంజలి బంధముతోన్=దోసిలి కట్టిన బంధముతో; ప్రదక్షిణ గ్రామ నమస్కృతుల్=అనేక ప్రదక్షిణ నమస్కారములు; కడపి=జరిపి; గారవము=మన్నన; ఆరఁగన్=అతిశయించునట్లుగ; భక్తి=ఆరాధనా భావము; తలిర్పన్=ప్రకాశించు నట్లుగ; ఇట్లనున్=ఇట్లు పల్కెను.

భావము :- మంకణుడను ముని ఋగ్వేద యజుర్వేద సామవేదములందు విద్వాంసుడు. శైవ పురాణములలోని రహస్యములను తెలిసినవాడు. ప్రసిద్ధుడు. అతడు సప్తర్షులందరికిని ప్రదక్షిణ నమస్కారములు చేసెను. వారిపై భక్తి గౌరములతో ఇట్లనెను.

సీ॥ "పరమ పుణ్యుఁడనైతి భాగ్యవంతుఁడనైతి
ధన్యుండనైతి నా తపసు పండెఁ
దీర్థంబు లన్నియుఁ దిరిగి చూడఁగఁజాల
నొక్కజన్మమున నీయుర్విలోన

దిగ్దేశముల సర్వతీర్థంబులను నాడి
తీర్థభూతత్వ ప్రతిష్ఠఁగన్న
మిమ్మందఱనుఁగంటి మీ కృపాబలమున
నేను దీర్థమనైతి నింత నిజము

తే॥ భీమనాథ మాహాత్మ్యంబు పెంపు వినఁగ
వేడ్కయగుచుండు నాకు నీవేళయందుఁ
బ్రార్థనము చేసి వేఁడెద భవ్యులార
యానతీఁదగు నాకు మీలోన నొకఁడు." 44

అర్థము :- నేను=నేను; పరమ=మేలైన; పుణ్యుఁడను=పుణ్యము కలవాడను; ఐతిన్=అయితిని; భాగ్యవంతుఁడను=సంపద కలవాడను; ఐతిన్=అయితిని; ధన్యుండను=కృతార్థుడను; ఐతిన్=ఐతిని; నా తపసు=నా తపము; పండెన్=ఫలించినది;

ఒక్క జన్మమునన్=ఈ ఒక్క పుట్టుకయందు; ఈ ఉర్విలోన=ఈ భూమియందలి; తీర్థంబులు+అన్నియున్=పవిత్ర తీర్థ ప్రదేశములన్నింటిని; తిరిగి=తిరిగి; చూడఁగఁజాలన్=చూడలేను;

దిక్=దిక్కుల మధ్యగల; దేశములన్=అన్ని దేశములందలి; సర్వతీర్థంబులనున్=అన్ని పవిత్ర జలములలో; ఆడి=స్నానము చేసి; తీర్థభూతత్వ=పవిత్రుడగుటయను; ప్రతిష్ఠన్=గౌరవమును; కన్న=పొందిన; మిమ్ము+అందఱను=మీ అందరిని; కంటిన్=చూచితిని; మీ=మీ యొక్క; కృపాబలమునన్=దయ యొక్క బలముచేత; ఏను=నేను; తీర్థమన్+ఐతిన్=పవిత్రతను పొందితిని. ఇంత=ఇది; నిక్కువంబు=నిజము.

భవ్యులార=యోగ్యులారా! నాకున్=నాకు; ఈ వేళయందున్=ఈ సమయమున; భీమనాథ=శ్రీ భీమేశ్వరస్వామి యొక్క; మాహాత్మ్యంబు=మహత్త్వము యొక్క; పెంపు=అతిశయమును; వినఁగన్=వినుటకు; వేడ్క+అగుచుండున్=కుతూహలము కల్గుచున్నది; ప్రార్థనము చేసి=ప్రార్థించి; వేఁడెదన్=కోరెదను; నాకు=నాకు; మీలోనన్=మీ అందరిలో; ఒకఁడు=ఒకరు; ఆనతీఁదగున్=చెప్పదగును.

భావము :- యోగ్యులైన ఓ మహర్షులారా! మిమ్మందరిని నేడు నేను చూడగల్గుటచే గొప్ప పుణ్యమూర్తిని, సంపన్నుడను, ధన్యుడను ఐతిని. నా తపస్సు ఫలించినది. ఈ ఒక్క జన్మములో ఈ భూమి మీది సర్వతీర్థములను చూడలేను. దిక్కుల మధ్యగల సర్వదేశములందలి సర్వ పవిత్ర జలములలో స్నానమాడి తీర్థభూతులను గౌరవమును పొందిన మీ

అందరిని ఒక్కసారిగ ఒక్కచోట చూడగల్గితిని. మీ దయాబలముచే నేను పవిత్రుడనైతిని. ఇది నిజము. ఓ మహానుభావులారా! ఈ సమయమున శ్రీ భీమేశ్వరస్వామి యొక్క మహత్త్వమును గూర్చి వినుటకై నాకు కుతూహలము కల్గుచున్నది. దయచేసి మీలో ఒకరు నాకు చెప్పుడు."

విశేషము :- తీర్థభూతత్వము :- తీర్థములుగా చేయగలవారి శక్తి

"తత్రోప జగ్ముర్భువనం పునానా మహానుభావా మునయ స్సశిష్యాః
ప్రాయేణ తీర్థాభిగమాపదేశైః స్వయంహి తీర్థాని పునంతి సంతః"

శ్రీమద్భాగవతము - స్కంధము-1. అధ్యా-19. శ్లోక-8.

ప్రాయోప విష్టుడైన పరీక్షిన్మహారాజున్న గంగా నికట ప్రదేశమునకు అత్రి వసిష్ఠాదులు శిష్యులతో వచ్చిరి. సజ్జనులు తీర్థయాత్రా వ్యాజముతో వచ్చి తీర్థములనే పవిత్రముల నొనర్తురు.

వ॥ అనిన విని యందఱు వసిష్ఠ మహామునిం బ్రార్థించిన సకలముని జనానుమతంబునఁ గుంభసంభవుని నియోగంబున నప్పుడు మైత్రావరుణుండు మంకణున కిట్లనియె. 45

అర్థము :- అనిన=అని పలుకగా; విని=విని; అందఱు=మునులందరు; వసిష్ఠ మహామునిన్=వసిష్ఠ మహర్షిని; ప్రార్థించినన్=ప్రార్థింపగా; సకలముని జన=సమస్తమైన ముని సమూహము యొక్క, అనుమతంబునన్=అనుమతితోను; కుంభసంభవుని=అగస్త్యుని; నియోగంబునన్=ఆజ్ఞ చేతను; అప్పుడు=అపుడు; మైత్రావరుణుండు=వసిష్ఠుడు; మంకణునకు=మంకణ మునికి; ఇట్లు+అనియెన్=ఈ విధముగ పల్కెను.

భావము :- అని మంకణముని కోరగా మునులందరు వసిష్ఠుని ప్రార్థించిరి. మునులందరి కోరికపైనను, అగస్త్యుని ఆనతి మీదను వసిష్ఠుడు మంకణమునితో నిట్లు పల్కెను.

కం॥ "భీమమగు గరళ కూటము
భూమిని గగనమున దిశలఁ బొడ సూపినచో
భీమగతి మ్రింగెఁ గావున
భీమేశ్వరుఁడయ్యె నితఁడు బిరుదాంకమునన్." 46

అర్థము :- భీమము+అగు=భయంకరమైన; గరళకూటము=విష సమూహము; భూమిని=భూమియందు; గగనమునన్=ఆకాశమునందు; దిశలన్=దిక్కులందు;

పొడసూపినచో=కనిపింపగా; భీమగతిన్=భయంకరమగు వేగముతో; మ్రింగెన్+కావున= మ్రింగినాడు గనుక; ఇతఁడు=ఈ శంకరుడు; బిరుద+అంకమునన్=బిరుదు నామముతో; భీమేశ్వరుఁడయ్యెన్=శ్రీ భీమేశ్వరుడయ్యెను.

భావము :- "భయంకరమైన విషము భూమ్యాకాశములందు దిక్కులందును కన్పించెను. ఆ విషమును భయంకర రీతిగా మ్రింగినాడు గనుక బిరుదు నామముతో శంకరుడు శ్రీ భీమేశ్వరుడయ్యెను."

విశేషము :- భయంకరమైన విషమును భయంకరమూర్తియై అణచిపట్టి మ్రింగినాడు గనక శంకరునకు భీమ శబ్దము అన్వర్థమైనది.

## క్షీరసాగర మథన కథాక్రమము :

వ॥ అనిన విని మంకణుండు పంకజాసన సంభవునితో "మునీంద్రా! దక్షవాటికాధీశ్వరండు కాలకూటంబు నెబ్భంగి నుపసంహరించె? నక్కథాక్రమంబు పరిపాటిం దేటపడ నాకెఱింగింపవే" యనుటయు నతండిట్లని చెప్పందొణంగెఁ; "దొల్లి జలంధరాంధక మహిషాసుర బిడాలాక్ష ధూమ్రాక్ష గంధ సింధూరాసుర విద్యున్మాలి తారక బలి బాణ పౌలోమ నివాత కవచ కాలకేయాదులగు రాక్షసులును; పాకశాసన పావక పరేతరాజ పలలాశి ప్రాచేతస పవన పౌలస్త్య పశుపతి ప్రధానులగు వేల్పులునుం దమలోన దాయాద సంబంధంబునం బొడమిన వైరానుబంధంబునం బరస్పర విజిగీషులై రోషంబున నెదురు వేలంబులు పెట్టి కట్టుపకాసులై ప్రతిఘటించి బెట్టయి నెట్టుకొని యున్న సమయంబున. 47

అర్థము :- అనినన్=అని చెప్పగా; విని=వినినవాడై; మంకణుండు=మంకణముని; పంకజాసన=బ్రహ్మయొక్క; సంభవునితో=కుమారుడైన వసిష్ఠునితో; మునీంద్రా!=ముని శ్రేష్ఠుడా! దక్షవాటికా=దక్షారామమునకు; అధీశ్వరుండు=ముఖ్య దైవమైన శ్రీ భీమేశ్వరుడు, కాలకూటంబున్=కాలకూటమను పేరుగల విషమును; ఏ+భంగిన్=ఏవిధముగ; ఉపసంహరించెన్=అణచెను. ఆ+కథాక్రమంబు=ఆ కథయంతయు; పరిపాటిన్=వరుసగ; తేటపడన్= విశదముగ; నాకు=నాకు; ఎఱింగింపవే=తెలుపుము; అనుటయు=అని అడుగగా; అతండు= ఆ వసిష్ఠుడు; ఇట్లు+అని=ఈవిధముగనని; చెప్పన్+తొణంగెన్=చెప్పుట మొదలు పెట్టెను.

తొల్లి=పూర్వము; జలంధర=జలంధరుడు; అంధక=అంధకుడు; మహిషాసుర= మహిషాసురుడు; బిడాలాక్ష=బిడాలాక్షుడు; ధూమ్రాక్ష=ధూమ్రాక్షుడు; గంధసింధురాసుర= గజాసురుడు; విద్యున్మాలి=విద్యున్మాలి; తారక=తారకాసురుడు; బలి=బలి చక్రవర్తి; బాణ=

బాణాసురుడు; పౌలోమ=పౌలోముడు; నివాత కవచ=నివాత కవచులను రాక్షస గణము; కాలకేయ+ఆదులగు=కాలకేయులు మొదలైన; రాక్షసులును=రాక్షసులును; పాకశాసన= ఇంద్రుడు; పావక=అగ్ని; పరేతరాజు=యముడు; పలలాశి=నిర్ఋతి; ప్రాచేతస=వరుణుడు; పవన=వాయువు; పౌలస్త్య=కుబేరుడు; పశుపతి=ఈశానుడు; ప్రధానులగు=నాయకులుగగల; వేల్పులునున్=దేవతలును; తమలోన=తమలో తాము; దాయాద=జ్ఞాతులయిన; సంబంధంబునన్=చుట్టరికముచేత; పొడమిన=కల్గిన; వైర+అనుబంధంబునన్=శత్రు బంధముచేత; పరస్పర=ఒకరినొకరు; విజిగీషులై=జయింప కోరిక కలవారై; రోషంబునన్=కోపముతో; ఎదురు వేలంబులు=ఎదురెదురు శిబిరములు; పెట్టి= ఏర్పాటు చేసి; కట్టుపకాసులు+ఐ=కోపోద్దీపితులై; ప్రతిఘటించి=ఎదిరించి; బెట్టు+ఐ=ఉద్ధతితో; నెట్టుకొని=చెలరేగి; ఉన్న=ఉన్నట్టి; సమయంబునన్=సమయమునందు;

భావము :- అని వసిష్ఠుడు చెప్పగా మంకణముని ఇంకను వసిష్ఠ మహర్షినిట్లడిగెను. "ఓ మునీంద్రా! శ్రీ భీమేశ్వరస్వామి విషమును మ్రింగిన కథను విశదముగ తెలియునట్లు చెప్పుము" అపుడు వసిష్ఠుడీ విధముగ చెప్పెను.

"పూర్వము జలంధరుడు, అంధకుడు, మహిషాసురుడు, బిడాలాక్షుడు, ధూమ్రాక్షుడు, గజాసురుడు, విద్యున్మాలి, తారకుడు, బలి, బాణుడు, పౌలోముడు, నివాతకవచులు, కాలకేయులు మొదలగు రాక్షసులును, ఇంద్రుడు, అగ్ని, యముడు, నిర్ఋతి, వరుణుడు, వాయువు, కుబేరుడు, ఈశానుడు మొదలైన దేవతలును దాయాదులై శత్రుత్వముతో తమలోతాము కక్షలు పెంచుకొనిరి. ఎదురు శిబిరములు పెట్టిరి. పరస్పరము విజయకాంక్షులై రోషావేశ పరవశులై చెలరేగిరి. అట్టి సమయమున.

సీ॥ **దివ్యాయుధములైదు ధృత చేతనంబులై**
**శత్రుసంహారంబు సంస్తుతింపఁ**
**బులుఁగు తేఁడు కరాబ్జములు రెండు మొగిడించి**
**భ్రూలతాదేశంబు పొలుపు నరయ**
**సౌఖశాయనికులై సనకాది యోగీంద్రు**
**లనురాగ వీక్షణం బభిలషింప**
**నూరురంభాస్తంభ యుగళంబు పైనుంచి**
**లక్ష్మి శ్రీపాద పల్లవము లొత్తఁ**

తే॥ బన్నగాధీశ భోగతల్పంబు మీఁదఁ
దత్ఫణారత్నదీప్తిమై తళుకుఁజూపఁ
బాల మున్నీటిలో నిద్ర మేలుకొన్న
హరికిఁబొడ చూప నేతెంచె హరిహయుండు. 48

అర్థము :- దివ్య+ఆయుధములు=దివ్యములైన ఆయుధములు; ఐదు=అయిదును; ధృత=ధరింపబడిన; చేతనంబులై=ప్రాణములు కలవై; శత్రు=పగవారి; సంహారంబు=నాశమును; సంస్తుతింపన్=మిక్కిలికొనియాడుచుండగా;

పులుఁగు ఱేఁడు=గరుత్మంతుడు; కర+అబ్జములు+రెండు=పద్మముల వంటి చేతులు రెంటిని; మొగిడించి=ముడిచి; భ్రూలతా=(విష్ణువు యొక్క) తీగలవంటి కనుబొమలు (కదలికలచే తెలియు); ఆదేశంబున్=ఆజ్ఞ యొక్క; పొలుపున్=జాడను; అరయన్=చూడగా;

సౌఖశాయనికులై=సుఖముగ నిద్రపట్టినదా అని అడుగువారై; సనక+ఆది=సనకుడు మొదలైన; యోగి+ఇంద్రులు=యోగులలో శ్రేష్ఠులైనవారు; అనురాగ=ప్రేమమయమైన; వీక్షణంబు=దృష్టిని; అభిలషింపన్=కోరగా;

ఊరు రంభాస్తంభ=అరటి బోదెలవంటి తొడల; యుగళంబు=జంట; పైనుంచి=(తనతొడల) పైననుంచి; శ్రీ=లక్ష్మీదేవి; పాదపల్లవములన్=చిగురుల వంటి అందమైన పాదములను; ఒత్తన్=ఒత్తుచుండగా;

పన్నగాధీశ=సర్ప నాయకుడైన ఆదిశేషుడనెడి; భోగతల్పంబు మీఁదన్= సుఖకరమగు పాన్పుమీద; తత్+ఫణారత్న=ఆ ఆదిశేషుని పడగల యందలి రత్నముల; దీప్తి=కాంతి; మై తళుకున్=శరీరపు వెలుగును; చూపన్=కన్పింపజేయగా; పాలమున్నీటిలో=పాల సముద్రమున; నిద్ర మేలుకొన్న=నిద్రలేచిన; హరికి=విష్ణువునకు; పొడచూపన్=కనిపించుటకై; హరిహయుండు=ఇంద్రుడు; ఏతెంచెన్=వచ్చెను.

భావము :- దివ్యాయుధములైదును ప్రాణవంతములై శత్రునాశమును స్తుతించు చుండెను. గరుత్మంతుడు చేతులు జోడించి విష్ణుమూర్తి యొక్క కనుబొమల కదలికలచే తెలియు ఆజ్ఞల కొరకై ఎదురుచూచుచుండెను. సనకాది యోగీంద్రులు మేల్కొలుపులు పాడుచు శ్రీవారి ప్రేమచూపుల కొరకు ఎదురు చూచుచుండిరి. లక్ష్మీదేవి చిగురుల వంటి అందమైన పాదములను ఒత్తుచుండెను. ఆదిశేషుడను సుఖకరమైన పాన్పుమీద, ఆ శేషుని పడగలపైగల రత్నముల కాంతులతో దేదీప్యమానముగ వెలుగుచు పాలసముద్రమున మేలుకొన్న శ్రీ మహావిష్ణువునకు కన్పించుటకై ఇంద్రుడు వచ్చెను.

**విశేషము :-** దివ్యాయుధములైదు :- 1. పాంచజన్యమను శంఖము, 2. సుదర్శనమను చక్రము, 3. కౌమోదకి యను గద, 4. నందకము అను ఖడ్గము, 5. శార్ఙ్గము అను విల్లు.

ఈ సీసపద్యము - కాళిదాస మహాకవి రఘువంశ మహాకావ్యము 10వ సర్గలో 7 నుండి 14వ శ్లోకము వరకు 8 శ్లోకములలో రావణ పీడితులగు ఇంద్రాదులు దర్శించిన శ్రీవిష్ణుదేవుని వర్ణనమునకు అనుసరణము - శ్రీనాథుడు ఆ శ్లోకములను గైకొన్న క్రమము.

1 - దివ్యాయుధములైదు :- దైత్య స్త్రీ గండ లేఖానాం మద రాగ విలోపిభిః
హేతిభి శ్చేతనావద్భి రుదీరిత జయ స్వనమ్. 12

2. పులుఁగుతేఁడు :- ముక్తశేష విరోధేన కులిశ వ్రణ లక్ష్మణా
ఉపస్థితం ప్రాంజలినా వినీతేన గరుత్మతా. 13

3. సౌఖశాయనికులై :- యోగ నిద్రాంత విశదైః పావనై రవలోకనైః
భృగ్వాదీ నను గృహ్ణంతం సౌఖశాయనికాన్ మునీన్. 14

4. ఊరురంభాస్తంభ :- శ్రియః పద్మనిషణ్ణాయాః క్షౌమాంతరిత మేఖలే
అంకే నిక్షిప్త చరణ మాస్తీర్ణ కరపల్లవే. 8

5. పన్నగాధీశ :- భోగి భోగాసనాసీనం దదృశు స్తం దివౌకసః
తత్ఫణా మండలోదర్చిర్మణి ద్యోతిత విగ్రహమ్. 7

ఈ ఘట్టమున సంస్కృత భీమఖండమున (అధ్యా-15; శ్లో. 35 నుండి 40 వరకు) ఆరు శ్లోకములు కలవు. సంస్కృత భీమఖండమునందలి ఈ ఆరు శ్లోకములు శ్రీనాథుని ఈ సీస పద్యమునకు సంస్కృతీకరణమని ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారి అభిప్రాయము.

సంస్కృత భీమఖండము శ్రీనాథుని భీమేశ్వర పురాణమునకు సంస్కృతీకరణమని వీరి వాదము. ఆ వాదమునకు ఈ అంశమును ఒక ఉపపత్తిగా తెలుపుచు అన్న మాటలివి.

"సమష్టిపై కాళిదాసు శ్లోకములను ఆంధ్రీకరించిన శ్రీనాథుని సీస పద్యమునకు సంస్కృత భీమఖండము నందలి శ్లోకషష్ఠము సంస్కృతీకరణముగ స్పష్టము. ఇది సంస్కృత భీమఖండము శ్రీనాథుని భీమఖండమునకు సంస్కృతీకరణమనుటకు నిర్ధారక సాధనము"
(శ్రీనాథుడు. పుట - 377.)

49

**వ॥ ఇట్లు చనుదెంచి.**

**అర్థము :-** ఇట్లు=ఈవిధముగ; చనుదెంచి=వచ్చి.

**భావము :-** ఈవిధముగ వచ్చి.

క॥ ఒంటి నేతెంచి మంతనం బుండి నిలిచి
చక్రధరుతోడ హితకార్య చర్చచేసి
యేగె దేవేంద్రు డిరుచెవి నెఱుఁగ కుండ
సిద్ధ సంకల్పుఁడై యాత్మ శిబిరమునకు. 50

అర్థము :- దేవేంద్రుడు=దేవతల నాయకుడైన ఇంద్రుడు; ఒంటిన్=ఒంటరిగ; ఏతెంచి=వచ్చి; మంతనంబు+ఉండి=ఏకాంతమున; నిలిచి=ఉండి; ఇరుచెవిన్=రెండవ చెవియు; ఎఱుఁగకుండ=తెలిసికొనకుండ; చక్రధరుతోడన్=విష్ణువుతో; హితకార్య=మేలుచేయు పనిని గూర్చి; చర్చచేసి=విచారణ చేసి; సిద్ధ సంకల్పుడై=నెరవేరిన కోరిక కలవాడై; ఆత్మ=తన యొక్క; శిబిరమునకు=విడిదికి; ఏగెన్=వెళ్ళెను.

భావము :- ఇంద్రుడు ఒంటరిగ వచ్చెను. రహస్యముగ ఏకాంతముగ నిలువబడి శ్రీహరితో మేలుచేయు పనిని గూర్చి రెండవ చెవికి వినబడకుండ చర్చించెను. సంకల్పము నెరవేరినవాడై తన నిలయమునకు వెళ్ళెను.

విశేషము :- ఇరు చెవి నెఱుఁగకుండ :- రెండవ చెవికి వినబడకుండ అని అర్థము. మూడవ కంటికి తెలియకుండ, రెండవ చెవికి వినబడకుండ ననునవి తెలుగు నుడికారపు సొంపులు. ఇంద్రుడు విష్ణువు ఒకరి చెవిలో ఒకరు చెప్పుకొన్నప్పుడు తమ తమ రెండవ చెవులకే వినబడనంత రహస్యముగ మాటాడుకొనిరట. అచటగల పంచాయుధములకుగాని, గరుత్మంతునకుగాని, సనకాది ఋషులకుగాని, ఆదిశేషునకుగాని వినబడకుండ మాటాడుకొన్నట్లు చెప్పుట.

వ॥ తదనంతరం బా శ్రీమన్నారాయణుండును. 51

అర్థము :- తత్+అనంతరంబు=ఆ తరువాత; ఆ=ఆ; శ్రీమన్నారాయణుండును= విష్ణువు;

భావము :- ఆ తరువాత శ్రీ మహావిష్ణువు.

క॥ "ఓ వెఱ్ఱులార యేటికి
నీ వెడఁగు విచారములు సహింపఁగ రాదా
యే వారికైన మేలా
చావు లతర్కితము లుగ్ర సంగ్రామములన్. 52

అర్థము :- ఓ వెఱ్ఱులార=ఓ అవివేకులారా! ఈ=ఇటువంటి; వెడఁగు=అవివేకపు; విచారములు=ఆలోచనలు; ఏటికి=ఎందులకు; సహింపఁగన్ రాదా!=ఓర్చుకొనకూడదా! ఉగ్ర=

భయంకరమైన; సంగ్రామములన్=యుద్ధములందు; చావులు=చావులు; అతర్కితములు= ఊహకందనివి. ఏవారికైన=(యుద్ధము) ఎవ్వరికైనను; మేలా!=మేలుకూర్చునా!

భావము :- "ఓ అవివేకులారా! ఇట్టి అమాయికపు ఆలోచనలెందుకు? సహనమవసరము. భయంకరమైన యుద్ధములందు చావులు ఊహింపలేము. యుద్ధము ఎవరికిని మేలు చేయదు.

తే॥ కుడిచి కూర్చుండి మీరేల కొఱఁతయైన
కుమ్ములాడెదరో యన్నదమ్ములార!
గొఱ్ఱె క్రొవ్వియు సెలగట్టె గోఱికినట్లు
కటకటా! మీ వివేకంబు గాడుపడఁగ. 53

అర్థము :- ఓ అన్నదమ్ములార=ఓ సోదరులారా! గొఱ్ఱె=గొఱ్ఱె; క్రొవ్వియు= బలిసినదైనను; సెలగట్టెన్=బాణమును; కొఱికినట్లు=కొరికిన విధముగా; కటకటా=అయ్యో! కొఱఁతయైన=దోషము కలదైన; మీ వివేకంబు=మీ యొక్క సత్యాసత్యములను తెలిసికొను జ్ఞానము; కాడుపడఁగ=దారి తప్పగా; కుడిచికూర్చుండి=తిని కూర్చుండి (ఊరకనే); మీరు= అన్నదమ్ములైన మీరు; ఏల=ఎందులకు; కుమ్ములాడెదరు=తగవులాడెదరు.

భావము :- ఓ అన్నదమ్ములారా! గొఱ్ఱె బలిసి బాణమును కొరికి అపకారమును పొందిన విధముగా మీరేల తిని కూర్చుండి దోష భూయిష్ఠమైన అవివేకముతో తగవులాడి కొందురు? మీ తెలివి తెల్లవార.

విశేషము :- కుడిచి కూర్చుండి అను పదబంధము తెలుగు నుడికారము. ఈ నుడికారము తిక్కన రచనలో అనేక పర్యాయములు కనబడును. తినికూర్చుండి పనిలేక చేయు పనులను గూర్చి చెప్పునపుడు ఉపయోగించు పదబంధమిది.

"గొఱ్ఱె క్రొవ్వియు" యందలి 'యు' అను సముచ్చయము వలన వక్రోక్తి కలదు.

అలంకారము - ఉపమ.

ఉ॥ భద్రము మీకుఁగావలె నపారముగా సురదైత్యులార! యీ
విద్రవ ముజ్జగింపుఁడు వివేకము పాకము దప్పకుండఁగా
భద్ర సువర్ణ పీఠికలపైఁ గొలువుండి త్రిలోకరాజ్యమ
చ్ఛిద్రముగాఁగ నేలుట విశేషమొ? చచ్చుట తా విశేషమో. 54

అర్థము :- సుర=దేవతలారా! దైత్యులార=రాక్షసులారా! అపారముగాన్=అంతు లేకుండ; మీకున్=మీకు; భద్రము కావలెన్=క్షేమమగుగాక! వివేకము=యుక్తాయుక్త జ్ఞానము;

పాకము దప్పకుండ(గాన్=చెడిపోకుండ; ఈ విద్రవమున్=ఈ అతి తెలివిని; ఉజ్జగింపు(డు= వీడుడు; భద్ర సువర్ణ పీఠికలపై=మంగళకరమైన బంగరు సింహాసనములపై; కొలువుండి= సభదీర్చి; అచ్ఛిద్రము గా(గన్=భంగము లేకుండునట్లుగ; త్రిలోక రాజ్యమును=ముల్లోకమనెడి రాజ్యమును; ఏలుట=పరిపాలించుట; విశేషమొ=గొప్పతనమా! తాన్=తాను; చచ్చుట= చచ్చుట; విశేషమో!=గొప్పతనమా!

భావము :- ఓ దేవతలారా! ఓ రాక్షసులారా! మీకు మేలు కలుగుగాక! వివేకము చెడిపోకుండుటకై అతితెలివిని వీడుడు. సువర్ణ భద్రాసనము నధిష్ఠించి కొలువుదీర్చి నిష్కంటకముగ త్రిలోక రాజ్యము నేలుట గొప్పయా! లేక యుద్ధములో నేలకూలుట విశేషమా?

వ॥ అదిగావున సుధాపానంబున జరామరణంబు లుజ్జగించి సుఖంబు ననుభవింపుడు. క్షీరసముద్ర మథనంబునం గాని సుధారసంబు సంభవింపదు గావున. 55

అర్థము :- అది=అందరు క్షేమముగ నుండు మార్గమిది; కావునన్=కనుక; సుధా= అమృతమును; పానంబునన్=త్రాగుట చేత; జరామరణంబులు=మునలి తనము మరణములను; ఉజ్జగించి=వదలి; సుఖంబు=సుఖమును; అనుభవింపు(డు=పొందుడు; క్షీరసముద్ర=పాల సంద్రమును; మథించినన్+కాని=చిలికినగాని; సుధారసంబు= అమృతరసము; సంభవింపదు=పుట్టదు; కావున=కనుక.

భావము :- అందరు క్షేమముగనుండు మార్గమిది. కనుక అమృతమును త్రాగి ముసలితనము, మరణములను వదలి సుఖము పొందుడు. పాల సముద్రమును చిలికిన అమృతము పుట్టును. అందుచేత.

శా॥ క్షీరాంభోధి మథింప(గా వలయు నక్షీణ ప్రతాప ప్రభా
వారంభంబున నాది కచ్ఛపము మూలాధార కుండంబుగా
సారోదారము మందరాచలము చంచన్మంథ దండంబుగా
గారామార రసాతలాధిపతి దృక్కర్ణుండు సూత్రంబుగన్." 56

అర్థము :- అక్షీణ.....రంభంబున. అక్షీణ=క్షీణింపని; ప్రతాప=ఉత్సాహము; ప్రభావ= శక్తి యొక్క; ఆరంభంబునన్=ప్రారంభముతో; ఆదికచ్ఛపము=మహాకూర్మము; మూల+ఆధార= అడుగు భాగమున ఆశ్రయమైన; కుండంబు+కాన్=చుట్టకాగా; సార+ఉదార=బలశ్రేష్ఠతలుగల; మందర+అచలము=మందర పర్వతము; చంచత్=కదలుచున్న; మంథదండంబుగాన్= కవ్వముకాగా; గారాము+ఆర=గౌరవము అతిశయించునట్లుగ; రసాతల+అధిపతి=రసాతలలోక నాయకుడు; దృక్+కర్ణుండు=కన్నులే చెవులుగగల సర్పమైన వాసుకి; సూత్రంబుగన్= త్రాడుగను; క్షీర+అంభోధిన్=పాలసముద్రమును; మథింప(గాన్+వలయున్=చిలుక వలయును.

భావము :- ఆదికూర్మము బరువు మోయు ఆధారమైన చుట్టకుదురుగ, మందర పర్వతమును కవ్వముగ, రసాతలాధిపతియైన వాసుకి కవ్వపు త్రాడుగ అనల్పమైన శౌర్య ప్రభావముతో, నశింపని పట్టుదలతో పాలసముద్రమును చిలుకవలెను."

ఆ॥ అనిన శౌరి పల్కు విని సమ్మతించి యా
దేవతలును బూర్వ దేవతలును
నమృత మథనమునకు నారంభ మొనరించి
రుల్లమునఁ బ్రమోద ముప్పతిల్ల. 57

అర్థము :- అనిన=అని పల్కిన; శౌరి=విష్ణువు యొక్క; పల్కు=మాటను; విని=వినినవారై; సమ్మతించి=ఒప్పుకొని; అ దేవతలును=ఆ దేవతలును; పూర్వదేవతలునున్=రాక్షసులును; ఉల్లమునన్=మనసునందు; ప్రమోదము=మిక్కిలి సంతోషము; ఉప్పతిల్లన్=కలుగగా; అమృత మథనమునకున్=అమృతము కొఱకు చిలుకుటను; ఆరంభము=ప్రారంభము; ఒనరించిరి=చేసిరి.

భావము :- శ్రీ మహావిష్ణువు చెప్పిన ఆ మాటను దేవతలు, రాక్షసులు విని అంగీకరించి సంతోషముతో అమృతము కొఱకై పాలసముద్రమును చిలుకుట ప్రారంభించిరి.

శా॥ బాహాస్తంభ చతుష్టయంబున మురప్రధ్వంసి లంఘించి యు
త్సాహంబొప్పఁగ నెత్తె మందర మహీధ్రం బుద్ధతిం గూట సం
దోహంబుల్ ద్రుహిణాండ కర్పరము నున్మూలింప దిక్సీమలం
గ్రాహింపం బతయాళు నిష్ఠుర మహా గండోపల ధ్వానముల్. 58

అర్థము :- కూట=కొండ కొమ్ములు; సందోహముల్=సమూహములు; ద్రుహిణ+అండ+కర్పరము=బ్రహ్మాండము యొక్క పైభాగపు పెంకును; ఉన్మూలింపన్=పెకలింపగా; పతయాళు.....ధ్వానముల్. పతయాళు=పడెడి స్వభావముగల; నిష్ఠుర=కఠినమైన; మహా+గండ+ఉపల=శ్రేష్ఠమగు పెద్దపెద్దరాళ్ళ; ధ్వానముల్=శబ్దములు; దిక్+సీమలన్=దిక్కుల యొక్క అంచులను; గ్రాహింపన్=తాకగా; మురప్రధ్వంసి=మురారియైన విష్ణువు; ఉత్సాహంబు=విజృంభణము; ఒప్పఁగన్=ప్రకాశింపగా; లంఘించి=దూకి; బాహాస్తంభ=స్తంభముల వంటి చేతులు; చతుష్టయంబున=నాలుగింటితో; ఉద్ధతిన్=గర్వముతో; మందర మహీధ్రంబున్=మందర పర్వతమును; ఎత్తెన్=పైకి లేపెను.

భావము :- కొండ కొమ్ములు బ్రహ్మాండము యొక్క పై పెంకును పెకలింపగా, శ్రేష్ఠమగు పెద్ద పెద్ద రాళ్ళు దొర్లుడు శబ్దములు దిగంతములను తాకగా, మురారియైన విష్ణువు

అతిశయముగ విజృంభించి స్తంభముల వంటి తన నాల్గు చేతులతో మందర పర్వతమును పైకి లేపెను.

సీ॥ కపట కచ్ఛపమైన కైటభాంతకు వీఁపు
కొమరు మీఱిన చుట్టకుదురు గాఁగ
నారసాతల మూలమైన మందర మహా
ధరణీధరంబు మంథానకముగ
దందశూకాన్వయాధ్యక్షుండు వాసుకి
తత పరిగ్రహణ సూత్రంబు గాఁగ
నావహ ప్రవహాదులగు మారుతంబులు
తగులఁగట్టిన యాఁక త్రాళ్ళు గాఁగ

తే॥ బలి పురోగములగు దైత్య పరివృఢులును
దివిజనాయకుఁడాదిగా దేవతలును
దరిచి రంభోధి ఘుమఘుమ ధ్వాన రవము
భువన గోళంబు దిక్కులు చెవుడు వడఁగ. 59

అర్థము :- కపట కచ్ఛపము+ఐన=మాయాకూర్మమైన; కైటభ+అంతకు=కైటభుడను రాక్షసుని సంహరించిన విష్ణువు యొక్క; వీఁపు=వీపు భాగము; కొమరు మీఱిన=అందముతో అతిశయించిన; చుట్టకుదురు+కాఁగన్=పాత్ర అటునిటు కదలకుండుటకై అడుగున నుంచెడి చుట్టుదిండు కాగా;

ఆ రసాతల=ఆ రసాతల లోకము; మూలము+ఐన=పాదముగాగల; మందర= మందరమను పేరుగల; మహా=గొప్ప; ధరణీధరంబు=కొండ; మంథానకముగ=కవ్వముగ;

దందశూక+అన్వయ=సర్పవంశమునకు; అధ్యక్షుండు=నాయకుడైన; వాసుకి=వాసుకి; తత=పొడవైన; పరిగ్రహణ=పట్టుకొను; సూత్రంబు=త్రాడు; కాఁగన్=కాగా;

ఆవహ=ఆవహము; ప్రవహ=ప్రవహము; ఆదులగు=మొదలైన; మారుతంబులు= గాలులు; తగులన్=తగిలించి; కట్టిన+ఆఁక త్రాళ్ళు=కవ్వము కదలుచు ప్రక్కలకు జారకుండు టకై కవ్వమునకు స్తంభమునకు తగిలించి కట్టెడి తాళ్ళు; కాఁగన్=కాగా;

బలి పురోగములగు=బలి చక్రవర్తి ముందు నడచు వాడుగగల; దైత్య పరివృఢులును =రాక్షస నాయకులును; దివిజ నాయకుఁడు=దేవేంద్రుఁడు; ఆదిగా=మొదలైన; దేవతలును= దేవతలును; ఘుమఘుమ=ఘుంఘుమ్మను; ధ్వానరవము=శబ్దము యొక్క గర్జనము; భువన గోళంబు=బ్రహ్మాండ గోళమును; దిక్కులు=దిక్కులును; చెవుడువడఁగన్=చెవిటి తనమును పొందగా; అంభోధిన్=సముద్రమును; తర్చిచిరి=చిలికిరి.

భావము :- మయాకూర్మమైన శ్రీ మహావిష్ణువు యొక్క వీపు అందమైన చుట్టకుదురైనది. మందర పర్వతము కవ్వమైనది. సర్పరాజు వాసుకి కవ్వపు త్రాడైనాడు. ఆవహము, ప్రవహము మొదలైన సప్తవాయువులు కట్టుత్రాళ్లైనవి. బలి చక్రవర్తి నాయకుడుగ రాక్షసులు, ఇంద్రుడు నాయకుడుగ దేవతలు పాల సముద్రమును చిలుక నారంభించిరి. ఆ చిలుకుచుండగా వచ్చిన శబ్దములకు బ్రహ్మాండ గోళము దిక్కులు దద్దరిల్లినవి. చెవుడువడినవి.

విశేషము :- సప్త వాయువులు :- 1. ప్రవహము, 2. ఆవహము, 3. ఉద్వహము, 4. సంవహము, 5. వివహము, 6. ప్రతివహము, 7. పరావహము - అనునవి.

వీని విశేషములకు చూడుడు 3-48.

వ॥ ఇవ్విధంబున సురాసుర వ్యూహంబు లుత్సాహంబులు మదంబులు ముదంబులు శౌర్యంబులు ధైర్యంబులు క్రౌర్యంబులు వీర్యంబులు, హంకారంబులు హుంకారంబు లుల్లాసంబులు ప్రహాసంబులు బలంబులు చలంబులు జవంబులు రవంబులు నదల్పులు విదల్పులు వీకులు తాఁకులు జూఁకలు కూఁకలు మూఁకలు వ్రేఁకలు తెగింపులు నగింపులు నింపులు సొంపులు పెంపులు గుంపులు పరువులు మురువులు గెలయ మెలయు బాహావష్టంభ సంరంభ విజృంభణంబునఁదరతరంబు తరువందరువఁ దరిత్రాడు పాఁపజేని యొడలి మలకలు పురులు విడి తరులువడి దిర్దిరందిరుగు మందరగిరి కందరాఘాతంబులం గలగుండువడి కరిమకరి తిమింగిల మత్స్యకచ్ఛప ఢులీ కుళీరంబులు సవ్యాపసవ్య యాతాయాత పరిభ్రమణంబులచేత విచేత నావస్థఁబరిభ్రమించి యంతర్మగ్నంబులైన పక్షక్షోణీధరంబులు తెక్కలు ముణుచుకొని క్రుంగి మణంగి తరంబుల నొదుగ దుగ్ధార్ణవంబు ఘూర్ణమానంబయ్యెఁ; నప్పుడు భుజంగ పుంగవ వదన నాసా నిష్క్యూత నిష్ఠుర విష నిశ్వాస పవనధారా సంధుక్షణంబున నభిస్యంద జ్వాలనంబు ప్రజ్వలించె నోయన భుగభుగ ధ్వని తోడంగూడి సుడి గొన నెగయు క్రొంబొగల వెంబడి విస్ఫులింగంబు లాస్ఫోటించి దిక్కులంజూఱ పుచ్ఛం జిచ్చు పెచ్చు పెఱిఁగి కోమలతమ తమాల పల్లవంబుల యుల్లాసంబు నుల్లసంబాడు నల్లని నాలుకలు విషంబుమియుచుంగమియుచు భృంగ సంకాశంబును నీలజీమూత సన్నిభంబును కల్పాంత సమయ వహ్ని కల్పంబును గాలమృత్యుప్రతిమంబును యుగాంతాగ్ని వర్చసంబునునై ఛటచ్ఛటా శబ్దంబులతో నసహ్య విషజిహ్వాల కలాపంబులు బ్రహ్మాండ కర్పరంబు నప్పళింప నిప్పులు చెదరి

చదలు దరికొల్పు నుల్కాపాతంబులుంబోలె దిక్కులం జురజుర స్రుక్కి లావెక్క సప్తపాతాళ భువన చక్రవాళంబు పురపురంబొక్క వెక్కసంబయి కోలాహలాభీలంబయి హాలాహలం బుద్భవించిన. 60

అర్థము :- ఈ+విధంబున=ఈవిధముగా; సుర+అసుర=దేవతల రాక్షసుల; వ్యూహంబులు=సమూహములు; ఉత్సాహంబులు=విజృంభణలు; మదంబులు=గర్వములు; ముదంబులు=సంతోషములు; శౌర్యంబులు=పరాక్రమములు; ధైర్యంబులు=ధీరతలు; క్రౌర్యంబులు=కఱకుతనములు; వీర్యంబులు=బలములు; హంకారంబులు=పొగరులు; హుంకారంబులు=హుమ్మనిచేయు గర్జనలు; ఉల్లాసంబులు=వేడుకలు; ప్రహాసంబులు=ఎగతాళులు; బలంబులు=సత్తువలు; చలంబులు=పట్టుదలలు; జవంబులు=వేగములు; రవంబులు=శబ్దములు; అదల్పులు=అదలించుటలు; విదల్పులు=విదిలించుటలు; వీకులు=పొంగుపాటులు; తాఁకులు=కలియుటలు; జూఁకలు=తత్తరపాటులు; కూఁకలు=కేకలు; మూఁకలు=గుంపులు; వీఁకలు=విజృంభణలు; తెగింపులు=తెగువలు; నగింపులు=నవ్వించుటలు; ఇంపులు=ఆనందములు; సొంపులు=అందములు; పెంపులు=అతిశయములు; గుంపులు=మూగుటలు; పరువులు=వ్యాపించుటలు; మురువులు=విలాసములు; గెఱయ=రూపులేర్పడగా; మెఱయ=ప్రకాశింపగా; బాహా=భుజముల; అవష్టంభ=గర్వము యొక్క; సంరంభ=సంరంభము; విజృంభణంబునన్=చెలరేగుట చేత; తరతరంబు=వరుస పెట్టి; తరువన్+తరువన్=చిలుకగా చిలుకగా; తరిత్రాడు=కవ్వపు త్రాడైన; పాఁపఱేని=సర్పనాయకుని; ఒడలి=శరీరమందలి; మలకలు=మెలికలు; పురులు విడి=పేటలు విడి; తరులు వడి=రాపిడి పడి; దిర్దిరన్+తిరుగు=దిరదిరమని తిరుగుచున్న; మందరగిరి=మందర పర్వతము యొక్క; కందర=గుహాకారములైన పర్వతపు నడిమి ప్రదేశముల యొక్క; ఆఘాతంబులన్=గట్టి దెబ్బలచే; కలగుండు వడి=చెదరి; కరి=ఏనుగులు; మకరి=మొసళ్లు; తిమింగిల=తిమింగలములు; మత్స్య=చేపలు; కచ్ఛప=తాఁబేళ్లు; ఢులీ=ఆడు తాబేళ్లు; కుళీరంబులు=ఎండ్రలు; సవ్య+అపసవ్య=కుడి యెడమలకు; యాతాయాత=వచ్చిపోవు; పరిభ్రమణంబులచేత=చుట్టు తిరుగుటలచే; విచేతనావస్థన్=జడత్వము పొంది; పరిభ్రమించి =తిరిగి; అంతర్మగ్నంబులు+ఐన=లోపల మునిగినవికాగా; పక్షక్షోణీధరంబులు=ఱెక్కల పర్వతములు; ఱెక్కలు=తమ ఱెక్కలను; ముణుచుకొని=ముడుచుకొని; గ్రమంగి=క్రుంగి; అణంగి=అణగి; తరంబులన్=తత్తరపాటులతో; ఒదుగన్=ఒదిగియుండగా; దుగ్ధ+అర్ణవంబు=పాలసముద్రము; ఘూర్ణమానంబు=తిరుగుడు వడినదిగ; అయ్యెన్=అయ్యెను; అప్పుడు=ఆ సమయమున; భుజంగ.....సంధుక్షణంబున. భుజంగ పుంగవ=సర్పరాజు వాసుకి యొక్క;

వదన=ముఖమునందలి; నాసా=ముక్కుల నుండి; నిష్ఠ్యూత=ఉమియబడిన; నిష్ఠుర=కఠినమైన; విష+నిశ్వాస పవన=విషముతో కూడి వదలిన గాలి యొక్క; ధారా=ప్రవాహము యొక్క; సంధుక్షణంబునన్=రగిలింపు చేత; అభిస్యంద=ప్రేరేపింపబడిన; జ్వలనంబు=అగ్ని; ప్రజ్వలించెనో=మండెనా; అనన్=అన్నట్లుగా; భుగ భుగ=భుగ భుగమను; ధ్వనితోడన్=శబ్దముతో; కూడి=కలసి; సుడిగొనన్=చుట్టుకొనగా; ఎగయు=క్రమ్ముకొను; క్రొత్త+పొగలన్=క్రొత్తవగు పొగల; వెంబడి=వెంట; విస్ఫులింగంబులు=అగ్నికణములు; ఆస్ఫోటించి=మ్రోతలు పెట్టి; దిక్కులన్=దిక్కులను; చూఱపుచ్చన్=నాశనము చేయగా; చిచ్చు=మంట; పెచ్చు పెరి(గి=విజృంభించి; కోమలతమ=మిక్కిలి మృదువైన; తమాల పల్లవంబుల=కాటుక చెట్టు చిగురాకుల; ఉల్లాసంబున్=అందమును; ఉల్లసంబు+ఆడు=వెక్కిరించు; నల్లని=నల్లనైన; నాలుకలు=కీలలు; విషంబు=విషమును; ఉమియుచు=వెలిగ్రక్కుచు; కమియుచు=క్రమ్ముచు; భృంగ సంకాశంబును=తుమ్మెదలతో పోలినది; నీలజీమూత=నల్లని మేఘముతో; సన్నిభంబును=పోలినది; కల్పాంత సమయ=యుగము యొక్క చివరి సమయమందలి; వహ్నికల్పంబును=అగ్నివంటిదియు; కాలమృత్యు=క్రూరుడైన యమునితో; ప్రతిమంబును=సమమైనదియు; యుగాంత=యుగాంతము నందలి; అగ్ని వర్చసంబును=అగ్నితేజము వంటి తేజము కలదై; ఛటత్+ఛటత్=ఛటఛటమను; శబ్దంబులతోన్=ధ్వనులతో; అసహ్య=సహింపరాని; విష జిహ్వల=విషపు నాలుకల; కలాపంబులు=గుంపులు; బ్రహ్మాండ=బ్రహ్మాండము యొక్క; కర్పరంబున్=పై పెంకును; అప్పళింపన్=చరచగా; నిప్పులు=నిప్పులు; చెదరి=వ్యాపించి; చదలు=ఆకాశము; దరికొల్పున్=మండించు; ఉల్కాపాతంబులున్+పోలె=తోకచుక్కలు పడుటవలె; దిక్కులన్=దిక్కులందు; చురచుర=చురచురమని; స్రుక్కి=చుట్టుకొని; లావెక్కన్=శక్తి అతిశయింపగా; సప్త=ఏడైన; పాతాళ భువన=పాతాళలోకముల; చక్రవాళంబు=సమూహము; పురపురన్=పురపురమని; పొక్కన్=పరితపింపగా; వెక్కసంబయి=దుస్సహమై; కోలాహల=పెద్ద రొదతో; ఆభీలంబయి=భయంకరమై; హాలాహలంబు=హాలాహలమను విషము; ఉద్భవించినన్=పుట్టగా;

భావము :- ఈవిధముగ దేవతలు రాక్షసులును గర్వములు, సంతోషములు, పరాక్రమములు, ధైర్యములు, హుంకారములు, పట్టుదలలు, అదలింపులు, విదలింపులు, తెగింపులు, నగింపులు ప్రకాశించుచుండగా పాలసముద్రమును చిలుకుచుండిరి. కవ్వపు త్రాడుగనున్న సర్పరాజు వాసుకి శరీరముపైగల మెలికలు పోయి ఒరపిడి పడినవి. మందర పర్వతము గిరగిర తిరుగుచుండగా ఆ తిరుగుడుకు పాలసముద్రము కలగుండు పడినది. నీటిలోని ఏనుగులు, మొసళ్ళు, తిమింగిలములు, చేపలు, తాబేళ్ళు, ఎండ్రలు

చెల్లచెదరగుచున్నవి. సముద్రము నందలి ఱెక్కల పర్వతములు తమ ఱెక్కలను ముడుచుకొని తత్తరపాటుతో అణగి ఒదిగియున్నవి. ఆ సమయమున కవ్వపు త్రాడైన వాసుకి ముక్కుల నుండి వెలువడిన నిశ్వాస విషవాయువు యొక్క ప్రవాహముచే ప్రేరేపింపబడి రగిలింపబడిన అగ్ని మండెనాయన్నట్లుగ; భుగభుగమను శబ్దముతోకూడి చుట్టుకొని క్రమ్ము పొగల వెంట అగ్నికణములు మ్రోతలు పెట్టుచు దిక్కులను నాశనము చేయుటకు మంటలు పెచ్చు పెరుగునట్లు, కాటుక చెట్టు చిగురాకు కంటె అతిశయించిన నల్లనైన అగ్నికీలలు విషమును విరజిమ్ముచు తుమ్మెదలవలె, నల్లని మేఘమువలె, ప్రళయాగ్నివలె, కాలమృత్యువువలె, ప్రళయాగ్ని తేజస్సువంటి తేజస్సు కలదై ఛటఛట శబ్దములతో బ్రహ్మాండపు పై పెంకును చరచునట్లుగ నిప్పులు చెదరి వ్యాపించి; ఆకాశమును మండించు ఉల్కాపాతము వలె, దిక్కులందు చురచురమని చుట్టుకొని విజృంభించుచు, పాతాళలోకము లేడును పరితపించునట్లు, పెద్ద రొదతో సహింపరానిదై భయంకరమైన హాలాహలమనెడి విషము పుట్టగా;

సీ॥ పంకజ ప్రభవుఁ డబ్రహ్మణ్య మొనరించెఁ
దాల సన్నిభ భుజా స్తంభ మెత్తి
తరిత్రాడు విడిచి బృందారకాసురకోటి
పంచ బంగాళమై పారిపోయె
హాహా నినాద కోలాహలోత్తాలమై
త్రైలోక్యమును భీతిఁ దల్లడిల్లెఁ
గనక వర్ణుండైన కైటభాసురవైరి
పొగచూరి నల్లనై బొగ్గుపడియెఁ

తే॥ బెటిలె బ్రహ్మాండ భాండమ్ము చిటిలె దిక్కు
లురలె పాతాళ భువనంబు లుదిలె నభము
మేటి ధాటీ జనిత కాలకూట విషము
చిచ్చు విడివడి యంతంత పెచ్చు పెరుఁగ. 61

అర్థము :- మేటి=గొప్ప; ధాటీ=తీవ్రతతో; జనిత=పుట్టిన; కాలకూట=కాలకూటమను పేరుగల; విషము=గరళమనెడి; చిచ్చు=నిప్పు; విడివడి=ఆటంకము లేకుండ ప్రవర్తిల్లి; అంతంత=అంతకంతకు; పెచ్చుపెరుఁగన్=విజృంభింపగా;

పంకజ ప్రభవుఁడు=బ్రహ్మదేవుడు; తాల=తాడిచెట్టుతో; సన్నిభము+ఐన=సమమైన; భుజాస్తంభము=స్తంభము వంటి భుజమును; ఎత్తి=పైకి లేపి; అబ్రహ్మణ్యము=మొరపెట్టుట; ఒనరించెన్=చేసెను;

బృందారక+అసుర+కోటి=దేవతల రాక్షసుల సమూహము; తరిత్రాడున్=కవ్వపు త్రాడును; విడిచి=వదలి; పంచబంగాళము+ఐ=చెల్లచెదరై; పారిపోయె=పరుగెత్తెను;

హాహా....త్తాలమై. హాహానినాద=హాహామను ధ్వనుల యొక్క; కోలాహల=కలకలము; ఉత్తాలము+ఐ=విస్తరించినదై; త్రైలోక్యమును=మూడు లోకముల మొత్తము; భీతిన్=భయముతో; తల్లడిల్లెన్=కలతపడెను;

కనకవర్ణుండు+ఐన=బంగరు చాయకలవాడైన; కైటభ+అసుర+వైరి=(కైటభుడను రక్కసుని చంపిన) విష్ణుమూర్తి; పొగచూరి=పొగ తగిలి; నల్లన+ఐ=నలుపుగమారి; బొగ్గుపడియెన్=బొగ్గువలెనయ్యెను;

బ్రహ్మాండభాండంబు=భాండము వంటి బ్రహ్మాండము; పెటిలెన్=చప్పుడగునట్లు పగిలెను; దిక్కులు=దిశలు; చిటిలెన్=బీటలు వారెను; పాతాళ భువనంబులు=అధోలోకములు; ఉరలెన్=దొర్లెను; నభము=ఆకాశము; ఉదిలెన్=చలించినది.

భావము :- గొప్ప తీవ్రతతో కాలకూట విషమనెడి చిచ్చు పుట్టి వ్యాపించి అంతకంతకు పెచ్చు పెరిగినది. ఆ సమయమున బ్రహ్మదేవుడు చేయెత్తి మొర పెట్టినాడు. దేవతలు, రాక్షసులు కవ్వపు త్రాడును వదలి వేసి చెల్లచెదరై పారిపోయినారు. హాహాకార కోలాహలముతో మూడు లోకములు భయముతో చలించినవి. బంగరురంగు గలవిష్ణుమూర్తి పొగచూరి నల్లగ మారెను. బ్రహ్మాండ భాండము పగిలినది. దిక్కులు బీటలు వారినవి. అధోలోకములేడును దొర్లినవి. ఆకాశము చలించినది.

**వ॥ అప్పుడు మిసిమింతుఁడునుం గాక పయోధి ప్రాంతంబున దక్షవాటంబున హాటక సింహాసనాసీనుండయిన లలాటలోచను భవబంధ మోచను సోమశేఖరుని శరణంబు సొచ్చి హరి విరించి పురందరాది బృందారకులిట్లనిరి. 62**

**అర్థము** :- అప్పుడు=ఆ సమయమున; మిసిమింతుఁడునున్+కాక=అలసినవాడు కాకుండ; పయోధి ప్రాంతంబున=సముద్రము దగ్గర; దక్షవాటంబున=దక్షారామమున; హాటక సింహాసన=బంగరు గద్దెపై; ఆసీనుండు+ఐన=కూర్చుండియున్న; భవబంధ=సంసారమను సంకెలల నుండి; మోచను=ముక్తి కల్గించువాడును; లలాట లోచను=నొసట కన్ను కలవాడును; సోమశేఖరుని=చంద్రుని సిగపై ధరించినవాడునునగు శివుని; శరణంబు సొచ్చి=రక్షణ కోరి; హరి=విష్ణువు; విరించి=బ్రహ్మ; పురందర=ఇంద్రుడు; ఆది=మొదలైన; బృందారకులు=దేవతలు; ఇట్లు+అనిరి=ఈవిధముగ పల్కిరి.

భావము :- ఆ సమయమున ఏమాత్రము శ్రమను పొందక సప్తగోదావర ప్రాంతమున దక్షారామమున వెలసియున్న భవబంధ విమోచనుడు, ముక్కంటి, సోమశేఖరుడునైన శంకరుని కడకు బ్రహ్మ విష్ణువు దేవేంద్రుడు మొదలైన దేవతలు చేరి శరణు వేడి ఇట్లు పల్కిరి.

చ॥ "అభయము పార్వతీశ! యభయంబు మహేశ! శశాంక శేఖరా!
యభయము శూలపాణి! యభయంబు మదాంధ కృతాంత మర్దనా!
యభయము ఫాలనేత్ర! యభయంబు కృపామయ దివ్యమానసా!
యభయము భీమనాథ! యభయం బభయంబభయంబు శంకరా!". 63

అర్థము :- పార్వతి+ఈశ=ఓ పార్వతీపతీ! అభయము=భయము లేదని (పల్కుము); మహేశ!=ఓ మహాదేవా! అభయంబు=రక్షణనిమ్ము; శశాంక శేఖరా=చంద్రుని శిరస్సున ధరించినవాడా; అభయంబు=భయము లేదనుము; శూలపాణి=శూలమును చేత ధరించినవాడా! అభయము=భయమును తొలగింపుము; మదాంధ కృతాంత మర్దనా=మదము చేత గ్రుడ్డితనము కలిగిన యముని అణచినవాడా; అభయము=భయమును తొలగింపుము; ఫాలనేత్ర=నొసలి కన్ను కలవాడా! అభయము=రక్షింపుము; కృపామయ=దయతో కూడుకొన్న; దివ్యమానసా=గొప్ప మనసు కలవాడా!; అభయము=భయము లేకుండ చేయుము; భీమనాథ=ఓ భీమేశ్వరా! అభయంబు=అభయమిమ్ము!; శంకరా=శుభమును కల్గించువాడా!; అభయంబు=రక్షణ (నిమ్ము); అభయంబు=భయమును తొలగించి రక్షింపుము.

భావము :- ఓ పార్వతీ మనోహరా! ఓ చంద్రశేఖరా! ఓ త్రిశూలపాణీ! ఓ కృతాంత మర్దనా! ఓ ముక్కంటీ! ఓ కృపానిధీ! ఓ భీమేశ్వరా! ఓ శంకరా! అభయమిచ్చి రక్షింపుము.

విశేషము :- శంకరుని అనేక నామముల నుచ్చరించి పదిమార్లు అభయము అభయము అనుటలో బ్రహ్మాదుల భయాధిక్యము సూచింపబడినది.

తే॥ అని భయభ్రాంతులగుచు శక్రాది సురలు
బలిపురోగములగు దైత్య పరివృఢులును
శరణు చొచ్చిన నభయ హస్తంబు సాఁచి
వెఱవ కుండుఁడు మీరని విశ్వవిభుఁడు. 64

అర్థము :- అని=అని; శక్ర+ఆది=ఇంద్రుడు మొదలైన; సురలు=దేవతలు; బలి పురోగములు+అగు=బలి చక్రవర్తి ప్రధానుడుగ గలవారైన; దైత్య పరివృఢులును=రాక్షస నాయకులును; భయ=భీతిచే; భ్రాంతులగుచు=గాబరాపడిన వారగుచు; శరణు చొచ్చినన్= రక్షణ కొఱకు రాగా; మీరు=మీరందరు; వెఱవక+ఉండుడు=భయపడకుడు; అని=అని

పల్కుచు; విశ్వవిభుఁడు=విశ్వేశ్వరుడైన శంకరుడు; అభయ హస్తంబు సాఁచి=అభయ ముద్రగల చేతిని చాపి;

భావము :- ఇంద్రుడు మొదలైన దేవతలు, బలి మొదలగు రాక్షసులు ఆ కాలకూట విష విజృంభణకు భీతిల్లి గాబరాపడుచు దక్షారామ భీమేశ్వరుని కడకు వచ్చి శరణువేడిరి. ఆ భీమేశ్వరుడు వారందరికి అభయ హస్తము చాపి భయపడకుడని చెప్పెను.

విశేషము :- "బలి పురోగములగు దైత్య పరివృఢులును" అన్న పాదము - 4-59 లో వెనుక వచ్చినది. ఉత్సాహముతో మథించుటకు వచ్చిన వారందరును శరణుచొచ్చిరి - అని సూచించుటకు అ పాదమునే మరల వ్రాయుట జరిగినది.

## శివుఁడు హాలాహలము మ్రింగుట :

మ॥ పటు హుంకార మహాట్టహాసకలనం బాతాళ భూస్స్వర్గ సం
కట సన్నాహ సముద్భవంబయిన యా కాకోల కాలాగ్ని ధూ
ర్జటి హస్తాబ్జమునందుఁగైకొనియె నా జ్వాలాకులక్ష్వేల మ
ప్పటి వేళన్ మదభృంగమయ్యె శశిభృత్పాణ్యబ్జ మధ్యంబునన్. 65

అర్థము :- పాతాళ=పాతాళ లోకమును; భూ=భూమిని; స్వర్గ=స్వర్గలోకమును; సంకట=బాధపెట్టుటకు; సన్నాహ=సిద్ధమయి; సముద్భవంబు+ఐన=విశేషముగ పుట్టిన; ఆ కాకోల=ఆ కాకోలవిషమనెడి; కాల+అగ్నిన్=ప్రళయాగ్నిని; పటు.....అయిన; పటు=గొప్ప; హుంకార=హుమ్మను ధ్వనితో; మహా=గొప్ప; అట్టహాస=పెద్దనవ్వుతో; కలనన్=కూడి; ధూర్జటి= శివుడు; హస్త+అబ్జమునందు=పద్మము వంటి చేతియందు; కైకొనియెన్=తీసికొనెను. ఆ=అట్టి; జ్వాలా+ఆకుల=మంటలచే నిండిన; క్ష్వేళము=విషము; అప్పటి వేళన్=ఆ సమయమున; శశి.....ధ్యంబునన్; శశిభృత్=చంద్రుని ధరించిన శివుని యొక్క; పాణి+అబ్జ=పద్మము వంటి చేతి; మధ్యంబునన్=నడిమి భాగమున; మదభృంగము+అయ్యెన్=మదించిన తుమ్మెదయైనది.

భావము :- ముల్లోకములను బాధపెట్టుటకు సిద్ధమైన ఆ కాకోలమనెడి కాలాగ్ని పుట్టి గొప్ప హుంకారముతో విజృంభించినది. అట్టి భయంకరమైన కాకోలమును శంకరుడు పద్మము వంటి చేతితో పట్టి బంధించెను. అగ్ని జ్వాలలను విరజిమ్ము ఆ కాకోలము ఆ సమయమున శంకరుని చేతి గుప్పిలియనెడి పద్మమున చిక్కినట్టి మదించిన తుమ్మెదయైనది.

కం॥ కటుకమగు విషము విషధర
కటకంబగు కేలఁబూని కౌతూహలియై
ఘుటికా సంసిద్ధుఁడు రస
ఘుటికయునుం బోలె శివుఁడు గుటుకున మ్రింగెన్. 66

అర్థము :- శివుఁడు=శంకరుడు; కటుకము+అగు=తీక్ష్ణమైన; విషమున్=విషమును; విషధర=విషమును ధరించు సర్పము; కటకంబు+అగు=కడియము గల; కలన్=చేతితో; పూని=పట్టుకొని; ఘుటికా=ఘుటికాయోగమున; సంసిద్ధుఁడు=మిక్కిలి నేర్పుగలవాడు; రసఘుటికయునున్=పాదరసపు మాత్రను; పోలె=వలె; కౌతూహలియై=ఉత్సాహము కలవాడై; గుటుకున=గుటుకుమను ధ్వనివచ్చునట్లు, మ్రింగెన్=మ్రింగెను.

భావము :- శంకరుడు భయంకరమైన విషమును గుప్పిట పట్టెను. ఘుటికా యోగమున నేర్పరియైన సిద్ధుడు రసగుళికను మ్రింగినట్లుగా శంకరుడా విషమును నేర్పుగ గుటుక్కున మ్రింగెను.

విశేషము :- భీమేశ్వర పురాణమునకు ముందే వ్రాసిన హరవిలాసములో (6-70) ఈ కందపద్యము యథాక్షరముగ నున్నది. రసఘుటిక వివరణము (2-49) చెంత వచ్చినది.

శివుడు హాలాహలమును రసఘుటిక వోలె మ్రింగెనను భావము - ఆది శంకరుల శివానందలహరి (శ్లో-32) యందు కలదు. ఈ శ్లోకము 1-111 చెంత వ్రాయుట జరిగినది.

"గ్రసతేస్మ జగత్రాతా విషభృద్భూషణో విషం
ఘుటికాం ఘుటికా సిద్ధో బధ్వా రసమయీ మివ" అని సంస్కృత భీమఖండము (16-35)

కం॥ అపుడు హిమాచల కన్యక
యుపగూహన మాచరించు నొఱపునఁ జుట్టెం
ద్రిపురాంతకు కంఠంబునఁ
దపనీయచ్ఛాయ నొప్పు తన దోర్వల్లిన్. 67

అర్థము :- అపుడు=ఆ సమయమున; హిమ+అచల=హిమవత్పర్వతుని, కన్యక=కుమారియైన పార్వతి; తపనీయ=బంగారపు; ఛాయన్=రంగుతో; ఒప్పు=ప్రకాశించు; తన=తన; దోః+వల్లిన్=తీగెవంటి చేతితో; ఉపగూహనము=కౌగిలింత; ఆచరించు=చేయు; ఒఱపునన్=నేర్పుతో; త్రిపురాంతకు=శంకరుని; కంఠంబునన్=మెడయందు; చుట్టెన్= చుట్టివేసినది.

భావము :- అపుడు పార్వతి ఆలింగనమొనర్చురీతిగా బంగరు ఛాయగల తీవెలవంటి తన చేతులతో పరమేశ్వరుని కంఠమును చుట్టివేసెను.

విశేషము :- పరమేశ్వరుని లోకోపకారమునకు సంతసించిన పరమేశ్వరి శివుని కౌగిలించుకొన్నది. హిమాచల కన్యక అనుపదము సాభిప్రాయము. ముల్లోకములను మండించు కాలకూట విషాగ్నిని మ్రింగిన శివుని కంఠము చలిమల కూతురగు చల్లని తల్లి

శీతల స్పర్శచే చల్లబడినది. అందువలననే బంగరు ఛాయగల ఆమె దేహము కాలవర్ణమై కాళిక అయి యుండునని కవి భావమేమో!

ఉ॥ చుట్టి బిగించిపట్టి "పురసూదన! యీ గరళాగ్నిఁగంధరా
ఘట్టమునందు నిల్పుమదిగాక దిగంబడ నిచ్చితేని లో
పట్టున నున్న లోకముల భస్మముసేయు వెలార్చితేని వె
ల్పట్టున నున్న లోకముల భస్మము సేయు నిజంబు చెప్పితిన్. 68

అర్థము :- చుట్టి=చుట్టివేసి; బిగించి పట్టి=గట్టిగ బిగబట్టి; పుర సూదన= త్రిపురములను నాశము చేసినవాడా! శంకరా!; ఈ గరళాగ్నిన్=ఈ గరళమనెడు నిప్పును; కంధరా+ఘట్టమునందు=కంఠస్థానమునందే; నిల్పుము=ఆపి యుంచుము; అదిగాక= అట్లుగాక; దిగన్+పడనిచ్చితి+ఏని=(గొంతుదాటి లోనికి) దిగబడనిచ్చినచో; లోపట్టునన్= లోపలి స్థానమున; ఉన్న=ఉన్నటువంటి; లోకములన్=జగములను; భస్మము+చేయు= బూడిద చేయును; వెలార్చితి+ఏని=బయల్పరచినచో; వెల్పట్టునన్+ఉన్న=వెలుపలనున్న; లోకముల=లోకములను; భస్మము+చేయు=బూడిద చేయును; నిజంబు=నిజము; చెప్పితిన్=చెప్పితిని.

భావము :- పార్వతీదేవి తన చేతులతో శంకరుని మెడను చుట్టివేసి గట్టిగ బిగించి పట్టుకొని శంకరునితో - "ఓ పురహరా! ఈ గరళాగ్నిని గొంతునందే నిల్పుము. అట్లుగాక దానిని గొంతుదాటి లోపలికి పోనిచ్చినచో నీలోని లోకములు నాశమగును. గొంతుదాటి బయటకు పంపినచో బయటి లోకములు బూడిద యగును. నిజము చెప్పితిని."

విశేషము :- పురసూదన :- శంకరునకు పురసూదన అను విశేషణము రెండు విధముల అన్వర్థమైనది. లోకములకు ఇష్టమైనవాడా! యనియు త్రిపురములను నాశనము చేయువాడా! అనియు అర్థములు వచ్చు ఈ పదముతో హాలాహలమును మ్రింగుటతో లోకముల భయమును తీర్చి ప్రియమైనవాడు నయ్యెను. పిమ్మట కాలమున చేయబోవు త్రిపురాసుర సంహారమును సూచించుచు ప్రయోగించిన విశేషణమునైనది.

వెల్పట్టున లోపట్టుననున్న లోకములు :- శంకరుడు విశ్వేశ్వరుడు. బయటగల లోకములన్నియు సూక్ష్మరూపమున విశ్వేశ్వరుని పొట్టలోనుండునని భావము.

వ॥ అనుటయు. 69

అర్థము :- అనుటయు=అని పల్కుటయు;

భావము :- పార్వతీ దేవి పైవిధముగ చెప్పగా.

శా॥ శంభుండంబిక పల్కుఁగైకొని జగత్సంరక్షణార్థంబు సం
స్తంభించెన్ నిజకంఠ గోళమున విశ్వక్షోభ సంత్రాస సం
రంభారంభ విజృంభణోద్భట కలారౌద్రంబుఁ గాకోలమున్
జంభారాతి మణి ప్రకల్పిత విభూషా నిర్విశేషంబుగన్. 70

అర్థము :- శంభుండు=శంకరుడు; అంబిక పల్కున్=పార్వతీదేవి మాటను; కైకొని= అంగీకరించి; జగత్=లోకములను; సంరక్షణ+అర్థంబు=కాపాడుట కొరకై; విశ్వ..... శేషంబుగన్. విశ్వ=భువనములకు; క్షోభ=కలతను; సంత్రాస=మిక్కిలి భయము యొక్క; సంరంభ=ఆటోప మును; ఆరంభ=ఉపక్రమణము; విజృంభణ=వ్యాపించుటచే; ఉద్భట=ప్రచండమైన; కలా= క్రియచేత; రౌద్రంబున్=తీక్ష్ణత కలదైన; కాకోలమున్=కాకోలమను ప్రళయాగ్నిని; జంభారాతి మణి=ఇంద్రనీల మణిచే; ప్రకల్పిత=కల్గింపబడిన; విభూషా=అలంకారముతో; నిర్విశేషంబు గన్=భేదములేనట్లుగ; నిజ=తన; కంఠగోళమున=గొంతుక యందు; సంస్తంభించెన్=కదల కుండ ఉంచెను.

భావము :- శంకరుడు పార్వతీదేవి మాటను అంగీకరించినాడు. లోకములను రక్షింప దలచినాడు. జగములను బాధించి భయపెట్టుటకై తీక్ష్ణముగ విజృంభించిన విషమును తన కంఠమునందే కదలకుండ బంధించినాడు. అపుడా శంకరుని గొంతు ఇంద్రనీలమణి పొదిగిన ఆభరణముతో అలంకరింపబడినట్లుండెను.

విశేషము :- తెల్లనివాడైన శివుని కంఠముననున్న కాలకూటము నల్లనిదై లోకరక్షణ చిహ్నమగు అలంకారముగ భాసించినది. జగద్రక్షణమే వానికి భూషణము.

వ॥ అప్పుడు మహాదేవుని దేవతలిట్లని స్తుతియించిరి. 71

అర్థము :- అప్పుడు=ఆ సమయమున; మహాదేవుని=శంకరుని; దేవతలు=దేవతలు; ఇట్లు+అని=ఈవిధముగ; స్తుతియించిరి=కొనియాడిరి.

భావము :- అపుడు దేవతలు శంకరునీవిధముగ స్తుతించిరి.

## దేవతలీశ్వరుని స్తుతించుట

సీ॥ "సచరాచరంబైన జగము రక్షించితి
హాలాహలానలం బారగించి
శరణాగతత్రాణ పరతంత్ర భావంబు
నిఖిల లోకేశ్వర నీకె యొప్పు

భువనైక రక్షణ వ్యవహార చిహ్నకు
గుఱుతయ్యె నీకంఠ కోణ చిహ్న
త్రైలోక్య భీమంబుఁ గాలకూటము మ్రింగి
కైకొంటి భీమాఖ్యఁ గాలకంఠ!

తే॥ యఖిల దిక్పాలకులును నీ యాజ్ఞవారు
నీదు నిశ్వాస పవనంబు నిగమ రాశి
యమరకుల సార్వభౌమ! లోకాభిరామ!
దక్షవాటీపురీ కేలిధామ! భీమ! 72

**అర్థము** :- అమరకుల=దేవగణములకు; సార్వభౌమ=రాజరాజా! లోక+అభిరామ=లోకములకు ప్రియమైనవాడా! దక్షవాటీపురీ=దక్షారామ నగరము; కేలిధామ=విలాస మందిర ముగ కలవాడా! భీమ=ఓ భీమేశ్వరా!;

హాలాహల+అనలంబు=హాలాహలమనెడి నిప్పును; ఆరగించి=తిని; సచర+అచరంబు+ఐన=చలనముగల చలనములేని ప్రాణులతో కూడిన; జగము=లోకమును; రక్షించితి=కాపాడితివి;

నిఖిలలోక=సమస్త లోకములకు; ఈశ్వర=నాయకుడైనవాడా! శరణా.....భావంబు; శరణ+ఆగత=శరణు కోరి వచ్చినవారిని; త్రాణ=కాపాడుటయందు; పరతంత్ర భావంబు=పరాధీనమైయుండు స్వభావము; నీకె=నీకు మాత్రమే; ఒప్పు=తగియున్నది.

భువన=లోకములను; ఏక=అసహాయముగా; రక్షణ=కాపాడుటయను; వ్యవహార=ధర్మము యొక్క; చిహ్నకు=గుర్తుకు; నీ కంఠకోణ=నీ కంఠ ప్రదేశమునందలి; చిహ్న=మచ్చ; గుఱుతు+అయ్యెన్=సాక్షి అయినది;

కాలకంఠ=నల్లని కంఠము కలవాడా!; త్రైలోక్య=మూడు లోకముల మొత్తమునకు; భీమంబున్=భయంకరమైన; కాలకూటము=కాలకూటమను విషమును; మ్రింగి=కబళించి; భీమ+ఆఖ్యన్=భీముడను పేరును; కైకొంటి=పొందితివి;

అఖిల=అన్ని; దిక్+పాలకులును=దిక్కులను పాలించువారును; నీ+ఆజ్ఞవారు=నీ ఆనతికి లోబడినవారు; నిగమరాశి=వేదముల సమూహము; నీదు=నీ యొక్క; నిశ్వాస పవనంబు=నిట్టూర్పుల గాలి;

**భావము** :- ఓ దేవతా సార్వభౌమ! ఓ లోకాభిరామ! ఓ నిఖిల లోకేశ్వర! ఓ దక్షారామ భీమేశ్వరా! హాలాహలమును మ్రింగితివి. ఈ సమస్త లోకమును కాపాడితివి. శరణాగత

రక్షకుడను బిరుదము నీకే తగియున్నది. సకలలోక రక్షకుడవను లోక ప్రసిద్ధికి నీ మెడ యందలి నల్లని గుర్తే సాక్షి. ముల్లోకములను గడగడలాడించిన కాలకూటమును మ్రింగి నల్లని గొంతు కలవాడవై భీముడను సార్థక నామమును పొందితివి. దిక్పాలకులందరు నీ ఆనతికి లోబడియుందురు. వేదములన్నియు నీ నిట్టూర్పు గాలులు.

తే॥ దేవదేవ! మహాదేవ! దివిజ వంద్య!
సర్వలోకైక రక్షణ చతుర! శర్వ!
హాలహల కూట సంపర్క నీలకంఠ!
మ్రొక్కెదము దేవికిని నీకు ముదము తోడ. 73

అర్థము :- దేవదేవ=దేవతలకు దేవుడవైనవాడా!; మహాదేవ=శంకరా!; దివిజ వంద్య=దేవతలచే నమస్కరింప తగినవాడా!; సర్వ+లోక+ఏక+రక్షణ=లోకములన్నింటిని అసహాయముగ కాపాడుటయందు; చతుర=నేర్పు కలవాడా! శర్వ=దుష్టులను శిక్షించువాడా! హాలహల=హాలాహలమను విషము యొక్క; కూట=సమూహమును; సంపర్క=పొందుటచేత; నీలకంఠ=నల్లనైన గొంతుక కలవాడా!; నీకు=(అట్టి) నీకును; దేవికిని=పార్వతీదేవికిని; ముదముతోడన్=సంతోషముతో; మ్రొక్కెదము=నమస్కరింతుము.

భావము :- ఓ దేవదేవ! మహాదేవ! శర్వ! దేవతలకును పూజనీయుడవైనవాడా! సర్వలోక రక్షాదక్షుడవైనవాడా! హాలాహలమును కంఠమున బంధించి కాలకంఠుడవైనవాడా! నీకును పార్వతికిని సంతోషముతో నమస్కరింతుము.

మ॥ బహిరంత స్థ్సిత లోక రక్షణ కళాపారీణ శైలాత్మజన్
బహిరంతస్థ్సిత లోకరక్షణ కళాపారీణునిన్ దేవర
న్మహనీయ స్థిర సత్కృపాగుణనిధానంబైన దాక్షాయణి
న్మహనీయ స్థిర సత్కృపానిధి నిను న్వర్ణింతు మేమీశ్వరా! 74

అర్థము :- ఈశ్వరా!=ఓ శంకరా!; ఏము=మేము; బహి.....ఆత్మజన్. బహిః=బయట; అంతః=లోపల; స్థిత=ఉన్న; లోక=లోకములను; రక్షణ=కాపాడుటయను; కళా=విద్యయందు; పారీణ=ఆరితేరిన; శైల+ఆత్మజన్=(హిమవంతుని కుమారియైన) పార్వతిని; మహ.... నిధానంబు; మహనీయ=గొప్ప; స్థిర=గట్టి; సత్=మంచి; కృపాగుణ=దయా గుణమునకు; నిధానంబు=నిలయము; ఐన=అయినటువంటి; దాక్షాయణిన్=దక్షుని కుమారియైన సతీదేవిని; బహి.....పారీణునిన్. బహిః=బయట; అంతః=లోపల; స్థిత=ఉన్న; లోక=లోకములను; రక్షణ=రక్షించుటయను; కళా=విద్యయందు; పారీణునిన్=నేర్పుకలవానిని; మహనీయ.....నిధి.

మహనీయ=గొప్ప; స్థిర=నిలుకడగల; సత్=మంచి; కృపానిధి=దయకు నివాసమైన వానిని; దేవరన్=భగవంతుడవైన; నినున్=నిన్ను; వర్ణింతుము=పొగడుదుము.

భావము :- ఓ శంకరా! లోపలి, వెలుపలి లోకములను రక్షించుటయందు నీవును పార్వతీదేవియు సర్వసమర్థులు. మహనీయమై గొప్పదైన దయాగుణమునందు నీవును అంబికయు గొప్పవారు. దాక్షాయణియే పార్వతి. అట్టి ఆదిదంపతులైన మీ ఇరువురకు నమస్కరింతుము. ఇరువురను కీర్తింతుము.

విశేషము :- శైలాత్మజ, యను విశేషణముతో పార్వతీదేవి శాశ్వతత్వ మును, దక్షారామమున స్తుతించుటచేత దాక్షాయణి అను విశేషణము సార్థకములు. పార్వతీ పరమేశ్వరులిరువురు లోకములను రక్షించుటయందు, దయాగుణమునందు సమమైన శక్తిమంతులని సమాన పదములతో సూచించుట జరిగినది. చూడుడు. భీమ. 3-86.

తే॥ సంహరించితి భువన శోషకము విషము
నభయమిచ్చితి రక్షించి తఖిల జగము
శాంతమయ్యెనరిష్ట మిష్టంబు ప్రబలె
దక్షిణాబ్ధి తటావని ధామ భీమ. 75

అర్థము :- దక్షిణ+అబ్ధి=దక్షిణ సముద్రము యొక్క; తట=తీరమునందలి; అవని=భూమి; ధామ=నివాసముగ కలవాడా! భీమ=శ్రీ భీమేశ్వరా!; భువన=లోకములను; శోషకము=ఎండించు శక్తిగల; విషమున్=గరళమును; సంహరించితి=నిరోధించితివి; అభయము=భయము లేదని ధైర్యమును; ఇచ్చితి=ప్రసాదించితివి; అఖిల జగము=సర్వలోకములను; రక్షించితి=కాపాడితివి. అరిష్టము=కీడు; శాంతము+అయ్యెన్=ఉపశమించినది; ఇష్టంబు=కోరిక; ప్రబలెన్=వర్ధిల్లినది.

భావము :- ఓ దక్షారామ భీమేశ్వరా! సకల లోకములను ఎండింపగల భయంకరమైన కాలకూట విషమును నీ కంఠమున బంధించితివి. అభయమిచ్చి అన్ని లోకములను కాపాడితివి. కీడు తొలగిపోయినది. సంతోషము కల్గినది.

విశేషము :- దక్షిణ సముద్రమని మాటిమాటికి వచ్చుచుండును.

క॥ ధరణియు గగనము దిక్కులు
దరికొని మండెడు విషాగ్ని దక్షణ మాత్రం
గరమున ధరించి మ్రింగిన
నిరుపమ ధృతి నీక యొప్పు నీలగ్రీవా! 76

అర్థము :- నీలగ్రీవా!=ఓ నల్లని మెడకలవాడా! కాలకంఠా!; ధరణియు=భూమియు; గగనము=ఆకాశము; దిక్కులు=ఎనిమిది దిక్కులను; దరికొని=అంటుకొని; మండెడు= మండెడి; విష+అగ్నిన్=విషమనెడి నిప్పును; తత్+క్షణమాత్రన్=ఆ క్షణములోనే; కరమున=చేతితో; ధరించి=పట్టుకొని; మ్రింగిన=మ్రింగిన; ధృతి=ధైర్యము; స్థిరత్వము; నీక=నీకే; ఒప్పు=తగును.

భావము :- ఓ గరళకంఠా! శంకరా! భూమి, ఆకాశము, దిక్కులు అంటుకొని మండించగల కాలకూట విషమను అగ్నిని క్షణమాత్రమున చేతితో పట్టి మ్రింగి కంఠమున బంధించిన సాటిలేని ధీరుడా! అది నీకే తగును.

ఆ॥ ఆయత సత్కృపా మహిమ హాలహలాగ్ని భయంబు నీ మహో
పాయము చేతఁబాపితివి ప్రాల్గలవాఁడవు దక్షవాటికా
నాయక! భీమలింగ! శమనం బొనరించితి గాక యింతకుం
గోయిల వన్నెఁజెంది మఱిఁ గొక్కెర వంకర వోవె లోకముల్. 77

అర్థము :- దక్షవాటికా=దక్షారామమునకు; నాయక=అధిపతివైనవాడా!; భీమలింగ= లింగరూపముననున్న శ్రీ భీమేశ్వరా!; ఆయత=విరివియైన; సత్=మంచి; కృపామహిమన్= దయ యొక్క గొప్పతనముచేత; హాలహల+అగ్ని=హాలాహలమనెడి నిప్పు వలని; భయంబున్=భీతిని; ఈ=ఈవిధమైన; మహా=గొప్పదగు; ఉపాయముచేతన్=మార్గము చేత; పాపితివి=తొలగించితివి; ప్రాలు+కలవాఁడవు=ధాన్యవంతుడవు (ఐశ్వర్యవంతుడవు); శమనంబు=శాంతిని; ఒనరించితి=చేకూర్చితివి. ఇంతకున్=(లేకున్న) ఈపాటికే; లోకముల్= లోకములు; కోయిల వన్నెన్=కోకిల వంటి నల్లని రంగును; చెంది=పొంది; కొక్కెర వంకర= కొంగవలె వంకర టింకరలు; పోవె=తిరగవా!;

భావము :- ఓ దక్షారామ భీమేశ్వరా! విరివియైన దివ్యమైన దయామహత్త్వముతో ఈ మహోపాయముతో హాలాహలమనెడి అగ్ని వలన భయమును పోగొట్టితివి. ధాన్య వంతుడవు. లోకములను శాంతపరచితివి. లేకున్నచో ఈపాటికి లోకములన్నియు నల్లగ మాడి మెలికలు తిరిగెడివి.

విశేషము :- అలంకారము - ఉపమ.

క॥ లోకత్రయైక సంర
క్షా కల్పన మాచరింప సదృశులు వేల్పుల్
నీ కితరులు లేరధికులు
లేకుండుటఁ జెప్పనేల లేఖాధ్యక్షా! 78

అర్థము :- లేఖ+అధ్యక్షా!=దేవతలకు నాయకుడా!; లోకత్రయ=ముల్లోకములను; ఏక సంరక్షా=అసహాయముగ కాపాడుట అను; కల్పనము=ఏర్పాటు; ఆచరింపన్= చేయుట యందు; నీకు=నీతో; సదృశులు=సమానమైనవారు; వేల్పుల్=దేవతలలో; ఇతరులు= ఇతరులు; లేరు=లేరు; అధికులు=ఎక్కువవారు; లేకుండుటన్=లేకపోవుటను; చెప్పనేల= వేరుగ చెప్పవలయునా!

భావము :- ఓ దేవదేవా! ముల్లోకములను కాపాడుటకు ఏర్పాటు చేయుటలో నీకు సాటిరాగలవారు దేవతలలోనే లేరు. ఇక అధికులు లేరని వేరుగ చెప్పవలయునా?

విశేషము :- లేఖ :- "ఆదితేయా దివిషదో లేఖా అదితి నందనా" : అమరము.

తే॥ మమ్ము రక్షించి తనియేల మాటిమాటి
కభినుతింపంగ దక్షవాటాధినాథ
తల్లిదండ్రులు రక్షింపఁ దలఁప కుండ్రె
ప్రజల భీమేశ! బహువిధోపద్రవముల. 79

అర్థము :- దక్షవాట=దక్షారామమునకు; అధినాథ=సర్వాధికారియైన; భీమేశ=శ్రీ భీమేశ్వరా! మమ్ము=మమ్ములను; రక్షించితి=కాపాడితివి; అని=అని; మాటిమాటికి=పదే పదే; అభినుతింపంగన్=స్తుతించుట; ఏల=ఎందులకు?; తల్లిదండ్రులు=తల్లిదండ్రులైనవారు; ప్రజలన్=సంతతిని; బహువిధ=అనేక విధములైన; ఉపద్రవములన్=ఆపదలనుండి; రక్షింపన్=కాపాడుటకై; తలఁపక+ఉండ్రె=ఆలోచింపకుందురా!;

భావము :- శ్రీ దక్షారామ భీమేశ్వరా! మమ్ములను రక్షించితివని మాటిమాటికి నిన్ను స్తుతించుటెందులకు! తల్లిదండ్రులు అనేకములైన ఆపదల నుండి తమ బిడ్డలను కాపాడకుందురా! కాపాడుకొందురు. అట్లే మీరు మమ్ము కాపాడితిరి.

విశేషము :- పార్వతీ పరమేశ్వరులను కాళిదాస మహాకవి కూడ "జగతః పితరౌవందే పార్వతీ పరమేశ్వరౌ" (రఘు-ప్రథమ-1) అని ప్రార్థించెను. సనాతన దంపతులైన పార్వతీ పరమేశ్వరులను దేవతలును తల్లిదండ్రులుగ భావించినట్లు శ్రీనాథుడు చెప్పుట సందర్భ సుందరము. బిడ్డలపట్ల ఉండు తల్లిదండ్రుల వాత్సల్యమిందు సూచింపబడినది.

అలంకారము :- వ్యాజస్తుతి.

సీ॥ శ్రీ భీమనాయకా! శివ! మమ్ము రక్షింపు
విశ్వైకనాథ! దేవియును నీవు
శ్రీ నీలకంధరా! శేషాహి భూషణ!
మమ్ము రక్షింపు మమ్మయును నీవు
రక్షింపు మమ్ము శ్రీ దక్షవాటీశ్వరా!
వేదాంతవేద్య! దేవియును నీవు
దక్షిణాంబుధి తటీధామ! నిర్జితకామ!
మమ్ము రక్షింపు మమ్మయును నీవు

తే॥ వేడ్క రక్షింపు దేవ! దేవియును నీవు
ప్రతిభ రక్షింపు గిరిశ! యంబయును నీవు
దుగ్ధపాథోధి భవ వినిర్ధూమ ధామ!
కాలకూటాగ్ని సంహారకారి! యభవ! 80

అర్థము :- దుగ్ధపాథోధి=పాలసముద్రము నుండి; భవ=పుట్టిన; వినిర్ధూమ=పొగలేని; ధామ=కాంతిగల; కాలకూట+అగ్ని=కాలకూటమనెడి నిప్పును; సంహారకారి=నశింప జేసినవాడా! అభవ=పుట్టుక లేనివాడా! (శంకరా!);

శ్రీ భీమనాయకా=శ్రీ భీమేశ్వరా!; శివ=శంకరా!; విశ్వ+ఏకనాథ=భువనములకు ఒకే స్వామివైనవాడా!; దేవియును=పార్వతీదేవియు; నీవు=నీవును; మమ్ము=మమ్ములను; రక్షింపు= కాపాడుము;

శ్రీ నీలకంధరా!=ఓ గరళకంఠా!; శేష+అహి=ఆదిశేషుని సోదరుడైన వాసుకిని; భూషణ=ఆభరణముగ కలవాడా!; అమ్మయును=తల్లియును; నీవు=నీవును; మమ్ము=మమ్ములను; రక్షింపుము=కాపాడుము;

శ్రీ దక్షవాటి+ఈశ్వరా=శ్రీ దక్షారామ భీమేశ్వరా!; వేదాంత=వేదాంతముల వలన; వేద్య=తెలియనగువాడా! దేవియును=శాంభవియు; నీవు=నీవును; మమ్ము=మమ్ములను; రక్షింపు=కాపాడుము;

దక్షిణ+అంబుధి=దక్షిణ సముద్రము యొక్క; తటీ=ఒడ్డు; ధామ=నిలయముగ కలవాడా!; నిర్జిత కామ=జయింపబడిన మన్మథుడు కలవాడా!; అమ్మయును=అమ్మయు; నీవు=నీవు; మమ్ము=మమ్ములను; రక్షింపుము=కాపాడుము;

దేవ!=ఓ స్వామీ!; దేవియును=పార్వతీదేవియు; నీవు=నీవును; వేడ్కన్=అపేక్షతో; రక్షింపు=కాపాడుడు; గిరిశ=(కైలాస పర్వతమే శయనముగ కలవాడా!) శంకరా!; అంబయును= అమ్మయును; నీవు=నీవును; ప్రతిభన్=స్ఫూర్తితో; రక్షింపు=కాపాడుము;

భావము :- ఓ అభవా! పాలసముద్రము నుండి హాలాహలము పుట్టి అగ్నికీలలతో వ్యాపించి ముల్లోకములను తల్లడిల జేయుటకు సిద్ధమైనపుడు ఆ భయంకర కాలకూటాగ్నిని నీ కంఠమున బంధించి లోకములను రక్షించితివి. ఓ భీమేశ్వరా! విశ్వనాథా! వేదాంతవేద్య! నిర్జితకామా! కైలాసవాసా! అమ్మయును నీవును మమ్ములను ఆపేక్షతో రక్షింపుడు. స్ఫూర్తితో కాపాడుడు.

కం॥ శరణము భజింతు మభవుని
శరణము భజియింతు మర్ధ చంద్రాభరణున్
శరణము భజింతు మీశుని
శరణము భజియింతు మద్రిజా వల్లభునిన్. 81

అర్థము :- అభవుని=పుట్టుక లేనివాడైన శంకరుని; శరణము=రక్షణ కొరకు; భజింతుము=సేవింతుము; అర్ధచంద్ర+ఆభరణున్=చంద్రరేఖ సిగ అలంకారముగగల శివుని; శరణము=ప్రాపు కొరకు; భజియింతుము=పూజింతుము; ఈశుని=ఈశ్వరుని; శరణము= ఆశ్రయము కొరకు; భజింతుము=సేవింతుము; అద్రిజా వల్లభునిన్=పార్వతీపతిని; శరణము= ప్రోచుటకై; భజియింతుము=పూజింతుము.

భావము :- అభవుడు, చంద్రశేఖరుడు, ఈశుడు, పార్వతీపతియైన శంకరుని శరణువేడుదుము.

తే॥ సిరియు వాణియు మొదలైన సురపురంధ్రు
లఖ్ఖుఁగడుపునుఁ జల్లఁగా నభిలషించి
నియమమున గొల్తురెవ్వని నిత్యకలన
నట్టి భీమేశు నినుఁగొల్తు మహరహంబు. 82

అర్థము :- సిరియు=లక్ష్మీదేవియు; వాణియు=సరస్వతీ దేవియు; మొదలైన= మొదలగు; సురపురంధ్రులు=దేవ కుటుంబినులు; అఖ్ఖున్=మెడను (మాంగల్యమును); కడుపునున్=సంతానమును; చల్లఁగాన్=వర్ధిల్లుటను; అభిలషించి=కోరి; నియమమునన్= నిష్ఠతో; నిత్యకలనన్=శాశ్వత జ్ఞానముతో; ఎవ్వని=ఎవరిని; కొల్తురు=పూజింతురో; అట్టి= అటువంటి; భీమేశున్=శ్రీ భీమేశ్వరుడవైన; నిను=నిన్ను; అహరహంబు=నిత్యము; కొల్తుము= సేవింతుము.

భావము :- ఓ భీమేశ్వరా! లక్ష్మి, సరస్వతి మొదలైన దేవకుటుంబినులు తమ భర్తలు, సంతానము అభివృద్ధిని చెందవలెనని కోరి నిత్యము నియమముతో నిన్ను కొలుతురు. మేమును నిత్యము నిన్ను నియమముతో సేవింతుము.

విశేషము :- అఱ్ఱుఁగడుపును :- ఇది తెలుగు నుడికారము. అఱ్ఱు అనగా మెడ. మెడలో స్త్రీకి మాంగల్యముండును. మాంగల్యము భర్తృ చిహ్నము - అనగా భర్త చల్లగా నుండునట్లును; కడుపు - అనగా సంతతి - అనగా బిడ్డలు చల్లగా నుండుటకును - 'చల్లగా' అను పదము కూడ నుడికారమే. క్షేమముగ అని అర్థము. ఈ రెండు పదములును భావబంధురములు.

సీ॥ విశ్వంబు సృజియించు విధి మహేంద్రుఁడు గొను
 వివిధాధ్వరముల హవిర్విభాగ
మగ్ని యాహుతి మోయు నమర సంఘమునకుఁ
 బాపపుణ్యంబు లేర్పఱచు యముఁడు
ప్రత్యవాయములచే బ్రతుకు రాక్షస తతి
 వర్షించు పర్జన్య వరుణమూర్తి
గ్రహచక్రవాళంబు గాలి యెప్పుడు మోచుఁ
 గొండ్రు సంతృప్తిలగ్నునఁ బితరులు

తే॥ నవ నిధానములును యక్షనాథుఁడేలు
నా సదాశివుఁడీశానుఁడై తనర్చుఁ
బరఁగ నెవనాజ్ఞ నింద్రియప్రతతి నడచు
నట్టి భీమేశ్వరుఁడు మాకు నభయ మొసఁగు. **83**

అర్థము :- ఎవని+ఆజ్ఞన్=ఎవని ఆజ్ఞచే; విధి=బ్రహ్మ; విశ్వంబు=లోకమును; సృజియించు=పుట్టించునో; వివిధ=అనేకములైన; అధ్వరముల=యజ్ఞములందు; హవిస్+ విభాగము=ఆహుతి యందలి తన భాగమును, మహేంద్రుఁడు=దేవేంద్రుడు; కొనున్= తీసికొనునో;

అగ్ని=నిప్పు; ఆహుతిన్=హవిస్సును; అమర సంఘమునకు=దేవతాగణము కొరకు; మోయున్=మోయునో; యముఁడు=యమధర్మరాజు; పాపపుణ్యంబులు=పాపమును పుణ్యమును; ఏర్పఱచు=నిర్ణయించునో;

ప్రత్యవాయములచే=పాపములచేత; రాక్షసతతి=రాక్షసుల సమూహము; బ్రతుకున్=బ్రతుకునో; పర్జన్య=మేఘరూపమున; వరుణమూర్తి=వరుణుడు; వర్షించున్= వర్షము కురియునో;

గ్రహ చక్రవాళంబు=గ్రహముల సమూహమును; గాలి=వాయువు; ఎప్పుడు=ఎల్లప్పుడును; మోచున్=మోయునో; పితరులు=పితృదేవతలు; లగ్గనన్=ఉత్తరక్రియతో, సంతృప్తి=మిక్కిలి సంతోషమును, కొంద్రు=పొందుదురో;

నవనిధానములను=తొమ్మిదిరకములైన నిధులును; యక్షనాథుఁడు=కుబేరుడు; ఏలున్=పాలించునో; ఆ సదాశివుఁడు=ఆ శంకరుడు; ఈశానుఁడై=ఈశాన్య దిక్పాలకుడై; తనర్చున్=ప్రకాశించుచుండునో; ఇంద్రియ ప్రతతి=ఇంద్రియముల సమూహము; పరఁగన్=ఒప్పునట్లుగ; నడచున్=సంచరించునో; అట్టి=అటువంటి; భీమేశ్వరుఁడు=శ్రీ భీమేశ్వర స్వామి; మాకు=మాకందరికిని; అభయము+ఒసఁగున్=రక్షణనిచ్చును.

భావము :- ఆ పరమేశ్వరుని ఆజ్ఞతోనే బ్రహ్మ లోకమును పుట్టించును. యజ్ఞములందలి హవిర్భాగమును దేవేంద్రుడు తీసికొనును. అగ్ని హవిస్సును దేవగణము కొరకు మోయును. యముడు పాపపుణ్యములను నిర్ణయించును. రాక్షసులు పాపములచే బ్రతుకుచుందురు. వరుణుడు మేఘరూపమున వర్షములను కురియించును. వాయువు ఎల్లప్పుడు గ్రహగోళములను వహించు చుండును. పితృదేవతలు శ్రాద్ధములచే తనివి పొందెదరు. కుబేరుడు నవనిధులను పాలించును. ఆ సదాశివుడే ఈశాన్య దిక్పాలకుడై ప్రకాశించును. ఇంద్రియములు ఒప్పుగ ప్రవర్తించుచుండును. అట్టి ఆ మహాదేవుడైన శ్రీ భీమేశ్వర స్వామి మాకును అభయమిచ్చి రక్షించు గాక.

విశేషము :- నవనిధులు :- 1. పద్మము, 2. మహా పద్మము, 3. శంఖము, 4. మకరము, 5. కచ్ఛపము, 6. ముకుందము, 7. కుందము, 8. నీలము, 9. వరము- అనునవి.

సీ॥ వరుణుఁడెవ్వని యాజ్ఞ వారాశిఁ బాలించు
గాలి యెవ్వని యాజ్ఞఁ గంపమొందు
నవ నిధానములు చింతారత్న సురభులు
యక్షరాజెవ్వని యాజ్ఞనేలు
నెవ్వని యాజ్ఞ నర్కేందు గ్రహంబులు
చదల మార్గంబున సంచరించు
శైల కానన వార్ధి సహితమౌ నీధాత్రి
నహినాథుఁడెవ్వని యాజ్ఞఁదాల్చు

తే॥ నట్టి భీమేశు వేద వేదాంత వేద్యు
సర్పకేయూరు దేవతా సార్వభౌము
సప్త గోదావరోత్సంగ సన్నివిష్టు
నాశ్రయింతుము నిన్నుఁజంద్రార్ధమౌళి! 84

అర్థము :- ఎవ్వని యాజ్ఞన్=ఎవని ఆనతితో; వరుణుఁడు=వరుణదేవుడు; వారాశిన్=సముద్రమును; పాలించున్=పాలించునో; ఎవ్వని యాజ్ఞన్=ఎవని ఆనతితో; గాలి=వాయువు; కంపము=చలనమును; ఒందున్=పొందునో;

నవనిధానములు=నవనిధులను; చింతామణి=కోరికలనొసగుమణిని; సురభులు=కామధేనువులను; యక్షరాజు=కుబేరుడు; ఎవ్వని యాజ్ఞన్=ఎవని ఆనతితో; ఏలున్=పాలించునో;

ఎవ్వని యాజ్ఞన్=ఎవని ఆనతితో; అర్క=సూర్యుడు; ఇందు=చంద్రుడు (మొదలైన) గ్రహంబులు=గ్రహములు; చదల మార్గంబునన్=ఆకాశపు త్రోవలో; సంచరించున్=తిరుగునో;

ఎవ్వని యాజ్ఞన్=ఎవని ఆనతిచే; శైల=పర్వతములు; కానన=అడవులు; వార్ధి=సముద్రములు; సహితము+ఔన్=కూడియుండిన; ఈ ధాత్రిన్=ఈ భూమిని; అహినాథుఁడు=సర్పరాజైన ఆదిశేషుడు, తాల్చున్=మోయునో;

అట్టి=అటువంటి; వేద+వేదాంతవేద్యు=వేదములచేత, వేదాంతములచేతను తెలియతగినవాడును; సర్ప+కేయూరు=పాములే భుజకీర్తులుగ కల్గినవాడు; దేవతా సార్వభౌము=దేవతలలో రాజరాజును; సప్త...సన్ని విష్టు. సప్తగోదావర=సప్తగోదావరము యొక్క; ఉత్సంగ=ఒడియందు; సన్నివిష్టున్=కూర్చుండిన వాడును; చంద్ర+అర్ధ+మౌళిన్=చంద్రరేఖను శిరమున దాల్చినవాడును అగు; భీమేశున్=శ్రీ భీమేశ్వరుడను; నిన్నున్=నిన్ను; ఆశ్రయింతుము=ఆశ్రయము కోరుదుము.

భావము :- ఓ వేదవేదాంతవేద్య! సర్పభూషణ! చంద్రశేఖరా! దేవతా సార్వభౌమా! సప్తగోదావర తీరమున నున్న శ్రీ భీమేశ్వరా! నీ ఆనతితోనే వరుణుడు సముద్రమును పాలించుచుండెను. గాలి కదలుచున్నది. నవనిధులను, చింతామణిని, కామధేనువులను కుబేరుడు పాలించుచున్నాడు. సూర్యచంద్రులు ఆకాశమున క్రమముగ తిరుగుచున్నారు. కొండలు, అడవులు, సముద్రములు కూడియున్న భూమిని ఆదిశేషుడు మోయుచున్నాడు. అట్టి నిన్నే మేమును ఆశ్రయింతుము.

**విశేషము** :- కామధేనువును వరుణునకు అర్పణము చేసినట్లు, కల్పతరు చింతామణులను నందనోద్యానము నందు ప్రతిష్ఠించినట్లు హరవిలాసము (6-95).

వ॥ దేవదేవ! మహాదేవ! సదాశివ! యీశ! యీశాన తత్పురుష యఘోర సద్యోజాత వామదే వాఖ్యాక పంచవదనమూర్తి విశేష! ప్రకృతి ప్రధాన కారణ! మీకు సాష్టాంగ నమస్కారంబు. 85

**అర్థము** :- దేవదేవ=దేవతలకు దేవుడైనవాడా! మహాదేవ=శంకరా! సదాశివ= ఎల్లప్పుడు శుభమును కూర్చువాడా! ఈశ=ప్రభువా! ఈశాన=ఈశానమని; తత్పురుష= తత్పురుషమని; అఘోర=అఘోరమని; సద్యోజాత=సద్యోజాతమని; వామదేవ=వామదేవమని; ఆఖ్యాక=చెప్పబడిన; పంచవదన=ఐదుముఖముల; మూర్తివిశేష=ఆకార విశేషము కలవాడా! ప్రకృతి=సృష్టి విషయమున; ప్రధానకారణ=ముఖ్యహేతువైనవాడా! మీకు=అటువంటి మీకు; స+అష్టాంగ=ఎనిమిది అంగములతో కూడిన; నమస్కారంబు=వందనము.

**భావము** :- దేవదేవ! మహాదేవ! సదాశివ! ఈశ్వర! ఈశానము, తత్పురుషము అఘోరము, సద్యోజాతము, వామదేవమను ఐదు ముఖములతోడి మూర్తి విశేషము కలవాడా! ప్రకృతికి మూలకారణమైనవాడా! మీకు సాష్టాంగ నమస్కారము.

**విశేషము** :- సాష్టాంగ నమస్కారము 3-187 చెంత చెప్పబడినది.

*పంచవదనముల అవతార విశేషములు లింగ పురాణము నందు (11 నుండి 16వ అధ్యాయము వరకు) చాల విపులముగా వివరింపబడినవి.*

కం॥ నీ మహిమార్ణవమునకును
సీమాంతము గలదె? రాజశేఖర! దక్షా
రామ పురధామ! శంకర!
భీమేశ్వర! నీలకంఠ! పేశల కరుణా!" 86

**అర్థము** :- రాజశేఖర=చంద్రుని శిరముపై ధరించినవాడా! దక్షారామ పురధామ= దక్షారామ నగరము నివాసముగ కలవాడా! శంకర=శుభములను కూర్చువాడా! నీలకంఠ=నల్లని మెడ కలవాడా! పేశల కరుణా=సమర్థమైన దయ కలవాడా! భీమేశ్వర=ఓ భీమేశ్వర స్వామీ! నీ మహిమ=నీ యొక్క గొప్పతనమను; అర్ణవమునకును=సముద్రమునకు; సీమాంతము= హద్దు; కలదె=కలదా?"

**భావము** :- ఓ రాజశేఖర! శంకర! నీలకంఠ! కరుణామయా! దక్షారామ భీమేశ్వరా! నీ మహత్త్వము సముద్రమువలె అనంతమైనది. దానికి హద్దు లేదు.

**విశేషము** :- సముద్రమునకు హద్దులేనట్లే పరమేశ్వర మహిమకును అంతము లేదు. ఎల్లలు లేవు.

వ॥ అని యనేక ప్రకారంబుల బృందారక దైత్యులు తన్నుఁ బ్రస్తుతింపఁగాలకూటంబు హరించిన పంచాననుండగు భీమేశ్వరుండు హరివిరించి పురందరాదుల నాలోకించి యిట్లనియె. 87

అర్థము :- అని=అని; అనేక ప్రకారంబుల=పలువిధములుగ; బృందారక=దేవతలు; దైత్యులు=రాక్షసులు; తన్నున్=తన్ను; ప్రస్తుతింపన్=స్తోత్రము చేయగా; కాలకూటంబు= కాలకూటమను విషమును; హరించిన=గ్రహించిన; పంచ+ఆననుండు+అగు= ఈశానము మొదలగు ఐదు ముఖములు కలవాడైన; భీమేశ్వరుండు=శ్రీ భీమేశ్వరస్వామి; హరి=విష్ణువు; విరించి=బ్రహ్మ; పురందర=ఇంద్రుడు; ఆదులన్=మొదలైన వారిని; ఆలోకించి=చూచి; ఇట్లు+ అనియెన్=ఈవిధముగ పల్కెను.

భావము :- అని పలువిధములుగ దేవతలు, రాక్షసులు పంచముఖుడైన శ్రీ భీమేశ్వరస్వామిని స్తుతించిరి. కాలకూటమును హరించిన శ్రీ భీమేశ్వరస్వామి బ్రహ్మ విష్ణు మహేంద్రాదుల వైపు చూచి ఈవిధముగ పల్కెను.

## శివుని యాజ్ఞచే సురాసురులు విఘ్నేశునిఁబూజించి పాల్కడలి తరియించి చంద్రాదులఁబడయుట

తే॥ "మనము విఘ్నేశు సేవింప మఱచినార
మతని సేవింపకున్న నేలా ఫలించు
నఖిల కార్యంబులును నవశ్యము ఫలించు
నర్థిఁ గార్యార్థ మిభవక్త్రు ననుసరింప." 88

అర్థము :- మనము=మనము; విఘ్నేశున్=వినాయకుని; సేవింపన్=పూజించుట; మఱచినారము=మరచితిమి; అతని=ఆ విఘ్ననాయకుని; సేవింపకున్నన్=పూజింపనిచో; అఖిల=సమస్తమైన; కార్యంబులును=పనులును; ఏలా ఫలించున్=ఎట్లు ఫలించును? అర్థిన్= పూనికతో; కార్యార్థము=ప్రయోజనము కొరకై; ఇభవక్త్రున్=గజాననుని; అనుసరింపన్= సేవించినచో; అవశ్యము=తప్పనిసరిగ; ఫలించును=ఫలితము కలుగును.

భావము :- "మనము వినాయకుని పూజించుట మరచితిమి. ఆ విఘ్నేశ్వరుని పూజింపనిచో పనులు చేసినను ఫలితము కలుగదు. కార్యార్థి పూనికతో వినాయకుని కొలిచినచో పనులకు తప్పనిసరిగ ఫలితము కలుగును."

విశేషము :- హరవిలాస షష్ఠాశ్వాసమునందు 52 నుండి 59వ పద్యము వరకు వినాయకుని పూజ, నివేదనము, దండకముతో స్తుతి కలవు. ఈ భీమేశ్వరపురాణమునందును

88 నుండి 91 వరకుగల పద్యగద్యములలో వినాయకుని పూజ నివేదనాదులు కలవు. కాని కథలో కొంత భేదము కలదు. హరవిలాసమున క్షీరసాగర మథనమునకు పూర్వము వినాయకుని పూజింతురు. అయినను విషము పుట్టును. భీమఖండమునందు వినాయకుని పూజించుట మరచుటచేత విషము పుట్టినదని శంకరుడు చెప్పుట కలదు.

మ॥ అని యంభోధి తటోప కంఠమున దక్షారామ మధ్యంబునన్
ఘనునిన్ దాండవ విఘ్ననాయకు మహాకాయున్ సముత్తప్త కాం
చన సంకాశు ననేక రత్నఖచిత స్వర్ణాగ్ర సింహాసనం
బునఁ గూర్చుండఁగఁబెట్టి భక్తిపరతం బూజించి రవ్యగ్రులై. 89

అర్థము :- అని=అని భావించి; అంభో.....కంఠమున; అంభోధి=సప్తగోదావరము యొక్క; తట=ఒడ్డు; ఉపకంఠమున=సమీపమున; దక్షారామ=దక్షారామ నగరము; మధ్యంబు నన్=మధ్యభాగమునందు; ఘనునిన్=గొప్పవాడును; మహాకాయున్=గొప్ప శరీరము కల వాడును; సము.....సంకాశు. సముత్తప్త=మిక్కిలిగ కరిగిన; కాంచన=బంగారముతో; సంకాశున్= పోలినవాడునగు; తాండవ విఘ్ననాయకున్=నృత్యముచేయు భంగిమలోనున్న వినాయకుని; అనేక=పెక్కు; రత్నఖచిత=రత్నములు పొదగిన; స్వర్ణ=బంగరు; అగ్రసింహాసనంబునన్=పెద్ద గద్దెపై; కూర్చుండఁగన్+పెట్టి=కూర్చుండపెట్టి; భక్తిపరతన్=సేవించుట యందలి ఆసక్తితో; అవ్యగ్రులై=స్థిరమైన మనసు కలవారై; పూజించిరి=పూజచేసిరి.

భావము :- సప్త గోదావర తీరమున దక్షారామనగర మధ్యభాగమున తాండవ వినాయకుడు కలడు. అతడు గొప్ప ఆకారము కలవాడు. మేలిమి బంగరు రంగువాడు. దేవతలు రాక్షసులును ఆ వినాయకుని రత్నములు పొదిగిన పెద్ద బంగరు గద్దెపై కూర్చుండ బెట్టిరి. స్థిర చిత్తములతో భక్తి తత్పరులై పూజించిరి.

సీ॥ జలకమార్చె బలారి సప్తగోదావర
సలిలధారా హేమ కలశ సమితిఁ
గర్పూర కస్తూరికా గంధ సారంబు
నలఁదె వైవస్వతుం డంగకములఁ
బ్రన్నఁగాఁ బెనగొన్న బ్రహ్మ సూత్రంబులఁ
బసపూన్చి యర్పించెఁ బద్మ భవుఁడు
పారిజాతక తరు ప్రసవ మాల్యంబులు
వక్షస్థలంబున వైచె శౌరి

తే॥ ధూమకేతుండు మహిసాక్షి ధూపమిచ్చెఁ
బూన్చె యక్షాధిపతి మణి భూషణముల
నంధకాసురుఁ డిడియె దూర్వాంకురములు
వీఁచెఁ బవనుండు కుంచియ విఘ్నపతికి. 90

అర్థము :- బల+అరి=బలుడను రక్కసుని చంపిన ఇంద్రుడు; విఘ్నపతికిన్=వినాయకునకు; సప్తగోదావర=సప్తగోదావరమునందలి; సలిలధారా=జలధారలుగల; హేమ కలశ సమితిన్=బంగరు కుండల సమూహముతో; జలకమార్చెన్=స్నానము చేయించెను;

వైవస్వతుండు=యముడు; అంగకములన్=(వినాయకుని) శరీర అవయవములకు; కర్పూర= కర్పూరము; కస్తూరికా=కస్తూరియు కలిసిన; గంధసారంబున్=చందనమును; అలఁదెన్= పూసెను;

పద్మభవుఁడు=బ్రహ్మదేవుడు; ప్రన్నఁగాన్=చక్కగా; పెన గొన్న=పేనిన; బ్రహ్మ సూత్రంబులన్=జందెములను; పసపు+ఊన్చి=పసుపు పూసి; అర్పించెన్=ధరింపజేసెను;

శౌరి=విష్ణువు; పారిజాతక తరు=పారిజాతమను చెట్టుయొక్క; ప్రసవ=పూలతోడి; మాల్యంబులు=దండలను; వక్షస్థలంబున=ఱొమ్ముపై; వైచెన్=వేసెను.

ధూమకేతుండు=ధూమకేతుడను రాక్షసుడు; మహిసాక్షిన్=మేలుజాతి గుగ్గిలముతో; ధూపము+ఇచ్చెన్=ధూపమును సమర్పించెను; యక్ష+అధిపతి=కుబేరుడు; మణి భూషణములన్=మణులు పొదిగిన ఆభరణములను; పూన్చెన్=అలంకరించెను; అంధక+ అసురుఁడు= అంధకుడను రక్కసుడు; దూర్వ+అంకురములు=గరిక మొలకలను; ఇడియెన్=సమర్పించెను; పవనుండు=వాయువు; కుంచియన్=వింజామరతో; వీఁచెన్=విసరెను.

భావము :- వినాయకునకు ఇంద్రుడు బంగరు పాత్రలతో సప్తగోదావర జలములను తెచ్చి స్నానము చేయించెను. యముడు కర్పూరము కస్తూరి కలిపిన చందనమును పూసెను. బ్రహ్మదేవుడు జందెములకు పసుపురాచి అలంకరించెను. ధూమకేతుడు ధూపమును సమర్పించెను. కుబేరుడు మణులు పొదిగిన ఆభరణములతో అలంకరించెను. అంధకాసురుడు గరిక మొలకలను సమర్పించెను. వాయుదేవుడు వింజామరతో విసరెను.

వ॥ అనంతరంబ మోదకాపూప పాయస ఘృత మధుక్షీర శర్కరాపూప జంబూ కపిత్థ చూత ఖర్జూర కదళీ నారికేళ ఫల పుండ్రేక్షు సమన్వితంబుగా మహోపహారంబులఁ గల్పించి వేల్పులుఁ బ్రావేల్పులును ననల్ప భావనా విశేషంబుల నశేష విధంబుల మూషక వాహనునకుఁ బ్రదక్షిణంబులు ప్రణామంబులుం జేసి వలగొని క్రమ్మఱ పయోనిధి మథనంబునకుఁ బ్రారంభించిన. 91

అర్థము :- అనంతరంబ=ఆ తరువాత, వేల్పులున్=దేవతలును, ప్రావేల్పులున్నున్=రాక్షసులును; మూషక వాహనునకున్=ఎలుకను వాహనముగాగల వినాయకునకు; మోదక.....పుండ్రేక్షు. మోదక=ఉండ్రాళ్ళును; అపూప=పిండివంటలు; పాయస=పరమాన్నము; ఘృత=నెయ్యి; మధు=తేనె; క్షీర=పాలు; శర్కరా=పటిక బెల్లము; సూప=నాను పప్పు; జంబూ=నేరేడు పండ్లు; కపిత్థ=వెలగ పండ్లు; చూత=మామిడి పండ్లు; ఖర్జూర=ఖర్జూర పండ్లు; కదళీ=అరటిపండ్లు, నారికేళ ఫల=కొబ్బరి కాయలు; పుండ్రేక్షు=ఎఱ్ఱ చెఱకులు; సమన్వితంబుగా=కూడునట్లుగా; మహా+ఉపహారంబులన్=గొప్ప కానుకలను; కల్పించి=ఏర్పరచి; అనల్ప=అధికమైన; భావనా విశేషంబులన్=తలంపుల విరివిచేత; అశేష=అనేక; విధంబులన్=పద్ధతులుగ; ప్రదక్షిణంబులు=కుడివైపుగ చుట్టు తిరుగుటలు; ప్రణామంబులున్=నమస్కారములును; చేసి=ఆచరించి; వలగొని=చుట్టు తిరిగివచ్చి; క్రమ్మఱ=మరల; పయోనిధి=పాలసముద్రమును; మథనంబునకున్=చిలుకుటకు; ప్రారంభించిన=మొదలుపెట్టగా.

భావము :- ఆ తరువాత దేవతలు రాక్షసులు వినాయకునకు ఉండ్రాళ్ళు, పిండివంటలు, పాయసము, నెయ్యి, తేనె, పాలు, పటిక బెల్లము, వడపప్పును, నేరేడు, వెలగ, ఖర్జూర, అరటి పండ్లును, కొబ్బరి కాయలు, ఎఱ్ఱ చెఱకులతో కూడిన నైవేద్యమును సమర్పించిరి. మనసులోని కోరికలు నెరవేరవలెనను పూనికతో ప్రదక్షిణములు చేసిరి. నమస్కారములు చేసిరి. తిరిగివచ్చి మరల పాలసముద్రమును చిలుకుట మొదలుపెట్టిరి.

తే॥ మందరాచల మంథాన మథ్యమాన
దుగ్ధపాథోధిలో సముద్భూతమయ్యె
బాలశశిరేఖ యసురులు వేలుపులును
నిచ్చి రవ్వస్తు వర్థి భీమేశ్వరునకు. 92

అర్థము :- మందర.....పాథోధి. మందర+అచల=మందర పర్వతమనెడి; మంథాన=కవ్వముతో; మథ్యమాన=చిలుకబడుచున్న; దుగ్ధపాథోధిలో=పాలసముద్రమునందు; బాలశశిరేఖ=లేత చంద్రకళ; సముద్భూతము+అయ్యెన్=పుట్టినదయ్యెను; అసురులు=రాక్షసులు; వేలుపులునున్=దేవతలును; ఆ+వస్తువు=ఆ పదార్థమును; అర్థిన్=ఇష్టముతో; భీమేశ్వరునకు=శ్రీ భీమేశ్వరస్వామికి; ఇచ్చిరి=సమర్పించిరి.

భావము :- మందర పర్వతమనెడి కవ్వముతో చిలుకబడుచున్న పాల సముద్రము నుండి లేతచంద్రకళ పుట్టినది. ఆ చంద్రకళను దేవతలు రాక్షసులు కలసి భక్తితో శ్రీ భీమేశ్వర స్వామికి సమర్పించిరి.

వ॥ వెండియుఁ దరువం దరువఁ గల్పతరువును, నప్సరస్సతులును, గౌస్తుభ మాణిక్యంబును, నుచ్చైశ్రవంబను హయంబును, నైరావతంబను ధవళ గజంబును నాదిగా సకల కామదంబులు సర్వమంగళాస్పదంబులు నిఖిల భువన మోహనంబులు నైన పదార్థంబు లుద్భవించెఁ దదనంతరంబ. 93

అర్థము :- వెండియున్=ఇంకను; తరువన్+తరువన్=చిలుకగా చిలుకగా, కల్పతరువు నున్=కల్పవృక్షము; అప్సరస్+సతులు=అప్సరః కాంతలు; కౌస్తుభ మాణిక్యంబునున్= కౌస్తుభ మనెడు మణియు; ఉచ్చైశ్రవంబు+అను=ఉచ్చైశ్రవమను; హయంబునున్=గుఱ్ఱము; ఐరావతంబు+అను=ఐరావతమను పేరుగల; ధవళ గజంబునున్=తెల్లని ఏనుగు; ఆదిగా= మొదలయిన; సకల కామదంబులు=అన్ని కోరికలు తీర్పగలవి; సర్వమంగళ+ఆస్పదంబులు= సర్వశుభములకు నిలయములైనవి; భువన మోహనంబులును=లోకముల మనోహరము లైనవి; ఐన=అయిన; పదార్థంబులు=వస్తువులు; ఉద్భవించెన్=పుట్టెను; తత్+అనంతరంబ= ఆ తరువాత.

భావము :- దేవతలు రాక్షసులు ఇంకను పాలసముద్రమును చిలుకగా చిలుకగా ఆ సముద్రము నుండి కల్పవృక్షము, అప్సరసలు, కౌస్తుభమణి, ఉచ్చైశ్రవమను గుఱ్ఱము, ఐరావతమనెడి తెల్లని ఏనుగు మొదలైన కోరికలను తీర్పగల, శుభములు కూర్పగల మనోహరములైన పదార్థములు ఆవిర్భవించినవి. ఆ తరువాత.

కం॥ తరతరమ దరువఁ దరువం
దరి యందుదయంబు నొందె ధన్వంతరి సా
గరమునఁ గడు గరగరనై
కరమునఁ గర మమరు నమృత కలశముఁదానున్. 94

అర్థము :- తరతరమ=నిర్విరామముగ; తరువన్+తరువన్=మథింపగా మథింపగా; సాగరమున=సముద్రమునందు; కడు=మిక్కిలి; గరగరనై=కాంతిమంతమై; కరమునన్=చేతిలో; కరము=మిక్కిలి; అమరు=సరిపడు; అమృత కలశమున్= అమృతముగల భాండమును; తానున్=తానైన; ధన్వంతరి=ధన్వంతరియను పేరుగలవాడు; తరియందు=చిలుకుట యందు; ఉదయంబునొందెన్=పుట్టెను.

భావము :- దేవతలు రాక్షసులు కలసి పాలసముద్రమును నిర్విరామముగ మథించుచుండగా అమృతభాండమును చేతియందుంచుకొని ధన్వంతరి పాలసముద్రము నుండి కాంతిమంతుడై ప్రభవించెను.

విశేషము :- 'ర' వర్ణావృత్తిచే వర్ణవిన్యాస వక్రత.

సీ॥ సంపూర్ణ పూర్ణిమా చంద్రబింబంబుతోఁ
బుట్టెఁ దెల్లని తమ్మిపూవు మొగ్గ
విరిసె నొయ్యొయ్యన వేలావనీ వాటి
పవమాన కోమలాస్ఫాలనమున
వాసించె నఖిలదిగ్వలయంబు మధుర వి
స్తార కేసరధూళి సౌరభములు
నంభోజ మధ్యంబు నందుద్భవంబందె
మహిత కాంతిచ్ఛటా మండలంబు

తే॥ అందు మణికర్ణికాగ్ర సింహాసనమున
లక్ష్మి యుదయించి హస్త పల్లవము నందుఁ
బసిఁడి పూఁదండఁ బూజించెఁ బద్మనయను
నర్థి వరియించె లీలాస్వయంవరమున. 95

అర్థము :- సంపూర్ణ పూర్ణిమా=నిండు పున్నమినాటి; చంద్రబింబంబుతోన్=చంద్ర బింబముతోపాటుగ; తెల్లని=తెల్లనైన; తమ్మిపూవు మొగ్గ=తామర పూ మొగ్గ; పుట్టెన్=జనించెను;

వేలా...ఆస్ఫాలనమున. వేలా+వనీవాటి=సముద్రతీరమందలి అరణ్య ప్రదేశము నందలి; పవమాన=గాలుల; కోమల=మృదువైన; ఆస్ఫాలనమునన్=చఱపులచేత; ఒయ్యొయ్యన=మెల్లమెల్లగా; విరిసెన్=వికసించెను;

మధుర=ఇంపైన; విస్తార=విరివియైన, కేసరధూళి=కింజల్కముల పుప్పొడి యొక్క; సౌరభములు=సువాసనలు; అఖిలదిక్+వలయంబు=అన్ని దిక్కుల సమూహమునకు; వాసించెన్=గుబాళించెను.

అంభోజ=పద్మము యొక్క; మధ్యంబునందు=నడిమి భాగమున; మహిత=పూజ్యమైన; కాంతిచ్ఛటా=వెలుగు సమూహపు; మండలంబు=వలయము; ఉద్భవంబందెన్=పుట్టెను;

అందు=ఆ పద్మము యొక్క మధ్యభాగమున; మణికర్ణికా=రత్నము వంటి దుద్దు యొక్క; అగ్ర=పై భాగమనెడి; సింహాసనమున=గద్దెపై; లక్ష్మి=లక్ష్మీదేవి; ఉదయించి=పుట్టి; హస్త పల్లవమునందున్=చిగురాకు వంటి చేతియందలి; పసిఁడిపూ=బంగారు పూవుల; దండన్=మాలతో; పద్మనయనున్=విష్ణువును; పూజించెన్=పూజ చేసెను; అర్థిన్=కోరికతో; లీలాస్వయంవరమున=సొగసైన స్వయంవరమునందు; వరియించెన్=వరించెను.

భావము :- సముద్ర మధ్యమునుండి నిండు చంద్రునితో పాటుగ ఒక తామర మొగ్గ పుట్టినది. సముద్రతీరమందలి అరణ్యములనుండి గాలుల వీచి ఆ పద్మమును మృదువుగ తాకినవి. అది మెల్ల మెల్లగ విరిసినది. పూవులోని పుప్పొడి యొక్క సువాసనలు అన్ని దిక్కులకు వ్యాపించినవి. పూవు మధ్యలో పూజ్యమైన కాంతివలయ మేర్పడినది. పూవు దుద్దుపైన లక్ష్మీదేవి ఉదయించినది. ఆమె చేతిలో బంగరు పుష్పమాలయున్నది. ఆమె ఆ మాలను విష్ణువు మెడలో వేసి పూజించినది. విలాసమైన స్వయంవరముతో విష్ణువును చేపట్టినది.

## దేవాసురులమృతమునకై పోరుటయు శ్రీమన్నారాయణుండు దేవారుల వంచించుట

:ఉ॥ ఱంతులు మీఱి మిక్కిలిగ ఱాఁగతనంబున దొమ్మిచేసి దు
ర్దాంత పరాక్రమోన్నతులు దానవ దైత్యులు వేల్పువెజ్జు ధ
న్వంతరి చేతి దుగ్ధమయ వార్ధిసుధా రస పూర్ణకుంభమున్
సంతన కట్టి పుచ్చుకొని చయ్యన నేఁగిరి నిర్విశంకతన్. 96

అర్థము :- దుర్దాంత=అణచరాని; పరాక్రమ=శౌర్యముచే; ఉన్నతులు=గొప్పవారైన; దానవ=దనువు సంతతివారు, దైత్యులు=దితి సంతతివారునైన రాక్షసులు; నిర్విశంకతన్=జంకులేని తనముతో; ఱంతులు మీఱి=గుంపున పుట్టిన పెద్ద పెద్ద ధ్వనులతో; మిక్కిలిగ=ఎక్కువైన; ఱాఁగతనంబునన్=పొగరుబోతుతనముతో; దొమ్మిచేసి=ఒక్కుమ్మడిగ కలియబడి; వేల్పువెజ్జు=దేవవైద్యుడైన; ధన్వంతరి=ధన్వంతరి యొక్క; చేతి=చేతియందలి; దుగ్ధ..... కుంభమున్. దుగ్ధమయ వార్థి=పాలసముద్రమున పుట్టిన; సుధారస=అమృతముతో; పూర్ణ=నిండిన; కుంభమున్=కలశమును; సంతన కట్టి=గుంపులు కట్టి; పుచ్చుకొని=తీసికొని; చయ్యనన్=వెంటనే; ఏగిరి=వెళ్ళిరి.

భావము :- పాలసముద్రము నుండి ధన్వంతరి అమృతభాండముతో కాంతిమంతుడై వచ్చెను. రాక్షసులు పరాక్రమవంతులే కాదు. పొగరుబోతులు. గుంపుగూడినారు. కలకలధ్వని చేసినారు. విజృంభించినారు. అందరు కలసి ధన్వంతరిపై ఎగబడినారు. అతని చేతిలోని అమృతభాండమును లాగికొనినారు. వెంటనే పారిపోయినారు.

వ॥ అప్పుడు 97

అర్థము :- అప్పుడు=అ సమయమున.

కం॥ నారాయణుండు మాయా
నారీ రూపమునఁ గపట నాటక లీలా
పారాయణత హరించె సు
రారులచే నమృత కలశ మా సమయమునన్. 98

అర్థము :- ఆ సమయమునన్=అప్పుడు; నారాయణుండు=విష్ణుమూర్తి; మాయా=కల్పితమైన; నారీరూపమునన్=స్త్రీ వేషముతో; కపట నాటక లీలా=వంచనతో కూడిన కృత్రిమ ఉపాయమనెడి క్రీడయందు; పారాయణతన్=నేర్పుతో; సుర+అరులచేన్=దేవతల శత్రువులైన ఆ రాక్షసులచేతి నుండి; అమృత కలశము=అమృత భాండమును; హరించెన్=తీసికొనెను.

భావము :- శ్రీ మహావిష్ణువు మాయా మోహినీ రూపము ధరించి కపట నాటక క్రీడయందలి నేర్పుతో రాక్షసుల నుండి అమృతభాండమును స్వాధీనము చేసికొనెను.

చ॥ అమృతముఁగోలుపోయి విబుధారులు గంధగజాసురాంధక
ప్రముఖులు మోములందు వినఁబాటు దలిర్పఁగఁ గూడియున్నచో
నమరఁగ నారదుండు గగనాగ్రమునం జనుదెంచి వారికిం
బ్రమదము తోడ నిట్లనుచుఁ బల్కెను వాక్పరిపాటి యొప్పఁగన్. 99

అర్థము :- గంధగజాసుర=గజాసురుడు; అంధక=అంధకుడు; ప్రముఖులు=మొదలైన; విబుధ+అరులు=దేవతల శత్రువులైన రాక్షసులు; అమృతమున్=అమృతమును; కోలుపోయి=పోగొట్టుకొని; మోములందు=ముఖములందు; వినఁబాటు=వెలవెలబోవుట; తలిర్పఁగన్=అతిశయింపగా; కూడియున్నచో=కలసియుండగా; గగనాగ్రమునన్=ఆకసముపై నుండి; నారదుండు=నారద మహర్షి; చనుదెంచి=వచ్చి; ప్రమదము తోడన్=సంతోషముతో; వాక్+పరిపాటి=మాట పద్ధతి; ఒప్పఁగన్=ప్రకాశింపగా; వారికిన్=ఆ రాక్షసులతో, ఇట్లు+అనుచున్=ఈవిధముగననుచు; పల్కెన్=మాటాడెను.

భావము :- గజాసురుడు, అంధకాసురుడు మొదలైన రాక్షసులు అమృతమును పోగొట్టుకొని ముఖములందు వివర్ణత అధికముకాగా ఒకచోట కూడియుండిరి. అపుడు నారదుడు పైలోకమునుండి వచ్చి సంతోషముతోను, మాట నేర్పరితనముతోను ఆ రాక్షసులతో ఇట్లనెను.

## నారదోక్తి నసురు లీశ్వరుని బూజించి వరంబులు వడసి లోకముల బాధించుట :

శా॥ రక్షోనాయకులార! నిర్జరవర వ్రాతంబు చేతన్ సుధా
భిక్షాపాత్రము వోయెనంచు మదిలో బెగ్గిల్లఁగా నేటికిన్?
రక్షార్థంబు భజింపరాదె యభవుం ద్రైలోక్య కుక్షింభరున్
దక్షారామ పురాధినాథుని సుధాధామార్ధ చూడామణిన్. 100

అర్థము :- రక్షోనాయకులార=ఓ రాక్షసనాయకులారా! నిర్జరవర=దేవతానాయకుల; వ్రాతంబు చేతన్=సమూహముచేత; సుధాభిక్షా పాత్రము=అమృతమనెడి భిక్షగల పాత్ర; పోయెనంచు=పోయెనని; మదిలో=మనసులో; బెగ్గిల్లఁగాన్=చింతించుట; ఏటికిన్= ఎందులకు? రక్ష+అర్థంబు=భద్రతకొరకై; అభవున్=పుట్టుక లేనివాడును; త్రైలోక్య కుక్షింభరున్=(లోకత్రయమును కడుపులో పెట్టుకొన్నవాడును;) మూడు లోకముల జనుల పొట్టలను (ఆహారముతో) నింపువాడును; సుధాధామ+అర్ధ=వెన్నెలకు నెలవైన చంద్రుని యొక్క సగ భాగమును; చూడామణిన్=సిగయందు అలంకారముగ కలవాడునగు; దక్షారామపుర=దక్షారామ నగరమునకు; అధినాథుని=సర్వాధికారియైన; శ్రీ భీమేశ్వర స్వామిని; భజింపరాదె=సేవింపకూడదా!

భావము :- ఓ రాక్షస నాయకులారా! దేవనాయకుల వలన అమృతమనెడి భిక్షగల పాత్ర పోయెనని బెంగపడుచుంటిరేమి? చింతించి ప్రయోజనమేమి? భద్రత కొరకై అభవుడు, త్రైలోక్య కుక్షింభరుడు, చంద్రశేఖరుడునైన దక్షారామ శ్రీ భీమేశ్వర స్వామిని సేవింపుడు.

విశేషము :- సుధాభిక్షాపాత్రము కన్న త్రైలోక్య కుక్షింభరుడు సర్వోన్నతుడు. అమృతభాండము నిర్జరులకే పరిమితము. కాని పరమేశ్వరుడు త్రైలోక్య కుక్షింభరుఁడు. కావున ఆయన నాశ్రయించుట ఉత్తమము.

కం॥ అని నారదుండు పల్కిన
విని యందఱు భీమనాథు విశ్వేశ్వరునిన్
ఘన భక్తి దక్షమునిరా
డ్వన మధ్యము నందుఁగొల్చి వర్ధితబలులై. 101

అర్థము :- అని=అని; నారదుండు=నారదముని; పల్కిన=చెప్పగా; విని=విని; అందఱు=అందరును; దక్షమునిరాట్=దక్షడను మునిశ్రేష్ఠుని యొక్క; వన=ఆరామము

యొక్క; మధ్యము నందున్=నడిమి ప్రదేశమున; ఘనభక్తిన్=గొప్పదగు భక్తితో; విశ్వేశ్వరున్= విశ్వమంతటికి నాయకుడైన; భీమనాథున్=శ్రీ భీమేశ్వరుని; కొల్చి=సేవించి; వర్ధిత బలులై=వృద్ధిపొందిన బలము కలవారై.

భావము :- నారదుని మాటలను రాక్షస నాయకులందరు వినినారు. దక్షారామము చేరినారు. భక్తి తత్పరులై శ్రీ భీమేశ్వరుని సేవించినారు. వారి బలములను వృద్ధి చేసికొనినారు. వారింకను-

మ॥ త్రిపురావాసులతోడఁ గూడి కడిమిన్ దేవాహితుల్ లోకముల్
తపియింపంగఁ దపంబు చేసిరి దృఢ స్థైర్యంబు పాటించి పా
శుపతాచార నిరూఢి నందఱును సంశుద్ధాంతరంగంబులం
దుపమాతీతుని భీమనాయకుని నాద్యున్ శంభు సేవించుచున్. 102

అర్థము :- దేవ+అహితుల్=దేవతలకు శత్రువులైన రాక్షసులు, త్రిపుర=మూడు నగరములందు; ఆవాసుల తోడన్=నివసించు రాక్షసులతో; కూడి=కలిసి; కడిమిన్=పట్టుదలతో; దృఢ=గట్టి; స్థైర్యంబు=నిలుకడను; పాటించి=అవలంబించి; పాశుపత=పాశుపతమునందు చెప్పబడిన; ఆచార=పద్ధతులను పాటించుట యందలి; నిరూఢిన్=నేర్పుతో; సంశుద్ధ=మిక్కిలి పవిత్రములైన; అంతరంగంబులన్=మనస్సులతో; అందఱును=అందరు; ఉపమ+అతీతుని =చెప్పుటకు పోలిక సాధ్యము కానివాడును; ఆద్యున్=మొదటివాడును; శంభున్=శంకరుడగు; భీమనాయకునిన్=శ్రీ భీమేశ్వరస్వామిని; సేవించుచున్=కొలుచుచు; లోకముల్=లోకము లన్నియు; తపియింపంగన్=తాపమును పొందునట్లుగా; తపంబు=తపస్సును; చేసిరి= ఆచరించిరి.

భావము :- రాక్షసులు త్రిపురాసురులతో కలసి పట్టుదలతో. చెదరని దీక్షతో పాశుపత మతములోని నియమములను నేర్పుతో పాటించిరి. వారి మనసులు పవిత్రములైనవి. శ్రీ భీమేశ్వరస్వామిని సేవించుచు తపస్సు చేయుచుండిరి. లోకములు తపించుచున్నవి.

విశేషము :- పాశుపతాచార నిరూఢి :- సంసారవశవర్తులగు ప్రాణులందరు పశువులే. వారికి పతియగుటచే పరమేశ్వరుడు పశుపతి. మలమాయాదులగు పాశములతో ఆయన వారిని బంధించును. భక్తితో ఉపాసించినచో ఆయనయే వారిని బంధవిముక్తుల నొనర్చును. అనంత జనన మరణ కారణమగు సంసారము నుండి ముక్తి గోరువారు శాంభవీ దీక్ష ననుష్ఠింపవలెను. అత్యాశ్రమము; పాశుపతము; శిరోవ్రతము; శాంభవము అనునవి పర్యాయ వాచకములు.

పాశుపతవ్రతమునకు గురువు, లింగము, జంగము, తీర్థము, ప్రసాదము, భస్మధారణము, రుద్రాక్ష ధారణము, మంత్రజపము అను ఎనిమిది అంగములు కలవు. వీనిని అష్టావరణము అందురు. గురుముఖమున దీక్షనంది మంత్రమును జపింపవలెను. భస్మధారణము, రుద్రాక్ష ధారణము బాహ్య చిహ్నములు.

గురుర్లింగం జంగమశ్చ తీర్థంచైవ ప్రసాదకః
భస్మరుద్రాక్ష మంత్రాశ్చే త్యష్టావరణ సంజ్ఞితాః చంద్రజ్ఞానాగమము 2-2

సీ॥ అరుణోదయంబున నాకాశవాహినీ
హేమాంబుజంబుల నిందు ధరుని
మిహిరోదయంబున మహిసాక్షి గుగ్గుల
ధూప ధూమంబుల దురిత హరుని
సంగవంబున గంధసార కుంకుమ చంద్ర
జంబాలమునఁ బుష్పచాప మథను
మధ్యాహ్నమునఁ బక్వ మధురాన్న పాయసా
పూపాజ్యదధి ఫలంబులఁ ద్రినేత్రుఁ

తే॥ పరమ సంధ్యాగమంబునఁ బటహ శంఖ
ఝల్లరీ మడ్డు డమరు ఝుర్ఝరుల మ్రోఁత
నర్ధ రాత్రంబులందు వీణారవముల
హరునిఁ బూజింతు రతిభక్తి నసుర వరులు. 103

అర్థము :- అసురవరులు=రాక్షస నాయకులు; అతిభక్తిన్=మిక్కిలి భక్తితో; ఇందుధరుని=చంద్రుని ధరించిన శివుని, అరుణ=అనూరుని; ఉదయమునన్=పుట్టుకవేళ (వేకువజామున) ఆకాశ.....అంబుజంబుల. ఆకాశ వాహినీ=ఆకాశ గంగలోని; హేమ+ అంబుజంబులన్=బంగరు పద్మములతోను;

దురితహరుని=పాపనాశకుడైన శంకరుని; మిహిరోదయంబున=సూర్యోదయ వేళ; మహిసాక్షి=మహిసాక్షి యొక్క; గుగ్గుల=గుగ్గిలము యొక్క; ధూపధూమంబులన్=ధూపము వేయు పొగలతోను;

పుష్పచాప మథనున్=పూలు బాణములుగగల మన్మథుని చంపిన శంకరుని; సంగవంబున=సంగవ కాలమున (ఉదయము 8-9 గంటల మధ్యకాలమున); గంధసార= చందనము; కుంకుమ=కుంకుమ; చంద్ర=కర్పూరము యొక్క; జంబాలమునన్=బురదతోను;

త్రినేత్రున్=ముక్కంటిని; మధ్యాహ్నమునన్=పగటి మధ్యభాగమునందు; పక్వ.....ఫలంబులు. పక్వ=పాకము చేయబడిన; మధుర+అన్నము=పొంగలి; పాయస=పాయసము; అపూప=పిండివంటలు; ఆజ్య=నేయి; దధి=పెరుగు; ఫలంబులన్=పండ్లతోను;

హరుని=శంకరుని; పరమ సంధ్య=సాయంతన సంధ్య; అగమంబునన్=వచ్చినపుడు; పటహ.....మ్రోతన్. పటహ=తప్పెట; శంఖ=శంఖము; ఝల్లరీ=డోలు; మడ్డు=గుమ్మెట; డమరు=డమరుకము; ఝర్ఝరుల=చక్కి మొదలయిన వాద్యముల; మ్రోతన్=ధ్వనులతోను; అర్ధరాత్రంబులందు=నడిరాత్రులయందు; వీణారవంబులన్=వీణానాదములతోను; పూజింతురు=పూజ చేయుదురు.

భావము :- ఆ రాక్షస నాయకులు స్థిరమైన భక్తితో శ్రీ భీమేశ్వరుని వేకువ జామున ఆకాశగంగలోని బంగరు కమలములతో పూజింతురు. సూర్యోదయ కాలమున ధూప ధూమములతో పూజింతురు. సంగవకాలమున చందనము, కుంకుమ పూవు, కర్పూరములు కలిపి తడిపిన మిశ్రము పూసి సేవింతురు. మధ్యాహ్న సమయమున పొంగలి, పాయసము, పిండివంటలు, నేయి, పెరుగు, పండ్లు నైవేద్యముగ నిచ్చి పూజింతురు. సాయం సమయమున డమరువు, శంఖము, తప్పెట, డోలు మొదలగు వాద్యములను మ్రోగించుచు సేవింతురు. అర్ధరాత్రమున వీణావాదనలతో పూజింతురు.

విశేషము :- ఈ పద్యమునందు శైవులు చేయు షట్కాల శివపూజ వివరింపబడినది. అర్జునుడు పాశుపత దీక్షతో పరమేశ్వరుని షట్కాలములందు పూజించిన విధానము హరవిలాసమున 7వ ఆశ్వాసమున 29 నుండి 35 పద్యము వరకు కలదు.

పంటవంశపు రాజుల శివపూజలో శ్రీనాథుడు పై వాద్యవిశేషములను కాశీఖండము 1-56లోను పేర్కొనెను.

షట్కాలముల వివరణము. భీమ 3-7. చెంత వచ్చినది.

శా॥ **పంచబ్రహ్మ షడంగ మంత్రములనుం బ్రాసాద పంచాక్షరిం**
**బంచాస్యున్ బహు బిల్వ పత్రముల నభ్యర్చింతు రవ్యగ్రత**
**న్మంచుంగొండ యనుంగుఁ బెండ్లికొడుకు న్వర్ణింతు రేకాగ్రతం**
**జంచద్వేద పురాణమంత్రముల నిష్ఠాయుక్తి నక్తంచరుల్.** 104

అర్థము :- నక్తంచరుల్=రేద్రిమ్మరులైన రక్కసులు; నిష్ఠాయుక్తిన్=భక్తిశ్రద్ధల యొక్క కూడికతో; పంచ+ఆస్యున్=ఐదు ముఖములు గలవాడైన శంకరుని, పంచబ్రహ్మ=పంచబ్రహ్మ మంత్రములు; షడంగ=షడంగ మంత్రములతోను; ప్రాసాద పంచాక్షరిన్=ప్రాసాద పంచాక్షరీ

మంత్రముతోను; బహు=అనేకములైన; బిల్వపత్రములన్=మారేడు దళములచే; అవ్యగ్రతన్= పరాకులేక; అభ్యర్చింతురు=పూజింతురు; మంచుంగొండ=హిమపర్వతుని; అనుంగు=కూరిమి; పెండ్లికొడుకున్=అల్లుడైన శంకరుని; ఏకాగ్రతన్=లగ్నమైన మనసులతో; చంచత్=ప్రకాశమాన మైన; వేద=వేదములందలి; పురాణ=పురాణములందలి; మంత్రములన్=మంత్రములతో; వర్ణింతురు=పొగడుదురు.

భావము :- ఆ రాక్షస నాయకులు శంకరుని పంచబ్రహ్మ షడంగ ప్రాసాద పంచాక్షరీ మంత్రములు పఠించుచు మారేడు దళములతో పూజింతురు. స్థిరమైన పూనికతో వేదపురాణములందలి మంత్రములతో కీర్తింతురు.

విశేషము :- పంచబ్రహ్మ మంత్రములు, షడంగ మంత్రములు 2-75 చెంత, ప్రాసాద పంచాక్షరి 2-71 చెంత వివరింపబడినవి.

వేదపురాణ మంత్రములు :- వేదములందు మంత్రములు వైదిక ఛందస్సులో నుండును. పురాణములందలి మంత్రములు లౌకిక ఛందస్సులోనుండును. వైదిక భాషకు లౌకిక భాషకును భేదము కలదు.

**వ॥ఇవ్విధంబున నిష్టార్థ ప్రదుండైన యమ్మహాదేవు శ్రీ భీమనాథు సేవించి యద్దేవుని ప్రసాదంబున ననశ్వరంబును నత్యూర్జితంబును నసాధారణంబునునగు నైశ్వర్యంబునుం బొంది. 105**

అర్థము :- ఈ+విధంబునన్=ఈ రీతిగ; ఇష్ట+అర్థ+ప్రదుండైన=కోరిన కోరికలను ఇచ్చువాడైన; ఆ+మహాదేవు=ఆ గొప్ప దేవుడైన; శ్రీ భీమనాథు=శ్రీ భీమేశ్వర స్వామిని; సేవించి=కొలిచి; అనశ్వరంబునున్=నాశము లేనిది; అత్యూర్జితంబునున్=మిక్కిలి వృద్ధి కలిగినది; అసాధారణంబునున్=విశేషమైనది; అగున్=ఐన; ఐశ్వర్యంబునున్=సంపదను; పొంది=పడసి;

భావము :- ఈ రీతిగ ఆ రాక్షసులు శ్రీ భీమేశ్వరస్వామిని సేవించి ఆ దేవుని అనుగ్రహము చేత నాశము లేనిది, మిక్కిలి వృద్ధి కలది, అసాధారణమైనదియునైన సంపదను పొందిరి.

**తే॥ అపుడు గర్వించి నిర్జించి రఖిల జనుల
నిర్జరుల బాధపెట్టిరి నిరపరాధ
మప్రతీక మహాప్రతాపాతిరేక
నిర్విశంకావలేపులై పూర్వసురులు. 106**

అర్థము :- పూర్వసురులు=రాక్షసులు; అపుడు=అప్పుడు; గర్వించి=అహంభావము పూని; నిరపరాధము=నేరములేక; అప్రతీక=ప్రతికూలము లేని; మహాప్రతాప=గొప్ప శౌర్యము యొక్క; అతిరేక=పెచ్చు వలన కల్గిన; నిర్విశంక=జంకులేని; అవలేపులై=గర్వము కలవారై; అఖిలజనుల=ప్రజలందరిని; నిర్జించిరి=జయించిరి. నిర్జరులన్=దేవతలను; బాధపెట్టిరి= పీడించిరి.

భావము :- శ్రీ భీమేశ్వరస్వామి అనుగ్రహమును సంపాదించిన రాక్షసులందరు గర్వించిరి. శౌర్యముతో విజృంభించిరి. జంకు గొంకులుమాని ఎదురులేని ప్రతాపముతో నిరపరాధులగు ప్రజలను బాధింప జొచ్చిరి. దేవతలను పీడింపసాగిరి.

## బ్రహ్మావిష్ణ్వాదులు శివునికడఁకేగి మొఱవెట్టుట :

సీ॥ వజ్రహస్తుని చేతి వజ్రాయుధము జాగ్ర
　　　దుద్దీప్తి పాడఱి మొద్దు వోయె
నతి తీక్ష్ణతరమైన యాశుశుక్షణి తేజ
　　　మింగాల తేజమై యింకి పోయెఁ
జండ భీషణమైన జము గదా దండంబు
　　　బిఱుసంతయును బాసి బెండు పడియెఁ
బాథోధి వల్లభు పాశవల్లిమతల్లి
　　　దర్పంబు దిగఁద్రావి త్రాడుపడియె

తే॥ గాలిదూలెను ధనపతి ఘనత యణఁగె
గ్రహములకు నిగ్రహము పుట్టెఁ గాల వశతఁ
గాలకేయాది రాక్షస గణము లెల్ల
భీమ లింగంబు కృపఁ బెచ్చు పెరుఁగునపుడు. 107

అర్థము :- భీమలింగంబు=లింగరూపుడైన శ్రీ భీమేశ్వరస్వామి యొక్క; కృపన్= దయతో; కాలకేయ+ఆది=కాలకేయులు మొదలైన; రాక్షస గణములు+ఎల్లన్=రాక్షస సమూహములన్నియు; కాలవశతన్=కాలప్రభావము చేత; పెచ్చు పెరుఁగునపుడు= చెలరేగు నపుడు;

వజ్రహస్తుని చేతి=ఇంద్రుని చేతిలోని; వజ్రా+ఆయుధము=వజ్రమనెడి ఆయుధము యొక్క; జాగ్రత్+ఉద్దీప్తి=సావధానమగు తేజస్సు; పాడఱి=చెడిపోయి; మొద్దు+పోయెన్=మొన చెడిన దయ్యెను;

అతి=మిక్కిలి; తీక్ష్ణతరము=మిక్కిలి తీవ్రతరము; ఐన=అయినటువంటి; ఆశుశుక్షణి=అగ్నిదేవుని; తేజము=ప్రకాశము; ఇంగాల+తేజమై=బొగ్గువంటి కాంతికలదై; ఇంకిపోయెన్=నశించెను;

చండ=వాడియై; భీషణమైన=భయంకరమైనదైన; జము=యముని; గదాదండంబు=గద అనెడి ఆయుధము; బిఱుసు+అంతయును=కాఠిన్యము మొత్తము; పాసి=పోగొట్టుకొని; బెండుపడియెన్=బలహీనమైనది;

పాథోధివల్లభు=సముద్రములకు రాజైన వరుణుని; పాశవల్లిమతల్లి=తీవె వంటి శ్రేష్ఠమైన పాశము; దర్పంబు=గర్వమును; దిగఁద్రావి=పోగొట్టుకొని; త్రాడువడియె=దారమైపోయెను;

గాలి=వాయువు; తూలెను=కృశించెను; ధనపతి=కుబేరుని; ఘనత=గొప్పతనము; అణఁగె=నశించినది; గ్రహములకు=సూర్యుడు మొదలైన గ్రహములకు; నిగ్రహము=చెర, బెదరింపు; పుట్టెన్=కల్గినది.

భావము :- కాలకేయులు మొదలైన రాక్షసగణములు శ్రీ భీమేశ్వరుని దయను పొంది గర్వముతో, పరాక్రమముతో చెలరేగిరి. కాలవశమున వారికెదురు లేకపోయినది. ఇంద్రుని వజ్రాయుధము మొక్కవోయినది. అగ్నిదేవుని కాంతి, వేడి చల్లారిపోయినవి. యముని గదాదండము బెండు బారినది. వరుణపాశము శక్తిహీనమైనది. వాయుదేవుడు కృశించినాడు. కుబేరుని గొప్పతనము క్షీణించినది. గ్రహములకు చెరలు, బెదరింపులు కల్గినవి.

విశేషము :- పదపూర్వార్థ వక్రత యందలి వృత్తి వక్రోక్తి.

**వ॥ అప్పుడు హరివిరించులు పురందరాదులతోడ నక్తంచరుల చేతఁ బంచకర పాట్లువడి యంతఃకరణంబులఁజింతించి రాయంచనుం గాంచన వర్ణ గరుదంచలంబగు పులుఁగు ఱేనినెక్కి దక్షిణ జలధిపంచ దక్షారామంబున నధివసించిన మంచుఁగొండ యల్లునిఁ బంచబాణ విరోధిం డాయంజనుదెంచి పంచాక్షరీ పంచబ్రహ్మ మంత్రంబుల మంత్రోచ్చారణ పూర్వకంబుగా సాష్టాంగదండ ప్రణామంబు లాచరించి ప్రపంచ రక్షణార్థంబుగా నిట్లని స్తుతించిరి. 108**

అర్థము :- అప్పుడు=ఆ సమయమున; హరి+విరించులు=విష్ణువు బ్రహ్మలు; పురదంర+ఆదులతోడ=ఇంద్రుడు మొదలైన వారితో పాటుగ; నక్తంచరుల చేతన్=రాత్రులందు తిరుగువారైన రాక్షసులచే; పంచకరపాట్లు+పడి=అధికమైన బాధలుపడి; అంతఃకరణంబులన్=మనసులందు; చింతించి=ఆలోచించి; రాయంచనున్=రాజహంసను; కాంచనవర్ణ=బంగారు రంగుగల; గరుత్+అంచలంబగు=ఱెక్క అంచులు కలవాడైన; పులుఁగు ఱేనిన్=పక్షిరాజైన

గరుత్మంతుని; ఎక్కి=అధిరోహించి; దక్షిణ జలధి=దక్షిణ దిక్కునందలి సముద్రము యొక్క; పంచ=సమీపమున; దక్షారామంబునన్=దక్షారామ నగరమున; అధివసించిన=కొలువు దీరియున్న; మంచుఁగొండ=హిమవత్పర్వతుని; అల్లునిన్=అల్లుడైన వానిని; పంచబాణ విరోధిన్=ఐదు పూబాణములుకల మన్మథునకు శత్రువైన వానిని (శ్రీ భీమేశ్వరుని); డాయన్=సమీపమునకు; చనుదెంచి=వచ్చి; పంచాక్షరీ=పంచాక్షరియును; పంచబ్రహ్మ=పంచబ్రహ్మమను; మంత్రంబుల=మంత్రములతో; మంత్ర+ఉచ్చారణ పూర్వకంబుగా=తగిన విధముగ మంత్రములను పల్కుచు; స+అష్టాంగ=ఎనిమిది అంగములను; దండ=కఱ్ఱవలె; నేలపై చాచి; ప్రణామంబులు=నమస్కారంబులు; ఆచరించి=చేసి; ప్రపంచ=లోకము యొక్క; రక్షణార్థంబుగాన్=క్షేమమును కోరి; ఇట్లు+అని=ఈవిధముగ; స్తుతించిరి=కొనియాడిరి.

భావము :- బ్రహ్మ, విష్ణువు, ఇంద్రుడు మొదలైన దేవనాయకులందరు రాక్షసుల వలన పలుబాధలనుభవించినారు. మనసులలో ఆలోచించినారు. బ్రహ్మదేవుడు హంసనెక్కినాడు. విష్ణువు గరుత్మంతుని అధిరోహించినాడు. ఇంద్రాదులు వారి వారి వాహనము లెక్కినారు. దక్షారామము చేరినారు. పార్వతీపతి, మదనాంతకుడు ఐన శ్రీ భీమేశ్వరస్వామిని సమీపించినారు. పంచాక్షరి, పంచబ్రహ్మ మంత్రములను తగినవిధముగ పల్కుచు సాష్టాంగ దండ ప్రణామములు చేసినారు. లోకక్షేమమును కోరి వారందరు ఈవిధముగ శ్రీ భీమనాథేశ్వరస్వామిని కొనియాడినారు.

సీ॥ "అవధారుదేవ! దక్షారామ వల్లభ!
సప్తగోదావరోత్సంగ నిలయ!
కాలకూటానల జ్వాలానలముఁబాపి
మమ్ము రక్షించిన మహిత కరుణ!
భీమేశ్వరేశ్వరస్వామి! మహాదేవ!
త్రిపురదైత్యుల బాధ దీలుపడితి
మత్యంత దుఃఖము లనుభవించితిమి య
నాథుల మైతిమనాథ నాథ!

తే॥ మొదల దేవారులను గాచి పిదప సురలఁ
గాచి పిమ్మట నసురులఁ గాచి నాఁడ
వింక మముఁ గావు వరుస భోగీంద్ర కటక!
నీ వెఱుంగవె ధర్మంబు నీలకంఠ!

అర్థము :- సప్త.....నిలయ! సప్తగోదావర=సప్తగోదావరము యొక్క; ఉత్సంగ=ఒడియే; నిలయ=నివాసముగ కలవాడా! దేవ!=ఓ స్వామీ! దక్షారామ వల్లభ=శ్రీ భీమనాయకా! అవధారు=చిత్తగింపుము;

కాలా.....నలము. కాలకూట+అనల=కాలకూటమనెడి అగ్ని యొక్క; జ్వాల+అనలమున్=మంటలతో గూడిన నిప్పు నుండి; పాపి=దూరము చేసి; మమ్ము= మమ్ముల నందరిని; రక్షించిన=కాపాడిన; మహిత కరుణ=గొప్పదయ కలవాడా!

భీమేశ్వరేశ్వరస్వామి=శ్రీ భీమనాయకా!; మహాదేవ=శంకరా!; త్రిపురదైత్యుల=త్రిపురముల యందలి రాక్షసులు పెట్టు; బాధన్=అగచాట్లచేత; దీలుపడితిమి=కృశించితిమి;

అనాథనాథ=గతిలేని వారికి రక్షకుడవైనవాడా! అత్యంత=మిక్కిలి; దుఃఖములను=వ్యథలను; అనుభవించితిమి=పొందితిమి; అనాథులము+ఐతిమి=దిక్కులేనివారమైతిమి.

నీలకంఠ=నల్లని గొంతుక కలవాడా! శంకరా!; మొదల=మొదటిగ; దేవ+అరులన్=దేవతల శత్రువులైన రాక్షసులను; కాచి=రక్షించి; పిదప=తరువాత; సురలన్=దేవతలను; కాచి=కాపాడి; పిమ్మటన్=ఆ తరువాత; అసురులన్=రాక్షసులను, కాచినాఁడవు=కాపాడినావు; భోగీంద్ర కటక!=నాగరాజైన వాసుకి కంకణముగ కలవాడా! ఇంక=ఇక; వరుసన్=క్రమముగా; మమ్మున్=మమ్ములను; కావుము=రక్షింపుము; ధర్మంబు=న్యాయము; నీవు+ఎఱుంగవె=నీకు తెలియనిదా!

భావము :- "ఓ భీమేశ్వరా! దయతో మా విన్నపమాలకించుము. కాలకూట విషమును మ్రింగి మమ్ములను రక్షించితివి. నీ కరుణామహత్త్వము గొప్పది. త్రిపురాసురుల వలన మేము పలుబాధలనుభవించుచుంటిమి. అనాథులమైతిమి. నీవు అనాథనాథుడవు. మొదట రాక్షసులను రక్షించితివి. పిదప దేవతలను కాపాడితివి. తరువాత రాక్షసులను రక్షించితివి. ఇపుడు మమ్ములను కూడ నీవె కాపాడవలె. నీకు తెలియని ధర్మమేమున్నది స్వామీ!

**తే॥ చటులతర కాలకూటాగ్ని సంజిహీర్ష**
**పాల్కడలి నట్టనడుమ సంప్రభవమైన**
**యమృతలింగంబవగు నిన్ను నాశ్రయింతు**
**మభవ! భీమేశ! దక్షవాటాధినాథ! 110**

అర్థము :- అభవ=పుట్టుక లేనివాడా!; దక్షవాట+అధినాథ=దక్షారామమునకు నాయకుడైనవాడా! భీమేశ=శ్రీ భీమేశ్వరస్వామీ!; చటులతర=మిక్కిలి మెఱపుగల; కాలకూట=కాలకూటమనెడి; అగ్ని=నిప్పును; సంజిహీర్షన్=మిక్కిలిగ హరింపవలెనను

పూనికతో; పాల్కడలి నట్టనడుమన్=పాలసముద్రము యొక్క మధ్యభాగము నుండి; సంప్రభవమైన=పుట్టినదైనటువంటి; అమృత లింగంబవు+అగు=దివ్యమైన లింగమూర్తివగు; నిన్ను=నిన్ను; ఆశ్రయింతుము=రక్షణకోరుదుము.

భావము :- ఓ దక్షారామ భీమేశ్వరస్వామీ! మిక్కిలి మెఱపుగల కాలకూటమనెడి నిప్పును హరించుటకై పాలసముద్రపు మధ్యభాగమునుండి దివ్యలింగరూపమును ధరించి అవతరించితివి. అట్టి నిన్ను శరణు వేడుచుంటిమి.

విశేషము :- ఇందు శివుడు మొదటిగ లింగరూపమున పాలసముద్రము నుండి స్వయంభువైన విషయము స్మరింపబడినది.

కం॥ ప్రణవోత్తమాంగ! ఫణిభూ
షణ! గగనమణీందు వహ్ని చక్షుస్త్రితయా!
ఫణికటక! జితమనోభవ!
యణిమాది విశేషదా! పరాశ్రయ చరణా! 111

అర్థము :- ప్రణవ=ప్రణవమే; ఉత్తమాంగ=శిరస్సుగ కలవాడా!; ఫణిభూషణ!= సర్పము ఆభరణముగ కలవాడా! గగనమణి=ఆకాశ మణియైన సూర్యుడు; ఇందు=చంద్రుడు; వహ్ని=అగ్ని; చక్షుస్=కన్నుల; త్రితయా!=మూడింటి సమాహారము కలవాడా!; ఫణికటక= సర్పమును కడియముగ కలవాడా!; జిత=జయింపబడిన; మనోభవ=మన్మథుడు కలవాడా!; అణిమ+అది+విశేష=అణిమ, గరిమ మొదలైన సిద్ధుల సమూహమును; దా=ఇచ్చువాడా!; పర=మోక్షమునకు; ఆశ్రయ=ఇల్లైన; చరణా!=పాదములు కలవాడా!

భావము :- ఓ శంకరా! ఓంకారమే నీ శిరస్సు. సర్పమే నీకు ఆభరణము. సూర్యుడు చంద్రుడు అగ్ని నీ మూడు నేత్రములు. సర్పమే నీ చేతి కడియము. అణిమాది అష్టసిద్ధులను ప్రసాదింపగల వాడవు. నీ పాదములే మోక్షమునకు నిలయము.

ఉత్సాహము :- నీలకంఠ! భక్తలోకనిధి! భవాబ్ధి తారణా!
ఫాలభాగదృక్కృపీట భవ శిఖా హతస్మరా!
శూలపాణి! మమ్ముఁగరుణ జూడు త్రిపురదానవుల్
జాలిఁబెట్టు చున్నవా రసహ్య విక్రమోద్ధతిన్. 112

అర్థము :- నీలకంఠ=నల్లని కుత్తుక కలవాడా!; భక్తలోక నిధి!=భక్తుల సమూహము నకు పెన్నిధియైనవాడా!; భవ+అబ్ధి+తారణా!=సంసారమనెడి సముద్రమును దాటించు వాడా! ఫాలభాగ=నుదుటి ప్రదేశమునందలి; దృక్=కంటి; కృపీట భవ=(నీటి నుండి పుట్టిన) నిప్పు

యొక్క; శిఖా=జ్వాలచేత; హత=చంపబడిన; స్మరా!=మన్మథుండు కలవాడా!; త్రిపురదానవుల్=త్రిపురాసురులు; అసహ్యా=సహింపరాని; విక్రమ=పరాక్రమము యొక్క; ఉద్ధతిన్=గర్వముతో; జాలిన్+పెట్టుచున్నవారు=భయపెట్టుచున్నారు; మమ్ము= మమ్ములను; కరుణన్=దయతో; చూడు=చూడుము.

భావము :- ఓ గరళకంఠా! భక్తవశంకరా! త్రిశూలపాణీ! భవబంధ విమోచనా! నీ ఫాలభాగమందలి కంటిమంటచే మన్మథుని దహించితివి. త్రిపురాసురుల గర్వమును, పరాక్రమమును సహింపలేకుంటిమి. వారు మమ్ములను చాల బాధపెట్టుచుండిరి. నీవు మమ్ములను దయతో చూడవలయును

విశేషము :- శ్రీనాథుడీ సమయమున ఉత్సాహము నెన్నుట దేవనాయకులు త్రిపురాసుర సంహారము కొరకు ఫాలనేత్రమును, మన్మథ దహనమును, త్రిశూలమును గుర్తు చేసి శంకరుని ఉత్సాహపరచుటకు తగియున్నది. ఉత్సాహ లక్షణములు చూడుడు-3-202.

సీ॥ అర్కేందు హవ్యవాహన లోచన త్రయా!
త్రిపుర దైత్యుల బాధ నపనయింపు
మంబికా హృదయాంబుజాకర కలహంస
త్రిపుర దైత్యుల బాధ నపనయింపు
నిత్య! నిర్మల! శుద్ధ! నిరవద్య! నిర్ద్వంద్వ
త్రిపుర దైత్యులబాధ నపనయింపు
దీప్త! దీప్తాయుధ! స్థిర మహా దోర్దండ!
త్రిపుర దైత్యుల బాధ నపనయింపు

తే॥ డమరు పట్టిస పరశు ఖడ్గ త్రిశూల
చాప ఖట్వాంగధర! నీవె శరణుమాకు
నన్యథా శరణంబు లేదభవ! భీమ!
యపనయింపుము త్రిపురాసురారి బాధ. 113

అర్థము :- అర్క=సూర్యుడు; ఇందు=చంద్రుడు; హవ్యవాహన=అగ్నులు; లోచనత్రయా=మూడు కన్నులుగ కలవాడా! త్రిపురదైత్యుల=త్రిపురాసురుల వలని; బాధన్= బాధను; అపనయింపుము=తొలగింపుము;

అంబికా=పార్వతీదేవి యొక్క; హృదయ=మనసనెడి; అంబుజాకర=సరస్సునకు, కలహంస=రాజహంసయైనవాడా! త్రిపురదైత్యుల=త్రిపురములందలి రాక్షసులవలని; బాధన్=కష్టమును; అపనయింపుము=నివారింపుము;

నిత్య=శాశ్వతమైనవాడా!; నిర్మల=మలినమంటనివాడా!; శుద్ధ=శుభ్రమైనవాడా! నిరవద్య=కళంకములేనివాడా! నిర్ద్వంద్వ=రెండు భావములు లేనివాడా!; స్థితప్రజ్ఞుడా! (సుఖదుఃఖములు లేనివాడా!); త్రిపురదైత్యుల=త్రిపురాసురుల వలని; బాధన్=పీడను; అపనయింపు=తొలగింపుము;

దీప్త=కాంతిమంతుడా!; దీప్త+ఆయుధ=కాంతిమంతములైన ఆయుధములు కలవాడా! స్థిరమహో=నిలుకడైన గొప్ప; దోః+దండ!=దండములవంటి చేతులు కలవాడా! త్రిపుర దైత్యుల=త్రిపురాసురులవలని; బాధన్=హానిని; అపనయింపుము=రూపుమాపుము;

డమరు.....ధర!; డమరు=డమరుకము; పట్టిస=పట్టిసమనునది; పరశు=గండ్రగొడ్డలి; ఖడ్గ=కత్తి; త్రిశూల=త్రిశూలము; చాప=విల్లు; ఖట్వాంగ=ఖట్వాంగమనెడి ఆయుధములను; ధర!=ధరించినవాడా!; అభవ!=పుట్టుకలేనివాడా!; భీమ!=భయంకరుడా! మాకు=మాకును; నీవె శరణు=నీవె రక్షకుడవు; అన్యథా=వేరువిధముగా; శరణంబు=అభయము; లేదు=లేదు; త్రిపురాసురారి=త్రిపురములు నివాసములుగగల రాక్షసుల వలని; బాధన్=పీడను; అపనయింపుము=విరగడ చేయుము.

**భావము** :- ఓ ముక్కంటీ! అంబికానాథా! నీవు నిత్యుడవు. నిర్మలుడవు. పరిశుద్ధుడవు. నిరవద్యుడవు. నీకు సుఖదుఃఖములు లేవు. నిర్ద్వంద్వుడవు. దృఢమైన బాహుదండములు నీకు గలవు. స్థిరశూరుడవు. పరశుధరుడవు. ఖట్వాంగపాణివి. శూలధరుడవు. అభవుడవు. భయంకరుడవు. నీవే మాకు శరణు. అన్యథా శరణం నాస్తి. ఆ త్రిపురాసురులబారి నుండి మమ్ములను రక్షింపుము. వారి పీడ విరగడ చేయుము. త్వమేవ శరణం మమ. అని ప్రార్థించిరి.

**విశేషము** :- "త్రిపురదైత్యుల బాధ నపనయింపు" మను వాక్యము పలుమార్లు ఆ వృత్తియగుటచేత త్రిపురాసురుల వలన దేవతలు అనుభవించిన బాధాతీవ్రత, దేవతలు శంకరునకు నివేదించుకొనుటలోని భావనివేదన తీవ్రత వ్యక్తమగుచున్నది.

**కం॥ ముక్త! విశుద్ధ! నిరంజన!**
**ముక్తప్రియ! నిత్య! యష్టమూర్తి! ప్రతాపో**
**ద్రిక్త త్రినగర పరివృఢ**
**నక్తంచర బాధమాన్పు నాగాభరణా! 114**

**అర్థము** :- నాగ+అభరణా!=సర్పములే ఆభరణములుగ కలవాడా!; ముక్త!=మోక్షమైనవాడా! విశుద్ధ!=అతిపవిత్రమైనవాడా!; నిరంజన!=మలినమంటనివాడా!; ముక్తప్రియ!=ముక్తులకు ఇష్టమైనవాడా!; నిత్య!=శాశ్వతమైనవాడా!; అష్టమూర్తి!=ఎనిమిది

రూపములు కలవాడా! ప్రతాప=శౌర్యముచేత; ఉద్రిక్త=అతిశయించిన; త్రినగర పరివృఢ= త్రిపురములకు నాయకులైన; నక్తంచర=రాక్షసుల వలన; బాధ=బాధను; మాన్పు=పోగొట్టుము.

భావము :- ఓ నాగభూషణా! నీవే మోక్షమవు - పవిత్రుడవు. మలినములేనివాడవు. ఆనంద నిలయుడవు. శాశ్వతుడవు. అష్టమూర్తివి. త్రిపురాసురులు బలవంతులు. క్రూరులు. మాకు వారి పీడను తొలగింపుము.

విశేషము :- అష్టమూర్తి :- 1. భూమి, 2. ఆకాశము, 3. గాలి, 4. నీరు, 5. నిప్పు, 6. సూర్యుడు, 7. చంద్రుడు, 8. యజ్ఞకర్త - అను ఎనిమిది రూపములు కలవాడు.

కం॥ దగ్ధ స్మరాంగ! శంకర!
ముగ్ధేందు కళాకలాప మూర్ధాయన! సు
స్నిగ్ధ విధాతృ కపాల
స్రగ్ధారి! ఘటింపు త్రిపుర సంహారంబున్. 115

అర్థము :- దగ్ధ=బూడిదచేయబడిన; స్మరాంగ!=మన్మథుని దేహము కలవాడా! శంకర!=శుభములనిచ్చువాడా! ముగ్ధ=మనోహరమైన; ఇందుకళా=చంద్రకళయను; కలాప=అలంకారమునకు; మూర్ధ=శిరస్సు; అయన!=స్థానమైనవాడా స్నిగ్ధ=నున్నని; విధాతృ=బ్రహ్మదేవుని; కపాల=పుఱ్ఱెలనెడి; స్రక్+ధారి=మాలను ధరించినవాడా! త్రిపుర= త్రిపురాసురులను; సంహారంబున్=చంపుటను; ఘటింపుము=చేయుము.

భావము :- ఓ శంకరా! పాలనేత్రాగ్నితో మన్మథుని దహించినవాడవు. చంద్రశేఖరుడవు. బ్రహ్మదేవుని పుఱ్ఱెతోడి రుండమాలను ధరించినవాడవు. త్రిపురాసురులను సంహరింపుము.

కం॥ అద్వయ! సత్య! క్షరా! క్షర!
సద్వంద్య! యనాదినిధన! సర్వేశ్వర! కృ
ష్ణ ద్వైపాయన శుకముఖ
విద్వన్నుత! సంహరింపవే త్రిపురంబుల్. 116

అర్థము :- అద్వయ!=రెండుకానివాడా! ఏకరూపా!; సత్య!=నిజమైనవాడా! క్షర=నాశముకల జీవుడవైనవాడా! అక్షర=నాశములేని మాయారూపము కలవాడా! సత్+వంద్య=పూజ్యులచే నమస్కరింపతగినవాడా! న+ఆది+నిధన!=ఆద్యంతములు (పుట్టుక చావులు) లేనివాడా! సర్వేశ్వర!=అందరికి నాథుడవైనవాడా! కృష్ణ ద్వైపాయన=వ్యాసమహర్షి (యమునానది ద్వీపమున పుట్టినవాడు); శుక=శుకమహర్షి; ముఖ=మొదలైన; విద్వత్=విద్వాంసులచేత; నుత=కీర్తింపబడినవాడా! త్రిపురంబుల్=త్రిపురములను; సంహరింపవే=నాశనము చేయుము.

భావము :- ఓ సర్వేశ్వరా! జీవుడవు, ఈశ్వరుడవు నీవే. తెలియతగినవాడవు నీవే. నీవు సత్యుడవు, శాశ్వతుడవు. ఆద్యంతములు లేనివాడవు. వ్యాసుడు, శుకుడు మొదలైన విద్వాంసులు నిన్నే కీర్తించిరి. త్రిపురములను నాశము చేయుము.

విశేషము :- "ద్వావిమౌ పురుషే లోకే క్షరశ్చాక్షర ఏవచ

క్షర స్సర్వాణి భూతాని కూటస్థోऽక్షర ఉచ్యతే." భగవద్గీత 15-16

ఈ జగత్తునందు క్షరుడు అక్షరుడునని ఇరువురు పురుషులు. వినాశ శీలమగు సమస్త జీవరాశి రూపమును క్షరపురుషుడు-మాయా శక్తియే కూటస్థుడగు అక్షరపురుషుడు.

కం॥ సర్వేశ్వర! సర్వాత్మక!
శర్వ! సదాశివ! మహేశ! శాశ్వత! రుద్రా!
సర్వజ్ఞ! భీమనాయక!
గర్వాంధుల నణఁపు త్రిపుర కర్బుర పతులన్. 117

అర్థము :- సర్వేశ్వర!=సమస్తమునకు ప్రభువైనవాడా! సర్వాత్మక=విశ్వమంతయు వ్యాపించినవాడా! శర్వ!=హింసించువాడా! సదాశివ!=ఎల్లపుడు శుభమును కలుగజేయువాడా! మహేశ!=మహాదేవా! శాశ్వత!=నిత్యమైనవాడా! రుద్రా=తీక్ష్ణమైనవాడా! సర్వజ్ఞ!=అంతయు తెలిసినవాడా! భీమనాయక!=శ్రీ భీమేశ్వరా! గర్వ+అంధులన్=గర్వముచే గ్రుడ్డివారైన; త్రిపుర=మూడు పురములలోని; కర్బుర పతులన్=రాక్షస నాయకులను; అణఁపు=నశింపజేయుము.

భావము :- ఓ భీమేశ్వరా! సమస్తమునకు ప్రభువైనవాడవు. అంతట నిండియున్నవాడవు. రుద్రుడవు. శర్వుడవు. ఆ త్రిపురాసురులు గర్వాంధులు. వారిని నాశము చేయుము.

సీ॥ ప్రణతార్తిహర! దేవ! పరమేశ! దక్షవా
టాధీశ! యభవ! మా కభయమిమ్ము
మంత్రోపనిషదర్థ! మన్మథాంతక! గంధ
సింధురాసుర వైరి! సేమ మిమ్ము
భక్తవత్సల! శూల పాణి! దక్షిణవార్ధి
వేలాతటీవాస! విజయమిమ్ము
సంసార మాయానుషంగ శాశ్వత తమ
స్స్కంధ మార్తాండ! యైశ్వర్యమిమ్ము

తే॥ సద్య! రక్షింపు వామదేవాద్య! ప్రోవు
జయజయాఘోర! తత్పురుష జయమొసఁగు
భద్రమీశాన! సేయుము ప్రబలులై న
త్రిపుర దైత్యుల గర్వంబు ధిక్కరింపు. 118

అర్థము :- ప్రణత=నమస్కరించినవారి; ఆర్తి=కీడును; హర=నశింపజేయు; దేవ!=స్వామీ! పరమేశ!=మహాదేవా! దక్షవాట=దక్షారామమునకు; అధీశ!=చక్రవర్తివైనవాడా! అభవ!=పుట్టుకలేనివాడా! మాకు=మాకు; అభయము+ఇమ్ము=రక్షణనిమ్ము;

మంత్ర=వేదములచేత; ఉపనిషత్=వేదాంతములచేత; అర్థ=తెలియతగినవాడా! మన్మథ+అంతక=మన్మథుని చంపినవాడా! గంధ సింధురాసుర=మదగజరూపుడైన గజాసురునకు; వైరి=శత్రువైనవాడా! సేమము+ఇమ్ము=మేలు కలిగింపుము;

భక్తవత్సల!=భక్తులయందు కనికరము కలవాడా! శూలపాణి!=శూలమును చేత ధరించినవాడా! దక్షిణవార్ధి=దక్షిణ సముద్రము యొక్క; వేలా=చెలియలికట్ట యొక్క; తటీ=ఒడ్డునందు; వాస=నివాసమున్నవాడా! విజయము+ఇమ్ము=గెలుపు ప్రసాదింపుము;

సంసారమాయా=సంసారమనెడు మాయతో; అనుషంగ=కూడిన; శాశ్వత తమస్=స్థిరమైన చీకటి యొక్క; స్కంధ=సమూహమునకు; మార్తాండ=సూర్యుడవైనవాడా! ఐశ్వర్యము+ఇమ్ము=ఈశ్వరత్వమును ప్రసాదింపుము;

సద్య=సద్యోజాతమను ముఖము కలవాడా! రక్షింపు=కాపాడుము; వామదేవ=వామదేవమను ముఖముకలవాడా! ఆద్య=మూలరూపమైనవాడా! ప్రోవు=కావుము. జయజయ=జయము జయము; అఘోర=అఘోరమను ముఖము కలవాడా! తత్పురుష=తత్పురుషమను ముఖము కలవాడా! జయము+ఒసఁగు=గెలుపునిమ్ము; ఈశాన=ఈశానమను ముఖము కలవాడా! భద్రము+చేయుము=క్షేమమును కల్గింపుము; ప్రబలులైన=మిక్కిలిగ చెలరేగుచున్నవారైన; త్రిపురదైత్యుల=త్రిపురాసురుల యొక్క; గర్వంబు=మదమును; ధిక్కరింపు=ఎదిరింపుము.

భావము :- ఓ మహాదేవా! శ్రీ భీమేశ్వరా! నిన్ను శరణుకోరిన వారి బాధలను తొలగింపగలవు. వేదములచేత వేదాంగములచేత, నిన్ను తెలిసికొందురు. మన్మథుని దహించినవాడవు. గజాసురాది రాక్షసుల గర్వమునణచినవాడవు. సంసారమాయతో కూడిన శాశ్వతమైన చీకటిని పారద్రోలగల సూర్యుడవు నీవు. పంచముఖుడవు. నీకు సాధ్యము కానిది లేదు. మదాంధులు, గర్వాంధులునైన ఆ త్రిపురాసురుల బారినుండి మమ్ము రక్షింపుము.

విశేషము :- పంచవదనములు (4-85) చెంత వచ్చినవి.

శా॥ త్రైలోక్యంబు భుజాప్రతాపమున నిర్వక్రంబుగా నేలుచున్
హేలాహుంకృతిఁ గామగ త్రినగరీ హృద్యప్రచారంబులన్
వాలాయంబున మమ్ము వెట్టిగొనుచున్ వర్తించుచున్నారు, మీ
రాలస్యం బొనరించినం బ్రతుక శక్యంబెట్లు మాబోంట్లకున్? 119

అర్థము :- త్రైలోక్యంబున్=మూడు లోకముల మొత్తమును; భుజా=భుజముల యొక్క;ప్రతాపమునన్=బలిమిచే; నిర్వక్రంబుగాన్=అడ్డులేకుండ; ఏలుచున్=పాలించుచు; హేలాహుంకృతిన్=విలాసమగు హుంకారముతో; కామగ=కామగమనముగల; త్రినగరీ=మూడు పురములందు; హృద్య=ఇంపైన; ప్రచారంబులన్=సంచారములతో; వాలాయంబున= నిర్బంధముతో; మమ్ము=మమ్ములను; వెట్టిగొనుచున్=కూలిఈయక చాకిరి చేయించుకొనుచు; వర్తించుచున్నారు=ప్రవర్తించుచున్నారు; మీరు=మీరు; ఆలస్యంబు+ఒనరించినన్= జాగుచేసినచో; మాబోంట్లకున్=మావంటివారికి; ఎట్లు=ఏవిధముగ; బ్రతుకన్=జీవించుట; శక్యంబు=సాధ్యము.

భావము :- ఓ భీమేశ్వర స్వామీ! ఆ త్రిపురాసురులు తమ భుజ బలముతో ముల్లోకములను శాసించుచున్నారు. మామీద దండెత్తుట, మమ్ములను హింసించుట వారికి ఆటయైనది. గర్వము దానికి తోడైనది. కామగమనముగల తమ త్రిపురము లలో వినోద సంచారములు చేయుచున్నారు. మమ్ము నిర్బంధించి వెట్టిచాకిరి చేయించు కొనుచున్నారు. నీవు సర్వజ్ఞుడవు. రక్షకుడవు. నీవు వారిని శిక్షించుట ఆలస్యము చేసినచో మావంటివారు బ్రదుకుట కష్టము.

కం॥ లోకంబులు త్రిపురాసురు
లేకచ్ఛత్రంబు గాఁగ నేలఁగ నున్నా
రో కాలకంఠ! యింకిటు
మా కాపులు గావు ధర్మమార్గము దలఁగెన్ 120

అర్థము :- ఓ కాలకంఠ=నల్లని గొంతుక గల ఓ శంకరా! లోకంబులు=లోకములను; త్రిపురాసురులు=త్రిపురములందలి రాక్షసులు; ఏకచ్ఛత్రంబుగాఁగన్=ఒకే గొడుగు క్రిందకు తెచ్చినట్లుగా; ఏలఁగన్=పరిపాలించుటకు; ఉన్నారు=సిద్ధమగుచున్నారు; ధర్మమార్గము= యోగ్యమైన ధర్మపద్ధతి; తలఁగెన్=మాయమైనది; ఇంక=ఇటుపైన; ఇటు=ఈరీతిగా; మాకాపులు=మా వశములు; కావు=కావు.

భావము :- ఓ శంకరా! ఆ త్రిపురాసురులు లోకములను ఏకచ్ఛత్రముగ పరిపాలించు టకు సిద్ధముగ నున్నారు. ధర్మమార్గము మాయమైనది. వారి అక్రమములే అంతట ప్రబలినవి. ఇట్లు నీవు మిన్నకున్నచో లోకములు మా అధీనమున నుండవు. నీవు త్రిపురాసుర సంహారము జాగుచేసినచో లోకములందు ధర్మము నడిపించుట మావల్లకాదు.

మ॥ అభయం బిందు కళాకిరీట! శివదా! యామ్నాయ చూడామణీ!
యిభరాట్చర్మ పటీ కటీర! యభవా! యీశాన! మొఱ్ఱో! గిరి
ప్రభవా మానస పద్మ పద్మహిత! యబ్రహ్మణ్య మాలింపు మా
కభిమానచ్యుతి పాటిలెం ద్రిపురదైత్య గ్రామణీ శ్రేణిచేన్. 121

అర్థము :- ఇందుకళా కిరీట=చంద్రకళను కిరీటముగ కలవాడా! శివదా= శుభముల నిచ్చువాడా! ఆమ్నాయ=వేదములకు; చూడామణీ=శిరోరత్నమైనవాడా!; ఇభ....కటీర. ఇభరాట్=గజరాజు యొక్క; చర్మ=తోలే; పటీ=వస్త్రముగ గల; కటీర=మొల కలవాడా! అభవా= పుట్టుకలేనివాడా! ఈశాన=ఈశానమను ముఖము కలవాడా! ఓ గిరి.... పద్మహిత! ఓ గిరి ప్రభవా=హిమవంతుని పుత్రికయైన పార్వతి యొక్క; మానస=మనసనెడి; పద్మ=తామర పూవునకు; పద్మహిత=సూర్యుడవైనవాడా! మాకు=మాకు; త్రిపుర=త్రిపురము లందలి; దైత్య గ్రామణీ=రాక్షసనాయకుల; శ్రేణిచేన్=సమూహము చేత; అభిమాన= ఆత్మగౌరవము యొక్క; చ్యుతి=నాశము; పాటిలెన్=కల్గినది; మొఱ్ఱ=మొరపెట్టుచున్నాము; అబ్రహ్మణ్యము= మొరలను; ఆలింపుము=వినుము; అభయంబు= రక్షించుము.

భావము :- ఓ చంద్రశేఖరా! శుభములు కూర్చువాడా!. వేదములకు శిరోరత్నమైనవాడా! గజచర్మధారీ! అభవా!. ఈశానా!. పార్వతీ మనోహరా!. మా మొరలాల కింపుము. ఆ త్రిపురాసుర నాయకులవలన మా ఆత్మాభిమానములు నశించినవి. మా కభయమిమ్ము. మమ్ములను రక్షింపుము.

కం॥ కరుణింపు దక్షవాటీ
పురనాయక! భీమలింగ! భోగికులేంద్రా
భరణ! విష దహన భయమును
బురదనుజ భయంబు సరియ భువనంబులకున్." 122

అర్థము :- దక్షవాటీపురనాయక!=దక్షారామమునకు అధిపతివైనవాడా! భీమలింగ=శ్రీ భీమేశ్వరా! భోగికుల+ఇంద్ర=సర్పవంశమునకు నాయకుడైన వాసుకి; ఆభరణ=భూషణముగ

కలవాడా! భువనంబులకున్=లోకములకు; విషదహన=విషమనెడి అగ్నివలన కలుగు భయమును=భయమును; పురదనుజ=త్రిపురాసురుల వలన; భయంబు=భీతియు; సరియ= సమానమే యగును; కరుణింపుము=దయతో చూడుము.

భావము :- ఓ దక్షారామ భీమేశ్వరా! సర్పభూషణా! రక్షింపుము. లోకములకు హాలాహల విషము వలన ఎంతటి భయమో త్రిపురాసురుల వలనను అంతటి ప్రమాదము. ఆ హాలాహలమును సంహరించిన నీవే త్రిపురాసుర సంహారమును చేయతగును."

## ఈశ్వరుఁడు త్రిపురాసురుల నిర్జించుట

వ॥ అని యీ ప్రకారంబున బ్రహ్మ విష్ణువులు పురందర పురోగములగు బృందారకుల తోడంగూడి యభినందించినం బరమానందంబునుంబొంది యబ్భువనగోప్త సప్తపాతాళ భువన గర్భగోళంబునందుండి యావిర్భవంబునొందిన దివ్య స్వయం భూజ్యోతిర్లింగమూర్తి భీమేశ్వరుండు నిర్వికల్పంబును నిరస్తసమస్తోపాధికంబునునైన నిష్కళంక స్వరూపంబు విడిచి, యారకూట పాటలంబై కుసుంభచ్ఛాయ నగు జటాపటలంబును, బాండుర పుండరీకముకుళ డుండుభంబులను శంకనంకు రింప జేయంజాలు బ్రహ్మకపాల మాల్యంబును, జిఱునవ్వు జిగిమెఱుంగిడిన చెక్కుటద్దం బుల నీడంజూచు నిద్దంపు నాగకుండలంబులును, గ్రొత్తయఱసంజకెంజాయ రంజిలు కాఱు మొగులు కైవడిఁజిలుప చిలుపని నెత్తురుల జొత్తిల్లిన పచ్చి యేనిక తోలు పచ్చడంబును, కంఠోత్కంఠ భువన భవన రక్షణ దాక్షిణ్య లక్షణ కస్తూరికా లేపన నైపథ్యంబునుంబోని కాలకూట విషమషీకంఠంబును, సాయాహ్న సమయ సంఫుల్ల మల్లికా కుసుమ సముల్లాసంబు నుల్లసంబాడు తెల్లని మేనును, మొఱకుదనంబున నేతెంచిన కఱకు చెఱకువిల్తుని జూఱఁబుచ్చినదై చిగురు తేలన నుప్పతిల్లుచు మినుకు మినుకుమను నులివేడి చూపు వలనఁగోపాటోపావార్యహవ్య వాహనాడంబరంబగు లలాటలోచన జ్వాలనంబు ప్రజ్వలించి నికట జటాటవీవాటంబు నాస్ఫోటించునోయని యవధరించిన చందంబున నందంబగు మందాకినీ సలిలపూర సంభరింతమైన శాతకుంభ కుంభంబునుంబోని కిరీట కటాహంబును, జంద్ర ఖండంబులు మూఁగిన భంగి నంగీకరించిన యకించిన శశాంక రేఖాలంకారంబును, జెంగలువ తెక్కడాలుఁ జక్కనేలిన కేలి యంగుటంబునం జవమత్ఝరపుటంబుల

మోపి నింగికి నెగయ నంజచాఁచు లీలాకురంగ శాబకంబును, గనుపట్టు సర్వకళా రూపంబు ధరియించి సర్వమంగళా కుచ కలశ లేపనా నైపుణ్య కుంకుమాంగ రాగవాసనాసనాథంబును, గరళకూట పావకోత్పత్తి నిరస్త మణికుల ప్రశస్తంబునునైన శ్రీహస్తంబు విస్తరించి యభయంబు ప్రసాదించి సజల జలధర ధ్వాన గంభీరోదారంబైన కంఠస్వనంబున నిట్లని యానతిచ్చె. 123

అర్థము :- అని=అని; ఈ ప్రకారంబున=ఈ విధముగ; బ్రహ్మ విష్ణువులు= బ్రహ్మ దేవుడు; విష్ణువు; పురందర=ఇంద్రుడు; పురోగములు+అగు=ముందుగ గలవారైన; బృందారకుల తోడన్=దేవతలతో; కూడి=కలసి; అభినందించినన్=స్తుతింపఁగా; పరమ+ ఆనందంబునున్=మిక్కిలి సంతోషమును; పొంది=పొంది; ఆ+భువనగోప్త=భువనములను కాపాడు ఆ శంకరుడు; సప్త=ఏడైన; పాతాళ భువన=అధోలోకముల; గర్భ గోళంబు నందుండి=లోపలి భాగము నుండి; ఆవిర్భవంబునొందిన=పుట్టిన; దివ్య=దివ్యమైన; స్వయంభూ=స్వయముగ పుట్టిన; జ్యోతిర్లింగమూర్తి=జ్యోతిర్లింగాకారముగల; భీమేశ్వరుండు=శ్రీ భీమేశ్వరస్వామి; నిర్వికల్పంబును=అఖండమైనదియు; నిరస్త=నిరాకరింపబడిన; సమస్త= అన్నియగు; ఉపాధికంబునున్=కారణములు కలదియు; ఐన=అయినటువంటి; నిష్కళంక= మలినము లేని; స్వరూపంబు=ఆకారమును; విడిచి=వదలి; ఆరకూట పాటలంబై=ఇత్తడి వలె తెలుపు మించిన ఎరుపుతో; కుసుంభ=కుంకుమ పూవు యొక్క; ఛాయన్=రంగును; నగు=నవ్వునట్టి; జటాపటలంబునున్=జడల సమూహమును; పాండుర=తెలుపు మించిన పసుపు వర్ణముతో; పుండరీక=తెల్లని పొడలతో; ముకుళ=ముడుచుకొని యున్న; డుండుభం బులు+అను=రెండు తలల పాములాయను; శంకన్=అనుమానమును; అంకురింపన్+ చేయఁజాలు=కల్గింప చాలియున్న; బ్రహ్మకపాల=బ్రహ్మదేవుని పుర్రెతోడి; మాల్యంబును= దండయును; చిఱునవ్వు=లేత నవ్వు యొక్క; జిగిన్=ప్రకాశముతో; మెఱుంగిడిన=మెఱుగు పెట్టిన; చెక్కు+అద్దంబుల=అద్దముల వంటి బుగ్గలయందు; నీడన్=పాపను (ప్రతిబింబ మును); చూచు=చూచుచున్న; నిద్దంపు=నున్నని; నాగకుండలంబులును=పాము పోగులును; క్రొత్త=క్రొత్తదైన; అఱసంజ=సగము సంధ్యాకాలమందలి; కెంపు+చాయన్=ఎఱ్ఱని రంగుతో; రంజిలు=ప్రకాశించు; కాఱు మొగులు కైవడిన్=దట్టమైన మేఘమువలె; చిలువ చిలుపని=కొంచెము కొంచెముగా; నెత్తురుల= నెత్తురుతో; జొత్తిల్లిన=తడిసిన; పచ్చి=పచ్చిదైన; ఏనిక తోలు=ఏనుగు యొక్క తోలు; పచ్చడంబును=కట్టు వస్త్రమును; కంఠ+ఉత్కంఠ=గొంతు సమీపమున; భువన..... నైపథ్యంబును. భువన భవన రక్షణ=లోకములను గోళములను రక్షించుట యందలి; దాక్షిణ్య=దయకు; లక్షణ=చిహ్నమైన; కస్తూరికా=కస్తూరి యొక్క;

లేపన=మైపూతయను; నైపథ్యంబునున్=అలంకారమును; పోని=పోలిన; కాలకూట విష=కాల కూటమనెడి విషపు; మషీ=మచ్చగల; కంఠంబును=కుత్తుకయు; సాయా..... సముల్లాసంబు. సాయాహ్న సమయ=సాయంకాల సమయమున; సంపుల్ల=చక్కగ వికసించిన; మల్లికా కుసుమ=మల్లెపూవుల; సముల్లాసంబున్=చక్కని వికాసమును; ఉల్లసంబాడు=అపహసించు; తెల్లని మేనును=తెల్లని శరీరమును; మొఱకున్+తనంబునన్=మూర్ఖతచేత; ఏతెంచిన=వచ్చిన; కఱకు=ఉద్ధతిగల; చెఱకు విల్తునిన్= మన్మథుని; చూఱఁబుచ్చినది+ఐ=నశింపజేసినదై; చిగురు జేలు+అనన్=జేల చెట్టు చిగురాకు అనునట్లు; ఉప్పతిల్లుచు=అతిశయించుచు; మినుకు మినుకు+అను=మెరయు; నులివేడి=గోరువెచ్చని; చూపు వలనన్=చూపుల వలన; కోపా.....డంబరంబు. కోప=కోపము యొక్క; ఆటోప=విరివితో; అవార్య=నివారింపరాని; హవ్య వాహన=అగ్ని యొక్క; ఆడంబరంబు+అగు=దర్పము కలదైన; లలాటలోచన=ఫాలనేత్రము యొక్క; జ్వలనంబు=మంట; ప్రజ్వలించి=చెలరేగి; నికట.....వాటంబున్. నికట=సమీపము నందలి; జటా+అటవీ=జడల సమూహమనెడి అడవి; వాటంబున్=ప్రదేశమును; ఆస్ఫోటించునో+అని=చఱచునా అన్నట్లు; అవధరించిన=తలంచిన; చందంబునన్= విధముగ; అందంబు+అగు=అందమైన; మందా.....భరితంబైన. మందాకినీ= ఆకాశగంగ యొక్క; సలిలపూర=నీటి ప్రవాహముతో; సంభరితంబు+ఐన=నిండినదైన; శాతకుంభ= బంగారు; కుంభంబునున్=కుండను; పోని=పోలిన; కిరీట కటాహంబునున్=గంగాళము వంటి కిరీటమగు జటాజూటము; చంద్ర ఖండంబులు=కర్పూరపు పలుకులు; మూఁగిన భంగిన్= కలసిన విధమును; అంగీకరించిన=స్వీకరించిన; అకించన=చిక్కిన; శశాంకరేఖ= చంద్రరేఖ యను; అలంకారంబునున్=ఆభరణమును; చెంగలువ=ఎఱ్ఱ కలువ పూవు యొక్క; తెక్కడా లున్=రేకు యొక్క కాంతిని; చక్కన్+ఏలిన=పూర్తిగ జయించిన; కేలి=చేతి; అంగుటంబు నన్=బొటన వ్రేలియందు; జవమత్=వేగముగల; ఖురపుటంబుల=గిట్టల అంచులను; మోపి=ఆనించి; నింగికిన్+ఎగయన్=ఆకాశమునకెగురుటకై; అంజచాఁచు=అంగ చాచుచున్న; లీలా=క్రీడ కొరకగు; కురంగ శాబకంబునున్=లేడి పిల్లయును; కనుపట్టు=కనిపించు; సర్వకళారూపంబు=సమస్తమైన శరీరాంశా విశేషములతోడి రూపమును; ధరియించి=పొంది; సర్వ.....సనాథంబును. సర్వమంగళా=పార్వతీదేవి యొక్క; కుచకలశ=కలశముల వంటి కుచములందు; లేపనా=పూయుట యందలి; నైపుణ్యా=నేర్పరితనముగల; కుంకుమ= కుంకుమ పూవు; అంగరాగ=మైపూతల యొక్క; వాసనా=పరిమళముతో; సనాథంబును= కూడుకొని యున్నదియు; గరళ.....ప్రశస్తంబును. గరళకూట=కాలకూట విషము యొక్క; పావక+ఉత్పత్తి=అగ్నియొక్క పుట్టుకను; నిరస్త=తొలగించిన; మణికుల ప్రశస్తంబు నున్=మణికట్టు ముందుభాగమై (అరచేయియై) ప్రసిద్ధి చెందినదియు; ఐన=అయినటువంటి;

శ్రీహస్తంబు=వన్నెగల చేతిని; విస్తరించి= వెడల్పు చేసి; అభయంబు=భయము లేదను భావమును; ప్రసాదించి=ఇచ్చి; సజల=నీటితో నిండిన; జలధర=మేఘము యొక్క; ధ్వాన=శబ్దమువలె; గంభీర+ఉదారంబు=గాంభీర్యముతో గొప్పదగు; కంఠస్వనంబునన్= కంఠస్వరముతో; ఇట్లు+అని=ఈ విధముగ; ఆనతి+ఇచ్చెన్= ఆజ్ఞాపించెను.

భావము :- ఈ విధముగ బ్రహ్మ విష్ణు మహేంద్రాది దేవతలందరు శ్రీ భీమేశ్వరుని స్తుతించిరి. ఆయన ప్రసన్నుడై పాతాళలోక గర్భగోళము నుండి అవతరించిన దివ్య స్వయంభూ జ్యోతిర్లింగ రూపమును విడిచి స్వస్వరూపముతో సాక్షాత్కరించినాడు. ఇత్తడివలె తెలుపు మించిన ఎరుపుతో కుంకుమ పూవు రంగును పరిహసించు జడల సమూహము, పాండుర వర్ణముతో తెల్లపొడలతో ముడుచుకొనియున్న రెండు తలల పాములాయను భ్రాంతిని కల్గించు బ్రహ్మకపాలమాల, చిఱునవ్వులకు మెఱుగుపెట్టు నున్నని బుగ్గలపై ప్రతిబింబమును చూచుకొను నాగకుండలములు, సగము సంధ్యాకాలమందలి ఎఱ్ఱని కాంతితో ప్రకాశించు కారుమేఘము వంటి కొంచెము కొంచెము నెత్తురుతో తడిసిన పచ్చి ఏనుగు తోలు వస్త్రము, గొంతుక సమీపమున లోకములను రక్షించుట యందలి దయకు చిహ్నమైన కస్తూరి మైపూత పోలిన కాలకూట విషము వలననైన మచ్చ, సాయం సమయమున బాగుగా విరిసిన మల్లెపూవుల కాంతిని మించిన తెల్లని శరీరము, మూర్ఖముగ వచ్చిన మన్మథుని దహించినదై తేల చిగురాకువలె మిక్కిలిగ మెరయుచు నులివేడి చూపు వలన నివారింపరాని నొసటి కంటి మంట యొక్క ప్రజ్వలనము, అది సమీపమందలి జడల సమూహమను అడవిని దహించునాయని భావించి సిద్ధముగనున్న ఆకాశగంగా ప్రవాహములతో నిండిన గంగాళము వంటి కిరీటమైన జటాజూటము, కర్పూరపు పలుకుల కూడికవలె చిక్కిన చంద్రరేఖా లంకారము, ఎఱ్ఱ కలువ పూరేకు కాంతిని మించిన చేతి బొటన వ్రేలిపై గిట్టల నానించి ఆకాశమున కెగురుటకై అంగ చాచిన క్రీడాకురంగ శాబకముతో, సర్వకళా స్వరూపుడై గోచరించినాడు. పార్వతీదేవి యొక్క కుండల వంటి కుచములపై లేపన ద్రవ్యమును పూయుట యందు నైపుణ్యముగల్గి ఎఱ్ఱని కుంకుమ మైపూత యొక్క పరిమళముతో కూడియున్నదియు, కాలకూట విషమును బంధించినదియునైన అరచేతిని చాచి వెడల్పుచేసి అభయముద్రనిచ్చి - నీటితో నిండిన మేఘము యొక్క శబ్దమువలె గంభీరముతో గొప్పదైన కంఠస్వరముతో ఈవిధముగ పల్కెను.

మ॥ "అరవిందాసన తార్క్ష్య వాహన సహస్రాక్షాది బృందారకుల్
చిరకాలంబును బడ్డపాట్లు మదిలోఁ జింతించు చున్నాఁడ ని
ర్భర దర్పోద్ధతులం బురాసురుల నే భంజించెదన్ మీరునుం
బరిపాటిన్ ననుఁగొల్చి రండు సమర ప్రారంభ సన్నద్ధులై. 124

అర్థము :- అరవింద+ఆసన=పద్మమే ఆసనముగ కలవాడును (బ్రహ్మ); తార్క్ష్య=గరుత్మంతుడు; వాహన=వాహనముగ కలవాడు(విష్ణువు); సహస్ర+అక్ష=వేయి కన్నులు కలవాడు(ఇంద్రుడు); ఆది=మొదలయిన; బృందారకుల్=దేవతలు; చిరకాలంబునున్=చాలకాలము; పడ్డ=పడిన; పాట్లు=కష్టములు; మదిలోన్=మనసులో; చింతించుచున్నాఁడన్=స్మరించుచున్నాను; నిర్భర=భరింపరాని; దర్ప=పొగరుచే; ఉద్ధతులన్=గర్వించినవారైన; పురాసురులన్=త్రిపురాసురులను; ఏన్=నేను; భంజించెదన్=చంపెదను; మీరునున్=మీరుకూడ; పరిపాటిన్=వరుసగ; సమర=యుద్ధమును; ప్రారంభ= ప్రారంభించుటకు; సన్నద్ధులై=సిద్ధపడినవారై; ననున్=నన్ను; కొల్చి=సేవించి; రండు=రండి.

భావము :- "బ్రహ్మ విష్ణు మహేంద్రాది దేవతా ప్రముఖులారా! మీరు చాలకాలము నుండి అనుభవించిన బాధలను స్మరించితిని. ఆ త్రిపురాసురులు సహింపరాని విధముగ పొగరుతో చెలరేగిరి. నేను వారిని తప్పక సంహరించెదను. మీరు కూడ యుద్ధ సన్నద్ధులై నాతో రండు.

ఆ॥ అని ముహూర్త మాత్ర మద్దేవతా చక్ర
వర్తి దక్షవాటి వల్లభుండు
మనమునందుఁదలఁచె మదనాంధకారాతి
శత్రునగర విజయ సాధనంబు. 125

అర్థము :- అని=అని చెప్పి; ఆ+దేవతా చక్రవర్తి=దేవతలకు సార్వభౌముడైనట్టియు; దక్షవాటి వల్లభుండు=దక్షారామమునకు అధిపతియైనట్టియు; మదన=మన్మథునకు; అంధక=అంధకుడను రాక్షసునకు; అరాతి=శత్రువైన శ్రీ భీమేశ్వరస్వామి; మనమునందున్=మనసులో; ముహూర్త మాత్రము=క్షణకాలము; శత్రునగర=శత్రువుల యొక్క త్రిపురములను; విజయ=జయించుటకు; సాధనంబు=పనిముట్లను; తలఁచెన్=భావించెను.

భావము:- మన్మథుని, అంధకాసురుని సంహరించినవాడు, దేవతా సార్వభౌముడునైన దక్షారామ భీమేశ్వరస్వామి త్రిపురాసురులను సంహరింతునని దేవతలకు మాట యిచ్చినాడు. శత్రునిలయములైన త్రిపురములను జయించు సాధనములకై ఒక్క క్షణమాలోచించినాడు.

వ॥ అనంతరంబ తదభిజ్ఞాన ప్రభావ మహామహిమంబునఁ దదాజ్ఞాతి శయంబున. 126

అర్థము :- అనంతరంబ=తరువాత; తత్+అభిజ్ఞాన=ఆ పరమేశ్వరుని స్మరణము యొక్క; ప్రభావ=సామర్థ్యము యొక్క; మహిమంబునన్=మహత్త్వముచేత; తత్=ఆ శంకరుని; ఆజ్ఞా=ఆనతి యొక్క; అతిశయంబున=ఆధిక్యము చేత.

భావము :- తరువాత ఆ శంకరుని స్మరణ సామర్థ్య మహిమచేతను, ఆ రుద్రుని ఆజ్ఞమేరకును -

సీ॥ జలరాశి మేఖలా వలయంబు రథమయ్యెఁ;
రవియుఁజందురుఁడుఁ జక్రంబులైరి;
శారదా జీవితేశ్వరుఁడు సారథియయ్యెఁ;
శ్రుతులు నాలుగును వారువములయ్యెఁ
బ్రణవమంత్రైకాక్షరము ప్రతోదంబయ్యెఁ;
దారకావీథిపతాకయయ్యెఁ;
రత్నసాను ధరాధరము ధనుర్లతయయ్యెఁ;
నాగప్రధానుండు నారి యయ్యెఁ;
తే॥ గంధ వాహంబులేడును గఱులు గాఁగ
విలయ కాలానలజ్వాల ములికి గాఁగ
లచ్చి చనుదోయి కుంకుమ బచ్చనయుగఁ
బాలమున్నీటి యల్లుండు బాణమయ్యె. 127

అర్థము :- జలరాశి=సముద్రము; మేఖలావలయంబు=గుండ్రని ఒడ్డాణముగ గల భూమి; రథము+అయ్యెఁ=రథమైనది; రవియున్=సూర్యుడును; చందురుఁడున్= చంద్రుడును; చక్రంబులు+ఐరి=రథమునకు చక్రములుగనయిరి.

శారదా=సరస్వతి యొక్క; జీవిత+ఈశ్వరుఁడు=భర్తయైన బ్రహ్మదేవుడు; సారథి+ అయ్యెఁ=రథమును నడపువాడయ్యెను; శ్రుతులు నాలుగును=నాలుగు వేదములును; వారువములు+అయ్యెన్=గుఱ్ఱములయ్యెను;

ప్రణవ మంత్ర=ప్రణవమనెడి మంత్రమునందలి; ఏకాక్షరము=ఒకే అక్షరమైన "ఓమ్" కారము; ప్రతోదంబు+అయ్యెన్=మునికోలయైనది; తారకావీథి=ఆకాశము; పతాక+అయ్యెన్= జండాయైనది;

రత్నసాను=మేరువనెడి; ధరాధరము=కొండ; ధనుస్+లత+అయ్యెన్=తీగవంటి విల్లు అయినది; నాగ ప్రధానుండు=సర్పరాజైన ఆదిశేషుడు; నారి+అయ్యెన్=అల్లెత్రాడయ్యెను;

గంధవాహంబులు+ఏడును=వాయువులేడును; గఱులున్+కాఁగన్=బాణపు ఱెక్కలు కాగా; విలయకాల=ప్రళయకాలమునందలి; అగ్నిజ్వాల=నిప్పు యొక్క మంట; ములికి+కాఁగ =బాణపు మొనకాగా; లచ్చి=లక్ష్మీదేవి యొక్క; చనుదోయి=చనుల జంట యందలి;

కుంకుమ=గంధలేపనము; పచ్చనయుగన్=పసుపు రంగుకాగా; పాలమున్నీటి=పాల సముద్రము యొక్క; అల్లుండు=అల్లుడైన విష్ణువు; బాణము+అయ్యెన్= అమ్ముగనయ్యెను.

భావము :- భూమండలమే రథమైనది. సూర్యచంద్రులు రథచక్రములైరి. బ్రహ్మ దేవుడు రథసారథియయ్యెను. నాల్గువేదములు గుఱ్ఱములైనవి. ఓంకారమే చెన్నకోలయైనది. ఆకాశము జండాయైనది. మేరు పర్వతమే ధనుస్సయినది. ఆదిశేషుడు వింటినారియయ్యెను. వాయువులేడును బాణపు ఱెక్కలైనవి. ప్రళయాగ్నిజ్వాల బాణపు మొనయైనది. లక్ష్మీదేవి కుచములపైని పరిమళ గంధ లేపనము పచ్చని రంగుగనై శ్రీ మహావిష్ణువు బాణముగ నయ్యెను.

విశేషము :- గంధవాహంబులేడును :- సప్తవాయువులు 3-48 చెంత చెప్పబడినవి.

లింగపురాణమున 72వ అధ్యాయములోని త్రిపుర దాహోపక్రమమున "రుద్రరథ నిర్మాణ వర్ణనము" అను విషయమున కియ్యది సంగ్రహరూపము.

ఈ సందర్భమున ఒక విశిష్టమైన శ్లోకము కలదు.

"ఏకంద్వాదశధాచ, షోడశ పరంచక్రం, ససూతోరథః
ప్రత్యేకం నవధా, హయాశ్చ బహుధా, భిన్నోరథీ చాష్టధా,
కించైకాదశధా, శరశ్చదశధా, ద్వేధాధను, ర్దృక్త్రిధా,
మౌర్వీమూర్ధ్ని సహస్రధా, తదపియోజేతా సపాయాచ్ఛివః"

త్రిపురాసుర సంహారమునందు ఒక చక్రము 12 విధములైనటువంటిది. (సూర్యుడు-ద్వాదశాదిత్యులు.); మరియొక చక్రము పదునారు రీతులు. (చంద్రుడు - పదునారు కళలతో నుండువాడు.); సూతుడు తొమ్మిది విధములు. బ్రహ్మ - (నవ బ్రహ్మలు); రథము తొమ్మిది విధములు (భూమి-నవఖండ మండితము); గుఱ్ఱములు పలురీతులు (అనంతావైవేదాః - వేదములు అనంతములు); రథికుడు ఎనిమిది రూపములు కలవాడు (పంచభూతములు; సూర్యచంద్రులు; యజమానుడు - అను అష్టమూర్తి శంకరుడు, ఇంకను అనేక రూపములు కలవాడు - ఏకాదశరుద్రులు); బాణము పది ఆకృతులు కలది (విష్ణువు-దశావతారములు); ధనుస్సు రెండు విధములైన రూపములు కలది (మేరుపర్వతము - పర్వతరూపము, దైవరూపము); చూపు మూడు విధములు (ముక్కంటి-సూర్యచంద్ర అగ్నులు); అల్లెత్రాడు శిరస్సున వేయి విధములు (ఆదిశేషుడు-వేయిపడగలు కలవాడు); ఇట్లు పలురీతులైనను త్రిపుర విజయుడగు శివుడు మిమ్ము రక్షించుగాక అని పై శ్లోక భావము.

**వ॥ ఇవ్విధంబున సకల సాధనంబులు సన్నిహితంబులైన క్షణంబ దక్షారామంబున నయనాభిరాముండు భీమేశ్వరుండు త్రిపుర విజయార్థంబు దివ్యస్యందనం బెక్కెనప్పుడు.** **128**

అర్థము :- ఈ+విధంబున=ఈవిధముగ; సకలసాధనంబులు=అన్ని ఉపకరణములును; సన్నిహితంబులు+ఐన=సిద్ధములయిన; క్షణంబ=వెంటనే; దక్షారామంబున=దక్షారామ నగరమున; నయన+అభిరాముండు=కనులకు సంతోషమును కల్గించు రూపము కలవాడైన; భీమేశ్వరుండు=శ్రీ భీమేశ్వరస్వామి; త్రిపుర=మూడుపురములను; విజయార్థంబు=జయించుట కొరకై; దివ్యస్యందనంబు=తేజోమయమైన రథమును; ఎక్కెన్=అధిరోహించెను; అప్పుడు=ఆ సమయమున.

భావము :- ఈవిధముగ సర్వ సాధనములు సమకూరగనే దక్షారామ శ్రీ భీమేశ్వరస్వామి త్రిపురములను జయించుటకై దివ్యరథము నధిరోహించెను. అపుడు.

సీ॥ సరి బ్రాహ్మి మొదలైన సప్తమాతృకలు ద
  న్గూడ సేసలు చల్లె గోఁగులమ్మ
పసిఁడి వేత్రము పట్టి పాతాళ భైరవుం
  డందంద సందడి నపనయించె
దివ్యదుందుభినాద దీర్ఘ గర్జితముతోఁ
  గురిసె మిన్నున నుండి కుసుమ వృష్టి
జయజయ ధ్వని దేవ సంయమీశ్వర కోటి
  సంఘటించెఁ గరాంబుజంబు నొసలఁ

తే॥ త్రిపుర సంహార మొనరింప దీక్షసేసి
భీమనాథేశ్వరేశ్వర స్వామి శివుఁడు
దక్షవాటీ విభుఁడు మేరు ధనువుపట్టి
యేచి పంటవలంతి తేరెక్కునపుడు. 129

అర్థము :- దక్షవాటీ విభుఁడు=దక్షారామమునకు అధిపతియైన, భీమనాథేశ్వరేశ్వర స్వామి=శ్రీ భీమేశ్వరస్వామియైన; శివుఁడు=శంకరుడు; త్రిపుర= త్రిపురాసురులను; సంహారము+ఒనరింప=చంపివేయుటకు; దీక్షన్+చేసి=పట్టుపట్టి; మేరు=మేరు పర్వతమనెడి; ధనువు=విల్లును; పట్టి=ధరించి; ఏచి=చెలరేగి; పంట వలంతి=భూదేవియను; తేరు= రథమును; ఎక్కునప్పుడు=ఎక్కబోవు సమయమున;

సరి=సాటియైన; బ్రాహ్మి=బ్రాహ్మీమాత; మొదలైన=మొదలగు; సప్తమాతృకలు= ఏడుగురు దేవమాతలు; తన్+కూడ=తన్ను కూడిరాగా; గోఁగులమ్మ=గోగులమ్మ అను గ్రామ దేవత; సేసలు చల్లె=అక్షతలు చల్లెను;

పాతాళభైరవుండు=పాతాళభైరవుడను నగర రక్షకుడు; పసిఁడివేత్రము=బంగరు దండమును; పట్టి=ధరించి; అందంద=అక్కడక్కడ; సందడిన్=జనసమ్మర్ధమును; అపనయించెన్=తొలగించెను;

మిన్నున నుండి=ఆకాశము నుండి; దివ్య=దేవతల; దుందుభినాద=భేరీల శబ్దముల యొక్క; దీర్ఘ గర్జితముతోన్=నిడుపైన మ్రోతలతో; కుసుమ వృష్టి=పూలవాన; కురిసెన్= కురిసెను;

దేవ=దేవతల; సంయమీశ్వర=మునీశ్వరుల; కోటి=సమూహము; జయజయధ్వనిన్= జయజయ నినాదములతో; కర+అంబుజంబు=పద్మము వంటి చేతులను; నొసలన్= ఫాలభాగమున; సంఘటించెన్=చేర్చెను;

భావము :- శ్రీ భీమేశ్వరస్వామి త్రిపురాసురులను చంపుటకై పట్టుపట్టినాడు. మేరు పర్వతమనెడి ధనుస్సును ధరించినాడు. భూదేవి అనెడి రథమును అధిరోహించుచున్నాడు. అపుడు యోగ్యలైన సప్తమాతృకలు వెంటరాగా గ్రామదేవత గోఁగులమ్మ శంకరునిపై అక్షతలు చల్లినది. పాతాళభైరవుడు బంగారు దండమును పట్టి ఊపుచు అక్కడక్కడనున్న జన సందోహములను తొలగించెను. ఆకాశము నుండి దేవదుందుభులు ఇంపైన నాదములు చేయుచున్నవి. పూలవాన కురిసినది. దేవతలు మునులు జయ జయ ధ్వనులు పల్కుచు చేతులు జోడించి నమస్కరించిరి.

విశేషము :- సప్తమాతృకలు :- 1-88 చెంత చెప్పబడినవి.

గోఁగులమ్మ :- దక్షారామనగరమునకు పడమటి దిక్కునగల గ్రామదేవత. ఈమె దుర్గాదేవి అవతారమని ప్రసిద్ధి భీమ. 1-99.

పాతాళభైరవుఁడు :- దక్షారామములోని భైరవుని పేరు.

సీ॥ కమ్మి నూకిన నూత్న కలధౌతమునుఁబోలెఁ
జక్కంగ నిక్కి మైసొక్కుమానె
నంతరాంతరములందస్థిబృందంబులు
ఫెళఫెళ మనియెడు గిలుకు లెసఁగెఁ
బగిలి బీటలు వాఱి తగడెత్తెఁ గుబుసంబు
తోరంపు వెల్లుల్లి తునకలట్ల
మహనీయతర ఫణామండలంబులు లేఁత
చిగురుటాకుల చాయ జేగురించె

తే॥ హాటకాద్రి ధనుర్దండ కూటకోటి
వంచి బాహావలేపదుర్వార లీలఁ
గాలకంఠుండు త్రిపుర సంక్షయమొనర్ప
నెక్కువెట్టిన యపుడు భోగీశ్వరుండు. 130

అర్థము :- కాలకంఠుండు=శంకరుడు; త్రిపుర=త్రిపురములను; సంక్షయము=మిక్కిలి నాశము; ఒనర్పన్=చేయుటకు; హాటక.....కోటి. హాటక+అద్రి=మేరు పర్వతమనెడి; ధనుస్+దండ=దండము వంటి ధనుస్సు యొక్క; కూటకోటి=శిఖరముల అంచులను; వంచి=వంగునట్లు చేసి; బాహా=భుజముల; అవలేప=బలిమిచేత; దుర్వారలీలన్= నివారింపరాని విధముగా; ఎక్కుపెట్టిన యపుడు=అల్లెత్రాటిని తగిలించునపుడు; భోగి+ఈశ్వరుండు= సర్పరాజైన ఆదిశేషుడు;

కమ్మినూకిన=అచ్చున పెట్టి సాగుటకులాగిన; నూత్న=క్రొత్త; కలధౌతమునున్+ పోలెన్=బంగారమువలె; చక్కంగ=వంకర లేకుండ; నిక్కి=వర్ధిల్లి; మైసొక్కు=శరీరపు మత్తును; మానెన్=పోగొట్టుకొనెను;

అంతర+అంతరములందు=లోలోపలి; అస్థి=ఎముకల; బృందంబులు= సమూహములు; పెళపెళ+అనియెడు=పెళపెళమను; గిలుకులు=శబ్దములు; ఎసఁగెన్=అతిశయించెను;

కుబుసంబు=కుబుసము; తోరంపు=సాంద్రమైన; వెల్లుల్లి=వెల్లుల్లి పాయల; తునుకల+అట్లు=ముక్కలవలె; పగిలి=చిట్లి; బీటలు+పారి=బద్దలు బద్దలుగనై; తగదెత్తెన్=పొరలు పొరలుగ లేచెను;

మహనీయతర=మిక్కిలి గొప్ప; ఫణా=పడగల; మండలంబులు=ప్రదేశములు; లేఁత=లేతవైన; చిగురు+ఆకులు=చిగురాకుల; చాయన్=వలె; జేగురించెన్=ఎఱ్ఱబడెను.

భావము :- పరమేశ్వరుడు త్రిపురాసుర సంహారము చేయుటకు దుర్వారమగు బాహు గర్వముతో మేరుపర్వతమను ధనుస్సును వంచి ఆ ధనుస్సు కొప్పునకు ఆదిశేషుడను అల్లెత్రాటిని తగిలించెను. అపుడు ఆదిశేషుడు అచ్చునపెట్టి సాగదీసిన బంగారపు తీగవలె ప్రకాశించెను. అతని శరీరము మెలికలు లేకుండసాగినది. దానిపై మురికిపోయి మత్తు వదలినది. లోలోపలి ఎముకలు పెళపెళమన్నవి. కుబుసము పగిలి బద్దలు బద్దలై వెల్లుల్లి పొట్టువలె లేచినది. గొప్ప గొప్ప పడగలు చిగురు టాకులవలె ఎఱ్ఱబడినవి.

విశేషము :- అలంకారము - ఉపమ.

కం॥ ముక్కంటి మేరుచాపం
బెక్కిడి సారించెఁ బన్నగేంద్రగుణంబున్
మక్కువ హిమగిరికన్యక
క్రిక్కిరిసిన కుచము లలము కేలుందమ్మిన్. 131

అర్థము :- ముక్కంటి=త్రినేత్రుడైన శంకరుడు; హిమగిరి=హిమవంతుని; కన్యక=కుమారియైన పార్వతి యొక్క; క్రిక్కిరిసిన=ఎడము లేక వ్యాపించిన; కుచములు=చన్నులను; అలము=అదుమునట్టి; కేలున్+తమ్మిన్=పద్మము వంటి చేతితో; మేరుచాపంబు=మేరు పర్వతమనెడి ధనుస్సును; పన్నగ+ఇంద్ర=నాగరాజైన ఆదిశేషుడనెడి; గుణంబున్=అల్లెత్రాటితో; ఎక్కిడి=ఎక్కుపెట్టి; సారించెన్=లాగెను.

భావము :- ముక్కంటియైన శంకరుడు పార్వతీదేవి చన్నులను అదిమెడి పద్మము వంటి చేతితో మేరుపర్వతమనెడి ధనుస్సును వంచి, ఆదిశేషుడను అల్లెత్రాటిని సాగదీసి, వింటికి తగిలించి సారించెను.

కం॥ తాటించి నిటల నయనుఁడు
హాటకగిరి చాపవల్లి నహి శింజిని నా
స్ఫోటించెఁదత్కఠోర మ
హాటంకృతి కమలజాండ మటఁ బగులంగన్. 132

అర్థము :- నిటలనయనుఁడు=నొసటి కన్నుగల శంకరుడు; హాటకగిరి=మేరు పర్వతమనెడి; చాపవల్లిన్=తీగవంటి ధనుస్సునందలి; అహి=సర్పమైన ఆదిశేషుడనెడి; శింజినిన్=నారితో; తత్+కఠోర=ఆ భీకరమైన; మహాటంకృతి=గొప్పటంకారము; కమలజ+అండము=బ్రహ్మాండము; అటన్=ఆ సమయమున; పగులంగన్=పగులునా అన్నట్లుగ; తాటించి=మ్రోగించి; ఆస్ఫోటించెన్=చఱచెను (లాగివదిలెను).

భావము :- ఫాలనేత్రుడైన శంకరుడు మేరుపర్వతమనెడి ధనుస్సును చేతబట్టి ఆదిశేషుడను అల్లెత్రాటిని సంధించినాడు. అల్లెత్రాటిని సారించి వదలినాడు. అపుడు భీకరమైన శబ్దమైనది. ఆ ధ్వని బ్రహ్మాండము బద్దలగునట్లున్నది.

మ॥ గిరిశస్థూల భుజాపరీత విభవ క్రీడా సమాస్ఫాలిత
స్థిర బాణాసన గూఢపాద్గుణలతా దీర్ఘోగ్రఘోషంబునన్
ధరణీచక్రము దిర్దిరం దిరిగెఁ బాతాళంబు ఘూర్ణిల్లె నం
బరంబుం దిక్కులు వ్రయ్యలయ్యెఁ బగిలెం బ్రహ్మాండ భాండంబులున్. 133

అర్థము :- గిరిశ.....ఘోషంబున్. గిరిశ=శివుని; స్థూల=శక్తిమంతములైన; భుజా=భుజములందు; పరీత=ఆవరించియున్న; విభవ=పరాక్రమము యొక్క; క్రీడా=ఆటగా; సమాస్ఫాలిత=బాగుగా చరచబడిన; స్థిర=నిశ్చలమగు; బాణాసన=ధనుస్సునందలి; గూఢపాత్=సర్పమనెడి; గుణలతా=తీగవంటి నారియొక్క; దీర్ఘ=చాలదూరము వ్యాపించు; ఉగ్ర=భయంకరమైన; ఘోషంబునన్=పెద్దధ్వని చేత; ధరణీ చక్రము=భూ మండలము; దిర్దిరన్+తిరిగెన్=గిర గిర తిరిగినది; పాతాళంబు=పాతాళలోకము; ఘూర్ణిల్లెన్=తిరుగుడు పడినది; అంబరమున్=ఆకాశమును; దిక్కులు=దిక్కులన్నియును; వ్రయ్యలు+అయ్యెన్=చీలికలైనవి; బ్రహ్మాండ భాండంబులున్=భాండముల వంటి బ్రహ్మాండములు; పగిలెన్=పగిలెను.

భావము :- కైలాసవాసుడైన శంకరుని శక్తిమంతమైన భుజబల విలాసముచే నిశ్చలమైన మేరుపర్వతమనెడి వింటికి తగిలించిన ఆదిశేషుడనెడి అల్లెత్రాటిని సంధించి వదలగానైన పొడవైన భయంకరమైన టంకార శబ్దమునకు భూమండలము గిరగిర తిరిగినది. పాతాళలోకము తిరుగుడువడినది. ఆకాశము, దిక్కులు చీలికలైనవి. బ్రహ్మాండములు పగిలినవి.

కం॥ మృడుఁడు కనకాద్రి చాపము
గుడుసువడం దివియఁ గూడి కుశల ప్రశ్నం
బడిగిరి యొండొరులను గని
కడకొమ్ములనున్న యదితి కద్రువ తనయుల్. 134

అర్థము :- మృడుఁడు=శంకరుడు; కనక+అద్రి=మేరుపర్వతమనెడి; చాపము=ధనుస్సును; గుడుసు+పడన్=గుండ్రమగునట్లుగ; తివియన్=లాగగా; కడకొమ్ములనున్న=వింటి అంచులందున్న; అదితి=అదితి యొక్కయు; కద్రువ=కద్రువ యొక్కయు; తనయుల్=కుమారులు; కూడి=సమీపించి; ఒండొరులన్+కని=ఒకరినొకరు చూచి; కుశల ప్రశ్నంబు=క్షేమమా అని; అడిగిరి=ఒకరినొకరు అడిగిరి.

భావము :- శంకరుడు మేరు చాపమునకు బాణమును సంధించి బలముగ లాగెను. కుడిచేయి, అల్లెత్రాటి చివరలు; బాణపు వెనుక మొన శంకరుని చెవి వరకు వచ్చినవి. విల్లు యొక్క రెండు అంచులు ఆ చెవిని సమీపించినవి. అపుడు ఆదిశేషుడు విష్ణువు దగ్గరై కుశలమా అని ఒకరినొకరు ప్రశ్నించుకొనిరి.

**విశేషము** :- అదితి కశ్యపుల కుమారుడు వామనుడు. ఈయన విష్ణువు అవతారము. కద్రువ తనయులు సర్పములు. అదితి కుమారుడైన విష్ణుమూర్తి (బాణము) కద్రువ

కుమారుడైన ఆదిశేషుడు (అల్లెత్రాడు) పరస్పరము దగ్గరై కుశలమడిగికొనిరి. అదితి - దితి ఈ ఇరువురు కశ్యపుని భార్యలేగనుక విష్ణువు ఆదిశేషుడు అన్నదమ్ములు. విష్ణువు ఊర్ధ్వలోకవాసి, ఆదిశేషుడు పాతాళలోకవాసి - కనుక స్వర్గ పాతాళ వాసులైన అన్నదమ్ములు దగ్గరై కుశలములడిగికొనిరనియు సూచన.

కం॥ తెగనిండ ఫాలనయనుఁడు
నగచాపము దిగిచినపుడు నాగేంద్రుండ
బ్బిగువున మొగంబు లదరుటఁ
బొగలెగయఁగ విషము భుగులు భుగులునఁ గ్రక్కెన్. 135

అర్థము :- ఫాలనయనుఁడు=ఫాలనేత్రముగల శంకరుడు; తెగన్=అల్లెత్రాటిని; నిండన్=పరిపూర్ణముగ; నగచాపమున్=పర్వతమనెడి విల్లును; తిగిచినపుడు=లాగినపుడు; ఆ+ బిగువున=ఆ ఒత్తిడిచే; నాగ+ఇంద్రుండు=సర్పరాజైన శేషుడు; మొగంబులు=పడగలు, అదరుటన్=వణకుట చేత; పొగలు+ఎగయఁగన్=పొగలు లేచునట్లుగ; భుగులు భుగులునన్= భుగ భుగమని శబ్దములు చేయుచు; విషము=విషమును; క్రక్కెన్=కక్కెను.

భావము :- శంకరుడు అల్లెత్రాటిని బిగించి పట్టి ధనుస్సును గట్టిగ ఆకర్ణాంతముగ లాగినపుడు శేషుని తలలు అదరినవి. ఆ ఒత్తిడికి శేషుడు పడగలనుండి విషము క్రక్కినాడు. ఆ విషము (నల్లని పొగలు చిమ్ముచు) భుగ భుగమని శబ్దము చేయుచు బయల్పడినది.

కం॥ విషధర పరివృఢ నాసా
సుషిర వినిశ్వాస పవన ఘూత్కార రవ
ద్విష వహ్ని జ్వాలంబులు
వృషభధ్వజు చేతి కొండవింట జనించెన్. 136

అర్థము :- విష.....జ్వాలంబులు. విషధర=విషమును ధరించు సర్పములకు, పరివృఢ=నాయకుడైన శేషుని; నాసా సుషిర=ముక్కురంధ్రములందలి; వినిశ్వాస పవన=వదలిన గాలి (బుస) యొక్క; ఘూత్కార రవత్=ఘూత్కార శబ్దముతో కలసి; విషవహ్ని= విషమనెడి అగ్నియొక్క; జ్వాలంబులు=మంటలు; వృషభధ్వజు=వృషభమును ధ్వజముగ గల శంకరుని; చేతి=చేతనున్న; కొండ వింటన్=పర్వతమను విల్లునందు; జనించెన్=పుట్టెను.

భావము :- సర్పరాజైన శేషుని ముక్కురంధ్రముల నుండి వెలువడిన బుసల శబ్దము లతో విషాగ్ని జ్వాలలు శంకరుని చేతిలోని చాపము నుండి పుట్టినవి.

కం॥ శ్రీ కంఠ కఠిన భుజపరి
ఘాకృష్ట సువర్ణ గిరిశరాసన మౌర్వీ
కాకోదర ముఖ సంభవ
కాకోలానలము ముజ్జగము దరి కొనియెన్. 137

అర్థము :- శ్రీకంఠ=గరళకంఠుడైన శంకరుని; కఠిన=దృఢమైన; భుజ పరిఘ=ఇనుప గుదియ వంటి భుజముచేత; ఆకృష్ట=లాగబడిన; సువర్ణ గిరి=మేరు పర్వతమనెడి; శరాసన=చాపము యొక్క; మౌర్వీ=అల్లెత్రాడైన; కాకోదర=(ఉదరముతో కుటిలముగ నడచు) పాము యొక్క; ముఖ=నోటి నుండి; సంభవ=పుట్టిన; కాకోల+అనలము=కాకోలమనెడి అగ్ని; ముజ్జగము=మూడు లోకముల మొత్తమును; దరికొనియెన్=అంటుకొనెను.

భావము :- కాలకంఠుడైన శంకరుని ఇనుప గుదియల వంటి బలమైన చేతులతో లాగబడిన మేరుపర్వతమనెడి చాపమునకు అల్లెత్రాడైన శేషుని పడగల నుండి పుట్టిన కాకోలమనెడి అగ్ని ముల్లోకమును అంటుకొనినది.

క॥ కటకాముఖ హస్తంబున
నిటలాక్షుఁడు కొండవిల్లు నెవ్వడిఁ దివియన్
ఘటియిల్లె నురగరాజ
స్ఫుట హాలాహల కృపీటభవ కీలలటన్. 138

అర్థము :- నిటల+అక్షుఁడు=ఫాలనేత్రుడైన శంకరుడు; కటకాముఖ హస్తముతో= సర్పకంకణము ప్రముఖముగ గల చేతితో: కటకాముఖ హస్తంబున=కంకణమువలె గుండ్రగ చేసిన చేతిముద్రతో; కొండవిల్లు=మేరుపర్వతమను చాపమును; నెఱ+వడిన్=అతివేగముగ; తివియన్=లాగగా; ఉరగ.....కీలలటన్. ఉరగరాజ=సర్పరాజైన శేషుని; స్ఫుట=పడగల నుండి; హాలాహల=హాలాహలమనెడి; కృపీట భవ=(నీటి నుండి పుట్టిన) అగ్ని యొక్క; కీలలు= మంటలు; అటన్=ఆ సమయమున; ఘటియిల్లెన్=పుట్టినవి.

భావము :- శంకరుడు కటకాముఖ ముద్రతో చేతిని గుండ్రముగచేసి అల్లెత్రాటికి బాణమును సంధించి సారించినాడు. ఆ బిగువుకు శేషుడు పడగలనుండి హాలాహలమును కక్కినాడు. అది అగ్ని కీలలై పుట్టి వ్యాపించినది.

**విశేషము** :- కటకాముఖము :- ఇది హస్తాభినయ విశేషము.

"తర్జనీ మధ్యమా మధ్యే పుంఖోऽంగుష్ఠేన పీడ్యతే

యస్మిన్ననామికా యోగః స హస్తః కటకాముఖః" (శృంగార దీపిక - (సూ॥ని.)

ఉంగరపు వేలితో కలిపి చూపుడు నడిమి వ్రేళ్ళ మధ్యలో బాణపు పిడి నుంచి బొటన వ్రేలితో నొక్కిపట్టుట కటకాముఖము.

'పుష్ప మాలాధారణము, పగ్గము పట్టుట, ఛత్రధారణము, వ్యజన ధారణము, అద్దము పట్టుట, శరాకర్షణము, వస్త్రాంచల ఆకర్షణములలో కటకాముఖ హస్తాభినయ విశేషము వినియోగముననున్నది.' 'నృత్తరత్నావళి' - భా - 1 పు 124. శ్రీ జమ్ములమడక.

వ॥ ఇవ్విధంబున భీమనాథుండు త్రిపుర దహనారంభ సంరంభంబున శాతకుంభ కుంభినీధర కోదండం బుద్దండ భుజాదండ చండిమంబునఁ గుడుసు పడం దిగిచినఁ దత్సమాకృష్టి భారంబున భుజంగ పుంగవుండు వేయు పడగలను విషంబుఁ గ్రక్క దృక్కర్ణవదన నాసారంధ్ర సముదీర్ణ సంభవంబయిన యక్కాలకూట విషంబు కృపీటభవ జిహ్వాకలాపంబులు గ్రోయుచుఁ దోయధి మథనంబున సంభవించిన హాలాహలంబునుం బోలెఁ బ్రజ్వరిల్లి సముజ్జ్వల జ్వాలా జాలంబులఁ ద్రైలోక్యంబు నాక్రమింపం దొణంగినం దెగ యుడిపి, ఖట్వాంగపాణి యుత్తమాంగంబు జాడించి, గంగాంభః ప్రవాహనిర్ఝర వారి పూరంబులు చల్లియు, వామలోచన హిమధామ కిరణ వ్రాతంబులం బ్రోక్షించియు, నమ్మహోపద్రవం బుపశమింపంజేసి, దుర్గా సహాయుండును విష్ణురాజ ప్రసాదోపలబ్ధ సంభావితుండునునై విషమ లక్ష్యంబులయిన త్రిపురంబులు వీక్షించి, వెండియు నాది నారాయణునిం బురాణ పురుషునిఁ బురుషోత్తము ననాదినిధనుని బాణంబు చేసి యరింబోసి పాశుపతాస్త్ర సమంత్రకంబుగా నభిమంత్రించి యాకర్ణాంతంబుగాఁ దిగిచి లలాటేక్షణ జ్వాలా జాలంబు మునుముట్ట నిగిడించి బిట్టు హుంకరించి, యట్టహాసంబు చేసి యేసిన నమ్మహాస్త్రంబు. 139

అర్థము :- ఈ+విధంబున=ఈ ప్రకారముగ; భీమనాథుండు=శ్రీ భీమేశ్వరుడు; త్రిపుర .....సంరంభంబున. త్రిపుర=త్రిపురములను; దహన=కాల్చుట యందలి; ఆరంభ= ఉపక్రమము యొక్క; సంరంభంబున=వేగిరపాటుతో; శాత.....చండిమంబున. శాతకుంభ= బంగారు; కుంభినీధర=పర్వతమనెడి; కోదండంబు=విల్లును; ఉద్దండ=భయంకరమైన; భుజాదండ=దండముల వంటి భుజముల; చండిమంబునన్=వేడిమితో; గుడుసుపడన్= గుండ్రమగునట్లుగా; తిగిచినన్=సారింపగా; తత్+సమాకృష్టి=ఆయన బాగుగా లాగుట చేత; భుజంగ పుంగవుండు=సర్పశ్రేష్ఠుడైన శేషుడు; వేయు=వేయి; పడగలను=పడగల నుండి;

విషంబున్=విషమును; గ్రక్కన్=కక్కగా; దృక్కర్ణ.....అయిన. దృక్+కర్ణ=(చెవులే కన్నులుగ గల) పాము యొక్క; వదన=ముఖము నందలి; నాసారంధ్ర=ముక్కుపుటములనుండి; సముదీర్ణ=బాగుగా పైకిలేచి; సంభవంబయిన=పుట్టిన; ఆ+కాలకూట విషంబు=ఆ కాలకూట విషము యొక్క; కృపీటభవజిహ్వా=అగ్ని నాలుకల; కలాపంబులు=సమూహంబులు; గ్రోయుచున్=చాచుచు; తోయధి మథనంబున=సముద్రమును చిలుకుట వలన; సంభవించిన=పుట్టిన; హాలాహలంబునుంబోలె=హాలాహల విషమువలె; ప్రజ్వరిల్లి=మండి; సముజ్జ్వల=మిక్కిలి ప్రకాశించుచున్న; జ్వాలా=మంటల; జాలంబులన్=సమూహములచే; త్రైలోక్యంబును= మూడు లోకముల మొత్తమును; ఆక్రమింపన్=వ్యాపించుటకు; తొణంగినన్= పూనుకొనగా; తెగ=అల్లెత్రాటిని; ఉడిపి=ఆపి; ఖట్వాంగపాణి=ఖట్వాంగమను ఆయుధమును ధరించిన శంకరుడు; ఉత్తమాంగంబు=తలను; జాడించి=విదలించి; గంగా.....పూరంబులు. గంగ+అంభః=గంగానది నీటి; ప్రవాహ=ప్రవాహము యొక్క; నిర్ఝరవారి పూరంబులు= ఎడతెగని నీటి ధారలు; చల్లియు=చల్లియును; వామ.....ప్రోక్షించియు. వామలోచన=ఎడమ కన్ను అయిన; హిమధామ=చంద్రుని; కిరణ వ్రాతంబులన్=కిరణముల సమూహమును; ప్రోక్షించియు=చిలుకరించియు; ఆ+మహా+ఉపద్రవంబు=ఆ గొప్ప ఆపదను; ఉపశమింపం జేసి =శాంతింప జేసి; దుర్గా సహాయుండును=దుర్గాదేవి సహాయముగ కలవాడును; విఘ్న..... భావితుండును. విఘ్నరాజ=వినాయకుని; ప్రసాద+ఉపలబ్ధ=అనుగ్రహమును పొందుటచే; సంభావితుండునున్=బాగుగ సత్కరింపబడిన వాడును; ఐ=అయి; విషమ=ఎగుడుదిగుడు; లక్ష్యంబులు=గురికలవి; ఐన=ఐనటువంటి; త్రిపురంబులు= త్రిపురములను; వీక్షించి=చూచి; వెండియున్=మరియు; ఆదినారాయణునిన్=సృష్టికి మొదటి వాడైన శ్రీమన్నారాయణుని; పురాణ పురుషునిన్=ఆది పురుషుడైనట్టియు; పురుష+ ఉత్తముని= పురుషులలో శ్రేష్ఠుడైనట్టియు, అనాది నిధనుని=చావు పుట్టుకలు లేనట్టివాడగు విష్ణువును; బాణంబు చేసి=బాణముగ చేసి; అరింబోసి=ఎక్కుపెట్టి; పాశుపత+అస్త్ర=పాశుపతమనెడి అస్త్రమును; సమంత్రకంబుగా=మంత్రముతో కూడ; అభిమంత్రించి=పిలిచి(ఆవాహన చేసి); ఆ కర్ణాంతంబుగాన్=చెవుల వరకు వచ్చునట్లుగా; తిగిచి=సారించి; లలాట+ఈక్షణ=నొసటగల కన్ను నుండి; జ్వాలా జాలంబు=మంటల సమూహము; మునుముట్టన్=మొదలంట; నిగిడించి=వ్యాపింపజేసి; బిట్టు=బిగ్గరగా; హుంకరించి=గర్జించి; అట్టహాసంబు చేసి=పెద్దగ నవ్వుటను చేసి; ఏసినన్=ప్రయోగింపగా; ఆ+మహాస్త్రంబు=ఆ దివ్యాస్త్రము.

భావము :- ఈవిధముగ శ్రీ భీమేశ్వరుడు త్రిపురాసురులను చంపుటకు పూనెను. మేరుపర్వతమును విల్లుగ పూని ఆదిశేషుని వింటినారిగ బిగించి బలము కొద్ది వింటినారిని సారించెను. ఆ ధాటికి తట్టుకొనలేక శేషుడు తన పడగల నుండి హాలాహల విషమును

పూత్కరించెను. ఆ హాలాహల విషము అగ్నిజ్వాలలై ముల్లోకములను చుట్టుముట్టినవి. గంగాధరుడైన శంకరుడు తలను విదిలించి గంగా ప్రవాహములతోను, ఎడమ కన్నైన చంద్రుని కిరణముల చల్లదనమును ప్రసారముచేసియు ఆ విషాగ్ని కీలలను చల్లార్చి మహా ప్రమాదమును తప్పించెను. ఆ మహాదేవునకు దుర్గాదేవి సహాయముగనున్నది. వినాయకుని అనుగ్రహము లభించినది. ఎగుడు దిగుడులుగనున్న త్రిపురములవైపు శంకరుడు తీక్ష్ణముగ చూచినాడు. పురుషోత్తముడు, పురాణ పురుషుడు, అనాది నిధనుడు అయిన ఆదినారాయణుని బాణముగ చేసి వింటికి సంధించి పాశుపతాస్త్రమును మంత్రపూర్వకముగ ఆవాహన చేసినాడు. ఫాలనేత్రము నుండి అగ్నిజ్వాలలను మొదలంట పుట్టించినాడు. బిగ్గరగ గర్జించి అట్టహాసము చేసినాడు. ఆ కర్ణాంతము లాగి అస్త్రమును ప్రయోగించినాడు. అపుడా గొప్ప అస్త్రము.

సీ॥ కరపల్లవంబులు గబళించుఁ గబళించి
 ప్రబల నితంబ భారముల వ్రాలుఁ
జెక్కుటద్దములపైఁ జెరలాడుఁ జెరలాడి
 శ్రవణావతంస మంజరులు ముట్టు
వలి చన్నుఁగవలపైఁ బొలపాడుఁ బొలపాడి
 నాభిరంధ్రములపై నటన సేయు
వేణీభరములపై విహరించు విహరించి
 బింబాధరములపై బిత్తరించు

తే॥ నభవుకరముక్త నారాయణాస్త్రవహ్ని
కాముకుని కోమలాంత సంగంబు పగిదిఁ
దెగువ మీఱంగఁద్రిపుర దైతేయరాజ
సదన శుద్ధాంత భామినీ జనములందు. 140

అర్థము :- అభవు.....వహ్ని. అభవు=శంకరుని; కర=చేతి నుండి; ముక్త=విడువబడిన; నారాయణ+అస్త్ర=నారాయణుడను అస్త్రము యొక్క; వహ్ని=అగ్ని; తెగువ మీఱంగన్= సాహసము అతిశయింపగా; కాముకుని=రతియందు కోరిక గలవాని, కోమల+అంత= మార్దవము నశించిన; సంగంబు పగిదిన్=రతి వలె; త్రిపుర.....జనములందు. త్రిపుర=- త్రిపురము లందలి; దైతేయరాజ=రాక్షస నాయకుల; సదన=భవనములందలి; శుద్ధాంత భామినీ జనములందు=అంతఃపుర కాంతలయందు;

కరపల్లవంబులు=చిగురుల వంటి చేతులను; కబళించున్=గ్రహించును; కబళించి=గ్రహించి; ప్రబల=మిక్కిలి బలమైన; నితంబ భారములన్=బరువైన పిరుదులయందు; వ్రాలున్=పడును;

చెక్కు+అద్దములపైన్=అద్దముల వంటి బుగ్గలపైన; చెరలాడు=క్రీడించును; చెరలాడి=క్రీడించి; శ్రవణ=చెవులకు; అవతంస మంజరులన్=ఆభరణములైన పూగుత్తులను; ముట్టు=అలముకొనును;

వలి=గుండ్రని; చన్నుఁగవలపైన్=చనుజంటలపైన; పొలపాడున్=తిరుగును; పొలపాడి=తిరిగి; నాభిరంధ్రములపైన్=బొడ్డు బెజ్జములపైన; నటన+చేయు=నాట్యము చేయును;

వేణీభరములపై=బరువైన కొప్పులపైన; విహరించు=తిరుగును; విహరించి= తిరిగి; బింబ+అధరములపై=దొండపండు వంటి క్రింది పెదవులపైన; బిత్తరించున్= ప్రసరించును.

భావము :- శంకరుడు పాశుపతాస్త్రము నావాహన చేసి నారాయణాస్త్రమును సంధించి సారించి బలముగ విడిచినాడు. ఆ నారాయణాస్త్రము నుండి ప్రబలిన అగ్ని త్రిపురములందలి రాక్షస నాయకుల యొక్క అంతఃపుర కాంతలపాలిటి మన్మథాగ్నియైనది. కాముకుని రాక్షసరతివలె నైనది. తొలుత వారి బాహువుల నాక్రమించును. పిరుదులపై ఒరగును. చెంపలపై చెరలాడును. చెవులపై అలముకొనును. గుండ్రని చనుజంటలపై తిరుగును. బొడ్డులపై నాట్యము చేయును. కొప్పులపై విహరించును. అధరములపై అతిశయించును.

విశేషము :- అమరు శతకములోని శ్లోకభావమునకీ సీసపద్యము అన్యరూప కల్పనము. సంస్కృత స్రగ్ధర తెలుగులో సీసపద్య వైశాల్యమును సంతరించుకొన్నది.

"క్షిప్తోహస్తావలగ్నః ప్రసభ మభిహతో పాద్యదానోzం శు కాంతం
గృహ్ణన్ కేశేష్వపాస్త శ్చరణ నిపతితో నేక్షితః సంభ్రమేణ
ఆలింగన్యోzవధూత స్త్రిపుర యువతిభిః సాశ్రునేత్రోత్పలాభిః
కామీవార్ద్రాపరాధః స దహతు దురితం శాంభవో వశ్శరాగ్నిః" అమ - శ్లో-2

పరమేశ్వరుని బాణాగ్ని మీ పాపములను దహించుగాక. ఆ బాణాగ్ని అంతకు కొద్ది ముందుగనే ప్రియురాలికి విప్రియము చేసిన కాముకుని వలె కన్నీరు నిండిన కలువ కన్నులుగల త్రిపుర యువతుల చేతులందు తగుల్కొని విదల్పబడెను. చేలాంచలము లను బలాత్కరముగ గ్రహించుచు వారిచే కొట్టబడెను. కేశములను పట్టుకొనుచు చిమ్మబడెను. పాదములపై బడినను తొట్రుపాటుతో వారు చూడలేదు. కౌగిలింపగా వారు బాణాగ్నిని తిరస్కరించిరి.

అలంకారము - ఉపమ; సమము.

కం॥ లోహమయ దైత్య నగరీ
గేహంబులు హరశరాగ్ని కీలాజ్వాలా
దాహమునఁ గరఁగి మూఁడు స
మూహములై పెద్ద పెద్ద ముద్దలు నయ్యెన్. 141

అర్థము :- హర=శంకరుని; శర+అగ్ని కీలా=బాణము నుండి వెలువడిన అగ్ని శిఖల యొక్క; జ్వాలా=మంటల; దాహమునన్=దహనము చేత; లోహమయ=ఇనుము మొదలైన లోహములతో నిండిన; దైత్యనగరీ=రాక్షసుల యొక్క త్రిపురములందలి; గేహంబులు=భవనములు; కరఁగి=ద్రవముగనై; మూఁడు సమూహములై=మూడు గుంపులై; పెద్ద పెద్ద=పెద్ద పెద్దవైన; ముద్దలున్+అయ్యెన్=ముద్దలుగనైనవి.

భావము :- పరమేశ్వరుని బాణాగ్ని జ్వాలల దాహముచేత లోహమయములైన త్రిపురములందలి ఇండ్లన్నియు కరిగి మూడు పెద్దపెద్ద ముద్దలుగ అయ్యెను.

142

వ॥ అంత.

సీ॥ భస్మరేణువులయ్యెఁ బ్రాకార గోపుర
ప్రాసాద కుట్టిమ ప్రాంగణములు
మసి బూడిదయ్యె నిర్మల కేలి దీర్ఘికా
కమలినీ కహ్లార కైరవములు
దగ్ధమయ్యెను సమస్త ప్రశస్త మహాస
భాభ్యంతరాంతఃపురాంగణములు
ధూళయ్యె మారుతోద్ధూత పుష్పపరాగ
వాసనాదిశలగు వనచయములు

తే॥ కాలకంఠ భుజాదండ గర్భభార
కుండలీకృత మేరు కోదండ పరిధి
వలయ నిష్క్రాంత కైటభధ్వంసి బాణ
దహన సంధానమునఁ బురత్రయమునందు. 143

అర్థము :- కాల.....సంధానమున. కాలకంఠ=శంకరుని; భుజాదండ=దండము వంటి చేతి; గర్భభార=లోపలి శక్తిచేత; కుండలీకృత=గుండ్రమగునట్లు చేయబడిన; మేరుకోదండ= మేరు పర్వతమను చాపము యొక్క; పరిధి వలయ=గుండ్రని కాంతి వలయము నుండి;

నిష్క్రాంత=బయల్వెడలిన; కైటభ ధ్వంసి=కైటభుడను రాక్షసుని చంపిన శ్రీమన్నారాయణుడనెడి; బాణ=బాణము నందలి; దహన=అగ్నిని; సంధానమునన్=కూర్చుట చేత; పురత్రయము నందు=త్రిపురములయందు;

ప్రాకార.....ప్రాంగణములు; ప్రాకార=ప్రహరీగోడలు; గోపుర=నగరపు వాకిళ్ళు; ప్రాసాద=భవనములు; కుట్టిమ=అరుగులు; ప్రాంగణములు=ముంగిళ్ళును; భస్మరేణువులు+అయ్యెన్=బూడిద యందలి రేణువులైనవి;

నిర్మల....కైరవములు. నిర్మల=తెల్లని; కేలిదీర్ఘికా=విలాస సరస్సులలోని; కమలినీ=పద్మములు; కహ్లార=సౌగంధికములు; కైరవములు=తెల్లకలువలు; మసి బూడిదయ్యె=నల్లని బూడిదగనైనవి;

సమస్త.....అంగణములు. సమస్త=సకలమైన; ప్రశస్త=శ్రేష్ఠమైన; మహా=గొప్ప; సభా=సభా భవనములు; అభ్యంతర=లోపలి మందిరములు; అంతఃపుర=రాణివాస మందిరములు; అంగణములు=ముంగిళ్ళు; దగ్ధమయ్యెను=కాలిపోయెను;

మారుత.....దిశలగు. మారుత=గాలితో; ఉద్ధూత=చిమ్మబడిన; పుష్పపరాగ=పూలలోని పుప్పొడి యొక్క; వాసనా=సువాసనలతో కూడిన; దిశలు+అగు=దిక్కులు కలవియైన; వనచయములు=ఉద్యానవన సమూహములు; ధూళి+అయ్యెన్=దుమ్మైనవి.

భావము :- శంకరుడు త్రిపురములపై నారాయణాస్త్రమును ప్రయోగించెను. అది త్రిపురములలోని సర్వమును నాశము చేసినది. ప్రహరీ గోడలు, వాకిళ్ళు, భవనములు, అరుగులు, ముంగిళ్ళు బూడిద కుప్పలైనవి. విలాస సరస్సులలోని పద్మ వనములు, సౌగంధిక వనములు తెల్ల కలువ వనములు నల్లని బూడిదయైనవి. గొప్ప గొప్ప సభాభవనములు, ఆంతర మందిరములు, రాణివాస మందిరములు మాడిపోయినవి. ఉద్యాన వనములన్నియు కాలిపోయి దుమ్మైనవి.

కం॥ ఫాలేక్షణాస్త్ర వహ్ని
జ్వాలా జాలముల నసుర వర నగరంబుల్
కాలిన నప్పుడు కాలక
కాలాంతక లింగ మొకటి కడునొప్పారెన్. 144

అర్థము :- ఫాలేక్ష.....జాలములు. ఫాలేక్షణ=శంకరుని; అస్త్ర=మంత్రపూతమైన బాణము యొక్క; వహ్ని జ్వాలాజాలములన్=నిప్పు మంటల సమూహములచేత; అసురవర=రాక్షస శ్రేష్ఠుల యొక్క; నగరంబుల్=నగరములు; కాలినన్=దహనముకాగా;

అప్పుడు=ఆ సమయమున; కాల+అంతక=మృత్యువునకు మృత్యువైన శంకరుని; లింగము=లింగమూర్తి; ఒకటి=ఒకటి; కాలక=దహనము కాకుండ; కడున్+ఒప్పారెన్=మిక్కిలిగ ప్రకాశించెను.

భావము :- ముక్కంటి ప్రయోగించిన నారాయణాస్త్రము నుండి వెలువడిన అగ్నిజ్వాలల సమూహములచేత రాక్షస శ్రేష్ఠుల త్రిపురములు దహనమైనను, కాలాంతకుని లింగరూపమొకటి మాత్రము దహనము కాలేదు. మీదు మిక్కిలి అతిశయముగ ప్రకాశించుచుండెను.

విశేషము :- అలంకారము - అతద్గుణము.

తే॥ ఆది లింగోద్భవము నాఁటి యభవు భంగి
నింగి మోచిన యా శంభు లింగమూర్తి
భీమశర వహ్నిపురములఁ బ్రేల్చునపుడు
నగ్ని సెగదాఁక కేమియు నడలకుండె. 145

అర్థము :- ఆదిలింగ=మొదటి లింగమూర్తి యొక్క; ఉద్భవము నాఁటి=పుట్టినప్పటి; అభవ=శంకరుని; భంగి=వలె; నింగి=ఆకాశమును; మోచిన=అంటిన; ఆ+శంభు=ఆ శంకరుని; లింగమూర్తి=లింగాకారము; భీమ=భయంకరమైన; వర=శ్రేష్ఠమైన; వహ్ని=అగ్ని; పురములన్=త్రిపురములను; ప్రేల్చున్+అపుడు=కాల్చివేయునపుడు; అగ్ని=ఆ నిప్పు యొక్క; సెగ=వేడిమి; తాఁకక=అంటక; ఏమియున్=ఏ మాత్రమును; అడలక+ఉండెన్= చలింపకుండెను.

భావము :- ఆదిలింగమూర్తివలె ఆ కాలాంతక లింగము చాల పెద్దది. భయంకరమైన మంటలు త్రిపురములను కాల్చివేసినపుడు ఆ కాలాంతక లింగమునకు మంటల సెగ ఏమాత్రము సోకలేదు. చెక్కు చెదరలేదు.

విశేషము :- ఆదిలింగోద్భవము :- లింగపురాణము 17వ అధ్యాయమున కలదు.

బ్రహ్మ విష్ణువులు మాయామోహితులై ఆధిక్య విషయమై తగవులాడుకొనినపుడు వారి యెదుట జ్యోతిర్లింగమావిర్భవించెను. అది దశయోజన విస్తీర్ణము, శతయోజనాయతమునై యుండెను.

మ॥ అసురాధీశ సమర్పితంబులగు లీలారామ కల్పద్రుమ
ప్రసవంబుల్ కసుగందవయ్యె విలసత్పాటీర గోరోచనా
ఘుసృణాలేపన పంకిలాకలనమై గుంఫించె నారాయణా
స్త్రసముజ్జృంభణ భీమలింగమునకున్ దైతేయరాట్స్వామికిన్. 146

అర్థము :- నారా.....లింగమునకున్. నారాయణాస్త్ర=నారాయణాస్త్రము యొక్క; సముజ్జృంభణ=మిక్కిలి వ్యాప్తి చేత; దైతేయరాట్=రాక్షస నాయకుల; స్వామికిన్=దైవమగు; భీమలింగమునకున్=శ్రీ భీమేశ్వర లింగమునకు; అసురాధీశ=రాక్షస నాయకులచేత; సమర్పితంబులగు=బాగుగా అర్పింపబడినవైన; లీలా.....ప్రసవంబుల్. లీల+ఆరామ= ఉద్యానవనములందలి; కల్పద్రుమ=కల్పవృక్షముల యొక్క; ప్రసవంబుల్=పూవులు; కసుగందవయ్యేన్=వాడిపోలేదు; విలసత్.....కలనమై. విలసత్=వన్నెయైన; పాటీర= చందనము; గోరోచనా=గోరోజనము; ఘుసృణ=కుంకుమల; ఆలేపన=పూతల; పంకిల= బురదచేత; ఆకలన=అవగాహనము; మైన్=శరీరమునందు; గుంఫించెన్=కూర్చెను.

భావము :- నారాయణాస్త్రము యొక్క ప్రతాపమునకు రాక్షసనాయకుల ఇష్టదైవమైన కాలాంతక లింగము చెక్కు చెదరలేదు. రాక్షస నాయకులు ఆ శివలింగమునకు ఉద్యానవనములోని కల్పవృక్షము యొక్క పూలతో అలంకరించిరి. ఆ పూలు వసివాడలేదు. వన్నెయైన చందనము గోరోజనము కుంకుమల మిశ్రమును తడిపి శివలింగముపై పూత పూసిరి. అదియు సువాసనా భరితమై ప్రకాశించుచున్నదేకాని కసుగందలేదు.

**వ॥ ఇవ్విధంబున నున్నఁజూచి భీమేశ్వరుండు ఋక్సామ యజురథర్వణ వేద పారాయణ తురంగకంబును, రవి శశాంక రథాంగకంబును, కమలభవ సారథికంబును నగు విశ్వరథంబెక్కి భుజంగమరాజ శింజినీకంబయిన కాంచన ధరాధర ధనుర్దండంబును బుండరీకాక్ష బాణంబును సంధించి పురత్రయంబుల దహించి విజయలక్ష్మిఁబరిగ్రహించి విశ్వావసుప్రధాన నానాగంధర్వ జేగీయమాన భుజావ ధానుండై ప్రమోదాతి శయంబున. 147**

అర్థము :- ఈ+విధంబునన్+ఉన్నన్=ఈ రీతిగ ఉండగా; చూచి=చూచి; భీమేశ్వరుడు=శ్రీ భీమనాథుడు; ఋక్సా.....తురంగకంబును; ఋక్+సామ+యజుస్+ అథర్వణ+వేద=ఋగ్వేదము, సామవేదము, యజుర్వేదము, అథర్వణ వేదములే; పారాయణ=జారకుండగ కట్టబడిన; తురంగకంబును=గుఱ్ఱములుగ కలది; రవి+శశాంక= సూర్యుడు, చంద్రుడును, రథాంగకంబును=రథచక్రములుగ కలది; కమలభవ=బ్రహ్మదేవుడు; సారథికంబునున్=చోదకుడుగ కలది; అగు=అయిన; విశ్వరథంబు=భూమి అనెడి రథమును; ఎక్కి=అధిరోహించి; భుజంగమ రాజ=నాగరాజైన శేషుడు; శింజినీకంబు+అయిన= అల్లెత్రాడుగ గలదియైన; కాంచన ధరాధర=మేరుపర్వతమనెడి; ధనుస్+దండంబునున్= దండము వంటి చాపమును; పుండరీకాక్ష=విష్ణువనెడి; బాణంబును=బాణమును; సంధించి=మోపి; పురత్రయంబుల=త్రిపురములను; దహించి=కాల్చివేసి; విజయలక్ష్మిన్=

గెలుపు అను సంపదను; పరిగ్రహించి=చేపట్టి; విశ్వా.....అవధానుండై; విశ్వావసు=విశ్వావసుడు; ప్రధాన=మొదలైన; నానా=అనేకులైన; గంధర్వ=గంధర్వులచే; జేగీయమాన=మిక్కిలిగ కొనియాడబడిన; భుజ+అవధానుండై=బుజముల యొక్క కర్మ కలవాడై; ప్రమోద=మిక్కిలి సంతోషము యొక్క, అతిశయంబున=విరివిచే.

భావము :- శ్రీ భీమేశ్వరుడు భూమినే రథముగ చేసికొనెను. ఋక్సామ యజురథర్వణ వేదములు గుఱ్ఱములు. సూర్యచంద్రులు రథచక్రములు. బ్రహ్మదేవుడు రథసారథి. మేరు పర్వతము విల్లు. ఆదిశేషుడు వింటినారి. శ్రీ మహావిష్ణువు బాణము నైరి. శంకరుడు నారాయణాస్త్రమును సంధించి సారించి ప్రయోగించినాడు. త్రిపురములను నాశము చేసినాడు. విజయమును పొందినాడు. విశ్వావసుడు మొదలైన గంధర్వులు శంకరుని కీర్తించినారు. శంకరుడు మిక్కిలి సంతసించినాడు.

శా॥ ఆడెందాండవ మార్భటీ పటహ లీలాటోప విస్ఫూర్జిత
క్రీడాడంబర ముల్లసిల్ల గరళగ్రీవుండు జూటాటవీ
క్రోడాఘాటకరోటి కోటర కుటీ కోటీలుఠత్సింధు వీ
చీడోలా పటలీ పరిస్ఫుటతర స్ఫీత ధ్వని ప్రౌఢిమన్. 148

అర్థము :- గరళగ్రీవుండు=విషకంఠుడైన శివుడు; జూట.....ప్రౌఢిమన్. జూట= జటాజూటమను; అటవీ=అడవి యొక్క; క్రోడా=లోపలి భాగమునందు; ఘాట=మెడ వెనుక భాగమునందలి; కరోటి=మానవ కపాలములనెడి; కోటర=(చెట్టు) తొఱ్ఱలవలె; కుటీ=వంపుల యొక్క; కోటీ=అంచుల నుండి; లుఠత్=పొర్లుచున్న; సింధు=గంగానది యొక్క; వీచీ= తరంగములనెడి; డోలా=ఊయెలల; పటలీ=సమూహముతో; పరిస్ఫుటతర=నిండార విరిసిన; స్ఫీత=పెద్దదైన; ధ్వని ప్రౌఢిమన్=మ్రోత యొక్క గాంభీర్యముతో; ఆర్భటీ పటహ=పెద్దగా మ్రోగు తప్పెటల; లీలా+ఆటోప=విలాసమైన వ్యాప్తిగల; విస్ఫూర్జిత=గర్జనముల; క్రీడా+ఆడంబరము=క్రీడయందలి ఔద్ధత్యము; ఉల్లసిల్లన్=కలుగగా; తాండవము+ఆడెన్=తాండవ నృత్యము చేసెను.

భావము :- శివుడు మహాతాండవము చేయుచుండెను. శిరస్సుపై జటాజూటమను అడవిలోనున్న గంగ ఆ తాండవ వేగమునకు అటు నిటు కొట్టుకొనుచుండెను. శివుని మెడలోనున్న కపాల మాలికలు కదలుచు ధ్వనించుచుండెను. ఆ గంగా జలము ఎగిరి ఆ కాపాలములలో పడి ధ్వనించు చుండెను. ప్రమథులు బిగ్గరగ వాయించు తప్పెటలు సైతము పై మ్రోతలతో కలసి విశేష నూత్న ధ్వనిని వెలార్చుచుండెను.

విశేషము :- "ఘూట కరోటి కోటర కుటీ" :- అను సమాసము శ్రీనాథున కాశ్రయమిచ్చిన పెద కోమటి వేమారెడ్డి రచించిన "సాహిత్య చింతామణి"లోని ఈ శ్లోకము నందుండుట గమనార్హము.

"ఆటోపాయ నటన్మహానట జటాసంఘాట శృంగాటక
క్రీడాఘూట కరోటి కోటర కుటీ వాచాట వీచీ ఘటా
అస్తుస్వస్తటినీ విశంకిట తటీ వాటీ కవాటీ భవ
ల్లాటీ కోటి లలాట పాటల సటా పాటల్య పాటచ్చరీ"

ఇది గంగాస్తుతి. ఇందు పూర్వార్ధమున శివతాండవ ప్రసక్తి కలదు. గంగానది, ఆటోపముతో నటించుచున్న మహానటుని జటల సమూహము అను చతుష్పథము యొక్క తలమున ప్రతిబంధకమైన కపాలము యొక్క కోటరము అనెడి కుటీరమునందు మ్రోగుచున్న కెరటముల సముదాయము కలది - అని శ్లోక తాత్పర్యము.

వ॥ ఇట్లు త్రిపుర విజయానంతరంబునం గృతాంత దమనుండు వెండియు. 149

అర్థము :- ఇట్లు=ఈవిధముగ; త్రిపుర=త్రిపురముల; విజయ=గెలుపునకు; అనంతరంబునన్=తరువాత; కృతాంత దమనుండు=యముని బాధించినవాడైన శంకరుడు; వెండియు=మరియు.

భావము :- ఈవిధముగ కాలాంతకుడైన శంకరుడు త్రిపురములను నాశము చేసిన తరువాత ఇంకను.

చ॥ డమరుక డిండిమ ప్రకట ఠంకృతియుం గఠినాట్టహాస వి
భ్రమమును దాండవారభటి పాటవముం ఘటియిల్ల మాతృకా
సముదయ భూత భైరవ పిశాచ నిశాచర డాకినీ గణ
ప్రమథ సమూహముల్ వొగడ భర్గుఁడు సంతసమందె నెంతయున్. 150

అర్థము :- డమరుక.....ఠంకృతియున్. డమరుక=డమరువు యొక్క, డిండిమ=రాయడి గిరి అను వాద్య విశేషము యొక్క; ప్రకట=బయల్వెడలిన; ఠంకృతియున్= గట్టి ధ్వనియు; కఠిన.....విభ్రమమును. కఠిన=గట్టి; అట్టహాస=పెద్ద నవ్వు యొక్క; విభ్రమమును= ఉద్విగ్నతయు; తాండవ=తాండవ నృత్యములోని; ఆరభటి=ప్రౌఢరీతి యొక్క; పాటవము= సామర్థ్యము; ఘటియిల్ల=కలుగగా; మాతృకా.....సమూహముల్. మాతృకా సముదయ= మాతృకల యొక్క సమూహము; భూత=భూతములు; భైరవ=భైరవుల; పిశాచ=పిశాచముల; నిశాచర=రాక్షసుల; డాకినీ=గాలి దయ్యముల; గణ=సమూహములు; ప్రమథ సమూహముల్=

ప్రమథ గణములు; పొగడ=స్తుతింపగా; భర్గుఁడు=(పాపులనే వేధించువాడైన) శంకరుడు; ఎంతయున్=మిక్కిలిగ; సంతసము+అందెన్=సంతోషించెను.

భావము :- శంకరుడు అట్టహాసము చేసెను. తాండవము చేసెను. డమరుకము డిండిమములు మ్రోగినవి. అన్నింటి వలన భీకర నినాదములు పుట్టినవి. సప్తమాతృకలతో పాటు భూతములు, భైరవులు, రాక్షసులు గాలిదయ్యములు, ప్రమథ గణములు శంకరుని పొగడిరి. భర్గుడైన శివుడు సంతోషించెను.

వ॥ అనంతరం బా యంబికా వల్లభుండు జాంబూనదశైల కోదండం బెక్కుడించి యథాస్థానంబున నునిచి నారియగు పాపఱేనిని విశ్వంభరాభరణంబునకు నియోగించి క్షీరాంభోరాశి తూణీరంబున వైకుంఠ బాణంబు చేర్చి వేల్పుల వీడ్కొలిపి బ్రహ్మను సత్యలోకంబున కనిచి; వేదంబులం దన నిట్టూర్పు గాడ్పులలోనం గలిపి చంద్ర సూర్యులం గాలంబు గడప నియోగించి కృతకృత్యుండై త్రిపుర దైతేయుల కులదైవతంబయిన యద్దివ్యలింగంబును పంచబ్రహ్మ పంచాక్షరీ పంచతత్త్వ పంచభూతమయంబగుటఁజేసి పంచఖండంబులుగా ఖండించి కృష్ణవేణీ మహాతీరంబున ధరణాలకోటయను గ్రామంబున నమరేశ్వరుని చేతం బ్రతిష్ఠితంబగుటంజేసి యమర లింగంబునాఁ బ్రసిద్ధంబైన యమరారామంబును, గౌతమీ తీరంబున దక్షిణ కూలంబున గుణపూడియను గ్రామంబున సోముని చేతఁ బ్రతిష్ఠితంబు సేయంబడుటంజేసి సోమలింగంబన బ్రఖ్యాతంబైన సోమారామంబును బాలకోటయను గ్రామంబున శ్రీరామచంద్రునిచేఁ బ్రతిష్ఠితంబగుటంజేసి రామలింగంబునాఁ బ్రసిద్ధంబైన క్షీరారామంబును, జాళుక్యవంశ రాజధానియగు చాళుక్య భీమవరనామ గ్రామంబునఁ గుమారరత్నంబైన కుమారస్వామి చేతంబ్రతిష్ఠితంబగుటంజేసి కుమార భీమలింగంబనఁ బ్రఖ్యాతంబు నొందిన భీమారామంబును; మొదలి మామయగు దక్షప్రజాపతి యునికి పట్టైన యారామంబగుట దక్షారామంబున శివసన్నిధానంబై దానుండునట్టుగా నీ ప్రకారంబున భోగమోక్ష ప్రదంబులైన పంచారామంబులను బ్రతిష్ఠ నొందించి తానును దక్షావాటంబున మున్నీటి తటంబున విశుద్ధ స్ఫటిక సంకాశంబును ద్రిదశలోక భామినీ విలోకనచ్ఛాయాగుళుచ్ఛాచ్ఛ జ్యోత్స్నాభిషేక యుక్త యుక్తాంగంబగు శ్రీ భీమేశ్వర లింగంబునం దధివసించె నిది త్రిపుర విజయోపాఖ్యానంబు. దీని వినినను బఠించిన వ్రాసినఁబ్రశ్న చేసిన బోధించిన వారికి సకలపాతక నివర్తనంబై భుక్తి ముక్తులు గలుగును. సకల కళ్యాణకరంబనిన విని.

151

అర్థము :- అనంతరంబు=ఆ తరువాత; ఆ=ఆ; అంబికావల్లభుండు=పార్వతీదేవి యొక్క భర్తయైన శంకరుడు; జాంబూనదశైల=బంగారు పర్వతము (మేరువు) అను; కోదండంబు=విల్లును; ఎక్కుడించి=నారిని తొలగించి; యథాస్థానంబునన్=పూర్వమున్నచోట; ఉనిచి=ఉంచి; నారియగు=అల్లెత్రాడైన; పాపతేనిని=నాగనాయకుని (ఆదిశేషుని); విశ్వంభరా=భూమిని; భరణంబునకు=మోయుటకు; నియోగించి=పంపి; క్షీర+అంభోరాశి= పాలసముద్రమను; తూణీరంబునన్=అమ్ములపొదిలో; వైకుంఠ= శ్రీమహావిష్ణువను; బాణంబు=బాణమును; చేర్చి=పెట్టి; వేల్పులన్=దేవతలను; వీడ్కొలిపి=పంపించి; బ్రహ్మను= బ్రహ్మదేవుని; సత్యలోకంబునకు=బ్రహ్మలోకమునకు; అనిచి=పంపించి; వేదంబులన్= వేదములను; తన=తనయొక్క; నిట్టూర్పు గాడ్పులలోనన్=నిశ్వాస వాయువులలో; కలిపి=లీనముచేసి; చంద్ర సూర్యులన్=చంద్రుని సూర్యుని; కాలంబున్+కడపన్=కాలమును త్రిప్పుటకై; నియోగించి=పంపి; కృతకృత్యుండై=చేయబడిన పనికలవాడై; త్రిపుర దైతేయుల= త్రిపురాసురుల; కులదైవతంబు+అయిన=కులదైవమైన; ఆ+దివ్యలింగంబును=ఆ కాలాంతక లింగమును; పంచబ్రహ్మ=పంచబ్రహ్మ మంత్రమయము; పంచాక్షరీ=పంచాక్షరీ మంత్ర మయము; పంచతత్త్వ=పంచతత్త్వమయము; పంచభూతమయంబు=పంచభూతముల మయము; అగుటఁజేసి=అగుటవలన; పంచఖండంబులుగా=ఐదు భాగములుగ; ఖండించి=భాగించి; కృష్ణవేణీ=కృష్ణానది యొక్క; మహాతీరంబున=గొప్పతటము నందు; ధరణాలకోట+అను=ధరణాల కోట అనెడి; గ్రామంబునన్=పల్లెయందు; అమరేశ్వరుని చేతన్= దేవేంద్రునిచేత; ప్రతిష్ఠితంబు+అగుటంజేసి=ప్రతిష్ఠింపబడుటచే; అమరలింగంబు నాన్=అమరేశ్వరలింగమని; ప్రసిద్ధంబైన=ప్రఖ్యాతిపొందిన; అమరారామంబును= అమరారామ మును; గౌతమీ తీరంబున=గౌతమీ (గోదావరి) నది యొడ్డు నందలి; దక్షిణ కూలంబున=దక్షిణపు ఒడ్డున; గుణపూడి యను గ్రామంబునన్=గుణపూడి అను పల్లెలో; సోముని చేతన్=చంద్రుని చేత; ప్రతిష్ఠితంబు=స్థాపితము; చేయంబడుటంజేసి=చేయబడుట చేత; సోమలింగంబు+అనన్=సోమేశ్వర లింగమని, ప్రఖ్యాతంబు+ఐన=ప్రసిద్ధిని పొందిన, సోమారామంబును=సోమారామమనియు; పాలకోటయను=పాలకోట అనెడి; గ్రామంబునన్=ఊరిలో; శ్రీరామచంద్రునిచే=శ్రీరామచంద్రుని చేత; ప్రతిష్ఠితంబు+ అగుటంజేసి=స్థాపింపబడుట చేత, రామలింగంబునాన్=రామేశ్వర లింగమని; ప్రసిద్ధంబైన=ప్రసిద్ధిని పొందిన; క్షీరారామంబును=క్షీరారామమనియు; చాళుక్యవంశ=చాళుక్య వంశపు రాజుల; రాజధానియగు=రాజధానియైన; చాళుక్య భీమవరనామ=చాళుక్య భీమవరమను పేరుగల; గ్రామంబునన్= ఊరియందు; కుమారరత్నంబైన=కుమార శ్రేష్ఠుడైన; కుమారస్వామిచేతన్=కుమారస్వామిచేత, ప్రతిష్ఠితంబు+అగుటంజేసి=స్థాపింపబడుటచేత;

కుమార భీమలింగంబు+అనన్=కుమార భీమలింగమని; ప్రఖ్యాతంబున్+ఒందిన=ప్రసిద్ధిని పొందిన; భీమారామంబును= భీమారామమును; మొదలిమామయగు=మొదటిమామయైన; దక్షప్రజాపతి=దక్షప్రజాపతికి; ఉనికిపట్టు+ఐన=ఆస్థానమైన; ఆరామంబు+అగుట=ఉద్యానవన మగుటచేత; దక్షారామంబున=దక్షారామ నగరమున, శివసన్నిధానంబై=శివుని ఆశ్రయించి; తాన్=తాను (కాలాంతకుని ఐదవ భాగము); ఉండునట్లుగా=నెలవుండునట్లుగను; ఈ ప్రకారంబున=ఈ విధముగ, భోగమోక్ష=వైభోగమును ముక్తిని; ప్రదంబులు+ఐన=ఇచ్చునవైన; పంచారామంబులను=పంచారామములుగ, ప్రతిష్ఠన్+ఒందించి=స్థాపింపజేసి; తానును= తానుకూడ; దక్షావాటంబున=దక్షారామమున; మున్నీటి తటంబున=సముద్రపు ఒడ్డున; విశుద్ధ=మిక్కిలి శుభ్రమైన; స్ఫటిక=తెల్లని స్ఫటికమణితో; సంకాశంబునున్=సమానముగ ప్రకాశించునదియు; త్రిదశలోక=దేవలోకమునందలి; భామినీ=స్త్రీల; విలోకనచ్ఛాయా=చూపుల పంక్తి అనెడి; గుళుచ్ఛ=పూగుత్తుల; అచ్ఛ=తెల్లని; జ్యోత్స్నా=వెన్నెల యొక్క; అభిషేక= అభిషేకముతో; యుక్త=కూడిన; యుక్త=తగినట్టి; అంగంబు+అగు=శరీరము కలదైన; శ్రీ భీమేశ్వర లింగంబు నందు=శ్రీ భీమనాథ లింగరూపము నందు; అధివసించెన్=నివసించెను; ఇది=ఇది; త్రిపుర విజయ=త్రిపురములను జయించుట అనెడి; ఉపాఖ్యానంబు=అవాంతర కథ; దీని=ఈ కథను; వినినను=విన్నను; పఠించిన=చదివినను; వ్రాసినన్=రచించినను; ప్రశ్నచేసినన్= చర్చించినను; బోధించిన=చెప్పిన; వారికిన్=అటువంటివారికి; సకల పాతక=అన్ని పాపములు; నివర్తనంబై=పోవుటయై; భుక్తి ముక్తులు=భోగ మోక్షములు; కలుగును=కలుగును; కళ్యాణకరంబు=అన్ని శుభములను కూర్చునట్టిది; అనినవిని=అని చెప్పగావిని.

భావము :- తరువాత శంకరుడు మేరుపర్వతమను విల్లు నుండి అల్లెత్రాడైన ఆదిశేషుని వేరుచేసినాడు. మేరుపర్వతమును యథాస్థానమున పెట్టినాడు. ఆదిశేషుని భూమిని భరించుటకు పంపినాడు. నారాయణుడను అస్త్రమును పాలసముద్రము అను అమ్ములపొదిలోనికి చేర్చినాడు. దేవతలను వారివారి నివాసములకు పంపినాడు. బ్రహ్మదేవుని సత్యలోకమునకు పంపినాడు. వేదములను తన నిట్టూర్పు గాలులలో కలిపినాడు. సూర్య చంద్రులను కాలగమనమునకు పంపినాడు. త్రిపురాసురుల కులదైవమైన ఆ కాలాంతక లింగము పంచబ్రహ్మ పంచాక్షరీ మంత్రములతోను పంచతత్త్వ పంచభూతములతోను కూడియున్నది గనుక దానిని ఐదు భాగములుగ విభజించినాడు. అందొక భాగమును దేవేంద్రుడు కృష్ణానదీ తీరమున ధరణికోటయను గ్రామమున ప్రతిష్ఠించినాడు. ఆ లింగము అమరేశ్వర లింగముగ, ఆ గ్రామము అమరారామముగ ప్రసిద్ధినందినవి. మరొక భాగమును

గోదావరీనది దక్షిణ తీరమున గుణపూడి అను గ్రామమున చంద్రుడు స్థాపించినాడు. ఆ లింగము సోమేశ్వర లింగముగ ఆ గ్రామము సోమారామముగ ప్రసిద్ధిని పొందినవి. మరొక భాగమును పాలకోట యను గ్రామమున శ్రీరాముడు ప్రతిష్ఠించినాడు. ఆ లింగము రామలింగముగ, ఆ గ్రామము క్షీరారామముగ ప్రఖ్యాతి పొందినవి. మరొక భాగమును చాళుక్య భీమవరమను గ్రామమున కుమారస్వామి స్థాపించినాడు. ఆ లింగము కుమార భీమలింగమని, ఆ గ్రామము భీమారామమని ప్రసిద్ధి పొందినవి. ఇక ఐదవ భాగము - తెల్లని స్ఫటికమణితో సమానమైన కాంతి కలది, దేవ కాంతల చూపుల వరుసలనెడి పూగుత్తుల తెల్లని వెన్నెలలచే అభిషేకము చేయబడిన శరీరము కలదైన శ్రీభీమేశ్వర లింగమును చేరెను. ఈ విధముగ భోగమోక్షములను ప్రసాదించు పంచారామములు వెలసినవి.

ఇది త్రిపుర విజయమనెడి ఉపకథ. ఈ కథను విన్నను, చదివినను, వ్రాసినను, చెప్పినను, చర్చించినను సకల పాతక నివారణమగును. సకల శుభములు సమకూరును అని వసిష్ఠ మహర్షి చెప్పగా విని-

**విశేషము :-** ఈ శివ మాహాత్మ్య ప్రకటన వృత్తాంతమునకు 'త్రిపుర విజయము' అను ఉపాఖ్యానమని నామకరణము చేసి ఫలశ్రుతి చెప్పుట వలన ఈ వృత్తాంత ప్రాధాన్యము వెల్లడి చేసినట్లయినది.

ఉ॥ అప్పుడు సప్తదివ్య మును లంచిత భక్తిరసప్రయుక్తులై
చప్పట తాళముల్మొరయ సంస్తుతి పూర్వముగాఁగ నాడుచున్
ముప్పిరి గొన్న మోదమున మ్రొక్కుచు మైఁ బులకాంకురావళుల్
కుప్పలుగా భజించిరి యకుంఠిత భావన భీమలింగమున్. 152

**అర్థము :-** అప్పుడు=అ సమయమున; సప్త=ఏడుగురైన; దివ్యమునులు=దివ్యులైన ఋషులు; అంచిత=ఒప్పిన; భక్తిరస=భక్తిభావముతో; ప్రయుక్తులై=మిక్కిలిగ కూడియున్న వారై; అకుంఠిత=మొక్కపోని; భావనన్=భావముతో; చప్పట తాళముల్=లయబద్ధముగ చప్పట్లు కొట్టుచు; సంస్తుతి పూర్వము గాఁగన్=స్తుతిపూర్వకముగ; ఆడుచున్=నాట్యము చేయుచు; ముప్పిరిగొన్న=మూడు పేటలుగ అల్లుకొన్న; మోదమున=సంతోషముతో; మ్రొక్కుచు=నమస్కరించుచు; మైన్=శరీరము నందు; పులక+అంకుర=గగుర్పాటు మొలకల; ఆవళుల్=సమూహములు; కుప్పలుగా=మిక్కిలికాగా; భీమలింగమున్=శ్రీ భీమేశ్వర స్వామిని; భజించిరి=సేవించిరి.

**భావము :-** ఆ సమయమున దివ్యమునులైన సప్తర్షులు లయబద్ధముగా చప్పట్లు కొట్టుచు ఏకాగ్రమైన భక్తిభావముతో శ్రీ భీమనాథుని స్తుతించుచు నాట్యము చేసిరి. సంతోషము మూడురెట్లు కాగా వారి శరీరములు పులకరించినవి. ఆ స్వామికి మ్రొక్కుచు సేవించిరి.

సీ॥ ఆ ఖండ పంచకం బాఖండలాదిక
విబుధమండల నిషేవితము చంద్ర
మార్తాండ శతకోటి మహనీయ తేజంబు
కుండలి గ్రామణి కుండలంబు
పుండరీకత్వక్ర్పకాండాతిమండిత
కటి మండలము శ్రీఖండ ఘటిత
పాండు బ్రహ్మకపాల సంపుటము బ్ర
హ్మాండ కోటి స్ఫుర దమృతపిండ

తే॥ మభవ మద్వయ మాద్యం బనాదినిధన
మప్రమేయం బజయ్యంబు నప్రధృష్య
మఖిల వేదాంత వేద్య మత్యంత భక్తి
భావనాయుక్తి గలవారి పాలి సురభి. 153

అర్థము :- ఆఖండ.... నిషేవితము. ఆ+ఖండ పంచకము=ఆవిభజింపబడిన ఐదులింగముల మొత్తము; ఆఖండల=ఇంద్రుడు; ఆదిక=మొదలైన; విబుధ మండల=దేవతా సమూహముచే; నిషేవితము=కొలువబడినది; చంద్ర....తేజంబు. చంద్ర మార్తాండ=చంద్ర సూర్యుల యొక్క; శతకోటి=నూరుకోట్లు; మహనీయ=గొప్ప; తేజంబు=కాంతి వంటి కాంతి కలది; కుండలి గ్రామణి=సర్ప శ్రేష్ఠుడగు ఆదిశేషుడు; కుండలంబు=కర్ణాభరణముగ కలది;

పుండ....మండలంబు. పుండరీక=పులి యొక్క; త్వక్+ప్రకాండ=శ్రేష్ఠమగు తోలుతో; అతి=మిక్కిలిగ; మండిత=అలంకరింపబడిన; కటిమండలము=నడుము ప్రదేశము కలది; శ్రీఖండ....సంపుటము. శ్రీఖండ=చందనముతో; ఘటిత=కూర్చబడిన; పాండుర=తెలుపు మించిన పచ్చని; బ్రహ్మకపాల=బ్రహ్మయొక్క పుర్రె; సంపుటము=అర్ధచంద్రాకారమగు భిక్షాపాత్ర కలది; బ్రహ్మా.... పిండము. బ్రహ్మాండకోటి=బ్రహ్మాండ సమూహము వలె; స్ఫురత్=ప్రకాశించు; అమృతపిండము= అమృతాకారమైనది;

అభవము=పుట్టుకలేనిది; అద్వయము=ఏకైకమైనది; ఆద్యంబు=మొదటిది; అనాది నిధనము=ఆద్యంతములు లేనిది; అప్రమేయంబు=యథార్థముగ నెఱుగరానిది; అజయ్యంబు=జయింప సాధ్యము కానిది; అప్రధృష్యము=ఎదిరింప వీలులేనిది; అఖిల వేదాంత=సమస్తమైన వేదాంతములతో; వేద్యము=తెలియతగినది; అత్యంత=మిక్కిలి; భక్తి భావనా=భక్తి భావము తోడి; యుక్తి=కూడిక; కలవారి=కలిగినవారి; పాలి=పాలిటి; సురభి= కామధేనువు.

భావము :- ఐదు భాగములుగ చేయబడిన ఆ కాలాంతక లింగమును ఇంద్రాది దేవతలు సేవించిరి. సూర్య చంద్రాదుల కాంతితో ప్రకాశించుచున్నది. సర్పనాయకులు అలంకారములు. పులితోలు వస్త్రముగ నడుమునకు ధరించినట్టిది. బ్రహ్మకపాల మాలికలు ధరించినట్టిది. బ్రహ్మాండ సమూహమువలె ప్రకాశించునట్టిది. పుట్టుకలేనిది. ఏకైకమైనది. మొదటిది. ఆద్యంతములు లేనిది. యథార్థముగ తెలియలేనిది. జయింపసాధ్యముకానిది. ఎదిరింప వీలులేనిది. వేదాంతములతో తెలియతగినది. భక్తితత్పరులపాలిటి కామధేనువు.

శా॥ ఎంచన్ బెక్కు విశేషముల్ ధరణిలో నింపారుచున్నట్టి శ్రీ
పంచారామము లందు దక్షిణ మహాపాథోధి తీరంబునన్
పంచబ్రహ్మమయామృత ప్రకట శుంభద్దివ్యలింగాకృతిన్
మంచుంగుబ్బలియల్లుఁడొప్పెసఁగు భీమస్వామి యుద్దాముఁడై. 154

అర్థము :- ధరణిలోన్=భూమియందు; పెక్కు=అనేకములైన; విశేషముల్=జరిగిన సంగతులను; ఎంచన్=గణింపగా; ఇంపారుచున్నట్టి=ప్రకాశించుచున్నటువంటి; శ్రీ పంచారామములందు=సంపన్నములైన ఐదు క్షేత్రములందును; దక్షిణ=దక్షిణ దిక్కునందలి; పాథోధి=సముద్రము యొక్క; తీరంబునన్=ఒడ్డున; పంచ....లింగాకృతిన్. పంచబ్రహ్మ= సద్యోజాతాది ఐదు మంత్రములతో; మయ=కూడిన; అమృత=అమృతమువలె; ప్రకట=ఆవిర్భవించిన; శుంభత్=ప్రకాశమానమైన; దివ్యలింగ+ఆకృతిన్=శక్తిమంతమైన లింగాకారముతో; మంచుంగుబ్బలి=హిమపర్వతుని; అల్లుఁడు=అల్లుడైన; భీమస్వామి=శ్రీ భీమేశ్వరస్వామి; ఉద్దాముఁడై=అధికుడై; ఒప్పెసఁగున్=ప్రకాశించును.

భావము :- ఈ భూమిపై జరిగిన అనేక విశేషములను పరిశీలించినచో పంచారామములు గొప్పవి. అందున దక్షిణ సముద్ర తీరమునగల శ్రీ భీమేశ్వరస్వామి అత్యధికుడు. పంచబ్రహ్మమయుడు. అమృతరూపుడు. తేజోమంతము, దివ్యము ఐన లింగాకృతి.

శ్లో॥ కాశీక్షేత్ర మృతో జీవీ పునర్జన్మ శివాకృతిః
చిత్రం దక్షపురీ జీవీ నజన్మ స శివాకృతిః 1

శ్లో॥ మత్తో నాస్త్యపరం దైవం నదేవీ గిరిజాసమా
దక్షారామా త్పరంక్షేత్రం నభూతోనభవిష్యతి 2

శ్లో॥ రథ్యాంతరే మూత్రపురీషమధ్యే చండాల వేశ్మన్యథవా శ్మశానే
కృతప్రయత్నోప్యకృతప్రయత్నో శ్రీ దక్షపుర్యధ్వపరోపిముక్తః 3

**1. అర్థము** :- కాశీక్షేత్ర=కాశీక్షేత్రము నందు; మృతః=మరణించిన; జీవీ=ప్రాణి; పునః జన్మ=తరువాత జన్మము; శివాకృతిః=శుభమైన రూపము కలవాడగును. దక్షపురీ= దక్షారామము నందలి; జీవీ=ప్రాణి; నజన్మ=పుట్టుకలేదు. సశివాకృతిః=శివుని ఆకృతితో సమమైన ఆకృతి కలవాడగును. చిత్రం=విచిత్రము.

**భావము** :- కాశీక్షేత్రము నందు మరణించినజీవి తరువాతి జన్మమునందు శుభమైన రూపమును పొందును. దక్షారామమునందు మరణించిన జీవికి పుట్టుక ఉండదు. శివుని ఆకృతితో సమానమైన ఆకృతిని పొందును. ఇది విచిత్రము.

**2. అర్థము** :- మత్తః=నాకంటె; అపరందైవం=వేరొకదైవము; న+అస్తి=లేడు. గిరిజాసమా=గిరిజాదేవితో సమమైన; దేవీ=దేవత; న=లేదు. దక్షారామాత్=దక్షారామమున కంటె; పరంక్షేత్రం=శ్రేష్ఠమైన క్షేత్రము; నభూతం=పూర్వములేదు. నభవిష్యతి= ఇకముందుండదు.

**భావము** :- నాకంటె వేరుదైవము లేడు. గిరిజాదేవితో సమమైన దేవత లేదు. దక్షారామమున కంటె ఇతరమైన క్షేత్రము పూర్వము లేదు. ఇకముందుండదు.

**3. అర్థము** :- రథ్యాంతరే=ప్రయాణ మధ్యమున గాని; మూత్రపురీషమధ్యే=మూత్ర విసర్జనకు మలవిసర్జనకు మధ్యయందైనను; చండాల వేశ్మని=చండాలుని నివాసమందైనను; అథవా=లేక; శ్మశానే=శ్మశాన మందైనను; కృతప్రయత్న+అపి=ప్రయత్న పూర్వకముగనైనను; అకృతప్రయత్న+అపి=ప్రయత్నము లేకుండనైనను; శ్రీదక్షపురీ=శ్రీదక్షారామమునకు; అధ్వపరః=మార్గమునందు ఆసక్తుడైనను; ముక్తః=ముక్తుడు; భవతి=అగును.

**భావము** :- ప్రయాణ మధ్యమునందైనను మల మూత్ర విసర్జనలకు మధ్యలోనైనను చండాలుని నివాసమందైనను, శ్మశానమందైనను ప్రయత్నపూర్వకముగనైనను ప్రయత్నము లేకుండనైనను దక్షారామమునకు వెళ్ళు మార్గమందాసక్తుడైనవాడు ముక్తిని పొందును.

**విశేషము** :- ఈ మూడు శ్లోకములు సంస్కృత భీమ ఖండమున లేవు; ఇక్కడ ఆశ్వాస పద్యసంఖ్యలో గూడ చేరుట లేదు.

వ॥ **అట్టి దివ్య క్షేత్రంబునందు.** **155**

**అర్థము**:- అట్టి=అటువంటి; దివ్యక్షేత్రంబునందు=గొప్ప పుణ్యక్షేత్రము నందు.

**భావము** :- అటువంటి గొప్ప పుణ్యక్షేత్రమున.

కం॥ **అ లింగమూర్తి శశ్వ**
**జ్వాలామాలా కరాళ సందీప్తంబై**
**యాలోకింపంబడినం**
**దేలిరి యానంద జలధి దివ్యమునీంద్రుల్.** **156**

అర్థము :- ఆ లింగమూర్తి=ఆ భీమేశ్వర లింగము; శశ్వ....దీప్తంబై. శశ్వత్=ఎడతెగని; జ్వాలామాలా=మంటల సమూహముతో; కరాళ=ఉన్నతమై; సందీప్తంబై=మిక్కిలిగ ప్రకాశించినదై; ఆలోకింపంబడినన్=కనిపింపగా; దివ్యముని+ఇంద్రుల్=దేవమునిశ్రేష్ఠులు; ఆనందజలధి=ఆనందమనెడి సముద్రమున; తేలిరి=తేలియాడిరి.

భావము :- ఆ భీమేశ్వకర లింగము ఎడతెగని అగ్నిజ్వాలలతో దేదీప్యమానమై ప్రకాశించుచు కన్పించుటచేత. మునీంద్రులందరు ఆనంద సముద్రమునందు మునిగితేలిరి.

తే॥ సంస్మితంబైన మదన శాసనుని ముఖము
చూచి యానందమునుఁ బొంది సురలు మునులు
రాక్షస కృతావరోధ సంరంభ మింకఁ
దమకు లేదని తెలిసిరి తత్త్వ బుద్ధి. 157

అర్థము :- సురలు మునులు=దేవతలును మునులును; సంస్మితంబు+ఐన=మిక్కిలి లేతనగవుతోనున్న; మదన శాసనుని=(మన్మథుని శిక్షించిన) శంకరుని; ముఖము=వదనము; చూచి=చూచి; ఆనందమునున్=సంతోషమును; పొంది=పొంది; రాక్షసకృత=రాక్షసులచే చేయబడిన; అవరోధ=అడ్డగించుట అను; సంరంభము=ఆటోపము; ఇంకన్=ఇకమీదట; తమకు=తమకు; లేదు+అని=కలుగదని; తత్త్వబుద్ధిన్=వాస్తవమైన వివేకముతో; తెలిసిరి=గ్రహించిరి.

భావము :- చిరునవ్వుల సొరుతో దేదీప్యమానముగ ప్రకాశించుచున్నది ఆ లింగమూర్తి. దేవతలు మునులు ఆ శివలింగమును దర్శించినారు. ఆనందముతో పొంగిపోయినారు. తమకిక రాక్షస బాధలుండవని వివేకముతో గ్రహించినారు.

శా॥ కారాగార నిబద్ధలైన దివిషత్కాంతాజనుల్ వారికిం
గారామైన తనూజులుం బతులు దుఃఖంబాఱ గోదావరీ
వారిం దీర్థములాడి కాంచిరి జగద్వంద్యుం బురారాతి ద
క్షారామాధిపు భీమనాయకుఁ ద్రిలోకాహ్లాద సంధాయకున్. 158

అర్థము :- కారాగార=చెఱసాలలో; నిబద్ధలైన=బంధింపబడిన; దివిషత్ కాంతాజనుల్=దేవకాంతలును; వారికిన్=ఆ దేవకాంతలకు; గారామైన=ప్రియమైన; తనూజులున్=కుమారులును; పతులు=భర్తలు; దుఃఖంబు+ఆఱన్=బాధ తీరునట్లుగ; గోదావరీ=గోదావరీ నది యొక్క; వారిన్=నీటిలో; తీర్థము లాడి=పవిత్ర స్నానములు చేసి; జగత్=లోకములచే; వంద్యున్=నమస్కరింపతగిన వాడును; పుర+అరాతిన్=త్రిపురములను

నాశనము చేసినవాడును; దక్షారామ+అధిపున్=దక్షారామమునకు నాయకుడును; త్రిలోక=ముల్లోకములకు; ఆహ్లాద=సంతోషమును; సంధాయకున్=కల్గించు వాడునైన; భీమనాయకున్=శ్రీ భీమేశ్వర స్వామిని; కాంచిరి=చూచిరి.

భావము :- త్రిపురాసురులు పలువురు దేవతా స్త్రీలను చెఱబట్టిరి. త్రిపురములు త్రిపురాసురులు నాశనమగుటతో ఆ బందీలైన దేవకాంతలందరు విడిపింపబడిరి. ఆ దేవకాంతలు, వారి భర్తలు, వారి కుమారులు సంతోషించిరి. అందరు గోదావరీనదిలో స్నానములు చేసినారు. దుఃఖము తీరినది. త్రిపురాసుర సంహారము చేసి ముల్లోకములకు సంతసము కల్గించిన ఆ భీమేశ్వర స్వామిని వారందరు దర్శించి సేవించిరి.

**వ॥ తదనంతరం బా భరద్వాజాది మహామునులు శివున కర్ఘ్య పాద్యాచమనీ యార్థంబు భీమనాథ మహాదేవుని సమీపంబున గోదావరీ వాహినిం బ్రవహింపం జేయువారై ప్రారంభించి. 159**

అర్థము :- తత్+అనంతరంబ=ఆ తరువాత; ఆ భరద్వాజ+ఆది=ఆ భరద్వాజుడు మొదలైన; మహామునులు=గొప్ప ఋషులు; శివునకు=శంకరుని యొక్క; అర్ఘ్య=పూజకొరకు; పాద్య=కాళ్ళు కడుగుట కొరకు; ఆచమనీయ+అర్థంబు=కేశవాది నామములను ఉచ్చరించుచు పుచ్చుకొనుటకై; భీమనాథ మహాదేవుని=శ్రీ భీమేశ్వర స్వామి వారి యొక్క; సమీపంబున= దగ్గర; గోదావరీ=గోదావరి నది యొక్క; వాహినిన్=ప్రవాహమును; ప్రవహింపన్=పారునట్లు; చేయువారై=చేయుటకు నిర్ణయించినవారై; ప్రారంభించి=మొదలుపెట్టి.

భావము :- ఆ తరువాత భరద్వాజుడు మొదలైన మహర్షులు శివుని పూజకు, అభిషేకమునకు, అచమనమునకు గాను గోదావరీ ప్రవాహమును శ్రీ భీమేశ్వర స్వామి వారి సన్నిధిన ప్రవహింప చేయవలయునని భావించిరి. ప్రయత్నమును మొదలుపెట్టిరి.

**సీ॥ పంచ భూతమయంబు పరమ పంచబ్రహ్మ**
**తత్త్వతేజస్సముద్భాసితంబు**
**పంచాక్షరీ మహా పరమంత్ర మూలంబు**
**శాశ్వతం బజరం బనశ్వరంబు**
**భైమేశ్వరంబు శోభనమాది మధ్యాంత**
**శూన్యంబు సకలంబు శుద్ధ బుద్ధ**
**మనవద్యమచ్ఛేద్య మక్షోభ్యమఖిల ది**
**గ్దేశ కాలాపరిక్షీణ మనఘ**

తే॥ మంబరము మోచియున్న లింగంబుఁజూచి
సంప్రతిష్ఠ యొనర్పంగ సమ్మతించి
కాల మీక్షించి తగిన లగ్నంబుఁ జూచి
సకల సంభార నిచయంబు సంగ్రహించి. 160

**అర్థము :-** పంచ భూతమయంబు=భూమి మొదలైన ఐదు భూతముల వికారమైనది; పరమ...భాసితంబు. పరమ=శ్రేష్ఠమైన; పంచబ్రహ్మ=పంచబ్రహ్మ మంత్రముల యొక్క; తత్త్వ=వాస్తవమైన; తేజస్=కాంతితో; సముద్భాసితంబు=మిక్కిలిగ ప్రకాశింప జేయబడినది;

పంచా...శాశ్వతంబు. పంచాక్షరీ=పంచాక్షరి అను; మహా=గొప్ప; పరమంత్ర= ఉత్తమమైన మంత్రమునకు; మూలంబు=ఆధారమైనది; శాశ్వతంబు=నిత్యమైనది; అజరంబు=పరమాత్మయైనది; అనశ్వరంబు=నాశము లేనిది.

భైమేశ్వరంబు=భీమేశ్వరునకు సంబంధించినది; శోభనము=శుభము కల్గించునది; ఆది+మధ్య+అంత+శూన్యంబు=మొదలు నడిమి చివరలు లేనిది; సకలంబు=నిండైనది; శుద్ధ=పవిత్రమైనది; బుద్ధము=జ్ఞానమైనది.

అనవద్యము=దోషములేనిది; అచ్ఛేద్యము=తెగగొట్టుటకు వీలుకానిది; అక్షోభ్యము= కలతపెట్టవీలుగానిది; అఖిల=సమస్తమైన; దిక్=దిక్కులచేత; దేశ=దేశములచేత; కాల=కాలములచేత; అపరిక్షీణము=ఏ మాత్రము తగ్గనిది; అనఘము=పాపము లేనిది;

అంబరము=ఆకాశమును; మోచియున్న=ఆనియున్న; లింగంబున్=శివలింగమును; చూచి=చూచి; సంప్రతిష్ఠ=స్థాపనము; ఒనర్పంగ=చేయుటకు; సమ్మతించి=అంగీకరించి; కాలము+ఈక్షించి=తగిన సమయమును చూచి; తగిన=తగినటువంటి; లగ్నంబున్= ముహూర్తమును; చూచి=గ్రహించి; సకల=సమస్తమైన; సంభార=పదార్థముల; నిచయంబున్=సమూహమును; సంగ్రహించి=కూర్చుకొని.

**భావము :-** శ్రీ భీమేశ్వర లింగము పంచభూతమయము. పంచబ్రహ్మ మంత్ర భావమనెడి తేజస్సుతో మిక్కిలిగ ప్రకాశించుచున్నట్టిది. పంచాక్షరీ మహామంత్రమున కాధారమైనది. నిత్యమైనది. పరమాత్మయైనది. శుభదాయకమైనది. ఆది మధ్యాంత రహితమైనది. పవిత్రమైనది, జ్ఞానమైనది. దోషరహితమైనది. కలతపెట్ట వీలుకానిది. తెగగొట్టుటకు వీలుకానిది. అన్ని దిక్కులను, దేశములను, కాలములను వ్యాపించినది. ఆకాశము నంటి ప్రకాశించుచున్నది. అట్టి దివ్యలింగమును సప్తర్షులు చూచినారు. ఒకచోట ప్రతిష్ఠింప సమకట్టినారు. కాలపరిశీలన చేసినారు. శుభ ముహూర్తమును నిర్ణయించినారు. సకల సంభారములను సమకూర్చినారు.

తే॥ గౌతమీ గంగఁ బాపి యిక్కడికి నొక్క
సిద్ధవాహినిఁ బ్రవహింపఁజేసి కాని
లింగ సంస్థాపనంబుఁ గల్పింపమనుచుఁ
బరమ సంయము లేడ్వురుఁ బ్రతిన వట్టి. 161

అర్థము :- పరమ సంయములు=మహామునులు; ఏడ్వురున్=ఏడుగురును; గౌతమీగంగన్=గౌతమీ అను గంగ నుండి; పాపి=తొలగించి; ఇక్కడికిన్=ఈ భీమేశ్వర స్వామి చెంతకు; ఒక్క=ఒక; సిద్ధవాహినిన్=పవిత్రమైన నదిని; ప్రవహింపఁజేసి కాని=ప్రవహించునట్లు చేసిగాని;లింగ=లింగమును; సంస్థాపనంబున్=ప్రతిష్ఠ చేయుటను; కల్పింపము+అనుచున్= నెరవేర్పము అనుచు; ప్రతినన్+పట్టి=పట్టుదల పూని.

భావము:- సప్తర్షులు శ్రీ భీమేశ్వర లింగమును ప్రతిష్ఠింప ముహూర్త నిర్ణయము చేసినారు. గోదావరీ నది నుండి శ్రీ భీమేశ్వరలింగమున్నచోటకు శాశ్వత ప్రవాహము గల నదిని ప్రవహింప జేసిన పిమ్మటనే లింగమును ప్రతిష్ఠింపవలెననియు పట్టుదల పట్టినారు.

సీ॥ ఆ లగ్నవేళకు నమృత దివ్య స్వయం
భూమహాలింగైక మూర్తి యైన
శ్రీ భీమనాథుని శీతాంశు శేఖరు
నభిషేక మొనరింప నభిలషించి
కదలి సప్తర్షులు గౌతమాదులు శిష్య
సహితంబు కడు భక్తి సంభ్రమమున
దక్షవాటీపుర స్థానంబు నందుండి
యేఁగి యంతంతఁ గట్టెదుటఁగనిరి

తే॥ గౌతమీ గంగ నాలోల ఘన తరంగఁ
గేలిడోలా విహార సంక్రీడ మాన
చక్రవాక బక క్రౌంచ సారసాళి
హంస కారండవాది మాద్యద్విహంగ. 162

అర్థము :- ఆ లగ్నవేళకున్=ఆ శుభముహూర్త సమయమునకు; అమృత=సుధ నుండి; దివ్య=లోకాతీతమైన; స్వయంభూ=తనంతట తానుగ పుట్టిన, మహాలింగ=గొప్పలింగ

మను; ఏకమూర్తి+ఐన=ఒకే ఆకారమైన; శీతాంశు శేఖరున్=చంద్రుని శిరమున దాల్చినవాడగు; శ్రీ భీమనాథుని=శ్రీ భీమేశ్వర స్వామిని; అభిషేకము+ఒనరింపన్=అభిషేకము చేయుటకు; అభిలషించి=కోరి;

సప్తర్షులు=ఏడుగురు మహర్షులైన, గౌతమ+ఆదులు=గౌతముడు మొదలయిన వారు; శిష్య సహితంబు=శిష్యులతోకూడి; కడు భక్తి సంభ్రమమున=మిక్కిలి భక్తి యొక్క వేగముతో; దక్షవాటీపుర స్థానంబునందుండి=దక్షారామము నుండి; కదలి=బయలుదేరి; ఏగి=వెళ్ళి; అంతంతన్=అల్లంత దూరమున; కట్టెదుటన్=ఎదుటగా;

ఆలోల=మిక్కిలి చంచలమైన; ఘనతరంగన్=గొప్ప అలలు కలది; కేలి...విహంగన్. కేలి=ఆటల; డోలా=ఊయలలందు; విహార=సంచారములతో; సంక్రీడమాన=కలసి ఆడుచున్న; చక్రవాక=చక్రవాక పక్షులు; బక=కొంగలు; క్రౌంచ=క్రౌంచపక్షులు; సారస=బెగ్గురు పక్షుల; ఆళి=గుంపులు; హంస=హంసలు; కారండవ=కన్నెలేడి పిట్టలు; ఆది=మొదలైన; మాద్యత్+విహంగ=మదించిన పక్షులు కలదైన; గౌతమీ గంగన్=గౌతమి అనుపేరుగల గంగను; కనిరి=చూచిరి.

భావము :- భక్తశ్రేష్ఠులైన సప్తర్షులు శ్రీ భీమేశ్వరున కభిషేకము చేయుటకై శ్రీ భీమేశ్వర సన్నిధికి గౌతమీ గంగ నుండి ఒక ప్రవాహమును తేదలచిరి. శిష్యులతో సహా భక్త్యతిశయముతో దక్షారామము నుండి బయలుదేరి వెళ్ళిరి. ఎదురుగా అల్లంత దూరమున గౌతమీ నది కనిపించినది. ఆ గౌతమీనది పెద్దది. వేగముగ ప్రవహించుచున్నది. పెద్దపెద్ద అలలు లేచి సామూహికముగ ఆడుకొనుచున్నట్లున్నది. చక్రవాక పక్షులు, కొంగలు, క్రౌంచపక్షులు, బెగ్గురు పక్షుల గుంపులు, హంసలు, కన్నెలేడి పిట్టలు మదించి విలాసముగ ఎగురుచున్నవి.

కం॥ గౌతమ కన్యా తటినిం
ప్రీతిఁ బయఃపాన మాచరించిన మనుజ
వ్రాత మొనర్పదు మరల
న్మాతృపయోధర పయః కణాస్వాదనమున్. 163

అర్థము :- ప్రీతిన్=ఆసక్తితో; గౌతమ కన్యాతటినిన్=గౌతమీ నదిలో; పయః=నీటిని; పానము+ఆచరించిన=త్రాగుట చేసిన; మనుజ వ్రాతము=మానవుల సమూహము; మరలన్=మరొకమారు; మాతృ=తల్లి యొక్క; పయోధర+పయః=చనుబాల; కణ=బిందువులను; ఆస్వాదనమున్=త్రాగుటను; చేయదు=చేయదు.

భావము :- భక్తితో గౌతమీ నదిలోని నీటిని త్రాగిన మానవులు మరల జనింపరు. పుట్టి తల్లిపాలు త్రాగవలసిన అవసరము ఉండదు. అనగా జన్మరాహిత్యము కల్గును.

వ॥ అని మునీంద్రులు తమలోన వెండియు నొండొరులం గనుంగొని. 164

అర్థము :- అని=అనిభావించి; మునీంద్రులు=మునిశ్రేష్ఠులు; తమలోనన్=తమలో తాము; వెండియున్=మరియు; ఒండొరులన్=ఒకరినొకరు; కనుంగొని=చూచి.

భావము :- ఆ విధముగ సప్తర్షులు గౌతమీ నదీశక్తిని భావించిరి. ఇంకను ఒకరినొకరు చూచి.

తే॥ కంటిరే ఘోరపాతకౌఘముల నెల్లఁ
గడిమి జంకించుచున్నది గంగ యిపుడు
వీచికా హస్త విన్యాస విభ్రమముల
ఘుమఘుమ ధ్వాన హుంకార ఘోషమెసఁగ. 165

అర్థము:- ఇపుడు=ఈసమయమున; గంగ=ఈ గౌతమీ నది; వీచికా... విభ్రమములన్. వీచికాహస్త=అలలనెడి చేతుల యొక్క; విన్యాస=ఊపుటలనెడి; విభ్రమములన్=చేష్టలచేత; ఘుమ...ఎసఁగన్. ఘుమఘుమ=ఘుంఘుమ్మనెడి; ధ్వాన=శబ్దములును; హుంకార=గర్జనల; ఘోషము=చప్పుడు; ఎసఁగన్=అతిశయింపగా; ఘోర=భయంకరములైన; పాతక=పాపముల; ఓఘములన్=సమూహములను; ఎల్లన్=అన్నింటిని; కడిమిన్=గొప్పగా; జంకించుచున్నది= భయపెట్టుచున్నది; కంటిరే=చూచితిరా!

భావము :- చూచితిరా! ఈ గౌతమీ గంగ అలలనెడి చేతులను చాచి ఊపుచు ఘుమఘుమమను శబ్దముల గర్జనలతో భయంకరములైన పాపముల నన్నింటిని భయపెట్టి అణచుచున్నది.

విశేషము :- అలంకారము - రూపకము.

తే॥ యక్ష గంధర్వసిద్ధ విద్యాధరోర
గామర వ్రాత భరితోభయప్రతీర
పృథివి యెల్లను రక్షించు పేరఁటాలు
మమ్ము రక్షించు గోదావరమ్మ యెపుడు . 166

అర్థము :- యక్ష...పృథివి. యక్ష=యక్షులు, గంధర్వ=గంధర్వులు, సిద్ధ=సిద్ధులు; విద్యాధర=విద్యాధరులు; ఉరగ=నాగులను; అమరవ్రాత=దేవతల సమూహముతో; భరిత= నిండిన; ఉభయప్రతీర=రెండు తీరములందలి, పృథివి=భూమిని; ఎల్లను=అంతటిని;

రక్షించు=కాపాడు; పేరఁటాలు=ముత్తైదువ; గోదావరమ్మ=గోదావరీనది అనెడి తల్లి; ఎపుడు=ఎల్లపుడును; మమ్ము=మనలను; రక్షించు=కాపాడుగాక.

భావము :- గోదావరీ నదీమతల్లికి రెండు తీరములందును యక్షులు, గంధర్వులు, సిద్ధులు, విద్యాధరులు, నాగులు, దేవతల సమూహములు నివసించుచుందురు. ఆ భూమినంతటిని గోదావరమ్మ రక్షించుచుండును. అట్టి ఆ గోదావరమ్మ మనలను కూడ సదా కాపాడుగాక.

తే॥ అమృతమైన పయోధార నహరహంబు
సృష్టిఁగల జంతు కోట్ల రక్షింతు వీవు
జనని వౌటకు నేమి సంశయము చెపుమ
గౌతమీ గంగ! యాలోల ఘనతరంగ. 167

అర్థము :- ఆలోల=మిక్కిలి చలించుచున్న; ఘనతరంగ=గొప్ప అలలు కల; గౌతమీ గంగ=గౌతమి అను పేరుగల నదీ!; ఈవు=నీవు; అమృతమైన=అమృతమయమైన, పయః+ధారన్=నీటి ప్రవాహముచే; అహరహంబు=నిత్యము; సృష్టిన్+కల=సృష్టిలోనున్న; జంతుకోట్లన్=జీవరాసులను; రక్షింతువు=కాపాడుదువు; జననివి+ఔటకున్=తల్లివగుటకు; సంశయము=అనుమానము; ఏమి=ఏమున్నది; చెపుమ=చెప్పుము.

భావము :- గోదావరీ మాతా! నీవు నీ నీటిధారలతో సృష్టిలోని జీవరాశిని సర్వదా కాపాడుచుంటివి. కనుక నీవు తల్లివగుటకు ఏమాత్రము సందేహము లేదు.

విశేషము :- పయోధార అనగా జలధార, పాలధార అని రెండర్థములున్నవి. గోదావరిని తల్లిగా భావించుటచే 'పయోధార' శబ్దము ఔచిత్యవంతము.

కం॥ త్రైలోక్యవరద! పావన
నాళీకాసన కరాబ్జ నవమణికుండీ
కూలంకష సలిలామృత!
పాలింపు గిరీశజాయ! పర్వత తనయా! 168

అర్థము :- త్రైలోక్య=మూడు లోకముల మొత్తమునకు; వరద=ప్రియమును కూర్చుదానా! పావన...అమృత. పావన=పవిత్రమైన; నాళీక+ఆసన=పద్మాసనుడైన బ్రహ్మ యొక్క; కర+అబ్జ=పద్మము వంటి చేతిలోని; నవ=క్రొత్త; మణికుండీ=మణులు పొదిగిన కమండలువు యొక్క, కూలంకష= ఒడ్డుల నొరయునట్లు నిండుగనున్న; సలిల+అమృత=

నీరు అనెడి అమృతము కలదానా! గిరీశ=(కైలాసవాసుడైన) శంకరుని యొక్క; జాయ= ప్రియురాలవైనదానా! పర్వత తనయా=త్ర్యంబక పర్వతమునకు కుమారివైనదానా!; పాలింపుము=రక్షింపుము.

భావము :- ఓ గోదావరీమాతా! ముల్లోకములకు ప్రియమును కల్గించుదానవు. బ్రహ్మదేవుని కమండలువు నిండుగ నున్నదానవు. అమృతము వంటి నీటిని కలదానవు. శంకరునకు ప్రియురాలవు. త్ర్యంబక పర్వత తనూజవు. మమ్ములను రక్షింపుము.

కం॥ **గోదావరి గోదావరి**
**గోదావరి యంచుఁబల్కు గుణవంతులకున్**
**గోదావరి తల్లీ సం**
**పాదింతు గదమ్మ నీవు భవ్య శుభంబుల్.** 169

అర్థము :- గోదావరి తల్లీ=ఓ గోదావరీ మాతా! నీవు=నీవు; గోదావరి గోదావరి గోదావరి+ అంచున్=గోదావరి-గోదావరి గోదావరి అనుచు నిన్ను స్మరించు, గుణవంతులకున్= సద్గుణములు కలవారికి; భవ్య=యోగ్యమైన; శుభంబుల్=మంగళములను సంపాదింతుగదమ్మ= సమకూర్తువుగదా తల్లీ.

విశేషము :- ఇట్లే కాశీఖండములో(5-34) గంగానదిని స్తుతించు పద్యము కలదు.

గంగానది గంగానది
గంగానది యనుచు తేపకడ మేల్కనుచో
గంగఁ గొనియాడు నెవ్వఁడు
భంగించునతండు ఘోరపాతక చయముల్

కం॥ **కంబు శశి రజత శుక్తి వి**
**డంబసిత చ్ఛాయ కలిత డంబరములు నీ**
**యంబువు లమృతోపమ రుచు**
**లంబా! మా కొసఁగుఁగాత మభ్యుదయంబుల్.** 170

అర్థము :- అంబా!=ఓ తల్లీ!; నీ=నీ యొక్క; అంబువులు=నీళ్ళు; కంబు... డంబరములు. కంబు=శంఖమును; శశి=చంద్రుని; రజత=వెండిని; శుక్తి=ముత్యపు చిప్పలను; విడంబ=అనుకరించు; సితచ్ఛాయ=తెల్లని కాంతులతో; కలిత=కూడిన; డంబరములు= విజృంభణలు; అమృత=అమృతమును; ఉపమ=పోలిన; రుచులు=తీయని రుచి కలవి; మాకు=మాకు; అభ్యుదయంబుల్=అభివృద్ధిని; ఒసఁగున్+కాత=ఇచ్చుగాక.

భావము :- ఓ గోదావరీమాతా! నీ నీరు శంఖము, చంద్రుడు, వెండి, ముత్యపు చిప్ప మొదలైన వాని తెల్లదనమును మించిన తెల్లని స్వచ్ఛమైన కాంతులతో విజృంభించును. అమృతముతో సమానమైన కమ్మని రుచి కలవి. అట్టి నీ నీరు మాకు కోరికలను తీర్చి అభివృద్ధిని ప్రసాదించు గాక.

విశేషము :- ఉపమాలంకారము.

శా॥ ఆ పాతాళ గభీర నీరకు, సుధా హారామలచ్ఛాయకున్
దీ్వపాలంకృతికిన్ మహేంద్రనగరీ నిశ్రేణికాయష్టి కిం
దాపాపాయ విధావిహర్త్రికి మహో దన్వా దృఢాలింగన
వ్యాపార ప్రతిపన్న సౌఖ్యకును సాష్టాంగంబు గంగమ్మకున్. 171

అర్థము :- ఆ పాతాళ...నీరకు. ఆ పాతాళ=పాతాళ లోకము వరకు; గభీర=లోతుగల; నీరకు=నీరు కలదానికి; సుధా...ఛాయకున్. సుధా=అమృతమువలె; హార=ముత్యాలహారము వలె; అమల=మలినము లేని; ఛాయకున్=కాంతికలదానికి; ద్వీప=(చుట్టును నీరుకల) ద్వీపములకు; అలంకృతికిన్=అలంకారమైనదానికి; మహేంద్ర...యష్టికిన్. మహేంద్రనగరీ= స్వర్గమునకు; నిశ్రేణికా యష్టికిన్=నిచ్చెన కఱ్ఱయైన దానికి; తాపా...విహర్త్రికి. తాప=తాపత్రయ మును; అపాయ=తొలగించు; విధా=పద్ధతులతో; విహర్త్రికి=సంచరించుదానికి; మహా=గొప్ప; ఉదన్వా=సముద్రుని; దృఢ+ఆలింగన=గట్టిగ కౌగలించుకొను; వ్యాపార=పనిచేత, ప్రతిపన్న= పొందబడిన; సౌఖ్యకును=సుఖము కలదానికి; గంగమ్మకున్=గోదావరీ గంగకు; సాష్టాంగంబు= సాష్టాంగ నమస్కారము.

భావము :- ఓ గోదావరీ గంగా! పాతాళ లోకము వరకు లోతుకలదానవు. అమృతము నకు వలె ముత్యాలహారమునకు వలె మలినము లేని మనోహరమైన కాంతికల దానవు. ద్వీపదేశములకు అలంకారమైనదానవు. స్వర్గమును చేరుటకు నిచ్చెన కఱ్ఱవు. తాపత్రయమును తొలగించుటకు కావలసిన పద్ధతులతో విహరించుదానవు. మహా సముద్రమునకు ప్రియమైన దానవు. అట్టి నీకు సాష్టాంగనమస్కారము.

విశేషము :- తాప :- తాపత్రయము. ఆధ్యాత్మికము, ఆధిదైవికము, ఆధి భౌతికము అను మూడు విధములైన బాధలు.

అలంకారము - ఉపమ.

శా॥ రంభోరూకర శాతకుంభఘట ధారాపూరణప్రక్రియా
గంభీర క్వణ సాంద్ర భిన్న కరిరాడ్గండూష నిర్భిన్న కు
న్సంభావించి నమస్కరింతుము త్రిసంధ్యంబున్ ముదంబొప్ప నీ
కంభోజాసన కుండికాంబుజవనీ హంసాభ! గోదావరీ! 172

అర్థము :- అంభో...హంసాభ. అంభోజాసన=బ్రహ్మదేవుని; కుండికా=కమండలువను; అంబుజవనీ=పద్మవనమునకు; హంస+ఆభ=హంసవంటిదానా; గోదావరీ=ఓ గోదావరీ!; రంభో...నిర్భిన్నకున్. రంభ+ఊరూ=(అరటిబోదెల వంటి తొడలుగల) కాంతల; కర=చేతులందలి; శాంతకుంభ=బంగారు; ఘట=కుండల; ధారా=నీటితో; పూరణ=నింపుటయను; ప్రక్రియా=పద్ధతిచేత; గంభీర=మిక్కిలి గొప్ప; క్వణ=ధ్వని; సాంద్ర= దట్టమగుట చేత; భిన్న=తగ్గింపబడిన; కరిరాట్=గజరాజుల; గండూష=తొండముల చివరల (పుక్కిలింతల)చే, నిర్భిన్నకున్=చక్కగా వెదజల్లబడిన దానవగు; నీకున్=నిన్ను; సంభావించి=చక్కగా భావించి; ముదంబు+ఒప్పన్=సంతోషము ప్రకాశించునట్లుగ; త్రిసంధ్యంబున్=మూడు సంధ్యా సమయములందును; నమస్కరింతుము=ప్రణమిల్లెదము.

భావము :- ఓ గోదావరీ మాతా! బ్రహ్మదేవుని కమండలు వనెడి పద్మవనమునకు హంసవంటి దానవు. నీయందు కాంతలు బంగారు కుండలతో నీరు నింపుకొనుచుండగా అతిశయించి వచ్చు మనోహరమైన శబ్దములకు నీయందు విహరించుచు మదపుటేనుగులు తొండములతో నీటిని పుక్కిటపట్టి పైకి వదలుచుండగా నైన శబ్దములు తక్కువ చేయబడినవి. అట్టి విస్తారమైన నిన్ను చక్కగ భావింతుము. సంతోషముతోమూడు సంధ్యా సమయములందును నమస్కరింతుము.

కం॥ గౌతమికిన్ బంచమహా
పాతక పటలాంధకార పాటన విధిరా
డ్గౌతమికి నమస్కారం
బాతతమతిఁ జేయుదము ప్రయత్నంబెసఁగన్. 173.

అర్థము :- పంచ...గౌతమికి. పంచ మహాపాతక=ఐదు గొప్ప పాపముల యొక్క; పటల=సమూహమనెడి; అంధకార=చీకటిని; పాటన=ఛేదించు; విధిరాట్=శ్రేష్ఠమైన కార్యము నందు; గౌతమికి=దుర్గాదేవియైనట్టి; గౌతమికిన్=గౌతమీనదికి; ప్రయత్నంబు=సడలనిపూనిక; ఎసఁగన్=ప్రకాశించునట్లుగా; ఆతతమతిన్=గురిపెట్టబడిన మనస్సుతో; నమస్కారంబున్=దండమును; చేయుదము=పెట్టుదుము.

భావము :- ఓ గౌతమీ మాతా! పంచ మహాపాతకములనెడి చీకటిని తొలగించుటకు దుర్గాదేవి యైనట్టిదానవు. మా ప్రయత్నము ఫలింపవలెనను లక్ష్యముతో నీకు నమస్కరించుచుంటిమి.

విశేషము :- పంచ మహాపాతకములు :- చూడుడు. భీమ. 3-24.

వ॥ అని ప్రార్థించి యిట్లనిరి. 174

అర్థము :- అని=అని పైవిధముగ; ప్రార్థించి=మిక్కిలిగ కోరి; ఇట్లు+అనిరి=ఈ విధముగ అనిరి.

భావము :- సప్తర్షులు పైవిధముగ గోదావరిని ప్రార్థించి ఇంకను ఆ గోదావరీనదిని ఈ విధముగ కోరిరి.

సీ॥ విచ్చేయవమ్మ శ్రీ వృషభవాహన ధర
సామజకట మదాసారధార!
పయనంబు గావమ్మ భర్గ జటాటవీ
కుటజ శాఖా శిఖా కోరకంబ!
రావమ్మ యాదిమ బ్రహ్మదో: పల్లవ
స్థిత కమండలు పుణ్య తీర్థజలమ!
లేవమ్మ విశ్వంభరా వధూటీ కంఠ
తార మౌక్తిక హార ధామకంబ!
గీ॥ తెరులతో వీచికలతోడ దరులతోడ
విమల డిండీర ఖండ దండములతోడ
మురువు ఠీవియు నామోదమును జవంబు
వడువు నొప్పంగ గంగమ్మ నడువవమ్మ! 175

అర్థము :- శ్రీ వృషభవాహన=ఎద్దును వాహనముగ గల శ్రీ శంకరుడు; ధర=ధరించిన; సామజకట=ఏనుగు యొక్క చెక్కిలియందలి; మద+ఆసార=మదజలము యొక్క జడివానవంటి; ధార=ప్రవాహము కలదానా! విచ్చేయవమ్మ=రమ్ము;

భర్గ...కోరకంబ. భర్గ=శంకరుని; జటా=జడల సమూహమనెడి; అటవీ=అడవిలోని; కుటజ=కొండమల్లె యొక్క; శాఖా శిఖా=కొమ్మ చివరన గల; కోరకంబ=మొగ్గ ఐనదానా!; పయనంబు+కావమ్మ=బయలుదేరుము;

ఆదిమ...జలమ. ఆదిమ బ్రహ్మ=మొదటివాడైన బ్రహ్మదేవుని; దో: పల్లవ=చిగురాకువంటి చేతియందు; స్థిత=ఉన్న; కమండలు=కమండలువు నందలి; పుణ్య తీర్థజలమ=పుణ్యప్రదమైన పవిత్ర జలమా!; రావమ్మ=మావెంట రమ్ము;

విశ్వం...ధామకంబ. విశ్వంభరా వధూటీ=భూమి అను స్త్రీ యొక్క; కంఠ=మెడ యందలి; తార మౌక్తికహార=పులుగడిగిన ముత్యముల దండ యొక్క; ధామకంబ=శోభవంటి శోభకలదానా!; లేవమ్మ=కదలుము;

తెరులతో=పొంగులతోను; వీచికలతోడ=అలలతోను; దరులతోడ=ఒడ్డులతోను; విమల...దండముల. విమల=మలినములేని; డిండీరఖండ=నురుగు తునుకలనెడి; దండముల తోడన్=చుట్టలతోను; మురువు=సౌందర్యము; రీవియున్=గర్వమును; ఆమోదమును= సంతోషమును; జవంబువడువున్=వేగపురీతి; ఒప్పంగన్=ప్రకాశించునట్లుగా; గంగమ్మ=ఓ గోదావరీ మాతా!; నడువవమ్మ=బయలుదేరిరమ్ము.

భావము :- ఓ గోదావరీమాతా! శంకరుడు ధరించిన ఏనుగు మదజలము జడివాన వంటి ప్రవాహము కలదానవు. శివజటాజూటమనెడి అడవిలోని కొండమల్లె కొమ్మచివరన గల కొండమల్లె మొగ్గవు. బ్రహ్మదేవుని చేతియందలి కమండలువులోని పవిత్ర జలానివి. పార్వతీదేవి ధరించిన ముత్యాల హారము యొక్క శోభవంటి శోభకలదానవు. పొంగులతో, అలలతో, ఒడ్డులతో, తెల్లని నురుగు చుట్టల సమూహముతో, సౌందర్యము, గర్వము వేగపు రీతులతో బయలుదేరిరమ్ము.

మ॥ అదెమాస్వామి సుధారసోద్భవుఁడు దక్షారామ భీమేశుఁడ
భ్యుదయంబొంది ప్రతిష్ఠ గైకొనెడు నంభోరాశి తీరంబునం
బదమా! షట్పద మాలికా పరిలసత్పాథోధునీ సంపదా
స్పద నానా సలిల ప్రవాహలహరీ సంభార గోదావరీ! 176

అర్థము :- షట్పద...సంభార. షట్పద=(ఆరు పాదములు గల) తుమ్మెదల; మాలికా=సమూహములతో; పరిలసత్=అంతటను నృత్యము చేయుచున్న; పాథస్+ధునీ= నీటి ప్రవాహముల; సంపద=సమృద్ధికి; ఆస్పద=స్థానమైన; నానా=అనేకములైన; సలిల ప్రవాహ=నీటి ప్రవాహములందలి; లహరీ=తరంగములను; సంభార=సర్వపూర్ణత్వము గల; గోదావరీ!=ఓ గోదావరీ మాతా!; అదె=అదుగో; మా స్వామి=మాదైవము; సుధారస+ఉద్భవుఁడు= అమృతరసము నుండి పుట్టినవాడు; దక్షారామ=దక్షారామము నందలి; భీమేశుఁడు=శ్రీ భీమేశ్వర స్వామి; అంభోరాశి తీరంబునన్=సముద్రపు ఒడ్డున; అభి+ఉదయంబున్+ఒంది= వెలసియుండి; ప్రతిష్ఠన్=స్థాపనను; కైకొనెడున్=పూనినాడు; పదమా!=వెళ్ళుదము రమ్ము.

భావము :- ఓ గోదావరీ మాతా! తుమ్మెద గుంపుల సమూహములతో అంతటను నృత్యము చేయుచున్న అనేక నీటి ప్రవాహములను నీలో కలుపుకొని సర్వసంపూర్ణత్వముతో సుసంపన్నమై ప్రకాశించుచుంటివి. అడుగో మాస్వామి దక్షారామ భీమేశ్వరుడు. అమృతరసము నుండి పుట్టినవాడు. సముద్రతీరమున దక్షారామ నగరమున వెలసియున్నాడు. ప్రతిష్ఠను స్వీకరింపనున్నాడు. వెళ్ళుదము రమ్ము.

ఆ॥ సోమశేఖరుండు భీమేశ్వర స్వామి
తివిరినాఁడు సంప్రతిష్ఠఁ బొంద
వేళ దప్పకుండ విచ్చేయగా రాదె
త్ర్యంబకాద్రి సరసి ధామలక్ష్మి. 177

అర్థము :- త్ర్యంబక+అద్రి=త్ర్యంబకమనెడి పర్వతము నందలి; సరసి=కొలను అనెడు; ధామ=నివాసమునకు; లక్ష్మి=ఐశ్వర్యము అయినదానా! సోమశేఖరుండు=చంద్రుని శిరస్సుపై ధరించిన వాడైన; భీమేశ్వరస్వామి=శ్రీ భీమనాథ స్వామి; సంప్రతిష్ఠన్+పొందన్= ప్రతిష్ఠింప బడుటకు; తివిరినాఁడు=సిద్ధమైనాడు; వేళ=ముహూర్తము; తప్పకుండ=దాటి పోకుండగ; విచ్చేయగారాదె=దయచేయవచ్చును గదా!

భావము :- ఓ గోదావరీ మాతా! త్ర్యంబక పర్వతమందలి కొలను అను నివాసమునకు ఐశ్వర్యమైనదానా! సునంపన్నురాలవు. శ్రీ దక్షారామ భీమేశ్వర స్వామి ప్రతిష్ఠకు సిద్ధమైయున్నాడు. సుముహూర్తము మించిపోకుండగ దయచేయుము.

విశేషము :- శ్రీనాథ మహాకవి ఎందులకో ఆటవెలదులను ఎక్కువగ వ్రాయడు. వ్రాసిన తక్కువ ఆటవెలదులలో ఇది ఒకటి.

మ॥ అని మెప్పించి మహర్షులేడ్వురును నత్యాశ్చర్యమొప్పన్ బ్రభా
వ నిరూఢిం గొనివచ్చి రంధ్రవసుధా వక్షోజహారావళిన్
ముని బృందారక సేవ్యమాన సలిలన్ గోదావరీ వాహినిన్
వెనుకన్ముందఱఁ బార్శ్వ దేశముల నావేశించి సేవించుచున్. 178

అర్థము :- అని=ఈ విధముగ స్తుతించి; మెప్పించి=సంతోషపెట్టి; మహర్షులు=గొప్ప ఋషులు; ఏడ్వురునున్=ఏడుగురును; అతి=మిక్కిలి; ఆశ్చర్యము=వింత; ఒప్పన్=ప్రకాశించు నట్లుగ; ప్రభావనిరూఢిన్=మహత్త్వము యొక్క కుశలతచేత; అంధ్ర...వళిన్. అంధ్రవసుధా= ఆంధ్రభూమికి; వక్షోజహారావళిన్=ఱొమ్ముప్రదేశమందలి హారముల సమూహమైనదియు; ముని...సలిలన్. ముని బృందారక=మునిశ్రేష్ఠులచేత సేవ్యమాన=సేవింపబడుచున్న; సలిలన్=నీరుకల; గోదావరీ వాహినిన్=గోదావరీ నదిని; వెనుకన్=వెనుక భాగమును; ముందఱన్=ముందు భాగమును; పార్శ్వ దేశములన్=ప్రక్క భాగములను; ఆవేశించి= ఆక్రమించి; సేవించుచున్=పూజించుచు; కొనివచ్చిరి=తీసికొని వచ్చిరి.

భావము :- సప్తర్షులా విధముగ గోదావరిని స్తుతించి మెప్పించినారు. ఆ గోదావరీ నది ఆంధ్రభూమికి వక్షోజహారముల సమూహము వంటిది. మహర్షులచేత సేవింపబడు

చున్న జలము కలది. మహర్షుల కోరిక ననుసరించి ఆ గోదావరి కదలినది. ఉరకలు పెట్టినది. సప్తర్షులు ఆ గోదావరీ ప్రవాహమునకు వెనుక ముందర ప్రక్కన చేరి స్తుతించుచు తీసికొని వచ్చిరి.

వ॥ అప్పుడు ప్రతిష్ఠావలోకనంబునకు లోకపాలక గంధర్వయక్షసిద్ధ సాధ్య విద్యాధరోరగామర సహితుండై దేవేంద్రుడంబర మార్గంబున ఋషుల ననుసరించి యేతెంచు చుండె నా సమయమ్మున. 179

అర్థము :- అప్పుడు=ఆ సమయము నందు; ప్రతిష్ఠ=శ్రీ భీమేశ్వరుని ప్రతిష్ఠను; అవలోకనంబునకు=చూచుటకొరకై; దేవేంద్రుండు=దేవేంద్రుడు-లోకపాలక=దిక్పాలకులు; గంధర్వ=గంధర్వులు; యక్ష=యక్షులు; సిద్ధ=సిద్ధులు; సాధ్య=సాధ్యులు; విద్యాధర= విద్యాధరులు; ఉరగ=నాగులు; అమర=దేవతలతో; సహితుండై=కూడినవాడై; అంబర మార్గంబున=ఆకాశవీథిలో; ఋషులన్=సప్తర్షులను అనుసరించి=వెంబడించి; ఏతెంచు చుండెన్=వచ్చుచుండెను. అ సమయమ్మున=అపుడు.

భావము :- సప్తర్షులావిధముగ గోదావరీ నదిని వెంటగొని వచ్చుచుండిరి. శ్రీ భీమేశ్వర స్వామి ప్రతిష్ఠోత్సవమును చూచుట కొరకై దేవేంద్రుడు - దిక్పాలురు, గంధర్వులు, యక్షులు, సిద్ధులు, సాధ్యులు, విద్యాధరులు, నాగులు, దేవతలతో కూడినవాడై ఆకాశమార్గమున మునుల వెంట వచ్చుచుండెను. ఆ సమయమున.

తే॥ ఒక్కనది పొంత గార్హస్థ్య యుక్తమైన
పుణ్యతపమాచరించుచుఁ బుణ్యజనులు
తారు బంధులుఁదామర తంపరగుచుఁ
గూడి యుండంగ నెంతయుఁగాడు చేసి. 180

అర్థము :- పుణ్యజనులు=రాక్షసులు; తారు=తామును; బంధులు=చుట్టములును; తామరతంపర=మిక్కిలి అభివృద్ధి; అగుచున్=చెందుచు; ఒక్కనది=ఒకానొక ఏటి యొక్క; పొంతన్=సమీపమున; గార్హస్థ్య=గృహస్థాశ్రమముతో; యుక్తమైన=కూడియుండిన; పుణ్యతపము=పవిత్రమైన తపస్సును; ఆచరించుచున్=చేయుచు; కూడియుండంగన్= కలసియుండగా; ఎంతయున్=మిక్కిలి; కాడుచేసి=కీడునుచేసి.

భావము :- త్రోవలో ఒక సెలయేటి ఒడ్డున రాక్షసులు గృహస్థాశ్రమమును స్వీకరించి భార్యాపుత్రాది బంధువులతో అభివృద్ధి పొందుచునే పవిత్రమైన తపస్సును చేయుచుండిరి. అట్లుండగా వారికి ఎంతయో అపకారము చేసి.

విశేషము :- గార్హస్థ్యము నాలుగు ఆశ్రమములలో రెండవది. ఆశ్రమములు నాలుగు. ఇవి: 1. బ్రహ్మచర్యము, 2. గార్హస్థ్యము, 3. వానప్రస్థము, 4. సన్న్యాసము.

తే॥ ఋషుల వెంబడి సంరంభ మెసఁగవచ్చు
తటిని నడుత్రోవ వనములోఁ దపముసేయు
దైత్యమునుల పుణ్యాశ్రమ స్థలము సొచ్చి
వఱదఁగొనిపోయె నిండు సర్వస్వములును. 181

అర్థము :- ఋషుల వెంబడి=సప్తర్షుల వెంట; సంరంభము=త్వర; ఎసఁగన్= అతిశయింపగ; వచ్చు=వచ్చుచున్న; తటిని=నది; నడుత్రోవ=నడిదారిలోని; వనములోన్= అరణ్యప్రదేశమున గల; దైత్యమునుల=రాక్షసమునుల యొక్క; తపము+ చేయు=తపస్సు చేసికొను; పుణ్య=పవిత్రమైన; ఆశ్రమ స్థలమున్=ఆశ్రమములున్న ప్రదేశమును; చొచ్చి= ప్రవేశించి; వఱదన్=పొంగునీటితో; నిండు సర్వస్వములును=పూర్ణమగు సమస్తమైన సొమ్మును; కొనిపోయెన్=తీసికొనిపోయెను.

భావము :- సప్తర్షుల వెంట గొదావరి పొంగి ప్రవహించుచు వచ్చుచున్నది. త్రోవలో రాక్షసమునుల ఆశ్రమ ప్రదేశములున్నవి. ఆ గోదావరీ వరద ప్రవాహమునకు ఆశ్రమ ప్రాంతములన్నియు నేలమట్టమైనవి. సర్వస్వము వరదకు కొట్టుకుపోయినది.

శా॥ ప్రాగ్వంశంబులు స్రుక్స్రువంబులును యూపస్తంభ పంక్తుల్ హవి
ర్భుగ్వేదీ నిలయంబులున్ వఱదలోఁ బోవంగ దేవార్చనా
స్రగ్వాసోఘటికా కమండలు బ్రుసీ సంఘాతముం దేలిపో
వాగ్వాదం బొనరించి రప్పుడు ముని వ్రాతంబుతో దానవుల్. 182

అర్థము :- ప్రాగ్వంశంబులు=యజ్ఞశాలలకు తూర్పుగ యజమానులుండు గృహములు; స్రుక్+స్రువంబులు=హోమము చేయుటకు ఉపయోగించు కొయ్య గరిటెలు; యూపస్తంభ పంక్తులు=బలిపశువులను కట్టివేయుటకు ఉపయోగించు పాతిన కొయ్యల వరుసలు; హవి...నిలయంబులున్. హవిస్+భుక్=హవిస్సులను భుజించు అగ్నిదేవుని; వేదీ నిలయంబులున్=వేదికలు గల శాలలును; వఱదలోన్=వరదపొంగులో; పోవంగ=కొట్టుకొని పోగా; దేవా...సంఘాతముం. దేవ+అర్చనా=దేవపూజ కవసరమైన; స్రక్=పూలమాలలు; వాసస్=వస్త్రములు; ఘటికా=ముంతలు; కమండలు=కమండలువులు; బ్రుసీ=ఆసనముల; సంఘాతమున్=సమూహము; తేలిపోన్=వరదనీటిపై తేలిపోగా; అప్పుడు=ఆ సమయమున; దానవుల్=రాక్షసులు; మునివ్రాతంబుతో=మునుల సమూహముతో; వాగ్వాదంబు=తగవులను; ఒనరించిరి=చేసిరి, (ఆడిరి).

భావము :- యజ్ఞములు చేయువారుండు పర్ణశాలలు, హోమములు చేయుట కుపయోగించు కొయ్య గరిటెలు, బలిపశువులను కట్టివేయుట కుపకరించు యూప స్తంభములు, హోమగుండములుండు శాలలు వరదలో కొట్టుకుపోయినవి. దైవపూజకు ఉపకరించు పూలమాలలు, వస్త్రములు, ముంతలు, కమండలువులు, ఆసనములు వరదలో తేలిపోయినవి. అపుడు రాక్షసమునులు దేవమునులతో తగవులాడిరి.

కం॥ ఆకాశ దివ్యమునులును
నాకౌకః ప్రత్యనీక నాయక మునులున్
వాకాటులకుం జొచ్చిరి
పాకంబులు దప్పినట్టి పటు రోషములన్. 183

అర్థము :- ఆకాశ=ఆకసమునందలి; దివ్యమునులును=దేవమునులైన సప్తర్షులును; నాకౌకః...మునులున్. నాకౌకః=స్వర్గమే నివాసముగ గల దేవతలకు; ప్రత్యనీక=శత్రువులైన; నాయకమునులున్=రాక్షస నాయకులైన మునులును; పాకంబులు+తప్పినట్టి=ఔచిత్యము తొలగినటువంటి; పటు=ప్రచండములగు; రోషములన్=కోపములతో; వాకాటులకున్=తగవులకు; చొచ్చిరి=దిగిరి.

భావము :- సప్తర్షులును, రాక్షస మునులును యోగ్యతలను విడిచిపెట్టి రోషపరవశులై తగవులకు దిగినారు.

తే॥ శిఖలు వీడఁగ ముఖములు జేగురింపఁ
గటము లదరంగ నొకవిడిఁ గాటులాడి
యొండొరుల మీఁద శాపంబు లుగ్గడింప
హస్తముల యందు సలిలంబు లందుకొనిరి. 184

అర్థము :- శిఖలు=జుట్టుముడులు; వీడఁగ=విడిపోగా; ముఖములు=మొగములు; జేగురింపన్=ఎఱ్ఱబడగా; కటములు=చెక్కిళ్ళు; అదరంగన్=అదురుచుండగా; ఒకవిడిన్=నిర్దేశింప వీలుగాని కోపముతో; కాటులాడి=తగవులాడి; ఒండొరులమీఁద=ఒకరిపై ఒకరు; శాపంబులు=శాపములను; ఉగ్గడింపన్=పలుకుటకు; హస్తములయందు=చేతులతో; సలిలంబులు=నీళ్ళు; అందుకొనిరి=తీసికొనిరి.

భావము :- దేవమునులు, రాక్షసమునులు నిర్దేశింప వీలులేని కోపముతో పరస్పరము తగవులాడుకొనుచుండగా వారి జుట్టుముడులు వీడిపోయినవి. మొగములు ఎఱ్ఱబడినవి. చెక్కిళ్ళు అదురుచున్నవి. ఒకరినొకరు శపించుకొనుటకు సిద్ధపడిరి. చేతులతో నీళ్ళు తీసికొనిరి.

వ॥ ఇట్లందుకొని దానవులు సప్తర్షి సమానీతయైన యవ్వాహిని శుష్కతోయ యయ్యెడుమనియును మునులు దానవులకు సమాశ్రయంబైన యప్పుణ్యవాహిని యపూజ్యయై యస్పృశ్య యయ్యెడు మనియును శపియించి రప్పుడు. 185

అర్థము :- ఇట్లు+అందుకొని=ఈ విధముగ (చేతులతో) నీరందుకొని; దానవులు=రాక్షసులు; సప్తర్షి సమానీత=సప్తర్షులుచే కొనిరాబడినది; ఐన=అయినటువంటి; ఆ+వాహిని=ఆ నది; శుష్కతోయ=ఎండిన నీరు కలది; అయ్యెడుము+అనియును= అగునుగాక అని; మునులు=దేవ ఋషులు; దానవులకు=రాక్షసులకు; సమాశ్రయంబు+ఐన= నివాస స్థానమైన; ఆ+పుణ్యవాహిని=ఆ పవిత్ర ప్రవాహము (తుల్యభాగానది); అపూజ్య+ఐ= పూజింప తగనిదై; అస్పృశ్య=తాకరానిది; అయ్యెడుము+అనియును=అగునుగాక అని; శపియించిరి=శపించిరి; అప్పుడు=ఆ సమయమున.

భావము :- ఈ విధముగ దేవమునులు రాక్షసమునులు చేతులతో నీరందుకొనిరి. సప్తర్షులచే కొనిరాబడిన ప్రవాహములోని నీరు ఎండిపోవు గాక అని రాక్షసమునులు, రాక్షసుల కాశ్రయమైన నదీ ప్రవాహము పూజనీయముకానిది, తాకరానిది యగుగాక అని దేవమునులు శపించిరి. ఆ సమయమున.

## తుల్యభాగయుత్పత్తి క్రమము

తే॥ అసురులకు నాశ్రయంబైన యా స్రవంతి
తుల్యభాగాహ్వయుండు దైత్యుండు దేరఁ
బూర్వమున గౌతమీ గంగఁ బుట్టివచ్చె
నందు రితిహాస తత్త్వజ్ఞులైన బుధులు. 186

అర్థము :- ఇతిహాస=పూర్వచరిత్ర (లు గల గ్రంథము లందలి)ల; తత్త్వజ్ఞులు+ఐన= సత్యము తెలిసినవారైన; బుధులు=పండితులు; అసురులకున్=రాక్షసులకు; ఆశ్రయంబు+ ఐన=ప్రాపైన; ఆ స్రవంతి=ఆ ఏరు; తుల్యభాగ+అహ్వయుండు= తుల్యభాగుడను పేరుగల; దైత్యుండు=రాక్షసుడు; తేరన్=తెచ్చుటకు; పూర్వమున=ముందే; గౌతమీగంగన్=గౌతమీ నదినుండి; పుట్టివచ్చెన్=పుట్టివచ్చినదని; అందురు=అనుచుందురు.

భావము :- రాక్షసుల కాశ్రయమైన ఆ ప్రవాహమును తుల్యభాగుడను రాక్షసుడు కొనిరాకముందే గౌతమీ గంగ నుండి పుట్టి వచ్చినదని ఇతిహాసములలోని సత్యమును తెలిసిన పండితులు చెప్పుచుందురు.

వ॥ తుల్యభాగుండను దైత్యుండు పరమార్థ తత్త్వజ్ఞుండై పక్షపాతంబు లేక సురాసురులకు మాధ్యస్థ్యంబున వివాదంబులు తీర్చుచుండుటకు సమర్థుండగుట నద్దానవుండు తుల్యభాగాహ్వయుం డనం బరఁగుట నన్వర్థనామధేయుండు.187

అర్థము :- తుల్యభాగుండు+అను=తుల్యభాగుడను పేరుగల; దైత్యుండు=రాక్షసుడు; పరమార్థ=సత్యము యొక్క; తత్త్వజ్ఞుండు+ఐ=భావమును తెలిసినవాడై; పక్షపాతంబు లేక=ఏ ఒక్కరియందు అభిమానము లేకుండ; సుర=దేవతలకు; అసురులకు=రాక్షసులకు; మాధ్యస్థ్యంబున=మధ్యవర్తి ధర్మముతో; వివాదంబులు=తగవులు; తీర్చుచుండుటకు= పరిష్కరించుటకు; సమర్థుండు+అగుటన్=తగినవాడగుటచేత; ఆ+దానవుండు=ఆ రాక్షసుడు; తుల్యభాగ+ఆహ్వయుండు=తుల్యభాగుడను పేరుతో; అనన్+పరఁగుట=అని పిలువబడుట చేత; అన్వర్థ=సార్థకమైన; నామధేయుండు=పేరుకలవాడు.

భావము :- తుల్యభాగుడనెడి ఆ రాక్షసుడు సత్యజ్ఞానమును తెలిసినవాడు. పక్షపాతము లేనివాడు. దేవతలకు, రాక్షసులకు మధ్యవర్తియై తగవులు తీర్చుటకు తగినవాడు. కనుకనే ఆ రాక్షసునకు తుల్యభాగుడను పేరు సార్థకమైనది.

కం॥ ఆ తుల్యభాగు పేరను
నా తటినికిఁదుల్యభాగయను నామము ప్ర
ఖ్యాతి వడసె నవ్వాహిని
గౌతమ కన్యకకుఁ గూర్మి కన్యక మొదలన్. 188

అర్థము :- ఆ తుల్యభాగు పేరనున్=ఆ తుల్యభాగుని పేరుమీదుగ; ఆ తటినికిన్=ఆ ఏరునకు; తుల్యభాగయను=తుల్యభాగ అనెడి;నామము=పేరు; ప్రఖ్యాతి+పడసెన్=ప్రసిద్ధి పొందినది; మొదలన్=పూర్వము; ఆ+వాహిని=ఆ ఏరు; గౌతమ కన్యకకున్=గౌతమీనదికి; కూర్మికన్యక=ప్రియమైన కుమారి.

భావము :- ఆ తుల్య భాగుని పేరుతో ఆ నదికి తుల్య భాగ అనుపేరు ప్రచారమై ప్రసిద్ధి పొందినది. పూర్వము ఆ ఏరు గౌతమీనదికి ప్రధానమైన ఉపనది.

సీ॥ ఆ తుల్యభాగ మహామునీంద్రుఁడు ప్రీతి
ముని దానవశ్రేణి మ్రోల నిలిచి
వరుసతో వాదించి యిరుదెఱంగుల వారి
వారించి "కోపంబు వలదు మీకు

శపియింపఁదగునయ్య సర్వసర్వం సహా
భువన పావనలైన పుణ్యనదులఁ
గ్రమ్మఱింపుఁడు శాప గరళాక్షరంబులు
క్రోధంబులేల తపోధనులకు"

తే॥ ననుటయును వారలామాట లాదరించి
క్రమ్మఱుపరాదు పలు కమోఘమ్ము మాకు
నీవునిప్పుడు చెప్పిన హితవు నూఁది
వేఱు చందాన మేలుగా వింతు మింక. 189

అర్థము :- ఆ తుల్యభాగ=ఆ తుల్యభాగుడనెడి; మహా=గొప్ప; ముని+ఇంద్రుడు=శ్రేష్ఠుడైన ఋషి; ప్రీతిన్=ప్రేమతో; ముని=సప్తర్షుల యొక్క; దానవశ్రేణి=రాక్షస సమూహము యొక్క; మ్రోలన్=దగ్గరగా; నిలచి=నిలబడి;

వరుసతో=క్రమమైన పద్ధతితో; వాదించి=తర్కించి; ఇరుతెఱంగుల వారిన్=రెండు పక్షములవారిని; వారించి=నివారించి; మీకు=మీకు; కోపంబు=కోపము; వలదు=తగదు.

సర్వ=సమస్తమైన; సర్వంసహా=భూమిని; భువన=లోకములను; పావనలు+ఐన=పరిశుద్ధము చేసెడివైన; పుణ్యనదులన్=పవిత్రమైన నదులను; శపియింపన్=శపించుటకు; తగును+అయ్య!=తగునా!

తపః+ధనులకున్=తపమేధనముగా గల (మీవంటి) వారికి; క్రోధంబులు+ఏల=కోపములెందులకు!; శాప=శాపములనెడి; గరళ+అక్షరంబులు=విషపు మాటలను; క్రమ్మఱింపుడు=మరలించుడు;

అనుటయు=అని పలుకుటతో; వారలు=వారు (ఆ సప్తర్షులు, ఆ రాక్షసులును); ఆ మాటలు=ఆ తుల్యభాగుని మాటలను; ఆదరించి=గౌరవించి, మాకు=మా యొక్క; పలుకు=మాట; అమోఘమ్ము=వ్యర్థము కానిది; క్రమ్మఱుపన్+ రాదు=మరల్చుట సాధ్యము కాదు; నీవున్=నీవు; ఇప్పుడు=ఈ సందర్భమున; చెప్పిన=చెప్పినటువంటి; హితవున్+ఊఁది=హితమును గ్రహించి; ఇంక=ఇకమీద; వేఱుచందాన=మరొక విధముగ; మేలున్=మంచిని; కావింతుము=చేసెదము.

**భావము** :- తుల్యభాగుడను పేరుగల ఆ మహాముని దేవతలకు రాక్షసులకు మధ్య నిలచినాడు. ఇరుపక్షముల వారిని తన ధర్మవాక్కులతో శాంతపరచినాడు. అన్నింటిని భరించు, అన్నిలోకములను పావనము చేయు పవిత్రములైన నదులను శపింపతగదు. కనుక

విషపూరితములైన శాపములను ఉపసంహరింపుడని చెప్పెను. వారుభయులు ఆ తుల్యభాగుని హితవాక్కును అంగీకరించిరి. అతనితో "మా పలుకు లమోఘములు. శాపములను ఉపసంహరింప సాధ్యము కాదు. అయినను నీ హితవాక్కును గ్రహించి మరొకవిధముగ మేలు చేయుదు" మని పల్కిరి.

వ॥ అని రాక్షసులు సప్తముని సింధువునకు నంతః ప్రవాహంబును, మునులు తుల్యభాగకు నుత్తరాయణ దక్షిణాయన పుణ్యకాలంబులను, సూర్య చంద్ర గ్రహణంబులను, ప్రతిభానువారంబునను, దర్శ పౌర్ణమాసీ ప్రభృతి మహా పర్వకాలంబులను, సంక్రమణంబులు మొదలైన విశేష కాలంబులను స్నానదాన జప తపో హోమ శ్రాద్ధ దేవార్చనా విధానంబు లక్షయ ఫలంబు లగునట్లుగాను, బతిసమేతంబుగా సతికి రజస్వలాత్వాద్యంతరాయంబు లేక యధశ్శయన బ్రహ్మచర్యోపవాస నియమంబులతో భానువార చతుష్టయంబు స్నానంబు సిద్ధించిన సంతాన ప్రాప్తియౌనట్టుగాను వరంబు ప్రసాదించిరి. తదనంతరంబ. 190

అర్థము :- అని=అని చెప్పి; రాక్షసులు=రాక్షసమునులు; సప్తముని సింధువునకున్=సప్తర్షులచే కొనిరాబడిన నదికి; అంతఃప్రవాహంబును=లోపలి ప్రవాహము కలిగియుండునట్లును; మునులు=సప్తర్షులు; తుల్యభాగకు=తుల్యభాగ అనుపేరుగల నదికి; ఉత్తరాయణ=ఉత్తరాయణము యొక్కయు; దక్షిణాయన=దక్షిణాయనము యొక్కయు; పుణ్యకాలంబులను=పవిత్రమైన సమయములందును; సూర్య చంద్ర గ్రహణంబులను=సూర్య గ్రహణ చంద్రగ్రహణ సమయము లందును; ప్రతి భానువారంబునను=ప్రతి ఆదివారమునందును; దర్శ=అమావాస్య; పౌర్ణమాసి=నిండుపున్నమ; ప్రభృతి=మొదలయిన; మహాపర్వకాలంబులను=గొప్పపండుగ దినములందును; సంక్రమణంబులు=సూర్యుడు ఒకరాశినుండి మరొక రాశిలోనికి ప్రవేశించు సమయములు; మొదలైన=మొదలగు; విశేషకాలంబులను=విశేషమైన సమయము లందును; స్నాన=పవిత్ర స్నానము చేయుట; దాన=దానములు చేయుట; జప=జపములు; తపస్=తపముల; హోమ=హోమములు; శ్రాద్ధ=పితృకర్మలు; దేవార్చనా=దేవతార్చనలు; విధానంబులు=చేయుటలు; అక్షయ ఫలంబులు= శాశ్వతమైన ఫలితములు కలవి; అగునట్లుగాను=అగునట్లుగను; పతిసమేతంబుగా= భర్తతోగూడ; సతికి=భార్యకు; రజస్వలాత్వ=ముట్టగుట; ఆది= మొదలైన; అంతరాయంబు= అడ్డంకి; లేక=లేకుండగ; అధః+శయన=నేలపడక; బ్రహ్మచర్య= బ్రహ్మచర్యము; ఉపవాస= నిరశన వ్రతము అను; నియమంబులతో=ఆచారములతో; భానువార చతుష్టయంబు=నాలుగు ఆదివారములు; స్నానంబులు=పవిత్ర స్నానములు చేయుట; సిద్ధించిన=కల్గినచో; సంతాన

ప్రాప్తి=సంతతి కలుగుట; ఔనట్టుగాను=తటస్థించునట్లుగను; వరంబు=వరమును; ప్రసాదించిరి=అనుగ్రహించిరి; తత్+అనంతరంబ=ఆ తరువాత.

భావము :- సప్త గోదావరమునకు అంతఃప్రవాహము కలుగునట్లు రాక్షసమునులు పల్కిరి. ఇక సప్తర్షులు తుల్యభాగానదికి - ఉత్తరాయణ దక్షిణాయన పుణ్యకాలములందును; సూర్య చంద్ర గ్రహణ సమయములందును, అమావాస్య పూర్ణిమ మొదలగు పర్వదినములందును, సూర్యసంక్రమణ వేళలందును, - స్నానములు జపతపములు హోమములు దేవపూజలు పితృకర్మలు చేసినచో శాశ్వత ఫలితములు కలుగునట్లుగను; భర్తతోసహా భార్య ముట్టు మొదలయిన అడ్డంకులు లేక నేలపడక, బ్రహ్మచర్యము ఉపవాసము చేసి నాలుగాదివారములు పవిత్రస్నానమాచరించినచో సంతానప్రాప్తి కలుగుననియు వరములను ప్రసాదించిరి. ఆ తరువాత.

విశేషము :- ఉత్తరాయణము, దక్షిణాయనము. సంవత్సరమునకు గల పండ్రెండు మాసములలో ఆరు మాసములు ఉత్తరాయణము, ఆరు మాసములు దక్షిణాయనము. సూర్యుడు ఒక్కొక్క రాశిలో ఒక్కొక్క నెల చొప్పున పండ్రెండు రాశులలో సంవత్సరము చరించును. మకరరాశి నుండి మిథునరాశి సాంతమగు వరకు సంచరించు కాలము ఉత్తరాయణము. కర్కాటక రాశి నుండి ధనూరాశి సాంతమగు వరకు సంచరించు కాలము దక్షిణాయనము.

మ॥ కెలనన్ ముందర సిద్ధ కింపురుషులుం గీర్వాణులు న్నాగ సా
ధ్యులు విద్యాధర కిన్నరేంద్రులు సముద్ఘోషింప దివ్యాప్సరో
లలనా బృందములాడ దానవులు పిల్లంగ్రోళ్ళు పట్టంగ బొ
బ్బలు నార్పుల్ పటు సింహనాదములు నుత్పాదిల్ల ధాత్రీస్థలిన్. 191

అర్థము :- కెలనన్=ప్రక్కన; ముందర=ముందు వైపున; సిద్ధ=సిద్ధులు; కింపురుషులున్=కింపురుషులు; గీర్వాణులున్=అమరులు; నాగ=నాగులు; సాధ్యులు=సాధ్యులు; విద్యాధర=విద్యాధరులు; కిన్నరేంద్రులు=కిన్నర శ్రేష్ఠులు; సముద్ఘోషింప=పొగడుచుండగా; దివ్య=దేవసంబంధమైన; అప్సరస్+లలనా=అప్సరః కాంతల; బృంద ములు=సమూహములు; ఆడన్=నాట్యము చేయుచుండగా; దానవులు= రాక్షసులు; పిల్లం గ్రోళ్ళు=పిల్లన గ్రోవులను; పట్టంగన్=ఊదగా; బొబ్బలున్=పెద్ద అఱపులును; ఆర్పుల్=కేకలు; పటు సింహనాదములున్=గొప్ప సింహగర్జనల వంటి గర్జనలును; ఉత్పాదిల్లన్=పుట్టగా; ధాత్రీస్థలిన్=భూమిమీద (తర్వాతి పద్యముతో అన్వయము)

భావము :- ప్రక్క భాగములందు, ముందువైపునను, సిద్ధులు, కింపురుషులు, అమరులు, నాగులు, సాధ్యులు, విద్యాధరులు, కిన్నరులు మొదలగు దేవగణములు పొగడుచు (గోదావరిని) వచ్చుచుండగా అప్సరసలు నాట్యము లాడుచుండగా, రాక్షసులు వేణువులు ఊదుచుండగా కేకలు, అరుపులు, గర్జనలు పుట్టగా భూమిమీద (తర్వాతి పద్యముతో అన్వయము)

విశేషము :- కింపురుషులు :- నరుని మొగము, గుఱ్ఱపు దేహము కలవారు.

కిన్నరులు :- గుఱ్ఱపు మొగము, నరదేహము కలవారు.

చ॥ మలఁగి మలంగి భీమపతి మందిర మండల సిద్ధ భూమికిం
దొలఁగి తొలంగి యుచ్చలిత తోయ తరంగ పరంపరోద్ధతిన్
జెలఁగి చెలంగి యారభటి శీర్ణధరాధర ధాతు రేణులం
గలఁగి కలంగి పాఱె వడి గౌతమకన్యక దక్షవాటికిన్. 192

అర్థము :- గౌతమ కన్యక=గౌతమీనది; దక్షవాటికిన్=దక్షారామమునకు; భీమ... భూమికిన్. భీమపతి=శ్రీ భీమేశ్వర స్వామి యొక్క; మందిర=ఆలయము గల; మండల= విస్తారమైన; సిద్ధభూమికిన్=పవిత్రమైన స్థలమునకు; మలఁగి మలంగి=మరలి మరలి; ఉచ్చలిత...ఉద్ధతిన్=ఉచ్చలిత=బాగుగా చలించుచున్న; తోయతరంగ=నీటి అలల; పరంపర= సమూహము యొక్క; ఉద్ధతిన్=ఉన్నతితో; తొలఁగి తొలంగి=ప్రక్కకు తప్పుకొని తప్పుకొని; ఆర...రేణులన్. ఆరభటి=అతిశయముతో; శీర్ణ=తునుకలైన; ధరాధర=కొండలయందలి; ధాతు=మట్టి, మూలికలు మొదలగువాని; రేణులన్=దుమ్ములతో; చెలఁగి చెలంగి=విజృంభించి విజృంభించి; కలఁగి కలంగి=కలుషితమై కలుషితమై; వడిన్=వేగముగ; పాఱె=ప్రవహించినది.

భావము :- గౌతమీ (గోదావరి) నది దక్షారామము నందలి శ్రీ భీమేశ్వర స్వామి ఆలయము గల విస్తార పవిత్ర ప్రదేశమునకు నీటి అలల ఎగసిపాటుతో ఉరకలు వెట్టుచు, వేగము వలన గొప్పశబ్దములు చేయుచు, త్రోవలోని కొండలమీది మట్టి మూలికలు చూర్ణమై ఆ దుమ్ము తనలో కలవగా చెదరి చెదరి చెలరేగుచు వేగముగ పాఱినది.

విశేషము :- మలఁగి మలంగి, తొలఁగి తొలంగి, చెలఁగి చెలంగి, కలఁగి కలంగి అను అర్ధబిందు పూర్ణబిందు యుక్త అసమాపక క్రియాద్వయ ప్రయోగముచే గోదావరీ ప్రవాహ వేగ గమన వైవిధ్యము ధ్వనించుచున్నది.

తే॥ దేవ దుందుభు లుడువీథి దీటు కొలుప
నమరు లందంద పుష్పవర్షములు గురియ
ముని జనంబులు జయజయ ధ్వనులొనర్ప
దక్షవాటంబు చొచ్చె గౌతమ తనూజ. 193

అర్థము :- గౌతమ తనూజ=గౌతముని పుత్రికయగు గోదావరి, ఉడువీథిన్=నక్షత్ర మార్గమున; దేవదుందుభులు=వేల్పుఢక్కలను (ధ్వనులను); దీటు కొలుపన్=వ్యాపింపజేయగా; అమరులు=దేవతలు; అందంద=అక్కడక్కడ; పుష్పవర్షములు=పూలవానలు; కురియన్= కురియింపగా; మునిజనంబులు=మునుల సమూహము; జయజయధ్వనులు= జయజయ ధ్వానములను; ఒనర్పన్=చేయగా; దక్షవాటంబున్=దక్షారామమును; చొచ్చెన్=ప్రవేశించెను.

భావము :- ఆకాశమున దేవతలు మంగళ వాద్యములను మ్రోగించుచుండగా, అక్కడక్కడ అమరులు పూలవానలు కురియించుచుండగా, మునులు జయజయ నినాదములు చేయుచుండగా గోదావరీనది దక్షారామమును ప్రవేశించినది.

వ॥ ఇవ్విధంబున గోదావరీ పుణ్యవాహినిం గొనివచ్చి సప్తర్షులు పరమ హర్షోత్కర్షంబున. 194

అర్థము :- ఈ+విధంబున=ఈ రీతిగ; సప్తర్షులు=ఏడుగురు దేవమునులును; గోదావరి=గోదావరి అను పేరుగల; పుణ్యవాహినిన్=పవిత్రమైన నదిని; కొనివచ్చి=తెచ్చి; పరమ=మిక్కిలి యగు; హర్ష=సంతోషము యొక్క; ఉత్కర్షంబునన్=ఆధిక్యము చేత.

భావము :- సప్తర్షులు ఈ విధముగ పవిత్ర గోదావరీ నదిని దక్షారామమునకు గొనివచ్చి మిక్కిలి సంతోషాతిశయముతో.

## శ్రీ భీమనాథేశ్వరుఁడు దనకుఁదాన ప్రతిష్ఠితుండగుట

తే॥ తారుఁదలఁచిన శుభవేళ దప్పకుండ
సంప్రతిష్ఠితుఁడై సమర్చనముఁగొన్న
యమృత లింగంబు భీమనాయకునిఁజూచి
చాల విస్మయ మందిరి సప్తమునులు. 195

అర్థము :- సప్తమునులు=సప్తర్షులు; తారున్=తాము; తలఁచిన=భావించిన; శుభవేళ=శుభముహూర్తము; తప్పకుండ=దాటకుండగ; సంప్రతిష్ఠితుఁడు+ఐ=స్థాపింపఁబడిన వాడై; సమర్చనమున్=పూజను; కొన్న=పొందిన; అమృతలింగంబు=అమృతలింగ

స్వరూపుడైన; భీమనాయకునిన్=శ్రీ భీమేశ్వర స్వామిని; చూచి=చూచి; చాల=మిక్కిలిగ; విస్మయము+ అందిరి=ఆశ్చర్యమును పొందిరి.

భావము :- సప్తర్షులు తాము నిర్ణయించిన శుభ ముహూర్త సమయము దాటకుండ ప్రతిష్ఠింపబడి పూజనందుకొన్న అమృతలింగ రూపుడైన శ్రీ భీమేశ్వర స్వామిని చూచి అత్యాశ్చర్యమును పొందిరి.

వ॥ ఇట్లాశ్చర్యంబునుం బొంది. 196

అర్థము :- ఇట్లు=ఈ విధముగ; ఆశ్చర్యంబునున్=అచ్చెరువును; పొంది=పొంది.

భావము :- ఈ విధముగ ఆశ్చర్యపడి.

ఉ॥ తారు వినిశ్చయించిన ప్రధాన ముహూర్తము దప్పకుండఁ గా
మారి ప్రతిష్ఠఁ బొందుటకు నాత్మల సంతసముల్ వహించి యె
వ్వారొక మమ్ముఁ గైకొనక వారక మేమొనరింపనున్న సం
స్కారము తార చేసి రెడసందున నంచుఁ గలంగి యెంతయున్. 197

అర్థము :- తారు=తాము; వినిశ్చయించిన=నిర్ణయించిన; ప్రధాన=ముఖ్యమైన; ముహూర్తము=శుభసమయము; తప్పకుండన్=దాటకుండగా; కామ+అరి=మన్మథుని శత్రువైన శంకరుడు; ప్రతిష్ఠన్=స్థాపనను; పొందుటకున్=పొందుటకు; ఆత్మలన్=మనసులలో; సంతసముల్+వహించి=సంతోషములను పూని; మమ్మున్=మమ్ములను; కైకొనక=స్వీకరింపకయే; మేము=మేము; ఒనరింపన్+ఉన్న=చేయనున్న; సంస్కారము=ప్రతిష్ఠా రూపమైన సత్కార్యమును; ఏ+వారొకొ=ఎవరో; వారక=భయము లేక; ఎడసందునన్=మధ్యలో; తార=తామే; చేసిరి=చేసినారు; అంచున్=అనుచు; ఎంతయున్=మిక్కిలి; కలంగి=బాధపడి.

భావము :- సప్తర్షులు తాము నిర్ధయించిన శుభ సమయము మించి పోకుండగ శ్రీ భీమేశ్వరుడు ప్రతిష్ఠ పొందినందులకు మనసులలో సంతోషించిరి గాని తాము చేయవలసిన ప్రతిష్ఠా సంస్కారమును తమకు తెలియకుండ, తమతో చెప్పకుండ నిర్భీకులై ఎవరు చేసిరో అని మిక్కిలి బాధపడి.

తే॥ రోష సంరంభములును సంతోషములును
హృదయములఁ బిక్కటిలనున్న ఋషులకడకు
నంతరిక్షంబు నందుండి యతిరయమున
భాను మంతుండు భక్తిసంభ్రమము లెసఁగ. 198

అర్థము :- రోష సంరంభములు=కోపము, ఉద్రేకమును; సంతోషములును= ఆనందములును;హృదయములన్=మనసులలో; పిక్కటిలన్+ ఉన్న=అతిశయించి ఉన్నట్టి; ఋషులకడకున్=సప్తర్షుల వద్దకు; భానుమంతుండు=సూర్యుడు; అంతరిక్షంబునందుండి= ఆకాశము నుండి; అతిరయమున=మిక్కిలి వేగముగ; భక్తి సంభ్రమములు=భక్తియు, వేగిరపాటును; ఎసఁగన్=అతిశయింపగా.

భావము :- సప్తర్షులు సంతోషములతోపాటు కోపములు ఆవేశములు అతిశయించి ఉండిరి. అట్టి వారికడకు సూర్యుడు భక్తి, వేగిరపాటులతో తత్తరపడుచు ఆకాశమునుండి వేగముగ (వచ్చెను).

వ॥ వచ్చి యభివాదనంబు చేసి ముకుళిత కరకమలుండై కమల మిత్రుండమ్మహామునుల కిట్లనియె. 199

అర్థము :- కమల మిత్రుండు=సూర్యుడు; వచ్చి=వచ్చి; ఆ+మహామునులకు=ఆ మహర్షులకు; అభివాదనంబు=నమస్కారము; చేసి=చేసి; ముకుళిత=ముడిచిన; కరకమలుండై=పద్మముల వంటి చేతులు కలవాడై; ఇట్లు+అనియె=ఈ విధముగ పల్కెను.

భావము :- సూర్యుడు వచ్చి సప్తర్షులకు చేతులు జోడించి నమస్కరించి వారితో నిట్లనెను.

చం॥ పరమ మునీంద్రులార మిముఁ బ్రార్థన చేయుచు విన్నవించెదన్
గరుణ దలిర్ప మీ చనవుఁ గైకొని నన్ను ననుగ్రహింపుఁడీ
తెరువున మీకు నంకిలులు దీర్పఁగఁ గాల విలంబమైన దా
హరుఁడు ప్రతిష్ఠితుండునగు నప్పుడు నేనటు పూజ చేసితిన్. 200

అర్థము :- పరమ=ప్రధానమైన; మునీంద్రులార=ఋషిశ్రేష్ఠులారా!; మిమున్= మిమ్ములను; ప్రార్థన చేయుచు=వేడుకొనుచు; విన్నవించెదన్=విన్నపము చేయుచుంటిని; కరుణ=దయ; తలిర్పన్=చిగురింపగా; మీ చనవున్=మీ ఘనతను; కైకొని=పూని; నన్నున్=నన్ను; అనుగ్రహంపుఁడీ=దయచూడుడు; మీకున్=మీకు; తెరువున=మార్గమున; అంకిలులు=ఆటంకములు; తీర్పఁగన్=నివారించుటకు; కాలవిలంబమైన=సమయము ఆలస్యముకాగా; హరుఁడు=శ్రీ భీమనాథుడు; తాన్=తనకుతానే; ప్రతిష్ఠితుండున్=స్థాపితుడు; అగునప్పుడు=అయిన సమయమున; నేను=నేనే; అటు=ఆ విధముగ; పూజ చేసితిన్= పూజించితిని.

భావము :- ఓ మహర్షులారా! మిమ్ములను వేడికొనుచు విన్నవించుకొనుచున్నాను. మీరు ఘనులు. దయతో నన్ను అనుగ్రహింపుడు. మీకు మార్గమున ఆటంకములను నివారించుకొనుటయందు ఆలస్యమగుటచేత శ్రీ భీమేశ్వర స్వామి తనకు తానే ప్రతిష్ఠితుడైనపుడు నేనే ఆ విధముగ పూజ చేసితిని.

కం॥ మీరొనరించు ప్రతిష్ఠా
ప్రారంభము నాకుఁ జేయ నలవియె శ్రీ ద
క్షారామ విభుఁడు జగదా
ధారుఁడు గైకొనియెఁ దనకుఁ దాన ప్రతిష్ఠన్. 201

అర్థము :- మీరు+ఒనరించు=మీరు చేయు; ప్రతిష్ఠా=స్థాపన యొక్క; ప్రారంభము=పూనిక; చేయన్=చేయుట; నాకున్=నాకు; అలవియె=సాధ్యమా! జగత్+ఆధారుఁడు=జగత్తుకు ఆధారమైన; శ్రీ దక్షారామ విభుఁడు=శ్రీ దక్షారామ భీమేశ్వర స్వామి; తనకున్+తాన=తనకు తానుగనే; ప్రతిష్ఠన్=స్థాపనను; కైకొనియెన్=పూనెను.

భావము :- ఓ మహర్షులారా! మీరు చేయవలసిన ప్రతిష్ఠా కార్యక్రమమును చేయుట నాకు సాధ్యమా! కాదు. శ్రీ భీమేశ్వర స్వామి తనకు తానే ఆ శుభముహూర్తమున ప్రతిష్ఠను పొందెను.

కం॥ మేలెట్టి దట్టి శోభన
కాలము సరిగడచెనేని కాదని కంఠే
కాలుఁడు కారుణ్యసము
న్మీలిత మతిఁదనకుఁదాన నిలువంబడియెన్. 202

అర్థము :- మేలు=మంచి; ఎట్టిది=ఎటువంటిదో; అట్టి=అటువంటి; శోభన కాలము=శుభముహూర్తము; సరిగడచెన్+ఏని=మించినచో; కాదు+అని=మేలుకాదని; కంఠే కాలుఁడు=శంకరుడు; కారుణ్య=దయార్ద్రసము; సమున్మీలిత=మిక్కిలిగ వికసించిన; మతిన్=మనసుతో; తనకున్+తాన=తనకు తానుగనే; నిలువంబడియెన్=నెలకొనెను.

భావము :- మీరు నిర్ణయించిన శుభముహూర్తము మేలైనదగుటచే అట్టి సుముహూర్తము వేళదాటరాదని భావించి కాలకంఠుడైన శ్రీ భీమేశ్వరస్వామి దయాసముద్రుడై తనకు తానే నెలకొనెను.

మ॥ తనకుం దాన ప్రతిష్ఠితుండయిన యీ దక్షాధ్వరధ్వంసి నే
మును పూజించితిఁ బిమ్మటన్ హరియు నంభోజాతగర్భుండునుం
గని కైసేసిరి యంతమీఁద సురలుం గంధర్వులుం జేరి య
ర్చనముల్ చేసిరి మీరుఁ జేయుఁడు తగన్ సమ్యక్సమారాధనల్. 203

అర్థము :- తనకున్+తాన=తనకు తానుగ; ప్రతిష్ఠితుండు+ఐన=నెలకొనిన; ఈ+దక్ష+అధ్వర+ధ్వంసిన్=(దక్షయజ్ఞమును నాశనము చేసిన) ఈ శంకరుని; ఏన్+మును=నేను ముందుగ, పూజించితిన్=పూజ చేసితిని; పిమ్మటన్=తరువాత; హరియున్=విష్ణుమూర్తియు; అంభోజాత గర్భుండునున్=బ్రహ్మదేవుడును; కని=చూచి; కైసేసిరి=పూజించిరి; అంతమీఁద=ఆ తర్వాత; సురలున్=దేవతలును; గంధర్వులున్=గంధర్వులును; చేరి=సమీపించి; అర్చనముల్=పూజలు; చేసిరి=చేసిరి; మీరున్=మీరుకూడ; తగన్=తగిన విధముగ; సమ్యక్+సమారాధనల్=బాగైన పూజలను; చేయుఁడు=చేయుడు.

భావము :- ఓ సప్తర్షులారా! దక్షయజ్ఞ విధ్వంసకుడైన ఈ శ్రీ భీమేశ్వర స్వామి తనకు తానుగ ప్రతిష్ఠితుడైన సమయమున ముందుగా నేను ఆ స్వామిని పూజించితిని. తరువాత విష్ణుమూర్తి బ్రహ్మదేవుడు వచ్చి అర్చించిరి. ఆ తరువాత దేవతలు గంధర్వులు చేరి కొలిచిరి. మీరుకూడ ' స్వామికి సముచిత సేవలందింపుడు.

తే॥ అనిన సంయములును గాల యాపనమునఁ
జంద్రశేఖరు సంప్రతిష్ఠాపనంబు
తమకు సిద్ధింపకునికి సంతాపమొందఁ
బలికె నాకాశవాణి విస్పష్టఫణితి. 204

అర్థము :- అనిన=అని సూర్యుడు చెప్పగా; సంయములును=ఆ ఋషులు; కాలయాపనమునన్=ముహూర్తకాలము మించిపోవుటచేత; చంద్రశేఖరున్=(చంద్రుని శిరసున ధరించినవాడైన) శంకరుని యొక్క; సంప్రతిష్ఠాపనంబు=బాగుగా ప్రతిష్ఠించుట అను సంస్కారము; తమకు=తమకు; సిద్ధింపకునికి=లభింపక పోవుటచే; సంతాపము+ఒందన్=మిక్కిలి బాధపడుచుండగా; ఆకాశవాణి=అశరీరవాణి; విస్పష్టఫణితిన్=మిక్కిలి స్పష్టమైన వాక్కుతో; పలికెన్=చెప్పెను.

భావము :- ఆ విధముగ సూర్యుడు చెప్పినను సప్తర్షులు తృప్తిపడలేదు. గోదావరీనదిని తెచ్చుటలోనైన ఆలస్యముచేత ముహూర్త సమయమునకు శ్రీ భీమేశ్వర స్వామిని ప్రతిష్ఠ చేయు ఘనకార్య సాధన లభింపలేదని బాధపడుచుండిరి. అపుడు అశరీరవాణి వారితో వివరముగ పల్కినది.

ఉ॥ ఓ పరమర్షులార! కరుణోదధి యిందు వతంసుఁడాత్మ సం
స్థాపితుఁడయ్యు మీదెసఁ బ్రసాదము పేర్మి భవత్ప్రయత్న సం
స్థాపితుఁడైన వాఁడ యిది సత్యము మీరు మనంబులోన సం
తాపముఁ బొందకుండుఁడు ప్రధానము భక్తియ కాదె యిమ్మహిన్. 205

అర్థము :- ఓ పరమ+ఋషులార=ఓ గొప్ప మునులారా! కరుణా+ఉదధి=దయా సముద్రుడైన; ఇందు+వతంసుఁడు=చంద్రశేఖరుడైన శంకరుడు; ఆత్మ=తనకు తాను; సంస్థాపితుఁడు+అయ్యు=ప్రతిష్ఠితుడయి కూడ; మీదెసన్=మీపట్ల; ప్రసాదము పేర్మి=అనుగ్రహము యొక్క అతిశయము చేత; భవత్=మీ యొక్క; ప్రయత్న=పూనిక వలననే; సంస్థాపితుఁడు+ఐనవాఁడ=ప్రతిష్ఠితుడయినాడు; ఇది=నేను చెప్పిన ఈమాట; సత్యము=నిజము; మీరు=మీరందరు; మనంబులోనన్=మనసులో; సంతాపమున్=బాధను; పొందకుండుఁడు=అనుభవింపకుడు; ఈ+మహిన్=ఈ భూమిమీద; ప్రధానము=ముఖ్యమైనది; భక్తియ+కాదె=భక్తియే కదా!

భావము :- ఓ సప్తర్షులారా! చంద్రశేఖరుడైన శంకరుడు దయాసముద్రుడు. తనకు తానుగ ప్రతిష్ఠితుడైనను మీ యందు అనుగ్రహమే కలిగియుండెను. మీ ప్రయత్నము వలననే స్థాపితుడయ్యెను. ఇది నిజము. మీరు బాధపడకుడు. ఈ భూమి మీద భక్తి ప్రధానమైనది.

తే॥ అల్పమే మీరు చేసిన యట్టి భక్తి
యభవ మూర్ధాభిషేకార్థ మధికభక్తిఁ
దెచ్చితిరి గౌతమీ మహాదివ్యతటినిఁ
బాదపీఠోపకంఠ భూభాగమునకు. 206

అర్థము :- అభవ=శంకరుని; మూర్ధ=శిరస్సును; అభిషేక+అర్థము=అభిషేకించుట కొరకై; అధిక భక్తిన్=మిక్కిలి భక్తితో; గౌతమీ=గౌతమి అనెడి; మహా=గొప్ప; దివ్యతటినిన్=ప్రకాశమానమైన నదిని; పాద...భాగమునకు. పాదపీఠ=పాదములుంచుకొనెడి పీట యొక్క; ఉపకంఠ=సమీపమునందలి; భూభాగమునకు=భూమి భాగమునకు; తెచ్చితిరి=తీసికొని వచ్చితిరి; మీరు=మీరందరును; చేసిన+అట్టి=చేసినటువంటి; భక్తి=సేవ; అల్పమే=స్వల్పమైనదా! కాదు.

భావము :- శ్రీ భీమేశ్వర స్వామికి అభిషేకము చేయుటకై దివ్యమైన గౌతమీనదిని తెచ్చి స్వామివారి పదపీఠ సమీప భూభాగమున ప్రవహించునట్లు చేసితిరి. మీరు చేసిన సేవ మాత్రము అల్పమైనదా!

మ॥ అభిమానించిన మీర లేడ్వురుఁ బ్రతిష్ఠారంభ కాలంబునం
దభిషేకించిన తిగ్మభానుఁడును నేకార్థక్రియన్మించు వాం
డ్రు, భవార్చారతినెంచ మీర లెనమండ్రుం నిల్పి నారంబికా
విభునిన్ సత్యమ నేను చెప్పితి నభోవీథీవిటంకంబునన్. 207

అర్థము :- అభిమానించిన=గౌరవించిన; మీరలు+ఏడ్వురున్=మీరేడ్గురును; ప్రతిష్ఠా=స్థాపన యొక్క; ఆరంభ=పూనిక; కాలంబునందు=సమయమున; అభిషేకించిన=అభిషేకము చేసిన; తిగ్మభానుఁడునున్=వేడికిరణములు కల సూర్యుడును; ఏక+అర్థక్రియన్=ఒకే ప్రయోజనమును గూర్చిన పనియందు; మించు వాండ్రు=గొప్పవారు; భవ=శంకరుని; అర్చా=సేవించుటయందు; రతిన్=కోరిక యందు; ఎంచన్=తలపగా; అంబికా విభునిన్=పార్వతీ పతిని; మీరలు+ఎనమండ్రున్=మీరు ఎనిమిది మందియు; నిల్పినారు=నెలకొల్పినారు; నభోవీథీ=ఆకాశ మార్గము యొక్క; విటంకంబునన్=అంచున; సత్యము=నిజమును; నేను=నేను; చెప్పితిన్=చెప్పితిని.

భావము :- అభిమానముతో చూచిన మీ సప్తర్షులును, శంకరుడు తనకు తానుగ ప్రతిష్ఠితుడైన సమయమున పూజించిన సూర్యుడును ఒకే ప్రయోజనము నాశించి పనిచేసినారు. గొప్పవారైనారు. శంకరుని సేవించు కోరికయందు మీ అసక్తిని పరిశీలించితిని. మీ ఎనమండుగురును శ్రీ భీమేశ్వరుని ప్రతిష్ఠించినట్లేయగును. నేను ఆకాశమార్గము నుండి చెప్పుచుంటిని. ఇది నిజము.

తే॥ మీర లెనమండ్రు భుజగేంద్రహారునొద్ద
భక్తిఁ బూజింపఁ బెట్టుఁడు పాశుపతుల
వారిపేరష్టమూర్తులు గారవమున
వారిఁదాఁకఁగ నర్హు లెవ్వారలైన. 208

అర్థము :- మీరలు+ఎనమండ్రు=మీరెనిమిది మందియు; భుజగ+ఇంద్ర+హారునొద్దన్=(సర్పరాజును హారముగ ధరించిన) శంకరుని సమీపమున, భక్తిన్=భక్తితో; పాశుపతులన్=పాశుపతము వ్రతము కలవారిని; పూజింపన్=పూజించుటకై; పెట్టుఁడు=నెలకొల్పుడు; వారి=మీచే నెలకొల్పబడినవారి; పేరు=పేరు; అష్టమూర్తులు=అష్టమూర్తులు; వారిన్=ఆ అష్టమూర్తులను గారవమునన్=భక్తితో; ఏ+వారలైన=ఎవరైనను; తాఁకఁగన్=తాకుటకు; అర్హులు=తగినవారు.

భావము :- మీరెనిమిది మందియు శ్రీ భీమేశ్వర స్వామికి సమీపమున పాశుపతులను స్థాపింపుడు. వారు అష్టమూర్తులని ప్రసిద్ధి చెందెదరు. ఆ అష్టమూర్తులను భక్తిప్రేమలతో తాకుటకు అందరు తగియుందురు.

తే॥ అష్టమూర్తి విశిష్టాన్వయప్రసూతుఁ
డర్హుఁ డేపాటి వాఁడైన నభవునంట
వేదశాస్త్ర పురాణ సంవేదియైన
నితరుఁడర్హుండు గాఁడు భీమేశునంట. 209

అర్థము :- అష్టమూర్తి=అష్టమూర్తుల యొక్క; విశిష్ట=మిక్కిలి శ్రేష్ఠమైన; అన్వయ=వంశములందు; ప్రసూతుఁడు=పుట్టినవాడు; ఏపాటివాఁడైన=ఏ మాత్రపువాడైనను; అభవున్=శ్రీ భీమనాథుని; అంటన్=తాకుటకు; అర్హుండు=తగినవాడు; ఇతరుఁడు=ఇతరుడెవడైనను; వేద=వేదములను; శాస్త్ర=శాస్త్రములను; పురాణ=పురాణములను; సంవేది+ఐనన్=బాగుగా తెలిసిన వాడైనను; భీమేశున్=శ్రీ భీమనాథ స్వామిని; అంటన్=తాకుటకు; అర్హుండు=తగినవాడు; కాఁడు=కాడు.

భావము :- అష్టమూర్తుల వంశములందు పుట్టిన ఎటువంటి వాడైనను శ్రీ భీమేశ్వరుని తాకుటకు తగియుండును. ఇతరుడెంతటి వేద శాస్త్ర పురాణములు చదివిన వాడైనను శ్రీ భీమనాథుని తాకుటకు అర్హుడు కాడు.

వ॥ అని యాకాశవాణి మీరలును సూర్యుడును సములని యుద్దేశించి పల్కిన విని హర్షంబు నొంది మహర్షులు నభోమణి నభినందించి యతండును దామును హేమకుంభముల సప్తగోదావర ప్రవాహాంబుపూరంబులు దెచ్చి యయ్యభవు నభిషేకించి పూజించిరి. సప్తర్షి సమానీత గావున నమ్మహానదికి సప్తగోదావరాహ్వయంబు సంభవించెనని చెప్పుటయు శ్రీ భీమేశ్వర మహాదేవు మాహాత్మ్యంబు విన వేడుకయయ్యెడు నయ్యాశాను పుణ్యకథా విధానంబు వినిపంపవే యనుటయు. 210

అర్థము :- అని=అని; ఆకాశవాణి=అకాశవాణి; మీరలును=మీ ఏడుగురును; సూర్యుండును=సూర్యుడును; సములు+అని=సమానమైనవారని; ఉద్దేశించి=భావించి; పల్కిన=పలుకగా; విని=వినినవారై; హర్షంబున్=సంతోషమును; ఒంది=పొంది; మహర్షులు=గొప్ప మునులు; నభోమణిన్=సూర్యుని; అభినందించి=పొగడి; అతండును=ఆ సూర్యుడును; తామును=తామైన సప్తర్షులును; హేమ కుంభములన్=బంగారు కుండలతో; సప్తగోదావర=సప్తగోదావరమనెడి; ప్రవాహ=సరస్సునందలి; అంబుపూరంబులు=ప్రవాహ జలముల; తెచ్చి=కొనివచ్చి; ఆ+అభవున్=ఆ భీమేశ్వర స్వామిని; అభిషేకించి=అభిషేకము చేసి; పూజించిరి=పూజచేసిరి; సప్తర్షి=సప్తర్షులచే; సమానీత=కొనిరాబడినది; కావునన్=అగుటచేత; ఆ+మహానదికి=ఆ గొప్పనదికి; సప్తగోదావర+అహ్వయంబు= సప్తగోదావరమనెడి

పేరు; సంభవించెన్=కలిగెను; అని=అని; చెప్పుటయు=చెప్పిన పిమ్మట; శ్రీ భీమేశ్వర మహాదేవు=శ్రీ భీమేశ్వర స్వామి యొక్క; మాహాత్మ్యంబు=మహత్త్వమును గూర్చి; వినిన్= వినుటకు; వేడుక=కోరిక; అయ్యెడున్=అగుచున్నది; ఆ+ఈశాను=ఆ శంకరుని; పుణ్యకథా విధానంబు=పుణ్య చరిత్ర వివరము; వినిపింపవే=విన్పింపుము; అనుటయు=అని అడుగుట యును.

భావము :- మీరు, సూర్యుడు సమానమని సప్తర్షులతో ఆకాశవాణి పల్కినది. సప్తర్షులు సంతోషించినారు. సూర్యుని పొగడినారు. సప్తర్షులు, సూర్యుడు బంగరు కుండలతో సప్త గోదావర జలములను తెచ్చి శ్రీ భీమేశ్వర స్వామిని అభిషేకించినారు. అర్చించినారు. సప్తర్షులచే కొనిరాబడినది గనుక ఆ నదికి సప్త గోదావరమని పేరువచ్చినది అని వశిష్ఠుడు మంకణమునికి చెప్పినట్లు సూతముని శౌనకాది మహామునులకు చెప్పినాడు. శ్రీ భీమేశ్వర స్వామి మహత్త్వమును గూర్చి చెప్పుమని శౌనకాది మునులు సూతమహర్షిని అడిగినారు.

మ॥ అవనీ భారధురీణ! రీణరిపు సైన్యాధీశ! ధీశక్తి వై
భవ లీలాజిత కావ్య! కావ్యరచనా పారీణతావాస! వా
సవ భోగ ప్రతిమాన! మానవినయాచారార్థ సంభార! భా
రవిసంకాశ! మహాకవీంద్ర పరిషత్ప్రస్తూయమానోదయా!. 211

అర్థము :- అవనీ=భూమి యొక్క; భార=బరువును మోయుటయందు; ధురీణ= శ్రేష్ఠుడవైనవాడా!; రీణ=క్షీణించిన; రిపు=శత్రువుల; సైన్యాధీశ=సేనానాయకులు కలవాడా!; ధీశక్తి=బుద్ధిబలము యొక్క; వైభవలీలా=విరివితనమనెడి విలాసముతో; జిత=జయింపబడిన; కావ్య=శుక్రుడు కలవాడా!; కావ్యరచనా=కావ్యములు రచించుటలో; పారీణతా= నేర్పరితనమునకు; ఆవాస=నివాసమైన వాడా!; వాసవ=ఇంద్రుని; భోగ=వైభవముతో; ప్రతిమాన=సమానమైన వైభవము కలవాడా!; మాన=అభిమానము; వినయ=వినయము; ఆచార=సదాచారము; అర్థ=ధనముల; సంభార=పరిపూర్ణత కలవాడా!; భా=కాంతియందు; రవి=సూర్యునితో; సంకాశ=సమానమైనవాడా!; మహాకవీంద్ర=గొప్ప కవిశ్రేష్ఠుల; పరిషత్= సమూహముచే; ప్రస్తూయమాన=మిక్కిలిగ కీర్తింపబడుచున్న; ఉదయా=అభివృద్ధి కలవాడా!;

భావము :- ఓ అన్నయమంత్రీ! భూభారమును వహింప సమర్థుడవు. నీ శత్రుసేనానాయకులు నీధాటికి నీరుకారిపోదురు. బుద్ధి బలసంపదలో శుక్రుని మించినవాడవు. కవివి. ఇంద్ర భోగమునకు సమమైన వైభవము కలవాడవు. అభిమానము, వినయము, సదాచార సంపత్తి మొదలగు వానియందు పరిపూర్ణుడవు. కాంతిలో సూర్యునకు సమానుడవు. మహాకవులచే కీర్తింపబడుచుండు వాడవు. అభివృద్ధి కలవాడవు.

విశేషము :- ఈ పద్యమున శబ్దాలంకారమైన ముక్తపద గ్రస్తము కలదు.

కం॥ కాశ్యప గోత్ర పవిత్ర! య
వశ్యాయ ధరాధరోద్భవాధిప భక్తా!
వేశ్యాకటాక్ష దీక్షా
వశ్య విహారాపహసిత వాసవ తనయా!. 212

అర్థము :- కాశ్యపగోత్ర=కాశ్యపగోత్రము నందలి; పవిత్ర=నిర్మలమైనవాడా!; అవశ్యాయ ధరాధర=మంచుకొండకు; ఉద్భవ=పుట్టిన పార్వతి యొక్క; అధిప=భర్తయైన శంకరుని యొక్క; భక్తా=భక్తుడవైన వాడా!; వేశ్యా=వేశ్యల యొక్క; కటాక్ష దీక్షా=చూపుల పట్టుదలకు; అవశ్య=వశముకాని; విహార=సంచారముతో; అపహసిత=తక్కువ చేయబడిన; వాసవతనయా=ఇంద్రుని కుమారుడైన అర్జునుడు కలవాడా.

భావము :- ఓ అన్నయమంత్రీ! నీవలన నీ కాశ్యప గోత్రము పవిత్రమైనది. పార్వతీపతికి పరమ భక్తుడవు. అర్జునునికన్న మిన్నయైన ధీరుడవు.

విశేషము :- అవశ్యాయము అనగా మంచు. అవశ్యాయస్తు నీహార స్తుషార స్తుహినం హిమమ్ ప్రాలేయం మిహికాచ - అమరకోశము.

మాలిని॥ కమలభవ వధూటీ కంఠ కహ్లార మాలా
సముదిత మధుధారా సౌరభాసార లక్ష్మీ
సమధికరుచిసంపత్సార సారస్వత శ్రీ
హిమిత సుకవి రాజీడ్హృత్సరోజాత జాతా! 213

అర్థము :- కమల...జాతా. కమలభవ=బ్రహ్మదేవుని; వధూటీ=భార్యయగు సరస్వతీదేవి యొక్క; కంఠ=కంఠము నందలి; కహ్లారమాలా=ఎఱుపు తెలుపులుగల కలువల దండ నుండి; సముదిత=చక్కగా పుట్టిన; మధుధారా=మకరంద ధారల; సౌరభ+అసార= సువాసనల జడివాన యొక్క; లక్ష్మీ=సంపదకన్న; సమధిక=మిక్కిలి ఎక్కువైన; రుచిసంపత్= కాంతి సమృద్ధియొక్క; సార=సారమైన; సారస్వతశ్రీ=సారస్వత (పాండిత్య) గౌరవము చేత; హిమిత=మంచుగా మారిన; సుకవిరాజి+ఈట్=ఉత్తమ కవిసమూహ ప్రభువుల; హృత్+ సరోజాత=హృదయ పద్మములందు; జాత=ప్రకటమైనవాడా!

భావము :- సరస్వతీదేవి మెడలోని కల్హార పుష్పములతోని మకరంద ధారల సువాసనలకన్న అధికమైన కాంతి సమృద్ధిఫలమైన సారస్వత గౌరవముచే చల్లగ మారిన కవిశ్రేష్ఠ సమూహముల హృదయపద్మములందు ప్రకటమైనవాడా!

విశేషము :- మాలినీ వృత్తమునకు "న-న-మ-య-య" అనునవి గణములు. యతి మైత్రి ప్రతిపాదము నందును 1-9 అక్షరములు.

**గద్య :- ఇది శ్రీ కమలనాభ పౌత్ర మారయామాత్యపుత్ర సుకవిజన విధేయ శ్రీనాథ నామధేయ ప్రణీతంబైన శ్రీ భీమేశ్వర పురాణంబను మహా ప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసంబు.**

ఇది

శ్రీ భీమేశ్వర పురాణ చతుర్థాశ్వాసమునకు

**దక్షిణ కాశిక**

అను ప్రతిపదార్థ భావ విశేష సహిత వ్యాఖ్యానవ

# శ్రీ భీమేశ్వర పురాణము

## పంచమాశ్వాసము

### దక్షిణ కాశికా వ్యాఖ్యానము

**కం॥ శ్రీవత్స లాంఛనోపమ!**
**భావభవాకార! మంత్రి పరమేశ్వర! పా**
**రావార నిభ గభీరా!**
**దేవాధిప సుప్రసన్న! దేవయ యన్నా! 1**

అర్థము :- శ్రీవత్స లాంఛన=శ్రీవత్సమను సుడిని వక్షస్థలమున గుర్తుగ కల విష్ణువుతో; ఉపమ=పోల్ప తగినవాడా!; భావభవ+ఆకార=మన్మథునివంటి రూపము కలవాడా!; మంత్రి పరమేశ్వర=మంత్రులలో సర్వశ్రేష్ఠుడవైన వాడా!; పారావార నిభ=సముద్రముతో సమమైన; గభీర=గంభీరత కలవాడా!; దేవ+అధిప=దేవతల నాయకుడైన ఇంద్రుని వలె; సుప్రసన్న=మిక్కిలి అనుగ్రహము కలవాడా!; దేవయ+అన్నా=దేవయ మంత్రికి పుత్రుడవైన అన్నయ మంత్రీ!

భావము :- దేవయ మంత్రి కుమారుడవైన ఓ అన్నయ మంత్రీ! నీవు విష్ణువుతో సమమైన వాడవు. మన్మథుని వంటి రూపము కలవాడవు. మంత్రులలో సర్వశ్రేష్ఠుడవు. సముద్రము వలె గంభీరత కలవాడవు. ఇంద్రుని వలె అనుగ్రహాధిక్యము కలవాడవు.

**వ. అక్కథకుండు శౌనకాది మహామునుల కిట్లనియె. 2**

అర్థము :- ఆ+కథకుండు=(పురాణము చెప్పు) ఆ సూత మహర్షి; శౌనక+అది= శౌనకుడు మొదలైన; మహామునులకు=గొప్ప ఋషులకు; ఇట్లు+అనియెన్=ఈ విధముగ చెప్పెను.

భావము :- ఆ సూత మహర్షి శౌనకాది మహర్షులతో ఈ విధముగ చెప్పెను.

**తే॥ ధర్మ పారాయణుండు మైత్రావరుణుఁడు**
**వెండియును నిట్టులని చెప్పె విశద ఫణితి**
**గాఢ సమ్మోదభవ నేత్ర కంకణునకు**
**మంకణున కాత్మధృత భోగి కంకణునకు. 3**

అర్థము :- ధర్మ పారాయణుండు=ధర్మము యొక్క పారమును పొందినవాడు; మైత్రావరుణుఁడు=అగస్త్య మహర్షి; గాఢ=దట్టమైన; సమ్మోదభవ=మిక్కిలి సంతోషము వలన కలిగిన; నేత్ర కంకణునకు=కన్నుల యందు ఆనంద బాష్పములు కలట్టియు; ఆత్మ=మనస్సు నందు; ధృత=ధరింపబడిన; భోగి కంకణునకు=శివుడు కలవాడును అగు; మంకణునకు= మంకణమునికి; వెండియు=ఇంకను; ఇట్టులు+అని=ఈ విధముగనని; విశద ఫణితిన్=స్పష్టమగు వాక్కుతో; చెప్పెన్=చెప్పెను.

భావము :- ధర్మ పారాయణుడైన అగస్త్య మహర్షి అమితానందముతో కనులందు ఆనంద బాష్పములు కలవాడును, మనసు నందు శివభక్తిని ధరించిన వాడునైన మంకణమునికి ఇంకను ఈ విధముగా నని స్పష్టమైన వాక్కుతో పల్కెను.

విశేషము :- మైత్రావరుణుఁడు :- భీమ. 3 - 40 చెంత చెప్పబడినది.

వ. అనంతరం బా వివస్వంతుండాత్మ ప్రతిష్ఠితంబైన యద్దివ్యలింగంబు నందు శివసన్నిధానంబు సేయఁదలంచి. 4

అర్థము :- అనంతరంబు=ఆ తరువాత; ఆ వివస్వంతుండు=ఆ సూర్యుడు; ఆత్మ ప్రతిష్ఠితంబు+ఐన=తనచే నిలుపబడినదగు; ఆ+దివ్యలింగంబు నందు=ఆ దివ్యమైన శివలింగ రూపమును; శివ సన్నిధానంబున్=శివునకు ఆశ్రయమును; చేయఁదలంచి= చేయతలపెట్టి.

భావము :- ఆ తరువాత సూర్యుడు తనచే ప్రతిష్ఠింపబడిన ఆ దివ్య శివలింగ రూపము నందు శివుని ఆవాహన చేయదలచి.

## సూర్యుఁడు కైలాసంబున కరిగి శివుని దక్షారామంబునకుఁ దోడితెచ్చుట

సీ॥ ద్యోస్థలీ నక్షత్ర ధూళి పాళీ కేళి
చుళుకిత స్వర్ణదీ జల చరములు
వైజయంతీ పట వ్యాక్షేప సంభూత
మారుతోద్ధూతేందు మండలములు
సింహికాసుత కంఠ సీమాపునర్దండ
చక్ర ధారా వ్యథా ప్రక్రమములు
రథ రథ్య నిశ్వాస రంహస్సముద్భ్రాంత
గగన గంగా తరంగ చ్ఛటములు

గీ॥ నైన ప్రస్థాన వేగంబు లతిశయిల్ల
నభ్ర ఘంటా పథంబున నరుగు వాఁడు
గతికి నొకమూర్తిఁ జాలించి కదలి చనియె
శీఘ్రమున ద్వాదశాత్ముండు శివుని గిరికి. 5

అర్థము :- ద్యోస్థలీ=ఆకాశ ప్రదేశము నందలి; నక్షత్ర=చుక్కలనెడు; ధూళిపాళీ= దుమ్ము యొక్క కణముల సమూహము నందు; కేళి=ఆటగ; చుళుకిత=పుడిసిలిగా చేయబడిన; స్వర్ణదీ=ఆకాశ గంగానది యొక్క; జలచరములు=నీటిలో సంచరించు జీవులు కలవియు;

వైజయంతీపట=టెక్కెము నందలి జండా పట్ట యొక్క; వ్యాక్షేప=మిక్కిలి కదలిక చేత; సంభూత=విరివిగ పుట్టిన; మారుత=గాలిచే; ఉద్ధూత=మిక్కిలిగ వణకింపబడిన; ఇందు మండలములు=చంద్రమండలము కలవియు;

సింహికాసుత=సింహిక కుమారుడైన రాహువు యొక్క; కంఠసీమా=కుత్తుక ప్రదేశమును; పునః+దండ=మరల శిక్షించు; చక్రధారా=రథ చక్రము అంచులచే కల్గిన; వ్యథా=బాధ యొక్క; ప్రక్రమములు=ఆరంభములు కలవియు;

రథరథ్య=రథమునకు కట్టబడిన గుఱ్ఱముల యొక్క; నిశ్వాస=విడచు గాలుల యొక్క; రంహస్=వేగము చేత; సముద్భ్రాంత= మిక్కిలిగ గిరగిర తిరుగు; గగన గంగా=ఆకాశ గంగానదిలోని; తరంగ చ్ఛటములున్=అలల సమూహములు కలవియు;

ఐన=అయినట్టి; ప్రస్థాన వేగంబులు=గమన (ప్రయాణ) వేగములు; అతిశయిల్లన్=అధికము కాగా; అభ్రఘంటా పథంబునన్=ఆకాశమనెడి రాచబాట యందు; అరుగువాఁడు=వెళ్ళుచున్నవాడై; ద్వాదశాత్ముండు=పండ్రెండు మూర్తులు గల సూర్యుడు; గతికిన్+ఒక మూర్తిన్=గమనమునకొక మూర్తిని; చాలించి=వదలివేసి; శీఘ్రమున=వేగముగ; శివునిగిరికి=కైలాస పర్వతమునకు; కదలిచనియె=బలుదేరి వెళ్ళెను.

భావము :- పండ్రెండు మూర్తులు కల సూర్యుడు పయనమున కొక మూర్తిని వదలుచు వేగముగ కైలాసమునకు వెళ్ళుచుండగా రథ ప్రస్థాన వేగములచే ఆకాశము నందలి నక్షత్రములనెడి ధూళి సమూహమును ఆకాశగంగలోని జలచరములు మ్రింగుచున్నవి. సూర్యుని రథము యొక్క జండాగుడ్డ తీవ్రముగ కదలుచుండుటచే కల్గిన గాలికి చంద్రమండలము వణకుచు కన్పించినది. సింహికా పుత్రుడైన రాహువు యొక్క కంఠమును సూర్య రథ చక్రము మరల బాధించుట చేత ఆ బాధల మూల్గులు విన్పించుచున్నవి. ఆ రథమునకు కట్టబడిన

గుఱ్ఱములు వదలు నిశ్వాస పవనములచేత ఆకాశగంగలోని అలలు గిరగిర తిరుగుచున్నవి. అట్టి వేగముతో సూర్యుడు కైలాస పర్వతమును చేరెను.

విశేషము :- ద్వాదశాత్ముడు-3-87 చెంత చెప్పబడినది.

ఈ పద్యము మయూరుని సూర్యశతకము నందలి అరువది ఆరవ శ్లోకమునకు అనువాదము.

"ధూర్ధ్వస్తాగ్ర్య గ్రహాణి ధ్వజపట పవనాన్దోళి తేన్దూని దూరం
రాహౌగ్రాసాభిలాషాదనుసరతి పునర్దత్త చక్రవ్యథాని
శ్రాన్తాశ్వశ్వాస హేలాధుత విబుధధునీ నిర్ఝరామ్భాంసి భద్రం
దేయాసు ర్వోదవీయో దివి దివసపతేః స్యన్దన ప్రస్థితాని."

ఈ శ్లోకమునే శ్రీనాథుడు కాశీఖండము నందు (ఆశ్వా-1, పద్యము-127) మరియొక విధముగ ఆంధ్రీకరించెను. ఒకే శ్లోకమును రెండు విధములుగ తెలుగుచేయుట విశేషము.

కాశీఖండమందలి పద్యమిది-

ధూర్దండ ఘట్టన త్రుటిత గ్రహగ్రావ
ధూళిపాళీ మిళ ద్ద్యు స్థలములు
ధ్వజపట పల్లవోద్ధత మరుత్సంపాత
పరికంపమానోడు పరివృఢములు
గ్రాసాభిలాషానుగత విధుంతుద పునః
ప్రాప్త చక్రవ్యథో పద్రవములు
శ్రాంతాశ్వ నిబిడ నిశ్వాస ధారాధుత
స్వర్ధునీ నిర్ఝర జలచరములు

గగన పదలంఘనైక జాంఘాలికములు
పద్మవన బాంధవుని రథ ప్రస్థితములు
సాఁగెనది దక్షిణాయన సమయమగుట
దుర్దురము మీఁద మలయ భూధరము మీఁద.

**ఉ॥ భాసుర యక్ష నాథ దిగుపాంత కలాప విలాసమైన కై
లాసము చక్కటిం జదల లాఘవ మొప్ప రథంబుడిగ్గి వి
శ్వాస పురస్సరంబుగ దివాకరుఁ డిందు కళాకిరీటు నా
వాసముఁ జేర వచ్చి తల వాకిట వారితుఁ డయ్యె నందిచేన్.** 6

అర్థము :- దివాకరుఁడు=పగలును కలుగజేయు సూర్యుడు; భాసుర=దివ్యమైన; యక్షనాథ దిక్=కుబేరుని దిక్కైన ఉత్తరమునకు; ఉపాంత=కొనయందలి; కలాప=నగ వలె; విలాసమైన=అందమైన; కైలాసము=కైలాస పర్వతము యొక్క; చక్కటిన్=స్థానము నందు; చదల=ఆకాశమున; లాఘవము+ఒప్పన్=వేగము ఒప్పునట్లుగా; రథంబు డిగ్గి=రథము నుండి దిగి; విశ్వాస పురస్సరంబుగ=రహస్య ప్రేమ (భక్తి) పూర్వకముగా; ఇందు కళాకిరీటున్=చంద్రశేఖరుని యొక్క; ఆవాసమున్=నివాసమును; చేరవచ్చి=సమీపించి; తలవాకిట=మొదటి ప్రవేశ ద్వారము వద్ద; నందిచేన్=నందిచేత; వారితుఁడయ్యె=అడ్డగింపబడెను.

భావము :- దివ్యమైన కుబేర స్థానమైన ఉత్తర దిక్కునకు చివర ఆభరణము వలె అందమైన కైలాస పర్వతమునకు సమీపమున ఆకాశమున సూర్యుడు దర్పశూన్యుడై రథము దిగినాడు. రహస్య ప్రేమ పూర్వకముగా చంద్రశేఖరుని నివాసమును సమీపించినాడు. తల వాకిట కావలి యున్న నంది సూర్యుని అడ్డగించినాడు.

వ. ఇట్లు వారింపఁబడి. 7

అర్థము :- ఇట్లు=ఈ విధముగా; వారింపఁబడి=అడ్డగింపబడి;

భావము :- ఈ విధముగ సూర్యుడు నంది చేత అడ్డగింపబడిన వాడై.

తే॥ విపుల శాఖా శిఖా మంత్రవితతి నినుఁడు
సంస్తుతించెను నందికేశ్వరునిఁ బ్రీతి
బ్రహ్మ విష్ణు పురందర ప్రముఖులైన
వేల్పులును నట్ల పొగడరా వృషభరాజు. 8

అర్థము :- ఇనుఁడు=సూర్యుడు; ప్రీతిన్=అమోదముతో; విపుల=విరివియైన; శాఖా శిఖా=వేదభాగములందు ప్రధానమైన; మంత్ర వితతిన్=మంత్రముల సమూహముతో; నందికేశ్వరునిన్=నందిని; సంస్తుతించెను=మిక్కిలిగ కొనియాడెను. బ్రహ్మ=బ్రహ్మదేవుడు; విష్ణు=విష్ణుమూర్తి; పురందర=ఇంద్రుడు; ప్రముఖులైన=మొదలయిన; వేల్పులును=దేవతలును; ఆ వృషభరాజున్=ఎద్దులకు రాజైన ఆ నందీశ్వరుని, అట్లు=ఆవిధముగ; పొగడరు=స్తుతించి యుండలేదు.

భావము :- సూర్యుడు పూనికతో వేదభాగములందలి ప్రధానమైన మంత్రములతో నందీశ్వరుని మిక్కుటముగ స్తుతించెను. బ్రహ్మ, విష్ణు, మహేంద్రాది దేవతా ప్రముఖులును నందీశ్వరుని ఆ విధముగ పొగడియుండలేదు.

**వ. ఇట్లు పొగడినఁ బ్రసన్నుండై నందికేశ్వరుండు గొనిపోవం బోయి కోపకుటిల నిటలతట ఘటిత భీషణ భ్రుకుటీ భంగాభంగ ముఖముఖర భయంకర భృంగి**

భృంగిరిట హుంకృతి భజమాన విబుధ సంతానానుసంధానంబులైన కక్ష్యాంతరంబులు ప్రవేశించి ముందట వేదవేదాంత విద్యావందిత చరణార విందుండును, జండ కిరణ శశిమండల ప్రభా విభాసమాన ఫణా మణిగణాభిరామ కుండలిత కుండలిపతి కుండలాలంకార మండిత గండ స్థలుండును, బ్రళయకాల దహన దగ్ధ భువన భవన భస్మాలేప ధవళిత దేహుండును, నఖండ బ్రహ్మండ భాండ శతకోటి విలయకాల మృత శతధృతి రుండమాలికా భూషణుండునునై యున్నప్పు డాప్రదీప్రంబుగాఁ గొన్ని సచరాచర బ్రహ్మపారాయణంబులు పఠియించునవియును, గొన్ని ఋగ్వేదంబు గుణియించునవియును, గొన్ని యజురామ్నాయంబామ్రేడించునవియును, గొన్ని సామవేదంబుఁ జదువునవియును, గొన్ని యథర్వణ వేదం బాధ్యానం బొనరించునవి యును, సంస్తుతియించునవియును, నట్టహాసంబు సేయునవియును నైన యా విధి శిరంబుల చేతం గ్రుచ్చిన దండ పుండరీక ముకుళమండిత డుండుభంబునుం బోలె ప్రకాశింపఁ గంఠకోణంబునఁ గంఠికోపరి నీలంబునుం బోని కాలకూటంబున సంఘటిల్లు భ్రాంతి సంతమసంబునకు ఖద్యోతంబులునుం బోలె విద్యోతించు కంకణాశీ విష విషానల విస్ఫులింగంబుల వలన దుర్నిరీక్ష్యుండగుచు వికట జటాటవీ జూట కుహర విహర్మాణ స్నిగ్ధ పరిముగ్ధతర లహరీ పవన పూరితంబులైన యాపీడ విధిశిరః కరోటి కందర క్రోడంబులఁ బాటిల్లు ఘుమఘుమా ఘోషంబు భీషణ భూషా భుజంగంబుల నిద్రాముద్రాగ్రంథి నిగ్రహింపఁ గెంజెడ ముడి బిగియించి నెట్టియంబు చుట్టిన జగజెట్టి పాపతేని యొదల మాణిక్యంబుల తురంగలి మెఱుంగులు వెనువెంట మింటదాఁకను జరిగి ధగద్ధగ నిగనిగ వెలుఁగుటం జేసి యప్పుడప్పుడ యనల స్తంభంబున నావిర్భవించిన భంగి నంగీకరించుచు, నుగ్రగరళ పరిమళాఘ్రాణం బునం జేసి మూర్ఛిల్లిన విధంబున నిరంతర ధ్యాన స్తిమిత లోచనులై యుభయ పార్శ్వంబుల సనక సనందన సనత్సుజాతాది యోగీశ్వరులు పరివేష్టింప శేఖర శశాంకునకుఁ గ్రొత్తగాఁ గాళరాత్రి కళత్రంబును గల్పించినట్లు పొలిసిన పచ్చి యేనిక తోలు పచ్చడంబు జంగాళంబుగా వైచుకొని చరణ భూషణ శేషాహి శిఖామణి ప్రతిబింబితాంబరుండగుటం జేసి ఘోర విష వితరణ మహాపరాధక్షమకై పయోధి వచ్చి పాదంబుల పయింబడిన భావంబు భజియింప ధారాజల బిందు దంతురంబునుం బోని వారణాసుర కుంభకూట విదారణంబున హత్తిన

ముత్తియంబుల తోడఁ జాలనాభీలంబగు త్రిశూలంబు కేలంగీలు కొల్పి కఠిన శమన శిరస్తాడనంబునం గట్టిన శ్రీ పాదారవిందంబునం దాపించిన బిరుదు కటకంబున ఘటియింపఁబడి వెలుంగు యాదఃపతి మేదోమృతంబు జిడ్డున గడ్డుకొనిన పూషాదిత్య పలువరుస యంతంబున నుప్పతిల్లు త్రుళ్ళు మెఱుంగులు పెల్లుగ నుల్లసిల్ల విలసిల్లుచు విశ్వజగదుత్పత్తి గుప్తి విపత్తికారి యగు పురారిం గనుంగొని జయజయ శబ్ద పూర్వకంబుగా సంస్తుతి యొనర్చి ముకుళిత కరారవిందుండై. 9

అర్థము :- ఇట్లు=ఈ విధముగ; పొగడినన్=స్తుతింపగా; ప్రసన్నుండై= సంతోషించినవాడై; నందికేశ్వరుండు=నందీశ్వరుడు; కొనిపోవన్=తీసికొనిపోగా; పోయి=వెళ్ళి; కోప...సంధానంబులైన. కోప=కోపముచేత; కుటిల=వంకర తిరిగిన; నిటలతట=ఫాలభాగమున; ఘటిత=కల్గింపబడిన; భీషణ=దారుణమైన; భ్రుకుటీ=బొమముడి ప్రదేశమునందలి; భంగ వంపులు; అభంగ=చక్కగ నుండుటలును; ముఖ=నోటితో; ముఖర=కఠినముగా పలుకు; భయంకర=భయమును కల్గించు; భృంగి భృగిరిటి=భృంగి, భృంగిరిటి అను ప్రమథ నాయకుల యొక్క; హుంకృతి=హుంకారములచే; భజమాన=సేవించుచున్న; విబుధసంతాన=దేవతల సమూహములకు; అనుసంధానంబులైన=కూడలులైన; కక్ష్యాంతరంబులు=అంతస్తుల లోభాగములను; ప్రవేశించి=చొచ్చి; ముందట=ఎదురుగా - వేద...విందుండును. వేద వేదాంత విద్యా=వేదములు వేదాంతములను విద్యలచేత; వందిత=నమస్కరింపబడిన; చరణ+అరవిందుడును=పద్మముల వంటి పాదములు కలవాడును;

చండ...స్థలుండును. చండ కిరణ=సూర్యుని యొక్కయు; శశిమండల=చంద్ర మండలము యొక్కయు; ప్రభా=కాంతితో; విభాసమాన=మిక్కిలిగ ప్రకాశించుచున్న; ఫణా=పడగలపై గల; మణిగణా=మణుల సమూహముచే; అభిరామ=అందమై; కుండలిత= గుండ్రముగ చేయబడిన; కుండలిపతి=నాగరాజులను; కుండల+అలంకార=కర్ణాభరణముల చేత; మండిత=అలంకరింపబడిన; గండ స్థలుండును=చెక్కిలి ప్రదేశములు కలవాడును;

ప్రళయ...దేహుండును. ప్రళయకాల=కల్పాంత కాలము నందలి; దహన=అగ్నిచేత; దగ్ధ=కాల్చబడిన; భువన భవన=లోకములను ఇండ్ల యొక్క; భస్మ+అలేప=బూడిదను బాగుగా పూసికొనుటచే; ధవళిత=తెల్లగా చేయబడిన; దేహుండును=శరీరము కలవాడును;

అఖండ...భూషణుండును. అఖండ=సంపూర్ణమైన; బ్రహ్మాండభాండ= బ్రహ్మాండమనెడి పాత్రలందు; శతకోటి=లెక్కలేనన్ని; విలయకాల=ప్రళయ కాలములందు; మృత=మరణించిన; శతధృతి=బ్రహ్మల యొక్క; రుండమాలికా=తలల మాలలే; భూషణుండునున్=అలంకారముగ కలవాడును;

ఐ=అయి; ఉన్నన్=ఉండగా; అప్పుడు=అపుడు; అప్రదీప్రంబుగాన్=అంతట మిక్కిలిగ ప్రకాశించునట్లుగా; కొన్ని=కొన్ని తలలు; సచరాచర=స్థిర చర రూపములతో కూడిన; బ్రహ్మ=పరమాత్మ యొక్క; పారాయణంబులు=పారమును పొందునవియు; పఠియించు నవియు=చదువునవియును; కొన్ని=కొన్ని; ఋగ్వేదంబు=ఋగ్వేదమును; గుణియించు నవియును=వల్లెవేయునవియును; కొన్ని=కొన్ని; యజురామ్నాయంబును= యజుర్వేదమును; ఆమ్రేడించునవియును=మరల మరల చదువునవియు; కొన్ని=కొన్ని; సామవేదంబున్= సామవేదమును; చదువునవియును=పఠించునవియును; కొన్ని=కొన్ని; అథర్వణ వేదంబు= అథర్వణ వేదమును; అధ్యానంబు=చింతనము; ఒనరించునవియును=చేయునవియును; సంస్తుతియించునవియును=మిక్కిలిగ కొనియాడునవియును; అట్టహాసంబు చేయునవియు= ధ్వనితో కూడిన పెద్దనవ్వు నవ్వునవియును, ఐన= అయినటువంటి; ఆ విధి శిరంబుల చేతన్=ఆ బ్రహ్మశిరస్సులతో; గ్రుచ్చిన దండ=కూర్చిన మాల; పుండరీక= తెల్లతామరల; ముకుళ=మొగ్గలచే; మండిత=అలంకరింపబడిన; డుండుభంబునుం బోలె=రెండు తలల పామువలె; ప్రకాశింపన్=ప్రకాశించు చుండగా; కంఠ కోణంబునన్=కుత్తుక యొక్క కేంద్ర స్థానము నందలి; కంఠిక+ఉవరి=కంఠాభరణమునకు పైన (పొదుగబడిన), నీలంబునుంబోలె=ఇంద్రనీల మణివలె; కాలకూటంబున=కాలకూట విషము చేత; సంఘటిల్లు=కలుగు; భ్రాంతి సంతమసంబునకు=భ్రమయను చిమ్మ చీఁకటికి; ఖద్యోతం బులునుం బోలె=మిడుగుఱు పురుగుల వలె; విద్యోతించు=ప్రకాశించు; కంకణ=చేతి కడియములైన; అశీవిష=పాముల యొక్క; విషానల=విషమనెడు నిప్పు యొక్క; విస్ఫులింగం బుల వలన=నిప్పు కణికల వలన; దుర్నిరీక్ష్యుండు+అగుచు=చూడ శక్యము కానివాడగుచు;

వికట...పూరితంబులైన. వికట=విరివియైన; జటాటవీ=జడల అడవి యొక్క, జూట=ముడియను; కుహర=గుహలో; విహరమాణ=విహరించుచున్న; స్నిగ్ధ=దట్టమైన; పరిముగ్ధతర=సహజ సౌందర్యము మిక్కిలిగా కల; లహరీ=అలల వంటి, పవన=గాలిచే; పూరితంబు లైన=నింపబడినవైన; ఆపీడ=శిరోభూషణములైన; విధిశిరస్=బ్రహ్మతలల యొక్క; కరోటి=పుఱ్ఱెలనెడు; కందరా=గుహల యొక్క; క్రోడంబులన్=లోభాగము లందు; పాటిల్లు=సంభవించు; ఘుమ ఘుమా ఘోషంబు=ఘుంఘుమ్మను శబ్దము; భీషణ=భయంకం మైన, భూషా=అలంకారములైన; భుజంగంబుల=పాముల యొక్క; నిద్రా ముద్రా గ్రంథి=గాఢనిద్రయను ముడిని; నిగ్రహింపన్=తొలగింపగా; కెంజడముడిన్=ఎఱ్ఱని జడల యొక్క ముడియందు; బిగియించి=బిగియకట్టి; నెట్టియంబు=తలపాగ; చుట్టిన=అమరిన; జగజెట్టి పాపతేని=మహాశూరుడైన సర్పరాజు యొక్క; ఔదల=తలపై గల; మాణిక్యంబుల= కెంపుల యొక్క; తురంగలి మెఱుంగులు=ప్రకాశవంతమైన తళతళని కాంతులు; వెనువెంట=

వెంటవెంటనే; మింట దాఁకను=ఆకసము వరకు; జరిగి=ప్రాకి; ధగద్ధగ+నిగనిగ=ధగధగలతో నిగనిగని కాంతులతో; వెలుఁగుటంజేసి=ప్రకాశించుట వలన; అప్పుడప్పుడ=అపుడే; అనల స్తంభంబునన్=అగ్నిస్తంభము నుండి; ఆవిర్భవించిన భంగి=పుట్టిన విధమును; అంగీకరించు చున్=స్వీకరించుచు; ఉగ్రగరళ=భయంకరమైన విషము యొక్క; పరిమళ=వాసనను; ఆఘ్రాణం బునం జేసి=వాసన చూచుటచేత; మూర్ఛిల్లిన విధంబున=సొమ్మసిల్లిన రీతిగా; నిరంతర ధ్యాన=ఎడతెగని ధ్యానముచేత; స్తిమిత లోచనులై=మూయబడిన కన్నులు కలవారై; ఉభయ పార్శ్వంబుల=రెండువైపులను; సనక=సనకుఁడు; సనంద=సనందుఁడు; సనత్సుజాత= సనత్సుజాతుఁడు; ఆది=మొదలైన యోగీశ్వరులు=యోగిశ్రేష్ఠులు; పరివేష్టింప=చుట్టి యుండగా; శేఖర=తలపై గల; శశాంకునకున్=చంద్రునకు; క్రొత్తగా=క్రొత్తగా; కాళరాత్రి; కళత్రంబును=చీకటి రాత్రియను కోటను; కల్పించినట్లు=సృష్టించిన విధముగా; పొలిసిన=వ్యాపించిన; పచ్చి యేనిక తోలు=పచ్చి ఏనుగు తోలు అనెడి; పచ్చడంబు=కట్టుబట్ట; జంగాళంబుగా వైచుకొని=నిడువాటుగా (వదులుగ) వేసికొని,

చరణ భూషణ=కాలి అందెలైన; శేషాహి=అదిశేషుడను సర్పము యొక్క; శిఖా=పడగలపై గల; మణి=మణుల కాంతులు ప్రతిబింబిత=ప్రతిఫలించిన, అంబరుండు+ అగుటంజేసి=వస్త్రము కలవాడగుట చేత; ఘోర విష=భయంకరమైన కాలకూట విషమును; వితరణ=అర్పించుట అనెడు; మహాపరాధ=పెద్దతప్పు యొక్క; క్షమకై=మన్నింపు కొరకై; పయోధి=సముద్రము; వచ్చి=వచ్చి; పాదంబుల పయింబడిన=పాదములపై బడిన; భావంబు=స్థితిని; భజియింపన్=అంగీకరింపగా;

ధారాజల=పైనుండి ధారగా పడెడు నీటి యొక్క; బిందు=బొట్లచే; దంతురంబునుం బోలె=ఎగుడు దిగుడుగ చేయబడిన దానివలె; వారణాసుర=గజాసురుని; కుంభకూట= కుంభస్థలమనెడు కొండకొమ్మును; విదారణంబునన్=చీల్చుటచేత; హత్తిన=కూడుకొనిన; ముత్తియంబుల తోడన్=ముత్యముల; చాలన+ఆ భీలంబగు=కదలికలచే భయంకరమైన; త్రిశూలంబు=త్రిశూలమును; కేలన్=చేతియందు; కీలుకొల్పి=పూని; కఠిన=క్రూరుడైన; శమన=యముని, శిరస్తాడనంబునన్=తలదన్నుటచేత; కట్టిన=బంధించిన; శ్రీపాద+ అరవిందంబునన్=శుభంకరమైన పద్మము వంటి పాదము నందు; ఘటియింపఁబడి= కూర్పబడి; వెలుంగు=ప్రకాశించు; యాదఃపతి=సముద్రుని యొక్క; మేదస్+అమృతంబు నన్=కొవ్వు అగు అమృతము యొక్క; జిడ్డున=జిడ్డుచేత; గడ్డుకొనిన=అతిశయించిన; పూష+ఆదిత్యు=పూషుడను సూర్యమూర్తి యొక్క; పలువరుస=పలువరుస యొక్క; అంతంబునన్=చివరన; ఉత్పత్తిల్లు=పుట్టు; త్రుళ్ళు మెఱుంగులు=ఉప్పొంగుచున్న కాంతులు; పెల్లుగన్=అధికముగా; ఉల్లసిల్ల=వికసింపగా; విలసిల్లుచుం=ప్రకాశించుచు;

విశ్వజగత్=విశ్వము నందలి లోకములను; ఉత్పత్తి=పుట్టించుట; గుప్తి=కాపాడుట; విపత్తికారి యగు=నాశనము చేయువాడైన; పురారిన్=త్రిపుర సంహారకుడైన శంకరుని; కనుంగొని=చూచి; జయజయ శబ్దపూర్వకంబుగాన్=జయవాచకములతో; సంస్తుతి=మిక్కిలిగ నుతించుటను; ఒనర్చి=చేసి; ముకుళిత=ముడిచిన; కర+అరవిందుండై=పద్మముల వంటి చేతులు కలవాడై.

భావము :- సూర్యుడు ఈ విధముగ స్తుతింపగా నంది సంతసించెను. కోపము చేత భ్రుకుటి ముడివడి భయంకరముగ హుంకరించు భృంగి, భృంగిరిటి అను ప్రమథ గణ నాయకుల హుంకారములకు సేవించుచున్న దేవతల గుంపులున్న ప్రదేశములు దాటి ముక్కంటి ముందుకు నంది సూర్యుని గొంపోయినాడు. ఆ ముక్కంటి పాదములకు వేద వేదాంగములు నమస్కరించుచున్నవి. సూర్యచంద్రుల కాంతులతో ప్రకాశించు మణులను పడగలపై గల సర్పరాజులు కర్ణాభరణములు కాగా అతని చెక్కిళ్ళు అందగించి ప్రకాశించు చున్నవి. ప్రళయ కాలములందు కాలిపోయిన లోకముల బూడిదను పూసికొనుటచేట ఆయన దేహము తెల్లనై యుండెను. ప్రళయ కాలములందు మరణించిన బ్రహ్మల పుఱ్ఱెలతో కూర్చినమాలను ఆయన ధరించి యుండెను. అందలి పుఱ్ఱెలు కొన్ని చరాచర రూప పరమాత్మ పారమును పొందుచుండెను. కొన్ని ఋగ్వేదమును వల్లెవేయుచున్నవి. కొన్ని యజుర్వేదమును మరల మరల చదువుచున్నవి. కొన్ని సామవేదమును చదువుచున్నవి. కొన్ని అథర్వణ వేదమును చింతనము చేయుచున్నవి. కొన్ని స్తుతించుచున్నవి. కొన్ని అట్టహాసము చేయుచున్నవి. అట్టి బ్రహ్మ శిరస్సులతో కూర్చిన మాల తెల్ల తామర మొగ్గలచే అలంకరింపబడిన రెండు తలల పామువలె ప్రకాశించుచున్నది. కుత్తుక మధ్య భాగమున కంఠాభరణములోని ఇంద్రనీలము వలె మచ్చ ఏర్పడినది. అది విషమును మ్రింగి దాచుటచేనైనది. కాలకూట విషముచే నైన చిమ్మ చీకటికి మిణుగురు పురుగుల వలె చేతి కంకణములైన నాగరాజుల విషమనెడి నిప్పు కణికలచేత ఆయన చూడలేనివాడుగ నుండెను.

విశాలమైన శంకరుని జడముడి గుహలో ప్రవహించు గంగానది అలల గాలి ఆ పుఱ్ఱెల సందులలో దూరి చేయుచున్న భయంకర శబ్దములు ఆతని అలంకారములైన కాలసర్పముల గాఢ నిద్రావస్థను తొలగించుచున్నవి. శంకరుని జడముడిని గట్టిగ చుట్టియున్న నాగరాజు శిరముపై గల రత్నముల తళతళలు ఆకసము వరకు విస్తరించి ప్రకాశించుచు అప్పుడే అగ్నిస్తంభము నుండి పుట్టిన విధముగ నుండెను.

భయంకరమైన విషమును వాసన చూచుటచేత మూర్ఛపోయినట్లుగ నిరంతర ధ్యానముతో కనులు మూసియున్న సనక సనంద సనత్సుజాతాది యోగి పుంగవులు ముక్కంటి కిరువైపుల చుట్టి యుండిరి. తలపై నున్న చంద్రునకు క్రొత్తగా కాళరాత్రి యనెడి కోటను జతచేసినట్లుగ పచ్చి ఏనుగుతోలును వదులుగ కట్టుకొని యుండెను.

కాలి యందెలైన నాగరాజుల పడగలపైని మణుల కాంతులతో ఆ శంకరుని వస్త్రమైన ఏనుగు తోలు ప్రకాశించుట భయంకరమైన విషమును పుట్టించిన అపరాధమునకు క్షమార్పణము కోరుటకై సముద్రుడు వచ్చి శంకరుని పాదములపై పడినట్లున్నది. పైనుండి పడుచున్న ఆకాశ గంగధారలచేత ఎగుడు దిగుడుగ చేయబడిన దానివలె గజాసురుని కుంభ స్థలమును ఛేదించుటచే అతికియున్న ముత్యముల కదలికలచే భయంకరమైన త్రిశూలమును చేత ధరించి యుండెను. యముని తలదన్నుటచేట శుభంకరమైన పాదమున పొదుగబడిన బిరుదు కడియము నందు పరాజితుల బొమ్మలు చెక్కబడియున్నవి. ఆ బిరుదు కడియమున ప్రకాశించుచున్న సముద్రుని కొవ్వు అను అమృతము యొక్క జిడ్డు చేత అతిశయించి ప్రకాశించుచున్న పూషుడను సూర్యమూర్తి యొక్క పలువరుస చివరన కలుగు కాంతులతో ఆయన అధికముగ ప్రకాశించుచుండెను. ఈ బ్రహ్మాండము నందలి లోకములను పుట్టించి రక్షించి నాశనము చేయువాడైన ఆ పురారిని చూచి సూర్యుడు జయజయ వాచకములతో మిక్కిలిగ స్తుతించి చేతులు జోడించి యుండెను.

తే॥ బ్రహ్మ విష్ణు మహేంద్రాది పరివృఢునకు
నద్రి రాజన్య కన్యా సమన్వితునకుఁ
బ్రమథ గణ భూత బేతాళ పరివృతునకు
హరున కినుఁడు నమస్కార మాచరించె. 10

అర్థము :- ఇనుఁడు=సూర్యుడు; బ్రహ్మ విష్ణు మహేంద్ర+ఆది=బ్రహ్మదేవుడు; విష్ణుమూర్తి, దేవేంద్రుడు మొదలైన దేవనాయకులకు; పరివృఢునకున్=ప్రభువైన వానికి; అద్రి రాజన్య=పర్వతరాజులలో శ్రేష్ఠుడైన హిమవంతుని యొక్క; కన్యా=పుత్రికయైన పార్వతితో; సమన్వితునకున్=కూడియున్న వానికిని; ప్రమథగణ=ప్రమథ గణములతో; భూత= భూతములతో; బేతాళ=పిశాచములతో, పరివృతునకు=చుట్టబడి యున్న వానికి; హరునకు=శివునకు; నమస్కారమును=దండమును; ఆచరించెన్=చేసెను.

భావము :- బ్రహ్మ విష్ణు మహేంద్రాది దేవనాయకులచే సేవింపబడుచున్నవాడును, పార్వతీ సహితుడును, ప్రమథ గణములు భూత పిశాచములచే పరివేష్టించి యున్నవాడును నైన ముక్కంటికి సూర్యుడు నమస్కరించెను.

వ. ఇట్లు ప్రణామానంతరంబున భాస్వంతుండు గౌరీకాంతునకు నిజాగమన ప్రయోజనం బెఱింగించినఁ దదనంతరంబ. 11

అర్థము :- ఇట్లు=ఈ విధముగ; ప్రణామ=నమస్కారము చేసిన; అనంతరంబున= తరువాత; భాస్వంతుండు=సూర్యుడు; గౌరీకాంతునకు=శంకరునకు; నిజ+ఆగమన=తాను వచ్చుటకు గల; ప్రయోజనంబు=కారణమును; ఎఱింగించినన్= తెల్పిన; తదనంతరంబ=ఆ తరువాత.

భావము :- సూర్యుడు శంకరునకు ఈ విధముగ నమస్కరించి తన రాకకు కారణమును విన్నవించెను. ఆ తరువాత.

ఆ॥ ఇనుని తోడి చెలిమి నిభరాజ వదనుండు
విన్నపంబు చేసె విశ్వపతికి
నమృత మథన వేళ నావిర్భవుండైన
భుజఁగ హారుఁ జూడఁ బోద మనుచు. 12

అర్థము :- ఇనుని తోడి=సూర్యునితో గల; చెలిమిన్=స్నేహము చేత; ఇభరాజ వదనుండు=వినాయకుడు; అమృత మథన వేళన్=అమృతమును చిలుకు సమయమున; ఆవిర్భవుండైన=పుట్టిన; భుజఁగహారున్=శివుని; చూడన్=చూచుటకు, పోదము=వెళ్ళుదము; అనుచు=అని పల్కుచు; విశ్వపతికి=విశ్వేశ్వరునకు; విన్నపంబు చేసెన్=మనవి చేసెను.

భావము :- సూర్యునితో గల స్నేహముతో వినాయకుడు విశ్వేశ్వరునితో - పాల సముద్రము నుండి అమృతమును చిలుకునప్పుడు స్వయంభువుగ జనించిన నాగభూషణుని చూచుటకు వెళ్ళుదమని మనవి చేసెను.

సీ॥ విఘ్నాధినాథుండు విన్నవించిన మీఁదఁ
బర్వతాత్మజ విన్నపంబు చేసెఁ
బర్వతాత్మజ విన్నపం బొనరించిన
వెనుకఁ గ్రౌంచఘ్నుండు విన్నవించెఁ
గ్రౌంచఘ్నుఁడటు విన్నవించిన యత్తఱి
మఱి విన్నవించెను మాతృగణము
బ్రాహ్మ్యాది మాతృ వర్గము విన్నవించిన
వెండియు భూతముల్ విన్నవించె
తే॥ నిందు ధరునకుఁ గైలాస మందిరునకు
నభవ విచ్చేయు రవికిఁ బ్రియంబు గాఁగ
నమృత వారాశి నుదయించి యంధ్రభూమి
దక్ష పురి నున్న యా దివ్య తనువుఁజూడ. 13

అర్థము :- అభవ=పుట్టుక లేనివాడా! (ఓ ఆదిశంకరా) రవికిన్=సూర్యునకు; ప్రియంబు+కాఁగన్=సంతోషము కలుగునట్లుగా; అమృత వారాశిన్=పాల సముద్రమున;

ఉదయించి=పుట్టి; అంధ్రభూమి=ఆంధ్ర దేశమున; దక్షపురిన్=దక్షారామము నందు; ఉన్న=వెలసియున్న; ఆ దివ్యతనువున్=ఆ లోకతీతమైన గొప్ప (లింగ) రూపమును; చూడన్=చూచుటకై; విచ్చేయు=దయచేయుమని; కైలాస మందిరునకు=కైలాసగిరి నివాసముగ కలవానికి; ఇందు ధరునకు=చంద్రశేఖరునకు;

విఘ్న+అధినాథుండు=విఘ్నములకు అధినాయకుడైన వినాయకుడు; విన్నవించిన మీఁదన్=మనవి చేసిన తరువాత; పర్వతాత్మజ=హిమవంతుని కుమారియైన పార్వతీదేవి; విన్నపంబు చేసెన్=విజ్ఞాపన చేసినది;

పర్వతాత్మజ=పార్వతీదేవి, విన్నపంబు=విజ్ఞాపనము; ఒనరించిన వెనుకన్=చేసిన తరువాత; క్రౌంచఘ్నుండు=కుమారస్వామి; విన్నవించెన్=విన్నపము చేసెను;

క్రౌంచఘ్నుండు=కుమారస్వామి; అటు=ఆవిధముగ; విన్నవించిన=విన్నపము చేసిన; ఆ+తఱి=ఆ పిమ్మట; మఱి=ఇంకను; మాతృగణము=మాతృకల సమూహము; విన్నవించెను=మనవి చేసెను;

బ్రాహ్మి+ఆది=బ్రాహ్మి మొదలైన; మాతృ వర్గము=మాతృకాగణము; విన్నవించిన= మనవి చేసిన; వెండియు=మరియు; భూతముల్=భూతములును; విన్నవించెన్=మనవి చేసెను.

భావము :- ఓ ఆదిదేవా! అభవా! సూర్యునకు సంతోషము కల్గించుటకై అమృతమును చిలుకు సమయమున పాలసముద్రము నుండి పుట్టి ఆంధ్ర దేశమున దక్షారామమున వెలసి యున్న దివ్య స్వయం భూలింగమును చూచుటకు దయచేయుమని ముందుగ వినాయకుడు, పిమ్మట పార్వతీదేవి, ఆ పిమ్మట కుమారస్వామియు, ఆ తరువాత మాతృకాగణము, ఆ పిమ్మట భూతగణము విన్నవించెను.

**వ॥ అని యిట్లు విన్నవించిన విఘ్నేశ్వరుని మీఁది యనుగ్రహంబునను, భవాని మీఁది, కూర్మినిఁ, గుమారుని మీఁది ప్రేమానుబంధంబునను బ్రాహ్మ్యాది మాతృ గణంబుల మీఁది ప్రీతిని; భూతంబుల మీఁది ఆదరాతిశయంబునను, భాస్వంతుని మీఁది సంతోషంబునను, మధ్యమలోక గమనోద్యుక్తుండై హరి విరించులం జూచి మహాదేవుండిట్లనియె. 14**

అర్థము :- అని+ఇట్లు=అని ఈ విధముగ; విన్నవించిన=విన్నపము చేసిన; విఘ్నేశ్వరుని మీఁది=వినాయకుని మీద గల; అనుగ్రహంబునను=దయవలనను; భవాని మీఁది=పార్వతిపై గల; కూర్మినిన్=ప్రేమ వలనను; కుమారుని మీఁది=కుమార స్వామిపై నున్న; ప్రేమ+అనుబంధంబునను=ప్రేమ బంధము వలనను; బ్రాహ్మి+ఆది=బ్రాహ్మి

మొదలయిన; మాతృ గణంబుల మీఁది=మాతలపై గల; ప్రీతిని=ఆమోదము వలనను; భూతంబుల మీఁది=భూత గణములపై గల; ఆదర+అతిశయంబునను=మన్నన యొక్క విరివి వలనను; భాస్వంతుని మీఁది=సూర్యునిపై గల; సంతోషంబునను=ప్రసన్నత చేతను; మధ్యమలోక=భూలోకమునకు; గమన=పయనించుటకు; ఉద్యుక్తుండై=సిద్ధమైన వాడై; హరివిరించులన్+చూచి=విష్ణువు బ్రహ్మ దేవులవైపు చూచి; మహాదేవుండు=శంకరుడు; ఇట్లు+అనియె=ఈ విధముగ పల్కెను.

భావము :- వినాయకాదులు ఆ విధముగ విన్నవించిన మీదట శంకరుడు వినాయకుని మీది అనుగ్రహము వలన; పార్వతీదేవిపై గల ప్రేమచేతను; కుమార స్వామిపై గల వాత్సల్యము చేత; మాతృగణము మీద గల ఆమోదము చేత; భూత గణముల మీద గల ఆదరాతిశయము వలన; సూర్యునిపై గల మన్ననచేతను భూలోకమునకు బయలుదేర దలచి బ్రహ్మ విష్ణువులతో ఇట్లు పల్కెను.

విశేషము :- మధ్యమ లోకము=స్వర్గమునకు పాతాళమునకు మధ్యమున గల లోకము భూలోకము. కనుక నిది మధ్యమ లోకము.

## మహాదేవుండు ప్రమథగణ సమేతుండై దక్షారామమునకుఁ బోవుట

మ॥ కలవారందఱు దక్షవాటి గమనోత్కంఠా సముత్సాహ దో
హలులైనారు సహస్ర భానుఁడును నభ్యర్థించుచున్నాఁడు మం
గళ దివ్యామృత లింగ దర్శనమునుం గర్తవ్య మంధ్ర క్షమా
స్థలికింబోదమె యూసుపోకకు వినోదంబుల్ పరీక్షింపగన్. 15

అర్థము :- కలవారు+అందఱు=సమర్థులైన వారందరు; దక్షవాటి=దక్షారామమునకు; గమన=పయనించుట యందలి; ఉత్కంఠా=వేగిరపాటుతో కూడిన; సముత్సాహ=మిక్కిలి ఉత్సాహముతో; దోహలులు+ఐనారు=అభిలాష కలవారైరి. సహస్ర భానుఁడును=వేయి కిరణములు కలవాడు (సూర్యుడు)ను; అభ్యర్థించు చున్నాఁడు=మిక్కిలిగ ప్రార్థించు చున్నాడు. మంగళ=శుభంకరమైన; దివ్య+అమృత లింగ=లోకాతీతమైన గొప్ప తెల్లని లింగము యొక్క; దర్శనమునున్=చూచుటయును; కర్తవ్యము=చేయతగినపని, అంధ్రక్షమాస్థలికిన్=ఆంధ్రదేశపు భూమికి; ఊసుపోకకు=కాలక్షేపమునకై; వినోదంబుల్=వేడుకలను; పరీక్షింపఁగన్=పరిశీలించుటకై; పోదమె=వెళ్ళుదమా!

భావము :- సమర్థులైన వారందరు దక్షారామమునకు వెళ్ళుటకై మిక్కిలి ఉత్సాహము చూపుచున్నారు. సూర్యుడును మిక్కిలిగ ప్రార్థించుచున్నాడు. దక్షారామములోని శుభంకరము

దివ్యమునైన అమృత లింగమును చూచుట కర్తవ్యము. కాలక్షేపముగ అచటి వేడుకలను పరిశీలించుటకై ఆంధ్రదేశమునకు బయలుదేరుదమా!

గీ॥ పాయ కొక చోటఁ జదికిలఁ బడఁగ నుండ
నైన ఫలమేమి యటు వినోదార్థమరిగి
సంచరింతముఁ గాక యీ జలజ హితుని
ధర్మ మౌర్జిత్యమునుఁ బొంద దక్షపురిని. 16

అర్థము :- పాయక=విడువక; ఒకచోటన్=ఒకేచోటనే; చదికిలఁ బడఁగన్=పిఱ్ఱలు నేలపై మోపి కూర్చుండునట్లుగా; ఉండన్+ఐన=ఉండుట వలన; ఫలము+ఏమి=ఫలిత మేమి? ఈ జలజహితుని=ఈ సూర్యుని; ధర్మము=శ్రుతి స్మృత్యాదులందలి విహిత కృత్యము; ఔర్జిత్యమునున్+పొంద=గొప్పతనమును పొందునట్లుగా; దక్షపురిని=దక్షారామము నందు; అటు=ఆ వైపు; వినోద+అర్థము=వేడుకగా; అరిగి=వెళ్ళి; సంచరింతమున్+కాక=తిరుగుదము గాక.

భావము :- కదలకుండగ ఒకేచోట చదికిలబడి కూర్చుండి యున్నచో ఫలితమే ముండును? ఈ సూర్యుని కోరికకు తగినట్లుగ, ఇతని ధర్మము గొప్పదనమును పొందునట్లుగా దక్షారామమునకు వేడుకగ వెళ్ళివత్తము.

వ. అని యానతిచ్చి యాక్షణంబ. 17

అర్థము :- అని=అని; ఆనతిచ్చి=ఆజ్ఞాపించి; ఆ క్షణంబు=వెంటనే.

భావము :- అని ఆజ్ఞాపించి వెంటనే.

కం. చాటింపఁ బంచెఁ జంద్రకి
రీటుఁడు కైలాస నగపురీ వీథుల ఘం
టాటంకృతితో దక్షుని
వాటికిఁ బయనంబు ప్రమథ వరులకు ననుచున్. 18

అర్థము :- చంద్ర కిరీటుఁడు=(చంద్రుని కిరీటము నందు గల) శంకరుడు; కైలాసనగ=కైలాస పర్వతముపై గల; పురీవీథుల=నగరము యొక్క బజారులందు; ఘంటా టంకృతితో=గంటల మ్రోతలతో; ప్రమథ వరులకున్=ప్రమథ నాయకులకును; దక్షవాటికిన్=దక్షారామమునకై; పయనంబు= ప్రయాణము; అనుచున్=అనుచు; చాటింపన్=చాటింపు వేయుటకు; పంచెన్=పంపెను.

భావము :- శంకరుడు ప్రమథ నాయకులను దక్షారామమునకు ప్రయాణము కావలసినదని కైలాస నగర వీథులందు చాటింపు వేయించెను.

వ. అప్పుడు భవాని భవు సన్నిధిఁ జేతులు మొగిచి యిట్లని విన్నవించె. 19

అర్థము :- అప్పుడు=అపుడు; భవాని=పార్వతీదేవి; భవుసన్నిధిన్=శంకరుని సమీపమున; చేతులు మొగిచి=చేతులు జోడించి; ఇట్లని=ఈ విధముగనని; విన్నవించె= విన్నపము చేసెను.

భావము :- అపుడు పార్వతీదేవి శంకరుని సమీపమున చేతులు జోడించి ఇట్లు విన్నవించెను.

తే॥ పుట్టినిలు గాన నాకు నెప్పుడును బ్రేమ
దక్షవాటిక మీఁద నెంతయు ఘనంబు
సన్నిధానంబు సేయుమో చంద్రమౌళి!
అమ్మహాపురి భీమ లింగంబు మీఁద. 20

అర్థము :- పుట్టినిలు గాన=పుట్టిల్లు గనుక; నాకు=నాకు; ఎప్పుడును=ఎల్లపుడును; ప్రేమ=మక్కువ; దక్షవాటిక మీఁద=దక్షారామముపై; ఎంతయు=మిక్కిలి; ఘనంబు= అధికము; ఆ+మహాపురి=ఆ గొప్ప నగరము నందలి; భీమలింగంబు మీఁద=శ్రీ భీమేశ్వర లింగమూర్తిపై; సన్నిధానంబున్+చేయుము=సన్నిధి చేయుము (ఆశ్రయించి ఉండుము).

భావము :- ఓ స్వామీ! నాకు పుట్టిల్లు గనుక దక్షవాటి మీద మక్కువ మరీ యెక్కువ. ఆ మహానగరము నందలి శ్రీ భీమేశ్వర లింగముపై సన్నిధిసేయుము.

తే॥ ఉత్తరంబున గాశీ పురోత్తమంబు
మోక్ష లక్ష్మికి నెబ్భంగి మూలమయ్యె
దక్షిణంబున నాభంగి దక్షవాటి
మూలమౌ గావుతను భోగ మోక్షములకు. 21

అర్థము :- ఉత్తరంబునన్=ఉత్తర దిక్కున; కాశీపుర+ఉత్తమంబు=ఉత్తమమైన కాశీ నగరము; మోక్ష లక్ష్మికి=మోక్షమనెడు సంపదకు; ఏ+భంగి=ఏ విధముగ మూలము+అయ్యె=ఆధారమైనదో; దక్షిణంబునన్=దక్షిణ దేశము నందు; ఆ భంగి=ఆ విధముగ; దక్షవాటి=దక్షారామము; భోగ మోక్షములకు=భోగమునకును మోక్షమునకును; మూలమౌన్+కావుతను=ఆధారమగును గాక!

భావము :- ఉత్తర భారతదేశమున శ్రేష్ఠమైన కాశీ నగరము మోక్షసంపదకు ఎట్లు ఆధారమయ్యెనో అట్లే దక్షిణ భారతదేశమున దక్షారామ నగరము భోగమోక్షములకు ఆధారమగును గాక.

తే॥ కుంటి కుదుపు లశక్తులు కుష్ఠరోగు
లంధులును వృద్ధులును బాలు రాది గాఁగఁ
గాశి కరుగంగ లేని బికారు లెల్ల
మోక్షమును బొందుదురు గాక దక్షవాటి. 22

అర్థము :- కుంటి కుదుపులు=కుంటివారు; అశక్తులు=బలహీనులు; కుష్ఠరోగులు=కుష్ఠరోగము కలవారు; అంధులును=గ్రుడ్డివారును; వృద్ధులును=ముసలివారును; బాలురు=పిల్లలు; ఆదిగాఁగన్=మొదలైన; కాశికి+అరుగంగలేని=కాశీ క్షేత్రమునకు వెళ్ళలేని; బికారులు+ఎల్ల=అప్రయోజకులందరును; దక్షవాటి=దక్షారామము నందు; మోక్షమునున్=ముక్తిని; పొందుదురు గాక= పొందెదరు గాక!

భావము :- కుంటివారు, బలహీనులు, కుష్ఠరోగులు, గ్రుడ్డివారు, ముసలివారు, బాలురు మొదలైన కాశీక్షేత్రమునకు వెళ్ళలేని అప్రయోజకులందరు దక్షారామము నందు మోక్షమును పొందెదరు గాక.

మ॥ కలిదోషంబున నిష్ఠురాత్మకులునున్ గామాంధులుం బాపక
ర్ములు నజ్ఞాన దవాగ్ని దగ్ధులునునై ప్రోద్యన్మహా రౌరవా
వలిఁ గూలంగల దుష్ట మానసులకుం వారాణసీ తుల్యమై
కలుగుం గావుత ముక్తి దక్షపురి నీ కారుణ్య సంభావనన్. 23

అర్థము :- కలిదోషంబున=కలియుగ పాపము వలన; నిష్ఠుర+ఆత్మకులునున్= కఠినమైన మనసులు కలవారును; కామ+అంధులున్=కోరికతో గ్రుడ్డియైన వారును; పాపకర్ములును=పాపపు పనులు చేయువారును; అజ్ఞాన+దవాగ్ని=అజ్ఞానమనెడి కార్చిచ్చుచేత, దగ్ధులునున్+ఐ= కాలిపోవుచున్నవారునునై; ప్రోద్యన్మహా=మిక్కిలి అధికమైన గొప్ప (ప్ర+ఉద్యత్+మహా), రౌరవ+ఆవలిన్=రౌరవము మొదలైన నరకముల సమూహము నందు; కూలంగల=. పడిపోగలట్టి; దుష్ట=నీచమైన; మానసులకున్=మనసులు కల్గిన వారికిని; నీ కారుణ్య+సంభావనన్=నీ దయతో కూడిన తలంపుచేత; వారాణసీ తుల్యమై=కాశీక్షేత్రముతో సమానమై; దక్షపురిన్=దక్షారామము నందు; ముక్తి=మోక్షము; కలుగున్+కావుతన్=కలుగు గాక.

భావము :- ఓ చంద్రశేఖరా! కలి ప్రభావము చేత కఠినాత్ములు, కామాంధులు, పాపకర్ములు అజ్ఞానమనెడు కార్చిచ్చు నందు కాలిపోవువారై మహా రౌరవాది నరకము లందు పడిపోవు నీచులకు కాశీక్షేత్రము నందు వలె దక్షారామము నందును నీ దయతో మోక్షము కలుగు గాక.

విశేషము :- రౌరవావలి :- నరకములు పదునెనిమిది. అవి: 1. రౌరవము, 2. సూకరము, 3. తప్తలోహము, 4. మహాజ్వాలము, 5. శబలము, 6. విమోహము, 7. కృమి భక్ష్యము, 8. కృమీశము, 9. లాల, 10. విశసనము, 11. అధోముఖము, 12. కృమిపూయము, 13. వైతరణి, 14. కృచ్ఛ్రము, 15. అసిపత్రవనము, 16. వహ్నిజ్వాల, 17. సందంశము, 18. శ్వభోజనము.

**తే॥** సర్వ లోకంబులకును మోక్షదుఁడవైన
నీవు సన్నిహితుండవై నిలచినపుడు
దక్షిణాపథకాశి శ్రీదక్షవాటి
భువన మాన్యంబ కద నాదు పుట్టినిల్లు. 24

అర్థము :- సర్వలోకంబులకును=అన్ని లోకములకును; మోక్షదుఁడవు+ఐన=ముక్తిని ప్రసాదించువాడవైన; నీవు=నీవు; సన్నిహితుండవు+ఐ=సమక్షమందున్నవాడవై; నిలచినపుడు=ఉన్నపుడు; నాదు పుట్టినిల్లు=నాకు పుట్టిల్లయిన; దక్షిణాపథకాశి=దక్షిణభారత మందలి కాశి యగు; శ్రీ దక్షవాటి=శ్రీ దక్షారామము; భువన మాన్యంబ కద!=లోకమున పూజనీయమైనదే. కదా!

భావము :- ఓ స్వామీ! సర్వలోకములకు ముక్తిని ప్రసాదింపగల వాడవైన నీవు సన్నిహితుడవై నిలచి యున్నపుడు నా పుట్టిల్లయిన దక్షిణకాశియగు దక్షారామము లోకమున పూజనీయమైనదగును కదా!

**వ॥** అని విన్నవించిన యనంతరంబ యంబికా వల్లభుండు మందరాచల కూటంబనం బొల్చి సంస్మృతి మాత్రంబునం బొడచూపి నిల్చిన వృషభంబు నెక్కి యథోచితంబుగా నమందానందంబున గిరిరాజనందన వెనుకదెస నిఱియం గౌఁగిలించుకొని యుండఁదమతమ వాహనంబుల నారోహణంబు చేసి బ్రహ్మాదులు పరివేష్టించి చనుదేర శంసిత వ్రతులైన యక్షసుర సిద్ధ సాధ్యులు ముందటం గెలన బలసి యేతేర హృద్యంబులగు గద్య పద్యంబులు తుంబురు నారదాదులు పఠింప వేద ఘోషంబులు జయజయ శబ్దంబులు వేణువీణాకాహళాది పంచమహా వాద్య నాదంబులు కుంజర బృంహితంబులు తురంగ హేషితంబులు చెలంగ మూషకా రూఢుండై వినాయకుండు మున్నాడినడువ సుబ్రహ్మణ్యుండు మయూర వాహనుండై కదిసి కొలువ వసు రుద్రాదిత్యులు దుర్గా వీరభద్ర భైరవులు నంతరాంతరంబులఁ

**జండీశ్వరాద్య సంఖ్యాత ప్రమథ గణంబులు బలిసికొలువ కైలాస భవనంబున నుండి యక్షీణ విభవంబున దక్షారామంబు డాయంజనుదెంచునప్పుడు. 25**

అర్థము :- అని విన్నవించిన=అని విన్నపము చేసిన; అనంతరంబ=తరువాత; అంబికా వల్లభుండు=శంకరుడు; మందర+అచల+కూటంబు+అనన్=మందర పర్వతపు కొమ్ము అన్నట్లుగ; పొల్చి=ప్రకాశించి, సంస్మృతి మాత్రంబునన్=తలచినంత మాత్రముననే; పొడచూపి నిల్చిన=ప్రత్యక్షమై నిలచిన; వృషభంబున్+ఎక్కి=ఎద్దు (నంది) నెక్కి; యథోచితం బుగాన్=తగినట్లుగా; అమంద=తక్కువకాని; ఆనందంబున=ఆనందముతో; గిరిరాజ నందన=(పర్వత రాజైన హిమవంతుని కుమారియైన) పార్వతీదేవి; వెనుకదెసన్=వెనుక వైపుగ; ఇఱియన్=బిగువుగ; కౌఁగిలించుకొని యుండన్=కౌగిలించుకొని యుండగా;

తమతమ=తమతమ యొక్క; వాహనంబులన్=వాహనములను; ఆరోహణంబు చేసి= ఎక్కి; బ్రహ్మాదులు=బ్రహ్మ మొదలైనవారు; పరివేష్టించి=చుట్టును కూడి యుండి; చనుదేర= రాగా; శంసిత వ్రతులైన=స్తుతింపబడిన వ్రతములు కలవారైన; యక్ష=యక్షులు; సుర= దేవతలు; సిద్ధ=సిద్ధులు; సాధ్య=సాధ్యులు; ముందటన్=ముందువైపున; కెలన=ప్రక్కగా; బలసి=చుట్టుకొని; ఏతేర=వచ్చుచుండగా; హృద్యంబులగు=మనోహరములైన; గద్యపద్యం బులు=వచనములను పద్యములను; తుంబురు నారద+ఆదులు=తుంబురుడు నారదుడు మొదలగు వారు; పఠింప=చదువుచుండగా; వేదఘోషంబులు=వేదములు చదువుచుండుట వలననైన శబ్దములు; జయజయ శబ్దంబులు=జయ సూచకములైన పొగడ్తల మాటలు; వేణు వీణా కాహళ+ఆది=వేణువు, వీణ, బాకా మొదలయిన; పంచ మహావాద్య=ఐదు గొప్ప వాద్యముల యొక్క; నాదంబులు=ధ్వనులును; కుంజర=ఏనుగుల యొక్క; బృంహితం బులు=ఘీంకారములు; తురంగ=గుఱ్ఱముల యొక్క; హేషితంబులు=సకిలింతలు; చెలంగ=విజృంభింపగా;

మూషక+ఆరూఢుండై=ఎలుక నెక్కినవాడై; వినాయకుండు=విఘ్ననాయకుడు; మున్నాడినడువ=ముందుగ పయనించుచుండగా; సుబ్రహ్మణ్యుండు=కుమారస్వామి; మయూర వాహనుండై=నెమలిని వాహనముగ కలవాడై; కదిసి కొలువ=సమీపించి సేవింపగా; వసు=వసువులు (ఎనిమిది మంది); రుద్ర=రుద్రులు (పదునొకండుగురు); ఆదిత్యులు= సూర్యులు (పండ్రెండుగురు); దుర్గా=దుర్గాదేవి; వీరభద్ర=వీరభద్రుడు; భైరవులున్=భైరవుడు అనువారు; అంతరాంతరంబులన్=మధ్యమధ్య; చండీశ్వర+ఆది=చండీశ్వరుడు మొదలైన; ప్రమథ గణంబులు=ప్రమథ గణములు; బలసికొలువ=పరివేష్టించి సేవింపగా; కైలాస భవనంబున నుండి=కైలాసమందలి సౌధము నుండి; అక్షీణ విభవంబున=అనల్పమైన

వైభవముతో; దక్షారామంబు=దక్షారామ నగరమును; డాయన్=సమీపించుటకై; చనుదెంచు నప్పుడు=వచ్చునపుడు.

భావము :- అని పార్వతీదేవి విన్నపము చేసిన తరువాత శంకరుడు తలచిన మాత్రముననే ప్రత్యక్షమై నిలచి మందర పర్వత శిఖరము వలె నున్న నందిని ఎక్కినాడు. పార్వతీదేవియు అమితానందముతో వెనుక నుండి ఎద్దు నెక్కి శంకరు నానుకొని వెనుక కూర్చుండెను. బ్రహ్మాదులును తమ తమ వాహనముల నెక్కి ముందువైపు సిద్ధమైరి. నియమ శీలురైన యక్షులు సురలు సిద్ధులు సాధ్యులు మొదలైన దేవతా గణములు ముందువైపున కలసి వచ్చుచుండిరి. తుంబురుడు, నారదుడు మొదలైనవారు మనోజ్ఞముగ గద్యములను, పద్యములను చదువుచుండిరి. వేదనాదములు జయజయ శబ్దములు వినిపించుచున్నవి. వేణువు వీణ బాకా మొదలైన పంచ మహావాద్యములు శ్రుతి శుభగముగ మ్రోగుచున్నవి. ఏనుగుల ఘీంకారములు, గుఱ్ఱముల సకిలింతలు విజృంభించి విన్పించుచున్నవి.

వినాయకుడు ఎలుక వాహనము నెక్కి ముందుగ పయనించు చుండెను. కుమారస్వామి నెమలి వాహనము నెక్కి శంకరుని సమీపించి సేవించి అనుసరించుచుండెను. అష్టవసువులు, ఏకాదశ రుద్రులు, ద్వాదశాదిత్యులు, దుర్గ, వీరభద్రుడు, భైరవుడును, చండీశ్వరుడు మొదలగువారు ప్రమథ గణములును కూడి సేవించి అనుసరించి వచ్చుచుండిరి. శంకరుడు కైలాసమందలి సౌధము నుండి అనంత వైభవముతో బయలుదేరి దక్షారామమును చేరుటకై వచ్చుచున్నపుడు.

విశేషము :- అష్టవసువులు :- 1. ఆపుడు, 2. సోముడు, 3. ధరుడు లేక ధవుడు, 4. అనిలుడు, 5. అనలుడు, 6. ధ్రువుడు, 7. ప్రత్యూషుడు, 8. ప్రభాసుడు.

ఏకాదశరుద్రులు :- 1. అజైకపాదుడు, 2. అహిర్బుధ్న్యుడు, 3. త్వష్ట, 4. రుద్రుడు, 5. హరుడు, 6. త్ర్యంబకుడు, 7. వృషాకపి, 8. శంభుడు, 9. కపర్ది, 10. మృగవ్యాధుడు, 11. శర్వుడు.

ద్వాదశాదిత్యులు :- చూడుడు భీమ. 3-87.

తే॥ పొగడిరందు నికుంభకుంభోదరులును
బెరసి భద్ర మహాకాళి భృంగిరిటులు
పాయు బగళంబు తొలఁగు విచ్చేయుఁడనుచుఁ
బార్శ్వముల యందు మిగుల నార్భటము సేయ. 26

అర్థము :- అందు=ఆ ప్రదేశమున; నికుంభ కుంభోదరులును=నికుంభుడు, కుంభోదరుడును; పొగడిరి=స్తుతించిరి; భద్ర=వీరభద్రుడు; మహాకాళి=మహాకాళి; భృంగిరిటులు=భృంగిరిటి అనువారు; బెరసి=కలసి; పాయు=తొలగు తొలగు; బగళంబు= తప్పుకొనుడు; తొలగు=ప్రక్కకు తొలగుడు; విచ్చేయుడు=దయచేయుడు; అనుచున్=అని పల్కుచు; పార్శ్వముల యందు=ప్రక్కల యందు; మిగుల=మిక్కిలిగ; ఆర్భటము+చేయ= మ్రోతపెట్టుట చేయగా.

భావము :- నికుంభుడు కుంభోదరుడు అను ప్రమథ నాయకులు శంకరుని స్తుతించు చుండిరి. భద్రుడు, మహాకాళి, భృంగిరిటుడు అనువారు శంకరున కిరువైపుల నుండి త్రోవ కడ్డము వచ్చువారిని తొలగిపొండు తొలగిపొండని కేకలు వేయుచు సందడి చేయుచుండిరి.

విశేషము :- బగళంబు - కన్నడపదము. ఎఱ్ఱన నృసింహ పురాణము నందు (1-80) కూడ కలదు.

సీ॥ "అవసరం బిప్పుడ యగునంతదాఁకను
బగళమై నిలుఁడు దిక్పాల వరులు."

బగళమై నిలుఁడు=తొలగి నిలువుడు -వేలూరి శివరామ శాస్త్రి.

వ॥ **అంత నీలకంఠుండు పురోపకంఠంబునకు విచ్చేయు నప్పుడు.** 27

అర్థము :- అంత=అపుడు; నీలకంఠుండు=(నల్లని కుత్తుక కలవాడు) శంకరుడు; పుర=నగరము యొక్క; ఉపకంఠంబునకు=సమీపమునకు; విచ్చేయునపుడు=వచ్చునపుడు.

భావము :- అంతట శంకరుడు దక్షారామ నగర సమీపమునకు వచ్చునప్పుడు.

ఆ॥ **విషమ కఠిన నిమ్న వీథీ విటంకంబు**
**నంతరాంతరముల నరసి యరసి**
**యక్ష కర్దమమున యక్షేశ్వరాదులు**
**సవర చేసిరధిక సంభ్రమమున.** 28

అర్థము :- యక్షేశ్వర+ఆదులు=యక్షనాయకులు మొదలగు వారు; అధిక సంభ్రమమున=ఎక్కువ తత్తరపాటుతోను, ఉత్సాహముతోను; యక్షకర్దమమున=కర్పూరము కస్తూరి అగురు తక్కోలము చందనము కుంకుమ పువ్వు మొదలగు వానితో కలిపి చేసిన పొడితో; విషమ=సమముగ లేనట్టి; వీథీ విటంకంబున్=వీథి యందలి ఎత్తు చోటుల; అంతర+అంతరములన్=లోలోపలి భాగములను; అరసి+అరసి= వెదకి వెదకి; సవర చేసిరి=చదును చేసిరి.

భావము :- శంకరుడు పయనించు వీథులలోని సమముగ లేని; గట్టిగకల; ఎత్తుపల్లములు గల ప్రదేశములను వెదకి వెదకి యక్షనాయకులు మొదలగు వారు మిక్కిలి తత్తరపాటుతోను ఉత్సాహముతోను యక్షకర్దమము పొడితో చదునుచేసిరి.

కం॥ ఘుసృణ ప్రసూన రసమునఁ
బసపుంజూర్ణమునఁ జంద్ర పాంసుల ముక్తా
విసరముల సురలొనర్చిరి
పసగా శంఖాబ్జముఖ్య బహు చిత్రములన్. 29

అర్థము :- సురలు=దేవతలు; ఘుసృణ ప్రసూన రసమునన్=కుంకుమ పూరసముతో; పసపుంజూర్ణమునన్=పసుపు పొడితోను; చంద్రపాంసుల=కర్పూరపు పొడితోను; ముక్తా విసరముల=ముత్యముల సమూహముతోను; పసగా=నేర్పుగా, శంఖ+అబ్జ+ముఖ్య= శంఖములు పద్మములు మొదలైన; బహు=అనేకములైన; చిత్రములన్=చిత్తరువులను; ఒనర్చిరి=చేసిరి.

భావము :- దేవతలు కుంకుమ పూద్రవములో పసుపు పొడిని కర్పూరపు పొడిని కలిపి ముత్యముల సద్దుచు నేర్పుగను పరిమళ భరితముగను శంఖము పద్మము మొదలగు బొమ్మలను చేసిరి.

వ॥ వెండియు సువర్ణారవింద సందానిత సుందర మందార మాలికాభిరామంబును సంస్తంభిత శాతకుంభదండమండిత ధ్వజోప శోభితంబును నానా విపణి మార్గన్యస్త సంఘటిత మాణిక్య మయూఖ రేఖా కిమ్మీరిత దశదిశా ముఖంబును వర విశేష విభవ లక్ష్మీధామంబును నగు దక్షారామంబుఁ బ్రవేశించు నప్పుడు. 30

అర్థము :- వెండియు=మరియు; సువర్ణ+అరవింద=బంగరు తామరపూలతో; సందానిత=కూర్పబడిన; సుందర=అందమైన; మందార=మందార పూవుల; మాలికా= మాలలతో; అభిరామంబును=మనోజ్ఞమైనదియు; సంస్తంభిత=స్థాపింపబడిన; శాతకుంభ=బంగారపు; దండమండిత=స్తంభముచే అలంకరింపబడిన; ధ్వజ+ఉపశోభితంబును=జండాతో ప్రకాశించుచున్నదియు;

నానా=అనేకములైన; విపణి మార్గ=అంగడి వీథుల యందు; న్యస్త=ఉంచబడి; సంఘటిత=చక్కగా కూర్పబడిన; మాణిక్య=కెంపుల యొక్క; మయూఖరేఖా=కిరణ కాంతులతో; కిమ్మీరిత=చిత్రచిత్ర వర్ణములుగ చేయబడిన; దశదిశాముఖంబును=పది దిక్కుల ముందు భాగములు కలదియు; వర=మేలైన; విశేష=విశిష్టమైన; విభవలక్ష్మీ=సంపదలనెడి లక్ష్మీదేవికి;

ధామంబునున్=నిలయమైనదియు; అగు=అయిన; దక్షారామంబున్=దక్షారామ నగరమును; ప్రవేశించునప్పుడు=చొచ్చునపుడు.

భావము :- బంగరు తామరపూలతో కూర్పబడిన అందమైన మందార మాలలతో మనోజ్ఞముగ ప్రకాశించునట్టిదియు, బంగరు రేకులు తాపటము చేయబడిన ధ్వజస్తంభ పతాకలతో ప్రకాశించునట్టిదియు, అనేకములైన అంగడి వీథులలో నుంచబడిన కెంపుల కాంతి సమూహముల చేత చిత్రచిత్ర వర్ణములు పొందిన దశదిక్కులు కలదియు, మేల్తరమైన అధికమైన సంపల్లక్ష్మికి నివాసమైనదియునైన దక్షారామ నగరమును శంకరుడు ప్రవేశించునపుడు.

## శివుఁడు దక్షారామంబుఁ బ్రవేశించుట

ఉ॥ అక్షత గంధ పుష్ప ఫలహారి హిరణ్మయ పాత్ర హస్తలై
దక్షపురీ విలాసినులు తామరసాయత లోచనల్ సహ
స్రాక్షుఁడు భీమ లింగమున కర్పణ చేసిన యప్సరల్ విరూ
పాక్షు నెదుర్కొనం జనిరి యందియ లంఘ్రుల ఘల్లుఘల్లనన్. 31

అర్థము :- సహస్రాక్షుఁడు=దేవేంద్రుడు; భీమలింగమునకు=శ్రీ భీమేశ్వర స్వామికి; అర్పణ చేసిన=సమర్పించిన; అప్సరల్= అప్సరసలైన; దక్షపురీ=దక్షారామము నందలి; విలాసినులు=భోగకాంతలు; తామరస=పద్మము వలె; ఆయత=విశాలమైన; లోచనల్= కన్నులు కలవారు; అక్షత=అక్షతలు; గంధ=గంధము; పుష్ప=పూవులు; ఫల=పండ్లతో; హారి= మనోహరమైన; హిరణ్మయ పాత్ర=బంగారపు పాత్రలను; హస్తలై=చేతులందు కలవారై; అంఘ్రుల=పాదములందలి; అందియలు=అందెలు; ఘల్లుఘల్లనన్=ఘల్లుఘల్లుమని మ్రోగుచుండగా; విరూపాక్షున్=ముక్కంటిని; ఎదుర్కొనన్=ఎదురువచ్చి ఆహ్వానించుటకై; చనిరి=వెళ్ళిరి.

భావము :- దేవేంద్రుడు శ్రీ భీమేశ్వర స్వామికి సమర్పించిన అప్సరసలు పద్మముల వంటి విశాలమైన కన్నులు కలవారై దక్షారామ నగరమున భోగకాంతలైరి. వారు పూలు, పండ్లు, అక్షతలు, గంధము మొదలైన వానిని బంగరు పాత్రలలో నింపుకొని ఆ పాత్రలను చేతుల యందు ధరించి శంకరున కెదురేగి నగరములోని కాహ్వానించుటకై తమ తమ కాలి యందెలు ఘల్లుఘల్లు మనుచుండగా వెళ్లిరి.

తే॥ భావ హావ విలాస విభ్రమము లమరఁ
జంద్రశేఖరు నగరి యచ్చరల పిండు
తగ సమర్పించె నయ్యాది దంపతులకు
రత్న దీపాంకురముల నీరాజనములు. 32

అర్థము :- చంద్రశేఖరు నగరి=దక్షారామము నందలి, అచ్చరల పిండు=అప్సరసల సమూహము; భావ=భక్తి; హావ=కిలికించితములు; విలాస=శృంగార చేష్టలు; విభ్రమములు= వస్త్ర భూషణాదుల వెలుగులు; అమరన్=కలుగగా; తగన్=తగిన రీతిగ; అ+ఆది దంపతు లకు=ఆ మొదటి దంపతులైన పార్వతీ పరమేశ్వరులకు; రత్నదీప+అంకురములన్= రత్నముల దీపపు మొలకలతో; నీరాజనములు=ఆరతులను; సమర్పించెన్=ఇచ్చెను.

భావము :- దక్షారామము నందలి అప్సరసల సమూహము భక్తి, కిలికించితములు, శృంగార చేష్టలు, వస్త్రముల ఆభరణముల వెలుగులమరగా రత్న దీపముల మొలకలతో ఆరతులను తగినరీతిగ సమర్పించిరి.

ఉ॥ శైల తనూజ తోడుగఁ బ్రసాద గుణంబున మాటిమాటికిన్
మేలము లాడుచున్ నిజసమీపమునన్ గుహ మాతృ భద్ర శుం
డాలముఖ ప్రధాన గణనాథులు గొల్వఁగ భారతీశ ల
క్ష్మీలలనేశ్వరుల్ గదిసి చెప్పెడు విన్నప మాలకించుచున్. 33

అర్థము :- నిజ సమీపమునన్=తన (శంకరుని) సమీపమున; శైల తనూజ=పర్వత రాజ పుత్రియైన పార్వతీదేవి; తోడుగన్=సాయముగ; ప్రసాద గుణంబున=ప్రసన్నతయను సహజ లక్షణముతో; మాటిమాటికిన్=అడుగడుగునను; మేలములు+ఆడుచున్=పరాచకము లాడుచుండగా; గుహ=కుమారస్వామి; మాతృ=మాతృకాగణము; భద్ర=వీరభద్రుడు; శుండాల ముఖ=గజాననుడైన వినాయకుడు; ప్రధాన=మొదలైన; గణనాథులు=గణపతులు; కొల్వఁగన్=సేవింపగా; భారతి+ఈశ=సరస్వతీపతి యైన బ్రహ్మయు; లక్ష్మీలలన+ఈశ్వరుల్= లక్ష్మీపతియైన విష్ణువు; కదిసి చెప్పెడు=సమీపించి చెప్పెడి; విన్నపము=వినతిని; ఆలకించుచున్=వినుచు.

భావము :- శంకరుడు తన సమీపమున నున్న పార్వతి ప్రసన్నతతో మాటిమాటికి పరాచకము లాడుచుండగా కుమారస్వామి, మాతృకాగణము, వీరభద్రుడు, వినాయకుడు మొదలైన గణపతులు సేవించుచుండగా బ్రహ్మదేవుడు విష్ణుదేవుడు సమీపించి చేయు విన్నపములను ఆలకించుచు.

తే॥ భూమి దక్షిణ పాథోధి పుణ్యసీమఁ
బ్రజలు చేసిన భాగ్యవైభవ సమృద్ధి
శ్రీ మహాదేవు కరుణా నిరీక్షణంబు
గౌరిముఖ రాజలక్ష్మియుఁ గానఁబడియె. 34

అర్థము :- భూమి=భరత భూమి యందలి; దక్షిణ పాథోధి=దక్షిణ సముద్రపు; పుణ్యసీమన్=పవిత్ర ప్రదేశము నందు; ప్రజలు=జనులు; చేసిన=చేసికొన్న; భాగ్య=సుకృతము యొక్క, వైభవ=సంపద యొక్క; సమృద్ధి=పెంపు; శ్రీ మహాదేవు=శ్రీకరుడైన శంకరుని యొక్క; కరుణా=దయతో కూడిన; నిరీక్షణంబు=చూపు; గౌరిముఖ=గౌరీదేవి మొగమనెడి; రాజలక్ష్మియున్=చంద్రుని శోభయు; కానఁబడియె=కనిపించెను.

భావము :- భరత భూమిపై దక్షిణ సముద్రపు పవిత్ర ప్రదేశమైన దక్షారామము నందలి ప్రజలు చేసికొన్న సుకృత వైభవము యొక్క అధిక్యమది. మహాదేవుడైన శంకరుని దయగల చూపులు, పార్వతీదేవి మొగమనెడి చంద్ర శోభయు కన్పించెను.

శా॥ సంతోషించిరి దక్షిణాపథజనుల్ సాక్షాద్విరూపాక్షునిం
గాంతా సంయుతు నందివాహు శశి రేఖా జూట కోటీరు వే
దాంతాభ్యర్చిత పాదపంకజుని దక్షారామ మధ్యంబునం
దంత స్సంభృత సౌఖ్యుఁగంటి మిదె కన్నారంగ నంచెంతయున్. 35

అర్థము :- దక్షిణాపథ జనుల్=దక్షిణ భారతదేశము నందలి ప్రజలు; అంతస్+ సంభృత సౌఖ్యున్=మనసులోపల బాగుగా ధరింపబడిన అందము కలట్టియు; కాంతాసం యుతు=భార్యతో కూడియున్నట్టియు; నందివాహు=నందిని వాహనముగ గలట్టియు; శశిరేఖా జూట కోటీరు=చంద్రరేఖను జడముడిపై కిరీటముగ గలట్టియు; వేదాంత=ఉపనిషత్తుల చేత; అభ్యర్చిత=మిక్కిలి సేవింపబడుచున్న, పాదపంకజుని=పద్మముల వంటి పాదములు గలట్టియు; సాక్షాత్=సాక్షాత్తు (కన్నుల యెదుట) విరూపాక్షునిన్=ముక్కంటిని; దక్షారామ= దక్షారామ నగరము యొక్క; మధ్యంబునన్=మధ్య భాగము నందు; ఇదె=ఇదిగో; కన్నారంగన్= కనులార; కంటిమి=చూచితిమి; అంచు=అనుచు; ఎంతయున్= మిక్కిలిగ; సంతోషించిరి= ఆనందించిరి.

భావము :- దక్షిణ భారతదేశము నందలి ప్రజలు - అంతస్సౌందర్యము కలవాడు, విరూపాక్షుడు, పార్వతీ సహితుడు, నందివాహనుడు, చంద్రశేఖరుడు, ఉపనిషత్తులచే పూజింపబడువాడు నైన శంకరుని దక్షారామ మధ్యము నందు కనులార చూచితిమని మిక్కిలి ఆనందించిరి.

కం॥ నాగేంద్ర కర్ణకుండలు
నాగేంద్ర త్వక్కటీరు నగరాజ సుతా
సౌగంధ్య లలిత దక్షిణ
భాగుం గనుఁగొంటి మిట్టి భాగ్యము గలదే. 36

అర్థము :- నాగేంద్ర=సర్పరాజులు; కర్ణకుండలు=చెవులకు కుండలములుగ కలవానిని; నాగ+ఇంద్ర=గజరాజు యొక్క; త్వక్=చర్మము; కటీరు=మొలయందు (వస్త్రముగ) కలవానిని; నగరాజ=పర్వతరాజైన హిమవంతుని యొక్క; సుతా=పుత్రిక యైన పార్వతీదేవి యొక్క; సౌగంధ్య=పరిమళముతో; లలిత=అందమైన; దక్షిణ భాగున్=కుడిభాగము కలవానిని; కనుగొంటిమి=చూచితిమి; ఇట్టి=ఇటువంటి; భాగ్యము=అదృష్టము; కలదే=కలదా!

భావము :- సర్పరాజులను చెవుల కుండలములుగ కలవాడు, ఏనుగు తోలును నడుముకు వస్త్రముగ కట్టుకొన్నవాడు, ఎడమ పక్షము నాక్రమించిన పార్వతీ దేవి యొక్క పరిమళము లాలిత్యము కుడి పక్షమున కలము కొన్నవాడునైన శంకరుని చూచితిమి. ఇంతకంటె అదృష్టము కలదా!

విశేషము :- ఈ ఆశ్వాసముననే 130వ పద్యమున 'ఎడమన్ అర్ధాంగలక్ష్మి గౌరియు' అని చెప్పబడినది. కనుక ఎడమ భాగము నాక్రమించిన పార్వతీదేవి పరిమళము శంకరుని కుడిభాగమును పరిమళ భరితము చేసినదని భావించవచ్చు.

తే॥ అని సమస్త జనంబులు నభినుతింప
నల్ల నల్లన వేంచేసె నంధకారి
దక్షవాటిక ఘంటాపథంబు నందు
హరి శతానంద శక్రాది సురులు గొలువ. 37

అర్థము :- అని=అని; సమస్త జనంబులున్=అందరు ప్రజలును; అభినుతింపన్=స్తుతింపగా; హరి=విష్ణువు; శతానంద=బ్రహ్మదేవుడు; శక్ర=ఇంద్రుడు; ఆది=మొదలైన; సురులు=దేవతలు; కొలువ=సేవింపగా; దక్షవాటిక=దక్షారామము యొక్క; ఘంటాపథంబు నందు=రాజవీథి యందు; అల్లనల్లన=మెల్లమెల్లగ; అంధక+అరి=(అంధకుడను రక్కసుని చంపిన) శంకరుడు; వేంచేసెన్=వచ్చెను.

భావము :- ప్రజలు స్తుతించుచుండగా బ్రహ్మ విష్ణు మహేంద్రాది దేవతా ప్రముఖులు సేవించుచుండగా శంకరుడు దక్షారామ నగర రాజవీథి యందు మెల్లమెల్లగ వచ్చెను.

వ॥ ఇట్లు భీమేశ్వర సదనాంతరంబుఁ బ్రవేశించి. 38

అర్థము :- ఇట్లు=ఈ విధముగ; భీమేశ్వర=శ్రీ భీమనాథుని యొక్క; సదన+అంతరంబున్=నివాసము యొక్క లోభాగమును; ప్రవేశించి=చొచ్చి.

భావము :- ఈ విధముగ శంకరుడు శ్రీ భీమనాథుని నివాసము యొక్క లోభాగమునకు చొచ్చి.

తే॥ గారవించెను విధి శిరః కంపమునను
నాదరించెఁ బ్రియోక్తుల నబ్జనాభు
మించు మందస్మితమున మన్నించె శక్రు
హరుఁడు గరుణించె సురలఁ గటాక్ష దృష్టి. 39

అర్థము :- హరుఁడు=శివుడు; శిరః కంపమునను=తల యూపుతో; విధిన్=బ్రహ్మదేవుని; గారవించెను=ఆదరించెను; అబ్జనాభున్=విష్ణువును; ప్రియోక్తులన్=ఇష్టమైన మాటలతో; ఆదరించెన్=మన్నన చేసెను; మించు మందస్మితమున=ప్రకాశించు చిఱునవ్వుతో; శక్రు=ఇంద్రుని; మన్నించెన్=అనుగ్రహించెను; సురలన్=దేవతలను; కటాక్షదృష్టి=దయగల చూపులతో; కరుణించె=కనికరించెను.

భావము :- ఆలయ లోభాగమును ప్రవేశించిన శంకరుడు తలయూపి బ్రహ్మదేవుని మన్నించెను. ప్రియమైన మాటలతో విష్ణువును మన్నన చేసెను. ప్రకాశవంతమైన చిఱునవ్వుతో ఇంద్రుని ఆదరించెను. దయగల చూపులతో ఇతర దేవతా ప్రముఖులను కనికరించెను.

చ॥ సకల దిశాముఖంబులుఁ బ్రసన్నములయ్యెఁ బ్రదక్షిణార్చియై
యకలుష లీల గైకొనియె హవ్యవహుండు హవిర్విభాగముం
బ్రకటిత సౌఖ్యకారి యయి పాయక వీచె సమీరణంబు త్ర్యం
బకుఁడట భీమనాయకుని మందిరమధ్యము జొచ్చు నత్తఱిన్. 40

అర్థము :- త్ర్యంబకుఁడు=ముక్కంటి; అట=అపుడు; భీమనాయకుని=శ్రీ భీమేశ్వర స్వామి యొక్క; మందిర మధ్యమున్=ఆలయ మధ్యభాగమును, చొచ్చున్+ఆ+తఱిన్=ప్రవేశించు ఆ సమయమున; సకలదిశా ముఖంబులున్=అన్ని దిక్కుల యొక్క మొగములును; ప్రసన్నములయ్యెన్=నిర్మలములైనవి; ప్రదక్షిణ+అర్చి+ఐ=కుడివైపుగ తిరుగు జ్వాలలు కలవాడై; హవ్యవహుండు=అగ్నిదేవుడు; హవిస్+విభాగమున్=హోమద్రవ్యము యొక్క భాగమును; అకలుషలీలన్=పవిత్రమైన రీతిలో; కైకొనియె=గ్రహించెను; సమీరణంబు=గాలి; ప్రకటిత సౌఖ్యకారియయి=వెల్లడిచేయబడిన సుఖమును కల్గించునదై, పాయక=ఎడతెగకుండ; వీచె=వీచెను.

భావము :- శంకరుడు శ్రీ భీమేశ్వర స్వామి యొక్క నగరి మధ్య భాగమును ప్రవేశించు సమయమున అన్నిదిక్కులు నిర్మలములై ప్రకాశించినవి. అగ్నిదేవుడు హోమద్రవ్య భాగమును పవిత్రముగ స్వీకరించెను. వాయువు హాయిని కల్గించునట్లు ఎడతెగక వీచెను.

సీ॥ గంగా జలా పూర్ణ గాంగేయ మణికుంభ
హస్తాబ్జములఁ గొంద అప్సరసలు
ఫల పుష్ప కిసలయ ప్రచుర పాత్ర విశేష
హస్తాబ్జములఁ గొంద అప్సరసలు
నిర్మలానేక మాణిక్య నీరాజన
హస్తాబ్జములఁ గొంద అప్సరసలు
లాజాక్షతాదికల్యాణ వస్తువ్రాత
హస్తాబ్జములఁ గొందఱప్సరసలు
తే॥ నాటపాటల మ్రొక్కుల నభినుతులను
నర్థిసేవించి రొక కొంద అప్సరసలు
అపుడు రెండవకైలాసమనఁగ నొప్పె
నభవుఁడేతేర భీమ నాయకుని నగరు. 41

అర్థము :- అభవుఁడు=శంకరుడు; భీమనాయకుని=శ్రీ భీమేశ్వర స్వామి యొక్క; నగరు=అంతఃపురము; ఏతేర=రాగా;

గంగాజల=గోదావరి నది నీటితో; ఆపూర్ణ=బాగుగ నిండిన; గాంగేయ=బంగారపు; మణికుంభ=మణులు పొదిగిన కుండలు గల; హస్త+అబ్జములన్=పద్మముల వంటి చేతులతో; కొందఱు=కొంతమంది; అప్సరసలు=అప్సరస కాంతలు;

ఫల=పండ్లు; పుష్ప=పూలు; కిసలయ=లేత చిగురాకులు; ప్రచుర=అధికమైన; పాత్ర విశేష=విశిష్టమైన పాత్రలు; హస్త+అబ్జములన్=పద్మముల వంటి చేతులందు గల, కొందఱు=కొంతమంది; అప్సరసలు=అచ్చరలును;

నిర్మల=పవిత్రములైన; అనేక=అనేకములైన; మాణిక్య=కెంపుల యొక్క; నీరాజన= ఆరతుల తోడి; హస్త+అబ్జములన్=పద్మముల వంటి చేతులతో; కొందఱు=కొంతమంది; అప్సరసలు=అచ్చరలును;

లాజ+అక్షత+ఆది=పేలాలు అక్షతలు మొదలైన; లావణ్యవస్తు=చక్కని పదార్థముల యొక్క; వ్రాత=సమూహము కల; హస్త+అబ్జములన్=పద్మముల వంటి చేతులతో; కొందఱు= మరికొందరు; అప్సరసలు=అప్సరస జాతి స్త్రీలు;

ఒక కొందఱు=మరి కొంతమంది; అప్సరసలు=అచ్చరలు; ఆటపాటలన్= నర్తనల తోను గీతములతోను; మ్రొక్కులన్=నమస్కారములతోను; అభినుతులను=మిక్కిలి

స్తుతులతోను; అర్థిన్=పూనికతో; సేవించిరి=పూజించిరి; అప్పుడు=ఆ సమయమున; భీమ నాయకుని నగరు=శ్రీ భీమేశ్వర స్వామి యొక్క అంతఃపురము; రెండవ కైలాసము+అనఁగన్= రెండవ కైలాసము వలె; ఒప్పెన్=ప్రకాశించెను.

భావము :- అభవుడైన శంకరుడు శ్రీ భీమేశ్వర స్వామి యొక్క అంతఃపురము ప్రవేశించుటకు వచ్చిన సమయమున అప్సరస కాంతలలో కొందరు గోదావరీ జలమును నింపిన బంగరు కుండలను చేతులలో ధరించి వచ్చిరి. కొందరు పండ్లు, పూలు, చిగురాకులను విశిష్టమైన పాత్రలలో నింపి చేతులలో ధరించి వచ్చిరి. కొందరు ఆరతులిచ్చుటకై అనేకములైన కాంతిమంతములైన కెంపులను దోసిళ్ళతో తెచ్చుచుండిరి. కొందరు పేలాలు అక్షతలు మొదలైన చక్కని పదార్థములను దోసిళ్ళతో తెచ్చుచుండిరి. కొందరు పూనికతో ఆట పాటలతోను, నమస్కారములతోను, స్తుతులతోను వచ్చిరి. సేవించిరి. అపుడా స్థానము రెండవ కైలాసమువలె ప్రకాశించెను.

వ॥ మఱియు ననేక ప్రకారంబుల దివ్యాంగనా రచితోపచారంబు లంగీకరించుచు నాంగీరసదత్త శోభన లగ్నంబున మునుల యాశీర్వాదంబులు చెలంగ నంది వాహనంబు డిగ్గి నిజభుజావలంబనావతీర్ణయగు నపర్ణ హస్తాబ్జంబు కరపల్లవంబున నవలంబించి ముందట జలధర వాహుఁడు వేత్రహస్తుండై సందడి నెడంగలుగ జడియ మార్గశీర్ష శుద్ధ చతుర్దశి యందు రోహిణీ నక్షత్రంబున సిద్ధయోగంబున యోగీశ్వరేశ్వరుండు. 42

అర్థము :- మఱియున్=ఇంకను; అనేక ప్రకారంబుల=పలు విధంబులుగ; దివ్య+అంగనా=దేవకాంతలచే; రచిత=చేయబడిన; ఉపచారంబులు=సేవలు; అంగీక రించుచు=గ్రహించుచు; ఆంగీరస దత్త=అంగిరసుని కుమారుడైన బృహస్పతి చేత నిర్ణయింప బడిన; శోభన లగ్నంబున=శుభ ముహూర్తమున; మునుల=మునుల యొక్క; ఆశీర్వాదం బులు=దీవనలు; చెలంగ=విజృంభింపగా; నందివాహనంబు=నందివాహనమును; డిగ్గి=దిగి; నిజభుజ=తనభుజము యొక్క; అవలంబన=ఆశ్రయముతో; అవతీర్ణ=దిగినట్టిది; అగు= అయిన; అపర్ణ=పార్వతీదేవి యొక్క; హస్త+అబ్జంబు=పద్మము వంటి చేతిని; కరపల్లవం బునన్=తన చిగురాకు వంటి చేతితో; అవలంబించి=పట్టుకొని;

ముందట=ముందరి వైపున; జలధరవాహుఁడు=ఇంద్రుడు; వేత్రహస్తుండై=బెత్తము చేతియందు కలవాడై; సందడిన్=జన సమ్మర్దమును; ఎడంగలుగన్=ఎడమగునట్లు; జడియన్=భయపెట్టగా; మార్గశీర్ష=మార్గశిరమాసము యొక్క; శుద్ధ చతుర్దశి యందు=పున్నమి

ముందు నాటి చతుర్దశీ తిథి యందు; రోహిణీ నక్షత్రంబున=రోహిణి నక్షత్రమును పొంది యున్న సమయమున; సిద్ధ యోగంబున=జ్యోతిర్మండలములోని శుభ గ్రహకూటమి సమయమున; యోగీశ్వర+ఈశ్వరుండు=యోగీశ్వరులకు ప్రభువైన శంకరుడు.

భావము :- శంకరుడు అప్సరస కాంతలు చేసిన అనేకానేక ఉపచారములను గ్రహించి నాడు. బృహస్పతి నిర్ణయించిన శుభముహూర్తము సమీపించినది. మునులు ఆశీర్వచనములు పల్కుచుండిరి. శంకరుడు నంది వాహనమును దిగినాడు. పార్వతియు దిగినది. శంకరుడామె చేతిని తన చేతితో పట్టుకొని వచ్చుచుండెను. దేవేంద్రుడు ముందుండి బెత్తము చేత ధరించి జనసమ్మర్దమును ప్రక్కలకు తొలగించు చుండెను. మార్గశిర శుద్ధ చతుర్దశి యందు రోహిణీ నక్షత్రవేళ గ్రహకూటమి అనుకూలమైన సమయమున ఆ యోగీశ్వరేశ్వరుడైన శంకరుడు.

విశేషము :- అపర్ణ - పార్వతీదేవి శంకరుని కొఱకు తపస్సు చేయుచు రాలిన ఆకులను కూడ ఆహారముగ స్వీకరింపక కఠోర తపమాచరించుట చేత ఋషు లామెను 'అపర్ణ' అని సంబోధించిరి. నాటి నుండి పార్వతికి అపర్ణ అను నామము ప్రఖ్యాతమైనది.

తే॥ దాఁటెఁ బ్రాసాద దేహళి దర్పకారి
ధరణి ధర రాజపుత్రి కైదండ యొసఁగ
నమ్మహాదేవి కుచ మండలమ్ము సోఁకి
యంగకమ్ములఁ బులకంబు లంకురింప. 43

అర్థము :- ధరణి ధరరాజ పుత్రి=(పర్వత రాజైన హిమమంతుని కుమారియైన) పార్వతీదేవి; కైదండ=చేయూత; ఒసఁగన్=ఈయగా; ఆ మహాదేవి=ఆ మహాదేవుని భార్యయైన పార్వతి యొక్క; కుచమండలమ్ము=చనుకట్టు; సోఁకి=తగిలి; అంగకంబులన్=శరీర అవయములందు; పులకంబులు=గగుర్పాటులు; అంకురింప=మొలకెత్తగా; దర్పక+అరి= (మన్మథునకు శత్రువైన) శంకరుడు; ప్రాసాదదేహళి=దేవళము యొక్క కడపను, దాఁటెన్= దాటెను.

భావము :- పార్వతీదేవి చేయూత నీయగా ఆమె చనుకట్టు తగిలి దేహము పులకింపగా శంకరుడు దేవాలయము యొక్క గడపను దాటెను.

వ॥ అప్పుడు. 44

భావము :- ఆ సమయమున.

ఉ॥ తాముసు చేసినాఁడ నొక తప్పని చిత్తములోఁ దలంచునో
యేమనునో తనుంగనిన నీశ్వరుఁడంచు భయంబుతోన యా
స్వామికి నర్చనం బొసఁగె శంబర శత్రుఁడు దక్ష వాటికా
ధామ విలాస దీర్ఘికల దన్పుగఁ బూచిన హల్లకంబులన్. 45

అర్థము :- శంబర శత్రుఁడు=(శంబరాసురుని చంపిన) మన్మథుడు; తా=తాను; మును=పూర్వము; ఒక=ఒకానొక; తప్పు=అపరాధమును; చేసినాఁడను=చేసితిని; అని=అని; చిత్తములో=మనసులో; తలంచునో=భావించునో; ఈశ్వరుఁడు=శంకరుడు; తనుం గనినన్=తన్ను చూచినచో; ఏమనునో=ఏమనునో; అంచు=అని భావించుచు; భయంబుతోన= భయపడుచునే; దక్షవాటికాధామ=దక్షారామ నగరము నందలి; విలాస దీర్ఘికలన్; అందమైన నీటి పట్టులందు; తన్పుగన్=తనివితీర; పూచిన=పూచినట్టి; హల్లకంబులన్; చెంగలువ= పూలతో; ఆ స్వామికిన్=ఆ ప్రభువైన శంకరునకు; అర్చనంబు+ ఒసఁగెన్=పూజచేసెను.

భావము :- పూర్వము తానొక తప్పు చేసితినని ఇపుడు తన్ను చూచి ఆ శంకరుడే మనునో యని భయపడుచునే మన్మథుడు దక్షారామ నగరము నందలి అందమైన నడబావులందు తనివిదీర పూచిన చెంగలువ పూలను తెచ్చి ఆ ఆదిదేవునకు సమర్పించి పూజించెను.

విశేషము :- దీర్ఘిక=నాలుగు వందల ధనువుల పరిమాణము గల నీటిపట్టు-నడబావి.

వక్రత - వాక్యవక్రత

తే॥ మును కటాక్షైక వీక్షణాంభోరుహముల
నర్చనము లిచ్చిరఖిల లోకాధిపునకు
శివుని పూజించి రప్సర స్త్రీలు పిదప
హస్త పంకజ పుష్పోపహారములను. 46

అర్థము :- అప్సర స్త్రీలు=అప్సరః కాంతలు; మును=ముందుగా; కటాక్ష+ఏక+ వీక్షణా=క్రీగంటి చూపులే ప్రధానముగ గల కన్నులనెడి; అంభోరుహములన్=పద్మములతో; అఖిలలోక+అధిపునకు=అన్నిలోకములకు నాయకుడైన వానికి; శివునిన్=శంకరునకు; అర్చనములు+ఇచ్చిరి=పూజలను చేసిరి; పిదప=తరువాత; హస్తపంకజ=పద్మముల వంటి చేతులలోని; పుష్ప+ఉపహారములను=పూలు మొదలయిన పూజా ద్రవ్యములతో; పూజించిరి=పూజచేసిరి.

భావము :- అప్సరస కాంతలు ముందుగ ప్రేమైకమైన క్రీగంటి చూపులనెడి పద్మములతోను పిదప తమ చేతులలోని పూలు మొదలగు పూజా ద్రవ్యములతోను శంకరుని పూజించిరి.

విశేషము :- వాక్య వక్రత.

తే॥ కామమును లోభమును ముక్తికాంత యందు
మోహ మదములు బాలకముగ్ధ లందు
నధిక పాపాత్ములం దధర్మాత్ములందుఁ
గ్రోధ మాత్సర్యములు జనకోటి కొదవె. 47

అర్థము :- జనకోటికి=ప్రజాసమూహమునకు; ముక్తికాంతయందు=మోక్షమనెడి స్త్రీపై; కామమును=కోరికయు; మోహమును=ఆసక్తియును; బాలక=పదునారేండ్ల లోబడిన పిల్లలందును; ముగ్ధలందు=పండ్రెండు సంవత్సరములు కలిగి యౌవనోదయ మగుచున్న బాలలందును; మోహ=మోహము; మదము=అభిమానమును; అధిక పాప+ఆత్ములందు= మిక్కిలిగ పాప కర్మలు చేయు మనసులు కలవారి యందు; అధర్మ+ఆత్ములందు=ధర్మ విరుద్ధమైన మనసులు కలవారి యందును; క్రోధ మాత్సర్యములు=కోపము; అసూయలు; ఒదవె=కలిగెను.

భావము :- జన సమూహమునకు మోక్షమనెడి కాంతపై కోరికయు, ఆసక్తియు కల్గినది. బాలకులందు ముగ్ధలందు మోహమదములు కల్గినవి. అధిక పాపాత్ములందు అధర్మాత్ములందును క్రోధ మాత్సర్యములు కల్గినవి.

వ॥ అనంతరం బా శివుండభ్యంతర మందిరంబునఁ బ్రవేశించి హరి విరించి ప్రముఖ బృందారకుల చేత మధుపర్కాద్యుపచారంబులు గైకొని కక్ష్యాంతరంబులు గడచి గర్భ గృహ మండపంబు నందు నూత్నరత్న స్వరూపంబైన శ్రీ భీమనాథ మహాదేవ స్వయంభూ జ్యోతి స్సుధామయ మహాలింగంబు నాగమోక్త ప్రకారంబుల నర్చించి యాపాద మస్తకంబు తద్రూపంబు ముహూర్త మాత్రంబు చింతించి.48

అర్థము :- అనంతరంబు=తరువాత; ఆ శివుండు=ఆ శంకరుడు; అభ్యంతర మందిరంబునన్=మధ్య మందిరము లోనికి; ప్రవేశించి=చొచ్చి; హరి=విష్ణువు; విరించి= బ్రహ్మ; ప్రముఖ=మొదలైన; బృందారకులచేత=దేవతా ప్రముఖుల చేత; మధుపర్క+ఆది= మధుపర్కము మొదలైన; ఉపచారంబులు=సేవలు; కైకొని=గ్రహించి; కక్ష్య+అంతరంబులు= అంతస్థుల లోపలి భాగములను; కడచి=దాటి; గర్భ గృహమండపంబు నందు= గర్భాలయము లోని మండపము (దేవతా విగ్రహముల నుంచుటకై చుట్టును తెఱపిగ నుండునట్లు స్తంభములపై కట్టిన కట్టడము) పైన; నూత్న రత్న స్వరూపంబు+ఐన=క్రొత్త రత్నము ఆకారము కలదైన; శ్రీ భీమనాథ మహాదేవ=శ్రీ భీమనాథుడను పేరు గల శంకరుని యొక్క; స్వయంభూ=తనకు తానై ఆవిర్భవించిన; జ్యోతిస్+సుధామయ=కాంతిమంతమైన తెల్లని;

మహాలింగంబున్=గొప్పలింగమును; అగమ+ఉక్త=ఆగమ శాస్త్రమున చెప్పబడిన; ప్రకారంబులన్=పద్ధతులలో; అర్చించి=పూజించి; ఆ పాదమస్తకంబు=పాదముల నుండి శిరస్సు వరకు; తత్+రూపంబు=ఆ లింగ రూపమును; ముహూర్త మాత్రంబు=క్షణకాలము; చింతించి=పరిశీలించి.

**భావము :-** తరువాత శంకరుడు మందిర మధ్య భాగమును ప్రవేశించెను. బ్రహ్మ, విష్ణువు మొదలైన దేవతా ప్రముఖులు సమర్పించిన మధుపర్కము మొదలైన సేవలందు కొనినాడు. గర్భాలయమున ప్రవేశించినాడు. అచటి మండపముపై నూత్న రత్న కాంతులతో తెల్లనై శ్రీ భీమేశ్వర స్వయంభూ జ్యోతిర్లింగము ప్రకాశించుచున్నది. ఆగమ శాస్త్ర ప్రకార మాలింగమును పూజించినాడు. ఆ లింగ రూపమును నిలువెల్ల క్షణమాత్రము చూచి.

**విశేషము :-** మధుపర్కము :- పెరుగు, నేయి, నీరు, తేనెలను కలుపుటచే ఏర్పడిన పదార్థ విశేషము. దీనిని దేవతల కర్పింతురు. దీనిచే దేవతలు సంతుష్టులగుదురు. దీని నర్పించుటచేత సుఖ సౌభాగ్యములు కలుగును. షోడశోపచారములలో మధుపర్కమొకటి.

తంత్ర శాస్త్రానుసారము నెయ్యి, పెరుగు, తేనెలను మూడు పదార్థములను కలుపుటచే మధుపర్కము అగును.

ఆగమము :- దేవపూజా విధానము మొదలగు వానిని గూర్చి తెలుపు శాస్త్రము.

ఆపాదమస్తకము :- పాదముల నుండి శిరస్సు వరకని అర్థము. ఇచట శివలింగమునకు పాదములు తల యుండవు గనుక క్రింది నుండి పైదాక (నిలువెల్ల) అని భావము.

## శ్రీ కంఠుఁడు దక్షారామ భీమేశుతో నైక్యముం బొరయుట

శా॥ కైలాసాచలకేలిమందిరుఁడు శ్రీకంఠుండు సోత్కంఠుఁడై
ప్రాలేయాచల రాజకన్యకయుఁ దా బ్రహ్మాది దేవవ్రజం
బాలోకింపఁగ నైక్యముం బొరసె దక్షారామ భీమేశుతోఁ
ద్రైలోక్యంబును దివ్యలింగ శివ తాదాత్మ్యంబు వర్ణింపఁగన్. 49

**అర్థము :-** బ్రహ్మ+ఆది=బ్రహ్మదేవుడు మొదలైన; దేవ వ్రజంబు=దేవతల సమూహము; ఆలోకింపఁగన్=చూచుచుండగా; త్రైలోక్యంబును=మూడు లోకముల మొత్తమును; దివ్యలింగ=మహిమ గల లింగమునందు; శివ=శివుని యొక్క; తాదాత్మ్యంబు= లీనమగుటను; వర్ణింపఁగన్=స్తుతించు చుండగా;

కైలాస+అచల=కైలాసమనెడి పర్వతము; కేలి మందిరుఁడు=విలాస మందిరముగ కల; శ్రీకంఠుండు=నల్లని కుత్తుక కలవాడైన శంకరుడు; స+ఉత్కంఠుఁడై=ప్రబలమైన కోరిక కలవాడై; ప్రాలేయ+అచలరాజ=మంచుకొండ రాజైన హిమవంతుని యొక్క; కన్యకయున్=కుమారియైన పార్వతియు; తా=తానైన శంకరుడును; దక్షారామ భీమేశుతోన్=దక్షారామము నందలి శ్రీ భీమేశ్వర (లింగ) స్వామితో; ఐక్యమున్+పొరసెన్=ఏకతను పొందెను.

భావము :- కైలాసవాసుడు నీలకంఠుడు ఐన శంకరుడు ప్రబలమైన కోరికతో పార్వతీ సహితుడై - బ్రహ్మాది దేవతా ప్రముఖులు చూచుచుండగా ముల్లోకములు స్తుతించుచుండగా శ్రీ దక్షారామ భీమలింగమున లీనమయ్యెను.

విశేషము :- కైలాసవాసుడగు పరమేశ్వరుడు పరమేశ్వరితో సహా శ్రీ భీమేశ్వర లింగమున లీనమగుట ఇందలి విశేషము.

సీ॥ అవ్యయం బనవద్య మాద్య మచ్యుత మజం
 బవ్యక్త మప్రమేయం బనంగఁ
బరఁగి కైలాస భూధర సమాగతమైన
 తేజంబుతోఁ గూడి తేజరిల్లె
దక్షవాటీ పురాధ్యక్ష భీమేశ్వర
 శ్రీ స్వయం భూదివ్య సిద్ధ లింగ
మమృత పాథోధి మధ్యాంతస్సముద్భూత
 మమల పరంజ్యోతి రాదికంబు

తే॥ భువన బీజంబు కైవల్య భోగదాయి
యఖిల కళ్యాణ కారి విశ్వాద్భుతంబు
పూజఁగొనియెను మురభిదంబుజ భవాది
దేవతాకోటిచే సంప్రతిష్ఠఁ బొంది. 50

అర్థము :- అవ్యయంబు=నాశనము లేనిది, అనవద్యము=దోషము లేనిది; ఆద్యము= సనాతనమైనది; అచ్యుతము=పతనము లేనిది; అజంబు=పుట్టుక లేనిది; అవ్యక్తము=వ్యక్తము కానిది; అప్రమేయంబు=సరిగ తెలిసికొనుటకు సాధ్యము కానిది; అనంగన్=అనునట్లుగా; పరఁగి=ప్రకాశించి;

కైలాస భూధర=కైలాస పర్వతము నుండి; సమాగతమైన=వచ్చిన; తేజంబుతోన్=ప్రకాశముతో; కూడి=కలసి;

దక్షవాటీపుర=దక్షారామ నగరమునకు; అధ్యక్ష=నాయకుడైన; భీమేశ్వర=శ్రీ భీమేశ్వర స్వామియను; శ్రీ స్వయంభూ=శుభంకరమై తనకు తానై పుట్టిన; దివ్య సిద్ధ లింగము=గొప్ప మహిమ గల లింగమూర్తి;

అమృత పాథోధి=పాల సముద్రము యొక్క; మధ్య=మధ్య భాగమున; అంతస్+ సముద్భూత=లోపలి భాగము నుండి పుట్టినది; అమల=పవిత్రమైన; పరంజ్యోతిస్+ ఆదికంబు=సర్వోత్కృష్టమైన తేజస్సులో మొదటిది;

భువన బీజంబు=లోకముల పుట్టుకకు కారణమైనది; కైవల్య భోగదాయి=మోక్షమనెడి సుఖము నిచ్చునది; అఖిల కళ్యాణకారి=సర్వ శుభములను కలుగజేయునది; విశ్వ+ అద్భుతంబు=ఈ బ్రహ్మాండము నందు ఆశ్చర్యకరమైనదిగ; మురభిత్=(మురుడను రక్కసుని చంపిన) విష్ణుమూర్తి; అంబుజభవ=(పద్మమున పుట్టిన) బ్రహ్మదేవుడు; ఆది=మొదలైన; దేవతా కోటిచే=దేవతల సమూహము చేత; సంప్రతిష్ఠన్+పొంది=స్థాపనను పొంది; తేజరిల్లెన్=ప్రకాశించెను; పూజఁ గొనియెను=పూజలందుకొనెను.

భావము :- బ్రహ్మ, విష్ణువు మొదలైన దేవతా ప్రముఖులచేత స్థాపనను పొందిన దక్షారామ శ్రీ భీమలింగము సనాతనమైనది, నాశనము లేనిది, దోషము లేనిది, పతనము లేనిది, పుట్టుక లేనిది, గోచరము కానిది, పూర్తిగ తెలిసి కొనుటకు సాధ్యము కానిది - అన్నట్లుగ ప్రకాశించుచు కైలాస పర్వతము నుండి వచ్చిన కాంతితో కలసి - పాల సముద్రము యొక్క మధ్యభాగపు లోపలి నుండి పుట్టినది, పవిత్రమైనది, సర్వోత్కృష్టమైన మొదటి తేజము, లోకముల పుట్టుకకు కారణభూతమైనది, మోక్ష సుఖమును ప్రసాదించునది, సర్వశుభములను కూర్చునది, భువనము నందు అద్భుతమైనదియై ప్రకాశించెను. పూజలనందుకొనెను.

**వ॥ బ్రాహ్మీ ప్రధాన సప్తమాతృకలును నంది మహాకాళాది ప్రమథ గణంబులును హరివిరించి ప్రముఖ బృందారకులును బురందరాది లోకపాలకులును వసురుద్రాదిత్యమరు ద్విశ్వేదేవాశ్వినీ దేవతలును సిద్ధసాధ్యులును విద్యాధరోరగులును గ్రహ నక్షత్ర తారకంబులును బితృగణంబులును మూర్తంబులును నమూర్తంబులు నగు చరాచరంబు లన్నియు నానారత్న గంధ పుష్ప ధూప దీప నైవేద్యాదులు సమర్పించి ప్రదక్షిణంబు లాచరించి సమస్కరించి స్తుతియించిరి. తదనంతరంబ వెండియు.**

51

అర్థము :- బ్రాహ్మీ ప్రధాన=బ్రాహ్మీ మొదలయిన; సప్త మాతృకలును=ఏడుగురు మాతృకలును; నంది=నందీశ్వరుడు; మహాకాళ=మహాకాళుడు; ఆది=మొదలైన; ప్రమథ

గణంబులును=ప్రమథుల సమూహమును; హరి విరించి ప్రముఖ=విష్ణువు బ్రహ్మ మొదలైన; బృందారకులును=దేవతలును; పురందర+ఆది=ఇంద్రుడు మొదలైన, లోకపాలకులును= దిక్కులను పాలించువారును; వసు=వసువులును, రుద్ర=రుద్రులును; ఆదిత్య=సూర్యులును; మరుత్=వాయువులును; విశ్వేదేవ=శ్రాద్ధదేవతలును; అశ్వినీ దేవతలును=అశ్వనీ దేవతలును; సిద్ధ=సిద్ధులు; సాధ్యులును=సాధ్యులును; విద్యాధర=విద్యాధరులును; ఉరగులును= నాగులును; గ్రహ=సూర్య చంద్రాది గ్రహములును; నక్షత్ర=అశ్విని మొదలైన నక్షత్రములును; తారకంబులు=ఇతర నక్షత్రములును; పితృ గణంబులు=ప్రజాపతుల వలన పుట్టిన పితృదేవతలును; మూర్తంబులును=రూపము కలవియు; అమూర్తంబులున్=రూపము లేనివియు; అగు=అయిన; చర+అచరంబులు=చలనము కలవియు; చలనము లేనివియు; అన్నియు=అన్నియును; నానారత్న=అనేకములైన రత్నములును; గంధ=మంచి గంధమును; పుష్ప=పూవులును; ధూప=అగురు ధూపములును; దీప=దీపములును; నైవేద్య=నివేదనము లును; ఆదులు=మొదలైన వానిని; సమర్పించి= ఇచ్చి; ప్రదక్షిణంబులు=ప్రదక్షిణములను; ఆచరించి=చేసి; నమస్కరించి=నమస్కారములు చేసి; స్తుతియించిరి=స్తోత్రము చేసిరి; తదనంతరంబ=ఆ తరువాత; వెండియు=మరియు.

భావము :- బ్రాహ్మి మొదలయిన సప్త మాతృకలును, నంది మహాకాళుడు మొదలైన ప్రమథుల సమూహము, బ్రహ్మ విష్ణువు మొదలైన దేవతా ప్రముఖులును, ఇంద్రుడు మొదలయిన లోకపాలకులును, అష్ట వసువులు, నవగ్రహములు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు, సప్తవాయువులును, విశ్వేదేవాది శ్రాద్ధ దేవతలును, అశ్వినీ దేవతలును, సిద్ధులు, సాధ్యులు, విద్యాధరులు, నాగులు, అశ్విని మొదలయిన నక్షత్రములు, ఇతర తారకలును, పితృగణములును; రూపము కలవి రూపము లేనివి; చలనము కలవి చలనము లేనివి; అన్నియును - రత్నములు, గంధములు పుష్పములు ధూపములు, దీపములు, నైవేద్యములు మొదలైన వానిని సమర్పించి ప్రదక్షిణములు చేసి నమస్కారములు చేసి స్తోత్రములు చేసిరి. ఆ తరువాత మరియు..

**విశేషము** :- సప్తమాతృకలు :- వీరు ఏడుగురు - చూడుడు 1-88

**లోకపాలకులు** :- అనగా దిక్పాలకులు. వీరు ఎనమండుగురు : 1. ఇంద్రుడు, 2. అగ్ని, 3. యముడు, 4. వరుణుడు, 5. నిర్రృతి, 6. మరుత్తు, 7. కుబేరుడు, 8. ఈశానుడు.

**వసువులు** :- వీరు ఎనమండుగురు : చూ-విశే. ఆశ్వా-5; 25-వచ.

**రుద్రులు** :- వీరు పదునొకండుగురు : చూ-విశే. ఆశ్వా-5; వచ. 25.

**ఆదిత్యులు** :- వీరు పండ్రెండుగురు : చూ-విశే. ఆశ్వా-3; పద్యము-87.

**మరుత్తులు** :- ఇవి ఏడు : చూ-ఆశ్వా-3; పద్యము-48.

విశ్వేదేవులు :- వీరు పదిమంది : 1. క్రతువు, 2. దక్షుడు, 3. వస్తువు, 4. సత్యుడు, 5. కాముఁడు, 6. కాలుడు, 7. ధురి, 8. రోచనుడు, 9. పురూరవసుడు, 10. ఆర్ద్రవసుడు.

గ్రహములు :- ఇవి తొమ్మిది : 1. సూర్యుడు, 2. చంద్రుడు, 3. అంగారకుడు, 4. రాహువు, 5. బృహస్పతి, 6. శని, 7. బుధుడు, 8. కేతువు, 9. శుక్రుడు.

నక్షత్రములు :- ఇవి ఇరువదేడు : అశ్విని, భరణి, కృత్తిక, రోహిణి, మృగశిర, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష, మఘ, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, జేష్ఠ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషము, పూర్వభాద్ర, ఉత్తరభాద్ర, రేవతి.

పితృగణములు :- 1. వంశము నందలి పూర్వులు; 2. ప్రజాపతుల వలన కల్గిన యముడు అగ్నిష్వాత్తు మొదలైనవారు.

## లక్ష్మ్యాదులు శ్రీ భీమేశ్వరుని స్తుతించుట

కం॥ సిరి వాణి గౌరిసతి య
పృరస లరుంధతి యహల్య శచి మొదలగు స
త్పరమ పతివ్రత లర్చిం
చిరి దక్షారామ నిలయు శ్రీ భీమేశున్. 52

అర్థము :- దక్షారామ నిలయు=దక్షారామము నివాసముగ గల, శ్రీ భీమేశున్=శ్రీ భీమేశ్వర స్వామిని; సిరి=లక్ష్మీదేవి; వాణి=సరస్వతీ దేవి; గౌరీసతి=పార్వతీదేవియు; అప్సరసలు=అప్సరోజాతి కాంతలును; అరుంధతి=అరుంధతియు; అహల్య=అహల్యయు; శచి=శచీదేవియు; మొదలగు=మొదలైన; సత్+పరమ పతివ్రతలు=మంచి గొప్ప పతివ్రతలు; అర్చించిరి=పూజించిరి.

భావము :- దక్షారామ శ్రీ భీమేశ్వర స్వామిని సరస్వతి, లక్ష్మి, పార్వతి, అప్సరసలు, వసిష్ఠుని భార్య అరుంధతి, గౌతముని భార్య అహల్య, ఇంద్రుని రాణి శచీదేవి మొదలైన పరమ పతివ్రతలు పూజించిరి.

వ॥ ఇట్లు పూజచేసి పరమ పతివ్రతలు ముకుళిత కరాంబుజలై "శ్రీ దక్షవాటీ పురాధ్యక్ష! భీమేశ్వర! భీమనాథ! భీమశంకర! భీమలింగ! మహాదివ్యలింగ! యవాఙ్మానసగోచర! సనక సనందన సనత్కుమార సనత్సుజాతాది యోగీంద్రులు నపారంబైన నీ మహిమఁ గొనియాడనేర రటు గావున మిమ్ము స్తోత్రంబు సేయ

మాబోంట్ల తరంబె? నిర్గుణుండవు, సగుణుండవు, గుణాతీతుండవు, గుణాఢ్యుండవు. నీవొక్క గుణంబున బ్రహ్మవై సృజియింతు వొక్క గుణంబున విష్ణుఁడవై పాలింతు వొక్క గుణంబున రుద్రుండవై సంహరింతువు, సర్వభూతాంతరాత్మ భావనా! పరమపావనా! నీవు చంద్ర సూర్యాత్మ దీధితివై యహోరాత్ర రూపంబున వర్తింతువు. పృధివ్యాపస్తే జోవాయురాకాశాది పంచభూతాత్మక జీవాత్మక స్వరూపంబున వర్తింతువు. సర్వ భూతాత్మక ప్రవిష్టుండవు. సర్వేంద్రియ గుణాధారా! సర్వేంద్రియ వర్జిత! సర్వ సర్వాత్మక రూపంబున సర్వంబు ననుభవింతువు సర్వశక్త్యాత్మక సర్వభూత గుహాశయ యని నమో నమ శ్శబ్దంబుల తోడ నిన్ను శ్రుతులు సంస్తుతించు, శుద్ధుండవు బుద్ధుండవు సుఖివి సదానందుండవు సదాముక్తుండవు మముఁబోటి కామినులల్ప బుద్ధులు మిమ్ముఁ బ్రస్తుతింపఁగలవారలా! క్షమియింపు క్షమియింపుము రక్షింపు రక్షింపు మగోచర చరిత్ర! యగోచర బలాబల! మహర్షి యోగీంద్రులకు దుర్లభుండవు. సంసారి వసంసారివి. భవుండ వభవుండవు. మంగళుండ వమంగళుండవు. భుజంగ భూషణా! నిన్ను నీవ యెఱుంగుదువు. సర్వాతీతుండవు, తాపస ప్రియుండవు, తపోలభ్యుండవు. నిజకర్మనిష్ఠులైన కర్మఠులు నిన్ను భజియింతురు. నీకుఁ బ్రణామంబులు సేయుదురు. జ్ఞానంబున నొండె నజ్ఞానంబున నొండె నీ మహిమార్ణవంబున మునింగి దరిజేరం దెరువెఱుంగక నీవే తక్క నితఃపరంబెఱుంగక మాయాత్మశుద్ధి కొఱకుఁ దోఁచినట్లు వర్ణించెదము గాని శక్తి కలిగి కాదు. "దేవదేవ! మహాదేవ! దేవతా సార్వభౌమ! దేవాదిదేవ! దేవదేవేశ! మహాలింగ! తపో విశేషంబునం బర్వతాత్మజ నీదేహంబున సగపాలు గొనియె. నీ దేవికి నమస్కారము. నీకు దండ ప్రణామంబు కటాక్షింపు" మని ప్రార్థించిరి. తదనంతరంబ "యో సర్వమంగళా! భువనేశ్వరీ! సర్వమంగళదాయినీ! నీకు మ్రొక్కెదము. మమ్ము రక్షింపు" మని మహాదేవికిం గేలుదోయి నొసలిపయిం గీలించి "యో మహాదేవ! మహానుభావ! శశాంక శేఖర! నమస్తే నమస్తే నమ" యని యనేక ప్రకారంబుల స్తుతియించిన. 53

అర్థము :- ఇట్లు పూజచేసి=ఈ విధముగ పూజించి; పరమ పతివ్రతలు=ఆ గొప్ప పతివ్రత లందరు; ముకుళిత=ముడిచిన; కర+అంబుజలై=పద్మముల వంటి చేతులు కలవారై; శ్రీ దక్షవాటీపుర+అధ్యక్షా=శ్రీ దక్షారామ నగరమునకు నాయకుడవైన వాడా! భీమేశ్వర=ఓ భీమేశ్వర స్వామీ!; భీమనాథ=ఓ భీమనాథ స్వామీ!; భీమశంకర=ఓ భీమశంకర

స్వామీ!; భీమలింగ=ఓ భీమలింగేశ్వరా!; మహాదివ్యలింగ=ఓ గొప్పదివ్యలింగ మూర్తీ!; అవాఙ్మానసగోచరా=వాక్కునకు మనసునకు తోచనివాడా!; సనక=సనకుడు; సనందన= సనందనుడు; సనత్కుమార=సనత్కుమారుడు; సనత్సుజాత=సనత్సుజాతుడు; ఆది= మొదలైన; యోగీంద్రులున్=యోగీశ్వరులును; అపారంబైన=అంతులేని; నీ మహిమన్=నీ గొప్పతనమును; కొనియాడ నేరరు=స్తుతింపలేరు; అటుగావున=అందుచేత; మిమ్ము=తమను; స్తోత్రంబు+చేయ=స్తుతించుటకు; మాబోంట్ల=మావంటి వారి; తరంబె=సాధ్యమా!;

నిర్గుణుండవు=గుణములు లేనివాడవు; సగుణుండవు=గుణములతో కూడినవాడవు; గుణ+అతీతుండవు=గుణములను అతిక్రమించినవాడవు; గుణ+ఆఢ్యుండవు=గుణముల సమృద్ధి కలవాడవు; నీవు=నీవు; ఒక్క గుణంబున=ఒక గుణము (రజస్సు) చేత; బ్రహ్మవై=బ్రహ్మదేవుడవై; సృజియింతువు=సృష్టిచేయుదువు; ఒక్క గుణంబున=ఒక గుణము (సత్త్వము)చే; విష్ణువవై=విష్ణుమూర్తివై; పాలింతువు=రక్షణ చేయుదువు; ఒక్క గుణంబున=ఒక గుణము (తమస్సు) చేత; రుద్రుండవై=రుద్రమూర్తివై; సంహరింతువు= చంపెదవు;

సర్వభూత+అంతరాత్మ భావనా!=సర్వజీవుల హృదయములను గూర్చిన జ్ఞానము కలవాడా!; పరమ పావన=మిక్కిలి స్వచ్ఛమైనవాడా! నీవు=నీవు; చంద్ర సూర్య=చంద్రుని యొక్క సూర్యుని యొక్కయు; ఆత్మ=స్వభావమైన; దీధితివై=వెలుగువై; అహోరాత్ర స్వరూపంబున=పగలు రాత్రి అను రూపములతో; వర్తింతువు=ప్రవర్తింతువు; పృథివి=భూమి; ఆపస్=నీరు; తేజస్=అగ్ని; వాయుః=గాలి; ఆకాశ=ఆకాశము; ఆది=మొదలైన; పంచభూత+ ఆత్మక=ఐదు మహాపదార్థముల రూపముతో; జీవాత్మక రూపంబున=జీవి యొక్క స్వరూపముతో; వర్తింతువు=మెలగుచుందువు;

సర్వభూత+ఆత్మ ప్రవిష్టుండవు=సర్వ జీవ హృదయములందును ప్రవేశించిన వాడవు; సర్వ+ఇంద్రియ+గుణాధార=అన్ని యింద్రియముల యొక్క గుణములకు ఆధారమైన వాడా!; సర్వ+ఇంద్రియ వర్జిత=అన్ని ఇంద్రియములను వదలిపెట్టినవాడా!; సర్వసర్వాత్మక రూపంబునన్=సమస్తమునకు సంబంధించిన యంతటి రూపముతో; సర్వంబున్=అంతటిని అనుభవింతువు=పొందుదువు;

సర్వశక్తి+ఆత్మక=అన్ని శక్తుల యొక్క రూపము కలవాడా!; సర్వభూత గుహాశయ= సర్వప్రాణుల హృదయములను గుహలు నివాసముగ కలవాడా!; అని=అని; నమోనమ= నమస్కారముల యొక్క; శబ్దములతోడ=ధ్వనులతో; నిన్ను=నిన్ను; శ్రుతులు=వేదములు; సంస్తుతించు=స్తోత్రము చేయు; శుద్ధుండవు=పవిత్రుడవు; బుద్ధుండవు=జ్ఞానమూర్తివి; సుఖివి=సుఖము కలవాడవు; సదా+ఆనందుండవు=ఎల్లపుడు ఆనందము కలవాడవు; సదా=

ఎల్లపుడు; ముక్తుండవు=మోక్షము కలవాడవు; మముఁబోటి= మావంటి; అల్ప బుద్ధులు= చిన్నబుద్ధులు కలవారు; మిమ్ము=మిమ్ములను; ప్రస్తుతింపఁగల వారలా?=కొనియాడుటకు తగినవారా! కారు; క్షమియింపు క్షమియింపు=మన్నించుము మన్నించుము; రక్షింపు రక్షింపుము=కాపాడుము కాపాడుము;

అగోచర చరిత్ర=తలపునకు అందని చరిత్ర కలవాడా!; అగోచర బలాబల=కనిపింపని సామర్థ్యాసామర్థ్యములు కలవాడా!; మహర్షి=మహాఋషులకు; యోగీంద్రులకు= యోగిశ్రేష్ఠులకును; దుర్లభుండవు=పొంద శక్యము కానివాడవు; సంసారివి=లౌక్యుడవు; అసంసారివి=అలౌక్యుడవు; భవుండవు=పుట్టుట కలవాడవు; అభవుండవు=పుట్టుకలేని వాడవు; మంగళుండవు=శుభములు కల్గించువాడవు; అమంగళుండవు=(దుష్టులకు) శుభకరము కానివాడవు; భుజంగ భూషణా=పాములే ఆభరణముగ కలవాడా!; నిన్ను నీవ=నిన్ను నీవే; ఎఱుంగుదువు=తెలియుదువు; సర్వ+అతీతుండవు=అన్నింటిని అతిక్రమించువాడవు; తాపస ప్రియుండవు=మునులకు ఇష్టమైనవాడవు; తపోలభ్యుండవు=తపస్సు చేత పొందతగినవాడవు;

నిజకర్మ నిష్ఠులైన=విధ్యుక్తమైన పనులు చేయుట యందు నిశ్చయము కలవారైన; కర్మఠులు=పూర్తియగు వరకు విడువక చేయువారు; నిన్ను=నిన్ను; భజియింతురు= సేవింతురు; నీకు=నీకొఱకు; ప్రణామంబులు=నమస్కారములను; చేయుదురు=చేయుదురు; జ్ఞానంబునన్+ఒండె=తెలివిచే గాని; అజ్ఞానంబునన్+ఒండె=తెలివిలేక గాని; నీ మహిమ=నీ గొప్పతనమను; అర్ణవంబున=సముద్రమున; మునింగి=మునిగి; దరిజేరన్=ఒడ్డు చేరుటకై; తెరువు=సాధనము; ఎఱుంగక=ఇంతకన్న ఇతరమైన దేదియు తెలియక, మా+ఆత్మశుద్ధి కొఱకున్=మా మనసుల స్వచ్ఛతకై; తోఁచినట్లు=చేతనైన విధముగ; వర్ణించెదము గాని= కొనియాడెదము గాని; శక్తిగలిగి కాదు=శక్తికలవారమని కాదు;

దేవదేవ=దేవతలకు దేవతవైన వాడా!; మహాదేవ=ఓ మహాదేవుడా!; దేవతా సార్వభౌమ=దేవతలకు రాజరాజువైన వాడా!; దేవాదిదేవ=దేవతలందరిలో మొదటి దేవుడవైన వాడా!; దేవదేవేశ=దేవతలందరికిని పరమేశ్వరుడవైన వాడా!; మహాలింగ=ఓ గొప్పలింగమూర్తీ!; తపో విశేషంబునన్=తపస్సు యొక్క అతిశయము చేత; పర్వతాత్మజ= గిరిజాదేవి; నీ దేహంబున=నీ శరీరము నందు; సగపాలున్=సగభాగమును; కొనియెన్= పొందెను; ఈ దేవికి=ఈ పార్వతీదేవికి; నమస్కారంబు=నమస్కారము; కటాక్షింపుము= అనుగ్రహింపుము; అని=అని; ప్రార్థించిరి=వేడిరి;

తదనంతరంబ=ఆ తరువాత; ఓ సర్వమంగళా=సర్వశుభములను కల్గించుదానా!; భువనేశ్వరీ=లోకములకు నాయకురాలవైన దానా!; సర్వమంగళదాయినీ=సర్వ శుభములను ఇచ్చుదానా!; నీకు=నీకు; మ్రొక్కెదము=నమస్కరించెదము; మమ్ము=మమ్ములను; రక్షింపుము=కాపాడుము; అని=అని వేడికొని; మహాదేవికిన్=పార్వతీదేవికి; కేలుదోయి=రెండు

చేతులను; నొసలిపయిన్=నుదుటిపైన; కీలించి=కూర్చి; ఓ మహాదేవ=ఓ శంకరా!; మహానుభావ=ఔదార్యము గల గొప్పవాడా; శశాంక శేఖరా=చంద్రశేఖరా; నమః+తే+నమః+ తే+నమ=నీకు నమస్కారములు; అని=అని; అనేక ప్రకారంబుల=బహు విధములుగ; స్తుతియించిన=వేడిన.

భావము :- ఆ పరమ పతివ్రతలు ఈ విధముగ పూజించి చేతులు జోడించి నమస్కరించుచు ఓ దక్షారామ భీమేశ్వరా! మహాలింగా! ఆదిదేవ! వాక్కునకు మనసునకు అందనివాడా! సనక సనందనాది యోగీంద్రులే నిన్ను కొనియాడలేరే! ఇక మేమెంతటివారము;

నీవు గుణరహితుడవు, గుణ సహితుడవు, గుణ సమృద్ధిని కలవాడవు; నీవే ఒక గుణము చేత బ్రహ్మవై సృష్టి చేయుదువు, ఒక గుణముచేత విష్ణువువై పోషింతువు; ఒక గుణము చేత రుద్రుడవై నశింపజేతువు.

ఓ సర్వ భూతాంతర్యామీ! ఓ పరమ పరిశుద్ధుడా! సూర్య చంద్రులు నీవేయై పగలు రాత్రి రూపములుగ ప్రవర్తింతువు. భూమి నీరు అగ్ని గాలి ఆకాశము అను పంచభూతముల రూపములతో సర్వజీవులందు ప్రవర్తింతువు.

నీవు జితేంద్రియుడవై అన్నింటియందు అన్నింటిని అనుభవింతువు. సర్వశక్తి స్వరూపుడవు, సర్వజీవ రాశికిని ఈశ్వరుడవని వేదములు నీకు నమస్కరించుచు నిన్ను స్తుతించును. పరిశుద్ధుడవు, సర్వజ్ఞుడవు, ఎల్లపుడును సుఖము ఆనందము మోక్షము కలవాడవు. మావంటి కోరికలు కలవారు అల్పబుద్ధులు నిన్ను కీర్తింపలేరు. క్షమించి రక్షింపుము.

ఓ దేవాది దేవ! నీవు తలపున కందని చరిత్ర కలవాడవు, నీ సామర్థ్యా సామర్థ్యములు కన్పింపవు. యోగీంద్రులైన మహర్షులకు కూడ నీవు దుర్లభుండవు, జీవాత్మ కలవాడవు. జనన మరణాదులు లేనివాడవు, నీ నుండి లోకములు పుట్టును గాని నీకు పుట్టుట లేదు. శుభంకరుడవు, దుష్టులపాలిటి అశుభంకరుడవు, ఓ సర్పభూషణా! నిన్ను నీవే యెఱుగుదువు. నీవు సర్వాతీతుడవు, మునులకు ప్రియమైన వాడవు, తపస్సుచేత లభించువాడవు;

నిజకర్మనిష్ఠులైన కర్మఠులు నిన్ను సేవించి నమస్కరింతురు; తెలివి గలిగి గాని తెలివి లేక గాని నీ మహత్త్వమనెడు సముద్రమున మునిగి ఒడ్డునకు చేరు సాధనము తెలియక నీవు తప్ప ఇతరమైన దేదియు తెలియక మా మనసునకు తోచినట్లు కీర్తించుచుంటిమే గాని శక్తి కలవారమని కాదు;

ఓ దేవదేవ! మహాలింగ! భీమేశ్వర! తపో విశేషము చేత పార్వతీదేవి నీ అర్ధాంగి యైనది. ఈ దేవికి నమస్కారములు, నీకు సాష్టాంగ నమస్కారము అని ప్రార్థించిరి.

పిమ్మట ఓ సర్వమంగళా! భువనేశ్వరీ! సర్వమంగళదాయినీ! శాంకరీ! శాంభవీ! నీకు నమస్కరింతుము, మమ్ము రక్షింపుము అని తమ చేతులు జోడించి నుదుటిపై చేర్చి

పార్వతీదేవికి నమస్కరించిరి. మహానుభావుడు చంద్రశేఖరుడు మహాదేవుడు నైన శ్రీ భీమనాథ స్వామిని అనేక విధముల స్తుతించిరి.

చ॥ వికట జటా కుడుంగమున వెన్నెల తేని ధరించి వీనులం
ప్రకటిత నాగకుండల భరంబులు వ్రేలఁగ సుప్రసన్నుఁడై
వికవిక నవ్వుచుం గరము వేడుకతోఁబొడ చూపె భీమనా
యకుఁడు మహా పతివ్రతల కంబికతోఁ గరుణా గుణంబునన్. 54

అర్థము :- వికట జటా=విరివియైన జడలనెడి; కుడుంగమున=పొదరింటిపై; వెన్నెలతేని=చంద్రుని; ధరించి=తాల్చి; వీనులన్=చెవులకు; ప్రకటిత=కనుపట్టిన; నాగకుండల=సర్పములనెడి చెవి ఆభరణముల యొక్క; భరంబులు=అతిశయములు; వ్రేలఁగ=వ్రేలాడుచుండగా; సుప్రసన్నుఁడై=చక్కగ సంతుష్టుడై; వికవిక నవ్వుచున్=పకపక నవ్వుచు; అంబికతోన్=పార్వతీదేవితో కూడి; కరుణా గుణంబునన్=దయాగుణముతో; భీమనాయకుఁడు=శ్రీ భీమేశ్వర స్వామి; కరము వేడుకతో=మిక్కిలి సంతోషముగా; మహా పతివ్రతలకు=ఆ గొప్ప పతివ్రతలకు; పొడచూపె=కనిపించెను.

భావము :- అందమై విరివియైన జటాజూటమున చంద్రరేఖను ధరించి చంద్రశేఖరుడై, చెవులకు నాగాభరణములు వ్రేలాడుచుండగా సంతుష్టచిత్తుడై నగుమోముతో కరుణాగుణము కలవాడై పార్వతీ సహితుడై శ్రీ భీమేశ్వర స్వామి మిక్కిలి సంతోషముతో ఆ మహా పతివ్రతలకు కనిపించెను.

తే॥ ఇట్లు ప్రాదుర్భవించి సర్వేశ్వరుండు
వరము లెన్నేని యా పతివ్రతల కొసఁగి
యంత నంతర్హితుండయ్యె నఖిల సురులు
గానఁ గానంగ భీమ లింగంబు నందు. 55

అర్థము :- సర్వేశ్వరుండు=అందరికి యజమానుడైన శంకరుడు; ఇట్లు=ఈ విధముగ; ప్రాదుర్భవించి=అవతరించి; ఆ పతివ్రతలకు=సరస్వతి, లక్ష్మి, అరుంధతి మొదలైన పరమ పతివ్రతలకు; వరములు=కోరిన కోరికలను; ఎన్నేని=ఎన్నియో; ఒసఁగి=ఇచ్చి; అంత= అంతట; అఖిల సురులు=దేవతలందరును; కానన్+కానన్=చూచుచుండగనే; భీమలింగంబు నందు=శ్రీ భీమేశ్వరలింగ రూపము నందు; అంతర్హితుండు+అయ్యెన్= మాయమయ్యెను (లీనమయ్యెను).

భావము :- సర్వేశ్వరుడైన శంకరుడు ఈ విధముగ ఆ పరమ పతివ్రతలకు ప్రత్యక్షమై వరములను ప్రసాదించి దేవతలందరు చూచుచుండగనే శ్రీ భీమలింగము నందు లీనమయ్యెను.

వ॥ అప్పుడు సమీపవర్తియగు బృహస్పతికి దివస్పతి యిట్లనియె. 56

అర్థము :- అప్పుడు=ఆ సమయమున; సమీపవర్తి యగు=దాపున నున్నవాడైన; బృహస్పతికి=దేవగురువైన బృహస్పతికి; దివస్పతి=స్వర్గమునకు నాయకుడైన దేవేంద్రుడు; ఇట్లు+అనియె=ఈ విధముగ పల్కెను.

భావము :- అపుడు దాపున నున్న బృహస్పతితో ఇంద్రుడిట్లు పల్కెను.

## దివస్పతి బృహస్పతిని దానములఁ గూర్చి యడుగుట

కం॥ దాతృత్వము దానంబును
దాతవ్యంబనఁగ నెద్ది? ధర్మ విధిజ్ఞా!
దాతవ్యం బెయ్యది వి
ఖ్యాతము? భవ్యానుజన్మ! యానతి యీవే. 57

అర్థము :- ధర్మవిధిజ్ఞా=పుణ్యప్రదమైన యజ్ఞములు వ్రతములు చేయు విధానము తెలిసిన వాడా! భవ్య+అనుజన్మ=సత్యమును యోగ్యతను అనుసరించి పుట్టినవాడా!; దాతృత్వము=దానము చేయుట; దానంబును=దానము; దాతవ్యము=దానమీయ తగినది; అనఁగన్=అనగా; ఎద్ది=ఎటువంటిది; దాతవ్యము=దానమీయ తగినదిగ; ఎయ్యది=ఏది; విఖ్యాతము=మిక్కిలి ప్రసిద్ధమైనది; ఆనతి యీవే=దయతో చెప్పుము.

భావము :- ధర్మ విధిజ్ఞుడవు భవ్యజన్ముడవునైన ఓ దేవగురూ! దానము చేయుటన నేమి? దానమనగా ఏమి? దానమియ్యతగినదనగా ఏమి? దానమియ్యతగిన వానిలో మిక్కిలి ప్రసిద్ధమైన దేది? దయచేసి తెల్పుము.

కం॥ దేవతలకు బ్రాహ్మణులకు
నీవలయు పదార్థ మెద్ది యెఱీఁగింపఁదగున్
జీవా! బహు దాతవ్యలు
గావున రాజులకుఁ దెలియఁగాఁదగవగుఁబో. 58

అర్థము :- జీవా!=ఓ బృహస్పతీ!; దేవతలకు=దేవతలకును; బ్రాహ్మణులకున్=బ్రహ్మ (వేద) జ్ఞానము గలవారికిని; ఈ వలయు=ఈయదగు; పదార్థము=పదార్థము; ఎద్ది=ఏదియో;

ఎఱిఁగింపన్=తెలియజెప్పుట; తగున్=తగినది; బహుదాతవ్యులు=అనేకములైన దానముల నిచ్చువారు; కావున=కనుక; రాజులకు=రాజులకు; తెలియఁగాన్=తెలిసికొనుట; తగవగున్+పో=న్యాయమగును సుమా!

భావము :- దేవగురువైన ఓ బృహస్పతీ! దేవతలకును బ్రాహ్మణులకును దానమీయదగిన పదార్థ మేదియో నాకు తెల్పుడు. పలు దానములు చేయువారు గనుక రాజులుతెలిసికొనుట న్యాయ యుక్తము సుమా!

వ॥ అనిన విని వాస్తోష్పతికి గీష్పతి యిట్లనియె. 59

అర్థము :- అనిన=అని అడిగిన; విని=వినినవాడై; వాస్తోష్పతికి=గృహవాస్తు శాస్త్రమునకు అధిష్ఠాన దేవతయైన ఇంద్రునకు; గీష్పతి=దేవతలకు గురువైన బృహస్పతి; ఇట్లు+అనియె=ఈ విధముగ చెప్పెను.

భావము :- అని అడిగిన ఇంద్రునితో బృహస్పతి ఇట్లు చెప్పెను.

## భూదాన మహిమ

కం॥ పురుహూత! భూమి దానము
పరమము దానముల యందు బహు వస్తుతతుల్
ధరణీ తలమున యందును
విరళంబై యెపుడు నుద్భవించుట కతనన్. 60

అర్థము :- పురుహూత (పెక్కు పేర్లతో పిలువబడువాడవైన) దేవేంద్రా!; ధరణీ తలమున యందును=భూమియందు; బహు=అనేకములైన; వస్తుతతుల్=పదార్థముల సమూహములు; ఎపుడు=ఎల్లప్పుడు; విరళంబై=వృద్ధియై; ఉద్భవించుట కతనన్=ఉత్పత్తి యగుటచేత; దానముల యందు=దానములన్నింటి యందును; భూమిదానము=భూమిని దానము చేయుట; పరమము=శ్రేష్ఠమైనది.

భావము :- ఓ దేవేంద్రా! భూమియందు ఎల్లప్పుడును అనేకములైన పదార్థముల సమూహములు వృద్ధియై ఉత్పత్తియగును గనుక దానములన్నింటి యందును భూదానము శ్రేష్ఠమైనది.

కం॥ సర్వ పదార్థాశయమగు
నుర్వి మహీసురుల కిచ్చు నుత్తముల కగున్
సర్వ ప్రదాన ఫలమును
గీర్వాణాధీశ! యేటి కిన్సంశయముల్. 61

అర్థము :- గీర్వాణ=వాక్కే బాణముగ గల దేవతలకు; అధీశ=నాయకుడవైన ఓ దేవేంద్రా! సంశయముల్=అనుమానములు; ఏటికిన్=ఎందులకు!; సర్వపదార్థ=అన్ని పదార్థములకును; ఆశయమగు=ఆధారమైన; ఉర్విన్=భూమిని; మహీసురులకు= బ్రాహ్మణులకు; ఇచ్చు=ఇచ్చునట్టి; ఉత్తములకు=శ్రేష్ఠులకు; సర్వప్రదాన=అన్నింటిని దానము చేసిన; ఫలమును=ఫలితము; అగున్=కలుగును.

భావము :- ఓ దేవేంద్రా! అనుమానమెందులకు! అన్ని పదార్థములకు ఆధారమైనది భూమి. అట్టి భూమిని బ్రాహ్మణులకు దానము చేసిన ఉత్తమునకు అన్నిదానములు చేసిన ఫలితమును కలుగును.

చ॥ రజతము కాంచనంబు నవరత్నములున్ వనముల్ తటాకముల్
గజతురగాది జంతువులు గంధము పువ్వులుఁ బండ్లుఁ దేనియల్
ద్విజునకు వేఱు వేఱ కడు వేడుక నిచ్చుట కంటెఁ బ్రీతిఁ ద
త్ప్రజనన కారణంబగు ధరాస్థల మిచ్చుట యిచ్చుటన్నియున్. 62

అర్థము :- ద్విజునకు=బ్రాహ్మణునకు; రజతము=వెండి; కాంచనము=బంగారము; నవరత్నముల్=తొమ్మిది రకములైన రత్నములును; వనముల్=తోటలు, తోపులు; తటాకములు=చెఱువులు; గజతురగ+ఆది=ఏనుగులు గుఱ్ఱములు మొదలైన; జంతువులు= జంతువులును; గంధము=చందనము; పువ్వులున్=పూవులును; పండ్లున్=పండ్లును; తేనియల్=వివిధములైన తేనెలు; వేఱువేఱ=విడివిడిగా; కడువేడుకన్=మిక్కిలి సంతోషముతో; ఇచ్చుట కంటెన్=ధానము చేయుట కన్నను; ప్రీతిన్=సంతోషముతో; తత్=ఆయా పదార్థము లన్నింటిని; ప్రజనన=పుట్టించుటకు; కారణంబగు=కారణమైన; ధరాస్థలము=భూభాగమును; ఇచ్చుట=దానము చేయుట; అన్నియున్+ఇచ్చుట=అన్నింటిని దానమిచ్చినట్లగును.

భావము :- ఓ దేవేంద్రా! వెండి, బంగారము, నవరత్నములు, తోటలు-తోపులు, చెఱువులును; ఏనుగులు, గుఱ్ఱములు మొదలైన జంతువులను; గంధము, పూలు, పండ్లు, తేనెలు మొదలైన వానిని విడివిడిగా బ్రాహ్మణులకు దానమిచ్చుట కంటె ఆయా పదార్థము లన్నింటి పుట్టుకకు కారణభూతమైన భూమిని దానము చేయుటచే ఆ అన్నింటిని దానము చేసినట్లగును సుమా!

విశేషము :- నవరత్నములు : 1. వజ్రము, 2. వైఢూర్యము, 3. గోమేధికము, 4. పుష్యరాగము, 5. మరకతము, 6. మాణిక్యము, 7. నీలము, 8. ప్రవాళము, 9. ముత్యము.

తే॥ ధరణి సర్వగుణోపేత ధాన్యజనని
సస్యశాలిని నెవ్వాఁడు శాంత బుద్ధిఁ
బాత్రమున కిచ్చునతనికి ధాత్రియుండు
నంత కాలము సకల సౌఖ్యములు గలుగు. 63

అర్థము :- సర్వగుణ+ఉపేతన్=అన్ని గుణములతో కూడినదియు; ధాన్యజననిన్=ధాన్యమును ఉత్పత్తి చేయునదియు; సస్యశాలినిన్=పైరులతో ప్రకాశించునదియగు; ధరణిన్=భూమిని; ఏ+వాఁడు=ఎవడు; శాంతబుద్ధిన్=ప్రసన్నమైన బుద్ధితో; పాత్రమునకు=తగిన వానికి; ఇచ్చున్=దానమిచ్చునో; అతనికి=అట్టిదాతకు; ధాత్రి+ ఉండునంతకాలంబు=భూమి ఉన్నంత కాలము వరకు; సకల సౌఖ్యములు=అన్ని సుఖములు; కలుగు=కలుగును.

భావము :- భూమి సర్వ గుణములకు ఆశ్రయమైనది. ధాన్యము నుత్పత్తి చేయునది. పైరుపచ్చలతో ప్రకాశించునట్టిది. అట్టి భూమిని శాంత బుద్ధితో తగినవానికి దానము చేయు దాతకు భూమి ఉన్నంత కాలము సుఖ సంతోషములు కలుగును.

సీ॥ కృత దక్షిణంబు లగ్నిష్టోమములు పెక్కు
యజనించు నట్టి పుణ్యాత్ములకును
జ్ఞాన దయాసత్య సంతత విజితేంద్రి
యత్వముల్ గురుదేవతార్చనములు
మొదలుగాఁ గల పుణ్యములు సేయు ధన్యుల
కధికుండు భూప్రదుండండ్రు బుధులు
పరమ పాతివ్రత్య పరిపాటి పాటించు
తరుణి కంటె మహిప్రదాత పెద్ద

తే॥ వాఁడ మాన గోత్రుండును వాడు ఘనుఁడు
వాఁడు పుణ్య గరిష్ఠుండు వాఁడు బుధుఁడు
వాఁడు విశ్రాంతి మంతుండు వాఁడు దాత
యెవ్వఁడే వేద విప్రున కిచ్చు ధరణి. 64

అర్థము :- కృత దక్షిణంబులు=ప్రయోజనమైన దక్షిణలు గల; అగ్నిష్టోమములు=వసంత కాలమున అగ్నిని స్తుతించుచు; పెక్కు=అనేకములైన; యజనించునట్టి=యజ్ఞములు చేయునట్టి; పుణ్యాత్ములకును=పవిత్రమైన మనసులు కలవారి కంటెను;

జ్ఞాన=జ్ఞానము; దయా=కరుణ; సత్య=సత్యములతో; సంతత=ఎల్లపుడు; విజితేంద్రియిత్వముల్=ఇంద్రియములను జయించుటలు; గురు=గురువులను; దేవత=దేవతలను; అర్చనములు=పూజలు చేయుటలు; మొదలుగాఁ గల=మొదలయిన; పుణ్యములు=పుణ్యప్రదములైన పనులను; చేయు=చేయునట్టి; ధన్యులకు=కృతార్థుల కంటె; భూప్రదుండు=భూదానము చేసినవాఁడు; అధికుండు=గొప్పవాడని; బుధులు=పండితులు; అండ్రు=అందురు;

పరమ=శ్రేష్ఠమైన; పాతివ్రత్య=పతివ్రతా ధర్మము యొక్క; పరిపాటిన్=క్రమమును; పాటించు=ధరించు; తరుణికంటె=కాంత కన్నను; మహిప్రదాత=భూదానమును చేసినవాడు; పెద్ద=గొప్ప;

ఎవ్వఁడే=ఎవడు; వేదవిప్రునకు=వేదపారంగతుడైన బ్రాహ్మణునకు; ధరణిన్=భూమిని; ఇచ్చు=దానము చేయునో; వాఁడు=అట్టివాడు; అనూన గోత్రుండును=గొప్ప గోత్రము కలవాడు; వాఁడు=అతడే; ఘనుఁడు=గొప్పవాడు; వాడుఁ=అతడే; పుణ్య గరిష్ఠుండు=పుణ్యము చేత అధికుడు; వాఁడు=అతడే; బుధుఁడు=శాస్త్రము తెలిసిన పండితుడు; వాఁడు=అతడే; విశ్రాంతి మంతుండు=ఊరట పొందినవాడు; వాఁడు=అతడే; దాత=దానము చేసినవాడు.

భావము :- ప్రయోజనకరమైన దానము లిచ్చి అనేకములైన అగ్నిష్టోమ యాగములను చేసిన పుణ్యాత్ముల కంటెను, జ్ఞానము సత్యము దయలతో జితేంద్రియులై మిక్కుటముగ గురువులను దేవతలను పూజించు ధన్యాత్ముల కంటెను భూదానము చేసినవాడు గొప్పవాడని జ్ఞానులైన పండితులు చెప్పుదురు. పరమ పతివ్రతాధర్మములను పాటించు పతివ్రతకన్న భూదానమును చేసినవాడు పెద్ద.

వేద పారంగతుడైన బ్రాహ్మణునకు ఎవడు భూదానము చేయునో అతడే గొప్పవాడు. ఆతడే శ్రేష్ఠుడైన పుణ్యమూర్తి, అతడే జ్ఞానియైన పండితుడు. అతడే శాంతిమూర్తి. ఆతడే దాత.

తే॥ కాల మృత్యువు వెసఁదోలి కఱవ వెఱచు
నహిమ రోచియు నెండఁ గాయంగ నణఁగు
నగ్ని శంకించు నెరమంట లప్పళింప
భూమి దానం బొనర్చిన పుణ్యతముని. 65

అర్థము :- భూమి దానంబు=భూదానమును; ఒనర్చిన=చేసిన; పుణ్యతముని=శ్రేష్ఠమైన పుణ్యము కల వానిని; కాల మృత్యువు=కాలుడను పేరు గల యముడు; వెసన్=వేగముగ; తోలి=తఱిమి; కఱవన్=కాటువేయుటకు; వెఱచున్=భయపడును; అహిమ రోచియు=సూర్యుడును; ఎండగాయంగన్=ఎండకాయుటకు; అణఁగున్= శాంతించును; అగ్ని=నిప్పు; నెరమంటల=నిండైన మంటలచేత; అప్పళింపన్= క్రమ్ముకొనుటకు; శంకించున్=భయపడును.

భావము :- భూదానము చేసిన పుణ్య శ్రేష్ఠుని - కాలమృత్యువు వేగముగ తఱిమి కబళించుటకు జంకును. సూర్యుడు ఎండకాయుటకు వెనుకాడును. అగ్నియు తన నిండైన మంటలతో క్రమ్ముకొనుటకు భయపడును.

కం॥ స్వామి హిత మొప్పఁగను సం
గ్రామమునన్ శరపరంపరలు పయిఁ గురియం
గా మృతి బొందిన శూరుఁడు
భూమీ దాతకుఁ బ్రభావమునఁ గట్టుపడున్. 66

అర్థము :- స్వామి=ప్రభువు యొక్క; హితము=మేలునకు; ఒప్పఁగను=సమ్మతముగ; సంగ్రామమునన్=యుద్ధము నందు; శరపరంపరలు=బాణముల సమూహము; పయిన్=మీద; కురియంగా=వర్షింపగా; మృతి బొందిన=మరణించిన; శూరుఁడు=పరాక్రమ వంతుడు; ప్రభావమునన్=మహత్త్వము చేత; భూమీ దాతకున్=భూదానము చేసిన వానికి; కట్టుపడున్=బద్ధుడగును.

భావము :- రాజహితమును కోరి శత్రు బలగముతో యుద్ధమునకు దిగి ఆ యుద్ధ రంగమున వీర మరణము పొందిన శూరుడు మహత్త్వము చేత భూదానము చేసినవానికి బద్ధుడగును.

తే॥ అయిదు తరముల పూర్వుల నవుల మీఁద
నందఱను గాచు నూర్ధ్వ లోకాలయములఁ
గమియఁబండిన వివిధ సస్యముల తోడి
యవని దానంబు చేయు పుణ్యాత్మకుండు. 67

అర్థము :- కమియన్+పండిన=విరివిగ పండిన; వివిధ సస్యముల తోడి=అనేకములైన పైరులతో గల; అవనిన్=భూమిని; దానంబు చేయు=దానమిచ్చు; పుణ్యాత్మకుండు=సుకృతమైన ఆత్మకలవాడు; అయిదు తరముల=అయిదు తరముల వారైన; పూర్వులన్=తండ్రి, తాత మొదలైన వారిని; అవుల=ఆవల; మీఁదన్=తరువాతి కాలమున; అందఱను=అందరిని; ఊర్ధ్వలోక+ఆలయములన్=పైలోకముల యందలి నివాసములలో; కాచున్=రక్షించును.

భావము :- నిండు పంటలతో సస్య శ్యామలమైన భూమిని దానము చేసిన దాత పై లోకములకు వెళ్ళిన తన తండ్రి తాతలనెడి పూర్వులలో ఐదు తరముల వారిని, తన తర్వాతి ఐదు తరముల వారిని రక్షింపగలడు.

విశేషము :- భూదాత తనకు పూర్వము ఐదు తరముల వారిని తనకు తరువాత ఐదు తరముల వారిని - అందరిని పై లోకముల నివాసములలో రక్షింపగలడని భావము.

"దశపూర్వాన్ దశాపరాన్" - దాతకు పదితరముల ముందు వారిని తర్వాతి పది తరముల వారిని పరలోకములందు రక్షించును అని సంస్కృత భీమఖండము. (24-41).

కం॥ అనుములు గోధూమంబులు
మినుములు, శనగలును బండు మేదిని భూదే
వున కిచ్చు నెవ్వఁడతనికి
ననపాయ స్వర్గ సౌఖ్యమబ్బు మహేంద్రా! 68

అర్థము :- మహేంద్రా! అనుములు=అనుములును; గోధూమంబులు=గోధుమలు, మినుములు=మినుములు; శనగలును=శనగలును; పండు=పండెడు; మేదినిన్=భూమిని; భూదేవునకు=బ్రాహ్మణునకు; ఎవ్వఁడు=ఎవడు; ఇచ్చున్=దానముగ నిచ్చునో; అతనికి=ఆ భూదాతకు; అనపాయ=నాశనములేనట్టి; స్వర్గసౌఖ్యము=దేవలోక సుఖము; అబ్బున్=లభించును.

భావము :- ఓ దేవేంద్రా! అనుములు గోధుమలు మినుములు శనగ పంటలు పండు భూమిని బ్రాహ్మణునకు దానముగ నిచ్చిన దాతకు శాశ్వత స్వర్గ సుఖము కలుగును.

ఉ॥ హాటక పీఠికా ధవళ హర్మ్య మదావళ శంఖ కాహళీ
ఘోట సితాత పత్రములు క్రొత్త మెఱుంగులు వోని భామినుల్
మేటి ధనంబు వస్త్రములు మేదిని యీఁగికి నెంచి చూచినన్
సాటికిరావు గాన నిది సత్ఫల మభ్రము నాథ వాహనా! 69

అర్థము :- అభ్రము నాథ=అభ్రమువు అను తూర్పు దిక్కు నందలి ఏనుగునకు భర్తయైన ఐరావతమును; వాహనా!=వాహనముగ గల దేవేంద్రా!; హాటక పీఠికా=బంగరు సింహాసనములు; ధవళ హర్మ్యా=తెల్లని మేడలు; మదావళ=ఏనుగులు; శంఖ=శంఖములు; కాహళీ=ఢక్కలు; ఘోట=గుఱ్ఱములు; సిత+ఆతపత్రములు=తెల్లగొడుగులు; క్రొత్త మెఱుంగులు+పోని=లేత మెఱపుల వంటి; భామినుల్=సుందరీమణులు; మేటిధనంబు= అధికమైన ధనము; వస్త్రములు=బట్టలు-అనునవి; ఎంచి చూచినన్=లెక్కించి చూచినచో; మేదిని+ఈఁగికిన్=భూమిదానమునకు; సాటికిరావు=సరిరావు, కానన్=అందుచేత; ఇది=ఈ భూదానమనునది; సత్+ఫలము=శ్రేష్ఠమైన ఫలితమును కల్గించునది.

భావము :- ఓ మహేంద్రా! బంగరు సింహాసనములు; తెల్లని మేడలు; ఏనుగులు, శంఖములు; బాకాలు, గుఱ్ఱములు, వెల్లగొడుగులు, తళతళలాడు సందరీమణులు విరివియైన ధనము, వస్త్రములు - ఈ అన్నిటి దానములను పరిశీలించి చూచినచో భూదానమునకు సాటిరావు. కనుక ఈ భూదానమే సర్వశ్రేష్ఠమైన ప్రయోజనమును కల్గించును.

తే॥ శ్వేత పక్షంబు లోపలఁ బెరుఁగు నెట్లు
దినదినంబును నీహార దీప్తి దీప్తి
నవ్విధంబునఁ బెరుఁగు నిత్యాభివృద్ధిఁ
బంటపంటకు భూదాన భర్త ఫలము. 70

అర్థము :- శ్వేతపక్షంబు లోపలన్=శుక్లపక్షము నందు; నీహారదీప్తి=చలివెలుగైన చంద్రుని యొక్క; దీప్తి=కాంతి; దినదినంబును=రోజురోజుకు; ఎట్లు=ఏవిధముగ; పెరుఁగున్=అభివృద్ధి యగునో; అ+విధమునన్=ఆ రీతిగనే; భూదాన భర్త=భూదానము చేసిన స్వామి యొక్క; ఫలము=ఫలితము; పంట పంటకు=ప్రతి పంటకును (ప్రతి సంవత్సరము) నిత్య+అభివృద్ధిన్=శాశ్వతమగు పెంపుతో; పెరుఁగున్=వర్ధిల్లును.

భావము :- శుద్ధ పాడ్యమి నుండి పున్నమి వరకు చంద్రుని యొక్క కాంతి ఏవిధముగ రోజురోజుకు అభివృద్ధి యగునో ఆ విధముగనే భూదానము చేసిన వాని ఫలితము పంట పంటకు ఎడతెగని అభివృద్ధిని పొందును.

తే॥ పాతకము చేసియైనను బరితపించి
ధరణి దానంబు చేసిన ధన్యుఁ డడఁచు
నయ్యఘముఁ దథ్యమిది నిర్జరాధి నాథ!
కుబుస మూడ్చెడి మేటి నాగువును బోలె. 71

అర్థము :- నిర్జర+అధినాథ=దేవేంద్రా!; పాతకము=పాపము; చేసియైనను=చేసిన తరువాత నైనను; పరితపించి=పశ్చాత్తాపపడి; ధరణి దానంబు=భూదానమును; చేసిన=చేసిన; ధన్యుడు=కృతార్థుడు; కుబుసమును=కుబుసమును; ఊడ్చెడి=వదలివేసెడి; మేటి నాగువును బోలె=శ్రేష్ఠమైన త్రాచుపామువలె; ఆ+అఘమును=ఆ పూర్వము చేసిన పాపమును; అడంచున్=నశింపజేయును; ఇది=ఈ విషయము; తథ్యము=నిజము.

భావము :- పాపము చేసినవాడైనను పశ్చాత్తాపమును పొంది భూదానమును చేసిన పుణ్యాత్ముడు శ్రేష్ఠమైన త్రాచుపాము కుబుసమును వదలివేసినట్లుగ ఆ పూర్వపాపమును నశింప జేయగలడు. ఇది తథ్యము.

విశేషము :- అలంకారము - ఉపమ.

తే॥ ఒకఁడు హయమేధ మొనరించు నొక్కరుండు
భూమి దానంబొనర్చు నీ పురుషు లందుఁ
దారతమ్యంబు లేదండ్రు తత్త్వ విదులు
ధర్మములు రెండు నొక్క విధంబ కాన. 72

అర్థము :- ఒకఁడు=ఒకానొకడు; హయమేధము=అశ్వమేధ యాగమును; ఒనరించున్=చేయును; ఒక్కరుండు=ఒకడు; భూమిదానంబు=భూదానమును; ఒనర్చున్=చేయును; ధర్మములు రెండు=పుణ్యకర్మములైన ఈ రెండును; ఒక్కవిధంబకాన=ఒకే విధమగుట చేత; తత్త్వ విదులు=బ్రహ్మజ్ఞానము తెలిసినవారు; ఈ పురుషులందు=ఈ పై ఇరువురియందును; తారతమ్యంబు=తరతమ భావము (హెచ్చుతగ్గులు) లేదు+అంద్రు=లేదని అందురు.

భావము :- ఒకడు అశ్వమేధ యాగము చేయును. వేరొకడు భూదానము చేయును. ఈ ధర్మములు రెండును ఒకే విధమగుట చేత బ్రహ్మజ్ఞానులైన బుధులు ఆ యిరువురి యందును భేదము లేదని చెప్పుదురు.

ఉ॥ కాంచన కింకిణీ యుతము కామగమంబును దేవతాప్సర
శ్చంచల లోచనానికర సంకులముం బ్రమదావహంబు నై
మించిన దివ్య యానమున మీఁది జగంబులఁ గ్రీడ సల్పు ని
ర్వంచన భూమి దాత యగువాఁడు పురందర పెక్కు వర్షముల్. 73

అర్థము :- పురందర=దేవేంద్రా!; భూమి దాత యగువాఁడు=భూదానము చేసినవాడు; పెక్కు వర్షముల్=అనేక సంవత్సరములు; కాంచన కింకిణీ=బంగరు చిఱు గజ్జెలతో; యుతము=కూడినది; కామగమంబును=ఇచ్చ వచ్చిన చోటికి వెళ్ళగలది; దేవతా=దేవజాతి వారగు; అప్సరస్=అప్సరసలనెడి; చంచల లోచనా=కాంతల యొక్క; నికర= సమూహముతో; సంకులము=సంకీర్ణమైనది; ప్రమద+ఆవహంబున్=సంతోషము కల్గించునది; ఐ=అయి, మించిన=అతిశయించిన; దివ్య యానమున=దివ్య వాహనముతో; నిర్వంచన= ప్రమాదము లేకుండ; మీఁది జగంబులన్=పై లోకము లందు; క్రీడసల్పున్=విహరించును.

భావము :- ఓ దేవనాథా! పురందరా! భూదానము చేసినవాడు బంగరు చిఱు గజ్జెలతో కూడినది కామగమనము కలది దేవజాతివారైన అప్సరః కాంతా సమూహముతో కూడినది; మిక్కిలి సంతోషము కల్గించునది ఐన దివ్య వాహనముపైన పలు వత్సరములపాటు స్వర్గాది పై లోకములలో విహరింపగలడు.

కం॥ భూమికి సరియగు వస్తువు
భూమికి సరియైన విధియు భూమీ దాన
స్వామికి సరియగు పుణ్యుఁడు
లేమికి సందియ మొకింత లేదు మహేంద్రా! 74

అర్థము :- మహేంద్రా=ఓ దేవేంద్రా!; భూమికి=(భూత సమూహ మంతయు పుట్టుట కాశ్రయమైనది) భూమికి; సరియగు=సమానమైన; వస్తువు=పదార్థము; భూమికి=పుడమికి; సరియైన=సమమైన, విధియు=భాగ్యమును; భూమీదాన స్వామికిన్=భూదానము చేసిన శ్రేష్ఠునకు; సరియగు=సాటియైన; పుణ్యుఁడు=ధర్మాత్ముఁడు; లేమికి=లేకపోవుటకు; సందియము=అనుమానము; ఒకింత=కొంచెమైనను, లేదు=లేదు.

భావము :- ఓ దేవేంద్రా! భూమికి సరియైన వస్తువు గాని, భూమికి సమమైన సంపద గాని భూదాతకు సమమైన పుణ్యమూర్తి గాని లేవు లేదు లేడు అనుటకు ఏమాత్రము అనుమానము లేదు.

తే॥ భూమి దానంబె దాన మంభోదగమన!
సూనృతమె సారధర్మంబు సురవరేణ్య!
యనృతమె పాతకంబు సహస్ర నయన!
తెలియఁ జెప్పితి నీకు సందియము వలదు. 75

అర్థము :- అంభోదగమన!=మేఘముపై పయనించు వాడా! దేవేంద్రా! భూమీదానంబె=భూదానమే; దానము=దానము; సురవరేణ్య=దేవతలలో ప్రముఖుడమైన ఓ ఇంద్రా! సూనృతమె=సత్యమే; సారధర్మంబు=శ్రేష్ఠమైన ధర్మము; సహస్రనయన=వేయి కన్నులు కలవాడవైన ఓ సురేంద్రా! అనృతమె=అసత్యమే; పాతకంబు=పాపము (నరకమున పడద్రోయునది); నీకు=నీకు; తెలియన్+చెప్పితి=తెలియునట్లు చెప్పితిని; సందియము= అనుమానము; వలదు=కూడదు.

భావము :- ఓ మేఘవాహనా! సహస్రాక్ష! సురరాజా! ఇంద్రా! భూదానమే దానము. సత్యమే సర్వశ్రేష్ఠమైన ధర్మము, అసత్యమే పాపము. నీకు తెలియజెప్పుచుంటిని. ఇందే మాత్రము సందేహమక్కరలేదు.

## దివస్పతి శ్రీ భీమేశ్వరునకు భీమమండలంబు సమర్పించుట

**వ॥అనిన విని దివస్పతి బృహస్పతిం బూజించి యతని యుపదేశంబున భక్తి శ్రద్ధా తాత్పర్య విశ్వాసంబులు మనంబునం బెనంగొన భూమీ మండలంబు సస్యంబును, సోద్యానంబును, సకూపంబును, సతటాకంబును, సపద్మాకరంబును, సదక్షిణంబును, సశాస్త్రోకంబునుంగా ధారాపురస్సరంబుగా, శ్రీ భీమేశ్వర శ్రీ**

మన్మహాదేవునకు సమర్పించి యా మహా సన్నివేశంబునకు భీమమండలమ్మను నామంబు గల్పిచె నదియెట్లనిన. 76

అర్థము :- అనిన=అని చెప్పగా; విని=వినిన వాడై; దివస్పతి=ఇంద్రుడు; బృహస్పతిన్=బృహస్పతిని; పూజించి=పూజచేసి;, అతని=ఆ బృహస్పతి యొక్క; ఉపదేశంబున=బోధన చేత; భక్తి=భక్తియు; శ్రద్ధా=దీక్ష; తాత్పర్య=ఆసక్తి; విశ్వాసంబులు=నమ్మకములు; మనంబున=మనసులో; పెనంగొనన్=అల్లుకొనగా; భూమీ మండలంబు=భూభాగము; సస్యంబును=పైరులతో కూడినది; స+ఉద్యానంబును=ఉద్యాన వనములతో కూడినది; సకూపంబును=నూతులతో కూడినదియు; సతటాకంబును= చెఱువులతో కూడినదియు; సపద్మాకరంబును=సరస్సులతో కూడినదియు; సదక్షిణంబును=దక్షిణతో కూడినదియు; సశాస్త్ర+ఉక్తంబుగాన్=శాస్త్రములందు చెప్పబడినట్లుగా; ధారాపురస్సరం బుగా=నీటిధారా పూర్వకముగా; శ్రీ భీమేశ్వర=శ్రీ భీమేశ్వర స్వామి అను పేరుగల; శ్రీ మన్మహాదేవునకు=శంకరునకు; సమర్పించి=అప్పగించి; ఆ మహాసన్నివేశంబునకు=ఆ గొప్ప దక్షారామ ప్రాంత ప్రదేశమునకు; భీమ మండలంబు+ అను=భీమమండలమనెడు; నామంబు=పేరును; కల్పించెన్=సృజించెను; అది=ఆ పేరు పెట్టుట; ఎట్లనిన=ఏ విధమన్నచో.

భావము :- అని బృహస్పతి చెప్పగా వినిన ఇంద్రుడు బృహస్పతిని పూజించి ఆతని ఉపదేశము వలన భక్తి శ్రద్ధ తత్పర భావము విశ్వాసములు కలవాడై పైరులతోను, ఉద్యానవనములతోను, నూతులతోను, చెఱువులతోను, సరస్సులతోను, దక్షిణలతోను కూడియున్న భూమండలమును శ్రీ భీమేశ్వర మహాదేవునకు శాస్త్రోక్తముగ ధారపోసి సమర్పించి ఆ భూ మండలమునకు భీమ మండలమనెడి పేరు పెట్టెను. ఆ పేరు పెట్టుట ఎట్లనిన.

ఉ॥ అంబుధిమేర తూర్పునకు నబ్ధియ సీమటు యామ్య దిగ్వి భా
గంబునకుం బ్రతీచికిని గౌతమి సీమ యుదీచికిం బ్రమా
ణంబు త్రియోజనంబు సురనాథుఁడు దక్షిణ కాశి భీమలిం
గంబున కేక భోగముగఁ గట్టడి చేసె వసుంధరాస్థలిన్. 77

అర్థము :- సురనాథుఁడు=దేవేంద్రుడు; తూర్పునకు=తూర్పుదిక్కువైపు; అంబుధి= సముద్రము; మేర=హద్దు; అటు=ఆ; యామ్యదిక్+విభాగంబునకు=దక్షిణ దిక్కు యొక్క భాగమునకు; అబ్ధియ=సముద్రమే, సీమ=హద్దు; ప్రతీచికిని=పడమటి దిక్కునకు; గౌతమి= గోదావరి; సీమ=హద్దు; ఉదీచికిన్=ఉత్తర దిక్కునకు; త్రియోజనంబు=మూడు యోజనముల

దూరము; ప్రమాణంబు=హద్దు గల; వసుంధరాస్థలిన్=భూభాగమును; దక్షిణకాశి=దక్షిణకాశి యను ప్రసిద్ధిని పొందిన దక్షారామము నందలి; భీమలింగమునకు=శ్రీ భీమేశ్వర స్వామికి; ఏకభోగముగ=సర్వాధికారములు దత్తము చేసినదిగ; కట్టడిచేసెన్=నియమించెను.

భావము :- దేవేంద్రుడు తూర్పున సముద్ర పర్యంతము దక్షిణమున సముద్ర పర్యంతము పడమట గోదావరి వరకు ఉత్తరమున మూడు యోజనముల దూరము వరకు హద్దులుగ గల భూభాగమునకు శ్రీ భీమ మండలమని పేరు పెట్టి ఆ భీమ మండలమును దక్షిణకాశి యని ప్రసిద్ధి వడసిన శ్రీ దక్షారామ భీమేశ్వర స్వామికి సర్వాధికారములతో ఏక భోగముగ సమర్పించెను.

విశేషము :- భీమ మండలపు హద్దులు భీమ 3-18 చెంత వివరింపబడినవి.

సంస్కృత భీమ ఖండములో 'దక్షిణ కాశి' అను మాట లేదు. (అధ్యా-24; శ్లో. 56, 57)

పూర్వభాగే మహా సింధుర్దక్షిణే వృద్ధ గౌతమీ
పశ్చిమే గౌతమీ గంగా ఉత్తరే యోజన త్రయమ్
శ్రీ దక్ష వాటికా భీమలింగస్య సురనాయకః
దేయమబ్ధేశ్చ గౌతమ్యా స్తీర క్ష్మామండలం మహత్

తే॥ తుల్య భాగా తరంగిణి తోడఁగూడఁ
గణ్వ వాహిని తోఁ గూడఁ గనక రత్న
దివ్య పరిధాన సహితంబు దేవ భర్త
ధరణి భీమేశ్వరునకిచ్చె ధారపోసి. 78

అర్థము :- దేవ భర్త=దేవనాథుడైన ఇంద్రుడు; భీమేశ్వరునకు=శ్రీ భీమేశ్వర స్వామికి; తుల్యభాగా=తుల్యభాగ అను పేరుగల; తరంగిణి తోడన్+కూడన్=నదితోను; కణ్వ వాహిని తోన్+కూడ=కణ్వనది (గోదావరి)తోనూ; కనక=బంగారము; రత్న=రత్నములు; దివ్య పరిధాన=దివ్యమైన వస్త్రములతో; సహితంబు=కూడుకొన్న; ధరణి=భూమిని; ధారపోసి+ఇచ్చె=జలధారా పూర్వకముగా సమర్పించెను.

భావము :- దేవేంద్రుడు శ్రీ భీమేశ్వర స్వామికి తుల్యభాగానదితోను కణ్వనదితోను బంగారము రత్నములు దివ్యమైన వస్త్రములతో భూమిని ధారపోసి సమర్పించెను.

తే॥ దాత త్రైలోక్య భర్త వృద్ధశ్రవుండు
దేయ మంభోధి గౌతమీ తీర భూమి
త్రిపుర విధ్వసనుండు ప్రతి గ్రహీత
యింత యొప్పునె పరికింప నీ సమృద్ధి. 79

అర్థము :- దాత=దానము నిచ్చినవాడు; త్రైలోక్య భర్త=స్వర్గ మర్త్య పాతాళము లనెడి మూడు లోకములకు నాయకుడైన; వృద్ధశ్రవుండు=దేవేంద్రుడు; దేయము=దానమీయ తగినది; అంభోధి గౌతమీ తీరభూమి=సముద్రమునకు గోదావరీ నదికి నడుమ గల భూమి; ప్రతి గ్రహీత=దానమును గ్రహించిన వాడు; త్రిపుర విధ్వంసనుండు=త్రిపురములను త్రిపురాసురులను నాశనముచేసిన శ్రీ భీమశంకర స్వామి; ఈ సమృద్ధి=ఈ ఉన్నతి; పరికింపన్=పరిశీలింపగా; ఇంత+ఒప్పునె=ఇంత తగియుండునా!

భావము :- దానము చేసినవాడు ముల్లోక నాయకుడైన దేవేంద్రుడు. దానమును గ్రహించినవాడు త్రిపురాంతకుడైన శ్రీ భీమేశ్వర స్వామి. దానమీయబడినది సముద్ర గౌతమీ నదీతీర పర్యంతమైన భూమి. పరిశీలించి చూచినచో ఇంతటి ఔన్నత్యము మిక్కిలి తగియున్నది.

**వ॥ ఇవ్విధంబునఁ బాక శాసనుండు పురశాసనుండగు శ్రీ భీమేశ్వర శ్రీ మన్మహాదేవునకు నంగరాగాది భోగ వైభవ వినోదార్థంబుగా గజాశ్వ దాసదాసీ గాణిక్య మాణిక్య గోధేను సహితంబుగా భీమ మండలంబు దక్షారామ సమేతంబుగా సమర్పించి చాతుర్వర్ణంబును రప్పించి యిట్లనియె. 80**

అర్థము :- ఈ+విధంబునన్=ఈ విధముగా; పాక శాసనుండు=(పాకుడను రాక్షసుని చంపిన) దేవేంద్రుడు; పురశాసనుండగు=త్రిపురాంతకుడైన; శ్రీ భీమేశ్వర=శ్రీ భీమేశ్వర స్వామి అను పేరుగల్గు; శ్రీ మన్మహాదేవునకు=శంకరునకు; అంగరాగ+ఆది=శరీరమున కలదుకొను పరిమళ ద్రవ్యములు మొదలైన; భోగ వైభవ వినోద+అర్థంబుగా=సుఖము విభవము వినోదముల కొఱకై; గజ=ఏనుగులు; అశ్వ=గుఱ్ఱములు, దాసదాసీ=సేవకులు పనికత్తెలు; గాణిక్య=వేశ్యల సమూహము; మాణిక్య=కెంపుల సమూహము; గో+ధేను=ఆబోతులు ఆవుల యొక్క; సహితంబుగా=కూడికతో; భీమ మండలంబు=భీమ మండలమును; దక్షారామ సమేతంబుగా=దక్షారామ నగరముతో కూడ; సమర్పించి= ఇచ్చి; చాతుర్వర్ణ్యంబును=బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను నాలుగు వర్ణముల వారిని; రప్పించి=పిలిపించి; ఇట్లు+అనియె=ఈ విధముగ పల్కెను.

భావము :- ఈ రీతిగ దేవేంద్రుడు శ్రీ భీమేశ్వర స్వామికి - భోగములకు వేడుకలకు వినోదములకు గాను ఏనుగులను గుఱ్ఱములను సేవకులను పనికత్తెలను వేశ్యలను కెంపులను ఆబోతులతోడి ఆవుల మందలను, దక్షారామ నగరముతో సహా భీమ మండలమును భక్తితో సమర్పించి నాలుగు జాతుల వారిని పిలిపించి వారితో ఇట్లనెను.

సీ॥ ఓ మహాజనులార! భీమ మండల మహా
గ్రామ ఖండిక ఘట్టికా వ్రజైక
వాస్తవ్యులార! విశ్వాస పూర్వకముగా
సావధాన మనస్కులై వినుండు
ప్రాగ్దిశకును యామ్య పశ్చిమంబులకును
నంభోధి గౌతములవధి చిహ్నా
లుత్తరమున మూఁడు యోజనంబుల తుద
పొలిమేర యిది చక్రవలయరేఖ

తే॥ యీ మహా క్షేత్రమేను సర్వేశ్వరునకు
నిందు ధరునకు దక్ష వాటీశ్వరునకు
నిచ్చితిని ధారపోసి భీమేశ్వరునకు
నాసుధాకర తారకాహస్కరముగ. 81

అర్థము :- ఓ మహాజనులార=ఓ ప్రజలారా! భీమ మండల=భీమ మండలమనెడు; మహా గ్రామ=పెద్ద పల్లెలందును; ఖండిక=చిన్నపల్లెలందును; ఘట్టికా=పన్నులు వసూలు చేయు శాలలందును; వ్రజ=పశువుల కొట్టము లందును; ఏక=ప్రధానముగ; వాస్తవ్యులార= నివాసములు కలవారా! విశ్వాసపూర్వకముగా=నమ్మకముతో; సావధాన=జాగరూకతతోడి; మనస్కులై=మనసులు కలవారలై; వినుండు=వినుడు;

ప్రాక్+దిశకును=తూర్పుదిక్కునకును; యామ్యపశ్చిమంబులకున్=దక్షిణ పశ్చిమ దిక్కులకును; అంభోధి గౌతములు=సముద్రము గోదావరీ నదులు; అవధి చిహ్నాలు=హద్దు గుర్తులు; ఉత్తరమున=ఉత్తర దిక్కున; మూఁడు యోజనముల తుద=మూడు యోజనముల దూరము చివరన; పొలిమేర+హద్దు; ఇది=ఈ మధ్య గల భూమి, చక్రవలయ రేఖ=చక్రము వలె గుండ్రని హద్దు కలది;

ఈ మహాక్షేత్రము=ఈ గొప్ప ప్రాంతమును; ఏను=నేను; ఆ సుధాకర+తారక+ అహస్కరముగ=చంద్రుడు నక్షత్రములు సూర్యుడు ప్రకాశించుచుండు నంతకాలము వరకు; సర్వేశ్వరునకు=సర్వమునకు నాయకుడైన వానికి; ఇందుధరునకు=చంద్రశేఖరునకు; దక్షవాటీశ్వరునకున్=దక్షారామనగర నాయకుడైన వానికి; భీమేశ్వరునకున్=శ్రీ భీమేశ్వర స్వామికి; ధారపోసి=జలధారపోసి; ఇచ్చితిని=సమర్పించితిని.

**భావము :-** ఓ మహాజనులారా! భీమ మండల వాసులార! నమ్మకముతో జాగరూకులై వినుడు. తూర్పు దక్షిణ దిక్కులందు సముద్రము, పడమటి దిక్కున గోదావరి నది, ఉత్తరమున

దక్షారామమునకు మూడు యోజనముల దూరము చివరయు హద్దులు. ఈ మహా భూభాగము చక్రమువలె గుండ్రముగ నుండును. ఇట్టి భూమిని ఆచంద్ర తారార్కముగ నేను సర్వేశ్వరుడు చంద్రశేఖరుడు దక్షారామ నాయకుడు ఐన శ్రీ భీమేశ్వర స్వామికి భక్తితో ధారపోసి సమర్పించితిని.

ఆ॥ ఏలు కొంద్రు మీరలే పురాంతకునకుఁ
బృథివి యీఁగి బిడ్డ బిడ్డ తరము
బ్రతుకుఁడాశ్రయించి ఫణిరాజ కుండలు
భీమనాథ దేవు భూమి జనులు. 82

అర్థము :- పురాంతకునకున్=త్రిపుర సంహారకుడైన శ్రీ భీమశంకరునకు; ఈఁగి=దానమీయబడిన; పృథివి=భూమిని; మీరలే=మీరే; బిడ్డ బిడ్డతరము=వంశ పారంపర్యముగా; ఏలుకొంద్రు=కాపాడు కొందురు గాక; ఫణిరాజకుండలు=సర్పరాజులను చెవులకు కుండలముగ ధరించినవాడైన; భీమనాథదేవు=శ్రీ భీమేశ్వర స్వామి యొక్క; భూమి= భూమి యందలి; జనులు=ప్రజలు; ఆశ్రయించి=(ఆ స్వామిని, ఆ భూమిని) ఆశ్రయించి; బ్రతుకుఁడు=జీవించుదురు గాక.

భావము :- ఓ భీమమండల ప్రజలారా! పురాంతకునకు దానమీయబడిన భూమిని మీరే వంశ పారంపర్యముగ అనుభవించుచు కాపాడుకొనుడు. మీరందరు ఆ భూమిని, ఆ భీమేశ్వర స్వామిని ఆశ్రయించి బ్రతుకుడు.

వ॥ అని యీ ప్రకారంబునఁ దెల్పుడు సేయుచు. 83

అర్థము :- అని=అని చెప్పి; ఈ ప్రకారంబునన్=ఈ విధముగ; తెల్పుడు సేయుచు=తెలియపరచుచు.

భావము :- అని ఈ విధముగ తెలియ చెప్పుచు.

చ॥ సురపతి మార్గ శీర్షమున శుద్ధ చతుర్దశి నాఁడు రోహిణిం
బొరసిన సిద్ధ యోగమున భూతలమిచ్చెఁ బయోధి గౌతముల్
గరుసుగఁదుల్యభాగయును గండ్రెడు లోనుగ దక్షవాటికా
వరునకు భీమనాథునకు వారవధూ త్రిశత ద్వయంబుతోన్. 84

అర్థము :- సురపతి=దేవేంద్రుడు; మార్గ శీర్షమున=మార్గశిరమాసమందు; శుద్ధ చతుర్దశినాఁడు=పున్నమికి ముందు నాటి చతుర్దశీ తిథి రోజున; రోహిణిన్+పొరసిన=రోహిణీ నక్షత్రమును పొందిన; సిద్ధయోగమున=జ్యోతిర్మండలములోని గ్రహము లనుకూలించిన

సమయమున; పయోధి గౌతముల్=సముద్రము గౌతమీనదియు; గరుసుగన్=హద్దుగ; తుల్య భాగయును=తుల్య భాగానదియు; గంౘెడు లోనుగ=పరిమాణము గల భూభాగముతో; వారవధూ=భోగకాంతలు; త్రిశతద్వయంబుతోన్=అరువందలమందితోను; దక్షవాటికా వరునకు=దక్షారామ నగరనాయకుడైన; భీమనాథునకు=శ్రీ భీమేశ్వర స్వామికి; భూతలమున్= భూభాగమును; ఇచ్చెన్=సమర్పించెను.

భావము :- దేవేంద్రుడు మార్గశిర శుద్ధ చతుర్దశి యందు చంద్రుడు రోహిణీ నక్షత్రమును కూడియున్న శుభయోగము నందు సముద్రము గౌతమీనది తుల్యభాగానది హద్దులుగా గల అంతర్భాగమగు భూమిని అరువందల మంది భోగకాంతలతో సహా దక్షారామ శ్రీ భీమేశ్వర స్వామికి భక్తితో సమర్పించెను.

విశేషము :- తూర్పు దక్షిణములకు సముద్రము, పడమట దిక్కున గౌతమీనది; ఉత్తరమున తుల్యభాగానది సరిహద్దులుగ 3-33; 5-77 పద్యములలో చెప్పబడెను.

వ॥ ఇట్లిచ్చి ధర్మ శాసనంబు వ్రాయించెనది యెట్లనిన. 85

అర్థము :- ఇట్లు=ఈ విధముగ; ఇచ్చి=సమర్పించి; ధర్మశాసనంబున్=దానమును గూర్చి తెల్పు శాసనమును; వ్రాయించెన్=వ్రాయించెను; అది=ఆ దానశాసనము; ఎట్లు+అనిన=ఏవిధముగ నన్నచో.

భావము :- ఈ విధముగ సమర్పించి దానశాసనమును వ్రాయించెను. అది ఏ విధముగ అనినచో.

ఉ॥ ఇప్పటి భూమి పాలురును నింకిట రాఁగల భూమి పాలురుం
దప్పకుఁడయ్య మత్ప్రవిహిత స్థిర భూతల దాన ధర్మ మె
ల్లప్పుడు మీకు నయ్యెడుఁ జిరాయువు భాగ్యము వైభవంబుచే
నొప్పగు సుప్రతాపము సుఖోన్నతి గంధ గజాది లక్ష్మియున్. 86

అర్థము :- ఇప్పటి=ఈ కాలము నందలి; భూమిపాలురును=రాజులును; ఇంక+ ఇటరాఁగల=ఇకమీదట వచ్చునట్టి; భూమిపాలురున్=రాజులును; మత్=నాచేత; ప్రవిహిత=విశేషముగ చేయబడిన; స్థిర=శాశ్వతమైన; భూతల దానధర్మము=భూమండల దానమనెడి ధర్మమును; తప్పకుఁడయ్య!; అతిక్రమింపకుడు సుమా! మీకు=మీకందరకు; చిరాయువు=దీర్ఘమైన ఆయుర్దాయము; భాగ్యము=శుభము; వైభవంబు చేన్=గొప్పదనము చేత; ఒప్పగు=ప్రకాశవంతమైన; సుప్రతాపము=మంచి శౌర్యము; సుఖ+ఉన్నతి=సుఖము యొక్క గొప్పదనము; గంధ గజ+ఆది=మదపుటేనుగులు మొదలైన; లక్ష్మియున్=సంపదయు; ఎల్లప్పుడు=అన్నివేళల; అయ్యెడున్=కల్గుగాక.

భావము :- ఈనాటి రాజులును తర్వాతి కాలమున రాగల రాజులును - నేనీనాడు శ్రీ భీమేశ్వర స్వామికి ఆచంద్రతారార్కముగ చేసిన భూదానము యొక్క ధర్మమును అతిక్రమింపకుడు. మీకు సర్వదా దీర్ఘాయువు శుభము గొప్పదనములచే ప్రకాశవంతమైన శౌర్యము సుఖోన్నతి మదపుటేనుగులు మొదలైన సంపదయు కలుగుగాక.

విశేషము :- ధర్మము=దేనిని చేయుటచే కర్తకు ఇహలోకమున అభ్యుదయము పరలోకమును కల్గించునో ఆ కర్మయే ధర్మము.

వ॥ అని వెండియు. 87

అర్థము :- అని=అని శాసనము వ్రాయించి; వెండియు=మరియు.

భావము :- అని ఈ విధముగ శాసనమును వ్రాయించి మరియు.

సీ॥ కట్టించెఁ బట్టన క్ష్మా విభాగము పైఁడిఁ
గల్పించె వప్రంబు కాంచనమున
మలిపించె బంగారమున దేవగృహములు
కూర్పించె నట్టిళ్ళు కుందనమున
నిర్మించె ప్రాసాద నివహంబు గనకానఁ
బాటించె గవఁకులు హాటకమున
రచియించెఁగార్త స్వరమున గోపురములు
కీలించెఁ గేలి దీర్ఘికలు భూరి

తే॥ నాటె మందార తరువులు తోఁట లందు
వలఁతి సురభులఁ గీలారములకు నిచ్చెఁ
బోసె సిద్ధరసంబును బుష్కరిణులఁ
గణఁక నింద్రుండు దక్షిణ కాశి యందు. 88

అర్థము :- ఇంద్రుండు=దేవేంద్రుడు; కణఁకన్=అతిశయమైన పూనికతో; దక్షిణ కాశి యందు=దక్షిణ కాశి యని ప్రసిద్ధి వడసిన దక్షారామము నందు; పట్టన=నగరము యొక్క; క్ష్మా విభాగము=భూభాగమును; పైఁడిన్=బంగారముతో; కట్టించెన్=నిర్మింపజేసెను; వప్రంబున్=కోటను; కాంచనమునన్=బంగారముతో; కల్పించెన్=సృష్టించెను;

దేవ గృహములు=దేవాలయములను; బంగారమున=బంగారముతో; మలిపించెన్= చెక్కించెను; నట్టిళ్ళు=ఇండ్ల మధ్య భాగములను; కుందనమున=మేలిమి బంగారముతో; కూర్పించెన్=నిర్మింపజేసెను;

ప్రాసాద నివహంబున్=దేవాలయ సమూహమును; కనకానన్=బంగారముతో; నిర్మించెన్=నిర్మాణము చేయించెను; గవకుఁలు=కోటవాకిళ్ళు; హాటకమున=మేలిమి బంగారముతో; పాటించెన్=చేయించెను; గోపురములు=ఆలయ గోపురములను; కార్తస్వరమున=బంగారముతో; రచియించెన్=చేయించెను; కేలి దీర్ఘికలు=విలాసపు దిగుడు బావులను; భూరి=బంగారముతో; కీలించెన్=కూర్పు చేయించెను, పోయించెను;

తోఁటలందు=ఉద్యానవనములలో; మందార తరువులు=మందార చెట్లను; నాటె=పాదు కొల్పెను; వలఁతి=అనుకూలమైన; సురభులన్=కామధేనువులను; కీలారములకున్=పశువుల మందలకు; ఇచ్చెన్=సమర్పించెను; పుష్కరిణులన్=కొలకులందు; సిద్ధరసంబును=పాదరసమును (అమృతమును); పోసెన్=పూయించెను.

భావము :- దేవేంద్రుడు పట్టుదలతో దక్షిణకాశి యని ప్రసిద్ధి వడసిన దక్షారామము నందు ప్రధాన భూభాగమును, కోటను, దేవాలయములను, గర్భాలయములను, ఎత్తైన రంగములను, కోట వాకిళ్ళను, గోపురములను, కేళీ సరస్సులను బంగారముతో నిర్మింపజేసెను. తాపటము చేయించెను. ఉద్యానవనము లందు కల్పవృక్షమైన మందార చెట్లను నాటించెను. అధీనమైన కామధేనువులను ఆవుల మందలలో చేర్పించెను. కోనేరులను పాదరసముతో తాపటము చేయించెను, అమృతముతో నింపెను.

తే॥ ఏక భోగంబు గాఁగ నేలేఱు గరుసు
గడలి సీమయు గౌతమీ గంగ మేర
కప్పురపుఁగ్రోవి కాశ్మీర ఖండ మవధి
యేలె విశ్వ కుటుంబి భీమేశ్వరుండు. 89

అర్థము :- విశ్వకుటుంబి=విశ్వమంతటికి యజమానుడైన; భీమేశ్వరుండు=శ్రీ భీమేశ్వర స్వామి; ఏక భోగంబు+కాఁగన్=సర్వాధికారము కలవానిగ; ఏలేఱు (పీఠికాపుర ప్రాంతమున ప్రవహించు) ఏలేఱు అనుపేరుగల నది; గరుసు=హద్దు; కడలి సీమయు= సముద్రమే హద్దు; గౌతమీ గంగ=గౌతమి అనుపేరుగల గోదావరి నది; మేర=హద్దు; కప్పురపున్+ క్రోవి=కర్పూరపు బరిణ ఐన; కాశ్మీర ఖండము=కాశ్మీరమని ప్రసిద్ధి చెందిన ప్రాంతము; అవధి=హద్దుగ; ఏలెన్=పాలించెను.

భావము :- ఒకవైపు ఏలేఱు ఒకవైపు సముద్రము ఒకవైపు గౌతమీనది మరొకవైపు కర్పూరపు బరిణయైన కాశ్మీరమని ప్రసిద్ధి చెందిన ప్రాంతము హద్దులుగ గల్గి ఏక భోగముగ కానుక చేయబడిన భూమిని శ్రీ భీమేశ్వర స్వామి సర్వాధికారిగ పరిపాలించెను.

విశేషము :- కాశ్మీర ఖండమనగా కాశ్మీర దేశము వలె చల్లని పరిమళ భరితమైన ప్రాంతము కోనసీమ. దీని నానాడు దక్షిణ కాశ్మీరమనెడి వారేమో! కాశ్మీరము చల్లదనము గలది కుంకుమ పువ్వు మొదలయిన పరిమళ ద్రవ్యములకు నిలయము. కోనసీమ చల్లదనము గలది మాత్రమే. కప్పురపుఁగ్రోవి చల్లదనమునకు సువాసనకు ఆలవాలము. కనుక ఏకదేశ దేశ వివర్తి రూపకము చేసికొన్నచో గోదావరి జిల్లాలోని కోనసీమ దక్షిణ కాశ్మీరము కావచ్చును.

మ॥ సరి సామంతుఁడు శ్రీ కుమార వనికా చాళుక్య భీమేశ్వరే
శ్వర దేవుం డుపకంఠ బాంధవుఁడు శ్రీ సంవేద్యరాడ్భైరవుం
డిరువుం బొర్వును బల్వలేశుఁడు మృకండేశుండుగా నేలె ని
ద్ధరణీ మండలి భీమనాథుఁడు నిరాతంక ప్రతాపోద్ధతిన్. 90

అర్థము :- ఈ+ధరణీ మండలి=ఈ భీమ మండలమును; భీమనాథుండు=శ్రీ భీమేశ్వర స్వామి; సరిసామంతుఁడు=సాటియైన రాజుగ; శ్రీ కుమార వనికా=శ్రీ కుమారా రామములోని; చాళుక్య భీమేశ్వరేశ్వర దేవుండు=చాళుక్య భీమేశ్వరుడను పేరు గల స్వామి; ఉపకంఠ=సమీపము నందలి; బాంధవుఁడు=చుట్టము; శ్రీ సంవేద్య రాట్భైరవుండు= గోదావరి నది సముద్రమును కలియుచోట గల శ్రీ సంవేద్యమను క్షేత్రమున వెలసిన భైరవస్వామియు; ఇరువున్+పొర్వునున్=ఇరుగు పొరుగు వారగు; పల్వలేశుఁడు=పల్వలేశ్వర స్వామియు; మృకండేశుండున్=మృకండేశ్వర స్వామియు కాన్=కాగా; నిరాతంక=అడ్డులేని ప్రతాప+ఉద్ధతిన్=శౌర్యము యొక్క కాఠిన్యముతో; ఏలెన్=పాలించెను.

భావము :- దక్షారామ శ్రీ భీమేశ్వర స్వామి ఈ భీమ మండలమును - చాళుక్య భీమేశ్వర స్వామియే సాటివచ్చు రాజుగ, సంవేద్యరాట్భైరవుడే దగ్గరి బంధువుగ, ఇరుగు పొరుగు వారుగ పల్వలేశ్వర స్వామియు, మృకండేశ్వర స్వామియు కల్గి ప్రతాప ప్రకాశముతో ఆటంకము లేకుండగ పాలించెను.

విశేషము :- చాళుక్య భీమేశ్వరేశ్వర దేవుండు=కుమారారామమని పేరుగల చాళుక్య భీమవరము నందలి శ్రీ భీమేశ్వర స్వామి.

పల్వలేశుఁడు : పలివెల అను పురము నందలి శ్రీ కొప్పు లింగేశ్వర స్వామి.

మృకండేశుండు : రాజమహేంద్రవరములోని శ్రీ మార్కండేయ స్వామి.

తే॥ కట్టెఁబట్టంబు యువరాజు గజముఖునకు
రాణివాసంబు తుహినాద్రిరాజ తనయ
కూర్మి సైన్యాధినాథుండు గొమర సామి
యిలకుఁ బతియైన దక్షవాటీశ్వరునకు. 91

అర్థము :- (భీమనాథుఁడు=శ్రీ భీమేశ్వర స్వామి;) గజముఖునకు=వినాయకునకు; యువరాజు=యువరాజుగ; పట్టంబున్+కట్టెన్=పట్టాభిషిక్తునిగ చేసెను; ఇలకు=(శ్రీ భీమమండల) భూమికి, పతియైన=రాజైన; దక్షవాటి+ఈశ్వరునకు=దక్షారామ శ్రీ భీమేశ్వర స్వామికి; తుహినాద్రి రాజతనయ=హిమవంతుని కుమారియైన పార్వతి; రాణివాసంబు= రాజపత్ని; కూర్మి సైన్య+అధినాథుండున్=ప్రియమైన సేనానాయకుడు; కొమరసామి=కుమార స్వామి.

భావము :- దక్షారామ శ్రీ భీమేశ్వర స్వామి వినాయకుని యువరాజుగ పట్టాభిషిక్తుని చేసెను. శ్రీ భీమేశ్వర స్వామికి రాణి పార్వతీదేవి. సేనానాయకుడు కుమార స్వామి.

శా॥ శ్రీకంఠుండు త్రిలింగ భూవలయమున్ శ్రీ భీమనాథేశ్వరుం
డేకచ్ఛత్రముగా సమస్త భువనాధీశుండు పాలింపఁగాఁ
బాకోన్ముద్రిత మాధవీ విచికిల ప్రత్యగ్ర సౌరభ్య ల
క్ష్మీకంబైన వసంతకాల ముదయించెన్ సౌఖ్యసంధాయియై. 92

అర్థము :- సమస్త భువన=సర్వలోకములకును; అధీశుండు=అధినాయకుఁడైన; శ్రీకంఠుండు=నల్లని కుత్తుక గల వాడైన; శ్రీ భీమనాథేశ్వరుండు=శ్రీ భీమేశ్వరస్వామి, త్రిలింగ భూవలయమున్=త్రిలింగ భూమండలమును; ఏకచ్ఛత్రంబుగా=(ఒకే గొడుగు కలది) సార్వభౌముడుగ; పాలింపఁగాన్=పరిపాలించుచుండగా; సౌఖ్య సంధాయియై=సుఖమును కూర్చునదిగా; పాకో...లక్ష్మీకంబు; పాక=చక్కని వృద్ధి; ఉన్ముద్రిత=వెల్లడి చేయబడిన; మాధవీ= మాధవీలతల యొక్క, విచికిల=మల్లెల యొక్క; ప్రత్యగ్ర=నూతనమైన, సౌరభ్య=సువాసల యొక్క; లక్ష్మీకంబు+ఐ=సంపద కలదైన; వసంతకాలము=వసంత ఋతువు; ఉదయంచెన్= ప్రవేశించెను.

భావము :- సర్వేశ్వరుడు నీలకంఠుడునైన శ్రీ భీమేశ్వర స్వామి త్రిలింగముల నడిమి భూమిని సార్వభౌముడై పరిపాలించుచుండగా అభివృద్ధి సూచకమై మాధవీ తీగల నూతన సువాసనల సంపద కలదై వసంత ఋతువు ప్రవేశించెను.

విశేషము :- త్రిలింగ భూవలయము అనగా త్రిలింగదేశము. అనగా త్రిలింగముల మధ్య గల దేశము. ఆ త్రిలింగములు - శ్రీశైలము, కాళేశ్వరము, దక్షారామ లింగములు.

'శ్రీ పర్వత కాళేశ్వర ద్రాక్షారామ సంజ్ఞ వఱల...త్రిలింగ దేశమునఁ దగుఁ గృతులన్'

కావ్యాలంకార చూడామణి - విన్నకోట పెద్దన.

శ్రీ క్షితి ధర కాళేశ
ద్రాక్షారామంబులనఁగఁ దనరారెడు నీ
త్రిక్షేత్రంబుల లింగము
లీక్షింపఁ ద్రిలింగ సంజ్ఞ నెన్నిక కెక్కున్ అప్పకవీయము. 1-99

## వసంతర్తు వర్ణనము

తే॥ సకల దైవత మండల సార్వభౌము
దక్షిణాపథ కాశికా ధవునిఁ గొల్వఁ
గుసుమ విసరంబుఁగానుకఁ గొంచు వచ్చె
నఖిల ఋతు చక్రవర్తి మధ్వాగమంబు. 93

అర్థము :- అఖిల ఋతు చక్రవర్తి=అన్ని ఋతువులకు రారాజైనట్టి; మధు+ ఆగమంబు=వసంతుని వృద్ధి; కుసుమ విసరంబున్=పూవుల సమూహమును; కానుకన్+ కొంచు=కానుకగ ధరించుచు; సకల దైవతమండల=సర్వదేవతల సమూహమునకు; సార్వ భౌము=రారాజు అయినట్టి; దక్షిణాపథకాశికా=దక్షిణకాశి అని ప్రసిద్ధి వడసినట్టి దక్షారామము యొక్క; ధవునిన్=నాయకుడైన శ్రీ భీమేశ్వర స్వామిని; కొల్వన్=సేవించుటకు; వచ్చెన్=ప్రవేశించెను.

భావము :- అన్ని ఋతువుల యందును శ్రేష్ఠమైనదగు వసంతర్తువు పూల సమూహములను కానుక ధరించి సర్వదేవతా సార్వభౌముడును దక్షిణకాశికానాథుడును ఐన దక్షారామ భీమేశ్వర స్వామిని సేవించుటకై ప్రవేశించెను.

విశేషము :- ఋతువులు - ఇవి ఆరు : 1. వసంతము, 2. గ్రీష్మము, 3. వర్షర్తువు, 4. శరత్తు, 5. హేమంత, 6. శిశిరములు.

అలంకారము :- విభావన.

తే॥ కమిచె సురపొన్న వనలక్ష్మి కబరి మీఁద
సంతరించిన ముత్యాల జల్లి బోలెఁ
బూచె సంపెంగ లారామ భూమియందుఁ
గుసుమ నారాచు చిచ్చుల కోలవోలె. 94

అర్థము :- సురపొన్న=దేవతలకు ప్రియమైనదైన సురపున్నాగము; వనలక్ష్మి= వనమనెడి లక్ష్మీదేవి యొక్క, కబరి మీఁద=కొప్పుపై; సంతరించిన=కూర్చిన; ముత్యాల జల్లిన్+ పోలెన్=ముత్యాలు పొదిగిన వలవలె; కమిచెన్=అతిశయించెను; ఆరామ భూమియందున్= దక్షారామ భూమి యందు; సంపెంగలు=సంపెంగ చెట్లు; కుసుమ నారాచు=పుష్పబాణుడైన మన్మథుని యొక్క; చిచ్చుల కోలన్+పోలె=నిప్పుల బాణము వలె; పూచెన్=పూచెను.

భావము :- ఆ దక్షారామము నందు సురపొన్నలు వనమనెడి లక్ష్మీదేవి యొక్క కొప్పుపైన ముత్యాల వలవలె విరిసి ప్రకాశించుచున్నవి. మన్మథుని నిప్పుకల బాణము వలె సంపెంగలు పూచినవి.

విశేషము :- అలంకారము - ఉపమ.

శా॥ హేమంతావధి సంప్రబోధ గురువుల్ హృజ్జాత తేజోగ్ని ధా
యాయ్యా మంత్రాక్షరముల్ పటీరగిరివన్యా మంద వాతూలముల్
వేమాఱుం గలశీ తనూభవ వధూ వేణీ భరాంతః ప్రసూ
నామోద గ్రహయాళువుల్ పొలసె దక్షారామ మధ్యంబునన్. 95

అర్థము :- హేమంత+అవధి=మంచుకాలము యొక్క హద్దును; సంప్రబోధ= మిక్కిలిగ తెలివిడి కల్గించు; గురువుల్=ఉపాధ్యాయులు; హృత్+జాత=(హృదయమున పుట్టు) మన్మథుని యొక్క; తేజస్=పరాక్రమమనెడి; అగ్నిధాయ్యా=అగ్నిని (యాగము నందు) ప్రజ్వలింప జేయునపుడు పఠించు; మంత్రాక్షరముల్=మంత్రముల (సామిధేని ఋక్కుల) లోని అక్షరములు; కలశీతనూభవవధూ=అగస్త్యుని భార్యయైన లోపాముద్రాదేవి యొక్క; వేణీభర+అంతః=కబరీ భారము యొక్క లోభాగమున గల; ప్రసూన=పూవుల యొక్క; ఆమోద=పరిమళమును; గ్రహయాళువుల్=గ్రహించునవైన; పటీర గిరి=పటీర పర్వతముపై గల; వన్యా=అడవుల నుండి వచ్చు; మందవాతూలముల్=మందములై వెఱ్ఱిత్రిప్పునవైన గాలులు; వేమాఱున్=మాటిమాటికి; దక్షారామ మధ్యంబునన్=దక్షారామ మధ్య భాగమున; పొలసెన్=వ్యాపించెను.

భావము :- మంచు కాలము ముగియు చున్నదని తెల్పు గురువులు; మన్మథుని తేజస్సు అనెడి అగ్నిని ప్రజ్వలింప చేయుచు పఠించెడి ఋగ్వేదములోని సామిధేని మంత్రాక్షరములు; అగస్త్యుని భార్య ఐన లోపాముద్రాదేవి యొక్క కొప్పులోని పూవుల పరిమళమును గ్రహించు వాయువులు; చందన వృక్షముల పర్వతమైన పటీరాచలముపై గల చందన వనముల నుండి వచ్చు మందములైన వెఱ్ఱిత్రిప్పునవైన గాలులు (దక్షిణానిలము) దక్షారామమున (ఎడతెగకుండ) ప్రసరించెను.

విశేషము :- గ్రహయాళువు - "గ్రహయాళువు శబ్దము అసాధువు. గృహయాళువు అని యుండవలెను. గృహయాళువు అని సవరించినచో గణభంగమగును" అని పండిత లోకము. కాని గురుబాల ప్రబోధిక మాత్రము "గ్రహయాళుః" అను పాఠాంతరమున్నట్లు తెలుపుచున్నది. "గ్రహయాళుర్గ్రహీతరి" (తృతీయ కాండ-విశేష్య నిఘ్న వర్గము-27) కాని శబ్ద సాధుత్వము ప్రకృతి ప్రత్యయ విభాగము చేసి వివరింపలేదు.

సంస్కృత భీమ ఖండము నందు కూడ (25-6) గ్రహయాళవః అనియే కలదు. ఇది ఇట్లుండగా, బ్రహ్మశ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రి గారు - మనుచరిత్ర వ్యాఖ్యాన పీఠికలో (పుట-165) వారి మిత్రులు శ్రీమాన్ ఎన్.సి.ఎస్. వేంకటాచార్యులు గారు స్థిత గతి చింతనముగా ఒక మార్గము చూపిరని ఇట్లు ఉటంకించిరి;

"సూ. గ్రహ వృ దృ నిశ్చి గమశ్చ (పా. 3-3-58). ఇతి అబన్తో గ్రహః తతః "తత్కరోతి తదాచష్టేట" ఇతి వార్తికాత్ ణౌ "ప్రాతిపదికాద్ధాతుల మిష్ఠవచ్చ" ఇతి షష్ఠవద్భావే "టేః" (పా. 6-4-155). ఇతిటిలోపాద్వృద్ధ్యభావే "సిద్ధే సతి య దాలుచం శాస్తి తజ్ జ్ఞాపయత్యాచార్యః అన్యేభ్యోప్యయం భవతీతి" ఇతి భాష్యోక్తి మనుసృత్య-అలుచికృతే; "ఆయా మాన్తా ల్వాయ్యే త్న్విష్ణుషు" (పా. 6-4-55) ఇతి ణే రయాదేశే గ్రహయాలు శబ్దః సిధ్యతి.

గ్రహ్+అప్=గ్రహ+ణిచ్=గ్రహ్+ణిచ్=గ్రహ్+ణిచ్+ఆలుచ్=గ్రహ్+అయ+ఆలుచ్=గ్రహయాలుః - ఇతి ప్రక్రియా.

ఏష ప్రయోగ: భాష్య మర్మజ్ఞేన శ్రీనాథేన ప్రయుక్తః, పెద్దనార్యేణాను ప్రయుక్తః (4-38) వైయాకరణేభ్యోగళే కపిత్థన్యాయః ప్రాకల్పయత్"

అని భాష్యమతానుసారము పాణినీయము చేతనే "గ్రహయాళుః" శబ్దమునకు సాధుత్వము చెప్పిరి.

ధ్యాయ్యా :- భీమ 3-17 చెంత వివరింపబడినది.

వక్రోక్తి :- వాక్య వక్రత.

చ॥ దిగదిగఁ జేరవచ్చి రతిదేవి యపాయముఁ బొందకున్నె కై
తగవున రత్న కుండల కదంబకముం దను వేఁడిపుచ్చుకోఁ
దెగువ మనోభవుండు తియతియ్యని సింగిణి వింటి కొప్పునన్
దగిలిచె దక్షవాటి వనితా చికురంబులఁ బోలు శింజినిన్. 96

అర్థము :- మనోభవుండు=మన్మథుడు; తియతియ్యని=మిక్కిలి తియ్యనగు, సింగిణి వింటి కొప్పునన్=కొమ్ము (చెఱకు) వింటి కొనయందు; దక్షవాటి=దక్షారామము నందలి; వనితా=కాంతల యొక్క; చికురంబులన్=కేశములతో; పోలు=సమానమగు; శింజినిన్=అల్లెత్రాటిని; తగిలిచెన్=తగిలించెను. (అప్పుడు) రతిదేవి=మన్మథుని భార్యయైన రతిదేవి; కైతగవునన్=(భర్త) చేతి బహుమతిగా; రత్నకుండల=రత్నములు పొదిగిన కర్ణాభరణములను; కదంబకమున్=యక్షకర్దమమును; తనున్=తన్ను; వేఁడి=ప్రార్థించి; పుచ్చుకోన్=తీసికొనుటకు; తెగువన్=సాహసముతో; దిగిదిగన్=శీఘ్రముగా; చేరవచ్చి=సమీపించి; అపాయమున్=నాశనమును; పొందకున్నె=పొందకుండునా!

భావము :- మన్మథుడు తియ్యనైన కొమ్ము చెఱకు విల్లుకు దక్షారామము నందలి కాంతల తల వెండ్రుకల వంటి అల్లె త్రాటిని తగిలించెను. అపుడు రతిదేవి భర్తచేతి బహుమానముగ రత్న కుండలములను యక్షకర్దమ ద్రవ్యమును ప్రార్థించి పుచ్చుకొనుటకై తెగువతో వేగముగ వచ్చి హాని పొందకుండునా! అనగా రత్న కుండలముల కొరకు యక్షకర్దమము కొరకు మన్మథుని చెంతకు వచ్చినచో అతడు సంధించిన పూబాణములకు చలించకుండునా! అని భావము.

విశేషము :- కదంబకము=చందనము, అగురు, కస్తూరి, కుంకుమ పూవు, తక్కోలము - అనువానితో చేయబడిన మిశ్రమ పరిమళద్రవ్యము. దీనినే యక్షకర్దమ మనియు అందురు.

తే॥ పాంథ నివహంబు పాలి యుత్పాతకారి
ధూమ కేతువుఁ బోలి పెన్తోఁట నడుమ
విరిసెఁ గ్రొవ్వారి నాగకేసరపుఁ బువ్వు
మీఁది ధూమంబు భంగి దుమ్మెదలు వెడలె. 97

అర్థము :- పెను+తోట నడుమ=పెద్ద తోట యొక్క నడిమి ప్రదేశమున; పాంథ నివహంబు పాలి=బాటసారుల సమూహము పాలిటి; ఉత్పాతకారి=ఉపద్రవమును కల్గించు; ధూమకేతువున్+పోలి=అగ్నివలె; క్రొవ్వారి=అతిశయించి; నాగకేసరము+పువ్వు=నాగకేసర పుష్పము; విరిసెన్=వికసించెను. మీఁది ధూమంబు భంగిన్=పై పొగవలె; తుమ్మెదలు= తుమ్మెదలు, వెడలె=సాగినవి.

భావము :- ఆ దక్షారామము నందలి పెద్దతోట యొక్క నడిమి భాగమున తెరువరుల కాపద గల్గించు నిప్పువలె నాగకేసర పుష్పము అతిశయించి పూచి వికసించినది. పై పొగవలె తుమ్మెదలు విస్తరించినవి.

విశేషము :- అలంకారము - ఉపమ.

శా॥ సందుగ్ధార్ణవ చంద్రమండల శిఖి జ్వాలా తటిద్వల్లరీ
కందర్పేక్షు శరాసనాచ్యుత తనూ గంధర్వ వంశోద్భవల్
హిందోళంబునఁ బాడి రచ్చరలు భీమేశుం ద్రిలోకాధిపున్
మందారద్రుమ వాటి యందు సుమనో మైరేయముల్ గ్రోలుచున్. 98

అర్థము :- సందుగ్ధ+అర్ణవ=విరివిగ మథింపబడిన సముద్రము నుండి; చంద్ర మండల=చంద్రుని బింబము నుండి; శిఖిజ్వాలా=నిప్పు మంటల నుండి; తటిత్+వల్లరీ= మెఱపుతీగల నుండి; కందర్ప=మన్మథుని; ఇక్షుశరాసన=చెఱకు వింటి నుండి; అచ్యుత

తనూ=విష్ణుమూర్తి యొక్క శరీరము నుండి; గంధర్వ వంశ=గంధర్వ వంశమునందును; ఉద్భవల్=పుట్టిన వారైన; అచ్చరలు=అప్సరసలు; త్రిలోక+అధిపున్=ముల్లోకములకు నాయకుడైన; భీమేశున్=శ్రీ భీమేశ్వర స్వామిని గూర్చి; మందారద్రుమ వాటి యందు=మందార చెట్ల వనము నందు; సుమనః+మైరేయముల్=మంచి పూలలోని తేనెలను; క్రోలుచున్=పానము చేయుచు; హిందోళంబున=హిందోళ రాగయుక్తముగ; పాడిరి=గానము చేసిరి.

భావము :- బాగుగా మథించిన సముద్రము నుండి, చంద్రబింబము నుండి, అగ్నిజ్వాలల నుండి, మెఱపు తీగల నుండి, మన్మథుని చెఱకు విల్లు నుండి, విష్ణువు శరీరము నుండి, గంధర్వ వంశము నుండి పుట్టిన అప్సరసలు మందార వృక్షముల ఉద్యాన వనము నందు పుష్ప మధువులను పానము చేయుచు వసంతర్తు ప్రారంభమునకు తగు హిందోళ రాగమును మేళవించి త్రిలోకనాథుడైన శ్రీ భీమేశ్వర స్వామిని గూర్చి గానము చేసిరి.

విశేషము :- హిందోళంబు - హిందోళరాగము. ఋషభ పంచమ స్వరములు కాక మిగిలిన ఐదు స్వరములతో కూడిన యౌడవ రాగము. శిశిర వసంత ఋతువుల సంధి కాలము నందు గానము చేయబడునది. "శిశిరస్య వసంతస్యసంధౌ హిందోళరాగకః" అని శాస్త్ర ప్రమాణము.

మ॥ అళికోలాహల సంభ్రమంబును శుక వ్యాజృంభమున్ శారికా
కుల సల్లాపములున్ విహార విపిన క్షోణీ విభాగంబునం
గల పుంస్కోకిల కంఠకోమల కుహూకార ప్రపంచంబుతోఁ
దలఁపించెన్ రతికాంత మూలరథినీ ధాటీ సమారంభమున్. 99

అర్థము :- విహారవిపిన=ఉద్యానవనము యొక్క; క్షోణీ విభాగంబునన్=భూభాగము నందు; అళికోలాహల=తుమ్మెదల రొదలతో; సంభ్రమంబును=ఉత్సాహమును; శుక వ్యాజృంభ మున్=చిలుకలు విరివిగ విజృంభించుట; శారికాకుల=గోరువంక మూకల యొక్క; సల్లాపము లున్=సంభాషణంబును; కలపుంస్కోకిల=అవ్యక్త మధురధ్వని గల గండు కోయిలల యొక్క; కంఠ=గొంతుకల యందలి; కోమల కుహూకార=మృదువైన కూహూ కుహూ అను శబ్దముల యొక్క; ప్రపంచంబుతోన్=సమూహముతో; రతికాంత=రతిదేవి భర్తయైన మన్మథుని యొక్క; మూలరథినీ=ప్రధాన సైన్యము యొక్క; ధాటీ సమారంభమున్=దాడి యొక్క ప్రారంభ మును; తలఁపించెన్=తెలియ జేసెను.

భావము :- దక్షారామము నందలి ఉద్యానవనము నందు తుమ్మెద గుంపుల ఝంకార వ్యాప్తియు, చిలుకల విజృంభణలు, గోరువంక మూకల కిలకిలా రావములు, అవ్యక్త మధుర

ధ్వని గల గండు కోయిలల కుహూ కుహూ కార కూజితములును మన్మథుని ప్రధాన సైన్యము యొక్క దండ యాత్రా ప్రారంభమును తలపింప జేసెను.

వ॥ మఱియును దత్సమయంబున భువనోత్సంగ మంగళాలంకారంబైన దక్షారామంబునఁ బరిసరారామంబుల యందుఁ బరమ పరిపాక భిదుర ఫలాపీడ దాడిమీ క్రోడ నీడా క్రీడచ్చిక్రోడ యూథంబును, బరినమ్ర తామ్ర చూడ చూడా తామ్ర కిసల యామ్రేడిత మదన సామ్రాజ్య పూజ్యంబును; నవకుసుమ మధుపాన హర్షిత పుష్పతరు పుష్పిత లావణ్య విశేషంబును; వన దేవతా తాళవృంతాయమాన దళనిచయ రోచనా మేచక మోచారణ్యంబును; బరిసరావనిరుహ నివహ పతుల పనస నిస్రంస్యమాణ శీధురసధునీ జంబాల జాల వన విభాగంబును; మద చపల చంచరీక చక్ర చరణ తాడన చంచల చంపక దాడిమీ ప్రసవ మంజరీ రజఃపుంజ సముత్పుంజ నికుంజంబును; గంధసార గిరి గంధ వాహ ప్రవాహ లహరికా విహార బహుళీభూత నూతన క్రముక కుహళీ గర్భ నిర్భరామోద మేదురంబును నగుచు జగదాహ్లాదంబు సంపాదించుచు విజృంభించిన. 100

అర్థము :- మఱియున్=ఇంకను; తత్+సమయంబునన్=ఆసమయము నందు; భువన+ఉత్సంగ=ప్రపంచము యొక్క మధ్య భాగమునకు; మంగళ+అలంకారంబైన=శుభకరభూషణమైన; దక్షారామంబునన్=దక్షారామము నందు; పరిసర=చుట్టుప్రక్కల గల; ఆరామంబుల యందున్=తోటలందును; పరమ...యూథంబును; పరమపరిపాక=బాగుగ పండి; భిదుర=పగిలిన; ఫల+ఆపీడ=పండ్లే శిరో భూషణములుగ గల; దాడిమీ క్రోడ=దానిమ్మచెట్ల తొఱ్ఱలను; నీడ+ఆక్రీడత్=గూళ్ళ యందు ఆడుకొనుచున్న; చిక్రోడ యూథంబును=ఉడుతల సమూహము కలదియు;

పరినమ్ర...పూజ్యంబును; పరినమ్ర=మిక్కిలిగ వంగిన; తామ్ర చూడచూడా=కోళ్ళ యొక్క తురాయి వలె; ఆతామ్రకిసలయ=అంతటను యెఱ్ఱని చిగురాకుల చేత; ఆమ్రేడిత=ద్విరుక్తి చేయబడిన; మదన సామ్రాజ్య=మన్మథుని సామ్రాజ్యము చేత; పూజ్యంబును=కొలువదగినదియు; నవ...విశేషంబును; నవకుసుమ=క్రొత్తపూవులలోని; మధు=మకరంద మును; పాన=త్రాగుటచేత; హర్షిత=సంతోష పెట్టబడిన; పుష్పతరు=పూలచెట్ల యొక్క; పుష్పిత=వికసించిన; లావణ్య విశేషంబును=చక్కదనము యొక్క అతిశయము కలదియు;

వన...అరణ్యంబును. వనదేవతా=వనదేవతలకు; తాళవృంతాయమాన=విసన కఱ్ఱలగు; దళ=ఆకుల యొక్క; నిచయ=సమూహము యొక్క; రోచనా=ప్రకాశముతో;

మేచక=నల్లనివగు; మోచ+అరణ్యంబును=అరటితోటలు కలదియు; పరిసర...భాగంబును; పరిసర=చుట్టుప్రక్కల గల; అవనిరుహ=చెట్ల యొక్క; నివహ=సమూహములైన; వకుల=పొగడల నుండి; పనస=పనసల నుండి; నిస్రంస్యమాణ=బాగుగా కారుచున్న; శీధురస=మకరందము యొక్క; ధునీ=ప్రవాహము నందలి; జంబాల=బురద యొక్క; జాల=సమూహము గల; వన విభాగంబును= తోట భూమి కలదియు;

మద...నికుంజంబును. మద=అధికమైన సంతోషము చేత; చపల=చంచలములగు; చంచరీక=తుమ్మెదల; చక్ర=సమూహముల యొక్క; చరణ తాడన=కాళ్ళతాకిడి చేత; చంచల=బాగుగ కదలాడుచున్న; చంపక=సంపెంగల; దాడిమీ=దానిమ్మల; ప్రసవ మంజరీ=పూలగుత్తుల యందలి; రజఃపుంజ=పరాగ సమూహము చేత; సముత్పుంజ=అస్తవ్యస్తమైన; నికుంజంబును=పొదలు కలదియు;

గంధసార...మేదురంబును. గంధసారగిరి=మలయ (చందనవృక్షముల) పర్వతము నుండి వచ్చు, గంధవాహ=గాలి యొక్క; ప్రవాహ=వెల్లువ యందలి; లహరికా=అలల యొక్క; విహార=సంచారము చేత; బహుళీ భూత=విరివియైన; నూతన=క్రొత్తవగు; క్రముక=పోకల; కుహళీ=పూగుత్తుల యొక్క, గర్భ=లోభాగము లందు; నిర్భర=నిండియున్న; ఆమోద=పరిమళముచేత; మేదురంబునున్=సాంద్రమైనదియు; అగుచు=అగుచు; జగత్=లోకమునకు; ఆహ్లాదంబు=సంతోషమును; సంపాదించుచు=కూర్చుచు; విజృంభించిన=అతిశయించిన.

భావము :- ఇంకను ఆ సమయమున లోకమునకు మంగళాభరణమైన దక్షారామము నందును, చుట్టు ప్రక్కల తోటలందును దానిమ్మచెట్ల పండ్లు బాగుగా పండి పగిలియున్నవి. ఆ చెట్ల గూళ్ళయందు ఉడుతల సమూహములు ఆడుకొనుచున్నవి.

మిక్కిలిగ వంగిన చెట్ల చిగురాకులు కోళ్ళ తురాయిల వలె మిక్కిలి ఎఱ్ఱనై మన్మథ సామ్రాజ్యము చేత పూజింపతగినట్లున్నవి. క్రొత్త పూలలోని మకరందమును త్రాగుట చేత సంతోషించుచున్న పూల చెట్లు చక్కదనము అతిశయించి ప్రకాశించుచున్నవి.

వనదేవతలకు విసనకఱ్ఱలగు అరటాకుల సమూహముల ప్రకాశముతో అరటితోటలు నల్లనై విస్తరించినవి. చుట్టు ప్రక్కల గల పొగడ, పనసల నుండి బాగుగా కారుచున్న మకరందము చేత ఆ ప్రాంతమందలి భూమి తడిసి యున్నది.

మధుపానముచే మిక్కిలిగ సంతోషించి తిరుగాడుచున్న తుమ్మెద గుంపుల పాద తాడనములచేత సంపెంగల దానిమ్మల పూగుత్తులు బాగుగా కదలాడు చుండుటచేత ఆ పూలలోని పరాగ సమూహములు చెల్ల చెదరై విస్తరించుటచేత సంపెంగ దానిమ్మల పొదలు అన్నియు అస్తవ్యస్తమై కన్పించుచున్నవి.

గంధసారగిరి (పటీరాచలము) నుండి వచ్చు మలయానిల ప్రవాహము నందలి తరంగముల విహారము చేత విరివియై వికసించిన పోక పూగుత్తులందు నిండియున్న పరిమళము దట్టముగ వ్యాపించి లోకమునకు సంతసమును సంపాదించుచు విజృంభించిన.

సీ॥ కర్పూర కస్తూరికలఁ గోట నిర్మించి
    కుంకుమ ద్రవమునఁ గొమ్మఁ దీర్చి
యగురు జంబాలంబు నందు బెందడి చేసి
    పన్నీటి వెల్లువఁ బరిఖఁదార్చి
పవడంపుఁ జివురుల గవఁకు లుత్పాదించి
    తమ్మిరేకుల బోరు తలుపు లెత్తి
రత్నాంకురంబుల రంగవల్లి రచించి
    పట్టు పుట్టంబులఁ బడగ లెత్తి

తే॥ లలిత శృంగార రచన నలంకరించి
విబుధ గంధర్వు లామని వేళలందు
భీమనాథుని నగరి యారామ రేఖఁ
బూజ చేసిరి సహకార భూరుహముల. 101

అర్థము :- విబుధ+గంధర్వులు=దేవతలు గంధర్వులును; ఆమనివేళలందు=వసంత ఋతుసమయము లందు; భీమనాథుని=శ్రీ భీమేశ్వర స్వామి యొక్క; నగరి=నగరమైన దక్షారామము నందలి; ఆరామ రేఖన్=ఉద్యానవన సమూహము లందలి; సహకార భూరుహముల=తీయమామిడి చెట్లకు;

కర్పూర కస్తూరికలన్=కర్పూరము కస్తూరులతో; కోట=చుట్టుగోడను; నిర్మించి= నిర్మాణము చేసి; కుంకుమ ద్రవమునన్=కుంకుమ కలిపిన నీటితో; కొమ్మన్=కోట శిఖరమును; తీర్చి=అమర్చి;

అగురు జంబాలంబున్=అగురు పరిమళ ద్రవ్యపు బురదను; అందు=ఆ చుట్టు గోడకు; పెను+తడిచేసి=అధికముగ కలిపి; పన్నీటి వెల్లువన్=పన్నీటి ప్రవాహముతో; పరిఖన్=కందకమును; తార్చి=నిర్మించి;

పవడము+చిగురుల=పగడముల వంటి చిగురాకులతో; గవఁకులు=(చుట్టు గోడకు) వాకిళ్ళను; ఉత్పాదించి=సృష్టించి; తమ్మి రేకుల=పద్మ దళములతో; బోరు తలుపులు=సింహ ద్వారపు తలుపు తెక్కలను; ఎత్తి=నిలిపి;

రత్న+అంకురంబుల=రత్నముల మొలకల చేత; రంగవల్లి=ముగ్గును; రచించి=వేసి; పట్టుపుట్టంబులన్=పట్టుబట్టలతో; పడగలు+ఎత్తి=జెండాలను పూన్చి;

లలిత=మృదువైన; శృంగార రచనన్=అందమైన నిర్మాణముతో; పూజచేసిరి= పూజించిరి.

భావము :- దేవతలు గంధర్వులును వసంత ఋతు సమయము లందు దక్షారామము నందలి ఉద్యానవనములలోని తీయమామిడి చెట్లకు కర్పూరము కస్తూరిలతో చుట్టుగోడలు నిర్మించిరి. కుంకుమ నీటితో అంచులను దిద్ది తీర్చిరి. అగురు పరిమళ ద్రవ్యపు బురదతో పైపూత పూసి అలికిరి. చుట్టు గోడకు చుట్టు వెలుపల (పరిఖ) కందకమును నిర్మించిరి. ఆ కందకమును పన్నీటితో నింపిరి. పగడముల వంటి చిగురాకులతో కోటగోడకు వాకిళ్ళ నేర్పాటు చేసిరి. తామర పూరేకులతో ఆ వాకిళ్ళకు తలుపు ఱెక్కలను చేసి నిలిపిరి. రత్నపు మొలకలతో ముగ్గులు అలంకరించిరి. పట్టుబట్టలతో జండాలను పూన్చిరి. ఇట్లు మృదువుగ అందముగ అలంకరించి పూజించిరి.

కం॥ కిసలయరస జిగ్రహిషా
వ్యసనాకుల పిక కుహూ భవత్పంచమమై
కుసుమ సమయావతారము
త్రసమింగము జగము ముంచె రాగాంబునిధిన్. 102

అర్థము :- కిసలయ=చిగురాకుల; రస=రసమును జిగ్రహిషా=మిక్కిలిగ గ్రహించుట యందాసక్తి అనెడి; వ్యసన=కోరికతో; ఆకుల=నిండిన; పిక=కోయిలల; కుహూ=కుహూ శబ్దములతో; భవత్=అగుచున్న; పంచమమై=పంచమ స్వరము కలదై; కుసుమ సమయ+ అవతారము=వసంత ఋతువు అవతరించుట; త్రసమింగము=చరాచరమగు; జగమున్= లోకమును; రాగ+అంబునిధిన్=అనురాగమనెడి సముద్రములో; ముంచెన్=ముంచెను.

భావము :- చిగురాకుల రసమును అత్యాసక్తితో అధికముగ గ్రహించిన కోయిలలు కుహూకుహూ శబ్దములను పంచమస్వరముతో ఆలపించుటతో వసంత ఋతువు అవతరించి చరాచర లోకము నంతటిని అనురాగమనెడి సముద్రమున ముంచెను.

విశేషము :- చరాచరాత్మకం విశ్వం రాగాబ్ధౌమధువాసరః
న్యమజ్జయజ్జయ ప్రీత హృజ్జాతోజ్జృంభణోజ్వలః -సం. భీమ-25-27.

ఉ॥ జాదర జాదరంచు మృదు చర్చరి గీతులు వారుణీరసా
స్వాదమదాతిరేకమునఁ జంద్రిక కాయఁగ దక్షవాటికన్
వేదుల మీఁదటన్ గనక వీణలు మీటుచుఁ బాడిరచ్చరల్
మోద మెలర్పఁగా భువన మోహన విగ్రహు భీమనాథునిన్. 103

అర్థము :- దక్షవాటికన్=దక్షారామము నందు; చంద్రిక కాయఁగ=వెన్నెల కాయగా (వెన్నెల వేళయందు); అచ్చరల్=అప్సరసలు; వారుణీరస=మద్యమును; ఆస్వాద= త్రాగుట చేత (కలిగిన); మద+అతిరేకమునన్=మత్తు యొక్క ఆధిక్యముతో; మోదము+ఎలర్పఁగా= సంతోష మతిశయించునట్లు; వేదుల మీఁదటన్=అరుగులపై; కనకవీణలు=బంగారు వీణలను; మీటుచున్=మ్రోగించుచు; భువన మోహన=లోకములకు మోహము కల్గించు; విగ్రహున్= ఆకారము కల; భీమనాథునిన్=శ్రీ భీమేశ్వర స్వామిని గూర్చి; జాదర జాదర+అంచు= జాదర జాదర అను పల్లవితో; మృదు=మధురమైన; చర్చరి గీతులు=కరతాళ ధ్వనుల తోడి పాటలు; పాడిరి=ఆలపించిరి.

భావము :- వెన్నెల వేళలందు దక్షారామ నగరము నందలి అరుగుల పైన అప్సరసలు మద్యము సేవించి అమిత సంతోషముతోను అత్యుత్సాహముతోను బంగరు వీణలను వాయించుచు భువన మోహనమైన రూపము గల శ్రీ భీమేశ్వర స్వామిని గూర్చి జాదర జాదర అనెడి పల్లవితోడి మధురమైన చర్చరీ గీతములను ఆలపించిరి.

చ॥ అనువగు కౌనుదీఁగె లసియాడఁ బయోధరముల్ వణంకఁగాఁ
గనక మరాళ కీర కలకంఠ మయూర రథాధి రూఢలై
వనితలు భీమ నాయకుని వారక యేసిరి కమ్మఁదేనియల్
చినుకు పసిండి లేఁజెఱకు సింగిణి విండ్లను బుష్పబాణముల్. 104

అర్థము :- అనువగు=సన్ననివైన; కౌను దీఁగెలు=తీగల వంటి నడుములు; అసియాడన్=అల్లలాడుచుండగా; పయోధరముల్=చన్నులు; వణంకఁగాన్=కంపించు చుండగా; కనక మరాళ=బంగారు హంసలు; కీర=చిలుకలు; కలకంఠ=కోయిలలు; మయూర=నెమళ్ళు అనెడి; రథ=రథములను అధిరూఢలై=ఎక్కినవారై; వనితలు=కాంతలు; కమ్మఁదేనియల్= రుచికరమైన మధువులను; చినుకు=స్రవించు; పసిండి=బంగారపు; లేఁజెఱకు=లేత చెఱకు లనెడి; సింగిణి విండ్లను=కొమ్ములు గల విల్లుల నుండి; పుష్ప బాణముల్=పూల బాణములను; వారక=ఎడతెగకుండగ; భీమ నాయకుని=శ్రీ భీమేశ్వర స్వామిపై; ఏసిరి= ప్రయోగించిరి.

భావము :- అప్సరసల సన్నని నడుములు అల్లలాడుచున్నవి. చన్నులు కంపించుచున్నవి. అందమైన బంగారు హంసలు, చిలుకలు, కోయిలలు, నెమళ్ళు అనెడి రథముల నెక్కినారు. కమ్మని మధువును స్రవించెడి బంగరు లేత చెఱకు గడలనెడి కొమ్ము విండ్లకు పూబాణములను సంధించి ఎడతెగకుండగ శ్రీ భీమేశ్వర స్వామిపై ప్రయోగించిరి.

వ॥ తదనంతరంబ. 105

అర్థము :- తత్+అనంతరంబ=ఆ తరువాత.

ఉ॥ చంచల నేత్ర హేమరథ సౌధ శిరోగృహకూట కోటిపైఁ
గాంచన పత్ర పద్మమునఁ గర్ణిక మధ్యము నందు నిల్వ ని
ర్వంచన నేసె నంతఁబరివర్తన చిత్ర విలాస లీల న
ర్తించుచుఁ బుష్ప బాణముల దేవ శిఖామణి భీమనాథునిన్. 106

అర్థము :- చంచల నేత్ర=కాంత, హేమరథ=బంగారు రథము వంటి, సౌధ=మేడ యొక్క; శిరోగృహ=చంద్రశాల యొక్క; కూట కోటిపైన్=కొమ్ము యొక్క అంచుపైన; కాంచన పత్ర=బంగరు దళములు గల; పద్మమునన్=తామరపూవు నందలి; కర్ణిక మధ్యము నందు=దుద్దు యొక్క మధ్య భాగమున; నిల్వ=ఉండగా; అంతన్=అప్పుడు; పరివర్తన చిత్ర విలాసలీలన్=కదలుచున్న చిత్రము యొక్క అందమైన విధముగ; నర్తించుచున్= నాట్యము చేయుచు; దేవశిఖామణి=దేవతలలో సర్వశ్రేష్ఠుడైన; భీమనాథునిన్=శ్రీ భీమేశ్వర స్వామిని; నిర్వంచనన్=సూటిగ; పుష్ప బాణములన్=పూబాణములను; ఏసెన్=వేసెను.

భావము :- ఒక చంచలాక్షి బంగరు రథము వంటి తెల్లని మేడ పైభాగమున బంగారు రేకులు గల పద్మము నందలి దుద్దు మధ్యన నిలచి విచిత్రరీతిగ తిరుగుచు నర్తించుచు శ్రీ భీమేశ్వర స్వామిపై పూబాణములను (ప్రయోగించెను) వేసెను.

తే॥ ఆజ్ఞ వాటించెఁ గేలీ విహారములకు
భీమనాథుండు దేవతా గ్రామణులకు
గంధ కర్పూర కస్తూరికా ప్రశస్త
వస్తు కోటుల నొసఁగె నవారితముగ. 107

అర్థము :- భీమనాథుండు=శ్రీ భీమేశ్వర స్వామి; దేవతా గ్రామణులకు=దేవ శ్రేష్ఠులకు; కేలీ విహారములకు=క్రీడా విహారములకై; ఆజ్ఞ+పాటించెన్=అనుమతిని ప్రకటించెను; గంధ=చందనము; కర్పూర=కర్పూరము; కస్తూరికా=కస్తూరి మొదలయిన; ప్రశస్త=శ్రేష్ఠమైన; వస్తుకోటులను=ద్రవ్యముల సమూహమును; అవారితముగ=అడ్డు లేకుండ; ఒసఁగెన్= ఇచ్చెను.

భావము :- శ్రీ భీమేశ్వర స్వామి దేవతా ప్రముఖులకు క్రీడా విహార విలాసములకై అనుమతిని ప్రసాదించెను. చందనము కర్పూరము కస్తూరి మొదలగు సుగంధ ద్రవ్యములను విరివిగ ప్రసాదించెను.

వ॥ అప్పుడప్పురంబున నంగనా జనంబులు. 108

అర్థము :- అప్పుడు=ఆ సమయమున; ఆ+పురంబునన్=ఆ నగరమున; అంగనా జనంబులు=కాంతా సమూహములును.

భావము :- అపుడా నగరము నందలి కాంతలును.

మ॥ జిలుగుం జెంద్రిక వన్నె చేలలును గాశ్మీరాంగరాగంబులున్
వలి ముత్యంబుల భూషణంబులును భాస్వత్కేతకీ పత్రికా
విలస ద్వేణులుఁ జొక్కమై మెఱయఁగా వేల్పుంజకోరేక్షణల్
లలి భీమేశ్వరు రాజశేఖరునిఁ గొల్వన్వచ్చి రొక్కుమ్మడిన్. 109

అర్థము :- జిలుగున్=మృదువైన; చెంద్రిక వన్నె=సిందూరపు రంగు గల; చేలలును= వస్త్రములును; కాశ్మీర+అంగరాగంబులన్=కుంకుమమై పూతలను; వలిముత్యంబుల=చల్లని ముత్యములు పొదగిన; భూషణంబులును=ఆభరణములును; భాస్వత్=ప్రకాశవంతమైన; కేతకీ పత్రికా=పచ్చ మొగిలి రేకులతో; విలసత్=ప్రకాశించుచున్న; వేణులున్=పొడవైన జడలును; చొక్కమై=అందమై; మెఱయఁగా=ప్రకాశింపగా; వేల్పున్+చకోర+ఈక్షణల్= దేవతాజాతివారైన (చకోరము వంటి కన్నులు గల) కాంతలు; లలిన్=ప్రేమతో; ఒక్కుమ్మడిన్= ఒక్కసారిగా; రాజశేఖరునిన్=చంద్రశేఖరుడైన; భీమేశ్వరున్=శ్రీ భీమేశ్వర స్వామిని; కొల్వన్= సేవించుటకై; వచ్చిరి=వచ్చిరి.

భావము :- దేవకాంతలు సన్నని కుంకుమ పూవన్నె గల వస్త్రమలను ధరించిరి. శరీరముపై కుంకుమ మై పూతలను పూసికొనిరి. పొడవైన జడలను పచ్చ మొగిలి రేకులతో అలంకరించుకొనిరి. పుర స్త్రీలు, దేవకాంతలు. అందఱు ఒక్కసారిగ శ్రీ భీమేశ్వర స్వామిని సేవించుటకై వచ్చిరి.

శా॥ బీజాపూరఫలేక్షు చారుమణికుంభీమేచకేందీవరాం
భోజంబుల్ సమయోచితంబులుగ శంభుంజేరెఁగుంభస్థలీ
రాజార్ధాభరణంబు దక్షనగరీ రామా సముత్తుంగ వ
క్షోజద్వంద్వ నఖాంకుర స్ఫురణఁ గైకో విఘ్నరాజర్మిలిన్. 110

అర్థము :- కుంభస్థలీ=కుంభ స్థలము లందలి; రాజ+అర్ధ+ఆభరణంబు=చంద్రరేఖ అను అలంకారము: దక్ష...స్ఫురణన్, దక్ష నగరీ=దక్షారామము నందలి; రామా=స్త్రీల యొక్క; సముత్తుంగ=మిక్కిలి ఎత్తైన; వక్షోజ ద్వంద్వ=చనుజంటల యందలి; నఖ+అంకుర= నఖక్షత ముల యొక్క; స్ఫురణన్=తోచుటను; కైకోన్=అనుసంధింపగా; విఘ్నరాజు=వినాయకుడు; సమయ+ఉచితంబులుగ=సమయమునకు తగినట్లుగా; బీజా....జంబుల్; బీజాపూర=మాదీ ఫలములు; ఇక్షుచాప=చెఱకువిండ్లు; మణికుంభీ=మణిమయ కుంభము; మేచక=నెమలిపురి కన్నులు; ఇందీవర=నల్లకలువలు; అంభోజంబుల్=పద్మములు కలవాడై; అర్మిలిన్=ప్రేమతో; శంభున్=భీమేశ్వరుని; చేరెన్=సమీపించెను.

భావము :- కుంభస్థల మందలి చంద్రరేఖాలంకారము దక్షారామ కాంతల ఎత్తైన చనుజంటలందలి నఖక్షతములుగా స్ఫురింపగా వినాయకుడు సమయమునకు తగినట్లుగా మాదీఫలములు చెఱకు గడలు మణికుంభములు నెమలిపురి కన్నులు కలువలు పద్మములు అనువానితో ప్రేమతో శ్రీ భీమేశ్వరున కర్పించుటకై తెచ్చెను.

విశేషము :- ఈ సందర్భమున సంస్కృత భీమ ఖండమున - (25-40)

"దాక్షారామాంగ నోత్తుంగ స్తన ద్వంద్వ శిఖోపమాం
కుంభాగ్రే వేధ (?) దర్దేభో హేరంబ స్సముపాయయౌ - అని కలదు.
మాదీఫలాదులను శంకరున కర్పింప వినాయకుడు తెచ్చుట విశేషము-
"అగ్నిహోత్రం గృహం క్షేత్రం గర్భిణీం వృద్ధ బాలకౌ
రిక్త హస్తేన నోపేయా ద్రాజానం దైవతం గురుం"

యజ్ఞాదులకు ఇంటికి పుణ్యక్షేత్రమునకు గర్భిణీ స్త్రీ వద్దకు వృద్ధుల వద్దకు పసిపిల్లల వద్దకు రాజు వద్దకు దేవుని వద్దకు గురువు నొద్దకు శూన్యహస్తములతో పోరాదు అని శాస్త్రము.

తే॥ సాని కూఁతుల పల్లవోష్ఠములఁ బోలు
దాసనపుఁ బువ్వదండఁ గంధర ధరించి
పసిఁడి బుఱ్ఱట కొమ్ము చేపట్టి వచ్చె
భవునిఁ గొలువంగఁ బాతాళ భైరవుండు. 111

అర్థము :- పాతాళ భైరవుండు=పాతాళ భైరవ స్వామి; సాని కూఁతుల= వేశ్యల యొక్క; పల్లవ+ఓష్ఠములన్=చిగురాకుల వంటి పెదవులను; పోలు=పోలునట్టి; దాసనపున్= జపా వృక్షము యొక్క; పువ్వుదండన్=పూలమాలను; కంధర=మెడలో; ధరించి=అలంకరించు కొని; పసిఁడి=బంగారపు; బుఱ్ఱట కొమ్ము=చిమ్మనగ్రోవిని; పట్టి=పట్టుకొని; భవునిన్=శంకరుని; కొలువంగన్=సేవించుటకు; వచ్చెన్=వచ్చెను.

భావము :- పాతాళ భైరవ స్వామి వేశ్యా పుత్రికల చిగురు పెదవుల వంటి జపాకుసుమ మాలను మెడలో ధరించి బంగారపు చిమ్మన గ్రోవిని చేతపట్టి శంకరుని సేవించు టకై వచ్చెను.

చ॥ మగఁటిమిఁ జంద్రుగుజ్జురస మంటిన వామ పదాంబుజంబుపై
నిగళము నాసురాసుర వినిర్జితమౌ బిరుదందె ఘల్లనం
బొగడలు బొండు మల్లియలు పొన్నలు పావడ చొళ్ళియంబునన్
నిగిడిచి వీరభద్రుఁడు చనెన్ శశి మౌళి సమీప భూమికిన్. 112

అర్థము :- మగఁటిమిన్=శౌర్యము చేత; చంద్రు గుజ్జురసము=చంద్రుని పొట్టలోని వసయొక్క ద్రవము; అంటిన=అంటుకొన్న; వామపద=ఎడమ పాదమనెడి; అంబుజంబుపై= పద్మముపై; నిగళము+నాన్=కడియమనగా; సుర+అసుర=దేవతలను రాక్షసులను; వినిర్జితమౌ=జయించిన దగు; బిరుదు+అందె=బిరుదు కడియము; ఘల్లనన్=ఘల్లుఘల్లుమని మ్రోగుచుండగా; పొగడలు=పొగడపూలు; బొండుమల్లియలు=గుండు మల్లెలు; పొన్నలు= పున్నాగపూలు; పావడ=బహుమానముగా; చొళ్ళియంబునన్=జడతోడి తలచుట్టపై; నిగిడిచి=ఉంచుకొని; వీరభద్రుఁడు=వీరభద్రుడు; శశిమౌళిన్=చంద్రశేఖరుని; సమీప భూమికిన్=దగ్గరి చోటికి; చనెన్=వెళ్ళెను.

భావము :- శౌర్యమునకు గుర్తుగ చంద్రుని పొట్టలోని వస యొక్క ద్రవము అంటుకొనిన వీరభద్రుని ఎడమ పాదమునకు దేవతలను రాక్షసులను జయించిన గుర్తుగ బిరుదు కడియము కలదు. అది ఘల్లుఘల్లుమని మ్రోగుచుండగా జడముడితోకూడిన తలపై పొగడ పూలు గుండు మల్లెలు పున్నాగ పూలను మోసికొని వీరభద్రుడు చంద్రశేఖరుడైన శ్రీ భీమేశ్వర స్వామిని సేవించుటకై సమీపించెను.

విశేషము :- దక్ష యజ్ఞ వినాశన సమయము నందు వీరభద్రుడు చంద్రుని పొట్టను త్రొక్కి వసను వెలువరించెనని పురాణోక్తి. పరమేశ్వరుని పూజించుటకై వీరభద్రుడు పొగడలు బొండు మల్లెలు పున్నాగములు మొదలగు పూజా ద్రవ్యములను తెచ్చెననుట భావము.

**వ॥ అప్పుడు బ్రహ్మాది దేవతలును నింద్రాద్యష్ట దిక్పాలకులును నంది భృంగిరిటి కుంభ నికుంభ కుంభోదర చండీశ్వర మహాకాళ ప్రముఖులగు నసంఖ్యాత ప్రమథులును సురగరుడోరగ కిన్నర గంధర్వ సిద్ధ సాధ్య విద్యాధర రాక్షసులును భూతబేతాళ శాకినీ డాకినీ గణంబులును, సమయోచితాలంకారంబులం గైసేసి వృషకేతునిం గొలిచి యుండిరంత.** **113**

అర్థము :- అప్పుడు=అ సమయమున; బ్రహ్మ+ఆది దేవతలును=బ్రహ్మదేవుడు మొదలైన దేవతలును; ఇంద్ర+ఆది=ఇంద్రుడు మొదలైన; అష్ట=ఎనిమిది మంది; దిక్+పాలకులును=దిక్కులను పాలించువారును; నంది=నందీశ్వరుడు; భృంగిరిటి=భృంగిరిటి; కుంభ= కుంభుడు; నికుంభ=నికుంభుడు; కుంభోదర=కుంభోదరుడు; చండీశ్వర=చండీశ్వరుడు; మహాకాళ=మహాకాళుడు; ప్రముఖులగు=మొదలైన అసంఖ్యాత=లెక్కకు మిక్కిలియైన; ప్రమథులును=శివ భటులును; సుర=దేవతలు; గరుడ=గరుడులు; ఉరగ=నాగులు; కిన్నర= కిన్నెరులు; గంధర్వ=గంధర్వులు; సిద్ధ=సిద్ధులు; సాధ్య=సాధ్యులు; విద్యాధర=విద్యాధరులు; రాక్షసులును=రక్కసులును; భూత=భూతములు;

బేతాళ=పిశాచములును; శాకినీ డాకినీ=శాకిని డాకిని అను స్త్రీ పిశాచుల యొక్క; గణంబులును=సమూహములును; సమయోచిత=సందర్భమునకు తగినట్టి; అలంకారంబులన్=అలంకారములతో; కైసేసి=అలంకరించుకొని; వృషకేతు నిన్=శంకరుని; కొలిచి=సేవించి; ఉండిరి=ఉండిరి; అంత=అంతట.

భావము :- ఆ సమయమున బ్రహ్మ మొదలైన దేవతలు ఇంద్రుడు మొదలైన అష్టదిక్పాలురు నంది భృంగిరిటి కుంభుడు నికుంభుడు కుంభోదరుడు చండీశ్వరుడు మహాకాళుడు మొదలగు అనేకులైన ప్రమథులు, దేవతలు గరుడులు నాగులు కిన్నరులు గంధర్వులు సిద్ధులు సాధ్యులు విద్యాధరులు రాక్షసులు భూత బేతాళ గణములు శాకినీ డాకినీ గణములును సమయానుకూలమైన అలంకారములతో వచ్చి శ్రీ భీమేశ్వర స్వామిని సేవించి యుండిరి. అంతట-

శా॥ ప్రీత్యుత్ఫుల్ల సఫాలనేత్రుఁడగు శ్రీ భీమేశ్వర స్వామి ని
ష్ప్రత్యూహంబగు సౌహృదంబున హరి బ్రహ్మాదులన్ భ్రూలతా
ప్రత్యుద్బోధన సంజ్ఞచేసి కనుగిర్పంజాగె గంగోదకా
హత్యాక్షేప హృతి ప్రపంచములు దక్షారామ మధ్యంబునన్. 114

అర్థము :- ప్రీతి+ఉత్ఫుల్ల=సంతోషముతో వికసించిన; సఫాలనేత్రుఁడగు=నుదుటి కన్నుతో కూడిన వాడైన; శ్రీ భీమేశ్వర స్వామి=శ్రీ భీమశంకర స్వామి; నిష్ప్రత్యూహంబగు= అడ్డులేని; సౌహృదంబునన్=స్నేహముతో; హరి బ్రహ్మాదులన్=విష్ణువు బ్రహ్మ మొదలైన వారిని; భ్రూలతా=తీగల వంటి కనుబొమలతో; ప్రత్యుద్బోధన=బాగుగా ప్రేరేపించుటకు; సంజ్ఞ చేసి=సైగ చేసి; కనుగిర్పన్=కన్నుగీటగా; గంగోదక=గంగాజలముతో; ఆహతి=కొట్టుట; ఆక్షేప=చిమ్ముట; హృతి=తీసికొనుట అనువాని యొక్క; ప్రపంచములు=సమూహములు; దక్షారామ మధ్యంబునన్=దక్షారామ నగర మధ్యభాగము నందు, చాగె=సాగెను.

భావము :- శ్రీ భీమేశ్వర స్వామి సంతోషించినాడు. ఆ సంతోషమున ఫాలనేత్రము వికసించినది. నిరంతరాయమైన స్నేహ భావముతో క్రీగంట చూచినాడు. కనుబొమలు కదలినవి. క్రీగంటి చూపుతో విష్ణువు బ్రహ్మ మొదలగు వారివైపు ఆదర పూర్వకముగ చూచినాడు. ఆ కదలికకు పైనున్న గంగ ఒరపిడి వడినది. ఫలితముగ నీటి తుంపురులు లేచినవి. ఎగజిమ్మబడినవి. దక్షారామ నగర మధ్యమున బడినవి.

శివుని కనుబొమల కదలికతోనే దక్షారామము నందు వసంతోత్సవము లోని చల్లులాట ఆరంభమయ్యెను.

విశేషము :- నిష్ప్రత్యూహంబు=నిర్+ప్రతి+ఊహంబు; ప్రత్యుద్బోధన=ప్రతి+ ఉత్+బోధన. ఇట్లు ఒకటి కంటె ఎక్కువ ఉపసర్గలతో పదములను కూర్చుట శ్రీనాథుని ఉక్తి వక్రతలో కన్పడు ఒక విశేషము.

సుదుస్సహము=సు+దుర్+సహము (భీమ. 3-160); సముద్వీక్షింపు=సమ్+ఉత్+వి+ఈక్షింపు (కాశి. 3-201) సుప్రవృద్ధ=సు+ప్ర+వృద్ధ (భీమ. 6-1)

ఇది కుంతకుడు చెప్పిన ఉపసర్గ వక్రత.

సీ॥ హేరాళముగఁ జల్లె నెలనాఁగ యొక్కర్తు
కుంభోదరుని మీఁదఁ గుసుమ రజముఁ
కుటిల కుంతల భృంగిరిటి మోమునం దొర్తు
తాఁకించె నోల గందంపుఁ బసుపు
వక్షంబు లక్షించి వైచె గందపుటుండ
వీరభద్రుని నొక్క నీరజాక్షి
చెవిలోనఁ బాఱంగఁ జిమ్మె గొజ్జఁగ నీటఁ
గాల భైరవు నొక్క కలువకంటి
తే॥ కొమ్మ యొక్కతె యందంద గొమర సామి
యొదలల యందు జవ్వాది యసలు గలిపెఁ
బున్నఁగు మణి కుంభమున నించి పోసె నొక్క
పొలతి విఘ్నేశ్వరుని కుండ బొజ్జ మీఁద. 115

అర్థము :- ఎలనాఁగ=యువతి; ఒక్కర్తు=ఒకతె; కుంభోదరుని మీఁదన్= కుంభోదరుడను ప్రమథుని మీద; కుసుమరజమున్=పుప్పొడిని; హేరాళముగన్=అధికముగ; చల్లెన్=చల్లినది;

కుటిలకుంతల=నొక్కుల కురులు గల కాంత; ఒర్తు=ఒకతె; భృంగిరిటి=భృంగిరిటి అను ప్రమథుని; మోమునందు=మోగముపై; ఓలగందంపున్+పసుపు=పరిమళ భరితమగు పూత పసుపు; తాఁకించెన్=అంటించెను;

ఒక్క నీరజాక్షి=ఒక పద్మనయన; వీరభద్రునిన్=వీరభద్రుని యొక్క; వక్షంబు=వక్షస్థలమును; లక్షించి=గురిచూచి; గంధము+ఉండ=గంధపు ఉండను; వైచె=వేసెను;

ఒక్క=ఒక; కలువ కంటి=కలువల వంటి కన్నులు గల కాంత; కాలభైరవున్= కాలభైరవుని; చెవిలోన=చెవిలోనికి; పాఱంగన్=ప్రవహించునట్లుగా; గొజ్జఁగ నీటన్=పన్నీటితో; చిమ్మెన్=చిమ్మెను;

కొమ్మ=కాంత; ఒక్కతె=ఒకతి; అందంద=మాటిమాటికి; కొమరసామి=కుమారస్వామి యొక్క; ఓదలల యందు=తలల యొక్క పైభాగములపై; జవ్వాది అసలు=బురదవలె పలుచనైన జవ్వాదిని; కలిపెన్=కలియజేసెను;

ఒక్క పొలతి=ఒక స్త్రీ; విఘ్నేశ్వరుని=వినాయకుని; కుండ బొజ్జమీఁద=కుండవంటి పొట్టపైన; మణి కుంభమున=మణులు పొదిగిన కడవతో; నించి=నింపి; పునుఁగు=పునుగు అను పరిమళ ద్రవ్యమును; పోసెన్=పోసెను.

భావము :- ఒక కాంత కుంభోదరుని మీద పూపొడిని విరివిగ చల్లినది. ఒక లలన భృంగిరిటి మొగముపై పరిమళ భరితమైన పూత పసుపును పూసినది. ఒక సుందరి వీరభద్రుని వక్షమును గురిచూచి గందపుటుండను వేసినది. ఒక ఇంతి పన్నీటిని కాలభైరవుని చెవిలోనికి చిమ్మినది. ఒక జవ్వని కుమార స్వామి యొక్క తలలపై జవ్వాది బురదను దట్టముగ చల్లినది. ఒక యువతి మణులు పొదిన కుండ నిండ పునుగు అను పరిమళ ద్రవ్యమును నింపి వినాయకుని కుండ బొజ్జపై పోసినది.

ఉ॥ నేతుల నూనెలం బసపు నీరునఁ గుంకుమ చెందిరంబులన్
నూతన గంధ సారములనుం బొనరించిరి కేలితంత్రముల్
కౌతుక మొప్ప దక్షవనికాపుర వీథుల భూత కోటితో
మాతృక గోఁగు నూకసతి మండమ దేవియు ఘట్ట తల్లియున్. 116

అర్థము :- మాతృక గోఁగు=గోగులాంబ; నూకసతి=నూకాంబ; మండమదేవియు= మండ తల్లియు; ఘట్టతల్లియున్=ఘట్టాంబికయు; కౌతుకము+ఒప్ప=వినోదము కల్గునట్లుగా; భూత కోటితో=భూతగణములతో; దక్షవనికాపుర=దక్షారామ నగరము యొక్క; వీథులన్=వీథుల యందు; నేతులు=నేతులతోను; నూనెలన్=నూనెలతోను; పసపు నీరునన్=పసుపు నీటితోను; కుంకుమ చెందిరంబులన్=కుంకుమ సిందూరములతోను; నూతన=క్రొత్తదైన; గంధ సారముల నున్=చందనములతోను; కేలితంత్రముల్=వినోద వ్యాపారములను; పొనరించిరి=చేసిరి.

భావము :- గోగులమ్మ నూకాంబ మండమదేవి ఘట్టతల్లి అనెడి దక్షారామ గ్రామ దేవతలు వినోదార్థముగా భూతగణములతో కలసి దక్షారామ నగర వీథులందు నేతులు నూనెలు పసుపు నీరు కుంకుమ సిందూరము చందనములతో వసంతమును చేసి వినోదించిరి.

117

వ॥ అంత.

భావము :- అంతట.

తే॥ మాళవీదేవి శ్రీ భద్రకాళి మీఁదఁ
బరిమళముతోడి చిఱుబంతి పసుపుఁ జల్లె
గాజుకుప్పెలఁ గస్తూరికా జలంబు
కర్ణికారాంబపై నించెఁ గర్ణమోటి. 118

అర్థము :- మాళవీదేవి=మాళవీదేవి అను నామె; శ్రీ భద్రకాళి మీఁదన్=శ్రీ భద్రకాళి అనునామెపై; పరిమళముతోడి=సువాసనతో కూడిన; చిఱుబంతి పసుపున్=ఎక్కువ వన్నెకల చాయపసుపును; చల్లె=చల్లెను; కర్ణికారాంబపై=కర్ణికారాంబ అనునామెపై; కర్ణమోటి=కర్ణమోటి అనునామె; గాజుకుప్పెలన్=గాజుపాత్రలలోని; కస్తూరికా జలంబు=కస్తూరి కలిపిన నీటిని; నించెన్=చల్లెను.

భావము :- మాళవీదేవి భద్రకాళిపై సువాసన గల చాయ పసుపును చల్లినది. కర్ణమోటి అనునామె గోగులమ్మపై కస్తూరి కలిపిన చల్లని నీటిని చల్లినది.

ఉ॥ ఘట్ట తరోద్ధతిన్ గరిముఖంబునఁ బీలిచి గౌతమీ నదిం
బుట్టిన సత్ప్రవాహ జలపూరముఁ ద్రుస్సన నూఁదుచుం బురీ
హట్టమున న్మధూత్సవ విహారము సల్పెను గౌరిదేవి తొ
ల్పట్టి గణేశ్వరుండు సురభామిను లోలమునం దొదుంగఁగన్. 119

అర్థము :- గౌరిదేవి=పార్వతీదేవి యొక్క; తొల్పట్టి=మొదటి కుమారుడైన; గణేశ్వరుండు=వినాయకుడు; కరిముఖంబునన్=ఏనుగు మొగముతో; గౌతమీ నదిన్+పుట్టిన= గౌతమీ నదిలో కలిగిన; సత్ప్రవాహ=మంచిగ ప్రవహించు; జలపూరమున్=నీటి వెల్లువను; ఘట్టతర+ఉద్ధతిన్=అధికముగ ఇటునటు త్రిప్పుటచే కల్గిన గర్వముతో; త్రుస్సనన్=త్రుస్ త్రుస్ అని; ఊఁదుచున్=పైకి ఊదుచు; పురీహట్టమునన్=దక్షారామ నగర విపణి వీధియందు; సురభామినులు=దేవకాంతలు; ఓలము నందు=చాటున; ఒదుంగఁగన్=దాగుకొనగా; మధు+ ఉత్సవ=వసంతోత్సవము యొక్క; విహారమున్=వేడుకగ తిరుగుటను; చల్పెను=చేసెను.

భావము :- పార్వతీ దేవికి పెద్దకుమారుడైన వినాయకుడు తన ఏనుగు ముఖమునకు గల తుండముతో గోదావరీ నది నీటి ప్రవాహమును బిఱ్ఱుగ పీల్చి అటునిటు త్రిప్పుట వలన కల్గిన గర్వముతో త్రుస్ త్రుస్ అని పైకి ఊదుచు దక్షారామ నగర విపణి వీధి యందు వసంతోత్సవ విహారము చేసెను. దేవకాంత లా నీటి తుంపురలకు తడియలేక చాటుల దాగుకొనిరి.

మ॥ ప్రమదం బింపెసలార మేనకయు రంభా మంజుఘోషా తిలో
త్తమలున్ వెండియుఁ గల్గు నప్సరసలుం దారాధిపోత్తంసునిన్
బ్రమయంజల్లిరి గంధ సారమునను౦ బన్నీటఁ గాశ్మీర పం
కమునన్ సంకుమదంబునం బునుఁగునం గర్పూర ఖండంబులన్. 120

అర్థము :- ప్రమదంబు=సంతోషము; ఇంపెనలార=అతిశయమగునట్లుగ; మేనకయు=మేనకయును; రంభా=రంభయు; మంజుఘోషా=మంజుఘోషయును; తిలోత్తమ లున్=తిలోత్తమ అనువారును; వెండియున్+కల్గు=ఇంకను గల; అప్సరసలున్=అప్సరః కాంతలును; తార+అధిప+ఉత్తంసునిన్=చంద్రుడు శిరోభూషణముగ గల శంకరునిపై; గంధసారమునన్=చందనముతోను; పన్నీటన్=పన్నీటితోను; కాశ్మీర పంకమునన్=కుంకుమ పూ బురదతోను; సంకుమదంబునన్=జవ్వాదితోను; పునుఁగునన్=పునుగు అను పరిమళ ద్రవ్యముతోను; కర్పూర ఖండంబులన్=కర్పూరపు ముక్కలతోడను; బ్రమయన్=సంభ్ర మింపగా; చల్లిరి=చల్లిరి.

భావము :- సంతోషాతిశయముతో మేనక రంభ మంజుఘోష తిలోత్తమ మొదలయిన అప్సరస లందరు శ్రీ భీమేశ్వర స్వామిపై చందనము, పన్నీరు, కుంకుమ పూవు బురద, జవ్వాది, పునుగు, కర్పూరపు పలుకులను సంభ్రమింపగా వెదచల్లిరి.

తే॥ అచ్యుతుని మీఁద జల్లె దుగ్ధాబ్ధి కన్య
భారతీదేవి పద్మజు పైన చల్లె
శచి మహేంద్రునిఁ జల్లె వసంత కేలి
గంధ కర్పూర కస్తూరికా జలంబు. 121

అర్థము :- వసంత కేలి=వసంతోత్సవ క్రీడలో; గంధ+కర్పూర+కస్తూరికా= చందనము కర్పూరము కస్తూరి కలిపిన; జలంబు=నీటిని; దుగ్ధ+అబ్ధి+కన్య=పాల సముద్రమున పుట్టిన లక్ష్మీదేవి; అచ్యుతుని మీఁదన్=విష్ణుమూర్తిపైన; చల్లె=చల్లినది; భారతీదేవి=సరస్వతీదేవి; పద్మజుపైన=బ్రహ్మదేవుని మీద; చల్లె=చిలుకరించినది; శచి= శచీదేవి; మహేంద్రునిన్=దేవేంద్రునిపై; చల్లె=చల్లినది.

భావము :- వసంతోత్సవ వినోదముగ చందనము కస్తూరి కర్పూరములు కలిపిన చల్లని నీటిని లక్ష్మీదేవి విష్ణుమూర్తి పైనను, సరస్వతి బ్రహ్మదేవుని పైనను, శచీదేవి దేవేంద్రుని మీదను చల్లిరి.

మ॥ అగురుం గుంకుమ ధూళియుం దిమిర సంధ్యారాగ సంపూర్ణముం
గగనాభోగము సంధ్యకాలమున నాఁ గాన్పింప నా భంగికిం
దగియెన్ జుక్కలు వోలెఁ దాండవ గణాధ్యక్షుండు తుండమ్మున
న్నెగయం జల్లిన సప్తసింధుజల వేణీ బిందు సందోహముల్. 122

అర్థము :- అగురున్=అగురు అను సుగంధ ద్రవ్యము; కుంకుమ ధూళియున్= కుంకుమ పొడియు; తిమిర సంధ్యారాగ=చీకటితో కూడిన సంధ్యాకాలపు ఎఱ్ఱదనము యొక్క; సంస్పర్శమున్=చక్కని స్పర్శ కల్గిన; గగనాభోగము=ఆకాశ వైశాల్యము; సంధ్యాకాలమున నాన్=సంధ్యా సమయము నందు వలె; కాన్పింపన్=కనిపింపగా; ఆ భంగికిన్=ఆ పద్ధతికి; చుక్కలు+పోలెన్=చుక్కల వలె; తాండవ గణాధ్యక్షుండు=తాండవ వినాయకుడు; తుండంబు నన్=తుండముతో; ఎగయన్+చల్లిన=త్రుస్ త్రుస్ మని ఊది వెదజల్లిన; సప్త సింధు జలవేణీ= సప్త గోదావర జల ప్రవాహము యొక్క; బిందు సందోహముల్=బిందువుల సమూహములు; తగియెన్=తగియుండెను.

భావము :- నల్లని అగురు ఎఱ్ఱని కుంకుమ పొడి వెదజల్లుట చేత వాని నల్ల ఎఱ్ఱదనముల చేత ఆకాశము చీకటితో కూడిన సంధ్యా సమయపు కాంతిచే ప్రకాశించినది. సంధ్యా సమయమైనట్లే అనిపించినది. ఆ సమయమున తాండవ వినాయకుడు తన తుండముతో ఎగజిమ్మిన గోదావరీ నీటి ప్రవాహపు తుంపురలు చుక్కలవలె ప్రకాశించెను.

విశేషము :- తాండవ వినాయకుడు : దక్షారామమున దక్షిణ ద్వారము చెంత తాండవ గణపతి కలడు. ఈయన తాండవము చేయుచున్న భంగిమలో నుండును.

వ॥ అట్టి యెడ మున్ను కిన్నరులు చల్లినఁ బెల్లు నెఱసిన ఘుసృణ కుసుమ కేసర ధూళీపాళియు, విద్యాధరసందోహంబులు ఱువ్వినం జిందిన మవ్వంపుఁ జెందిరంబును మచ్చరించి విచ్చలవిడి హెచ్చుగా నచ్చరలు చిమ్మినఁ గ్రమ్ము కుసుంభాంభః పూరంబును, నంగనాజనంబులపై నుడిసి తడిసి యార్ద్రాంగ రాగ శీకరాసార వాహిని యగు గంధ వాహ ప్రవాహంబును, ధారాళకరాళ రక్తచందనాంబు సంసిక్త వసుంధరా భాగంబును, గలయం గెంపు పెంపు సంపాదింప నకాండ సంధ్య నావహించిన నందుచిత వ్యవహార యోగ్యంబులై పొడచూపిన యంధకారం బునుం బోలె గంధర్వకర వికీర్యమాణ కస్తూరికారేణు విసరంబుల వలనను, గుసుమ కస్తూరికా సాంధ్యరాగాంధకారంబులకుఁ దోడై పొడచూపనేతెంచు చుక్కల చక్కఁదనం బునకుఁ దోబుట్టైన హయలపనా పాణిపల్లవ విక్షిప్తంబులైన పచ్చకప్పురంబు పలుకులును జెదర లంబోదర కపోలానిలంబుల వలన రోలంబ నికురుంబంబులు నెగయుటయును; బరస్పర సంసర్గార్థ వశంబున వశంబులు సముద్ధతి నిగుడించు పసిండి తమ్మి మొగడలు మెండు మండుటయునుంగా మూర్తంబగు మకరకేతన భుజప్రతాప దావానలంబు ఛటచ్ఛటా శబ్దంబుల చాడ్పునఁ జెలంగుచున్న యక్షకర్దమ

ప్రక్షిప్త లాక్షాకరండ సంఘట్టనస్వనంబుల వలనను, దొట్టి తొట్టి యెడనెడమడువులు గట్టిన సజ్జకపు గొజ్జంగినీరు నందుఁ బ్రతిబింబించు నప్సరఃకాంతల వదనారవిందంబుల లోపలంబడి తేలియాడు వాడని చేమంతి బంతుల వడువునై కొలంకుల చందంబునొంద, బువ్వాన కరిగెడి కొదమ తుమ్మెద కదుపులను గదిరి తొరఁగు గుహ్యక మండలీకృత పుండ్రేక్షు కోదండ పృష్ఠ నిష్ఠ్యూత నూతన కువలయాస్త్రంబుల వలనను, నిశాట కరహాట ముఖ నఖ సముజ్ఝితంబైన సంకుమద పంకంబు వలనను, నలుదెసల నంతంత జాతిపడియున్న కమల మృణాల కాండంబు వలనను వరంబును బదిలంబుగా నవుర్చిన కేదారంబు తెఱంగుఁదోఁచుటకు నీడై చతుర హలికుండు జల్లు పరువపు మరువంపు మొలకల చెలువునం బెల్లుడుల్లు ప్రమథ గణ విభ్రష్ట విమల హార యష్టి ముక్తాఫలంబుల వలనను వసంతర్త్వారంభంబు త్రిభువన దృక్ప్రియ తమంబయ్యె నయ్యవసరంబున.
123

అర్థము :- అట్టియెడన్=ఆ సమయమున; మున్ను=ముందుగా; కిన్నరులు= కిన్నరజాతి దేవతలు; చల్లినన్=చిలుకరింపగా; పెల్లు నెఱసిన=అతిశయించి వ్యాపించిన; ఘుసృణ=కుంకుమపూవులలోని; కుసుమ కేసర=కింజల్కముల; ధూళీపాళియు=పొడి సమూహము; విద్యాధర సందోహంబులు=విద్యాధరుల సమూహములు; ఱువ్వినన్=విసరగా; చిందిన=వ్యాపించిన; మవ్వంపున్=చక్కనైన; చెందిరంబును=ఎఱ్ఱని సిందూరమును; మచ్చరించి=పోటీచేసి; విచ్చలవిడి=ఇచ్ఛ వచ్చినట్లుగ; హెచ్చుగాన్=మిక్కిలిగా; అచ్చరలు= అప్సరసలు; చిమ్మినన్=వెదజల్లగా; క్రమ్ము=వ్యాపించు; కుసుంభ=కుంకుమ కలిపిన; అంభః పూరంబునున్=నీటి ప్రవాహమును; అంగనా జనంబులపై=కాంతల సమూహముపై; సుడిసి=చుట్టుకొని; తడిసి=తడిసి; ఆర్ద్ర+అంగరాగ=చెమ్మగిల్లిన లేపన ద్రవ్యముల యొక్క; శీకర+ఆసార=నీటి తుంపురల జడివాన యొక్క; వాహిని యగు=నది యగు; గంధ వాహ=వాయువు యొక్క; ప్రవాహంబును=ప్రవాహమును; ధారాళ=అడ్డులేని; కరాళ=అధికమైన; రక్తచందన=ఎఱ్ఱగంధము కలిపిన; అంబు=నీటితో సంసిక్త=బాగుగా తడిసిన; వసుంధరాభాగంబును=భూ ప్రదేశమును; కలయన్=కలగలుపుగా; కెంపు= ఎఱ్ఱదనము; పెంపు సంపాదింపన్=అతిశయమును కూర్పగా; అకాండ సంధ్యన్=అకస్మిక సంధ్యాకాలమును; అవహించినన్=కల్పింపగా; అందు=అక్కడ; ఉచిత వ్యవహార యోగ్యంబులై=తగినట్లు ప్రవర్తించు నేర్పుకలవై; పొడ చూపిన=కన్పించిన; అంధకారంబు

నున్+పోలె=చీకటివలె; గంధర్వ=గంధర్వుల యొక్క; కర=చేతులచే; వికీర్యమాణ=వెదచల్లబడిన; కస్తూరి కారేణు=కస్తూరి పొడి యొక్క; విసరంబుల వలనను= సమూహముల వలనను;

కుసుమ=కుంకుమ పూవు; కస్తూరికా=కస్తూరులనెడి; సాంధ్యరాగ=సంధ్యాకాలపు ఎఱ్ఱదనము తోడి; అంధకారంబులకున్=చీకట్లకు; తోడై=సాటియై; పొడచూపన్=కన్పించుటకు; ఏతెంచు=వచ్చు; చుక్కల=చుక్కల యొక్క; చక్కఁదనంబునకున్=అందమునకు; తోఁబుట్టైన=సోదరి (సాటి) యైన; హయలపనా=గుఱ్ఱము మోములు గల కిన్నర కాంతల యొక్క; పాణి పల్లవ=చిగురుల వంటి చేతులచే; విక్షిప్తంబులైన=విసరబడినవైన; పచ్చకప్పురంబు పలుకులును=పచ్చకర్పూరపు ముక్కలును; చెదర=క్రమ్ముకొనగా; లంబోదర=వినాయకుని; కపోల=చెక్కిళ్ళ యందలి; అనిలంబుల వలన=గాలుల వలన; రోలంబ=తుమ్మెదల; నికురుంబంబులు=గుంపులు; నెగయుటయును=పైకి లేచుటయును; పరస్పరము=అన్యోన్యమైన; సంసర్గ+అర్థ=కలయికకై; వశంబున=అధీనమైన; వశంబులు=కోరికలు; సముద్ధతి=ప్రేరేపింపబడి; నిగుడించు=వ్యాపింపజేసిన; పసిండి=బంగారపు; తమ్మి మొగడలు=తామరపూ మొగ్గలు; మెండు=ఎక్కువగ; మండుట యునుంగా=ప్రకాశించుటగా; మూర్తంబగు=రూపు దిద్దుకొన్న; మకరకేతన=మన్మథుని; భుజప్రతాప=భుజముల శక్తి యనెడి; దావానలంబు=కార్చిచ్చు యొక్క; ఛటచ్ఛటా శబ్దంబులు=చటచటమను ధ్వనుల యొక్క; చాడ్పునన్=విధముగా; చెలంగుచున్న= ప్రకాశించుచున్న; యక్షకర్దమ=కర్పూరము కస్తూరి అగురు తక్కోలము చందనము కుంకమ పూవులు సమపాళ్ళలో కలిపి చేసిన చూర్ణము; ప్రక్షిప్త=కూర్పబడిన; లాక్షాకరండ=లత్తుక బరిణల యొక్క; సంఘట్టన=ఒరపిడి వలననైన; స్వనంబుల వలనను=శబ్దముల చేతను;

తొట్టి తొట్టి=స్రవించి స్రవించి; ఎడనెడ=అక్కడక్కడ; మడువులు గట్టిన=మడుగులు గట్టిన; సజ్జకపు గొజ్జంగ నీరు నందున్=మనోజ్ఞమైన పన్నీటి యందు; ప్రతిబింబించు=ప్రతిఫలించు; అప్సరః కాంతల=అప్సరః స్త్రీల యొక్క; వదన+అరవిందంబుల=పద్మముల వంటి మొగముల, లోపలన్=లోపల; పడి=రాలి; తేలియాడు=తేలాడునట్టి; వాడని=వాడిపోని; చేమంతి బంతుల=చేమంతి పూల; వడువునై=విధముగనై; కొలంకుల చందంబున్=సరస్సులరీతిని; ఒందన్=పొందగా; పువ్వు+అని=పూవును ఆశ్రయించి; అరిగెడి=వెళ్ళెడు; కొదమ తుమ్మెద=పిల్ల తుమ్మెదల యొక్క; కదుపులను=గుంపులను; కదిరి తొరగు=అతిశయించి స్రవించు; గుహ్యక మండలీ=గుహ్యకులను దేవజాతి వారి సమూహముచే; మండలీ కృత=వలయాకారముగా చేయబడిన; పుండ్రేక్షు=నలుపు గల ఎఱ్ఱ చెఱకు గడలనెడి; కోదండ=విల్లుల యొక్క; పృష్ఠ=ముందు నుండి; నిష్ప్యూత=బయల్వెడలిన; నూతన=క్రొత్తవైన; కువలయ+అస్త్రంబుల వలనను= కలువపూలనెడి బాణముల వలనను;

నిశాట కరహాటముఖ=పద్మ నాళము సాధనముగ గల భూతగణము యొక్క; నఖ=గోళ్ళ చేత; సమురిత్క్షితంబైన=బాగుగా విడువబడిన; సంకుమద=జవ్వాది యొక్క; పంకంబు వలనను=బురద వలనను; నలుదెసల=నాలుగు వైపులను; అంతంత=అక్కడక్కడ; జాఱిపడియున్న=జారిపోయి పడియున్న; కమల=పద్మముల; మృణాల కాండంబు వలనను= తూడుల గుంపుల వలనను; వరంబును=కుంకుమ పూవును; పదిలంబుగాన్=జాగ్రత్తగా; అమర్చిన=కూర్చిన; కేదారంబు=పాదు యొక్క; తెఱంగు=విధము; తోఁచుటకున్= తలపించుటకు; ఈడై=సాటియై; చతుర హలికుండు=నేర్పరియైన సేద్యగాడు; చల్లు=చల్లెడి; పరువపు=పాకము చేసిన; మరువంపు మొలకల=మరువపు మొలకలనెడి ఒక మేలుజాతి వడ్ల గింజల; చెలువునన్=చక్కనైన విధముగా; పెల్లుడుల్లు=మిక్కిలిగ రాలిపడు; ప్రమథ గణ=ప్రమథుల సమూహములచే; విభ్రష్ట=విరివిగ జార్చబడిన; విమల=చక్కనైన; హార యష్టి=ముత్యాలదండలోని; ముక్తాఫలంబుల వలనను=ముత్యముల వలనను; వసంతర్తు= వసంతఋతువు యొక్క; ఆరంభంబు=ప్రారంభము; త్రిభువన=మూడు లోకముల యొక్క; దృక్+ప్రియతమంబు=కనులకు మిక్కిలి సంతోషకరము; అయ్యెన్=అయ్యెను; ఆ+ ఆవసరంబున=ఆ సమయమున.

భావము :- ఆ సమయమున ముందుగ కిన్నరులు చల్లిన కుంకమపూవు పుప్పొడిల సమూహము క్రమ్మి వ్యాపించినది. విద్యాధరులు చక్కనైన ఎఱ్ఱ సిందూరమును చల్లిరి. అప్సరసలు కుంకుమ కలిపిన నీటిని వెదజల్లిరి. ఎఱ్ఱ సిందూరమును మించి కుంకుమ నీరు ప్రకాశించినది. ఆ నీటి వెల్లువకు కాంతలందరు తడిసిరి. వారి శరీరములపై అలదుకొన్న లేపన ద్రవ్యములు తడిసి పరిమళించుచుండగా ఆ పరిమళమును గ్రహించిన గాలి ప్రసరించు చున్నది. అనంతమైన ఎఱ్ఱ చందనము కలసిన నీటితో ఆ ప్రాంతపు నేల తడిసి ఎఱ్ఱగనైనది. భూమ్యాకాశములు ఆ విధముగ ఎఱ్ఱవడి సంధ్యా సమయమును తలపించినది. సమయము నకు తగినట్లుగ గంధర్వులు విరివిగ వెదచల్లిన కస్తూరి పొడులచేత చీకటి క్రమ్మినట్లయినది.

కస్తూరి కుంకుమ పూల విస్తారమైన వ్యాప్తిచేత చీకటితో కూడిన సంధ్యా సమయమై నట్లుండగా కిన్నర కాంతలు విరివిగా వెదజల్లిన పచ్చ కర్పూరపు ముక్కల సమూహములు అందమైన చుక్కలవలె ప్రకాశించుచు విస్తరించినవి.

నిత్యము చెవులు తాటించుటచేత వినాయకుని చెక్కిళ్ళ నుండి వచ్చు గాలులకు తుమ్మెద గుంపులు పైకి లేచుచున్నవి. పరస్పరము ఏకీభవించుటకు తగిన కోరికలతో ప్రేరేపింపబడి బంగారు తామర మొగ్గలు రూపుదిద్దుకొని ప్రకాశించుచున్నవి. మన్మథుని ప్రతాపమనెడి కార్చిచ్చు యొక్క ఛటఛట శబ్దముల విధముగా యక్షకర్దమ చూర్ణమును నింపిన బరిణలు పరస్పరము ఒరసికొని శబ్దములు చేయుచున్నవి.

చాలమంది వెదచల్లిన పరిమళ భరితమైన చల్లని పన్నీరు స్రవించి స్రవించి నేల తడిసి అక్కడక్కడ మడుగులు కట్టినవి. ఆ పన్నీటి మడుగులలో అప్సరసల మొగములు ప్రతిఫలించుచున్నవి. వారి కొప్పుల నుండి జారిపడిన చేమంతి బంతులు మడుగులలోని వారి మొగములపై తేలియాడుచున్నవి. ఆ మడుగులు సరస్సులవలె నున్నవి. మకరందము కొఱకు బయలుదేరిన తుమ్మెదలు పైన విహరించుచున్నవి. ఆ తుమ్మెద గుంపులను మించునట్లుగా గుహ్యకులనెడి దేవజాతి వారు చెఱకు విల్లు ఎక్కు పెట్టి విడిచిన కలువ పూవులనెడి బాణములు ప్రకాశించుచున్నవి.

పద్మనాళములు సాధనములుగ గల భూతగణముల గోళ్ళ నుండి విస్తారముగ విడువబడిన జవ్వాది పరిమళ ద్రవ్యపు బురద సువాసనా భరితమై అలరించుచున్నది. నలుదిక్కుల యందు అక్కడక్కడ జారిపడిన తామర తూడుల గుంపులు ప్రకాశించుచున్నవి. కుంకుమ పూవుతో జాగ్రత్తగా కూర్చిన పాదుల యందు నేర్పరియైన సేద్యగాడు మరువపు మొలకలను మేలుజాతి విత్తనపు వడ్లగింజలను చల్లు విధమును మించిన విధముగా ప్రమథులు వెదచల్లిన మేలు ముత్యములు విస్తరించి ప్రకాశించుచున్నవి. వీటన్నింటి వలన వసంతఋతువు ప్రారంభమైనది. ముల్లోకములకును కన్నులపండువైనది. అపుడు.

తే॥ బహుళ కస్తూరికా మేఘ పటలమునకు
శీకరాసారమయ్యెఁ గొజ్జెంగి నీరు
వలుద వడగండ్లునయ్యె నవ్వర్షమునకుఁ
గామినులు చల్లు కర్పూర ఖండ వితతి. 124

అర్థము :- బహుళ=దట్టమైన, నల్లని; కస్తూరికా=కస్తూరి యను; మేఘపటలమునకు=మేఘముల సమూహమునకు; గొజ్జెంగి నీరు=పన్నీరు; శీకర+ఆసారమయ్యెఁ=నీటి తుంపురుల జడివానయైనది; ఆ వర్షమునకున్=ఆ వానకు; కామినులు=అంచగత్తెలు; చల్లు=చల్లెడి; కర్పూర ఖండ=కర్పూరపు ముక్కల; వితతి=సమూహము; వలుద=ఉరువైన; వడగండ్లున్+అయ్యెన్=వడగండ్లుగనైనవి.

భావము :- గంధర్వ కాంతల చేత దట్టముగ వెదజల్లబడిన కస్తూరి మేఘముల సమూహమైనది. అప్సరసలు వెదచల్లిన పన్నీరు ఆ మేఘముల నుండి వచ్చు జడివాన యైనది. కిన్నర కాంతలు వెదజల్లిన కర్పూరపు పలుకుల సమూహము ఆ జడివానకు రాలుచున్న వడగండ్లు అయినవి.

విశేషము :- ఈ పద్యము అనవేమారెడ్డి ధృజ్జవర శాసనము నందలి శ్లోకమునకు అనువాదము.

"వసన్తరాయశ్చ వసన్తకేలౌ కస్తూరికా రేణు చయాంబు వాహః
క్షిప్రం హిమాంబు ఘన వర్షధారా కర్పూర ఖండా: కరకా వికీర్ణా:"

అలంకారము - రూపకము

వ॥ ఇవ్విధంబున వసంతోత్సవం బవధరించి, భీమేశ్వరుండు హరి బ్రహ్మాది దేవతలకు నింద్రాద్యష్ట దిక్పాలకులకు నరకిన్నర కింపురుష సిద్ధ సాధ్యయక్ష గంధర్వ రాక్షస గణంబులకు భృంగిరిటి కుంభ నికుంభ కుంభోదర వీరభద్ర కుమార విఘ్నేశ్వర నంది మహాకాళ పాతాళభైరవ కాలభైరవాది ప్రఖ్యాత ప్రమథులకు, బ్రాహ్మ్యాది మాతృవర్గంబులకు; శక్తి చతుష్టయంబునకు శ్రీ మహాలక్ష్మీ సరస్వతీ శచీదేవీ ప్రభృతి పరమ పతివ్రతా తిలకంబులకు నప్సర: స్త్రీలకు సముచిత ప్రకారంబులఁ గట్నంబు లిప్పించి దివ్య శ్రీ స్వయంభూత జ్యోతిర్లింగ మూర్తి శక్తి సహితంబు పరమానందంబునం బొందె, ననంతరంబు సప్తర్షులు గంగాజల సప్త గోదావరీ జలంబుల నభిషేకించి పూజించి భీమలింగంబు నిట్లని ప్రత్యేకంబు ప్రత్యేకంబు స్తుతియించిరి. 125

అర్థము :- ఈ+విధంబున=ఈ విధముగ; వసంత+ఉత్సవంబు=వసంతోత్సవమును; అవధరించి=చూచి; భీమేశ్వరుండు=శ్రీ భీమేశ్వర స్వామి; హరి బ్రహ్మ+ఆది=విష్ణువు బ్రహ్మ మొదలైన; దేవతలకున్=దేవతలకును; ఇంద్ర+ఆది=ఇంద్రుడు మొదలైన; అష్టదిక్+పాలకులకు=ఎనిమిది దిక్కులను పాలించువారికిని; నర=నరుల; కిన్నరుల=కిన్నరుల; కింపురుష=కింపురుషుల; సిద్ధ=సిద్ధుల; సాధ్య=సాధ్యుల; యక్ష=యక్షుల; గంధర్వ=గంధర్వుల; రాక్షస=రాక్షసుల యొక్కయు; గణంబులకు=సమూహములకును; భృంగిరిటి=భృంగిరిటుడు; కుంభ=కుంభుడు; నికుంభ=నికుంభుడు; కుంభోదర= కుంభోదరుడు; వీరభద్ర=వీరభద్రుండు; కుమార=కుమారస్వామి; విఘ్నేశ్వర=వినాయకుడు; నంది=నందీశ్వరుడు; మహాకాళ=మహాకాళుడు; పాతాళభైరవ=పాతాళ భైరవుడు; కాళభైరవ=కాల భైరవుడు; ఆది=మొదలయిన; ప్రఖ్యాత=ప్రసిద్ధులైన; ప్రమథులకు=ప్రమథ నాయకులకును; బ్రాహ్మి+ఆది=బ్రాహ్మి మొదలయిన; మాతృవర్గంబులకు=మాతృకా గణములకును; శక్తి చతుష్టయంబునకు=నలుగురు శక్తులకును; శ్రీ మహాలక్ష్మీ=లక్ష్మీదేవి; సరస్వతీ=సరస్వతీదేవి; శచీదేవి=శచీదేవి; ప్రభృతి=మొదలైన; పరమపతివ్రతా తిలకంబులకు=గొప్ప పతివ్రతలలో శ్రేష్ఠులైన వారికిని; అప్సర: స్త్రీలకు=అప్సరః కాంతలకును; సముచిత ప్రకారంబులన్=తగిన రీతులలో; కట్నంబులు=బహుమతులను; ఇప్పించి=ఇప్పించి; దివ్యశ్రీ=మహిమాన్వితము

శుభకరమునై; స్వయంభూత=తనకు తానై ఆవిర్భవించిన; జ్యోతిర్లింగమూర్తి=తెల్లని లింగమూర్తి; శక్తి సహితంబు=పార్వతితో కూడినదై; పరమానందంబునన్=బ్రహ్మానందమును; పొందెన్=అనుభవించెను; అనంతరంబు=ఆ తరువాత; సప్తర్షులు=వసిష్ఠుడు మొదలైన ఏడ్గురు మహర్షులును; గంగాజల=గంగాజలము తోను; సప్త గోదావర జలంబులన్=సప్త గోదావర నది యొక్క నీటితోను; అభిషేకించి=అభిషేకము చేసి; పూజించి=పూజచేసి; భీమ లింగంబును=శ్రీ భీమేశ్వరలింగస్వామిని; ఇట్లు+ అని=ఈ విధముగ; ప్రత్యేకంబు ప్రత్యేకంబు=విడివిడిగా; స్తుతియించిరి=స్తోత్రము చేసిరి.

భావము :- శ్రీ భీమేశ్వర స్వామి ఈ విధముగ వసంతోత్సవమును అవధరించినాడు. విష్ణువు బ్రహ్మ మొదలగు దేవతా ప్రముఖులకును, ఇంద్రుడు మొదలయిన అష్ట దిక్పాలకు లకును, నరులకు కిన్నర కింపురుష సిద్ధ సాధ్య యక్ష గంధర్వ రాక్షస సమూహములకును, భృంగిరిటి కుంభ నికుంభ కుంభోదర వీరభద్ర కుమారస్వామి విఘ్నేశ్వర నంది మహాకాళ పాతాళ భైరవ కాలభైరవాది ప్రముఖులైన ప్రమథులకును, బ్రాహ్మి మొదలయిన మాతృకాగణములకును, దక్షారామమును అహర్నిశలు కాచియుండు గోగులమ్మ మొదలయిన నలుగురు గ్రామదేవతా శక్తులకును, లక్ష్మీ సరస్వతీ శచీ మొదలయిన పరమ పతివ్రతా శిరోమణులకును, అప్సరః కాంతలకును తగిన రీతులలో కట్నములను ఇప్పించెను. పార్వతీ సహితుడైన శ్రీ భీమేశ్వర స్వయంభూ దివ్య శ్రీ జ్యోతిర్లింగ మూర్తి పరమానందమును పొందెను. తరువాత సప్తర్షులు గంగాజలముతోను సప్తగోదావర జలముతోను శ్రీ భీమేశ్వర స్వామిని అభిషేకించి పూజించి వేరువేరుగ ప్రత్యేకముగ ఆ స్వామిని ఈ విధముగ స్తోత్రము చేసిరి.

## సప్తముని స్తోత్రము

తే॥ వేయు ముఖములు గల కాద్రవేయ విభుఁడు
నెఱయ శక్తుండు గాఁడఁట నిన్నుఁ బొగడ
నేకముఖమునఁ బొగడంగ నెట్లు నేర్తు
నిన్ను శ్రీ దక్ష వాటికా నీలకంఠ! 126

అర్థము :- దక్షవాటికా నీలకంఠ=దక్షారామమున వెలసిన ఓ భీమశంకరా!; నిన్నున్=నిన్ను; పొగడన్=స్తుతించుటకు; వేయుముఖములు గల=వేయి నోరులు కల్గిన; కాద్రవేయ విభుఁడున్=ఆదిశేషుడును; నెఱయన్=అతిశయింపగా; శక్తుండు కాఁడఁట=శక్తి కల్గినవాడు కాడట; నిన్ను=అట్టి నిన్ను; ఏకముఖమునన్=ఒక నోటితో; పొగడంగన్= స్తుతించుటకు; ఎట్లు=ఏ విధముగ; నేర్తు=సమర్థుడనగుదును.

భావము :- ఓ భీమేశ్వర స్వామీ! వేయినోళ్ళు గల ఆ ఆదిశేషుడే నిన్ను సమర్థముగ కొనియాడలేడట. ఇక ఒక్కనోటితో నేను తమను సమర్థముగ స్తుతింపగలనా!

విశేషము :- కాద్రవేయ విభుఁడు - కద్రువకు సంతానమైన నాగజాతికి రాజైనవాడు ఆదిశేషుడు. ఇతనికి వేయి శిరసులు (పడగలు) అనిపురాణోక్తి. ఇతడే విష్ణువునకు శయ్యయైన వాడు కూడ.

అలంకారము :- కావ్యార్థాపత్తి.

కం॥ మిహిర కరంబులఁ దారా
గ్రహనక్షత్రముల వచ్చు గణుతింప; భవ
న్మహిమార్ణవ గుణరత్నము
లహికంకణ! యెవరికైన నలవియె పొగడన్. 127

అర్థము :- అహికంకణ=సర్పమును చేతికంకణముగ కల ఓ భీమేశ్వరా! మిహిర కరంబులన్=సూర్య (చంద్ర) కిరణములను; తారా=చుక్కలను; గ్రహ=సూర్యుడు మొదలైన గ్రహములను; నక్షత్రముల=అశ్విని మొదలైన ఇరువదేడు నక్షత్రములను; గణుతింప వచ్చు= లెక్కింపవచ్చును; భవత్...రత్నములు. భవత్=నీ యొక్క; మహిమ+అర్ణవ= మహత్త్వమనెడి సముద్రము నందలి; గుణరత్నములు=రత్నముల వంటి శ్రేష్ఠమైన గుణములు; ఎవరికైనన్= ఎవరికైనను; పొగడన్=పొగడుటకు; అలవియె=శక్యమగునా!

భావము :- సర్పభూషణుడవైన ఓ భీమేశ్వరా! సూర్య చంద్ర కిరణములను చుక్కలను గ్రహములను అశ్విని మొదలైన నక్షత్రములను లెక్కింప వచ్చును. నీ మహత్త్వమనెడి సముద్రములోని రత్నముల వంటి గుణములను పొగడుట ఎవరికైనను సాధ్యమగునా! కాదని భావము.

తే॥ అధికమైన తపంబు మూల్యంబు గాఁగ
నర్ధదేహంబు గౌరికి నమ్ముకొన్న
జాణదేవర నిను నాత్మ సంస్తుతింతు
దక్షిణాపథ కాశికాధామ! భీమ! 128

అర్థము :- అధికమైన=మిక్కిలియైన; తపంబు=తపస్సే; మూల్యంబు+కాఁగన్= వెలయగునట్లుగా; గౌరికిన్=పార్వతికి (సతీదేవికి); అర్ధదేహంబు=సగము శరీరమును; అమ్ముకొన్న=అమ్ముకొనిన; జాణదేవర=నేర్పరివైన దేవుడా! దక్షిణాపథ కాశికాధామ= దక్షిణకాశియైన దక్షారామము నివాసముగ కలవాడా! భీమ=ఓ భీమేశ్వరా! నిన్నున్=నిన్ను; ఆత్మన్=మనసుతో; సంస్తుతింతు=మిక్కిలిగ కీర్తించెదను.

భావము :- దక్షిణకాశి యని ప్రసిద్ధి వడసిన దక్షారామము నందు వెలసిన ఓ భీమేశ్వర స్వామీ! విశేషమైన తపస్సు చేసిన పార్వతీ దేవికి నీ అర్ధ శరీరమును అనుగ్రహించిన నేర్పరివైన దేవుడవు. అట్టి నిన్ను మనసుతో కీర్తింతును.

కం॥ ఎవ్వని కిరీటమునకుం
బువ్వై కడునొప్పు నన్నభో వాహిని లే
జవ్వనపుఁదుహిన రుచితో
నవ్వేలుపు భీమనాథు నభివర్ణింతున్. 129

అర్థము :- లేజవ్వనపు=లేత యౌవనమందున్న; తుహినరుచితో=చంద్రునితో; ఆ+నభోవాహిని=ఆ ఆకాశగంగ; ఎవ్వని=ఎవని యొక్క; కిరీటమునకున్=తలపాగకు; పువ్వై=పూవుగనై; కడున్+ఒప్పున్=మిక్కిలిగ ప్రకాశించునో; ఆ+వేలుపున్=ఆ దేవరను; భీమనాథున్=శ్రీ భీమేశ్వర స్వామిని; అభివర్ణింతున్=స్తుతింతును.

భావము :- ఓ భీమేశ్వరా! నీకు జడముడి కిరీటము. ఆ కిరీటము నందు లేత యౌవనపు చంద్రునితోను, ఆకాశ గంగ అలంకార పుష్పమై మిక్కిలి ప్రకాశించుచున్నది. అట్టి చంద్రశేఖరుడవు గంగాధరుడవు ఐన నిన్ను స్తుతించెదను.

కం॥ అర్ధ కపాలము కేలను
నర్ధనిశాసార్వభౌముఁ డౌదల నెడమున్
అర్ధాంగలక్ష్మి గౌరియు
వర్ధిల్లఁగ నొప్పు భక్త వత్సలుఁ గొలుతున్. 130

అర్థము :- అర్ధ కపాలము=సగము తలపుఱ్ఱె; కేలనున్=చేతియందున్; అర్ధ=సగమైన; నిశాసార్వ భౌముఁడు=రాత్రికి రాజైన చంద్రుడు; ఔదలన్=తలమీద; ఎడమున్=వామ భాగము నందు; అర్ధాంగలక్ష్మి=సగము శరీరము నాశ్రయించిన సంపన్నురాలు; గౌరియు=పార్వతీ దేవియు; వర్ధిల్లన్=వృద్ధి పొందునట్లుగా; ఒప్పు=ప్రకాశించు; భక్తవత్సలున్=భక్తుల యెడ దయకల వానిని (శ్రీ భీమేశ్వర స్వామిని) కొలుతున్= సేవింతును.

భావము :- సగము తల పుఱ్ఱెను చేతి యందు తలపైన అర్ధ చంద్రరేఖ ఎడమ వైపున, అర్ధాంగిగ పార్వతియు వర్ధిల్లు చుండగా ప్రకాశించెడి భక్త వత్సలుడైన శ్రీ భీమేశ్వర స్వామిని సేవించెదను.

కం॥ సాధారణ మతి సహజ త
పోధనుఁగా దలఁచి రతి విభుండెవ్వని దృ
క్క్రోధాగ్నికి నింధనమగు
నాధూర్జటి నహరహంబు నభివర్ణింతున్. 131

అర్థము :- సాధారణమతిన్=సామాన్యమైన తెలివితో; రతివిభుండు=మన్మథుడు; సహజ=సామాన్యమైన; తపః+ధనున్+కాన్=తపస్సే ధనముగ కలవానినిగ; తలఁచి=భావించి; ఎవ్వని=ఎవని యొక్క; దృక్+క్రోధ+అగ్నికిన్=చూపునందలి కోపమనెడి మంటకు; ఇంధనమగున్=వంట చెఱకగునో; ఆ ధూర్జటిన్=జడముడివేలుపైన ఆ భీమ శంకరుని; అహః+అహంబు=ప్రతిదినమును; అభివర్ణింతున్=స్తుతించెదను.

భావము :- మన్మథుడు సామాన్యమైన తెలివితో శంకరుని సామాన్య తపస్విగ భావించి ఎవని కోపమనెడి మంటకు వంటచెఱకై కాలిపోయెనో ఆ ధూర్జటి, ముక్కంటి ఐన శ్రీ భీమేశ్వర స్వామిని నిత్యము మిక్కిలిగ స్తుతించెదను.

కం॥ అస్తంగమిత సురద్విష
హస్తన్యస్త త్రిశూలు నంతర్విధి సం
విస్తృత విజ్ఞానోదయుఁ
గస్తూరీ సదృశ నీలకంఠునిఁ దలఁతున్. 132

అర్థము :- అస్తంగమిత=నాశనము పొందింపబడిన; సురద్విష=దేవతల విరోధులైన రాక్షసులు గల; హస్త=చేతి యందు; న్యస్త=ఉంచబడిన; త్రిశూలు=శూలము గలట్టియు; అంతః+విధి=ఆంతరమైన సంస్కారముతో; సంవిస్తృత=మిక్కిలి విస్తరించిన; విజ్ఞాన=విశేషమైన జ్ఞానము యొక్క; ఉదయున్=వృద్ధి గలట్టియు; కస్తూరీ సదృశ=కస్తూరి వంటి; నీల=నల్లని; కంఠునిన్=గొంతుక కల శివుని; తలఁతున్=స్మరింతును.

భావము :- శంకరుని ధాటికి రాక్షసులెందరో మరణించిరి. అనంతమైన ధాటి కలవాడు, విస్తృత బ్రహ్మ జ్ఞానము కలవాడునై శూలి, గరళకంఠుడునైన శ్రీ భీమేశ్వర స్వామిని స్మరింతును. స్తుతింతును.

తే॥ విశ్వునకు శాశ్వతునకు విశ్వేశ్వరునకు
విశ్వ రూపాత్మకునకు మహేశ్వరునకు
శ్రీ స్వయంభూ మహాసుధా సిద్ధలింగ
భీమనాథేశ్వరునకు నర్పింతు మనుసు. 133

అర్థము :- విశ్వనకు=విశ్వరూపుడైనట్టియు; శాశ్వతునకు=శాశ్వతుడైనట్టియు; విశ్వ+ఈశ్వరునకు=విశ్వమంతటికి ప్రభువైనట్టియు; విశ్వరూప+ఆత్మకునకు=ప్రపంచరూపమే తానైనట్టియు; మహేశ్వరునకు=పరమ శివుడైనట్టియు; శ్రీ స్వయంభూ=శుభంకరమై స్వయముగ పుట్టిన; మహాసుధా సిద్ధ లింగ=గొప్ప తెల్లని పవిత్ర లింగ మూర్తియైనట్టియు; భీమనాథేశ్వరునకున్=శ్రీ భీమేశ్వర స్వామికి; మనసు=చిత్తమును; అర్పింతున్=సమర్పించెను.

భావము :- విశ్వమంతట కలవాడు శాశ్వతమైనవాడు విశ్వమంతటికి నాయకుడు ప్రపంచ రూపమే తానైనవాడు మహేశ్వరుడు స్వయంభువు శుభంకరుడు మహా సుధా సిద్ధ లింగమూర్తి ఐన శ్రీ భీమనాథేశ్వర స్వామికి మనసును అంకితము చేయుచును.

తే॥ భీమ! భీమేశ్వరేశ్వర! భీమనాథ!
భవ! భవారణ్య పావక! భవ్య మూర్తి!
భర్గ! ఫాలాక్ష! భసితాంగ! ఫణివిభూష!
శిఖి శిఖా భాసమాన! భజింతు నిన్ను. 134

అర్థము :- భీమ=భయంకరమైనవాడా!; భీమేశ్వరేశ్వర=భీమేశ్వర స్వామీ!; భీమనాథ=భీమనాథుడా!; భవ=లోకముల పుట్టుకకు కారణమైనవాడా! భవ+అరణ్య+ పావక=ప్రాపంచిక విషయములనెడి అడవికి అగ్నివైనవాడా! భవ్యమూర్తి=సత్యమైన రూపము కలవాడా! భసిత+అంగ=విబూది పూసిన శరీరము కలవాడా! ఫణి విభూష=సర్పములే ఆభరణములుగ కలవాడా! శిఖిశిఖాభాసమాన=అగ్నిజ్వాలలవలె ప్రకాశము కలవాడా!; నిన్ను=నిన్ను; భజింతు=సేవింతును.

భావము :- భయంకరమైనవాడా! లోకముల పుట్టుకకు కారణమైనవాడా! ఐహిక విషయములనెడి అరణ్యమునకు అగ్నిదేవుడవైన వాడా! సత్యరూపము కలవాడా! పాపులను శిక్షించువాడా! ఫాలాక్షుడా! భసితాంగుడా! ఫణిభూషణా! అగ్ని జ్వాలల ప్రకాశము కలవాడా! మహాదేవ! శ్రీ భీమేశ్వర స్వామీ! నిన్ను సేవింతును.

తే॥ శర్వు సర్వేశ్వరేశ్వరు సర్వ వంద్యు
శర్వు సర్వప్రదాయకు సర్వధాత
శర్వు సర్వంసహా మహీచక్రధరుని
శర్వు వర్ణింతు దేవతా సార్వభౌము. 135

అర్థము :- సర్వేశ్వరేశ్వరు=అందరకు అధినాయకుడైనట్టి; సర్వవంద్యు=అందరిచే నమస్కరింప తగినట్టి; శర్వు=దుష్టులను శిక్షించువానిని; సర్వప్రదాయకు=అన్నిటిని ప్రసాదింప గలట్టియు; సర్వధాత=అన్నింటిని పుట్టించి పెంచి నశింపజేయ గలట్టియు; శర్వు=శివుని; సర్వంసహా=సమస్తమైన; మహీచక్ర+ధరుని=భూమండలమును ధరించినట్టి; శర్వు=శంకరుని; దేవతా సార్వభౌము=దేవతలలో రారాజైనట్టి; శర్వు=మహాదేవుని; వర్ణింతు= స్తుతింతును.

భావము :- సర్వేశ్వరుడు అందరిచేత నమస్కరింప తగినవాడు. పాపులను శిక్షించు వాడు. అన్నింటిని ప్రసాదింప గలవాడు. సృష్టి స్థితి లయములు చేయువాడు. సమస్తమును భరించువాడు. సమస్త భూమండలమును ధరించినవాడు. దేవతా సార్వభౌముడు శర్వుడునైన శ్రీ భీమేశ్వర స్వామిని స్మరించి స్తుతింతును.

విశేషము :- శర్వుఁడు. "ప్రళయే భూతాని శృణాతి హినస్తీతి శర్వః"
ప్రళయ కాలమున భూతములను హింసించువాడు శర్వుడు. గురుబాల ప్రబోధిక.
'ర్వ' అను వర్ణావృత్తి చేత వర్ణవిన్యాస వక్రత కలదు.

శా॥ వేదాతీతుని వేదవేద్యుని శివున్ వేదాంత వేద్యున్ భవున్
వేదాంతోపనిషద్రహస్యముఁ జతుర్వేదీ విహారాలయున్
వేదాంగాది పురాణముఖ్య విలసద్వేద్యాగమ ప్రక్రియా
వేది న్నిన్ను భజింతు నెమ్మనమునన్ విశ్వేశ భీమేశ్వరా! 136

అర్థము :- విశ్వేశ=విశ్వమంతటికి నాయకుడవైనవాడా! భీమేశ్వరా!=ఓ భీమేశ్వర స్వామీ! వేద+అతీతుని=వేదములను మించినట్టి; వేదవేద్యుని=వేదములచే తెలియబడునట్టి; శివున్=శుభమును కల్గించునట్టి; వేదాంత వేద్యున్=ఉపనిషత్తులచే తెలియబడునట్టి; భవున్=లోకముల పుట్టుకకు కారణభూతుడవైనట్టి; వేదాంత+ఉపనిషత్+రహస్యమును= వేదాంతములైన ఉపనిషత్తులలోని సారమైనట్టి; చతుః+వేదీ+విహార+ఆలయున్=నాలుగు వేదములే విహారప్రదేశముగ గలట్టి; వేదాంగ+ఆది= వేదాంగములు మొదలైన వానియందును; పురాణ ముఖ్య=పురాణములు మొదలైనవాని యందును; విలసత్=ప్రకాశించు; వేద్య=తెలియదగిన; ఆగమ ప్రక్రియా వేదిన్=శాస్త్ర ప్రమాణ విధానము నందు పండితుడవైనట్టి; నిన్ను=నిన్ను; నెఱ+మనమునన్=నిండుమనస్సుతో; భజింతు=సేవింతును.

భావము :- ఓ విశ్వేశ్వరా! శ్రీ భీమేశ్వరా! నీవు వేదముల కన్న మించిన వాడవు. వేదములచేత వేదాంతములచేత తెలియబడువాడవు. శుభంకరుడవు. లోకముల ఉత్పత్తికి మూలకారణమైనవాడవు. వేదాంతములైన ఉపనిషత్తులలోని సారమైనవాడవు. నాలుగు వేదము

లందును విహరించువాడవు. వేదాంగములందు పురాణములందును తెలియతగిన ఆగమ ప్రక్రియ యందు పండితుడవు. అట్టి నిన్ను నిండు మనస్సుతో సేవించెదను. స్తుతించెదను.

విశేషము :- 'వే' అను వర్ణావృత్తి వలన, ఈ పద్యమున కుంతకుడు చెప్పిన వర్ణ విన్యాస వక్రత కలదు.

కం॥ కామేశ్వరు నీశ్వరుని
గామిత ఫల దాన కల్పకముఁగామ రిపున్
గామాతీతుని దేవ
గ్రామణి నిను నాశ్రయింతు గౌరీరమణా! 137

అర్థము :- గౌరీ రమణా!=ఓ గౌరీపతీ! కామేశ్వరున్=పరమేశ్వరుడైనట్టి; ఈశ్వరున్= పరమాత్మమైనట్టి; కామితఫలదాన=కోరిన ఫలితములను ప్రసాదించుట యందు; కల్పకమున్= కల్పవృక్షమైనట్టి; కామరిపున్=మన్మథునకు శత్రువైనట్టి; కామ+అతీతుని=కోరికను అతిక్రమించిన వాడవైనట్టి; దేవ గ్రామణి=దేవతలందు శ్రేష్ఠుడవైనట్టి; నినున్=నిన్ను; ఆశ్రయింతు=ఆశ్రయించెదను.

భావము :- ఓ గౌరీనాథా! శ్రీ భీమేశ్వరా! నీవు కామేశ్వరుడవు. ఈశ్వరుడవు. కోరికలను ప్రసాదించుట యందు కల్పవృక్షమవు. మన్మథుని దహించినవాడవు. కోరిక లేనివాడవు. దేవతలలో అగ్రగణ్యుడవు. అట్టి నిన్ను ఆశ్రయించెదను.

విశేషము :- 'కా' వర్ణావృత్తి వలన ఇందు వర్ణ విన్యాస వక్రత కలదు.

కం॥ ఆనంద జ్యోతినిఁ బర
మానందానందమూర్తి నవ్యయునిఁద్రిలో
కానందామృతదాయి మ
హానందుని వృషభ వాహు నభివర్ణింతున్. 138

అర్థము :- ఆనంద జ్యోతినిన్=సుఖమునకు చైతన్యమైనట్టియు; పరమ+ఆనంద= బ్రహ్మానందము వలె; ఆనందమూర్తిన్=హర్ష స్వరూపుడైనట్టియు; అవ్యయున్=నాశనము లేనివాడవైనట్టి; త్రిలోక=మూడు లోకముల యొక్క; ఆనంద+ అమృత+దాయి=ఆనందమను అమృతమును ప్రసాదించునట్టి; మహానందుని=గొప్ప ఆనందము గలవానిని; వృషభ వాహున్=నంది వాహనముగ గలవాడవైన నిన్ను; అభివర్ణింతున్=మిక్కిలిగ స్తుతించెదను.

భావము :- ఓ భీమేశ్వర స్వామీ! నీవు ఆనందజ్యోతివి. బ్రహ్మానందమువలె హర్ష స్వరూపుడవు. అవ్యయుడవు. త్రిలోకానందమనెడి అమృతమును ప్రసాదింపగలవాడవు. మహానందుడవు. వృషభవాహనుడవు. అట్టి నిన్ను మిక్కిలిగ స్తుతించెదను.

సీ॥ ఓ మహాలింగంబ! యో మహాదేవుండ!
యో మహాత్ముఁడ! దేవ! యోమహేశ!
యో మహా సంపత్ప్రయోగ దీక్షా దక్ష!
యో మహా పాపేంధనౌఘ దహన!
నీ మూర్తి సంస్మృతి నీ నామ సంస్మృతి
నీ కథా శ్రవణంబు నిఖిల దురిత
యూథాంధకార సూర్యోదయం బఖిల క
ల్యాణ నికాయ సంప్రాప్తి హేతు

తే॥ వంబికా కుచ కుంభ ద్వయాంగ రాగ
పరిమళాసార వాసిత బాహు మధ్య!
దక్షిణాపథ కాశికాంతర్విహార!
గిరిశ! శ్రీ భీమనాథ! రక్షింపుమమ్ము. 139

అర్థము :- ఓ మహాలింగంబ=ఓ గొప్ప లింగరూపమా! ఓ మహాదేవుండ=ఓ గొప్ప దేవుడా; ఓ మహాత్ముఁడ=ఓ గొప్ప ఆత్మ కలవాడా! దేవ=ఓ దైవమా!; ఓ మహేశ=ఓ గొప్ప ఐశ్వర్యము కలవాడా!; ఓ=ఓయి; మహా సంపత్=గొప్ప సంపదలను; ప్రయోగ=ఆరంభమును; దీక్షాదక్ష=నియమము నందు సమర్థుడవైనవాడా! ఓ=ఓయి; మహాపాప+ఇంధన=గొప్ప పాపములనెడి కట్టెల సమూహమునకు; దహన=అగ్నియైన వాడా!

నీ మూర్తి సంస్మృతి=నీ రూపమును మిక్కిలిగ తలచుట; నీ నామ సంస్మృతి=నీ పేరులను స్మరించుట; నీ కథా శ్రవణంబు=నీ కథలను వినుటయు; నిఖిలదురిత=సమస్తమైన పాపముల యొక్క; యూథ=సమూహమనెడి; అంధకార=చీకటికి; సూర్య+ఉదయము= సూర్యుని ఉదయము; అఖిల కల్యాణ=సర్వ శుభముల యొక్క; నికాయ=సమూహములు; సంప్రాప్తి హేతువు=సమకూరుటకు కారణమైనట్టిది;

అంబికాకుచ=పార్వతీదేవి యొక్క స్తనములనెడి; కుంభద్వయ=కుండల జంటపై గల; అంగరాగ పరిమళ=లేపన ద్రవ్యపు సువాసన యొక్క; ఆసార వాసిత=వ్యాప్తితో గుబాళించుచున్న; బాహుమధ్య=వక్షస్థలము కలవాడా! దక్షిణాపథ కాశికా=దక్షిణ కాశియైన దక్షారామము నందలి; అంతర్+విహార=మధ్యభాగము నందు విహరించువాడా! గిరిశ=కైలాస వాసా! శ్రీ భీమనాథ=శ్రీ భీమేశ్వర స్వామీ! మమ్ము రక్షించు=మమ్ములను కాపాడుము.

భావము :- ఓ మహాలింగ! మహాదేవ! మహాత్మ! దేవ! దేవాది దేవ! అష్టైశ్వర్యముల వినియోగము నందు నియమ శీలుడవైన సమర్థుడవు. పాపములనెడి కట్టెల సమూహమును

కాల్చివేయగల అగ్నివి. నీ రూపమును తలచుట నీ నామములను స్మరించుట నిను గూర్చిన కథలను వినుటలు సకల పాపములనెడి చీకటికి సూర్యోదయము. సర్వ శుభములను కలుగజేయు వాడవు, అంబికాదేవి స్తన ద్వయముపై గల అంగరాగ పరిమళము సోకి వ్యాపించి గుబాళించుచున్న వక్షస్థలము కలవాడవు. దక్షిణ కాశియైన దక్షారామ మధ్యమున విహరించువాడవు. అట్టి కైలాసవాసా! శ్రీ భీమేశ్వరా! మమ్ము రక్షించుము.

**వ॥ అని సప్తర్షులు సంస్తుతించిరి. తదనంతరంబ యరుంధతీదేవియు హంస వాహన పశు సఖి చండికా పరిచారికా సముదయంబును ననేక ప్రకారంబులఁ బ్రశంసించి యథాశక్తిం బూజించిరి. 140**

అర్థము :- అని=అని పై విధముగ; సప్తఋషులు=ఏడుగురు మహామునులును; సంస్తుతించిరి=చక్కగ స్తోత్రము చేసిరి. తత్+అనంతరంబ=ఆ తరువాత; అరుంధతీ దేవియు=వసిష్ఠ మహర్షికి భార్యయైన అరుంధతియు; హంసవాహన=హంసను వాహనముగ గల సరస్వతీదేవియు; పశు=ప్రమథ గణములును; సఖి=స్నేహితులు; చండికా=పార్వతీదేవి యొక్క; పరిచారికా=సేవకురాండ్ర యొక్క; సముదయంబును=సమూహమును; అనేక ప్రకారంబుల=పలు విధములుగ; ప్రశంసించి=పొగడి; యథాశక్తి=చేతనైనంత వరకు; పూజించిరి=పూజచేసిరి.

భావము :- అని సప్తర్షులు శ్రీ భీమేశ్వర స్వామిని మనసార స్తుతించి సేవించిరి. ఆ తరువాత ఆరంజ్యోతియైన అరుంధతి, సరస్వతీ దేవియు, ప్రమథ గణములు స్నేహితులు పార్వతీదేవి యొక్క పరిచారికలును పలువిధముల స్తుతించి యథాశక్తి పూజించిరి.

**క॥ ఈ సప్తముని స్తోత్రము**
**వ్రాసినఁ జదివినను వినిన వర్ణించినఁ గై**
**లాసపతి దక్ష వాటి ని**
**వాసుఁడు జనులకు నభీష్ట వరము లొసంగున్. 141**

అర్థము :- ఈ సప్తముని స్తోత్రము=సప్తర్షులు చేసిన ఈ భీమేశ్వరుని గూర్చిన స్తుతి పాఠమును; వ్రాసినన్=వ్రాసినను; చదివినన్=చదివినను; వినిన=ఒకరు చదువుచుండగా వినినను; వర్ణించినన్=స్తోత్రము చేసినను; జనులకు=జీవులకు; కైలాసపతి= కైలాసమునకు నాయకుడును; దక్షవాటి నివాసుఁడు=దక్షారామ నివాసియైన శ్రీ భీమేశ్వర స్వామి; అభీష్టవరంబులు=కోరిన కోరికలను; ఒసంగున్=ప్రసాదించును.

భావము :- వసిష్ఠాది సప్తర్షులు చేసిన ఈ భీమేశ్వర స్తోత్రమును వ్రాసిన, చదివిన, వినిన, స్తోత్రము చేసిన జీవులకాభీమేశ్వర స్వామి కోరిన వరములను ప్రసాదించును.

వ॥ అనిన విని మంకణుండు మునీంద్రా! సదాశివ భక్తి మాహాత్మ్యం బింకను నాకెఱింగింపవేయని యడుగుటయు వసిష్ఠ మునీంద్రుఁ డిట్లనియె. 142

అర్థము :- అనిన విని=అని చెప్పగా వినినవాడై; మంకణుండు=మంకణముని; మునీంద్రా!=మునులలో శ్రేష్ఠుడవైన ఓ వసిష్ఠ మహర్షీ; సదాశివ=శంకరుని యందలి; భక్తి మాహాత్మ్యంబు=భక్తి యొక్క గొప్పదనమును; ఇంకను=ఇంకను; నాకు=నాకు; ఎఱింగింపవే= తెల్పుము; అని=అని, అడుగుటయు=అడుగగా; వసిష్ఠ మునీంద్రుఁడు=వసిష్ఠ మహర్షి; ఇట్లు+అనియె=ఈ విధముగ చెప్పెను.

భావము :- అని వసిష్ఠ మహర్షి చెప్పగా వినిన మంకణముని - ఓ మహర్షీ సదాశివుని భక్తి యందలి మహత్త్వమును గూర్చి ఇంకను చెప్పుమని ప్రార్థించెను. అపుడా వసిష్ఠ మహర్షి మంకణమునితో ఈ విధముగ చెప్పెను.

తే॥ కల్పవృక్షం బదేటికిఁ గామధేను
సముదయంబేల? యిష్టార్థ సంపదలకు
నిశ్చయంబుగ మనసులో నిల్చెనేని
చాలదా మర్త్య్య రక్షింప శంభు భక్తి. 143

అర్థము :- ఇష్టార్థ సంపదలకు=కోరుకున్న ఐశ్వర్యములకు; కల్ప వృక్షంబు+అది=ఆ కల్ప వృక్షము; ఏటికి=ఎందులకు!; కామధేను సముదయంబు=కామధేనువుల సమూహము; ఏల=ఎందులకు!; మర్త్య్య=మానవుని; రక్షింప=కాపాడుటకై; నిశ్చయంబుగ=స్థిరముగ; శంభుభక్తి=శంకరుని మీది భక్తి; మనసులో=మనసు నందు; నిల్చెన్+ఏని=నిలచినచో; చాలదా=సరిపోదా! సరిపోవును.

భావము :- కోరిన కోరికలు తీరుటకు కల్పవృక్షములు కామధేనువులును అక్కఱ లేదు. మరణశీలుడైన జీవికి శివుని యెడల స్థిరమైన భక్తి మనసున నిల్పిన చాలును.

తే॥ శంభు పద భక్తులకు వినాశంబు లేదు
కదియ వీశాను భక్తులఁ గల్మషములు
నాది యందుఁ బ్రతిజ్ఞగా నానతిచ్చెఁ
జంద్రచూడుండు నిజ భక్త జనముఁ గూర్చి. 144

అర్థము :- శంభుపద=శంకరుని పాదముల యందు; భక్తులకు=భక్తి కలిగిన వారికి; వినాశంబు=చేటు; లేదు=లేదు. ఈశాను భక్తులన్=శంకరుని భక్తులను;

కల్మషములు=పాపములు; కదియవు=అంటవు. చంద్రచూడుఁడు=చంద్రశేఖరుడు; నిజ=తన యొక్క; భక్తజనముఁ గూర్చి=భక్తుల సమూహమును గూర్చి; ఆదియందున్=మొదటనే; ప్రతిజ్ఞగాన్=నియమముగా; అనతిచ్చెన్=సెలవిచ్చెను.

భావము :- శంకరుని పదములను సేవించు భక్తులకు చేటు లేదు. పాపము లంటవు. శంకరుడు కృతయుగముననే తన భక్తులను గూర్చి నిర్దేశించి సెలవిచ్చినాడు.

సీ॥ భోగీంద్ర భూషణు భూతిదిగ్ధాంగుని
  నాభీల శూలాయుధాగ్ర హస్తుఁ
గాకోల విష నీలకంధరాభాగుని
  గజ చర్మ పరిధాన కటి విభాగుఁ
దాండవాడంబరోద్దండ దివ్యాకారు
  నజ విష్ణు విబుధాధిపాభివంద్యు
గంగా తరంగ సంకలితోత్తమాంగునిఁ
  త్రైలోక్య రక్షా ప్రదాన దక్షు

తే॥ నిటు సాకారునొండె నొండే విభూతి
పతి నిరాకారుఁగాఁ జూచి బహు విధములఁ
బూజ సేయంగ నేర్చిన పుణ్యమతులు
వారు శివ భక్తు లందు రివ్వసుధలోన. 145

అర్థము :- భోగీంద్ర భూషణు=సర్పరాజులు ఆభరణములుగ గల వానిని; భూతిదిగ్ధ=అంగునిన్=విబూది పూయబడిన శరీరము కలవానిని; అభీల=భయంకరమైన; శూలాయుధ=శూలమనెడి ఆయుధమును; అగ్రహస్తున్=చేతిచివర కలవానిని;

కాకోలవిష=కాకోలమను విషము చేత; నీలకంధరా=నల్లనైన గొంతు యొక్క భాగుని=భాగము కలవానిని; గజచర్మ=ఏనుగు తోలనెడి; పరిధాన=వస్త్రము; కటి విభాగున్=నడుము భాగమున కలవానిని;

తాండవ=తాండవ నృత్యము యొక్క; ఆడంబర=దర్పము చేత; ఉద్దండ దివ్యాకారున్=మిక్కుటమై దివ్యమైన రూపము కలవానిని; అజ=బ్రహ్మ చేత; విష్ణు=విష్ణువు చేత; విబుధ+అధిప=దేవేంద్రుని చేతను; అభివంద్యు=నమస్కరింప తగినవానిని;

గంగాతరంగ=ఆకాశ గంగ యొక్క అలలతో; సంకలిత=కూర్చబడిన; ఉత్తమ+అంగునిన్=తలగలవానిని; త్రైలోక్య=ముల్లోకముల మొత్తమునకు; రక్షా ప్రదాన=రక్షణనిచ్చుట యందు; దక్షున్=సమర్థుడైన వానిని;

ఈశున్=శివుని; సాకారున్+ఒండె=సాకారునిగ గాని; ఒండే=మరొక విధమైన; విభూతిపతిన్=శంకరుని; నిరాకారుఁగాన్+చూచి=ఆకారము లేనివానిగ చూచి గాని; బహు విధములన్=పలు విధములుగ; పూజ చేయంగ=పూజించుట; నేర్చిన=తెలిసిన; పుణ్యమతులు=సుకృతాత్ములు; వారు=అట్టివారు; ఈ+వసుధలోన=ఈ భూమిపై; శివభక్తులు=శివుని భక్తులు; అందురు=అనబడుదురు.

భావము :- నాగభూషణుడు విభూతిధరుడు త్రిశూలపాణి నీలకంఠుడు గజచర్మాంబరధరుడు గంగాధరుడు తాండవాడంబరుడు దివ్యరూపుడు బ్రహ్మ విష్ణు మహేంద్రాదుల చేత నమస్కరింప తగినవాడు ముల్లోకములను రక్షింప సమర్థుడు నైన శంకరుని సాకారముగ గాని నికారారముగ గాని ధ్యానించి దర్శించి మనసా పలు విధముల పూజించు సుకృతాత్ములే ఈ భూమిపై శివభక్తులు.

కం॥ శివ ధనము ముచ్చిలించిన
శివ ధనమన్యాయ వృత్తిఁ జెడిపోవంగాఁ
దవులక యుపేక్ష చేసిన
శివభక్తి ద్రోహమండ్రు శివభక్తి విదుల్. 146

అర్థము :- శివధనము=శంకరుని సొమ్మును; ముచ్చిలించిన=దొంగిలించినను; శివధనము=ఆ దేవుని సొమ్ము; అన్యాయ వృత్తిన్=న్యాయము కాని మార్గమున; చెడిపోవంగాన్=పాడైపోవుచుండగా; తవులక=ఆసక్తిలేక; ఉపేక్ష చేసిన=అశ్రద్ధ చేసినను; శివభక్తి ద్రోహము=శివభక్తికి కీడు అని; శివభక్తి విదుల్=శివభక్తిని తెలిసిన వారు; అండ్రు=అందురు.

భావము :- శివుని సొమ్మును దొంగిలించినను ఆ దేవుని సొమ్ము అన్యాయముగ పాడైపోవుచుండ నిరాసక్తులై నిర్లక్ష్యము చేసినను శివ భక్తికి కీడు అని శివభక్తిని తెలిసిన వారందురు.

తే॥ శివునికై భిక్ష చేసి యార్జించినట్టి
ద్రవ్యమావంత యేనియుఁ దాస్పృశింప
కభవునకు నెవ్వఁడొనరించు నర్పణంబు
వాఁడు శివభక్త ముఖ్యుండు వసుధలోన. 147

అర్థము :- శివునికై=శంకరుని కొఱకై; భిక్షచేసి=బిచ్చమెత్తి; ఆర్జించినట్టి=సంపాదించి నటువంటి; ద్రవ్యము=సొమ్మును; తాన్=తాను; ఆవంత యేనియున్=ఆవగింజంతయినను; స్పృశింపక=అంటుకొనక; ఎవ్వఁడు=ఎవడు; అభవునకున్=శివునకు; అర్పణంబు=ఇచ్చుట; ఒనరించున్=చేయునో; వాఁడు=అతడు; వసుధలోనన్=భూమిపై; శివభక్తముఖ్యుండు= శివభక్తులలో శ్రేష్ఠమైనవాడు.

భావము :- శివుని కొఱకు బిచ్చమెత్తి సంపాదించిన సొమ్మును తాను ఆవగింజం తయినను అంటుకొనక ఎవడు శంకరునకే సమర్పించునో అతడే భూమిమీద శివ భక్తాగ్రగణ్యుడు.

కం॥ మాటలు వేయును నేటికి
హాటక ధాన్యాది శివ పదార్థముల యెడన్
జేటున కోర్వమి తుదిఁబరి
పాటించిన శంభు భక్తి పథము మునీంద్రా! 148

అర్థము :- మునీంద్రా!=మునులలో శ్రేష్ఠుడవైన ఓ మంకణమునీ!; మాటలు= పలుకులు; వేయునున్+ఏటికి=వేయి ఎందులకు?; హాటక=బంగారము; ధాన్య+ఆది= ధాన్యములు మొదలైన; శివ పదార్థముల యెడన్=శివునకు సంబంధించిన ద్రవ్యముల పట్ల; చేటునకు=అపకారమునకు; ఓర్వమి=సహింపకుండుటను; తుదిన్=చివరివరకు; పరిపాటించిన=లక్ష్యముగ ఆచరించినచో; శంభుభక్తి పథము=శివభక్తి మార్గము.

భావము :- ఓ మంకణమునీ! వేయి మాటలేల! బంగారము ధాన్యము మొదలయిన శివధనము దుర్వినియోగము కాకుండ చూచుటయే లక్ష్యముగా చివర వరకు ఆచరించుటయే శివభక్తి మార్గము.

సీ॥ మహనీయ సంప్రీతి మద్భక్త జనముల
నాదరించుచు నుండు నతఁడొకండు
ఫలములుఁ బక్వాన్నములు మాకు నర్పింప
కనుభవింపక యుండు నతఁడొకండు
పంచాక్షరీ మంత్ర పాఠంబు నిత్యంబు
నాచరించుచునుండు నతఁడొకండు
ననుఁ బ్రస్తుతించు నానా పురాణంబులు
సతతమావర్తించు నతఁడొకండు

తే॥ శిలలఁ గాష్ఠంబులను మృత్తికలను నిసుక
లింగముల లెస్సఁగాఁగ గఁల్పించి భక్తి
నర్చనము సేయు నతఁడొకండనుచుఁజెప్పు
శివుఁడు భక్త విమర్శన చేయునపుడు. 149

అర్థము :- శివుఁడు=శంకరుడు; భక్త విమర్శన=భక్తులను సమీక్షించుట; చేయు నపుడు=చేయు సమయమున; మహనీయ సంప్రీతిన్=గొప్ప అనురాగముతో; మత్=నా యొక్క; భక్త జనములన్=భక్తుల సమూహమును; ఆదరించుచునుండున్=మన్నన చేయు చుండు; అతఁడు+ఒకండు=అతడొకడును;

ఫలములు=పండ్లు; పక్వ+అన్నములు=వండిన అన్నములను; మాకున్+ అర్పింపక=మాకు సమర్పింపక ముందే; అనుభవింపక యుండున్=ఆరగింపకుండు; అతఁడు+ఒకండు=అతడొకడును;

పంచాక్షరీ మంత్ర=పంచాక్షరి మంత్రము యొక్క; పాఠంబు=అధ్యయనమును; నిత్యంబున్=ప్రతి దినము; ఆచరించుచు నుండున్=చేయుచుండు; అతఁడు+ఒకండు= అతడొకడును;

ననున్=నన్ను; ప్రస్తుతించు=మిక్కిలిగ కొనియాడునట్టి; నానాపురాణంబులు= అనేకములైన పురాణములను; సతతము=ఎల్లపుడును; ఆవర్తించున్=వల్లించు; అతఁడు+ఒకండు=అతడొకడును;

శిలలన్=రాళ్ళయందును; కాష్ఠంబులను=కొయ్యలందును; మృత్తికలను= మన్ను లందును; ఇసుక=ఇసుక యందును; లింగముల=శివలింగములను; లెస్సఁగాఁగన్= చక్కనగునట్లుగా; కల్పించి=చేసి; భక్తిన్=భక్తితో; అర్చనము చేయున్=పూజించును; అతఁడొకండు=అతడొకడును; అనుచు+చెప్పున్=అని చెప్పెను.

భావము :- శివుడు భక్త జనములను సమీక్ష చేయునపుడు - గొప్ప అనురాగముతో శివభక్తుల నాదరించువాడు; పండ్లు పిండివంటలు అన్నములు తమకు నైవేద్యము చేసిన తర్వాతనే ఆరగించువాడు; పంచాక్షరీ మంత్రమును నిత్యము జపించుచుండు వాడు; శంకరుని స్తుతించి కీర్తించు నానా పురాణములను నిత్యము వల్లించువాడు; రాళ్ళతోను కొయ్యలతోను మట్టితోను ఇసుకతోను అందముగ శివలింగములను చేసి భక్తితో పూజించువాడును తనకు ఇష్టులైన భక్తులని చెప్పెను.

విశేషము :- అనేక పదార్థములతో శివలింగ నిర్మాణము. చూ-భీమ. 3-102.

వ॥ ఆదియునుంగాక రాగద్వేష ఝషసంకులంబును, గామ క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్య మహాగ్రాహకులంబును, బుణ్య పాప తోయ మహాప్రవాహంబును నైన యీ సంసార మహాంభోరాశి యందుఁ గర్మచోదితంబులైన జంతువులు మునుంగుచుఁ దేలుచుం గొంత తడవు సుఖంబును కొంత తడవు దుఃఖంబును ననుభవించుచు నుండును. కలియుగంబున శివభక్తి యుత్పన్నంబై యుండు. 150

అర్థము :- ఆదియునుం గాక=అదియే గాక; రాగద్వేష=ప్రేమ, ద్వేషము అనెడి; ఝష=చేపలతో; సంకులంబును=కూడుకొన్నదియు; కామ=కోరిక; క్రోధ=కోపము; లోభ=అత్యాశ, మోహ=మూర్ఖత; మద=గర్వము; మాత్సర్యము=ఓర్వలేనితనము-అనెడి; మహాగ్రాహ= గొప్ప మొసళ్ళచేత; ఆకులంబును=వ్యాపించినదియు; పుణ్యపాప=పుణ్యములు పాపములు అనెడి; తోయ=జలము గల; మహా=గొప్ప; అంభోరాశి యందున్=సముద్రము నందు; కర్మచోదితంబులైన=ప్రారబ్ధ కర్మచేత పురికొల్పబడిన; జంతువులు=జీవులు; మునుంగుచున్=మునుగుచు; తేలుచున్= తేలుచు; కొంతతడవు=కొంతసేపు; సుఖంబును=సుఖమును; కొంతతడవు=కొంతసేపు; దుఃఖంబునున్=బాధను; అనుభవించుచున్+ఉండును=అనుభవించుచుండును. కలియుగంబున=కలియుగమున; శివభక్తి=శివునిపై భక్తి; ఉత్పన్నంబై+ఉండు=పుట్టి ప్రవర్తించును.

భావము :- అంతేకాదు. రాగద్వేషములనెడి చేపలతోను కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములను క్రూరమైన మొసళ్ళతో కూడుకొని వ్యాపించి యున్నదియు, పుణ్య పాపములనెడి గొప్ప నీటి ప్రవాహముతో నున్న సంసారమనెడి ఈ మహా సముద్రము నందు మునుగుచు తేలుచు కొంతసేపు సుఖము కొంతసేపు దుఃఖమును అనుభవించుచు ప్రారబ్ధ కర్మలచే ప్రేరితులైన జీవులు కొట్టుమిట్టాడు చుందురు. కలియుగము నందును శివభక్తి పుట్టి ప్రవర్తించును.

అలంకారము - రూపకము.

తే॥ అతి విశుద్ధాత్మ! చతురంఘ్రి గృతయుగమునఁ
త్రేతఁ బాదత్రయమున వర్తించు చుండి
ద్వాపరంబున యందుఁ బాదముల రెంట
వెలయు శివభక్తి యొక కాలఁ గలియుగమున. 151

అర్థము :- అతి విశుద్ధ+ఆత్మ=మిక్కిలి పవిత్రమైన హృదయము గల ఓ మంకణ మునీ! శివభక్తి=శివునియందు భక్తి; కృతయుగమునన్=కృతయుగము నందు; చతుః+అంఘ్రిన్=నాలుగు పాదములతోను; త్రేతన్=త్రేతాయుగము నందు; పాదత్రయమున=

పాదములు మూడింటితో; వర్తించుచుండి=ప్రవర్తించుచు; ద్వాపరంబున యందున్=ద్వాపర యుగమున; పాదములు రెంట=రెండు పాదములతోను; కలియుగమున=కలియుగము నందు; ఒక కాలన్=ఒంటి పాదముతోను; వెలయున్=ఒప్పుచుండును.

భావము :- పవిత్రాత్ముడవైన ఓ మంకణమునీ! శివభక్తి కృతయుగమున నాలుగు పాదములతోను త్రేతాయుగమున మూడు పాదములతోను ప్రవర్తించుచుండి ద్వాపర యుగమున రెండు పాదములతోను కలియుగమున ఒంటిపాదముతోను ఒప్పుచుండును.

తే॥ కలియుగంబున ధర్మంబు కఱవు గాన
నందు ధర్మంబుఁ జేసిన యతఁడు ఘనుఁడు
నిండు వేసవి మరుభూమి నిర్మలముగఁ
బేర్మి సలిలాన్న సత్రంబుఁ బెట్టినట్లు. 152

అర్థము :- కలియుగంబున=కలియుగమునందు; ధర్మంబు=ధర్మము; కఱవు గానన్=దొరకనిది కనుక; అందు=ఆకలియుగమునందు; ధర్మంబున్=ధర్మమును; చేసిన+అతఁడు=ఆచరించినవాడు; నిండు వేసవిన్=పూర్ణమైన ఎండ కాలమున; మరుభూమిన్=ఎడారి ప్రదేశము నందు; నిర్మలముగన్=పవిత్రముగ; పేర్మిన్=ఆసక్తితో; సలిల=నీటిని; అన్నసత్రంబున్=అన్నమును పెట్టు సత్రమును; పెట్టినట్లు=ఏర్పరచినట్లుగ; ఘనుఁడు=గొప్పవాడు.

భావము :- కలియుగమున ధర్మము క్షీణదశలో నుండును. అట్టి కలియుగమున ధర్మము నాచరించినవాడు - పవిత్ర హృదయముతోను ఆసక్తితోను నడి ఎండకాలమున ఎడారి ప్రదేశము లందు చలివేంద్రములను అన్నసత్రములను నెలకొల్పిన వానివలె గొప్పవాడు.

విశేషము :- అలంకారము - ఉపమ.

వ॥ అని మఱియు నొక ప్రశ్నంబు చెప్పెదఁ బూర్వకాలంబు. 153

అర్థము :- అని=అని చెప్పి; మఱియున్=ఇంకను; ఒక=ఒక; ప్రశ్నంబు=చర్చా విషయమును; చెప్పెదన్=చెప్పెదను, పూర్వకాలంబున=పూర్వకాలము నందు

భావము :- అని వసిష్ఠుడు మంకణమునికి చెప్పి ఇంకను ఒక విషయమును చెప్పెదను. పూర్వ కాలమున...అని మొదలిడెను.

తే॥ అభవు నొకనాడు ప్రార్థించి యడిగె గౌరి
కలియుగంబున శివభక్తి గ్రాఁగిపోవు
నఖిలలోక హితంబుగా నానతిమ్ము
భక్తి విజ్ఞాన యోగంబు ఫాలనయన! 154

అర్థము :- ఒకనాఁడు=ఒక రోజు; గౌరి=పార్వతీదేవి; అభవున్=శంకరుని; ప్రార్థించి=నమస్కరించి; అడిగె=అడిగినది; ఫాలనయన=నుదుటి కన్ను గల ఓ ముక్కంటీ! కలియుగంబున=కలియుగము నందు, శివ భక్తి=శివుని యందలి భక్తి; క్రాఁగిపోవున్=నశించిపోవును; అఖిల లోక=అన్ని లోకముల యొక్క; హితంబుగాన్=మేలు కొఱకు; భక్తి విజ్ఞాన యోగంబు=భక్తిని గూర్చిన విశేష జ్ఞానముతో కూడిన ధ్యానము (ఔషధము)ను; అనతిమ్ము=సెలవిండు.

భావము :- ఒకనాడు పార్వతీదేవి శంకరునకు నమస్కరించి ఓ ముక్కంటీ! కలియుగమున శివభక్తి నశించి పోవును. సర్వలోకముల మేలు కొఱకు భక్తి యొక్క విజ్ఞాన యోగమును సెలవిండని అడిగినది.

వ॥ అని భవాని విన్నవించిన మహేశ్వరుండు. 155

అర్థము :- అని=అని; భవాని=పార్వతీదేవి; విన్నవించిన=వినయముగ అడిగినపుడు; మహేశ్వరుండు=మహాదేవుడైన శంకరుడు.

భావము :- అని పార్వతీదేవి అర్థింపగా మహేశ్వరు డామెకు ఇట్లు చెప్పెను.

## గౌరికి మహేశ్వరుండు భక్తి విజ్ఞాన యోగంబుఁ జెప్పుట

తే॥ అడుగ వలసిన యర్థంబ యడిగి తీవు
క్రాఁగి యుండెడు శివభక్తి కలియుగమునఁ
బాపకర్ముఁడ కాని యెప్పాట లేఁడు
పుణ్యకర్ముఁడు వికసితాంభోజనయన! 156

అర్థము :- వికసిత+అంభోజనయన=వికసించిన పద్మముల వంటి కన్నులు కలదానా! ఓ పార్వతీ! అడుగవలసిన=అడుగవలసియున్న; అర్థంబ=విషయమునే; ఈవు=నీవు; అడిగితి=అడిగితివి; కలియుగమునన్=కలియుగము నందు; శివభక్తి=శివుని యందు భక్తి; క్రాఁగి+ఉండెడు=నశించి యుండును; పాపకర్ముఁడ కాని=పాపకర్మములు చేయు వాడే కాని; పుణ్య కర్ముఁడు=పవిత్రమైన పనులు చేయువాడు; ఏ+పాటన్=ఎపుడైనను; లేఁడు=ఉండడు.

భావము :- ఓ పార్వతీ! అడుగ వలసియున్న విషయమునే అడిగితివి. కలియుగమున శివునిపై భక్తిభావము నశించి యుండును. ఈ యుగమున పాపకర్ముడే గాని పుణ్యకర్ముడు కన్పింపడు.

సీ॥ ఎప్పుడు కలియుగం బేతెంచుఁ గ్రమ వృత్తి
బాపంబు లన్నియుఁ బ్రబలు చుండుఁ
బాపంబు లొక భంగిఁ బ్రక్షయం బొందిన
నా మీఁద దృఢ భక్తి నాఁటు కొనును
నా మీఁద దృఢ భక్తి నాఁటు కొన్నప్పుడు
ధర్మంబు వర్తించుఁ దరతరంబు
ధర్మంబు వృద్ధిఁ బొందఁగఁ జిత్తమునఁ బట్టు
లింగార్చనా విధి మంగళంబు
తే॥ అంతట విభూతి నలఁదంగ నాసపుట్టు
నంతమీఁదట గల్గు రుద్రాక్ష కలన
బాశుపతమట మీఁదను బదిలపడును
ముక్తిలతికకు నది గదా మూల మరయ. 157

అర్థము :- ఎప్పుడు=ఎపుడు; కలియుగంబు=కలియుగము; ఏతెంచున్=వచ్చునో; పాపంబులు+అన్నియున్=అన్ని పాపములును; క్రమవృత్తిన్=వరుసగా; ప్రబలుచుండున్=పెరుగుచుండును;

పాపంబులు=పాతకములు, ఒక భంగి=ఒకే విధముగ; ప్రక్షయంబు=వినాశమును; ఒందినన్=పొందినపుడు; నామీఁద=నాపై; దృఢభక్తి=స్థిరమైన భక్తి; నాటుకొనును=పాదుకొనును;

నామీఁద=నాపై; దృఢభక్తి=స్థిరమైన భక్తి; నాటుకొన్నప్పుడు=కల్గినపుడు; ధర్మంబు=ధర్మము; తరతరంబ=క్రమక్రమముగా; వర్తించున్=శోభించును;

ధర్మంబు=ధర్మము; వృద్ధిన్+పొందఁగన్=అభివృద్ధి పొందినపుడు; లింగార్చనా విధి=లింగమును పూజ చేయు విధానము అనెడి; మంగళంబు=శుభము; చిత్తమునన్=మనసునకు; పట్టు=కలుగును;

అంతట=ఆ మీదట; విబూతిని=విభూదిని; అలదంగన్=పూసికొనుటకు; ఆస పుట్టున్=అపేక్ష కలుగును. అంతమీఁదట=ఆ తరువాత; రుద్రాక్ష కలన=రుద్రాక్షలు ధరించుట; కల్గున్=తటస్థించును; అటమీఁదను=ఆ పిమ్మట; పాశుపతము=శైవమతము; పదిలపడును=స్థిరపడును; ముక్తిలతికకు=మోక్షమనెడి చిన్నతీగకు; మూల=ప్రధానమైనది; అరయ=విచారింపగా; అదిగదా!=అదేకదా!

భావము :- కలియుగము ప్రవేశించుట తోడనే పాపములన్నియు క్రమముగ వృద్ధి పొందును. పాపములన్నియు నాశనమైన పిదప జీవుల యొక్క హృదయము లందు నాపై భక్తి భావము నాటుకొనును. ఆ పిమ్మట ధర్మము క్రమముగ వృద్ధి చెందును. ఆ తరువాత శుభంకరమైన లింగార్చనా విధానము మనసునకు పట్టును. అపుడు జీవికి విబూది పూసికొనుటకు అపేక్ష కల్గును. రుద్రాక్షలను ధరించుటనపేక్షించును. ఆ మీద పాశుపతదీక్ష స్థిరపడును. మోక్షమనెడి తీగకు మూలమైనదీ భక్తియే కదా!

వ॥ మఱియు నొక్కటి చెప్పెద. సదాచార నిరతులైన బ్రహ్మ క్షత్రియ వైశ్యులును త్రైవర్ణ్య శుశ్రూషాపరులై సత్యవాదులైన శూద్రులును పతివ్రతలైన పుణ్య స్త్రీలును నాత్మ దర్శనంబునకు నధికారులు. విశేషించి. 158

అర్థము :- మఱియున్=ఇంకను; ఒక్కటి=ఒక విషయమును; చెప్పెద=చెప్పెదను; సదాచార=మంచి నడవడి యందు; నిరతులైన=మిక్కిలి ఆసక్తి గల వారైన; బ్రహ్మ= బ్రాహ్మణులు; క్షత్రియ=క్షత్రియులు; వైశ్యులును=కోమటులును; త్రైవర్ణ్య=ఈ మూడు వర్ణముల వారికి; శుశ్రూషాపరులైన; సేవించుట యందు ఆసక్తి కలిగి; సత్యవాదులైన=నిజమును పలుకువారైన; శూద్రులును=శూద్రులును; పతివ్రతలైన=పతివ్రతలైనట్టి; పుణ్య స్త్రీలునున్= పవిత్ర కాంతలును; ఆత్మ దర్శనంబునకున్=పరమాత్మ జ్ఞానమునకు; అధికారులు=అర్హులు, విశేషించి=ఇంకను.

భావము :- ఇంకను ఒక విషయము చెప్పెదను. సదాచారములను పాటించు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులును; ఈ మూడు వర్ణములవారిని సేవించుట యందాసక్తి కల్గి సత్యవాదులైన శూద్రులును. పతివ్రతలైన పుణ్య స్త్రీలును పరమాత్మ దర్శనమునకు యోగ్యులు. ఇంకను.

తే॥ రాగ వైషమ్యములు లేక ప్రజ్ఞ గలిగి
మనములోన విరక్తి యెవ్వనికిఁ గలుగు
వాఁడె యధికారి బ్రహ్మ కైవల్యమునకు
వీఁడు వాఁడని కులశుద్ధి వెదుక వలదు. 159

అర్థము :- రాగ వైషమ్యములు=ప్రేమ ద్వేషములు; లేక=లేకుండగ; ప్రజ్ఞ గలిగి=తెలివి కలిగి; మనములోన=మనసులో; విరక్తి=వైరాగ్యము; ఎవ్వనికిన్=ఎవనికి; కలుగు=కలుగునో; వాఁడె=అతడే; బ్రహ్మ కైవల్యమునకు=జ్ఞాన స్వరూపమైన మోక్షమునకు; అధికారి=అర్హుడు; వీఁడు వాఁడు=వీడు వాడు అని; కులశుద్ధి=కులము నందలి పవిత్రతను; వెదుకవలదు=వెదుకనక్కఱలేదు.

భావము :- రాగ ద్వేషములు విడిచిపెట్టి తెలివిడి కలిగి మానసికముగ విరాగి ఐన వాడే జ్ఞానరూపమైన మోక్షమును పొందుటకు అర్హుడు. వీడు వాడని కులభేదము లేదు.

సీ॥ బహు జన్మ సంశుద్ధి భాగ్య సంపదఁ గాని
యోగ విద్యా శక్తి నూన దాత్మ
యోగ సామగ్రికి నుచిత సాధనములు
వాయు మార్గ విశుద్ధ వర్తనములు
నాడి పరంపరాక్రోడ వాయు జయంబు
బలము చేత స్థితి భాగ్యమునకుఁ
జిత్తంబు తన యాజ్ఞ చేసి వర్తించెనే
నిట్టట్టనఁగఁజాల వింద్రియములు

తే॥ యమ నియమములు నాసన ప్రాణ నియతి
ధ్యానమును ధారణంబుఁ బ్రత్యాహృతంబు
నన సమాధియుఁ నాఁగ నష్టాంగ కలన
బ్రహ్మయోగంబు విలసిల్లుఁ బద్మనయన. 160

అర్థము :- పద్మనయన=కమలముల వంటి కన్నులు కలదానా! ఓ పార్వతీ! బహు జన్మ=అనేక జన్మముల యొక్క; సంశుద్ధి భాగ్యసంపదన్=పవిత్రమనెడు భాగ్యము యొక్క ఐశ్వర్యము వలన; కాని=కాని; ఆత్మ=మనసు; యోగ విద్యాసక్తిన్=యోగవిద్య యందు అసక్తిని; ఊనదు=పొందదు;

యోగ సామగ్రికి=యోగము యొక్క సమగ్రతకు; ఉచిత సాధనములు=తగిన ఉపాయ ములు; వాయుమార్గ=వాయువులు ప్రసరించు త్రోవల యొక్క; విశుద్ధ=పరిశుద్ధమైన; వర్తనములు=ప్రవర్తనలు;

నాడి పరంపరా=ఇడ-పింగళ-సుషుమ్న మొదలైన నాడుల; క్రోడ=తొఱ్ఱల యందలి; వాయు జయంబు=వాయువును బంధించి జయించుట; చేతస్థితి=చిత్తవృత్తి యొక్క నిలుకడ యను; భాగ్యమునకున్=సంపదకు; బలము=సత్తువ;

చిత్తంబు=మనసు; తన+ఆజ్ఞ చేసి=జీవునియొక్క ఆదేశము మేరకు; వర్తించెన్+ ఏన్=ప్రవర్తించినచో; ఇంద్రియములు=మనస్సు; జ్ఞాన కర్మేంద్రియములును; ఇట్టు+అట్టు+ అనఁగన్=ఇట్లు అట్లు అని అనుటకు; చాలవు=తగవు;

యమ=యమము; నియమములున్=నియమమును; ఆసన=ఆసనము; ప్రాణ నియతి=ప్రాణాయామము; ధ్యానమును=ధ్యానమును; ధారణంబున్=ధారణమును; ప్రత్యాహృతంబు=ప్రత్యాహారము; ఆనన్=అనగను; సమాధియు=ఇంకను సమాధియు; నాఁగన్=అని యనునట్లుగా; అష్టాంగ కలన=ఎనిమిది అంగముల నెఱుగుట; బ్రహ్మ యోగంబు=ఆత్మజ్ఞానోపలబ్ధి; విలసిల్లున్=ఒప్పు చుండును.

భావము :- ఓ పార్వతీ! అనేక జన్మల పుణ్య ఫల సంపద వలన జీవికి యోగ విద్యయందు ఆసక్తి సమకూరును. పరిపూర్ణ యోగమునకు వాయు మార్గముల పవిత్ర ప్రవర్తనలే సాధనములు. ఇడ, పింగళ, సుషుమ్న మొదలైన నాడులలోని వాయువులను బంధించి జయించుటయే చిత్తము యొక్క నిలుకడకు బలము. ఆత్మ యొక్క ఆదేశము మేరకు మనసు ప్రవర్తించినచో ఇంద్రియములు ఎదురాడజాలవు. యమము నియమము ఆసనము ప్రాణాయామము ధ్యానము ధారణము ప్రత్యాహారము సమాధి అను ఎనిమిది అంగములతో యోగ విద్య ప్రకాశించును.

విశేషము :- యోగవిద్య యందలి అష్టాంగములు -

1. యమము :- అహింస, సత్యము, అస్తేయము (దొంగిలింపకుండుట), బ్రహ్మచర్యము, అప్రతిగ్రహము (దానము తీసికొనకుండుట) - అను నియమములు కలది.

2. నియమము :- శౌచము (శుచిగా నుండుట), సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము (కర్మ ఫలములను ఈశ్వరునకు అర్పించుట) - అను విధులు కలది.

3. అసనము :- ఉన్నత స్థితులను పొందుటకు శారీరకముగా, మానసికముగా సలుపు అభ్యాసము. ఈ అసనములు ఎనుబది నాలుగు విధములు. సాధకులకెట్టిది సులభముగా సుఖముగా నుండునో అట్టి ఆసనమును ఎన్నుకొనవలెను.

"స్థిర సుఖమాసనమ్" - సాంఖ్య దర్శనము. (అధ్యా-3. సూ-34) స్థిరమై సుఖము నిచ్చు కూర్చుండు విధానము ఆసనము.

4. ప్రాణాయామము :- ప్రాణమును నిరోధించుట అనగా ప్రాణమును వశము చేసికొనుట. స్థిరాసనము ఏర్పడిన తరువాత నాడీశౌచముతో ప్రారంభమగు సాధన.

యమము, నియమము, అసనము, ప్రాణాయామము - అను నాలుగు అంగములను అభ్యాసయోగము అని అందురు.

5. ధ్యానము :- "రాగోపహతిర్ధ్యానమ్" - సాంఖ్యదర్శనము - (అధ్యా. 3 సూ-30). చిత్తమును చలింపజేయు విషయానురాగము యొక్క నాశము.

6. ధారణ :- ఏక విషయము నందు మనస్సు నిలుపుట.

7. ప్రత్యాహారము :- మనస్సు యొక్క బాహ్య ముఖములైన వ్యాపారములను అరికట్టి, ఇంద్రియ దాస్యము నుండి మనస్సునకు విమోచనము కల్గించుట.

8. సమాధి :- అతీంద్రియ జ్ఞానావస్థ.

ధ్యానము, ధారణ, ప్రత్యాహారము, సమాధి - అను నాలుగు అంగములను జ్ఞానయోగము అని అందురు.

**తే॥ దేవి! సద్గురునాథోపదిష్టసరణి**
**మనుజుఁ డష్టాంగ యోగంబు ననువు పఱచి**
**యంతనద్వైత భక్తిఁ గృతార్థుఁ డగుచు**
**నన్నుఁగని ఘోర భవబంధనంబుఁ బాయు. 161**

అర్థము :- దేవి!=ఓ పార్వతీ! మనుజుఁడు=మానవుడు; సత్+గురునాథ=మంచి గురు శ్రేష్ఠుని వలన; ఉపదిష్టసరణిన్=ఉపదేశము పొందిన విధముగా; అష్ట+అంగ+యోగంబున్=ఎనిమిది భాగములతో కూడిన యోగవిద్యను; అనువు పఱచి=అలవరచుకొని; అంతన్=అంతట; అద్వైత భక్తిన్=జీవాత్మ పరమాత్మలకు భేదము లేదని చెప్పు పరబ్రహ్మ తత్త్వము నందలి భక్తితో; కృతార్థుఁడు+అగుచు=విహితమైన పనిని చేసినవాడై; నన్నున్+కని=నన్ను చూచి; ఘోర=భయంకరమైన; భవబంధనంబున్=ప్రాపంచికమైన సంకెలను; పాయున్=ఎడబాయును.

భావము :- ఓ పార్వతీ! మానవుడు మంచి గురు సత్తముని వలన ఉపదేశము పొంది అష్టాంగ యోగ విద్యను సాధనచేసి కృతార్థుడై అద్వైత భక్తితో నన్ను దర్శించి భయంకరమైన భవబంధములను ఎడబాయగలడు.

**వ॥ రజ్జు జ్ఞానంబున సర్పభ్రాంతి నివృత్తి యగు చందంబున యోగంబున నన్ను నాత్మంగను కారణంబున నవిద్యా నివృత్తి యగుననినఁ గృతాంజలియై త్రిపురహర! యోగంబెయ్యది? బ్రహ్మజ్ఞానం బెయ్యది? యానతీవే యనుటయు. 162**

అర్థము :- రజ్జు జ్ఞానంబున=త్రాడు అని తెలియుట చేత; సర్పభ్రాంతి=పాము అనెడి భ్రమ; నివృత్తి యగు చందంబున=తొలగిపోవు విధముగ; యోగంబున=యోగ విద్య చేత; నన్ను; ఆత్మన్=మనసులో; కను=చూచునట్టి; కారణంబునన్=హేతువుచేత; అవిద్యా=అజ్ఞానము; నివృత్తియగున్=తొలగిపోవును; అనినన్=అని చెప్పగా; కృత+అంజలియై=

చేతులు జోడించినదై; త్రిపుర హర=త్రిపురములను నాశనము చేసిన ఓ మహాదేవా!; యోగంబు=యోగవిద్య అనగా; ఏ+అది=ఏది? బ్రహ్మ జ్ఞానంబు=బ్రహ్మ జ్ఞానమనగా; ఏ+అది=ఏది; అనతీవే=సెలవిమ్ము; అనుటయు=అని అడుగుటయు.

భావము :- అది త్రాడు అని తెలియుటచేత పాము అను భ్రమ తొలగిపోవునట్లుగ యోగవిద్యతో మనసులో నన్ను చూచుట చేత అజ్ఞానము తొలగిపోవునని శంకరుడు చెప్పగా - పార్వతీదేవి చేతులు జోడించి ఓ మహాదేవ! పురహర! ఏది యోగము? బ్రహ్మజ్ఞానమేది? సెలవిమ్ము అని అర్థించినది.

తే॥ శమము దమము తపంబును శ్రద్ధతాల్మి
మఱి సమాధానమనఁగ నిర్మల వివేక!
సాధనము లాఱు దెఱువులు సంఘటిల్లు
మోక్షమున కండ్రు నిగమార్థమూల విదులు. 163

అర్థము :- నిర్మల వివేక=పవిత్రమైన సదసద్వివేచన కలదానా! ఓ పార్వతీ! నిగమార్థమూల విదులు=వేదార్థముల యొక్క ఆధారము నెఱిగిన వారు; మోక్షమునకు=ముక్తికి శమము=శాంతి; దమము=బాహ్యమైన ఇంద్రియములను నిగ్రహించుట; తపంబును= మనసును ఇంద్రియములను ఏకాగ్రముగ నుంచుట; శ్రద్ధ=నమ్మిక; తాల్మి=మనః స్థైర్యము మఱి=ఇంకను; సమాధానము=మనసును ధ్యేయ వస్తువునందు లయింపజేయు గాఢమై ధ్యానము; అనఁగన్=అనునట్లు; సాధనములు=ఉపకరణములు; అఱుదెఱువులు= ఆరుమార్గములు; సంఘటిల్లు=కలుగును; అండ్రు=అందురు.

భావము :- పవిత్ర జ్ఞానమూర్తివైన ఓ పార్వతీ! వేదార్థసారము నెఱిగిన పెద్దల శమము దమము తపము శ్రద్ధ మనఃస్థైర్యము గాఢమైన ధ్యానము అను ఆఱు అంచె మార్గము మోక్షమునకు కలదందురు.

తే॥ బలిమిమై నింద్రియంబులఁ బట్టి తెచ్చు
నది సుమీ యిందువదన! ప్రత్యాహరణము
సర్వ సంసార దుఃఖ ప్రశాంతి హేతు
వేకచిత్త ప్రకారంబు నిదియ సూవె. 16

అర్థము :- ఇందువదన=చంద్రుని వంటి ముఖము కలదానా! ఓ పార్వ బలిమిమైన్=బలముగా; ఇంద్రియములన్=ఇంద్రియములను; పట్టి తెచ్చునది=బంధిం

అర్థము :- గురుఁడే=ఆచార్యుడే; అభవుఁడు=శివుడు; అభవుఁడే=శివుడే; గురుఁడని= ఆచార్యుడని; అభవునకు=శివునకును; గురునకును=ఆచార్యునకును; ఎదన్=మనసులో భేదము=తారతమ్యమును; పరికింపని=చూడని; శిష్యునకే=విద్యార్థికే; గురుఁడన్= గురువును; అభవుఁడన్=శివుడను; అయి=ఐ; వాని=ఆ శిష్యుని యొక్క కోర్కులు=కోరికలను; తీర్తున్=నెరవేర్తును.

భావము :- గురువే శివుడు శివుడే గురువు అని గురువునకు శివునకు మనస్సులో భేదము పాటింపని శిష్యునకే గురువును శివుడను అయి ఆ శిష్యుని కోరికలు నెరవేర్చెదను.

తే॥ రాజసము మాని శిష్యుండు ప్రకట భక్తి
గురుని గొలువంగఁదగు రాజుఁ గొలిచినట్లు
వినయ మొప్పంగ నిశ్శోక వృత్తి సౌఖ్య
నిభృతుఁ డందుఁ ద్రివర్గంబు నీరజాక్షి; 168

అర్థము :- నీరజ+అక్షి=పద్మముల వంటి కన్నులు కలదానా! ఓ పార్వతీ! శిష్యుఁడు= విద్యార్థి; రాజసము మాని=దుర్గర్వమును వదలి; ప్రకట భక్తి=వెల్లడియగు భక్తితో; రాజున్= రాజును; కొలిచినట్లు=సేవించినట్లుగ; గురునిన్=గురువును; కొలువంగన్+తగు=సేవింప దగును; వినయము+ఒప్పంగ=అణకువ ప్రకాశించునట్లుగ: నిశ్శోకవృత్తిన్=శోకములేనట్టి ప్రవర్తన చేత: సౌఖ్యనిభృతుఁడు=సంతోషముతో చలింపనివాడు; త్రివర్గంబు=ధర్మార్థ కామములనెడి మూడింటిని; అందున్=పొందగలడు.

భావము :- శిష్యుఁడు (మానవుడు) దుర్గర్వమును వదలిపెట్టి రాజును సేవించినట్లుగ గురువును సేవింపవలెను. వినయమూర్తియై శోకరహితుడై సంతోషముతో చక్కబడినవాడు త్రివర్గములైన ధర్మ అర్థకామములను పొందగలడు.

విశేషము :- త్రివర్గంబు - ఇచట ధర్మము అర్థము కామము అనెడి మూడును బ్రహ్మ జ్ఞాన సంబంధము ఆత్మ జ్ఞాన సంబంధమునైన ధర్మము సంపద కోరికలని భావము. ఈ మూటి ఏకీకరణమే మోక్షమునకు సాధనమనియు తాత్పర్యము.

తే॥ సర్వభూతములందును సమతఁ బూని
సత్త్వవిదుఁడయి యెవ్వాఁడు సంచరించు
నతఁడు శివభక్తుఁ డాతని నాదరింతు
నెట్టి వేళలయందుఁ బూర్ణేందు వదన! 169

అర్థము :- పూర్ణ+ఇందువదన=నిండు చంద్రుని వంటి ముఖము కలదానా! ఓ పార్వతీ! సర్వ భూతంబులందును=అన్ని జీవరాసుల యెడలను; సమతన్=సమభావమును; పూని=వహించి; సత్త్వవిదుఁడయి=తెలివిడి, మంచి తనము తెలిసినవాడై; ఏ+వాఁడు=ఎవడు; సంచరించున్=ప్రవర్తించునో; అతఁడు=అతడే; శివభక్తుఁడు=శివుని భక్తుడు; ఆతనిన్=అట్టివానిని; ఎట్టి వేళల యందున్=ఎటువంటి సమయములందైనను; ఆదరింతున్=మన్నన సేతును.

భావము :- ఓ పార్వతీ! సర్వ జీవరాశి యెడల సమభావముతో ప్రవర్తింపవలెను. తెలివిడితో మంచి తనముతో ప్రవర్తింపవలెను. అట్టివాడే శివభక్తుడు. అట్టివానిని సర్వదా ఆదరించెదను.

సీ॥ పాపంబు పుణ్యంబు పాథః ప్రపూరంబు
దుర్వార మైనట్టి దుఃఖ మడుసు
కాంతాది సుఖము సైకత వేదికా స్థలి
కందర్ప వికృతులు కరడములును
బ్రాణభయంబు నక్ర కుళీర నివహముల్
చేతో వికారముల్ క్షితిధరములు
బహుళ దారిద్ర్యంబు బడబాగ్ని పిండంబు
విషయాభిలాషంబు విషము గాఁగ

తే॥ సమధికంబైన సంసార జలధి యందు
మునుగుచునుఁ దేలుచును గడముట్టఁబడని
జనుల కెల్లను మత్పాద సరసిజములు
తెప్పయై యుద్ధరించు నిందీవరాక్షి.

170

అర్థము :- ఇందీవర+అక్షి=నల్ల కలువల వంటి కన్నులు కలదానా! ఓ పార్వతీ! పాపంబు పుణ్యంబు=పాపము పుణ్యము; పాథఃప్రపూరంబు=నీటి ప్రవాహము; దుర్వారమైనట్టి=నివారింపరానిదైన; దుఃఖము=బాధ; అడుసు=బురద;

కాంత+ఆది=స్త్రీ మొదలైన; సుఖము=సుఖము; సైకతవేదికా స్థలి=ఇసుక తిన్నెల చోటు; కందర్ప వికృతులు=మన్మథ వికారములు; కరడములును=అలలు; ప్రాణ భయంబు=జీవి యొక్క భయమే; నక్రకుళీర నివహముల్=మొసళ్ల ఎండ్రుల యొక్క సమూహములు; చేతస్+ వికారముల్=మనో వికారములే; క్షితిధరములు=కొండలు;

బహుళ దారిద్ర్యంబు=అనేక విధములైన లేమి; బడబాగ్ని పిండంబు=పిండ రూపమైన బడబాగ్ని; విషయ+అభిలాషంబు=ఇంద్రియ సుఖము లందలి కోరిక; విషమున్+ కాఁగ=విషము కాగా;

సమధికంబైన=మిక్కిలి పెద్దదైన; సంసార జలధి యందు=సంసారమనెడి సముద్రము నందు; మునుగుచునున్=మునుగుచును; తేలుచును=తేలుచును; కడముట్టన్+ పడని=దరిజేర్పబడని; జనులకు+ఎల్లన్=జీవులందరికిని; మత్=నా యొక్క; పాద సరసిజములు=పద్మముల వంటి పాదములు; తెప్పయై=నావగనై; ఉద్ధరించున్=రక్షించును.

భావము :- ఓ పార్వతీ! పాప పుణ్యములే నీటి ప్రవాహమై నివారింపలేని దుఃఖమే బురదయై స్త్రీ సుఖము మొదలయినవి ఇసుక తిన్నెలై మన్మథ వికారములే అలలై ప్రాణభయమే మొసళ్ళ ఎండ్రుల సమూహములై మనోవికారములే కొండలై అనేకవిధములైన దారిద్ర్యమే బడబాగ్ని గోళమై ఐహిక సుఖములందలి అభిలాషయే విషమై విశాలమైన సంసారమనెడి సముద్రము నందు మునుగుచు తేలుచు దరిజేరలేని జీవులను నా పాద పద్మములే నావయై రక్షింప గలవు సుమా!

విశేషము :- అలంకారము - రూపకము.

కం॥ కామ క్రోధావేశ
వ్యామోహాదుల నిజాన్వయాచారంబుల్
వైముఖ్యము నొందించుచుఁ
బామర సంసార జలధిఁ బడుదురు కుమతుల్. 171

అర్థము :- కుమతుల్=చెడు మనసు కలవారు; కామ=కోరిక; క్రోధ=కోపము; ఆవేశ= గర్వము; వ్యామోహ=మిక్కిలి అనురాగము; ఆదుల=మొదలైన వానితో; నిజ=తన యొక్క; అన్వయ+ఆచారంబుల్=వంశాచారముల; వైముఖ్యమున్=వ్యతిరేకతను; ఒందించుచున్= కల్గించుచు; పామర=నీచమైన; సంసార జలధిన్=సంసారమనెడి సముద్రము నందు; పడుదురు= క్రుంకుదురు.

భావము :- పాపులైన జీవులు కామము క్రోధము మదము వ్యామోహము మొదలైన వానిచేత తాను ప్రవర్తింపవలసిన వంశ సంప్రదాయమును వ్యతిరేకించుచు అధమమైన సంసారమనెడి సముద్రమున మునుగు చుందురు.

కం॥ సుఖములు దుఃఖంబులుగా
సుఖములుగా దుఃఖములను జూతురు కుమతుల్
సుఖ దుఃఖ సమతఁ జూచిన
నఖిల భవాంభోధిఁ గడతు రంబుజవదనా! 172

అర్థము :- అంబుజ వదనా!=పద్మము వంటి ముఖము కలదానా!; ఓ పార్వతీ! సుఖములు=సుఖములను; దుఃఖంబులు గాన్=దుఃఖములుగను; దుఃఖములను=బాధలను; సుఖములుగా=సుఖములుగను; కుమతుల్=పాపమతులు; చూతురు=పరిగణింతురు; సుఖ దుఃఖ=సుఖములను దుఃఖములను; సమతన్=సమభావముతో; చూచినన్=చూడగల్గినచో; అఖిల=సమస్తమైన; భవ=ప్రాపంచిక బంధములనెడి; అంభోధిన్=సముద్రమును; కడతురు=దాటుదురు.

భావము :- పాపులైన జీవులు సుఖములను దుఃఖములుగను; దుఃఖములను సుఖములుగను పరిగణించి భ్రమపడుదురు. సుఖదుఃఖములను సమముగ సరిగ చూడగలవాడు ఈ సమస్తమైన ప్రాపంచిక బంధములనెడి సముద్రమును దాటగలడు సుమా!

సీ॥ మనసు కామక్రోధ మద లోభముల కిచ్చి
సడలింతు రన్వయాచార సరణి
నన్వయా చారంబులట్లు మాసి చనంగ
వర్తించు రన్యాయవర్తనమున
నన్యాయ వర్తనం బది కారణముగాఁగఁ
బడిమునుంగుదు రుగ్ర భవ పయోధి
భవ పయోనిధిలోనఁ బడియుండి కొంతురు
నరక కూపమున నున్మజ్జనంబు

తే॥ నిరయమునబెద్ద కాలంబు నికృతిబొంది
యిలకు వచ్చి జనింతురు హీనజాతి
హీనజాతి జనించి పాపానువృత్తిఁ
బాప్రలగు చుందురట నధః పాతమునకు. 173

అర్థము :- మనసు=హృదయమును; కామ=కోరికలకు; క్రోధ=కోపమునకు; మద=గర్వమునకు; లోభములకు=అత్యాశలకు; ఇచ్చి=అంకితము చేసి; అన్వయ+ఆచార సరణిన్=జ్ఞానిగ తమ నియత సంబంధమైన సంప్రదాయముల మార్గమును; సడలింతురు= వదలివేయుదురు;

అన్వయ+ఆచారములు=నియత సంబంధమైన సంప్రదాయములు; అట్లు=ఆ విధముగ; మాసి చనంగ=నశించి పోగా; అన్యాయ వర్తనమునన్=దోష పూరితమైన నడవడి యందు; వర్తింతురు=నడచుదురు;

అన్యాయవర్తనంబు+అది=ఆ దోషపూరితమైన ప్రవర్తన; కారణముగాఁగన్=కారణముగ; ఉగ్ర=భయంకరమైన; భవపయోధిన్=ప్రాపంచిక బంధములనెడి సముద్రమున; పడి=జారిపోయి; మునుంగుదురు=మునిగిపోదురు;

భవపయోధిలోన్=ప్రాపంచిక బంధములనెడి సముద్రములో; పడియుండి=జారిపడి కొట్టుమిట్టాడుచు; నరక కూపమునన్=నరకమనెడి నూతిలో; ఉత్+మజ్జనంబు=తేలియాడు చుండుటను; కాంతురు=చూతురు.

నిరయమున=శుభములేని దైన నరకమున; పెద్దకాలంబు=చాలకాలము; నికృతి బొంది=దీనతను నిరసనను పొంది; ఇలకు వచ్చి=భూమిపైకి వచ్చి; హీనజాతి=తక్కువ జాతి యందు; జనింతురు=పుట్టుదురు; హీనజాతి=ఆ తక్కువ జాతి యందు; జనించి=పుట్టి; పాప+అనువృత్తిన్=పాపములను అనుసరించుచు; అధఃపాతమునకు=జారిపోయి నరకమున బడుటకై; అట=అక్కడ; పాపులు+అగుచుందురు=పాపములు చేసిన వారగుచుందురు.

భావము :- జీవులు తమ హృదయములను కామ క్రోధ లోభ మదములకు అంకితము చేసి జ్ఞానముచే మానవులుగ తమకు నియతమైన సంప్రదాయములను వదలివేయుదురు. ఆ విధముగ సంప్రదాయములను వదలివేసి అన్యాయ మార్గమున ప్రవర్తించుచుందురు. ఆ అన్యాయ మార్గము, పాప ప్రవర్తన కారణముగ భయంకరమైన ప్రాపంచిక బంధములనెడి సముద్రమున పడిపోదురు. అచ్చటి నుండి నరకమను నూతియందు తేలియాడుదురు. అక్కడ చాల కాలము దీనతను హీనతను అనుభించి భూమిపైకి వచ్చి హీనజాతిలో పుట్టుదురు. అట్లు పుట్టి పాపములను చేయుచు పాపులై మరల జారిపడి నరకమునే చేరుదురు.

విశేషము :- అలంకారము :- కారణమాల.

తే॥ ఎట్టి హీనాత్మునకు నైన నేన శరణ
మెట్టి పుణ్యాత్మునకునైన నేన దిక్కు
నన్ను వర్ణింప మేలు మానవుల కెందు
సత్యమిది నమ్ము హిమధామచారువదన! 174

అర్థము :- హిమధామ=చల్లని వెలుగు కలవాడైన చంద్రుని వంటి; చారువదన!=అందమైన ముఖము కలదానా! ఓ పార్వతీ! ఎట్టి=ఎటువంటి; హీన+అత్మునకున్+ఐన=నీచమైన మనసు కలవానికైనను; నేన=నేనే; శరణము=దిక్కు; ఎట్టి=ఎటువంటి; పుణ్య+ఆత్మునకున్=సుకృతమైన మనసు కలవానికైనను; నేన=నేనే; దిక్కు=ఆశ్రయము; ఎందున్=ఎక్కడైనను; మానవులకు=మనుజులకు; నన్ను=నన్ను గూర్చి; వర్ణింపన్=స్తుతించుట; మేలు+శుభము; ఇది=ఈ మాట; సత్యము=నిజము; నమ్ము= నమ్ముము.

భావము :- ఓ పార్వతీ! ఎటువంటి పాపాత్మునకైనను ఎటువంటి పుణ్యాత్మునకైనను నేనే దిక్కు. జీవులు ఎవరైనను ఎక్కడైనను నన్ను నమ్మి ప్రార్థించుటయే శుభము. ఇది నిజము. నమ్ముము.

వ॥ అనిన విని భవాని యెద్దాని నెఱింగి భవార్ణవంబు వలన నిర్ముక్తులై పురాతన యోగీంద్రులు సనక సనందన సనత్కుమార సనత్సుజాతాదులు నిశ్శ్రేయసంబు నొంది; రమ్మహాజ్ఞానంబు సవిస్తరంబుగా నానతిమ్మనిన నమ్మహాదేవుండిట్లనియె. 175

అర్థము :- అనిన=అని చెప్పగా; విని=వినినదై; భవాని=పార్వతి; ఏ+దానిన్=దేనిని; ఎఱింగి=తెలిసికొని; భవ+అర్ణవంబు వలన=సంసారమనెడి సముద్రము నుండి; నిర్ముక్తులై= విడువబడిన వారై; పురాతన=పూర్వపు; యోగి+ఇంద్రులు=యోగులలో శ్రేష్ఠులైన వారైన; సనక=సనకుడు; సనందన=సనందనుడు; సనత్కుమార=సనత్కుమారుడు; సనత్సుజాత= సనత్సుజాతుడు; ఆదులు=మొదలైన వారు; నిశ్శ్రేయసంబున్=శ్రేష్ఠమైన ముక్తిని; ఒందిరి= పొందిరి; ఆ+మహాజ్ఞానంబు=ఆ గొప్ప జ్ఞాన మార్గమును; సవిస్తరంబుగాన్=వివరణతో కూడినదిగా; ఆనతిమ్ము=సెలవిమ్ము; అనినన్=అని అర్థింపగా; ఆ+మహా దేవుండు=ఆ మహాదేవుడైన శంకరుడు; ఇట్లనియె=ఈ విధముగ పల్కెను.

భావము :- అని శంకరుడు చెప్పగా పార్వతి వినినది. పూర్వపు యోగీంద్రులైన సనక సనందన సనత్కుమార సనత్సుజాతాదులు ఏ జ్ఞానమార్గము నెఱిగి సంసార సముద్రము నుండి విముక్తులై మోక్షమును పొందిరో ఆ గొప్ప జ్ఞాన మార్గమును సవివరముగ సెలవిండు అని అర్థించినది. ఆ మహాదేవుడిట్లు చెప్పెను.

మాలిని. శమదమ పరినిష్ఠా సర్వభూతానుకంపా
సమనిగమ నివృత్తి జ్ఞాన వృత్తి ప్రశాంతుల్
కమలదళ నిభాక్షీ! కల్గినన్ గల్గునయ్యు
త్తమునకుఁ జిరకాలస్థాయి కైవల్య లక్ష్ముల్. 176

అర్థము :- కమలదళనిభ+అక్షీ=పద్మపురేకుల వంటి కనులు గలదానా! ఓ పార్వతీ! శమదమ+పరినిష్ఠా=శమదమములు పూర్ణజ్ఞానము నిష్ఠ; సర్వభూత+అనుకంపా=సర్వ జీవరాశి యందు దయ; సమనిగమ=సర్వవేదములందలి; నివృత్తి=మోక్షార్థమైన; జ్ఞానవృత్తి=తెలివిడి తోడి ప్రవర్తనతో; ప్రశాంతుల్=మిక్కిలి శాంతియును; కల్గినన్=కలిగినచో; ఆ+ఉత్తమున కున్=అట్టి మంచివానికి; చిరకాల స్థాయి=శాశ్వత స్థానమైన; కైవల్య లక్ష్ముల్=మోక్ష సంపదలు= కల్గున్= కలుగును.

భావము :- ఓ పార్వతీ! అంతరింద్రియముల, బాహిరింద్రియముల నిష్ఠ; సర్వజీవ రాశి యందును దయ సమభావము సర్వవేద (న్యాయ)ము లందలి మోక్ష సంబంధమైన జ్ఞానముతోడి ప్రవర్తన; ప్రశాంత వర్తనలు కలిగిన మంచి వానికి శాశ్వతమైన మోక్ష సంపదలు లభించును.

విశేషము :- మాలినీ వృత్త లక్షణము చూడుడు. భీమ. 1-125

తే॥ చిత్తమునఁ దుష్టియును నతుష్టియును లేక
యొడలిలో నన్యు గృహమందు నున్న భంగి
నిస్పృహుండయి యుండంగ నేర్చె నేని
యతఁడు ముక్తుండు పద్మపత్రాయతాక్షి. 177

అర్థము :- పద్మపత్ర+ఆయత+అక్షి=పద్మపు రేకుల వంటి విశాలమైన కన్నులు కలదానా! ఓ పార్వతీ! చిత్తమునన్=మనసు నందు; తుష్టియును=తృప్తియు; అతుష్టియును= అసంతృప్తియు; లేక=లేకుండగ; ఒడలిలోన్=శరీరము నందు; అన్యు గృహమందున్= ఇతరుని ఇంటిలో; ఉన్న భంగి=ఉన్నట్లుగనే; నిస్పృహుండయి=కోరికను విడచిపెట్టినవాడై; ఉండంగన్=ప్రవర్తించుట; నేర్చెన్+ఏని=తెలిసికొన్నచో; అతఁడు=అట్టివాడు; ముక్తుండు= మోక్షమును పొందువాడు.

భావము :- మనసులో సంతోష విషాదములు తృప్తి అసంతృప్తి లేకుండగ ఇతరుని యింటిలో ఉన్నట్లు తాను తన శరీరము నందు కోరికలను విడనాడి ప్రవర్తించిన జీవి మోక్షమును పొందగలడు సుమా!

తే॥ అవని గగనాగ్ని వాయు జలాదులైన
ప్రకృతి సంభూతముల వికారములఁబాసి
యున్న నామూర్తిఁబొడఁగాన నొప్పునేని
నతఁడు ముక్తుండు సుమ్ము హైమాద్రి తనయ. 178

అర్థము :- హైమ+అద్రి+తనయ=మంచుకొండ ఐన హిమవంతుని పుత్రిక వైనదానా! ఓ పార్వతీ! అవని=భూమి; గగన=ఆకాశము; అగ్ని=అగ్గి; వాయు=గాలి; జల=నీరు; ఆదులైన మొదలైన, ప్రకృతి సంభూతముల=సహజములై పుట్టిన వాని; వికారములన్=మార్పులు పొందుటను; పాసియున్న=వదలియున్నట్టి; నా మూర్తిన్=నా రూపమును; పొడఁగానన్= దర్శించుట; ఒప్పునేనిన్=కల్గినచో; అతఁడు=అటువంటి జీవి; ముక్తుండు సుమ్ము= మోక్షమును పొందువాడు సుమా!

భావము :- ఓ పార్వతీ! భూమి ఆకాశము నిప్పు నీరు గాలి అనెడి పంచ భూతములు మొదలైన ప్రకృతి జనితములైన వాని ప్రభావములకు అతీతమై యున్న నా రూపమును చూడగల్గిన జీవి మోక్షము నందును సుమా!

వ॥ నిత్యానిత్య వివేకుండును; నీషణత్రయ విరహితుండును; సమాధి షట్క సంపన్నుండును; నంత రరిషడ్వర్గ వివర్జితుండును నగువాడు ముముక్షుండు. 179

అర్థము :- నిత్య+అనిత్య+వివేకుండును=ఏది శాశ్వతము ఏది అశాశ్వతము అను జ్ఞానము కలవాడును; ఈషణత్రయ+విరహితుండును=మూడు విధములైన కోరికలచే విడువబడిన వాడును; సమాధి షట్క=సమాధి మొదలైన యోగాంగములు ఆఱింటి, సంపన్నుండునున్=సంపద కలవాడును; అంతర్+అరి+షడ్వర్గ=లోపల నున్న కామక్రోధాది శత్రువు లాఱింటి సమూహము చేత; వివర్జితుండున్=పూర్తిగ విడిచిపెట్టబడిన వాడును; అగువాఁడు=అయిన జీవి; ముముక్షుండు=మోక్షమును పొందువాడు.

భావము :- ఏది శాశ్వతము ఏది అశాశ్వతము అనెడి జ్ఞానము కలవాడు; ఈషణ త్రయమును విడచిపెట్టినవాడు యోగాంగములు ఆఱింటి యందు సంపన్నుడు అంతశ్శత్రువు లను పూర్తిగ జయించిన వాడు ఐన జీవుడు మోక్షమును పొందును.

విశేషము :- ఈషణ త్రయము :- 1. దారేషణ, 2. పుత్రేషణ, 3. విత్తేషణ-

సమాధి షట్కము :- 1. శమము, 2. దమము, 3. తపము, 4. శ్రద్ధ, 5. మనఃస్థైర్యము, 6. సమాధి.

అరిషడ్వర్గము :- 1. కామము, 2. క్రోధము, 3. లోభము; 4. మోహము; 5. మదము, 6. మాత్సర్యము.

తే॥ తత్పదార్థంబు పరమాత్మ తలిరుఁ బోణి
త్వం పదార్థంబు జీవుండు తలఁచి చూడఁ
దత్త్వమారయ వేద సూత్రంబులోని
యర్థమది చిత్తమందు నీవలవరింపు. 180

అర్థము :- తలిరుఁబోణి=చిగురాకు వంటి చక్కని మేనుగల దానా! ఓ పార్వతీ! తలఁచి చూడన్=ఆలోచించి చూడగా; పరమాత్మ=పరమాత్ముడు; తత్పదార్థంబు=విశ్వ వ్యాపితమై జ్ఞానరూపమైన చైతన్యము; జీవుండు=ప్రాణి; త్వం పదార్థంబు=ఇంద్రియము లతో అహముకల్గిన వస్తువు; తత్త్వము=యథార్థమును; అరయన్=పరిశీలింపగ; వేదసూత్రంబు

లోని=వేదమనెడి గ్రంథము నందలి; అర్థము=గ్రహింపబడిన విషయము; అది=ఆ విషయమును; నీవు=నీవు; చిత్తమందు=మనసులో; అలవరింపు=గ్రహింపుము.

భావము :- ఓ పార్వతీ! ఆలోచించి చూడగా విశ్వవ్యాపితమై జ్ఞాన రూపమైన చైతన్యమే పరమాత్మ. ఇంద్రియ లోలతతో అహము కల్గిన వస్తువే జీవి. ధర్మబోధకములైన వేదములలోని సారమిది. నీవును ఆ యథార్థమును గ్రహింపుము.

తే॥ ప్రత్యభిజ్ఞానమనియెడి ప్రత్యయమున
విశ్రుతంబైన యాత్మ భావింపవలయుఁ
బెద్ద కాలంబునకుఁ గన్న ప్రియవయస్యు
నానవాల్పట్టి తెలిసిన యట్ల వోలె. 181

అర్థము :- పెద్ద కాలంబునకున్=చాల కాలమునకు; కన్న=చూచిన ప్రియవయస్యున్=ఇష్టమైన చెలికానిని; ఆనవాల్పట్టి=గుర్తించి; తెలిసిన యట్ల+పోలె=తెలిసికొన్న విధముగ; ప్రతి+అభిజ్ఞానము=పరమేశ్వరుడే పరబ్రహ్మ అని తెలిసికొను; అనియెడి=అనెడి; ప్రత్యయమున= జ్ఞానముతో; విశ్రుతంబైన=మిక్కిలి ప్రసిద్ధికెక్కిన; ఆత్మన్=పరమేశ్వరుని; భావింపవలయున్= తలంపవలెను.

భావము :- ఇష్టుడైన స్నేహితుని చాలకాలమైన పిమ్మట చూచి గుర్తింప గల్గినట్లుగా ఆ గుర్తించగల జ్ఞానముతో ఆత్మరూపుడైన పరమాత్మను గుర్తించవలెను సుమా!

విశేషము :- అలంకారము - ఉపమ.

ఆ॥ త్రాడుఁ జూచి భ్రాంతి దందశూకంబని
యాత్మ వలనఁ దలఁచినట్లవోలె
వేద శాస్త్రజనిత విజ్ఞానబలమునఁ
దెలివివడసి యాత్మఁ దెలియ వలయు. 182

అర్థము :- త్రాడున్=త్రాడును; చూచి=చూచి; భ్రాంతిన్=పొరబడి; దండశూకంబని=సర్పమని; ఆత్మవలనన్=మనసుచేతనే; తలఁచినట్ల+పోలె=భావించినట్టి విధముగనే; వేద శాస్త్రజనిత=వేదములు శాస్త్రముల వలన కల్గిన; విజ్ఞాన బలమునన్=తెలివిడి యొక్క బలముచేత; ఆత్మన్=పరమాత్మను; తెలివిన్+పడసి=జ్ఞానమును పొంది; తెలియవలయు= తెలిసికొనవలెను.

భావము :- త్రాడును చూచి పొరపాటుపడి పామని మనసుచేతనే భావించినట్లుగనే వేద శాస్త్రముల వలన కల్గిన జ్ఞానముతో ప్రవర్తించి ఆత్మ స్వరూపమును తెలిసికొనవలెను

వ॥ నిత్యంబు సర్వగతంబు కూటస్థం బేకంబు దోషవర్జితంబు భ్రాంతి వశంబున భిన్నంబై తోఁచు; ఘటాకాశంబు మహాకాశంబు భిన్నంబు గానేర్చునే? జీవేశ్వరులకు భేదం బెక్కడిది? పృథివ్యాపస్తేజోవాయురాకాశంబులు; శబ్ద స్పర్శ రూప రస గంధంబులు; మాయాసంసార ప్రపంచంబు లేను సదాసాక్షి స్వరూపకుండనైన జీవుండనని సమాధి నిష్ఠులైన పెద్దలు తెలిసికొని పరమ నిర్వృతి ననుభవింతురు. 183

అర్థము :- నిత్యంబు=శాశ్వతమైనది; సర్వగతంబు=అంతట వ్యాప్తిని పొందియున్నది; కూటస్థంబు=పరిణామాదులు లేక ఎల్లకాల మొకేరీతిగ నుండునది; ఏకంబు=ఒకటే ఐనది; దోషవర్జితంబు=పాపము లేనిది; భ్రాంతి వశంబున=పొరపాటు చేత; భిన్నంబై=ఇతరమైనదిగ; తోఁచు=అనిపించును; ఘట+ఆకాశంబు=కుండలో కనిపించు ఆకాశము; మహాకాశంబు= గొప్పదైన ఆకాశము; భిన్నంబు కానేర్చునే=వేఱగునా?; జీవ+ఈశ్వరులకు=ఆత్మకును పరమాత్మకును; భేదంబు=వేఱుపాటు; ఎక్కడిది=ఎచట గలదు? పృథివి=భూమి; ఆపస్సు= నీరు; తేజస్=అగ్ని; వాయుః=గాలి; ఆకాశంబులు=ఆకాశము అనెడి పంచభూతములు; శబ్ద=ధ్వని; స్పర్శ=తాకిడి; రూప=ఆకారము; రస=రుచి; గంధంబులు=వాసన-లను పంచ (భూత) గుణములు; మాయా సంసార ప్రపంచంబులు=ఉన్నదానిని కన్పింపకుండ చేయు మాయతోడి భ్రాంతి లోకములు; ఏను=నేను; సదా=ఎల్లప్పుడు; సాక్షి స్వరూపకుండన్+ఐ= అన్నింటి యందును కన్పించు రూపము కలవాడనైన; జీవుండన్+అని=జీవుడనని; సమాధి నిష్ఠులైన=యోగము నందు పరిపూర్ణులై స్థిరులైనట్టి; పెద్దలు=గొప్పవారైన యోగులు; తెలిసికొని=ఎఱిఁగి; పరమ నిర్వృతిన్=మోక్షమును; అనుభవింతురు=పొందుదురు.

భావము :- పరమాత్మయైన బ్రహ్మ పదార్థము శాశ్వతమైనది. విశ్వవ్యాప్తమైనది. మార్పులేనిది. ఏకమైనది. దోషము లేనిది. అయినను భ్రమచేత ఇతరముగ అన్పించును. కుండలో కనిపించు ఆకాశమునకును విశాలాకాశమునకు భేదము లేదు కదా! భూమి నీరు అగ్ని గాలి ఆకాశమను పంచభూతములును వాని గుణములైన శబ్దము స్పర్శము రూపము రుచి వాసనలును మాయా సంసార సమూహములు. నేనే అన్ని వేళలందును అంతట నిండి యుండి కన్పింతును. ఈ సంగతిని యోగనిష్ఠులైన వారు తెలిసికొని శ్రేష్ఠమైన మోక్షమును పొందుదురు.

సీ॥ ప్రణవాత్మ వర్ణరూపస్ఫుర్ణనామూర్తి
ప్రణవంబు మూఁడక్షరములు గలది
యిది పర బ్రహ్మ మేకాక్షరంబున నొప్పు
నది ఋగ్యజుస్సామమందు నిలిచె

ననులోమకము లుదాత్తాది స్వరములు కా
లంబులు వర్ణత్రయంబు లవియు
వర్ణత్రయంబు సర్వంబు నంతర్భావ
మొందుట యదియేమి సందియంబు

తే॥ గతి నకార ముకార మకారములను
నాత్మ మాయను జీవాత్మ నాఁటు కొల్పి
జీవునీశ్వర బుద్ధి భజింపవలయు
ధృతి దఱుఁగనీక యెప్పుడు మతివివేక. 184

అర్థము :- మతి వివేక=ఆత్మజ్ఞానము కలవానా! ఓ పార్వతీ!; ప్రణవ+ఆత్మ= ఓంకార శరీరము; వర్ణ=అక్షరముల; రూప=రూప వికారమైన; స్ఫుర్ఘనా=ప్రభావమే; మూర్తి= రూపము కలది; ప్రణవంబు=ఓంకారము; మూఁడు+అక్షరములు+కలది=మూడు అక్షరము లను కలది;

అది=ఆ ఓంకారము; పరబ్రహ్మము=పరమాత్మను ప్రతిపాదించు నట్టిది; ఏకాక్షరంబు నన్=ఒకే అక్షరము నందు; ఒప్పున్=ప్రకాశించును; అది=ఆ ఓంకారమే; ఋక్+యజుః+ సామమందు=ఋగ్వేదము యజుర్వేదము సామవేదము అను మూడింటి యందు నిలిచెన్=నిలచియున్నది.

అనులోమకములు=ఆరోహణ క్రమములు కలవగు; ఉదాత్త+ఆది=ఉదాత్తము అనుదాత్తము స్వరితము అనెడి; స్వరములు=ధ్వని ప్రయత్నములును; కాలంబులు= కాలములును (భూత వర్తమాన భవిష్యత్కాలములును); అవియు=అవికూడ; వర్ణత్రయం బులు=మూడక్షరములతో కూడినవి.

వర్ణత్రయంబు=మూడక్షరములు; మూడు రంగులును; సర్వంబు=సమస్తము; అంతర్భావము+ఒందుట=ఒకదానిలో ఒకటి కలసిపోవుట; అది=అను విషయము; ఏమి సందియంబు=అనుమానమేల?

ధృతిన్=ధైర్యమును; తఱుఁగ నీక=తగ్గనీయక; ఎప్పుడు=ఎల్లవేళలందును; గతిన్=ఎఱుకతో; అకారము=అకారము; ఉకారము=ఉకారము; మకారములను=మకారము- లను మూడింటిని; జీవాత్మ=జీవుని యొక్క హృదయము నందు; ఆత్మ=పరమాత్మను; మాయను=ఉన్నదానిని కన్పింపనీయని మాయను; నాటుకొల్పి=నెలకొల్పి; జీవున్=జీవుని; ఈశ్వర బుద్ధిన్=పరమేశ్వరుడను భావముతో; భజింపవలయు=సేవింపవలెను.

భావము :- ఆత్మ జ్ఞానము గల ఓ పార్వతీ! ఓంకారము పరమాత్మను గూర్చిన గుణ రూప స్వర్శనముల మహత్త్వము కలది. ఆ ఓంకారము మూడక్షరములు కలది. అదే ఏకాక్షర రూపమైన పరబ్రహ్మము. ఆ పరబ్రహ్మము ఋగ్యజుస్సామ వేదము లందు నిలచి యున్నది. క్రమము అనులోమము విలోమము అని క్రమములు మూడు. ఉదాత్తము అనుదాత్తము స్వరితము అని స్వరములు మూడు. నలుపు, ఎఱుపు, పసుపు అను రంగులు మూడు. మూడు అక్షరములు మూడు రంగులు. ఒకదానిలో నొకటి కలసిపోవునను విషయమున సందేహము లేదు. స్థిరమైన జ్ఞానముతో ఓంకారమును మనసునందు పరమేశ్వరుని మాయను నెలకొల్పుకొని ప్రాణిని పరమేశ్వరునకు వలె సేవింపవలెను సుమా!

సీ॥ చైతన్య మెప్పుడు సర్వంబుఁ దానయై
  విలసిల్లు చుండు నవ్వేళఁ గాని
విశ్వ భూతములను వీక్షించుఁదనయందు
  బరిపాటి నెప్పు డప్పాటఁ గాని
సకల భూతములకు సంతసంబునుఁ బొంది
  యెప్పుడు వర్తించుఁ దా నపుడు గాని
యఖిల లోకములకు నధ్యక్షుఁడై కను
  నధ్యక్షుఁ డెప్పు డయ్యెదనఁ గాని
తే॥ తన్నుఁ గేవల మాత్మగాఁ దలఁచి యిష్ట
మతిశయము దృఢముగఁజూచునపుడు గాని
జన్మ దుఃఖ జరావ్యాధి శాంతికరము
బ్రహ్మ విజ్ఞాన మూరక పట్టు వడదు. 185

అర్థము :- చైతన్యము=చేతన; ఎపుడు=ఎల్లపుడు; సర్వంబున్+తానయై= అంతయు తానే ఐ; విలసిల్లు చుండున్=ప్రకాశించుచుండునో; ఆ+వేళన్+కాని=అపుడు గాని (అపుడే)

విశ్వ భూతములను=లోకము నందలి జీవుల నన్నింటిని; ఎప్పుడు=ఎపుడు; పరిపాటిన్=సాధారణముగనే; తనయందు=తనలో; వీక్షించున్=చూచునో; ఆ+పాటన్+ కాని= అపుడుగాని (అపుడే).

తాను=జీవుడు; సకల భూతములకు=సర్వ జీవరాశి యొక్క; సంతసంబునున్= సంతోషమును; పొంది=అనుభవించి; ఎపుడు=ఏ సమయమున; వర్తించున్=ప్రవర్తించునో; అపుడు గాని=అ సమయమున గాని (అపుడే);

ఎప్పుడు=ఏ సమయమున; అఖిల లోకములకు=అన్ని లోకములకును; అధ్యక్షుఁడు=ప్రత్యక్ష జ్ఞానము కలవాడై; అధ్యక్షుఁడై=ప్రభువై; కనున్=చూచునో; అ+అదనన్+కాని=ఆ సమయమున గాని (అపుడే);

తన్ను=పరమాత్మయైన తన్ను; కేవలము+ఆత్మగాన్=అచ్చమైన పరమాత్మగా; తలఁచి=భావించి; ఇష్టము=ప్రియమును; అతిశయము=అధికము; దృఢముగన్=పూనిక విడువక; చూచున్=కనుగొనునో; అపుడు గాని=అప్పుడు గాని (అపుడే) జన్మ దుఃఖ జరావ్యాధి=జననము విషాదము ముసలితనము రోగములకు; శాంతికరము=శుద్ధిని ఉపశమనమును కల్గించునదైన; బ్రహ్మజ్ఞానము=పరబ్రహ్మమును గూర్చిన విశేషమైన జ్ఞానము; ఊరక=అప్రయత్నముగ; పట్టు వడదు=లభింపదు.

భావము :- బ్రహ్మజ్ఞానము ఊరకనే లభింపదు. జీవి యొక్క చేతన అంతయు తానేయై ప్రకాశించునపుడు; సర్వ జీవరాశిని అలవాటుగ తనలో చూడగల్గినపుడు; సర్వ జీవులకు సంతోషము కలుగునట్లు ఎల్లపుడు ప్రవర్తించినపుడు; ప్రత్యక్ష జ్ఞానము కలవాడై అన్ని లోకములను సమదర్శకుడై చూడగల్గినపుడు మాత్రమే ఆ జీవి జన్మములు దుఃఖములు ముసలితనము రోగముల నుండి శాంతిని కల్గించు మోక్షదాయియైన బ్రహ్మజ్ఞానమును పొందగలడు.

తే॥ జ్ఞాన సంపదఁ గాని మోక్షంబు లేదు
కర్మ శతమున నేని యో నిర్మలాత్మ!
జ్ఞాన మనఁగ వేదాంత విజ్ఞాన మబల!
యితర విజ్ఞాన మజ్ఞాన మెంచి చూడ. 186

అర్థము :- అబల=ఓ కాంతా! ఓ నిర్మల+ఆత్మ=పవిత్రమైన ఆత్మ కలదానా! ఓ పార్వతీ! కర్మ శతమునన్+ఏనిన్=విధ్యుక్త ధర్మములను పుణ్యములను పెక్కింటిని ఆచరించినను; జ్ఞాన సంపదన్+కాని=బ్రహ్మజ్ఞానమును సంపాదించినపుడు గాని; మోక్షంబు లేదు=ముక్తి కలుగదు, జ్ఞానమనఁగ=జ్ఞానమనగా; వేదాంత విజ్ఞానము=ఉపనిషత్తుల యందు చెప్పబడిన దానిని తెలిసికొనుట; ఇతర=ఇతరమైన; విజ్ఞానము=తెలివిడి; ఎంచి చూడన్= పరిశీలించి చూడగా; అజ్ఞానము=మాయ.

భావము :- పవిత్రమైన ఆత్మ గల ఓ పార్వతీ! విధ్యుక్త ధర్మములను పుణ్యములను ఎన్నింటి నాచరించినను బ్రహ్మజ్ఞానమును పొందిన వానికే మోక్షము కలుగును. వేదాంతము లందు చెప్పబడిన దానిని తెలిసికొనుటయే అసలైన జ్ఞానము. ఇతరమైన జ్ఞానమంతయు విజ్ఞానమువలె కన్పించు అజ్ఞానము.

విశేషము :- ఈ పద్యము చదువగనే వెంటనే స్ఫురించునది ఆది శంకరాచార్యుల వారి - "జ్ఞానవిహీన స్సర్వమతేన ముక్తిం నభజతి జన్మ శతేన" అనుమాట.

ఈ ఘట్టమున ఆది శంకరులు బోధించిన అద్వైత ధోరణులు కలవు.

కం॥ జ్ఞానాభ్యాసం బల్పం
బైన మహా పాతకముల హరియించును గం
జానన! దీపంబించుక
యైనను హరియించుఁ గాదె యంధతమంబుల్. 187

అర్థము :- కంజ+అనన!=పద్మముల వంటి కన్నులు కలదానా! ఓ పార్వతీ! దీపంబు=దీపము; ఇంచుక+ఐనను=చిన్నదైనను; అంధతమంబుల్=కారుచీకట్లను; హరియించున్+కాదె=నశింపజేయును గదా! (అట్లే) జ్ఞాన+అభ్యాసంబు= బ్రహ్మజ్ఞానమును గురించిన సాధన; అల్పంబైన=చిన్నదై (కొంచెమై) నను; మహాపాతకముల= గొప్ప పాపములను; హరియించున్=నాశనము చేయును.

భావము :- ఓ పార్వతీ! దీపము చిన్నదైనను దట్టమైన చీకటిని నాశనము చేయునట్లుగనే బ్రహ్మజ్ఞానమును గూర్చిన సాధన కొంచెమైనను మహాపాతకములను నాశనము చేయగలదు సుమా!

విశేషము :- అలంకారము - అర్థాంతరన్యాసము.

తే॥ వహ్ని సందీప్తమై మహావనము నందు
సరస నీరసతరుల భస్మంబు సేయు
బ్రహ్మ విజ్ఞానమును నట్ల ప్రజ్వరిల్లి
శుభమునశుభము నొకటిగా సుడిసి కాల్చు. 188

అర్థము :- వహ్ని=అగ్ని; సందీప్తమై=మిక్కిలిగ ప్రజ్వలించి; మహావనము నందు= గొప్ప అడవి యందలి; సరస=రసము గల (పచ్చి)నీరస=రసము లేని (ఎండిన); తరుల= చెట్లను; భస్మంబున్+చేయు=బూడిద చేయును; అట్ల=అట్లే; బ్రహ్మ విజ్ఞానమును= పరమాత్మను గూర్చిన జ్ఞానము కూడ; ప్రజ్వరిల్లి=మిక్కిలిగ విజృంభించి; శుభమున్+ అశుభమున్=మేలు కీడులను; పుణ్య పాపములను; మంచి చెడులను; ఒకటిగ=ఒకే విధముగ; సుడిసి=చుట్టుకొని; కాల్చు=కాల్చివేయును.

భావము :- అగ్ని ప్రజ్వలించి కార్చిచ్చై మహారణ్యములోని ఎండు చెట్లతోపాటు పచ్చి చెట్లను కూడ కాల్చి బూడిద చేయునట్లుగనే బ్రహ్మ జ్ఞానము కూడ ప్రజ్వరిల్లి శుభాశుభములను ఒకేరీతిగ చుట్టివేసి కాల్చివేయును సుమా!

విశేషము :- అలంకారము - ఉపమ.

తే॥ జలజ పత్రంబు తన మీఁదఁ జల్లి యున్న
యుదక బిందులతో; గూడకున్నయట్లు
బ్రహ్మ విజ్ఞాని తన మీఁదఁ బడినయట్టి
విషయ మలమునఁ బడకుండు విమల చరిత. 189

అర్థము :- విమల చరిత=పవిత్రమైన నడవడి కలదానా! ఓ పార్వతీ! జలజ పత్రంబు=తామరాకు; తన మీఁదన్=తనపై; చల్లి యున్న=చిలకరింపబడిన; ఉదకబిందుల తోన్=నీటి బిందువులతో; కూడక+ఉన్నయట్లు=కలవకున్నట్లుగనే; బ్రహ్మ విజ్ఞాని=బ్రహ్మ జ్ఞానము కలవాడు; తన మీఁదన్+పడిన+అట్టి=తనపై ప్రసరించినటువంటి; విషయ మలమునన్=విషయమనెడి మురికి యందు; పడక+ఉండు=పడకుండును; అనుభవింప కుండును కదా!

భావము :- ఓ పార్వతీ! తామరాకు తనమీద పడిన నీటి బొట్లతో కలవకుండునట్లుగనే బ్రహ్మజ్ఞాని తన మీద బడిన లౌకికమైన సుఖ దుఃఖములనెడి మురికి యందు పడడు.

విశేషము :- అలంకారము - ఉపమ.

తే॥ భక్షితంబైన విష మెట్లు కుక్షినఱుగు
విమల మణి మూలమంత్రౌషధములచేత
ననుభవించిన విషయంబు లట్లు యఱుగు
బ్రహ్మ విజ్ఞానమునఁ జేసి పరమ మునికి. 190

అర్థము :- పరమ మునికి=మహర్షికి; విమల=నిర్మలమైన; మణి=మణి; మూల+ చెట్టువేరు; మంత్ర=మంత్రము; ఔషధముల చేతన్=మందులచేత; భక్షితంబైన=తినబడి నటువంటి; విషము+ఎట్లు=విషమే విధముగ; కుక్షిన్=కడుపులో; అఱుగు=జీర్ణము అగునో; అట్ల=అదే విధముగ=అనుభవించిన=పొందిన; విషయంబులు=లౌకికమైన సుఖ దుఃఖములు; బ్రహ్మ విజ్ఞానమునన్+చేసి=బ్రహ్మజ్ఞానము చేత; అఱుగు= క్షీణించును.

భావము :- ఓ పార్వతీ! ఋషియైన వానికి పవిత్ర రత్నములు, చెట్టువేరులు గారుడాది మంత్రములు, మందులచేత తినిన విషమెట్లు పొట్టలో జీర్ణమగునో ఆ విధముగనే బ్రహ్మజ్ఞాన సంపాదనచేత అనుభవించిన లౌకికమైన సుఖదుఃఖములు క్షీణించును సుమా!

విశేషము :- విషము యొక్క విరుగుడుకు మణి, చెట్టు వేరు గారుడాది మంత్రములు - ఔషధములను వినియోగించుట ప్రాచీన వైద్య పద్ధతి.

శా॥ పూవుం బోణి! విశాలలక్ష్మిఁగనుచుం బుష్పంబు మూర్కొంచు వీ
ణావాద్యంబులు వించు నిష్ట మధురాన్నంబర్థి సేవించుచున్
వేవే భంగుల నిల్చుచున్నడచుచున్నిద్రించుచో యీశ్వరా!
నీవే కర్తవు సుమ్మటన్న పురుషు న్వేధింప వేదోషముల్. 191

అర్థము :- పూవుంబోణి=పూవు వంటి శరీరము కలదానా! ఓ పార్వతీ! విశాలలక్ష్మిన్=అనంతమైన సంపదను; కనుచున్=ఆశ్రయించుచు; పుష్పంబు=పూవులను; మూర్కొంచు=వాసన చూచుచు; వీణా వాద్యంబులు=వీణా వాదనలను; వించున్=వినుచును; ఇష్ట=ప్రియమైన మధుర+అన్నంబు=తీయనైన ఆహారమును; అర్థి=పూనికతో; సేవించుచున్=ఆరగించుచు; వేవే భంగుల=అనేక విధములుగా; నిల్చుచున్=నిలచుచు; నడచుచున్=నడచుచు; నిద్రించుచో=నిద్రించు చున్నపుడును; ఈశ్వరా!=ఓ పరమేశ్వకరా! నీవే=నీవే; కర్తవు=చేయువాడవు; సుమ్ము= సుమా! అటన్న=అని అనునట్టి; పురుషున్=జీవుని; ఏదోషముల్=ఏ పాపములును; వేధింపవు=బాధ పెట్టవు.

భావము :- ఓ పార్వతీ! అంతములేని సంపద లనుభవించుచు పూవును వాసన చూచుచు (సుఖమనుభవించుచు) వీణా గానములను వినుచు ఇష్టమైన మధురాన్నములను పూనికతో ఆరగించుచు నిల్చున్నపుడు నడచునపుడు నిద్రించునపుడును అనేక రీతులలో ఓ పరమేశ్వరా! అన్నింటికి నీవే కర్తవని భావించు జీవుని ఎట్టి పాపములు బాధింపవు సుమా!

తే॥ జ్ఞాన వైరాగ్య సంపన్నుడైన పెద్ద
నెఱుఁగ లేక యపహసించు నెవ్వఁడేని
వాఁడు గాల్పంగఁ బడుఁదీవ్ర వహ్నిశిఖల
రౌరవాదిక ఘోర నారకము లందు. 192

అర్థము :- జ్ఞాన=బ్రహ్మ జ్ఞానము; వైరాగ్య=ఇంద్రియ సుఖములను త్యజించి విరాగి యగుట యను; సంపన్నుఁడు+అయిన=సంపద కలవాడైన; పెద్దన్=గొప్పవానిని; ఎఱుఁగలేక=తెలిసికొనలేక; అపహసించున్=పరిహాసము చేయునట్టి; ఎవ్వఁడేని=ఎవడైనను; వాఁడు=అటువంటివాడు; రౌరవ+ఆదిక=రౌరవము మొదలైన; ఘోర=భయంకర మైన; నారకము లందు=నరకములందు; తీవ్ర=వాడియైన; వహ్ని శిఖలన్=అగ్ని జ్వాలలందు; కాల్పంగఁబడున్=దహింపబడును.

భావము :- బ్రహ్మ జ్ఞానమును వైరాగ్యమును పొందిన గొప్పవానిని గుర్తింపలేక పరిహసించిన వాడెవడైనను రౌరవాది నరకము లందు భయంకరమైన అగ్నిజ్వాలలలో కాల్చబడును.

విశేషము :- రౌరవాది నరకములు - చూడుడు. భీమ. 5-23.

సీ॥ సజ్జనుండైన దుర్జనుఁడైన మూర్ఖైనఁ
బండితుఁడైన నాతండె ఘనుఁడు
నిరపేక్షుఁ డాతండు నిర్వైరుఁడాతండు
సమదృష్టి యాతండు శాంతుఁడతఁడు
రాజిల జనులచేఁ బూజఁ గైకొనుమాడ్కి
నతఁడు దేవతలచే నర్చఁగాంచు
నతని పాదాబ్జంబులంటిన భూభాగ
మఖిల తీర్థములకు నభ్యధికము

తే॥ వాని జన్మంబు జన్మ మవ్వాఁడు సుకృతి
వాఁడు ద్రొక్కిన యిల్లిల్లు వాఁడు దైవ
మే కొఱంతయు లేకుండు నింతి యెఱుఁగు
బ్రహ్మ విజ్ఞానమయశీలి భాగ్యశాలి. 193

అర్థము :- ఇంతి=ఇల్లాలా! ఓ పార్వతీ! బ్రహ్మ విజ్ఞానమయ శీలి=బ్రహ్మ జ్ఞానముతో కూడిన నడవడి కలవాడైన; భాగ్యశాలి=సంపన్నుడు; ఏ కొఱంతయు=ఎట్టి లోటును; లేకుండు=లేకుండ ఉండును;

సజ్జనుండైన=మంచి వాడైనను; దుర్జనుఁడైన=చెడ్డవాడైనను; మూర్ఖ+ఐన=తెలివి తక్కువ వాడైనను; పండితుఁడైన=పండితుడైనను; అతండె=ఆ బ్రహ్మజ్ఞానియే; ఘనుఁడు= గొప్పవాడు;

అతండు=ఆ బ్రహ్మజ్ఞాని; నిరపేక్షుఁడు=కోరికలు లేనివాడు; అతండు=అతడే; నిర్వైరుఁడు=శత్రువులు లేనివాడు; అతండు=అతడే; సమదృష్టి=సర్వజీవులను సమముగ చూచువాడు; అతఁడు=అతడే; శాంతుఁడు=శాంతి కలవాడు;

రాజు=ప్రభువు; ఇల=భూమిపై; జనులచేన్=ప్రజలచేత; పూజన్+కైకొను మాడ్కి=పూజను గ్రహించు విధముగా; అతఁడు=ఆ బ్రహ్మజ్ఞాని; దేవతలచే=దేవతలచేత; అర్చఁగాంచున్=పూజలను పొందును;

అతని=ఆ బ్రహ్మజ్ఞాని యొక్క; పాద+అబ్జంబులు=పద్మముల వంటి పాదములు; అంటిన=తాకిన భూభాగము=నేల భాగము; అఖిల తీర్థములకు=సమస్తమైన తీర్థముల కన్నను; అభి+అధికము=మిక్కిలి గొప్పది;

వాని=ఆ బ్రహ్మ జ్ఞాని యొక్క; జన్మంబు=పుట్టుకయే; జన్మము=పుట్టుక; ఆ+వాఁడు= ఆ బ్రహ్మజ్ఞాని; సుకృతి=అదృష్టవంతుడు; వాఁడు=ఆ బ్రహ్మజ్ఞాని; త్రొక్కిన=అడుగుపెట్టిన; ఇల్లు=నివాసమే; ఇల్లు=నివాసము; వాడు=అతడే; దైవము=దేవుడు; ఎఱుఁగు=తెలిసి కొనుము.

భావము :- ఓ పార్వతీ! బ్రహ్మజ్ఞాన సంపన్నుడు సజ్జనుడైనను దుర్జనుడైనను మూర్ఖుడైనను పండితుడైనను బ్రహ్మజ్ఞానముచే అతడే గొప్పవాడు. అపేక్ష లేనివాడు. శత్రువులు లేనివాడు. సర్వజీవుల యందు సమభావము కలవాడు. శాంతి పొందినవాడు. భూమిమీద రాజు ప్రజలచే ఎట్లు గౌరవింపబడునో అట్లే బ్రహ్మ జ్ఞాని దేవతలచే పూజింపబడును. ఆతడు కాలుపెట్టిన చోటు తీర్థములన్నింటికన్న గొప్పది. వానిజన్మమే జన్మము. వాడే అదృష్ట వంతుడు. ఆతడు మెట్టిన ఇల్లే యిల్లు. అతడే దైవము. ఈ విషయమును తెలిసికొనుము.

తే॥ ఎవ్వనింటికి బ్రహ్మజ్ఞుఁ డేఁగుదెంచుఁ
బ్రియముఁగారుణ్యమును గల్గి భిక్షఁగొనఁగ
వానిఁ బితృదేవతలు హర్ష వైభవమునఁ
బొగడుదురు కేలి నర్త నా భోగకముగ. 194

అర్థము :- బ్రహ్మజ్ఞుఁడు=బ్రహ్మజ్ఞానము కల్గిన విరాగి; ప్రియమున్=ఇష్టము; కారుణ్యమును=దయా గుణమును; కల్గి=కలిగి యుండి; భిక్షన్=బిచ్చమును; కొనఁగన్= స్వీకరించుటకు; ఎవ్వని+ఇంటికి=ఎవని నివాసమునకు; ఏగుదెంచున్=వచ్చునో; వానిన్=ఆ ఇంటి వానిని; పితృదేవతలు=యముడు అగిష్వాత్తు మొదలైన పితృదేవతలు; హర్షవైభవము నన్=సంతోషము యొక్క విరివితో; కేలినర్తనాభోగకముగ=క్రీడతో కూడిన నాట్యముతో సంతృప్తి కలుగునట్లుగ పొగడుదురు.

భావము :- బ్రహ్మజ్ఞాన సంపన్నుడు ప్రీతి దయలతో (బిచ్చము) భిక్ష కొఱకు ఎవని యింటికి వచ్చునో ఆ ఇంటి యజమానుని పితృదేవతలు సంతోషాతి శయముతో క్రీడా నర్తనముతో సంతృప్తులై పొగడుదురు.

కం॥ అనుభవ పర్యంతం బె
వ్వని చిత్తము తత్త్వ వీథి వర్తించు మహా
త్మునిఁ నాతనిఁ బొడఁగను స
జ్జనులకు నాక్షణంబ కిల్బిషంబు లడంగున్. 195

అర్థము :- ఎవ్వని=ఎవని; చిత్తము=మనసు; అనుభవ పర్యంతంబు=ప్రత్యక్ష జ్ఞాన మున్నంత వరకు; తత్త్వ వీథిన్=బ్రహ్మ పదార్థమనెడి త్రోవ యందు; వర్తించున్=సంచరించు

చుండునో; మహాత్మునిన్=గొప్ప ఆత్మ కలవాడైన; ఆతనిన్=అతనిని; పొడఁగను=చూచు; సజ్జనులకున్= మంచి మానవులకు; ఆ క్షణంబ=వెంటనే; కిల్బిషంబులు=పాపములు; అడంగున్= అణగిపోవును.

భావము :- ప్రత్యక్ష జ్ఞానమున్నంత వరకు ఎవని హృదయము బ్రహ్మజ్ఞానమనెడి త్రోవ యందు సంచరించుచుండునో అతడు మహాత్ముడు. అట్టి వానిని దర్శించు సజ్జనులకు ఆక్షణమే పాపవినాశన మగును.

తే॥ అన్వయము పావనంబు కృతార్థుఁడతఁడు
పుణ్యవతి! వార్ధి వేష్టిత భూతధాత్రిఁ
జెలఁగి యోలాడు నెవ్వని చిత్త వృత్తి
సచ్చిదానందమయసుధాసాగరమున. 196

అర్థము :- పుణ్యవతి=సుకృతముకల దానా! ఓ పార్వతీ! వార్ధి వేష్టిత=సముద్రములచే చుట్టబడియున్న; భూతధాత్రిన్=సర్వజంతు జాలమును ధరించు భూమియందు; చెలఁగి= ప్రవర్తించి; ఎవ్వని=ఎవని యొక్క చిత్తవృత్తి=మనస్సు యొక్క నడవడి; సత్+చిత్+ ఆనందమయ=శాశ్వత జ్ఞాన సుఖ స్వరూపముతో కూడిన; సుధాసాగరమున=అమృత సముద్రమున; ఓలలాడున్=మనుగునో; అతఁడు=ఆ జీవి; కృతార్థుఁడు=కోరిక నెరవేరినవాడు; అన్వయము=ఆతని వంశము; పావనము=పవిత్రము.

భావము :- ఓ పార్వతీ! సముద్రములచే చుట్టబడియున్నదైన భూమి యందు ప్రవర్తించుచు ఎవడు మనసుచేత శాశ్వత జ్ఞానసుఖముల నిలయమనెడి పాలసముద్రమున క్రీడించునో అతడే కృతకృత్యుడు. అతని వంశము పవిత్రము.

తే॥ శ్రద్ధ గురుభక్తి విశ్వాస సౌష్ఠవంబు
జరిగెనేఁ గల్గు వేదాంత సంగ్రహంబు
జరగదా లేదు సత్యంబు సత్యమిదియు
బహువిధోక్తులపనయింపు బ్రహ్మ మిదియు. 197

అర్థము :- శ్రద్ధ=ఆసక్తి; గురుభక్తి=గురువు నందు భక్తి; విశ్వాస=నమ్మకముల యొక్క; సౌష్ఠవంబు=నిండుదనము; జరిగెనేన్=వ్యాపించినచో; వేదాంత సంగ్రహంబు=ఉపనిషత్తుల సారమును గ్రహించుట; కల్గున్=సంభవించును; జరుగదా=అట్లు జరుగని యెడల; సత్యంబు= పరమాత్మ; లేదు=తెలియబడదు; ఇదియు=ఇదికూడ; సత్యము=నిజము; బహు విధ=అనేక

విధములైన; ఉక్తులన్=మాటలను; అపనయింపు=తొలగించుము, బ్రహ్మము=బ్రహ్మజ్ఞానము; ఇదియు=ఇదియు; లేదు=తెలియబడదు.

భావము :- ఆసక్తి గురుభక్తి నమ్మకములు నిండుగ నున్నచో మాత్రమే జీవి ఉపనిషత్తుల సారమును గ్రహింపగలడు. అది జరగనిచో పరమాత్మను తెలిసికొనలేడు. పలు పల్కు లెందుకు! బ్రహ్మజ్ఞానమును పొందలేడు.

**వ॥ ఈ యర్థంబులు దేవతా గురు విశ్వాసంబులు గలవారికిఁ గాని ప్రకాశింపవని భవానికి భవుఁ డుపదేశించెనని మంకణునకు వసిష్ఠుడు చెప్పెనని శౌనకాది మహామునులకు సూతుండు వివరించె. 198**

అర్థము :- ఈ+అర్థంబులు=ఈ విషయములు; దేవతా=దేవతలందును; గురు=గురువుల యందును; విశ్వాసంబులున్=నమ్మకములు; కలవారికిన్+కాని=కల్గిన వారలకు గాని; ప్రకాశింపవు=తేటతెల్లము కావు; అని=అని; భవానికి=పార్వతికి; భవుఁడు=శంకరుడు; ఉపదేశించెన్+అని=బోధించెనని; మంకణునకు=మంకణ మునికి; వసిష్ఠుండు=వసిష్ఠ మహర్షి; చెప్పెను+అని=చెప్పినట్లుగా; శౌనక+ఆది=శౌనకుడు మొదలైన; మహామునులకు=మహర్షులకు; సూతుండు=సూతమహర్షి; వివరించె=వివరముగ చెప్పెను.

భావము :- ఈ విషయములు దేవతలందును గురువులందును నమ్మకములు గల వారలకు మాత్రమే తేటతెల్లమగును. అని పార్వతికి శంకరుడు బోధించెనని వసిష్ఠుడు మంకణ మునికి చెప్పినట్లుగా సూతముని శౌనకాది మహర్షులకు వివరించెను.

**శా॥ ఆకల్ప స్థిర ధర్మ వైభవ! దిశాహర్మ్యాగ్ర సంస్థాపితా**
**స్తోకస్ఫాటిక కుంభ విభ్రమ ధురా శుంభద్యశోమండలా!**
**రాకా చంద్రమసో విరాజ నవభద్రా! వీరభద్రేశ్వర**
**క్ష్మాకాంతాగ్రజ వేమ భూధవ కృపాసంవర్ధిత ప్రాభవా! 199**

అర్థము :- ఆ కల్ప...వైభవ. ఆ కల్ప=కల్పము వరకు; స్థిర=నిలుకడయైన; ధర్మ వైభవ=పుణ్యము యొక్క విరివి కలవాడా!; దిశా...మండలా!; దిశా=దిక్కులనెడి; హర్మ్య=మేడల యొక్క; అగ్ర=పైభాగమున; సంస్థాపిత=నెలకొల్పబడిన; అస్తోక=అనల్పమైన, స్ఫాటిక=స్ఫటికముల; కుంభ విభ్రమ=కుండల శోభయొక్క; ధురా=బరువు వలె; శుంభత్=ప్రకాశించు; యశః+ మండలా!=యశస్సు యొక్క వలయముకలవాడా!; రాకా...భద్రా!. రాకా=పున్నమినాటి; చంద్రమసః=చంద్రుని వలె; విరాజ=ప్రకాశించు; నవ+భద్రా=నూతన మంగళములు కలవాడా!; వీరభద్రేశ్వర...ప్రాభవా!; వీరభద్రేశ్వర=వీరభద్రభూపతి అను; క్ష్మాకాంత=భూపతి

యొక్క; అగ్రజ=అన్నయైన; వేమభూధవ=వేమ భూపాలుని యొక్క; కృపా=దయచేత; సంవర్ధిత=మిక్కిలిగా అభివృద్ధి చెందిన; ప్రాభవా!=దొరతనము కలవాడా!

భావము :- శాశ్వతమై స్థిరమైన పుణ్యము యొక్క ఏరిపి కలవాడా! దిక్కులనెడి మేడలపై నెలకొల్పబడిన పెద్దపెద్ద స్ఫటిక కుంభకాంతులతో అధికమై ప్రకాశించు యశోవలయము కలవాడా! పూర్ణిమా చంద్రునివలె ప్రకాశించు సజ్జనుడా! వీర భద్రభూపతికి సోదరుడైన వేమ భూపాలుని దయతో విశేషమైన అభివృద్ధిని పొందిన దొరతనము కలవాడా! ఓ అన్నయమంత్రీ!

కం॥ లింగన మంత్రి సహోదర!
గంగాధర దివ్య చరణ కమల నివాసా;
భంగాపరతంత్ర! సమి
ద్రంగార్జున! యిందుధరధరాధర ధీరా! 200

అర్థము :- లింగనమంత్రి=లింగన మంత్రికి; సహోదర=సోదరుడైన వాడా! గంగా... తంత్ర. గంగాధర=శంకరుని యొక్క; దివ్య=మహిమ గల; చరణ కమల=పద్మముల వంటి పదములే; నివాసా=నివాసముగ కలవాడా! భంగ=పరాజయమునకు; అపర తంత్ర=స్వాధీనము కానివాడా!; సమిత్+రంగ=యుద్ధ రంగమునందు; అర్జున=అర్జునుడవైన వాడా!; ఇందుధర=చంద్రశేఖరుడైన శంకరుని నివాసమైన; ధరాధర=కైలాస పర్వతము వంటి; ధీరా=స్థైర్యము కలవాడా!

భావము :- లింగనమంత్రికి సోదరుడవైనవాడా! పరమేశ్వరుని దివ్య పాదపద్మములే నివాసముగ గలవాడా! అపజయమునకు లొంగనివాడా! యుద్ధరంగమున అర్జునుడవైనవాడా! శంకర నివాసమైన కైలాస పర్వతము వలె స్థిరమైనవాడా! ఓ అన్నయమంత్రీ!

మాలిని :- రవి నిభ శుభ తేజా! రామమాంబా తనూజా
దివిజగురు చరిత్రా! దేవయామాత్య పుత్రా!
భువన భవన కీర్తీ! పుష్ప కోదండ మూర్తీ
ప్రవిమల గుణసంగా రాయ వేశ్యా భుజంగా! 201

అర్థము :- రవినిభ=సూర్యునితో సమమైన; శుభతేజా=మంగళకరమైన కాంతికలవాడా! రామమాంబా=రామమాంబాదేవికి; తనూజా!=కుమారుడవైన వాడా!; దివిజగురు=దేవగురువైన బృహస్పతి వంటి; చరిత్రా=నడవడి కలవాడా! దేవయ+అమాత్య+ పుత్రా=దేవయ మంత్రి యొక్క కుమారుడవైన వాడా! భువన భవన కీర్తీ=లోకములనెడి యిల్లంతయు వ్యాపించిన

కీర్తి కలవాడా! పుష్పకోదండ మూర్తీ=మన్మథుని వంటి రూపము కలవాడా! ప్రవిమల గుణసంగా=మిక్కిలి పవిత్రమైన సుగుణముల కలయిక కలవాడా!

భావము :- సూర్యుని వంటి తేజస్సు కలవాడా! రామామాంబాదేవికి కుమారుడైన వాడా! బృహస్పతి వంటి చరిత్ర కలవాడా! దేవయ మంత్రికి కుమారుడైనవాడా! లోకము లన్నింటికి విస్తరించిన యశస్సు కలవాడా! మన్మథుని వంటి రూపము కలవాడా! పరిశుద్ధమైన గుణ సమూహము కలవాడా! "రాయవేశ్యా భుజంగ" అను బిరుదు కలవాడా! ఓ అన్నయ మంత్రీ!

విశేషము :- మాలినీ వృత్త లక్షణము చూడుడు - భీమ 1-125

గద్య. ఇది శ్రీమత్కమలనాభ పౌత్ర మారయామాత్య పుత్ర సుకవిజనవిధేయ శ్రీనాథ నామధేయ ప్రణీతంబైన శ్రీ భీమేశ్వర పురాణంబను మహా ప్రబంధంబు నందుఁ బంచమాశ్వాసంబు.

ఇది

శ్రీ భీమేశ్వర పురాణ పంచమాశ్వాసమునకు

**దక్షిణ కాశిక**

అను ప్రతిపదార్థ భావ విశేష సహిత వ్యాఖ్యానము

# శ్రీ భీమేశ్వర పురాణము

## షష్ఠాశ్వాసము

## దక్షిణ కాశికా వ్యాఖ్యానము

శ్రీ మహిత దక్షవాటీ
భీమేశ్వర పాదపద్మ పీఠాతిరసా
సామర్థ్య సుప్రవృద్ధమ
హామహిమా! బెండపూఁడి యన్నామాత్యా! 1

అర్థము :- శ్రీ మహిత=ఐశ్వర్యముతో గొప్పదైన; దక్షవాటీ=దక్షారామ పుణ్య ప్రదేశము నందలి; భీమేశ్వర=శ్రీ భీమేశ్వర స్వామి యొక్క; పాదపద్మ పీఠ=చరణ కమలముల పీఠము యొక్క; అతిరసా=భూమిని అతిక్రమించు; సామర్థ్య=శక్తిచేత; సుప్రవృద్ధ=బాగుగా పెంపొందిన; మహామహిమా=గొప్పదైన మహత్త్వము కల; బెండపూఁడి అన్నామాత్యా= ఓ బెండపూడి అన్నయ మంత్రీ! (వినుము).

భావము :- శ్రీమంతమైన దక్షారామ క్షేత్రము నందలి శ్రీ భీమేశ్వర స్వామి వారి పాదపీఠము సమస్త భూమండలము కన్న మిన్నయైనది. ఆ పాద పీఠ శక్తిచేత బాగుగా వృద్ధి చెందిన గొప్ప మహత్త్వము గల ఓ బెండపూడి అన్నయ మంత్రీ! (వినుము).

విశేషము :- సుప్రవృద్ధ=సు+ప్ర+వృద్ధ. ఇట్లు ఒకటి కంటె ఎక్కువ ఉపసర్గలతో పదములను కూర్చుట శ్రీనాథుని లేఖినికి ఇష్టము. చూడుడు భీమ. 5-114 విశేషము.

వ॥ అక్కథకుండు శౌనకాది మహామునుల కిట్లని చెప్పందొడంగె. 2

అర్థము :- అ+కథకుండు=కథను చెప్పువాడగు సూతుడు; శౌనక+ఆది=శౌనకుడు మొదలైన; మహామునులకు=గొప్ప ఋషులకు; ఇట్లు+అని=ఈ విధముగ; చెప్పన్+తొడంగె=చెప్పసాగెను.

భావము :- కథను చెప్పు సూతమహర్షి శౌనకాదులగు మహామునులకు ఈ విధముగ చెప్పసాగెను.

సీ॥ వినుఁడు సద్యోముక్తి విభవైక కారణం
బామ్నాయ విద్యా రహస్య పథము
దక్షవాటీ మహా స్థాన మాహాత్మ్యంబు
వెండియుఁ బరిపాటి విస్తరింతు
నాదిలోకేశ్వరి యఖిల తత్త్వేశ్వరి
భోగ మోక్ష ఫలానుభూతి ధాత్రి
సంపూర్ణ విజ్ఞాన శాలిని కల్యాణి
శైలేంద్ర తనయ హస్తములు మొగిచి

తే॥ పశుపతికి నిట్టులని విన్నపంబు చేసె
దేవదేవ! జగన్నాథ! దివిజ వంద్య!
దేవ తిర్యఙ్మనుష్యాది దీన సంస్థ!
యభవ! కృప నాదు విన్నపం బవధరింపు. 3

అర్థము :- సద్యః+ముక్తి=వెనువెంటనే మోక్షమను; విభవైక కారణంబు. విభవ=సంపదకు; ఏక కారణంబు=ఒకే ఒక హేతువు; ఆమ్నాయ విద్యా= వేద విద్య యొక్క; రహస్య=నిగూఢమైన; పథము=మార్గము;

దక్షవాటీ=దక్షారామ మనెడు; మహాస్థాన=గొప్ప ప్రదేశము యొక్క; మాహాత్మ్యంబు= మహిమను; వెండియున్=ఇంకను; పరిపాటిన్=క్రమక్రమముగ; విస్తరింతున్=వివరింతును; వినుఁడు=ఆలకింపుడు;

ఆది లోకేశ్వరి=పరమేశ్వరి; అఖిల తత్త్వ+ఈశ్వరి=సమస్త తత్త్వములకు యజమానురాలు; భోగ=వైభవము యొక్క; మోక్ష=ముక్తి యొక్క; ఫల=ఫలితమును; అనుభూతి=కలిగించుటలో; ధాత్రి=తల్లి;

సంపూర్ణ=సమస్తమైన; విజ్ఞానశాలిని=జ్ఞానముతో సంపన్నురాలు; కల్యాణి=మంగళ రూపిణి యగు; శైల+ఇంద్ర=పర్వత రాజు యొక్క; తనయ=పుత్రిక (పార్వతి); హస్తములు మొగిచి=చేతులు జోడించి;

పశుపతికిన్=పరమేశ్వరునకు; ఇట్టులు+అని=ఈ విధముగా; విన్నపంబు చేసె= విన్నవించెను; దేవదేవ=ఓ దేవదేవా! జగన్నాథ=లోకముల కన్నింటికి పతియైనవాడా!

దివిజ వంద్య=దేవతలచే నమస్కరింపబడు వాడా! దేవ=దేవతలు; తిర్యక్=జంతువులు; మనుష్య=మానవులు; ఆది=మొదలైన; దీన=పీడితుల యందు; సంస్థ=సమానత గలవాడా! అభవ=పుట్టుక లేనివాడా!; కృపన్=దయతో; నాదు=నా యొక్క; విన్నపంబు=విజ్ఞప్తిని; అవధరింపు=వినుము.

భావము :- వెనువెంటనే మోక్షము నొసగుటకు ఏకైక కారణమైనది, వేద విద్యా రహస్యము నెరుగు మార్గ మనదగిన దక్షారామ క్షేత్ర మహత్త్వమును క్రమముగ వివరించెదను. పరమేశ్వరి, జగన్మాత, భోగ మోక్ష ఫలములను కల్గించుటలో తల్లియు, పర్వత రాకుమారియు, సమస్త విజ్ఞాన సంపన్నయు, మంగళ రూపిణియు ఐన పార్వతీ దేవి పరమేశ్వరున కిట్లు విన్నవించెను. ఓ దేవదేవా! జగత్పతీ! సమస్త దేవతా సమూహములచే నమస్కరింప బడువాడా! దీనులైన దేవతలు పశుపక్ష్యాదులు మానవులందును సమానుడా! ఓ అభవా! దయతో నా వినతిని వినుము.

వ॥ సద్యో ముక్తిదం బెయ్యది? పుణ్యస్థానం బెయ్యది? యానతిం డనుటయు జగద్ధితార్థంబుగా నా వృషభ ధ్వజుండు భవాని నభినందించి యిట్లని యానతిచ్చె. 4

అర్థము :- సద్యః=వెంటనే; ముక్తిదంబు=మోక్షము నిచ్చునది; ఏ+అది=ఏది; పుణ్య=పుణ్యముల కన్నింటికి; స్థానంబు=నెలవైనది; ఏ+అది=ఏది; ఆనతి+ఇండు=సెలవిండు; అనుటయున్=అనగా; ఆ+వృషభధ్వజుండు=ఎద్దును ధ్వజముగా కల్గిన ఆ పరమేశ్వరుడు; జగత్+హిత+అర్థంబుగాన్=ప్రపంచమునకు మేలు చేకూర్చునట్లుగా; భవానిన్=పార్వతిని; అభినందించి=ప్రశంసించి; ఇట్లు+అని=ఈ విధముగ ఆనతి+ఇచ్చె=ఆజ్ఞ నిచ్చెను.

భావము :- వెనువెంటనే మోక్షము నిచ్చునది పుణ్య స్థాన మైనట్టిది ఏదియో చెప్పుడని పార్వతి అడుగగా విశ్వ కల్యాణార్థమై పరమేశ్వరుడు పార్వతి నభినందించి ఈ విధముగా ఆనతిచ్చెను.

క॥ సద్యో ముక్తి కరంబును
సద్య స్సౌఖ్య ప్రదంబు సద్యోదురిత
ప్రోద్యమ భంగకరంబును
సద్యస్సకలార్థ సిద్ధి సంపాదియునై. 5

**అర్థము** :- సద్యః=వెనువెంటనే; ముక్తికరంబును=మోక్షమును ఇచ్చునట్టిదియు; సద్యః=వెనువెంటనే; సౌ[illegible]=సుఖములను; ప్రదంబును=ఇచ్చునట్టిదియు; సద్యో...కరంబును; సద్యః=వెనువెంటనే; [illegible]రిత=పాపముల యొక్క; ప్ర+ఉద్యమ=గొప్ప ప్రయత్నములకు;

భంగకరంబును=నాశనము జేయునట్టిదియు; సద్య...పాదియున్. సద్యః=వెనువెంటనే; సకల=సమస్తమైన; అర్థ=సంపదల; సిద్ధి=ఫలములను; సంపాదియున్=సంపాదించు నట్టిదియును; ఐ=అయియుండి.

భావము :- వెంటనే భోగ మోక్షములను చేకూర్చునట్టిది, వెనువెంటనే పాప సమూహ ముల ప్రయత్నములను నాశనము చేయునట్టిదియు, వెన్వెంటనే సమస్తసంపదలను కలుగ జేయునట్టిదియును అయి (తరువాతి పద్యముతో అన్వయము)

సీ॥ దర్శన మాత్ర నే దైవత గ్రామణి
జనులకు భోగ మోక్షము లొసంగు
నమృతాబ్ధి మధ్యంబు నందు నే వేల్పు ఱేఁ
డుర్వి లింగాకృతి నుదయ మొందె
మార్తాండుచే సప్త మౌని ముఖ్యులచేఁ బ్ర
తిష్ఠఁ గైకొనియె నే దివ్య మూర్తి
యప్సర స్త్రీ కటాక్షావలోకన కళా
పాథేయ మెవనికిఁ బ్రాహుణికము

తే॥ విశ్వపతి భీమనాథ నామేశ్వరుండు
శివుఁడతండు వసించు నే క్షేత్ర సీమ
నట్టి శ్రీ దక్షవాటీ మహాపురంబు
భుక్తి ముక్తులు రెంటికిఁ బుట్టినిల్లు. 6

అర్థము :- దర్శన మాత్రన్=దర్శించు కొనిన క్షణముననే; ఏదైవత గ్రామణి=ఏ దేవతా శ్రేష్ఠుడు; జనులకు=జీవులకు; భోగమోక్షములు=భోగమును మోక్షమును; ఒసంగున్= ఇచ్చునో;

అమృత+అబ్ధి=పాలసముద్రము యొక్క; మధ్యంబునందున్=మధ్యమున; ఏవేల్పు ఱేఁడు=ఏ దేవతారాజు; ఉర్వి=భూమిపై; లింగ+ఆకృతిన్=లింగాకారముతో; ఉదయము+ ఒందె=పుట్టెనో;

మార్తాండుచే=సూర్యునిచే; సప్త మౌని ముఖ్యులచేన్=ప్రధానులైన సప్తర్షుల చేతను; ఏ దివ్యమూర్తి=దివ్యత్వము మూర్తీభవించిన ఏ స్వామి; ప్రతిష్ఠన్=ప్రతిష్ఠను; కైకొని యెన్=స్వీకరించెనో;

అప్సరస్+స్త్రీ=అప్సరః కాంతల యొక్క; కటాక్ష=కడకంటితో; అవలోకన=చూచుట యను; కళా=విద్య యనెడి; పాథేయము=దారి బత్తెము; ఎవనికిన్=ఏ స్వామికి; ప్రాహుణికము=అతిథ్యమగునో;

విశ్వపతి=జగన్నాథుడు; భీమనాథ=భీమనాథుడను; నామ=పేరుగల; ఈశ్వరుండు= ఈశ్వరుడు; శివుఁడు=శంకరుడు; అతండు=ఆయన; ఏ క్షేత్రసీమన్=ఏ క్షేత్ర ప్రదేశములో; వసించున్=నివసించునో; అట్టి=ఆ విధమైన; శ్రీ దక్షవాటీ=శ్రీ దక్షారామమనెడి; మహాపురంబు= గొప్ప నగరము; భుక్తిముక్తులు=భోగము మోక్షము అను; రెంటికిన్=రెంటింటికిని; పుట్టినిల్లు= జన్మస్థలము.

భావము :- కేవలము దర్శించుకొన్న మాత్రముననే జీవులకు ఏ దేవతా శ్రేష్ఠుడు భోగ మోక్షములను ప్రసాదించునో; పాలసముద్రమధ్యమున ఏ దేవతా రాజు లింగాకారముతో ఉద్భవించి భూమిపై వెలసెనో; సూర్యుని చేతను సప్తర్షుల చేతను ఏ దివ్యమూర్తి ప్రతిష్ఠను పొందెనో; అప్సరః కాంతల కడగంటి చూపుల విద్యయనెడి దారిబత్తెము ఏ స్వామికి ఆతిథ్యమైనదో; జగన్నాథుడు, భీమనాథ నామధేయుడైన ఈశ్వరుడు ఏ క్షేత్రములో నివసించునో అట్టి శ్రీ దక్షారామ మహాక్షేత్రము భుక్తికిని, ముక్తికిని జన్మస్థలము.

విశేషము :- కటాక్షము - "హర్షప్రసాద జనితా కాంతాత్యార్థం సమన్మథా
సభ్రూక్షేప కటాక్షా చ శృంగారే దృష్టిరిష్యతే॥"
పుట - 305 - నాట్య వేదము - జమ్ములమడక మాధవరామ శర్మ.

ఇష్ట ప్రాప్త జనితమైన, మన్మథ వికార సంబంధమైన, ప్రణయహేతుకమైన, శృంగార దృష్టి విశేషమే కటాక్షము. అట్టి కటాక్షమునకు పాథేయము రతిసౌఖ్యము. అదే జీవనోత్పత్తికి హేతువు. ఆ హేతువు భీమేశ్వరునకు ఆతిథ్యమాను. లయకారునకు సృష్టియే ఆతిథ్య మొసగును కదా!

ప్రాహుణికము :- ఈ శబ్దము శ్రీహర్షుని నైషధీయ చరితము నందు (2 స-56 శ్లో.) కలదు. శ్రీనాథ మహాకవి ముచ్చటపడి భీమేశ్వర పురాణమున ప్రస్తుత పద్యము నందు, కాశీ ఖండమున 3 ఆ. 190 పద్యము నందు ఈ శబ్దము గ్రహించినాడు.

**వ॥ తొల్లి కృత యుగంబున నమ్మహాస్థానంబున సంశ్రితవ్రతులును త్రికాల విహితా చరిత స్నానులును భస్మోద్ధూళిత సర్వాంగులును రుద్రాక్షమాలికాభరణులును జటావల్కల ధారులును శంభులింగార్చనా పరాయణులును నగు మహామునులు పెద్ద కాలంబు ఘోరతపంబుఁ జేసిన నత్తపోధనుల యుత్తమ తపంబునకుఁ**

చిత్తంబునఁ బ్రసాదంబు వహించి మంకణ సంకల్ప కల్పవృక్షంబగు నయ్యహికంకణుండు ప్రత్యక్షంబైన నద్దక్షవాటికాధ్యక్షుని సాక్షాత్కారంబు వీక్షించి పరమర్షులు హర్షోత్కర్షంబు నొంది యందంద దండ ప్రణామంబు లాచరించి హస్తారవిందంబులు మొగిడ్చి యిట్లనిరి. 7

అర్థము :- తొల్లి=పూర్వము; కృతయుగంబునన్=కృతయుగములో; ఆ+మహా+ఆస్థానంబున=ఆ గొప్ప ప్రదేశములో; సంశ్రిత వ్రతులును=ఆశ్రయింపబడిన నియమములు కలవారు; త్రికాల...స్నానులును. త్రికాల=మూడు వేళలందు; విహిత=విధింపబడిన; ఆచరిత స్నానులును=చేయబడిన స్నానములు కలవారును; భస్మ...అంగులును. భస్మ+ఉద్ధూళిత=విబూదితో అలదబడిన; సర్వ+అంగులును=అన్ని శరీర అవయవములు కలవారును; రుద్రా...భరణులును. రుద్రాక్షమాలికా=రుద్రాక్షల మాలలే; ఆభరణులును=ఆభరణములుగ కలవారును; జటా...ధారులును. జటా=జడలను; వల్కల=నారబట్టలను; ధారులును=ధరించిన వారును; శంభు...యణులునున్. శంభులింగ=శివలింగమును; అర్చనా=పూజించుటలో; పరాయణులు నున్=తత్పరులైన వారును; అగు=అయినట్టి; మహామునులు=మహర్షులు; పెద్దకాలంబు=చాలకాలము; ఘోరతపంబున్=తీవ్రమయిన తపస్సును; చేసినన్=చేయగా; ఆ+తపోధనుల=తపస్సే ధనముగా గల ఆ మునుల యొక్క; ఉత్తమ=శ్రేష్ఠమైన; తపంబునకున్=తపస్సునకు; చిత్తంబునన్=మనసులో; ప్రసాదంబు=ఆనందమును; వహించి=పొంది; మంకణ=మంకణ ముని యొక్క; సంకల్ప=కోరికలకు; కల్ప వృక్షంబు+అగున్=కల్పవృక్షమైనట్టి; ఆ+అహి కంకణుండు=సర్పములనే కంకణములుగ గల ఆ ఈశ్వరుడు; ప్రత్యక్షంబు+ఐనన్=ప్రత్యక్షము కాగా; ఆ+దక్షవాటికా+అధ్యక్షుని=ఆ దక్షారామ నాయకుడైన వాని; సాక్షాత్కారంబు=ప్రత్యక్ష మగుటను; వీక్షించి=చూచి; పరమర్షులు=శ్రేష్ఠులైన మునులు; హర్ష+ఉత్కర్షంబున్=ఆనందాతిరేకమును; ఒంది=పొంది; అందంద=అచ్చటచటనే; దండ ప్రణామంబులు=సాష్టాంగ నమస్కారములను; ఆచరించి=చేసి; హస్త+అరవిందంబులు=కరకమలములు; మొగిడ్చి=జోడించి; ఇట్లు+అనిరి=ఈ విధముగా పల్కిరి.

భావము :- పూర్వము కృతయుగములో దక్షారామము నందు నియమ వ్రతశీలురు, త్రికాల స్నానములు చేసి సర్వావయములకు విబూదిని అలదుకొని రుద్రాక్షమాలలను ఆభరణములుగ ధరించి నారచీరలను గట్టి జడదారులై శివలింగార్చన యందు తత్పరులైన మహామునులు చాలకాలము తీవ్రమయిన తపము చేసిరి. ఆ తపోధనుల తపస్సునకు ఆనందించి మంకణముని సంకల్పమునకు కల్పవృక్షమైన పరమేశ్వరుడు ప్రత్యక్షమయ్యెను. ఆ దక్షపురాధీశుని దర్శనముతో మహామునులందరు అత్యంతానందమును పొంది సాష్టాంగ నమస్కారములు చేసిరి. చేతులు జోడించి నమస్కరించి ఈ విధముగా పల్కిరి.

తే॥ ఓ సదాశివ! యోదేవ! యో మహాత్మ!
యో విరూపాక్ష! యో మహాదేవ! యభవ!
వరముఁ గృప సేయు మీ దక్షవాటమునకు
మ్రొక్కెదము మేము మీ పదాంభోజములకు. 8

అర్థము :- ఓ సదాశివ=ఓ నిత్య మంగళ స్వరూపుడా! ఓ దేవ=ఓ దేవుడా! ఓ మహాత్మ=ఓ శ్రేష్ఠమైన ఆత్మ స్వరూపుడా! ఓ విరూపాక్ష=ఓ బేసి కన్నుల స్వామీ! ఓ మహాదేవ=ఓ శ్రేష్ఠుడవైన దేవా!; అభవ=పుట్టుక లేనివాడా! ఈ దక్షవాటమునకు=ఈ దక్షారామమునకు; వరమున్=వరమును; కృపసేయుము=దయ చేయుము; మీ+పద+అంభోజములకు=మీ పాద పద్మములకు; మేము=మేమందరము; మ్రొక్కెదము=నమస్కరించెదము.

భావము :- ఓ నిత్యమంగళ స్వరూపా! దేవా! మహాత్మా! విరూపాక్షా! అభవా! మేమందరము నీ పాదపద్మములకు అంజలి మ్రొక్కెదము. ఈ దక్షారామమునకు వరమును ప్రసాదింపుము.

విశేషము :- చాలకాలము ఘోరతపము చేసిన మహర్షులు స్వార్థమునకు కాక లోకహితార్థము పరమేశ్వరుని - దక్షారామమునకు వరము గోరుట వారి ఉదాత్త చిత్తములకు ప్రతీక.

క॥ సద్యో భోగశ్రీ యును
సద్యః కైవల్య విభవ సౌలభ్యంబు
న్విద్యా సముద్యమంబు న
విద్యానాశంబు దక్షు వీటికి వలయున్. 9

అర్థము :- దక్షు వీటికిన్=దక్షారామమునకు; సద్యః=తత్క్షణమే; భోగ=అనుభవమునకు వలయు; శ్రీయును=సంపదయును; సద్యః=వెంటనే; కైవల్య=ముక్తి యొక్క; విభవ=వైభవము యొక్క; సౌలభ్యంబున్=సులభత్వమును; విద్యా+సముద్యమంబున్=జ్ఞానమునందు తత్పరతను; అవిద్యా+నాశంబు=అజ్ఞానము యొక్క నాశనము; వలయున్=(వరముగ) కావలయును.

భావము :- తత్క్షణాను భవమునకు వలయు సంపదయును, వెంటనే కలుగు మోక్ష వైభవము యొక్క సులభత్వమును; జ్ఞానతత్పరతయును అజ్ఞాన వినాశమును ఈ దక్షారామ నగరమునకు వరముగ అనుగ్రహింపవలెను.

చ॥ అనఁగఁ బ్రహృష్టచిత్తుఁడయి యర్ధశశాంక కిరీటుఁ డప్పు డి
ట్లను దగ నూర్ధ్వరేతసుల కమ్మునిముఖ్యులకు న్విశుద్ధవ
ర్తనులకు నిచ్చితి న్వరము దక్షుని వీటికి దక్షవాటికి
న్ననుపమ రత్నపేటికి మనఃప్రమదావహవస్తు కోటికిన్. 10

అర్థము :- అనఁగన్=అని కోరగా; అర్ధ శశాంక కిరీటుఁడు=అర్ధ చంద్రుడు కిరీటముగ గల శంకరుడు; ప్రహృష్ట చిత్తుఁడు+అయి=సంతసించిన మనసు కలవాడై; అపుడు=ఆ సమయమున; ఊర్ధ్వరేతసులకున్=వీర్యపతనము కానీయనివారికి; విశుద్ధ వర్తనులకున్= పవిత్రమైన ఆచరణ కలవారు నైన; ఆ+ముని ముఖ్యులకున్=ఆ ముని శ్రేష్ఠులకు; తగన్= తగినట్లుగా; ఇట్లు+అనున్=ఈ విధముగ పల్కెను; అనుపమ=సాటిలేని; రత్నపేటికి= రత్నముల పెట్టెకు; మనస్=మనసునకు; ప్రమద+ఆవహ=మిక్కిలి సంతోషమును కూర్చునట్టి; వస్తుకోటికిన్=వస్తురాశి కలదగు; దక్షుని వీటికి=దక్షుని నగరమైన; దక్షవాటికిన్= దక్షారామము నకు; వరము=వరమును; ఇచ్చితిన్=ప్రసాదించితిని.

భావము :- అని మహర్షులు ప్రార్థింపగా చంద్రశేఖరుడైన శంకరుడు సంతసించి నైష్ఠిక బ్రహ్మచారులు, పవిత్రమైన నడవడి కలవారు అయిన ఆ మహర్షులతో ఇట్లు పల్కెను. అమూల్య రత్నములకు పెట్టెయు మానసానందకరములైన వస్తురాశి కలదియు దక్షుని నగరమునైన ఈ దక్షారామమునకు వరము ప్రసాదించితిని.

తే॥ ఎల్ల కాలంబు నుండెద నిచట నేను
మొదలి మామామ యారామపదము నందు
వెండి గుబ్బలిపై వేడ్క వీడు కొల్పి
మేరు నగరాజుపైఁ జాల మెచ్చు వదలి. 11

అర్థము :- నేను=నేను; వెండి గుబ్బలిపైన్=కైలాస పర్వతము పైన; వేడ్కన్=వేడుకను; వీడు కొల్పి=వదలివేసి; మేరు నగరాజుపైన్=మేరువను కొండ రాజుపైన; చాల+మెచ్చున్=మిక్కిలి ప్రీతిని; వదలి=వదలిపెట్టి; మొదలి+మామామ=మొదటి నామామ యొక్క; ఆరామ పదము నందున్=విహార స్థలము నందు; ఇచట=ఈ దక్షారామము నందు; ఎల్లకాలంబున్=నిత్యము; ఉండెదన్=నివసించెదను.

భావము :- నేను కైలాస పర్వతముపై గల ప్రీతి వదలి, మేరు పర్వతముపై గల మిక్కిలి ప్రేమను విడిచిపెట్టి నా మొదటి మామయైన దక్షునకు నివాస స్థానమైన ఈ దక్షారామము నందు ఎల్లవేళల నివసింతును.

సీ॥ అగ్రజుండైనను నంత్యజుండైనను
బూఁబోఁడి యైనను బురుషుఁడైన
బరమ మూర్ఖుండైనఁ బండితుండైనను
దారిద్ర్యగుండైన ధనికుఁడైనఁ
బలవంతుఁడైనను బలహీనుఁడైనను
బ్రాయంపు వాఁడైనఁ బంగువైన
నాస్తికుండైనను నన్నృతవాదియునైనఁ
బరఁగ గార్దభమైనఁ బంది యైనఁ

తే॥ గీటకంబైన బకమైనఁ గ్రిమియునైనఁ
బాదపంబైనఁ దృణమైనఁ బ్రాణ రహిత
మై రహిని దక్షవన చతుర్ద్వార సీమఁ
బొందుఁ గైవల్య కళ్యాణ భోగలక్ష్మి. 12

అర్థము :- అగ్రజుండు+ఐననున్=మున్ముందు పుట్టిన వాడైనను (అగ్రకులమున పుట్టిన వాడైనను); అంత్యజుండు+ఐననున్=కడపట పుట్టిన వాడైనను (నీచకులమున పుట్టిన వాడైనను); పూఁబోఁడి+ఐననున్=పూవు వంటి సుకుమారియైన స్త్రీ యైనను; పురుషుఁడు+ఐనన్=మగవాడైనను;

పరమ మూర్ఖుండు+ఐనన్=అత్యంత మూఢుడైనను; పండితుండు+ఐనను=విద్వాంసుడైనను; దారిద్ర్యగుండు+ఐన=బీదతనము నందిన వాడైనను; ధనికుండు+ఐనన్=ఐశ్వర్యవంతుడైనను;

బలవంతుఁడు+ఐనను=బలము కలవాడైనను; బలహీనుఁడు+ఐననున్=దుర్బలుడైనను; ప్రాయంపువాఁడు+ఐనన్=యువకుడైనను; పంగువు+ఐనన్=కుంటివాడైనను;

నాస్తికుండు+ఐననున్=దైవ విశ్వాసము లేనివాడైనను; అనృతవాదియున్+ఐనన్=అసత్యవాది యైనను; గార్దభము+ఐనన్=గాడిదయైనను; పంది+ఐనన్=పందియైనను;

కీటకంబు+ఐన=పురుగైనను; బకము+ఐనన్=కొంగయైనను; క్రిమియున్+ఐనను=క్రిమియైనను; పాదపంబు+ఐనన్=చెట్టు అయినను; తృణము+ఐనన్=గడ్డిపరకైనను; పరఁగన్=ఒప్పునట్లుగా; దక్షవన=దక్షారామము యొక్క; చతుః=నాలుగైన; ద్వారసీమన్=ద్వారముల మధ్య ప్రదేశములో; ప్రాణరహితమై=ప్రాణము విడిచినదై; రహిని=సంతోషముతో;

కళ్యాణ=శుభప్రదమైన; కైవల్య=మోక్షమను; కళ్యాణ+భోగలక్ష్మి=శుభప్రదమైన భోగమనెడి ఐశ్వర్యమును; పొందున్=పొందును.

భావము :- మానవజాతిలో నున్న వివిధ వర్ణములలో వర్గములలో అగ్రజుడైనను, కడవాడైనను; స్త్రీ యైనను, పురుషుడైనను; పరమ మూర్ఖుడైనను, పండితుడైనను; దరిద్రుడైనను; ధనవంతుడైనను; బలవంతుడైనను; బలహీనుడైనను; యువకుడైనను, అవిటివాడైనను; నాస్తికుడైనను, అసత్యవాదియైనను; గాడిదయైనను పందియైనను; క్రిమికీటకము లైనను, కొంగ యైనను, చెట్టైనను, గడ్డిపరకైనను, దక్షారామ సీమలో ప్రాణములు విడిచి కైవల్య సిద్ధిని పొందును.

**విశేషము** :- జగత్తు - జీవరాశి :-

శ్లో॥ స్థావరం జంగమం చేతి జగత్ ద్వివిధముచ్యతే।
చతస్రో యోనయస్తత్ర ప్రజానాం క్రమశో యథా॥

ఈ జగత్తు స్థావరము (చలనము లేనివి) లు, జంగము (చలనము కలవి)లతో కూడి యుండును. ఇందులో జీవులు నాలుగు విధములైన యోనుల నుండి జన్మించును.

శ్లో॥ తేషా ముద్భిదజా వృక్షా లతా వల్లయశ్చ వీరుధః।
దంశయూకాద యాశ్చాన్యే స్వేదజాః కృమిజాతయః॥

శ్లో॥ పక్షిణా శ్ఛిద్ర కర్ణాశ్చ ప్రాణిన స్త్వండజామతాః।
మృగశ్యాల మనుష్యాంశ్చ విద్ధి తేషాం జరాయుజాన్॥

ఇందు వృక్షములు లతలు వల్లరులు మరియు తృణములు ఉద్భిజ్జములు. భూమిని భేదించుకొని పుట్టునవి గనుక ఉద్భిజ్జములు. దోమలు, పేలు మున్నగునవి స్వేదజములు. ఇవి చెమట నుండి పుట్టునవి కనుక ఇవి స్వేదజములు.

రెక్కలు కలవి, చెవి స్థానమున ఛిద్రములు కలవి అండజములు - (గ్రుడ్డు నుండి పుట్టునవి) పక్షులు, పాములు, బల్లులు, చేపలు మొదలగునవి.

పశువులు హింసకములైన పులులు, సింహములు మరియు మనుష్యులు జరాయుజములు. జరాయుజములనగా మావి నుండి పుట్టునవి.

శ్లో॥ ఏవం చతుర్విధాం జాతి మాత్మా సంస్కృత్య తిష్ఠతి॥

ఈ విధముగ ఆత్మ నాల్గు విధములైన జాతులను ఆశ్రయించి యుండును.

క్రిమి :- శరీరము లోపల పుట్టి నల్లని దేహము కలది క్రిమి. కృమి అనియు అందురు.

కీటకము :- బయట పుట్టిన చిన్న ప్రాణి కీటకము.

"నీలాంగో కృమి రంతర్జః క్షుద్రః కీటో బహిర్భవః" - వైజయంతీ కోశము - పాతాలకాండ-సరీసృపాధ్యాయము - 39 శ్లో.

ఉ॥ ప్రాణ వియోగ వేళ నరపక్షి మృగాళికి దక్షవాటికా
క్షోణినిఁ దారకంబుఁ బుర సూదనుఁ డానతి యిచ్చు చుండఁగన్
బాణి బిస ప్రసూనములఁ బయ్యెద నొయ్యన వీచుచుండు శ
ర్వాణి త్రిలోక మాత బలవన్మరణ శ్రమ భార శాంతికిన్. 13

అర్థము :- దక్షవాటికా క్షోణినిన్=దక్షారామ భూమి యందు; ప్రాణ=ప్రాణములతో; వియోగవేళన్=ఎడబాటుగలుగు సమయమున; నర=నరుల; పక్షి=పక్షుల; మృగ=జంతువుల; ఆళికిన్=సమూహమునకు; పురసూదనుఁడు=(పురములను నశింప జేయువాడు) పరమ శివుడు; తారకంబున్=తారక మంత్రమును; ఆనతి+ఇచ్చు చుండఁగన్=చెప్పుచుండగా; త్రిలోకమాత=ముల్లోకములకు తల్లియైన; శర్వాణి=పార్వతి; బలవత్+మరణ=బలవంతముగ ప్రాణములు వీడుట యందు కలుగు; భార=బలవత్తరమైన; శ్రమ=కష్టము; శాంతికిన్= శాంతించుటకు; పాణి=చేతిలో; బిసప్రసూనములన్=తామర పూవులతో; పయ్యెదన్= పైటతో; ఒయ్యనన్=మెల్లమెల్లగ; వీచుచుండున్=విసరుచుండును.

భావము :- పవిత్రమైన దక్షారామ క్షేత్రమున నరులు గాని పక్షులు గాని జంతువులు గాని ప్రాణములు విడుచువేళ పరమేశ్వరుడు తారక మంత్రమును ఉపదేశించును. ఆ జీవులు ప్రాణములు విడుచువేళ అత్యంత క్లేశముతో కూడిన బాధానివారణకు జగన్మాతయైన పార్వతి పద్మములతోను, తనపైటతోను మెల్లమెల్లగ విసరును.

విశేషము :- తారక మంత్రము :- ''ఓమ్'' అనునది.

బలవన్మరణము :- ఇచ్చట బలవన్మరణమనగా ఆత్మహత్య కాదు. మృత్యువులలో యత్నసాధ్యములేక ఇచ్ఛామృత్యువు తప్ప మిగిలిన మృత్యువులన్నియు బలవన్మరణములే. జీవన క్లేశము లన్నింటిలోను మరణ సమయ క్లేశము అత్యంత దారుణమైనది. ప్రాణి తన చావు జగత్ప్రళయముగ భావించును.

తే॥ తూర్పుదిశకును లవణ పాథోధి సీమ
దక్షిణమునకు వృద్ధ గౌతమియె సీమ
పడమటికి రాజమాహేంద్ర పట్టనంబు
ద్యుమ్నపతి దిక్కునకు సీమ తుల్య భాగ. 14

అర్థము :- తూర్పు దిశకును=తూర్పు దిక్కునకు; లవణ పాథోధి=ఉప్పు సముద్రము; సీమ=హద్దు; దక్షిణమునకు=దక్షిణ దిక్కునకు; వృద్ధ గౌతమియె=వృద్ధ గౌతమీ నదియే; సీమ=హద్దు; పడమటికి=పడమర దిక్కునకు; రాజమాహేంద్ర పట్టనంబు=రాజమహేంద్రవర

నగరము; సీమ=హద్దు; ద్యుమ్నపతి+దిక్కునకు=(ధనపతియైన) కుబేరునిదైన ఉత్తర దిశకు; తుల్య భాగ=తుల్య భాగానది; సీమ=హద్దు.

భావము :- దక్షారామ క్షేత్రము (దక్ష మండలము) నకు తూర్పున ఉప్పు సముద్రము, దక్షిణమున వృద్ధ గౌతమీనది, పడమట రాజమహేంద్రవర నగరము, ఉత్తరమున తుల్య భాగానదియు హద్దులు.

విశేషము :- ఈ పద్యము నందలి రెండు, నాలుగు పాదములు యథాక్షరముగ ఈ గ్రంథముననే (3-33) వెనుక వచ్చినవి.

వ॥ ఈ క్రమంబున సీమా విభాగంబు లేర్పడిన భీమమండలంబు భుక్తి ముక్తి ప్రదంబు; వహ్ని సంయోగంబున శుష్క కాష్ఠంబులు హరణంబైన చందంబున దర్శన మాత్రంబునఁ బాపౌఘంబును నది భస్మీ భావంబునుం బొందింపం జాలును. ప్రాణ వియోగ కాలంబున జంతుకోటికిం గాలకంధరుండు తారకబ్రహ్మ విద్యా రహస్యార్థం బుపదేశించును. కాని మాత్రంబైన ధనంబును విడికెఁడు ధాన్యంబైన నిచ్చుదాతకు ననంత ఫలంబు చెందు. శ్రద్ధా సమన్వితంబుగా శివయోగికిం బెట్టిన భోజనంబును, నిచ్చిన వస్త్రంబును భవబంధ విధ్వంసనంబులు. జపహోమదాన తపో ధ్యాన సమాధియోగంబులు గలుగు పుణ్యులకుం గొలఁది లేదు. హిమవత్పర్వతంబునఁ గోటి వర్షంబులు తపంబు చేసిన ఫలంబు ఘటికార్ధోపవాస మాత్రంబునను, వారణాసి యందుఁ గోటిఁ బ్రాహ్మణులకు భోజనంబు పెట్టిన ఫలంబు భిక్షునకు నొక్క భిక్ష యిడిన మాత్రంబునను; గురుక్షేత్రంబున సూర్య గ్రహణకాలంబునం దులాపురుష దానంబు చేసిన ఫలంబు నొక్క భూసురాతిథి కభ్యాగతికి శివయోగులకు బెట్టిన భోజన మాత్రంబునను; దక్షవాటికా పుణ్యక్షేత్రంబున సంభవించు. 15

అర్థము :- ఈ క్రమంబున=ఈ వరుసలో; సీమా విభాగంబులు=హద్దుల విభజనలు; ఏర్పడిన=కలిగిన; భీమ మండలంబు=భీమ మండలము; భుక్తి=(లౌకికవమైన జీవన నిర్వహణకు ఆవశ్యకమగు) ఆహారమును; ముక్తి=మోక్షమును (లౌకిక బంధ విమోచనము), ప్రదంబు=ఒసగు నట్టిది; వహ్ని సంయోగంబున=అగ్నితో కలయుటచే; శుష్కకాష్ఠంబులు= ఎండు కట్టెలు; హరణంబు+ఐన=హరింపబడిన; చందంబున=రీతిగా; దర్శనమాత్రంబునన్=దర్శనమాత్రముచేతనే; పాప+ఓఘంబున్=పాప సమూహమును; అది=ఆ భీమ మండలము; భస్మీ భావంబునున్=బూడిదగుటను; పొందింపన్+చాలును=పొందజేయ జాలును; ప్రాణ=ప్రాణములతో; వియోగ=ఎడబాటు కలుగు; సమయంబున=సందర్భమున;

జంతుకోటికిన్=జీవరాశికి; కాలకంధరుండు=గరళకంఠుడు; తారక...అర్థంబు. తారక=తరించుటకు కారణమైన; బ్రహ్మవిద్యా=బ్రహ్మ జ్ఞానము యొక్క; రహస్య=గూఢమైన; అర్థంబు=పరమార్థమును; ఉపదేశించును=బోధించును; కాని మాత్రంబు+ఐన=కాని అనునాణెము మాత్రమైన; ధనంబును=ధనమును; పిడికెఁడు=ముష్టి మాత్రమైన; ధాన్యంబు+ఐనన్=ధాన్యమునైనను; ఇచ్చు=ఇచ్చునట్టి; దాతకున్=దాతకు; అనంత=అంతము లేని; ఫలంబు=ఫలితము; చెందు=దక్కును; శ్రద్ధా=శ్రద్ధతో; సమన్వితంబుగా=కూడునట్లుగా; శివయోగికిన్=శివయోగికి; పెట్టిన=పెట్టినట్టి; భోజనంబునున్=ఆహారమును; ఇచ్చిన వస్త్రంబును=దానము చేసిన బట్టలును; భవబంధ=ప్రాపంచికమైన బంధనములను; విధ్వంసనంబులు=నాశమొనర్చునవి; జప=జపము; హోమ=హోమము; తపః+ధ్యాన=తపస్సు ధ్యానము; సమాధి=సమాధి అనెడు; యోగంబులున్=యోగములు; కలుగు=లభించు; పుణ్యులకున్=పుణ్యాత్ములకు; కొలఁది లేదు=తక్కువ లేదు; హిమవత్పర్వతంబు నన్=హిమశైలము నందు; కోటి వర్షంబులు=కోటి సంవత్సరములు; తపంబు చేసిన=తపస్సు చేయగా కల్గిన; ఫలంబు=ఫలితము; ఘటికా-మాత్రంబునన్; ఘటిక+అర్ధ=అరగడియ కాలము; ఉపవాస=ఉపవాసముండిన; మాత్రంబునన్=మాత్రము చేతనే; వారణాసి+అందున్=కాశీక్షేత్రమున; కోటి బ్రాహ్మణులకు=కోటిమంది బ్రాహ్మణులకు; భోజనము=అన్నమును; పెట్టిన ఫలంబు=పెట్టగా కలిగెడు ఫలితము; భిక్షునకున్=దక్షారామము నందలి భిక్షుకునకు; ఒక్క భిక్ష=ఒక్కమారు భిక్షను; ఇడిన+మాత్రంబుననున్=ఒసగిన మాత్రము చేతనే; కురుక్షేత్రంబున=కురుక్షేత్రములో; సూర్యగ్రహణకాలంబునన్=సూర్యగ్రహణ సమయమున; తులాపురుష దానంబు=దాత బరువుతో సమానమగు ధాన్యాదుల నిచ్చుట; చేసిన ఫలంబు=చేసిన ఫలితము; ఒక్క=ఒక; భూసుర=బ్రాహ్మణుడగు; అతిథి=ఆగంతుకునకు; అభ్యాగత=భోజనవేళకు వచ్చిన; శివయోగులకున్=శివయోగులకు; పెట్టిన=పెట్టినట్టి; భోజన మాత్రంబునను=భోజనమాత్రము చేతనే; దక్షవాటికా=దక్షారామమనెడు; పుణ్యక్షేత్రంబున=పుణ్యక్షేత్రములో; సంభవించున్=కలుగును.

భావము :- ఇట్లు హద్దులు గల భీమ మండలము భోగ మోక్షముల నొసగునట్టిది. నిప్పుతో కలసినందువలన ఎండు కట్టెలు కాలిపోవు విధముగా దక్షారామమును దర్శించినంత మాత్రముననే పాప సమూహము నాశనమగును. ప్రాణముపోవు సమయమున జంతువులకు శంకరుడు తారక మంత్రమునుపదేశించును. ఒక కాని డబ్బైనను పిడికెడు ధాన్యమునైనను దానమిచ్చినవాడు అనంతమైన ఫలితమును పొందును. శ్రద్ధతో శివయోగికి భోజనము పెట్టినను వస్త్రదానము చేసినను భవబంధములు తెగును. జపము, హోమము, దానము, తపము, ధ్యానము సమాధి అనెడి యోగములు గలవారికెట్టి కొఱతయు లేదు. హిమవత్పర్వతమందు కోటి సంవత్సరములు తపస్సు చేసినచోకల్గెడి ఫలితము ఈ దక్షారామమున అరగడియ

కాలము ఉపవాసమున్నంతనే కల్గును. కాశీ క్షేత్రమున కోటిమంది బ్రాహ్మణులకు భోజనము పెట్టినచో కల్గెడి ఫలితము ఈ దక్షారామమున భిక్షునకు ఒక్క భిక్ష పెట్టినచో కల్గును. కురు క్షేత్రమున సూర్యగ్రహణ కాలమున తులాపురుష దానము చేసినచో కలిగెడు ఫలితము ఒక్క బ్రాహ్మణ అతిథికి, భోజన సమయమునకు వచ్చిన శివ యోగులకు భోజనము పెట్టుట వలన ఈ దక్షారామమున కలుగును.

విశేషము :- కాని - "కాని మాత్రంబైన" అని చెప్పుట వలన 'కాని' అనునది తక్కువ విలువ గల నాణెమని తెలియుచున్నది. ఎంత విలువ గల నాణెమో తెలియదు. శ్రీనాథుని కాలమున 'దీనారము' అను టంకమున్నట్లు "దీనారటంకాలఁదీర్థ మాడించితి దక్షిణా ధీశు ముత్యాశాల" అను శ్రీనాథుని చాటు పద్యము వలన తెలియుచున్నది. "ఎట్లు చెల్లింతు టంకంబు లేడు నూర్లు" అని మరి యొక చాటువు.

సంస్కృత భీమ ఖండమున 'కాని' నాణెము యొక్క ప్రసక్తి లేదు. 'స్వల్ప ధనము' అని మాత్రమే కలదు. (అధ్యా-29 శ్లో-34)

యో ముష్టి మాత్రం ధాన్యం వా స్వల్ప మాత్రం ధనంచవా
దదాతి దక్ష నగరే సోనంత ఫల మశ్నుతే

తే॥ భీమ లింగంబు త్రిభువన స్వామి యెపుడు
సన్నిధానంబుఁ గైకొని యున్న కతనఁ
దీర్థములలోన నుత్తమ తీర్థమయ్యె
దక్షిణానందవనవాటి దక్షవాటి. 16

అర్థము :- త్రిభువన స్వామి=ముల్లోకములకు ప్రభువగు; భీమలింగంబు=శ్రీ భీమేశ్వర లింగము; ఎపుడు=ఎల్లపుడును; సన్నిధానంబున్=ప్రత్యక్షముగ కన్పించుటను; కైకొని+ ఉన్నకతనన్=గ్రహించి యున్నందు వలన; తీర్థములలోనన్=పవిత్ర తీర్థము లన్నింటిలో; దక్షిణ=దక్షిణ దేశమున గల; ఆనంద వనవాటి=కాశీ క్షేత్రమైన; దక్షవాటి= దక్షారామము; ఉత్తమ=శ్రేష్ఠమైన; తీర్థము=పవిత్ర తీర్థము; అయ్యెన్=ఐనది.

భావము :- ముల్లోకములకు ప్రభువగు శ్రీ భీమేశ్వర లింగము ఎల్లపుడును ప్రత్యక్షరూపము గైకొని యుండుట వలన దక్షిణ కాశియగు దక్షారామము తీర్థము లన్నింటిలో ఉత్తమ తీర్థమైనది.

విశేషము :- కాశీనగరము :- "అస్యానందవనం నామ పురాకారి పినాకినా
క్షేత్రస్యానంద హేతుత్వాదవిముక్త మనంతరం॥

-శివ పురాణము ... రుద్ర సంహితాఖండము 6వ అధ్యాయము - 31 శ్లో.

కాశి, వారణాసి, అవిముక్తము, ఆనందవనము, మహాశ్మశానము, రుద్రావాసము అని కాశికి పేరులు.

తే॥ ఘనత శివగంగయును రుద్ర గంగ యనఁగఁ
గూపములు రెండు దక్షవాటీ పురమున
మొదలి యది పాపముల నెల్ల నుదుకఁ జాలు
నొకటి పితృదేవతలఁ దృప్తి నునుపనోపు. 17

అర్థము :- దక్షవాటీ పురమున=దక్షారామము నందు; శివ గంగయును=శివగంగ యనియు; రుద్రగంగ+అనఁగన్=రుద్రగంగ యనియు; రెండు=రెండు; కూపములు=బావులు; ఘనతన్=గొప్పతనముతో (కలవు). మొదలి+అది=మొదటిదైన శివగంగ; పాపములన్+ఎల్లన్=పాపముల నన్నింటిని; ఉదుకన్+చాలున్=ఉదికివేయగలదు; ఒకటి=మరొకటైన రుద్ర గంగ; పితృ దేవతలన్=పితృదేవతలను; తృప్తిన్=తృప్తితో; ఉనుపన్=ఉంచుటకు; ఓపున్=సమర్థమగును.

భావము :- దక్షారామమున శివగంగ, రుద్ర గంగ అను పేర్లతో రెండు గొప్ప బావులు కలవు. శివగంగ సమస్త పాపములను పోగొట్టగలదు. రుద్రగంగ పితృదేవతలను తృప్తితో నుంచగలదు.

విశేషము :- దక్షారామమున శివగంగ; రుద్రగంగ అను రెండు కూపములు ఉన్నట్లు ఈ పద్యము వలన తెలియుచున్నది. నేడు రుద్రగంగ అను కూప మొక్కటియె నిలిచియున్నది.

ఈ కూపములను గూర్చి కీ.శే. చిలుకూరి పాపయ్య శాస్త్రి గారి వివరణమిది-

"వీనిలో 'రుద్రగంగ' యీనాఁడు నిలిచియున్నది. ఇది యొక కూపము. భీమేశ్వరాలయ ప్రాకారము నందు ఈశాన్య భాగమున భైరవుని యాలయము వెనుక నుండినది. దానికి నెదురుగా నా యాలయ ప్రాకారము నందే నైరృతి భాగమున 'శివగంగ' యనుకూపము కూడ నుండవలయును. అది మాత్రము గానరాదు" శ్రీనాథ కృతి సమీక్ష - పు. 40.

ఆ॥ అని వరంబు లిచ్చి యంతర్హితుండయ్యె
నిందు మౌళి ఋషుల కెట్ట యెదుట
వార లొన్నమశ్శివాయ యంచుఁ బఠించి
రొక్కమొగిని దిశలు పిక్కటిల్ల. 18

అర్థము :- అని=అని; ఇందు మౌళి=చంద్రశేఖరుడు; వరంబులు=వరములను; ఇచ్చి=ప్రసాదించి; ఋషులకు=మునులకు; ఎట్టయెదుట=ఎదురుగనే; అంతర్హితుండు+అయ్యెన్=అదృశ్యుడయ్యెను; వారలు=ఆ మునులందరు; ఒక్కమొగిని=ఒక్క పూనికతో; ఓన్నమశ్శివాయ=ఓమ్ నమశ్శివాయ అని; అంచున్=అనుచు; దిశలు=దిక్కులు; పిక్కటిల్లన్=నిండునట్లుగా; పఠించిరి=చదివిరి.

భావము :- ఆ ప్రకారము పరమేశ్వరుడు వరములను ప్రసాదించి మునుల యెదుటనే అదృశ్యుడయ్యెను. ఆ మునులందరు ఒక్కుమ్మడిగా "ఓమ్ నమశ్శివాయ" అని షడక్షరీ మంత్రమును దిక్కులు పిక్కటిల్లునట్లు పలికిరి.

సీ॥ పంచాక్షరీ మంత్ర పారాయణంబులు
    పఠియించుచును స్పష్ట ఫణితి తోడ
  నెచ్చటి కేగితో యెఱుఁగక యున్నార
    మెచటికి విచ్చేయ కిచట నుండు
  మనుచుఁ బ్రార్థింపంగ నౌఁగాక యని పల్కి
    ఋషులు చూడఁగఁ జూడ నిందుధరుఁడు
  భీమనాథేశ్వరు కామితార్థప్రదు
    కామిత దివ్య లింగంబుఁజొచ్చె
తే॥ మెఱుఁగు మెఱచిన పగిదిని మెఱయ దీప్తి
  నద్భుతంబునుఁ బొందిరి యప్పుడు వారు
  గౌరి! యిది భీమ లింగంబు గౌరవంబు
  దక్షవాటీ పురీ మహా స్థానమునను. **19**

అర్థము :- పంచాక్షరీ మంత్ర=పంచాక్షరీ మంత్రమును; పారాయణంబులు=ఆద్యంతములుగా; స్పష్టఫణితి తోడన్=స్పష్టమైన వాక్కుతో; పఠియించుచును=చదువుచును; ఎచ్చటికి=ఎక్కడకు; ఏగితో=వెళ్ళితివో; ఎఱుఁగక+ఉన్నారము=తెలియకుంటిమి; ఎచటికి=ఎక్కడికిని; విచ్చేయక=వెళ్ళక; ఇచటన్=ఇక్కడనే; ఉండుము=వసింపుము; అనుచున్=అనుచు; ప్రార్థింపంగన్=ప్రార్థింపగా; ఔన్+కాక=సరే; అని పల్కి=అని పలికి; ఇందుధరుఁడు=చంద్రమౌళి; ఋషులు=మునులు; చూడఁగన్+చూడన్=చూచు చుండగనే; కామిత+అర్థప్రదు=కోరిక కోర్కులనిచ్చు; భీమనాథ+ఈశ్వరు=శ్రీ భీమేశ్వర స్వామి యొక్క; కామిత=కోరబడిన; దివ్యలింగంబున్=దివ్యమైన లింగమును; మెఱుఁగు=మెరుపు;

మెఱచిన+పగిదిని=మెరసినట్లుగా; మెఱయు దీప్తిన్=వెలుగు కాంతితో; చొచ్చెన్=ప్రవేశించెను; అపుడు=అప్పుడు; వారు=ఆ మునులు; అద్భుతంబునున్=ఆశ్చర్యమును; పొందిరి=పొందినారు; గౌరి=ఓ పార్వతీ!; దక్షవాటీపురీ=దక్షారామ నగరమును; మహాస్థానమును=గొప్ప ప్రదేశమునందు; భీమలింగంబు+గౌరవంబు=భీమేశ్వరలింగము యొక్క గొప్పతనము.

భావము :- ఆ మునులు స్పష్టవాక్కుతో పంచాక్షరీ మంత్రమును పఠించుచునే ఓ స్వామీ! ఎచటికి వెళ్ళితివో తెలియకుంటిమి. మరెచ్చటికి వెళ్ళక ఇచ్చటనే ఉండుమని ప్రార్థించిరి. ఆ స్వామి సరేయని ఆమునులు చూచుచుండగనే కోరిన కోరికలను ప్రసాదింపగల శ్రీ. భీమేశ్వర దివ్యలింగము నందు మెఱపుకాంతితో ప్రవేశించెను. ఆ మునులందరు ఆశ్చర్యపడిరి. ఓ పార్వతీ! దక్షారామ పుణ్యక్షేత్రమున భీమేశ్వర లింగము యొక్క గొప్పతనమది.

వ॥ అనంతరం బమ్మునీశ్వరులు నియమ శ్రద్ధా తాత్పర్యంబు లొప్ప సప్తర్షి సమానీత యగు గోదావరిం గనుంగొని పరమానందంబున. 20

అర్థము :- అనంతరంబు=ఆ తరువాత; ఆ+మునీశ్వరులు=ఆ మునిశ్రేష్ఠులు; నియమ=నియమము; శ్రద్ధా=ఆస్తిక్యబుద్ధి; తాత్పర్యంబులు=ఆసక్తియు; ఒప్పన్=ప్రకాశింపగా; సప్తర్షి=సప్తర్షుల చేత; సమానీత+అగు=కొనిరాబడిన; గోదావరిన్=గోదావరి నదిని; కనుంగొని=చూచి; పరమ+ఆనందంబునన్=మహానందముతో.

భావము :- అటు పిమ్మట ఆ మునీశ్వరులు నియమము శ్రద్ధ తత్పర భావములు ప్రకాశించునట్లుగా సప్తర్షులచేత కొనిరాబడిన గోదావరీ నదిని చూచి మహానందముతో.

శ్లో॥ దేవి! శంభోర్జటాజూట నివాసిని! శివప్రియే!
లోక రక్షణ కార్యార్థ ముద్భూతాయై నమోస్తుతే॥ 21

అర్థము :- శంభోః=శివుని యొక్క; జటాజూట=(శిరస్సు నందలి) జడల సమూహము నందు; నివాసిని=ఉన్నదియు; శివప్రియే=శివునకిష్టమైన; దేవి=గోదావరీ దేవీ! లోకరక్షణ=జగత్తును రక్షించుటయను; కార్యార్థమ్=పనికొఱకు; ఉద్భూతాయై=జన్మించిన; తే=నీకు; నమః=నమస్కారము; అస్తు=అగుగాక.

భావము :- పరమేశ్వర జటాజూటము నందుండి, ఆయనకు ప్రియురాలవగు ఓ గోదావరీ దేవీ! లోకరక్షణమను పనికై జన్మించిన నీకు నమస్కారము.

శ్లో॥ ఏకేనైవ స్వరూపేణ భీమనాథస్య సన్నిధౌ
సదా సన్నిహితాస్యత్ర గోదావరి! నమోస్తుతే॥ 22

అర్థము :- గోదావరి=ఓ గోదావరీ! అత్ర=ఇక్కడ; ఏకేన+ఏవ=ఒకేఒకటైన; స్వరూపేణ=స్వరూపముతో; భీమనాథస్య=శ్రీ భీమేశ్వర స్వామి యొక్క; సన్నిధౌ=సన్నిధి యందు; సదా=ఎల్లపుడు; సన్నిహితా=దగ్గర నున్నదానవు; అసి=అయి యున్నావు; తే=నీకు; నమః=నమస్కారము; అస్తు=అగుగాక.

భావము :- ఓ గోదావరీ! ఇక్కడ శ్రీ భీమేశ్వర స్వామి సన్నిధిలో ఒకే రూపముతో ఎల్లపుడు సన్నిహితురాలవై యున్నావు. అట్టి నీకు నమస్కారము.

విశేషము :- ఈ పై రెండు శ్లోకములును కించిద్భేదములతో సంస్కృత భీమ ఖండము నందు (అధ్యా-29. శ్లో-51, 52) కలవు.

క॥ అని సంస్తుతించి యందఱు
ముని గణములు మంకణముని మునుకొని వికచ
త్కనకారవింద సౌరభ.
ఖని యగు నయ్యేటి నీటఁ గౌతుక మొప్పన్. 23

అర్థము :- అని=ఈ ప్రకారముగా; సంస్తుతించి=కీర్తించి; మంకణముని= మంకణుడను మునిని; మునుకొని=ముందు బెట్టుకొని; అందఱు+ముని గణములు=మునిజన సమూహములందు అందరు; వికచత్=వికసించిన; కనక+అరవింద=బంగారు పద్మముల యొక్క; సౌరభ=పరిమళములకు; ఖని+అగున్=గనియైన; ఆ+ఏటినీటన్=ఆ గోదావరి నీటిలో; కౌతుకము+ఒప్పన్=ఆనందమొప్పగా.

భావము :- అని ఆ ప్రకారము గోదావరిని కీర్తించి మంకణమునిని ముందు బెట్టుకొని మునులందరు వికసించిన బంగరు పద్మములలోని పరిమళములతో నిండిన ఆ గోదావరి నీటిలో సంతోషాతిశయముతో.

24

వ॥ అఘమర్షణ స్నానమాడిరి.

అర్థము :- అఘమర్షణ=పాపములను పోగొట్టు; స్నానము+ఆడిరి=స్నానము చేసిరి.

భావము :- పవిత్ర స్నానము చేసిరి.

విశేషము :- అఘమర్షణ స్నానము - భీమ. 1-114 చెంత వివరింపబడినది.

తే॥ అఖిల కాలంబు నొక ప్రవాహంబు తోడ
భీమలింగంబు సేవించి బెరసి ప్రేమ
యొరసి మదినుబ్బి పాతాళ మొరసి హరి
సప్త సింధువు మున్నీటి సంక్రమించె. 25

అర్థము :- హారి=మనోజ్ఞమైన; సప్త సింధువు=సప్త గోదావరము; అఖిల కాలంబున్= ఎల్ల కాలమును; ఒక=ఒకే; ప్రవాహంబు తోడన్=పొరుదలతో; భీమలింగంబున్=శ్రీ భీమేశ్వర స్వామిని; సేవించి=సేవచేసి; ప్రేమన్=ప్రేమతో; బెరసి=వ్యాపించి; మదిన్=మనసులో; ఉబ్బి=సంతసించి; ఒరసి=స్వామిని ఒరసికొని; పాతాళము=పాతాళమును; ఒరసి=ఢీకొని; మున్నీటిన్= సముద్రమును; సంక్రమించె=ప్రవేశించెను.

భావము :- మనోహరమైన సప్త గోదావరము జీవనదియై ఎల్లవేళల ప్రవహించుచు ప్రేమతో వ్యాపించి శ్రీ భీమేశ్వర స్వామిని సేవించి అతిశయించి ఆ స్వామిని ఒరసికొనుచు పాతాళ లోకమును తాకుచు వెళ్ళి సముద్రమున ప్రవేశించెను.

తే॥ భీమ లింగంబు మ్రోల గాంభీర్య సలిల
పూర మగుచుండు నేకాలమును సమృద్ధి
దనిపి తగఁ బాఱుచుండు నిత్యమ్ము ఘన ము
దార జలనిధి సప్త గోదావరంబు. 26

అర్థము :- ఘనము=గొప్పగా; ఉదార+జలనిధి=ఋజుమార్గమున ప్రవహించు నీటికి స్థానమైన; సప్త గోదావరంబు=సప్త గోదావరము; ఏ కాలమును= ఏ కాలమందైనను; భీమ లింగంబు+మ్రోలన్=శ్రీ భీమేశ్వర లింగమునకు ఎదురుగ (సమీపమున); గాంభీర్య=లోతైన; సలిల పూరము=నీటి ప్రవాహము కలది; అగుచుండున్=అగుచుండును; సమృద్ధిన్+తనిపి= నిండుదనముతో తృప్తి కల్గించి; తగన్=తగినట్లుగ; పాఱుచుండు= ప్రవహించుచుండును.

భావము :- ఋజు మార్గమున గొప్పగ ప్రవహించు నీటి ప్రవాహము గల సప్త గోదావరము సర్వకాలము లందును శ్రీ భీమేశ్వర లింగమునకు సమీపముగా లోతైన నీటి ప్రవాహము కల్గియుండును, నిండుదనముతో తృప్తిపఱచి పాఱుచుండును.

ఉ॥ ఏట మునింగిలేచి పరమేశ్వరు మందిర సౌధ వాటికా
హాటక కుంభముం గని షడక్షర మంత్రముఁ జిహ్వఁ గూర్చి వా
చాటత సత్య తత్త్వుఁడగు శాంభవయోగి వరేణ్యుఁ డేల జం
జాటపు సంసృతిం బొరలి చచ్చుచు బుట్టుచు నుండుఁ బార్వతీ. 27

అర్థము :- పార్వతీ=ఓ పర్వతరాజపుత్రీ!; సత్యతత్త్వుడు+అగు=సత్యమైన తత్త్వము కలవాడైన; శాంభవ=శివసంబంధమైన; యోగి+వరేణ్యుఁడు=శ్రేష్ఠుడైన యోగి; ఏటన్=సప్త గోదావరములో; మునింగి లేచి=స్నానము చేసి లేచి; పరమేశ్వరు=పరమ శివుని; మందిర= ఆలయపు; సౌధ=మేడ యొక్క; వాటికా=పై ప్రదేశము నందలి; హాటక కుంభమున్=బంగారు

కలశమును; కని=చూచి; షట్+అక్షర మంత్రమున్=ఆరు అక్షరములు గల మంత్రమును; వాచాటతన్=వాచాలతతోనైన; జిహ్వన్=నాలుక యందు; కూర్చి=కూర్చి; ఏల=ఎందులకు; జంజాటము+సంసృతిన్= ఎడతెగని సంసారము నందు; పొరలి=అటు ఇటు దొర్లి; చచ్చుచు=మరణించుచు; పుట్టుచున్=తిరిగి జన్మించుచు; ఉండున్=ప్రవర్తించును.

భావము :- ఓ పార్వతీ! శంభు దీక్షాపరాయణుడైన యోగి శ్రేష్ఠుడు సప్త గోదావరమున పవిత్ర స్నానము చేసి వచ్చి శ్రీ భీమేశ్వరాలయపు మేడపై గల స్వర్ణ కలశమును దర్శించి షడక్షర మంత్రమును పఠించుచు సత్యతత్త్వము కలవాడగును గాని చావు పుట్టుకలతో కూడిన సంసారములో నుండునా! ఉండడు.

విశేషము :- షడక్షరి :- ఓంకారముతో కూడిన పంచాక్షరి. "ఓమ్ నమశ్శివాయ."

చ॥ కొడుకులు నీవు నేఁ బ్రమథకోటి విరించి సరోజలోచనుం
డుడుగణరాజ ఖేచర మహోరగ కిన్నర సిద్ధ సాధ్యు లె
ప్పుడు గొలువంగ వైభవము పొంపిరి వోవఁగ దక్షవాటి నుం
డెడు శివు భీమనాయకుఁ దటిన్యవతంసు భజింప మేలగున్. 28

అర్థము :- కొడుకులు=కుమారులు; నీవు=నీవు; నేన్=నేను; ప్రమథకోటి=శివ పారిషదులు; విరించి=బ్రహ్మ; సరోజ లోచనుండు=విష్ణువు; ఉడుగణరాజ=చంద్రుడు; ఖేచర= దేవతలు; మహా+ఉరగ=గొప్పనాగులు; కిన్నర=కిన్నరులు; సిద్ధ=సిద్ధులు; సాధ్య=సాధ్యులును; ఎప్పుడున్=ఎల్లపుడును; కొలువంగ=అర్చింపగా; వైభవము=విభవము; పొంపిరి+పోవఁగన్= అతిశయింపగా; దక్షవాటిన్+ఉండెడు=దక్షారామము నందు వసించెడు; తటినీ=నది; అవతంసు=శిరోభూషణముగ గల్గిన; శివున్=శివుని; భీమనాయకున్=శ్రీ భీమేశ్వర స్వామిని; భజింప=సేవించినచో; మేలు+అగున్=మేలు కలుగును.

భావము :- మన కుమారులు; నీవు, నేను, బ్రహ్మ, విష్ణువు, చంద్రుడు, దేవతలు. నాగులు, కిన్నరులు, సిద్ధులు, సాధ్యులును నిరంతరము సేవించుటతో వైభవ మతిశయించు గంగాధరుడైన దక్షారామ భీమేశ్వరుని సేవించుట వలన మేలు కలుగును.

విశేషము :- కిన్నరులు - కించిన్నరః కిన్నరః - కొంచెము నరాకారముగల శరీరము గలవారు. కుత్సితో నరోవా కిన్నరః - గుఱ్ఱము మోము కలవారు గనుక ఏవగింపదగినవారు.

సిద్ధులు - అణిమాది సిద్ధి ర్యేషామస్తీతి సిద్ధాః - అణిమాది సిద్ధులు కలవారు. విశ్వావసు ప్రభృతులు సిద్ధులు.

సాధ్యులు - సాధ్యంతే ఆరాధ్యంత ఇతి సాధ్యాః - ఆరాధింపబడువారు. మనువు, హనుమంతుడు, విష్ణువు, ధర్ముడు మొదలగువారు.

ప్రమథులు - ప్రమథ్నంతి శత్రూన్ - శత్రువులను మథించువారు.

చండీశ్వర, నంది, మహాకాళ, భృంగి, భృంగిరిటి - మొదలగువారు - అమరకోశము.

క॥ సప్తాశ్వ సంప్రతిష్ఠుని
సప్తమునీశ్వర ప్రధాన సంస్థితు నంత
ర్గుప్త స్వరూపుఁ ద్రిభువన
గోప్తను భీమేశ్వరేశుఁ గొలువుము తరుణీ! 29

అర్థము :- తరుణీ=ఓ (పార్వతీ) యౌవనవతీ! సప్తాశ్వ=సూర్యునిచేత; సంప్రతిష్ఠుని= బాగుగ ప్రతిష్ఠ చేయబడినట్టియు; సప్త మునీశ్వర= సప్తర్షులనెడు; ప్రధాన=ముఖ్యులచేత; సంస్థితున్=స్థిరుడైనట్టియు; అంతః+గుప్త స్వరూపున్=లోపల గుప్తమైన రూపము గలట్టియు; త్రిభువన=ముల్లోకముల; గోప్తను=రక్షకుని: భీమేశ్వర+ఈశున్=శ్రీ భీమేశ్వర స్వామిని; కొలువుము=సేవింపుము.

భావము :- ఓ పార్వతీ! సూర్యునిచే ప్రతిష్ఠింపబడినవాడు, సప్తర్షులచే స్థిరీకరింపబడిన వాడు, అంతరంగమున గుప్తమైన స్వరూపము కలవాడు, ముల్లోకములకు రక్షకుడునైన శ్రీ భీమేశ్వర స్వామిని సేవింపుము.

వ॥ భీమనాథ మహాస్థానంబు సర్వకామార్థ సాధకంబు; సంవత్సరంబును గొలువ ముక్తి ప్రదాయకంబు. సూర్యుండు మేషరాశి యందుఁ జిత్రానక్షత్రంబున వసియించి యుండు చైత్రమాసంబున సప్త గోదావరంబునఁ బ్రాతస్స్నానంబుఁ జేసి యథాశక్తి విప్రులకుఁ దగిన దానంబు లొసఁగి భీమనాథుండనగు నాకు నమస్కారాభిషేక పూజానైవేద్యంబు లాచరించి నరుండు నక్తభోజియయ్యెను; నట్లె భానుండు వృషభరాశియందు విశాఖా నక్షత్రంబు నాశ్రయించి యుండు వైశాఖమాసంబునను, బ్రభాకరుండు మిథునంబునందు జ్యేష్ఠానక్షత్రంబునందు నిలిచియుండు జ్యేష్ఠ మాసంబునను, రవి కర్కాటకంబున భగదైవతంబైన నక్షత్రంబున నాషాఢమాసం బునఁ గూడి యుండఁగను; శ్రావణ మాసంబున శ్రవణ నక్షత్రంబున సింహరాశి యందు మార్తాండుండు నిలచియుండంగఁను, భాద్రపద మాసంబునఁ బూర్వాభాద్రా నక్షత్రమునఁ గన్యారాశి యందు భానుండుండఁగను, నాశ్వయుజ మాసమున నశ్వినీ నక్షత్రంబు నందుఁ దులారాశియందుఁ జిత్ర భానుండు నిలిచి యుండఁగను; గార్తికమాసంబునఁ గృత్తికా నక్షత్రంబున వృశ్చిక రాశిని సూర్యుండుండఁగను; మార్గశీర్ష

మాసంబున ధనూరాశి యందు మృగశిరా నక్షత్రంబున నభోమణి యుండఁగను; బుష్య మాసంబునఁ బుష్యనక్షత్రంబున మకరరాశియందు లోకబాంధవుఁడుండఁగను, మాఘమాసంబున మఘా నక్షత్రంబునఁ గుంభరాశి యందు మిహిరుండుండఁగను; ఫాల్గునమాసంబున నుత్తరా నక్షత్రంబున మీనరాశినిం దినకరుండుండఁగను బూర్వోక్త ప్రకారంబున శైవవ్రతాచారంబులు నడపిన మనుజుండు పాతకంబుల వలన విము క్తుండగును. వెండియు యజ్ఞతీర్థంబను తటాకంబు సకల తీర్థరాజంబు. 30

అర్థము :- భీమనాథ+మహాస్థానంబు=శ్రీ భీమేశ్వరుని గొప్ప సభాభవనము; (పవిత్ర నివాసము) సర్వ+కామ+అర్థ+సాధకంబు=సమస్తమైన కోరికలను, ధనమును, సాధించునది; సంవత్సరంబును=సంవత్సరము మొత్తమును; కొలువన్=సేవించినచో; ముక్తి+ ప్రదాయకంబు=మోక్షము నిచ్చునది;

సూర్యుండు=సూర్యుడు; మేషరాశి+అందున్=మేషమను రాశియందు; చిత్రా నక్షత్రంబునన్=చిత్ర అను నక్షత్రము నందు; వసియించి+ఉండు=నివసించి యుండునట్టి; చైత్రమాసంబునన్=చైత్రమను మాసములో; సప్తగోదావరంబునన్=సప్త గోదావర సరస్సులో; ప్రాతస్+స్నానంబున్=సూర్యోదయము మొదలు రెండు ముహూర్తముల కాలములో స్నానమును; చేసి=చేసి; యథాశక్తిన్=తన శక్తి ననుసరించి; విప్రులకున్=బ్రాహ్మణులకు; తగిన దానంబులు=యోగ్యములైన దానములు; ఒసఁగి=ఇచ్చి; భీమనాథుండను+అగు= భీమేశ్వరుడనగు; నాకున్=నాకు; నమస్కార=సాష్టాంగ నమస్కారములు; అభిషేక=(నమక చమకాదులతో) స్నానము; పూజా=అర్చనము; నైవేద్యంబులు=నివేదనము అనువానిని; ఆచరించి=చేసి; నరుండు=మానవుడు; నక్తభోజి+అయ్యున్=రాత్రిపూట మాత్రమే భోజనము చేయువాడై యుండియును;

అట్లె=అదే విధముగ; భానుండు=సూర్యుండు; వృషభరాశియందు=వృషభమను రాశిలో; విశాఖా నక్షత్రంబున్=విశాఖ అను నక్షత్రమును; ఆశ్రయించి+ఉండు=ఆశ్రయించి ఉండునట్టి; వైశాఖ మాసంబుననున్=వైశాఖమను మాసము నందును; ప్రభాకరుండు= సూర్యుడు; మిథునంబునందు=మిథునమను రాశిలో; జ్యేష్ఠా+నక్షత్రంబునందు=జ్యేష్ఠా అను నక్షత్రము నందు, నిలచి+ఉండు=నివసించి ఉండు; జ్యేష్ఠ మాసంబునను=జ్యేష్ఠమను మాసమునందును; రవి=సూర్యుడు; కర్కాటకంబున=కర్కాటకమను రాశిలో; భగదైవతంబు+ ఐన=భగుడు దేవతగా గల; నక్షత్రంబునన్=నక్షత్రముతో; ఆషాఢమాసంబునన్=ఆషాఢమను మాసమున; కూడి+ఉండఁగను=కలసియున్నపుడును; శ్రావణమాసంబున=శ్రావణమను

మాసములో; శ్రవణ నక్షత్రంబున=శ్రవణమను నక్షత్రముతో; సింహరాశియందు=సింహమను రాశిలో; మార్తాండుండు=సూర్యుడు; నిలిచి+ఉండఁగను=ఉండియున్నపుడును; భాద్రపద మాసంబునన్=భాద్రపదమను మాసము నందు; పూర్వాభాద్రా నక్షత్రమునన్=పూర్వాభాద్ర అను నక్షత్రముతో; కన్యారాశియందు=కన్య అను రాశి యందు; భానుండు=సూర్యుడు; ఉండఁగనున్=ఉన్నపుడును; ఆశ్వయుజ మాసమునన్=ఆశ్వయుజమను మాసము నందు; అశ్వినీ నక్షత్రంబునందున్=అశ్విని అను నక్షత్రముతో; తులారాశియందున్=తుల అను రాశియందు; చిత్ర భానుండు=సూర్యుడు; నిలిచి+ఉండఁగనున్=ఉండియున్నపుడును; కార్తిక మాసంబునన్=కార్తీకమను మాసము నందు; కృత్తికా నక్షత్రంబున=కృత్తిక అను నక్షత్రముతో; వృశ్చికరాశిని=వృశ్చికమను రాశిలో; సూర్యుండు=సూర్యుడు; ఉండఁగను= ఉన్నపుడును; మార్గశీర్ష మాసంబున=మార్గశిరమను మాసము నందు; ధనూరాశియందు= ధనుస్సు అనురాశిలో; మృగశిరా నక్షత్రంబున=మృగశిర అను నక్షత్రముతో; నభోమణి= సూర్యుడు; ఉండఁగను=ఉండినపుడును; పుష్యమాసంబునన్=పుష్యమను మాసమునందు; పుష్య నక్షత్రంబునన్=పుష్యమి అను నక్షత్రముతో; మకరరాశియందు=మకరమను రాశియందు; లోకబాంధవుఁడు=సూర్యుడు; ఉండఁగను=ఉండినపుడును; మాఘమాసంబునన్=మాఘము అను మాసము నందు; మఘా నక్షత్రంబునన్=మఘ అను నక్షత్రముతో; కుంభరాశియందు= కుంభమను రాశియందు; మిహిరుఁడు=సూర్యుడు; ఉండఁగను=ఉన్న సమయమునను; ఫాల్గున మాసంబునన్=ఫాల్గునమను మాసమున; ఉత్తరా నక్షత్రంబునన్=ఉత్తర అను నక్షత్రముతో; మీన రాశినిన్=మీనమను రాశియందు; దినకరుండు=సూర్యుడు; ఉండఁగ నున్=ఉన్నపుడును; పూర్వ+ఉక్త+ప్రకారంబునన్=వెనుక చెప్పిన విధముగా; శైవవ్రత=శివునకు సంబంధించిన వ్రతము నందలి; ఆచారంబులు=అనుష్ఠానములు; నడపిన=ఆచరించిన; మనుజుండు=మానవుడు; పాతకంబుల వలనన్=పాపముల నుండి; విముక్తుండు+అగును= ముక్తినందిన వాడగును; వెండియున్=మఱియు; యజ్ఞతీర్థంబు+అను=యజ్ఞ తీర్థమను పేరుగల; తటాకంబు=చెఱువు; సకల తీర్థ+రాజంబు=సమస్తమైన తీర్థములలో మేటియైనది.

భావము :- శ్రీ భీమేశ్వరుని నివాసమైన దక్షారామ క్షేత్రము సమస్తమైన కోరికలను ధనమును సాధించు నట్టిది. సంవత్సరము పొడవునను సేవించినచో మోక్షము నిచ్చునట్టిది.

సూర్యుడు మేషరాశి యందు చిత్త అను నక్షత్రముతో నివసించి ఉండు చైత్ర మాసములో సప్త గోదావరము నందు సూర్యోదయ కాలమున పవిత్ర స్నానము చేసి శక్తి కొలది బ్రాహ్మణులకు యోగ్యములైన దానములు చేసి శ్రీ భీమేశ్వరుడనైన నాకు సాష్టాంగ నమస్కారము, అభిషేకము, అర్చనము నైవేద్యము-లు చేసిన మానవుడు నిత్యము రాత్రిపూట మాత్రమే భోజనము చేయుచును; అదేవిధముగ

సూర్యుడు :

వృషభమను రాశియందు విశాఖా నక్షత్రముతో నున్న వైశాఖమాసము నందును, మిథునమను రాశియందు జ్యేష్ఠ అను నక్షత్రముతో నున్న జ్యేష్ఠమాసము నందును, కర్కాటకమను రాశియందు భగదైవత నక్షత్రముతో నున్న ఆషాఢమాసము నందును సింహమను రాశియందు శ్రవణమను నక్షత్రముతో నున్న శ్రావణమాసము నందును, కన్య అను రాశియందు పూర్వాభాద్ర నక్షత్రముతో నున్న భాద్రపదమాసము నందును, తుల అను రాశియందు అశ్విని అను నక్షత్రముతో నున్న ఆశ్వయుజమాసము నందును, వృశ్చికమను రాశియందు కృత్తిక అను నక్షత్రముతో నున్న కార్తీకమాసము నందును, ధనుస్సు అను రాశియందు మృగశిర అను నక్షత్రముతో నున్న మార్గశిరమాసము నందును, మకరమను రాశియందు పుష్యమి అను నక్షత్రముతో నున్న పుష్యమాసము నందును, కుంభమను రాశియందు మఘ అను నక్షత్రముతో నున్న మాఘమాసము నందును, మీనమను రాశియందు ఉత్తర అను నక్షత్రముతో నున్న ఫాల్గునమాసము నందును; ప్రవర్తించుచున్నపుడు వెనుక చెప్పినట్లుగ శైవవ్రతాచారములతో వర్తిల్లిన మానవుడు మోక్షమును పొందును. మఱియు యజ్ఞతీర్థము అను చెఱువు సమస్తమైన తీర్థములలో శ్రేష్ఠమైనది.

విశేషము :- భగదైవత నక్షత్రము :- పూర్వాషాఢ నక్షత్రము.

సీ॥ మేషరాశిస్థుఁడై మిహిరుఁడుండఁగ బర్వ
తిథి స్నాతుఁడగుచుఁ దత్తీర్థమందుఁ
దన యథా శక్తిఁ గాంచనము విప్రుల కిచ్చి
పాతకంబులఁ బాయుఁ బంచ జనుఁడు
వృషభంబు నందట్ల వెండి మార్తాండుండు
మిథున రాశిం దగ మెచ్చు మీఱు
స్థితిఁ గర్కటకరాశిఁ గృతసప్త గోదావ
రాభిషేకుఁడు దోష మపనయించుఁ

తే॥ దప్పు కాషాఢ సిత చతుర్దశిని సింహ
కన్యలను సూర్య సంగమ కాలమునను
జన్మ తారల యందున సంధులందు
యజ్ఞ కుండ పయస్స్నాన మఘహరంబు.

అర్థము :- మిహిరుఁడు=సూర్యుడు; మేషరాశిస్థుఁడు+ఐ=మేషరాశి యందున్నవాడై; ఉండఁగన్=ఉన్నపుడు; పంచజనుఁడు=మానవుడు; పర్వ=పర్వదినములగు అమావాస్య మొదలగు; తిథిన్=తిథులలో; స్నాతుఁడు+అగుచున్=స్నానము చేసిన వాడగుచు; తత్+తీర్థ మందున్=యజ్ఞ తీర్థమను ఆ తటాకము ఒడ్డునందు;

తన యథాశక్తిన్=తన శక్తి కొలది; కాంచనము=బంగారమును; విప్రులకు= బ్రాహ్మణులకు, ఇచ్చి=దానము చేసి; పాతకంబులన్=పాపములను; పాయున్= పోగొట్టుకొనును;

అట్ల=అదేరీతిగ; మార్తాండుండు=సూర్యుడు; వృషభంబు నందు=వృషభరాశి యందు; వెండి=మరియు; మిథున రాశిన్=మిథున రాశియందు; తగన్=తగినట్లుగా; మెచ్చుమీఱు స్థితిన్=సంతోషించు స్థితి యందును;

కర్కటకరాశిన్=కర్కట రాశిలో; కృత=చేయబడిన; సప్త గోదావర=సప్త గోదావరములో; అభిషేకుఁడు=స్నానము కలవాడు; దోషము=పాపమును; అపనయించున్=తొలగించు కొనును;

తప్పక=తప్పకుండగ; ఆషాఢ=ఆషాఢ మాసము నందలి; అసిత+చతుర్దశిని=కృష్ణపక్ష చతుర్దశి తిథి యందు; సింహ కన్యకలను=సింహ కన్యారాశులందు; సూర్య సంగమ కాలముననను=సూర్యుడు కలిసిన వేళయందును; జన్మతారల+అందున=పుట్టినపుడున్న నక్షత్రములున్న వేళలందును; సంధులందున్=పర్వదినముల సంధి సమయము లందును; యజ్ఞకుండ=యజ్ఞకుండమను తటాకములోని; పయస్=నీటిలో; స్నానము=స్నానము; అఘహరంబు=పాపములను హరించును.

భావము :- సూర్యుడు మేషరాశి యందున్నపుడు అమావాస్యాది పర్వతిథులలో యజ్ఞకుండమున స్నానము చేసి శక్తి కొలది భూసురులకు సువర్ణదానము చేసిన నరుడు పాపములను పోగొట్టుకొనును. అదేరీతిగా సూర్యుడు వృషభరాశి యందు మిథున రాశియందు కర్కాటక రాశియందు నున్నపుడు సప్త గోదావరమున పవిత్ర స్నానము చేసిన నరుడు తన పాపములను తొలగించుకొనును. ఆషాఢ మాసము నందలి కృష్ణపక్ష చతుర్దశి యందు కన్యారాశిలోను సింహరాశిలోను సూర్యుడున్న వేళ, జన్మ నక్షత్రము కలిసిన సమయము లందు, పర్వదినముల సంధి వేళలందు యజ్ఞకుండ జలములలో స్నానము చేయుట పాపనాశనకరము.

విశేషము :- రాశులు పండ్రెండు. 1. మేషము, 2. వృషభము, 3. మిథునము, 4. కర్కాటకము; 5. సింహము, 6. కన్య, 7. తుల, 8. వృశ్చికము, 9. ధనుస్సు, 10. మకరము, 11. కుంభము, 12. మీనము-అనునవి. సూర్యుడు మేషాది రాశులలో నున్నపుడు స్నానము చేసిన కల్గెడి ఫలములను ఈ పద్యము నుండి వరుసగ వివరింపబడుచున్నది.

తే॥ భానుమంతుండు తులమీఁదఁ బవ్వళింప
యజ్ఞకుండ తటాకంబునందుఁ గ్రుంకి
బ్రహ్మ హత్యాదులైన పాపనిచయములఁ
బంచ బంగాళముగఁదోలుఁ బంచజనుఁడు. 32

అర్థము :- భానుమంతుండు=సూర్యుడు; తులమీఁదన్=తులారాశిపై; పవ్వళింప=(శయనించి) ఉండగా; యజ్ఞకుండ=యజ్ఞకుండమను పేరుగల; తటాకంబునందున్=జలాశయములో; క్రుంకి=స్నానముచేసి; పంచజనుఁడు=(పంచ భూతముల నుండి పుట్టిన) నరుడు; బ్రహ్మ హత్య=బ్రాహ్మణ హత్య; ఆదులు+ఐన=మొదలగు; పాప=పాపముల; నిచయములన్=సమూహములను; పంచబంగాళముగన్=చెల్లచెదరుగ; తోలున్=పారద్రోలును.

భావము :- సూర్యుడు తులారాశి యందున్నపుడు యజ్ఞకుండము నందు స్నానమాచరించిన నరుడు బ్రహ్మ హత్యాదులైన పాపములను పారద్రోలును.

క॥ ఆదిత్యుఁడు వృశ్చికమునఁ
బాదం బిడినట్టి వేళఁ బావన తిథి సూ
ర్యోదయమున యజ్ఞ తటా
కోదకమునఁ గ్రుంకి మనుజుఁ డొడుచు నఘంబుల్. 33

అర్థము :- ఆదిత్యుఁడు=సూర్యుడు; వృశ్చికమునన్=వృశ్చికమను రాశియందు; పాదంబు+ఇడినట్టి వేళన్=అడుగుపెట్టిన సమయములోను; పావనతిథిన్=పవిత్రమైన తిథిలో; సూర్య+ఉదయమున=సూర్యోదయ వేళ; యజ్ఞతటాక=యజ్ఞకుండమను చెఱువులోని; ఉదకమునన్=నీటిలో; క్రుంకి=మునకలిడి; మనుజుఁడు=మనుష్యుడు; అఘంబుల్=పాపములను; ఒడుచున్=జయించును.

భావము :- సూర్యుడు వృశ్చికరాశిలోనికి అడుగు పెట్టిన పవిత్రమైన తిథిలో సూర్యోదయ సమయమున యజ్ఞకుండ తటాకములోని నీటిలో పవిత్ర స్నానము చేసి నరుడు పాపములను జయించును.

తే॥ ఇనుఁడు కోదండరాశి యందెక్కి యుండ
రుద్ర నక్షత్రమునను మర్త్యుండు నియతి
యజ్ఞకుండ పయస్స్నాన మాచరించి
సృష్టిలోఁదోలుఁ బాతక శ్రేణి నెల్ల. 34

అర్థము :- ఇనుఁడు=సూర్యుడు; కోదండరాశియందు=ధనూరాశిపై; ఎక్కి+ఉండ= అధిష్ఠించి యున్న సమయమున; రుద్ర నక్షత్రముననను=ఆర్ద్రా నక్షత్రము నందు; మర్త్యుండు= నరుడు; నియతి=నియమముతో; యజ్ఞకుండ=యజ్ఞకుండము యొక్క; పయస్=నీటిలో; స్నానము=పవిత్ర స్నానము; ఆచరించి=చేసి; సృష్టిలోన్=సృష్టిలోని; పాతక శ్రేణిన్+ఎల్ల= పాపముల సమూహము నంతటిని; తోలున్=పారద్రోలును.

భావము :- సూర్యుడు ధనూరాశి యందు ఆర్ద్రా నక్షత్రము నధిష్ఠించినవేళ నరుడు నియమముతో యజ్ఞకుండ జలములలో స్నానము చేసి సృష్టిలోని పాపములన్నింటిని పారద్రోలును.

విశేషము :- శివపూజకు ఆర్ద్రానక్షత్రము చాల శ్రేష్ఠము. ఆర్ద్రోత్సవము అనగా ఆర్ద్రా నక్షత్రమున చేయు శివపూజయే.

తే॥ మకర రాశిస్థుఁడై భానుమంతుఁడుండఁ
బుష్య నక్షత్రమునఁ బ్రొద్దు పొడుచునపుడు
భాను వాసరమున యజ్ఞ భద్ర సరసిఁ
గ్రుంకి పాతక చయముల పొంక మణఁచు. 35

అర్థము :- భానుమంతుఁడు=సూర్యుడు; మకర రాశిస్థుఁడై=మకరరాశి యందున్న వాడై; ఉండన్=ఉండగా; పుష్య నక్షత్రమునన్=పుష్యమి అను నక్షత్రమున్న సమయమున; భాను వాసరమున=ఆదివారమున; ప్రొద్దు పొడుచున్+అపుడు=సూర్యోదయవేళ; యజ్ఞ+భద్ర సరసిన్=యజ్ఞము అనుపేరుగల మంగళకరమైన కుండము నందు; క్రుంకి=మునిగి (స్నానము చేసి) పాతక చయముల=పాప సమూహముల యొక్క; పొంకము=గర్వమును; అణఁచు= అణగద్రొక్కును.

భావము :- సూర్యుడు మకర రాశియందున్నపుడు పుష్యమీ నక్షత్రమున్నట్టి ఆదివారమునాడు సూర్యోదయ సమయమున యజ్ఞకుండమున పవిత్ర స్నానము చేసిన నరుడు పాప సమూహముల గర్వమును అణగద్రొక్కును.

విశేషము :- సూర్యుడు కర్కాటక రాశి నుండి మకరరాశి వరకు సంచరించు కాలము దక్షిణాయనము. మకరము నుండి కర్కాటక రాశివరకు సంచరించు కాలము ఉత్తరాయణము. సూర్యుడు మకరరాశి లోనికి ప్రవేశించు పవిత్ర సమయమును ఉత్తరాయణ పుణ్యకాల మనిరి. అందువలన మకర సంక్రమణమునకు ప్రాముఖ్యము కల్గినది.

క॥ మాఘమునఁ గుంభరాశి ని
దాఘద్యుతి యుండ సప్త తాపస వాహి
న్యోఘమున మునుఁగు నరుఁడఖి
లాఘ విఘటితుఁడగుచుండు హావ ప్రౌఢిన్. 36

అర్థము :- నిదాఘద్యుతి=(బాగుగా తపింపజేయు దీప్తి గలవాడైన) సూర్యుడు; మాఘమునన్=మాఘమాసములో; కుంభరాశిన్=కుంభమను రాశియందు; ఉండన్=ప్రవర్తించు చుండగా; సప్తతాపస వాహిని=సప్తర్షులచే కొనిరాబడిన సప్తగోదావరమను నది యొక్క; ఓఘమున=ప్రవాహము నందు; మునుఁగు=స్నానము చేయు; నరుఁడు=మనుజుడు; హావ=చేష్టల యొక్క; ప్రౌఢిన్=గౌరవముతో; అఖిల=సమస్తమైన; అఘ=పాపముల నుండి; విఘటితుఁడు=వేరు చేయబడినవాడు; అగుచుండున్= అగుచుండును.

భావము :- సూర్యుడు మాఘమాసమున కుంభరాశి యందున్నపుడు సప్త గోదావర ప్రవాహము నందు స్నానము చేసిన నరుడు తన సత్ప్రవర్తన చేత సమస్త పాపరహితుడగును.

తే॥ ఫాల్గునంబున నుత్తరాఫల్గునినిని
మీనరాశిని సూర్యుండు మెలఁగుచుండ
సప్త గోదావరాభిషేచనము సేయఁ
బాతక వ్రాతముల నెల్ల భంగపఱచు. 37

అర్థము :- సూర్యుండు=సూర్యుడు; ఫాల్గునంబునన్=ఫాల్గునమను మాసమున; ఉత్తరా ఫల్గునినిని=ఉత్తర ఫల్గునీ నక్షత్రమున్న సమయమున; మీనరాశిని=మీనరాశి యందు; మెలఁగుచుండ=ప్రవర్తించుచున్న వేళ; సప్తగోదావర=సప్తగోదావరము నందు; అభిషేచనము= స్నానము; చేయన్=చేయగా; పాతక వ్రాతములన్+ఎల్ల=పాప సమూహముల నన్నింటిని; భంగపఱచు=నాశము చేయును.

భావము :- సూర్యుడు ఫాల్గున మాసమున మీనరాశి యందున్నపుడు ఉత్తర ఫల్గునీ నక్షత్రమున్న సమయమున సప్త గోదావరమున పవిత్ర స్నానము చేసిన నరుడు పాప సమూహమును నాశము చేయును.

విశేషము :- ఫల్గునీ నక్షత్రముల సమూహము చాల పెద్దది. అందువలననే పూర్వ ఫల్గుని, ఉత్తర ఫల్గుని అని రెండుగ విభజింపబడినది. పూర్వఫల్గుని వ్యవహారమున "పుబ్బ" యైనది. ఉత్తర ఫల్గుని "ఉత్తర" అని మాత్రమే వ్యవహరింపబడు చున్నది.

మ॥ ప్రతివేళం దగ మర్త్యుఁ డీక్రియఁ జరింపం బాడి యంగీ కృత
వ్రతుఁడై దక్షిణ కాశి యందు బహుళ స్వర్గాపవర్గార్థమై
శితికంఠ ప్రియ మందిరంబయిన యీ క్షేత్రంబు నందెచ్చటన్
మృతుఁడై యున్న నరుండు పొందు గమి కర్మీభూత కైవల్యమున్. 38

అర్థము :- మర్త్యుఁడు=మానవుడు; ప్రతివేళన్=ప్రతి సమయము నందును; ఈ క్రియన్=ఈ విధముగ; దక్షిణ కాశి+అందు=దక్షిణ కాశియగు దక్షారామము నందు; అంగీకృత= స్వీకరింపబడిన; వ్రతుఁడై=నియమము కలవాడై; బహుళ=మిక్కిలి; స్వర్గ=సుర లోకమును; అపవర్గ=మోక్షమును; అర్థమై=ప్రయోజనము కొఱకై; తగన్=తగినట్లు; చరింపన్=ప్రవర్తించుట; పాడి=తగినది; శితికంఠ=గరళకంఠుని యొక్క; ప్రియ మందిరంబు+అయిన=ఇష్టమైన ప్రాసాదమైనట్టి; ఈ క్షేత్రంబు నందు=ఈ పవిత్ర క్షేత్రము నందు; ఎచ్చటన్=ఏ చోటనైనను; మృతుఁడై+ఉన్న=మరణించి యున్న; నరుండు=మానవుడు; గమి కర్మీ భూత="గమ్" అను ధాతువునకు కర్మయైన; కైవల్యమున్=ముక్తిని; పొందున్=పొందును.

భావము :- నరుడు దక్షిణకాశియైన దక్షారామము నందు నిత్యము ఈ విధముగ నియమశీలుడై మోక్షమును పొందుట కొఱకై ప్రవర్తించుట శ్రేష్ఠము. కాలకంఠుని నివాసమైన ఈ దక్షారామమనెడి పవిత్ర తీర్థము నందు ఎచట మరణించిన నరుడైనను మోక్షమును పొందును.

విశేషము :- "గమికర్మీ భూత" అని శృంగార నైషధము (2-20) నందు కూడ ప్రయోగించెను. ఇది శ్రీహర్షుని "గమికర్మీకృత" (నైష. 2-40) అనుదాని అనుసరణము.

క॥ కనకం బణు మాత్రం బై
నను దక్షారామ నగర నైకటిక మహా
ముని సింధువు దరి దానం
బొనరించుట మేరు దాన మూర్వీం దలఁపన్.. 39

అర్థము :- దక్షారామ నగర=దక్షారామ నగరము నందు; నైకటిక=(ఆలయమునకు) సమీపము నందలి; మహాముని సింధువు=(సప్త) మహర్షులచే కొనిరాబడిన సప్త గోదావరము యొక్క; దరిన్ ఒడ్డున; అణుమాత్రంబు+ఐనను=స్వల్పాతి స్వల్పమైనను; కనకంబు= బంగారము; దానంబు=దానము; ఒనరించుట=చేయుట; తలఁపన్= విచారింపగా; ఉర్విన్=భూమియందు; మేరు దానము=బంగరు కొండ (గొప్ప) దానమే యగును.

భావము :- దక్షారామమున శ్రీ భీమేశ్వరాలయ సమీపమున గల సప్త గోదావరము ఒడ్డున అతి కొంచెమైనను సువర్ణ దానము చేసినచో - ఆలోచింపగా ఈ లోకము నందు హేమాద్రిని దానమిచ్చినట్లగును. అనగా మిక్కిలి గొప్ప దానమగునని భావము.

తే॥ వర్తనం బెల్ల శంభు సేవావ్రతంబు
మాట లెల్ల పంచాక్షరీ మంత్రరాశి
భోగమోక్ష నివాసైక భూమియైన
దక్షపురి నున్న జనులకో తలిరుఁ బోణి. 40

అర్థము :- ఓ తలిరుఁ బోణి=చిగురాకు వంటి శరీరము గల ఓ పార్వతీ! భోగ=ఐహిక మైన భోగములకును; మోక్ష=ముక్తికిని; నివాస+ఏక భూమి+ఐన=ఒకే నివాస ప్రదేశమైన; దక్షపురిన్=దక్షారామము నందు; ఉన్న=ఉండిన; జనులకు=ప్రజలకు; వర్తనంబు+ఎల్ల= నడవడి అంతయు; శంభు సేవా వ్రతంబు=శంకరుని సేవించు వ్రతము; మాటలు+ఎల్ల= పలుకులన్నియు; పంచాక్షరీ మంత్ర+రాశి=పంచాక్షరీ మంత్రము యొక్క ప్రోవు (అగును).

భావము :- ఓ పార్వతీ! భోగ మోక్షములకు ఏకైక నివాస స్థానమైన దక్షారామము నందుండు ప్రజల నడతలన్నియు శంభుని సేవించు వ్రతములే యగును. వారి పలుకు లన్నియు పంచాక్షరీ మంత్రములే అగును.

వ॥ దక్షారామ మాహాత్మ్యం బవాఙ్మానస గోచరంబు. భీమనాథ మహాదేవ దివ్య శ్రీపాద పద్మ సేవావ్రతంబు వలన నెట్టి పాపకర్ముండును భోగ మోక్ష పదవీ సామ్రాజ్య పట్టాభిషేక మహాదివ్య పదవి నొందు. సర్వశాస్త్ర సిద్ధాంత మతాంతరంబులకు సమ్మతంబైన యమ్మహాస్థానం బేకవటీభూతంబు. సద్యోముక్తి ప్రదంబు. సద్యః పరిజ్ఞాన సదనంబు. సద్యః కళా సమృద్ధి ప్రదంబై యుండునని దయార్ద్ర మానసుండై వృషభధ్వజుండాదేవి నుద్దేశించి పార్వతీ! నీ వడిగిన యర్థంబు సర్వంబు సమర్థించితి. చిత్తంబున నవధానంబు సేయు మనినం బతికిఁ గరంబులు మొగిడిచి మ్రొక్కి భవాని హర్షోత్కర్షంబు నొందె; నీ రహస్యం బేనును గురుముఖంబున నెఱిఁగి ప్రసంగ వశంబునం బ్రహ్మాదులగు మీకు నుపదేశించితి. 41

అర్థము :- దక్షారామ=దక్షారామ క్షేత్రము యొక్క; మాహాత్మ్యంబు=మహిమ; అవాఙ్మానస గోచరంబు=వాక్కునకు; మనసునకును అందనిది; భీమనాథ మహాదేవ=శ్రీ భీమేశ్వర స్వామి యొక్క; దివ్య=సుందరమైన; శ్రీ పాదపద్మ=సర్వైశ్వర్య సంపన్నమైన చరణ కమలముల; సేవా+వ్రతంబు వలనన్=సేవించుట యందలి దీక్షచేత; ఎట్టి=ఎటువంటి;

పాపకర్ముండును=పాపపు పనులు చేసినవాడైనను; భోగ...పదవిన్. భోగ=భుక్తి; మోక్ష=ముక్తి యను; పదవీ=స్థానముల; సామ్రాజ్య=సువిశాల రాజ్యము నందు; పట్టాభిషేక=రాజపట్టముతో అభిషేకింపబడుట అనెడు; దివ్య పదవిన్=దివ్యమైన పదమును; ఒందున్=పొందును; సర్వ శాస్త్ర=సమస్తమైన శాస్త్రములకు; సిద్ధాంత=సిద్ధాంతములకు; మత+అంతర=ఇతర మతములకు; సమ్మతంబు+ఐన=ఆమోదయోగ్యమైన; ఆ+మహాస్థానంబు=ఆ గొప్ప క్షేత్రము; ఏకపటీభూతంబు=ఒకే ఒక శ్రేష్ఠమైనది; సద్యః+ముక్తి=వెనువెంటనే మోక్షమును; ప్రదంబు= ఇచ్చునది; సద్యస్=తత్కాల సంభవమగు; పరిజ్ఞాన=పూర్ణమైన జ్ఞానమునకు; సదనంబు= నివాసము; సద్యస్=వెంటనే; కళాసమృద్ధి=గీత వాద్యాది చతుష్షష్టి కళల సమృద్ధిని; ప్రదంబు= ఒసగునది; ఐ=అయి;ఉండును+అని=అలరారగలదని; దయా+ఆర్ద్ర=దయతో చెమ్మగిల్లిన; మానసుండై=మనసు కలవాడై; వృషభ ధ్వజుండు=(వృషభమును కేతనమందు చిహ్నముగ గల) ఈశ్వరుడు; ఆ+దేవిన్=ఆ పార్వతిని; ఉద్దేశించి=ఉద్దేశించి; పార్వతీ=ఓ పర్వత రాజనందనా!; నీవు=నీవు; అడిగిన=అడిగినటువంటి; అర్థంబు=విషయము; సర్వంబు= మొత్తమును; సమర్థించితి=పుష్టి కల్గించితిని; చిత్తంబునన్=మనసులో; అవధానంబు= ఏకాగ్రతను; చేయుము=కల్గించు కొనుము; అనినన్=అని చెప్పగా; పతికిన్= భర్తకు; కరంబులు=చేతులు; మొగిడిచి=జోడించి; మ్రొక్కి=నమస్కరించి; భవాని=పార్వతి; హర్ష+ ఉత్కర్షంబును=ఆనందము యొక్క ఔన్నత్యమును; ఒందెన్=పొందెను; ఈ రహస్యంబు=ఈ రహస్యమును; ఏనును=నేను కూడ; గురు ముఖంబునన్=గురువుల నోటినుండి; ఎఱింగి=తెలిసికొని; ప్రసంగ వశంబునన్=సంభాషించు విషయమునను లోబడుట చేత; బ్రహ్మవేదులు+అగు=బ్రహ్మజ్ఞాన వేత్తలగు; మీకున్=మీకు; ఉపదేశించితి=బోధించితిని.

భావము :- శ్రీ దక్షారామ క్షేత్ర మహిమ మాటకు మనసునకు అందునది కాదు. కేవలము అతీంద్రియ జ్ఞాన సంబంధమయినది. శ్రీ భీమేశ్వర స్వామి వారి దివ్య చరణముల నర్చించు దీక్షతో ఎట్టి పాప కర్ముడు కూడ మోక్ష సామ్రాజ్యమున పట్టాభిషిక్తుండు కాగలడు. ఈ దక్షారామము సమస్తమైన శాస్త్రములకు, సిద్ధాంతములకు, మతములకు ఆమోదయోగ్య మైనది. ఈ క్షేత్రము తత్కాల మోక్షమును, తత్కాల పూర్ణ జ్ఞానమును, తత్కాల కళా విశేషముల సమృద్ధితో యోగ్యమయినదని చెప్పి పరమ శివుడు పార్వతితో - ఓ దేవీ! నీ వడిగిన ప్రశ్నలకు సమాధానము చెప్పితిని. నీవిక మనసులో ఏకాగ్రత నవలంబింపుము - అని పల్కెను. అపుడు పార్వతి భర్తకు చేతులు జోడించి నమస్కరించి పరమ సంతోషమును పొందెను. ఈ రహస్యమును నేనును గురువుల వలన విని బ్రహ్మవేత్తలైన మీకు మాటల సందర్భమున బోధించితిని (అని సూతుడు పల్కెను).

విశేషము :- 1) సర్వ శాస్త్ర సిద్ధాంత మతాంతరంబులకు నేకవటీ భూతంబు."నేహ నానాస్తి కించన" అనునది బృహదారణ్యక శ్రుతి వచనము. నానాత్వ నిషేధము ఏకాత్మ స్వరూప ప్రతిపాదనమునైన ఉపనిషల్లక్షణము. ఇక్కడ సూచితమయినది.

2) మునులనుద్దేశించి "బ్రహ్మ వేదులగు మీకు" అనుటచేత రహస్య విషయమైన బ్రహ్మ విద్యా సంబంధమైన అధికారము మీకున్నదని సూచింపబడినది.

3) "గురు ముఖంబున" - అనుట చేత జీవ బ్రహ్మైక్య రూపమయిన అద్వైత బ్రహ్మతత్త్వము గురు దేవతానుగ్రహము వలననే ప్రాప్తమగునని సూచితము.

శా॥ సద్యోముక్తి పదంబు దక్ష నగరీ స్థానంబు విశ్వేశ్వరుం
డాద్యుం డవ్యయుఁ డానతిచ్చె నిది వేదార్థంబు సద్యో విము
క్త్యుద్యోగం బనుపేక్ష్యమైన నదిసుం డొండొక్క తీర్థంబు పు
ష్పో ద్యానంబనఁ గాలమందుఁ గడుపన్ యోగంబు భావింపఁగన్. 42

అర్థము :- దక్షనగరీ స్థానంబు=దక్షారామ క్షేత్రము; సద్యః=తత్క్షణమే, ముక్తి=మోక్షమును కల్గించు; పదంబు=స్థానము (అని); ఆద్యుండు=ఆది ఐనవాడు; అవ్యయుఁడు=నాశము లేనివాడు; విశ్వేశ్వరుండు=సమస్త విశ్వమునకు ప్రభువైన సదాశివుడు; ఆనతి+ఇచ్చెన్=చెప్పెను; ఇది=ఈ క్షేత్రము (భావము); వేద+అర్థంబు=వేదముల తాత్పర్యము; సద్యః+విముక్తి+ఉద్యోగంబు=వెంటనే కలుగు మోక్షమునకు ఉన్నత యోగమైనట్టిది; అనుపేక్ష్యము=నిర్లక్ష్యము చేయుటకు వీలుకానిది; ఐనన్=అయినట్టి; పుష్ప+ఉద్యానంబు+అనన్=పుష్పించిన చెట్లు గల ఉద్యాన వనము అనునట్లుగ; అది=ఆ దక్షారామము; ఒండు+ఒక్క=ఒకే ఒక; తీర్థంబు+సుండు=పవిత్ర తీర్థము సుమా! అందు=ఆ పుష్పోద్యానము (దక్షారామము) నందు; కాలము=జీవిత కాలమును; గడుపన్=వెళ్ళబుచ్చుట; భావింపఁగన్=ఆలోచింపగా; యోగంబు=మహాయోగము (అదృష్టము).

భావము :- ఈ దక్షారామ క్షేత్రము వెనువెంటనే మోక్షమును ప్రసాదింప గల స్థానము అని సనాతనుడు శాశ్వతుడు విశ్వనాయకుడైన శంకరుడు చెప్పెను. ఈ క్షేత్రము వేదముల తాత్పర్యమైనట్టిది. మోక్షమునకు యోగమైనట్టిది. నిర్లక్ష్యము చేయ వీలు కానిది. ఈ దక్షారామము పుష్పించిన ఉద్యానవనము వలె ఏకైకమైన పవిత్ర తీర్థము. అచ్చట జీవితకాలమును గడపుట నిజముగ అదృష్టము.

వ॥ మఱియు భీమలింగ మాహాత్మ్యంబు భవకలుష నాశనంబు; బ్రహ్మ విష్ణు, పురందరాదులకుఁ గల్ప కోటి శతంబులనైన వచియింప నలవిగాదు. అయినను నా నేర్చు విధంబున నింక వర్ణించెద. 43

అర్థము :- మఱియు=అంతియే గాక; భీమలింగ=శ్రీ భీమేశ్వర లింగము యొక్క; మాహాత్మ్యంబు=మహిమ, భవ+కలుష+నాశనంబు=జన్మసంబంధమైన పాపములను పరిహరించు నట్టిది; బ్రహ్మ+విష్ణు+పురందర+ఆదులకున్=బ్రహ్మ, విష్ణువు, ఇంద్రుడు మొదలగు వారికిని; కల్పకోటి+శతంబులన్+ఐన=శతకోటి కల్పముల కాలములో నైనను; వచియింపన్=చెప్పుటకు; అలవి కాదు=శక్యము కాదు; అయినను=అయినప్పటికిని; నా+నేర్చు+విధంబునన్=నేను ఎఱిగిన రీతిగా; ఇంక=ఇకపయి; వర్ణించెద=నిరూపించెదను.

భావము :- అంతేకాదు. శ్రీ భీమేశ్వర లింగము యొక్క మహిమ జన్మ జాత పాపములను పరిహరింప గలట్టిది. ఆ మహిమను బ్రహ్మ, విష్ణు, మహేంద్రాదులైనను శతకోటి కల్పముల కాలమందైనను నిరూపింపలేరు. అయినను నేను నా శక్తి కొలదిగ నిరూపించెదను.

విశేషము :- కల్పము :- చూడుడు - భీమ - 1-113.

తే॥ భువనముల మూఁటి యందును బొబ్బవిడుచు
నంత దాఁకనె యితర తీర్థాదు లెల్ల
నపుడు భేదంబు లేదని రవని మీఁద
దక్ష వాటిపురీ భీమ ధామ మహిమ. 44

అర్థము :- ఇతర+ఇతరములైన; తీర్థ+ఆదులు=తీర్థములు మొదలైనవి; ఎల్లన్=అన్నియు; భువనములు=లోకములు; మూటియందును=మూడింటి యందును; అంతదాఁకనె=అంతవఱకే; బొబ్బవిడుచున్=సింహనాదము చేయును; అపుడు=ఆ సమయమున; దక్ష...మహిమన్; దక్షవాటీ=దక్షారామమునను; పురీ=పట్టణము సందలి; భీమధామ=శ్రీ భీమేశ్వరాలయము యొక్క; మహిమన్=గొప్పతనము చేత; అవని మీఁదన్= భూమి పైన (గల తీర్థాదులకు); భేదంబు=కలహము; లేదు+అనిరి=లేదని (పెద్దలు) అనిరి.

భావము :- ఇతర తీర్థ క్షేత్రములు ముల్లోకములందును అంతవరకే బొబ్బవిడుచును. అపుడు దక్షారామ భీమేశ్వర స్వామి మహిమ వలన భూలోకము నందలి తీర్థ క్షేత్రములకు జగడము లేదని పెద్దలనిరి.

సీ॥ దక్షుండు పొట్టేలి తల ధరించిన యప్డు
భారతి ముక్కు గోల్పడిన యపుడు
పూషార్కు వదనంబు బోసి వోయిన యప్డు
విష్ణుని చక్రంబు విఱిగినపుడు
అగ్నినాలుక లేడు నోడు మాసిన యప్డు

డుడు రాజు పొట్ట గుజ్జుఱికినపుడు
జన్నంపుటిఱ్ఱి మస్తకము ద్రెళ్ళిన యప్డు
వడి దక్షుతల చిచ్చు వడిన యపుడు

తే॥ ప్రాణ భయమున ముక్తి సంభ్రమము మెఱయ
నమ్మహోత్పాత కాలంబు నందు మునులు
దైవ గంధర్వ సిద్ధ విద్యాధరులును
నేమమున గొల్తు రెవ్వాని నెమ్మనమున. 45

అర్థము :- దక్షుండు=దక్ష ప్రజాపతి; పొట్టేలితల=పొట్టేలు తలను; ధరించిన+అప్డు=తాల్చినయపుడు; భారతి=సరస్వతి; ముక్కున్=ముక్కును; కోల్పడిన+అపుడు=పోగొట్టుకొనినపుడు;

పూష+అర్కు=(ద్వాదశాదిత్యులలో ఒకడైన) పూషుడను సూర్యుని; వదనంబు=నోరు; బోసి+పోయిన+అప్డు=దంత శూన్యమైనపుడు; విష్ణుని=విష్ణుదేవుని; చక్రంబు=ఆయుధమైన సుదర్శన చక్రము; విఱిగిన+అపుడు=విరిగిపోయినపుడు;

అగ్ని నాలుకలు+ఏడున్=అగ్నిదేవుని ఏడు నాలుకలును; ఔడు+మాసిన+అప్డు=అధరము అదృశ్యమైనపుడు; ఉడురాజు=చంద్రుని; పొట్ట గుజ్జు=పొట్టయందలి వస; ఉఱికిన+అపుడు=వెలికి వచ్చినపుడు;

జన్నము+ఇఱ్ఱి=యజ్ఞ మృగము యొక్క; మస్తకము=తల; త్రెళ్ళిన+అప్డు (భూమిపై) పడినపుడు; వడి=వేగముగ; దక్షుతల=దక్షుని శిరస్సు; చిచ్చు=అగ్నిలో; పడిన+అపుడు=పడిపోయినపుడు;

ఆ+మహా+ఉత్పాత కాలంబునందు=గొప్పదగు ఆ ఉపద్రవ సమయము నందు; ప్రాణ భయమున=ప్రాణములు పోవునను భయముతోను; ముక్తి సంభ్రమము=విడుపు నందలి వేగిరపాటు; మెఱయన్=వ్యక్తము కాగా; మునులు=మహర్షులు; దైవ=దేవతలు; గంధర్వ=గంధర్వులు; సిద్ధ=సిద్ధులు; విద్యాధరులును=విద్యాధరులు కూడ; నెఱ+మనమున=నిండు మనసుతో; నేమమునన్=నియమముగ; ఏ+వానిన్=ఎవనిని; కొల్తురు=కొల్చెదరో.

భావము :- దక్ష యజ్ఞ విధ్వంసమునాడు శివ జట నుండి ఆవిర్భవించిన వీరభద్రుడు విక్రమించి దక్షుని తలను త్రెంచి ఆతని మెడపై పొట్టేలు తలను పెట్టినపుడు, సరస్వతీదేవి తన ముక్కును పోగొట్టుకొన్నపుడు, పూషుడను సూర్యుని పండ్లు రాలి నోరు బోసిపోయినపుడు; విష్ణుదేవుని చక్రాయుధము విరిగి పోయినపుడు; అగ్నిదేవుని ఏడు నాలుకలు క్రింది పెదవి

తెగిపడినపుడు; చంద్రుని పొట్ట పగిలి కొవ్వు బయటికి వచ్చినపుడు, యజ్ఞ మృగము తల నేలరాలినపుడు, దక్షుని తల వేగముగ అగ్నిలో పడినపుడు కలిగిన ఆ గొప్ప ఉపద్రవమునకు ప్రాణములు పోవునని భయము వేగిరపాటులతో మునులు, దేవతలు, గంధర్వులు, సిద్ధులు, విద్యాధరులును నిండుమనసుతో నియమశీలురై ఏ స్వామిని కొల్చెదరో అట్టి (తర్వాతి పద్యముతో అన్వయము).

విశేషము :- అగ్ని నాలుక లేదు - జ్వాలా రూపములయిన అగ్ని నాలుకలు ఏడు. అవే సప్త జిహ్వలు. 1. కాళి, 2. కరాళి, 3. మనోజవ, 4. సులోహిత, 5. సుధూమ్రవర్ణ, 6. ఉగ్ర, 7. ప్రదీప్త - అనునవి.

ద్వాదశాదిత్యులు :- భీమ. 3-87 చెంత తెలుపబడినవి.

సీ॥ దుగ్ధాబ్ధి మంథనోద్భూత హాలాహల
  జ్వలన మేచక కంఠ! శరణు శరణు
 గిరి చాప నిష్ప్యూత హరిశిలీముఖ దగ్ధ
  పుర గోపురాట్టాల! శరణు శరణు
 సింధురాంధ జలంధ రాంధక వ్యాఘ్రాది
  సురకంటకధ్వంస! శరణు శరణు
 విలయ సంధ్యా కాల వికట తాండవ కేళి
  జర్జర బ్రహ్మాండ! శరణు శరణు

తే॥ శరణు ఖేచర దేవతా సార్వభౌమ!
 శరణు త్రైలోక్య సతత రక్షాధురీణ!
 శరణు దక్షిణ కాశికా స్థాన నిలయ!
 శరణు భీమేశ శంకర! శరణు శరణు. 46

అర్థము :- దుగ్ధ+అబ్ధి=పాల సముద్రమును; మంథన=మథించుటచేత; ఉద్భూత= పుట్టిన; హాలాహల=హాలాహలమును; జ్వలన=అగ్నితో; మేచక కంఠ=నల్లని కంఠము కలవాడా!; శరణు శరణు=శరణు జొచ్చితిమి;

గిరి చాప=పర్వతమను ధనుస్సు నుండి; నిష్ప్యూత=బయల్వెడలిన; హరి శిలీముఖ= నారాయణాస్త్రముతో (విష్ణువను బాణముతో) దగ్ధ=దహింపబడిన; పుర=త్రిపురముల యొక్క; గోపుర=గోపురములును; అట్టాల=ప్రాసాదములును కలవాడా!; శరణు శరణు=రక్షించి కాపాడుము;

సింధుర=గజాసురుడు; అంధ=వివేకహీనుడైన; జలంధర=జలంధరుడు; అంధక=అంధకాసురుడు; వ్యాఘ్ర=వ్యాఘ్రాసురుడు; ఆది=మొదలయిన; సురకంటక=దేవ విరోధులైన రక్కసులను; ధ్వంస=నాశనము చేసిన వాడా! శరణు శరణు=రక్ష రక్ష;

విలయ=ప్రళయ కాలము నందలి; సంధ్యాకాల=సంజవేళలో; వికట=భయంకరమైన; తాండవకేళి=తాండవ నృత్య క్రీడతో; జర్జర=శిథిలమైన; బ్రహ్మాండ=భువన గోళము కలవాడా! శరణు శరణు=రక్ష రక్ష;

ఖేచర=గగన చారులకు; దేవతా=దేవతలకు; సార్వభౌమ= చక్రవర్తీ! శరణు=కాపాడుము; త్రైలోక్య=ముల్లోకములలోని వారిని; సతత=ఎల్లపుడు; రక్షా=రక్షించుటలో; ధురీణ=అగ్రేసరుడా! శరణు=రక్షింపుము; దక్షిణకాశికా+స్థాన=దక్షిణ కాశి అను ప్రదేశమే (దక్షారామమే); నిలయ=నివాసముగ కలవాడా!; శరణు=రక్ష; భీమేశ శంకర=భీమేశ్వరుడను పేరుగల ఓ శంకరా! శరణు శరణు శరణు=రక్షింపుము రక్షింపుము రక్షింపుము.

భావము :- దేవదానవులు పాల సముద్రమును మథించునపుడు పుట్టిన హాలాహలము యొక్క మంట చేత ( మ్రింగి గొంతున దాచుటచేత) నల్లని కంఠము గల ఓ నీలకంఠా! మేరుపర్వతమును విల్లుగ ధరించి నారాయణాస్త్రమును ప్రయోగించి త్రిపురములను నాశనము చేసిన ఓ త్రిపుర హరా! గజాసురుడు జలంధరుడు అంధకుడు వ్యాఘ్రుడు మొదలయిన దేవ విరోధులైన రక్కసులను సంహరించిన రాక్షసాంతకా! ప్రళయ కాలపు సందెవేళ భయంకర తాండవ నృత్య క్రీడతో భువన గోళమును శిథిలము చేసిన ఓనటరాజా! ఆకాశసంచారులకు దేవతలకు చక్రవర్తి యైనవాడా! ముల్లోకములను సర్వదా రక్షించుట యందు అగ్రేసరుడవైన వాడా! ఓ భీమేశ్వర స్వామీ! రక్షింపుము రక్షింపుము.

క॥ **హర! సర్గ స్థితి నాశన**
**కర! సంసారాబ్ధి తరణ ఘనతర చరణాం**
**బురుహప్లవ! రక్షింపుము**
**శరణాగతులైన మమ్ముఁ జంద్రాభరణా.** 47

**అర్థము** :- చంద్ర+ఆభరణా! చంద్రుడు ఆభరణముగ కలవాడా!; హర=శివా!; సర్గ=సృష్టి; స్థితి=పోషణ (ఉనికి); నాశనకర=లయములను చేయువాడా! సంసార...ప్లవ; సంసార=సంసారమను; అబ్ధి=సముద్రమును; తరణ=దాటుటకు; ఘనతర=మిక్కిలి గొప్ప; చరణ+అంబురుహ=పాదపద్మములే; ప్లవ=నావ ఐనవాడా! శరణాగతులు+ఐన=శరణము కోరివచ్చిన; మమ్మున్=మమ్ములను; రక్షింపుము=కాపాడుము.

భావము :- ఓ చంద్రశేఖరా! సృష్టి స్థితి లయములకు హేతువైన వాడా! హరా! సంసారమనెడి సముద్రమును దాటుటకై పాదపద్మములనెడి నావకలవాడా! నిన్ను శరణు వేడితిమి. మమ్ములను కాపాడుము.

క॥ అపరాధ శతము లోఁగొను
మపరిమిత కృపా విధేయ! యార్త శరణ్యా!
త్రపుసీ కుసుమాభరణా!
కపర్ది కోటీ విటంక ఘటిత శశాంకా! 48

అర్థము :- అపరిమిత=అంతులేని; కృపా=దయకు; విధేయ=విధేయుడవైనవాడా!; ఆర్త+శరణ్యా=దుఃఖితులకు రక్షణమైన వాడా!; త్రపుసీ+కుసుమ=చేదు దోసపూవులు; ఆ భరణా=ఆభరణములుగ గలవాడా! కపర్ది=జటాజూటము యొక్క; కోటీ=అంచు అను; విటంక=పై భాగమున; ఘటిత=కూర్పబడిన; శశాంకా=చంద్రుడు కలవాడా!; అపరాధ శతము=అసంఖ్యాకములైన అపరాధములను; లోఁగొనుము=వశపఱచుకొనుము.

భావము :- అపారమైన దయగలవాడా! దుఃఖితులకు శరణ్యమైనవాడా! చేదు దోస పూవులు ఆభరణములుగ గలవాడా! చంద్రశేఖరా! అసంఖ్యాకములైన మా దోషములను నియంత్రించి రక్షింపుము.

విశేషము :- త్రపుస(ష) అనగా పెద్దగుమ్మడి అను అర్థము కూడ కలదు.

త్రపుసీ కుసుమాభరణము - ఒక వింతయే.

తే॥ సుప్రకాశుండ వగుము విశ్వప్రకాశ;
శర్వ! సర్వేశ! త్రిపుర భంజన! గిరీశ!
యనుచు నందంద నందఱు నభినుతింప
నచట భీమేశ్వరేశ్వరుం డభవుఁడపుడు. 49

అర్థము :- విశ్వ ప్రకాశ=ప్రపంచమును ప్రకాశింప జేయువాడా!; శర్వ=దుష్టులను హింసించువాడా! సర్వ+ఈశ=సమస్తమునకు ప్రభువైనవాడా! త్రిపుర భంజన=త్రిపురములను ధ్వంసము చేసినవాడా!; గిరి+ఈశ=కైలాసనాథుడా!; సుప్రకాశుండవు+అగుము=ప్రత్యక్షము కమ్ము; అనుచున్=అని పల్కుచు; అందందన్=అచ్చటచ్చటనే; అందఱున్=అందరును; అభినుతింపన్=కీర్తింపగా; అపుడు=ఆ సమయమున; భీమేశ్వర+ఈశ్వరుండు=శ్రీ భీమేశ్వరస్వామి యైన; అభవుఁడు=(పుట్టుక లేనివాడైన) శంకరుడు అచట=అక్కడ.

భావము :- ప్రపంచమును ప్రకాశింపజేయు వాడా! దుష్టులను హింసించువాడా! సమస్తమునకు ప్రభువువైన వాడా! త్రిపుర హరా! కైలాసనాథా! మాకు ప్రత్యక్షము కమ్ము అని అర్థించుచు అందరు కీర్తింపగా ఆ సమయమున శ్రీ భీమేశ్వర స్వామి అచట.

ఉ॥ సన్నిధి చేసి వారలకు శాక్కర కేతుఁడు సుప్రసన్నుఁడై
యెన్నిక కెక్కఁగా వరము లిచ్చెననేకము లింతనుండి నా
మన్నన దక్షవాటిక సమస్త మహీవలయంబులోనఁ దాఁ
బన్నుగఁ దీర్థ రాజ పదభాజన మయ్యెడు నెల్లకాలమున్. 50

అర్థము :- శాక్కర కేతుఁడు=వృషభధ్వజుడైన శ్రీ భీమేశ్వర స్వామి; సుప్రసన్నుఁడై=బాగుగ సంతుష్టుడై; వారలకు=ఆ మునులకు; సన్నిధిచేసి=ప్రత్యక్షమై; ఎన్నికకు+ఎక్కగా=ప్రసిద్ధమగునట్లుగా; అనేకములు=లెక్కలేనన్ని; వరములు=వరములు; ఇచ్చెన్=ప్రసాదించెను. ఇంతనుండి=(ఇప్పటి నుండి) ఇకమీదట; నా మన్నన=నా గౌరవము వలన; దక్షవాటిక=దక్షారామము; తాన్=తాను; సమస్త=సకలమైన; మహీవలయంబులోనన్= భూమండలమునందు; పన్నుగన్=సిద్ధముగా; ఎల్లకాలమున్=అన్ని కాలములందును; తీర్థరాజపద=తీర్థములలో శ్రేష్ఠమైన స్థానమునకు; భాజనము=పాత్రము; అయ్యెడున్=అగును.

భావము :- శ్రీ భీమేశ్వర స్వామి సంతుష్టుడై ఆ మునులకు ప్రత్యక్షమై అనేకములైన వరములు ప్రసాదించెను. నా ప్రసాదము వలన ఇకమీదట ఈ దక్షారామము ఈ భూమండలము మీద ఎల్లకాలము తీర్థము లన్నింటిలో శ్రేష్ఠమైనది (తీర్థరాజము) అగును.

క॥ ఈ దక్షారామమునకు
మేదినిఁ గల తీర్థ కోటి మిగులక యుండున్
మేదుర కరుణా గరిమను
సాదరముగ ఖచర సిద్ధజన హితబుద్ధిన్. 51

అర్థము :- మేదుర=దట్టమయిన; కరుణా గరిమను=దయ యొక్క గొప్పతనముతోడను; సాదరముగ=ఆదరముతో కూడినట్లుగ; ఖచర=ఆకాశ సంచారులైన దేవతల; సిద్ధ=సిద్ధుల; జన=జనుల; హిత=మేలు యొక్క; బుద్ధిన్=తలంపుతో; ఈ దక్షారామమునకు=ఈ దక్షారామ తీర్థమునకు; మేదినిన్=భూమిపై; కల=ఉన్నట్టి; తీర్థకోటి=తీర్థముల సమూహము; మిగులక+ఉండున్=మించకుండును.

భావము :- అపారమైన దయాగరిమతోను ఆదర భావముతోను దేవతల సిద్ధుల ప్రజల యొక్క మేలును కోరు తలంపుతోను ఈ దక్షారామ తీర్థమునకు ఈ భూమిపై గల తీర్థము లేవియు సాటిరావు.

తే॥ దక్షుఁ గీర్తించి యా చంద్ర తారకంబు
దక్షవాటిక సకల తీర్థంబులందు
నుత్తమంబుగ వరమిచ్చి యుండు మిచట
నేర్పుగను నేరికిని ముందు నేను నుమయు. 52

అర్థము :- దక్షున్=దక్ష ప్రజాపతిని; కీర్తించి=ప్రశంసించి; సకల+తీర్థంబులందున్=సమస్తమైన తీర్థము లందును; దక్షవాటిక=దక్షారామము; ఉత్తమంబుగ=శ్రేష్ఠమగునదిగ; వరము+ఇచ్చి=వరము ప్రసాదించి; నేనున్=నేనును; ఉమయు=పార్వతియు; నేర్పుగనున్=చాతుర్యముతో; ఏరికిని ముందు=అందరి కన్నను ముందుగా; ఇచటన్=ఈ దక్షారామ తీర్థము నందే; ఆచంద్రతారకంబు=చంద్రుడు చుక్కలు ఉన్నంతవరకు; ఉండుము=నివసించెదము.

భావము :- దక్ష ప్రజాపతిని ప్రశంసించి భూమిపై గల సమస్త తీర్థములలోను ఈ దక్షారామము శ్రేష్ఠమగునదిగ వరమిచ్చి నేనును పార్వతియును ఈ తీర్థమున అందరికన్న ముందుగ వచ్చి ఆచంద్ర తారకముగ నివసింతుము.

సీ॥ యజ్ఞకుండంబున యందుఁ దీర్థం బాడుఁ
బాయ కెవ్వండు నా భక్తుఁడతఁడు
గ్రుంకు తేపులు సప్త గోదావరంబునఁ
బాయ కెవ్వండు నా భక్తుఁడతఁడు
ద్వాదశ క్షేత్ర యాత్రా విధాన మొనర్చుఁ
బాయ కెవ్వండు నా భక్తుఁడతఁడు
దక్షవాటీ మహాస్థానంబునందుండుఁ
బాయ కెవ్వండు నా భక్తుఁ డతఁడు

తే॥ తెరువు నడిచెడు వారికి నిరవు చేసి
ధాన్యములు నెయ్యి నూనె వస్త్రములు లవణ
మాదిగాఁగల యాత్రా పదార్థ సమితిఁ
బాయ కెవ్వండు పెట్టు నా భక్తుఁ డతఁడు. 53

అర్థము :- పాయక=విడువక; ఎవ్వండు=ఎవడు; యజ్ఞకుండంబునయందున్=యజ్ఞకుండమను తటాకము నందు; తీర్థంబు+ఆడున్=పవిత్ర స్నానము చేయునో; అతఁడు=అట్టివాడు; నా భక్తుఁడు=నా యొక్క భక్తుడు;

ఎవ్వండు=ఎవడు; పాయక=విడువక, సప్తగోదావరంబునన్=సప్త గోదావరమునందు; తెపులు=ప్రభాతవేళల; క్రుంకు=స్నానము చేయునో; అతఁడు=వాడు; నా భక్తుఁడు=నాకు భక్తుడు.

ఎవ్వండు=ఎవడు; పాయక=విడువక; ద్వాదశ క్షేత్ర=దక్ష (భీమ) మండలములోని; ద్వాదశ (పంౘ్రెండు) క్షేత్రములకు; యాత్రా=తీర్థయాత్ర చేయు; విధానము=విధిని; ఒనర్చున్=చేయునో; అతఁడు=వాడు; నా భక్తుఁడు=నాకు భక్తుడు;

ఎవ్వండు=ఎవడు; పాయక=విడువకుండ; దక్షవాటీ=దక్షరామ మనెడు; మహా స్థానంబున్+అందు+ఉండున్=గొప్ప ప్రదేశము నందు నివసించునో; అతఁడు=అట్టివాడు; నా భక్తుఁడు=నాకు భక్తుడు;

ఎవ్వండు=ఎవడు; పాయక=విడువక; తెరువు+నడిచెడు వారికిన్=మార్గమున నడచువారికి (బాటసారులకు); ఇరవుచేసి=నివాసము కల్పించి; ధాన్యములు=ఆహార ధాన్యములు; నెయ్యి=నేయి; నూనె=నూనె; వస్త్రములు=బట్టలు; లవణము=ఉప్పు; ఆదిగాన్+కల=మొదలగునవైన; యాత్రా పదార్థ సమితిన్=తీర్థయాత్ర సందర్భమున అవసరమగు పదార్థముల సముదాయమును; పెట్టున్=ఇచ్చునో; అతఁడు=అట్టివాడు; నా భక్తుఁడు=నాకు భక్తుడు.

భావము :- యజ్ఞకుండ తటాకము నందు తప్పకుండ స్నానము చేయువాడు; సప్తగోదావరమున ప్రభాత వేళలందు తప్పక పవిత్ర స్నానము చేయువాడు; భీమమండలము లోని ద్వాదశ క్షేత్రములకు యాత్రచేయు విధిని పాటించువాడు; దక్షారామ తీర్థమున విడువక నివసించువాడు; తీర్థ యాత్రికులైన బాటసారులకు యాత్ర సందర్భమున కావలసిన ఆహార ధాన్యములు, నెయ్యి, నూనె, ఉప్పు, బట్టలు మొదలగు వస్తువులను ఇచ్చుచుండువాడును నా భక్తుడు.

విశేషము :- ద్వాదశ క్షేత్రములు :- భీమ. 3-26. చెంత తెలుపబడినవి.

క॥ **మాటలు వేయియు నేటికిఁ**
**జాటించెను శివుఁడు వేడ్క జగములలో ము**
**న్నీటి దరి దక్ష వాటికి**
**సాటిగఁ దీర్థములు లేవు సత్యము సుండీ.** 54

**అర్థము** :- మాటలు=పలుకులు; వేయియున్=వేయి; ఏటికిన్=ఎందులకు; శివుఁడు=ఈశ్వరుడు; వేడ్కన్=సంతసముతో; జగములలో=లోకములలో; మున్నీటి దరి=సముద్రము చెంతనున్న; దక్షవాటికి=దక్షారామమునకు; సాటిగన్=సమానముగా; తీర్థములు=పవిత్ర

తీర్థములు; లేవు=లేవు; సత్యము=ఇది నిజము; సుండీ=సుమా! (అని) చాటించెను= ప్రకటించెను.

భావము :- వేయిమాటలేల? లోకములలో భూమి మీద సముద్రము చెంతనున్న దక్షారామమునకు సాటి వచ్చు తీర్థములు లేవు. ఇది నిజము సుమా! అని శివుడు సంతోషముతో ప్రకటించెను.

తే॥ బ్రహ్మ విద్వాంసులకుఁ బాశుపత యతులకుఁ
బెట్టు ధన ధాన్య వస్త్రాన్న భిక్ష మెవ్వఁ
డక్షయ గుణంబు గాఁగ నీ దక్షవాటి
వాని కలవడు నిజము కైవల్యపదవి. 55

అర్థము :- ఎవ్వఁడు=ఏనరుడు; బ్రహ్మ విద్వాంసులకున్=బ్రహ్మతత్త్వవిచారకులైన పండితులకు; పాశుపత యతులకున్=శివయోగులకును; ధన=ధనమును; ధాన్య= ధాన్యమును; అన్న=అన్నమును; అక్షయ గుణంబున్=నశింపనంత అధికము; కాఁగన్= అగునట్లుగా; భిక్ష పెట్టున్=భిక్ష నొసగునో; వానికి=అతనికి; ఈ దక్షవాటి=ఈ దక్షారామము నందు; కైవల్య పదవి=మోక్షమను పదవి; అలవడు=లభించును; నిజము=ఇది సత్యము.

భావము :- బ్రహ్మతత్త్వజ్ఞులైన పండితులకు శివయోగులకు ఉపయోగకరమగునట్లుగా ధనమును ధాన్యమును అన్న వస్త్రములను తరుగని దానగుణముతో భిక్షపెట్టు వానికి ఈ దక్షారామ తీర్థము నందు నిక్కముగ మోక్షపదవి లభించును.

తే॥ చప్పరంబొండె గుడి యొండెఁ జవిక యొండె
గలు మఠం బొండె నిల్లొండెఁ గట్టి పెట్టి
బ్రహ్మయోగీశ్వరుని నుంచు భక్తి నెవ్వఁ
డతఁడు మాన్యుండు పూజ్యుండు నతులితముగ. 56

అర్థము :- ఎవ్వఁడు=ఎవడు; భక్తిన్=భక్తితో; చప్పరంబు+ఒండె=(చౌకము తీర్చివేసిన) గుడారము గాని; గుడి+ఒండెన్=గుడిని గాని; చవిక+ఒండెన్=మండపమును గాని; కలుమఠంబు+ఒండెన్=రాతి (తో కట్టబడిన) మఠమును గాని; ఇల్లు+ఒండెన్= గృహమును గాని; కట్టి పెట్టి=నిర్మించి; బ్రహ్మ యోగీశ్వరునిన్=బ్రహ్మ యోగమను ఐశ్వర్యము కలవానిని; ఉంచున్=నివాసముంచునో; అతఁడు=వాడు; అతులితముగ=అసమానముగ; మాన్యుండు= గౌరవింపదగినవాడు; పూజ్యుండున్=పూజింపతగినవాడును (అగును).

భావము :- భక్తితో ఒక గుడారము గాని ఒక గుడినిగాని ఒక మండపమును గాని ఒక రాతి మఠమును గాని ఒక ఇంటిని గాని కట్టించి దాని నొక బ్రహ్మజ్ఞాన సంపన్నునకు నివాసముగ చేసిన వాడు అసమానుడైన మహనీయుడు పూజనీయుడు అగును.

వ॥ తొల్లి జలంధర గంధగజ పుండరీకాంధకాసురాదులగు మహా దైత్యులు భువన త్రయం బాక్రమించిన శక్రుండు భయ భ్రాంతుండై దేవగణ దేవముని సిద్ధ సాధ్య విద్యాధరోరగ గరుడ గంధర్వ కిన్నర కింపురుషాదులం గూర్చుకొని బ్రహ్మకు విన్నవించిన విరించియు వారిం దోడ్కొని పాల మున్నీటిలో ఫణిరాజ తల్పంబుపైఁ బవ్వళించిన పాంచజన్యధరునకు విన్నపంబు చేసి సంస్తుతించినఁ గైటభారి హాటక గర్భుని విన్నపంబవధరించి చింతాభరంబున నొక్కింత దడ వూరకుండి పుండరీకాసనుం జూచి యిట్లనియె. 57

అర్థము :- తొల్లి=పూర్వము; జలంధర=జలంధరుడు; గంధ గజ=మత్తగజాసురుడు; పుండరీక=వ్యాఘ్రాసురుడు; అంధకాసుర=అంధకాసురుడు; ఆదిగాన్+కల=మొదలుగా గల; మహాదైత్యులు=పెనురక్కసులు; భువనత్రయంబు=ముల్లోకములను; ఆక్రమించినన్=(బలిమిచే) వశపరచుకొనగా; శక్రుండు=ఇంద్రుడు; భయ భ్రాంతుండై=భయముచే కలతపడిన వాడై; దేవగణ=దేవతా గణములు; దేవముని=దేవమునులు; సిద్ధ=సిద్ధులు; సాధ్య=సాధ్యులు; విద్యాధర=విద్యాధరులు; ఉరగ=నాగులు; గరుడ=గరుడులు; గంధర్వ=గంధర్వులు; కిన్నర=కిన్నరులు; కింపురుష=కింపురుషులు; ఆదులన్=మొదలగు వారిని; కూర్చుకొని=పోగుచేసుకొని; బ్రహ్మకు=బ్రహ్మదేవునకు; విన్నవించినన్=విన్నపము చేసికొనగా; విరించియు=ఆ బ్రహ్మయు; వారిన్=వారందరిని; తోడ్కొని=వెంటబెట్టుకొని; పాలమున్నీటిలో=పాల సముద్ర ములో; ఫణిరాజ తల్పంబుపైన్=శేషశయ్యపైన; పవ్వళించిన=పండుకొనిన; పాంజన్యధరునకు=పాంచజన్యమను శంఖమును ధరించిన విష్ణుమూర్తికి; విన్నపంబు చేసి=విన్నవించి; సంస్తుతించినన్=కీర్తింపగా; కైటభ+అరి=కైటభుడను రక్కసునకు శత్రువైన విష్ణువు; హాటక గర్భుని=బ్రహ్మదేవుని; విన్నపంబు=విజ్ఞప్తిని; అవధరించి=విని; చింతాభరంబునన్=విచారపు బరువుతో; ఒక్కింత+తడవు=కొంతసేపు; ఊరక+ఉండి=పలుకక యుండి; పుండరీక+ఆసనున్=పద్మమే ఆసనముగా గల బ్రహ్మను; చూచి=చూచి, ఇట్లు+అనియె=ఈ విధముగ పలికెను.

భావము :- పూర్వము జలంధరుడు గజాసురుడు పుండరీకుడు అంధకుడు మొదలగు పెను రక్కసులు బలిమితో ముల్లోకములను ఆక్రమించినపుడు దేవేంద్రుడు భీతిల్లి దేవతలను,

దేవమునులను, సిద్ధులను, సాధ్యులను, విద్యాధరులను, నాగులను, గరుడులను, గంధర్వులను, కిన్నరులను, కింపురుషులను ఇంకను తదితరులను వెంట బెట్టుకొని వెళ్ళి బ్రహ్మదేవునకు మొఱపెట్టుకొనెను. ఆ బ్రహ్మదేవుడు వారందరను తోడుకొని వెళ్ళి పాలసముద్రమున శేషశయనుడై పాంచజన్య శంఖధారియై యున్న విష్ణుమూర్తికి విజ్ఞప్తిచేసి కీర్తించెను. విష్ణుమూర్తి బ్రహ్మ చేసిన విన్నపమును ఆలకించి ఆలోచనా మగ్నుడై కొంతసేపు ఊరకుండి పిదప బ్రహ్మదేవునితో ఈ విధముగ పల్కెను.

తే॥ వీరభద్రుండు చక్రంబు విఱిచి దక్ష
యాగమున నాఁడు భక్షించె నాగ్రహమునఁ
జెఱకు శర్కర పాకంబు చేసినట్టి
చక్కిలముఁ బోలె ఛట ఛటా శబ్దమొప్ప. 58

అర్థము :- నాఁడు=ఆనాడు; దక్షయాగమున=దక్షయజ్ఞము నందు; వీరభద్రుండు= వీరభద్రుడు; ఆగ్రహమునన్=కోపముతో; చక్రంబు=సుదర్శన చక్రమును; చెఱకు=చెఱకుదగు; శర్కర=పంచదార యొక్క; పాకంబు=పాకముతో; చేసిన+అట్టి=వండినట్టి; చక్కిలమున్+పోలె=జంతికను వలె; ఛట ఛటా=ఛటఛటమను; శబ్దము+ఒప్ప=ధ్వని వచ్చు నట్లుగా; విఱిచి=విరగగొట్టి; భక్షించెన్=తినెను.

భావము :- ఆనాడు దక్షయజ్ఞ సమయమున వీరభద్రుడు కోపముతో నా సుదర్శన చక్రమును విరుగగొట్టి పంచదార పాకముతో వండిన జంతికను వలె ఛటఛటమను శబ్దము వచ్చునట్లుగా విరచి నమిలి మ్రింగెను.

విశేషము :- అలంకారము - ఉపమ.

ఉ॥ కోపము చిచ్చునం బడిన కూరిమి తల్లి ఋణంబు దీఱ ను
ద్దీపతరాగ్రహంబునను దేవతలం గడు భంగ పెట్టఁగా
నేపున నేను మార్కొని పయిం బఱతెంచిన యంతమాత్రలో
జా పరమేశ్వరా యనుచుఁ జక్రము మ్రింగిన నోహటించితిన్. 59

అర్థము :- కోపము=కోపమనెడి; చిచ్చునన్+పడిన=అగ్నిలోపడిన; కూరిమి తల్లి=ప్రేమగల తల్లి (సతీదేవి) యొక్క; ఋణంబున్=ఋణము; తీఱన్=తీరునట్లుగా; ఉద్దీపతర+ఆగ్రహంబునను=బాగుగా చెలరేగిన కోపముతో; దేవతలన్=దేవతలను; కడు=మిక్కిలి; భంగపెట్టఁగాన్=పరాభవింపగా; నేను=నేను; ఏపునన్=విజృంభణముతో; మార్కొని=ఢీకొని; పయిన్=పైకి; పఱతెంచిన=రాగా; అంతమాత్రలో=అంతలోననే

(వీరభద్రుడు) జా పరమేశ్వరా=జై పరమేశ్వరా!; అనుచున్=అనుచు; చక్రము=నా సుదర్శన చక్రమును; మ్రింగినన్=మ్రింగివేయగా; ఓహటించితిన్=భయపడితిని.

భావము :- కోపమనెడి అగ్నిలో పడిన తల్లి సతీదేవి ఋణము దీర్చుకొనుటకన్నట్లుగ వీరభద్రుడు కోపముతో చెలరేగి దేవతలను అవమానించెను. అపుడు నేను విజృంభించి అతనిని ఢీకొని పైకి వచ్చు నంతలోననే ఆ వీరభద్రుండు జై పరమేశ్వరా అని కేక వేయుచు నా సుదర్శన చక్రమును విరిచి మ్రింగెను. అపుడు నేను భయపడితిని.

తే॥ తెగువ దక్షుని కంఠంబుఁ ద్రెవ్వనేసి
వ్రేల్చెఁ దల నధ్వరాగ్నిని వీరభద్రుఁ
డా ప్రజాపతి మెడమీఁద నాక్షణంబ
నగుచుఁబొట్టేలి తలఁ దెచ్చి నాఁటుకొలిపె. 60

అర్థము :- వీరభద్రుఁడు=వీరభద్రుడు; తెగువ=సాహసముతో; దక్షుని+కంఠంబున్=దక్షప్రజాపతి కుత్తుకను; త్రెవ్వన్+ఏసి=త్రెంచివేసి; తలన్=తలను; అధ్వర+అగ్నిని=యాగాగ్ని యందు; వ్రేల్చెన్=హోమము చేసెను; ఆ క్షణంబు+అ=ఆ క్షణముననే; నగుచున్=నవ్వుచు; పొట్టేలితలన్=పొటేలుయొక్క తలను; తెచ్చి=కొనివచ్చి; ఆ ప్రజాపతి=ఆ దక్షుని; మెడమీఁదన్=మెడపైన; నాఁటుకొలిపెన్=నిలిపెను.

భావము :- వీరభద్రుడు. సాహసముతో దక్షుని కుత్తుకను త్రెంచి తలను యాగాగ్నిలో హోమము (దహనము) చేసెను. ఆ క్షణమే నవ్వుచు ఒక పొట్టేలి తలను తెచ్చి ఆ దక్షుని మెడపై నిలిపెను.

వ॥ అప్పుడవ్వీరభద్రుని తేజో విశేషంబును గనుఁగొనఁ గన్నులు మిఱుమిట్లు గొన వెఱచఱచి యెలుంగు డించి తొలంగితి నాఁటి నుండియు. 61

అర్థము :- అప్పుడు=ఆ సమయమున; ఆ+వీరభద్రుని=ఆ వీరభద్రుని యొక్క; తేజస్+విశేషంబునున్=తేజస్సు యొక్క ఆధిక్యమును; కనున్+కొనన్=చూచుటకు; కన్నులు=కనులు; మిఱుమిట్లు గొన=అధిక కాంతిని చూడలేక చెదరగా; వెఱచఱచి=భయపడి; ఎలుంగు=కంఠస్వరము; డించి=తగ్గించి; తొలంగితి=తొలగిపోతిని. నాఁటి నుండియు= ఆనాటి నుండియు.

భావము :- ఆ సమయమున ఆ వీరభద్రుని తేజో విశేషమును కన్నులు చూచుటకు మిఱుమిట్లు గొలుపుచుండగా చూపు చెదరి భయపడి గొంతు తగ్గించి అచటి నుండి తొలగిపోతిని. ఆనాటి నుండియు.

శా॥ పట్టంగైదువు లేక విన్ననవు నా బాహార్గళుల్ చూడుఁడా
యిట్టుంగాక సురేంద్ర! బాధపడి మీరిబ్భంగి దుఃఖింపఁగాఁ
గట్టా పో యిటు మిన్నకుండుదునె శీఘ్రం బిప్డు భీమేశ్వరున్
ముట్టం గొల్చెదఁ జక్ర లాభమునకై ముగ్ధేందు చూడామణిన్. 62

అర్థము :- సురేంద్ర=ఓ దేవేంద్రా! పట్టన్=ధరించుటకు; కైదువు+లేక=ఆయుధము లేక; విన్నన+అవు=వెలవెలబోయిన; నా=నా యొక్క; బాహా+అర్గళుల్=తలుపు గడియల వంటి బాహువులు; చూడుఁడా=చూడుడు; ఇట్టున్+కాక=ఇట్లు కాకున్నచో; మీరు=మీరందరు; ఈ+భంగి=ఈ విధముగా; బాధపడి=బాధను అనుభవించి; దుఃఖింపఁగాన్=శోకించుచుండగా; కట్టా! పో=అయ్యో పోనిమ్ము అని; ఇటు=ఇక్కడ; మిన్నక+ఉండుదునె=ఊరకుందునా?; శీఘ్రంబు+అ=త్వరితముగా; ఇప్డు=ఇపుడే; చక్ర+లాభమునకై=చక్రము ప్రాప్తించుటకునై; ముగ్ధ=సుందరమైన; ఇందు=చంద్రుడు; చూడామణిన్=శిరసునందు అలంకారముగ గల; భీమేశ్వరున్=శ్రీ భీమేశ్వర స్వామిని; ముట్టన్=(మనసులో) గట్టిగా హత్తుకొను నట్లు; కొల్చెదన్=సేవింతును.

భావము :- ఓ దేవేంద్రా! ఆనాటి నుండి ధరించుటకు ఆయుధము లేక తలుపు గడియల వంటి నా చేతులు వెలవెలబోవు చున్నవి. చూడుడు. అట్లు కానిచో మీరందరి విధముగ కలత చెంది శోకించుచుండగా అయ్యో పోనిమ్మని ఊరకుందునా! నా చక్రాయుధమును తిరిగి పొందుటకై ఈ క్షణమే వెళ్ళి చంద్రశేఖరుడైన ఆ భీమేశ్వర స్వామిని ప్రసన్నమగు వరకు సేవింతును.

వ॥ అని పలికి నలినసంభవేంద్రాదులగు నిర్జరులతోడం గూడి సరోరుహాక్షుండు దక్షారామంబునకు వచ్చి శివగంగా కూపంబునఁ ద్రిషవణస్నానంబు సేసి భస్మోద్ధూళిత గాత్రుండును; త్రిపుండ్రాంకిత మస్తకుండును; రుద్రాక్షమాలికాధరుండును జటా వల్కల సంయుతుండునునై నిత్యంబును సహస్ర పద్మంబులఁ బూజఁ గావించుచు భీమనాథేశ్వరు సేవించుచుండె; నంతఁగొంత కాలంబునకు. 63

అర్థము :- అని పలికి=ఈ విధముగా పలికి; సరోరుహ+అక్షుండు=పద్మముల వంటి కన్నులు గల విష్ణువు; నలిన సంభవ=పద్మము నందు పుట్టిన బ్రహ్మదేవుడు; ఇంద్ర=ఇంద్రుడు; ఆదులు+అగు=మొదలయిన, నిర్జరుల తోడన్=దేవతలతో; కూడి=కలసి, దక్షారామంబునకు=దక్షారామమునకు; వచ్చి=చేరి; శివగంగా కూపంబునన్=శివగంగ అను పేరుగల బావిలో; త్రిషవణ స్నానంబు=మూడు పూటల స్నానమును, చేసి=చేసి; భస్మ+ఉద్ధూళిత=విబూది పూయబడిన; గాత్రుండునున్=శరీరము కలవాడును; త్రిపుండ్ర+అంకిత=

విబూదితో అడ్డముగ పెట్టబడిన మూడు రేఖలతో చిహ్నితమైన, మస్తకుండును=శిరస్సు కలవాడును; రుద్రాక్షమాలికా=రుద్రాక్షమాలలను; ధరుండును=ధరించిన వాడును; జటా=జడలతో; వల్కల=నారబట్టలతో; సంయుతుండునున్=కూడినవాడును; ఐ=అయి; నిత్యంబును=అనుదినము; సహస్ర పద్మంబులన్=వేయి కమలములతో; పూజన్=అర్చనను; కావించుచు=చేయుచు; భీమనాథేశ్వర+ఈశ్వరున్=శ్రీ భీమేశ్వర స్వామి అను పేరుగల శంకరుని; సేవించుచు+ఉండెన్=కొలుచుచుండెను; అంతన్=(అట్లు కొలుచుచుండగా) అంతట; కొంతకాలంబునకు=కొంతకాలమునకు;

భావము :- ఈ విధముగా పలికి విష్ణుమూర్తి బ్రహ్మ మహేంద్రుడు మొదలగు దేవతలతో కూడి దక్షారామమునకు వచ్చెను. శివగంగా కూపములో మూడు వేళల స్నానము చేయుచు శరీరమునకు విబూది పూసికొని, విబూదితో నుదుట త్రిపుండ్రములను తీర్చిదిద్దుకొని రుద్రాక్ష మాలలను ధరించి జడలను నారచీరలను ధరించి నిత్యము వేయి కమలములతో శ్రీ భీమేశ్వర స్వామిని అర్చించుచుండెను. అట్లుండగా కొంతకాలమునకు.

క॥ ఈ భంగి వేయు దమ్ముల
నా భుజగాభరణు నెప్పు డర్చన సేయన్
శ్రీ భీమేశుండు కమల
నాభుని మనమరయనొక్క నలినము దాచెన్. 64

అర్థము :- ఈ భంగిన్=ఈ విధముగా; వేయున్=వేయి; తమ్ములన్=పద్మములతో; ఆ భుజగ+అభరణున్=పాములను ఆభరణములుగా చేసికొన్న ఆ శంకరుని; ఎప్పుడున్=ఎల్లప్పుడును; అర్చన+చేయన్=పూజ చేయగా; కమలనాభుని=(పద్మమును బొడ్డు నందు గల) విష్ణుమూర్తి యొక్క; మనము=మనసును; అరయన్=తెలిసికొనుటకు; శ్రీ భీమేశుండు=శ్రీ భీమేశ్వర స్వామి; ఒక్కనలినమున్=ఒక పద్మమును; దాచెన్=దాచిపెట్టెను.

భావము :- నిత్యము ఈ విధముగా వేయి కమలములతో పూజించుచున్న విష్ణుమూర్తి మనసు తెలిసికొనుటకై శ్రీ భీమేశ్వర స్వామి ఒకనాడు ఒక కమలమును దాచెను.

తే॥ తొంబనూఱును దొంబది తొమ్మిదియును
జలజములు పూజ చేసెను శార్ఙ్గపాణి
వేయిటికి నొక్క పద్మంబు వెలితి యైన
నహహ నియమంబునకు భంగమయ్యె ననుచు. 65

అర్థము :- శార్ఙ్గపాణి=శార్ఙ్గమను విల్లును చేతియందు గల విష్ణుమూర్తి; తొంబ నూఱునున్=తొమ్మిది వందలును; తొంబది తొమ్మిదియును=తొంబది తొమ్మిదియు అగు; జలజములు=పద్మములతో; పూజచేసెను=పూజించెను; వేయిటికిన్=వేయికి; ఒక్క పద్మంబు=ఒక కమలము; వెలితి+ఐనన్=తక్కువ కాగా; అహహ=ఆహా! నియమంబునకు= నియమమునకు; భంగము+అయ్యెన్=భంగమాయెను గదా! అనుచు=అని పలుకుచు. (తర్వాతి పద్యముతో అన్వయము)

భావము :- విష్ణుమూర్తి శ్రీ భీమేశ్వర స్వామిని తొమ్మిది వందల తొంబది తొమ్మిది కమలములతో అర్చన చేసెను. వేయికి ఒక కమలము తగ్గినది. ఆహా! నియమమునకు భంగము కల్గినది కదా అని భావించి.

చ॥ కటక కలాప సంఘటిత కమ్రమణిద్యుతి పాటవంబునం
జిటికెన వ్రేలి గోరఁగొని చిఱ్ఱునఁ దీసెను లోచనంబు ప్ర
స్ఫుట కమలంబు వేగ హరి పూన్చెఁ దటుక్కున దక్ష వాటికా
కటక విలాసినీ విట శిఖామణికిన్ హరిణాంక మౌళికిన్. 66

అర్థము :- హరి=విష్ణువు; కటక=కంకణముల; కలాప=సమూహము నందు; సంఘటిత=కూర్పబడిన; కమ్ర=మనోహరమైన; మణిద్యుతి=మణుల యొక్క కాంతుల; పాటవంబునన్=తీక్ష్ణత గల; చిటికెన వ్రేలి=చిటికెన వ్రేలు యొక్క; గోరన్=గోటితో; కొని= తీసికొని; ప్రస్ఫుట కమలంబున్=బాగుగ వికసించినట్టి కమలమును వలె; లోచనంబున్=(తన) కన్నును; చిఱ్ఱునన్=చటుక్కున; తీసెను=బయటకు తీసెను; వేగ=వేగముగ; తటుక్కున= అకస్మికముగా (వెంటనే); దక్ష....మణికిన్. దక్ష వాటికా=దక్షారామమే; కటక=నివాసమైన; విలాసినీ=విలాసవతులకు; విట=విటులలో; శిఖామణికిన్=శిరోమణియగు; హరిణాంక+ మౌళికిన్=చంద్రమౌళికి; పూన్చెన్=సమర్పించెను.

భావము :- విష్ణుమూర్తి చేతి కంకణము లంచలి మణుల కాంతులు ప్రసరించి తీక్ష్ణమైన చిటికెన వ్రేలి గోటితో గ్రహించి తన కంటిని బాగుగా వికసించిన కమలమును వలె చటుక్కున పెఱికి తీసెను. ఆ కంటిని వెంటనే వేగముగా దక్షారామ విలాసినులగు సానులకు విట శ్రేష్ఠుడైన శ్రీ భీమేశ్వర స్వామికి సమర్పించెను.

విశేషము :- విష్ణువు భక్తితో తన నేత్రమును సమర్పించునపుడు కూడ భీమేశ్వరుని "దక్షవాటికా కటక విలాసినీ విటశిఖామణి" అని అనుట శ్రీనాథునకు దక్షారామ విలాసవతులపై గల మక్కువను సూచించుచున్నది. సంస్కృత భీమ ఖండమున (31-31) దక్షారామ విలాసవతుల ప్రసక్తి లేదు.

ఇక్కడ చిటికెన వ్రేలితో ఒక సంఘటన ఏర్పడుచున్నది. అందువలన చిటికెన వ్రేలునకు "కటక కలాప సంఘటిత క్రమమణిద్యుతి పాటవంబునన్" అని దీర్ఘ వర్ణనము చేసి ప్రాముఖ్యమిచ్చినాడు.

ఇది నన్నయభట్టు చూపిన మార్గము. నూతిలోబడిన దేవయానిని యయాతి చేతితో బైటకు లాగునపుడు, యయాతి హస్తమునకు ప్రాముఖ్యమిచ్చి నన్నయభట్టు చేసిన వర్ణనమిది. (ఆది-3-144)

"జలధివిలోల వీచి విలసత్కల కాంచి సమంచితావనీ
తల వహనక్షమంబయిన దక్షిణ హస్తమునం దదున్నమ
ద్గళ దురు ఘర్మ వారికణ క్రమకరాబ్జము వట్టి నూతిలో
వెలువడఁ గోమలిం దిగిచె విశ్రుత కీర్తి యయాతి ప్రీతితోన్."

తరువాత బమ్మెర పోతన కూడ యయాతి కథ వ్రాయుచు ఈ మార్గమునే అనుసరించి "సప్తాంభోనిధి మేఖలావృత మహీసర్వంసహా...." (భాగ. 9-527) అని హస్తమునకు ప్రాముఖ్యమిచ్చి వర్ణించినాడు.

క॥ కైటభ విరోధి భక్తి ర
సాటోపం బెసఁగ వనరుహావళి నియతిం
బాటించి భీమనాథుని
హాటక పదపీఠి లోచనాబ్జముఁ బెట్టన్. 67

అర్థము :- కైటభ విరోధి=కైటభుడను రాక్షసునకు శత్రువైన విష్ణుమూర్తి; భక్తిరస= భక్తిరసము యొక్క; ఆటోపంబు=సంరంభము; ఎసఁగన్=అతిశయింపగా; వనరుహ= పద్మముల; ఆవళి=సమూహము నందలి; నియతిన్=నియమమును; పాటించి=ఆదరించి; లోచన+అబ్జమున్=తన కన్ను అనెడి పద్మమును; భీమనాథుని=శ్రీ భీమేశ్వర స్వామి యొక్క; హాటక=బంగారుదగు; పదపీఠిన్=పాద పీఠము నందు; పెట్టన్=పెట్టెను.

భావము :- విష్ణుమూర్తి భక్తిరసావేశము అతిశయింపగా వేయి పద్మములతో స్వామిని పూజించు నియమమును పాటించి తామర పూవు వంటి తన కంటిని పెఱికి శ్రీ భీమేశ్వర స్వామి యొక్క బంగరు పాద పీఠము నందు (పాదములపై) పెట్టెను.

మ॥ నిడువాలుం గుడి కన్ను పాదములపై నేమంబుతోఁ బెట్టన
ప్పుడు ప్రత్యక్షముఁ బొంది నీలగళుఁ డంభోజాక్షునిం జూచి "నేఁ
గడు హర్షించితి నిచ్చెద న్వరము వే కైకొమ్ము" నా నమ్రుఁడై
యడిగెన్ శౌరి జగత్త్రయోద్ధరణ లీలా వక్రమున్ జక్రమున్. 68

అర్థము :- నిడు=దీర్ఘమైన; వాలున్=సొగసైన; కుడికన్ను=కుడికంటిని; నేమంబుతోన్=నిష్ఠతో; పాదములపై=చరణములపై; పెట్టన్=పెట్టగా; అప్పుడు=ఆ సమయమున; నీలగళుఁడు=నీలకంఠుడు; ప్రత్యక్షమున్=చక్షురాది ఇంద్రియ గోచరమైన రూపమును; పొందీ=పొంది; అంభోజ+అక్షునిన్=కమల నేత్రుడైన విష్ణుమూర్తిని; చూచి=కాంచి; నేన్=నేను; కడు=మిక్కిలిగా; హర్షించితిన్=సంతసించితిని; వేన్=వేగముగా; వరమున్=వరమును; ఇచ్చెదన్=ఒసంగెదను; కైకొమ్ము=స్వీకరింపుము; నాన్=అనగా; శౌరి=విష్ణుమూర్తి; నమ్రుఁడై=వినీతుడై; జగ...వక్రమున్. జగత్రయ=ముల్లోకములను; ఉద్ధరణ=ఉద్ధరించుట యను; లీలా=క్రీడయందు; అవక్రమున్=కుటిలము కాని; చక్రమున్=చక్రాయుధమును; అడిగెన్=కోరెను.

భావము :- విశాలమై సుందరమైన కుడికంటిని స్వామి చరణముల వద్ద అర్పింపగా నీలకంఠుడైన ఆ భీమేశ్వర స్వామి ప్రత్యక్షమై పద్మ లోచనుడైన విష్ణుమూర్తిని చూచి "నేను మిక్కిలి సంతసించితిని. వరమిచ్చెదను. స్వీకరింపుము" అని పలుకగా విష్ణుమూర్తి వినమ్రుడై ముల్లోకముల నుద్ధరించు తన సుదర్శనమను చక్రాయుధమును కోరెను.

తే॥ భీమనాథుఁడు త్రిభువన స్వామి యిచ్చె
నస్త్రకుల దైవమన నొప్పు నాయుధంబు
హరికి నట మున్నయిచ్చెఁ జంద్రార్ధమౌళి
వికచ పద్మోపమంబైన వెడఁద కన్ను. 69

అర్థము :- త్రిభువన స్వామి=మూడు లోకములకును స్వామి యైన; భీమనాథుఁడు=శ్రీ భీమేశ్వర స్వామి; హరికిన్=విష్ణుమూర్తికి; అస్త్రకుల=అస్త్రముల సమూహము నందు; దైవము+అనన్=దైవము వలె; (అస్త్ర=మంత్రప్రయోగముచే శక్తిని పొంది దుష్ట సంహారము చేయు ఆయుధములలో; కులదైవము+అనన్=ఇలువేలుపు వలె:) ఒప్పున్=అలరారునట్టి; ఆయుధంబు=చక్రాయుధమును: ఇచ్చెన్=ప్రసాదించెను; అటమున్న=అంతకు ముందే; చంద్ర+అర్ధ+మౌళి=అర్ధ శశాంక మౌళియైన శ్రీ భీమేశ్వర స్వామి; (హరికి) వికచపద్మ=వికసించిన పద్మముతో; ఉపమంబు+ఐన=తుల్యమైన; వెడఁద కన్ను=విశాలమైన లోచనమును; ఇచ్చెన్=ఇచ్చెను.

భావము :- త్రిభువన స్వామి యైన శ్రీ భీమేశ్వరుడు అస్త్రముల సమూహమున దేవతవలె, అస్త్రములందు ఇలువేలుపువలె ప్రకాశించెడు సుదర్శనమను చక్రాయుధమును శ్రీహరికి ప్రసాదించెను. అంతకు పూర్వమే చంద్రశేఖరుడైన ఆ స్వామి వికసించిన పద్మముతో తులతూగు విశాల నేత్రమును (శ్రీహరికి)ప్రసాదించెను.

వ॥ ఇవ్విధంబున శ్రీ భీమనాథ మహాదేవుని వలనం జగద్విజయంబగు చక్రాయుధంబు వడసి కోటి సహస్ర మార్తాండ మండల తేజః ప్రభా ప్రభావ భాస మానంబైన యా రథాంగంబున మున్ను చెప్పంబడ్డ విబుధ విరోధుల ఖండించి; యింద్రాది ప్రముఖ నిఖిల బర్హిర్ముఖ వ్రాతంబునకుఁజేతః ప్రమోదం బాపాదించె; నిది యమ్మహాదేవుని మహిమంబు. 70

అర్థము :- ఈ+విధంబునన్=ఈ ప్రకారముగా; శ్రీ భీమనాథ మహాదేవు వలనన్=మహా దేవుడైన శ్రీ భీమేశ్వర స్వామి వలన; జగత్+విజయంబు+అగు=జగమును జయింప గలదగు; చక్ర+ఆయుధంబు=చక్రాయుధమును; పడసి=పొంది; కోటి సహస్ర=అసంఖ్యాకములైన; మార్తాండమండల=సూర్యమండలముల; తేజః=తేజస్సు యొక్క; ప్రభా=కాంతి యొక్క; ప్రభావ=శక్తితో; భాసమానంబు+ఐన=వెలుగొందుచున్న; ఆ+రథాంగంబునన్=ఆ సుదర్శన చక్రముతో; మున్ను=పూర్వము; చెప్పన్+పడ్డ=చెప్పబడిన; విబుధ+విరోధులన్=దేవతలకు శత్రువులైన రాక్షసులను; ఖండించి=సంహరించి; ఇంద్ర+ఆది=ఇంద్రుడు మొదలైన; నిఖిల=సమస్తమైన; బర్హిర్ముఖ=దేవతల యొక్క; వ్రాతంబునకున్=సమూహమునకు; చేతః=చిత్తమునందు; ప్రమోదంబు=ఆనందమును; ఆపాదించెన్=కలుగజేసెను. ఇది=ఇట్టిది; ఆ+మహాదేవుని=ఆ భీమేశ్వర స్వామి యొక్క; మహిమంబు=మహిమము.

భావము :- ఈ ప్రకారముగ విష్ణుమూర్తి శ్రీ భీమేశ్వర స్వామి వలన సుదర్శన చక్రమును పొందెను. కోటి వేల సూర్య మండలముల తేజస్ శక్తితో ప్రకాశించు ఆ సుదర్శన చక్రముతో పూర్వము చెప్పబడిన జలంధరాది క్రూర రాక్షసులను ఖండించి ఇంద్రాది దేవతా సమూహమునకు ఆనందమును కల్గించెను. ఇది ఆ భీమేశ్వర స్వామి మహత్త్వము.

క॥ శివగంగా జలముల నా
ప్లవనం బొనరించినట్టి పరమాత్ములు త
ద్దివసమున భీమనాథుని
నవలోకింపంగఁ గలుగు నభిమత సిద్ధుల్. 71

అర్థము :- (ఏ దినమున) శివగంగా జలములన్=శివగంగా కూపము నందలి నీటిలో; ఆప్లవనంబున్=స్నానమును; ఒనరించిన+అట్టి=చేసినటువంటి; పరమ+ఆత్ములు= ఉత్కృష్టమగు మనసు కలవారు; తత్+దివసమున=ఆ దినముననే; భీమనాథునిన్=శ్రీ భీమేశ్వర స్వామిని; అవలోకింపంగన్=దర్శించినచో; అభిమత సిద్ధుల్=అభీష్ట సిద్ధులు; కలుగున్=కలుగును.

భావము :- దక్షారామము నందలి శివగంగా కూపము లోని నీటిలో స్నానము చేసిన దినముననే శ్రీ భీమేశ్వర స్వామిని దర్శించిన పరమాత్ములకు అభీష్ట సిద్ధులు కలుగును.

తే॥ మదన విధ్వంసి తిరుచుట్టుమాలె యందు
దక్షిణపు దిక్కు నందు మాధవునిఁ గాంచి
రహిని వేడుక విఘ్నాధిరాజుఁ జూచి
మనుజుఁ డిష్టార్థ సిద్ధి సంపదల నొందు. 72

అర్థము :- మనుజుఁడు=నరుడు; మదన విధ్వంసి=మన్మథుని రూపుమాపిన శ్రీ భీమేశ్వరుని యొక్క; తిరుచుట్టుమాలెయందు=ఆలయపు లోపలి ప్రాకార సదనమున; దక్షిణపు దిక్కునందు=దక్షిణ దిశలో; మాధవునిన్=విష్ణువును; కాంచి=చూచి; రహిని=ప్రేమతో; వేడుక=సంతసముతో, విఘ్నాధి రాజున్=విఘ్నేశుని; కాంచి=చూచి; ఇష్ట+అర్థసిద్ధి సంపదలన్=ఇష్టమైన కోరికలు ఫలించుట అను సంపదలను; ఒందు=పొందును.

భావము :- మానవుడు శ్రీ భీమేశ్వర స్వామి వారి ఆలయపు లోపలి ప్రాకార సదనమున దక్షిణ దిక్కున నున్న మాధవ స్వామిని విఘ్నేశ్వరుని దర్శించి ఇష్టార్థ సిద్ధి సంపదలు పొందును.

తే॥ అష్టమీ భాను వాసరంబందు నొండె
నొండెనేని చతుర్దశి నిండు భక్తిఁ
బూజఁగావించి యెవ్వఁడే భూమినున్న
దుర్గ సేవింప దురితంబు దొలఁగు నండ్రు. 73

అర్థము :- ఎవ్వఁడేన్=ఎవడైనను; అష్టమీ=అష్టమి అను తిథి తోడి; భాను+వాసరంబందున్+ఒండెన్=ఆదివారమున గాని; చతుర్దశిన్+ఒండెనేని=చతుర్దశీ తిథినాడు గాని; నిండు భక్తిన్=పరిపూర్ణమైన భక్తితో; భూమిన్+ఉన్న=ఈ క్షేత్రము నందు గల; దుర్గ=దుర్గాదేవిని; పూజన్+కావించి=పూజచేసి; సేవింపన్=అర్చించినచో; దురితంబున్=పాపము నుండి; తొలఁగున్=తొలగునని; అండ్రు=అందురు.

భావము :- ఏ జీవియైనను అష్టమీ తిథితో కూడిన ఆదివారమునాడు గాని; చతుర్దశినాడు గాని ఈ క్షేత్రము నందు గల దుర్గాదేవిని నిండు భక్తితో పూజించి సేవించినచో పాపము తొలగిపోవునని చెప్పుదురు.

**విశేషము** :- అష్టమీ తిథియందు దుర్గాదేవిని పూజించుట మిక్కిలి శుభకరము. నవరాత్ర్యుత్సవములలో అష్టమినాడు దేవత దుర్గాదేవియే గదా! పైగా నవరాత్రులలో దుర్గాష్టమి చాల ఉత్తమమైనదని సంప్రదాయము.

"అష్టమీ చంద్ర విభ్రాజ దళిక స్థల శోభితా" - అని లలితా సహస్రనామ స్తోత్రము.

కII తాండవ భవు వీక్షణమున
ఖండేందు శిఖావతంసు కట్టెదురుగఁ దా
నుండెడు గౌరిని మంచుం
గొండ సుతం బూజ సేయఁ గోర్కులు నిండున్. 74

అర్థము :- తాండవభవున్=తాండవ నృత్యము చేయు ఈశ్వరుని; వీక్షణమునన్=చూపునందును; ఖండ+ఇందు=అర్ధచంద్రుడు; శిఖా+అవతంసు=శిరోభూషణముగ గల శ్రీ భీమనాథుని; కదు+ఎదురుగన్=ఎట్టయెదుట; తాన్+ఉండెడు=తానై యుండు; గౌరిని=గౌరీ దేవిని; మంచుంగొండ సుతన్=హిమవత్పర్వతుని పుత్రియైన పార్వతిని; పూజ+చేయన్=పూజించినచో; కోర్కులు=కోరికలు; నిండున్=నెరవేరును.

భావము :- తాండవేశ్వర స్వామికి చూపులో నున్నదియు చంద్రశేఖరుడైన శ్రీ భీమేశ్వర స్వామికి ఎట్టయెదుట గల పార్వతీదేవిని సేవించినచో కోరిక లీడేరును.

సీII భూర్భువస్స్వర్లోకములు మూఁడు భేదించి
బ్రహ్మాండ ఖండ కర్పరము దాఁకఁ
బెరిగి దిక్చక్రంబు పిక్కటిల్లఁగఁ బట్టి
బలిసి తుప్పసముతోఁ బాము పోలె
నిరవకాశంబుగా నిత్య సన్నిహితంబు
నురులింగ మూర్తితో నుబ్బి యుబ్బి
భీమనాథుఁడు మహా భీమాద్భుత ప్రౌఢి
బహు విరాడ్రూప విభ్రాజి యయిన

తే భయమునుంబొంది దేవతల్ ప్రస్తుతించి
యయ్య! నీ రూప మింతింత యనఁగ రాదు
యేది మొదలేది కడపల యేది మధ్య
మెట్టు నినుఁ బూజ సేయుదు మిందుజమును. 75

అర్థము :- భీమనాథుండు=శ్రీ భీమేశ్వర స్వామి; మహా...ప్రౌఢి, మహా=గొప్పదైన; భీమ=భయంకరమైన; అద్భుత=ఆశ్చర్యకరమైన; ప్రౌఢిన్=రీతిలో; భూర్భువస్స్వర్లోకములు;

భూర్=భూలోకము; భువస్=భువర్లోకము; స్వర్+లోకములు=స్వర్గము అను లోకములు; మూఁడు=మూడింటిని; భేదించి=చీల్చి; బ్రహ్మాండ=భువన గోళమనెడు; భాండ=పాత్ర యొక్క; కర్పరము=కపాలము (పై పెంకు) తాఁకన్=స్పృశింప;

పెరిగి=పెరిగి; బలిసి=అతిశయించి; కుప్పుసముతోన్=కుబుసముతోడి; పాము+పోలెన్=పామువలె; దిక్+చక్రంబు=దిక్కుల యొక్క వలయమును; పిక్కటిల్లఁగన్=నిండుగా; పట్టి=వ్యాపించి;

నిర్+అవకాశంబుగా=వ్యవధానము లేకుండగా; నిత్య+సన్నిహితంబున్=శాశ్వతముగా స్థాపింపబడిన; ఉరు+లింగమూర్తితోన్=గొప్పదగు లింగాకారముతో; ఉబ్బి+ఉబ్బి=వృద్ధి నొంది వృద్ధి నొంది;

బహు=మిక్కుటమై; విరాట్+రూప=విస్తారమైన రూపముతో; విభ్రాజి+ఐనన్=ప్రకాశించువాడు కాగా;

దేవతల్=దేవతలు; భయమునున్=భీతిని; పొంది=పొంది; ప్రస్తుతించి=కీర్తించి; అయ్య!=స్వామీ!; నీ రూపము=నీ ఆకారము; ఇంత+ఇంత=ఇంత మాత్రమని; అనఁగ రాదు=అనుటకు వీలు కాదు; ఏది+మొదలు=ప్రారంభమేది!; ఏది+తుదపల=చివర ఏది!; ఏది+మధ్యము=మధ్య భాగమేది!; నినున్=నిన్ను; ఇంచుకయును=మేమించుకయు; ఎట్టు=ఏ రీతిగా; పూజ+చేయుదుము=పూజించెదము.

భావము :- శ్రీ భీమేశ్వర స్వామి మిక్కిలి భయంకరముగను ఆశ్చర్యకరముగను భూలోకము భువర్లోకము స్వర్గలోకములను మూడింటిని భేదించెను. విశ్వగోళము యొక్క సర్వోపరితలమును తాకునట్లు పెరిగెను. కుబుసముతో నున్న పాము వలె దిగ్వలయమున నిండునట్లు వ్యాపించెను. ఎడము లేకుండగ శాశ్వతముగ ప్రతిష్ఠింపబడిన గొప్ప లింగాకారముతో మిక్కిలి విశాలమైన రూపముతో ప్రకాశించుచుండెను. దేవతలు భయపడి ఆ విరాడ్రూపుని కొనియాడి ''స్వామీ! నీ రూపము ఇంత మాత్రమేనని కొలిచి చెప్పుట సాధ్యము కాదు. మొదలేది! తుదయేది! మధ్యమేది! మేమించుకయు నిన్ను ఏవిధముగ పూజింపగలము'' అని అర్థించిరి.

**వ॥ అనినం గరుణా సామ్రాజ్య పట్టాభిషిక్తుండగు నా జగజెట్టి వేల్పు బ్రహ్మాండ గోళంబునకు మిక్కుటంబుగాఁ బెరిఁగిన దేహంబుఁ బొట్టి చేసి తిరుచుట్టుమాలికలోన గౌరీ జనార్దన రుద్ర, కేశవ వినాయక దుర్గా తాండవేశ్వర నృత్య భైరవులను దేవతా సప్తకంబు పరివేష్టింప, సకల లోకానందకర పరదారగమన పాపహరేశ్వరులు నైఋతి భాగంబున నధివసింప నంతర్గర్భ గృహంబు లోపల మాణిక్యాదేవి సహితుండై**

సలిలనిధి వృద్ధగంగా కౌంతేయ సరి త్తుల్యభాగా హేలానదీ సప్త గోదావర మాతృకా పరివృత మండలంబున మధ్యమలోక భాగధేయంబును; విబుధ గంధర్వ పతాకావేదియుఁ బరిసరోద్యాన వాటికాసరస కాసార కఠోర కుహళీ పాళికా కుసుమ ధూళీ మధూళికా సౌరభాసార సంవాసిత దశదిశా ముఖంబును; మఖకుండి తటాక సముద్దండ పుండరీక షండ మకరంద బిందు గండూషావ్యగ్ర సముదగ్ర మధుప మండలాహంకార ఝుంకార కోలాహల కరంబిత మకరధ్వజ భుజాదండ మండలీకృత కుసుమ కోదండ శింజినీ ఠంకారంబును, నాఖండలాది దిక్పాల భరిత కలిత గోపుర ప్రాంగణంబును, బాదుకా ఖడ్గ ఘుటికారస రసాయన మూలికాంజనాకర్షణాదృశ్యాది విద్యాసిద్ధిక్షేత్రంబును, నత్ర్యాత్రేయాగస్త్య హరితాంబరీషాసిత భార్గవ పరాశర పారాశర్య మాండవ్య మార్కండేయ మౌద్గల్య మంకణ శౌనక శాండిల్య మందపాల వత్స వశిష్ఠ వాధూలస వాలఖిల్య కౌండిన్య కాశ్యప కణ్వ [illegible] గాధి గార్గ్య ప్రముఖ వాలఖిల్యాద్యష్టాశీతి సహస్ర సంయమి సమాకీర్ణంబును, గర్ణికారాంబికా కరకమల పుట ఘటిత కనత్కనక మణిమయ డమరుక ఢమఢమ ధ్వాన పర్జన్యగర్జా సముజ్జృంభిత గుహశిఖండి తాండవంబును మార్కండేశ్వర కుండలాముఖ సంవేద్యాంతర్వేది చాళుక్య భీమేశ్వర ప్రధాన నానావిధ శాఖోపశాఖా తీర్థ సంబాధ సంభరితంబునునై యఖిల భువన భవనాభిరామంబైన దక్షారామంబును గైలాస మేరు మందరంబుల కంటెను, గాంచీ చిదంబర కాళహస్తి కాశి శ్రీ శైలాది మహాస్థానంబుల కంటెను సేతు కేదారంబుల కంటెను, నతిశయంబుగాఁ జేసి నా క్షేత్రంబు మరగి గరళకూట కృపీట భవ జ్వాలావష్టంభంబు సంస్తంభించి, త్రిపుర దైతేయ మదవతీ గండ భాగ మకరికా పత్ర భంగంబులు దొలగించి భీమలింగంబు సర్వమంగళాదేవియుం దాను లోకరక్షణార్థంబుగా నధిష్ఠించి యుండును. 76

అర్థము :- అనినన్=అని ప్రార్థింపగా; కరుణా సామ్రాజ్య=దయ అను సార్వభౌమ రాజ్యము నందు; పట్టాభిషిక్తుండు+అగు=పట్టాభిషేకము నందిన; ఆ జగజెట్టి వేల్పు=దేవ శ్రేష్ఠుడగు ఆ భీమేశ్వర స్వామి; బ్రహ్మాండ గోళంబునకున్=అండమువలె గుండ్రముగనున్న సమస్త జగత్తునకు; మిక్కుటంబుగాన్=అధికమగునట్లుగా; పెరిఁగిన+దేహంబున్=పెరిగిన (లింగాకార) శరీరమును; పొట్టికాన్+చేసి=పొట్టిది అగునట్లుచేసి; తిరుచుట్టు మాలికలోనన్= దేవాలయమున చిన్న చిన్న దేవతల నుంచుటకై ఆవరణము చుట్టును కట్టిన కట్టడములో; గౌరీ...భైరవులు; గౌరీ=పార్వతీదేవి; జనార్దన=విష్ణువు; రుద్ర=రుద్రుడు; కేశవ=కేశవుడు;

వినాయక=వినాయకుడు; దుర్గాతాండవేశ్వర=దుర్గతో కూడిన తాండవేశ్వరుడు; నృత్య
భైరవులు=నాట్యము చేయు భైరవులు; అను=అనునట్టి; దేవతా సప్తకంబు=ఏడుగురు
దేవతలు; పరివేష్టింపన్=చుట్టుకొని యుండగా; సకల...ఈశ్వరులు; సకలలోక=సమస్త
లోకములకు; ఆనందకర=ఆనందము కల్గించు; పరదారగమన=ఇంద్రుడు ప్రతిష్ఠించిన
ఇంద్రేశ్వరుడు; పాపహర+ఈశ్వర=పాపహరుడు అను శివ లింగములు; నైఋతి
భాగంబునన్=నిరృతి దిక్కునందు; అధివసింపన్=నివసింపగా; అంతర్ గర్భ గృహంబు
లోపలన్=లోపలివగు గర్భాలయములో; మాణిక్యాదేవి సహితుండై= మాణిక్యాంబాదేవితో
కూడి; సలిల...మండలంబున. సలిలనిధి=సముద్రము; వృద్ధగంగా=వృద్ధ గంగయు; కౌంతేయ
సరిత్=కౌంతేయ నదియు; తుల్య భాగా=తుల్య భాగానదియు; హేలానదీ=ఏలేరును;
సప్తగోదావర=సప్తగోదావరమను సరస్సును; మాతృకా=బ్రాహ్మి మొదలగు ఏడుగురు
మాతృకలతోను; పరివృత=చుట్టబడియున్న; మండలంబునన్=దేశములో
(భీమమండలమున):

మర్త్యలోక=భూలోకము యొక్క; భాగధేయంబును=సంపదయును; విబుధ=
దేవతల యొక్క; గంధర్వ=గంధర్వుల యొక్క; పతాకా=జెండాలు; వేదికయున్ (అరుగు)
ఉన్నత స్థానమును. పరిసర...ముఖంబున; పరిసర=సమీపమందలి; ఉద్యాన వాటికా=
ఉద్యానవనము లందలి; సరస=జలపూర్ణములగు; కాసార=సరస్సుల (తీరములందలి) కరీర=
నిండియున్నవగు; కుహాళి=పోక చెట్టు (తమలపాకు తీగ)ల; పాళికా=వరుసల; కుసుమ
ధూళీ=పూవులందలి పుప్పొడులతోను; మధూళికా=ఇప్పపూవుల (మామిడి పూవుల)
సౌరభ=సువాసనల; ఆసార=మహావృష్టి చేత; సంవాసిత=పరిమళింప జేయబడిన; దశదిశా
ముఖంబున=పది దిక్కుల చివరలు కలదియు; ముఖ...రంకారంబును. ముఖ కుండి
తటాక=యజ్ఞకుండమను సరస్సు నందలి; సముద్దండ=మిక్కిలి ఎక్కువైన; పుండరీక
షండ=పద్మముల సమూహము లందలి; మకరంద బిందు=తేనె చుక్కలను; గండూష=
పుక్కిలించుట యందు; అవ్యగ్ర=తొందరపాటు లేని; సముదగ్ర=బాగుగా పైకి లేచిన;
మధుపమండల=తుమ్మెదల సమూహముల యొక్క; అహంకార=అహంకారముతో కూడిన;
ఝుంకార=ఝుంకారమనెడు; కోలాహల=పెద్ద రొదతో; కదంబిత=కలుపబడిన; మకరధ్వజ=
మన్మథుని యొక్క; భుజాదండ=దండము వంటి భుజము చేత; మండలీకృత=గుండ్రముగ
చేయబడిన; కుసుమ కోదండ=పూవింటి యందలి; శింజినీ=అల్లె త్రాటి యొక్క;
రంకారంబును=రమ్మను ధ్వని కలదియు; ఆఖండల+ఆది=ఇంద్రుడు మొదలగు;
దిక్పాల=దిక్పాలురతో; భరిత=నిండి; కలిత=కూడియున్న; గోపుర ప్రాంగణంబును=గోపురము
యొక్క ముందు భాగము కలదియు; పాదుకా...క్షేత్రంబును. పాదుకా=పాదుకలు; ఖడ్గ=కత్తి;

ఘుటికారస=ఘుటికారసము; రసాయన=రసాయనము; మూలికా=మూలిక; అంజన=అంజనము వేయుట; ఆకర్షణ=ఆకర్షణము; అదృశ్య=అదృశ్యమగుట; ఆది=మొదలైన; విద్యా=విద్యలకు; సిద్ధి క్షేత్రంబును=సిద్ధిని కల్గించు పవిత్ర ప్రదేశమును;

అత్రి...ఆ కీర్ణంబును. అత్రి=అత్రి; ఆత్రేయ=ఆత్రేయుడు; అగస్త్య=అగస్త్యుడు; హారిత=హరితుడు; అంబరీష=అంబరీషుడు; అసిత=అసితుడు; భార్గవ=భార్గవుడు; పరాశర=పరాశరుడు; పారాశర్య=వ్యాసుడు; మాండవ్య=మాండవ్యుడు; మార్కండేయ=మార్కండేయుడు; మౌద్గల్య=మౌద్గల్యుడు; మంకణ=మంకణుడు; శౌనక=శౌనకుడు; శాండిల్య=శాండిల్యుడు; మందపాల=మందపాలుడు; వత్స=వత్సుడు: వసిష్ఠ=వసిష్ఠుడు; వాధూలస=వాధూలసుడు; వాలఖిల్య=వాలఖిల్యుడు; కౌండిన్య=కౌండిన్యుడు; కాశ్యప=కాశ్యపుడు; కణ్వ=కణ్వుడు; గాలవ=గాలవుడు; గాధి=గాధి, గార్గ్య=గార్గ్యుడు; ప్రముఖ=మొదలగు వారును; వాలఖిల్య+ఆది=వాలఖిల్యుడు మొదలగు; అష్ట+అశీతి సహస్ర=ఎనుబది ఎనిమిది వేల మంది; సంయమి=మునులతో; సమాకీర్ణంబును= క్రిక్కిరిసినదియు:

కర్ణికార...తాండవంబును. కర్ణికారాంబికా=(పశ్చిమ ద్వారమున గల) గోగులమ్మ: కరకమలపుట=పద్మకోశము వంటి చేతుల యందు; ఘటిత=కూర్చబడిన: కనత్=ప్రకాశించు చున్న; కనక=బంగారము నందు; మణిమయ=మణులతో నిండైన: డమరుక్=డమరుకము (బుడబుక్కల వానిచేతిలో నుండు చర్మ ఘటిత వాద్య విశేషము) యొక్క: ఢమ ఢమ ధ్వాన=ఢమ ఢమ ధ్వని యనెడు; పర్జన్య గర్జా=మేఘ ధ్వానము (ఉరుము) చేత: సముజ్జృంభిత=మిక్కిలిగ విజృంభించిన; గుహ=కుమార స్వామి (వాహనమైన). శిఖండీ=నెమలి యొక్క; తాండవం బును=తాండవ నృత్యము కలదియు:

మార్కం...సంభరితంబు. మార్కండేశ్వర=మార్కండేయేశ్వరము; కుండలాముఖ=కుండలాముఖము; సంవేద్య=సంవేద్యము; అంతర్వేది=అంతర్వేది; చాళుక్య భీమేశ్వర=చాళుక్య భీమేశ్వరము; ప్రధాన=ముఖ్యములైన; నానావిధ=అనేక విధములైన; శాఖా+ఉపశాఖా+తీర్థ=ప్రధాన తీర్థమునకు అవయవములై పెద్దవి చిన్నవిగా విస్తరిల్లిన పవిత్ర స్థానముల యొక్క; సంబాధ=ఇఱుకుతో; సంభరితంబును+ఐ=నిండినదియు: అఖిల=సమస్తమైన; భువన=లోకముల వంటి; భవన= సౌధముల చేత; అభిరామంబు+ఐన=మనోహరమైన; దక్షారామంబును=దక్షారామమును-కైలాస=కైలాసము; మేరు=మేరు పర్వతము; మందరంబుల కంటెను=మందర పర్వతముల కన్నను; కాంచీ=కంచి; చిదంబర=చిదంబరము; శ్రీకాళహస్తి=శ్రీకాళహస్తి; కాశి=వారణాసి; శ్రీశైల+ఆది= శ్రీశైలము మొదలగు; మహాస్థానంబుల కంటెను=ప్రఖ్యాత (తీర్థ) ప్రదేశముల కన్నను; సేతు=సేతువు (రామేశ్వర సమీపమున నున్నది)

కేదారంబుల కంటెను=(హిమా లయములలో గల) కేదార క్షేత్రముల కన్నను; అతిశయంబు+ కాన్+చేసి=అధికమగునట్లుగా చేసి; నా క్షేత్రంబు=దక్షారామమును; మరగి=మోహించి; గరళ కూట=విషరాశి యనెడు; కృపీట భవ=అగ్ని యొక్క; జ్వాలా=మంటల; అవష్టంభంబున్= గర్వమును; సంస్తంభించి= అణచివేసి; త్రిపురదైతేయ=త్రిపురాసురుల; మదవతీ=స్త్రీల యొక్క; గండ భాగ=చెక్కిళ్ళ యందలి; మకరికాపత్ర భంగంబులు=సౌందర్య వృద్ధికై స్త్రీలు కస్తూరి కుంకుమ మొదలగు వాని లేపనముతో చెక్కిళ్ళపై చిత్రించుకొను చిత్రములు రేఖలు; తొలగించి=తొలగింపజేసి; భీమలింగంబు=శ్రీ భీమేశ్వర స్వామి; సర్వమంగళాదేవియున్= పార్వతీదేవియు; తానును=తాను కూడ; లోక+రక్షణ+అర్థంబు+కాన్=లోక రక్షణము కొఱకై; అధిష్ఠించి+ ఉండున్=సన్నిధి చేసి యుండును.

భావము :- అని దేవతలు కోరగా దయా సామ్రాజ్య పట్టభద్రుడైన ఆ భీమేశ్వర స్వామి బ్రహ్మాండ గోళపు అంచు వరకు పెరిగిన తన రూపమును చిన్నదిగా చేసెను. ఆయనకు చుట్టును గల తిరుచుట్టు మాలికలో గౌరి, జనార్దనుడు, రుద్రుడు, కేశవుడు, వినాయకుడు, దుర్గా తాండవేశ్వరుడు, నృత్య భైరవుడు అను ఏడుగురు దేవతలు చుట్టి యుండిరి. నైఋతి దిక్కుగా సకల లోకానందకరములైన ఇంద్రేశ్వర పాపహారేశ్వర లింగములు ప్రతిష్ఠింపబడియున్నవి. లోపలి గర్భాలయమున మాణిక్యాంబా సమేతుడై తాను అధివసించి యుండెను.

సముద్రము వృద్ధ గౌతమి కౌంతేయ తుల్య భాగ ఏలేరు సప్త గోదావరమను నదులతోను; సప్త మాతృకలతోను చుట్టబడి యున్న భూభాగము నందు భూలోకమునకు సంపద యను నట్టిది: దేవతలకు గంధర్వులకు నిలయమైనదియు; సమీపమున గల ఉద్యాన వనములలోని సరస్సుల యొడ్ల యందు దట్టముగ నున్న పోక చెట్ల పూల సువాసనలతోను; ఇప్ప మామిడి సువాసనలచేత నిండియున్న దిక్కుల చివరలు కలిగి యుండినది; యజ్ఞ కుండమను సరస్సులోని పద్మవనము లందలి తేనె బిందువులను పుక్కిలింప తొందరపాటు లేక గుంపులు గుంపులుగా పైకి లేచి అహంకరించి చేయుచున్న తుమ్మెదల ఝంకారములతో కలిసి ప్రకాశించుచున్న మన్మథుని పూవింటి అల్లెత్రాటి రంకార శబ్దములు కలది; ఇంద్రాది దిక్పాలురతో నిండిన ఆలయ గోపుర ప్రాంగణములు కలది; పాదుక; కత్తి ఘుటికారసము, రసాయనము, మూలిక, అంజనము, ఆకర్షణము; అదృశ్యము మొదలగు విద్యలు సిద్ధించు పవిత్ర ప్రదేశమైనదియు;

అత్రి, ఆత్రేయుడు, అగస్త్యుడు, హరితుడు, అంబరీషుడు, అసితుడు, భార్గవుడు, పరాశరుడు, వ్యాసుడు, మాండవ్యుడు, మార్కండేయుడు, మౌద్గల్యుడు, మంకణుడు, శౌనకుడు,

శాండిల్యుడు, కాశ్యపుడు, కణ్వుడు, గాలవుడు, గాధి, గార్గ్యుడు మొదలగువారును, వాలఖిల్యుడు మొదలగు ఎనుబది యెనిమిది వేలమంది మునులతో క్రిక్కిరిసినది;

గ్రామదేవత గోగులమ్మ చేతిలోగల మణిఖచిత బంగరు చర్మ వాద్యమైన డమరుకమును మ్రోగించుచుండగా కల్గిన ఉరుముల వంటి ఢమ ఢమ శబ్దములకు తగినట్లు విజృంభించి కుమారస్వామి వాహనమైన నెమలి చేయు తాండవ నృత్యము కలదియు;

మార్కండేయేశ్వరము, కుండలాముఖము, సంవేద్యము, అంతర్వేది, చాళుక్య భీమేశ్వరము, మొదలగు ననేకములైన చిన్నవి, పెద్దవి ఐన పవిత్ర తీర్థములతో విస్తరించినదగుటచే నిండైనదియు; సమస్తమైన లోకముల వంటి సౌధములతోను మనోహరమైనది దక్షారామము.

ఈ దక్షారామమును కైలాసము, మేరువు, మందరము - అను పర్వతముల కన్నను; కంచి, చిదంబరము; శ్రీకాళహస్తి, వారణాసి, శ్రీశైలము మొదలగు ప్రసిద్ధ క్షేత్రముల కన్నను; సేతువు, కేదారము మొదలైన ప్రసిద్ధ స్థానముల కన్నను, గొప్పదానినిగ చేసి, ఈ దక్షారామమును ప్రేమించి; అమృతమునకు ముందు పాల సముద్రమున పుట్టిన గరళ కూట విషరాశి మంటలను అణచివేసి, త్రిపురాసురులను సంహరించి వారికాంతల సౌభాగ్యమును తుడిచివేసి లోకములను రక్షించు పూనికతో పార్వతీ సమేతుడై శ్రీ భీమేశ్వర స్వామి నిత్యము సన్నిధి చేసి యుండును.

**తే॥** **దేవదర్శన మాత్ర సంధిల్లు భుక్తి**
**కొందఱకు దక్ష వాటికా క్షోణి యందు**
**దేవదర్శన మాత్ర సంధిల్లు ముక్తి**
**కొందఱకు దక్షవాటికా క్షోణియందు.** **77**

అర్థము :- దక్షవాటికాక్షోణియందు=దక్షారామ భూమిలో; కొందఱకు=కొంతమందికి; దేవదర్శన మాత్రన్=శ్రీ భీమేశ్వర స్వామిని దర్శించిన మాత్రముననే; భుక్తి=భోగము; సంధిల్లున్=సమకూడును; దక్షవాటికాక్షోణియందు=దక్షారామ భూమియందు; కొందఱకు= కొంతమందికి; దేవదర్శన మాత్రన్=ఆ దేవుని దర్శించినంత మాత్రముననే; ముక్తి=మోక్షము; సంధిల్లున్=సమకూరును.

**భావము** :- దక్షారామ క్షేత్రము నందు శ్రీ భీమేశ్వర స్వామిని దర్శించినంత మాత్రముననే కొంతమందికి భోగము మరికొంతమందికి మోక్షము సమకూడును.

విశేషము :- సమానసత్వము సూచించుటకు శ్రీనాథ మహాకవి పద్యమున ఇట్లు సమాన పాదములు వ్రాయుచుచుండును. చూడుడు. భీమ. 3-86 విశేషములు.

తే॥ గీత వాదిత్ర నృత్యంబు కేవలంబు
శంభునకు సర్వకాలంబు సంభవింప
నప్సర స్త్రీల నర్పించె నాఱునూఱు
బాలలను యువతుల జంభభంజనుండు. 78

అర్థము :- జంభ భంజనుండు=జంభుడను రక్కసుని చంపిన ఇంద్రుడు శంభునకు=శివునకు; సర్వకాలంబు=అన్ని కాలముల యందు; గీత=పాటలు; వాదిత్ర= సంగీతపు మేళము; నృత్యంబు+కేవలంబు=నృత్యములతో సంపూర్ణమైనది; సంభవింపన్= కలుగుటకై; ఆఱునూఱు=ఆఱు వందల మంది; బాలలను+యువతుల= బాలికలు యువతులు అగు; అప్సరస్+స్త్రీలన్=అప్సరః కాంతలను; అర్పించెన్= సమర్పించెను.

భావము :- దేవేంద్రుడు శ్రీ భీమేశ్వర స్వామికి అన్ని కాలములందును పాటలు సంగీతపు మేళము నృత్యముల కొఱకు బాలలు యువతులు ఐన ఆరు వందల మంది అప్సరః కాంతలను సమర్పించెను.

విశేషము :- వాదిత్ర :- తతము, అనద్ధము, సుషిరము, ఘనము అను వాద్య చతుష్టయము; వీణాగానము మొదలగునవి కలసిన సంగీతపు మేళము.

శా॥ ఆ వంశంబున సానికూఁతులను దివ్య స్త్రీలు దుగ్ధాబ్ధి మ
ధ్యావిర్భూతలు, మీనకేతనుని పుష్పాస్త్రంబు లెక్కాలమున్
సేవాదక్షతఁ గొల్తురిందుధరునిన్ శ్రీ దక్షవాటీశ్వరుం
గైవల్యాధిపు భీమనాథుని లసత్కారుణ్య పాథోనిధిన్. 79

అర్థము :- దుగ్ధ...భూతలు. దుగ్ధ+అబ్ధి=పాలసముద్రము యొక్క; మధ్య=మధ్యము నుండి; ఆవిర్భూతలు=పుట్టిన వారలును; మీనకేతనుని=చేపను ధ్వజమున చిహ్నముగ గల మన్మథుని యొక్క; పుష్ప+అస్త్రంబులు=పూల బాణములునై; ఆ వంశంబునన్=ఆ వేశ్యాజాతిలో; సానికూఁతులు+అను=వేశ్యల పిల్లలను పేరుగల; దివ్య స్త్రీలు=దేవకాంతలు; ఇందుధరునిన్=చంద్రమౌళియు; శ్రీ దక్షవాటి+ఈశ్వరున్=శ్రీ దక్ష క్షేత్రాధీశ్వరుడును; కైవల్య+ అధిపున్=ముక్తికి స్వామియైనవాడును లసత్...పాథోనిధిన్. లసత్=ఒప్పుచున్న; కారుణ్య=దయకు; థోనిధిన్=సముద్రుడునైన వాడును; అగు; భీమనాథుని=శ్రీ భీమేశ్వర స్వామిని; ఏ+కాలమున్=ఎల్లకాలము లందును; సేవా దక్షతన్=సేవించుట యందలి సామర్థ్యముతో; కొల్తురు=అర్చింతురు.

భావము :- పాల సముద్ర మధ్యమున పుట్టినవారు మన్మథుని పూ బాణములైనవారు ఆ వేశ్యా వంశమున సానికూతులైన దేవకాంతలు - చంద్రశేఖరుడు శ్రీ దక్షారామ నాయకుడు మోక్షమునకు స్వామి దయాసముద్రుడు నైన శ్రీ భీమేశ్వర స్వామిని ఎల్లకాలము దక్షతతో సేవించుచుందురు.

వ॥ మఱియు మహనీయ దేవగంధర్వాప్సరో వేశ్యాజాతి-సంజాత కాంతాచికుర తిమిరాంగ సుమంగళ విభావరీ లలాట శశికళా విలాస ద్వితీయ భ్రూలతా లాసికా లాస్య లలిత రంగ భూమియు; నయన శంబరాను బంధ నవ కందర్ప పతాకయు, నధర బంధూక కుసుమయు, వికాస విభ్రమ శరద్వేళా కంబు కమనీయ కంఠయు, బిబ్బోక సరిదంబుధరవేణియుఁ; బ్కుధులతా చక్రవాకయుఁ గరపల్లవ స్ఫురణ పర్యాయ వల్లీమతల్లీ పన్నగ పరిషత్తునుంబోలెఁ బ్రకటిత విలాస మన్మథ లీలయుంబోలె, రతిసుఖ సంపత్సంపాదన లంపటకుముదియునుం బోలెఁ, రాజానుకూల దర్శన కేశభరంబునఁ గృష్ణవదన, వచోమనోహర వశంబున మంజుఘోష, మధ్యంబున మందోదరి, యూరుయుగళంబున రంభ, కనక భూషణధారణంబున రుక్మిణి, సురత కళాకౌశలంబున దక్షిణ, తనువున భద్ర, పుష్పాస్త్ర ద్వితీయ జన్మభూమి, కారుణ్యవతి, తారుణ్యావతి, కాంతిమతి, కమనీయవతి, వినయవతి, విభ్రమవతి, విజ్ఞానవతి, వితీర్ణవతి, త్రపావతి, భూషణవతి, భూషణమరీచిజాలాకార విగ్రహయగుట విద్యుద్దండంబు వలనను; బ్రసవ పరిమళ హారిణి యగుటం బారిజాత కోరకంబుల వలనను, నిశ్వాసామోదకారిణి యగుట మలయమారుతంబువలనను, నిఖిలేంద్రి యామోదకారిణి యగుట నటనామృతంబు వలనను, మాధుర్య జన్మభూమి యగుట నిక్షుకాండంబు వలనను బ్రభవించెనో యనఁబ్రశంసాస్పదంబై యుండు; నవ్వంశంబునం దిందుముఖుల యానన చంద్రమండలంబులయం దభ్యర్ణ రోహిణీ పాశ శృంఖలోద్వృత్తినిం బోలె లాంఛన హరిణంబు ప్రవేశింప వెఱచు; నా చంచలాక్షుల దృగంచల స్ఫురణంబు లించు విలుకానికిం బంచ బాణంబులు పువ్వులగుట నవ్వుటాలమాట; యప్పణంతుల లలాట కర్పూర తిలకంబు దర్పకునకు ధవళాతపత్రంబు శశాంక బింబంబనుట బొంకు; ఆ పువ్వుఁబోణుల కఱివంక కనుబొమ్మలె యంగజున్నకు సింజిని విండ్లల్ల చెఱకు విల్లనుట కల్ల; యత్తొయ్యలుల నెత్తావి యూర్పు గాడ్పులె పుష్ప బాణునకుఁ బ్రాణసఖులు చందనాచల సమీరణంబు

సఖుండనుట యుకారణ చిత్త ప్రత్యావహంబు. అది గావున నుత్తమ నాయికా నాయక గర్భ జనితలైన యూనానులు సానురాగంబున నీశానుని భీమేశ్వరుని ఘుసృణ ముకుళితోపాంగంబులు, కుంచితాకుంచిత భ్రూలతంబులు విస్మయోత్పాదన తానకంబులు, ప్రసన్నంబులు, ప్రేమరస పూర్ణత్రపావృతారంభంబులు, నవలలితంబులు, పులకాంకురకారణంబులు, భావజగర్వితంబులు, వికస్వరంబులు, విస్మృత విశేషంబులు నైన వీక్షణంబులఁ దదీయలావణ్య పూరం బాస్వాదించు విధంబు నభిలషించుట దెల్పు చందంబున; హృదయంబు నాకర్షించు చాడ్పునఁ జామర వ్యజన వీటికా కరండ పాదుకాముకుర దీపికా సంగీత నాట్యాద్యుపచార సేవా విశేషంబులఁ బ్రతి సంధ్యంబును బల్యంకికా సేవా బహిర్విజయాది భోగావసర సమయంబున సేవించుచుందురు. 80

అర్థము :- మఱియు=ఇంకను; మహనీయ ..భూమియు. మహనీయ=గొప్పవారగు; దేవ=దేవతల; గంధర్వ=గంధర్వుల, అప్సరస=అప్సరస్సంబంధమైన; వేశ్యాజాతి=దక్షారామ వేశ్యాజాతి-సంజాత=బాగుగా కూర్పబడిన, కాంతా=స్త్రీల యొక్క; చికుర=కొప్పు వెంట్రుకలనెడు; తిమిర=చీకటియే, అంగ=శరీరముగా గల; సుమంగళ=శుభప్రదమైన; విభావరీ=రాత్రి యొక్క; లలాట=నుదుటి యందలి; శశికళా=చంద్రరేఖ యొక్క; విలాస=సౌందర్యమే; ద్వితీయ=రెండవదిగా గల; భ్రూలతా=తీగెల వంటి కనుబొమలనెడు; లాసికా=నర్తకి యొక్క; లాస్య=నృత్యమునకు; లలిత=సుందరమైన; రంగభూమియు=రంగస్థలమైనదియు; నయన... పతాకయు. నయన=కన్నులనెడి; శంబర=శంబర జాతి చేపలకు; అనుబంధ= సంబంధము గల; నవ=క్రొత్తదైన; కందర్ప=మన్మథుని; పతాకయు=జెండా కలదియు; అధర...కుసుమయు. అధర=పెదవులనెడు; బంధూక కుసుమయు=మంకెన పూవులు కలదియు; వికాస...కంఠయు. వికాస=వ్యాప్తి చేత; విభ్రమ=సుందరమైన; శరత్-వేళా= శరత్కాలము వలె (స్వచ్ఛతయు), కంబు=శంఖము వలె; కమనీయ=సుందరమైన; కంఠయు=కంఠములు కలదియు; బిబ్బోక... వేణియు. బిబ్బోక=మెఱపు సౌందర్యము గల, సరిత్=ప్రవాహము వంటి; అంబుధర=మేఘము వంటి; వేణియు=జడలు కలదియు; పృథులతా=(చన్నుల) విస్తారము చేత; చక్రవాకయున్= చక్రవాక పక్షులు కలదియు; కర...పోలెన్. కరపల్లవ=చేతివ్రేళ్ళ; స్ఫురణ=కదలికలకు; పర్యాయ=సూరైన; వల్లీమతల్లీ=శ్రేష్ఠమైన తీగెల వంటి, పన్నగ పరిషత్తునున్+పోలెన్=పాముల సమూహము వలెను; ప్రకటిత...పోలెన్. ప్రకటిత=వ్యక్తము చేయబడిన; విలాస=శృంగార చేష్టలతో; మన్మథ లీలయునున్+పోలెన్=మదన క్రీడవలెను; రతి...పోలెన్. రతిసుఖ=రతిసుఖమనెడు, సంపత్=సంపదను; సంపాదన= కల్గించుట యందు;

లంపట=అమితాసక్తిని కల్గించు; కుముదియునున్+పోలెన్=తెల్ల కలువల సమూహము వలె; రాజా...నదన. రాజా+అనుకూల=రాజును అనుకూలముగా; దర్శన= చూచుటచేత; కేశభరంబున=కొప్పు యొక్క బరువుతో; కృష్ణవదన=నల్లనైన ముఖము కలదియు; వచో...ఘోష. వచస్= మాటలందలి; మనోహర వశంబునన్=మనసును దోచుట అను శక్తిచేత; మంజు ఘోష=మధురస్వరము కలది (మంజు ఘోష అను అప్సరస); మధ్యంబు నన్=నడుము నందు; మంద+ఉదరి=మృదువు దుర్బలమునైన నడుము కలది; ఊరు యుగళంబునన్= తొడల జంట యందు; రంభ=అరటి (రంభయను అప్సరస) యును; కనక భూషణ+ ధారణంబునన్=బంగరు సొమ్ములను తాల్చుటలో; రుక్మిణీ= (రుక్మిణీదేవి) బంగారము కలది; సురత...దక్షిణ. సురత=సంభోగమనెడు; కళా=కలయందలి; కౌశలంబు నన్=నేర్పుచేత; దక్షిణ=నిపుణురాలు; తనువున=శరీరముచేత; భద్ర=బంగారమైనది (మనోహరమైనది); పుష్పా...భూమి. పుష్పాస్త్ర=మన్మథునకు; ద్వితీయ=రెండవదైన; జన్మభూమియు=పుట్టిల్లును; కారుణ్యవతి=దయగలది; తారుణ్యవతి=యౌవనము కలది; కాంతిమతి=జిగికలది; కమనీయవతి=సౌందర్యము కలది; వినయవతి=వినయము కలది; విభ్రమవతి=విలాసము కలది; విజ్ఞానవతి=విజ్ఞానము కలది; త్రపావతి=సిగ్గు గలది; భూషణవతి=సొమ్ములు కలది;

భూష...విగ్రహ. భూషణ=అలంకారముల యొక్క; మరీచిజాల=కాంతుల సమూహమే; ఆకార=స్వరూపమైన; విగ్రహ=స్వరూపము కలది; అగుటన్=అగుటచేత; విద్యుత్+దండంబు వలనను=మెఱపుల సమూహము వలనను; ప్రసవ...హారిణి. ప్రసవ=పూల యొక్క; పరిమళ= సువాసనల చేత; హారిణి=మనోహరి; అగుటన్=అగుటచేత; పారిజాత+కోరకంబుల వలనను= పారిజాతపు పూమొగ్గల వలనను; నిశ్వాస...కారిణి. నిశ్వాస=నిట్టూర్పులచేత; ఆమోదకారిణి= సంతోషము (సువాసన)ను కల్గించునది; అగుటన్=అగుటచేత; మలయ మారుతంబు వలనను=మలయ పర్వతము నుండి వచ్చు గాలుల వలనను; నిఖిల...కారిణి. నిఖిల+ ఇంద్రియ=ఇంద్రియములన్నింటికి; ఆమోదకారిణి=సంతోసము కల్గించునది; అగుటన్= అగుటచేత; నటన=నాట్యమను; అమృతంబు వలనను=అమృతము నుండియు, మాధుర్య=మధురత్వమునకు; జన్మభూమి+అగుటన్=పుట్టినిల్లగుటచేత; ఇక్షు+కాండంబు వలనను=చెఱకు గడ నుండియు; ప్రభవించెన్+ఓ+అనన్=పుట్టెనా అన్నట్లుగ; ప్రశంసా+ ఆస్పదంబై=మెచ్చుకోలుకు స్థానమై; ఉండున్=అయి యుండును;

ఆ+వంశంబునందున్=ఆ వేశ్యాజాతి యందు; ఇందు ముఖుల=చంద్రముఖుల (సుందరీమణుల) యొక్క; ఆనన=మొగములనెడు; చంద్రమండలంబులయందు=చంద్ర మండలములందు; అభ్యర్ణ=సమీపమందలి; రోహిణి=రోహిణీ నక్షత్రమనెడు; పాశ=కట్టుత్రాడైన; శృంఖలా=గొలుసు యొక్క; ఉద్వృత్తిన్+పోలె=అతిశయమా అన్నట్లుగ; లాంఛన హరిణంబు=

చిహ్నమైన జింక; ప్రవేశింపన్=చొచ్చుటకు; వెఱచున్=భయపడును; ఆ+చంచల+అక్షుల=చంచలములైన చూపులు గల ఆ కాంతల యొక్క; దృక్+అంచల=కనుకొనల; స్ఫురణంబులు=కదలికలు; ఇంచు విలుకానికిన్=చెఱకు విల్లుగల మన్మథునకు; పంచ బాణంబులు=ఐదు బాణములు గాని; పువ్వులు=పూవులు; అగుట=అగుట; సవ్వుటాలమాట=పరియాచకపు మాట; ఆ+పణంతుల=ఆ కాంతల యొక్క; లలాట=నుదుటి యందలి; కర్పూర తిలకంబు=కర్పూరపు బొట్టు; దర్పకునకున్=మన్మథునకు; ధవళ+ఆతపత్రంబు=తెల్లగొడుగు గాని; శశాంక బింబంబు=చంద్రబింబము; అనుట=అని చెప్పుట; బొంకు=అబద్ధము; ఆ+పువ్వుఁబోణుల=పూవు వంటి శరీరములు గల ఆకాంతల యొక్క; కటి=నల్లని; వంక=వంపులు తిరిగిన; కనుబొమ్మలె=కనుబొమలే; అంగజునకు=మన్మథునకు; సింగిణి విండ్లు=కొమ్ముధనస్సులు గాని అల్లచెఱకు=ఆ చెఱకు గడ; విల్లు+అనుట=ధనుస్సు అని చెప్పుట; కల్ల=అసత్యము; ఆ+తొయ్యలుల=ఆ స్త్రీల యొక్క; నెఱ+తావి=చక్కని సువాసన గల; ఊర్పుగాడ్పులె=నిశ్వాస వాయువులే; పుష్పబాణునకు=మన్మథునకు; ప్రాణసఖులు=ప్రాణస్నేహితులుగాని; చందన... సమీరణంబు. చందన+అచల=గంధపు కొండ నుండి వచ్చు; సమీరణంబు=గాలి; సఖుండు+అనుట=స్నేహితుడగుట; అకారణ=కారణములేకయే; చిత్త=మనసును; ప్రత్యావహంబు=తప్పుత్రోవ పట్టించునది;

అదిగావున=అందుచేత; ఉత్తమ=శ్రేష్ఠులైన; నాయికా నాయక=రూప యౌవన సంపన్నులయిన స్త్రీ పురుషుల; గర్భ జనితలు+ఐన=కడుపున పుట్టిన వారైన; ఆ సానులు=ఆ వేశ్యలు; సానురాగంబునన్=ప్రేమతోకూడి; ఈశానునిన్=పరమేశ్వరుడైన; భీమేశ్వరునిన్=శ్రీ భీమేశ్వరస్వామిని; ఘుసృణ=కుంకుమ పూవువలె; ముకుళిత=ముడుచుకొనిన; అపాంగంబులు=కను కొలకులు కలవి; కుంచిత+అకుంచిత=ముడుచుకొనిన, విప్పారిన; భ్రూలతంబులు=తీగలవంటి కనుబొమలు కలవి; విస్మయ=ఆశ్చర్యమును; ఉత్పాదన=కలిగించుటయందు; తానకంబులు=స్థానములైనవియు; ప్రసన్నంబులు=ప్రసన్నమైనవి; ప్రేమరస+పూర్ణ=ప్రేమ యను రసముతో నిండినవియు; త్రపా+ ఆవృత=సిగ్గుచే కప్పబడిన; ఆరంభంబులు=ప్రారంభము కలవియు; నవ+లలితంబులు=క్రొంగ్రొత్త సౌకుమార్యము గలవియు; పులక+ఆవళి=గగుర్పాటుల సమూహములకు; కారణంబులు=కారణములైనవి; భావజ+మన్మథునితో; గర్భితంబులు=నిండియున్నవియు; వికస్వరంబులు=బాగుగ విప్పారినవియు; విస్మృత+నిమేషంబులున్=మరచిన రెప్పపాటులు కలవియు;

ఐన+అయినట్టి; వీక్షణంబులన్=చూపులతో; తదీయ=ఆ స్వామి యొక్క; లావణ్య పూరంబు=సౌందర్య ప్రవాహమును; ఆస్వాదించు=క్రోలు; విధంబున్=రీతిని; అభిలషించుటన్=కోరుటను; తెల్పు చందంబునన్=తెలియజేయు విధముగ; హృదయం బున్=మనసును;

ఆకర్షించు=లాగు; చాడ్పునన్=విధముగా; చామర వ్యజన=వింజామరవీచుట; వీటికాకరండ=తాంబూలపు పెట్టెను మోయుట; పాదుకా=పాదుకలను మోయుట; ముకుర=అద్దము పట్టుట; దీపికా=కాగడాలు పట్టుట; సంగీత=పాటలు పాడుట; నాట్య=నాట్యములు చేయుట; అది=మొదలైన; ఉపచార=ఉపచారములనెడి; సేవా విశేషంబు లన్=విశేషములైన సేవలతో; ప్రతి సంధ్యంబును=ప్రతి సంధ్యా సమయము నందును; పల్యంకికా సేవా=పల్లకీసేవ; బహిః+విజయ=పారువేట; ఆది=మొదల యిన; భోగ+అవసర+ సమయంబులన్=భోగముల సేవల సమయములందు; సేవించుచుండుదురు=సేవించు చుందురు.

భావము :- దేవతల గంధర్వుల అప్సరసల సంబంధమైన దక్షారామము నందలి వేశ్యాజాతి-కాంతల కేశపాశములనెడి చీకటియే దేహముగా గల రాత్రి అనెడు కాంత యొక్క నుదుటి చంద్రరేఖ సౌందర్యమును అప్రధానము చేయగల తీగెల వంటి కనుబొమలనెడు నర్తకి యొక్క లాస్యమునకు వారి ముఖములు రంగస్థలములు; ఆ యువతుల చేపల వంటి కన్నులు మన్మథుని క్రొత్త జెండాలు. వారి అధరములు ఎఱ్ఱని మంకెన పూవుల వలె నుండును. వారి కంఠములు శరత్కాలము వలె స్వచ్ఛములు; శంఖములవలె సుందరములు; వారి విలాసములనెడు నదీ ప్రవాహమునకు మేఘముల వంటి జడలు హేతువులు; విరివియైన వారి చనుకట్టులకు చక్రవాకములు పోలిక; వారి చేతివ్రేళ్ళ కదలికలు శ్రేష్ఠమైన తీగెల వంటి సర్పసమూహముల కదలికల వలె నుండును; వారి శృంగార చేష్టలు మన్మథ లీలలను పోలియుండును. రతిసుఖమను సంపదను కల్గించుట యందు అధికమైన ఆసక్తిని కల్గించుటలో తెల్ల కలువల సమూహము ఆ కాంతలు; చంద్రబింబమున కనుకూలముగ చూచుటచేత ఆ చంద్రకాంతి వారి కొప్పుభారములపై ప్రసరించి ప్రతిఫలించుటచే నల్లని ముఖములు కలవారైరి. అందుచే వారు కృష్ణ వదనలు. మధురవచనలైన వారు మాటనేర్పరితనమున మంజుఘోషలు. వారి నడుములు సన్నములు. అందుచే వారు మందోదరులు. వారి తొడలు అరటి బోదెల వలె నుండును. అందుచేత వారు రంభలు. ధరించిన బంగరు ఆభరణములచేత వారు రుక్మిణులు. సురత కళాకౌశలమున వారు దక్షిణలు. వారి శరీరముల. బంగారు రంగుచేత భద్రలు. ఆ వేశ్యాజాతి మన్మథునకు రెండవ పుట్టిల్లు. ఆ జాతి-దయ, యౌవనము, కాంతి, అందము, వినయము, విలాసము, విజ్ఞానము, సిగ్గు, అలంకారములు కలది. ఆ జాతి-అనేకములైన అలంకారముల కాంతియే రూపమగుట చేత మెఱుపుల నుండి పుట్టెననియు, పూవుల సువాసనలతో మనోహరమగుట చేత పారిజాతపు పూమొగ్గల నుండి పుట్టె ననియు, నిట్టూర్పులతో సువాసనను గల్గించునదగుట చేత మలయమారుతము నుండి పుట్టెననియు, అన్ని ఇంద్రియములకు ఆనందమును

కల్గించునదగుట చేత నాట్యమును అమృతము నుండి పుట్టెననియు, మాధుర్యమునకు నిలయమగుటచేత చెఱకు గడల నుండి పుట్టెననియు, ప్రశంసింప తగియుండును;

చంద్రబింబమునకు సమీపమున నున్న రోహిణీ నక్షత్రమే కట్టు త్రాడగుట చేత అందున్న జింక (చంద్రబింబానన లైన) ఈ దక్షారామ వేశ్య కాంతల ముఖములనెడి చంద్ర మండలములలో ప్రవేశించుటకు జంకును. వారి చూపుల కదలికలే మన్మథుని పంచ బాణములు గాని పూవులనుట పరిహాసపు మాట. వారి ముఖములపై నున్న కర్పూర తిలకమే మన్మథుని వెల్లగొడుగు గాని చంద్రబింబము మన్మథుని వెల్లగొడుగనుట అబద్ధము - వారి నల్లని వంకర కనుబొమలే మన్మథుని ధనుస్సులు గాని చెఱకుగడ ఆతని ధనుస్సనుట అసత్యము. ఆ కాంతల సువాసనాభరితములైన నిట్టూర్పులే మదనునకు ప్రాణసఖులు గాని మలయానిలము ఆతనికి ప్రాణమిత్రుడగుట అకారణముగ మనసును తప్పు త్రోవ పట్టించుటగును;

అందుచేత ఉత్తమ నాయికా నాయకుల సంతతియైన ఆ వేశ్య కాంతలు, అనురాగముతో - కుంకుమపూవు వలె ఎఱ్ఱనై ముకుళితములైన క్రీగంటి చూపులతో శ్రీ భీమేశ్వర స్వామిని చూతురు. ఆ చూపులతో వారి కనుబొమలు ముడుచుట విప్పారుటలు కలిగి యుండును. ఆ చూపులు ఆశ్చర్యకరములు; నిర్మలములు. ప్రేమరస పూర్ణములు; సిగ్గుచే కప్పబడినవి; నిత్యనూతన సుకుమారములు; పులకరింతలకు కారణములు; మన్మథ గర్భితములు; విప్పారి యుండి ఱెప్పపాటులు లేనివి. అట్టి విశిష్ట లక్షణములు గల చూపులతో ఆ వేశ్యకాంతలు శ్రీ భీమేశ్వర స్వామి వారి దివ్య సౌందర్యమును ఆస్వాదించు కోరికను తెలియజేయు విధముగను; ఆస్వామి హృదయము నాకర్షించు విధముగను చూతురు. వింజామరలు వీచుట, తాంబూలపు పెట్టెను మోయుట; పాదుకలను మోయుట; అద్దము పట్టుట, కాగడా పట్టుట, పాటలు పాడుట, నాట్యము చేయుట మొదలగు ఉపచారములతో కూడిన సేవలను నిత్యము చేయుచుందురు. ప్రతి సంధ్యా సమయము నందును పల్లకీ సేవ, బహిర్విజయము (పారువేట) మొదలగు భోగసేవల సమయములలోను ఆ స్వామిని సేవింతురు.

విశేషము :- ఈ దక్షారామ వేశ్యా వర్ణనము నందు వామన భట్టబాణుని వేమభూపాల చరితము నందలి అద్దంకి పురవేశ్యా వర్ణనము యొక్క అనువాదములు ఉన్నవి.

"ఇందుముఖుల యానన చంద్ర మండలంబులయం దభ్యర్ణ రోహిణీ పాశ శృంఖలో ద్వృత్తినిం బోలె లాంఛన హరిణంబు ప్రవేశింప వెఱచు, నా చంచలాక్షుల దృగంచల స్ఫురణంబు లించువిలుకానికిం బంచ బాణంబులు; పువ్వులనుట నవ్వులాటలమాట,

యప్పుణంతుల లలాట కర్పూర తిలకంబు దర్పకునకు ధవళాత పత్రంబు; శశాంక బింబంనుట బొంకు, ఆ పువ్వుఁ బోఁణుల కణివంక కనుబొమ్మలె యంగజునకు సింగిణీ విండ్లల్ల చెఱకు విల్లనుట కల్ల, యత్తొయ్యలుల నెత్తావి యూర్పు గాడ్పులె పుష్పబాణునకుఁ బ్రాణసఖులు, చందనాచల సమీరణంబు సఖుండనుట యకారణ చిత్త ప్రత్యాహంబు."

ఈ వర్ణనము వేమ భూపాల చరితము నందెట్లున్నదో గమనింపుడు-

"యత్రచ హరిణీ దృశా మానన చంద్రమండలేష్వభ్యర్ణ కర్ణ పాశ గాఢ సహస శంకా సంకుల ఇవ న కదాపి నివిశతో లాంఛన హరిణః, యత్ర చ చంచల దృశామంచల స్ఫురణ మేవదృశోః పంచశరీ పంచబాణస్య పుష్పాణీతి మృషోద్యా కిం వదంతీ, విభ్రమ ప్రణయినీ భ్రూలతికైవ సమర సాచివ్య కర్మణం కార్ముకం ఇక్షు రిత్యలక్ష్య మాఖ్యానమ్, నిసర్గసురభి ర్నిశ్వాస ఏవ రాగోద్దీపన సాధనమ్ మలయ పవన ఇతి చింతావ్యామోహః, ఛాయాకరం చందన తిలక మేవ ధవళాతపత్రమ్ చంద్రమండల మితి కవిధర్మ..." పుట-16.

తే॥ దక్ష వాటీ పురీ చతుర్ద్వారములను
భీమమండలికా పుణ్యభూమి యందు
శంభు లింగ ప్రతిష్ఠలు సంఘటించి
యెల్లవేల్పులు ప్రార్థించి రిందుధరుని. 81

అర్థము :- భీమ మండలికా=భీమమండలమను; పుణ్యభూమి యందు= పవిత్రమైన నేలయందలి; దక్షవాటీపురీ=దక్షారామ నగరము యొక్క; చతుః+ద్వారములను= నాలుగు వాకిళ్ళ యందును; ఎల్లవేల్పులు=దేవతలందఱు; శంభులింగ=శివలింగముల యొక్క; ప్రతిష్ఠలు=ప్రతిష్ఠాపనలు; సంఘటించి=జరిపి (చేసి); ఇందుధరుని=చంద్రమౌళిని; ప్రార్థించిరి=వేడుకొనిరి.

భావము :- పవిత్రమైన భీమమండలము నందు దక్షారామ నగరము యొక్క నాలుగు వాకిళ్ళయందును దేవతలందఱును శివలింగ ప్రతిష్ఠలు చేసి చంద్రశేఖరుడైన శ్రీ భీమేశ్వర స్వామిని ప్రార్థించిరి.

**వ॥ ప్రార్థించి శ్రీ భీమేశ్వర మహాదేవుని వలన నాత్మ ప్రతిష్ఠిత శంభు లింగంబులకును వరంబులడిగిన నవ్విరూపాక్షుండువారు కోరినట్లు భుక్తిముక్తి ప్రదాన సామర్థ్యంబులు సర్వలింగంబులకుఁ గలుగ ననుగ్రహించె.** 82

అర్థము :- ప్రార్థించి=వేడుకొని; శ్రీ భీమేశ్వర మహాదేవుని వలనన్=శ్రీ భీమేశ్వరేశ్వరుని వలన; ఆత్మ+ప్రతిష్ఠిత=తాము ప్రతిష్ఠించిన; శంభులింగంబులకును=శివలింగములకును;

వరంబులు=వరములను; అడిగినన్=కోరగా; ఆ+విరూప+అక్షుండు=ఆ బేసి కన్నులవాడు (ఫాలాక్షుడు) వారు=ఆ దేవతలు, కోరినట్లు=కోరిన విధముగానే, సర్వ+లింగంబులకున్=అన్ని శివలింగములకును; భుక్తి+ముక్తి+ప్రదాన+సామర్థ్యంబులు=భుక్తిని ముక్తిని ప్రసాదింపగల శక్తి; కలుగన్=కలుగునట్లుగా; అనుగ్రహించెన్=దయచేసెను.

భావము :- ఆ దేవతలు ఆ విధముగ వేడుకొని తాము ప్రతిష్ఠించిన శివలింగములకు వరములు కోరగా ఆ భీమేశ్వర స్వామి వారు కోరిన విధముగా వారు ప్రతిష్ఠించిన శివలింగము లన్నింటికిని భోగము మోక్షము మొదలగు వానిని ప్రసాదింపగల శక్తిని దయచేసెను.

తే॥ సప్త సింధువునకు భీమశంకరునకు
నడుమ నింద్రేశ్వరము పాపనాశనంబు
దృష్టి మాత్రన భుక్తి ముక్తిప్రదంబు
దేవలోకాధిపతి సంప్రతిష్ఠితంబు. 83

అర్థము :- సప్త సంధువునకు=సప్తగోదావరము నకును; భీమశంకరునకు=శ్రీ భీమేశ్వర స్వామికిని; నడుమన్=మధ్యమున; దేవలోక+అధిపతి=దేవలోక నాయకుడైన మహేంద్రుని చేత; సంప్రతిష్ఠితంబు=చక్కగా ప్రతిష్ఠింపబడిన; ఇంద్రేశ్వరము=ఇంద్రేశ్వర లింగము; దృష్టి మాత్రన=కేవలము చూచినంత మాత్రముననే; భుక్తి+ముక్తి+ప్రదంబు=భోగమును మోక్షమును ప్రసాదింపగలది; పాపనాశనంబు=పాపములను పోగొట్టునది.

భావము :- శ్రీ భీమేశ్వర స్వామికిని సప్త గోదారమునకును నడుమన దేవేంద్రునిచే ప్రతిష్ఠింపబడిన ఇంద్రేశ్వర లింగము దర్శన మాత్రముననే భుక్తిని, ముక్తిని ప్రసాదింపగలది. పాపములను పోగొట్టగలది.

క॥ భీమయ దేవుని దక్షిణ
భూమీ భాగమున యజ్ఞ పురుషేశ్వర ది
వ్యామృత లింగము భోగ
శ్రీ ముక్తి విభూతిదాయి సేవక తతికిన్. 84

అర్థము :- భీమయ దేవుని=శ్రీ భీమేశ్వర స్వామి యొక్క, దక్షిణ=దక్షిణదిశ యందలి; భూమీ భాగంబున=భూమి యందు గల, యజ్ఞపురుష+ఈశ్వర=అగ్నిదేవునిచే స్థాపింపబడిన; దివ్య+అమృత లింగము=దివ్యమైన అమృతలింగము; సేవక తతికిన్=సేవించు భక్తుల సమూహమునకు; భోగ=ఐహికమైన భోగమును; శ్రీ=సంపదను; ముక్తి విభూతి=ముక్తి అను ఐశ్వర్యమును; దాయి=ప్రదానము చేయునట్టిది.

భావము :- శ్రీ భీమేశ్వర స్వామికి దక్షిణపు దిక్కున అగ్నిదేవుడు ప్రతిష్ఠించిన యజ్ఞపురుషేశ్వర మనుపేరుగల దివ్యమైన అమృత లింగము సేవించిన భక్తులకు ఐహికమైన భోగమును, సంపదను, అలౌకికమైన మోక్ష సంపదను ప్రదానము చేయగలది.

ఆ॥ అగ్నికుండమనఁగ నచ్చోట నున్నది
ధాత్రి భుక్తి ముక్తి ధాతృ నీవి
దానఁ దీర్థమాడి తర్పణ మొనరింప
బితరు లూర్ధ్వలోక గతులు గంద్రు. 85

అర్థము :- ధాత్రి=పుడమిలో; భుక్తి=భోగమును; ముక్తి=మోక్షమును; ధాతృ=ధరించు; నీవి=మొలలో దాచుకొను డబ్బు సంచి (ఐన); ఆ+చోట=ఆ యజ్ఞ పురుషేశ్వరము వద్ద; అగ్నికుండము+అనఁగన్=అగ్నికుండమను పేరుతో; ఉన్నది=కలదు; దానిన్=ఆ అగ్నికుండమున; తీర్థము+ఆడి=స్నానముచేసి; తర్పణము=పితృదేవతలకు తర్పణములను; ఒనరింపన్=చేసినచో; పితరులు=పితృదేవతలు; ఊర్ధ్వలోకగతులు=ఉత్తమ లోకగమనములను; కంద్రు=పొందుదురు.

భావము :- భూమి మీద ఆ యజ్ఞపురుషేశ్వరము వద్ద భోగమోక్షములకు మూలధన మనదగునట్టి అగ్నికుండమను జలాశయము కలదు. ఆ అగ్నికుండమున స్నానము చేసి తర్పణములు వదలినచో పితృదేవతలు ఉత్తమగతులను పొందుదురు.

తే॥ కృత్తికా తారకంబులఁ గీలుకొన్న
దినమునం దగ్నికుండికా తీర్థమాడి
శంభు నగ్నీశ్వరునిఁ జూచు సజ్జనులకు
లలిత కరతల ధాత్రీఫలంబు ముక్తి. 86

అర్థము :- కృత్తికా=కృత్తికలను; తారకంబులన్=నక్షత్రములతో; కీలుకొన్న=కూడుకొన్న; దినమునందు=దినము నందు; అగ్నికుండికా=అగ్నికుండములో; తీర్థము+ఆడి=స్నానము చేసి; అగ్నీశ్వరునిన్=అగ్నీశ్వరుడైన; శంభున్=శంకరుని; చూచు= దర్శించునట్టి; సత్+జనులకు+సత్పురుషులకు; ముక్తి=మోక్షము; లలిత=మనోహరమైన; కరతల= అరచేతి యందలి; ధాత్రీఫలంబు=ఉసిరికపండు.

భావము :- కృత్తికా నక్షత్రములున్న దినమున అగ్నికుండమున స్నానము చేసి అగ్నీశ్వర స్వామిని దర్శించిన సత్పురుషులకు మోక్షము కరతలామలకము. అనగా అందమైన అరచేతనున్న ఉసిరిక పండు వలె సులభము.

సీ॥ అగ్నీశ్వరుని మ్రోల నగ్నికుండిక కూప
తట దేశమున నుండు దక్ష కుండి;
యది సర్వ పాపౌఘ ముదిర ఝుంఝానిలం
బా కూపమునకు యామ్యంబునందు
దాక్షాయణీదేవి త్రైలోక్య జనయిత్రి
చలికొండ రాచూలి వెలసి యుండు
దక్షకుండమునఁ దీర్థంబాడి యర్థితో
దాక్షాయణీదేవి దక్షపుత్రి

తే॥ నసిత పక్షాష్టమీ తిథి యందు నొండె
మఱి చతుర్దశి యందొండె మహిత బుద్ధి
చేసి దండ ప్రణామంబు సేయు నరుఁడు
కాంచు మోక్షంబుఁ బ్రాణ నిర్గతము నందు. 87

అర్థము :- అగ్నీశ్వరుని+మ్రోలన్=అగ్నీశ్వర లింగమునకు ముందున్న అగ్నికుండిక= అగ్ని కుండమును. కూప=బావి యొక్క; తటదేశమునన్=తీరప్రదేశము నందు; దక్షకుండి= దక్షకుండము; ఉండున్=ఉండును;

అది=ఆ దక్షకుండము; సర్వ=సమస్తమైన; పాప+ఓఘ=పాపముల సమూహమను; ముదిర=మేఘములకు; ఝుంఝా+అనిలంబు=పెనుగాలి; ఆ కూపమునకు=ఆ బావికి; యామ్యంబునందు=దక్షిణ దిక్కు నందు; త్రైలోక్య జనయిత్రి=ముల్లోకములకు తల్లి అయిన; చలికొండ రాచూలి=హిమపర్వత రాజకుమారి; దాక్షాయణీదేవి=దక్షుని పుత్రిక (సతీదేవి); వెలసి+ఉండున్=ప్రసిద్ధికెక్కి యుండును;

దక్షకుండమునన్=దక్షకుండములో; తీర్థంబు+ఆడి=స్నానము చేసి; దక్షపుత్రిన్= దక్షుని కుమారి యగు; దాక్షాయణీ దేవిన్=సతీదేవిని; అర్థితో=కోరికతో; అసితపక్ష=శుక్లపక్షము నందలి; అష్టమీ+తిథియందున్+ఒండె=అష్టమీ తిథినాడు గాని; మఱి=లేక; చతుర్దశి యందున్+ఒండె=చతుర్దశీ తిథినాడు అని, మహిత బుద్ధి చేసి=గొప్పదగు మనసుతో; దండ ప్రణామంబు=సాష్టాంగ నమస్కారమును; చేయు+నరుఁడు=చేయునట్టి మానవుడు; ప్రాణ+ నిర్గతమునందు=ప్రాణములు పాయునపుడు; మోక్షంబున్=ముక్తిని; కాంచు=పొందును.

భావము :- అగ్నీశ్వర లింగమునకు ముందున్న అగ్నికుండము యొక్క తీరప్రదేశ మున దక్షకుండియను కూపము కలదు. అది సమస్తమైన పాపముల సమూహమనెడి

మేఘముల పాలిటి పెనుగాలి. ఆ బావికి దక్షిణము వైపుగా ముల్లోకముల తల్లి హిమవత్పర్వతరాజ పుత్రియైన దాక్షాయణీదేవి ప్రసిద్ధి చెందియున్నది. శుక్లపక్ష అష్టమీ తిథియందు గాని చతుర్దశీ తిథియందు గాని భక్తి యుక్తముగా దక్షకుండికలో స్నానము చేసి దాక్షాయణీదేవికి సాష్టాంగ నమస్కారము చేసిన నరుడు ప్రాణములు పోవు వేళ మోక్షమును పొందగలడు.

వ॥ ఆ యుత్తరంబున వీరభద్ర ప్రతిష్ఠితంబు; చెంగట నిబుతి లింగంబు; భీమనాథేశ్వరునకుఁ బడమట వరుణ ప్రతిష్ఠితంబగు వరుణలింగంబు; వరుణకుండంబునఁ దీర్థంబాడి వరుణ నక్షత్రంబున వరుణేశ్వర దేవుని దర్శించిన నరుండు భవబంధనంబులం బాయును; భీమేశ్వరు వాయువ్య దిగ్భాగంబున వాయు ప్రతిష్ఠితంబగు వాయు లింగంబుండు; వాయు కుండంబునఁ దీర్థంబాడి వాయు లింగంబును సందర్శించిన నరుండు మోక్షలక్ష్మింగూడు; సోమేశ్వర లింగంబు సోమ ప్రతిష్ఠితంబు; సోమ నక్షత్రంబున సోమకుండంబునఁ దీర్థంబాడి సోమేశ్వర దేవుని దర్శించిన నరుండు భుక్తి ముక్తి సంసిద్ధింబొందు. 88

అర్థము :- ఆ+ఉత్తరంబున=ఆ (దాక్షాయణీ దేవికి) ఉత్తర భాగము నందు, వీరభద్ర=వీరభద్రుని చేత; ప్రతిష్ఠితంబు=ప్రతిష్ఠింపబడిన వీరభద్రేశ్వర లింగము (కలదు). చెంగటన్=ఆ (వీరభద్రేశ్వర లింగమునకు) సమీపము నందు; నిబుతి లింగంబు=నిబుతిచే ప్రతిష్ఠింపబడిన నిబుతి లింగము (కలదు); భీమనాథ+ఈశ్వరునకున్=శ్రీ భీమేశ్వర స్వామికి; పడమట=పశ్చిమ దిక్కున; వరుణ ప్రతిష్ఠితంబు+ఉగు=వరుణునిచే ప్రతిష్ఠింపబడినదైన; వరుణలింగంబు=వరుణేశ్వర లింగము (కలదు); వరుణ కుండంబునన్=వరుణకుండము నందు; తీర్థంబు+ఆడి=స్నానము చేసి; వరుణ నక్షత్రంబున=శతభిషా నక్షత్రము నందు; వరుణేశ్వర దేవుని=వరుణేశ్వరుడను పేర ప్రసిద్ధుడైన ఈశ్వరుని; దర్శించిన=దర్శనము చేసికొన్న; నరుండు=మానవుడు; భవబంధంబులన్=సంసార బంధములను; పాయును=పోగొట్టుకొనును; భీమేశ్వరు+శ్రీ భీమేశ్వర స్వామి యొక్క; వాయువ్య దిక్+భాగంబున=వాయువ్యమను దిక్కున; వాయు ప్రతిష్ఠితంబు+అగు=వాయుదేవునిచే ప్రతిష్ఠింపబడినదగు; వాయులింగము=వాయులింగమను పేరుతో ప్రసిద్ధమైన శివలింగము; ఉండున్=కలదు; వాయు కుండంబునన్=వాయుకుండమను జలాశయములో; తీర్థంబు+ఆడి=స్నానము చేసి; వాయు లింగంబును=వాయ్వేశ్వరలింగమును; సందర్శించిన=దర్శనము చేసికొన్న; నరుండు=మనుజుడు; మోక్ష+లక్ష్మిన్=మోక్షమను సంపదను; కూడును=పొందును; సోమేశ్వర లింగంబు=సోమేశ్వరమను పేరుగల శివలింగము; సోమ ప్రతిష్ఠితంబు=చంద్రునిచే ప్రతిష్ఠింపబడినది; సోమనక్షత్రంబున=చంద్రనక్షత్రము నందు; సోమకుండంబునన్=సోమ కుండమను జలాశయములో; తీర్థంబు+ఆడి=స్నానముచేసి; సోమేశ్వర దేవుని=సోమేశ్వర స్వామిని; దర్శించిన=దర్శనము చేసికొన్న;

నరుండు=మానవుడు; భుక్తి+ముక్తి=భోగము మోక్షముల (తో కూడిన) సంసిద్ధిన్=ఫలితమును; పొందు=పొందును.

భావము :- దాక్షాయణీదేవికి ఉత్తర దిక్కున వీరభద్రుని చేత ప్రతిష్ఠింపబడిన వీరభద్రేశ్వర లింగము గలదు. దానికి సమీపమున నిఋతిలింగము కలదు. శ్రీ భీమేశ్వర స్వామికి పడమటి దిక్కున వరుణుడు ప్రతిష్ఠించిన వరుణేశ్వర లింగము కలదు. వరుణ కుండమున స్నానమాడి వరుణ నక్షత్రమైన శతభిష నక్షత్రమున్న సమయమున వరుణేశ్వరుని సందర్శించిన నరునకు భవబంధ విముక్తి కల్గును. శ్రీ భీమనాథ స్వామికి వాయువ్య దిక్కులో వాయుదేవుడు ప్రతిష్ఠించిన వాయ్వేశ్వరలింగము కలదు. వాయుకుండములో స్నానమాచరించి వాయ్వేశ్వర లింగమును దర్శించిన మానవుడు మోక్షలక్ష్మిని పొందును. చంద్రుడు ప్రతిష్ఠించిన శివలింగము సోమేశ్వర లింగము. చంద్ర నక్షత్రమున్న సమయమున సోమకుండములో స్నానమాడి సోమేశ్వర స్వామిని దర్శించిన నరునకు భోగమోక్షములు లభించును.

విశేషము :- సోమ నక్షత్రము :- రోహిణి, హస్త, శ్రవణము - ఈ మూడును సోమ నక్షత్రములు.

తే॥ బాదరాయణుఁ డత్యంత పరమ నిష్ఠ
సప్త సింధు సమీప దేశంబు నందుఁ
దపముఁ గావించి శంభు సంస్థాపనంబుఁ
జేసె నత్యంత భక్తి విశేషమమర. 89

అర్థము :- బాదరాయణుఁడు=వ్యాసుడు; అత్యంత=గొప్పదైన; పరమనిష్ఠన్=శ్రేష్ఠమగు భక్తి (శ్రద్ధ)తో; సప్త సింధు=సప్త గోదావరి యొక్క; సమీప+దేశంబునందున్=సమీప ప్రదేశము నందు; తపమున్=తపస్సును; కావించి=చేసి; అత్యంత=మిక్కుటమైన; భక్తి విశేషము= విశేషమైన భక్తి; అమరన్=కలుగగా; శంభు=శివుని; సంస్థాపనంబున్=ప్రతిష్ఠను; చేసెన్= చేసెను.

భావము :- వ్యాస మహర్షి పరమ నిష్ఠాగరిష్ఠుడై సప్త గోదావర తీరమున తపస్సు చేసి మిక్కుటమైన భక్తి విశేషముతో శివలింగ ప్రతిష్ఠను చేసెను.

క॥ పంచాక్షర మంత్రమును జ
పించుచు సత్యవతి సుతుఁడు పెద్దయుఁ గాలం
బంచిత యోగ సమాధి భ
జించెన్ దా సంప్రతిష్ఠ సేసిన్ శంభున్. 90

అర్థము :- సత్యవతి సుతుఁడు=సత్యవతికి కుమారుడైన వ్యాసమహర్షి; పెద్దయున్+ కాలంబు=చాలకాలము; పంచాక్షర మంత్రమును=శివపంచాక్షరీ మంత్రమును; జపించుచు= జపము చేయుచు; అంచిత=ఒప్పిదమయిన; యోగసమాధిన్=యోగసమాధిలో; తాన్=తాను; సంప్రతిష్ఠ+చేసిన=ప్రతిష్ఠ యొనరించిన; శంభున్=శివుని; భజించెన్=సేవించెను.

భావము :- వ్యాసమహర్షి చాలకాలము పంచాక్షరీ మంత్రమును జపించుచు యోగ సమాధిలో నుండి తాను ప్రతిష్ఠించిన శివుని సేవించెను.

విశేషము :- యోగము - "యోగ శ్చిత్త వృత్తి నిరోధః" - పాతంజలి యోగ దర్శనము 1వ పాదము - 2వ సూత్రము.

ఒక్క జ్ఞానమును మాత్రము స్థిరముగ నుంచి మిగిలిన జ్ఞానము లన్నింటిని నిరోధించుట-

సమాధి : "తదే వార్థమాత్ర నిర్భాసం స్వరూప శూన్యమివ సమాధిః" - పాతంజలి యోగ దర్శనము. 3వ పాదము, 3వ సూత్రము.

ధ్యానమున కేవల ధ్యేయము మాత్రమే గోచరింపగా (ప్రతీతి కల్గుచుండగా) 'నేను ధ్యానము చేయుచుంటి' నను విషయమును కూడ మఱచి గ్రహణ, కర్తృత్వ స్మృతి వీడిన సమయమున ధ్యానము యొక్క ప్రతీతి మాత్రమే మిగిలిన చిత్త స్వరూప శూన్య స్థితిని సమాధి అందురు.

వ॥ ఒక్క నాఁడమ్మహా దేవుండు త్రిగుణమూర్తులగు బ్రహ్మ విష్ణు మహేశానులచే సముపాస్యుండగుచు బాదరాయణునకుఁ బ్రత్యక్షం బగుటయు. 91

అర్థము :- ఒక్క నాఁడు=ఒక దినమున; త్రిగుణ మూర్తులు+అగు=(సత్త్వ రజస్తమో గుణ ప్రధానులగు) సృష్టి స్థితి లయ గుణములు కలవారైన; బ్రహ్మ+విష్ణు+మహేశానుల చే= బ్రహ్మ విష్ణు మహేశ్వరుల చేత; సముపాస్యుండు+అగుచు=బాగుగా ఉపాసింపబడిన వాడగుచు; ఆ+మహాదేవుండు=ఆ పరమేశ్వరుడు; బాదరాయణునకున్=వ్యాసమహర్షికి; ప్రత్యక్షంబు+అగుటయు=ప్రత్యక్షము కాగా. (తర్వాతి పద్యముతో అన్వయము).

భావము :- ఒకనాడు (సత్త్వ రజస్త మోగుణ ప్రధానులు) సృష్టి స్థితి లయ కారకులు నైన బ్రహ్మ విష్ణు మహేశ్వరులు సేవించుచుండగా ఆ పరమేశ్వరుడు వ్యాసమహర్షికి ప్రత్యక్షముకాగా.

మ॥ కురిసెం బువ్వుల వాన మత్తమధులిట్కోహలాన్వీతమై
విరిసెం దిక్కులు మందమందగతులన్ వీచె న్నభస్వంతుఁడున్
మొరసెం దుందుభులొక్కయుమ్మడి నభోమూర్ధావకాశంబునం
బొరసెన్ సమ్మద మెల్ల లోకముల కప్పుణ్యాహ కాలంబునన్. 92

అర్థము :- ఆ+పుణ్య+అహ+కాలంబునన్=ఆ పుణ్య దినము నందలి సమయమున; మత్త...న్వీతమై. మత్త=మదించిన; మధులిట్=తుమ్మెదల; కోలాహల=అలజడులతో; అన్వీతమై= కూడినదై; పువ్వుల వాన=పుష్ప వృష్టి; కురిసెన్=కురిసెను; దిక్కులు=దిశలు; విరిసెన్= వికసించెను; నభస్వంతుఁడున్=వాయుదేవుడు కూడ; మంద•మందగతిన్= మెల్లమెల్లని గమనముతో; వీచెన్=వీచెను; దుందుభులు=భేరీలు; ఒక్కుమ్మడి=ఒక్కసారిగా; నభస్= ఆకాశము యొక్క; మూర్ధ=శీర్షస్థానమైన; అవకాశంబునన్=వ్యవధానమునందు; మొరసెన్= మ్రోగెను; ఎల్ల లోకములకున్=లోకముల కన్నింటికిని; సమ్మదము=సంతసము; పొరసెన్= కలిగెను.

భావము :- ఆ దినము నందలి ఆ పవిత్ర సమయమున మత్తెక్కిన తుమ్మెదల ఝుంకార కోలాహలముతో కూడి పూలవాన కురిసెను. దిక్కులన్నియు వికసించినవి. వాయువు మెల్లగా వీచెను. ఆకాశమున దేవదుందుభులు ఒక్కుమ్మడిగా మ్రోగెను. లోకముల కన్నింటికి సంతసము కలిగెను.

క॥ ఆడిరి యచ్చర లేమలు
పాడిరి గంధర్వపతులు పరమ మునీంద్రుల్
గూడిరి బహువిధములఁ గొని
యాడిరి యందంద నద్భుతావహ భంగిన్. 93

అర్థము :- అచ్చర లేమలు=అప్సరః కాంతలు; ఆడిరి=నాట్యమాడిరి; గంధర్వ పతులు=గంధర్వ శ్రేష్ఠులు; పాడిరి=పాటలు పాడిరి; పరమ మునీంద్రుల్=శ్రేష్ఠులైన ముని సత్తములు; కూడిరి=సమావేశమైరి; అందందన్=అచ్చటచ్చటనే; అద్భుత+ఆవహ+ భంగిన్= అద్భుతమును కల్గించువిధముగా; బహువిధములన్=పలురకములుగా; కొనియాడిరి= ప్రశంసించిరి.

భావము :- అప్సరః కాంతలు నాట్యము చేసిరి. గంధర్వ రాజులు సంగీతమును గానము చేసిరి. మునీశ్వరులందరు జతగూడి అనేకరీతులలో అద్భుతమైన విధముగా కీర్తించిరి.

క॥ కొందఱు తాండవమాడిరి
కొందఱు పరిహాస కేలిఁ గొఱలిరి మఱియుం
గొందఱు బాహా యుద్ధం
బందంద ఘటించి రమ్మహాసంఘమునన్. 94

అర్థము :- ఆ+మహా సంఘమునన్=ఆ మహా సమూహములో; కొందఱు=కొంత మంది; తాండవము=తాండవ నృత్యమును; ఆడిరి=చేసిరి; కొందఱు=కొంతమంది; పరిహాస కేలిన్=పరిహాస క్రీడ యందు; కొఱలిరి=మించిరి; మఱియున్+కొందఱు=ఇంక కొందఱు; అందంద=అచ్చటచ్చటనే; బాహాయుద్ధంబు=పెనుగులాడుటలు; ఘటించిరి=చేసిరి.

భావము :- గుమికూడిన ఆ మహాసమూహములో కొంతమంది తాండవ నృత్యమును చేసిరి. కొంతమంది పరిహాసములతో క్రీడించిరి. మఱికొంతమంది (ముష్టి యుద్ధములను) పెనుగులాటలను చేసిరి.

విశేషము :- తాండవము :- ఉద్ధత కరణాంగ విక్షేపములు కలిగి ఆరభటీవృత్తి ప్రధానమైనది తాండవము. -అమరకోశము-పుట-147.

**వ॥ వ్యాసమహర్షి కనుగ్రహం బొసఁగి యప్పరమేశ్వరుండు కూడిన యశేష మునులను సర్వ యోగీశ్వరులను సకల దేవతల నుద్దేశించి యిట్లని యానతిచ్చె. 95**

అర్థము :- వ్యాసమహర్షికి=వ్యాసుడను మహర్షికి; అనుగ్రహంబు=అనుగ్రహమును; (దయను) ఒసఁగి=ఇచ్చి; ఆ+పరమ+ఈశ్వరుండు=ఆ పరమశివుడు; కూడిన=(అచట) సమావేశమైన; అశేష+మునులను=సమస్త ఋషులను; సర్వ+యోగి+ఈశ్వరులను= యోగి శ్రేష్ఠులనందఱను; సకల+దేవతలను=సమస్త దేవగణములను; ఉద్దేశించి= సంబోధించి; ఇట్లు+అని=ఈ విధముగా; ఆనతి+ఇచ్చె=ఆజ్ఞాపించెను.

భావము :- ఆ పరమేశ్వరుడు వ్యాసమహర్షిపై కృపాప్రసారము చేసి అచట కూడిన అసంఖ్యాకులైన మునులను యోగీశ్వరులను సమస్త దేవతలను సంబోధించి ఈ విధముగా ఆజ్ఞాపించెను.

**క॥ ఈ యున్న వార లందఱు**
**నా యానతి వినుఁడు నెమ్మనంబుల లోనం**
**బాయం బెట్టుఁడు సంశయ**
**మీ యర్థము వేదములకు నెక్కుడు సుండీ! 96**

అర్థము :- ఈ+ఉన్నవారలు=ఇచ్చట ఉన్నవారు; అందఱు=అందఱును; నా+ఆనతిన్=నా ఆజ్ఞను; వినుఁడు=వినుడు; నెఱ+మనంబుల లోనన్=నిండు మనసులలో; సంశయము=సందేహము; పాయన్+పెట్టుఁడు=వదలిపెట్టుడు; ఈ+అర్థము=ఈ (చెప్పు) విషయము; వేదములకున్=వేదములకన్నను; ఎక్కుడు+సుండీ=అధికమైనది సుమా!

భావము :- ఇక్కడ ఉన్నవారందఱు నా ఆజ్ఞను వినుడు. మీ నిండు మనసులలో సందేహమును వదలిపెట్టుడు. నేను చెప్పు ఈ విషయము వేదములకన్నను అధికమైనది సుమా!

తే॥ అర్కుడెబ్బంగి నభమున కాభరణము
భువనముల కెల్ల నాభంగి భూషణంబు
దక్షవాటీ పురము భోగ మోక్ష విభవ
పావనం బందు విశ్వాసపరులు గంద్రు. 97

అర్థము :- అర్కుఁడు=సూర్యుడు; ఏ+భంగిన్=ఏ విధముగా; నభమునకు= గగనమునకు; ఆభరణము=భూషణమో; ఆ+భంగి=ఆ విధముగ; భువనములకు+ ఎల్లన్=లోకముల కన్నింటికిని; దక్షవాటీపురము=దక్షారామ నగరము; భూషణంబు= ఆభరణము; భోగ=ఐహికమైన సుఖముల యొక్క; మోక్ష=ముక్తి యొక్క; విభవ= వైభవము చేత; పావనంబు=పవిత్రమైనది; అందు=ఆ క్షేత్రము నందు; విశ్వాసపరులు= నమ్మకము కలవారు; కంద్రు=అగుడు.

భావము :- సూర్యుడు ఏ విధముగా ఆకాశమునకు ఆభరణమో అదే విధముగా లోకములన్నింటికిని దక్షారామ నగరము అభరణము. భోగ మోక్షముల యొక్క వైభవము చేత పవిత్రమైనది. కనుక ఆ దక్షారామ క్షేత్రము నందు విశ్వాసపరులు కండు.

విశేషము :- అలంకారము - ఉపమ.

క॥ త్రిభువనముల యందును మా
కభిమతములు పెక్కులైన నారామము లం
దభిమాన మింత సేయము
విభవాస్పదమైన దక్షువీటిం బోలెన్. 98

అర్థము :- మాకు=మాకు; త్రిభువనములయందును=మూడు లోకములందును; అభిమతములు=ప్రియమైనవైన; పెక్కులు=అనేకములైన; అరామములు=విహార క్షేత్రములు (కలవు); ఐనన్=అయినను; అందు=వానియందు; విభవ+ఆస్పదము+ఐన=వైభవమునకు స్థానమైన; దక్షువీటిన్+పోలెన్=దక్షారామమును వలె; ఇంత=ఇంతటి గొప్ప; అభిమానము+ చేయము=ప్రేమింపము.

భావము :- మాకు ముల్లోకములలోను ప్రియములైన ఎన్నియో విహార క్షేత్రములు కలవు. అయినను వానన్నింటిలోను ఈ దక్షారామమును వలె మరిదేనిని (మరేయితర క్షేత్రమును) అభిమానింపము.

తే॥ వినుఁడు సత్యంబు సత్యంబు వెండి సత్య
మాత్మలోన విచారించి యానతిత్తు
దక్షవాటంబు కంటెఁ దీర్థంబు నిఖిల
మేదినీ మండలంబున లేదు లేదు. 99

అర్థము :- ఆత్మలోనన్=మనస్సులో; విచారించి=ఆలోచించి; ఆనతి+ఇత్తు= ఆజ్ఞాపించుచుంటిని; వినుఁడు=వినుడు; నిఖిల=సమస్తమైన; మేదినీ మండలమున+ భూమండలము నందు; దక్షవాటంబుకంటెన్=దక్షారామమున కన్న (మించిన) తీర్థంబు=పవిత్ర తీర్థము; లేదు+లేదు=లేనేలేదు (అనుట) సత్యంబు=నిజము; సత్యంబు=నిజము; వెండి+సత్యము=మఱియు నిజము.

భావము :- మనసులో ఆలోచించి చెప్పుచుంటిని. వినుడు. ఈ సమస్త భూమండలము నందును దక్షారామమును మించిన పవిత్ర తీర్థము లేనేలేదు అనుట ముమ్మాటికి నిజము.

తే॥ వాఁడి గోర్గొండిఁ గన్నులు దోఁడి యైన
నడుగు లడిదంబు చేతఁ జక్కడఁచి యైన
నొండు కడ కేఁగుటలు మాని యుండవలయుఁ
డక్కు మాటలు దక్ష వాటంబు నందు. 100

అర్థము :- వాఁడి=పదునైన; గోర్గొండిన్=మంగలి గోళ్ళను తీయు ఇనుప సలాకతో; కన్నులున్=కన్నులను; తోఁడి+ఐనన్=పెఱికియైనను; అడుగులు=పాదములను; అడిదంబు చేతన్=కత్తితో; చక్కడఁచి+ఐనన్=నఱికియైనను; ఒండుకడకు+ఏఁగుటలు=ఇతరమైన ప్రదేశములకు వెళ్ళుటలు; టక్కుమాటలు=మాయమాటలు; మాని=విడిచిపెట్టి; దక్షవాటంబున+అందు=దక్షారామములో; ఉండవలయున్=నివసింపవలయును.

భావము :- గోళ్ళను తీయు పదునైన ఇనుప సలాకతో కనులను పెఱికియైనను; పాదములను కత్తితో నఱికియైనను; మాయమాటలను విడిచిపెట్టియు ఇతర ప్రదేశములకు వెళ్ళుటలు మాని యీ దక్షారామమున నివసింపవలెను.

క॥ తిష్ఠ న్మూత్రునకైన వ
సిష్ఠ ప్రతి మానుఁడైన శిష్టునకైనన్
నిష్ఠాత్మ గలిగెనేనియు
నిష్ఠా కాలంబు ముక్తి నియతం బచటన్. 101

అర్థము :- తిష్ఠత్+మూత్రునకు+ఐనను=నిలువబడి మూత్ర విసర్జన చేయువాని కైనను (ఆచార రహితునకైనను); వసిష్ఠ=వసిష్ఠమునితో; ప్రతిమానుఁడు+ఐన=సమానుడైన; శిష్టునకు+ఐనన్=శిష్టాచార సంపన్నునకైనను; నిష్ఠా+ఆత్మ=భక్తి శ్రద్ధలుగల మనసు; కలిగెన్+ ఏనియు=కల్గినచో; అచటన్=ఆ దక్షారామ క్షేత్రములో నిష్ఠాకాలంబు=నివసించిన కాలములోనే; ముక్తి=మోక్షము; నియతంబు=నిశ్చితము.

భావము :- నిలుచుండి మూత్ర విసర్జన చేయు ఆచార హీనుడైనను; వసిష్ఠ మహర్షితో సమానుడైన సదాచార సంపన్నుడైనను; మనసులో భక్తిశ్రద్ధలను కల్గియున్నచో ఈ క్షేత్రము నందు (నిష్ఠాకాలము) నివసించిన కాలము నందే మోక్షము కల్గుట నిశ్చయము.

ఆ॥ బ్రహ్మహత్య మద్యపానంబు గురు తల్ప
గమన మాదిగాఁగఁ గలుగునట్టి
పాతకంబు లపుడె పాయు మానవులకు
దక్షవాటి భీమ దర్శనమున. 102

అర్థము :- బ్రహ్మహత్య=భూసుర హత్య; మద్యపానంబు=సురాపానము; గురుతల్ప గమనము=గురు భార్యాగమనము; ఆదిగాఁగన్=మొదలుగా; కలుగునట్టి=సంభవించునట్టి; పాతకములు=పాపములు; మానవులకు=మనుజులకు; దక్షవాటి=దక్షారామము నందలి; భీమ=శ్రీ భీమేశ్వర స్వామిని; దర్శనమున=దర్శించుటచే; అపుడె=వెంటనే; పాయున్= పోవును.

భావము :- మానవులకు బ్రహ్మహత్య మద్యపానము గురు భార్యాగమనము మొదలైన వానివలన కలుగు పాపములు దక్షారామము నందలి శ్రీ భీమేశ్వరస్వామిని దర్శించిన వెంటనే తొలగిపోవును.

విశేషము :- పంచమహాపాతకములు భీమ. 3-24 చెంత తెలుపబడినవి.

వ॥ అని యిట్లర్థేందు మౌళి యానతిచ్చి యంతర్ధానంబు చేసెఁ దదనంతరం బా హరి విరించి పురందరాదులగు బృందారకులును సనకసనందన సనత్కుమార సనత్సుజాతులగు బ్రహ్మయోగీశ్వరులును మార్కండేయ మందపాల మౌద్గల్య మాండవ్య మంకణాదులగు మహామునులును బాదరాయణు నభినందించుచు నిజస్థానంబులకుం జనిరి. 103

అర్థము :- అని+ఇట్లు=అని ఈ ప్రకారముగా; ఆనతి+ఇచ్చి=ఆజ్ఞాపించి; అర్థ+ ఇందు+మౌళి=అర్ధ చంద్రుని సిగ యందు గల ఈశ్వరుడు; అంతర్ధానంబు+ చేసెన్= అదృశ్యుడయ్యెను; తత్+అనంతరంబు=ఆ తరువాత; ఆ+హరి+విరించి+ పురందర=ఆ విష్ణువు; బ్రహ్మ, ఇంద్రుడు; ఆదులు+అగు=మొదలగు; బృందారకులును=దేవతలును; సనక+సనందన+సనత్కుమార+సనత్సుజాతులు+అగు=సనకుడు; సనందనుడు; సనత్కు మారుడు; సనత్సుజాతుడు అను; బ్రహ్మయోగి+ఈశ్వరులును=తత్త్వజ్ఞానులైన యోగి శ్రేష్ఠులును; మార్కండేయ=మార్కండేయుడు; మందపాల=మందపాలుడు; మౌద్గల్య=

మౌద్గల్యుడు; మాండవ్య=మాండవ్యుడు; మంకణ=మంకణుడు; ఆదులు+ అగు=మొదలగు; మహామునులును=మహర్షులును; బాదరాయణున్=వ్యాసమహర్షిని; అభినందించుచు= మెచ్చుచు; నిజస్థానంబులకున్=తమతమ నివాస ప్రదేశములకు; చనిరి=వెళ్ళిరి.

భావము :- అని ఈ ప్రకారముగా ఆజ్ఞాపించి శంకరుడు అదృశ్యుడయ్యెను. ఆ తరువాత బ్రహ్మ, విష్ణువు, ఇంద్రుడు మొదలగు దేవతలును, సనకుడు సనందనుడు సనత్కుమారుడు సనత్సుజాతుడు అను బ్రహ్మ యోగీశ్వరులు; మార్కండేయుడు మందపాలుడు మౌద్గల్యుడు; మాండవ్యుడు మంకణుడు మొదలైన మహర్షులును వ్యాసమహర్షిని ప్రశంసించుచు తమతమ నివాసములకు వెళ్లిరి.

సీ॥ సప్త గోదావర స్నానంబు, రామ నా
థావ లోకనము, పిత్రర్చనంబు,
రామగయా పితృ శ్రాద్ధంబు గౌరీ జ
నార్దన రుద్ర సన్నామ జపము,
పరఁగ మహా దివ్య భావ నానార్చనా
భవన ప్రదక్షిణ ప్రక్రమంబు
పంచాక్షరీ మంత్ర పారాయణ జపంబు
పాశుపతాచార పరమ నియతి

తే॥ సమయ మిది సర్వదేవతా సార్వభౌము
భుక్తి ముక్తి ప్రదాయకు భువన భర్త
భీమనాథేశ్వరేశ్వర స్వామిఁ గొలుచు
భక్తులకు నెల్ల నాగమ పద్ధతి యిది. 104

అర్థము :- సప్త గోదావర+స్నానంబు=సప్త గోదావరిలో స్నానము; రామనాథ+ అవలోకనము=రామేశ్వరుని దర్శనము; పితృ+అర్చనము=పితృయజ్ఞము; రామగయా= రామగయ అను పవిత్ర ప్రదేశమున; పితృశ్రాద్ధంబు=పితరులకు శ్రాద్ధములు పెట్టుట; గౌరీ+ జనార్దన+రుద్ర=గౌరీదేవి; జనార్దన స్వామి; రుద్రుల యొక్క; సత్+నామ జపంబు=శ్రేష్ఠమగు నామముల యొక్క జపము; పరఁగన్=సముచితముగా; మహాదివ్య=గొప్పదైన దివ్యత్వముతో కూడిన; నానా=అనేక విధములయిన; భావ=భావనలతో; అర్చన=సేవలతో (కూడిన); భవన=స్థానముల; ప్రదక్షిణ ప్రక్రమంబు=ప్రదక్షిణముల ఆరంభము;

తీర్థమైన దక్షారామము సమస్త తీర్థములకు నిలయము. సర్వ విద్యలకు సాముకూటము; వైభవ స్థానము, ఈ నగరము శంకరుని అంతఃపురము.

వ॥ ఇట్టి మహా మహిమంబు గల దక్షారామంబున నభివసింపుదము, భీమ మండలంబు దర్శింపుదము, సప్త గోదావరంబున నాడుదము. వృద్ధగంగా జలంబులఁ దేలుదము, తుల్య భాగా తోయంబుల మునుఁగుదము; కణ్వవాహిని నవగాహింతము, కౌంతేయంబున నోలలాడుదము, లవణ పయోనిధి గంగా సంగమంబుల నభిషేకింతము రండని హర్షోత్కర్షంబున రోమహర్షణ తనయుండు సూత్యాహ సంభవుండు నిఖిల పురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుండైన సూతుండు పల్కిన విని నైమిశారణ్య పుణ్యక్షేత్రంబున ద్వాదశ వార్షిక పరిమితంబైన సత్రయాగంబునఁ గూడిన శౌనకాది మహామునులు యజ్ఞావసాన సమయంబున శ్రీ మన్మహాదేవుని సందర్శింప జనిరి. ఇది పంచాశత్ఖండమండితంబును, సనత్కుమార సంహితాది బహుసంహితా సంధానంబును నైన స్కాంద పురాణంబునందు గోదావరీ ఖండంబు నందుఁ జెప్పంబడిన భీమ ఖండంబు; భీమేశ్వర మాహాత్మ్యంబు, భీమేశ్వర పురాణంబనం బరఁగు నిమ్మహా ప్రబంధంబు వ్రాసినఁ బఠించిన, వినినఁ, బుస్తకంబర్చన చేసిన, నారాధించిన, శ్రీ భీమనాథేశ్వరుం డాయురారోగ్యైశ్వర్యంబులు, శాశ్వత మోక్షపదంబును గృపసేయు. 107

అర్థము :- ఇట్టి ఈ విధమైన; మహా మహిమంబున్+కల=ఘనమైన గొప్పతనము గలిగిన; దక్షారామంబునన్=దక్షారామ తీర్థము నందు; అభివసింపుదము=నివసింతము; భీమమండలంబు=భీమమండలమంతటిని; దర్శింపుదము=చూతము; సప్త గోదావరంబునన్=సప్తగోదావరములో; ఆడుదము=జలకమాడుదము; వృద్ధ గంగా+జలంబులన్=వృద్ధ గంగ యొక్క నీటిలో; తేలుదము=తేలియాడుదము; తుల్య భాగా+తోయంబులన్=తుల్యభాగా నది నీటిలో; మునుఁగుదము=క్రుంకులిడుదము; కణ్వ వాహినిన్=కణ్వవాహిని యందు; అవగాహింతము=స్నానము చేయుదము; కౌంతేయంబునన్=కౌంతేయమను నది యందు; ఓలలాడుదము=జలక్రీడ లాడుదము; లవణపయోధిన్=ఉప్పు సముద్రమున; గంగా+సంగమంబులన్=గంగానది కలియుచోటు లందు; అభిషేకింతము=స్నానముచేయింతము; రండు+ అని=రండు అని; హర్ష+ఉత్కర్షంబున=సంతోషము యొక్క అతిశయము చేత; రోమహర్షణ తనయుండు=రోమహర్షణముని యొక్క కుమారుడు; సూత్య+అహ+సంభవుడు= సూత్యయను యజ్ఞము చేసిననాడు పుట్టినవాడు; నిఖిల పురాణ=సమస్త పురాణములను;

వ్యాఖ్యాన=వివరించి చెప్పు; వైఖరీ=(వాక్కు) పద్ధతితో; సమేతుండు+ఐన=కూడినవాడైన; సూతుండు=సూతముని; పల్కిన=పలుకగా; విని=ఆలకించి; నైమిశ+అరణ్య=నైమిశారణ్య మనెడు; పుణ్యక్షేత్రంబున=పవిత్ర ప్రదేశమున; ద్వాదశ వార్షిక=పండ్రెండు సంవత్సరముల; పరిమితంబు+ఐన=కాలపరిమితి గల; సత్రయాగంబునన్=సత్రమనుపేరుగల యాగము నందు; కూడిన=కలసిన, శౌనక+ఆది=శౌనకుడు మొదలైన; మహామునులు=మహర్షులు; యజ్ఞ+అవసాన+సమయంబున=యజ్ఞము యొక్క చివరి సయము నందు; శ్రీమత్+మహా దేవుని=శ్రీమంతుడైన శ్రీ భీమేశ్వర స్వామిని; సందర్శింపన్=దర్శించుకొనుటకై; చనిరి=వెళ్ళిరి; ఇది=ఈ గ్రంథము; పంచాశత్+ ఖండ=ఏబది ఖండములతో; మండితంబును=అలంకరింపబడి నదియు; సనత్కుమారసంహిత=సనత్కుమార సంహిత; ఆది=మొదలైన; బహుసంహితా= అనేక సంహితల యొక్క; సంధానంబునున్+ఐన=కూర్పయిన; స్కాంద పురాణంబునందు= స్కాందపురాణములోని; గోదావరీ ఖండంబునందున్=గోదావరీ ఖండములో; చెప్పన్+పడిన= చెప్పబడినట్టి; భీమఖండంబు=భీమఖండమనియు; భీమేశ్వర మాహాత్మ్యంబును=శ్రీ భీమేశ్వర మాహాత్మ్యమనియు; భీమేశ్వర పురాణంబు+అనన్=శ్రీ భీమేశ్వర పురాణమనియు, పరఁగున్= ప్రసిద్ధికెక్కిన; ఈ+మహా ప్రబంధంబు=ఈ గొప్ప గ్రంథమును; వ్రాసినన్=లిఖించినను; పఠించిన=చదివినను; వినినన్=వినినను; పుస్తకంబు=పుస్తకమును; అర్చన చేసినన్=పూజించి నను; ఆరాధించినన్=కొలిచినను; భీమేశ్వరుండు=శ్రీ భీమేశ్వర స్వామి; ఆయుః=ఆయువును; ఆరోగ్య=ఆరోగ్యమును; ఐశ్వర్యంబులు=సంపదలను; శాశ్వత+మోక్షపదంబునున్=శాశ్వతమైన మోక్ష స్థానమును; కృపసేయు=దయచేయును.

భావము :- ఇట్టి గొప్ప మహత్త్వము గల దక్షారామ తీర్థమున నివసించెదము. భీమ మండలమంతటిని చూచెదము. సప్త గోదావరము; వృద్ధ గంగ తుల్యభాగ; కణ్వ వాహిని కౌంతేయము అను నదులందు పవిత్ర స్నానములు చేయుదము. గంగ సముద్రమున కలియు చోటులందు అభిషేకము చేయుదము. రండని సంతోషాతిశయముతో రోమహర్షుణుని కుమారుడు; సూత్యాహ సంభవుడు; సమస్త పురాణములను వివరించి చెప్పు కథకుడు నైన సూతమహర్షి పలుకగా నైమి శారణ్య పవిత్ర ప్రదేశమున పండ్రెండు సంవత్సరముల కాలముపాటు చేయు యజ్ఞము సమయమున కలిసిన శౌనకాది మునులందఱు ఆ సత్రయాగము పూర్తియైన పిమ్మట శ్రీ భీమేశ్వర స్వామిని దర్శించుటకై వెళ్ళిరి.

ఈ గ్రంథము ఏబది ఖండములతో కూడుకొన్నదియు; సనత్కుమార సంహిత మొదలగు ఎన్నియో సంహితలతో కూర్పబడిన స్కాందపురాణములోని గోదావరీ ఖండము నందు చెప్పబడిన భీమఖండమనియు; భీమేశ్వర మాహాత్మ్యమనియు; భీమేశ్వర పురాణమనియు ప్రసిద్ధమై యున్నది. ఈ గొప్ప గ్రంథమును వ్రాసినను చదివినను వినినను

పుస్తకమును పూజించినను ఆరాధించినను శ్రీ భీమేశ్వర స్వామి ఆయురారోగ్య ఐశ్వర్యములను; మోక్షమును ప్రసాదించును.

ఉ॥ వైభవ పాకశాసన! సుపర్వమహీధర ధైర్యవర్తి! గే
యోభయ వంశదీపక! సముద్ధత వీర విరోధి మండల
క్షోభకర ప్రతాప! ఫణికుండల భక్తినిధీ! దిగంత గం
ధేభ కట ద్వయ ద్వయస హృద్యయశస్సరిదంబునిర్ఝరా! 108

అర్థము :- వైభవ=సంపదలో; పాకశాసన=ఇంద్రుడా! సుపర్వ+మహీధర=దేవతల కొండయైన మేరు పర్వతము వలె; ధైర్యవర్తి=ధీరమైన వర్తనము కలవాడా! గేయ=స్తుతింప తగిన; ఉభయ వంశ=తలిదండ్రులిద్దరి వంశములను; దీపక=ప్రకాశింప జేయువాడా! సము...ప్రతాప. సముద్ధత=గర్వితులైన; వీర=వీరులైన; విరోధిమండల=శత్రువుల సమూహమును; క్షోభకర=కలతపెట్టగల; ప్రతాప=శౌర్యము కలవాడా! ఫణికుండల=(సర్పములే చెవికుండలములుగ గల) శంకరుని యందు; భక్తినిధీ=భక్తికి గనియైన వాడా! దిగంత...నిర్ఝరా. దిక్+అంత=దిక్కుల యొక్క చివరలందు గల; గంధ+ఇభ=మదపుటేనుగుల; కటద్వయ ద్వయస=రెండు చెక్కిళ్ళ బంటియైన; హృద్య=మనోజ్ఞమైన; యశస్=కీర్తియనెడు; సరిత్=నదియందలి; అంబు+నిర్ఝర=నీటి ప్రవాహము కలవాడా!

భావము :- వైభవము నందు దేవేంద్రుడవైన వాడా! మేరు పర్వతము వలె స్థిరమైన వాడా! గర్వించిన శత్రువీరుల సమూహమును క్షోభింపజేయు పరాక్రమము గలవాడా! శివభక్తాగ్రేసరుడా! దిగ్గజముల చెక్కిళ్ళు మునుగుసంతటి మనోహరమగు యశోనదీ జలప్రవాహము కలవాడా! ఓ అన్నయమంత్రీ!

విశేషము :- ద్వయసచ్ - ప్రత్యయము. కటద్వయసము=చెక్కిళ్ళ బంటి, - చెక్కిళ్ళు మునుగు సంతటి లోతైన.

కీర్తికిని సరస్సునకు అభేదము గావున రూపకము.

"కాంతా కుచద్వయద్వయసవాఃపూరవంతంబులయ్యె." - (కాశీ. 3-23)

క॥ రామాంబా నందన! సం
గ్రామ జిత ధనంజయా! పరాక్రమ రామా!
స్వామి ద్రోహర గండ! మ
హామాత్య కిరీట శేఖరామాత్యమణీ! 109

అర్థము :- రామాంబా=రామాంబా దేవికి; నందన=కుమారుడవైనవాడా!; సంగ్రామ=యుద్ధమున; జిత=జయింపబడిన; ధనంజయా=అర్జునుడవైన వాడా! (అందఱను ఆనందింపజేయువాడా!); పరాక్రమ=పరాక్రమము నందు; రామా=శ్రీరామునివంటివాడా; స్వామిద్రోహరగండ='స్వామి ద్రోహరగండ' యను బిరుదము కలవాడా!; మహా...మణీ. మహా+అమాత్య=గొప్ప మంత్రుల యొక్క; కిరీట=కిరీటము లందలి; శేఖర=శ్రేష్ఠమైన; అమాత్యమణీ=మణి వంటి మంత్రీ!

భావము :- రామాంబాదేవికి కుమారుడవైన వాడా! అర్జునుని మించిన వీరుడా! పరాక్రమమునందు శ్రీరాముడా! స్వామి ద్రోహులపాలిటి శత్రువువై "స్వామి ద్రోహరగండ" అను బిరుదమును పొందినవాడా! మహామంత్రుల కిరీటములలోని శ్రేష్ఠమైన మణివంటి మంత్రి పుంగవుడా! ఓ అన్నయమంత్రీ!

విశేషము :- 'స్వామిద్రోహరగండ' అనునది బిరుదమని శృంగార నైషధము నందు (1-30) కలదు. "స్వామిద్రోహరగండ లాంఛనునకున్.." కాని ఈ బిరుదము శృంగార నైషధమున మామిడి నామనమంత్రికి కలదని చెప్పెను. ఇచట బెండపూడి అన్నమంత్రికి కూడ కలదని చెప్పెను.

భుజంగ ప్రయాతము : ప్రధూత్యార్య సామంత రక్షాధురీణా!
విధూత్తంస సేవా ప్రవృత్తాంతరంగా!
మధూళీ మదాసార మాధుర్య వాక్యా!
బుధారాధనాసార భోజావతారా! 110

అర్థము :- ప్రధూ...ధురీణా!. ప్రధూత్యార్య=అధికముగ వణకింపతగిన, సామంత=సామంత రాజులను; రక్షా=రక్షించుట యందు; ధురీణా=నేర్పరియైనవాడా!; విధూ...రంగా!; విధు+ఉత్తంస=చంద్రశేఖరుడగు శివుని యొక్క; సేవా=పూజాదులందు; ప్రవృత్త=ప్రవేశించిన; అంతరంగా=మనసు కలవాడా!; మధూ...వాక్యా!. మధూళీ=తీయ మామిడి; మద=తేనె యొక్క; ఆసార=ధారాపాతమువలె; మాధుర్య=తీయదనము గల; వాక్యా=మాటలు కలవాడా!; బుధా...తారా. బుధ=పండితులను; ఆరాధనా=పూజించుట యందు; సార=అత్యుత్తముడవైనవాడా!; భోజ+అవతారా=భోజరాజు యొక్క అవతారమైనవాడా!

భావము :- అవినయము చేత వణకిపోదగిన సామంత రాజులను గూడ రక్షించుట యందు నిపుణుడవైన వాడా! పరమేశ్వర పూజాలగ్న చిత్తము కలవాడా! తీయ మామిడి పండు రసమువలె తేనెధారల వర్షము వలె తీయగ మాటాడువాడా! కవిపండితులను పోషించుటలో రాజశ్రేష్ఠుడైన భోజరాజు నవతారమైనవాడా! ఓ అన్నయమంత్రీ! -

విశేషము :- భుజంగ ప్రయాత వృత్తమున నాలుగు 'య' గణము లుండును. యతి మైత్రి స్థానము ఎనిమిదవ అక్షరము.

దేవ వేశ్యా భుజంగుడు అయిన భుజంగ భూషణుని ప్రబంధమును భుజంగ ప్రయాత వృత్తముతో శ్రీనాథ మహాకవి పరిసమాప్తము చేయుట గమనార్హ విషయము.

గద్యము :- ఇది శ్రీమత్కమలనాథ పౌత్ర మారయామాత్యపుత్ర సుకవిజన విధేయ శ్రీనాథ నామధేయ ప్రణీతంబైన శ్రీ భీమేశ్వర పురాణంబను మహా ప్రబంధంబు నందు సర్వంబును షష్ఠాశ్వాసంబు.

ఇది

శ్రీ భీమేశ్వర పురాణ షష్ఠాశ్వాసమునకు

**దక్షిణకాశిక**

అను ప్రతిపదార్థ భావ విశేష సహిత వ్యాఖ్యానము

**సర్వము సంపూర్ణము**

నమశ్శివాయైచ నమశ్శివాయ

# శ్రీ భీమేశ్వర పురాణము
## దక్షిణ కాశికా వ్యాఖ్యాన సహితము
## అకారాది పద్య గద్య సూచిక

### అ


| | | |
|---|---|---|
| అంత | 2-38 | 159 |
| అంత | 2-47 | 168 |
| అంత | 4-142 | 533 |
| అంత | 5-117 | 657 |
| అంత దేవ సిద్ధ సాధ్య.... | 3-135 | 361 |
| అంత నన్నుం జేరఁ బిలిచి | 2-113 | 223 |
| అంత నీలకంఠుఁడు | 5-27 | 599 |
| అంతర్వాణి భజించెఁ | 2-58 | 184 |
| అంతేవాసులు నీవుఁ | 2-123 | 228 |
| అందు వాపి తటాక | 3-172 | 382 |
| అంధ్రభూ భువన మధ్యము | 3-50 | 299 |
| అంబ పార్వతి నాతోడ | 2-5 | 137 |
| అంబుధర శ్రేణి | 1-94 | 88 |
| అంబుధిమేర తూర్పునకు... | 5-77 | 631 |
| అకుటిల నయ మార్గా | 1-125 | 134 |
| అక్కథకుండు శౌనకాది | 2-2 | 136 |
| అక్కథకుండు శౌనకాది | 3-2 | 251 |
| అక్కథకుండు శౌనకాది | 4-2 | 434 |
| అక్కథకుండు శౌనకాది | 5-2 | 579 |
| అక్కథకుండు శౌనకాది | 6-2 | 712 |
| అక్కటా యేమి చెప్ప | 2-100 | 212 |
| అఖిల కాలంబు నొక | 6-25 | 729 |
| అఖిల తీర్థ ప్రదేశంబు | 4-34 | 451 |
| అఖిల తీర్థోత్తమోత్తమంబు | 4-18 | 441 |
| అఖిల దిగ్దంతి దంతా | 1-81 | 78 |
| అగస్త్యేశ్వర రామేశ్వర | 3-173 | 383 |
| అగురుం గుంకుమ | 5-122 | 659 |
| అగ్నికుండమనఁగ నచ్చోట | 6-85 | 779 |
| అగ్నీశ్వరుని మ్రోల | 6-87 | 780 |
| అగ్నిహోత్రంబు దాన | 3-122 | 354 |
| అగ్రజుండైనను | 6-12 | 720 |
| అఘమర్షణ స్నాన మాడిరి | 6-24 | 729 |
| అఘముల కొండు | 3-195 | 401 |
| అజ్ఞానంబున హరున | 2-8 | 138 |
| అచట దానంబు | 3-148 | 368 |
| అచ్చమగు భోగమోక్షముల | 2-19 | 145 |
| అచ్యుతుని మీఁదఁ జల్లె | 5-121 | 659 |
| అటఁజని యొక్క చోటఁ | 4-38 | 454 |
| అటమీఁద సిద్ధేశ్వర | 3-111 | 346 |
| అటమీఁది వృత్తాంతం | 2-161 | 248 |
| అట వరుణేశ్వరంబన | 3-142 | 365 |
| అటు పౌరవీథి చక్కటిఁ | 2-103 | 216 |
| అట్టి దివ్య క్షేత్రంబునందు | 4-155 | 546 |
| అట్టి యెడ మున్ను | 5-123 | 660 |
| అడుగవలసిన యర్థంబ | 5-156 | 682 |
| అతి విశుద్ధాత్మ | 5-151 | 680 |
| అదిగావున సుధాపానంబు | 4-55 | 466 |
| అది భవాబ్ధి తరణి | 3-114 | 348 |
| అది యాదిగఁ దీర్థంబులు | 3-162 | 376 |
| అదియునుం గాక | 5-150 | 680 |
| అదియును | 1-25 | 24 |
| అదె పట్టిన స్థాన | 3-55 | 305 |
| అదె మా స్వామి | 4-176 | 558 |
| అదె సంవేద్యము | 3-54 | 304 |
| అద్వయ! సత్య! క్షరాక్షర | 4-116 | 510 |
| అధికమైన తపంబు | 5-128 | 667 |
| అధ్యయన శ్రుత దాన | 3-138 | 364 |
| అనంతరంబ | 2-129 | 231 |
| అనంతరంబ | 4-126 | 519 |
| అనంతరంబ కతిపయ | 2-69 | 193 |
| అనంతరంబ కుంభ. పులిన | 3-57 | 307 |
| అనంతరంబ యంతరంగంబు | 3-4 | 252 |
| అనంతరంబ యేము | 2-152 | 243 |
| అనంతరంబ యొక్కింత | 2-60 | 185 |
| అనంతరం బమ్మునీశ్వరులు | 6-20 | 728 |
| అనంతరం బాతుల్యభాగా | 2-86 | 204 |
| అనంతరం బాబహిర్గేహ | 3-181 | 389 |
| అనంతరం బామోదకాపూప | 4-91 | 492 |
| అనంతరం బాయంబికా | 4-151 | 539 |
| అనంతరం బా వివస్వంతుండు | 5-4 | 580 |
| అనంతరం బా శివుండు | 5-48 | 610 |
| అనఁగఁ బ్రహృష్ట చిత్తుఁడయి | 6-10 | 719 |
| అనవధానత నావగింజంత | 2-158 | 247 |

| | | |
|---|---|---|
| అని కాశీనగరంబునందుఁ | 4-9 | 437 |
| అని కుంభసంభవుండు | 4-42 | 456 |
| అని కుంభసంభవునకు | 2-160 | 248 |
| అని చూపి చెప్పి కుంభజుఁ | 3-56 | 307 |
| అని చెప్పిన విని | 3-219 | 430 |
| అని దక్షారామ | 2-22 | 147 |
| అని దక్షారామ | 3-175 | 384 |
| అని దక్షారామ | 3-68 | 320 |
| అనినం గరుణా సామ్రాజ్య | 6-76 | 764 |
| అనినఁ బారాశర్యుండు | 2-94 | 209 |
| అనినఁ బారాశర్యునకు | 3-12 | 259 |
| అనిన నంబవచనంబులు | 2-157 | 246 |
| అనిన నవ్వాలుఁగంటికి | 2-119 | 225 |
| అనిన నేమును వియల్లోక | 2-125 | 229 |
| అనిన మందస్మిత | 2-122 | 227 |
| అని నమస్కరించి | 2-133 | 361 |
| అనిన విని | 5-59 | 622 |
| అనిన విని దివస్పతి | 5-76 | 630 |
| అనిన విని భవాని | 5-175 | 695 |
| అనిన విని మంకణుండు | 4-47 | 460 |
| అనిన విని మంకణుండు | 5-142 | 675 |
| అనిన విని యందఱు | 4-45 | 459 |
| అనిన విని యగస్త్యుండు | 3-71 | 321 |
| అనిన శౌరి పల్కు విని | 4-57 | 467 |
| అనిన సంయములును | 4-204 | 572 |
| అనినారదుండు చెప్పిన | 4-37 | 453 |
| అని నారదుండు పల్కిన | 4-101 | 498 |
| అని పంక్తి పంక్తి నడుమ | 2-132 | 232 |
| అని పలికి నలిన సంభవ | 6-63 | 756 |
| అని పలికి యనంతరంబు | 3-177 | 385 |
| అని పలికి స . వతీ | 3-73 | 322 |
| అని పలికి సబహుమానంబు | 1-28 | 26 |
| అని ప్రసంగించి | 3-89 | 334 |
| అని ప్రార్థించి | 4-174 | 556 |
| అని ప్రార్థించి భక్త్యావేశంబు | 3-210 | 414 |
| అని భయభ్రాంతులగుచు | 4-64 | 474 |
| అని భవాని విన్నవించిన | 5-155 | 682 |
| అని మఱియు | 5-153 | 681 |
| అని మఱియుఁ | 3-196 | 402 |
| అని మునీంద్రులు తమలోన | 4-164 | 551 |
| అని ముహూర్తమాత్ర | 4-125 | 519 |
| అని మెప్పించి మహర్షులు | 4-178 | 559 |
| అని యంభోధి | 4-89 | 491 |
| అని యడిగిన | 1-122 | 133 |
| అని యడిగిన నారదుండిట్లు | 4-17 | 441 |
| అని యనేక ప్రకారంబుల | 4-87 | 490 |
| అని యాకాశవాణి | 4-210 | 575 |
| అని యానతిచ్చి యాక్షణంబు | 5-17 | 593 |
| అని యిట్లర్థించు మౌని | 6-103 | 788 |
| అని యిట్లు విన్నవించిన | 5-14 | 591 |
| అని యివ్విధంబున | 3-215 | 428 |
| అని యిష్టదేవతా ప్రార్థనంబు | 1-16 | 17 |
| అని యీ ప్రకారంబునఁ | 5-83 | 635 |
| అని యీ ప్రకారంబున బ్రహ్మ | 4-123 | 515 |
| అని యుపన్యసించి | 3-103 | 342 |
| అని రాక్షసులు నష్టముని | 4-190 | 565 |
| అని వరంబులిచ్చి | 6-18 | 726 |
| అని విన్నవించిన | 5-25 | 596 |
| అని వెండియు | 5-87 | 637 |
| అని శపింపఁగఁబూను | 2-109 | 220 |
| అని సంస్తుతించి యందఱు | 6-23 | 729 |
| అని సప్తఋషులు | 5-140 | 674 |
| అని సమస్త జనంబులు | 5-37 | 604 |
| అని సాత్యవతేయుండు | 4-11 | 438 |
| అనుచుం దొందరమాను | 3-213 | 427 |
| అనుటయు | 4-69 | 477 |
| అనుభవ పర్యంతం బవ్వని | 5-195 | 707 |
| అనుములు గోధూమంబులు | 5-68 | 627 |
| అనువగు కొనుఁడిఁగ | 5-104 | 650 |
| అన్యమంత్ర శేఖరుఁడ | 1-74 | 71 |
| అన్వయము పావనంబు | 5-196 | 708 |
| అపరాధ శతము లోఁగొను | 6-48 | 748 |
| అపుడు హిమాచల కన్యక | 4-67 | 476 |
| అపుడు గర్వించి నిల్చించి | 4-106 | 502 |
| అప్పరమ మాహేశ్వరుం | 2-82 | 201 |
| అప్పుడప్పురంబున | 5-108 | 651 |
| అప్పుడవ్వీరభద్రుని | 6-61 | 755 |
| అప్పుడు | 4-97 | 496 |
| అప్పుడు | 5-44 | 608 |
| అప్పుడు కాలశుద్ధి | 3-40 | 292 |
| అప్పుడు ఘటోద్భవుండు | 3-60 | 312 |
| అప్పుడు పారాశర్యుండు | 3-189 | 394 |
| అప్పుడు ప్రతిష్ఠావలోకన | 4-179 | 559 |
| అప్పుడు బాదరాయణుండు | 2-33 | 155 |
| అప్పుడు బ్రహ్మాది దేవతలు | 5-113 | 654 |
| అప్పుడు భవాని భవుని | 5-19 | 594 |
| అప్పుడు మహాదేవుని | 4-71 | 478 |
| అప్పుడు మిసిమింతుఁడు | 4-62 | 473 |
| అప్పుడు సప్తదివ్యమును | 4-152 | 543 |
| అప్పుడు సమీపవర్తియగు | 5-56 | 621 |
| అప్పుడు హరివిరించులు | 4-108 | 504 |
| అప్పుణ్యవంశంబు | 1-32 | 30 |
| అప్పురంబు ప్రభావంబుఁ | 3-27 | 279 |
| అభంగ వీర విక్రమార్క | 3-222 | 432 |

| | | |
|---|---|---|
| అభయబిందుకళాకిరీట | 4-121 | 514 |
| అభయము పార్వతీశ | 4-63 | 474 |
| అభవునొకనాఁడు ప్రార్థించి | 5-154 | 681 |
| అభిమానించిన మీరలే | 4-207 | 574 |
| అభిషేకమొనరించు | 2-44 | 163 |
| అభ్యంతర భవనంబు | 2-147 | 240 |
| అభ్యుదయ పరంపరా | 1-87 | 81 |
| అమృతపయోనిధానమున | 3-80 | 326 |
| అమృతమయమైన పయో | 4-167 | 552 |
| అమృతమయుఁడైన | 3-150 | 369 |
| అమృతముఁ గోలుపోయి | 4-99 | 497 |
| అయిదు తరముల పూర్వుల | 5-67 | 626 |
| అయ్యన్నయ్యకు యావదర్థ | 1-51 | 51 |
| అరబీ భాష తురుష్క భాష | 1-73 | 70 |
| అరవిందాప్త కృత ప్రతిష్ఠుఁ | 1-27 | 25 |
| అరవిందాసన తార్క్ష్యవాహన | 4-124 | 518 |
| అరుణోదయంబున | 4-103 | 500 |
| అర్కుఁడెబ్బంగి నభమున | 6-97 | 786 |
| అర్కేందు హవ్యవాహన | 4-113 | 508 |
| అర్కేందూపల రత్న నిర్మిత | 3-93 | 336 |
| అర్చనలు చేసి గంధ | 2-130 | 231 |
| అర్ధకపాలము కొలను | 5-130 | 668 |
| అర్ధమండల ముదయించు | 2-40 | 160 |
| అర్థితో నోషధీశ్వరుఁ | 2-7 | 138 |
| అల్పపు బుద్ధి నీ క్రియ | 2-9 | 139 |
| అల్పమే మీరు చేసిన | 4-206 | 573 |
| అల్లనల్లన గగన మధ్య | 2-24 | 148 |
| అల్లాడ విభుఁడు | 1-48 | 48 |
| అళికోలాహల సంభ్రమంబు | 5-99 | 645 |
| అవధారు దేవ! | 4-109 | 505 |
| అవని గగనాగ్ని వాయు | 5-178 | 696 |
| అవనీ భారధురీణ | 4-211 | 576 |
| అవుఁగాకేమి నిజంబు | 2-136 | 234 |
| అవుర! ప్రతాప వేమ | 1-65 | 65 |
| అవ్యయం బనవద్యమాద్య | 5-50 | 612 |
| అవ్విధంబున బాష్పధారా | 3-3 | 252 |
| అసమసమ విషమ | 2-163 | 249 |
| అసురపురములు సాధించె | 3-42 | 293 |
| అసురాధీశ సమర్పితంబు | 4-146 | 536 |
| అసురులకు నాశ్రయంబైన | 4-186 | 563 |
| అస్తంగమిత సురద్విష | 5-132 | 669 |
| అహహ దయారసానుగత | 3-128 | 358 |
| అహిపతి కంకణుండు | 3-161 | 375 |
| అష్టమ దివసంబునందు | 2-101 | 213 |
| అష్టమీ భాను వాసరంబందు | 6-73 | 762 |
| అష్టమూర్తి విశిష్టాన్వయ | 4-209 | 575 |
| అష్టాశీతి సహస్ర సంయమి | 3-201 | 406 |
| అక్షత గంధ పుష్ప ఫల | 5-31 | 601 |

ఆ

| | | |
|---|---|---|
| ఆఁకొంటి రిన్ని దినములు | 2-124 | 228 |
| ఆ కపాలమోచనాభిధానంబై | 3-141 | 365 |
| ఆకల్ప స్థిర ధర్మ వైభవ | 5-199 | 709 |
| ఆకాశ దివ్యమునులును | 4-183 | 561 |
| ఆకాశ లక్ష్మికి | 1-45 | 46 |
| ఆకాశాంచల వీథులన్నిగిడె | 2-32 | 154 |
| ఆఖండపంచకంబాఖండలా | 4-153 | 543 |
| ఆగమ మంత్ర తంత్రములు | 3-105 | 343 |
| ఆజ్ఞ వాటించెఁ గిరి | 5-107 | 651 |
| ఆచిర యచ్ఛర లేములు | 6-93 | 784 |
| ఆడెం దాండవ మార్చటి | 4-148 | 537 |
| ఆతత భక్తి భావమున | 4-24 | 443 |
| ఆతతలీలఁ గోమల | 2-39 | 159 |
| ఆ తుల్యభాగమహా | 4-189 | 564 |
| ఆ తుల్యభాగ పేరను | 4-188 | 563 |
| ఆదిత్యుఁడు ప్రత్యేకమునఁ | 6-33 | 737 |
| ఆది లింగోద్భవము నాఁటి | 4-145 | 535 |
| ఆనందంబున సప్తరాత్రము | 2-91 | 207 |
| ఆనంద జ్యోతినిఁ | 5-138 | 672 |
| ఆననమునందు | 2-87 | 205 |
| ఆపాతాళ గభీర నీరను | 4-171 | 554 |
| ఆ మంత్రికి నుదయించిరి | 1-47 | 48 |
| ఆ మందాకిని యా త్రివేణి | 2-90 | 207 |
| ఆ ముక్తిదమన యాత్ర | 2-139 | 236 |
| ఆ ముని మండలంబునను | 4-43 | 457 |
| ఆయుత సత్ప్రపామహిమ | 4-77 | 482 |
| ఆయుత్తరంబున వీరభద్ర | 6-88 | 781 |
| ఆ రామాంబకు | 1-59 | 59 |
| ఆ లగ్న వేళకు సమ్మత | 4-162 | 550 |
| ఆ లింగమూర్తి శశ్వజ్జ్వాలా | 4-156 | 546 |
| ఆలోకించె మహామునీంద్రుఁ | 2-61 | 185 |
| ఆ వంశంబున సానికూఁతు | 6-79 | 770 |
| ఆ సమయంబునఁ గౌశికా | 2-110 | 220 |
| ఆహా! యింత | 3-125 | 356 |

ఇ

| | | |
|---|---|---|
| ఇంకఁ గృతార్థుల మైతిమని | 3-217 | 429 |
| ఇంక నొక్క విచారంబు | 3-43 | 294 |
| ఇందఱుఁగూడి శాంతి | 2-131 | 231 |
| ఇంద్రపదభోగ మెవ్వఁడే | 3-109 | 345 |
| ఇంద్ర ప్రతిష్ఠితుండగు | 3-107 | 344 |
| ఇంద్రుఁడేఁటేఁట | 3-106 | 344 |
| ఇంద్రేశతీర్థంబు ఋషి | 3-74 | 322 |
| ఇట మున్న దక్షవాటి | 3-70 | 32 |

| | | |
|---|---|---|
| ఇటు కృష్ణద్వైపాయన | 3-58 | 311 |
| ఇట్టి మహామహిమంబు | 6-107 | 792 |
| ఇట్టి మహిమంబు | 1-82 | 79 |
| ఇట్లందుకొని దానవులు | 4-185 | 562 |
| ఇట్లనియె | 2-4 | 137 |
| ఇట్లాశ్చర్యంబునుంబొంది | 4-196 | 569 |
| ఇట్లిచ్చి ధర్మశాసనంబు | 5-85 | 636 |
| ఇట్లు చనుదెంచి | 4-49 | 463 |
| ఇట్లు త్రిపుర విజయా | 4-149 | 538 |
| ఇట్లు పిలిపించి సమ్మాన | 1-22 | 22 |
| ఇట్లు పూజ చేసి పరమ | 5-53 | 615 |
| ఇట్లు పొగడినఁ బ్రసన్నుండై | 5-9 | 583 |
| ఇట్లు ప్రణామానంతరంబున | 5-11 | 589 |
| ఇట్లు ప్రాదుర్భవించి | 5-55 | 620 |
| ఇట్లు భీమేశ్వర సదనా | 5-38 | 604 |
| ఇట్లు వారింపఁబడి | 5-7 | 583 |
| ఇట్లు సూర్యోదయం | 2-50 | 170 |
| ఇనుఁడు కోదండ రాశి | 6-34 | 737 |
| ఇనుని తోడి చెలిమి | 5-12 | 590 |
| ఇపుడు ఘటికా | 3-46 | 295 |
| ఇప్పటి భూమిపాలురును | 5-86 | 636 |
| ఇమ్మహాపురాణంబునకుఁ | 1-120 | 131 |
| ఇవ్విధంబునఁగాలకంఠున | 2-76 | 197 |
| ఇవ్విధంబునఁ బాకశాసనుం | 5-80 | 633 |
| ఇవ్విధంబున గోదావరి | 4-194 | 568 |
| ఇవ్విధంబున నాజ్యధారా | 2-145 | 239 |
| ఇవ్విధంబున నావహస్కంధ | 3-49 | 298 |
| ఇవ్విధంబున నిష్టార్థ ప్రదుం | 4-105 | 502 |
| ఇవ్విధంబున నున్నఁజూచి | 4-147 | 536 |
| ఇవ్విధంబున వసంతోత్సవ | 5-125 | 665 |
| ఇవ్విధంబున శ్రీ భీమనాథ | 6-70 | 761 |
| ఇవ్విధంబున శ్రీ భీమనాథ | 4-139 | 529 |
| ఇవ్విధంబున సకల | 4-128 | 521 |
| ఇవ్విధంబున సప్తవాసరో | 2-107 | 218 |
| ఇవ్విధంబున సురాసుర | 4-60 | 469 |
| ఈ క్రమంబున సీమా విభాగ | 6-15 | 723 |
| ఈ దక్షారామమునకు | 6-51 | 749 |
| ఈ భంగి వేయు దమ్ముల | 6-64 | 757 |
| ఈ యర్థంబులు | 5-198 | 709 |
| ఈ యున్నవారలందఱు | 6-96 | 785 |
| ఈ యోంకార పుర పుణ్య | 3-47 | 296 |
| ఈ వసుధామండలమున | 1-70 | 69 |
| ఈవును నేనపోలెను మునీ | 3-5 | 253 |
| ఈవు పెట్టిన భిక్ష | 2-121 | 227 |
| ఈ సప్తముని స్తోత్రము | 5-141 | 674 |
| ఉండి యాసార | 2-127 | 229 |
| ఉత్తరంబునఁగాశీపురో | 5-21 | 594 |
| ఉత్సవంబుత్సవము వచ్చ | 3-90 | 334 |
| ఉదయరాగము నించించు | 2-43 | 162 |
| ఉన్నంత | 1-18 | 18 |


ఋ


| | | |
|---|---|---|
| ఋషుల వెంబడి సంరంభ | 4-181 | 560 |


ఎ


| | | |
|---|---|---|
| ఎంచన చెక్కు విసేసముల | 4-154 | 544 |
| ఎక్కడఁ జూచినన సరసి | 3-23 | 276 |
| ఎచ్చోటఁదాఁ బాఱి | 3-37 | 288 |
| ఎచ్చోట క్షేత్రంబు లేకాఁడు | 3-65 | 316 |
| ఎట్టి హీనాత్మునకునైన | 5-174 | 694 |
| ఎనయుం గల్గిన కూర్మి | 1-112 | 118 |
| ఎప్పుడు కలియుగం | 5-157 | 683 |
| ఎల్లకాలంబు నుండెద నిచట | 6-11 | 719 |
| ఎవ్వఁడే పదార్థ మొంతేనిఁ | 2-143 | 238 |
| ఎవ్వనింటికి బ్రహ్మజ్ఞ | 5-194 | 707 |
| ఎవ్వని కరిటమునకుం | 5-129 | 668 |
| ఎవ్వని యాజ్ఞ నీతెసు | 3-206 | 411 |
| ఎవ్వాఁడు వింధ్యాద్రి నిక్షింకు | 2-77 | 197 |
| ఏక భోగంబు గాఁగ నేతెఱు | 5-89 | 638 |
| ఏకే నైవ స్వరూపేణ | 6-22 | 728 |
| ఏఁటేఁట విరినీట | 2-54 | 177 |
| ఏట మునింగి లేచి | 6-27 | 730 |
| ఏడు దినంబు లన్నమున | 2-116 | 224 |
| ఏడు రసాతల క్రోడంబులు | 3-36 | 286 |
| ఏతాదృశ ప్రభావ | 1-119 | 130 |
| ఏదెసఁజూచినన్ విబుధుల | 1-104 | 96 |
| ఏనిక మోము తొల్పలుక | 1-2 | 2 |
| ఏ పట్టనము మ్రోల నేలేఱు | 2-52 | 175 |
| ఏ మంత్రి కులదైవ మిందు | 1-19 | 19 |
| ఏమి చిత్రంబు | 2-14 | 143 |
| ఏమియని చెప్పుదును | 2-104 | 216 |
| ఏమి శకునమునఁ జొచ్చి | 2-96 | 210 |
| ఏలా విచారింప నిందు రేఖా | 2-105 | 217 |
| ఏలు కొండ్రుమీరలే | 5-82 | 635 |
| ఒంటినేతెంచి | 4-50 | 464 |
| ఒకఁడు హయమేధ | 5-72 | 628 |
| ఒకచోటఁగోటిపల్లుపడు | 3-20 | 270 |

ఒకవేళ ధరియించు 1-117 124
ఒకమాటు జలక మార్చిన 3-170 381
ఒక్కనది పొంత గార్హస్థ్య 4-180 560
ఒక్కనాఁడమ్మహాదేవుండు 6-91 783
ఒక్కనాఁడు 1-20 20
ఒక్క పక్షంబు 3-145 367
ఒక్క సమయమ్మున 3-96 337

ఓ

ఓం జయజయ దేవదేవ 3-212 415
ఓ పరమర్షులార 4-205 573
ఓ మహాజనులార! 5-81 634
ఓ మహాలింగంబ! 5-139 673
ఓరి దురాత్మ! 2-153 244
ఓ వెఱ్ఱులార! యేటికి 4-52 464
ఓ సదాశివ! యోదేవ 6-8 718

క

కంబు శశి రజత శుక్తి 4-170 554
కంఠీరవ ఘోరపాత కొఘము 4-165 551
కంఠీరవ విక్రమున కకుంఠ 1-83 80
కటక కలాప సంఘటిత 6-66 758
కటుకమగు విషము 4-66 476
కటకాముఖ హస్తంబున 4-138 528
కట్టించె పట్టనక్ష్మా విభాగ 5-88 637
కట్టెఁ బట్టంబు యువరాజు 5-91 639
కదు దయాళురు దేవతా 2-159 248
కనకం బఖు మాత్రంబైనను 6-39 740
కనక క్ష్మాధర ధీరు 1-10 12
కపట కచ్ఛపమైన 4-59 468
కమలభవ వధూటీ కంఠ 4-213 577
కమలాచలాగ్ర మార్కండేయ 1-43 44
కమిచె సురపొన్న వన 5-94 641
కమ్మనూకిన నూత్న 4-130 523
కరపల్లవంబులు గబళించుఁ 4-140 531
కరుణింపు దక్షవాటీపుర 4-122 514
కర్ణికారాంబికా మహాకాళి 3-59 311
కర్పూర కస్తూరి కలఁగోట 5-101 648
కలకంఠముల ఛాయఁగల 1-80 77
కలవాఱుందఱు దక్షవాటి 5-15 592
కలిదోషంబున నిష్ఠురాత్మ 5-23 595
కలియుగంబున ధర్మంబు 1-152 681
కల్పవృక్షం బదేటికిఁ 5-143 675
కశ్యపాన్వయ పాథోధి 1-68 67
కాంచన కింకిణీ యుతము 5-73 629
కాంచీకంకణ తారహార 1-78 75
కాంచీ శ్రీగిరి కాశీ 1-40 41
కాంచెనే సర్వపురాధిదానముఁ 2-65 190
కాంతి సంపద నేల 1-89 84
కాకతిక్ష్మాపాల గంధ 1-49 49
కాదె నీ తప్పు కల్మష 3-214 427
కాదు కా దుదయాద్రి 2-42 161
కానీ యీ దివసంబును 2-137 235
కామ క్రోధావేశ 5-171 692
కామమును లోభమును 5-47 610
కామిని విప్రయోగ 2-31 153
కామేశ్వరు నీశ్వరునిం 5-137 672
కారాగార నిబద్ధులన 4-158 547
కార్తికవేళ భీమశంకరు 3-25 278
కాలకూట విషాగ్ని కబళ 2-21 146
కాలకూటోప సంహార కాలి 2-13 142
కాలభైరవుఁడు భక్త్యా 2-46 166
కాల మృత్యువు వెనఁగోలి 5-65 625
కావుము దక్షారామ పుర 3-208 413
కాశిం బట్టిన యంతఁగాని 3-53 303
కాశికి నేఁగుదెంచి 4-07 436
కాశిపై గోపగింపఁగఁగాదు 2-118 225
కాశి వెలువడివచ్చి 1-121 132
కాశి ప్రతిబింబమునకుఁ 3-131 360
కాశిస్థాన నివాసులన్ 4-10 438
కాశి శపునకు దుర్దాంత 2-151 243
కాశిక్షేత్ర మృతో జపి 4-154 545
కాశ్యపగోత్ర పవిత్ర 4-212 577
కాళినందన కంఠేకాలుర 2-89 206
కినుకం బుట్టినయట్ల మౌని 2-23 147
కిసలయరస జిగ్రహిషా 5-102 649
కుంటి కుడుపు లశక్తులు 5-22 595
కుక్కుట పక్షి సంఘముల 3-144 366
కుక్షిప్రాప్తవ నిష్ఠుర 2-102 215
కుడిచి కూర్చుండి మీరేల 4-53 465
కురిసెం బువ్వుల వాన 6-92 783
కూడి యొప్పారె నష్టాద్రి 2-26 149
కూడు పెట్టక యేన్నాళ్ళు 4-12 438
కృత దక్షిణంబు లగ్నిష్టోమ 5-64 624
కృత్తికాతారకంబులఁ 6-86 779
కృప గల్గి భీమనాయక 3-209 413
కృష్ణద్వైపాయను తోడిద 4-14 439
కెలనన్ ముందర సిద్ధ 4-191 567
కేవలతాయకరంబును 4-8 437
కేవల భక్తి సంపదలు 3-188 394
కైటభ దైత్య వైరి పద 1-31 29
కైటభ విరోధిభక్తిరసా 6-67 759
కైలాసాచల కేలి మందిరుఁ 5-49 611
కొందఱు తాండవ మాడిరి 6-94 784

| | | |
|---|---|---|
| కొడుకులు నీవునేఁ బ్రమథ | 6-28 | 731 |
| కొమరేటి కల్యాణ కమల | 2-62 | 187 |
| కొలనుఁ బ్రతాపరుద్ర నృప | 1-50 | 50 |
| కొలుతు సద్యో జాతుఁ | 3-205 | 409 |
| కోణార్క క్షేత్రము వారాణసి | 3-147 | 368 |
| కోపము చిచ్చునంబడిన | 6-59 | 754 |
| కోపము సంహరింపు ముని | 2-106 | 218 |
| కౌక్షింభర్యము దీర్పం గడు | 3-200 | 406 |
| క్రొన్నెల పువ్వు దాల్చునకుఁ | 2-117 | 224 |
| క్షమియింపు భీమనాయక | 3-207 | 413 |
| క్షీరాంభోధి మథింపఁగా | 4-56 | 466 |

ఖ

| | | |
|---|---|---|
| ఖండ శర్కర జున్ను | 1-61 | 61 |

గ

| | | |
|---|---|---|
| గంగాజలాపూర్ణ గాంగేయ | 5-41 | 606 |
| గంగానదీ ప్రవాః కణము | 2-51 | 173 |
| గంగా యమునా తీరో | 2-92 | 208 |
| గంధర్వోపనిషద్రహస్యము | 1-91 | 85 |
| గజ చర్మ మెన్నఁడో కాని | 1-116 | 122 |
| గరళకూట వినీల కంఠాయ | 3-211 | 414 |
| గరుడ గంధర్వ యక్ష | 3-76 | 324 |
| గాంధర్వోపనిషన్మతంగ | 3-220 | 431 |
| గారవించెను విధి | 5-39 | 605 |
| గార్గ్య సిద్ధాంతమతము | 3-41 | 292 |
| గిరినికుంజముల | 2-35 | 156 |
| గిరిశ స్థూల భుజాపరీత | 4-133 | 526 |
| గిరిసార్వభౌము కన్యా కర | 3-164 | 377 |
| గీత వాదిత్ర నృత్యంబు | 6-78 | 770 |
| గురుఁడే యభవుఁ | 5-167 | 689 |
| గూఢములు నిగూఢంబులు | 3-75 | 323 |
| గేహముల కేఁగి భిక్షాందేహి | 2-97 | 210 |
| గోదావరి గోదావరి | 4-169 | 553 |
| గౌతమ కన్యా తటినిన్ | 4-163 | 551 |
| గౌతమికిన్ పంచమహా | 4-173 | 556 |
| గౌతమీ గంగఁ బాపి | 4-161 | 549 |
| గౌరింజూచిన యప్పుడంచిత | 2-150 | 242 |
| గౌరి యొక్కతె యాకాశగంగ | 3-95 | 337 |

ఘ

| | | |
|---|---|---|
| ఘట్టితరూద్ధతిం గరి | 5-119 | 658 |
| ఘనత శివగంగయును | 6-17 | 726 |
| ఘల్లు ఘల్లని రత్న | 3-62 | 313 |
| ఘుసృణ ప్రసూన రసమునఁ | 5-29 | 600 |

జ్ఞ

| | | |
|---|---|---|
| జ్ఞాన వైరాగ్య సంపన్నుఁడైన | 5-192 | 705 |
| జ్ఞాన సంపదఁగాని మోక్షంబు | 5-186 | 702 |
| జ్ఞానాజ్ఞాన కృతంబులైన | 4-28 | 446 |
| జ్ఞానాభ్యాసం బల్పంబైన | 5-187 | 703 |

చ

| | | |
|---|---|---|
| చంచలనేత్ర హేమరథ | 5-106 | 651 |
| చంచల లోచనా కుసుమ | 1-69 | 68 |
| చంద్రబింబానన చంద్రరేఖా | 2-148 | 241 |
| చటులతర కాలకూటాగ్ని | 4-110 | 506 |
| చప్పరం బొండె గుడి యొండె | 6-56 | 752 |
| చరణద్వయీ భూరి సౌభాగ్య | 1-92 | 86 |
| చరణాయుధేశ్వరేశ్వరు | 3-146 | 367 |
| చరమాచల శిఖరంబునఁ | 2-27 | 150 |
| చల్లని సౌమ్య దృష్టియుఁ | 2-134 | 233 |
| చాటింపఁబంచెఁ | 5-18 | 593 |
| చిక్కని కాలభైరవుని | 3-140 | 3-64 |
| చిత్తమునఁ దుష్టియును | 5-177 | 696 |
| చుట్టి బిగించి పట్టి | 4-68 | 477 |
| చూడుం డాస్వాదింపు | 4-26 | 444 |
| చెంచుమల చూఱకారున | 1-85 | 80 |
| చేతోమోద మెలర్పఁ | 2-70 | 194 |
| చైతన్య మెప్పుడు | 5-185 | 701 |

జ

| | | |
|---|---|---|
| జంభరిపుదిక్కునకు సీమ | 3-33 | 285 |
| జగతీమౌళిపతంస | 3-6 | 253 |
| జగదేక సంస్తుత్య సౌభాగ్య | 1-57 | 57 |
| జనమేజయారబ్ధ సర్పాధ్వరా | 3-52 | 302 |
| జపహోమదాన యజ్ఞములు | 3-112 | 347 |
| జయయు విజయయు నొక | 2-149 | 242 |
| జలక మార్చె బలారి | 4-90 | 491 |
| జలజపత్రంబు తనమీఁదఁ | 5-189 | 704 |
| జలరాశి మేఖలా వలయంబు | 4-127 | 520 |
| జహ్ను కన్యా తీరసన్నివేశ | 4-40 | 455 |
| జాదుర బాదురంచు | 5-103 | 649 |
| జిలుగుంజంద్రిక వన్నె | 5-109 | 652 |

ఝ

| | | |
|---|---|---|
| ఝూదేశవన సప్తమాదె | 1-63 | 63 |

డ

| | | |
|---|---|---|
| డమరుక డిండిమ ప్రకట | 4-150 | 539 |
| డాయఁబోయి యప్పుడా | 2-112 | 222 |

త

| | | |
|---|---|---|
| తండు భుజార్గళా కలిత | 3-183 | 390 |
| తత్పదార్థంబు పరమాత్మ | 5-180 | 697 |
| తదనంతరంబ | 5-105 | 650 |

| | | |
|---|---|---|
| తదనంతరంబ యతనితో | 4-39 | 454 |
| తదనంతరం బా భరద్వాజా | 4-159 | 547 |
| తదనంతరంబా శ్రీ | 4-51 | 464 |
| తదనుసంభవుఁడఖిల | 1-72 | 70 |
| తనకుందాన ప్రతిష్ఠితుండ | 4-203 | 572 |
| తనతీరంబునఁ బాయకున్నఁ | 4-25 | 444 |
| తమ్ముని వీరభద్ర వసుధా | 1-34 | 35 |
| తరతరమ దరువఁదరువన్ | 4-94 | 494 |
| తరమె వర్ణింప సప్త | 4-41 | 456 |
| తరుణి యిది యన్నపూర్ణా | 2-141 | 237 |
| తలఁతున్ భారత సంహితా | 1-6 | 7 |
| తల్లీ యిన్ని దినాల కేనియు | 2-120 | 225 |
| తాండవభవు వీక్షణమున | 6-74 | 763 |
| తాండవ మాడుఁ గుమార | 3-91 | 335 |
| తాటించి నిటల నయనుఁడు | 4-132 | 525 |
| తామును చేసినాఁడ నౌక | 5-45 | 609 |
| తారగిరి మందరముల | 1-79 | 76 |
| తారాపథాంచలము డిగి | 2-25 | 149 |
| తారు దలఁచిన శుభవేళ | 4-195 | 569 |
| తారు వినిశ్చయించిన | 4-197 | 569 |
| తిలకంబు బలుతేనియలఁ | 1-98 | 92 |
| తిష్ఠన్మాత్రునకైన | 6-101 | 787 |
| తీర్థయాత్రాక్రమంబులు | 4-15 | 440 |
| తుదిఁబోయి యమ్మహేశ్వరు | 2-11 | 140 |
| తుల్యభాగా తటీద్రుమ | 3-39 | 290 |
| తుల్యభాగా తరంగిణి తోడఁ | 5-78 | 632 |
| తుల్య భాగుండను | 4-187 | 563 |
| తూర్పుదిశకును లవణ | 6-14 | 722 |
| తెగనిండ ఫాలనయనుఁడు | 4-135 | 527 |
| తెగువ దక్షుని కంఠంబు | 6-60 | 755 |
| తేజిత విష్ణు శిలీ ముఖుఁ | 3-84 | 329 |
| తొంబ నూఱును దొంబది | 6-65 | 757 |
| తొల్లి కృతయుగంబున | 6-7 | 716 |
| తొల్లి జలంధర గంధగజ | 6-57 | 753 |
| తొల్లి దక్ష ప్రజాపతి | 2-6 | 138 |
| తొల్లి బ్రహ్మాదులగు దేవ | 3-124 | 355 |
| త్రపుస పుష్ప లతామతల్లీ | 2-56 | 182 |
| త్రాడుఁ జూచి భ్రాంతి | 5-182 | 698 |
| త్రిపుర సంహారంబు దివిజ | 3-178 | 385 |
| త్రిపురావాసుల తోడఁ గూడి | 4-102 | 499 |
| త్రిభువనముల యందును | 6-98 | 786 |
| త్రైలోక్యంబు భుజాప్రతాప | 4-119 | 513 |
| త్రైలోక్య వరద పావన | 4-168 | 553 |
| త్ర్యంబకాచల శిఖాగ్రము | 3-21 | 272 |


## ద


| | | |
|---|---|---|
| దక్షపురమున నుత్తర | 1-100 | 94 |
| దక్షప్రజాధినాథ మహాధ్వర | 3-17 | 263 |
| దక్షప్రజాపతి తప్పులోఁ | 2-12 | 140 |
| దక్షమునిరాజునంత | 3-94 | 336 |
| దక్షవాటికఁ బశ్చిమ ద్వార | 1-99 | 93 |
| దక్షవాటీపురీ చతుర్ద్వార | 6-81 | 777 |
| దక్షవాటీ మహాస్థానంబులో | 6-106 | 791 |
| దక్షాధ్వరానల త్రయ తీర్థ | 3-66 | 318 |
| దక్షారామ వధూటీ | 3-221 | 432 |
| దక్షారామ విలాసినీ | 1-93 | 87 |
| దక్షారామ మాహాత్మ్యంబు | 6-41 | 741 |
| దక్షిణకాశికా తుహినధామ | 4-31 | 447 |
| దక్షిణ కాశీ నగరము | 3-30 | 283 |
| దక్షిణ వారాణసికిని | 2-20 | 146 |
| దక్షుండు పొట్టేలి తల | 6-45 | 744 |
| దక్షుఁగీర్తించి యాచంద్ర | 6-52 | 750 |
| దక్షుని సవనాగారము | 2-16 | 144 |
| దగ్ధస్మరాంగ! శంకర! | 4-115 | 510 |
| దత్తమిష్టంబుహుత | 3-155 | 372 |
| దర్శనమాత్ర నేదైవత | 6-6 | 715 |
| దర్శనము కంటె మేలు | 3-101 | 340 |
| దానికిఁదూర్పు దిక్కున | 3-180 | 388 |
| దాఁటె బ్రాసాద దేహళి | 5-43 | 608 |
| దాత త్రైలోక్య భర్త | 5-79 | 632 |
| దాతృత్వము దానంబును | 5-57 | 621 |
| దిగదిగఁజేరవచ్చి రతి | 5-96 | 643 |
| దివ్యాయుధము లైదు | 4-48 | 461 |
| దుగ్ధపయోధి సుధారస | 1-84 | 80 |
| దుగ్ధాబ్ధి మంథనోద్భూత | 6-46 | 746 |
| దృష్టించి భక్తి పరతను | 3-187 | 393 |
| దేవతలకు బ్రాహ్మణులకు | 5-58 | 621 |
| దేవతాభర్త శంభు ప్రతిష్ఠ | 3-98 | 338 |
| దేవదర్శనమాత్ర | 6-77 | 769 |
| దేవ దుందుభు లుడువీధి | 4-193 | 568 |
| దేవదేవ! మహాదేవ! | 4-73 | 480 |
| దేవదేవ! మహాదేవ! సదాశివ! | 4-85 | 489 |
| దేవదేవునకు నాదికినాది | 3-197 | 402 |
| దేవబ్రాహ్మణ భక్తివర్ధిత | 1-39 | 40 |
| దేవ బ్రాహ్మణ భూములు | 1-64 | 64 |
| దేవి! శంభోర్జటాజూట | 6-21 | 728 |
| దేవి! సద్గురు నాథోపదిష్ట | 5-161 | 687 |
| దోసము పెద్ద లేదనక | 3-11 | 259 |
| ద్యోస్థలీ నక్షత్ర ధూళిపాళీ | 5-5 | 580 |
| ద్రాక్షాపానక ఖండశర్కర | 2-142 | 237 |
| ద్వాదశక్షేత్ర తీర్థయాత్రా | 4-30 | 447 |
| ద్వాదశక్షేత్ర పుణ్యక్షేత్రము | 3-26 | 279 |
| ద్వాదశక్షేత్ర యాత్రావిధాన | 2-80 | 200 |

ద్వాదశక్షేత్ర వికచ 3-78 325
ద్వాదశక్షేత్ర శివలింగ 3-69 320
ద్వాదశక్షేత్ర శివలింగ 4-29 446
ద్వాదశ తీర్థక పరివేషా 3-77 324
ద్వాదశాక్షర దివ్యమంత్ర 2-68 192
ద్వీపాంతోద్భవుఁడైన 2-79 200
ద్వైపాయనముని వెడలం 4-13 439
ధనకోటీ వినిబద్ధకేతన 3-63 315
ధరణియు గగనము దిక్కులు 4-76 481
ధరణీ సర్వగుణోపేత 5-63 623
ధరియింప నేర్చిరి దర్పవెట్టైదు 1-41 42
ధర్మపారాయణుండు 5-3 579
ధర్మశాసన ఘనశిలా 1-42 43
ధాత్రివలయంబులో 2-17 144
ధారాసురత్రాణధాటీ 1-29 26
ధీరుఁడు దేవమంత్రి 1-56 56
ధ్యానంబు సాకార నిరాకారం 5-165 689

న

నంది వినాయకాది గణ 3-86 330
నన్నుఁగన్న తల్లి యన్న పూర్ణ 3-9 257
నమస్తే భీమనాథాయ 4-23 443
నవమరుత్తు చరిత్రంబు 1-17 18
నాగేంద్ర కర్ణకుండలు 5-36 603
నాభిమండల మిచ్చోట 3-44 294
నారాయణుండు మాయానారీ 4-98 497
నారికేళంపు మట్ట నెన్నడిమి 2-53 177
నాళీకభవ వధూస్తన 1-71 69
నిండి పాఱుచునుండునే 3-7 254
నికటమున నుండి 1-14 16
నిఖిల పరివార దేవతా 3-182 389
నిఖిల పుణ్యక్షేత్ర 3-29 281
నిత్యంబు సర్వగతంబు 5-183 699
నిత్యానిత్య వివేకుండును 5-179 697
నిడువాలుం గుడికన్ను 6-68 759
నిర్గుణుని నిత్యశుద్ధుని 5-166 689
నిష్ఠతో భజంతు భీమునిన్ 3-203 408
నీమమున మ్రొక్కెదను 3-204 408
నీ మహిమార్ణవమునకును 4-86 489
నీరు కడఁగోళ్ళఁగూడి 3-22 276
నీలకంఠ! భక్తలోకనిధి! 4-112 507
నీవు విశ్వేశ్వరదేవ 3-38 289
నీవెఱుంగని తీర్థముల్ 4-16 440
నీహార భూధరేశ్వరు 3-165 378
నెట్టుకొని కొలుతు నన్నయ 1-8 10
నేఁగొమ్ముటేనుఁగు నే 4-33 450
నేతుల నూనెలం బనుపు 5-116 657
నేదిష్ఠమున సప్తగోదా 1-114 119

ప

పంకజ ప్రభవుఁడబ్రహ్మణ్య 4-61 472
పంచతీర్థము లాడి భవలింగ 3-190 395
పంచ బ్రహ్మంబుననుసే 2-75 196
పంచబ్రహ్మషడంగ మంత్ర 4-104 501
పంచభూతమయంబు 4-160 548
పంచమవేదమై పరఁగు 1-9 11
పంచాంగ శుద్ధిగాఁ 3-179 386
పంచాక్షర మంత్రమును 6-90 782
పంచాక్షరీ మంత్రపారాయణం 3-28 280
పంచాక్షరీ మంత్ర పారాయణం 6-19 727
పండువా సురతాణి పావడం 1-38 39
పటు హుంకార మహాట్టహాస 4-65 475
పట్టం గైదువులేక 6-62 756
పడియు నార్వన్నె బంగారుఁ 2-74 196
పదునాల్గు మహాయుగముల 1-113 119
పన్నీట గంధ జలమున 1-53 53
పప్పునుఁ బిండివంటలునుఁ 2-140 237
పరదారేశ్వర కుంభసంభవ 6-105 790
పరమపుణ్యుఁడనైతి భాగ్య 4-44 457
పరమ మునీంద్రులార 4-200 570
పరమదుల్లస్త్రిత రోమహర్ష 3-48 296
పరమాశించుచు భీమేశ్వరు 1-115 121
పరిరంభ మొసరించు బాహా 3-194 399
పర్యంత మందార పారిజాతక 1-88 82
పాంథ నివహంబు పాలి 5-97 644
పాటలంబగు జటాజూటంబు 3-19 269
పాతకము చేసియైనను 5-71 628
పాతాళ భువనాధిపతికి 1-35 36
పాతాళ శ్రీకాలభైరవ 4-27 445
పాత్ర సంశుద్ధి కావ్యంబు 2-135 233
పాపంబు పుణ్యంబు పాథః 5-170 691
పాయకొకచోటఁ జడికిలఁ 5-16 593
పుట్టినిలుగాన నాకు 5-20 594
పురుహూత భూమిదానము 5-60 622
పువ్వు ముడిచిన పురవీథి 2-10 139
పూఁబోణులకును విటులకు 1-96 91
పూర్వజన్మకృతంబైన పుణ్య 3-72 321
పూవుంబోణీ! విశాల 5-191 705
పృథివిఁ బదునెనిమిది 1-103 95
పైఠ! దక్షారామపతి 3-216 428
పొగడిరందు నికుంభ 5-26 598
పోక నడగొట్టితేనియు 2-154 245
పోయె వారాణసికి 4-5 435
పోసిరా యెల్ల వారి కాపోశన 2-138 235

